ర. స. సం. ప్రచురణ - తృతీయ దీధితి :

శ్రీ ఆదిభట్ల నారాయణదాస

# సారస్వత నీరాజనము

సంపాదకుడు

మహాకవి మధుర సరస్వతి

శ్రీ యస్వీ జోగారావు, M. A., Ph. D.

Professor & Head, Telugu Dept. A. U. P. G. Centre, Guntur,
President, Guntur Dt. Writer's Co-op. Society,
Formerly Professor of Tel. Leningrad University, USSR.

ప్రచురణ

రచయితల సహకార సంఘము, గుంటూరు

రిజిష్టరు నెం. బి. 2257 — స్థాపితము : 1-1-1972.

ప్రథమ ముద్రణ
ఆనంద సంక్రాంతి
( జనవరి, 1975 )

ప్రతులు : 1000



ప్రాప్తిస్థానము
డాక్టర్ ప్రసాదరాయ కులపతి, M. A., Ph. D.
కార్యదర్శి, రచయితల సహకార సంఘము, గుంటూరు.

వెల : 60 రూకలు

ముద్రణ
జూపిటర్ ప్రింటింగ్ ప్రెస్,
7వ లైను అరండల్ పేట, గుంటూరు.

# అంకితము

'నాయన నాల్గు మోము లవు
నా! యెటు ముద్దిడెద' దంచు నల్వ యా
ప్యాయముగా హసింపఁగ, 'న
నంతసుఖుండ నన' నెట్లు ముద్దిడం
బోయెదొ!" యంచుఁ బల్కఁగ,
'ముద్దిడెదం గను' మంచు నల్వ నా
రాయణుఁదాను కాఁగఁ ద్రవ
నందు సరస్వతికిన్ నమస్కృతుల్.

—యస్వీ జోగారావు

# Sri M. R. APPAROW, M.A., M.L.A.,

VICE CHANCELLOR
ANDHRA UNIVERSITY

WALTAIR
10—8—75

## ముఖబంధము

ఆంధ్రజాతి అంతా కలకాలం గర్వించదగిన మహావ్యక్తి ఆదిభట్ల నారాయణదాసుగారు. సకల కళాస్వరూపుడైన భగవంతుని సర్వజనుల హృదయాలలోను ప్రతిష్ఠించడానికి చేసిన ప్రయత్నమే తన మనుగడగా సాగిన మహాభాగుడాయన. సకలకళలకు సమస్తభారతీయ సంవిత్తునను, సంస్కృతికి సంగమస్థానమైన ఆయనయొక్క బహుముఖపరిశ్రమ ఫలితంగా బాహిరిల్లిన బహు కృతులు హరికథలు మనకొక సంస్కృతి భాండాగారంగా మిగిలి వున్నాయి. అటువంటి దాసుగారి స్వరూపాన్ని గుర్తించి వారిలో కొలువుదీరిన వాగ్దేవి కొక సారస్వతనీరాజనమెత్తినారు గుంటూరు మండల రచయితల సహకారసంఘమువారు, తదధ్యక్షులు, సంపాదకులు అయిన జోగారావుగారు. నిజంగా దొడ్డపనిచేశారు. వారిని మనసారా నేను అభినందిస్తున్నాను.

గ్రంథంలో ప్రకరణవిభాగము, విషయవిభాగము, అనుబంధాలు అన్నీ చాలబాగున్నవి. దాసుగారికి సంబంధించిన వివిధాంశముల గురించి ఎందరోమహానుభావులు ఎంతో చక్కని రచనలు చేశారు. ఆ సకల కళాపరిపూర్ణుని గురించిన సమగ్రసుందరమైన మహాగ్రంథమిది. ఆంధ్రమహాజనులంతా దీనిని అవశ్యం సంప్రీతి ప్రతిపత్తితో ఆదరిస్తారని ఆశిస్తాను.

M. R. Apparow

# ముద్రణార్థ ప్రదాత

సహృదయ సమ్రాట్

## శ్రీ కర్రా ఈశ్వరరాయ ప్రశంస

—యస్వీ జోగారావు

శ్రీకటాక్ష మార్యాదరస్మితము దారు
శారదా విపంచి విగనస్వరము స్వరము
ఆయురారోగ్య భోగభాగ్యము లొసంగి
పుణ్యచరితు నీశ్వరరావుఁ బ్రోచుఁగాక!

శ్రీ యువతి కుచూనాల విచిత్రరుచిన్ బరికించి కేలిమై
నా యక శాత్రిపుట్ట హరి యగ్గలమైన విరాట్స్వరూప ము
న్యాయముగా ధరించె, నహహా యనుచున్ జగదేకమాతయున్
జేయని విశ్వరూపము ధరించె, నహో! మిసిమింతుఁడౌచు నా
రాయణు! శ్రీధరుండు విషార్తిఁ దదీయ పదంబు దాసుఁడై
పాయక పట్టెఁ గాని తరపడ్డను గూటమి దుర్ఘటంబు నా
హ్వాయము తదియు మధురాశయ మానసపుత్రుఁడైన నా
యయణదాను సన్మతి బృహస్పతి విశ్వకళాజగద్విరా
ట్ప్రాయుఁడు బ్రోచుతన్ మనుమరాలి మగండవు నాత్మభక్తిశా
ణాయత నాత్మ నిన్ హరికథాభిరతి ప్రథితాంతరంగునిన్.

అంతర్వాణి విరేఖుఁ డార్యజన మర్యాదా మహాధార మా
నాంతస్స్వరుఁ డనాంశాన్వయన పాధ్యబ్రహ్మ విద్యా ప్రబు
ద్ధాంతేవాసి జనాంతరంగుఁడు శివైకస్వన్నిగ్రచిత్తుం డయ
స్వాంత ప్రజ్ఞుఁడు తాతపాదుఁడగు వేంకట్రావు విన్నోముతన్.

లలితకళాపశీసురభిళాత్ముఁడు సంతత సత్యసంధుఁడు
జ్జ్వలమతి వేదకంఠుఁడు దానదయార్ద్ర ధర్మదో
హాలకృతి స్నేహశీలి బహిరంతర బంధుర శీల వాఙ్మనో
లలితుఁడు నంచు నిన్ను నిరలంకృతిగా నిజమాడి మెచ్చెదన్.

ఉ॥ నా వాక్కున నిక్కు నీల్గులకు నాయీ కర్మముంజేసి నా
నా నిస్సారులఁ గోరి వారల పసదాన్ముఁ ప్రౌఢ ప్రశం
సా నీరాజితులం బొనర్చితిఁ దదంహశ్శాంతికై నేఁడు నీ
దౌ నిక్కంపు గుణంబుఁ జేరుకొని నే ధన్యుండ నౌదున్ సఖా!

శిష్టుల్ విశిష్టవశిష్టు లంతర్ద్రష్ట
లలరిన భృగుమహాన్వయము నాది
జనని సరస్వతి సంగీతసాహిత్య
సరస కళాప్రవాహ్వ సార్థకాహ్వ
బ్రహ్మనిష్ఠుఁడు పితృపాదుఁడు రసికుండు
సత్కవీశానుఁడు సాంబశివుఁడు
గుర్పుపరంపర విస్మృత్వరవివేక మలౌక
సామాన్య వైదుష్య సంభృతమ్ము

అట్టి నాకు నీకు నొక మహానుబంధ
మమరె మతి నిమిత్త మది జన్మాంతరీయ
మగునొ! శ్రీ దాససారస్వతామృతాబ్ధి
పుణ్యతీర్థావగాహన భూతి యగునొ!

మాచే మాన్యసరస్వతీ సచివ సామంతాళిచే సాహితీ
రోచిర్మూర్తులచే జగద్ధిత రసారూఢాశయ శ్రేణిచే
నీ చేయుంచిన పుణ్యకార్య మిది రాణించున్ చిరస్థాయిగా
నీ చిత్తస్థిత సాహితీ వితతియున్ నిల్చున్ రసస్థాయిగా.



సహృదయ సమ్రాట్

**శ్రీ జి. రామానుజులు నాయుడు,** బి. ఏ., బి. యల్.

గుంటూరు మండల ప్రధాన న్యాయమూర్తి

# సహృదయ భూమిక



ఇందుగల డందు లేడని సందేహము వలదు. ఎవరు? ఆదినారాయణుడు కాదు, ఆదిభట్ల నారాయణదాసుడు ఒకకళా? ఒకవిద్యా? ఒక భాషా? ఎందులోపడితే అందులోనే వున్నాడు. ఇంతటి బహుముఖ ప్రజ్ఞతో, విశిష్టవ్యక్తిత్వంతో జాతి ధన్యపదవీ సేవార్థము జీవించిన గొప్పవారి చరితలు తెలుసుకోవడం అభివృద్ధికాముకమైన జాతి కవశ్య కర్తవ్యం. అదిగుర్తించి ఈ ర. స. సంఘము. తదధ్యక్షులు ఏతద్గ్రంథ సంపాదకులూ అయిన ఆచార్య శ్రీ జోగారావుగారు ఈ కార్యభార ధురంధరులు కావడం మిక్కిలి ముదావహం.

ఈ బృహద్గ్రంథం బహిరంతములు రెండింటను బంధురమైన స్వరూపం గలది. దీనికి శ్రీ జోగారావుగారు సంపాదకత్వం సమర్థంగా నిర్వహించడమే కాదు, గ్రంథంలో అమూల్యములైన పలువ్యాసములు, అనుబంధములు ఆయనయొక్క క్షోదక్షమమైన పరిశ్రమకు, విమర్శక ప్రజ్ఞకు, పరిశోధన పాటవమునకు, ఉపజ్ఞకు, రసజ్ఞతకు తార్కాణలు.

దీని ముద్రణభారం వహించడంలో మోతాదు, పత్త్రాను తానేర్పై నిల్చిన నిండు హృదయంగల సహృదయ సమ్రాట్టు శ్రీ కన్రా ఈశ్వరరావుగారు.

ఈ ర. స. సంఘం ఇప్పటికి మూడు గొప్ప కృతులు ముద్రించి అనేక మహాసభలు జరిపి ఘనవిజయాలు సాధించిందని విన్నాను. కొన్నిటిని ప్రత్యక్షంగా కనుగొన్నాను. ఈ సంఘ సముద్యమ మంతటికీ ప్రధాన సూత్రధారులు డాక్టర్ జోగారావుగారు, డాక్టర్ ప్రసాదరాయ కులపతి. ఇద్దరూ ఉద్దండులు, మేధావులైనా వినీతులు, ఆదర్శదృక్పథం వున్నా వాస్తవాన్ని విస్మరించరు. సంఘంలో తమకొక ప్రత్యేకతవున్నా సాటి రచయితల హృదయాలకు సౌహార్ద సేతువులు నిర్మింపగలరు. ఇద్దరినీ మనసార అభినందిస్తున్నాను. వీరి ఆధ్వర్యవములో ర. స. సంఘం పురోగమించి అనతికాలంలో తన లక్ష్యాన్ని చేరుతుందని ఆశిస్తాను. భవతు.





శ్రీ కర్రా ఈశ్వరరావు　　శ్రీ యస్వీ జోగారావు　　శ్రీ ప్రసాదరాయకులపతి

# విషయసూచిక

## ప్రథమ భాగము

## జీవితము : వ్యక్తిత్వము



* * *

# ద్వితీయ భాగము

# సాహిత్య వైభవము

## ౧. హరికథా విభాగము



## కృతిసమీక్షలు

## ౨. అచ్చ తెలుగు విభాగము



## 3. సంస్కృత విభాగము

## ౬. సమాలోచన విభాగము



* * *

# తృతీయ భాగము

## సంగీతప్రతిభ

# అనుబంధములు

[పరికల్పన — యస్వీ]

౧. యశశ్చంద్రికలు

(పత్రికల ప్రశంసలు)

౨. పూజాపుష్పాలు

(వివిధ కవుల ప్రశంసా పద్యాలు)

3. జీవిత పంచాంగము

(వివిధ ముఖ్యజీవిత సన్నివేశాలు, తేదీలు)

౪. దాస గ్రంథ దర్శిని

(దాస గ్రంథావళి గురించి వివరములు)



శ్రీ ఆదిభట్ల నారాయణదాస

# సారస్వత నీరాజనము



ప్రథమ భాగము

## జీవితము వ్యక్తిత్వము





‘‘తొండము త్రిన పుత్తబుండాల మాగము
గ్గిసపండ్లు నెమరువేసినది నేడు.” — యస్వీ.

# సంపాదక భూమిక

— యస్వీ జోగారావు

లోకములో అనేకులుందురు మహానుభావులు. ఎందరెందరో వారిని గూర్చి ఎన్నెన్నో వాకొనుచుందురు వ్రాయుచుందురు. మితి మీరి శ్లాఘింతురు. భజనలు సాగింతురు, అభూతకల్పనలు చేయుటకును వెనుకాడరు. ఆ కతలలో ప్రశంసలలో శ్లాఘలలో భజనలలో కల్పనలలో స్తవ మెక్కువ. వాస్తవము తక్కువ, పోనీ యిట్లుండును— ఆ మహానుభావులందరును అతిమాత్ర స్తుతిపాత్రులే యనుకొందము. కాని యాభాషాభూషల భోషాణములలో వారివారి భుజకీర్తులు, వడగలు, బొమిడికలు సర్వము గతార్థములగును ఈ ఆదిభట్ల నారాయణదాసుగారున్నారే ఈయన గురించి ఎన్ని పడగ లెత్తెదమన్నను, ఎంత గొడుగు పట్టెదమన్నను అందక పోఁదిక అల్లంత యెత్తున "అత్యతిష్ఠద్దశాంగుళ"మ్మన్నట్లు కూర్చుండును. మన కొలమానములు సరిపోవు. ఆయా మహానుభావుల ఘనత పూర్ణపురుషత్వమునుగాక తత్తద్వ్యక్తిత్వములందేదో యొక కోణము నాశ్రయించియుండును. ఆవిశిష్ట గుణమో లక్షణమో కళయో కౌశలమో దాని మీదనే మోజుపడిన లోకమంతయు తన చూపును మోహరించును. బహిరంతరముల బహువిశిష్టలక్షణ, విలక్షణ గుణబంధురుడైన వివిధ విద్యా విశారదుడైన సకల కళాకౌశల పేశలుడైన బహుభాషా చతురాస్యుడైన దాసుగారి వ్యక్తిత్వము నాకళించుకొనుట కొకరికే వెక్కడిది? ఒకచో పూర్ణావతార పురుషుడైన శ్రీ కృష్ణుడిట్లు స్తుతింపబడినాడు.

> మల్లైః శైలేంద్రకల్పః, శిశురఖిలజనైః, పుష్పచాపోఽంగనాభిః,
> గోపైస్తు ప్రాకృతాత్మా, దివి కులిశభృతా విశ్వకాయోఽప్రమేయః,
> క్రుద్ధః కంసేన, కాలో భయచకితదృశా, యోగిభిర్ధ్యేయమూర్తిః
> దృష్టో రంగావతారే హరి రమరజనానందకృ త్పాతు యుష్మాన్॥

ఇదీ ఆయన వాలకము. మరి ఆయనకు మానసపుత్రుడే ఆయెను శ్రీ దాసుగారు. ఆయన సామాన్య మానవులకు మహామహుడు. ధీమాన్యులకు కత్యద్భుత ధిషణా ధూర్వహుడు, హరిదాసులకు హరికథా పితామహుడు, కవులకు మహాకవి, గాయకులకు గాంధర్వ సార్వభౌముడు, నర్తకులకు నందీశ్వరుడు, నటులకు మహానటుడు, భక్తులకు మహాభాగవతుడు, భాషావేత్తలకు బ్రహ్మిష్ఠో బ్రహ్మ, శాస్త్రవిద్వాంసుల కక్షపాదుడు, పౌరాణికులకు బాదరాయణుడు, వేదాంతుల కాది శంకరుడు, ధార్మికులకు ధర్మజుడు. వనితల కంటికి వంచిత పంచబాణుడు, కళావతుల పాలిటికి కామధేనువు. వదరుబోతులకు వావదూక శిఖామణి, మిత భాషులకు వాచంయమివరేణ్యుడు, నిక్కుబోతులకు నిరంకుశ గంధ సింధురము, నాగరికులకు నవఖండ మహీమండలాఖండలుడు, జానపదులకు పట్టె సత్తైకాలపు సత్తెయ్య- ఇదీ ఆయన వరుస. మరి ఆ మహాభాగుని జీవితమునకుగాని వ్యక్తిత్వమునకుగాని వైదుష్యమునకుగాని ఏతామెత్తుట యెట్లు సాధ్యపడును? అందులకే యొక నీరాజన మెత్త సంకల్పించితిమి.

దాసుగారిగురించి ఆంధ్రాంగ్లములం దిప్పటికి మూడు జీవిత చరిత్రలు, మూడు ప్రత్యేకసంచికలు, పలువ్యాసములు, పరశ్శతములు ప్రశంసా పద్యములు వెలువడినవి. మరల నిదేల నీరాజనం బన్నచో అని యన్నియు సమ్యక్ప్రణాళికములు, సమగ్రదర్శనములునుగావు. అదిగాక హరికథ దాసుగారి ప్రధాన కర్మక్షేత్రమగుటచే ఆయనను లోకము హరికథా పితామహునిగనే గుర్తించినది. ఆయన జీవిత విశేషములను, వ్యక్తిత్వమర్మములను, కవితా కామనీయకమును, పాండిత్య పరిణాహమును, సంగీతప్రతిభను, హరికథేతర గ్రంథజాలమును తగినంతగా గుర్తించలేదు. అందులకే మా యీ ప్రకృతప్రయత్నము. దేశములో దాసుగారి యశోరేఖల నాకళించుకొన్న పెద్దలెందరో గలరు. వారి వారికి నాయా విషయములనుగూర్చి వ్రాయవలసినదిగా ప్రార్థించితిమి. అతః పూర్వము సిద్ధముగానున్న జీవితచరిత్రలనుండియు ప్రత్యేకసంచికల

నుండియు, పత్రికలనుండియు కొంత సామగ్రిని సేకరించితిమి. అన్నిటిని విషయ స్వభావానుగుణముగ వింగడించితిమి. గ్రంథమున ప్రథమ భాగము "జీవితము-వ్యక్తిత్వము", ద్వితీయ భాగము "సాహిత్య వైభవము", తృతీయభాగము "సంగీతప్రతిభ"గా రూపొందినవి. ఆయా భాగములందుండదగిన యంశములు, కృతిసమీక్షలు క్రమసమిద్ధపద్ధతి ప్రతీకములుగా సంపుటీకృతములైనవి. చిట్టచివర నొక అనుబంధ చతుష్టయమును ఇదియొక వాగ్దేవీపరివస్యయని భావించి కడు శ్రమకోర్చి తయారుచేసి చేర్చితిమి. అది యంతయు దాసజీవిత సారస్వత సారసంగ్రహము లేక సంగ్రహ సర్వస్వమువంటిది

మా విన్నపములను మన్నించి పెద్దలెందరో పలు వ్రాయసములు (62) పంపిరి. అందు చక్కని వెన్నోయున్నవి. చిక్కనవియును కొన్ని యున్నవి. అనపేక్షిత విస్తీర్ణములను గ్రంథ సౌందర్యలోభమునను, గ్రంథ విస్తరభీతి చేతను సంక్షేపింప వలసి వచ్చినది. అందులకా వ్యాసకర్తలను క్షమింప వేడుచుంటిమి. ఈ "సాహిత్య నీరాజన" భాగస్వాములైన సర్వరచయితలకును ఇందు మా కుపజీవ్యములైన ఆ. నా. దాసు జీవిత చరిత్రకారులకును, ప్రత్యేక సంచికల పత్రికల సంపాదకులకు మా కృతజ్ఞతా సహస్రతానేక సాధు వాదములు.

ఏ తద్గ్రంథ ముద్రణవ్యయభార ధూర్వహులైన వ్యక్తి ఒక సహృదయ సమ్రాట్టు, భారతీయ సంస్కృతి సంభావుకజన తురాషాట్టు, దాస భారతీ ప్రతిష్ఠా ప్రవర్ధకులు, మా ర. స. సంఘ ప్రధాన సంవర్ధకులు, శ్రీ కర్రా ఈశ్వర రావుగారు, B. Com. (Hons.), B. L., F. C. A. L. L. T. D. మేనేజరు, గుంటూరు. వారికి మా మనఃపూర్వక ప్రణామములు. ఈ సంఘమునకు వా రొనర్చిన మేలు కలకాలము మరువరానిది. తన్నిమిత్తము వారి కిందు ప్రత్యేకముగా కృతజ్ఞతాంజలి ఘటించితిమి. ఈకడచిన రెండేండ్లలోను శ్రీ ఈశ్వర రావుగారు దాసభారతీ ప్రచురణము లనుపేర వరుసపెట్టి దాసుగారి కృతులనేకము ప్రకటించుచున్నారు. అందు "మేలుబంతి" అను చాటుప్రబంధము, "కచ్ఛపీశ్రుతులు" అను

కవితాసంకలనము, "వ్యాసపీఠము" అను వ్యాససంపుటముల పరికల్పనము మదుపజ్ఞ మగుట నా యదృష్టము. "తల్లి నిన్ను—" అను లలితా సహస్ర నామ పరమార్థ ప్రకాశిక 'వేదాంతపారీణ' శ్రీఓరుగంటి నీలకంఠశాస్త్రి గారి సంపాదకత్వమున వెలువడినది. ఇంకను మరికొన్ని కృతులు త్వరలో వెలువడగలవు. దాసుగారికి సంబంధించిన సర్వగ్రంథముల గురించి వివరములకు ఇందలి ౪వ అనుబంధమును సంప్రదింపదగును.

ఈ మహాగ్రంథమునకు అమూల్యమైన ముఖబంధము ననుగ్రహించిన మహాభాగులు బహుశాస్త్రురభిజ్ఞహృదయులు, ఆంధ్రవిశ్వకళాపరిషదుపాధ్యక్షులు, అతీతకాల సాంస్కృతిక శాఖామాత్యులు, ఆంధ్రనాటక కళాపరిషదధ్యక్షులు, కీ॥ శే॥ రాజా వేంకటాద్రి అప్పారాయ మహాాదయుల ప్రియపుత్రులు శ్రీ రంగయ్యప్పారాయ రసిక ప్రభువులు. వారికి మా కృతజ్ఞతా పరిపాకములు నమోవాకములు.

దీనికి సహృదయభూమికను సంతరించినవారు సహృదయశిరోమణి ఉదారచిత్తులు, ఉత్తమసంస్కృతి ప్రవణులు, సాహితీవల్లభులు, ధర్మదేవతా ప్రతినిధులు గుంటూరుమండల ప్రధానన్యాయమూర్తి శ్రీ జి. రామానుజులు నాయుడుగారు. వారికి మనసార మా కృతజ్ఞతాభివాద నివేదనము.

మా ర.స. సంఘము ప్రాదుర్భవించి మూడేండ్లు మాత్రమయినది ఇదియేదో వట్టి వ్యాపారనిమిత్త మేర్పడిన సంస్థ కాదు. గట్టి ఆదర్శదృక్పథము పునాదిగా యేర్పడిన సంస్థ.

గుంటూరు, దాని పరిసరము అంతా చిరకాలానుగతముగా బహుధా చైతన్య చకచ్చకితమైన ప్రదేశము. జాతిని జాగృతము చేసిన రాసికర్యరమణీయము చేసిన సాహిత్యమునకిది జన్మభూమి. అతివిదగ్ధులును లబ్ధప్రతిష్ఠులును అయిన అనేక రచయితల బహుముఖ సారస్వత ప్రక్రియా కూలంకషమైన కృషితో పునీతమైన పుణ్యభూమి. కాని నేడు పలురచయితల పరిస్థితి సరిగా లేదు. తమ సారస్వత పరిశ్రమద్వారా వారు సమాజమునకును తమకు దామును ఉపయోగపడవలె నన్నచో వారి

పరిస్థితులు మెరుగుపడవలె, వారి యూహలు మనస్సులు నుత్సాహద్రోహలములు కావలె. "సంఘే శక్తిః కలౌ యుగే" అని పెద్దలన్నారు గనుక వారిశక్తి యేకముఖముగా సుసంఘటితమైనచో బహుముఖముగా వారి అస్తిత్వము చరితార్థమగును. అందుకే ఇటీవల ఆంధ్ర ప్రభుత్వాశంస ఫలముగా గుంటూరు రచయితల సహకార సంఘము అవతరించినది (1-1-1972).

మా సంఘము కొన్ని సాహిత్యపురోభివృద్ధి కార్యక్రమములను నిర్వహింపవలెనని. తద్వారా సమాజ శ్రేయస్సునే తనధ్యేయముగా పెట్టుకొని ఆనుషంగికముగా తన శ్రేయస్సును సాధించుకొనవలెనని ఆశించుచున్నది. ప్రపంచములో వివిధ దేశములలో వివిధ కాలములలో అవసరమైనప్పుడు విశ్వరూపము ధరించి విప్లవజ్యోతిని వెలిగించి ప్రచండ వేగముతో ప్రగతిని సాధించి విశ్వ శ్రేయస్సాధనలో విజయ శంఖధ్వానము చేసిన సాహిత్యము యొక్క మహత్తర శక్తిలో మాకున్నది విశ్వాసము, "విశ్వశ్రేయః కావ్యమ్" అన్నది మా నిశ్వాసము.

మా రచనలు మా ప్రచురణలు వర్తమానపు వాస్తవికతను విస్మరింపరాదని, అయితే వానికి కాలదోషము మాత్రము పట్టకూడదని మా ఆశయము. భవిష్యత్తు రూపురేకల మీద ఎంత ఆశపెట్టుకొందుమో గతకాలపు సత్సంప్రదాయముల నంత గౌరవింతుము. అయితే సంప్రదాయమన్నది అభివృద్ధికి మార్గదర్శకము దోహదము మాత్రమే కావలెగాని లోహశృంఖల కాకూడదని మా చూపు.

ఈనాడు రాజాధిరాజు లంతరించిరి, మహా మహా సామ్రాజ్యము లస్తమించినవి, కవులు కవులుగా బ్రతికిన కాలమును అంతరించినది, ఈనాడు తమ్ము నమ్ముకొన్న సాహిత్యమును తాము నమ్ముకొనలేక బ్రతుకు తెరువులు బరువులై సతమతమగుచున్నారు రచయితలు. అయితే యీనాడు ప్రజలే ప్రభుత్వ రథసారథులు, ప్రగతిపథ మహారథులు. వారే సాహిత్య మహారాజ పోషకులు కావలె. మా సంఘము

యొక్క అభ్యుదయము మా రచయితల యొక్క రెక్కల కష్టము మీదనే ప్రధానముగా ఆధారపడి యున్నదని మాకు తెలియును, కాని చేతనైన ప్రజలు, చేతమున్న ప్రజలు తమ అభ్యుదయము కోసము, తథాపి మా అభ్యుదయము కోసము తమ సహాకారము మా కందిపవలె; అప్పుడే "విశ్వశ్రేయః కావ్యమ్" అను సూక్తి సార్థక మగును,

ఆ యీ చూపులతోనే మనసంస్కృతి, మనసాహిత్యముల పర మార్థము క్రమముగా విస్మృతిపాలగుచున్నదని, ఉపరి అప్రతిష్ఠకు గురి యగుచున్నదనియు గుర్తించి మున్ముందుగా యథాశక్తి తద్విషయమై ఒక చక్కని గ్రంథము ప్రకటించుట మా ముఖ్యకర్తవ్యముగా నెంచి జిజ్ఞాసువులైన పాఠకులకోసము, విద్యార్థులకోసము "శారదావిపంచి" అను వివిధ రచయితల వ్యాసముల సంపుటిని ప్రకటించితిమి. తదుపరి జాతియందు రాసిక్యాభివృద్ధికి చేతనైన దోహదము చేయవలెనని సంక ల్పించి "ప్రసన్నకుసుమాయుధము" అనునొక అపూర్వప్రబంధమును ప్రకటించితిమి, ఇప్పుడీ నీరాజనము మా తృతీయ దీధితి. తన సాహిత్య జీవితమును లోకకళ్యాణార్థము సమర్పించిన నారాయణదాసుగారి బహు ముఖీనమైన మహానుభావత కేటికోళ్లై త్తవలెనను పూనికయది. జాతీయ స్వాస్థ్యమున కేడుగడ లేతాదృశులైన మహానుభావుల యుదంతములు.

ఇట్టి గ్రంథములను ప్రకటించుటయేగాక అనేక సభలు, సమా వేశములు, సాహితీగోష్ఠులు, సాంస్కృతిక కార్యక్రమములును నిర్వ హించినది మా ర. స సంఘము. అందు నా మనశ్శిశువులు : యమసభ, ఇంద్రసభ, చంద్రసభ, బ్రహ్మసభ, సరస్వతీసామ్రాజ్యము, మన్మథసా మ్రాజ్యము, నవరస తరంగిణి, కనకాభిషేకము, త్రైలోక్యవిజయము, అష్టకష్టావధానము. అన్నిటను ఏదోయొక క్రొత్తవింత, ప్రత్యేకప్రయో జనము ప్రణాళికయునున్నవి. ఇవి యన్నియు పలుతావుల రసిక సభా రంజకములగుటయేకాదు మన సాహితీసంస్కృతి ప్రతిష్ఠ లినుమడించు టకును దోహదము చేసినవి. వీనియందు సమర్థతతో పాల్గొని, మా

సంఘము పేరు ప్రతిష్ఠలకు తోడ్పడిన మా సభ్యులెల్లరకు నా సౌహార్ద సాధువాదములు. ఆయా కార్యక్రమముల యేర్పాటులకు తమ ఆర్థికమైన తోడ్పాటునందించిన ఉదారచరితులైన వ్యక్తులకు, సంస్థలకు మా కృతజ్ఞతా సహకృతానేక నమోవాకములు. (చూ., గ్రంథాంతపట్టిక).

ఆయా గ్రంథప్రచురణ, సభానిర్వహణాదిక సర్వకార్యక్రమములందును నాకు కుడిభుజమై నిల్చిన మేరునగధీరుడు డాక్టర్ ప్రసాదరాయ కులపతి. ఆతని పాండిత్య శౌండీర్యము, సభానిర్వహణనిపుణత, సముదాత్తవ్యక్తిత్వము ఈ సంస్థకు కలకాలము రామరక్షగా నిలుచుగాక!

ముద్రణ కార్యభారమును ర. స. సంఘ సారస్వత వరివస్యగా భావించి సముచితముగా నిర్వహించిన సహృదయ శేఖరులు శ్రీ వేదాంతం సంపత్కుమారాచార్యులుగారికి మా సాధువాదములు.

మా ర. స. సంఘ దీధితులను మూడింటిని భద్రముద్రణ కళతో భాసింపజేసిన జూపిటర్ ప్రింటింగ్ ప్రెస్ ముద్రణాలయము వారికి మా సముచిత కృతజ్ఞతా ప్రమాణములు

సహృదయ ప్రపంచము మా యీ సముద్యమమును సానుభూతితో సమాదరించునుగాక,

— సంపాదకుడు



Adibhatla Narayanadas
Principal,
Sri Vijayarama Ganapatasala.
Vizianagram.

# మధుర సరస్వతి

— శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

ఏతతి సగర్భమౌ వెలుఁగు విస్ఫుటమౌ మతిచే మఱిన్ వికా
రితమయి వేదశాస్త్ర సుపరీత పురాణ నవేతిహాస సం
గతిఁ గని గూడఁ దొల్తటి సగర్భ్యత మానక యుజ్జ్వలత్సర
స్వతి యయి సర్వశాస్త్ర పరిష త్ప్రథమాకృతియై వెలుంగుచున్.

అవిదితముల్ మఱెన్నియొ మహాకళలందున లీనమై ఏ ఱిన్
జవు లుదయింపఁ జేయునవి సాగెను మెట్లవు ఖండకాలమున్
నవము స్వరాకృతిం జనిన నాదము వేదము శారదాంబుదో
ద్భవమయి వాన వెన్నెలలు పంటలు తీర్చినయట్లు సాగఁగా.

క్రతువులు చేసి స్వర్గమున కంటె నిమేష సజీవముక్తిగా
ప్రతను రసానుభూతి గల బంధుర కావ్య విశిష్ట శిల్ప స
త్కృతి రచనాంగ భూతమగు రీతి కవిత్వ మనేకరాగ సం
గతమును భావ రాగ రస గానము శారద గర్భరూపముల్.

లయ గతి తాళ భేద పరిలక్ష్యముగాఁ గను ఖండకాలమున్
రయ విచలత్తురంగమ తరంగములై చనురీతిగాఁగ స
న్నయముగ మోదదాయి యగు నాట్యము భారతి వేఱు రూపుగా
నయి బహుభిన్నవైభవ సనాథముగాఁ బొలుపొందు నిచ్చటన్.

ఈ యఖిలమ్మునందుఁ బరమేశ్వరుఁ డెట్టులు నిండియుండెనో
యా యఖిలమ్ము వచ్చి తనయందున నుండెన యాదిభట్టనా
రాయణదాసులో హరికథాకృతి భారతి సర్వశిల్పవి
ద్యాయుతి సంస్కృతాంధ్రముల యాకృతియై పెఱమూర్తులై మఱిన్.



# వంశావళి

— శ్రీ నారాయణదాసు

కం. మునులం దెల్ల విధంబుల
మొనగాఁడు గణింపరాని మూఁకలతో వ
చ్చిన శ్రీరామున్విందునఁ
దనుపు భరద్వాజఋషికి దండం బిడెదన్.

సీ. మూఁడువేలేండ్లకు మున్ను సౌరాష్ట్ర వి
ప్రులు మ్లేచ్ఛసంపర్కమునకు రోసి
సాగిరి చోళదేశమున కవ్వారిలోఁ
బదుమూఁడుగోత్రము ల్బయలుదేఱి
వేయివత్సరముల వెన్క గోదావరీ
తీరముఁ జేరి న త్తెగలయందు
పేరూరునుండి పిల్పించి నన్నికఁ జేసి
జయపురేశుండు కృష్ణప్రభుండు

రెండువందల యేఁబదియేండ్లక్రింద
బహు తపఃప్రభావున్ భరద్వాజగోత్రు
సత్కుటుంబి నఖిలవేదశాస్త్రనిపుణు
నాదిభట్టనాము మదన్వయాద్యపురుషు.

గీ. అఘము తెగఁగొట్టు దపమున కాటపట్టు
నీతిఁ గనిపెట్టుఁ బులికైన మూతిఁగట్టు
ప్రేమమిన్ముట్టు నీవికి వేల్పుఁబెట్టు
వైదికుల తుదిమెట్టు మా యాదిభట్టు.

మ. గురుఁడున్ శుక్రుఁడు దారగేహములలోఁ గొల్వుండ నుద్దీప్తుఁడై
హరిణాంకాత్మజుఁ డాడుచు న్నశికి స్వాయత్తస్థితిన్బొందఁగా
నరవిందాప్తుఁడు హర్షమంద శని భాగ్యంబేలుచున్ సౌమ్యునన్
శరణొందన్ జనియించె మంగవిరాజద్గోపి లగ్నంబునన్.

కం. దేవతల శంకరుండున్
క్ష్మావల్లభులందు రామచంద్రుఁడు పేరార్
ద్రావిడుల నాదిభట్లు ప్ర
భావంబున నెదురులేనివారలు జగతిన్.

శా. మారాకారుఁడు వేదశాస్త్రనిధి బ్రహ్మజ్ఞాని మాయాదిభ
ట్టారాజేంద్రుఁడు సత్కరింపఁగ మహాయజ్ఞంబులన్ జేయుచున్
దారావత్య సమన్వితుండయి జగత్సన్మానితాచార్యుఁడై
పేరెక్కె న్గణభక్తిమై నతనితోఁ బృథ్వీశ్వరుం డిట్లనెన్.

శా. దేవా నీవు సమస్తమంత్రముల సిద్ధింబొందినావంచు నీ
సేవన్ జేయ నభీష్టమబ్బు ననుచు న్జెప్పెన్ మహాత్ముం డొకం
డే వేఁటాడు వనాంతరంబున భవద్వృత్తాంత మెర్గించి నిన్
న్నే విల్పించితిఁ గోరి కావున దయన్వీక్షించి రక్షించుమా.

కం. పితల ఋణముఁ దీర్పఁగ సం
తతికల్గెడి త్రోవఁ జూపు దయతో భూదే
వతల కసాధ్యం బెయ్యది
వెతఁ దొలఁగించుము మహాత్మ వేఁడెద నిన్నున్.

ఉ. కాలము వెళ్లుచుండె ననఘా కులదీపకుఁడౌ తనూభవున్
మాలిమితోడ ముద్దిడుట మాత్రమ నాకిఁక నున్నకోర్కె యీ
లాలస మీవు తీర్చు నెడ రాజ్యములో సగ బాలొసంగి భూ
పాలు నొనర్తు నీ సుతునిఁ దావక గోత్రమె నే వహించెదన్.

గీ. అనఁగఁ జెలుసవ్వానం బల్కె నాదిభట్టు
ధృతి యొనఁగ రఘునాథ కృష్ణదేవుఁడోడఁ
దపముగావించి యొక్కవత్సరములోనఁ
బుత్రు నీ కలరింతు గాయత్రి సాక్షి.

చ. అని తన యెన్మిదేండ్ల సుతు నా ధరణీశున కప్పగించి భా
ర్యను దనవెంటవేసికొని యగ్రేఁ దవంబున కాదిభట్టు; నం
దన దశకార్థముం గడు ముదంబునఁ గాంచి చిరంబు రాజ్యమున్
బొనరిచి కాన కేగె నఖిలుండయి రాజును లోకులొనన్.

తరువోజ

ఆదిభట్టాత్మజుఁడా హయగ్రీవుఁ డర్ధ రాజ్యంబున కధిపతియగుచు
వైదిక లౌకిక వైభవంబలరఁ బ్రథిత నందాపురిం బాలించు చఖిల
వేదవేత్తలను రప్పించి గ్రామముల వెలయించి శాత్రవభీకరుం డగుచు
భూదేవతలె మానవుల మిన్నలంచు భువనంబులన్నియుం బొగడరాజిల్లె.

సీ. వెడఁద ఫాలంబునఁ దడిసూరెడు విభూతి
నెలవంకలోన గందలగురీతి
కంఠమం దొంటి మొగంబు రుద్రాక్షము
హరు గళమున హాలాహలము మాడ్కి
ధనువూని రణరంగమున శత్రులం బాఱఁ
దోలుచు నభినవ ద్రోణు కీవి
వేదవేదాంగము ల్వివరించు తటి సర
స్వతి మగరూపునం బరఁగు చెల్వ
భూసుర క్షత్ర తేజము ల్మూర్తిఁ గొన్న
పోలికవు వెలయించి జనము లబ్బురము పడఁగ
క్షితిని బాలించి రఘునాథ కృష్ణదేవు
దొడ్డకొడుకగు రామచంద్రున కనె నిటు.

ఉ. ఏలుము నీవె రాజ్య మిది యెల్ల మహాత్ముఁడ రామచంద్ర! యా
యేలిక మాటఁ బట్టి యిటు లీకొనినాఁడను, బ్రహ్మగాఁడ నా
కేల నృపాల ధర్మ మిఁక నేగెద నందపురాగ్రహార వి
ప్రాళిగతిం బిత్ర్యాణ మెడయన్నవకట్టె గృహస్థు నయ్యెదన్.

చ. అన విని రామచంద్రుఁ డనఘా! పితృతుల్యుఁడ విచ్చవచ్చు న
ట్లొనరుచు మీవు నీకరుణ యుంచుము నాపయి రాజ చిహ్నము
ల్దనర యథేచ్ఛనుండు మన దబ్బున నందపురాగ్రహార వం
క్తిని వసియింప నేగె హయగ్రీవుఁడు బ్రాహ్మణచక్రవర్తియై.

సీ. బంగరుచాయ మాన్పల్లికి న్గూర్చుండి
తూర్యధ్వనులు మీఱఁ దూర్పుదెసకు
నందపురమునుండి నలుదట్లఁ గొండదొ
రల్ బ్రాహ్మణులు గొల్వ రయముతోడ
వెడలి పొట్టంగిలో విడిసి యావయిఁ దాడి
వలసను మక్కువన్గడచి సీత
నగరమున్దాటి స్వర్ణముఖినదీతటి
నజ్జాడ యనునూర నధివసించి

ద్రావిడాష్టాదశాగ్రహార ప్రభువయి
యజ్ఞముల్ గృహమేధియై యాచరించె
యబ్బయను పుత్రుఁగని నాకమరిగెఁ బత్ని
ప్రేమననుగమింపఁగ హయగ్రీవచయని.

ఉ. అబ్బయసోమయాజి సుతులారసు లిద్దఱు వేంకటేశ వీ
రబ్బలు, వేంకటేశ్వరుఁడు యజ్వయు లౌకికుఁ డన్నదాత, వీ
రబ్బఁడు పండితాగ్రణి యుదారుఁడు సత్వగుణప్రధానుఁడున్
బెబ్బులినైనఁ బట్టుకొను విక్రమశాలి మదన్వయాద్యుఁడున్.

## వంశావళి

సీ. అన్నదాతలని దిగంతవిఖ్యాతులై
వరఁగి రజ్జాడాదిభట్లవారు
బ్రాహ్మణప్రభువులై బహుయజ్ఞశాలలం
బన్ని రజ్జాడాదిభట్లవారు
కలవునవచ్చిన ఘనకుటుంబములఁ గా
పాడి రజ్జాడాదిభట్లవారు
విజయరామగజేంద్రు విందొనర్చిరి తమ
వట్ల నజ్జాడాదిభట్లవారు

శ్రీగలిపి యింటిపేర్ ఖరారించి చేతి
వ్రాలుపచరించి లక్ష్మిసరస్వతులకుఁ
బొందుగావించి యేలిన ప్రోడలెదిరి
పల్కనోవ రజ్జాడాదిభట్లవారు.

సీ. తొంబదియేండ్లముందు విజయనగర నా
రాయణగజపతి సాయమంది
అజ్జాడఁ గాపాడె యజ్ఞేశచయని వే
సారి మరాటీపితూరి నుండి
నడురేయి నన్నయ్య నదియీఁది యిడువన్న
ఫలమున రక్కసి న్వాదలఁగొట్టె
సుంద్రాయిచేఁబట్టి క్రొల్పులి నెదిరించి
శక్తిమై వేంకటభుక్త కూల్చె

త్యాగులున్ భోగులు సద్బోధనులు పూర్వు
లందఱు స్మృత్కాలంబున నలరినారు
సుతుఁడు వేంకటభోక్తకు సోమభోక్త
నామకీన పితామహుఁ డామహర్షి.

కం. నాజనకుఁ డాడితప్పని
యాజానుభుజుండు భాస్కరారాధకుఁడుర్
తేజోనిధి వేంకటకవి
రాజిల్లెను జగతి సతని(వ్రాఁతయుఁ జదువుర్.

సీ. బహుదేశ భాషలఁ బ్రభుల మెప్పించిన
మరువాడ వెంకన్న మనుమరాలు
పార్వతీశివులని ప్రఖ్యాతిఁగొన్న జ
గ్గయ్య-సీతమల నాల్గవకుమార్తె
గున్న యేన్గులవలె నున్నతిగన్న యై
దుగురన్నదమ్ముల తోడఁబుట్టు
పసితనంబున భాగవతపురాణము నాకుఁ
గఱపి సన్నించు నాకన్నతల్లి

కడుపు చల్లఁగ నేవురు కొడుకు లమటి
కూఁతుల స్నల్వుర గ్గాంచి కులము పొదల
నై దువతనంబు మోాయు నిల్లాలు చదువు
లవ్వయను బిరుదంపు నాయమ్మ నరస.

క. ఘనశంఖమువలెఁ గంఠ
ధ్వని యలర సమస్త కావ్యతతి విన్పించున్
జనులకుఁ బ్రత్యహము న్నా
జనకుఁడు గీర్వాణ వాగ్విశారదుఁ డగుచున్.

క. అభినవ మదనాకారుం
డిభవైరి పరాక్రముఁడు మహేంద్రవిభవుఁడున్
సభలఁ జిరంజీవి మహా
ప్రభువనఁ దగి త్యాగభోగరాయుండయ్యెన్.

సీ. అస్మజ్జనక శిష్యులై కావ్యపఠనము
చేసి లోకమునఁ బ్రసిద్ధిగాంచి
రల గంటి నీలకంఠావధానియు నా న
హోధ్యాయుఁడున్ జ్ఞాతి న్యాయతీర్థ
బిరుదముగొన్న కోవిదశిరోమణి యనే
కులఁ దర్క వేదాంతముల విబుధుల
సలిపిన యాచార్య సార్వభౌముఁ డఖండ
కీర్తినొందిన రామమూర్తి శాస్త్రి

అగ్రజులు నాకు నల్వురు ముగ్గురితోడఁ
బుట్టు మాకెల్ల సంతానము విలసిల్లు
వంశపావనచారిత్ర స్వర్ణగాత్ర
నా పెదవ్వ పాపమ సుగుణముల కుప్ప.

సీ అస్మదీయ భ్రాతలం దేను గడసార
మగ్రజోత్తముఁడు జగ్గావధాని
స్వాధ్యాయవరుఁ డనుపమ బలాఢ్యుండు నై
బంగారు మదపు టేనుంగుగున్న
విజయనగరమున విభవము సమకూర్చి
మమ్మింటకుం దెచ్చి మాకుటుంబ
ముద్ధరించిన మహాబుద్ధిమంతుఁడు సీ
తారాముఁ డిహాపరతంత్రవేత్త

గోత్రపావనుఁడౌ నగ్నిహోత్రశాస్త్రి
చలువ పన్నీరు చల్లిన చందమనుచు
రాజు లందఱు మెచ్చ నల్లోజవలెను
జోడుగూడి పేరన్న నాతోడఁబాడు.

గీ. కావ్యరచనకు వాల్మీకి కావలయును
తగును వ్యాసుఁ డొకండె శాస్త్రంబుఁ దెలుపఁ
శక్తి లేమి నెఱిఁగియు లజ్జ న్దొఱంగి
వేత్తవలె నటియించెద విధివశమున.

గీ. తెలుఁగువారలకు న్దేటతెల్లముగను
దెనుఁగులో నెల్ల విద్దెఁ దెలుపనెంతు
అన్నివిధముల నను గాచు నాంధ్రదేశ
మునకు నాయిచ్చియున్న యవ్వనము దీర్తు.

కం. నీమూలము నాగోత్రము
నా మంచియుఁ జెడ్డ నీదె నడిపించుము న
న్నీమది కొలఁది న్నాదృశ
పామరజనకల్పభూజ భారద్వాజా!



# జీవితోదంతము

— శ్రీ కట్టా ఈశ్వరరావు

Lives of great men, all remind us
We can make our lives sublime
and departing leave behind us
Foot prints on the sands of time

ఏదేని దేశముయొక్కగాని జాతియొక్కగాని చరిత్రము ఆ యా ప్రధానక్షేత్రములలో వెలిగిన కొలదిమంది మహాపురుషుల జీవిత చరిత్రమే యయియున్నది.

నేటి విశాఖజిల్లాలోని విజయనగర సంస్థానము 19&20-వ శతాబ్దుల పూర్వార్థమున గజపతుల పరిపాలనమున అనేక విద్యలకు కళలకు నిలయమై తన యశశ్చంద్రికలను నలుగడల ప్రసరింపజేయుచుండెను. ఆనాడు అట్టి యశస్సౌరభములను వెదజల్లిన మహాపురుషులలో తొలుత పేర్కొనదగినవారు శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాసుగారు. వారు ఇంటిపేరనే గాక సర్వవిద్యా విదగ్ధుల యందును ఆదిభట్లులై కీర్తిగాంచిరి. వారు ఆకార సదృశ ప్రజ్ఞులు. 'ప్రపేదిరే ప్రాక్తనజన్మ విద్యాః' అను నానుడికి దృష్టాంతమైనవారు.

శ్రీ దాసుగారు దక్షిణభారతములో తత్రాపి ఆంధ్రదేశములో హరికథకు భిక్షపెట్టినవారు. వారి వలన ఆంధ్రులకీర్తి దశదిశల వ్యాపించినది. హరికథలలో వారి శిష్యవర్గము తామరతంపరయై యుండుటచే వారి యఖండ ప్రజ్ఞావిశేషము హరికథలయందే యనగా హరికథ కాధారములగు సంగీత నాట్యములయందే గుర్తింపబడినది. కాని వారి బహుముఖములగు రచనా సంతతులనుబట్టి వారికి సాహిత్యమునందేగాక సర్వకళలయందును ఎట్టి సమగ్ర ప్రజ్ఞగలదో లోకము తెలిసికొనుటకు అవ

కాశము గాదు. హరికథకు వేదప్రామాణ్యముద్వారా సుస్థిర గౌరవమును నెలకొల్పి ఉత్తమ సంప్రదాయమును స్థాపించి అఱువది సంవత్సరములు తన యుత్తమ శాస్త్ర విజ్ఞానమును లలితకళాకౌశలమును ప్రదర్శించుచు దన గంభీరగాత్ర సంగీత గంగాతరంగములతో తన కాలి గజ్జెల ఘలంఘలలతో ఆంధ్రదేశమునేగాక ఇతర దేశములనుగూడ ఉఱ్ఱూతలూగించి ఒక ధ్రువతారగా వెలసిన శ్రీ దాసుగారి కళాజీవిత చరిత్రము వారి సంగీత సాహిత్య కృషి తెలిసికొనకుండ ఆంధ్రదేశ సంస్కృతి సమగ్ర స్వరూపమును గ్రహింపలేము. శ్రీ దాసుగారి విద్యావంశములోని సంతానమగు శిష్య ప్రశిష్యులు వారి వలన తమకు సంక్రమించిన దాయమగు సంగీత నాట్యకళావైభవమును అనుకృతిచేసైన జీర్ణింపజేసికొని ప్రచారములోనికి తీసికొనిరావలయును. అట్లయినచో శ్రీ దాసుగారి యశస్సు హరికథా పితామహునిగాను హరికథా జగద్గురువుగాను చిరస్థాయిగా వెలుగుచుండును. సర్వకళాసంపుటముగా ప్రజానీకమునకు తన హరికథలద్వారా చిత్తశాంతిని భక్తిని ప్రబోధమును ఆనందమును కలుగజేయుటకు ఈ ప్రక్రియ సృజించి దేశములో వ్యాప్తినందించుటకు ఆ విద్యల రాణి వాగ్దేవితో పురుషాకృతితో దివినుండి భువికేతెంచినదని శ్రీ దాసుగారిని దెలిసిన వారందఱు అనుచుందురు.

శ్రీకాకుళమండలము నందలి బొబ్బిలి తాలూకా అజ్జాడలోని ఆదిభట్లవారు భారద్వాజగోత్రులు. 'ఆదిభట్ల' గృహనామము గలవారు. వేఱొక గోత్రమున దిమిలయను వేఱొక గ్రామము నందుండుటచే శ్రీదాసుగారు తమ స్వరూపము స్పష్టముగ దెలియుటకు "శ్రీమదజ్జాడాదిభట్ల" యని వ్రాసికొనెడివారు. శ్రీదాసుగారి తండ్రి వేంకటచయనిశాస్త్రి ఆజానుబాహుడు. భాస్కరోపాసకుడు. కవియు పౌరాణికావతంసుడును గూడ. ఈమహానుభావుడప్రతిగ్రహీత. ఈ యుత్తమవిప్రుడు ఒకప్పుడు తనకు క్షయవ్యాధి సోకగా తన సూర్యోపాసనతో ఆవ్యాధిని నిర్మూలింప జేసికొనెను. అనంతరము తనకు గల్గిన

కుమారునకు తన యుపాస్యదేవతానామమును 'సూర్యనారాయణ' అని పెట్టుకొనెను. ఆబాలుడే లోకమున నారాయణదాసుడుగా ప్రసిద్ధుడయ్యెను. ఇంటిలోని ముద్దుపేరు - సూరన్న - సూరి.

(శ్రీ)దాసుగారి తల్లి నరసమాంబ. ఈమెకు అన్ని పురాణములు గూడ అవగతములు. తన చిన్న పుత్రునకు పసితనమునందే భాగవత పురాణమును గరిపి దానియందాతనికి అత్యంతాసక్తిని ఈమె గలుగజేసెను ఈమె విజ్ఞానమునుబట్టి ఈమెను 'పురాణముల నరసమ్మగార'నియు, 'చదువులవ్వ' యనియు జనులు పిలుచుచుండెడివారు.

ఈనరసమాంబా వేంకటచయన పుణ్యదంపతులకు అయిదుగురు పుత్రులు నల్వురు పుత్రికలును గల్గిరి. అందు జ్యేష్ఠుడు జగ్గావధానులుగారు. ఈతడు మహాబలశాలి, సాలప్రాంశువు, సంపూర్ణ వేదాధ్యేత. ఆనాడు విజయనగరమహారాజ సంస్థాపితమగు నాటకసమాజమున నొక నటుడుగా గూడ నీతడుండుట ఒక విశేషము. రెండవ పుత్రుడగు సీతారామయ్యగారు కూడ స్వాధ్యాయపరుడు. ఇహాపరతంత్రివేది తెలుగు ప్లీడరు పనిచేసెను. మూడవపుత్రుడు అగ్నిహోత్రశాస్త్రిగారు. కావ్య నాటకాలంకారజ్ఞానము బాగుగా గలవారు. నాల్గవపుత్రుడు పేరన్నగారు. (శ్రీ)దాసుగారివలెనే తనకు జన్మతః అలవడిన సంగీతమును శాస్త్రీయము గావించుకొని సన్నవిగాత్రముతో "రాజులందఱు మెచ్చ నల్గోజవలెను" జోడు గూడి (శ్రీ)దాసుగారితో పాడుచుండెడివారు. అయిదవ కుమారుడే మన శ్రీదాసుగారు. రక్తాక్షిసంవత్సర శ్రావణ కృష్ణచతుర్దశీ బుధవాసరమున (31-8-1864) రాత్రి పదిగడియలకు మఘానక్షత్ర చతుర్థ చరణమున జనించెను. (శ్రీ)దాసుగారి జాతకము హరికథామృత గ్రంథాదియందు ప్రకటింపబడినది. (శ్రీ)మిన్నికంటి గురునాథశర్మగారు జాతకచక్ర స్వరూపమును ఈగ్రంథముననే నిరూపించిరి.

బాల్యము :- సువర్ణముఖరును జీవనది యొడ్డున రమణీయమగు ప్రకృతిశోభతో వెలుగు అనేక బ్రాహ్మణాగ్రహారములలో

మిక్కిలి వన్నెకెక్కినది అజ్జాడాగ్రహారము. అచటి మనోహరములగు తోటలు, పచ్చనిపైరులు, సెలయేళ్లు పచ్చికబయళ్లును గల సౌందర్య సముజ్జ్వల ప్రకృతి సవిత్రి యొడిలో శ్రీదాసుగారు చిన్ననాడు ఆటలాడు కొనుచుండెడివారు. ఆసౌందర్యమునకు ఆయన ముగ్ధులయ్యెడివారు. అక్షరములు నేర్చిన కొలదికాలమునకే తల్లి నేర్పిన భాగవతపురాణము శ్రీదాసుగారి జన్మసిద్ధమగు దైవభక్తిని భాషానురక్తిని పెంపొందించెను. కావున బాల్యమునందే అనేక పద్యములను కంఠస్థము గావించి శ్రవణపేయముగా చదువుట, ఎవరేపాటను ఎట్లు పాడినను ఆపాటనట్లే అనుకరించి పాడుట, గ్రామదేవతల జాతరలయందు వాయించు పటహ ధ్వనుల లయననుసరించి తన్మయులై యాడుటయు వీరికి సహజములు. ఒకపర్యాయమే వినుటచేతను చూచుటచేతను గూడ ఆయా విషయములను గ్రహించి ప్రదర్శించుచు తమ యసాధారణ ప్రజ్ఞాప్రతిభా ప్రాభవములచే గ్రామస్థులను ఆశ్చర్యపఱచుచుండెడివారు.

నాడు శివరాత్రి పర్వదినము. సమీపమునందలి ' గుంప ' యను దివ్యతీర్థమున పెద్ద యుత్సవము జరుగును. దానికి తన తల్లితో గూడ వెడలి దేవదర్శనము చేసికొని పార్వతీపురము మీదుగా తిరిగి తన యూరికి వచ్చుచు ఒక పుస్తకముల యంగడికి పోయి ఆ యధికారిని " భాగవతమున్నదా ?" అని అడిగెను. దాని యధికారియగు సాతాని రంగయ్య యను నాతఁడు మన చిన్నవారిని చూచి ' భాగవతము నీకెందుకు పొమ్మ 'నెను. ఆ మాట తల్లివిని ' మాపిల్లాడు చదువు కుంటాడు; పుస్తకముంటే ఖరీదు కివ్వండి ' అని బండిలోనుండియే చెప్పెను. అదివిని రంగయ్య ' ఈ పిల్లవాడు భాగవతము చదువుతాడా ? ఇతడు చదివితే నేను వెలకు ఇచ్చేదా ! అని పలుకుచు భాగవతముతీసి అక్కడక్కడ చదివించెను. పిల్లవాడు రాగ వరుసతో ఇతరులకు బాగుగా అర్థమగునట్లు శరవేగముతో చదువుటచూచి బాలుని ప్రజ్ఞ కచ్చెరువు పడి ఆ పుస్తకము ఆ బాలునికి బహూకరించెను. తానవ్వడట్లార్జించిన

ఆ పుస్తకమును ప్రజ్ఞా శుల్కముగా శ్రీ దాసుగారు చెప్పుచుండెడి వారు.

ఒకప్పుడు అజ్జాడకు వచ్చిన ఒక యతీశ్వరుడు చిన్నసూరినిచూచి 'నీవు గొప్ప పండితుడవగుదువని' నారాయణ స్మరణముతో ఒక శాటీని ఆ పిల్లవాని కంఠమునం దలంకరించిరి. చిన్నతనమునుండియు శ్రీ దాసు గారు ప్రకృతి సౌందర్యమునుచూచి వివశతను పొందెడివారు. తర్క వేదాంతముల యందును సదాచార సంపత్తియందును గురుపీఠముగా దేశమున వాసిగాంచిన న్యాయతీర్థ ఆదిభట్ల రామమూర్తి శాస్త్రిగారు శ్రీ దాసుగారి సహపాఠులు. చిన్నతనమున తన జనకులయొద్దనే పదవ సంవత్సరము వఱకు రామమూర్తి శాస్త్రిగారితో గూడ కావ్యములను జదివిరి. పాఠసమయములందు ప్రసంగవశమున వచ్చు ప్రకృతి వర్ణనముల యందు చిన్న సూరికి గల్గు వివశత చెప్పనలవి గాకుండెను.

ఒకనాడు తన పదవయేట "పంతరాము" అను మాతామహస్థానమునకు తన తల్లితో గూడ చిన్నసూరి వెళ్ళెను. బొబ్బిలి సంస్థాన సంగీత విద్వాంసులగు వాసా సాంబయ్యగారు ఆ సమయమున ఆ యూరికి వచ్చుట తటస్థించెను. అతడు సూరి ఆంధ్రమహాభారతములోని పద్యములను వివిధ రాగములతో చదువుటగాంచి ఆకంఠగాంభీర్యమును రాగ భంగిమములను విని అత్యాశ్చర్యమునంది తల్లి నరసమ్మగారితో 'వీనికి సంగీతము చెప్పించిన పెద్ద పాటగాడగును. నాతో పంపినచో కుఱ్ఱవానికి వారము లిప్పించి సంగీతము చెప్పెద'నని పలికెను. ఆమె దాని కంగీకరింపగా తనతో తీసికొనిపోయి మంచి ముహూర్తమున చిన్నసూరికి 'సప'ల నుపదేశించెను. కాని బాలుడు మాత్రము బొబ్బిలిలో ఒక మాసము మాత్రమే యుండి తన యారోగ్యము సరిగా లేకపోవుటచే తన గురువుగారికి గూడ దెలుపక తన యూరుచేరెను. ఇట్లు చిన్నసూరి సంగీత విద్యాభ్యాసము నెల దినములకే పూర్ణమయ్యెను. కాని అచిర కాలములోనే అత్యల్పమగు ఆ గురూపదేశమునే యూతగా గొని

స్వయం కృషితో సహజప్రతిభతో గురుసాహాయ్యము లేకయే సంగీతశాస్త్రరత్నాకరమును మథించి అందు కాకలుతీరిన విద్వన్మణి అయ్యెను. నూరి సహజముగ సంపెగ ఛాయతో దృఢమగు కాయము గలవాడు. ఎండవానల నెంతమాత్రము లెక్కపెట్టనివాడు. తోడిపిల్లలతో ఆడునప్పుడుగాని తాను ఏకాకిగా స్వేచ్ఛతో తిరుగునప్పుడుగాని పెద్దపెద్ద చెట్లను అవలీలగా నెక్కునప్పుడుగాని పెద్దపెద్ద చెఱువుల నీదుటయందుగాని తాను లఘిష్ఠము బలిష్ఠము అగు శరీరము గలవాడగుటచే అందఱిలో మేటియే యగుచుండెను. ఈతను సోగముక్కు ఉంగరాలజుట్టు ఉన్నతభుజములు సన్నపుకౌను వెడదఱొమ్ముగల్గిన సమవిభక్త దృఢదేహుడు. సుస్నిగ్ధ గాత్రుడు. శరీర సౌష్ఠవమునకు తోడు బుద్ధిబలము గొప్ప మేధాశక్తి పరిశోధనాశక్తి స్వతంత్రతారక్తి అనుకంపాతిశయము ఈతనికి సహజములు. తాను మొండి పట్టుదల గలవాడైనను సోదరులుగాని జనకుడుగాని గట్టిగ నుందలించినచో అతి వినీయతతో వారల యాజ్ఞనను అనునగ్గించెనే గాని యెన్నడును వారలను ధిక్కరింపలేదు. జాతకప్రభావముచే గాంభీర్యం ఈతనికి అకారణప్రేమ నిష్కారణ వైరము నైజములు. ఈ ధర్మములు చిన్ననాటినుండి పెద్దతనమువఱకు అనపేతములుగా నుండెను. ఒక వస్తువును గాంచినప్పుడు అందలి సౌందర్యముగాని వికారముగాని వెనువెంటనే స్ఫురించెడిది.

విద్యాభ్యాసము :-

పదుమూడవయేట మన బాలదాసుని రెండవ యన్నగారగు సీతారామయ్యగారు ఇంగ్లీషుబడిలో ప్రవేశపెట్టిరి. 1880. సం. లో నీతడు మొదటి తరగతిలో చదువు మొదలుపెట్టెను. సహపాఠకులలో వయసున నీతడు చాల పెద్దవాడు. సంస్కృతాంధ్రములు బాగుగా తెలిసినవాడును గణిత శాస్త్రమునందు మంచి ప్రజ్ఞగలవాడును అగుటచే ఆంగ్లభాషను చాల సులభముగా నేర్చుకొనెను. అందుచే గురువులందఱు నీతనియందు అత్యంతాభిమానము గల్గియుండిరి. కాలేజీ ప్రిన్సిపాలుగారగు చంద్ర

శేఖర శాస్త్రిగారు ఈయనకు "ఫ్రీస్కాలర్షిప్పు" నిచ్చిరి. సహజముగు మేధాసంపదతో విలసిల్లుటచే నీతడు గూడ "డబుల్ ప్రమోషను" మీద పై తరగతి దాటి చదువుచుండెను. కాని క్రమముగా బడిలో తన యుపాధ్యాయుల దగ్గర నేర్చిన దానికంటె ఊరిలో స్వయముగా నేర్చిన చదువు హెచ్చుగానుండెను. కావున బడిచదువు అంత లాభకరము కాకపోవుటచే బడిచదువుమీద నీతనికి మనసు నిలువలేదు.

ఆనాటి విజయనగరము వాస్తవముగు విద్వలనగరమే. వేదశాస్త్రాది సకలవిద్యల యందేగాక సంగీతనృత్యసాహిత్యాది సర్వకళల యందు గూడ దిగ్దంతులయిన పండితులచట ఉండెడివారు. అచట ప్రతి దినము గూడ పండితసభలు శాస్త్రవాదములు పాటకచ్చేరీలు భజనలు నాటకములు సాముగరిడీలు కుస్తీపందెములు మున్నగునవెన్నియో జరుగుచుండెడివి. ఇట్టి సంతతోత్సాహ సంపూర్ణముగు నాపట్టణమందు మన సూర్యనారాయణ బడికి పోవుచున్నప్పటికిని బడిచదువు ఆతనికి అంతగా నచ్చక పూర్వజన్మసంస్కారమువలన సంగీత-సాహిత్య-కవితాదులయందే హృదయము మహోత్సాహముతో పరువులిడుచుండెను. ఆతడు ఎవరేది యెట్లు పాడినను విని దానిని హెచ్చుస్థాయిలో ఇంకను మిక్కిలి రసస్ఫూర్తి గల్గునట్లు మనోహరముగ పాడుచుండెను. కాలేజీ విద్యార్థులందఱు ఈతని చుట్టూచేరి ఈతని కవితను గానమును విని ఆనందభరితులగుచుండెడివారు. శ్రీగురజాడ అప్పారావుగారు, శ్రీగిడుగు రామమూర్తిగారు, శ్రీఆచంట వేంకటరాయ సాంఖ్యాయన శర్మగారు మున్నగు వారందఱును మన సూర్యనారాయణ మిత్రబృందము. ఇట్లు సంగీత సాహిత్యాదులందలి యాసక్తిచే బడిచదువు నంతగా లెక్కింపక పోయినను 1886వ సంవత్సరమున మెట్రిక్యులేషను పరీక్షయందు తీర్ణుడయ్యెను. అప్పటికే పండితపామరరంజకముగ పాడుట ధారాశుద్ధిగా కవిత చెప్పుట మున్నగువానియందు మంచి ప్రావీణ్యముండెను. హరికథ చెప్పుటయన్నదో తన యిరువదవ యేటనే ఆరంభించెను. అది మొదలు

(శ్రీ)సూర్యనారాయణకు 'నారాయణదాస' నామము జగత్ప్రసిద్ధ మయ్యెను.

ఈ 1886 వ సంవత్సరమునందే (శ్రీ) నడ్డమూని అన్నప్ప అను నొక సద్వంశ్యుని పుత్రికయగు లక్ష్మీనరసమ్మను (శ్రీ) దాసుగారు వివాహమాడిరి.

విజయనగర మహారాజ కలాశాలకు (శ్రీ) చంద్రశేఖరశాస్త్రిగారి యనన్తరము (శ్రీ) కిళాంబి రామానుజాచార్యులుగారు ప్రిన్సిపాలు పదవి నధిరోహించిరి. ఆయనకు సంగీత మంతగా రుచింపదు. కావున సూర్య నారాయణకు 'ఫస్టుమార్కు' రాలేదను నెపమున 'స్కాలరుషిప్పు'ను తొలగించెను. కావున సూర్యనారాయణకు విజయనగరమున చదువు టకు అవకాశములేక విశాఖపట్టణము వెళ్ళి అచట ఎ. వి. యన్. కళా శాలలో చదువుటకు నిశ్చయించుకొనెను. సంకల్పానుసారముగ విశాఖ పట్టణము వెళ్ళి ఆ ఎ. వి. యన్. కాలేజీ ప్రిన్సిపాలుగారితో తన విషయ మును తెలుపుకొనగా ఆతడు తన కాలేజీలో ఉచితముగా చదువుకొమ్మ నియు, తన యింటనే భోజనము చేయుమనియు దెలిపి మఱియు ఆ యూరిలోనున్న తన వేశ్యకు వలసిన సంగీత పాఠము చెప్పుమనియు గూడ కోరిరి. అందులకు మన సూర్యనారాయణ యంగీకరించి యట్లే చేయుచు 1886-1888 రెండేడ్లు అచట F. A. తరగతిని చదివెను. దీనితో బడి చదువు సమాప్తమాయెను.

(శ్రీ) నారాయణదాసుగారికి ఉద్యోగము చేయవలయునను కోరిక యెన్నడును లేదు. అది యాతని మనస్తత్వమునకు విరుద్ధము. తన యిష్టము చొప్పున ఆడుచు పాడుచు హరికథా కాలక్షేపనముతో జీవిత మును గడుపుకొనుచు హాయిగా స్వతంత్రముగా జీవితమును గడుపు టయే ఆతని జీవిత పరమావధిగా నెన్నుకొనెను. తాను గురుపుకడ నభ్యసింపక పోయినను పరమేశ్వరానుగ్రహమువలన అలవడిన భక్తికి

ప్రధాన సాధనములగు ఆటపాటలతో లోకమును తద్ద్వారా పరమేశ్వరుని రంజింపజేసి తృప్తిపఱచి ఆనాటికి దేశమునం దెవ్వరికిగూడ తెలియని హరికథా రూపకోపన్యాసములతో తాను హాయిగా కాలక్షేపమును చేయగలనను మెచ్చదగిన ధైర్యసాహసములు (శ్రీ) దాసుగారికే చెల్లినవి. వారి యాత్మవిశ్వాసమట్టిది. వారు నేర్చిన విద్యలలో ఇంగ్లీషు తప్ప మిగిలినవన్నియు స్వకీయకృషి సిద్ధములే. నిజముగా పూర్వజన్మ సంస్కారవశమున వారికి ఈ ప్రపంచమే యొక్క చదువుల జడియు విద్యాధిష్ఠాత్రియగు వాణియే యొక్క యొజ్జయునయ్యెను. విశాఖపట్టణము నందలి కలాశాల చదువు విడిచిన తరువాత స్వగ్రామమునందు నిశాసమయముల తొమ్మిది పది గంటలకు నారంభించి తెల్లవారు వఱకును ఆముదపు దీపము కాంతిలో ఏదోయొక గ్రంథమును జదువుట వారికి పరిపాటియైనది. ఈ తీరుననే వారు అఱువది సంవత్సరముల వఱకు చదువుచు తమ మేధాశక్తివలన అనేక భాషలను శాస్త్రములను సాధింపగల్గిరి. ఇట్టి తమ చదువంతయు సదసద్వివేక సంపాదనముద్వారా తమ యానందము కొఱకేగాని ఇతరములకు ఐహిక తుచ్ఛ భోగముల కొఱకుగాదని (శ్రీ) దాసుగారి నిరూఢమగు భావన. కొన్ని దినముల తరువాత సంస్కృత వాఙ్మయ జలధియందు నేను స్పృశింపని గ్రంథ జలకణ మెద్దియైన గలదా యనునంతటి విశేష విజ్ఞానమునందిరి. వారు 1900-1901 సంవత్సరముల యందు ఉర్దూ నేర్చుటకై పుస్తకములను తెప్పించి యొక మౌల్వీ సాహాయ్యమున లిపిని, మాటలను, కొంత వ్యాకరణ విజ్ఞానమును తెలిసికొని తదనంతరము స్వయం కృషివలన ఉర్దూ అరబ్బీ పారశీక భాషలను నేర్చెను. హిందూస్థానీ మాటాడుట వారికదివఱకే వచ్చును.

హరికథ :- మన దేశమునందీ హరికథాప్రక్రియ చాల అపూర్వము. హరికథకుని తాహతునుబట్టి ఇది ప్రదర్శింపబడును. ఇట్టి విశాలమగు భావప్రదర్శనానుకూలరంగము. ఇట్టి రంగము మఱెందును

లేదు. సకల కళలను సకల విద్యలను గూడ ఒకే సమయమున నిందు ప్రదర్శించుటకు తగునవకాశము గలదు. ఇట్టి విద్యాప్రదర్శక వినోదము ఇంతకుముందు లేదు. దీనిలో ప్రధానమైనవి - ఉత్తమములగు సంగీత సాహిత్యములు, ఇంపగు నృత్యము, రసానురూపమగు అభినయము, హృదయరంజకములగు మాటలనేర్పు, ఆకర్షణీయమగు కథకుని రూపము ను వీనికితోడు సర్వశాస్త్ర విజ్ఞానము కూడ నున్నచో సువర్ణమునకు సువాసన అబ్బినట్లే. అప్పుడు అతని వాక్కు పండిత పామర రంజకముగా నుండుననుటలో ఎట్టి సందేహము గూడ లేదు. పూర్వపుణ్యవశమున ఇవి అన్నియు గూడ ఎట్టిలోటు గూడ లేకుండ (శ్రీ)దాసుగారి నాశ్రయించినవి. ఇవి వారికి ఆజన్మసిద్ధములు. మఱియు త్రిస్థాయిగనుక మేఘ గంభీరగాత్రము, సర్వపురాణేతిహాస పరిచయము, వివిధ భాషా వేత్తృత్వము, అత్యద్భుతమగు లోకవృత్త పరిశీలనము, భావప్రకటన సామర్థ్యము మున్నగు కథకునికి ఆవశ్యకములగు సుగుణములు గూడ వారికి వెన్నతో పెట్టినవి. ఇట్టి సర్వగుణసంపూర్ణులగు వీరి హరికథ ఆబాలగోపాలమునకు గూడ భరద్వాజుని విందువంటిదయ్యెను.

విజయనగరమునందు ఒకప్పుడు దాక్షిణాత్యుడగు కుప్పుస్వామి నాయుడు అనునొక భాగవతారు కథా కాలక్షేపము చేయుచుండగా (శ్రీ) దాసుగారు దానిని చూచిరి. ఆ పద్ధతిని కొంత సంస్కరించి ప్రదర్శించినచో జనరంజకమగునని శ్రీ దాసుగారి హృదయమున గాఢమగు నభిప్రాయము గల్గినది. పద గద్య పద్యములను అందు సమకూర్చి రసభావానుకూలమగు నృత్యాభినయ ప్రదర్శనమే అందు దాసుగారు చేయదలచిన సంస్కారము. తాము సహజ కవితా ధురీణులగుటచే ఎట్టిభావమును ఏమాటలతో సమకూర్పవలయునో బాగుగా నెఱింగిన వారు. వెంటనే తమ భావానుకూలముగ మచ్చునకై "ధ్రువచరిత్ర" మును రచియించి పవిత్రమగు ఒక దేవాలయమున తొలుత తన మిత్ర బృందమునకు ఆడిపాడి విన్పించిరి. వారందఱు అట్టి అపూర్వ ప్రదర్శన

మునకు వివశులయి శ్రీదాసుగారిని స్తుతింపగా ఈ నూతన ప్రక్రియ తన సంకల్పమునకు చేదోడు వాదోడుగా నుండునని శ్రీ దాసుగారు మిగుల తృప్తినొందిరి.

బహుప్రజ్ఞా విలసితమగు ఈ నూతన హరికథా కథనము అనితర సాధ్యము. స్వోపజ్ఞమగు నిట్టి హరికథా రూపమగు హృదయరంజక ప్రక్రియ నొకదానిని వారు కల్పించి ఆంధ్రదేశమునందంతటను అఱువది సంవత్సరములకు పైగా ప్రదర్శించిరి. దేశాంతరములయందును గూడ తమ ఈ నూతన ప్రదర్శనమును ప్రదర్శించి ఆ యా దేశీయుల పొగడ్తలను గాంచిరి. వేయేల శ్రీ దాసుగారి కథను వినుటకై దూరభారములను గూడ లెక్కింపక పండిత పామరు లందఱును తండోపతండములుగ వచ్చి ప్రదర్శనము తుదివరకు గూడ తన్మయులై కూర్చుండి వారి దివ్యసుందర సుమంగళ విగ్రహమును నృత్య విన్యాసమును నేత్రపర్వముగ గాంచియు మేఘగంభీరమగు వారి త్రిస్థాయి గమకమగు పాటను శ్రోత్రపేయముగ వినియు వారి సమయస్ఫూర్తితో గూడిన చమత్కృతి వచన రచనములు మనసునందు మాటి మాటికి భావించుకొనుచుండిరి. వారి కథ సకలేంద్రియ సంతర్పణముకాగా నిర్భరానంద రసనిమగ్నులయి కథాంతమునందు ఎట్లో తమతమ నెలవులకు అరుగుచుండెడివారు. విశాలమగు బాహ్యప్రదేశమునందు గూడ జనము క్రిక్కిరిసి దాసుగారిరాకకై ఎదురు చూచుటయు సమీపములయందలి చెట్లను గోడలను ఇండ్లను ఎక్కి తమ్ము తామెఱుగని యుత్సాహముతో ఎదురు చూచుట, టిక్కెట్లు పెట్టినప్పుడుగూడ ఎంతో విశాలమగు హాలు గూడ నిండి స్థలము లేక టిక్కెట్లు దొరుకక నిరుత్సాహులై వెనుదిరిగిపోవుట మున్నగునవి శ్రీదాసుగారి కథా ప్రసక్తికి లక్షణములైనవి. హరికథాగాన మొనర్చునపుడు వారొక పర్యాయము సభావేదికపై నిలుచుండి సభనంతను కలయజూచుచుండెడివారు. ఆచూపే జరుగబోవు వారి కథా రచనమునకు త్రోవ చూపెడిది. అందలి సభ్యులను బట్టి వారి వాచె కింపగునట్లు

తమ కథకు మార్పులను చేర్పులను చేయుచు సంగీతజ్ఞులకు గానప్రతిభను, సాహిత్యవేత్తలకు సాహిత్య చమత్కారములను, కవులకు కవితా చాతుర్యమును, తత్తచ్ఛాస్త్రజ్ఞులకు తత్తచ్ఛాస్త్ర పాండిత్యమును, సామాన్య ప్రజలకు వింతవింతలగు లోకవృత్తి పరిశీలకములగు పిట్టకథలను ప్రదర్శించుచు విన్పించుచు వివిధములగు హాస్యములను గావించుచు సర్వజన సమ్మోహనమును గావించెడివారు. నాటకములోని మంచి నటుడు సామాన్యముగ తాను రసలోలుడుగాక తన నటనా పాటవముచే సామాజికులను రసమయులనుగా జేయును. శ్రీదాసుగారట్లుగాక కథోపక్రమణము మొదలు కథాంతము వఱకును, భక్తి పరవశతతో తాము ఒక్కరే తత్తత్సమయములయందు తత్తద్రసమయులగుచు శ్రోతలను గూడ తత్తద్రసమయులుగావించుట ఒకపెద్ద విశేషము.

సంగీతస్వరూపము మూడు విధములుగా నున్నట్లు "గీతం వాద్యం చ నృత్యంచ త్రయంసంగీతముచ్యతే" అను వచనముచే తెలియుచున్నది. కనుక నృత్యగీత వాద్యముల మూడింటిని ఎఱిగి తనవిద్యను ప్రదర్శింప గలవాడే సిసలైన సంగీతవిద్వాంసుడని శ్రీదాసుగారి యభిప్రాయము. కావున వారు తమ కథలయందు దీనికి అనుగుణముగానే సర్వవిధాల తమ విద్యను ప్రదర్శించెడివారు. హరికథా సమయమున శ్రీదాసుగారు తమ మాటల ధోరణులలో వచరించు దివ్యవేదాంతము మొదలు జానపదహాస్యము వఱకుగల నవరస సంభరితములగు చమత్కారములను ఎత్తివ్రాయుట శక్తికి మించినపని. తమకు సంగీతప్రతిభయు ఉత్తమ కవితా సంపదయు సర్వశాస్త్ర పాండితీగరిమయు సంపూర్ణముగ నున్నందున ఆవిద్యలనన్నింటిని మేళవించి వివిధదేశములందు అజ్ఞులు విజ్ఞులుగూడ గల సభలయందు హరిభక్తిని ప్రబోధించుటయే వారి యొక్క జీవితలక్ష్యము.

లోకమున గల కొన్ని యాక్షేపములను తొలగించుటకై శ్రీదాసుగారు స్వరశుద్ధి కొఱకు వీణావాదనము నభ్యసించి సంగీత

గ్రంథముల ననేకములను బరిశీలించి తమపాటను నిర్దుష్టము గావించు కొనిరి. లయజ్ఞానము విషయమున ఆయనను ఎంతటి ప్రౌఢులయినను వ్రేలుముడిచి చూవలేకపోవుచుండిరి. సాహిత్యవిషయమున గలుగు ఆక్షేపములను ఎదుర్కొనుటకు ఆయాశాస్త్రములందు పరిశ్రమించి మంచి విజ్ఞానమును సంపాదించిరి. తథాపి గురుసాహాయ్య మపేక్షింప కయే పాణినీయ వ్యాకరణమును స్వయంకృషితో చదివి యందు మంచి పాండిత్యమును సంపాదించి అందులకు పతాకగా ప్రౌఢప్రయోగములతో గూడిన "తారక" మను సంస్కృతగ్రంథమును సంతరించి దేశీయ విద్వాంసుల మన్ననలను పొందుటయేగాక జర్మనీ ఫ్రాన్సు ఇంగ్లాండు మున్నగు దేశములలోని విశ్వవిద్యాలయ సంస్కృతాచార్యుల మెప్పులను గూడ బహుముఖములనందెను.

శ్రీదాసుగారి నిష్కారణప్రేమయు అకారణవైరము గూడ పూర్వము పేర్కొనబడినవి. ఇతరుల యాపదనుగాని బాధనుగాని వారెంతమాత్రమును చూడలేకపోయెడివారు. ఇచ్చకములుగాని ముఖ ప్రీతిమాటలుగాని వారికి అసలు గిట్టవు. ఎవ్వరేమనుకొన్నను తన మనసులోని అభిప్రాయమును ఘటభేదనము చేసినట్లు జంకులేకుండ చెప్పెడి స్వభావము వారిది. ఇట్టి స్వభావము గలవారికి పై గుణములు గలుగుట యుచితమేగదా!

దాసుగారి పేరుప్రఖ్యాతులు దేశమంతట నలుగడల వ్యాపించెను. ఉత్తమ వాఙ్మయరూపములగు అనేక హరికథలను రచించియు సర్వరస భావోపేతముగ నభినయపదేడులు ఆడిపాడి హరికథాగాన మొనరించియు తాము "హరికథాపితామహు" లయిరి. కట్టి హరికథన ప్రఖ్యాతివలన ఆనందతోలరాగు జనులకు కవితా, వీణావాదన, వివిధశాస్త్ర పరిజ్ఞానాది ప్రజ్ఞలు ప్రత్యేకముగ గుర్తింపనవకాశము లేకపోయినది. కాని ఉన్న తోన్నతమగు బహుముఖప్రజ్ఞా సమ్మేళనము చేతనే వారి హరికథా జ్ఞానమంత వన్నెకెక్కినదియని మాత్రము లోకము గ్రహించినది.

దేశాటనము :- మహాకవి భట్టబాణుడు యౌవన స్వభావమును దెల్పుచు 'యౌవనప్రభవమగు తమము అభాను భేద్య మనియు అప్రదీప ప్రభావనేయ' మనియు 'సుడిగాలి శుష్క-పత్రము నెటకో గొనిపోవునట్లు యౌవనప్రకృతి పురుషునెటు పొందించునో తెలుపలేమ'నియు పేర్కొనెను. స్వాత్మపరిశీలన స్వభావులగు దాసుగారు కూడ తనయిష్టదైవముతో :-

"తనరంగా పరిపూర్ణభావమున మద్బాల్యంబు వోవన్వినా
తనమౌ యౌవన సన్నిపాత దశచేతన్ భ్రాంతచిత్తుండనైతి"
(సూర్య. శత.)

నని చెప్పుకొనిరి.

తమకిరువదియైదు వత్సరములు వచ్చుసరికి పురాణపఠనము, గీర్వాణాంధ్రములలో కవితనల్లుట, అష్టావధానము చేయుట, మూడు గంటలసేపు పాటకచ్చేరీ చేయుచు ఒకగంట కోరినరాగము, ఒకగంట తానము, వేరొకగంట పల్లవిపాడుట, హరికథచెప్పుట మున్నగు పనులు (శ్రీ)దాసుగారు చేయుచుండిరి. ఇవికాక ఇంటికడ ఉపనిషత్ బ్రహ్మ సూత్ర - భగవద్గీత రూపమగు అధ్యాత్మప్రస్థానత్రయమును ఇతర వేదాంత గ్రంథములను అధ్యయనము గావించుట, మిగిలిన సంస్కృత వాఙ్మయమును గూడ తీవ్రముగ పరిశీలించుచు అందు రచనము గావించుట (శ్రీ)దాసుగారి నిత్యకర్తవ్యములు. ధనమునకు దాసుడుకాక నియత పవిత్రజీవితమునకై వారు కొన్ని నియమములను ఏర్పఱచుకొనిరి. అందు :- ఆటపాటలవలన తప్ప వేరొక విధమున ధనము నార్జింప కుండుట, పరస్త్రీని మాతృభావముతో చూచుట, తన హరికథలను పరమేశ్వరునకే అంకితము గావించుట, అసత్యము పలుకకుండుట, జీవ హింస చేయకుండుట అనవరత హరికథాగానమును ప్రధానములు. ఈనియమములను దాసుగారు తమ యెనుబదియేటివఱకు అనగా తమ చరమావస్థ వఱకును తప్పక పాటించుచునే యుండిరి. తుదకువారు -

"బండ్రాతిన్ గరగింపజాలెదు ఘనధ్యానంబుతో" పాడుచు నాడుచును మూడునాళ్లు గంటలసేపు హరికథాగానమును గూడ తుదివఱకును జేయుచునే యుండుట మనము గమనింపదగిన విషయము.

ఈకాలమున (శ్రీ)దాసుగారెచ్చటెచ్చట ఎట్టి మర్యాదలనందిరో తెలిసికొనుట యావశ్యకము. అయినను అన్నింటిని పేర్కొనుట అశక్యమగుటచే కొన్నింటిని మాత్రము పేర్కొనుచున్నాను.

బరంపురము :- నేటి ఒరిస్సా మండలములోని బరంపురమునందు ప్రసిద్ధ న్యాయవాదులగు శ్రీ జయన్తి రామేశముపంతులుగారిని (శ్రీ)దాసుగారు 1885వ సంవత్సరమున దర్శించిరి. వారి ప్రోత్సాహమున ఒకదినము కాలముననే ధ్రువచరితమును, అంబరీష చరితమును రచించి వారు ఏర్పఱచిన సభలోనే హరికథను చెప్పిరి. పంతులుగారు (శ్రీ)దాసుగారి ప్రతిభకు సంతసించి నిండుసభలో సింహతలాటపుమురుగులు, దుశ్శాలువలు, బనారసుపట్టుపీతాంబరములతోడను ఆఱువందలరూప్యముల కట్నముతోడను శ్రీదాసుగారిని సత్కరించిరి.

పిఠాపురము :- విజయనగరము దివానుగారి సిఫార్సుపై శ్రీ దాసుగారు పిఠాపురము వెళ్ళి అట కుక్కుటేశ్వరాలయమునందు హరికథను చెప్పగా పిఠాపురము దివానుగారు అమితానందము నందిరి. నాటి పిఠాపురసంస్థానప్రభువులగు శ్రీ గంగాధరరామారావుగారి ఆహ్వానముపై కోటలోనికి వెళ్లి అచట హరికథను చెప్పగా రాజావారు శ్రీదాసుగారి ప్రతిభకు చాల మెచ్చుకొనిరి. పేరన్నగారి పాట శ్రీజమీందారుగారికి 'లడ్డుమీద పన్నీరు చల్లినట్టున్నదని వారు చెప్పిరి. రాజుగారు పిలిపింపగా శ్రీదాసుగారు పేరన్నగారితో కూడ కోటలోనికి వెళ్ళిరి. రాజావారు తమ నౌకరును పిలిచి కైజారు తెమ్మనిరి. ఆసంప్రదాయము గాయకసోదరులకు అశ్రుతపూర్వమగుటచే కొలదిగా నిర్విణ్ణులైరి. కైజారుసాక్షిగా దానిమీదుగా మూడువందల రూప్యములను రాజావారు శ్రీదాసుగారి దోసిటపోసి విలువగల శాలువలతో దాసుగారి

నలంకరించిరి. ఈబహుమానమునే ప్రతిసంవత్సరమును దాసుగారికిచ్చెద మని శ్రీరాజావారు వాగ్దానము చేసిరి.

ఖాసింకోట :- ఆంధ్రదేశమున ఆనాడు సర్వత్ర పట్టణములలో గాని పల్లెలలోగాని ఉత్సాహవంతులగు సత్త్వసంపన్నులు వివాహాది శుభ సమయములందు శ్రీదాసుగారి నాహ్వానించి వారికథనువిని తాము ధన్యులమైనట్లు తలంచి ఉచితరీతిని శ్రీదాసుగారిని సత్కరించుట పరిపాటి అయినది.

ఖాసింకోట జమీందారుడు తమయింట వివాహసందర్భమున శ్రీదాసుగారిని హరికథ గావించుటకును శ్రీ పప్పు వెంకన్నగారిని సంగీత కచ్చేరీ చేయుటకు నాహ్వానించెను. వీరితోపాటు ఆంధ్రదేశమునందుగల గొప్ప గొప్ప విద్వాంసులను గూడ ఆహ్వానించెను. తనకు వెనుక పాట పాడుటకు పేరన్నగారు రాలేకపోయినందున శ్రీదాసుగారు శ్రీ పప్పు వెంకన్నగారిని సాయము చేయుగోరగా వారందుల కంగీకరించిరి. ఆనాటి హరికథలో శ్రీదాసుగారు మహావిద్వాంసులందఱు తన్మయులై తలలూచు నట్లు తన సాహిత్యప్రతిభను చూపించిరి. మఱియు శ్రీవెంకన్నగారికి తన సంగీతప్రజ్ఞను దెలియుజేయుటకు నానావిధములగు గాన ప్రక్రియల నగపఱచుచు గానము చేయుచుండిరి. వెంకన్నగారు రాగము విసిరినపుడు ఆపై రాగమును పాడియు, అతని స్వరము పాటకు పై స్వరము పాడియు అతని ముక్తాయింపునకు పై ముక్తాయింపు ముక్తాయించియు, దేహమున అంతటను లయజ్ఞానము నగపఱచు నృత్యవిన్యాసము గావించియు హరి కథాగానమును గావించిరి. ఆసమయమున కథానంతరము శ్రీతిరుపతి వేంకటకవులు తమ పరమానందమును దెలుపుచు ఆశువుగా పద్యములను గూడ నిండుసభలో జదివిరి. వెంకన్నగారు దాసుగారిని కౌగలించుకొని "తండ్రీ, గురుశుశ్రూష లేకపోయినను ఆసరస్వతి నీపై తాండవించినది" అని ఆశీర్వదించెను.

కాకినాడ :- 1904వ వత్సరమున కాకినాడలో సరస్వతీ గానసభ స్థాపించబడినది. అది మొదలు ప్రతివత్సరము 1942 వత్సరము వఱకు శ్రీదాసుగారి హరికథా కాలక్షేపములు జరుగుచునేయుండెను. శ్రీదాసుగారి హరికథకువచ్చు ధనాదాయము మఱెట్టి కచ్చేరికిని రాలేదు. 1923వ సంవత్సరమున కాకినాడయందు జాతీయ కాంగ్రెసు మహాసభ జరిగినది. అందలి కార్యనిర్వాహకవర్గమువారు దాసుగారిని అచటికి వచ్చిన బహుసహస్రసంఖ్యగల సభ్యుల వినోదమునకై ఆహ్వానించిరి. ఆసభకు శ్రీమతి సరోజినీదేవి ఆలీసోదరులు గూడ విని అత్యానంద భరితులయిరి. శ్రీసరోజినీదేవి దాసుగారితో మీనృత్యము మనోహరముగనున్నదని (Your dance is exquisite) అని కొనియాడెను. ఆ హరికథయందే శ్రీ దాసుగారు రుక్మిణీకల్యాణ ఘట్టమునకు – రుక్మిణి యనెడి బుద్ధి ఉపాధిగాగల జీవుడు విప్రుడనెడి వేదశాస్త్ర విజ్ఞానము సాహాయ్యమున శ్రీ కృష్ణుడను పరమాత్మను స్వస్వరూపునిగా దెలిసి యట్టి పరమాత్మలో ఐక్యమునందుట యని పరమార్థమును అపూర్వము అగు అర్థమును చెప్పి వారి నందఱను అలరించెను.

రాజమహేంద్రవరము :- ఇందు ఆంధ్ర భీష్ములు సుప్రసిద్ధ న్యాయవాదులు అగు న్యాపతి సుబ్బారావు పంతులుగారు తొలుత శ్రీ దాసుగారి ప్రతిభను తెలిసికొని గౌరవించిరి. దాసుగారిచే అష్టావధాన మును చేయించిరి. అందు విశేషమేమనగా రెండు తాళముతో పల్లవి పాడుట. శ్రీ వీరేశలింగముగారు దాసుగారితో 'మీ బాటసారి యను ఖండకావ్యమును చదివితిని. చాల బాగుగనున్నది.' అని ప్రశంసించి దానిని 1902 వ సంవత్సరమున మెట్రిక్యులేషను పరీక్షకు పఠనీయ గ్రంథ ముగా పెట్టిరి.

మఱల 1912 సం. రమున న్యాపతి సుబ్బారావుగారు, వీరేశ లింగము పంతులుగారు, వడ్డాది సుబ్బారాయ మహాకవిగారు, సుప్రసిద్ధ

న్యాయవాదులు గంటి లక్ష్మన్నగారు, మున్నగు పుర ప్రధానులు శ్రీ దాసుగారికి నవరత్న ఖచితమగు భుజకీర్తిని ఆంధ్ర సారస్వత పరిషత్పక్ష మున సమర్పించి సత్కరించిరి. తరువాతగూడ చాల పర్యాయములు చింతా మణి హాలులో హరికథలు చెప్పించి విశేషధనమును దాసుగారికి గౌర వాదరములతో సమర్పించిరి.

ఏ లూ రు :- ఇందు గూడ ఏలూరు పౌరులు చాల పర్యాయ ములు దాసుగారి హరికథకు టికట్లు పెట్టించి విశేష ధనము సమర్పించిరి. అట్లే గృహస్థులు తమ ఇండ్లలోని శుభకార్యములయందు హరికథలను చెప్పించి విశేషముగా సమ్మానించిరి. హరికథలవలననే గాక శ్రీ దాసు గారి మైత్రివలన గూడ కుటుంబములు సద్వృత్తి పరులగుట మనకు అగపడును. ఏలూరునందు శ్రీ దాసుగారి మిత్రుడొక న్యాయవాది యుండెను. ఆతడు చిఱుతప్రాయమున తన భార్య మరణించిన యనంత రము మఱల వివాహము చేసికొనుమని చెప్పిన తన తల్లిమాటను నిరాక రించి వడుపువృత్తిగల యొక కాంతను చేపట్టి తిరుగుచుండెను. ఈ విష యమును ఆతని వృద్ధమాత (శ్రీ) దాసుగారితో చెప్పగా ఆయన రూపాజీ వల వలపును న్యాయవాది మిత్రునకు బోధింప వారిగుపురును ఆ కులట ఇంటికి పోయిరి, దాసుగారి ప్రబోధము యథార్థమని ఆ న్యాయ వాది తెలిసికొని ఆమె యందాతడు విరక్తుడయ్యెను. అప్పుడు దాసుగారు చెప్పిన పద్యము :-

"కాకి జాతి తెలుపు కడు లంచగొండికి
న్యాయమందు తలపు నాస్తికునకు
పాపమందు జడుపు పడుచు బోగపుతొత్తు
కొకనియందు వలపు యుండుటరుదు"

బ ం ద రు :- బందరు సభలోని దాసుగారి విజయము అనాటి జనక సభలోని యాజ్ఞవల్క్యుని విజయమువంటిది, నాటిబందరు

సుప్రసిద్ధులగు శాస్త్రజ్ఞులతోడను సాహిత్యవేత్తలతోను కవులతోను గాయకులతోను వేదవిద్వాంసులతోడను మహాప్రసిద్ధినొంది యుండెను. అందు సరససాహిత్య గానరసజ్ఞ శేఖరులు ఆ పట్టణమున పెక్కురుండిరి. విద్వాంసుల కుచితరీతిని సమ్మానములు జరుగుచుండెను.

శ్రీదాసుగారు తనమిత్రుడగు నొక న్యాయవాదితో బందరు వెళ్లి ఆతని బంధువుల యింట బస చేసిరి. ఒకనాడు అచటనే గానసభ జరిగెను. ఆసభలో దక్షిణదేశ గానవిద్వాంసులు బందరువారు, తదితరులు, మార్దంగికులు, వైణికులు, ఫిడేలర్లు మున్నగు పెక్కుమంది సుప్రసిద్ధులందుండిరి. సంగీతవిద్వాంసులు పల్లవి పాడుచు వాయించుచుండిరి. అట్టి సభలో శ్రీదాసుగారు ప్రవేశించిరి. యజమాని దాసుగారితో "అయ్యా మీరు కూడ పల్లవి పాడగల్గినచో నుపక్రమింప గోరుచున్నా"ననెను. దానిపై స్మేరాననులై దాసుగారు పల్లవిలో తమ యసాధారణ ప్రతిభ నగపఱచి ప్రతిపక్షులను అవనతముఖులుగను మిత్రులను ఉన్నతముఖులుగను జేసిరి. కొందఱు గానముల నాక్షేపించిరి. అట్టి యాక్షేపములు విరోధ హేతువులయ్యెను. ప్రతిపక్షులెట్లయినను దాసుగారి నెట్లేని అవమానింప సమకట్టిరి. తగు సమయమునకై వేచియుండిరి. ప్రత్యేకముగ రాగ తాళ పల్లవులను పాడుచు శ్రీదాసుగారు అచట పదివం డెండు సభలనుగావించి అందఱిచే స్తుతింపబడిరి. దానితో బందరు పురమున రెండు పార్టీ లేర్పడెను

ఒకనాడు 'వంతెంగారి మేడ' మీద టికెట్లుపెట్టి దాసుగారి అష్టావధానమేర్పాటు చేయబడెను. వేర్వేరుగా రెండుచేతుల రెండు తాళములు రెండు పాదముల రెండుతాళములు వేయుచు కోరిన ముక్తాయీలతో పల్లవిపాడుట, ఛందోభాషణము మున్నగునవి ఇందు విశేషము. మఱునాటి నుండియు 'బుధవిధేయిని' 'కలుషహారిణి' అను స్థానికపత్రికలలో పెద్ద దుమారము చెలరేగినది. బందరువారే గాక గ్రామాంతరులు

అత్యాసక్తితో ఆపత్రికలను చదువుచుండిరి. నాడు శ్రీదాసుగారు చెప్పిన పద్యములు బందరువాసులకు అనేకులకు కంఠస్థములు.

ఇట్టి దాసుగారి ప్రతిష్ఠను సహింపలేక ప్రతికక్షులు వేఱొకచో నొక సభచేసి దాసుగారిని పరాభవింపదలచి 'శక్తుడవైనచో ఆసభకు రమ్మ'ని అచ్చునోటీసును జారీచేసిరి. శ్రీదాసుగారా సమయమున ఒక మునసబుగారింట హరికథను చెప్పుచుండిరి. కథానంతరము ప్రతిపక్షుల సభకేగుటకై సంసిద్ధులయిన శ్రీదాసుగారిని చూచి ఆమున్సబుగారు కొంచెము భీతినంది 'విదేశీయులు ఒంటరివారగు మీరు ప్రతికక్షి బహుళమగు ఆసభకు వెడలవద్దని' వారించిరి. వేఱొక న్యాయవాది మిత్రుడు 'వెళ్లవలసినదే, మరేమీ భయములేదని' దాసుగారి నుత్సాహపఱచెను. ఆసభ రెండువేలమందితో ఒకమేడ మీద జరిగినది. దాసుగారి ప్రతికక్షులిరువదిమంది సంగీతజ్ఞులచట ఉపవిష్టులైరి. ఎట్టి అల్లరులు జరుగకుండ క్రింద పోలీసు బందోబస్తు చేయబడెను. అత్యుత్సాహముతో ఉద్యోగులు వర్తకులు ఉపాధ్యాయులు మున్నగు పౌరబృందమంతయు అచటికి వచ్చియుండిరి. శ్రీదాసుగారు గంభీరవదనముతో నందు ప్రవేశించిరి. తీర్పునకు మధ్యస్థును నిర్ణయించిరి. అంతలో సభామధ్యమునుండి ఒక వ్యక్తి లేచి "దాసుగారు ఇందలి గాయకులను తమకు చాలరని నిరసించినందులకు ఈసభ జరుపబడుచున్నది. వీరి పరీక్షకు ఆగి వీరి ప్రశ్నములకు దాసుగారు సమాధానము చెప్పినచో దాసుగారి వాక్యము సత్యమగును. కానిచో దాసుగారు క్షమాపణము చెప్పవలయునని పలికెను. దానిపై శ్రీదాసుగారు 'వీరు నన్ను ఆక్షేపించినపుడెల్ల నేనామాట అంటిని. అది నిజము. సంస్కృతభాష యందుగల సంగీతశాస్త్రము నాధారముగ జేసికొని, తెలుగే తెలియని వీరు నన్నెట్లు పరీక్షింతురో నాకు తెలియకున్నది. నేను శాస్త్రము ననుసరించియే వీరల ప్రశ్నములకు సమాధానము చెప్పుచు మాటలాడుదును. మధ్యస్థులు గూడ అట్టివారే అగుటచే వారు ఎట్లు నిర్ణయము చేయగల్గుదురనియే నాసందేహమ'ని స్పష్టముగ

పలికిరి. అది నిజమగుటచే వేఱొకవిధమున దాసుగారిని పరీక్షింప నాలో చించుచుండిరి. అది యిట్లుండ ఒక ప్రతికక్షి లేచి 'దాసుగారికి వర్ణములు కృతులు రావు. వచ్చినచో పాడవలయు'ననెను. అంతలో దాసుగారి శిష్యుడొకడు లేచి 'పల్లవిపాడు విద్వాంసుని నిట్లు ప్రశ్నించుట ఎంత యువివేకము! అనర్గళముగ నిరుపమానమగు కవితచెప్పు మహాకవిని వేమన పద్యములురావని ఆక్షేపించినట్లున్నది. ప్రతికక్షి కోరిన దానిని నేనే పాడెదను. మాగురువుల వఱకెందుక'ని సమాధానము చెప్పెను. దానిపై దాసుగారు శ్రోత్రరంజకముగ ఒకగంటసేపు ప్రతికక్షులందఱు గాని కొందఱుగాని గానకచ్చేరి చేసి తమప్రతిభ నగపఱచుడు. నేనును పాడెదను. అపుడు మధ్యస్థులు ఎవరధికులో నిర్ణయింతురని పలికిరి. మధ్యస్థులు అందుకంగీకరించిరి. కాని ప్రతికక్షులందుల కంగీకరింపక లేచిపోయిరి.

ఒకనాడు ఆపట్టణమున ఒక సంగీతజ్ఞుని కోరికపై పల్లవిపాడి ఆతని మెప్పింప నాతడు తన చేతినున్న పదితులముల బంగారుకడియమును శ్రీదాసుగారి చేతికి తొడిగి వారిని సమ్మానించెను. ఇట్లు బందరునందు వారొక సంవత్సరముండిరి. పిదప పురప్రముఖులందఱు ఒకపెద్దోల సభచేసి అందు శ్రీదాసుగారి ప్రతిభను పాండిత్యమును వేనోళ్ల పొగడిరి. సభాధ్యక్షుడు దాసుగారి వాగ్ధాటి 'బ్రాడ్లే' వంటిదని స్తుతించెను. తరువాత గూడ దాసుగారు అనేక పర్యాయములు బందరువెళ్లి భూరి సత్కారములనందిరి. శ్రీదాసుగారు బందరుపౌరులు తమకు సమర్పించిన రత్నఖచితమగు భుజకీర్తిని తమ బహూకృతులలో అన్నింటికంటెను ఉత్తమమైనదిగా ఎంచుచుండిరి. అది తమ సంపూర్ణ పాండిత్య సంపాదిత మని వారిభావన. ఎట్టివారి పాండిత్యమును ఆధిక్యమును అంగీకరింపని బందరువారు తమకిట్టి సత్కారమును చేయుటలోనే తమ గౌరవమున్న దని వారు చెప్పుచుండిరి.

చెన్నపట్టణము :- శ్రీదాసుగారు పేరన్నగారితో గూడ మద్రాసు చూచుటకు వచ్చిరి. అచట దాసుగారి ఏలూరి మిత్రుడగు శ్రీసోమంచి భీమశంకరముగారి బసలో భుజించుచు ఊరు చూచు చుండిరి. ఒకనాడు సుప్రసిద్ధ న్యాయవాదులగు రెంటాల సుబ్బారావు గారు భీమశంకరుల బసలోనున్న శ్రీదాసుగారిని చూచి వారి కవిత్వ మును విని సంతోషముతో తమ గృహమునకు శ్రీదాససోదరులను తోడ్కొనిపోయిరి. దాసుగారు తాము సంస్కృతముతో వ్రాసిన శ్రీకృష్ణజనన యక్షగానమును తెలుగులోని బాటసారి పద్యకావ్యమును చదివి వినిపించిరి. సుబ్బారావుగారు అట్టి మెత్తని తెలుగుకవితను తాను వినలేదని దాసుగారిని స్తుతించిరి. ఊరిలో చాల తావులయందు దాసు గారి హరికథలు జరిగినవి. శ్రోతలు పరమానందముతో శ్రీదాసుగారి సంగీతసాహిత్య ప్రతిభను 'హిందూ' 'స్టాండర్డు' పత్రికలద్వారా వేనోళ్ల స్తుతించిరి.

ఒకనాడు శ్రీ భీమశంకరముగారు దాసుగారిని ఎగ్మూరులోనున్న పనప్పాకము ఆనందాచార్యులు గారింటికి తీసికొనివెళ్ళిరి. ఆయన హైకోర్టు న్యాయవాది, 'నేషనల్ కాంగ్రెసు ప్రెసిడెంటు' గూడ. 'విద్యా వినోది' బిరుదాంకితుడు. తెలుగు భాషయందు అతనికి ఆసక్తియేగాక విశేషపాండిత్యము గలవాడు. ఒకానొకప్పుడు దాసుగారి గజేంద్రమోక్ష హరికథను విజయనగరమున వినుటచే నాటినుండియు శ్రీదాసుగారిని ఎఱిగినవాడు. ఆయన దాసుగారి సంగీతసాహిత్య పాండిత్యప్రకర్షకు ఆనందించి తనయింట నొక హరికథాగానమును చేయించి సత్కరించెను. దాసుగారు తన 'బాటసారి'ని అతనికి కృతిగానొసంగిరి. ఆచార్యులుగారు ఆనాడు రెవెన్యుబోర్డు మెంబరగు 'గ్రోలు' దొరవద్దకు తీసికొని వెళ్లెను. దాసుగారి పాటవిని గ్రోలుదొరకంటె అతనిభార్య మిగుల సంతోషించి నది. అతడు దాసుగారి కథ నేర్పుఅచుటకు రామనాథపురము రాజుగారికి సిఫారసు చేసినను మనదాసుగారు దూరమని అచటికి వెళ్లలేదు.

ఆచార్యులుగారు దాసుగారి ధనార్జన వైముఖ్యమునుగని విచారించి, మైసూరు దర్బారునందు మీగానవైభవము నగపఱచవలయునని అతి కష్టముతో శ్రీదాసుగారిని మైసూరు వెళ్లుటకు ఒప్పించి దర్బారు బక్షీకి సిఫారసు చేసిరి. అటునుండి బెంగుళూరు కూడ వెళ్లుడని బలవంతముచేసి బెంగుళూరు నందుగల తన తమ్మునికి ఉత్తరము నిచ్చిరి. మద్రాసులో దాసుగారున్నప్పుడు ప్రెసిడెన్సీ కాలేజి పండితులగు శ్రీ కొక్కొండ వేంకటరత్నము గారితో దాసుగారికి పరిచయము కలిగెను. దాసుగారి పాటసారిని వినివారు శ్రీరామ్నమువ లెనున్నదని స్తుతించిరి. అట్లే వేఱొకప్పుడు దాసుగారి రుక్మిణీకల్యాణ హరికథనువిని "పోతనకవితకు మెఱుగు పెట్టితివయ్యా" అని మెచ్చుకొని సంతోషముతో దాసుగారిని కౌగలించుకొనిరి.

దాసుగారు మద్రాసు నుండి బెంగుళూరు బండినెక్కి ప్రయాణము చేయుచుండిరి. గుడియాతము స్టేషను రాగా అచట వారికొక టెలిగ్రాము నందించిరి. అది విప్పి చూడగా 'మీ ఇద్దరన్నదమ్ములను తిరిగి మద్రాసుకే రావలయును; రెంటాల సుబ్బారావు' అనియున్నది. వారిద్దరు తిరిగి మద్రాసు వచ్చివేసిరి. సుబ్బారావుగారు దాసుగారితో నిట్లు వల్కిరి. "అయ్యా! ఈఊరి వారికిని నాకును ఒక పట్టుదల వచ్చినది. అందుకై మిమ్ములను తిరిగి రమ్మని పిలిచితిని. ఈదినము పోలీసు కమీషనర్ గారింట నాలుగు గంటలకు సభ జరుగును. అందు ఇచట ప్రసిద్ధులగు విద్వాంసులు మీప్రక్కన ఫిడేలునకును మృదంగమునకును ఏర్పాటు చేయబడిరి. ఈ ఊరిలోనున్న పెద్దలందరు అచటికి వచ్చెదరు. దక్షిణ దేశస్థుల కంటె ఉత్తర దేశస్థులు సంగీతమున తక్కువ వారు అను ఇచటి వారి అభిప్రాయమును పూర్తిగా తుడిచి పెట్టవలయును. ఈ పట్టుదలకే మిమ్ములను రప్పించితిని" అని పల్కెను. దాసుగారు ఆనందముతో తమకు మంచి అవకాశము గల్గినట్లు అంగీకరించిరి. యథాకాలమునకు అనుకున్నట్లు సభ ఆరంభమైనది. దాసుగారు నటభైరవి

రాగమును ఎత్తుకొని పాడుచుండిరి. వారి అపూర్వ శారీరమునకు సభ్యులు ఆశ్చర్యపడుచుండిరి. రాగము కొంతవఱకు పాడి, తానము పాడుచుండగా ఫిడెలరు పల్లవి నెత్తుకొమ్మని తొందరపెట్టుచుండెను. వినివిని దాసుగారు విషమోద్గ్రాహమున పల్లవి ఎత్తుకొని పాడుచుండగా ప్రక్కవాయిద్యగాండ్రు ఒకమారైనను జాగాకు రాజాలకపోయిరి. వారి స్థితిని జూచి దాసుగారు 'పల్లవి పల్లవి యని నాప్రాణాలు తీసినారు. ఒకసారియైనను జాగాకు రాలేదు. కాలమును తరిమివేయుచున్నారు. మీదాక్షిణాత్యులు విలంబకాలమునకు పనికిరారు' అని పలికిరి. సభలోనున్న హైకోర్టు న్యాయమూర్తి ముత్తుస్వామి అయ్యర్ గారు దాసుగారి ఆనందభైరవిని వినగోరిరి. ఆ రాగమును దాసుగారు పాడుచు, ఫిడ్లరు ఆరాగమును ఎంతో చక్కగా వాయించుటను జూచి తన్మయులై తాను పాటమాని అతని వాద్యమునే వినుచుండెను తరువాత దాసుగారు రాగముమార్చి హిందూస్థానీ భైరవి నందుకొని పాడనారంభించిరి. దాక్షిణాత్యులకు దాసుగారి వలె విలంబకాలమున పల్లవి పాడుట అరుదు. హిందూస్థానీ సొగసులు వారికి తెలియవు. సభయంతయు మైమరచియుండెను. అంత సభలోని పెద్దలు కొందఱు లేచి 'ఆహా! ఈ విజయనగర విద్వాంసుని శారీరము నిరుపమానము గదా! శ్రౌత్రరాహులలయ జ్ఞానము మెచ్చదగినది. ఈయన పల్లవిలో సాటిలేని మేటి' అని మెచ్చుకొనిరి.

బెంగుళూరు :- వేంకట సుబ్బారావుగారివద్ద సెలవు తీసికొని శ్రీ దాససోదరులు బెంగుళూరు చేరిరి. ఆచార్యులుగారి అన్నదమ్ముని ఇంటికి బోయి అచట వారు బసచేసిరి. ఆయన ఒక ప్లీడరు. గొంతె బాగుగా పాడగలవాడు. దాసుగారిని పాడవలసినదిగా కోరి తాను తంబుర శ్రుతి జేసి పట్టుకొనెను. సావేరీ రాగము దాసుగారు పాడుచుండగా ఆయన తన్మయుడయ్యెను. అచటనే మున్సబు పనిచేయుచున్న అతని అన్నగారు దాసుగారి పాటను విని 'ఎవ్వడో కోయంబత్తూరు రాఘవయ్య

పాట విన్నాను. ఇప్పుడట్టి గంభీర శారీరము తిరిగి వినగల్గితిని' అని స్తుతించెను.

మైసూరు మహారాజావారు బెంగుళూరు పూలతోటలో వచ్చి యున్నట్లు దాసుగారికి తెలిసినది. వారి బక్షీ మున్సబుగారి బంధువు. ఆయనద్వారా మాటపై దాసుగారు వీణె పేరన్నగారు తంబుర తీసికొన మహారాజ భవనమునకు వెడలిరి. భవనమున అప్పటికే ఇరువదిమంది సంగీత విద్వాంసులు వీణెలను తంబురాలను పట్టుకొని అంయుండిరి. వారు మెచ్చుకొని విద్వాంసులనే రాజుగారి ఎదుట పెట్టుట అచట యాచార మట.

పేరన్నగారు తంబుర శృతి చేయుగా దాసుగారు ధన్యాసిరాగ మును పాడిరి. వారి శారీరమునకు బంగళా అంతయు దద్దరిల్లినది. మహారాజావారు దాసుగారి శారీరము విని అమితానందము నంది తన బక్షీని దాసుగారి వద్దకు బంపి, 'ఈ రాత్రి మీ గానము వినెదము. బసకేగి సిద్ధముగా నుండుడు' అని కబురు బంపిరి. రాత్రి ఎనిమిది గంటలకు గాన కచేరికి సమయ మేర్పాటు చేయబడెను. దాసుగారు ప్రక్క వాయిద్య గాండ్రతో చంధనము పూసుకొని నేత్రములకు కాటుక పెట్టుకొని ఫాల మున తిలకముదిద్ద కేశపాశమునకు పూలమాల నలంకరించి, కంఠమున పూలదండ ధరించి, పట్టుపుట్టము కట్టి. బనారస్ పట్టు కండువా నడుము నకు బిగించి శ్రీరామ పట్టాభిషేక పటమును చేత బట్టుకొని కాళ్ళగజ్జె లతో దాసుగారు, తంబుర చేతబట్టి పేరన్నగారు రాజప్రాసాదమును ప్రవేశించిరి. పట్టాభిషేక పటమును ఒక ఆసనముపై నునిచి, దానికొక పూలమాలవేసి, దాసుగారు ఖమాచ్ రాగముతో ప్రార్థన శ్లోకమును జదివి, పాడుట కారంభించిరి. మహారాజావారున్నూ వారి పాట వినుచునే 'Your music in very sweet' అని తల పంకించుచు అమితానందముతో పల్కిరి. ఆనాడు దాసుగారి అంబరీష చరిత్రమును గానము చేసిరి. సంస్కృతము, తెలుగు చదువుట పాడుట విషయమును

ఇంగ్లీషులోనికి తర్జుమా చేయుట మున్నగునవి దాసుగారి రొనర్చుటచే మహారాజావారికి కవితయందలి, కథయందలి సొబగులు చక్కగా బోధపడినవి. అచటనున్న మహారాణి వారికి తెలుగు బాగుగా తెలియుటచే ఆమె కూడ మిక్కిలి ఆనందించెను. అపుడు దాసుగారి వయసు ముప్పదేండ్లు. దాసుగారి మృదుమధుర ఘన గంభీరమైన త్రిస్థాయి శారీరమును నృత్త విన్యాసమును విని కని సభవారు మూడుగంటలసేపు నిశ్చేష్టులై ముగ్ధులై వినిరి. మంగళముపాడి కథ ముగించుసరికి రాత్రి 11 గంటలైనది. మంగళహారతి నందుకొని ప్రభువులు లోనికి పోయిరి. బక్షి వచ్చి దాసుగారితో మరల మహారాజావారు మీ పాటను ఎల్లుండి చిత్తగించుదురని సెలవిచ్చిరి. మీ పాటను విని అమితానందము నొంది ఇది అపూర్వ మనోహరమనిరి, అని చెప్పెను, అచటి విద్వాంసులుగూడ దాసుగారి ప్రతిభను మిక్కిలి శ్లాఘించిరి.

రెండవనాటి రాత్రి దాసుగారు గజేంద్ర మోక్షమును చెప్పనారంభించిరి. ప్రక్కనే పాడుచున్న పేరన్నగారి పాటవిని మహారాజావారు 'It lulls me to sleep' అని సంతోషముతో పల్కిరి. ఆ దినమున మహారాజు భుజించి సావకాశముగా కథను వినుటకు కూర్చుండిరి. కాని పది గంటలు కాగానే మహారాజావారి భోజన సమయ మతిక్రమించుచున్నదని తలచి దాసుగారు కథ ముగిసినదని ఇంగ్లీషులో మహారాజావారికి చెప్పిరి. మహారాజావారి కింకను పాట వినుట కిష్టమున్నను సభ చాలించవలసివచ్చినది. అంత బక్షి వచ్చి ప్రభువులకు మీ పాట యింకను తనివి తీరలేదు. మైసూరులో సింహాసనము పైనుండి మీకు బహుమతి ఈయదలంచిరి. దసరా ఉత్సవములకు మిమ్ములను రమ్మని సెలవైనది అని చెప్పి, ఖర్చులకై రెండు వందలు రూప్యములు దాసుగారికి ఇచ్చెను.

మఱునాడు మైసూరు దివానుగారు కూడ దాసుగారి గానమును మాత్రము వినగోరియందులకై ఒక సభను ప్రత్యేకముగ చేయించిరి.

గొప్ప గొప్ప యుద్యోగులు పురప్రముఖులు గూడ సభకువచ్చిరి. దాసుగారి హనుమత్తోడి రాగమును పల్లవి రెండు గంటలు పాడిరి. దాసుగారి యపూర్వ గానమును విని దివానుగారు 'ఇది అసాధారణము సభా సమ్మోహనము' తన శారీర మాధురిని ఈ వయసున వీరు కాపాడుకొనినచో యావజ్జీవము జనరంజకముగ పాడవచ్చునని' పలికిరి. తరువాత హైకోర్టు న్యాయమూర్తిగూడ దాసుగారిచే హరికథను చెప్పించి సమ్మానించెను. దాసుగారిట్లు బెంగుళూరందు రెండు మాసములుండిరి. అప్పుడే తమ యాస్థాన విద్వాంసులను కొందఱను దాసుగారివద్ద హిందూస్థానీ భైరవిని నేర్వవలసినదని మహారాజులు . దాసుగారి కడకు పంపిరి. కాని వారు దాసుగారి కడ అభ్యసించియు పట్టుపడక విఫలులైరి.

దాసుగారు బెంగుళూరువదలి మార్గమధ్యమున గుంటూరువచ్చి రెండు హరికథలు చెప్పి విజయనరము చేరిరి. విజయనగరము మహారాజావారు, (శ్రీ) దాసుగారు మైసూరు మహారాజావారి ఆస్థానమున హరికథా గానముచే మిక్కిలి సమ్మానితులయినట్లు 'హిందూ' 'మెయిలు' మున్నగు పత్రికలలో చూచిరి. ఇట్టి అసాధారణ గౌరవమునందిన (శ్రీ) దాసుగారిని తమ ఆస్థానమున పండిత పదవి నలంకరింపజేయునందులకు చాల పశ్చాత్తాపపడి దాసుగారు వచ్చినవెంటనే పండితులలో వారి పేరు నమోజు చేయించి జీతము నేర్పఱచిరి. ఉద్యోగముచేసి ధనము సంపాదింపవలయునని వారి కెన్నడును లేదు. వారు ఎప్పుడును యథాలాభతుష్టులు. వారు చిత్ర విచిత్రమగు ప్రపంచమును బరిశీలించుచు భగవల్లీలలకు మహానందమును పొందుచుండెడివారు. స్వేచ్ఛాజీవనమే వారి అభీష్టము. చదువుకొనుచుండుట, గ్రంథములను వ్రాసికొనుట వారి నిత్యకృత్యము. వారు ఆ సమయమున మాఘమాహాత్మ్యమును చదివి మార్కండేయోపాఖ్యానమును రచించిరి. అప్పుడే మైసూరు రావలసిన దిగా బక్షీనుండి దాసుగారికి తంతి వచ్చినది.

మైసూరురాజ సమ్మానము :- దాసుగారు పేరన్నగారితో మైసూరు చేరిరి. రాజభటులువచ్చి (శ్రీ)దాససోదరులను సంగీతశాలకు తోడ్కొనిపోయిరి. మహారాజావారు దాసుగారిని తమ సౌధమునకు పిలిపించి 'మీరు మాదర్బారునందు సర్వీసు చేసెదరా' అని యడుగ, దాసుగారు నేనొల్లను - మర్త్యులను నేను కొలువనొల్లన'ని నిర్భయముగ దెల్పిరి. రాజావారు దాసుగారి స్వాతంత్ర్యప్రియత్వమునకు లోపల మెచ్చు కొని 'ఔను — మీరు సర్వస్వతంత్రులుగానే యుండదలచితిరి శాబాసు' మంచిదని పలికి, ఎందరిపాటలనో వింటిమిగాని మీరు కర్ణాట హిందూ స్థానీలను జోడించి పాడినట్లు ఎవ్వరును పాడలేదు. మీరెవరివద్ద గానము నభ్యసించితిరని యడిగిరి. దాసుగారును - నేనీ సంగీతసాహిత్యాలను ఒకరివద్ద నేర్చుకొనలేదు. అవి నాకు సహజములే" అనిచెప్పిరి. రాజాను మతితో దాసుగారు పలుల పాడ దొడగిరి. పాటలనేగాక పద్యములను సంస్కృతశ్లోకములను గూడ దాసుగారు పాడగా ఆరాజదంపతులు మిగుల ఆనందించిరి. ఎందరెందరో పాడగావినిన ప్రభువులు అట్లు తమ పాటకు సంతోషభరితులగుటచే దాసుగారుకూడ తమజన్మ సార్థకమైనట్లు సంతోషించిరి. అంత తంబురా చేతబట్టిన పేరన్నగారితోకూడ దాసు గారిని రాజావారు సంగీతశాలకు గొనిపోయి ఒక ఆంగ్లేయునిచే ఫోనో గ్రాము యంత్రముద్వారా దాసుగారి గానమును రికార్డు చేయించిరి. అందు ఒకప్లేటులో జంజూటి రాగముతో బెంగుళూరిమీద చెప్పిన పద్యము, రెండవప్లేటుపై కన్నడరాగము, మూడవప్లేటులో రాజావారికి ప్రీతికరమైన హిందూస్థానీభైరవితో 'సయ్యా జావోనహీ బోలుం' అను టుమ్రీని రికార్డు గావించిరి. తాము పాడుచుండగా జారిన తంబురా పూసను రాజావారు సరిదిద్దుటను గాంచిన దాసుగారు (శ్రీ)రాజావారి శ్రుతిజ్ఞతను గని తమ గానకళ సార్థకమైనట్లు సంతసించిరి. దాసుగారు గావించిన రెండు హరికథలు అయిన తరువాత రాజావారు దర్బారు గావించి అందు దాసుగారికి స్వప్రభుత్వచిహ్నముతో ఒప్పు సువర్ణ

కంకణములను దుశ్శాలువలను, వీణయును, తంబురాను, వెయ్యి నూట పదార్లను ఇచ్చి మొదటి తరగతి బహుమతితో సత్కరించి, రెండవ తరగతిలో రైలుపై దాసుగారిని పంపిరి.

మైసూరు నుండి దాసుగారు తిరిగివచ్చునపుడు బళ్లారి వెళ్లి అట సుప్రసిద్ధ నటశేఖరులు చిత్రనళీయ గ్రంథకర్తలునగు ధర్మవరము కృష్ణమాచార్యులుగారిచే మిక్కిలి ఆదరింపబడి అచట టికెట్టుపై రెండు హరికథలను చెప్పిరి. దాసుగారి రాకను విని ఆదరముతో చోడవరము మున్సబుగారాహ్వానింప అటకేగి ఒక హరికథను చెప్పిరి.

ఇట్లు దాసుగారు తమకుగల బహువిధములగు విద్యావిలాసములను ప్రకటింపననువగు హరికథా షక్కికతో 'లోకులుప్పొంగ నుద్యత్సంగీత కవితావైభవమున' భగవదారాధనమును గావించుచు తాము తరించుచు లోకులను తరింప చేయుచుండిరి.

విజయనగరమున రాజాదరము :- దాసుగారి పేరుప్రతిష్ఠలు 'హిందూ' - 'మెయిలు' పత్రికల ద్వారా భారతదేశమంతయు వ్యాపించినవి. విజయనగరవాసులు తమ ఊరివారగు దాసుగారికి అట్టి యశస్సు గల్గుటకు మహానందమునంది తమ యూరిలో గూడ హరికథలను దాసుగారిచే చెప్పించి సమ్మానించుచుండిరి. ఆకాలములో విజయనగర ప్రభువు సరససంగీతాది సకల కళాప్రియులగు ఆనందగజపతి మహారాజు. అట్టి కళాప్రియుంభావుకుడగు ప్రభువు మహాయశస్వియగు (శ్రీ)దాసుగారి అతిశయమును ఏల గుర్తింపలేదు. గుర్తించినచో ఏల మిన్నకుండెను? రప్పించి తమ కోటలో ఒక ప్రదర్శనమును గూడ చేయింపలేదే! హేతువులు క్రమక్రమముగా బయల్పడినవి. ఈర్ష్యాపరులగు ఆస్థాన సంగీత విద్వాంసులు దాసుగారి కీర్తిప్రతిష్ఠలను సహింపలేక ఆస్థాన ప్రభువులకు దుష్ప్రచారము చేసిరి. దాసుగారి హరికథవినిన మైసూరు ప్రభువులు దిగవంతులయ్యిరను దుర్వార్తను కోటలో ప్రచారము చేసిరి.

వార్ధకము చేతను కులక్రమాగతత్వము చేతను ప్రభువునకు ఆదరపాత్రుడగు నొక వైణికుడు యువకులగు (శ్రీ) దాసుగారిపై వైరము పూని యుండెను. ఆతనిని దాసుగారు ఎన్నడును సరకుగొనలేదు. రాజదర్శనమునకై తనను అనేకులాశ్రయించుచుండగా ఈయువకుడు తనను ఏల లెక్కగొనడు? అని ఆతనికి దాసుగారిపై అసూయ. దానికితోడు దాసుగారు మైసూరు సమ్మానము నందిన వెనుక ఆముదుసలి వైణికునితో "చూచితివా, మైసూరి నుండి షస్టుక్లాసు బహుమతిని పొందితిని. ఇట్టి సమ్మానమును పొందుట నీతరమా? ముదుసలి దాసివలె నీవు ఈకోట లోనే కనిపెట్టుకొని ఉండవలసినదే" అని ఆతని అపహాస్యము చేసిరి. ఆతడు దాసుగారిపై ఏదియో చెప్పి యుండును. ఇట్టి కారణసామగ్రి అంతయు దాసుగారికి కోటలో ప్రవేశము లేకపోవుటకు హేతువయ్యెను.

కొంతకాలమయిన వెనుక దాసుగారికి కోటనుండి ప్రభువులు తమ్మును ఆహ్వానించుచున్నట్లు వార్త వచ్చెను. ఇన్నినాళ్ళు లేకుండ ఇట్లు హఠాత్తుగా ఆహ్వాన మెట్లు వచ్చినది? అందఱకు ఆశ్చర్యమే! విజయనగరమున ఆనందగజపతులకు గురువుగా ఒక మహాప్రతిభాశాలి యగు పురుషుడుండెను. ఆతడే లింగం లక్ష్మాజీ పండితుడు. ఆంగ్లమునందే గాక గ్రీకులాటిన్ జర్మనీ భాషలయందు గూడ ఆతడు మహా విద్వాంసుడు. సంస్కృతాంధ్రములందే గాక వివిధ శాస్త్రములయందు గూడ నిధి. ఆతని వైదుష్యమును యుక్తి చతురతను కథలుగా చెప్పుకొందురు. ఆతడు ఆనంద గజపతీంద్రునకు విద్యాగురువు - విశాఖ పట్టణమున (శ్రీ) దాసుగారు హరికథను చెప్పుచుండగా ఆ లక్ష్మాజీ పండితుడు విని సంతోషించి ఆనందగజపతి మహారాజునకు దాసుగారిని గూర్చి సిఫారసుచేసెను. ఆ సంగతి దాసుగారికేగాక ఎవరికిని గూడ తెలియదు. ప్రభువు దాసు గారిని పిలిపించుటకు అది హేతువు. మఱునటి దినము దాసుగారి ప్రభు దర్శనమునకేగి—

'ఆశ్రితులపాలి దాక్షిణ్య మరుల యొద్ద
శౌర్యముం గోవిదులకడ సాత్త్వికతయు
నెసగుదేలినవారి కభీష్ట జయము
నిచ్చు గావుత సంతత మీశ్వరుండు'

అని ఆశీర్వదించి యొక నారికేళమును ప్రభులకు సమర్పించి కూర్చుండిరి. ప్రభువు దాసుగారితో 'మిమ్ములను గూర్చి పత్రికలలో చూచితి'మని పలుకగా దాసుగారు ఆనందగజపతిపై రచించిన సావేరీవర్ణమును పాడిరి. ప్రభువు విని ఇంతటి సంగీత సాహిత్యములుగల దాసుగారిని గూర్చి తమతో ఎవ్వరు గూడ చెప్పక పోవుటకు విచారపడి దాసుగారి జన్మభూమియేది? అనియు, విద్యాభ్యాసంగములనుగూర్చి యడుగగా తమ జన్మభూమి అజ్జాడ అనియు విద్యాభ్యాసంగము తమ కాలేజీయే యనియు తెలిసికొని మహానందము నందిరి. దాసుగారు ప్రభువుముందు తాము రచించిన భైరవి ధన్యాసి స్వరజతులను పాడి నాటకురంజి స్వరజతిని పాడుచుండగా అందున్న దాసుగారిపై ఈర్ష్యగల వృద్ధ వైణికుడు దుర్వాసుడై ప్రభువువారి పరిచయము గలవాడగుటచే ముందుకువచ్చి 'కవితా వీణా వాదనములతో నాతో సరివాడు లేడని అవమానకరముగా పలికితిని. అట్లు పలుక లేదని వీణపై ప్రమాణము చేయవలసిన'దని బిగ్గరగా పలికెను. దాసుగారూరకుండిరి. ఆతని ఆస్థాన ప్రరంగమునకు ప్రభువు కంటగించుకొని 'అతడట్లని ఉండవచ్చును, అసత్యము పలుకుటకు ఇష్టపడక ఇపుడు ఊరకుండెను. ఆ ప్రరంగ మిప్పు డేంచులకు' అని

"కులశైలంబులు దలఁకిన
జలనిధు లింకినను సూర్య చంద్రుల సన్మం
డలములు నేల దొఱంగిన
పలుక డబద్ధంబు సత్యవాది గుణనిధీ"

అను పద్యమును చదివి గజపతీంద్రుడు ఆ పద్యమును దాను రచించినట్లు చెప్పెను. దాసుగారు పద్యము చాల బాగున్నదని ఆ పద్యమును మఱల

డాము చదివిరి. ప్రభువు దాసుగారి యొక్క సుధా గ్రాహిత్వమునకు మెచ్చు కొనిరి. అందులకా జరఠ వైణికుడు సహింపలేక—"ప్రభూ ఈతడు మిక్కిలి పొగరుబోతు. మా బోంట్లను బ్రతుకనీడు" అని కఠినముగ మాటలాడి నను దాసుగారు అచటి లక్ష్మాజీ పంతులుగారు మున్నగు పెద్దలయందలి గౌరవముతో దానికి సమాధానము చెప్పక మిన్నకుండెను. 'రసవంత మగు పాట సమయాన ఈ గోలయేమి? అతడు స్వతంత్రుడు. మైసూరు సంస్థానమున మహాగౌరవ మందిన యాతనికి మనబోంట్లు లెక్కకాక పోవచ్చునని, పలుక ఆ ముదుసలి దుఃఖముతో అటనుండి లేచిపోయెను. సభ ముగిసెను. ఎవరిండ్లకు వారు పోయిరి.

ముదుసలి వైణికుని నాశ్రయించియున్న గాయకులందఱు దాసు గారిపై బద్ధద్వేషులయిరి. తండ్రితాతలనుండి వచ్చుచున్న యావృద్ధ వైణికునియందు తనకుగల అభిమానముతో ప్రభువుకూడ ఏమియు అనజాలక దాసుగారిని తమ కోటలోనికి మఱల పిలిపింపలేదు. కొంత కాలము గడచినది. ఆవృద్ధ వైణికుడు మరణించెను. మఱి నాల్గు దిన ములకే ప్రభువువారినుండి దాసుగారికి పిలుపు వచ్చినది. దాసుగారు ప్రభుదర్శనమున కేగిరి. ప్రభువు సంస్కృతాంధ్రములలో ఒక్కొక్క సమస్యనిచ్చి ఆశువుగా పూరింపగోరిరి. దాసుగారు మిగుల రసవత్తరముగా పూరింప ప్రభువు సంతోషించెను. దాసుగారిపాట వినునప్పుడెల్ల ప్రభువు - మీగాత్రము కోటాపేటాగూడా పట్టదు; మీకు సంగీత సాహిత్యములు రెండు నేత్రములు. మీ ప్రతిభ నిరుపమానము' అని కొనియాడి ఆతనివంటి సంగీత కవితావిశారదుడు ఈయూరనే లేడని పలుతావుల పేర్కొననారంభించెను. ఒకనాడు ప్రభువు దాసుగారిని - "సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్" అను మకుటమునిచ్చి పద్యము లను చెప్పుడనగా దాసుగారు ఆమకుటముతో నూఱు పద్యములను చెప్పి తుదిని —

"చతురకళావిద్యా సం
గతికిన్ స్థిరధృతికి ప్రకట కరుణామతికి

కృతి యానందగజపతికి
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్"

అనిచెప్పగా ప్రభువు పరమానందమునందెను.

కొలది దినములయిన వెనుక దాసుగారి జీతమును పదునైదు రూప్యములను ముప్పది రూప్యములు చేసిరి. దాసుగారెల్లప్పుడు స్వతంత్రులుగా నుండిరి. దేశమునందలి ఆహ్వానములతో పలుతావులకు హరికథా కథనమునకేగుచుండిరి. ఊరిలోనున్నపుడు గూడ తక్కిన పండితులవలె ప్రతిదినము కోటకు ఏగుటలేదు. ప్రభువు పిల్చినచో వెళ్ళెడివారు. అది చూచి సహింపని దివాను దాసుగారికి ఒక పని కల్పింపవలయునని ప్రతి ఏకాదశికి విజయనగరమునందలి వేణుగోపాల స్వామిమఠమున హరికథ చెప్పవలయునని శాసనమును పంపెను. దాసుగారు అర్డరును చూచి, ఆ అర్డరు కాగితము త్రిప్పి వెనుక ప్రక్కనే - ఇతరత్ర తనహరికథకు ఇచ్చు నూటపదారు రూప్యములు, మిగిలిన లాంఛనములు మఠమువారు ఇచ్చినచో అచట హరికథ చెప్పుటకు తనకభ్యంతరము లేదనియు, అట్టి సత్కారము తనకు చేసినచో అచటనే గాక మఱెచ్చటనైనను కథ చెప్పుట కభ్యంతరము లేదనియు వ్రాసి పంపిరి. దివాను ఏమియుననలేక మిన్నకుండెను.

ఒక పర్యాయము దివానుగారు దాసుగారు ఒకేపర్యాయము ఆనందగజపతీంద్రుల సన్నిధికి పోవుట తటస్థించినది. అపుడు ప్రభువు దాసుగారిని చూచి "Come on Mr. Narayanadas" అని దాసుగారిని కుర్చీపై కూర్చుండబెట్టి దివానుగారు నిల్చుని యుండగనే దాసుగారితో మాటలాడజొచ్చిరి. అప్పుడు దాసుగారు దివానుగారినిచూచి—'అయ్యా మీకును మాకును గల తేడా ఇదే. మీరు మూడువందలు తీసుకొన్నను అది నౌఖరీ జీవితము. మాకు సంస్థానమువారు ఇచ్చునది పండితవేతనము" అనిరి. ప్రభువా మాటలకు ఆశ్చర్యపడి ఏమి విశేషమని దాసుగారినడు

గగా వారు దివాను వ్రాసిపంపిన ఆర్డరును దెలిపిరి. గజపతీంద్రుడు దివానుగారిని మందలించి పంపివేసి దాసుగారితో 'ఆతడు పెద్దవాడుగదా ఆట్లనుట బాగుండునా'యని స్మేరాననుడై పలుక దాసుగారు-"ప్రభూ! జరిగిన విషయము నాతడు తమకు తెలుపడు. ఇట్టిది తమకు తెలియవలసి యున్నది. ఆతని పరోక్షమున కంటె ఆతడున్నపుడే చెప్పుట ధర్మము గదా" అని పలికెను.

ఇట్లు దాసుగారు మహారాజాస్థానములో సైతము తమ యాత్మ గౌరవమునకును స్వాతంత్ర్యమునకును ఎట్టిభంగము కలుగకుండ ప్రభువుల కీయవలసిన మర్యాదనిచ్చుచు ప్రవర్తించు చుండెడివారు. ఒకప్పుడు ఆనంద గజపతీంద్రుని కడ పాడుచు సొగసైన సంగతి వేయుగా ప్రభు వానంద పరవశుడయి 'ఏదీ యింకొకసారి' అనెను. దాసుగారు అదే సమయమున మందమలయానిలము వీచుట గమనించి 'ఏదీ యింకొక పర్యాయము' అనిరి. రసజ్ఞశేఖరుడగు గజపతీంద్రుడు సహజగానము జాలువారి తనంతట తా వచ్చునేగాని దానికి పునరావృత్తి కలుగదను దాసుగారి భావమును కనిపెట్టి సంతోషించెను. ఇట్లు దాసుగారు జమీందారుల వద్ద తా నొక భృత్యునివలె గాక స్వతంత్రుడుగానే ప్రవర్తించు చుండెడివారు.

యౌవనము :- దాసుగారి బాల్యము ఆనందముతో గడచి పోయెను. జనునికి యౌవనము ప్రమాద భూయిష్ఠ మగుటచే ఎట్టి ప్రమాదములు జరుగునోయని దాసుగారు ఎప్పటి కప్పుడు ఆత్మపరీక్ష గావించుకొనుచుండిరి. అందులో గూడ తమ సంగీతనర్తనకళ ఎక్కువ ప్రమాదోన్ముఖమగుటకు తగు అవకాశము కల్పించునది. కాని పెద్దల సహవాసముచేగాని బహుదేశసంచారముచే గల్గిన యనుభవముచేగాని ఇంతకూ పూర్వజన్మసుకృత విశేషముచే తాను ఏకట్టుబాట్లను ఏపద్ధతులను అవలంబింప నిశ్చయించుకొనెనో వాటినన్నింటిని తు-చ-లు తప్పకుండ స్థిరచిత్తముతో ఆచరించుటచే తన ప్రవర్తనము తనకు మహాతృప్తిని

కల్గించినది. ఎల్లప్పుడును చదువను వ్రాయను దీక్షనుండుటచే విశేష విజ్ఞానము నార్జింప మంచి యవకాశము కలిగెను.

ఆనందగజపతీంద్రుడు 1897వ సంవత్సరమున స్వర్గతుడయ్యెను. సంస్థానమును ప్రభుత్వము స్వాధీనపఱచుకొనెను. దాసుగారి పండిత వేతనము ఆగిపోయినది. వారికెట్టి చింతయు దానివలన కలుగలేదు. దేశమునందంతటను అప్పటికే తమ కీర్తిప్రతిష్ఠలు వ్యాపించియుండుటచే కృతవిద్యుడగు తనకు పృథివి యంతయు తలచికొన్నంతనే సువర్ణపుష్పముగా నుండుననుట కెంతమాత్రము సందేహము లేదని వారి భావము. ఎట్టివారైనను తమ ప్రతిభా వాగ్మిత్వములకు దోసిళ్లు లొగ్గుచుండిరి. శుభకార్యమునకుముందు విఘ్నేశ్వరుని పూజవలె దేశమునందలి పెద్ద పెద్ద వివాహములయందుగాని ఉత్సవములయందుగాని వారి హరికథాగానము అవశ్యంభావి యగుచుండెను. ఇది పట్టణ జనపద సామాన్య మర్యాద అయ్యెను. తుదకు వారి కథలకు కంట్రాక్టులు గూడ సిద్ధమై కొందఱు ధనమును సంపాదించుకొనుచుండిరి. దాసుగారికి ఎల్లపుడు, చదువుకొనుట - పాడుకొనుట - వ్రాసికొనుట - శిష్యులకు పాఠములను చెప్పుట నిత్యకృత్యములు. ఇంటిలో ధనము తఱుగగానే గ్రామాంతరముల కేగి తమ విద్యాప్రదర్శనముచే ధనమునార్జించి ఇంటపడవేసెడివారు. "యా నిశా సర్వ భూతానాం తస్యాం జాగర్తి సంయమీ" అను గీతావచనమునకు దృష్టాంతముగ దాసుగారు రాత్రియంతయు చదివికొనియు వ్రాసికొనియు నాలుగు గంటలకు పరుండిరి. మఱల ఎనిమిది గంటలకు లేచుట వారికి పరిపాటి.

> "The heights by greatmen reached and kept,
> Were not attained by sudden flight,
> But they while their companions slept,
> Were toiling upward in the night"

అను లాంగ్‌ఫెలో మహాశయుని వక్కాణ శ్రీదాసుగారియందు శతధా సార్థకము.

ఒకనాడొక చిత్రగతి జరిగినది. వారు లేచినతోడనే బ్రాహ్మణ దంపతులు వచ్చి నమస్కరించిరి. తమ కులగోత్ర నివాసాదుల నెఱిగించి, తమకు సంతానము లేదనియు గడచినరాత్రి యొక స్వప్నమున ఒక మహానుభావుడు నారాయణదాస ప్రసాదమున సంతానము గల్గునని చెప్పుటచే దర్శింపవచ్చితిమని చెప్పిరి. దాసుగారు అచ్చెరువుపడి – "నేడు ఏకాదశి. రేపు మీరు అయ్యకోనేటిలో మీరిరువురు స్నానముచేసి రాగి చెంబుతో నీళ్లుతెండు" అని వారితో చెప్పెను. వారట్లుచేసిరి. భార్య ఆనీటిని పోయుచుండ భర్త దాసుగారి పాదములను కడిగెను. దాసుగారు ఆ చెంబు తీసికొని దానిలోని జలమును ఆచమించి మిగిలిన నీటిని తన చేతిలోనుండి ఆదంపతుల దోసిళ్లలో పోసి త్రాగుడనిరి. వారు త్రాగగా 'ఇకమీరు వెళ్లుడు, మీకు పుత్రసంతానము కలుగునని చెప్పి దీవించి పంపెను. అనంతరము వారికి దాసుగారు చెప్పినట్లు పుత్రసంతతి కల్గినది.

అప్పటికి దాసుగారికి సంతానములేదు. పై విషయమును తెలిసి కొన్న భార్య సంతానము కొఱకు తనచే ఏదేని వ్రతము చేయింప గోరెను. దాసుగారితల్లి 1902 సంవత్సరమున 'నాయనా నీవు సావిత్రి చరితమును వ్రాసినచో నీకు సంతానము కల్గునని చెప్పెను. తల్లి తల్లిమాటపై దాసుగారు అపుడు సావిత్రి చరిత్రమును హరికథగా వ్రాసిరి. 1903వ సంవత్సరముననే వారికి పుత్రిక కలుగగా ఆ బాలికకు 'సావిత్రి' యను నామమిడిరి. 1904వ సంవత్సరమున బెంగుళూరులో గొప్ప గాయకసభ జరిగెను. దేశమంతట నుండియు గొప్ప గొప్ప గాయకులు వచ్చిరి. దాసుగారు కూడ ఆహ్వానముపై పేరన్నగారితో వెళ్లెను. ఒకనాడు దాసుగారి రుక్మిణీకల్యాణము హరికథ. దక్షిణదేశ మున మహాప్రసిద్ధుడగు ఒక పిళ్లేగారు మార్దంగికుడుగా నియమింపబడెను. ఆరంభమునుండియు మార్దంగికుడు తన ప్రాగల్భ్యము నగపఱచుచుండెను. దాసుగారాతని ఔద్ధత్యమును కనిపెట్టి జంపెతాళము కీర్తన నెత్తుకొని ఒకగతిలో పాడుచు వేఱొకగతిలో తాళము చిప్పలతో లయ వేయు

చుండగా పిళ్లేగారికి మద్దెలపై చెయ్యి ఆడలేదు. ఇక దాసుగారి పాటయేగాని మద్దెల వినవడలేదు. దాసుగారు సభాధికారులవైపు తిరిగి 'ఏమిదక్షిణామూర్తి' అని మార్దంగికుని పలుకరించిరి. అతడు 'స్వామీ జాగా దొరకలేదు' అనెను. "ఒకరిబల మొకరికి తెలిసిపోయినది. ఇక జాగ్రత్తగా వాయించుము" అని జాగా వెల్లడిచేసి రెండుగతులతో పనిచేయుచు మూడవ గతియందు నృత్యవిశారదత్వ మగపఱచిరి. సభ్యులందఱి హర్షధ్వనులు మిన్నుముట్టెను. సదస్యులు దాసుగారిని "లయబ్రహ్మ" యని స్తుతించిరి. పిళ్లేగారు జోహారు ఒనర్చిరి.

1905వ సంవత్సరమున దాసుగారి తల్లి దిగవంతురాలయ్యెను. ఆమె మరణసమయమున దాసుగారికిచ్చిన తులము బంగారుచుట్టును దాసుగారు మాతృసంస్మరణమునకై తలవ్రేలియందు ధరించిరి. 1909 - 1910 సంవత్సరమున దాసుగారు తారక గ్రంథమును రచించిరి. 1911-1912 సంవత్సరమున దాసుగారు బరంపురమువెళ్లి అచట జిల్లా జడ్జిగారగు టి. సదాశివయ్యరుగారిచే హరికథగావించి సమ్మానము పడసిరి. పురజనుల పక్షమున జడ్జిగారు ముప్పది తులముల బంగరు కడియము బహూకరించిరి 1912 - 1913లో విజయనగరసంస్థానమునకు 'ట్రస్టీ'గా నియమింపబడిన రీవారాణియగు అప్పలకొండమాంబ యను ఆనందగజపతీంద్రుని సోదరి కోటలో మూడునాల్గు హరికథలను చెప్పించి నలువది పెద్దకాసులు పర్పు పట్టువస్త్రములను కానుకగా నిచ్చెను.

ఈసంవత్సరముననే దాసుగారు పుత్రికకు వివాహమును గావించి పేరన్నగారితో కూడ కాశీయాత్ర చేసిరి. అలహాబాదులో తన ప్రియ మిత్రులగు చిట్టావూరి యజ్ఞనారాయణ చింతామణి గారింట కొన్ని దినములుండిరి. అప్పుడే అచట సుప్రసిద్ధ గాయకురాలగు 'జానకీబాయి'తో పరిచయము కలుగగా పరస్పర గానములతో ఒకరి విషయ మొకరు తెలిసికొనిరి. జానకీబాయి గొప్పగాయని యని దాసుగారు

చెప్పుచుండిరి. కాశీయాత్ర నుండి తిరుగు ప్రయాణమున దాసుగారు భార్యయు పుత్రికయు కలకత్తా వచ్చిరి. అచట ఒక పెద్దసభ జరిగెను. ఉన్నతోద్యోగులు విద్యాధికులు సంగీతసాహిత్య విద్వాంసులు పెక్కురు వచ్చిరి. రవీంద్రనాథటాగూరుగారు కూడ అందుండిరి. 'శ్రీకృష్ణజనన' మను సంస్కృతహరికథ ఆనాటి ప్రదర్శనము. హరికథ యందలి సౌందర్యములను హిందీలో నుపన్యసించుచు పాడుచు ఆడుచు బహు విధములుగ శ్రోతలకు దాసుగారు విందొనర్చిరి. రవీంద్రుడు దాసుగారి కవిత్వగాన నృత్యములకు పరవశించి ఎంతయూ అభినందించెను. కథానంతరము రవీంద్రులు దాసుగారిని కలిసి 'మీరు పాడిన బేహాగు రాగము హిందూస్థానీ భైరవి దాక్షిణాత్యు లెఱుగరు. ఇచట కూడ ఆ రాగములు మీవలె ఎవ్వరును పాడలేరు. కావున మీరు దాక్షిణాత్యులని నేను విశ్వసింపజాలకున్నా'నని''రి. చిరకాలమునకు రవీంద్రుడు విజయనగరము విచ్చేయగా మహారాణీగారు ఒక సభ నేర్పఱచిరి. దానియందు దాసుగారు చిట్టచివర కుర్చీపై కుర్చొనియుండగా దూరమునుండి చూచి రవీంద్రుడు దాసుగారి కడకు వచ్చి 'నన్ను మఱచితిరా' అని నమస్కరించెను. దాసుగారును లేచి నమస్కరించి 'మీరు విశ్వకవీంద్రులు. మిమ్ములను మఱచుటెట్లు ? మీకు నేను గుర్తుంటినో లేదోయని సందేహించితిని. గుర్తించితిరి సంతోషము''అని పలికిరి. "ఆనాటి మీ" బేహాగు రాగము "చెవులలో ఇంకను మెలగుచుండ మిమ్ములను మఱచుటెట్లు"ని రవీంద్రులు పలికిరి.

కాశీనుండి ఇంటికి వచ్చిన కొలది దినములకే చల్లపల్లి రాజాగారు శ్రీ రాజా అంకినీడు మల్లికార్జున ప్రసాదరావుగారు కుడియెడమ చేతులతో సమవిషమ జాతుల వీణవాయించిన శ్రీ దాసుగారికి నిండుసభలో బంగరు గండపెండేరమును బహూకరించి సత్కరించిరి.

దాసుగారి ధర్మపత్ని లక్ష్మీనరసమ్మగారు 1915 లో పరమపదించిరి. ఆమె దాసుగారు చెప్పు రామాయణ కథను విని సంతోషించు

చుండుటచే దాసుగారు యథార్థ రామాయణమును వ్రాసి యామెకు అంకితము చేసిరి.

1908—1914 మధ్య సమయమున బరంపురము మొదలుగల ఆంధ్ర దేశమునందలి పట్టణములలోను పల్లెలలోను కూడ భుజకీర్తులు, సువర్ణ ఘంటా కంకణములు, మెడలో పతకములు గండపెండేరములు, కాలి కంకణములు గజారోహణములు మున్నగు బహువిధ సత్కారములను దాసుగారు పొందిరి. నిజముగా దాసుగారికి ధన సంపాదనేచ్ఛ లేనే లేదు. వారి ధన సంపాదనము కేవలానుభవమునకేగాని నిక్షేపమునకు మాత్రము కాదు. ధన సంపాదనేచ్ఛయే వారికున్నచో తనను స్తుతించిన రవీంద్రుల పరిచయముతోను, సిఫార్సుద్వారా రామనాథ్ రాజావారి ఆశ్రయముతోడను మైసూరు మహారాజావారి ఆదరముతోను ఆనంద గజపతీంద్రుల అభిమానముతోడను ఎన్ని లక్షలు సంపాదించెడి వారో! ఆయన యథాలాభ సంతుష్టుడు. స్వతంత్ర భావానురక్తుడును. ఆయనకు ధనము పనిలేదు.

విజయరామ గజపతీంద్రుడు విజయనగరమున గానకళాశాలను స్థాపింపవలయుననియు, దానికి దాసుగారే ప్రిన్సిపాలుగ నుండవలయు ననియు సంకల్పించి దాసుగారికి చెప్పెను. గానకళాశాల స్థాపించుట నాకు చాల ఆనంద ప్రదము. 'రిటైరు' అగు వయసుననున్న నేను దానికి ప్రిన్సి పాలుగ నుండజాలనని దాసుగారు ప్రభువుతో ననిరి. మీ కీర్తిప్రతిష్ఠల వలన కళాశాల అభివృద్ధి గాంచునని కళాశాల నేర్పఱచుచున్నాము-కళా శాల కొఱకు మీరుగాని మీ కొఱకు కళాశాలకాదు అని ప్రభువు పెక్కు విధముల చెప్పగా దాసుగారు అందుల కొప్పుకొనిరి మహారా జావారు మఱల దాసుగారితో మీహరికథా ప్రచారము యథాపూర్వ ముగ సాగవచ్చును. మీకు ఇష్టము వచ్చినంతకాల ముద్యోగము చేయ వచ్చును. మీ జీవిత పర్యంతము మీకు నూఱు రూప్యములనిచ్చెదమని పలుకగా దాసుగారు కళాశాల నిర్వాహణమున కంగీకరించి- వీణె, ఫిడేలు

సన్నాయి, మృదంగము, డోలు, గాత్రము మున్నగు వానిలో శిక్షణ నీయగల యుపాధ్యాయులను వలసిన సాధనములను దెప్పించి కళాశాల నారంభించి 1919—1936 వఱకు మహోజ్జ్వలముగా కళాశాలను నడిపించిరి. దీనివలన వారికి రాబడి తక్కువయినను గ్రంథపఠనమునకును గ్రంథరచనమునకును తగు అవకాశము లభించెను. ఉమరుఖయ్యాము అనువాదము, నవరస తరంగిణి మున్నగు గ్రంథముల నపుడే రచించిరి.

30-8-1924 వత్సరమునకు దాసుగారికి షష్టి వత్సరములు పూర్ణములగుట. పేరుగల శిష్యులు అభిమానులు, గ్రామాంతరములనుండి విచ్చేసి గొప్ప యుత్సవమును చేసిరి. 1931 వ సంవత్సరమున గుంటూరు నందు జరిగిన సప్తమ గాయక మహాసభకు దాసుగారధ్యక్షులై సంగీత సాహిత్యములు తెలుగు బాణీని గూర్చి మహోపన్యాసము గావించిరి.

1931-33 సంవత్సరముల దాసుగారిని విజయనగర ప్రభువగు అలక నారాయణ గజపతీంద్రులు దాసుగారిని ఉదకమండలమునకు తీసికొనివెళ్లి అచ్చటికివారి సాటి జమీందారు మిత్రుల నాహ్వానించి దాసుగారిచే హరికథను చెప్పించిరి. ఆ చలిలో దాసుగారు పొడవు కోటుచు ధరించి ఆడుచు పాడుచుండిరి. తమ సహజ ధోరణిలో ప్రసంగించుచు లోకము నానాటికి చెడిపోవుచున్నదని—

"జగముచెడె, దేగవాలగ సాహసింప
కున్న జీనువ యెరతిన్ను మండెనెల్ల
నీచుడున్ ఘడుడౌటచే నెరుపబడిరి
తక్కువారుగ పల్వురు తగు మనుషులు"

అని షేక్స్పియరు పద్యమొకటి చదివి మూడు చరణములు సభవైపు చూపుచు నాల్గవ చరణమును తనవైపు చూపుచు నభినయించి సభ్యులను కడుపుబ్బ నవ్వించిరి.

1933 సం॥ మున విశాఖపట్టణమున పండిత న్యాయవాది యగు ప్రభల లక్ష్మీనరసింహం పంతులుగారు తమ పుత్రిక వివాహ సందర్భమున

హరికథ చేయించి సత్కరించిరి. అచటికి విచ్చేసిన జయపురాధీశ్వరులగు శ్రీ విక్రమ దేవవర్మగారు శ్రీ దాసుగారికి భక్తి పురస్సరముగ 'పర్సు' బహూకరించి పౌరుల తరపున "సంగీత సాహిత్య సార్వభౌమ" బిరుదము నొసంగిరి. శ్రీ విక్రమ దేవవర్మ మహారాజుల అధ్యక్షత తోడను శ్రీ బుఱ్ఱా శేషగిరిరావుగారి కార్యదర్శిత్వముతోడను నెలకొల్పబడిన "భారతీ తీర్థ" విద్యాలయసంస్థ వార్షికోత్సవమునందు దాసుగారు "ఆట పాటల మేటి" అను బిరుదముతో సత్కరింపబడిరి. అనంతరము దాసుగారు 1936 వ. సంవత్సరమున సంగీత కళాశాలాధ్యక్షపదవి నుండి విరమించిరి.

రామేశ్వర యాత్ర :- శ్రీ దాసుగారు తాము గానకళా శాలాధ్యక్షపదవిని విరమించిన రెండేండ్లకు సహోదరశిష్యసమేతులై సేతుయాత్ర వెడలిరి. హైకోర్టు జడ్జి పదవినుండి విరమించిన Mr. H R. Bard swell అను తమ మిత్రుడు పుదుక్కోటలో నుండగా ఆతనిని గూడ చూడదలచిరి. ఆతనికి తెలుగు దేశమున ఉద్యోగము చేయుటచే తెలుగు భాష బాగుగా తెలియును. దాసుగారి హరికథలను విని బాగుగా సంతోషించెడివారు. దాసుగారిని ''షేక్స్పియరన్ స్కాలర్' అని స్తుతించెడివాడు. 1923 సంవత్సరమున జిల్లాకలక్టరు ఇంగ్లండులోని 'అంపైరు ఎగ్జిబిషను'కు ఆహ్వానింపగా అచటి చలికి దాసుగారి శరీరము సహింపదని దాసుగారి ప్రయాణమును ఆపివేసెను. అనగా దాసుగారి యందు అత్యాదరముగలవాడు. దాసుగారు పుదుక్కోటవెళ్లి ఆయనను కలియుగా ఆతడు మిక్కిలి సంతోషించెను. దాసుగారు పుదుక్కోట దర్బారునందు సమ్మానమునంది అచటినుండి తిరువాన్కూరు వెడలి అచట పద్మనాభ స్వామిని దర్శించి అచట మహారాజుచే సమ్మానింపబడి రామేశ్వర మేగిరి. మనో నైర్మల్యముగల యుత్తమ పురుషులకు భావి శుభా శుభములు పరోక్షాంతరమున గోచరించుచుండుట లోకప్రసిద్ధము. ఈ ప్రయాణమున ఒక చిత్రసంఘటనము జరిగెను. విజయనగరమున దివానుపనిచేసిన శ్రీ రాజ్యాంగమయ్యరుగారు రావణ సముద్ర

మున నుండిరి. ఆయన దాసుగారిని అత్యంత భక్తితో ఆహ్వానించిరి. అందుకై విరుద్ధనగరము స్టేషనులో పెంకోట ప్యాసింజరునకు టిక్కెట్లు తీసికొని బండి ఎక్కి కూడ చల్లగాలికై మఱలదిగి ప్లాటుఫారము మీద దాసుగారు పరివారము కూర్చుండి కబుర్లు చెప్పుకొనుచుండిరి. బండి బయలుదేరు సమయాన దాసుగారు రెండవ బండిలో వెళ్ళవచ్చునని ఆ బండిలోని తమ సామాను దింపించి వేసిరి. పరివారము అందఱకు కొంతకష్టమనిపించెను. మఱునాటి యుదయము పత్రికలలో వారు ఎక్కి సామాను దించివేసిన పెంకోట ప్యాసింజరు ఒక వంతెనపైనుండి పడిపోయినట్లును మూడువందలమంది మరణించినట్లును ప్రకటింపబడెను. దానిని చూచి దాసుగారు వేదమాతయగు కన్యాకుమారీ పరదేవతయే తనకు ఆ బుద్ధి పుట్టించి ఆ రైలు మీద తన ప్రయాణమాపి సామాను దింపించినదని తలచిరి. వారు తరువాత వేఱొక మార్గమున రావణ సముద్రమునకేగి అయ్యరుగారింట కొలది దినములుండి అటుపై రామేశ్వరమున కొలది దినములుండి కన్యాకుమారికేగి దేవతా దర్శనము గావించుకొని భక్త్యుత్సాహములతో లలితా సహస్రనామములను ఆ దేవిని స్తుతించెను. ఆ నామములనే అచ్చ తెనుగున కీర్తింపవలయునను పూనిక (శ్రీ) దాసుగారికి పరదేవతా సన్నిధియందే గల్గినది. కుమారీ పరమేశ్వరి తన స్వప్నమునందగపడి తనకు అభయమిచ్చినట్లు దాసుగారు చెప్పెడివారు. (శ్రీ) దాసుగారు ఆ సమయముననే "దశవిధరాగ నవతి కుసుమమంజరి" అను దేవీ స్తుతిని రచింప నారంభించిరి.

తిరుగు ప్రయాణమున మద్రాసువచ్చి అచటి ఆంధ్రుల ఆదరముతో హరికథలను గావించి పెద్ద పెద్ద విద్వాంసుల ప్రశంసలను సత్కారములను పొంది విజయనగము చేరి సంస్థానమువారిచే తమ ఉద్యోగ సమయమున నిచ్చు నెల జీతమును ఉద్యోగ విరమణము చేసినను పొందుచుండిరి. దాసుగారు అప్పటినుండి తమ ప్రయాణములను తగ్గించి విశ్రాంతితో హాయిగా గ్రంథరచనమునే చేయుటకు సంకల్పించిరి.

ఇరువదియేండ్ల వయసు తరువాత దాసుగారికి జ్యోతిశ్శాస్త్ర పరి శీలనమున ఆసక్తి మెండయినది. అనేక గ్రంథములను చదివి అందు మంచి విజ్ఞానమును సంపాదించిరి. తద్విజ్ఞానము నార్జించిన పిదప దాసు గారికి నవగ్రహ ప్రతిష్ఠ యందాసక్తి కలిగి అయ్యకోనేటిగట్టుపై తామే స్వయముగా యథా శాస్త్రముగ నవగ్రహ ప్రతిష్ఠను గావించి యాలయమును నిర్మించిరి. దాసుగారు గ్రామాంతర గమనమును విర మించిన వెనుక విశ్రాంతి గల్గియుండుటచే అచ్చతెనుగున అనేక గ్రంథ ములను వ్రాసిరి. అష్టాదశ పురాణములను చదివి 'అష్టాదశ విద్యారహ స్యము' లేక 'జగజ్జ్యోతి' అను గ్రంథమును వ్రాసిరి. తమ గ్రంథము లన్నియు తమ తృప్తికొఱకు వ్రాసికొన్నవేగాని యితరులకై గాదనియు, అట్లే కీర్తికొఱకుగాని ధనముకొఱకుగాని కాదనియు చెప్పుచుండెడివారు,

విజయనగరమున మహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ శాస్త్ర రత్నాకర (శ్రీ) తాతా సుబ్బారాయ శాస్త్రిగారి షష్టిపూర్తి మహో త్సవము మూడు దినములు జరిగినది. (శ్రీ) శాస్త్రిగారు దాసుగారికి ఆప్తులు మిత్రులు బంధువులుగూడ. ఆ ఉత్సవమునకు మహామహోపా ధ్యాయ కుప్పుస్వామి శాస్త్రిగారను గొప్ప దాక్షిణాత్య విద్వాంసులు అధ్యక్షులు. ఆ యుత్సవమునకు (శ్రీ) శాస్త్రిగారి శిష్య ప్రశిష్య సంతతి పెక్కురు అనేక శాస్త్రములలో నుత్తీర్ణులు మహాపండితులు దేశమంతట నుండి వచ్చిరి. కార్యనిర్వాహకవర్గము వారిని దాసుగారిని హరికథా గానమును జేయగోరిరి. దాసుగారు అపూర్వమగు అట్టి విద్వత్సభను గాంచి మహానందపరవశులై తమ విద్యావైభవమును వెదజల్లుచు తమ శాస్త్ర ప్రసంగములతో అచటి విద్వద్బృందమును నందఱను సంతోష సాగరమున ముంచెత్తిరి. దేశమునందలి సుప్రసిద్ధవైయాకరణులందఱు అటనుండుటచే (శ్రీ) దాసుగారు అనేకములగు వ్యాకరణశాస్త్రమునందలి క్లిష్టసమస్యలను వెల్లడిచేసి తమ యనితరసాధారణమగు ప్రతిభచే వారల నందఱను సమ్మోహపఱచిరి, సభానంతరము అధ్యక్షులు (శ్రీ) దాసు

గారివంటి సర్వశాస్త్రపాండితి సంగీతసాహిత్యవైదుష్యము గల విద్వాంసు నెన్నడును గాంచలేదనియు, ఇట్టి మహానుభావుడు చంద్రగుప్తుని సమయమున నొకరుండినట్లు గ్రంథమున జదివితిననియు, నేడు మఱల అట్టి ఈ మహానుభావుని గాంచి ధన్యుడనైతిననియు వేనోళ్ల స్తుతించి నమస్కరించెను. దాసుగారు ఆనాడు పొందిన యానందము పాలకొల్లులో శ్రీ చుండూరు నారాయణరావు తన చేతికి సువర్ణ ఘంటా కంకణము వేసి తనపరివారమంతకు పట్టువస్త్రములనిచ్చి మహాసత్కారము చేసినప్పుడుగూడ పొందలేదు.

కాలక్రమమున దేశమునందుగల తమమిత్రులొక్కొకరు గతించుచుండుటచే దాసుగారు ఖిన్నులగుచుండిరి. దాసుగారి మిత్రులలో శ్రీ గురజాడ అప్పారావుగారొకరు. దాసుగారు షేక్స్పియరు ననువదించునపుడు కవిహృదయమును కవియే ఎఱుగును కావున నీకు తోచిన రీతిగానే అనువదింపుమని దాసుగారి కాయన సలహా నిచ్చెను. తన యవసానదశయందు దాసుగారిని పిలిపించి ఏదైన పాడుమని కోరి వారు పాడిన దైవస్తుతిని విని మిగుల ప్రమోదమునందెను. హరికథాసమయమున తనవెనుక పాట పాడునట్టి శ్రీ పేరి రామమూర్తి (పేరిబాబు) అను మహావైణిక విద్వాంసుడు దివంగతుడు కాగా — "నేను పాడిన రాగము తరువాయి పాడునట్టివాడు, నాతో సమానముగ స్వరమును పాడునట్టివాడు, నేను ముక్తాయించినపుడు ముక్తాయించువాడు గతించెనే యని వాపోయిరి. నా యూపులను అతడుతప్ప వేఱొకరు కాచుకోలేక పోయెడివారని చెప్పుచుండెడివారు. తనతో బడిలో చదువుకొని తనను దేవునివలె చూచు శ్రీ బొడ్డు వేంకటేశమను మిత్రుని మరణమునకు మిక్కిలి శోకించి అతనికి సుగతి కలుగవలయునని పద్యములతో దైవమును ప్రార్థించిరి. శ్రీ కానుకుర్తి నరసింగరావు (బుచ్చిబాబు) గారి మరణ సమయమున చిన్ననాటి మిత్రుడు సంగీతాభిమానియగు సంపన్న గృహస్థు గతించెనే యని దుఃఖించిరి. ఆంధ్రభీష్మన్యాపతి సుబ్బారావు

పంతులుగారి మరణమును విని రాజమహేంద్రవరము ఇక నిర్వీర్యమైనదని మిగుల వగచిరి.

ఇట్లు దాసుగారి చిన్ననాటిమిత్రులు, తన విద్యావైదుష్యమునకు ఆనందపడువారు గతించినను పల్లీపట్టణ ప్రాంతములయందు మాత్రము శిష్య ప్రశిష్య రూపమగు క్రొత్తకారు హరిదాసబృందమును గాంచి కొంత ఊరటచెందెడివారు. ఆ బృందముగూడ దాసుగారి హరికథ ఎచట జరిగినను వారి రీతులనుగాంచి అనుకరింప యత్నించెడివారు.

1943 - 44 లో జయపురమునుండి కొందఱు వచ్చి దాసుగారికి వేయిన్నూట పదహారులిచ్చి జాగ్రత్తతో తీసికొనివెళ్ళి మఱల అట్లే దిగబెట్టెదము అని ఎంత ప్రార్థించినను దాసుగారు నిరాకరించిరి. వారు తమాషాగా "బోడితల అంట వేడుక, రానివారిని పిలువ వేడుక" అన్నట్లు మీరు ప్రయాసపడవద్దని వారలను వారించిరి.

దాసుగారు తమ జ్యోతిర్విజ్ఞానమును బట్టియు శ్రీ శ్రీధర వెంకయ్యగారు చెప్పినదానినిబట్టి తనకు ఎనుబదియేండ్లుదాటిన తరువాత మారక మున్నదని నిశ్చయించి జ్యోతిషము తెలిసిన యొక శిష్యునితో తమ జాతకమును విమర్శించుచు ఈ మారక సమయము గడిచినచో నూరేండ్లు బ్రతుకుదుననియు కాని మారకసమయము గడచుట మూడు వంతులు జరుగదనియు చెప్పిరి. ఎనుబది యొకటవ వత్సరమునుండి భీష్మునివలె తమ మరణమును నిర్విచారముగ నిరీక్షించుచుండిరి. దాసు గారికి జ్యోతిశ్శాస్త్రమున విశేషప్రత్యయము ప్రజ్ఞయు ఉన్నను దాని ఫలమును నిరాఘాటముగ దెలిసికొనుట అవశ్యము కావున దానినే నమ్మి యుండరాదనియు అది సూచక మాత్రమే యనియు వారి భావనము.

విజయనగరమునందలి ప్రముఖులు కమిటీగా ఏర్పడి శ్రీ దాసు గారి అశీతితమ జన్మదినోత్సవమును మహావైభవముతో జరుపనెంచి శ్రీ దాసుగారికి విన్నవించిరి. దాసుగారు దానిని విని 'నాకు వివిధములగు సన్మానములు ఎన్నియో పలుతావుల జరిగినవి. సన్మానములతో విసిగితిని. నేను ఇరువదవ యేట హరికథాగానము నారంభించితిని. కావున మీరు నా హరికథకు షష్టిపూర్తి సన్మానమును వలసినచో కావింపుడు. అందు నేనును పాల్గొందునని చెప్పిరి. పౌరులును తమ

ప్రతినిధులను దేశమంతట పంపి ప్రచారము గావించి పెద్ద ప్రయత్నమును గావించిరి. అంతలోనే శ్రీ దాసుగారు పరమేశ్వర సాన్నిధ్యము చేరుటచే వారల యుత్సాహము భగ్నమయినది.

ఇదియొక అద్భుత విషాదఘట్టము. శ్రీ దాసుగారి దౌహిత్రుడు సూర్యనారాయణునికి మశూచిక వ్యాధి తగిలి సుమారు నెలదినముల నుండి బాధించుచున్నది. దానిని చూచి దాసుగారు భరింపలేక– "తాతా, ఈ వ్యాధి నిన్నువిడిచి నాకు వచ్చిన బాగుండునని యనుకొనుచున్నా" ననిరి. మఱునాటి దినముననే పిల్లవానికి వ్యాధి విడువనారంభించెను. మూడుదినములకే వ్యాధి తగ్గిపోయెను. శ్రీ దాసుగారు చాల సంతోషించిరి. ఆనాడే దాసుగారికి జ్వరము తగిలినది. శాలువ కప్పుకొని మంచముపై పరుండి పరమేశ్వరధ్యానము చేసికొనుచు ఎవ్వారలకు కబురంపవలదని చెప్పిరి. పుత్రిక సావిత్రమ్మ మంచముకడ నిలిచి కంటతడి పెట్టుకొనుచుండగా కొంతసేపటి కామెను గాంచి – 'అమ్మా నేను కోరుకొంటేగాని నాకు చావురాదు. నేను కోరుకొన్నాను. నీవు ఏడ్వవద్దు" అని చెప్పి ఆనాటి రాత్రి ఎట్టి ఆయాసము లేక చిత్త శాంతితో హరినామస్మరణము గావించుచు భీష్ముని వగిది స్వచ్ఛంద మరణము నందిరి. ఆ పరమభాగవతుడు ఆ సంగీత సాహిత్య సార్వభౌముడు బ్రహ్మైక్యమందిన దివసము భక్తిమూర్తి త్యాగరాజస్వామి తనువు చాలించిన పుష్య బహుళ పంచమి; తేది 2-1-1945.

ఆ మహామేధావి, సర్వవిద్యాసాగరపారదృశ్వుడు, సకల కళా సరస్వతీ దరస్మిత చతురాననుడు, సంగీత సార్వభౌముడు, అపూర్వ సాహిత్యద్రష్ట, అ స్రద్రష్ట, హరికథాపితామహుడు, పరమ భాగవతోత్తముడు, అవశ్యము సర్వదా మనకారాధ్యుడు.

ఆయన మనుగడ యొక మహాభారతము.

భక్తిభవ్యము వ్యక్తిత్వమొక మహాభాగవతము.

అపూర్వరసప్రథ హరికథ యొక రామాయణము.

[ఈరచనమునకు తోడ్పడిన "నారాయణదాస జీవితచరిత్రము"ను రచించిన కీ, శే. మరువాడ వెంకటచయనులు గారికి నా కృతజ్ఞతాసహకృత శ్రద్ధాంజలి. —రచయిత]



విజయనగర పుర ప్రజభక్తి దీక్షతో వియ్యమందిన మహావిగ్రహుండు



మ హా మ నీ షి

శ్రీ ఆదిభట్ల నారాయణదాసుగారు

# వ్యక్తిత్వ వైభవము

— కుమారి కె. రాజరాజేశ్వరీదేవి M. Sc.

సహజపాండిత్యధురీణులు, సరసకవితాప్రవీణులు, బహుభాషా వేత్తలు, వాగ్గేయకారప్రపంచవిరించనులు, భావరాగ తాళస్వరశబ్ద ప్రబంధ కల్పనాసమంచిత పంచముఖీశ్వర స్తోత్రసహస్రావధాన ధురంధరులు, స్వవిరచిత నానావిధానేక సంస్కృతాంధ్ర కావ్యోత్తమ సంపాదిత సంపూర్ణ యశశ్చంద్రికాధవళిత దశదిశావకాశులు, హరికథాగానవాగనుశాసనులు, భాగవత శిఖామణులు. కాత్యాయినీ కటాక్షలబ్ధ విభవజ్ఞాన ధనులై, మోక్షసామ్రాజ్యమలంకరించిన "హరికథాపితామహ" శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాసుగారు ఆంధ్రదేశములోని మహా పురుషులలో ఒకరుగ ప్రసిద్ధికొందిరి. కన్నవారిడిన నామధేయము సూర్యనారాయణయే యైనను జ్ఞానమందినది మొదలు పరాత్పరుడైన నారాయణుని హరికథాకథనమున స్తుతించి దాసుడై తదాది నారాయణదాసుగ జగద్విఖ్యాతి నొందినాడు.

ఆయన శతజయంతి సందర్భమున శ్రీస్థానంవారు ప్రస్తావించినట్లు దాసుగారు హరికథా వాఙ్మయానికే ఆదిభట్టు. కావ్యశిల్పానికి కవి సమ్రాట్టు. కథాకల్పనకు ఆటపట్టు. కథావధానమునకు మూలవిరాట్టు. భక్తిపారవశ్యానికి పెన్నిధి. నవరసాలకు కళానిధి. యుక్తిప్రయుక్తులకు మహోదధి. సంగీత సాహిత్యాలకు సరస్వతి. బహుభాషా పాండిత్యానికి పట్టుకొమ్మ. లయబ్రహ్మ.

విద్యలరాణియగు వాణి తన ప్రతిభకు సానపెట్టి మెఱుగులు దిద్దుకొనుటకే పురుషాకృతితో దివినుంచి భువికే తెంచినదా అనిపించుచుండ

వారు ఆకళింపు చేసుకొనని విద్యలేదు. చవి చూడని గ్రంథము లేదు. అని వేరుగ పేర్కొనవలసిన అగత్యము లేదుకదా. సర్వకళలలోను పరిపూర్ణమైన పాండిత్యమును సముపార్జించినను ముఖ్యముగ అనేక హరికథలను రచించి అవ్వానిని ఆడిపాడి జనులకు ముదము గూర్చుటయే ముఖ్యవిధిగ భావించి ఆ హరికథలచేత తానేకాక విన్నవారిని కన్నవారిని కూడ పునీతులను చేయుటయే ఆయన లక్ష్యమైనది కనుక ఆయన హరికథాపితామహుడనియే పేర్గాంచినాడు. కాని నిజమున కాయన కాగిలింపని కళలేదు. చుంబించని శాస్త్రములేదు.

తీర్థంకరులు :- సామాన్యప్రజలకు వేదవ్యాసమహర్షి అష్టాదశపురాణములు లోకోపకారార్థము వ్రాసి ప్రచారము చేసినట్లుగానే శ్రీనారాయణదాసుగారు కావ్యపురాణములను హరికథా రూపములో సామాన్యప్రజల కందుబాటులోనికి తెచ్చిరి. ఈవిషయమును బాల్యదశ నుండి భక్తిభావమును గలిగిన పరమభాగవతోత్తముడైన దాసుగారు తన "వేల్పువంద" అను శతకములో —

"ఆరవ యేట నిన్నరయ నెరవు దెల్పి
వైదిరి కన్న వార్చుచనాకు
అనాటి నుండి నే నాడుచుంబాడుచు
నీపేరు చాటుచుంటి నలు కొసల"

అని చెప్పుకొనిరి. హరికథకు ఆదిభట్టులైన దాసుగారు మధురాతిమధుర గానములో, ఘనగంభీర శారీరములో, హిందూస్థాని మేళవించిన మధుర గాన ఫణితితో, అపూర్వ పల్లవివైఖరిని, లయసిద్ధిని ప్రదర్శించుచు, నృత్య సంగీతసాహిత్య సమ్మేళనమైన హరికథాగానము చేయునప్పుడు అటనొక గంధర్వజగత్తు ప్రగల్భించినట్లుండును. హరికథకు ఇప్పటి స్వరూపము, ప్రజాదరణము, ఆయన వలననే చేకూరినవి. హరికథా పితామహులు హరిదాస జగద్గురువులై, తమకాలి గజ్జెల గలగలతో సహృదయ హృదయాలయములలో గాంధర్వ ఘంటానాదమును ప్రతి

ధ్వనింపజేసెడివారు. భక్తిరసాభిషేకము లొనర్చెడివారు. లోకులకు సుబోధమైన రీతిలో భక్తిమార్గమునుచూపి మార్గదర్శకులైరి. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు దాసుగారి బాహ్యప్రవృత్తి ఏదోవిధముగ గానబడినను వారి అంతరంగము బహునిర్మలమయినది అని ఒక సందర్భములో చెప్పిరి. "వారు పరమభక్తులు, ప్రహ్లాదపరాశర పుండరీక వ్యాసాంబరీష శుకశౌనకాది పరమభాగవతుల శ్రేణికి జెందినవారు" అని వ్రాసిరి. అందువలననే సులభముగ సుగ్రాహ్యమగు రీతిలో సర్వజనానీకమునకు అందుబాటులోనుండు విధముగ పరంధాముని దివ్యకథలను అనేకమైన హరికథల రూపములో తన 80వ ఏటివరకు అలుపన్నది ఎరుగక ఆడి పాడినారు.

మన దేశములో మన సంస్కృతి ఈనాటివరకు ఈ తీరుగానైనా నిలిచియుండుటకు పురాణ శ్రవణము, హరికథా శ్రవణము కొంతవరకు తోడ్పడుచున్నవని చెప్పవచ్చును. చదవనేర్వని వారికైన ధర్మాధర్మ విచక్షణతను చూపుటకు, ప్రాచీన సంప్రదాయములను సుబోధములను గావించుటకు, నిత్యము, దయ, ధర్మము పాటింపజేసి, కర్తవ్య పరాయణులను గావించుటకు హరికథలు, పురాణ శ్రవణాలు, అనేక విధాల తోడ్పడుచున్నవి. అంత ప్రాముఖ్యమును సంతరించుకొన్న హరికథ అను నూతన ప్రక్రియను సృష్టించి ప్రజానీకములో భక్తిని ధర్మనిరతిని పెంపొందించిన మహనీయులు శ్రీ దాసుగారు.

మహాకవి :- దాసుగారు మహాకవియేకాదు విద్వత్కవియును, పదవాక్య పారావార పారీణులు, సర్వతంత్ర స్వతంత్రులు, నిరంకుశులు. "నిరంకుశాః కవయః" అను ఆభాణకమునకు నిదర్శనముగా నిలిచిన వారు. మహాకవి, స్వేచ్ఛాజీవియై తాను చూచినది, తనకు తోచినది, సుందరతరమైన ప్రతిభావనను గ్రంథస్థము చేయును. అతడు ఇతరులు దానిని గ్రహించినను విసర్జించినను మోదఖేదములందడు. ఇది దాసుగారి పట్ల సార్థకత నొందినది. తాను అచ్చ తెలుగున వ్రాసిన గ్రంథ

రాజములలోని సారమంతయు ఇతరులెవ్వరును వెలికి తీసికొనలేరని ఎరిగి యను తనకు ఆమోదమైన మార్గముననే వ్రాసినారే కాని ఇతరు లెరుగ లేరని ఆ తీరు మార్చుకొన ఇచ్ఛగించలేదు. (శ్రీ) వేంకటశాస్త్రిగా రన్నట్లు ఈయన హరికథలు రచించు సమయమునకు అచ్చతెనుగున రచింపవలెనన్న భావన వారికి కలుగలేదు. లేకున్న అవి గూడ మరు గునబడి వెలుగులోనికి వచ్చుటకు చాలకాలము పట్టియుండెడిది. మహా కవుల రచనలు సార్వకాలికములు కనుక దాసుగారి అచ్చ తెలుగు పొత్త ములు ఏదో ఒకనాటికైన సర్వేక్షకు అందుబాటులోనికి వచ్చురీతిగ వెలుగు లోనికి రాకపోవు అని విశ్వసింపవచ్చును. రచన అనేది ఆత్మానందానికీ, మోక్షసిద్ధికే అని భావించిన దాసుగారు ధనార్జనకొరకై మానవ మాత్రులకు తన హరికథలను అంకిత మీయలేదు. ఆత్మవిశ్వాసముతో దాసుగారు 'వేల్పువంకలో' "అయిదేండ్ల బుడతడనై యున్న మొదలు నన్గొరి చదువులెల్ల దారసిల్లె" అని వ్రాసికొన్నారు. కూలంకషమైన వేద వేదాంగ పాండిత్యం వారిసొమ్ము.

"ఋషీణాం పునరాద్యానాం - వాచమర్థోను ధావతి" అన్న శ్రేణికి చెందినవారు దాసుగారు. వాగర్థాలకు నిఘంటువులు, కావ్యాలు లక్షణాలు, లక్ష్యాలు వెతుకవలసిన పనిలేదు. అయన స్మృతిపథాన చెర గని ముద్రవేసికొని అవన్నీ నిలిచిపోయినవి. దాసుగారితో సన్నిహిత సంబంధం కల (శ్రీ) యామిజాల పద్మనాభస్వామిగారు దాసుగారినిగూర్చి "శబ్దశాస్త్ర భంగిమలు రూపొందినట్లు, సాహిత్యపద్ధతులు పొడగట్టినట్లు, రసమూర్తియై కుంజర గమనంతో స్నిగ్ధమధుర నయన విలాసాలతో ఉన్న ఆయన్ని చూసి ప్రకృతి ప్రఫుల్లకల్ప ప్రసూన వర్షం కురిసేది. 'సకల కళావిశారద, శారద, ప్రేక్షకుల పుణ్యఫలంగా దర్శనం ఇచ్చిందా అని తృప్తిపడేది సజీవజగత్తు" అని ప్రస్తావించారు. పరసువేది సోకిన వాని హస్తమున ఇనుము కూడ సువర్ణమై శోభిల్లునట్లు దాసుగారి చేతిలో ఏ చిన్న విషయమైనా కవితగా దివ్యలక్షితమైన కావ్యంగా

మారిపోతుంది. కవిత్వం ఒక దివ్యశక్తి దానిని జగత్కల్యాణం కొరకు ఉపయోగించారు దాసుగారు. ఈ సందర్భమున కవిత్వమును గురించి దాసుగారు తమ నవరసతరంగిణి పీఠికలో వ్రాసిన తమ అభిప్రాయమును నుడువుట సమంజసము. "రసము చెడనీయక యమక పుష్టిగ చెప్పుట — సందర్భశుద్ధిగల పదప్రయోగముతో స్వతంత్రముగ కథను కల్పించి, యపూర్వముగు నూహ దెల్పుట, అతుకుంచక పద్దెము లల్లుట, పండితపామరరంజకముగ మృదుమధురోచిత శబ్దంబుల నొప్పించుపరచుటయు, కవిత్వమున ముఖ్యాంశములు. సర్వసాధారణానుభవమున యధోచితంబుగ నిల్పి జనుల హృదయంబులకెల్ల రసముప్పతిల్లంజేసి నీతినోప్పధించుటయే కవితకు దగు ప్రయోజనము. మనసునకింపగు శబ్దార్థ సమూహము కావ్యమునదగినది. జనులకే శబ్దార్థ సమూహము వలన మనసునకుల్లాసము కలిగి సత్కర్మాచరణమున నుత్సాహము కలుగునో అట్టిది సత్కావ్యము. జనులకు భయ శోకజుగుప్సాక్రోధముల బుట్టించి దుర్మార్గమునకు పురికొల్పునది యసత్కావ్యము." అని కావ్యప్రశంస చేసిరి. ఇంకొకచోట "ఖ్యాతిమీర మంచి కావ్యము న్విరచించి కవి తరించి, లోకమ్మునందరింపించు" నసిరి. ఆయన తమ గ్రంథమున వెలిబుచ్చిన తమ అభిప్రాయమున కనుగుణముగనే తమ గ్రంథములను రచించి మహాకవిగను సత్కవిగను విఖ్యాతి నొందినారు.

వాగ్గేయకారుడు :- వాక్కారులూ, గేయకారులు విడివిడిగ ఖ్యాతి నొందినవారున్నను వాగ్గేయకారులనదగువారు కొద్దిమంది. 19వ శతాబ్దమున ఆవిర్భవించిన వాగ్గేయకారులలో ప్రప్రథములు శ్రీనారాయణదాసుగారు. యాతుధాతు ప్రయోగమును బాగుగ తెలిసినవారు. వాగర్థాలకు పరస్పర సంబంధమున్నప్పటికిని రానురాను అవి స్వతంత్రముగ అన్యోన్యాపేక్ష లేక వర్ధిల్లుచుండుట వలన ఆరెంటిని అకళింపు జేసుకొన్నవారిసంఖ్య బహుకొద్ది ఆరెంటి కలయికతో స్వాతంత్ర్యముగ రచన సాగించి యక్షగాన ప్రబంధాలు రచించి, ఆటపాటలతో ఆంధ్ర సరస్వతి నారాధించి ప్రజారంజన మొనర్చినారు దాసుగారు.

బహుముఖ ప్రజ్ఞాధురీణుడు మేధావి :- దాసుగారివంటి బహుముఖ ప్రతిభాశాలి నభూతో నభవిష్యతి అని చెప్పవచ్చును. దాసుగారి బహుముఖ ప్రజ్ఞలు తెలుసుకొని, వారి ప్రజ్ఞాప్రాభవాలు కొలువదగినవాడు అంతటి ప్రజ్ఞాధురీణుడే కావలయును కాని అన్యుల తరముగాదు. అన్నికళలు, అన్నివిద్యలు, బహుభాషాకవనము, ఏఒక్కరిలో నుండుట అసంభవము. ఒకటిరెండు విద్యల నేర్వవచ్చు. అందు ప్రతిభ గణింపవచ్చు. అది సాధ్యపడు కార్యమే అనదగును. కాని ఒకేసారి స్వయంశక్తితో సర్వకళా పరిపూర్ణుడుగా, బహుభాషావేత్తగా, పేరొందుట అన్నది దాసుగారికే సాధ్యపడినదిగాని ఒట్టిది అనితర సాధ్యమని ఘంటాపథముగ చెప్పవచ్చును. సంగీతం, సాహిత్యం, నృత్యము, కవిత్వము, వేదాంతము, వ్యాకరణము, జ్యోతిష్యం, తర్కము, ఆయుర్వేదము ఇన్నిటిలో ఇంతటివాడు లేడు. అష్టభాషావేత్త. అష్టభాషాకవి. సర్వతోముఖపాండిత్యమంతా సహజ ప్రతిభతో స్వయం కృషిచే సాధించినదే. గురుముఖతః నేర్చిన దేదియును లేదు.

సంస్కృత శ్లోకములను, సంస్కృతపదమును ఉపయోగించకుండ దేశ్యాంధ్రములో (అచ్చతెనుగులో) అనేక కృతులు రచించిన ఏకైక పండితుడు. అద్వైత వేదాంతమునిూద, ఋగ్వేదములోని ఋక్కుల తోను, గ్రంథములు రచించిన ఏకైక గాయకుడు. సమానభక్తితో సొగసుగా హిందూస్థానీ, కర్ణాటక. గాత్రములు మేళవించి పాడగలిగిన ఏకైక వైణికుడు, సమాన స్థాయితో ప్రాచీ భావమైన సంస్కృతము, పారశీకము బాగా అకళింపు చేసుకొన్న ఏకైక బహుభాషావేత్త, అసమానమైన నేర్పుతో సంస్కృతాంధ్రములలో కావ్యములు వ్రాయ గలిగిన మహాకవి, అయిన శ్రీనారాయణదాసు గారొక్కరే ఆంధ్ర దేశములో గత శతసంవత్సరముల కాలములో బహుముఖ ప్రజ్ఞావంతుడు అను మాటకు సర్వవిధముల లక్ష్యభూతుడు. ఆత్మానందము కొరకు మాయన తీసిన కూనిరాగముకూడ గాన కళ ప్రాణ స్నాయువులంటు

చుండెడిది. తోచినట్లు వ్రాసినదంతా సాహిత్యమయ్యెడిది. రంగస్థలముపై హరికథాగానము చేయునప్పుడు వారుచేయు యదృచ్ఛాపదవిన్యాసమొక యపూర్వ శాస్త్రీయ నృత్యవిలాసము. ఆయన స్వభావసిద్ధముగ అలవోకగా పలికిన పలుకెల్లనొక హాస్యసారస్యము. తలచిన తలపెల్ల భక్తి తాత్పర్య సురుచిరము, కవిత్వకళా సురభిళము.

ఆత్మవిశ్వాసము :- దాసుగారిలో ప్రధానముగా భాసించునది, ఆయన ఆత్మవిశ్వాసము. అదియే వారి మనుగడకు శ్రీరామరక్ష. తాను స్వయంకృషితో సాధించలేని విద్యయేది లేదని ఆయన విశ్వసించి జీవితయాత్ర సాగించిరి. జన్మతః శక్తిసామర్థ్యములు కలవారు మాత్రమే ప్రజ్ఞా పాటవముతో భాసిల్ల గలరని ఆయన దృఢవిశ్వాసము. వారు గురుముఖమున ఏదీ నేర్చుకొనలేదు. వారి ఆత్మ విశ్వాసమును క్రింది ఉదాహరణలు చాటి చెప్పును.

1. 1884 లో ఆయన బరంపురమందు శ్రీ జయంతి కామేశం పంతులుగారిని దర్శింపనేగెను. కామేశం పంతులుగారు పేరుమోసిన న్యాయవాది, గీర్వాణాంధ్రములలో పండితుడు, కవి, సంపన్నుడు, సరసుడు, సంగీత సాహిత్య పోషకుడు. ఆయన దర్శనమునకు దాసుగారు పోయినప్పుడు ఆయన దాసుగారిని "మీరెవ్వరు మీదేయూరు"ని సంస్కృతమున అడిగిరి. దాసుగారును సంస్కృతమునందే తన యూరు పేరు చెప్పి తాను మనుష్యరూపమును దాల్చిన గంధర్వుడనని చెప్పెను. దాసుగారికి ఎంత ఆత్మవిశ్వాసమున్నదో కదా ఇట్లు పలుకుటకు.

2. దాసుగారు పిఠాపురంలో రాజావారి సమ్ముఖములో కథలు చేసి బాగా సన్మానింపబడిరి. మహారాజావారు మొదటికథకు 300 రూప్యములు దాసుగారి దోసిటపోసి "మీకు సంతుష్టేనా ? 'అసంతుష్టోద్విజో నష్టః' అన్నారు" సుమండీ అనగా అందుకు దాసుగారు "సంతుష్ట యివ పార్థివ" అనెను. అదివిని రాజుగారు కడుపుబ్బనవ్వి, వారు గవర్నరుల సభలో ధరించుటకై తయారుచేయించుకొన్న ముఖమల్ కోటుమీద

దాసుగారి చూపుపడుట గ్రహించి వెంటనే ఆయనకు తొడిగి "ఇప్పుడు సంతుష్టేనా" అనెను. దానికి దాసుగారు "నాకు ఎప్పుడు సంతుష్టే ఒక రన్నమాటకు పై మాటనుట నా స్వభావము, క్షమించవలెను" అన్నారు.

3. రాజమహేంద్రవరంలో న్యాపతి సుబ్బారావు పంతులుగారు దాసుగారిచేత అష్టావధానము చేయించెను. ఆ సభలో కందుకూరి వీరేశలింగం పంతులుగారు, వడ్డాది సుబ్బారాయుడుగారు, మొదలగు పండితులుండిరి. తక్కిన అష్టావధానములవలె అన్నిపనులుచేయుచుండగా, రెండు తాళములతో పల్లవి పాడుట, దాసుగారి అవధానములోని విశేషము. కాళిదాసు శాకుంతల నాటకములోని "యథాలోకే న్యూత్మ్యాం" అను శ్లోకమును తెలుగు చేయుడని శ్రీ వీరేశలింగం పంతులుగారు కోరిరి. దాసుగారు ఒక కందపద్యములో చెప్పగా పద్యము బాగున్న దని, రథవేగముస్ఫురించుచున్నదని పంతులుగారు సంతోషించిరి. అవధానము బాగున్నదని అందరును శ్లాఘించిరి. అప్పుడు పంతులుగారు శ్రీ వీరేశలింగంగారిని "మీరు కూడ ఈ శ్లోకమును తర్జుమా చేసినారు కాబోలు ఆ పద్యము చదువు" డనిరి. ఆ అనువాదమును విని దాసుగారు "చూచితిరా, నే నొక చిన్న పద్యములో చెప్పితిని మీరు రెండు పద్యములు దండుగపెట్టినారు. మరియును ఇంగ్లీషు భాషనుండి అనువదించునపుడు ఆ భాషాపదము వాడుట అనునది ఎట్లొప్పదో, సంస్కృత మనువదించు నప్పుడు సంస్కృతపుమాట రానీయకూడదని" ఆక్షేపించిరి.

4. మైసూరు మహారాజావారు వారి ఆస్థానములో, దాసుగారు చెప్పిన హరికథలు విని సంతోషించి "మీరు మా దర్బారులో సర్వీసు చేయగోరెదరా" అనిరి. దాసుగారు "నాకక్కరలేదు, మర్త్యులం గొల్వ నొల్లను" అనిరి. రాజావారి కందోయి కొంచె మెఱ్ఱబడెను. కాని, అవును మీరు స్వేచ్ఛగా నుండదలచితిరి" అనిరి. తిరిగి "ఎందరెందరి పాటలో వింటినిగాని మీవలె హిందూస్థాని కర్ణాటములు జోడించి పాడ నేర్చినవారు కానరాలేదు" అనిరి. మీరెక్కడ సంగీతము నేర్చితిరన్న

ప్రశ్నకు దాసుగారు నా సంగీత సాహిత్యములు నా సహజ పాండిత్య ఫలితములే కాని ఒకరికడ అభ్యసింప సిద్ధించినవి కాదనెను.

5. ఒకసారి, ఆంధ్రవిశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులగు Sir C. R. రెడ్డిగారు మెయిలులో వాల్తేరు వెళ్ళునపుడు విజయనగరం పురప్రముఖులు వారిని చూచుటకై స్టేషనుకు వెళ్ళిరి. శ్రీదాసుగారు కూడ ఆసమయమందట నుండుట తటస్థించినది. వారు విశ్రాంతి గదుల సమీపమున రాతి స్తంభమునకానుకొని, తన కర్రమీద గడ్డమానించుకొని, చూచుచు నిలబడిరి. వారిని చూచి రెడ్డిగారు, దగ్గరకువెళ్ళి కుశల ప్రశ్నలువేసి "ఏమి ఇటువచ్చితి" రనగా "ఏదో Vice chancellor గారు వెళ్ళుచున్నారుగదా, చూడవచ్చితి నందరితోబాటు" అనిరి దాసుగారు. దానికి రెడ్డిగారు "మేమేమి Vice chancellors మండి! You are the University itself". (మీరే విశ్వవిద్యాలయము) అని నుడివిరి. అప్పుడు దాసుగారు "ఆసంగతి మీకు తెలును నాకు తెలును, కాని వచ్చిన పెద్దమనుష్యులకు తెలిసినట్లు లేదు. వారికి చెప్పండి. నేను కుక్కనో, పందినో, పండితుడనో వారికేమీ పాలుపోలేదు" అని పలికిరి.

6. ఒకసారి దాసుగారికి వయస్సుమీరిన తర్వాత ఒకానొక వ్యక్తి "ఏమండీ దాసుగారు ఎందుకు మీసాలు ఇంకా అలాగే పెంచుతున్నారు" అని అడిగారు. అప్పుడు వారు "అరేయ్ నా మరణానంతరం ఆంధ్రదేశానికి మీసం పోయిందని ప్రజలు అనుకోవాలిరా! అందుకురా మీసాలు ఇలాగ పెరుగుతున్నాయి" అని బదులిడిరి.

7. ఆయన సభలలో రెండు చేతుల బంగారు సింహ తలాటాలు గంటలు కదిలించి "ఇది సంగీతమునకు ఇది సాహిత్యమునకు ఎవరైనా నే చెప్పు సమస్యలువిడగొట్టి నన్ను మెప్పిస్తే ఇవి వేస్తాను" అని challenge చేసేవారు.

8. దాసుగారు గొప్ప విమర్శకుడు. ఆశక్తి ఆయనకు బాల్యము నుండి యుండెను. ఈ సహజ శక్తితో వారు ఏ సభలయందైన, వారున్నారు, వీరున్నారు అను జంకులేకుండ, రాజాస్థానములయందేమి, పెద్ద పెద్ద ప్రభుత్వోద్యోగులు, కలెక్టరులు, జడ్జీలు, మంత్రులు నున్న సభలందేమి, పేరుమోసిన పండిత ప్రకాండులు, వైయాకరణులు, నున్న సభయందేమి తమకుతోచిన విధముగ విమర్శలు జరిపేవారు. అప్పుడు వారిని "ఏమండి సభకువచ్చిన వాళ్ళను అలాగ దుయ్యబట్టితే వాళ్ళేమీ అనుకోరా?" అంటే, ఒరేయ్ ఎవ్వరు ఏమీ అనుకోరు. నా దేవి వాళ్ళ నోళ్ళు కట్టేస్తుంది. నేనూ అందరిలాగ ఊరకుంటే, యీ లోకంలో మంచిచెడ్డ చెప్పేవాడెవరా" అని చెప్పేవారు.

ఆయన ఆత్మవిశ్వాసాన్ని, స్వయంప్రతిభను, సంగీత సాహిత్య ధురీణతను, వ్యదగ్గింపగల ఉదాహరణలు ఆయన జీవితంలో కోకొల్లలు. స్థలాభావమువల్ల పై కొద్ది ఉదాహరణలే వ్రాస్తాకించితిని.

యథాలాభ సంతుష్టి :- దాసుగారు, ధనార్జనపై అభిలాష గలిగియుండెడివారు కాదు. వచ్చిన దానితో సుఖజీవనము సాగించిరి. డబ్బు కాపీనముండెడిది కాదు. ధనసంపాదన విషయమందు, వ్యవహార జ్ఞాన ముండెడిది కాదు. వారి అన్న పేరన్నగారే ఆయనను కనిపెట్టుకొని యుండని యెడల వారి లక్షల సంపాదన యేమయి యుండెడిదో ఊహించ లేము.

వారు హరికథలను, మానవుల కంకిత మివ్వలేదు. అనేకులు వారినుండి, కృతి పొందుటకు, ధన ధాన్య వస్తు వాహనాదుల ఆశలు పెట్టినను, దాసుగారు వారిని ఆ ప్రయత్నమునుండి విరమింపజేసెడివారు. వారి కథలలో చివర ఈ విధముగ అంకిత మిచ్చుట గలదు. "గానకవితా విధాన నిధానులగు మహాత్ములార, దయతో గనుడీ, దాని రచించి, కృష్ణాధీనంబుగ, ఈశాధీనంబుగ కృతి నొసంగితి, మోక్షేక్షన్". 1912-

1918 సం॥లో రీవారాణీగారు దాసుగారిని కోటకు పిలిచి 3, 4 కథలు విని సత్కరించెను. రుక్మిణీకళ్యాణము కథవిని సంతోషము పట్టలేక "కోరు కోండి దాసుగారు" అనెను ఆవిడ ఎంత డబ్బునైన, భూదానమైన, గృహములనైన, ఆ సందర్భమున ఈయ సంకల్పించెను. అందుకు దాసు గారు, ఆ లోభమునకు లొంగక "పరమేశ్వరునిపై భక్తి కోరుకొంటు న్నాను, ఈశ్వర కటాక్షముకన్న కోరదగిన వస్తువు లేదు." అని బదులు చెప్పగా ఆవిడకొంచెము చిన్నబుచ్చుకొని వారికి ద్రవ్యాపేక్ష లేకపోవుట గాంచి అచ్చెరువందినది. అప్పటికిని ఒక జరీసంచిలో పెద్దకాసులుపోసి దాసుగారిని సత్కరించెను ఒకమారు, రీవారాణీగారి సమక్షంలో హరి శ్చంద్ర హరికథ చెప్పగా, ఆమె ఆ యా సన్నివేశములందు, అమితముగా కంటతడిపెట్టవలసివచ్చెను. "ఈమారు కథ చెప్పునపుడు మమ్ములను దుఃఖంప జేయకుండ యుండేకథలను చెప్పుడు" అని కోరెను. దాసుగారి యథాలాభ సంతుష్టి, స్వేచ్ఛానురక్తియు వారిని ఇంతికన్న మిన్నగ అఖిల భారత దేశ మహాపురుషునిగ పరిగణనను పొందుటకు అడ్డువచ్చిన వని తలపోయ వచ్చును.

దాసుగారికి H. R. Bardswell అను దొరగారు సన్నిహిత స్నేహితులు. వారు విజయనగరంలో Sub collector గా నుండి పిమ్మట హైకోర్టు జడ్జి చేసిరి. తరువాత పుదుక్కోటకు chief justice గా నున్న కాలమున దాసుగారిని పిలిపించి, ఆయన కథకు టిక్కెట్లుపెట్టి, కొన్ని వేల రూప్యములను ఆయనకు బహూకరింపవలెనని సంకల్పించిరి. దాసుగారు పుదుక్కోట రాజావారి సమక్షమున కథ చేయుట కంగీకారమేకాని Tickets పెట్టి కథను చెప్పనని పట్టుపట్టిరి. అప్పటికిని ఆ దొరగారు రాజులు ఇచ్చే బహుమతులు స్వల్పము, Tickets వల్ల బాగా ధనము వచ్చునని పలికినను కోటలో కథ చేసితినన్న గౌరవము తప్ప వేరేమియు అక్కరలేదు" అని చెప్పిరి.

దాసుగారి హరికథలు కొంతమంది ఆ పీర్రైటుకు అచ్చువేయించు టయు, వారి కీర్తనలు రికార్డుచేసియు చాల ధనము సంపాదించిరి. దానికై వారు Court కు పోగా ఆ మునసబుగారు దాసుగారికి బాగా ధనము Damages క్రింద ఇప్పించవలెననుకొను సమయమున ఆతప్పు చేసిన ఆసాములు దాసుగారిని స్వయముగ కలుసుకొని క్షమాపణ చెప్పుకొనగా చాల చిన్న మొత్తము తీసికొనిరో, ఏమీ తీసుకొన కయో, వదలివేసెడివారు.

ఒకసారి భూములు వేలము పాటపాడుటకై వెళ్ళి తమ పాట మీద పై పాటయుండుటచూచి దాసుగారు ముందుకు వెళ్ళి నాపాట మీద పై పాట యుండకూడదని ఉన్న పాటకు రెండింతలుచేసి పాట పాడిరి. అప్పుడు ఆయన చేసినదానికి, అందరును నిర్ఘాంతపోయిరి. బజారుకు వెళ్ళుచు, ఏదైన మంచివస్తువు కనబడిన అదియెంత వెల యైనను, పుచ్చుకొని ఆనందించెడివారు. మొత్తముమీద వారు ధన సంపాదన ఎటులవచ్చెడిదో ఎటులపోయెడిదో గమనించెడివారు కారు.

దాసుగారి జీవితములోని మరికొన్ని విశేషములు :- దాసు గారు 'నాయెఱుక' అని తన జీవితచరిత్రలో ఈరీతి నుడివిరి. "నాకురెండు వ్రతములు, అబద్ధమాడకుండుట, జీవహింస చేయకుండుట" అని, ఈసత్య వ్రవచన సూత్రమువల్ల తమకు తోచినది నిష్కర్షగా చెప్పుటవలన అనేకులకు దూరమైనారు. జీవహింస అనునది ఆయనకు ఎంతగ సరి పడెడిదికాదో ఆయన పద్ధతుల వల్లనే తెలియును. చర్మముతో చేసిన పాదరక్షలు ధరించెడివారు కారు. కొమ్ముదువ్వెనలను, దంతపుదువ్వెనలను గాక మంచిగంధపు దువ్వెనలనే వాడేవారు.

చిన్నతనముననే అనేకపదములు కంఠస్థముచేసి శ్రావ్యముగ చదువుట, యెవరే పాట పాడినను, వారి ననుకరించి పాడుటయు, గ్రామ దేవత పండుగలలో వాయించు డప్పుల లయకు ఆడుటయు ఈయనకు

సహజములు. చిరుతప్రాయమందే అసాధారణ ప్రతిభాశాలి కాగలడు అని అనిపించుకొనెడివారు. పూవుపుట్టగనే పరిమళించుట సహజముకదా! ఆయన అయిదేండ్ల ఎలప్రాయమందే మొట్ట మొదటగా తన విద్యచే భాగవత గ్రంథమును సముపార్జించుకొన్నారు.

వింతలుచూచి ఆనందించుట, వింతపనులు చేయుట, నిర్భయ ధైర్య సాహసములతో తమ స్వబుద్ధి కేల్లు తోచిన అట్లు చేయుట, ఈయనకు బాల్యాదిగానున్న అలవాట్లు. దేహబలమునకు సరిపడు బుద్ధి పాటవము, జ్ఞాపకశక్తి, పరిశోధనాశక్తి, స్వతంత్రేచ్ఛ, కనికరపు డెందము, నాతనికి మొదటినుండియు నైజగుణములు. దాసుగారొకచోట "నాకు నిష్కారణప్రేమయు, అకారణ వైరము నైజగుణముల"ని చెప్పకొనిరి.

బాగా వయసుమీరిన పిమ్మట వారి అన్నగారి ప్రోద్బలమువల్ల విజయనగరంలోని ఆంగ్ల పాఠశాలలో చేరెను. అందుచేత చిన్ననాడే ప్రవేశించిన పిల్లలందరి కన్న ఈయన పెద్దవాడు. గణిత శాస్త్రమందు బుద్ధి కుశలత కలవారు. ఇంగ్లీషు సులువుగా నేర్చుకొని అధ్యాపకుల మెప్పు వడసి, డబుల్ ప్రమోషన్‌లు పొంది త్వరగా మెట్రిక్యులేషన్ పరీక్షయందు తీర్ణుడాయెను.

అప్పటి విజయనగరం విద్యల నగరమనిపించుకొన్నది. అన్ని రంగములలోను దిగ్గంతులైన పండితులుండెడివారు. అట్టి పురమున దాసు గారికి బడిచదువుకన్న సంగీత సాహిత్యములలో ప్రావీణ్యము అభివృద్ధి పొందుచుండెను. తాను విన్న పాటను వినినదానికన్న ఇంపుగ అనేక రాగములందు పాడుట, నిరాఘాటముగ, కవిత్వము చెప్పుట అలవరచు కొనెను.

ఒకసారి దాసుగారు రాత్రింతా సంగీతసభలలో ఆనందించి ఉదయము క్లాసులో బోర్డు వెనుక నిద్రించెను. క్లాసు ప్రారంభమై లెక్కలు

మాష్టారుగారు Equation చెప్పుచుండెను. కాని ఆలెక్క 2, 3 steps లో రావలసినది రాక ఆయన ఆలోచించుచున్నంత దాసుగారు మేల్కొని అప్పుడు ముందుకువచ్చి ఆ లెక్కను 3 steps లో వేసి చూపించి ఆయన మెప్పు బడసెను. ఆయన ఏకగ్రంథాగ్రాహి అగుటచే క్లాసులో తెలుగు పద్యములు అవి చదువకయే మొదటివాడు చెప్పినది విని అప్పజెప్పెడివారు. తన 20 వ యేట హరికథా గానమొనరించి అది మొదలు హరినామకీర్తనయే జీవిత ప్రధానలక్ష్యముగా అప్పటినుండి క్రమముగా నారాయణదాసు అను నామముతో లోకప్రసిద్ధుడాయెను. ఉద్యోగవాంఛ లేక తన యిష్టము చొప్పున ఆడుచు పాడుచు హరికథా కాలక్షేపముచే జీవితము గడుపుకొనుచు స్వేచ్ఛాజీవనము చేయుటే పరమావధిగా నెంచెను. వీరు "గానము కవిత్వము మాతృగర్భమునందే సంపాదించుకొనిరి" అని వెంకటశాస్త్రులవారు చెప్పెడివారు. పూర్వజన్మ సంస్కారమునకు తోడుగా ఆయనకు లోకమే ఒక బడియు, సరస్వతియే యొక యొజ్జయు ఆయెను. F. A. లో కాలేజీ చదువుమాని స్వగ్రామమందున్న సమయములో రాత్రి 9, 10 గంటల నుండి వేకువజామువరకు ఆముదపు దీపపువెలుగులో ఏదో ఒకటి చదువుచుండెడివారు. ఈరీతి 60 వత్సరములవరకు గ్రంథములసారము గ్రహించి తన మేధాశక్తితో అనేక భాషలు శాస్త్రములు సాధించెను. "నేచదువని సంస్కృతగ్రంథమున్నదా" అని చెప్పగలిగిన సాహిత్య జ్ఞానమలవరచుకొనెను.

"క్షణశః కణశశ్చైవ విద్యామర్థంచ సాధయేత్
క్షణత్యాగే కుతోవిద్యా, కణత్యాగే కుతోధనమ్."

అన్నది సార్థకపరచుకొనుచు, క్షణకాలము వృథాకాకుండ అనేకగ్రంథాల రసమును గ్రహించగలిగినారు. 80వ పడిలో దినమంతా చదువుచు చీకటి పడగనే శిష్యులకు రోడ్డుమీదనే పాఠాలు చెప్పుచు వాహ్యాళికి వెళ్లెడివారు. తన చదువు తన యానందము కొరకు, సదసద్వివేకము

కొరకుగాని ఇతర ప్రయోజనముల కొరకుగాదని వారి భావన. ధనార్జన కొరకు విద్య నభ్యసించుట ఆయనకు గిట్టనివని.

దాసుగారి నొక్కసారి కలిసి మాట్లాడిన వారెవరైనను వారి అనన్య సాధారణమైన ప్రతిభకు జోహార్లర్పింపక యుండలేరు. వారి రమ్యమైన వాగ్ధాటికి మురియని వారుండరు.

విద్యాపోషకులని, పేర్గాంచిన విజయనగరం మహారాజావారు సంగీత కళాశాలను నెలకొల్పి అద్దానికి దాసుగారిని ప్రిన్సిపల్‌గా నుండుడని కోరగా "నాకు అప్పుడే 57 సంవత్సరములు, నాకు ఉద్యోగవాంఛ లే"దని చెప్పినను రాజావారు పట్టుపట్టి "మీవల్ల మా కళాశాల అభివృద్ధి నొందును. మీ కిచ్చవచ్చి నన్నాళ్ళు చేయవచ్చును. హరికథావ్యాసముల మన్నించి మీ ఇచ్చ వచ్చిన రీతిని వెళ్ళవచ్చును." అని ఆయనను ప్రిన్సిపాల్‌గా నుండవలెనని అభ్యర్థింప దాసుగారంగీకరించి 1919 నుండి 1936 వరకు ఆ కళాశాల నతిసమర్థులయంగా నడిపిరి.

దాసుగారికి పంచముఖి పరమేశ్వర "అను బిరుదుకలదు. పూర్వము సుబ్రహ్మణ్యయ్యరు అను దాక్షిణాత్యుడు, రెండు చేతులతో రెండు తాళములు వేయుచు, పల్లవి పాడి అందుకు సువర్ణ ఘంటాకంకణము బహుమతిగా పొంది, ఆంధ్ర దేశ సంచారము చేయసాగెను. ఆయన ఆ సందర్భమున విజయనగరం వచ్చెను. ఈదేశమున ఒక తాళముతో పల్లవి పాడుటయే గొప్ప. దాసుగారు విజయనగరంలో సభ చేయించి పండితుని ప్రశంసించి "3 లేక 4 తాళములతో పాడగలరా" అని అడుగ ఆవిద్వాంసుడు "నావలె 2 రెండు తాళములలో పాడువాని నేనెక్కడ చూడలేదు. అట్టివాడున్న నావీరఘంటాకంకణము తీసివేసెద" ననెను. దాసుగారు బందరులో అష్టావధానము సల్పునప్పుడే 2 తాళముల పల్లవి సాధించెను. తరువాత 3, 4, 5 తాళములతో పల్లవిపాడి చూపించగా ఆవిద్వాంసుడు మిక్కిలి ముదమంది తన వీరఘంటాకంకణము విప్పివేసి

దాసుగారికి సమర్పించి నమస్కరించెను. దాసుగారు పంచముఖిశ్వర తాళమును, 16 స్వరములతోను, తానము, పల్లవి, శబ్దము, ముక్తాయింపు చక్కగ చేసి ప్రదర్శించుటచే పంచముఖిశ్వరుడని బిరుదునందెను. ఆసువర్ణ ఘంటాకంకణము తిరిగి ఆపండితునకిచ్చివేసెను.

1900 సంవత్సర ప్రాంతమందు ఉర్దూ నేర్చుకొనుటకై పుస్తకములు తెప్పించి ఒకమున్షీ సహాయమున, లిపి మాటలు, వ్యాకరణ విశేషములు, తెలిసికొని క్రమముగ స్వయంకృషితో ఉర్దూ, పారసీ, అరబ్బి భాషలను నేర్చుకొనెను. వారు కలకత్తాలో కథ చెప్పేటప్పుడు సంస్కృతములో కథచెప్పి హిందీలో తర్జుమాచేసి ఆదేశ ప్రజలను రంజింపజేసేవారు.

ఆయన కథ చెప్పునపుడు ముందుగా సభ్యులను పరీక్షించి చూసి అందు ఏరంగమందైనను ప్రతిభ గడించిన వారున్నట్లు తోచిన వారికి తగ్గట్లుగ తన ప్రతిభను ఆరంగమందు కూలంకషముగ ప్రదర్శించేవారు. సర్వకళానిధి, బహుభాషా పారీణుడు, సర్వశాస్త్రవేత్త యయిన దాసు గారికి రానివిద్య, ప్రవేశములేని రంగము లేదుకదా! ఆయన కథలు ఒకదానికొకటి సంబంధములేక ప్రతిది కొంగ్రొత్తగా, రసస్ఫూర్తితో నుండెడివి. ఒకసారి పాశ్చాత్యులున్న సభలో, నీలగిరిలో పాశ్చాత్య నాట్యభణితులను ప్రదర్శించి వారిని ఆశ్చర్యాంబుధిలో ముంచిరి. ఒక సభలో శ్రీశ్రీశ్రీ కళ్యానందభారతీ స్వాములవారుండుట తటస్థింప ఆనాడు, బ్రహ్మసూత్రములు, ఉపనిషత్తులు అవి ఏకరువుపెట్టి వారిని ముగ్ధులను గావించిరి. కవితారసము నానందించువారిని కవిత్వముతోను, సంగీతజ్ఞులను తన సంగీత ప్రతిభతోను, లయబ్రహ్మలను లయజ్ఞానము తోను, ఏమియు నెరుగనివారిని చమత్కార సంభాషణలవల్లను, ఉల్లాసపరచి, పండితపామర జనరంజకం చేసేవారు. వారు ఈ రీతి 60 సంవత్సరములు ఆంధ్ర దేశమంతటను మహారాజుల ఆస్థానములు మొదలు మారుమూల గ్రామముల వరకును ఆడిపాడి ప్రజల మన్ననలనందుకొనిరి.

వారి అవసాన సమయము సమీపించుచునప్పుడు రాజమండ్రి పౌరులు వారిని ఏనుగు నెక్కించి ఘనముగా సన్మానించవలెననుకొనిరి. అప్పుడు వారు 80_వ పడిలోనుండిరి

"నాకివ్వా డివన్నీ ఎందుకు? గజారోహణాలు, సన్మానములు నా జీవితములో చాల అయినవి. అందుచేత, నేను హరికథలు మొదలుపెట్టి 60 సంవత్సరములయినది. ఆ కళకు షష్టిపూర్తి చేయండి; మీఅందరితో పాటు ఆ వేడుకలో నేనును పాల్గొని సంతోషిస్తాను." అన్నారు. కాని ఆ వేడుక ఇంకా 10 రోజుల్లో జరగబోవు చుండగనే ఆయన హఠాత్తుగ తనువు చాలించిరి.

దాసుగారు చిన్న విద్వాంసులను వెనుక వేసుకొని దంభవిద్వాంసుల నధిక్షేపించు చుండెడివారు. ముఖప్రీతి మాటలు, ఇచ్చకములు ఆయన యెరుగరు, సహించరు. ఎవ్వరేమనుకొన్నను తన మదిలోనిమాట నిర్భయముగా జంకుగొంకు లేకుండ వెల్లడిచేసెడివారు. ఇట్టి గుణములు లోకసమ్మతములుగావు కాన కొందరు బాహాటముగ ఏమీ చేయలేక పోయినను చాటుమాటున నిరసించుట కలదు.

వారు అద్వైతశిఖామణులు. ఉపనిషద్ జ్ఞానసంపన్నులు. పర తత్వవేత్తలు. భాష్యసాహాయ్య మవసరము లేకయే కేవలము మూలము నాధారముగ చేసికొని స్వతంత్ర బుద్ధిచేతనే వారు తత్వమును గ్రహించిరి. కథలు చదివినట్లే అంత సునాయాసముగా ఆఉద్గ్రంథములను చదివెడివారు. వారు ఏకాగ్రతతో ఏ గ్రంథమైన ఒకసారి చదివినచాలు; మరల దానిని పఠింపనవసరము లేదు.

ఒక్క కళలో కొంత ప్రవేశమున్న వారికే విశ్వవిద్యాలయము వారు 'కళాప్రపూర్ణ' బిరుదునిచ్చుచుండగా సర్వకళా ప్రపూర్ణులగు దాసుగారికి ఆ బిరుదునిచ్చి ఏల సత్కరింప లేదు? ఆ బిరుదు పొందదగిన వ్యక్తి (శ్రీ) దాసుగారు ఒకరే అనదగునని (శ్రీ) చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి

గారు సెలవిచ్చిరి. ఆ బిరుదమునకు, జగత్కావ్య స్రష్టయైన భగవంతు డొక్కడే అర్హుడని దాసుగారి విశ్వాసము.

ఆయన తమ పాండిత్యమును, మేధాశక్తిని, సంగీత సాహిత్య వైభవమును గుర్తెరిగిన ఆత్మజ్ఞులగుటచే ఒకరి కధీనులు కాక జీవించుచుండ కొందరు ఆయనను గర్విగా నెంచినను, ఆయన వ్యక్తిత్వమున కలరుచు, ఆయన బహుముఖ పాండిత్య ప్రతిభలను, కొనియాడువారును లేకపోలేదు.

మనః ప్రవృత్తి :- పై విషయములవల్ల దాసుగారి మనః ప్రవృత్తి కొంత విదితమే. చిన్ననాటినుండియు స్వాభావసిద్ధముగ నుదయించిన అంతర దైవభక్తియు, స్వేచ్ఛానురక్తియు, క్రమముగా పెరుగుచునే యుండెను. ఒకరి కట్టుబాట్లకు లోనుగాక, స్వేచ్ఛా జీవనముతో సహజముగా అబ్బిన విద్యల నభివృద్ధి పరుచుకొని, లోకులకు హరిభక్తి నుపన్యసించుచు, సంఘములోని పశుహింస, బాల్యవివాహ, కన్యావిక్రయములు మొదలగు దురాచారములు నిర్భయముగా ఖండించుచుండెను. అందరికన్న మిన్నయైన మేధాశక్తితో, సంగీత సాహిత్య వైభవమును గుర్తెరిగిన ప్రజ్ఞాశాలియగుటచే ఒకరి కధీనుడుగాక తనజీవితమును తన కిచ్చవచ్చిన తీరున నడిపించుకొనెను. అందువలన కొందరాయనను గర్విగా నెంచినను, విచక్షణులగు వారందరును, ఆయన వ్యక్తిత్వమున కలరుచు ఆతని బహుముఖ పాండిత్యమునకు లొంగిపోవుచుండిరి. ఆయన యంతఃకరణము బహునిర్మలము, దయాపూరితము. బీదలపై కనికరము గలిగి తనవద్ద డబ్బు లేకపోయినను బజారులో ఒక వర్తకుని యొద్ద వాడుకొని తోచిన ధర్మము చేయుచుండెను. కోటలో తనకిచ్చు పండిత వేతనము ఆ వర్తకుని అప్పుదీర్చుటకే వ్యయమగుచుండెను. అన్నగారు బోను పెట్టి, పందికొక్కుని పట్టుకొనిన, దాసుగారు మూతతీసి దానిని వదలివేయుచుండెడివారు. విజయనగరమున జ్యేష్ఠమాసమున రెండు [illegible]యాత్రలు జరుగుచుండును. దాసుగారానాడు పదిరూపాయలు [illegible]గామార్చి

కంచువాలో కట్టుకొని, దారి కిరు ప్రక్కల నున్న బిచ్చగాండ్రకు పంచెడి వారు. ఒకపరి యొక బెస్తవానికడ సజీవ మత్స్యములను జూచి వానిని వెలయిచ్చి కొని వెంటనే నీళ్ళలో వదలివేసెను. బజారులోని పేదవర్తకులం పావలా చొప్పున చందా జమచేసి పాతికరూపాయలిచ్చిన చాలునని కృష్ణాష్టమికి గంటస్తంభమునద్ద హరికథ చెప్పెడి దాసుగారు శ్రీ పేర్ల రామమూర్తి సెట్టిగారను గొప్ప సాహుకారు తన యింట పెండ్లికి హరికథ చెప్పవలసినదని కోరంగా అర్ధవెయ్యి నూటపదహార్లు యిచ్చినంగాని చెప్పనని కోరిన కట్నము పుచ్చుకొనెను. అట్లే విజయరామగజపతి పట్టాభిషేక సందర్భమున మైసూరునుండి వచ్చిన విద్వాంసుని కిచ్చిన కట్నమునకు తక్కువలేకుండ బహుమతిపొంది తన హరికథ విన్పించెను. దాసుగారికి బీదలపై ఎంత కనికరమో ధనికులయెడ అంత నిర్లక్ష్యముండెడిది.

శ్రీ దాసుగారు పరువు మర్యాదలు నిలబెట్టుకొనుటకై దేవులాడు స్వభావము కలవారు. ధనార్జనమునకై ఎవరినైన ఉపమలు ఉత్ప్రేక్షలు పెట్టి పొగడుట యెన్నడు లేదు. శ్రీ దాసుగారు హరికథా సందర్భమున తనవారు, పైవారు, గొప్పవారు, కొద్దివారు అను భేదములేకుండ తాను కనిపెట్టిన దొసగుల పైకిబెట్టి, తన స్వతంత్ర ధోరణిలో వ్యక్తిగతము గాకుండ ఆక్షేపము చేయుచుండుటచేత హరికథకు పిలిపించిన వారినే దుయ్యబట్టునను అపవాదుకూడ లోకముననున్నది. కాకినాడ గానసభలో ఒకప్పుడు జనము క్రిక్కిరిసి వినుచుండగా ఒక జమీందారుడు పెద్దలందరిని త్రోసుకొని ముందునకు బోయి కూర్చొని కొద్ది సేపటికే లేచి వెళ్ళిపోయెను. దాసుగారది చూచి "పుట్టగానే చచ్చినట్లు - తానీ లోకమున కేలవచ్చెనో యే మనుభవించెనో యా పరమేశ్వరునకే ఎరుక అని" తర్కించెను సభ్యులందరు నవ్విరి. బాపట్లలో ఒక హరికథవిన్న సబ్ జడ్జిగారు "మీ తల్లిదండ్రుల ఆశీర్వాద బలమెట్టిదో కాని యీ ముదివయసులో బ్రహ్మాండముగా ఆడుచు పాడుచు మూడు నాల్గు గంటలు హరి

కీర్తనము చేయుటకు బలముకలిగియున్నారు" అనగా దాసుగారు "నేను చిన్నతనములో పోకిరినై తిరుగకుండిన యెడల నింకను బలముండును కాబోలు" అనియెను. రాజమహేంద్రవరమున ఒకనాడు హరికథ విని డాక్టరుపాలకోడేటి గురుమూర్తిగారు "ఈ పెద్ద వయసులో అంత బ్రహ్మాండమైన కంఠధ్వనితో పాడుట మంచిది కాదని, చప్పున గుండెకాయ ఆగిపోవచ్చునని అనగా, దాసుగారు "బాబూ నేను హరికథాగానము చేయుచుండగా అట్టి అదృష్టము పట్టిన ఇంకేమి కావలయు" ననెను. మరియొక సందర్భమున "మీరు పెద్దలయిరి. వయసుమించినది, హరికథలు మానివేయుండి" అన దాసుగారు తనకది ఐహికమైన లౌకిక వృత్తి కాదనియు, పరమేశ్వరగానము సల్పుటకు అవకాశము దొరకినపుడెల్ల చేయవలసినదేగాని, దీనికి విరమించుట అనునది లేదనెను. డెబ్బదేండ్లు దాటిన తరువాత తనకు హరికథల నొనరించుటకు కావలసిన బలిమిమ్మని దేవుని ప్రార్థించెను. "మచ్చిక న్నన్ను నీ ముచ్చటల్పాటనీ - లేనిచో మనికి జాలింపనిమ్ము" అని వేల్పువంద కతకమున వ్రాసెను. హరికథ చెప్పగల బలము తగ్గినపుడు, తాను మరి బ్రతుకనక్కరలేదట.

విజయనగరమందున్నపుడెల్ల సాయంకాలము వీథిలోనికి బోయినపుడు ఒకేదారిని పోవుటయు వచ్చుటయుతప్పదు. దాని రహస్యము ఆ దారిలో శివాలయముండుటయే. దానివలన శివాలయ ప్రదక్షిణముచేసినట్లు. భోజనానంతరము ప్రతిదినము శంకరాచార్య కృత యమక షట్పదీ స్తోత్రమును పఠించుచుండువారు. వారికి ఆచార్యులవారి స్తోత్రములు, శ్లోకములు అనేకము కంఠస్థముగా నుండెడివి. శంకరుల కవిత్వమునందు దాసుగారికి విశేషగౌరవము, ఆ స్వామి యందమితమగు భక్తియు గలిగి యుండెను. (శ్రీ) దాసుగారు తాను రచించిన 'భగవద్గీత - వేల్పుమాట' అను పొత్తమును, 'మొక్కుబడి' అను ఋగ్వేద మంత్రానువాదమును (శ్రీ) శంకరాచార్యుల వారికి కృతి యిచ్చిరి.

ధారాళమైన మనస్సుగల దాసుగారికి కొన్ని పూర్వపు ఛాందసపు నమ్మకము లుండెడివి 'విశ్వ స్త' వడ్డించుట తటస్థించు నెడ ఆయనకు కష్టముగా నుండెడిదట. కాని తనకు భార్యావియోగమైన తరువాత యింట దక్షతలేక యొకవంటలక్కను బెట్టుకొని "విశ స్త వడ్డింపగా" తినుట నాకెంత యసహ్యామో అంత తప్పినది కాదని విచారించెను. ఇంటి నుండి బయటికి పోవునపుడు మంచి శకునము కెదురుచూడకపోయినను దుశ్శకునమైనపుడు వెంటనే లోనికి వెళ్ళి తుం సికోటకు ప్రదక్షిణము చేసి తిరిగి బయలుదేరుచుండెను. హరికథ చెప్పునపుడు శ్రీరామపట్టాభిషేక పటము నొకదానిని నిల్పుచుండును. ఆ పటముపై తాను వేయు పూలహారమును, తన మెడలో వేసికొనుదండయు, ఒంటిమీద పూసుకొను మంచి గంధము పేరన్నగారే కూర్చవలయును. ఇంకెవ్వరును ముట్ట కూడదు. తన మెడలోని హారము తానే వేసికొనుట తప్పని మామూలు. హరికథకు తయారై పట్టువస్త్రముల గట్టుకొన్న తరువాత తన్నెవ్వరును తాకకూడదు. హరికథ చేయునపుడు మధ్యకాలములో దాహశాంతికై ఆవుపాలు పుచ్చుకొనుట అలవాటు. గ్రామఫోను యంత్రములో దాసుగారి పాట రికార్డు చేయుటకై కంపెనీ యేజంట్లు పలుసార్లు ప్రయత్నింపగా దాసుగా రొప్పుకొనలేదు. తనకు కావలసినంత ద్రవ్యము సునాయాసముగా లభించునను దృష్టి దాసుగారి కెంతమాత్రము లేకుండెను.

దాసుగారి తత్వదృష్టి సూక్ష్మముగా చెప్పవలెనన్న "మానవుడు చిరకాలమునుండి తన పూర్వుల వద్దనుంచి వచ్చిన యాచార వ్యవహారములను నమ్మకముల ననుసరించి, తన పెద్దలనాటి మర్యాద నడుపుకొనుచు నొకరికి కీడుదలపక చేతనయినంత లోకోపకారముగ వర్తిసల్పుచు, కోర్కెల విజృంభించనీయక, పరమేశ్వరు నారాధించుచు బ్రతుకుటయే మంచి, యేలయన 'ఎల్లలుండవు కోర్కెల వెల్లువలకు.'

సీ॥ "వర్ణాశ్రమాచార పద్ధతి విడువక
ప్రాజ్ఞులవలన కర్తవ్య మెఱిగి

సకలశ్రుతి స్మృతి సారముఁగొని శ్రద్ధ
ధానుఁడై యేకాగ్ర మానసుఁడయి
స్థిరబుద్ధియై యసందిగ్ధుడై యున్నయా
తనికి సత్యము తనంత తెలియఁబడు"

అని వారి విశ్వాసము.

గురువునొద్ద నేర్వకే విద్యలన్నిటికిని గురువైన దాసుగారు - గజ్జెకట్టి కథ చెప్పునపుడు గంధర్వసార్వభౌముడతడు. హరికీర్తనము చేయునపుడు పదునార్గురు పరమభాగవతుల ఏకైక అవతార మాయన. హరికథాదిక విరచనావసరమున పరమేష్ఠి. సంగీత సాహిత్య కళలతో సభలలో అవధాన ప్రజ్ఞ ప్రదర్శించువేళ పుంభావసరస్వతి. అంతర్ముఖుడైన సమయమున పరమాత్ముడే ఆయన. "సర్వదేవ నమస్కారం కేశవం ప్రతి గచ్ఛతి" యనునట్లుగా వాగ్దేవికి మనము చేయు ప్రతి నమస్కారము దాసుగారికి చెందునని నా విశ్వాసము.



# సకల కళా ప్రపూర్ణుడు


కళా ప్రపూర్ణ
కీ. శే. చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి


[దాసుగారికి శాస్త్రిగారికి మంచి అనుబంధము. దాసుగారి యెడ శాస్త్రిగారికి గల గౌరవాభిమానములపారము. శాస్త్రిగారు దాసుగారి గురించి పలుతావుల వ్రాసిన వ్యాసములను, ప్రశంసా వాక్యములను పద్యములను కొన్నిటి నెన్నికచేసి యిట నొక్కచో పొందుపరచి యీ వ్యాసముగా రూపొందించితిని]

—సంపాదకుడు

కం. నారాయణదా సనియెడి
ధీరుఁడు రసికుండు మిగులఁ దేజస్వి కళా
పార మహోదధి సభ్యుడు
వేఱుగ వర్ణింపవలెనె విద్యా గరిమల్.

తే గీ. దాసు నారాయణునకు నితండు, ఏని
దాసు లెల్లెడఁ గల హరిదాసు లెల్ల;
నొక్క హరిదాసులేకాదు, ఎక్క మితని
యెడల నాదృతి లేనివాఁ డెవఁడు పుడమి.

(కలహరగంప. పుట 8)

మ. అల నారాయణుఁ దప్ప కృష్ణుఁ డయి గేయమ్మందు సంతోషముం
గొలిపెంగా వి కవిత్వమందుఁ గొలుపన్ గొంతేనియున్ నోచుకోఁ
డు లోపమ్మును దీర్చుకోఁ దలఁచి కాబో యిట్టి రూపమ్ముతో
నిం నారాయణదాస నామమున విఖ్యాతిం గాంచె నారాయణుండు ల్లదే.

(1917 లో లక్ష్మీనరసాపురములో చెప్పినది.)

హరికథా చతురాననుడనదగిన నారాయణదాసుగారిని యెఱుగనివారు లేరుగదా! ఆయనతోకూడా తాటితో దబ్బనంగా వెనుక పాడుతూవుండే ఆయన అన్నగారిని కూడా లోకం యెఱిగేవుంది. ఈ అన్నగారే సర్వవిధాలా ఆ దాసుగారిని యుక్తమార్గంలో పెట్టి కథాకాలక్షేపం చేయించే హంగుదారుడని దాసుగారే వప్పుకుంటారు. సంగీతంలో దాసుగారెంత విజ్ఞులో అంత విజ్ఞులూ అన్నగారున్నూ అయివుంటారు. కాని లోకం యీ మాటకు యెంతవఱకు అంగీకరిస్తుందో చెప్పజాలను. అన్నగారి గాత్రం సన్నవిడిగా మధురంగానే ఉంటుంది. దాసుగారి గాత్రం ముదుగుగా జంబోరాగా కొంత మోటుగా వుంటుంది. ఇద్దఱున్నూ యేకగర్భజనితులే గనుక ఆ సృష్టికర్త సృష్టిచేసే తరుణంలో గాత్రస్వరాన్ని నిర్మించేటప్పుడు సరిగా యేర్పాటు చేయాలనుకొని యీయన గాత్రంలో వేయవలసిన సామగ్రిని కూడా పొరబాటున ఆయన గాత్రంలో పడవేసేడేమో అని నాకు తోస్తుంది. లేకపోతే తమ్ముడి గాత్రం 'శంభో' అనేటప్పటికి మూడు కోసులదాకా ఉఱుములమీనట్లు ప్రతిధ్వనివ్వడమేమిటి? అన్న గాత్రం అంతంతలోనే అంతరించడమేమిటి? ఇట్టి సందర్భంలో ఒకసభలో వక కొంటెకుఱ్ఱవాడన్నాడట గదా! "యేమండోయి దాసుగారూ! యేనోకా డబ్బు పెట్టి టిక్కెట్టు కొనుక్కొని రానేవచ్చాం, ఆయనచేత పాడించటం మానివేస్తే యింకా కొంత డబ్బిచ్చుకుంటాం మీా "కన్నాడని చెప్పగా విన్నాను. "లోకులో కాకులో" వాళ్ళని యెవళ్ళాపగలరు? ఇంత మాత్రం చేత అన్నగారు దాసుగారిమీాద అసూయ పెట్టుకున్నట్టు మాత్రం వినలేదు. ఆయన ప్రాజ్ఞత్వం యేలాటిదో చదువరులు విచారించుకోండి.

(కృష్ణాపత్రిక, 1936 - కథలు-గాథలు, 1వభా. 67-68వు.)

ఈ శాంతిబోధ యెవరిని గుఱించింది అంటే పోట్లాడడానికి సిద్ధంగా వున్నవారినిగూర్చి. వారెవరు? వొకరు సుప్రసిద్ధతరులు నారాయణదాసుగారు. రెండు సుప్రసిద్ధులు నాగభూషణంగారు. వీరిద్దరినీ

గూర్చి ప్రపంచం బాగా యెఱుగును. ఉభయులున్నూ నానావిద్యలలో ప్రవీణులు. కాని ప్రస్తుతం వీరికి సంబంధించిన వివాదం, గానవిద్యకు సంబంధించింది. దాసుగారు మహానాయకులే అయినా హరికథకులై పేరుప్రతిష్ఠలను ఆర్జించివున్నారు.

మేము విజయనగరం మహారాజావారి దర్శనానికి వెళ్ళినప్పుడు నేను (శ్రీ) కట్టు సూరన్నగారి (వైణికులు) గానపాఠశాలకు తలచు వెడుతూ వుండేవాణ్ణి వొకరోజున నారాయణదాసుగారున్నూ వచ్చారు. సూరన్న గారికిన్నీ దాసుగారికిన్నీ లలిత వస్తువులకు భేదమేమిటి? అంటూ కొంత ప్రసంగం నడిచింది. క్రమంగా పాఠం ముదిరింది. ఆవట్టాన్ని సూరన్నగారు కళ్ళెఱ్ఱచేసి "నీవు సంగీతంలోకి రావద్దు యిదేమీ హరికథ కా" దన్నారు. అంతదాకా కోపంగానే వాదిస్తూవున్న దాసుగారు వకాలున వొక్కనవ్వునవ్వి "యేమోయి! నీవేమో సంగీతం జోలికి రావద్దంటూవైతివి. వేంకటశాస్త్రుల్లు కవిత్వం జోలికి రావద్దాంటాడాయె, వేఱొకరు ఇంగ్లీషు జోలికి, యింకొకరు మరోదాని జోలికి రావద్దంటారు గదా! యిక నేను యేవిద్య జోలికి వెళ్ళాలో నీవేచెప్పు" మన్నారు. యెంతోధ్వని ప్రధానంగావున్న ఆ వాక్యం నాకు యెంతో సంతోషాన్ని అప్పుడేగాదు; యిప్పటికీ కలిగిస్తూవుంది. "ఏకవిద్యా సురక్షితా" అన్నమాదిరిని వీణనే అభ్యసించినవారు కట్టు సూరన్నగారు. దాసుగారు అప్పటి కింకా వీణలో బాగా కృషిచేసి వుండరు. కాని అసలే ప్రవేశం లేనివారు మాత్రం కారనుకుంటాను. ఈ సంగతి మన్మథ సంవత్సర ఆశ్వయుజములో జరిగింది.

మటి వర్ధాలుగేళ్ళకు 'సౌమ్య' సంవత్సరములో దాసుగారున్నూ మేమున్నూ ఖాసింకోట సంస్థానములో మీటయినాము. అప్పుడు రాత్రి అందరం ఒకటే బసలో వుండేవారం. దాసుగారు వీణ 'ప్రాక్టీసు' చేస్తూ వుండేవారు. అందుచేత సూరన్నగారితో వాదం జరిగేనాటికి విశేషప్రవేశం లేదనుకోవచ్చును. యిటీవల వీణలోకూడా దాసుగారు

మంచిప్రవేశాన్ని సంపాదించే వుందురు. కాని ఆయన్ని వీణకచ్చేరీ చేయడానికంటూ ప్రత్యేకించి యెవ్వరూ ఆహ్వానించినట్లు వినలేదు. యీలోపం ఆహ్వానించనివారియందు ఆపాదించటంకంటె దాసుగారి వివిధ విద్యాపరిశ్రమమందే ఆపాదించి "సతుగుణగణానా మవగుణః" అనే మురారి వాక్యాన్ని స్మరించుకొని వూరుకోవాలి. వీణకచ్చేరీకి ఆహ్వానించని వారిమీద దాసుగారున్నూ కోపం కనపరచకూడదు. గీరతంలో ప్రత్యేకించి

"క నారాయణ దాసకీయెడి ధీరు నెఱుంగుదుమగాదె"

అని వకపద్యం ఖర్చుపెట్టివున్న పరమమిత్రుణ్ణి నన్నుగూడా దాసుగారు యేమీ అనకూడదు. (యేమైనా అనే యెడల వడడానికి సిద్ధమే). దాసుగారికిన్నీ మా తిరుపతిశాస్త్రికిన్నీ బొత్తిగా యెటామొటీగా వుండేదిగానీ, నాకున్నూ దాసుగారికిన్నీ యెటామొటీ లేశమూ లేదు. కాని బొత్తిగా వొకరిని వొకరు వెక్కిరించుకోని వాళ్ళం మాత్రం కాదు. దీన్ని తెలిపే వక ముచ్చట మాత్రం యిక్కడ వుదాహరిస్తాను.

వికారి సం॥లో ఖాసింకోట సంస్థానంలో ఒక వివాహం జరిగింది. దానికి తి॥ శా॥ అనారోగ్యంగా వుండి రాలేదు. నేను మాత్రమే వెళ్ళాను. (శ్రీ) పోలవరం, కిర్లంపూడి, లక్కవరం వగయిరా జమీందార్లున్నూ వచ్చారు. నారాయణదాసుగారు చెప్పిన "వేయు నేటికి బంగారు బెంగళూరు"అనే పద్యాన్ని యెవరో చదివితే మా జమీందారు గారు ఆక్షేపించారు. ఆక్షేపణకు అవకాశంలేనిదాన్ని ఆక్షేపించటంచేత నేను దాన్ని సమర్థించాను. జరిగిన వాస్తవమింతే. దాసుగారితో యెవరేమి చెప్పారో మరునాడు నా బసకువచ్చి నన్ను "శాస్త్రీజీ! నాకు వున్న ప్రజ్ఞలలో దేన్ని నీవు ఆమోదిస్తా"వని మృదువుగానే ప్రశ్నించారు. అన్నిటినీ ఆమోదిస్తానని నేను యథార్థాన్నే చెప్పాను. దానికి సంతుష్టిపడక యేదోవకదాన్ని నిర్ధారణచేసి చెప్పాలి అంటూ

నిర్బంధించి బాధించారు. సుమారు నూఱుసార్లైనా అలాగే చెప్పాను గాని అన్యథా చెప్పలేకపోయాను. తుదకు నాకు విసుగెత్తించి నాచేత "నీకు గానంలో వున్నంత విలక్షణత్వం కవిత్వంలో వున్నట్టు లోకం విశ్వసించదు" అనేమాట అనిపించి తీరినారు దాసుగారు. అనిపించి వూరుకున్నారా! లేదు. అవకాశాన్ని దొరికించుకున్నారు. అడ్డమైన మాటలు అనడానికి ఆరంభించారు. మఱేమిటీ తిట్లూ, తిమ్మలూగావు సుమండీ. నీకు కవిత్వం చేతగాదు. భట్రాజుకవిత్వం నీది, నీకు పాండిత్యమంటే నిండుసున్న యీ మాదిరివే అనుకోండి కసితీరేదాకా అన్నారు. నేమీ అనలేదు. వూరుకున్నాను. యెందుచేత? ఆయనయందు నాకు మిక్కిలి అభిమానం. తొందరమనిషి అని యెఱుగుదును యథార్థం కాకపోయినా "నీకు కవిత్వంవల్లనే లోకంలో మంచిపేరు వచ్చింది" అంటే సంతోషించటం జరిగేదేమో! అయితే మాత్రం బుద్ధిపూర్వకంగా అసత్యాన్ని ముఖప్రీతికోసం యెలా ఆడేది? సరే నాకు కోపం తెప్పించలేక పోయారు అప్పటికి. దీనివల్ల లోకం నన్ను కోపం లేనివాడనుకోకూడదు. ఆయన బోళావాడని నావూహ. ఆ నాడు మధ్యాహ్నం మళ్ళా తారసపడ్డాం. మళ్ళా "పూర్వోత్తరపూర్వా"గా ప్రారంభమయ్యింది. అప్పటికి వొళ్ళుమండింది నాకు. సరే రాత్రి నీ హరికథ గదా! అప్పుడు నాశక్తి చూపిస్తానులే అన్నాను. అన్న పేరన్నగారు మాత్రం మావాడి మాటలు మనసులో పెట్టుకోవద్దని ప్రీతిగా నొక్కినొక్కి నన్ను అనునయించారు. సరే రాత్రి యేదో జరిగిందనుకోండి. ఆ మఱునాడు కలుసుకున్నప్పుడు "శాస్త్రీజీ! మీ శాంతానికి నేను మిమ్మలను మిక్కిలిగా అభినందిస్తున్నాను!" అని పలువురు చూస్తు వుండగా అనీ అనడంలోనే రెండుచేతులూ రెండుచేతులతో కలుపుకున్నాము. స్నేహితులమైనాం అంతటితో.

మఱి రెండేళ్ళకు విజయనగరం ఏదో మార్గవశాత్తూ నేను వెళ్ళడం జరిగింది. కలుసుకున్నాం. వక సీసపద్యం శాస్త్ర ప్రవేశాన్ని

సూచించేది చదివి నాకు విశదీకరించారు దాసుగారు. దీనివల్ల తేలేదేమిటంటే, నాడు ఖాసీంకోటలో మీరు హరికథా సమయంలో వ్యాకరణ తప్పులుకదా వట్టదలుచుకొని పెన్నులూ, కాగితమూ చేతపట్టుకు కూర్చున్నారు. యిప్పుడు దానికో కూడా మీకు దొరికేదిలేదని తెల్పడమే దాని తాత్పర్యం. దొరికినా, దొరక్కపోయినా అప్పటికి దాసుగారు పాణినీయంలోగూడా తగుమాత్రం ప్రవేశం సంపాదించారన్నది సత్యదూరంకాదు. అయితే అందులో యెవరి శిష్యులు అంటే, అందులోనేకాదు, యెందులోనూ కూడా యెవరి శిష్యులూ కాదు. ✓

"ప్రపేదిరే ప్రాక్తన జన్మవిద్యాః" అనే వాక్యానికి దాసుగారు ప్రథమలక్ష్య మనుకోవాలి. విజయనగరం అంటే సర్వవిధాలా కాశీగా వుండేది. సర్వవిధాలా అంటే దాంట్లో భంగుకూడా చేరవలసి వుంటుంది. దీన్నిగురించి అన్యత్ర విస్తరించినట్లు జ్ఞాపకం. దాసుగారి అన్న పేరన్నగారు నన్ను అనునయించడంలో దీని మాహాత్మ్యాన్ని కొంత నాడు సూచించే వున్నారని తెలిపెడి. అలాటి అపరకాశీలో వున్న దాసుగారు పూర్వజన్మ సుకృతం గూడా కలిసిరావడంచేత అన్నిటినీ అశ్రమంగా ఆర్జించగల్గారు. ఆయన ఆర్జించ లేనిదల్లా యీ వయస్సులో కూడా వక్కటిమాత్రమే. ఆ విద్య యేదో అందఱూఎఱిగిందే కనుక గ్రహించుకోండని లోకానికే వదిలిపెడతాను. ఆయన వయస్సిప్పటికి దాదాపు యెనభై కి యేమాత్రమో తక్కువనుకుంటాను. ఇన్నివిద్యలలో ప్రవేశం కలిగి యీ మాదిరిగా హరికథ పండిత–పామర రంజకంగా మహాగాయకులున్నూ, మహాకవులున్నూ, మహాలౌకిక శిరోమణున్నూ నిండివున్న సభలో చెప్పి మెప్పు సంపాదించిన వ్యక్తి మనకికదొరకడు. చేతనైతే యీ వయస్సులో వున్న తెల్లముంగురులు వగయిరా కీర్తిస్ఫోరకమైన పోమక్కతోటేనా యీ లోకంలో అమరుణ్ణిగా చేసి నిల్పుచేయవలసిందని మనదేశస్థులంతా భగవంతుణ్ణి ప్రార్థించవలసివుంటుంది.

ఈయన సంస్కృతంలో కూడా కవి. ఆంధ్రం చెప్ప నేఅక్కఱలేదు. "తొండ ముదిరితే వూసరవెల్లి"అవుతుం దన్నట్టు యిటీవల యీయన కవిత్వంపేర్లదగ్గఱనుంచిన్నీ ("వెన్నుని వేయిపేళ్ళ విపంకిడి" అని కాబోలును వొక పుస్తకంపేరు) అచ్చతెలుగులోకి మాఱి కొంత రసాన్ని గోలుపోతూవుంది కాని హరికథా రచనాకాలం నాటికి యీ చేదస్తం యీయనకు పుట్టలేదు. అది అదృష్ట మనుకోవాలి. లేకపోతే యీయన రచనలు యీయనతోటే అంతరించిపోయేవి. సంశయం లేదు, యీయనకు ఎన్నివిద్యలేనా వచ్చును. అన్నిటిలోనూ కూడా ప్రత్యేకించి కృషి చేసినవారితో పోట్లాడి నిగ్రహించగల శక్తికూడా వుండేవుంటుంది గాని లోకం యీయన్ని హరికథకుడుగానే కాని అన్యథా వాడుకోదు. సార్వభౌమ బిరుదు సంపాదించినా, "మహామహోపాధ్యాయ"సంపాదించినా వృథా పరిశ్రమే కాని "ప్రాప్తేఽపి సోమయాజిత్వే నంబిశబ్దో న ముంచతి."

ఇంతవరకు వ్రాయడానికి అంతో యింతో నాకు అర్హత వుంది గాని యీపైని వ్రాయడానికి నేనే లేదనుకునేటప్పుడు లోకం లేదంటే ఆగ్రహపడవలసి వుండదు; నేను గాయకుణ్ణి గాను. యెందుచేత? చెప్పకోకపోవడంచేత. చెప్పకుంటేనో అయ్యేవాణ్ణే. యిప్పుడు నాగభూషణంగారు ప్రత్యర్థిగా నిలబడ్డారుగాని అప్పుడు నేనే నిలబడేవాణ్ణేమో. కాని వుండీ. దాసుగారు లయబ్రహ్మ అని అందరూ చెప్పకుంటారు. నాగభూషణంగారు లయబ్రహ్మ కారని యెవరూ చెప్పరుగదా? అందరు గాయకులూ - ఏ మహాగాయకుల రచనవల్లనో సభను రంజింపజేస్తే దాసుగారు స్వంతరచనచేతనే అద్భుతంగా రంజింపజేస్తారు. కేదారమీదా, బిలహరిమీదా, ఝుంఝూటిమీదా యింకా కొన్ని రాగాలమీదా, సీసపద్యం చదవడానికి దాసుగారే మార్గదర్శకులు. ఇట్టి దాసుగారు నన్నొకరోజున విజయనగరంలోనే అయ్యకోనేటి గట్టుమీద "శాస్త్రీజీ! నీవు చదివేశైలి వినా" లన్నారు. దురుద్దేశంతో గాదు.

సదుద్దేశముతోనే యిలా అనడం తటస్థించింది. అప్పటికి నా వయస్సు 24 వత్సరాలు. దాసుగారు ముప్పయికి లోగానో పయిగానో వుంటారు. చదివాను. ( చదివిన పద్యం శ్రవణానందంలోది ) సంతోషించారు అప్పుడు నేను యిదే తాబోలును "పొరుగింటి పుల్లగోంగూర రుచి" అంటారు పెద్దలు అనుకున్నాను. ఈయన్నిగూర్చి ఇంకా యెంత వ్రాసినా తనివితీరదు. అయితే వోపిక లేదు. యేంచేసేది? "అనుక్తమన్యతో గ్రాహ్యమ్."

(కృష్ణాపత్రిక, 23-4-38; కథలు-గాథలు, 2వ భా. 660-666.)

...వొక్కొక్కరి కవిత్వమందున్నా, వొక్కొక్కరి గానమందున్నా ఒక్కొక్క విశిష్టగుణం సహజంగా వుంటూవుంటుంది. ఆ గుణం అనుకర్తలకు యే కొంతభాగమో స్వాధీన మవుతుందిగాని పూర్తిగా స్వాధీనం కాదన్నది సర్వానుభవసిద్ధం. శ్రీ నారాయణ దాసుగారిని హరికథకు లెందరు అనుకరించడంలేదు? కోడి రామమూర్తిగారిని మల్ల విద్యాప్రవిష్టు లెందరు అనుకరించడం లేదు? వొక్కరైనా వారి వారి పూర్తివిశేషాలు ప్రకటింపగలుగుతున్నారా?

(కృష్ణాపత్రిక, 1939; కథలు-గాథలు, 1వ భా. 659.)

"కృష్ణగాన చటికా భాగవతి" శబ్దంకూడా ఆయన స్వకపోల కల్పితమే. యిందులోవున్న "చటికా" శబ్దానికి అర్థం అయిన 'చిటికే' అనే పదంతో చెపుతారు. ఆ చిటికెలు ఆయన రెండుచేతులతోటి రెండుగా పట్టుకొని అద్భుతంగా లయానుగుణంగా వాయించే వొక విధమైన చిన్న లక్కపిడతలే. ఆయన్ని చూచి మరికొందరు ఆ చిటికెలు వాయించడానికి ఆరంభించారు. కాని ఆ పోకడ పూర్తిగా యింత వరకు యెవ్వరికీ అలవడిందికాదు. యీ వాద్యానికి ప్రథమాచార్యులు యీయనే. వొక్కొక్క దానికి వొక్కొక్కరు ప్రథమ ప్రవర్తకులుగా వుంటారు. మహారాష్ట్రాది దేశాల్లోతప్ప నా చిన్నతనం నాటికి మన

దేశంలో హరికథలు చెప్పడమంటూ వున్నట్టులేదు. అట్టి కాలంలో (1) బాలాజీదాసుగారు (2) నారాయణదాసుగారు వీరిద్దరున్నూ వుపక్రమించారు. వీరికి మార్గదర్శకులెవరేనా వున్నారేమోకాని ఫలానా అని వ్రాయడానికి నాకు తెలియకపోవడంచేత వ్రాయలేదు. బహుశః నారాయణదాసుగారికంటె వయస్సులో బాలాజీదాసుగారు కొంచెం గొప్ప పెద్దలనుకుంటాను. నానావిధమైన శక్తులతో మిళితమైన నారాయణదాసుగారికిన్ని బాలాజీదాసుగారికిన్నీ పోలిక యెందులోనూ లేదుగాని భక్తిప్రధానంగానున్నూ రక్తిప్రధానంగానున్నూ మన దేశంలో అగ్రగణ్యులే యిటీవల యెందరు హరికథలు చెప్పేవారు బయలు దేరినా నారాయణదాసుగారినే వరవడిగా పెట్టుకొని మొదలుపెట్టేరు. కాని ఆయనకువున్న సాధనసామగ్రి అంతా కాదు సరికదా అందులో దశాంశం వున్నవారుకూడా బయలుదేరలేదు. అన్ని శక్తులు వొకచోట కేంద్రీకరించడం కష్టసాధ్యంకదా? అయితే నాట్యం వగైరాలు మాత్రం అచ్చంగా అదేమాదిరిగా అనుసరించేవారు మాత్రం వలువురున్నారు. అంతేకాదు కొందఱు ఆయనవలెనే నిలుచుండడాన్నికూడా అభ్యసించి చూపే వారున్నారు. (శ్రీ) పోలవరపు జమీందారుగా రొక్కరు మాత్రం నారాయణదాసుగారికన్నా మిన్నగా హరికథ చెప్పి మెప్పించే వారు, దక్షిణాదినే యెవరో వకరు వున్నారని వారిపేరుకూడా చెపుతూ వుండేవారు. బహుశః ఆ పేరు "కృష్ణభాగవతార్" అన్నదని జ్ఞాపకం. వారిని నేను దర్శించలేదుగాని మఱికొందఱి హరికథలు దాక్షిణాత్యులవి వినియున్నాను. వారెవరున్నూ మన దాసుగారివలె చెప్ప తగ్గవారుగా నాకు తోచలేదు. స్వయంభువులైన వారికిన్నీ అనుకర్తలకున్నూ చాలాభేదం యీ విషయంలోనేకాదు ప్రతి విషయంలోనున్నూ వుంటుం దని చెప్పనక్కఱలేదు.

— (కృష్ణాపత్రిక, 28-1-1939)

కళాశబ్దము కవులకు, పండితులకు అందఱికీ చెల్లుతుంది. 'కళా' శబ్దానికి 'విద్య' అనే అర్థంకూడా వుందికదా ? యూనివెర్సిటీ వారు

'కళాప్రపూర్ణ' బిరుదాన్ని యివ్వడంకలదు. వారు దాన్నియే అర్థం మనస్సులో పెట్టుకొని యిస్తూవున్నారో తెలియడంలేదు; యివ్వడం మాత్రం జరుగుతూవుంది. ఈ రోజులలో ఆ బిరుదం పొందడానికి అర్హులైనవారు పలువురున్నారుగాని, అందులో (శ్రీ)యుతులు (అజ్జాడ) ఆదిభట్ల నారాయణదాసుగారు చిటికెనవ్రేలిమీదికి వస్తారు. వయస్సు చేతకూడా వారు పెద్దలు; 80 సంవత్సరాలకు అంతో యింతో వారి వయస్సు యెక్కువగాని తక్కువకాదు. యూనివర్సిటీ వారు ఈ మధ్య 'కళాప్రపూర్ణ' బిరుదంతో యెవరెవరిని సంభావించారో అందులో యే యిద్దఱు మగ్గురో దాసుగారికంటే వయస్సులో కొంత పెద్దలే; అయినా తక్కిన వారందఱూ అంతో యింతో చిన్నలే. ఇదిన్నీ కాక యూనివర్సిటీవారు యీ బిరుదాన్ని యివ్వడం మొదలుపెట్టి ఎన్నాళ్ళు యిందో నాకు బాగా తెలియదుగాని, సుమారు ఏభై అరవై యేళ్ల మధ్య ఇన్నికళలలో ప్రజ్ఞకలవారు దాసుగారు తప్ప ఇతరులు శ్రుతంకా లేదు. సంగీతంలోవున్న అంగాలన్నిటిలోనూ ఆయనకు మంచి ప్రవేశం కదా? పైగా చక్కని కవిత్వం, సంస్కృతాంధ్రాలు రెండింటిలోనే కాక ఇంగ్లీషు, హిందీ, పార్సీ వగైరాలలో సాహిత్యం. ఇన్ని ఈలా వుండగా లోకోత్తరమైన జనరంజకత్వం; ఇంకా మనదాకా రాని మఱికొన్ని కళలలో ఆయనకు ప్రవేశంవుంటే వుండవచ్చుననుకుంటాను. ఇట్టి స్థితిలో యూనివర్సిటీవారు ఆయన్ని కళాప్రపూర్ణుణ్ణి చేయకపోయినా లోకదృష్టిలో ఆయన ఇదివఱకే కళాప్రపూర్ణులై భావిస్తూన్నారనుకోక తప్పదు. అయితే నేడో రేపో యూనివర్సిటీవారు ఆయన్ని ఆ బిరుదు నిచ్చి సన్మానిస్తారనుకుందామా? అట్లు చేయడం జరిగినా లోకులకు సంతుష్టి కలగదు ఎప్పుడో ఇంతకు పూర్వమే సమ్మానించవలసి వుండగా ఆలాచేయక ఆలస్యంగా చేయడానికి కారణం వారు చూపవలసి వస్తుంది.

ఇదిన్నీకాక ఆ బిరుదు సంస్కృతభాషలో వున్నప్పటికీ దాన్ని ఇచ్చే సంప్రదాయం హూణభాషకు సంబంధించినదని నేననుకుంటాను.

వారు దీనికి చెప్పే అర్థమేమో నాకు తెలియదు. దాన్నిబట్టి సమర్థనీయం అయితే అవుతుందేమో -

(గృహలక్ష్మి, మే 1939, ప్రజామిత్ర 12-12-1943)

మా సమకాలీనులలో పదకవిత్వం చెప్పదగువారు చాలామంది వున్నారు. వారిలో నారాయణదాసుగారు కొత్తపోకడగా హరికథలలో కొన్ని కీర్తనలు రచించారు. మరికొందరు దాసుగారినీ, మరికొందరినీ వరవడిగా పెట్టుకొని రచించేవారున్నారు.

... ఒక రసమేమిటి ? అన్ని రసాలకూ పదకవిత్వం తోడ్పడుతుంది. దీనికల్లా వచ్చినచిక్కు- వేదంతోపాటు అభ్యసిస్తేనేగాని పుస్తకం చూచి అభ్యసిస్తే సాధ్యపడేది కాదు. యిది ప్రచారకులకు వుండే చిక్కు.

అసలు రచయితలకో ? యేదో అల్లే శక్తి భగవంతు డిచ్చినా, కీర్తనలో పదాలో రచించడానికి పూర్వులు వెళ్ళిన మట్లు కాక కొత్త మట్లు సృష్టించే శక్తివుండాలి. ఆ శక్తి అంతో యింతో నారాయణదాసుగారికి వుంది. చాలాభాగం ఆయన పాడే మట్లు యెక్కువ కష్టంగా వుండవు. గాయకులలో సుప్రసిద్ధ కవులు రచించిన వాట్లకు దీటుగానూ వుండవు. యే త్యాగరాయుల కీర్తనలకో పాఠాంతరాలునూ కావు. కొన్ని వంబుమట్లుకూడా వుంటే వుంటాయేమో! తక్కిన మన దేశంలో వుండే నేటి గాయకులలో సృష్టికర్తలంతగా కనపడరు. పద్యకవులలాగ పదకవులు రచనకి సిద్ధపడితే వప్పు వుడకదు. వ్రాస్తే చాలా వ్రాయాలి. హరినాగభూషణంగారు తగినంత సాహిత్యం వున్న కవి అయివుండిన్నీ పదకవిత్వం అంతో యింతో రచించిన్నీ సృష్టికర్తగా పరిణమించకుండా అంతంతలో ఆగడానికి కారణం కొత్తమట్లు స్ఫురించకపోవడమే అని నా తలంపు.

(ఆంధ్రవాణి, 28-7-44; కథలు-గాథలు 2వ భాగం 676-681)

ఈ పరమభక్తాగ్రేసరుడు హరికథ అంటే యేమిటో తెలియని కాలంలో మన ఆంధ్రదేశానికి దాన్ని రుచి చూపడమే కాక పలువురికి వుపదేశించిన మహోపాధ్యాయుడు. హరికథలకు సంస్కృతాంధ్ర సాహిత్యముండాలి. మంచి శ్రుతిలయ జ్ఞానంతో మిళితమైన గానప్రవేశ ముండాలి. ఈయనకు పూర్వోక్తమైన శక్తులే కాక ఉభయభాషల యందు మంచిగా కవిత్వం చెప్పే నైపుణ్యంకూడా వుంది. ఈయన యెన్నో హరికథలు రచించారు. ఇంగ్లీషు, పారసీల్లోనైన దేశాంతర భాషలలో కూడా ప్రవేశం వుంది ఇన్ని శక్తులు యేకత్ర వుండటం చాలా అరుదు. /

తే॥గీ॥ ఆదిభట్టీతఁ డయ్యెను హరికథలకు
ఆదిభట్టీతఁ డయ్యె గేయపు ఫణితికి
ఆదిభట్టీతఁ డయ్యె నాట్యపుం గళకు
ఆదిభట్టీతఁ డయ్యె లోఁ దృతులకు.

ఈయనతో నాకు ప్రథమపరిచయం నేటికి 50 సం॥నాడు శ్రీ విజయనగర మహారాజావారి దర్శనార్థం వెళ్ళినప్పుడు కలిగింది. ఆ వూళ్ళోనే యీయన హరికథ విన్నాను. అంతవరకు నేను సీసపద్యం రేగుప్తిరాగంమీదా, ఆనందభైరవిరాగంమీదా చదవటమే విన్నాను గాని ఇతరరాగాలమీద చదివినవారిని యెఱుగను. ఈయన ఆవేళ కేదార, బిలహరి, జంఝూటి – ఈ రాగాలమీద చదవడం విన్నాను. ఈయన మన దేశపు గానానికే కొన్ని మార్పులు కలిగించి వన్నెపెట్టిన స్వతంత్రుడు. ఈయనగాత్రం చాలాగంభీరమైనది. చాలామందిగాత్రాలు విన్న నాకు యెక్కడా ఈయనగాత్రం మాదిరి గాత్రం తటస్థం కాలేదు. ఈయన దినచర్య ధీరోదాత్త లక్షణాని కుదాహరణంగా వుండదుగాని ధీరోద్ధత లక్షణానికి ఉదాహరణంగా వుండును. తృణీకృత బ్రహ్మపురందరుడు. గానమే కాదు, సంస్కృతాంధ్రసాహిత్యమే కాదు, నాట్యమే కాదు, అదీ యిదీ అనడ మెందుకు? ఈయనకు వశమైన సర్వవిద్యలున్న

గురూపదేశం వినాగా లభ్యమైనవే. విజయనగరంలో అప్పుడు సర్వ విద్యలూ తాండవిస్తూ వుండేవి. ఈ వరప్రసాదునకు శ్రుతి మాత్రంచేత అవన్నీ స్వాధీనపడ్డాయి. వీణ గురుశుశ్రూష వినాగా లభించదని నాకు తోస్తుంది. ఈయనకు ఆ విద్యకూడా అలాగ స్వాధీన పడ్డది. ఆసంస్థాన ప్రభువులు యీయన్ని యెలా గౌరవించవలెనో ఆ విధంగా గౌరవించి చరితార్థులైనారు. సంగీత పాఠశాలా ప్రధానాధికారిగా నేర్పరచి పూజించినారు. ఈయనవంటి సరస్వత్యావతారులు ఏ కాలంలోనో గాని అవతరింపరు. వార్ధక్యంలో కూడా యీ పుంభావ సరస్వతి హరికథ అంటే వేలకొలదిగా జనం వచ్చేవారు. ఆ వయస్సులో (70 యేండ్ల దాదాపులో అన్నమాట) గాత్రం పలకమంటే పల్కుతుందా ? దగ్గిర వాళ్ళకే వినపడని స్థితిలో దూరస్థులకు చెప్పేదేమిటి ? కాని యెప్పుడో శంభో అని తన సహజ మేఘ గంభీర ధ్వనితో వాక గర్జింపు గర్జిస్తే దానికే సంతోషించి తృప్తి పడేవారు.

బాలాజీ దాసుగారు ఈయనకన్న సుమారు పదేళ్లేనా పెద్దలు. ఆయన శైలి వేఱుగాని అదిన్నీ జనరంజకమైనదే. ఇంత సామగ్రిగల హరి కథకులు యింతకు పూర్వం లేరు. భవిష్యత్తులో నేనా బయలు దేరతారనడం పుస్తకాపేక్షే. ఈయన వయస్సిప్పుడు 84 వత్సరాల కించుమించు. యింతటి ధన్యమూర్తి యింతటి అదృష్టశాలి మఱివుండడు. ధన్యాతిధన్యా ధన్య నారాయణుని నారాయణుడు గౌరవించుగాక !

(ఆంధ్రవాణి 13-1-45; కథలు - గాథలు 2వ భా. 207 - 8)

ఆదిభట్ల నిన్న మొన్న కీర్తిశేషులైన జగద్విఖ్యాతకీర్తి మూర్తులైన హరికథా ప్రథమావతారులైన నారాయణ దాసుగారి గృహనామం. భట్టశబ్దం పండితవాచకం. ఆదిభట్ల వారిలో అజ్జాడ ఆది భట్లవారు విశిష్టులని తెలియునగును. (ఈమాట దాసుగారివల్ల నేను విన్నాను) ఆదిశ్చాసౌ భట్టశ్చ ఆదిభట్టః. మొట్ట మొదట యీ గోత్రీ

కులకు యీ పేరు వచ్చుటకు కారకుడే మహాపురుషుఁడో దాసుగారి బంధువులకు తెలిసియుండునేమో కాని మనకు మాత్రం తెలియదు. యీ పేరు సంపాదించిన పురుషోత్తములు మహావిద్వాంసులై యుండుట నిర్వివాదాంశము.

"భరతుని బట్టి యిందుజులు
భారతులైరి రఘుండు హేతువై
పరగిరి రాఘవాఖ్యనల
భానుకుల ప్రభువుల్."

అన్న రీతిగా ఒక్కొక్క మహాపురుషుని పేరుతో కొంతకాలము వకు ప్రసిద్ధిజెంది మరల కొంతకాలమునకు ఎవరో మహాపురుషులు బయలు దేరినచో ఆయనపేర ఆ వంశం ప్రసిద్ధి కెక్కుతూ ఉంటుంది.

సూర్యవంశము, మనువంశము, ఇక్ష్వాకువంశము, కాకుత్స్థవంశము, రఘువంశము ఇత్యాదులు చూడుడు. అట్లే ఆదిభట్ల వంశం నారాయణ వంశముగా ప్రసిద్ధికెక్కుట యీ నారాయణదాసుగారు కారకులగు చున్నారు. ఈయన భవిష్యత్కాలమునందు నారాయణునకు దాసుడు.

శ్లో. ప్రహ్లాద నారద పరాశర పుండరీక...పరమ భాగవతాన్ స్మరామి - అన్న శ్లోకమునందలి పరమభక్తులలో నొక్కడుగా పరిగణింప దగ్గ వాఁడు కాఁగలఁడని తెలిసియే నారాయణ నామధేయము మీాతనికి తల్లిదండ్రులు పెట్టియుందురు. ఈయన బాహ్యావర్తనము యేదో మాదిరిగా కానవచ్చినను అంతరంగము బహునిర్మలమైనది. భక్తుఁడనగా నారాయణదాసుగారు అని నేను బాహువులెత్తి చెప్పగలను.

ఈయన చదవకుండగనే సమస్త విద్యలను (సంస్కృతాంధ్రములు లోనైనవి) సాధించెను. ఒక్క ఇంగ్లీషుమాత్రము పాఠశాలా ప్రవేశము వలన సంపాదించెను గాని ఆ విద్య యితనికి ప్రధానము కాదు. గానము, కవిత్వము ఇతఁడు మాతృగర్భమునందే సంపాదించుకొనెను.

ప్రపేదిరే ప్రాక్తన జన్మవిద్యాః - అను కాళిదాసోక్తి యీతని యందు సమన్వయించినట్లు మరియొకరియందు సమన్వయించదు. ఈయనకు జన్మవంశమునకు సంబంధించిన జ్ఞాతులేకన్నా విద్యావంశమునకు సంబంధించిన జ్ఞాతులే విస్తరించి యుందురని చెప్పటలో అతిశయోక్తి లేదు. ఈతడీ హరికథాప్రణాళికను యెవరిని గురువుగా పెట్టుకొని (ఏకలవ్యుని వలె) అభ్యసించెనో కాని ప్రస్తుత మాంధ్రలోకమున హరికథ చెప్పు ప్రతి వ్యక్తియు ప్రత్యక్షముగానో, పరంపరగానో యీాయన శిష్యులు కాక తీరదు.

ఈయనకు మించిన గాయకుడుండవచ్చును. కాని యీాయన గాత్రము వంటి గాత్రము (మేఘ గంభీర నిస్వనః) ఆ గాయకులలో ఒక్కరికిని భగవంతుడు యివ్వలేదనియే నా నిశ్చితాభిప్రాయము. త్యాగరాయల తరువాత యీా మహాపురుషుడు సంగీత సాహిత్యములకు వన్నె కల్పించినాడని నేను చెప్పగలను. ఇతని గానము దాక్షిణాత్య గానము ననుసరించునదిన్నీ కాదు. ఉత్తరదేశ గానము ననుసరించునదిన్నీ గాదు. ఈ గానములన్నింటిని కలియద్రొక్కి పెట్టిన కషాయమిది. శిష్యులలో చాలామంది కొంతవఱ కనుకరించినను, కొన్ని పోలికలు దానుగారితో అంతరించఁ దగినవేగాని శాశ్వతముగా నిల్చిపోఁదగినవి కావు. ఈ దోషము ప్రతిగాయకుని గానమునకూ తగిలేదే. ఒక్కొక్క గాత్రమందు ఒక్కొక్క వైలక్షణ్యముండును. అది ఆ గాత్రమునుండి వినవలసినదేగాని అనుకర్తల గాత్రముల నుండి వినదగినది కాదు. ఏదో మేనమామపోలికగా అనుకరించువారు మాత్ర ముందురు. ఈయన కు గానమందువలెనే కవిత్వమందు గూడ విశిష్టస్థానము యీాయక తప్పదు.

కీర్తన (పున్నాగతోడి-త్రిపుట)

ప. బాలాచంద్రమౌళి, పాదాముల్ విడకా కాలునోర్చి వేగమె రమ్ము కొడుకా.

చ. అంగము శైత్య పైత్యములంటా నీయకా గంగాధవానీ సన్ కాపాడు గాక.

చ. పవలు రేయి తాపము చెందనీయకా రవిచంద్రములు నిన్ను రక్షింతురుగాక.

ఆ యీ కీర్తన మార్కండేయోపాఖ్యానములోనిది. ఇది ఆయన గానము చేయుచున్నప్పుడు విన్ననాకు, (సంగీతజ్ఞానము లేకపోయినప్పటికీ) ఆ కవిత్వమునందును ఆ గానమునందును గల మాధుర్యముచే కంఠోపాఠము చేయాలని బుద్ధిపుట్టింది. ఎవ్వరు లేనప్పుడు నాలో నేను పాడుకొని ఆనందించుచుందును. అది నేడు జ్ఞాపకము వచ్చి యిట్టి కీర్తన చెప్పిన దాసుగారికి పరమేశ్వరుడు మార్కండేయునివలె స్థిరాయుష్యము నియ్యక వంద్రెండేళ్ళు మాత్రమే (వంద్రెండుయేళ్లు యెనుబది నాల్గు) యిచ్చి బాలారిష్టజాతకులలో జేర్చినాడు కదాయని చింతింపవలసినవాడనైతిని. హరికథకులలో యిట్టి సన్మానము పొందినవారు గాని యింత నిరాఘాట ప్రవర్తకులు గాని యిట్టి శిష్యులను తయారు చేసినవారు గాని మన ఆంధ్ర దేశమందే కాదు, యితర దేశములందు కూడా లేరనియే చెప్పవచ్చును. ఈయన సంస్కృతంలో రచించిన గ్రంథము పండితులెల్లరు శిరసావహించినదిగా నుండుటచే అందలి పాండిత్యమును గూర్చి వేరే వ్రాయనక్కర లేదు. తెనుగు మాతృభాషయే గదా! గురు శుశ్రూషాలభ్యమగు సంస్కృతమునందే యీయన నిరాఘాట ప్రజ్ఞగలవాడైనప్పుడు మాతృభాషయైన తెనుగులో యీయనకు గురు వుండవలసియుండునా? ఆ యీ విషయాలు సుమారు అయిదారు యేళ్ళనాడు యీయనను గురించి కృష్ణాపత్రికలో నేను వ్రాసిన అనునయం అనే వ్యాసంలో చర్చింపబడినవే. కనుక యిందు మరల పునరుక్తం చేసేదిలేదు. ఈయనతో పోల్చుటకు నాకు తెలిసినంతలో ఒక్కరును గోచరించుట లేదు. "అధీత మధ్యాపిత మార్జితం యశః"

తే. గీ బ్రతుకఁ దగినంత కాలమ్ము బ్రతికి కులము
వన్నె కెక్కించి జగతికిఁ దన్నుఁ దెలిపి
అరిగె మత్సోదరుండు నారాయణుండు
తనదు పేరి దేవునిచూచు తలఁపు వొడమి.

ఈయన ప్రజ్ఞ అనన్యాయాలంకారానికి ప్రథమ లక్ష్యం. నరః పతిత కాయోపి యశః కాయేన జీవతి.

ఉ॥ గాయక మాత్రుఁడన్న నటుగాఁ డితఁ డంద మెలర్ప సత్కృతుల్
సేయఁగలాఁడు వాక్పటిమచే నుతికెక్కినవాఁడు భాష లే
వో యయిదాఱు నేర్చిన మహోదయుఁ డక్కట పోయె నేమి నా
రాయణదాసు ముక్తుఁ డతఁ డట్టిఁడు భూస్థలిఁ బుట్టఁబోఁడిఁకన్.

క॥ శ్రుతి సతి "నస పున రావ
ర్తతే" యనుచుఁ బలుకు పలుకు తథ్యమ యేనిన్
హితుఁ డల నారాయణ దా
సు తరించెన్ మఱల నతనిఁ జూచుట యెట్టుల్.

(ఆంధ్రపత్రిక, 29-1-45; కథలు - గాథలు 2వ భా. 211-12)

ఇప్పటికి యేడెనిమిదేళ్ళ కిందట నారాయణదాసుగారున్నూ, నాగభూషణంగారున్నూ యేదో లయజ్ఞానం విషయంలో పట్టింపులు పట్టించుకుంటూ వుంటే నేను "అనునయం" అనే శీర్షికతో వక దీర్ఘ వ్యాసం వ్రాసి (కృష్ణాపత్రిక) రాజీ చేశాను. అందులో నారాయణ దాసుకూడిరిగా యితడున్నూ స్వయం గురుడు అని వ్రాశాను. దాన్ని మాత్రం యితడు అంగీకరించక తనకు ఫలానా ఫలానావారు గురువు లున్నారని వారిపేర్లు వుదాహరించివున్నట్టు జ్ఞాపకం.

(ఆంధ్రవాణి, 23-3-46; కథలు-గాథలు 2వ భా. 694)

వికారి సంవత్సరంలో ఖాసింకోట జమీందారుగారి తోబుట్టువు వివాహానికి శ్రీయుతులు పోలవరపు జమీందారుగారు, కిర్లంపూడి

వారు లోనైన జమీందార్లు, యింకా మఱికొందఱు విచ్చేశారు. దానికి కిర్లంపూడివారితో మేం కూడా వెళ్ళడం తటస్థించింది. హరికథాపితా మహులు నారాయణదాసుగారు కూడా వచ్చారు. దాసుగారిని వినడమే గాని అప్పటికి మేం చూడలేదు. ఆయనతో యెవరు యే విధంగా చెప్పి వున్నారో తెలియదు. మమ్మల్ని యీ విధంగా ప్రశ్నించారు ఆయన. "ఏమయ్యా! వేంకటశాస్త్రీ! మీరు నన్ను కవిగా అంగీకరిస్తారా? గాయకుడుగా అంగీకరిస్తారా?" అని ప్రశ్నించేటప్పటికి "మీరు హరి కథకాగ్రేసరులు. హరికథకులకు గానప్రజ్ఞా ఉండాలి, కవనప్రజ్ఞా వుండాలి. యింకా చాలా ప్రజ్ఞలు వుండాలి. మీరు అన్ని విద్యలకూ నివాస స్థానంగా మాబోంట్లు చెప్పుకుంటారు." ఈరీతిగా యెన్నిసార్లు నిష్కపటంగా నేను చెప్పినా "ఇలా కాదు, యేదో వక విద్యను నిర్ధారణచేసి చెపితేనేగాని నా మనస్సుకు సంతుష్టి లేదు" అని పట్టుకొని వేధించేటప్పటికి గత్యంతరం లేక "మీకు నిరుపమానత్వం రావలెనంటే గానంలో వస్తుంది కాని, కవనంలో రాదు. కారణం కవులలో మీవంటివారు మఱికొందఱు దొరుకుతారు. గానంలోనో మీ గాత్రంవంటి గానమాధుర్యం 'న భూతో న భవిష్యతి.' అనేటప్పటికి ఆయనకు చాలా కోపం వచ్చింది. తోకతొక్కిన పాముగా పరిణమించి తిట్టడంకూడా జరిగింది. యిటీవల మళ్ళా కొలది వత్సరాలలో స్నేహితులమైనాం. నే నంటే చాలా ప్రేమగా చూచేవారు. నాకంటే సుమారు పదేళ్ళు ఆయన పెద్ద. నావలె కాక యావజ్జీవమూ బలిష్ఠులుగా, సుఖిగా కాలం వెళ్ళబుచ్చిన మహనీయుడాయన. చెప్పొచ్చేదేమంటే, దాసుగారు కూడా త్యాగయ్యగారివలెనే రచనాశక్తి కలవారైనా వారివంక్తిలో చేరుటకు సందేహిస్తారు."

(ఆంధ్రవీక్లీ, 1948; కథలు-గాథలు 2వ భా. 906 - 907.)



సర్వసత్కళా కౌశల ధూర్వహుండు
మహామహుండు హరికథా పితామహుండు.



శిష్యవాత్సల్యంబు చెలువుదీర్చినమూర్తి
సరిలేని దేశిక చక్రవర్తి

# హరికథా పితామహుడు

శ్రీ దివాకర్ల వేంకటావధాని

దక్షిణాంధ్రయుగమున నాంధ్రవాఙ్మయమందు యక్షగానములు తండోపతండములుగా రచింపబడినవి. అవి సంగీతాభినయ ప్రధానమైన దేశిరూపములు. అప్పటి రచయితలు కొందరు తమ యక్షగానములను నాటకములనిగూడఁ బేర్కొనియున్నారు. కాని సంస్కృతనాటకముల కును వానికిని సామ్యముకంటె వైషమ్యమే యెక్కువగా గోచరించును. ఇప్పు డాంధ్రమున మనము చూచు నాటకములకు యక్షగానములు కాక సంస్కృతనాటకములో ఆంగ్లనాటకములో ఆదర్శములని చెప్ప వలయును. యక్షగానము లాంధ్రమున నాటకరచనమునకుఁ గొంత ప్రోత్సాహ మిచ్చినను వాని నిజమైన పరిణామము హరికథలలోఁ గన వచ్చునని విమర్శకులు చెప్పుదురు. ఆంధ్రమున హరికథలు క్రీ॥ శ॥ 19వ శతాబ్ది ఉత్తరార్ధమునందే ఆరంభమైనవి. యక్షగానము లంతకు పూర్వ మునుండి కనిపించును. అవి ప్రధానముగా దృశ్యకావ్యములు. అందు నేపథ్యధారణముతో పాటు పాత్రప్రవేశసూచనలు, ఎడ నెడ సంవాద ములు, సూత్రధారోక్త సంధి వచనములు కూడ గోచరించును. హరికథ లందు సైతము సంగీతాభినయాదులున్నను అవి హరికథకుఁ డొక్కఁడే గానోపన్యాస వ్యాఖ్యాన పూర్వకముగా చెప్పఁదగినట్టివి. వాని నభినయ పూర్వకముగా నుపన్యసింపవచ్చునే కాని ప్రదర్శించుటకు వీలు లేదు. యక్షగానముల నించుక మార్పుతో హరికథలవలె గానాభినయ పూర్వ కముగా నుపన్యసించుటకుఁ గూడ నవకాశమున్నది. యక్షగానములం

దును హరికథలందును వచనము లుండునుగాని, హరికథలందలి వచనములు వర్ణనాత్మకములై సుదీర్ఘములుగా నుండును. ఈవిధముగా హరికథా యక్షగానములకు గొంత తారతమ్యమున్నను ఆ రెండింటను దేశి మార్గములకు జెందిన గేయములు, పదములు హెచ్చుగా నుండుటచే తను, ఆ రెండింటను గానాభినయములకు ప్రాధాన్య ముండుటచేతను పండితులు కొందఱు హరికథలను యక్షగానములనియే పేర్కొనియుండిరి. 19వ శతాబ్ది ఉత్తరార్ధమున అనంతపుర మండలమందలి హిందూపురమునకు జెందిన శ్రీ బాగేపల్లి అనంతరామాచార్యులవారు హరికథోపన్యాసకులుగా ప్రసిద్ధి కెక్కుటయేగాక పది పండ్రెండు హరికథలను గూడ రచించియుండిరి. వానిలో గొన్నిటిని వారు యక్షగానము లని పేర్కొనియుండిరి. యక్షగానములందు నాటక హరికథారీతులు రెండును కనిపించును. ప్రదర్శన యోగ్యతనుబట్టి అవి నాటకములుగాను, తాళలయాన్వితములైన దేశికవితారీతుల ప్రాచుర్యమునుబట్టి హరికథలుగాను పరిణమించినవని చెప్పవచ్చును.

ఆంధ్రమున హరికథా ప్రక్రియ కపార ప్రాచుర్యము కలిగించిన అపూర్వ ప్రతిభా పాండిత్యపథోధులు కీ॥ శే॥ అజ్జాడాదిభట్ల నారాయణ దాసుగారు. వారికి తల్లిదండ్రులు పెట్టినపేరు సూర్యనారాయణ. కాని వారు హరిదాసులుగా ప్రఖ్యాతులైన పిమ్మట నారాయణదాసను నామమే అధిక ప్రాచుర్యము పొందినది. వారు బాల్యముననే జీవత్పితృకతా భాగ్యమును గోల్పోయిరి. తల్లి లక్ష్మీనరసమాంబగారు కనిష్ఠ పుత్రులైన వారిని బుజ్జగించి భాగవతమందలి కొన్నిఘట్టములతో పాటు భాగవతతత్త్వమునుగూడ వారికి జక్కగా బోధించిరి. పద్వర్ష దేశీయమైన ప్రాయముననే వారు పోతన భాగవతమందలి వామనచరిత్రము నంతను శ్రావ్యముగా పాడి పార్వతీపురమునందలి పెద్దలను ముగ్ధుల నొనరించి యుండిరట!

ఒకప్పుడు వారు తల్లిగారితో శివరాత్రిసందర్భమున గుంప గ్రామమున జరుగు తీర్థమునకు బండిలో నరుగుచు నొక పుస్తకములఅంగడిలో నాంధ్రభాగవతమును గాంచి యానందతుందిలహృదయులై బండినుండి దిగి, యా గ్రంథము తమకిమ్మని యచ్చట వర్తకుని వేడిరఁట. రంగయ్య యను పేరుగల యా వర్తకుఁడు వయస్సునుబట్టి వారు భాగవత మేమి చదువఁగలరని భావించి "నీ వెక్కడ ? భాగవత మెక్కడ ?" అని వేళా కోళము చేసెనఁట. నారాయణదాసుగారు ఖిన్నులగుట చూచి బండిలో నున్న తల్లిగారు వారు నిజముగాఁ జదువుకొందురను నాసక్తితోనే యా గ్రంథము నర్థించిరని చెప్ప రంగయ్య యాశ్చర్యపడి వారిని భాగవతమునందలి కొన్ని భాగములను జదువు మనెనఁట. అంత దాసుగారా భాగము లన్నిటిని స్పష్టముగను, శ్రావ్యముగను జదువ నతఁడు సంతోషించి భాగవతముతోపాటు మైనురూప్యములను గూడ వారి కిచ్చి సంతోషపఱచెనఁట, దీనినిబట్టి దాసుగారికి బాల్యమునందే భక్తియు నాంధ్రభాషాసక్తియు నలవడెనని తెలియుచున్నది. తరువాత వారు పాఠశాలలోఁ జేరి యుత్సాహమున విద్యాభ్యాసము కావించుచు పదునాఱవయేట మెట్రిక్యులేషను పరీక్షలో నుత్తీర్ణులైరి. పిమ్మట ఎఫ్. ఏ. కూడా చదివి కళాశాలావిద్యాభ్యాసము ముగించి సంస్కృతము, ఉర్దూ, పారసీకము, అరబ్బీ మున్నగు భాష లెన్నో నేర్చుకొని వానివాందు త్తమమైన పాండిత్యము గడించుటయేకాక కవిత్వముకూడ చెప్ప నేర్చి విద్వాంసుల మన్నన లందిరి. ఈ విధముగా వారు గురుముఖమున నభ్యసించిన విద్యకంటె స్వయఁకృషిచే నలవఱుచుకొన్న విద్యయే మెక్కువ.

ఆంధ్రగీర్వాణములందు మహాకవి యగుటకుఁ దగిన ప్రతిభా పాండిత్యములు కలవారయ్యును, బాల్యమునందే ఆ యుభయభాషలందును కవితారచన కావించుట ప్రారంభించినవారయ్యును, దాసుగారు హరికథ కాగ్రగణ్యులు కావలెనని భగవంతుఁడు నిర్దేశించి యుండుటచే వారు సంగీతమును, వీణావాదనమును, అభినయమును బాగుగా నేర్చుకొని

హరికథలు చెప్పుట కారంభించిరి. మొట్టమొదట దాసుగారిచే హరికథా కాలక్షేపము చేయించి యుదారముగా సత్కరించిన గౌరవము బరంపుర నివాసులైన జయంతి కామేశముగారికి దక్కినది. అప్పటినుండి దాసుగా రాంధ్రదేశమునందే కాక మదరాసు, మైసూరు మున్నగు పర ప్రాంతములందుఁ గూడ హరికథలు చెప్పి అచ్చటిపెద్దలచే అఖండసత్కారము లందఁజాలిరి.

సాహిత్యము, సంగీతము, నాట్యము, కవిత్వము మున్నగు కళల యందారితేరి యుండుటయే కాక ఉత్తముఁడైన శ్రీహరి కథకుఁడు, బహుపురాణ విజ్ఞాననిధియు, వాగ్మియు, హాస్యచమత్కారనిపుణుఁడును ధారణాశక్తిసంపన్నుఁడును గూడ నై యుండవలయును. అట్టివాడు కాని యతఁడు పండిత పామర జనరంజకుఁడు కాఁజాలఁడు. అదృష్టవశమున దాసుగారియందు హరికథకుని కుండవలసిన పై లక్షణము లన్నియు పుంజీకృతములై యున్నవి. సంగీతమున జంత్రగాత్రములందు వారికున్న ప్రజ్ఞ అప్రతిమాన మైనది.

ఒకప్పుడు వా రన్నగారితోఁ గూడ బెంగుళూరు మైసూరు నగరముల కరిగి యచ్చటి మహావిద్వాంసులను తమ సంగీత కళాకౌశలముచే నాశ్చర్యచకితులను గావించి, మైసూరు మహారాజుగారినికూడ నాకర్షించి వారిచే నపూర్వ సత్కారము లంది వచ్చిరి. వారికిఁ గల లయజ్ఞాన మనన్య దుర్లభమని పెద్దలు చెప్పుదురు. ఒక సందర్భమున - వారు షణ్ముఖిరాగ ప్రదర్శనమున నప్పటి చల్లపల్లి జమీందారుగారిని మెప్పించి వారిచే గజారోహణోత్సవమును, గండపెండేరమును బొంది యపార ప్రఖ్యాతి నార్జించిరి. ఆనందగజపతి మహారాజులుంగారు వారి బహుముఖ వైదుష్యము నాకర్షించి వారిని తమ యాస్థానమున విద్వాంసులుగా నియమించి గౌరవించిరి. విజయనగరమందలి సంగీతకళాశాలలో సుమారు పదునేడు వత్సరములు వా రధ్యక్షులుగా నుండి తమ సంగీత పాండితీ విధానమును పలువురు శిష్యులకు పంచిపెట్టిరి.

దాసుగారు సంస్కృతాంధ్రములందే కాక పెక్కితర భాషలయం దును కవిత్వము చెప్పఁజాలియుండిరి. తెలుఁగున జానకీశపథము, రుక్మిణీ కల్యాణము, గజేంద్రమోక్షము, ప్రహ్లాదచరిత్ర, ధ్రువోపాఖ్యానము, మార్కండేయోపాఖ్యానము, భీష్మచరిత్రము, సావిత్రీచరిత్రము, భగవద్గీత (వేల్పుమాట), యథార్థ రామాయణము మున్నగునవి వారు రచించిన హరికథలు. సాధారణముగా హరిదాసులు పలువురు దాసుగారి కథలనే వల్లించి హరికథాకాలక్షేపము చేయుచుందురు. అవి యొకవంక గంభీర భావసంపదకును, ఇంకొకవంక మృదుమధుర పదప్రయోగమునకును, వేఱొకవంక రసభరితమైన కవితాసంపదకును, వేఱొకవంక నవరస భరితములైన కవితాసంపదకును ఆలవాలములై యలరారుటయే యందుకుఁ గారణము. దాసుగారివలె సంగీత సాహిత్యములందును, కవితా కౌశలమునందును సమానప్రజ్ఞగల హరికథా రచయిత లెందఱో యుండరు. వారి వర్ణనలు సహజములును, భావగంభీరములునై దృశ్యమును పఠితలకు సాక్షాత్కరింపఁజేయఁజాలి యుండును. హరికథలలో వా రెడనెడ రచించుచుండు దీర్ఘవచనము లర్థాలంకార బంధురములై అనుప్రాసాది శబ్దాలంకారముల కాలవాలములై వినువారికి వీనులవిందు చేకూర్చుచుండును. ఇన్ని గుణవిశేషము లుండుటయే హరిదాసులు పలువురు వారి రచనలను వల్లించుటకుఁ గారణము. అవి హరిదాసులకు జీవనోపాధిని, యశస్సంపదను జేకూర్చుటయే కాక సాహిత్యవైభవమును గూడ కల్గింపఁజాలిన కావ్యఖండములు. ఈ హరికథలను రచించువట్ల దాసుగారా యా సందర్భములం దౌచిత్య పరిశీలన దృష్టితోఁ గొన్ని మార్పులను గూడఁ గావించియుండిరి. వాలివధ, అహల్యాసంక్రందనవృత్తాంతము మున్నగువానిని తమ యథార్థ రామాయణమునుండి వారు తొలగించుట యిందుకు నిదర్శనము. హరికథలు కాక దాసుగారు పెక్కు శతకములను, కావ్యములను, విమర్శనలను గూడ వెలయించి యుండిరి. రామశతకము, శివశతకము, ముకుంద శతకము, మృత్యుంజయ శతకము, సూర్యనారా

యణ శతకము, సత్యవ్రత శతకము, వేల్పువంద, నూరుగంటి అనునవి వారు రచించిన శతకములు. బాటసారి యను పేర వారు రచించిన కావ్యము తాత్త్వికార్థ సంభరితము, రసవత్కవితా కమనీయములై పెక్కుసార్లు కళార్థులకు పాఠ్యముగా నియమింపఁబడి ప్రసిద్ధి నందినది. దాసుగారు కాళిదాసు, షేక్స్పియరు కవుల కవిత్వములందలి సొగసులు ప్రదర్శించుచు "నవరస తరంగిణి" యను విమర్శక గ్రంథమును వెలయించిరి. ఇది వారికి సంస్కృతాంధ్రములందే కాక, ఆంగ్లమునందుఁ గూడఁ గల యపూర్వ పాండిత్యమునకుఁ దార్కాణము. 'ఋక్సంగ్రహ' మను పేర వారు ఋగ్వేదమునందలి ఋక్కులను గేయములుగా ననువదించిరి. విష్ణు సహస్రనామములను "వెన్నుని వేయిపేరుల వెనుకరి" యను పేర నచ్చతెలుఁగున ననువదించిరి. దాసుగారి బహుభాషా పాండిత్యమునకును, కవితా కౌశలమునకును నిదర్శనమని చెప్పఁదగిన మరొక గొప్ప గ్రంథము "ఉమర్ ఖయామ్" రుబాయతుల అనువాదము. వారు పారసీకమునందలి యా మధురవృత్తముల తెనుఁగు సంస్కృతములలోనికి రసవంతముగాఁ బరివర్తనము చేసియుండిరి. ఇవిగాక వారు 'పురుషార్థ బోధిని' మున్నగు నితర గ్రంథములను గూడఁ దెనుఁగున వెలయించియుండిరి.

దాసుగారికి తెనుఁగుభాషయందలి తియ్యఁదనముపై మక్కువ యెక్కువ. "మొలక లేఁతఁదనము తలిరుల నవకంబు, మొగ్గసొగఁదనము, పూవుతావి, తేనెతీయఁదనము తెన్గునకే కాక పరుష సంస్కృతాఖ్య భాష కేది?" యని వారు వ్రాసిన పద్య మిందుకుఁ దార్కాణము. అందుచేతనే వారు తమ రచనలు పెక్కచ్చతెనుఁగుననే రచించియుండిరి. అచ్చతెనుఁగు నంత అక్రమముగా నతి ధారాళముగా రచించునేర్పు దాసుగారి కలవడినట్లు మఱి యెందఱికో యలవడి యుండలేదని చెప్పుటలో నతిశయోక్తి యుండదు. ఎంత క్లిష్టగంభీరభావములైనను వారు క్రొత్తపదములు, పదబంధములు సృజించి యలవోకగాఁ జెప్పివైతురు.

వారి రుబాయతులు, నూరుగంటి, వేల్పువంద మున్నగునవి పరిశీలించిన నీ విషయము తేటతెల్లము కాఁజాలును.

దాసుగారు సంస్కృతమున కాశీశతకము, రామచంద్ర శతకము అను శతకములను, హరికథామృత మను హరిగాథను, తారక మను కావ్యమును రచించిరి. ఆంధ్రమందువలెనే సంస్కృతమందుఁగూడ వారి రచన భావగంభీరమును, ధారాశుద్ధిశోభితమును నై యలరారుచుండును.

దాసుగారిట్లా యా భాషలలోనే కాక నాలుగైదు భాషలలో నొక్కొక్క భాషయం దొక్కొక్క పాదము చొప్పున చెప్పిన పద్యములు కూడ కొన్ని గలవు.

(శ్రీ) దాసుగారు బహుముఖప్రతిభావంతులైనను హరికథాప్రవచనమున వారికిఁగల యనన్యసాధారణమైన కౌశల మితర ప్రజ్ఞల నన్నిటి నతిక్రమించి వారి కఖండమైన యశస్సు నార్జించినది. వారు హరికథ చెప్పుచుండఁగా విను భాగ్యమునకు నేను నోచుకొనియుండలేదు. కాని వారు మధుర గంభీరమూర్తితో నిలఁబడి పాటలు పద్యములు పాడుచు విశేషార్థములను వెల్లడించుచు, నెడ నెడ నాట్యము, హరికథోపన్యాసము కావించుచుండ సాహితీ సంగీత నృత్య సరస్వతు లేకమూర్తి ధరించి సాక్షాత్కరించిన ట్లుండెడిదని చూచినవారు చెప్పుదురు. హరికథాకథనమున వారి ప్రజ్ఞ శ్లాఘాలంఘనజాంఘికమైనట్టిది. వారి శిష్యులనిపించుకొనుట ఆంధ్రప్రదేశమున హరిదాసుల కొక యపూర్వ గౌరవము. ఈ విషయమున దాసుగారిని సుగృహీత నామధేయులైన తిరుపతి వేంకట కవులతోఁ బోల్చవచ్చును. ఆధునిక యుగమునందలి కవులకు తిరుపతి వేంకట కవులు కవితాగురువులని చెప్పుకొనుట యెంతపరిపాటియో అంత సత్యము. దాసుగారి హరికథాప్రవచనమునందలి మరొక విశేషము వారు హరికథల నాశువుగాఁ జెప్పఁజాలుట. ఇతరులవలె వారు హరికథలను శ్రమపడి వల్లింపవలసిన అక్కఱ లేకుండెడిది. ఒకప్పుడు వారు హరి

కథ చెప్పుట కారంభించుచు "హరికథ కావలెనా, గిరికథ కావలెనా" అని సామాజికుల నడిగిరనియు, నప్పుడు సామాజికులు వారిని పరీక్షించుటకై గిరికథయే కావలెనని పలుక వా రాశువుగా గిరిజా కళ్యాణమును జెప్పి వారి నలరించి రనియుఁ" జెప్పుదురు. వారి పాండితీ కవితా ప్రాగల్భ్య మట్టిది!

దాసుగారు సుందర గంభీర విగ్రహులు. ఐహిక భోగములందు వలెనే ఆముష్మిక సౌఖ్యములందును ఆసక్తిగలవారు. వారు జీవించి నంతకాలము ఏ లోపమును లేక సర్వభోగముల ననుభవించిరి. వారెంత భోగానురక్తులో అంత భక్తాగ్రేసరులు. వారియందలి అపారమైన భక్తి సంపదయే వారిచే నన్ని భక్తిపూరితములైన హరికథలు, కావ్యములు వ్రాయించినది. వారు శ్రీచక్రము నారాధించెడివారనియుఁ బరమేశ్వరీ కృపాపాత్రులై యుండిరనియుఁ జెప్పుదురు.

ఒకప్పుడు వారి మనుమఁడు మశూచివ్యాధి కగ్గమై యపాయదశ యందుండ వారు పరమేశ్వరుని ప్రార్థించి తత్కృపచే మనుమని ప్రాణములు దక్కించుకొనిరని చెప్పుదురు.

శ్రీ నారాయణదాసుగా రాధున కాంధ్రదేశమునఁ బలు తావులందుఁ బలువురిచే పలువిధములైన సత్కారము లంది ఆచంద్రతారార్కమైన యఖండ యశస్సు నార్జించిన అప్రతిమాన ప్రతిభాశాలురు. ఆయన ప్రతిభవలెనే వ్యక్తిత్వమును అపూర్వమైనది. ఆంధ్రుల ప్రతిభా పాండితీ శౌండీర్యముల కాదర్శముగాఁ జెప్పఁకొనఁదగిన అపూర్వ మేధానిధి శ్రీ దాసుగారు. ఆంధ్రదేశము కీర్తి నఖిలాశల నలమఁ జేసిన యీ మహనీయమూర్తి యాంధ్రుల కెల్లరికి ననవరత స్మరణీయుఁడు.



# మహానటుడు

కీ. శే. స్థానం నరసింహారావు

రంగస్థలాన నటించే మేమంతా కవివ్రాసిన నాటక పాత్రముల సంభాషణలను ఎన్నాళ్ళనుంచో వల్లించుకొంటూ, కంఠస్థం చేసుకుంటాం. వాటిని రంగస్థలాన వల్లిస్తాం. అందుకొరకు మూడు నాలుగు గంటల కాలం వేషాలు వేసుకుంటాం. ఇంత చేసినా, ఎంతకష్టపడినా ఒక్కొక్క ప్పుడు మా పాత్రముల తత్త్వాల్లో జీవించలేక మా వ్యక్తిత్వాలతో బయటపడుతూ వుంటాము.

దాసుగారి విషయంలో అల్లాకాదు. ఆయన చెప్పే కథలోని అన్ని పాత్రముల్లోనూ ఆయన జీవిస్తాడు. అంతేకాక ఆడి, పాడి మాటాడి అభినయిస్తూ తన పాత్రములవెంట తన మనస్సును నడిపిస్తాడు. కాదు; లాక్కొని పోతాడట. ఆయన హరిదాసు వేషం మాత్రం మారదు. ఆ మీసాలూ, ఆ బొజ్జా, మెళ్ళో పూలమాలికా నడుంకు కట్టిన ఆసిల్కు ధోవతి దానిపై చుట్టిన కుచ్చుగల కాశ్మీర్ జరీశాలువా, కాళ్ళ గజ్జెలు, చేతిలో చిరతలూ అన్నీ కనిపిస్తూనే వుంటాయి. మనం వాటిని చూస్తున్నట్లే వుంటాం కాని అంతగా గమనించం. అందులోంచి వెలికివచ్చే ఆపాత్రములనూ వాటిభావాలనూ మాత్రమే గమనిస్తూ ఉంటాం.

ఆయన వాక్శుద్ధంలోనూ, భావప్రకటనలోనూ ఆంగిక చలనం లోనూ, విసిపించే 'సీతాకళ్యాణం'లోనూ ఒక గంభీరుడైన రావణబ్రహ్మ

కనిపిస్తాడు. మహోదాత్తుడైన విశ్వామిత్రమహర్షి కనిపిస్తాడు. నవ మన్మథుడైన రామచంద్రుడు కనిపిస్తాడు. నవకోమల కన్యారత్నం సీతా, ఆమె చిరునగవు, సిగ్గూ కనిపిస్తాయి. ఒకదాసి, ఒకభటుడు, ఒకమంత్రి, వారు వీరననేమిటి, కథలోవచ్చే పాత్రములన్నీ మన స్వత్వాలతో వాటి రూపాలతో మనకు కళ్ళకు కట్టినట్లుగా కనిపిస్తాయి. తుదకొక్కమాట అన్ని వేషాలూ వేసి మెప్పించడానికి ప్రయత్నించే నటులకంటే అసలు వేషాలే ధరించకుండా వాటి మన స్వత్వాలను, మనముందు స్వభావ సిద్ధంగా ప్రకటించడంలో ఆయన ప్రతిభ అసమానం. అద్భుతం. ఆనంద ప్రదం. ఆయన ఆత్మశక్తి అచంచలం. పాండిత్యం అపారం. అందలి అంతరార్థం పరమార్థం. భావప్రకటనలో అస్మదాదులకు ఆదర్శం. అందులకే ఆయనను మహానటుడని స్మరిస్తూ వుంటాను."

[ఇది చీరాల సంస్కృతి సమితి ప్రకటించిన నారాయణదాస జయంత్యుత్సవ సంచికలో స్థానంవారు వ్రాసిన వ్యాసంలోని భాగము --- సంపాదకుడు]

[విజయనగరం బళ్లారి రాఘవ మెమోరియల్ అసోసియేషన్ వారు జరిపిన రెుుక మహాసభలో స్థానంవారు చేసిన ప్రసంగంనుండి శ్రీ కర్రా సూర్యనారాయణగారు సేకరించిన పంక్తులు. చూ. పూర్వోదాహృత సంచిక-పుట 242. —సంపాదకుడు]

"శ్రీ నారాయణదాసుగారు నటకావతంసులు. ఆయనకు ఇతర నటులకు చాలా భేదం ఉంది. మాట వరసకు నేనే ఉన్నాను అనుకోండి. "జవ్వారీబాయి" వేషం వేస్తాను. చీరకట్టి రైక తొడిగి కొప్పుముడిచి కాటుక పెట్టి మొగమునకు (మీసములేనిదానికి) కోటా పూస్తాను. ఆడుతొడుపులన్నీ ధరిస్తాను. తీరా స్టేజి మీదకు వచ్చి జవ్వారీ పాత్ర నభినయిస్తూంటే పైట జారినా సర్దుకోవడం అలవాటులేక మానివేయుగా ఒక ప్రేక్షకుడు వెటకారంగా "కిటికీ మూసేయమ్మా" అంటాడు. నాటకంలో అభినయిస్తున్నది 'స్థానం' అంటారు. కాని జవ్వారీబాయి అనే భ్రమ వారికి నూటికి నూరుపాళ్ళు కలుగదు. ఇంత చేసినా నేను ప్రేక్షకులను భ్రమ కల్గింపలేకపోయాను.

ఇక శ్రీనారాయణదాసుగారికి పైన పేర్కొన్న పరికరములేవీ లేవు సరికదా కాళ్ళకు గజ్జెలు, చేతిలో తాళపు చిప్పలు, సింహతలాటపు మురుగులు మూతికి అందమైన మీసాలు, లాంగని బిరుసుజుత్తు క్రొమ్ముడి, దానిపైన పూలదండ, గంధంమీద అద్దిన కుంకుమబొట్టూ ప్రస్ఫుటంగా కనపడుతూవుంటాయి. ఇందులో ఆడుది అని భ్రమింపజేసే పరికరాలేవి ? అయినప్పటికి కథా మధ్యలో "రుక్మిణి ఇలాగ అన్నది" అని బుగ్గమీద వేలు పెట్టుకొని ఆయన అభినయిస్తే నిజంగా రుక్మిణియే యెదురుగుండా వున్నదా ? అనుకుంటాము. మూతిమీద మీసాలు మరచిపోతాము. ఇదీ ఆయన విశిష్టత. మాకూ ఆయనకూ ఎంత దూరమున్నదో గమనార్హము."



# సర్వతంత్ర స్వతంత్రుడు

శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య

నారాయణదాసుగారితో కొంచెముగనో గొప్పగనో పరిచయము గల నావంటివారికి, వారిలో కనుపించిన ప్రధానలక్షణము వారి ఆత్మవిశ్వాసము. ప్రపంచములో తాను స్వయంకృషిచే సాధించజాలని విద్య ఎట్టిదీ లేదను ధీమాలో వారు జీవితయాత్రను సాగించినారు. ఇట్టి విశ్వాసము వారికి కుదురుటకు పోతనమహాకవి పాండిత్యమువలె వారిది కూడా సహజపాండిత్య మగుటయే కారణము. జన్మతః శక్తిసామర్థ్యములు కలవారు మాత్రమే ప్రతిభావంతులు కాగలరనుట వారినమ్మకము. దీనినిగురించి పదేపదే వారు మిత్రులతో ప్రస్తావించుచుండువారు.

వారు గురుముఖమున ఏ విద్యనూ నేర్చుకొనలేదు. అట్లు నేర్చుకొనుట స్వీయ ప్రతిభకు ఆటంకము కలిగించుననియు, అట్లు నేర్చుకొన్నవారు "ప్రాచదువుల బిక్కపెట్టి గుడ్డెద్దు చేలబడునట్లు" ప్రవర్తించువారనియు వారు భావించిరి. వారి గ్రంథములన్నిటిలో అత్యంత హృదయ రంజకమగు యథార్థరామాయణములో "సహజ పాండిత్య విలాస నారాయణదాస" అనియు, అంబరీషచరిత్రములో "సహజ పాండిత్యమున గావ్యసరణి జేసి యెల్లర హితము గోరెద నేకదంత నేను" అనియు చెప్పిరి. కర్ణాట హిందూస్థానీ బాణీల రెండింటినీ సమన్వయించి, సరికొత్త ఫక్కిని అద్భుత సంగీత ప్రదర్శనము మైసూరు సంస్థానమునందు వారు గావించినపుడు మహారాజావారు వారి గానమును

అత్యంత శ్రద్ధతో మహారాణి సహితముగ ఆలకించి, "మీరు ఎక్కడ సంగీతము నేర్చుకొంటిరి ? అని ప్రశ్నింపగా, "నా సంగీత సాహిత్యములు సహజ పాండిత్యమేకాని యొకరివద్ద నేర్చుకొన్నవి కావు" అని జవాబు చెప్పిరి.

వారు అనువదించిన ఉమరుకయ్యాము పీఠికలో "ఇన్ని తెరగుల బుట్టుకతోనే వచ్చిన తెల్వితేటలతో నొరులవద్ద నేర్చుకొనకయే వేల్పు నుండి నాటు మాటల చెక్కుకబ్బము ల్లి పిన్న పెద్దల స్మెప్పించ" గలిగినట్లు వ్రాసినారు. ఉమరుకయ్యాము కూడా "తన పుట్టు తెల్వి తేటలనెల్ల బడిచదువుల నారితేరిన" వాడగుటచేత దాసుగారి ప్రశంసకు పాత్రుడయ్యెను. ఇటువంటి సహజ పాండిత్యసాధనమున వారు సంగీతము, సాహిత్యము, నాట్యము, పాత్రాభినయము, కవిత్వము, వేదాంతము, వ్యాకరణము, జ్యోతిషము, ఆయుర్వేదము మొదలయిన విద్యల యందును, సంస్కృతము, ఆంధ్రము, హిందీ, ఉర్దు, పారసీకము, అరబ్బి భాషలందును అసమానమైన పాండిత్యమును సంపాదించిరి. బాల్యమందు వారికి కుదిరిన ఆత్మవిశ్వాసము ఈ కారణమున సార్థకమయ్యెను. ✓

ఈ సార్థకమునే వారు యథార్థ రామాయణ పీఠికయందు సుస్పష్టముగా పేర్కొన్నారు. ఆదర్శ భాగవతోత్తముని కుండదగ్గ సుణగుము లన్నియు తనకు ఉన్నట్లు స్ఫురింపచేయుచు ఈ వాక్యముల రచించెను. "సహజ సంగీత సాహిత్య ప్రతిభాలంకృతుడయి, శ్రోత్రియ కుటుంబములో జన్మించి యైదేండ్ల వయస్సుగోపునుండియు, నాడినదాట పాడినది పాటగా నేకసంతాగ్రాహియై, జగదేక సహస్రవిధాల ప్రజ్ఞా ధురంధరుడై, యశేష దేవ దేశ్య భాషా విశేష పాండిత్య వైభవోపేత చతుర్విధానవద్య గద్య పద్య గేయ ప్రబంధ రాజముల స్వతంత్రముగా శరవేగమున గొంగ్రొత్త కల్పనము బన్ని, యపూర్వ చతుర్విధాభినయ చాతుర్యన గంభీర మధుర త్రిస్థాయి గమక రాగరూపా కలాప నైపుణ

న్గొండల న్నారు ప్రయోగించు సుస్నిగ్ధ దేవదత్త శంఖారావ రమణీయకంఠస్వర మూర్తీభూత నవ నవ రసస్ఫూర్తియై, సమవిభక్త దృఢారుణ సుందరాకారుడై, దినదిన ప్రవర్ధమాన యశస్సంపూర్ణ దశదిగంతరుడై ... కేవల వైదిక జీవనవృత్తి స్వరగుచు తా తరించి పరుల తరింపజేయు విష్ణు భాగవతోత్తముఁడీ జగమున నలరారుట మిక్కిలి యరుదు" అని చెప్పినారు. ఇందులో స్వశక్తిచే తాము ఆర్జించిన విద్యలన్నియు ప్రశంసింపబడినవి. వారి ప్రజ్ఞ అంతయు సహజమని వివరింపబడినది.

ఇంతటి ఆత్మవిశ్వాసము వారికి ఉండుటచేతనే వారు వారి రచనలు, హరికథలను ధనార్జనమునకుగాక ఆత్మసంతృప్తికొరకును, యశోభివృద్ధికొరకును సాగించెను. జీవితమును సుఖముగ గడుపుటకు రాజాశ్రయము అవసరము లేదను భావముతోడను, అట్టి ఆశ్రయము తన స్వాతంత్ర్యమునకు భంగకరమగునన్న కారణమునను మైసూరు మహారాజావారు ఇచ్చెదనన్న ఉద్యోగమును నిరాకరించెను. ఇందులో కూడా వీరికిని "పురంబులు వాహనంబులు సొమ్ములు గొన్ని పుచ్చుకొని చొక్కి శరీరమువాసి కాలుచే సమ్మెట పోటులంబడు"టకు ఇచ్ఛగించని పోతన మహాకవితో కొంతవరకు పోల్చదగియున్నారు. ఇద్దరూ పరమ భాగవతోత్తములు. భక్తియే మోక్షసాధనమని విశ్వసించినవారు. పోతన భాగవత గ్రంథముద్వారా ఆంధ్రజనావళికి భక్తి ప్రబోధము గావించిరి. దాసుగారు వారి హరికథలద్వారా అట్టి పనినే చేసిరి. వీరిద్దరి పరమార్థము ఒక్కటే. దాసుగారు మొదట చదివిన గ్రంథము; మొదట సంపాదించిన గ్రంథము భాగవతమే. వారు దానిని బాల్యములోనే దుకాణదారునివద్ద నుండి సొమ్మిచ్చిగాక, తన మధుర గానమును వినిపించి సంపాదించినారట. తాను గడించిన విద్యలను ధనార్జనకై వినియోగించుట పాపకారణమగునని, భావించి అట్లు చేయువారిని గట్టిగా నిరసించిరి. వారి గౌరమ్మ పెళ్ళిలో "దుడ్డుకై పాడిన దేద్పుకాని పాటయగునా – పొట్టకక్కూర్తి జెప్పినదేదో మొఱ్ఱగాని నిక్కపు చదువగునా ?" అని ప్రశ్నించినారు.

దాసుగారు తన సహజ పాండిత్యమును ప్రశంసనీయమని పలు మారు చెప్పుచుండ, వారిని విమర్శించిన పండితు లనేకులు అది అహంభావ సూచకమని వారిని నిందించుచు వచ్చిరి. దాసుగారు మహారాజుల నుండియు, వారి హరికథామృతమును పానముచేసిన సామాన్య ప్రజల నుండియు ఎన్నియో మెప్పులు, ప్రశంసలు, బహుమానములు సంపాదించిరి.

కాని, వారి సమకాలికులగు విద్వాంసులు వారి వైదుష్యమును గుర్తించుట కంగీకరించరైరి. గురుముఖమున సంపాదించని పాండిత్యము లోతు లేక పైమెరుగుపూతలతో కూడుకొన్నట్టిదనియు, ఎందులోను దాసుగారికి సంపూర్ణ పరిజ్ఞానము లేదనియు వారిలో కొందరు విమర్శించుచుండువారు. "కొలనువుకూటముల నృది బిళబిళ యన బాడియాడుచుండు" తన్ను నవిధముగ విమర్శించువారి విషయమై ఉమరుకయ్యాము పీఠికలో దాసుగారు వ్రాసిన వాక్యములు గమనార్హములు. ఉమరు కయ్యాముయొక్క ప్రతిభను గ్రహింపలేనివా రెందరో అతని కవిత్వమును ఖండించుచుండినట్లే ఆంధ్రదేశమందలి పండితులు తన రచనలను ఖండించుచుండిరని దాసుగారు భావించిరి. విమర్శకుడు కవి యంతటివాడయినప్పుడు విమర్శింప నర్హుడగును. కాని అట్టి విమర్శకులు ప్రపంచమందుండుట అరుదు. ఉమరు కయ్యాము చదువరి, మాటకారి, లయకాడు "ఆట పాట మాట చదువుల న్వేనవేల నిండుకొల్వుల మరపించు మాటకారి లయకాని మంచిచెడ్డలను హెచ్చుతగ్గుల న్వివరింపగలవాడంతవాడింకొక డున్నవ్వాడేగదా! నిజముగా నాడనేర్చినవాడు పాడనేరడు. పాడనేర్చినవా డాడజాలడు. మరియు నాడుచు న్పాడనేర్చినవాడెల్ల చదువు సందెల నారితేరి, నాటిమాటల న్వేల్పునుడుల న్గలగల్పు లేని కబ్బముల దనంతట న్దానెక్కటిగా బన్ని, తన పన్నికలన్తానే యాడుచెంతో దవ్వు కొండల న్మారుమ్రోగించు తీరున బాడి, చదివి వినిపించుచు, నిండురాజు కొల్వుల జూపరకు దీవు లొదవించు మై సొగసు

లావుకల్ముల నొక్కపోల్కి నీకువచ్చినది మొదలు మిగులు ముదుకుడై యును రున్నదనుక దనయూరి కెన్నియో యామడల చుట్టుపట్ల గల వీకుల నెంతయో యెనలేని వన్నెవాసుల న్గాంచుచు మరల దా గాపుర మున్న యూరు చేరగలిగిన మంచి తల్రవాలున నొప్పారు గొప్పవాని న్గూర్చి గుడివా రేవుగున్ బోల్చినట్లు చదువరులవలె మాటకారుల తీరున నాటపాటల నారితేరిన లయకాంద్ర పాలువునదుంవిరి పెంకెవడుచు వాంద్రు నాలుగెంగిలి ముక్కలు నేర్చుకొని యుంటించుకొన్న చదువు రంగుగోటున తమ యూరిలోనే తమ యింటివంచనే వెర్రిమొర్రి పెంకి పిల్లకాయల న్వెంట ద్రిప్పుకొనుచు దమ వెనుకటి చిన్నతనము నగుబాటు చాటు చేసికొని యవ్వాడే యూడివడ్డ తగువారివలె నొడలు విరుచుకొని విర్రవీగు కొంటెలు పుట్టు చేపగల మాటకారి లయకానిని నోచన్ గలరా?" ఈ ధోరణిలో దాసుగారు విమర్శకులగురించి అతి దీర్ఘముగ వ్రాసిరి. వారి అచ్చతెనుగు రచనలను విమర్శించినవారి గురించి "వేల్పు నుడులకు దుముపుల తోకలు తగిల్చియు, వేల్పునుడువుల తారుమారు గావించియు సమపల్కుల నందంద నతికి కలగలపు పాడుతెలుగు గీ నాటి తిప్పకాయ లల్లుచున్నారు. నిక్కముగా దేటనాటుమాట లాడగలవాడు గాని వ్రాయగల నేర్పరిగాని యరుదు" అని అన్నారు. ఇంతేకాదు, వీరు "చచ్చినవారల న్మెచ్చుచు బ్రతికియున్న యెట్టి చదువరి జెట్టినైన జుల కన చేయుచున్నారు."

అచ్చతెనుగు కావ్యముల విమర్శించినవారి కోవకు చెందిన మరి కొందరు దాసుగారు అరవలు మనోహరముగ పాడునట్లు అరవలయేసతో పాడుటలేదని చెప్పుచుండిరి. అట్టివారు ఈ కాలములో కూడ అనేకు లున్నారు.

అందుచేతనే ఆంధ్రదేశమందు జరుగు సంగీత సభలలో అరవ పాటగాంద్ర కున్నంత గౌరవము ఇప్పటికి కూడా తెనుగు గాయకులకు లభించుటలేదు. ఈ సందర్భములో దాసుగారు చెప్పినమాటలు గుర్తించ

తగ్గవి. "నిక్కముగ తెలుగువా డరపయేస న్నాడునా? తెగబుట్టు లెవ్వడైన తన బిడ్డను మలక పోలిక నుండగోరునా? ఎవ్వనిమ్ముటునకు వాడే ఎక్కువ యెవనిగొప్ప వానిది ... ఏ సీమవారి వారి కా సీసన్నాళ్లింటి నాటినుండి వాడుకలో నున్న యాట పాట మాట మీట మెలపులో జమై వింపు, ఎవరి వంటలు వారి వెవరి నడవడికలు వారి వేసీమ వల్కాలా సీమవారల కింపు. అద్దిరా యీ|వాత లీ కూత లీ మందలింపు లీ టక్కంబంపు లీ బొంకు లీ యుంకులు..."

ఎవరో ఒకరు "మీరు త్యాగరాజకృతులను పాడగలరా?" అని దాసుగారిని ప్రశ్నింపగా చెప్పిన జవాబు వారి ఆత్మవిశ్వాసమునకును, సహజ పాండిత్యమునందు వారికిగల అభిమానమునకును తార్కాణము. "ఎన్నియో కృతులను సునాయాసముగ అల్లగల నేను ఇతరుల కృతులను పాడవలసిన అవసరమేమిటి?" అని అన్నారు. ఇది నిజమే కదా! వారి హరికథలలోను, ఇతరత్రాను సుమారు వంద్రెండు వందల కృతులు వారు చేసియున్నారు. వాటిని పాడియేకదా! వీరు గాయక విద్వాంసులతో నిండిన రాజసభలలో మన్ననలను, సువర్ణ కంకణములను, గండపెండేరములను పొందగలిగినది? ఏ రాజులుకూడా వారిని త్యాగరాజ కృతులను పాడవలసినదిగా కోరినవారు కాదు. త్యాగరాజు, శ్యామశాస్త్రి కృతులను పాడినట్లుగాని, శ్యామశాస్త్రి త్యాగయ్య కృతులను పాడినట్లుగాని మనము వినియున్నామా?

మన స్తత్వములో ఉమరు కయ్యాముకును, దాసుగారికిని ఎంతో పోలిక ఉన్నందుననే వారు ఉమరు కయ్యాము రుబాయీలను సంస్కృతములోనికి, అచ్చ తెనుగులోనికి అనువదించారు. ఉమరు కయ్యాము ఐహికసుఖమే పరమార్థమని తన కవిత్వముద్వారా ఉపదేశించె నన్న పాశ్చాత్యుల వాదమును ఖండించి, అతని తత్త్వమంతయు ఆముష్మిక సౌఖ్యమునకు సంబంధించినదే అని ఋజువు చేయగలిగిరి. అతని రుబా

యాలను తెనుగుజేసిన ఉమ్రు ఆలీషా కవి యొక్కయు, దువ్వూరి రామిరెడ్డిగారి యొక్కయు అభిప్రాయ మిట్టిదే.

తమ భీష్మచరిత్రలో దాసుగారు చెప్పిన ఈ క్రింది పద్యము ఉమరు కయ్యాము తత్త్వములోని గూఢార్థమును స్పష్టపరచుచున్నది.

సీ. బ్రతికి యున్నంతకు స్వర్గ నరకముల
సంగతి దెలియ నసాధ్యము గద !
తరలిన వారలు పరలోక వార్తలు
జెప్పిరా మనతోడ నెప్పుడైన ?
మర్త్యుల నోళ్ళలో మఱియు వేదములకు
గన గన నొక మఱుక్క మొనయగలదె ?
దీప మారినయట్లు తెల్వి శూన్యంబగు
దేహాంతములయందు దెల్లముగను ;
మనకు గగనారవింద వర్ణనము లేల ?
ఇహమునందున స్వమతాభివృద్ధి మీర
నెల్ల రన్యోన్య మైత్రికి హేతువైన
ధర్మవర్తన మెపుడైన దప్ప జనదు.

ఆంధ్ర వాఙ్మయములో దాసుగారికి ఉన్నతస్థాన మున్నదన్న మాట వాఙ్మయ చరిత్రకారులు ఇప్పటికీ గ్రహించి యుండలేదు. యక్షగానములు వాఙ్మయములో ఒక్క ప్రధానశాఖయని గుర్తించినవారు యక్షగానములకు హరికథారూపమును కల్పించి, దానికి కొత్త సొగసులను చేకూర్చిన దాసుగారి ప్రజ్ఞ అసమానమైనది. గుర్తించుట న్యాయము కదా ? చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు చెప్పినట్లు వారు హరికథకు పితామహులు. హరికథలనే గాక ఇతర రచనల నెన్నిటినో దాసుగారు గావించియున్నారు. వానినన్నిటిని ప్రచారములోనికి దెచ్చుట మన ధర్మము.

# పరమ భాగవతుడు

శ్రీ కె. వి. యల్. నరసింహాచార్యులు

"మాంచ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే ।
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే ॥
(భగవద్గీత - 14 అ. శ్లో. 26.)

-: భక్తి నిర్వచనము :-

మానవుని ఋజుమార్గ ప్రవర్తక భావవ్యాపారమే భక్తి. కర్మ జ్ఞానముల కంటె భిన్నమగు భావబంధమే భక్తి. ఈ భక్తిబంధము దైవ మానవ సంబంధమును దృఢతరము కావించును. ఇదియొక ఉదాత్తమగు బంధము. "మహనీయ విషయే ప్రీతిః భక్తిః" అని యభియుక్తోక్తి కలదు. ఇది తైలధారవలె నవిచ్ఛిన్న స్మృతి సంతాన రూపమైనది. ఉపాసన మను నామాంతరముచే నొప్పుచున్నది. మానవు లందరును భక్తిమార్గమున కధికారులే. ఔపనిషదమగు నుపాసనాసిద్ధాంతమును, భగవద్గీతయందలి భక్తిమార్గ ప్రబోధమును మానవ మనోక్షేత్రము లందు భక్తిబీజముల నాటినవి. భాగవతబోధలు కూడ భక్తినే చాటి చెప్పినవి. శ్రీ శుకముఖగళితమగు :

"నివృత్త తర్షై రుపగీయమానాత్
భవౌషధాత్ శ్రోత్ర మనోఽభిరామాత్
క ఉత్తమశ్లోక గుణానువాదాత్
పుమాన్ విరజ్యేత వినాఽపశుఘ్నాత్"

అను సూక్తి భక్తిని, భగవద్గుణానుభవ రూపానువాదముగ చిత్రించినది. ఆత్మోపహారసికులు కానివారును, ఆత్మహననశీలురు కానివారందరును భక్తిమార్గము నవలంబింతురు. మూకరసనారుచివలె భక్తి స్వభావ మనిర్వాచ్యము. భక్తి, శ్రద్ధ కలవానికే లభించును. భక్తి మహా విశ్వాసపూర్వకము. భగవంతునియందు నమ్మక ముండవలయును. అద్వేషాభిముఖ్యములు భక్తికి పూర్వభావి భావములు. భగవంతుని గాంభీర్య, ఔదార్య, సౌశీల్య, సౌందర్య, ఔజ్జ్వల్యాద్యనంత కళ్యాణగుణ గణోపాసనమే, తద్ధ్యానమే భక్తి యనంబరగును. ముక్తిసాధ మార్గమున కర్మ, జ్ఞాన, భక్తి యోగములు సోపానత్రయ రూపమున నున్నవి. కర్మ, జ్ఞానములు భక్తిద్వారా మోక్షసాధకములు. భక్తియోగము సాక్షాన్ముక్తిప్రదము. భక్తిరూపాపన్న జ్ఞానమే మోక్షదము. శరణాగతి, వైకుంఠ, శ్రీరంగ గద్యత్రయకర్తలగు భగవద్రామానుజులును, భజగోవింద, కరావలంబ స్తోత్రకర్తలగు శంకర భగవత్పాదులును నీ పూర్వోక్తపరమ సత్యములచే ఉద్ఘాటించినారు. ఏ తత్ప్రథానువర్తులగు శ్రీ దాసుగారు తమ హరికథాత్మకకృతులందు భక్తిమార్గమునే ప్రబోధించినారు.

## -: నామ వైశిష్ట్యము :-

శ్రీ నారాయణదాసుగారు దాసనామధారులగుటలో విశేష మున్నది. నవవిధభక్తులలో దాస్యరూప భక్తి వీరి కభిమతము – అని ద్యోతక మగుచున్నది. కులశేఖరాళ్వారుల "తద్దాస దాస చరమావధి దాస దాస" భావమును వీరలవరచుకొన్నట్లు గన్పట్టుచున్నది. ఇది యాళ్వారుల పంథయే. భగవద్రామానుజ సిద్ధాంతమునందలి శేష శేషి భావమే దాసుగారి కృతులందు ప్రతిబింబించుట గాననగును. వీరి కృతుల యందు పూర్వాచార్యుల సూక్తులందలి భావములు కూడ మన మనో నేత్రములకు గోచరమగును.

భక్తిభరితములును, ఉజ్జ్వల శైలీ విరాజితములును, వేదాంత జటిలములును నగు వీరి కృతులు మానవాళికి మార్గదర్శకములు. ఇపుడు దాసుగారి కతిపయ కృతుల భక్తిదృష్టితో పరిశీలింతము.

1. శ్రీ హరికథామృతమ్ :-

ఈ సంస్కృత కృతియందలి ఇతివృత్తము భాగవతకథావస్తువగు శ్రీ కృష్ణుని యుజ్జ్వలామానుష చేష్టితములే. ఈ కృతి యొకవిధముగా అతి మానుష స్తుతియే. కృత్యాదియందే శ్రీ కృష్ణపరత్వ ముద్ఘాటితము. శ్రీ కృష్ణుడు భువనసుందరుడనియు, నారాయణదాస హృద్వాసుడనియు నభివర్ణించినాడు. అంతర్యామి తత్త్వనిరూపణ మిట గ్రంథకర్త యాశయమయి యుండవోవును. నిఖిలభువన రక్షణ నిబర్హణ ధురీణుడు శ్రియఃపతి యనుటలో కవి "యతో వా ఇమాని భూతాని జాయంతే, జాతాని జీవంతి యత్ప్రయం త్యభిసం విశంతి" అను శ్రుత్యర్థమును ప్రకటీకరించినాడు. దుష్టనిగ్రహ శిష్టపరిపాలన చతురు డనుటలో భగవదవతార రహస్యము నుగ్గడించినాడు. దుష్టనిగ్రహము సంకల్పమాత్రమున జరుగునని. శిష్టరక్షణమన్ననో భక్తజనులకు పొడసూపి వారికి బ్రహ్మానందానుభవ మొడగూర్చుటవలన సిద్ధించును. అటుగాకున్న భక్తుల కూరట గల్గదు కదా! శ్రీకృష్ణుడు విలాసార్థము భూమింగలుడనుటలో సృష్టిరహస్యము నుట్టంకించినాడు. "సోఽకామయత। బహుస్యాం ప్రజాయే యేతి" "స ఏకాకీ నరమేత" అను నౌపనిషద లీలాసృష్టి సిద్ధాంతము ననువదించినాడు. సర్వచరాచరాత్మకుడు అనుటలో అంతర్యామిత్వ ముద్ఘోషితము. చిదచిదాత్మకజగము సర్వము విష్ణుమయము. వ్యాపకత్వమువలన విష్ణు. వాసుదేవ శబ్దములు సార్థకముగదా? వేణుగానార్ద్రీకృత శిలాతరుషండుడనుటలో కూరత్తాళ్వార్ సూక్తులు ధ్వనించుచున్నవి. అతిమానుష స్తవమున పూర్వాచార్యులు వేణుగాన మాధుర్యమున రాల్లరగెనని వర్ణించినారు. మందబుద్ధియైన కురూపి అద్దము

నందు స్వస్వరూపము గాంచి యానందించు విధమున ఆత్మానందము కొరకు గ్రంథకర్త భగవద్గుణానుభవము సేయుచుంటి నని చెప్పికొని నాడు. "ఆత్మనః కామాయ సర్వం ప్రియం భవతి" యుని కదా యావ నిషదముగు ననుశాసనము. ఈయన ఉదరపూరక సేవావృత్తి శ్వవృత్తిగ భావించి గర్హించినాడు. భగవత్సేవావృత్తి నాదల ధరించినాడు. ఇట (శ్రీ) మద్వేదాంత దేశికుల వైరాగ్య పంచకచ్ఛాయలు దృగ్గోచరమగును.

కలియుగమున నామసంకీర్తనమే మోక్షదమని విజ్ఞుల యభిప్రాయము. తదనుగుణముగ నీ హరికథా కథన చతురుడు ఈశ్వర భజనము మోక్షదాయకమని యభివర్ణించినాడు. "న శ్రోత్రం విష్ణునామ శ్రవణ విరహితం కిం తు మృత్క్వాడ్య రంధ్రం." ఇత్యాది శ్లోకపాదములచే పోతనామాత్యు ననుకరించుచు ఈయన విష్ణునామ విశేషములను విస్తరించినాడు. "కమలాక్షు నర్చించు కరములు కరములు" ఇత్యాది పోతనామాత్య పద్యపాదము లీ శ్లోకమాతృకలు గానోపును. "ధన మతి బలనాశం కుర్వతే దుష్టనార్యో మధుముఖ విషకుంభాస్తా విదూరం త్యజామ" అని దాసుగారు వక్కాణించుటలో (శ్రీ) వేదాంతదేశిక సూక్తియగు "తరుణీకుణపంస భాభుజంగీం చ పరిహారతి గుప్తమాహాత్మ్యం" అను వచనపంక్తి యర్థ ముద్దిష్టము గానోపును. ప్రహ్లాదుని ప్రవిమల గుణుడని వర్ణించుటలో దాసుగారు పూర్వాచార్య పద్ధతి ననుసరించినారు. "ప్రహ్లాద నారద పరాశర పుండరీ"కేత్యాది శ్లోకమున భక్తకోటిలో ప్రహ్లాదున కగ్రస్థాన మీయబడినది. దాసుగారును ఈ బాల భాగవతోత్తమునకే యగ్రతాంబూల మిచ్చినారు. "జ్ఞానినో నావమంస్థాః" అనుటలో దాసుగారు భాగవతోపదేశ భావమును అనగా "నాహం విశంకే సురరాజ వజ్రాత్ । న త్ర్యక్షశూలాత్ న యమస్య దండాత్। శంకే భృశం బ్రహ్మకులావమానాత్" అను ప్రహ్లాదసూక్తి యంతరార్థమును విశదీకరించినారు,

భక్తి ఆత్యంతికము, నైకాంతికమునయి యుండవలెను. ఇది ఉపాసనా ముఖ్యలక్షణము. పూర్వాచార్యులు, పరమభాగవతోత్తము లీ యైకాంతికాత్యంతిక భక్తినే యనుష్ఠించినారు. "శ్రీనాథాన్యం మా బ్రూథాః" అనుటలో అన్యదేవతారాధనము నిషేధించినారు దాసుగారు. "నారాయణాన్యం మాశి శ్రియథాః" అను వచనముకూడ ఐకాంతికాత్యంతిక భక్తిస్ఫోరకమే. జ్ఞాన లవదుర్విదగ్ధత దాసుగారు ఖండించినారు. శ్రీమన్నారాయణుడే మోక్షప్రదాత యని చాటి చెప్పినారు. "స్మర నారాయణం మూఢ శాశ్వతానంద మాప్స్యసి" భక్తి ప్రభావితమై పశుపక్షిగణము చిత్రార్పితారంభమువలె నున్నది యని వర్ణించుటలో కూరత్తాళ్వార్ అతిమానుష స్తవచ్ఛాయ లున్నవి. "చిత్రీకృతో పశుపక్షిగణో బభూవ."

పరీక్షిన్మహారాజును ఆర్తప్రపన్నునిగా ప్రదర్శించినారు. "కాలస్సన్నిహితో మతి ర్విచలితా" ఇత్యాది శ్లోకమున పరీక్షిన్మహారాజును పరమార్త ప్రపన్నునిగా భాగవతపంథలో నిరూపించినారు. బ్రహ్మమును దాసుగారు అభిన్ననిమిత్తోపాదాన జగత్కారణముగా వర్ణించినారు. ఊర్ణనాభి దృష్టాంత మీ వేదాంత పద్ధతినే ద్యోతకము సేయుచున్నది. సర్వేశ్వరుడున్నాడనియు, ఆతని యంఘ్రిరాజీవములే నిశ్శ్రేయస ప్రదము లనియు గ్రంథకర్త మతము. ఇందీవరదళశ్యాముడును, ఇందిరానందకందళుడును, వందారుజనమందారుడు నగు యదునందను పదద్వంద్వారాధనమే మోక్షప్రదము. ఇంతకంటె నాకనివాసముకూడ కోరదగినది కాదని దాసుగారి మతము. ప్రహ్లాదముఖమున గ్రంథకర్త తమ యభిప్రాయముల కూడ ప్రకటీకరించినారు.

"భక్తిరవ్యభిచారిణీ" యని గీతాశాస్త్రము ఘోషించుచున్నది. దాసుగారు "మురహరిం విహాయ భజతి ముముక్షురన్యం కథం, స్వరమణం ప్రభూయ సతీ, ప్రకుసు తేఽన్య మనోరథమ్" అను శ్లోకమున

భక్తధర్మము పతివ్రతా ధర్మము నొక్కటియే యని యనుశాసించి యున్నారు.

దాసుగారు భక్తికృతములగు ఆనందబాష్ప, రోమాంచ, గద్గద స్వర, హర్షోత్కర్ష, పారవశ్యాది సాత్త్విక భావములగూడ తమ ప్రబోధమున వర్ణించినారు. హరికథామృత శ్రవణము వక్తృ, శ్రోతృ పవిత్రీకరణక్షమమని చాటించినారు. వీరు కథావస్తువును భాగవత పురాణమునుండి సేకరించుటలో భాగవత శ్రేష్ఠ్యము మరియొకసారి నిరూపించినారు. శ్రీకృష్ణలీలావిలసితము, నవరసోజ్జ్వలితమునగు వీరి శ్రీహరి కథామృత ప్రబోధము విలక్షణమైనది, ఉదాత్తమైనది.

ఔపనిషదవచనమగు "యతో వాచో నివర్తంతే అప్రాప్యమనసా సహ" అనునది వీరి "యద్వసు తత్త్వం సుధియోఽప్యవేద్యం" అను సూక్తికి మాతృక. ధీరధిషణానధీత బృహస్పతులును తత్త్వము నెరుంగజాలరని వీరి యాశయము. "తదద్రేశ్య మగ్రాహ్య మగోత్రవర్ణం" అను కూరత్తాళ్వార్ సూక్తి యిట సూహ్యాము. "నాహం వేదైః న యజ్ఞేన న తపసాఽనాశకేన" అను శ్రుత్యర్థమును "భక్త్యా త్వనన్యయా లభ్యః" అను గీతాపరమార్థమును నిట అభివ్యక్తమయినవి. దాసుగారి మతమున "భక్తానుగ్రహమే" అవతార రహస్యము. దుష్టశిక్షణమే యానుషంగికము మాత్రమే.

దేవకీవసుదేవులు దేవుని సుతుగా బడయుట కఖండ తపమాచరించిరి. అట్లే దశరథుడు పత్నీసహితముగ పుత్రకామేష్టి గావించెను. వారి కోర్కెలు సఫలములై కృష్ణ, దాశరథు లుదయించిరి. కాని తల్లిదండ్రు లేమి యనుభవించిరి? ఒకరు చెరసాల, మరియొకరు నిధనము. దీనివలన భగవత్పితృత్వము అతికష్టమైనదను నీతి గ్రాహ్యము. భగవద్భక్తులకు పరీక్షలు మెండు.

ఆచార్యుడు లేకున్న మోక్షము దుర్లభము. ఆచార్యుడు వ్యాపగతాఖిలరోగియు, సర్వసంగపరిత్యాగియు, వినమిత సకల విరాగియు, మోక్షతత్త్వామృత భోగియు నని దాసుగారు వర్ణించినారు. శిష్యుడు దుష్టాహంకారాక్షతుడు మోక్షమార్గ విలక్షితుడని వీరి మతము. ఇది గురుశిష్య సంప్రదాయము.

దాసుగారి "ముక్తపదగ్రస్తములు" "ముక్తపదగ్రాపకముల"ని చెప్పనొప్పును. వీరు ప్రయోగించిన ధాతురూపములు, అభాత్, అక్షోభీత్, ఇక్షిష్ట, ప్రాతార్ప్సీత్, అవివత్, అనునవి భట్టి కావ్యమును స్మృతిపథమునకు దెచ్చుచున్నవి. దాసుగారు అసురశబ్ద నిర్వచనమును అసురుడు 'అకారణభూతహింసాకర్త' యనియు, భూసురశబ్ద నిర్వచనము భూసురుడు 'అపరాధ్యుపకారి' యనియు చేసినాడు. నన్నయ భారతమున "బ్రాహ్మణుడు పుట్టిన తోడన పుట్టు నుత్తమ జ్ఞానము, సర్వభూతహిత బుద్ధియు"నని వాక్రుచ్చినాడు. ఈ రెండు నిర్వచనములును సదృశము లే. భక్త్యనుష్ఠానమున బ్రాహ్మణునికి జన్మతః కించిద్వైశిష్ట్య ముండునని వీరి మతము కావచ్చును. దేవకి జగత్ప్రపూత కనుక నే కారాగృహమున తపఃఫల పుంజమూర్తియగు నారాయణుని సుతుగా బడసెనని వీరు వాక్రుచ్చిరి. "దేవకీ పూర్వ సంధ్యాయాం ఆవిర్భూతం మహాత్మనా" అను భాగవతోక్తి యందు నీమె పూర్వ సంధ్య వలె జగత్ప్రపూత యని నిర్దేశింపబడినది. దీనినినే దాసుగారు అనుకరించి యుండవచ్చును.

బ్రహ్మకృత శ్రీకృష్ణస్తుతి యందు శ్రీకృష్ణుడు త్రిగుణాతిచరిష్ణుడనియు, స్థావరజంగమ రూపుడనియు, దాసుగారనిపించినాడు. "నేదం విశ్వం సత్యం, నిఖిలం తవ లీలాకృత్యం" అనుటలో జగత్తు పరమేశ్వరాయత్త స్థితిత్వముకలది యను భగవద్రామానుజ సిద్ధాంతము గర్భితమై యున్నది. భాగవతులు పండితమ్మన్యులు గారనియు, సువిశ్వాస హతాఖిల సంశయులనియు దాసుగారు వక్కాణించినారు. "సంశయాత్మా వినశ్యతి" యని గీతాసూక్తి యున్నదికదా ! "రక్షిష్యతీతి"

మహావిశ్వాసము కలవారు భాగవతులు, శరణాగతులు, ప్రపన్నులు అను వైష్ణవ సంప్రదాయమిట నూహ్యము.

దాసుగారి ప్రబోధమున పీయూషవర్ష జయదేవ కవీంద్ర భక్తి చ్ఛాయలను గోచరించును. వీరి మతమున తత్త్వము వేదాతీతము. "వేదా అపినశక్నువంతి త్వాం వేత్తుం" అని నుడివినారు. "యస్యనిశ్వసితం వేదాః" అనికదా వచనము. "శాస్త్రయోనిత్వాత్" అను బ్రహ్మసూత్రార్థము. సేశ్వర మీమాంసా మతములిట అనుసంధేయములు. జపహోమవ్రతిదానతపముల చే భగవన్మాహాత్మ్య మెరుకపడదని శివునిచే యసిపించినారు. భక్తియే సాధనమని బ్రహర్షులు వ్రవ్ర్తి చేసినారని దాసుగారనుట ఎంతయో సమంజసము.

నారదకృత శ్రీకృష్ణస్తుతి యందు దాసుగారు "తర్కాప్రతిష్ఠానాత్" అను బ్రహ్మసూత్రార్థమును విశదీకరించిరి. "అస్తి నాస్తీతి సందేహకులో భవతి తార్కికః। త్వత్పాదభక్తః సతతం రమతే ముక్తి కాంతయా" అను వచనమున తర్కము మోక్షదము కాదనియు, మహావిశ్వాసపూర్వక శరణాగతియే నిశ్శ్రేయస ప్రదమనియు దాసుగారు సిద్ధాంతీకరించిరి. Prof. A. N. White head అను పాశ్చాత్య తాత్త్వికశేఖరుడు కూడ "God is the ultimate irrationality" అని యభివర్ణించినాడు. "స్తనంధయదశలో తల్లిదండ్రుల నెరుగను. శైశవమున కొన్ని చూచితిని. యౌవనమున జగన్మద్యము ద్రావితిని. శాస్త్రులవదుర్విదగ్ధుడనగు నన్ను, అఘమగ్నుని, అంహంకారిని కాపాడుము" అని నారదునిచే నడిపించి "కృతఘ్నో దుర్మానీ స్మరపరవశో వంచన పరః। అసూయా ప్రసవభూః చలమతిః॥" అను పూర్వాచార్య నిర్వేదమునే దాసుగారాలపించినారు. "తోయనిర్ముక్త ఝషము" నకు భక్తులతో సామ్యము రూపించి దాసుగారు ఆర్తప్రవ్తి లక్షణమును దృప్తప్రవ్తి నుండి తద్వైలక్షణ్యమును నిరూపించినారు. దేవకీ వసుదేవుల దశావతారస్తోత్ర గద్యము, శ్రీమద్వేదాంత దేశికకృత

దశావతారస్తోత్రము ననుకరించుచున్నది; రఘువీరగద్యమును జ్ఞాపకము సేయుచున్నది. దాసుగారు 'సంకల్పసృష్టి'నే చెప్పినారు. వీరి భక్తి కవితకు పరాకాష్ఠగా "భక్తః శివోఽపి భవతితే" అనుటలో నారాయణ పరత్వమును నిరూపించినారు. "ఉవ్యో దేవ ఏకో నారాయణః" అని కదా వేదానుశాసనము.

భగవద్గుణానుభవ మొనరించు పట్టున దాసుగారు శ్రీకృష్ణుని దివ్యసుందర విగ్రహునిగను, లోకోత్తర తేజశ్శాలిగను, సర్వగోప గోపీ ప్రేమాస్పదునిగను నభివర్ణించి యా భువన సుందరమూర్తిని మన యెదుట సాక్షాత్కరింపఁ జేసినారు. "తేషామావిరభూత్ శౌరిః స్మయమాన ముఖాంబుజః పీతాంబరధరః స్రగ్వీ సాక్షాన్మన్మథ మన్మథః" అను శుకవాగమృతమును క్రొంగ్రొత్త పాత్రలో దాసుగారు మన కందించినారు. "మదన్యః కోపి దేహోఽస్తి కిమిత్యాజ్ఞాపితే సుతః నిరకార్షీద్దేవ పీఠం ఉచ్ఛిష్టేన మయాలయే" అను చోట దాసుగారు శ్రీకృష్ణుని యతిమానుష చేష్టితముల విశదీకరించిరి. మరియొకచోట తిర్యగ్జంతువులభగవద్విశ్లేషాసహనమునువర్ణించిరి."గోసమూహోఽప్యన్న శూన్యాణి విముంచిన్నాహారం విసృజ్య సమున్నమిత మస్తకో నిశ్చేష్టితో బభూవ" బలరాముని శేషాంశ సంభూతునిగాను, జ్ఞానిగాను నిరూపించి నారు. కాళియనాగుని హరిపదాంకితుడగుటచే ధన్యతమునిగా నిర్దేశించిరి. శర్వార్చిత పదముల మోక్షదముల నౌదల ధరించినాడు కదా కాళీయుడు! దాసుగారు, భగవత్పాద భక్త్యమృత పానరతి త్రిదివాధిపత్యముకన్న, అష్టవిభూతి సిద్ధికన్న, మోక్షపదముకన్న మిన్నయని వాక్రుచ్చినాడు. "సత్యం వదే వారణ శైలనాథ వైకుంఠ వాసేఽపి నమేఽభిలాషః" అను పూర్వాచార్య సూక్తియిట అనుసంధేయము. "భగవన్ భక్తి మపి ప్రయచ్ఛమే" అని యొక భాగవతోత్తము లర్థించి నారు. మునికాంత లన్న స్వరూపుడగు కృష్ణపరబ్రహ్మమున కన్నము నొసంగి ఆత్మతృప్తుడగు నాయనను తృప్తిపరచిరి. కైంకర్య భావము నల

వరచుకొనుట భక్తుల కావశ్యకము. మునిపత్నులచే "గుణవాన్ మూర్తి మాన్ మర్త్య ఇతి త్వామిహ మన్యతే మూఢధీః, కింతు సాక్షాత్త్వం పరబ్రహ్మైవ కేవలం" అని యనిపించి తత్త్వ రహస్యమును ప్రకటీకరించిరి. కృష్ణపాదాబ్జ చింతనయే కైవల్యదమని దాసుగారియభిప్రాయము.

ఒక ధర్మసందేహమును దాసుగారు వెలిబుచ్చినారు. "సర్వ ధర్మ స్థాపనాయ యదిభూమా వవాతరత్ విష్ణుః కథం బ్రూహి మునే వర నారీరతో భవత్?" అని పరీక్షన్మహారాజుచే ప్రశ్నవేయించి శుక యోగీంద్రునిచే నిట్లు సమాధాన మిప్పించినారు" నిఖిలపదార్థాన్ భక్ష యన్నపి సర్వ భక్షకో యథాదోషైర్నలిప్యతే తేజస్వినః, తథా వాసవ చంద్రాదయ ఇవ నదుష్టా భవంతి" అహల్యా జారుడగు నింద్రునివలె ను తారాపహార రసికుడగు చంద్రునివలెను శ్రీకృష్ణుడు కళంకికాడు. "తేజీయసాం న దోషాయ, వహ్నేః సర్వభుజో యథా" సర్వ భక్షకు డగు నగ్నికి దోష మాపాదించునా? నిప్పుకు చెదలంటునా? తాత్త్విక దృష్టితో పరిశీలించిన సర్వాంతర్యామికి పరాంగన యెవరు? మనము భగవల్లీలలను అపార్థము చేసికొనకూడదని దాసుగారు హెచ్చరించు చున్నారు.

స్నాన జప సమయమున అక్రూరుడు కాళిందీ జలములందు రామ కృష్ణుల గాంచెను. ఇది భగవద్విభుత్వమును చాటును. అక్రూర కృత కృష్ణస్తుతి గంభీర పదగుంభితమై, పరమభక్తిని ప్రకటీకరించుచున్నది. దాసుగారు లోకాతీతాశ్చర్యకరునిగా భగవంతు నక్రూరుచే స్తుతింప జేసినారు. గ్రంథకర్తకు భగవంతుడు "నారాయణదాస హృద్వాసు నిగా" చిరపరిచితుడని తోచకమానదు. భక్తియే జీవిత పరమార్థము. కృష్ణ ప్రసాదమువలన భక్తికల్గును. భక్తి రూపాపన్న జ్ఞానమే మోక్ష దాయి. "యమేవేష వృణుతే తేనలభ్యః" అను సూక్తి యిట అను సంధేయము. భగవత్కటాక్షమున్నవాడే భగవంతుని జేరగల్గును.

దాసుగారు, భక్తియోగి కాగోరువాడు సాత్త్వికాహారనిరతుడును, సర్వభూతదయాపరుడును, సంసార విముఖుడును కావలెనని సూచించిరి. అట్టివాడే నిజమైన హరిదాసుడని దాసుగారి మతము. మృత్పదార్థము నుండి కుండ యెట్లు వేరైనదో అట్లే హరి నుండి జగత్తు వేరైనది. తదాయత్త స్థితికలది. భక్తిమంతుడు రాగద్వేషములకు తావీయరాదు. "ఏకేన మృణ్మయేన పాత్రేణ సర్వం మృణ్మయం విజ్ఞాతం" అని చెప్పుటలో దాసుగారు "ఏక విజ్ఞానేన సర్వ విజ్ఞాన ప్రతిజ్ఞ"ను సూచించినారు. హరియే ఆత్మ - తద్ధ్యానమే భక్తి యని నిర్దేశించుటలో దాసుగారు బ్రహ్మము ఆత్మాంతర్యామి యని సూచించినాడు. ఈ సూచన పూర్వోత్తర గ్రంథములతో సంవదించును. అష్టాక్షరీజపము వైధమని నుడివినారు. "అలం శుష్క వేదాంతం, పిబకృష్ణ కథామృతం" అనుటలో శుష్కతర్కముకన్న భక్తియే సారతరమని వర్ణించినారు. భక్తి వైరాగ్యములలో భక్తిసులభ మోక్షసాధనమని దాసుగారి మతము. శ్రద్ధవలన భక్తి, భక్తివలన మోక్షము లభించును. నవవిధభక్తులలో ముఖ్యములు శ్రవణకీర్తనములు. వాసుదేవోపాసనమే భవసముద్రతరణోపాయము. పశుమారణకర్మదారుణములగు క్రతువులల్పస్థిర ఫలదములు. భక్తి శాశ్వత మోక్షఫలప్రదము. గార్హస్థ్యము గోవిందోపాసనాయోగ్యము; శ్రేష్ఠమని గ్రంథకర్త భావించినాడు. కాళిదాససూక్తియందు "సర్వోపకారక్షమమాశ్రమం" అనిగృహస్థాశ్రమము వర్ణింపబడినది. ఆజానుబాహుడు అరవిందదళాయతాక్షుడు, పీతాంబరుడు, నవపయోధర నీలవర్ణుడు నగు హరి, భాగవతావనోత్సుకుడు. వైష్ణవాగ్రణి యగు కుచేలుడు నవభక్తి విధానములచే శ్రీకృష్ణుని సేవించెను. అచంచల భక్తి విశ్వాసములతో కుచేలుడు కృష్ణునుపాసించి సఫలుడయ్యెను, ఆయురన్నం ప్రయచ్ఛతి "పౌరుషం వృథా" అను సూక్తులచే దాసుగారు భక్తి వైశిష్ట్య ముగ్గడించినారు. పత్రపుష్ప ఫలతోయములచే ప్రీతిం జెందు నల్పసంతోషి పరమాత్ముడు. కుచేలుని

చరిత్రయే దీనికి నిదర్శనము. "ధానాముష్టిముచే కుచేల మునయే ద త్తేస్మ వి త్తే శతామ్" అని శ్రీ మద్వేదాంత దేశిక సూక్తి. శ్రీకృష్ణలీలా విశేషములు శంకరునంతవానికి కూడ దుర్గ్రాహ్యములు.

2. సూర్యనారాయణశతకము

సకలకర్మసాక్షి సూర్యుడు. అంతరాదిత్యవిద్య మొదలగు సువని షద్విద్యలందు సూర్యనారాయణోపాసన ముపదిష్టము. అరుణ మండ లాంతర్వర్తియగు నారాయణు డుపాస్యపరబ్రహ్మము. ఈనారాయణుని గురించియే యీ శతకము రచింపబడినది.

శాస్త్రశోధనములు, తర్కవితర్కములు, క్రతుస్నానములు, "సోహ"మ్మను నద్వైత వాదములువృథా. సత్యదయార్జవంబులు గల్గి భక్త్యావేశముతో భగవన్నామ సంకీర్తనము సేయుటయే మానవకర్త వ్యము. అదియే మోక్షప్రదమని దాసుగారి సిద్ధాంతము. ప్రత్యక్షదైవ మగు సూర్యుడు చరాచరమయుడు. నారాయణ దివ్యతత్త్వ మూహ సేయ నెవ్వరితరము ? మానవుడు తర్కవితర్కములచే సంశయాత్ము డగును. గీతాచార్యుడు "సంశయాత్మా వినశ్యతి" యని చెప్పినాడు కదా. "పాండిత్య నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్" అను వచన మీ యర్థ మునే స్ఫురింపచేయును. మోక్షార్థికి మహావిశ్వాసము అవసరము. తర్కము అనవసరము. సూర్యుడే సర్వము అనుటలో "సర్వంఖల్వి దంబ్రహ్మ" అను మహావాక్యార్థము నిబిడీకృతము. "ఆత్మవత్సర్వ భూతాని" యని దాసుగారి యుపదేశము. "నీకుంబిడ్డడనుమ్ము" అనుటలో వాత్సల్య భక్తిభావము నావిష్కరించిరి. "కట్టా మూర్ఖుడ దామసుండ, దురహంకారుండ నజ్ఞుండనే" అనుటలో దాసుగారు "కృతఘ్నోదుర్మానీ స్మరపరవశో వంచన వరః" అను పూర్వాచార్య సూక్తినే యనుస రించినాడు. "అన్యథాశరణం నాస్తి త్వమేవ శరణంమమ"అను శరణా గతి యీ శతకమందంతటను గానవచ్చును. "అయయో నీవయి భక్తి

నా మది దృఢంబై నిల్వ కుంటున్నదా" అని దాసుగారు "భగవన్ భక్తి మపి ప్రయచ్ఛమే" అను పూర్వాచార్య ప్రార్థనసే అనువదించినారు. "త్వత్పాదాంభోరుహ యుగగతా నిశ్చలా భక్తిరస్తు" అని యభియుక్తోక్తి. దేవదేవ దివ్యాంఘ్రి సరోజ భక్తి దాసుగారి వాంఛితము. బంగారమునుండి దాని చాయను వేర్పరువ నెట్లశక్యమో అట్లే బ్రహ్మమునుండి జగత్తును వేర్పరువజాలము. తత్త్వము చిదచిద్విశిష్ట మనియే యిట దాసుగారి యభిప్రాయము కావచ్చును. స్థిరతర సాత్త్విక భక్తితో నారాయణుని సేవించిన మోక్షము లభించును. శాస్త్రజ్ఞాన మాత్రమున లభింపదు. భక్తి రూపాపన్న జ్ఞానమే మోక్షసాధనము. "యుక్తితో జెప్పగలేనుగాని, నీవు భక్తాధీనుడవు" అని దాసుగారు మహావిశ్వాసప్రాముఖ్యతను వర్ణించినారు. ఇదియే వేదాంతమతము. భగవత్తత్త్వము జ్ఞేయము, జ్ఞాన, విజ్ఞాతృ తత్త్వాతీతము. ఫలాపేక్ష లేని నామసంకీర్తనము వీరికభిమతము. సంసార రసాభాసమన్న ఏహ్యాభావము. జ్ఞానము తుష్టినియ్యదు. భక్తి యిచ్చును. జన్మసార్థకము చేసికొనుటకు భక్తియే సాధకతమమగు కరణము. సకల శ్రుతిస్మృతీతిహాససారము భక్తి.

8. గజేంద్ర మోక్షణము :-

ఈ కథ సర్వజన విదితము. పరమేశ్వరుడు సకలాంతర్వర్తి. సకల భూత సాక్షి. కార్యకారణ రూపుడు. సర్వ స్వతంత్రుడు. స్థూలసూక్ష్మ స్వభావుడు. "అణోరణీయాన్ మహతో మహీయాన్" అని శ్రుతి ఘోషించుచున్నది. భక్తవత్సలుడు, దేవుని దయవలన జ్ఞానోదయ మగును. జ్ఞానము భక్తియై మోక్షమిచ్చును. పతి దూరదేశము పట్టిన యపుడు సతి పతి పటము గొల్చుట లోకవిదితము. అట్లే భగవద్విశ్లేషము సహింపనిభక్తుడు భక్తి భావమున భగవంతుని భావించును. భక్తి యిట భగవద్విరహముగా మారినది. ఈభక్తి మార్గమునకు ఆచార్యక

మొనరించినది శ్రీ గోదాదేవి; సాక్షా ల్లక్ష్మీ. ఈ భావమే నాయికా భావ మనబరగును.

దైవబలమే బలమని గజేంద్రుడెంచి ప్రవర్తి జేసినాడు. ఆతడార్త వ్రవన్నుడు. కనుకనే ద్రుతముగా మోక్షగామియైనాడు. "జలధులు రోమకూపములు" అను పద్యమున "యద్రోమ రంధ్ర పరిపూర్తి విధావదక్షో వారాహజన్మని బభూ వురమీ సముద్రాః తంబాలకం యశోదా పాణిద్వయాంతర జలైః స్నపయాంబభూవ" అను అతి మానుషవ స్తువచ్ఛా యలున్నవి. తల్లి చనుబాలు గ్రోలెడు తరినిబిడ్డ కరచిన తల్లి చికాకుతో విదల్చును. బిడ్డ కావుమని మఱియు బొడిగిట గదియును. కాని తల్లిని వదలి యెక్కడకు పోలేదు. ఇదియే భక్తునికి భగవంతునికి గలసంబంధాతిశయము. "రుషా నిరస్తోపి శిశుస్తనంధయో నజాతుమాతు శ్చరణౌ జిహాసతి" అను కవితార్కిక సింహ సూక్తి దాసుగారి పూర్వోక్త భావ మునకు మాతృకగా నోపును. భక్తాభిమాని యగు భగవంతుడు గజేంద్ర రక్షణార్థము ఎట్లున్న వాడట్లే భక్తావనార్థము పరుగిడినాడు. పంచా యుధములతో కూడ రమాదేవి నాథు ననుసరించినది. "నమేభక్త ప్రణశతి" "తేషాం యోగక్షేమం వహామ్యహమ్" అను వాగ్దానము లను గీతాచార్యుడు నిలుపుకొనినాడు. గజేంద్రుడు పరమభాగవతుడు.

4. అంబరీష చరిత్రము

ఈ కథ లోకప్రసిద్ధము. కృతయుగమున భూమండలము నేలిన చక్రవర్తి యంబరీషుడు. ఈయన భాగవతుడు. ఈ కథను దాసుగారు భక్తిరసభరితముగ కీర్తించినారు. భగవద్భక్తులకు సుస్థిరానందముండు నని దాసుగారి సుభాషితము. "శ్రీనాథాశ్రిత ఫలదా శ్రీకంఠ నుతా" అని విశ్వజన నస్థిత్యంత హేతు ప్రభావుడగు రమేశుని దాసుగారి కూయిడినాడు. జనులు నాస్తికులుగా కూడ కాపాడుమని దైవము నర్థించినాడు. ఈ కథయందు భగవంతుడు స్వవిషయాపచారమునైనను

సహించునేమో కాని భాగవతాపచారమును మాత్రము సహించడను సత్య ముద్ఘాటితము. భగవంతుడు భక్తవశంవదుడు.

5. రుక్మిణీ కల్యాణము.

ఈ కథ లోకవిదితము. ఇందు బలరామునిచే, మూడు కన్నుల వేల్పు కూడ కృష్ణవిలాసముల దలచలేడు, అని యనిపించి దాసుగారు శ్రీకృష్ణపరత్వముద్ఘాటించినాడు. కృష్ణుడే జగన్నాథుడనియు నెల్లరకు ప్రియుమైన తత్త్వమనియు నొక్కి వక్కాణించినాడు. కృష్ణునకు ప్రియమైనది పుణ్యము. అతని కప్రియము అపుణ్యము. రాసగోష్ఠి యందలి ధూర్తాయితగాథ పుణ్యదము. అట్లని మనము అవని చేయరాదు. "న మహదాచరిత మాచరేత్" "తదుక్తం కుర్యాత్" అనిగదా ! యభియుక్తోక్తి. రుక్మిణీదేవిని జ్ఞానిగను, పరమైకాంతిగను నిరూపించినాడు. కృష్ణవిశ్వరూపదర్శనమున నాశ్చర్యచకితయు, భీతయునై రుక్మిణి సభక్తిక సాష్టాంగ ప్రణామము చేసినది. క్షణకాలము ఆమె మనోనయనములకు శాంతానంత మహావిభూతిమత్తత్త్వము దృగ్గోచరమాయెను. మరుక్షణమున నాయద్భుత దృశ్యము హరియే మఱుగు చేసెను. రుక్మిణి ఉదంచితచారుపతివ్రతామణి, దశకంఠ కంఠలుంఠనుడవు, పశుపతి కార్ముక విభేది యని స్తుతించి రామకృష్ణుల కైక్యము కలదని వర్ణించినాడు.

6. భీష్మ చరిత్రము.

ఈయన చరిత్ర జగత్ప్రసిద్ధము. ఆయన శీలము, సత్త్వము, దమము, కఠోరబ్రహ్మచర్యము అవినాశములు. భీష్ముని జ్ఞానిగా రూపించినాడు. "నలిననాభసంశ్రితులకు నవశ్యము కోర్కె లీడేరు"నని భీష్ము ముఖమున మనకు తెలియజేసినాడు. "అతివృద్ధునికి మేనియాస తగదు" అని భీష్మముఖమున మనకు హితవు గఱపినాడు దాసుగారు. "బాలస్తావత్ క్రీడాసక్తః" అను వచనము ప్రహ్లాదుడు తప్పు అని నిరూపించినాడు. తరుణస్తావత్తరుణీ సక్తః" అను వచనము శ్రీశుకుడు అబద్ధమని నిరూ

17

పించినాడు. "వృద్ధస్తావ చ్చింతా సక్తః" అను సూక్తిని భీష్ముడన్య థాకరించినాడు. "పరేబ్రహ్మణికోఽపి నసక్తః" అను వచన మీావిధముగా ఖండితము. అగ్ని, హావిస్సు, విష్ణుమయములే. విష్ణుభక్తులకు కిల్బిషమంటదు. "ప్రభురహమన్యనృణాం నవైష్ణవానాం" అని యముడే చెప్పినాడు. వారు మృత్యుంజయులు. భీష్ముడు నట్టివాడేకదా! "శివ నారాయణ కృష్ణ ముకుందా" యని భీష్మునిచే ననిపించి హరిహరాద్వైత పంథ సూచించినాడు. 'శివ' యనగా 'శుభంకర' యను నర్థము కూడ చెప్పకొనవచ్చును. బ్రతుకు సుఖాభాసమనియు, శాశ్వతసుఖము మోక్షమనియు దాసుగారు భీష్ముని ద్వారా చాటినాడు.

7. ప్రహ్లాద చరిత్రము :-

ఈ కథ లోకవిదితము ప్రహ్లాదుడు భాగవతాగ్రగణ్యుడు. "యమేవైష వృణుతే తేనలభ్యః" అను శ్రుతి ఈ బాలకునియెడ సార్థకము. వెఱ్ఱి యెత్తినట్లు ప్రహ్లాదుడు తిరిగినాడని చెప్పటలో దాసుగారు భక్తి పరాకాష్ఠయగు నున్మాదావస్థను సూచించినారు. ఇనుము సూదంటురాతి చెంత నెట్లు తిరుగునో ప్రహ్లాదుచిత్తము నారాయణుని చుట్టు నట్లు భ్రమియించెను. "దదామి బుద్ధి యోగం యేన మాముపయాంతి తే" అను గీతావాగ్దానము గీతాచార్యుడు ప్రహ్లాదుని యెడ సార్థకము చేసికొనినాడు. ప్రహ్లాదుడు పురుషాకృతి దాల్చిన విష్ణుభక్తి. చదువులలోని మర్మమెల్ల నెరిగినవాడు. సఖ్యభావాది నవవిధభక్తుల హరి గొల్చుట వలన భద్రములు సేకూరును. బ్రహ్మ మొదలు స్తంభ పర్యంతము విష్ణువు వ్యాపించియున్నాడు.

"భ్రూభంగ చంచత్సటాధ్వాన దంష్ట్రానఖ ప్రాభవంబున్ విశాలాంత్ర మాలాతి ఘోరంబు కాలాగ్ని కుండాభ నేత్రంబునౌ నీ నృసింహాకృతిన్ జూచి నే బెగ్గిలన్ గాని దుర్వార సంసార దావాగ్నికిన్ జంకెదన్" అను ప్రహ్లాద వచనము దర్పణమ్ము. శ్రీశుకుని భాగవ

తాంతరార్థమును, పోతనామాత్యుని హృదయమును ప్రతిబింబించు చున్నది. ప్రహ్లాదుడు మూమ్మారు వలగొనుటలో నమస్కరించుటలో సాంప్రదాయికార్థ మొందు పొడసూపకమానదు. పునఃపునః ప్రవృత్తి ఆవశ్యకమని శ్రీవైష్ణవ సంప్రదాయము. భగవద్రామానుజులు తమ గద్యత్రయమున "పునఃపునః ప్రణమ్య" యని యుద్ఘాటించినారు. దాసుగారి యభిప్రాయము నిదియే. ప్రహ్లాదు డితరము నర్థింపక నిష్కామత్వము, మోక్షము నర్థించుట గమనింపదగిన విశేషము.

8. యథార్థరామాయణము :-

దాసుగారు పీఠికలో "యథామతి నా రచించిన శ్రీరామచరిత్రమునకు ప్రస్తుత మర్థమెట్లు లభించునో, నామనస్సునకు యాథార్థ్యమెట్లు తోచెనో యారీతిన్ బట్టి చెల్లుబడికై యథార్థ రామాయణంబను వింత పేరిడినాడను" అని ప్రతిజ్ఞ చేసినాడు. ఇది శారీరక బ్రహ్మసూత్ర భాష్యమునకు పూర్వ భావియగు శాంకరప్రతిజ్ఞను పోలియున్నది. స్వాభిమతమగు ద్వైతపరమగు నర్థమెట్లు వచ్చునో యారీతి బ్రహ్మ సూత్రముల వ్యాఖ్యానింతునని శంకరాచార్యులు ప్రతిజ్ఞ చేయుట పండిత వేద్యముకదా ! "యథాచాయ మర్థః సర్వేషాం వేదాంతానాం తథా వయం అస్యాం శారీరక మీమాంసాయాం ప్రదర్శయిష్యామః" రామాయణకథ సర్వవిదితము. భార్గవుని ద్వారా భక్తియే మోక్ష మార్గమని చెప్పించినాడు. భక్తమందారుడని, భవదూరుడని, పరమపురుషుడని, శ్రీరాముని నుతించినాడు. "మూడు కనులవేల్పు కూడ భవదాఖ్య మూథ భక్తి కీర్తించు"నని చాటినాడు. హనుమంతునిచే శ్రుతులకు రాము డతీతుడనియు, మహర్షులు రాము నెరుంగ లేమని గ్రహించిరనియు నగిపించినాడు. ఇవి ఔపనిషదములగు భావములే, సౌందర్యధిక్కృత శతకోటి మన్మథుడనియు, అఖిలధర్మ స్వరూపుడనియు, సజ్జనోద్ధరణ దీక్షాకంకణాంకితుడనియు శ్రీరాము నభివర్ణించినాడు. రామభక్తున కసాధ్యము లేదని చాటినాడు, రామనామమ్ము

సర్వాతిశాయి యగు తారక మంత్రమని యుపదేశించినాడు. వాల్మీకి రామాయణమునే దాసుగా రనుసరించినాడు. కొన్ని ప్రక్షిప్తములని తలంచినాడు. "దేవుడయ్యు మనుతం బల్కెడు రాముడు విభీషణుని రావణు బలము నడిగెను" అనుచోట "ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్" అను వాల్మీకి సూక్తులనే దాసుగారు ప్రతిబింబింప జేసినారు. "దేవదేవ నీలీల లెవ్వరు దెలియజాలుదురో" అని భాగవతోత్తముడగు విభీషణుడు రామచంద్రు బొగడినాడు. రామచంద్రుడు సర్వజ్ఞత్వ, సార్వభౌమత్వ, సర్వశక్తిమత్వాది సకలగుణోపేతుడయ్యు మానవుని రీతి బ్రవర్తించినాడు. ఈ రహస్యము మనము గుర్తెరుగవలెను. రామాయణము శరణాగతి వేదము. శ్రీమద్రామాయణము శ్రీవైష్ణవులకు పరమ ప్రామాణిక గ్రంథము. ఇందు భక్తితత్త్వము సవిస్తరముగ నుపన్యసింపబడినది. శబరి, గుహుడు, భరతుడు, లక్ష్మణుడు, సుగ్రీవుడు, హనుమంతుడు, విభీషణుడు మొదలగు వారు అనేకవిధ భక్తిరీతుల ననుష్ఠించినారు. సీత పరమపతివ్రత సాక్షాల్లక్ష్మి. రామాయణ కథను ఎందరెన్నోరీతుల చెప్పినను తనివి తీరదు. తత్కథానస్థు వైలక్షణ్య మట్టిది.

## సింహావలోకనము

"నిరతిశయానందప్రియా నన్యప్రయోజన సకలేతర వైతృష్ణ్య జ్ఞాన విశేషమే భక్తి" యని దాసుగారు తమ రామాయణ పీఠికలో నిర్వచించినారు. భక్తి అన్నిటికంటె నెక్కుడగు నానందసంపాదనము నకై ఏర్పడిన సాధనము, భక్తికి మోక్షము తప్ప వేరొండు గమ్య స్థానము లేదు. అన్ని విధములైన రాగద్వేషాదులను పరిహరించు సమ్యక్ జ్ఞానమే భక్తి యనబరగును. ఇట్లు భక్తి, జ్ఞానమార్గములకు అవినాభావ సాహచర్యము కలదు. భక్తి రూపాపన్న జ్ఞానము మోక్షదమను విశిష్టాద్వైత సిద్ధాంతమునకు దాసుగారి రాద్ధాంతము సన్నిహితమే.

భక్తియోగము మోక్షమునకు సులభ సాధనము. ఈశ్వరుడు దయామయుడు. సార్వజ్ఞత్వ సర్వశక్తిమత్త్వాది సకల కల్యాణగుణ పరిపూర్ణుడు. అవాప్త సమస్త కాముడయ్యు ప్రళయ పయోధిజలముల నుండి వేదముల నుద్ధరించి భక్తావనార్థము మరల నిశ్వాసరూపమున వానిని శ్రియఃపతి మానవుల కందించినాడు. కర్మానుగుణముగ మానవులకు ఫలము లొసంగుచున్నాడు. ప్రణవ మాతని నామము. అకారార్థము 'విష్ణువు'. 'మ' కారార్థము జీవుడు. 'ఉ' కారము పరమాత్మ ప్రత్యగాత్మ సంబంధవాచకము. అ + ఉ + మ కలసి 'ఓమ్' కారమయినది. 'ఓమిత్యుపాసీత' 'ఓమిత్యాత్మనం యుంజీత' అని శ్రుతి. ఓంకారోపాసనచే చిత్తస్థైర్యము లభించును. భక్తి వలన నాకృష్టుడయి భగవంతుడు జీవునికి మోక్షమార్గమున గల యవరోధముల తొలగింపవచ్చును. భగవదర్పితముగా, ఫలాపేక్షరహితముగ కర్మల నాచరింపవలెను. దీనివలన మోక్షము కరస్థమగును. దీనినే భక్తియోగమనియు, శరణాగతి, ప్రపత్తి యనియు నందురు. భక్తికి వేదనమనియు, నుపాసనమనియు నామాంతరములున్నవి. భక్త్యనుష్ఠానము పలువిధములైనది– భగవద్గుణానుభవము, భగవద్విషయిక చర్చలు, భగవన్నామ సంకీర్తనము, భగవదర్పితముగా ఫలాభిసంధి రహితముగా కర్మాచరణము. దాస్య, వాత్సల్య, మధురభక్త్యాదులున్నవి. ప్రత్యక్త్వ మర్యాదా దాహకమగు పవిత్రప్రేమాగ్నియే భక్తి. అదియే మోక్ష ప్రాపకము. "వాసుదేవః సర్వమితి సమహాత్మా సుదుర్లభః" అను గీతావచనము ననుసరించి దృఢాధ్యవసాయముగల భక్తుడు దుర్లభుడు. భక్తి యనగా కర్మసన్న్యాసము కాదు. ఫలాభిసంధిరహిత, భగవదర్పిత కర్మాచరణము మాత్రమగును. జ్ఞానకర్మానుగృహీతమగు భక్తియోగమే మోక్షప్రదమని పూర్వాచార్యుల మతము. ఆమతమునే దాసుగా రనుసరించిరనుట నిర్వివాదము.

శ్వేతాశ్వతరోపనిషత్తులో 'భక్తి' శబ్దము ప్రయోగింపబడినది. (6-23) భక్తి గురుద్వారకమని కూడ చెప్పబడినది. పాణిని కూడ భక్తి శబ్దము సూత్రీకరించినాడు. (4-3-95)

ఈవిధముగా నుజ్జ్వలములగు పవిత్రేతివృత్తముల గైకొని, పండితపామర వేద్యముగా హరికథాత్మకముగా కృతుల రచియించి శ్రియఃపతి కంకితమిచ్చి దాసుగారు ధన్యజీవులైనారు. భగవదుపచారము కన్న భాగవతోపచారము మిన్న యని పెద్దలు చెప్పుదురు. అట్టి మహా భక్తకవియగు దాసుగారి కృతులలోని భక్తి విశేషముల నాబుద్ధికి దోచిన వరకెరింగింప ప్రయత్నించినాడను. "యాన్యస్మాకగ్ం సుచరితాని, తానిత్వయో పాస్యాని, నో ఇతరాణి" అను నుపనిషద సూక్త్యను సారముగ నిందు దొసగులు ఏమైన పొసగిన యెడల, అవి మన్నించి గుణములు మాత్రమే గ్రహించి విజ్ఞులు అనుగ్రహముతో ఈ నా వ్యాసమును పఠింతురుగాక యని నాప్రార్థన.

"ఇతి శమ్"



# అవతారపురుషుడు

ఆచార్య శ్రీ కప్పగంతుల వెంకటరావు

శ్రీ దాసుగారు సర్వకళలయొక్క సంపుటి. వారు కథకులు. ఒక్క వ్యక్తియే అన్ని పాత్రలను అభినయించి అన్ని హావభావములను ప్రకటన చేయుట కథకుల ధర్మము. యథోచితముగా రసపుష్టితో ప్రజారంజకముగా అనేకపాత్రల మనస్తత్త్వములను ఒక్కడభినయించుశక్తి సామాన్యమయినదికాదు. శ్రీ దాసుగారు అన్నిటిలో ఆరితేరి ఆటను పాటను మాటను సమ్మేళనము చేసి రక్తితో భక్తిద్వారా ముక్తికి దారి చూపించిన లోకైక నటుడు. అందరికీ అన్నీ అయి ఆనందమును గలుగజేసిన ప్రతిభాశాలి. ఆటకాండ్ర కాటగాడు. పాటకాండ్రకు పాటగాడు. మాటకాండ్రకు మాటగాడు. వేషధారులకు వేషధారి. అందమును గోరువారి కందగాడు. పోకిరీలకు పోకిరి.

ఇది మహాపురుషునకు సామాన్యలక్షణము. దీనినే ఒక కవి మల్లరంగసమయమున శ్రీకృష్ణునిగూర్చి వర్ణించెను.

"మల్లైశ్శైలేంద్రకల్పః శిశు రితరగణైః పుష్పచాపోంగనాభిః
గోపైస్తు ప్రాకృతాత్మా దివి కులిశభృతా విశ్వకాయో౽ప్రమేయః
క్రుద్ధః కంసేన కాలో భయచకిత దృశా యోగిభిర్ధ్యేయమూర్తిః"

శ్రీకృష్ణుఁడు వస్తాదులకు కొండగా, సామాన్యులకు పిల్లవానిగా, స్త్రీలకు మన్మథునివలె, గోపాలకులకు గోపాలబాలునివలె, దేవేంద్రు

నకు భగవంతునివలె, కంసునకు మృత్యుదేవతవలె, యోగులకు ధ్యేయమూర్తివలె గోచరించెను.

దీనికి కారణము భగవంతుని యోగసిద్ధి కావచ్చును. లేదా అంతకన్న ముఖ్యముగా వ్యక్తుల చిత్తవృత్తి కావచ్చును. (శ్రీ) దాసుగారి విషయమున గూడ ఇది వర్తించును. ఇది లోకము (శ్రీ) దాసుగారిని గ్రహించిన బయటి చూపు. బాహ్యలోక మీ విధముగ శ్రీదాసుగారి బాహ్యలీలలనే గ్రహించినది.

కాని నాకు వారి యీ చాతుర్యములలో ప్రవేశమూ లేదు ; అనుభవమునకు తగినంత అవకాశమూ లేకపోయెను. కాని, వారి అంతరంగిక వ్యక్తిత్వమును గ్రహించుటకు నాకు కొంత అవకాశము లభించెను. వారు మొట్టమొదట శాఖానుసారముగా నాకు దూరపు బంధువులు. తరువాత వారితో సన్నిహితబాంధవ్య మేర్పడినది. వారి ఏకైక పుత్రికను నా శ్యాలకున కిచ్చి వివాహము గావించిరి. అప్పటికి నేను ఎమ్. ఏ. పరీక్షలో నుత్తీర్ణుడనైతిని. నన్ను చూచి వారు ముచ్చటపడి వాత్సల్యముతో అనన్యసాధారణముగ నన్నాదరించిరి. ఇట్లు గావించుట వారిలో కొంచెము అరుదే. ఆ వివాహసందర్భమున ఏనాళ్ళకు వారింటికి పోవ నన్ను నియోగించిరి. అది మామూలుగా మూడునాళ్ళ ముచ్చటయే. కాని (శ్రీ) దాసుగారు మా దంపతులను చూచి పార్వతీపరమేశ్వరుల లాగున నున్నారని ముచ్చటపడి పదిహేనుదినములు వారింట నుంచివేసిరి. బంధువుల నీ తీరుగా ఆదరించుటకూడ వారికి అరుదే. వారు తలచుగా వైరాగ్యబుద్ధిలో అందరినీ చాలవరకు ఉపేక్షాభావముతో చూతురు. వారి సమక్షమునందు వారు సన్నిహితకాలము ఆదరించుటలో వారికి ఫలాపేక్షయూ లేకపోలేదు.

వారు "నవరస తరంగిణి" అనుదానిని రచించి వ్రాత ప్రతిలో నుంచిరి. నాకు అవతల షేక్స్పియరుతోను, ఇవతల కాళిదాసుతోను కొంత పరిచయమున్నదని వారు గ్రహించి యా ఉద్గ్రంథమును నాకు

వినిపింప నారంభించిరి. అటులనే "ఉమర్ ఖయ్యాము"ను కూడ వినిపించిరి. మా కిరువురకు నవకాశము గలిగినపుడెల్ల నన్నుఁ గూర్చుండబెట్టి దీక్షతో ఈ గ్రంథములను ఆమూలాగ్రముగ జదివి విపులముగా వ్యాఖ్యానించుచు, అందలి రసముల నా యా ఘట్టముల నిరూపించుచు, తా నెక్కడ ఏ విధముగ కవి భావము ననుసరించగలిగెనో, యెక్కడ దానిని పుష్టి చేయగలిగెనో వివరించుచు, నాకు కలిగిన శ్రవణాసక్తిని ఇనుమడింపచేయును. ఈ ఉభయతారకమైన కార్యమును కొనసాగించిరి. తాను వ్రాసినదానిని ఎవరుచెప్పినా మార్చను దీక్ష వారికి కలదు. అది స్వతంత్రులగు కవులకు సహజము. కాని ఒకచోట రెండక్షరముల మాటకు బదులుగా "పస" అనుమాట వీర్యవత్తరమని నేను సూచింపగా అతికష్టముపై ఆ మార్పునుమాత్ర మంగీకరించిరి. అటులనే కొన్ని షేక్స్పియరులోని వాక్యములనుకూడ నే నుదహరించగా అంగీకరించి తనవ్రతమును కొంచెము సడలించి గుణగ్రహణ యోగ్యతను తెలియజేసినా మొత్తముమీద స్ఫుటమైన స్వాతంత్ర్యమునే సాధించుచూ దాని ప్రాశస్త్యమునే పొగడుచుండిరి. ఇటులనే "ఉమర్ ఖయ్యాం"ను కూడ వినిపించి, 'ఫిడ్జరాల్డు' కన్న వ్రాతయంశములోను తన ఆధిక్యమును చూపుచూ, అసలు కవిభావములను తాను సరిగా పొందుపరచిన వివరములను స్పష్టపరుస్తూ, ఆ గ్రంథతత్త్వమును నాకు బోధపరుస్తూ, తనకుగల అనేక భాషాప్రావీణ్యమును, గ్రహణశక్తిని, వ్రాకటన పటుత్వమును, సమయానుకూలముగ వివరించి నన్ను పరవశుని గావించిరి.

ఇప్పటికిని ఇంతే. ఇంతకంటె మఱియొకవిశేష మున్నది. బంధుత్వము పూర్వముకంటె ఇప్పుడు బలపడినది. వారి దౌహిత్రిని నా జ్యేష్ఠపుత్రున కిచ్చి వివాహము గావించిరి. నేను భీమునిపట్నమునుండి వచ్చేపదే వారిసన్నిధికి వచ్చి కాలము గడుపుచుంటిని. ఉభయులకు ఆనందముగా కాలము గడుచుచుండెను. ఆ యా తరుణములలో నా అనుభ

వము విశిష్టమైనది. దానికి కొంచెము వెనుకపెట్టి ముందుగా ఈ వివాహ సందర్భమున జరిగిన కొన్ని విశేషములను చెప్పెదను.

మేము సంకల్పించినది మేనరికము. ఇది యీదేశపు ద్రావిడులకు నిషిద్ధము. సనాతన సంప్రదాయానుచార సంపన్నులైన మా అన్నగారు దీని కంగీకరించుటలేదు. నేనుకూడా అనుకూలుడను కాలేదు. ఈ విషయము ధర్మశాస్త్ర మీమాంస కాస్పదమయిపోయినది. విజయనగరములోని ధర్మశాస్త్రజ్ఞులుకూడా ఈ విషయమును విమర్శింప మొదలుపెట్టిరి. ఆతని కుమార్తెకు నా భార్యకు వీరిరువురకును ఎట్లయినా సంబంధము చేసికొనవలెనను ఆసక్తి దృఢముగా కలదు. అప్పుడు వారు దానికి సంబంధించిన శాస్త్రగ్రంథములను క్రోడీకరించి, అందఱిని సమాధానపరచి కార్యమును సాధించిరి దీనివలన వారికిగల ధర్మశాస్త్ర పరిచయము సర్వజన విదితమయ్యెను. ఈ శాస్త్రనిర్ణయమును లోకమామోదించినది. నాటి నుండి యీ మాతుల కన్యాపరిణయమును ఈనాటి ద్రావిడులు కూడ చేయ నారంభించిరి. పిల్లల జాతకములనుగూడ వారే పరీక్షించి, వారి జ్యోతిశ్శాస్త్ర పరిచయమును రూఢిపరచుకొనిరి. నా అనుమానము కొలది మఱెవ్వరిచేతనైనా సరి చూపించుదునా? యంటే వలదని వారించి నన్ను నమ్మించిరి.

అన్నిటికన్న విశేషమేమనగా, వారు ఉపనిషద్విజ్ఞానసంపన్నులు. పరతత్త్వవేత్తలు. దీనిని వారి కథలలో సందర్భానుసారముగ ఉపయోగించిరి. కాని అది లీల మాత్రమే. ఉపనిషత్తులందు వారికి గాఢాసక్తి కలదు. భాష్యసాహాయ్యము వారి కక్కరలేదు. కేవల మూలమునే యాధారముగ చేసికొని స్వతంత్రబుద్ధిచేతనే వారు తత్త్వమును గ్రహించిరి. ఇరువదియైదుపనిషత్తులు గల సంపుటమును చేతబూని కాలుమీద కాలు వేసుకొని ఆడిస్తూ పరుండి ఉపనిషత్తులను కథలను కథానికలను చదువునట్లుగ విలాసముగ చదువుట వారి యలవాటు. నేనది చూచి ఆశ్చర్యపడుచుంటిని. కాని, వారి కది క్రీడా మాత్రమే. ఇట్టి యాధ్యా

త్మికగ్రంథములందు వారికున్న యమితాసక్తికి నేనొకమారు గురి యయితిని.

వారివి కొన్ని వేదాంతగ్రంథములు మాత్రము నాకు వారి యనంతరమున సంక్రమించినవి. అద్వైతసుధ, అనుభూతి ప్రకాశము, అవధూతగీత, స్మృతి కౌస్తుభము మొదలగునవి నా యుపయోగము క్రిందికి వచ్చినవి. ఇంకా ఎన్నెన్నో ఉద్గ్రంథములు ఉపయోగించువారు లేక పడియున్నవి. వాటి నన్నిటిని వారు విమర్శ దృష్టితో చదివిరి. స్వతంత్రబుద్ధితో గ్రహించిరి. ఈ పరిశ్రమ సారాంశమే వారి యుద్గ్రంథ మగు జగజ్జ్యోతి. వారి గ్రహణస్వాతంత్ర్యమే యీ గ్రంథమునకు భూష ణము. సాంప్రదాయచ్ఛాందసులకు దూషణము.

వారి జీవితములో ఈ స్వతంత్రబుద్ధి బలిష్ఠము. ఒకసారి వారు కాఫీ త్రాగుచుండగా ఎదుట నున్న దౌహిత్రుల నుద్దేశించి "మీకు చాలా తీరుబడిగదా ! ఈ పిల్లలకు చదువు చెప్పరాదా?" అని నేనంటిని. దానికి వారు మామూలుధోరణిలో నావైపు తీక్ష్ణముగా కళ్ళు విప్పి చూస్తూ "హాఁ చదువు చెప్పడమా ! ఒకరి కొకరు చెప్పడమా ! నా కెవడు చెప్పాడురా? నీ కెవడు చెప్పాడురా? విద్య చెలమ ఊరినట్టు ఊరా లిరా !" అని గర్జించి తాను విద్యల నార్జించిన విధమును విపులముగా వివరించి భగవద్గీతలోని –

"ఉద్ధరే దాత్మనాఽత్మానం । నాత్మాన మవసాదయేత్
ఆత్మైవ హ్యాత్మనో బంధు । రాత్మైవ రిపు రాత్మనః
బంధు రాత్మాఽత్మనస్తస్య । యేనాత్మై వాత్మనాజితః
అనాత్మనస్తు శత్రుత్వే । వర్తే తాత్మైవ శత్రువత్."

అను శ్లోకముల నెత్తుకొని –

"తన్ను తానే యుద్ధరించుకొనవలెను. తాను తన్ను చెడునట్లు గావించుకొనరాదు. తనకు బంధువైనా, శత్రువైనా తానే. ఇతరు లెవ్వరూ లేరు. తన్ను తాను స్వాధీనము గావించుకొన్న తానే తనకు

బంధువగును. అట్లు గానినాడు తానే తనకు శత్రువగును" అను భావమును చక్కని యుదాహరణములతో వివరించి విస్తరించి నన్నెంతయో ఆనందింపజేసినారు. అదియే వారి జీవితచరిత్రకు మూలసూత్రము.

వ్యక్తీకృతము వారి తత్త్వజ్ఞానసంపత్తి. ఒకనాడు నేను వారికడ నున్న సమయమున వారు తైత్తిరీయోపనిషత్తును జూచుచుండిరి. అందులో :

"ఆత్మానం స్వయ మకురుత - తస్మాత్త త్సుకృత ముచ్యతే
యద్వైత త్సుకృతం రసో వైసః - రసం హ్యేవాయం
లబ్ధ్వాఽనందీ భవతి."

ఆత్మ తన్నుతానే అనేకరూపములుగ జేసుకొనెను. అందుచేతనే దానిని సుకృతమందురు. అదియే సమస్త జగత్సారము దానిని పొంది ఆనందమును పొందుదురు" అనిన సంపుటిని విపులీకరించి సృష్టిస్థితిలయ తత్త్వమును బోధించిరి. సర్వోపనిషదుత్కృష్టమయిన తత్త్వమును విశదీకరించి నాకు వికాసమును గలిగించిరి. నే నక్కడున్నంత కాలము వారితోడనే సంభాషణ మూలమున కాలము గడుపుచుంటిని. ఒకనాడు బజారులో నడుస్తూ వుండగా ఏదో సందర్భమున "ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి" తనకోసమే అన్నిటియందు ప్రీతి" అని నే నంటిని. ఆ మాట విని, వారి అలవాటు ప్రకారంగా నిలబడిపోయి తీవ్రంగా నావైపు చూస్తూ చాలాసేపటికి దానినే అనేక దృష్టాంతములతో విపులీకరించి జీవనరహస్యమును గ్రహింపజేసిరి. మఱియొకసారి "తరతి శోక మాత్మవిత్ - ఆత్మజ్ఞాని సంసారదుఃఖమును దాటును" అన్న వాక్యమును బహువిధముల వ్యాఖ్యానించి తరణ మార్గమును స్పష్టీకరించిరి. "ఆత్మానాం చేద్విజానీయాత్ అహమస్మీతి పూరుషః-కిమిచ్ఛన్కస్యకామాయ శరీరమనుసంజ్వరేత్ - నేనే యాత్మను అను జ్ఞాని దేనికోసం శరీరములో బాధపడును", అన్నదానికి వారి విశదీకరణమును వారివల్ల

విను కుతూహలముతో నేను కోరగా ప్రతిపదమును పరీక్షించి సమన్వయించి సముదాయ జీవిత రహస్యమును ఉద్బోధించిరి.

ప్రస్థానత్రయములో రెండవదయిన బ్రహ్మసూత్రములు గూడ వారికి కరతలామలకములే. దానిలో నాకు గొంత వ్యాసంగమున్నదని తెలిసి నన్ను పరీక్షించుటకు "ఆనందమయోఽభ్యాసాత్" అన్న సూత్రమును గురించి ప్రశ్నించిరి. వారివద్ద నా పాండిత్యమును ప్రకటించునంత తెలివితక్కువ పనిచేయక మీరే చెప్పండని యూరకుంటిని. అప్పుడు వారు "చూచితివా ? శంకరుని చాతుర్యము గురువునే విమర్శించుచున్నాడను దోషము తనకు రాకుండ సూత్రమందలి "మయట్" ప్రత్యయము యొక్క వికార ప్రాచుర్యార్థములను వివరించుచు, సమర్థిస్తూ ఉన్నట్లు ప్రయత్నిస్తూ, సవరణ ఎలాగు చేసిరో శ్రీ శంకరులు" అని వారి నైపుణ్యమును వివరించి పరతత్త్వమెంత సూక్ష్మమో చూడుమని తమ నైపుణ్యమును నిరూపించినారు. ఆ కూటములో మూడవదగు భగవద్గీతకూడ వీరికి కొట్టినపిండియే. దానిలోకూడ అనేక విషయములను చర్చిస్తూ కొన్ని అభిమాన విషయములను నొక్కి విపులీకరించి వాటిలో పైనిచెప్పిన "ఉద్ధరేదాత్మనా" అనునది యొకటి. రెండవది యింద్రియ నిగ్రహమునుగూర్చినది. దీనిననుసరించియే సుఖదుఃఖములుకూడ మన యధీనములే యను చూపు వారికి గలదు. ఇదివారి రెండవ యభిమాన ఘట్టము.

''ధ్యాయతో విషయాన్పుంసః సంగస్తేషూపజాయతే
సంగాత్సంజాయతే కామః । కామాత్క్రోధోఽభిజాయతే.
క్రోధాద్భవతి సమ్మోహః । సమ్మోహాత్స్మృతి విభ్రమః
స్మృతి భ్రంశాద్బుద్ధి నాశః । బుద్ధినాశాత్ప్రణశ్యతి
రాగద్వేష వియుక్తైస్తు । విషయా నింద్రియైశ్చరన్
ఆత్మవశ్యై ర్విధేయాత్మా । ప్రసాద మధిగచ్ఛతి.
ప్రసాదే సర్వదుఃఖానాం । హానిరస్యోప జాయతే,

ప్రసన్న చేతసో హ్యాశు । బుద్ధిః పర్యవతిష్ఠతే
నాస్తి బుద్ధి రయుక్తస్య । నచాయుక్తస్య భావనా,
నచాభావయత శ్శాంతి । రశాంతస్య కుతస్సుఖం."
(భగవద్గీత-2 అధ్యాయము-62-65 శ్లో॥)

ఏ పదార్థమునైనా చింతించుచుండిన ఆ పదార్థమందు ఆసక్తి కలుగును. ఆ యాసక్తివలన అది లభింపవలెననెడి కామము పుట్టును. ఆ కోరిక నెరవేరనిచో క్రోధము కలుగును. దానివలన నేమియు దెలియనంత యజ్ఞానము జనించును. దానివలన స్మరణశక్తి యంత రించును. అద్దాన బుద్ధి నశించును. తన్నాశమున ప్రతివాడును చెడును. ఆ రాగద్వేషములను ఇంద్రియములనుండి మరలించి, ఆ యింద్రియము లను తనకు లొంగునట్లు గావించుకొనిన వానికి మానసిక ప్రసన్నత లభించును. అట్టి ప్రసన్నత లభించిన వారికెట్టి దుఃఖమును నుండదు. ప్రసన్నమనస్కునకు బుద్ధియు నిలకడగా నుండును. యోగవిరహితునకు బుద్ధియు లేదు; యోగవిరహితునకు భావనయు లేదు. బుద్ధియు భావనయు లేనివానికి శాంతి యెక్కడిది? శాంతిలేనివానికి సుఖమెక్కడిది?" ఈశ్లోకములో దుర్భావన నాశనముకొఱకున్నూ మనః ప్రసాదమును గలిగించే సుభావన శాంతి సౌఖ్యములకున్నూ మూలములని యాతని నమ్మిక. వీనిని ఉదాహరణములతో వివరించి నిరూపించిరి. భక్తికి నిర్వచనము పెక్కుచోట్ల పెక్కువిధముల నున్నను భగవద్గీతలోని భక్తినిర్వచనము సర్వోత్కృష్టమని, గీతలోనిభక్తియగ్రస్థాన మలంక రించినదని వారు ప్రశంసించుచుండిరి. 12వ అధ్యాయములోను, 18వ అధ్యాయమున 51-55 లోను ఉన్న భక్తిలక్షణములను ప్రశంసిస్తూ భక్తి జ్ఞానమునకు ఆఖరిమెట్టు అని చెప్పుచుండిరి. వారు అట్టిభక్తులు. ఇంకా కొన్ని యుదాహరింపవచ్చును. కాని గ్రంథవిస్తరభీతి వారించు చున్నది.

ఇట్లు వారు ప్రస్థానత్రయమును స్వయంకృషి చేతనే సాధించి తన యంతరంగమున నిలిపికొని లోకవిడంబనము అవసరములేని సమయము లలో స్వస్వరూపానుసంధానము చేసుకొనుచుండిరి. వారి హరికథలు కూడా జ్ఞానయజ్ఞమునకు చెందినవే. కథలలో వారు చేసినది సర్వ తారకమైన జ్ఞానమార్గసాధనమే.

ఈ విధముగ వారిజీవితమంతయు తనయొక్కయు ఇతరుల యొక్కయు, తరణము రక్తి భక్తులచే సాధింపవచ్చునని రూఢిగా ప్రక టించి సార్థకము గావించుకొనినారు. వారి స్వీయచరిత్రయందుగాని, దాని సంగ్రహరూపములయిన యితర చరిత్రలలో గాని శ్రీ దాసుగారి జ్ఞాన సిద్ధినిగూర్చి ఎవ్వరును విశేషించి చెప్పలేదు. వారి లోకాతీతశక్తులను వారి యలవాటులను బాహిరములైన వానినే వివరించిరి.

వారితో నాకున్న యీ యసాధారణ సన్నిహిత పరిచయముచే నేను దృఢముగా గ్రహించిన దేమన "వారు సర్వతోముఖ ప్రజ్ఞాధురం ధరులు - కేవల సరస్వత్యవతారము" అని. ఇది నా దృఢ విశ్వాసము.



# శిష్యసంపద

శ్రీ యస్వీ జోగారావు

అజ్జాడాదిభట్లవారు తరతరాల నుండి మహాసంపన్నులు. నిరతాన్నదాతలుగా చిరంతన ప్రసిద్ధులు. అయితే గాదెలు, గేదెలు, బోదెలును మాత్రమే కాదు వారి సంపద. విద్యాబుద్ధులుగూడ వారి కానువంశికములైన నిధి నిక్షేపములు. కాని చిత్రము, దాసుగారి కుటుంబము మాత్రము సిరి సరస్వతుల అత్తాకోడలి సిగపట్లగోత్రమైనది. అమ్మ వంకను అబ్బ వంకను అందరును సరస్వతీ స్తనంధయులే కాని లక్ష్మీపుత్రులు కారు. ఆ సరస్వతి అత్తగారిని సాధించుట కొరకు అవతార మెత్తవలసి వచ్చినది. నారాయణదాసై మామను మంచిచేసుకొని అత్తను సాధించినది. గంటముపట్టి గజ్జకట్టి కంఠమెత్తి మామ కథ చెప్పినా అత్తగారి పెత్తన మడుగున బడవలసినదే, అరచేతికి రావలసినదే. కాని యా కడాని గండపెండేరములు, కట్నములు, కానుకలు దాసుగారి కడ కలకాలము కాపురము చేసినవి కావు. కట్నము కానుకలు పుచ్చుకొన్నంతనే నవాబు కర్చుచేసినంతనే గరీబు. ఇదీ ఆయన వరుస. కర్చులనగా దర్జావద్దు సొంత కర్చులే కాదు దానధర్మాల దూబరాలు. సాంబరాభరణాడంబరుడై నడువీథి హరికథ చేసినపుడవి సంపచ్ఛంపాలతాంగి సాష్టాంగములుచేయు సరస్వతి దర్బారు. నట్టింట మట్టుగోచి పెట్టుకొని హరికథాదిక గ్రంథ రచన మొనర్చునపు డాయన సంపత్కటాక్షదూరుడై సమాధిగతుడైన కైలాస సన్న్యాసి. అయితే ఆయన సంపద యనగా స్పందనములేని మందసపు చీకటి కోణమున మరుగుపడిన నిశ్చేతనమైన ధనసంపద కాదు. అది



గురుపూజ : శ్రీ వేతి లక్ష్మీనారాయణ భాగవతులు.

భావస్పందనబంధురమగు భక్తిసంపద. అంతస్తేజోవిరాజితమగు జ్ఞానసంపద. రసజ్ఞజనమనోభిరామమగు కళాసంపద. సచేతనమగు శిష్యసంపద.

సరస్వతీ వర ప్రసాదుడగు దాసుగారికి జగద్గురుడైన పరమేశ్వరుడే పరమ గురువు. ఆయన విద్యలెల్ల స్వయంకృషిలబ్ధములే. అనగా హరికరుణాకటాక్ష సంప్రాప్తములే. అందులకే ఆయన తన నేర్పులనెల్ల జగజ్జనతారక మగు హరికీర్తనము కొరకే వినియోగించెను. తన సకల కళాకౌశలముల కెల్లగా సాంద్రవిద్యాకేంద్రముగా హరికథను రూపొందించుకొనెను. ఆంధ్రదేశమందలి ప్రప్రథమ సంగీత కళాశాలకు తాను ప్రప్రథమ ప్రధానాచార్యుడయ్యు హరికథక పితామహుడుగా జగత్తున సరస్వతి పేరు ప్రతిష్ఠించెను. అనేక శిష్యులను తన యశఃపతాకలుగా దేశమున నెలకొల్పెను. తన కొక్క గురువు లేకున్నను తాను హరిదాసజగద్గురు వయ్యెను.

"దాసు నారాయణునకు నీతండు, వీని
దాసు లెల్లెడ గల హరిదాసు లెల్ల
రొక్క హరిదాసులే గాదు నిక్క మితని
యెడల నాదృతి లేని వా డెవఁడు పుడమి."

అని మహామహులు తిరుపతి వేంకటకవులు వీరిని యథార్థముగా కీర్తించిరి. అంతేకాదు దాసుగారవతారము చాలించిన తరువాత ఉళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు – "ప్రస్తుత మాంధ్రదేశమున హరికథ చెప్పు ప్రతి వ్యక్తియు ప్రత్యక్షముగానో పరంపరగానో శ్రీనారాయణదాసుగారి శిష్యులో ప్రశిష్యులో కాక తీరదు." అని వక్కాణించిరి. (ఆంధ్రపత్రిక, 29-1-1945). అది యథాక్షర సత్యము. అంతేకాదు విశ్వనాథవారన్నట్లు "సత్కవి చెళ్లపిళ్ల వేంకన గురువంచు చెప్పికొనఁగా నది గొప్ప తెనుంగు నాడునన్" అని అనేకాంధ్రకవులు భావించినట్లుగా దాసుగారి శిష్యులు కాని హరికథకులును ఆయన శిష్యులమని చెప్ప

కొనుట, తమ హరికథా ప్రసంగారంభముల యందు తత్ప్రస్తావము చేయుట యొక పరిపాటి. ఆ భారద్వాజుడైన ద్రోణాచార్యుల కొక్క-ఏకలవ్యుడే అటువంటి శిష్యుడు గాని యీ భారద్వాజు లిద్దరికీ ఏకలవ్య శిష్యు లనేకులు. అందును హరికథకులు గాని పట్టి సంగీత కోవిదులును కొందరు దాసుగారిని భావనా గురువుగా పరిగణించుకొనిరి.

దాసుగారి సంగీతప్రజ్ఞ స్వాయంభువము. ఆయన స్వభావము సర్వతంత్ర స్వతంత్రము. ఒక యొజ్జ వద్ద నేరపడి పెట్టుకొన్నది కాదు. ఒక సిద్ధమైన పక్కీకి కొదుగునది కాదు. ఆపక్కీ స్వతసిద్ధము, స్వభావ సిద్ధము నైనది. "దాసుగారి బాణీ" అని వాసికెక్కినట్టిది. పండ్రెండు పందలకు పైబడిన దాసుగారి కీర్తనలలో కొన్నికొన్నిటిని కొందరు కంఠస్థము చేయగలిగిరే కాని ఆ అంభోదగంభీర త్రిస్థాయి గమక కమనీయ గాఢగాత్రము, ఆ పంచతాళ పటువైన పల్లవి పాట, ఆ లయ హొయలు నాన్యతోదర్శనీయములు, అనన్యసాధ్యములు. అనుకరించుటకు ప్రయత్నించి పలువురు విఫలురైరి. దాసుగారి తమ పాటగుట్టు మరెవరికిని చెప్పరను నొక వాడుక పడినది. అది అయథార్థము. ముప్పదేండ్లు రాకమునుపే ఆయన గొప్పదనమును గ్రహించిన పప్పా అయ్యావారు అను గాయక శిఖామణి మేళకర్త రాగముల మేలిమి సరములైన కీర్తనలుగల దాసుగారి ప్రహ్లాదచరిత్రము హరికథను వారి యొద్దనే అధ్యయనము చేసెను. వరుసగా సంగీతజ్ఞులు మరికొంద రెగబడగా అపురూపపు జన్యరాగము లనేకముగల తమ సావిత్రీ చరిత్రమును వారికొక వారము పాటు వేదమునంత చెప్పునట్లు చెప్పిరి దాసుగారు. ఆ పాటపోలికమైనను వారికి పట్టుబడినది కాదు. చెళ్ళపిళ్ళవారు చెప్పినట్లు- "శిష్యులలో కొందరు కొంతవరకు అనుకరించినను కొన్ని పోలికలు దాసుగారితో నంతరించవలసినవే గాని శాశ్వతముగా నిల్చిపోదగినవి కావు." అందుచే దాసుగారా అధ్యేతలతో ఇట్లు చెప్పుకొని యేమి లాభ మని పెదవి విరువగా నందులో యొక గడుసరి శిష్యుడు- "బాబూ ! మే మెంత నేర్చుకొన్నను మీవలె

పాడగల్గుదుమా ? నేర్చుకొనగా నేర్చుకొనగా మా మా శక్తికొలది యేదో యొక తీరున రాగలదు. ఇంతకును మీ శిష్యులమని లోకములో కొంత యాదరణమునకు పాత్రుల మగుదుము" అనెను పలువురు తమ పరిశ్రమ కంచి గరుడసేవ కాగా తీర్థప్రసాదములు మాత్రకయే వచ్చినదారి పట్టిరి. కొలది మంది మాత్రము భల్లూకపు పట్టుబట్టి యేండ్ల తరబడి పడిగాపులు పడినను అడియాసల పాలుగాక అంతో యింతో దాసుగారి వారసుల మనిపించుకొనిరి. కీర్తనల కైవాడము కొంత పట్టుబడినను దాసుగారి కథాకథన విధానము కైవసముగాక తికమక పడుచుండెడివారు కొందరు. వారికి కథ గంపు నపుడు మాత్రము దాసుగారు వారి యుబుసు లేక చండామార్కులవలె విజృంభించి శిక్షించెడివారు కాని శిష్యులు కథను వీడి వారినే స్మరించుకొనెడివారు ఎట్టకేల కెటులో ఓ పది పండ్రెండు మందికా ఫక్కి యొక కొంత పట్టుబడినది.

అట్లు చరితార్థులైన శిష్యులలో పేరుమోసినవారిలో ప్రథములు కీ. శే. వాజపేయయాజుల సుబ్బయ్యగారు. ఆయన తొలుత పప్పు అయ్యవారి సంగీతశిష్యులు. పిమ్మట నటుడయి రంగమున కెక్కి తదుపరి దాసుగారి కడ హరికథ నభ్యసించి రచ్చకెక్కి రాణించిరి. దాసుగారి నంటి పెట్టుకొని వారి హరికథలలో వెనుకపాట పాడి చేసిన చిరకాలపరిశ్రమకు ఆయనకు సహజముగా నున్న అభినయ వైదగ్ధ్యము, అప్పటికే వ్యాసంగ వశమున అబ్బిన సంగీతప్రజ్ఞ, సాధురూపము, వాక్చమత్కారములను నవి. వన్నె పెట్టినవి. దాసుగారి కంఠపుటురుకులును, జారులును వీరి కంత యలవడలేదుగాని కథన విధానమున వీరి గుర్వనుకరణము ప్రశంసాపాత్ర మైనది. 1921 సం॥లో నందిగామలో దాసుగారి గౌరవార్థము ఏర్పాటు చేయబడిన వారి "రుక్మిణీకల్యాణము" హరికథపోటీలలో సుబ్బయ్యగారిదే ప్రథమబహుమతి. నేమాని వరహాలుదాసు, రావికంటి జగన్నాథ దాసు, చిట్టిమళ్ల రంగయదాసుగారలకును బహుమతులు లభించినవి. సుబ్బయ్యగారు, గుడిపాటి శ్రీరామమూర్తి, పెంటపాడు సుబ్బయ్య,

పుచ్చల భ్రమరదాసు (ఉరపు బవరదాసు) వంటి విదగ్ధశిష్యులను గూడ తయారుజేసి నారాయణదాసు వారసత్వమును వర్ధమాన మొనరించిరి. బవరదాసుగారు మొదట దాసుగారి కేకలవ్యశిష్యులే గాని దూరముగా నుండియే వారి పోకడలు పట్టుకొని దాసుగారి కభిమానపాత్రులై దగ్గరికి చేరి వారి కడను కడుదీక్షతో శుశ్రూష చేసి ఆ విద్యను సాధించి పేర్వడ సిరి. బవరదాసుగారు చెన్నపురి యందును బహువారములు హరికథలు చెప్పి సత్కరింప బడినట్లు తేది 26-7- 1928 నాటి ఆంధ్ర పత్రిక పేర్కొనుచున్నది. 'దాసుగారి గౌరప్ప పెండ్లి' హరికథను వీరే 1940 లో అచ్చొత్తింపించిరి. వీరికి దాసుగారి మీద ఎంత భక్తియనగా వారి వేషభాషానుకరణము చేసిగాని సంతృప్తిపడెడివారు కారు.

దాసుగారి ముఖ్య శిష్యులలో శ్రీ నేమాని వరహాలు దాసుగారొకరు. వీరు దాసుగారికడ సంగీత కళాశాలలో గాత్రసంగీతశాఖకు ఆచార్యులు. దాసుగారివలె గొప్ప శారీరము గలవారు. వారి ఫక్కిని పక్కెడ్బందుగా చిక్కబరుచుకొన్న వారు. శ్రీ చొప్పల్లె సూర్యనారాయణ గారి వంటి గొప్ప శిష్యులను కూడ తయారుచేసిరి. శ్రీ చిట్టిమళ్ళ రంగయ్యగారును దాసుగారి ననుకరించి నెగ్గిన ప్రతిభాశాలి. దాసుగారి తరువాత వారి "గౌరప్ప పెండ్లి" అచ్చతెలుగు హరికథ చెప్పగలిగినది వీరొక్కరే.

దాసుగారి శిష్యవర్గములో శ్రీ నేతి లక్ష్మీనారాయణగారి దొకవిశిష్ట స్థానము. దాసుగారికి వీరిమీద పుత్రవాత్సల్యము. ఇంటిమండి సంగీతకళాశాలకు దాసుగారి వెంట రామాయణహరికథాగానము చేయుచు వీరును సుబ్బయ్యగారును వెళ్ళుచు మార్గమధ్యమందే గురుశుశ్రూష చేయుట యొకవరి పాటి. ఆ సన్నివేశమును, సంగీత కళాశాలలో గణపతి నవరాత్రులు జరిపి చివరి దినమున ఊరేగింపుటుత్సవములో విజయనగర వీథులలో కీ. శే. ద్వారం వెంకటస్వామినాయుడుగారి వాయులీన వాదనమున కనువుగా దాసుగారు గీతనృత్యములు పరిఢవించుచుండగా వారి వెనుక ఈ శిష్యద్వ

యము వంత పాడుసన్నివేశమును తిలకించిన పురజనులు వాల్మీకి వెంట కుశలవులను జూచిన స్ఫురణగలిగించి పులకించి పోయెడివారు. దాసుగారు ఆరు కాండల రామాయణమును ఆరు హరికథలుగా రచించి దానికి 'యథార్థ రామాయణ' మని నామకరణము చేసిరి. కొన్ని సన్నివేశములు వాల్మీకములో ప్రక్షిప్తములైనవని భావించి అట్టి అవాల్మీక సన్నివేశములకొక పరిష్కార మార్గమును సూచించుటచే వారు దానికా పేరిడిరి. అది ఆరు కథలు గాని దాసుగారు గాని, వారి శిష్యులుగాని పట్టుబట్టి పగడగా చెప్పినచో శ్రోతలకా రసానంద మొక మూస గ్రాసము. అట్లెందరెందరో హరిదాసులా రామాయణ కథాగానము చేసి బహువిధ సత్కారము లందుచున్నారు. ఒకపరి ఒకాయన దాసుగారిని మీదే యథార్థ రామాయణమా? ఇతరులవి కావా? అని ప్రశ్నింపగా చట్టున దాసుగారు "ఔను. యథా = సత్యముగ, అర్థ = ధనమును ఇచ్చే రామాయణం నాది. వందలు వేలు హరిదాసులకు బ్రతుకు తెరువు చూపినది నా రామాయణం" అని సగర్వముగా నిర్వచించిరి. అట్టి ఆరామాయణ కథాగానములో సుబ్బయ లక్ష్మీనారాయణ భాగవతు లిద్దరికిని మంచి తరిఫీదు నిచ్చిరి దాసుగారు. నాటి నుండి వారిరువురికిని "రామాయణ సోదరులు" అను వ్యవహార మేర్పడినది. మదరాసు అఖిలభారత కాంగ్రెసు మహాసభలకు సభాప్రారంభకులుగా వెళ్లిన గురువుగారి వెంట వీరిరువురును వెళ్లి అక్కడ జరిగిన అనేక హరికథలలో గురుదేవునితో పాటు కర్ వేహ రామేశం ప్రభృతుల ప్రశంసలకు పాత్రులైరి. పిఠాపురములో నెలదినములు దాసుగారు యథార్థ రామాయణము చెప్పినపుడు (శ్రీ) నేతివారు సహకారగానము చేసి వీణ సంగమేశ్వరశాస్త్రి, దెందుకూరు నరసింహశాస్త్రి ప్రభృతుల ప్రశంసాప్రసూనములను దాసుగారితో పాటు శిరసావహించిరి. దాసుగారి కడ వారి వండ్రెండు హరికథలను వల్లించిన మహాయోగము ఈ రామాయణ సోదరులకే పట్టినది. కాని దాసుగారు ఉత్తరకాండకథను "జానకీ

శపథము" పేరుతో వెలయించిన హరికథ మాత్రము వీరికే కాదు ఇంకెవ్వరి కిని కొరుకుడుపడినది కాదు. డెబ్బదిరెండు మేళకర్తరాగముల గాథపాక మా హరికథ. దాసుగారైనను ఆకథను తమ జీవితములో ఒక్కమారే చెప్పిరి-వారి షష్టిపూర్త్యుత్సవ సందర్భమున విజయనగరము అయ్య కోనేటిగట్టున ఆంజనేయస్వామివారి ఆలయమున. అయితే ఈ రామా యణ సోదరులు మాత్రము గుర్వనుజ్ఞతోడనే సందర్భోచితములైన రాగాంతరములతో ఆకథ నధ్యయనము చేసిరి. ఆకథను చెప్పగలిగిన హరి దాసులు ముప్పురే నాటికి నేటికిని- ఈ నేతివారు, శ్రీ వడ్లమాని నరసింహ దాసుగారు, శ్రీ కరూరు కృష్ణదాసుగారు. దాసుగారి అపూర్వ నృత్యకళా కౌశలముగూడ కొంత సుష్ఠుగా పట్టుబడినది ఈ ముప్పురికే. దురదృష్ట వశాత్తు నేతివారి కొకరైలు ప్రయాణములో నివ్వెరవ్వపడి గాత్రధర్మము చెడినదిగాని తత్పూర్వము వారి నృత్యగానములు శాస్త్రశాణరేఖాయిత ములై రసజ్ఞపారిషదరంజన శ్లాఘన పాత్రములై దాసుగారిచే సెహబా సనిపించుకొన్నవి. నేడు డెబ్బది యెనిమిదేండ్ల వృద్ధు నేతివారు. హరికథ చెప్పుట విరమించుకొనిరి. కాని తన యెదుట దాసుగారి యూసువచ్చిన చాలు పరవశించి ఆయన చేయు పాద విన్యాసమును మరువలేము. ఆయన యెదుట నెవరైన దాసుగారి హరికథ చెప్పిరా సరేసరి కథ రస పట్టులో పడు ఘట్టమున హఠాత్తుగా లేచి వేదిక నెక్కి అవతలి హరి దాసును వెనుకకు నెట్టి ఆయన ప్రదర్శించు నృత్యపాండిత్య మది యొక హృదయము నూచివేయు రమణీయదృశ్యము. తేది. 9-11-1933 న దాసుగారికి తునిలో "బ్రహ్మరథ"సన్మానము జరిగినది. అప్పుడు నేతివారు గురువుగారితోనే యున్నారు. అప్పటికే దాసుగారి కథలను వారి సన్ని ధిలో శుశ్రూష చేయకుండగనే కొందరు హరిదాసులు చెప్పుటయు, ఆ చెప్పుటలో వారి సంప్రదాయమునకు చెరుపు చేయుటయు కద్దు. అది గమనించి దాసుగారు అట్టివారికి రిజిష్టరు నోటీసులిచ్చి కథలను మధ్యలో ఆపుచేయించిరి. అట్టి యొక ఘట్టములో ఆవేశవశంవదులైన దాసుగారు

వెంటనే ఆ తునిలోనే 11-11-33 న శ్రీ నేతివారికి సాధికారముగా ఒక సనదు వ్రాసి సంతకముచేసి యిచ్చిరి. "అదే నా విద్యకు స్నాతకోత్సవం... ఏ విశ్వవిద్యాలయ పట్టానికి లేని గౌరవం దాని కున్నది" అని నేతివారి వక్కాణ. గురుదేవుల జీవిత చరమక్షణమున వీరక్కడనే గరుడాళ్వారువలె కాచుకొనియుండిరి. గురువులు పరమపదించగనే వీరు తమ స్వస్థలమైన విజయవాడకు విచ్చేసి అచిరకాలమున నట 'శ్రీ నారాయణదాస హరికథాగాన కళాపరిషత్తు' స్థాపించి నేటికిని ఏటేట దాసుగారి ఆరాధనోత్సవముల నతివైభవముగ జరిపించుచున్నారు. తేది 25-2-51న సత్యనారాయణపురము శివాలయావరణములో గురుదేవుని శిలావిగ్రహమును ఆగమోక్తముగా ప్రతిష్ఠచేసి అనునిత్యము పూజాపురస్కారములు జరించుచున్నారు. గురువులు ధరించిన మంచిగంధపు పాదుకలు, కాలిగజ్జెలు, చిటితాళములు, చేతికర్ర తమ యింట పూజాపీఠమున పదిలపరుచుకొని - "మా గురుపూజయే మాకు ఏడుగడ, మా గురుపూజయే మాకు ఇహపరసాధకం" అను అచంచల విశ్వాసముతో నున్నారు. ఇంతటి గురుభక్తి పరాణు నీ నవయుగమున మరి చూడబోము. కౌత్సోదంక ప్రభృతులైన పురాణకాలపు శిష్యులను తలపింతురు వీరు (చీరాల సంస్కృతి సమితివారు ప్రకటించిన నారాయణదాస శతజయంత్యుత్సవ సంచికలో వీరు వ్రాసిన "మాగురుదేవులు" అను వ్యాసమవశ్యపఠనీయము.) శ్రీ ములుకుట్ల సదాశివశాస్త్రి, అంబటిపూడి శివరామకృష్ణ, శ్రీ కుప్పా వీరరాఘవయ్య, శ్రీ కావూరి సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీ కరెడ్ల సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీ వెంపటి సుబ్బనారాయణ భాగవతులు ప్రభృతులు శిష్యులు.

దాసుగారి శిష్యులలో మరియొక అఖండుడు శ్రీ వేదనభట్ల వెంకటరమణయ్యగారు. వీరు తొలుత దాసుగారి శిష్యులును, విజయరామగాన పాఠశాలలో మృదంగ విద్వాంసులు నగు శ్రీపాద సన్యాసిరావుగారి యొద్ద దాసుగారి రుక్మిణీకల్యాణము నేర్చుకొని పిదప 1931

లో దాసుగారి మెప్పునంది ఆ సద్గురు సన్నిధానమున వ్యాసంగము చేసి వారి భీష్మచరిత్రము, యథార్థరామాయణ కథలు చెప్పుకొనిరి. వీరి జిజ్ఞాసను గమనించి దాసుగారు తానెంత రచనావ్యగ్రులై యున్నను అడిగినదే తడవుగా సంతోషముగా కుర్చీనుండి సరుగున లేచి కాలుకదిపి కేలుగలిపి కన్నుగిలిపి నోరుమెదపి సంగీతనృత్య సాహిత్యాలతో అప్పటి కప్పుడు అక్కడికక్కడ వాగ్దేవి నావిష్కరించెడివారు. "ఒరే! నేనింకా బ్రతికి యున్నాను. నాదగ్గర కొచ్చి తెలుసుకోరేమిరా? వెఱ్ఱివాళ్లు!" అని యనుచుండెడి వారు-"శిష్యవాత్సల్యంబు చెలువు దీర్చిన మూర్తి." రమణయ్యదాసుగారికి దాసుగారి సాంగత్యము వల్లనే కవితాశక్తి కూడ అలవడినది. ఆయన మొదటి పద్యము నారాయణదాసుగారికే నీరాజన మెత్తినది. గురువుల యాశీస్సులతో రమణయ్యగారి కంఠమే కాదు గంటము కూడ గడితేరి ఆయనచే హరికథా రచన చేయించినది. రమణయ్యగారును, దాసుగారి మరియొక శిష్యులైన శ్రీ పేరి నరసింహము గారును దాసుగారి హరికథ కతి వైభవముగా వజ్రోత్సవము సంకల్పించి ఊళ్లవెంబడి తిరిగి పెద్దపెట్టున ప్రయత్నము చేయుచుండగా "వారి కిక సన్మానము మేము చేయవలె గాని మీరు చేయలేరని దేవత లావహించినట్లు" దాసుగారు పరమపదించిరి. (చీరాలవారి సంచికలో రమణయ్య దాసుగారు వ్రాసిన "సద్గురు సన్నిధానము" అను వ్యాసము చూడ దగును.)

(శ్రీ) పిల్లలమఱ్ఱి రామదాసు భాగవతులు రమణయ్యదాసుగారి వలెనే హరికథక మాత్రులు గాక సరసకవితా విశారదులు. దాసుగారి శుశ్రూష చేసి, నేటికిని దాసుగారి అనేక కథలను కీర్తిని గానము చేయుచున్న ధన్యజీవనులు. గురువుగారి యథార్థ రామాయణము నిప్పటికి 158 పర్యాయములైన చెప్పియుందురు.

(శ్రీ) కరూరు కృష్ణదాసుగారు కూడ నారాయణదాస ప్రతిష్ఠ కెత్తిన పతాక. వీరు గుంటూరు వాస్తవ్యులు. మాధ్వ బ్రాహ్మణులు.

షష్టిపూర్తి అయిపోయినను నేటికిని దృఢగాత్రులై అభినివేశముతో నృత్యకౌశలముతో దాసుగారి కథ లనేకము చెప్పుచున్నారు. 1931 నుండి 1944 వరకు పదునాలుగేండ్లు గురుకులక్లిష్టులై హరికథా వ్యాసంగము చేసినారు. యథార్థరామాయణము, శ్రీకృష్ణజననము (సంస్కృతహరికథ) మాత్రమే దాసుగారి కడ చెప్పుకొన్నారు. జానకీ శపథము, మార్కండేయచరిత్రము, రుక్మిణీకల్యాణము, సావిత్రీచరిత్ర ములను స్వయముగా సాధన చేసుకొన్నారు. గురువుగారి నృత్యకళ వీరికి పట్టుబడినది. సహజముగా నటశిఖామణులు. గురువుగారి యెదుట కథ చెప్పి వారి మెప్పు లందిరి. ప్రియశిష్యు లనిపించుకొనిరి. ఆ పదు నాలుగేండ్ల వ్యాసంగకాలమున గురువుగారే వీరిని పోషించిరట. మరి పూడి ప్రజలెవ్వరో దాసుగారి కథ విన్నవారు వీరివలన సీతాకల్యాణము విని గురుదేవుని ఝుటితిస్ఫురణకు తెచ్చినారని వీరి నభినందించిరి. వీరు యథార్థ రామాయణ మిప్పటి కేబది పర్యాయములైన చెప్పియుందురు. యథార్థరామాయణ కథనప్రవీణులు శ్రీశనగల వెంకటప్పయ్యగారు వీరి శిష్యులు. శ్రీ వేదనభట్ల వెంకటరమణయ్య దాసుగారు వీరికడ 'పాదుక' చెప్పుకొన్నారు.

శ్రీ శ్రీపాద లింగమూర్తిగారు, కీ. శే. తేకి రామమూర్తి గారు, శ్రీ చెరుకుపల్లి కనకదుర్గాదాసు ("మిత్రము" ఉపనామాంకితులు) శ్రీ మల్లికార్జునదాసు, శ్రీ పరిమి సుబ్రహ్మణ్యదాసు (దాక్షారామ వాస్తవ్యులు; వీరు వేరు ఏలూరు వాస్తవ్యులైన పరిమి సుబ్రహ్మణ్య దాసుగారు వేరు.) శ్రీ అదుసుమల్లి నారాయణదాసు (మోపిదేవి దాసు), శ్రీ జగన్నాథదాసు, శ్రీ అప్పలస్వామి, శ్రీ బంక బాలకృష్ణదాసు శ్రీ అన్నంనీడి బాలకృష్ణదాసు (రామచంద్రపురం, గోదావరి జిల్లా) మున్నగువారు దాసుగారి ప్రత్యక్ష శిష్యులు.

శ్రీ వడ్లమాని నరసింహదాసుగారిని, కీ. శే. చొప్పల్లె సూర్య నారాయణగారిని కొందరు దాసుగారి కేకలవ్య శిష్యులందురు కాని

నరసింహదాసుగారిని పిల్లలమఱ్ఱి రామదాస ప్రభృతులు తమ సతీర్థునిగనే సంభావించుచున్నారు. అసలు నరసింహదాసుగారే కంఠోక్తిగా తాను దాసుగారి శిష్యుడనని చెప్పుకొనుట నేనెరుగుదును. అదిగాక చీరాల సంచికలో వారు దాసుగారిగురించి వ్రాసిన వ్యాసమును- "మద్గురువర్యులు" అను మాటతోనే ఎత్తుకొనిరి. నేను విన్న మఱియొక సంగతి యేమనగా నరసింహదాసుగారు స్వయంకృషివల్లను, బహువారములు వేదికపై దాసుగారి దర్శనము వల్లను హరికథకుకావలసిన హంగు లనేకము సమకూర్చుకొని తా నొకనాడు దాసుగారి రుక్మిణీకల్యాణము హరికథ చెప్పబోవుచు దాసుగారిని సప్రశ్రయముగా ఆహ్వానించినారట. దాసుగా రాయన కథవిని తనకడ నేర్చుకొనకుండగనే స్వాంతేవాసులైన శిష్యులను మించి కథ చెప్పినాడన్న సంతోషముతో ఆయన తాను దాసుగారి శిష్యుడనని చెప్పుకొనుట కనుమతించిరట. నే నసలు దాసుగారి నెరుగుదును. నరసింహదాసుగారి కథ నెరుగుదును, ఇరువురును రుక్మిణీ కల్యాణము చెప్పగకూడ చూచినాడను. దాసభారతి శ్రీనరసింహదాసుగారిని పరిపూర్ణముగ కటాక్షించినది. ఆ గౌళగాత్ర గాంధర్వములో, ఆ నృత్య వైయాత్యములో, ఆ అభినయ విన్యాసములో, ఆ యాఁవోక ఛలోక్తుల చకచకలో, ఆ అన్యదేశ భాషా భేషజములో నరసింహదాస హరికథా ప్రసంగములో నారాయణదాస శారదాచారు విపంచీ వికస్వర స్వరములే వినిపించును. నారాయణదాస వ్యక్తిత్వమునకు పునర్భవము కనిపించును. ఈనాడు దాసుగారి జానకీశపథము చెప్పగల చేవగల మొనగా డీయన యొక్కడే. ఈయనకా మధ్య ఆంధ్రవిశ్వకళాపరిషద్వేదికపై నొక సన్మానము గూడ జరిగినది.

శ్రీ చొప్పల్లె సూర్యనారాయణ భాగవతారుగారు దాసుగారి శిష్యులనియే కీ. శే. మరువాడ వెంకట చయనులుగారు వ్రాసిన నారాయణదాస జీవితచరిత్రము పేర్కొనుచున్నది. (చూ. పుట 209). ముందు నేమాని వరహాలుగారి కడ శుశ్రూష చేసి పిదప దాసుగారి కడ

చేరియుందురు. ఆవక్షమున బవరదాసు రమణయ్యగారల వలె దాసు గారికి వీరు శిష్యులు, ప్రశిష్యులును. వీరు దాసుగారి కీర్తన లనేకము గ్రామఫోను రికార్డు లిచ్చి పేర్బడసిరి. శ్రీయుతులు హరిసోమయాజుల సుబ్రహ్మణ్యము, వల్లూరి చంద్రశేఖరశాస్త్రి, భమిడిపాటి అయ్యప్ప శాస్త్రి ప్రభృతులు నారాయణదాస ప్రశంసాత్మకముగా రచించిన యనేక శ్లోకములును, పద్యములును మాకు లభించినవి. అందీ ముగ్గురును కంఠోక్తిగా దాసుగారిని గురుసంజ్ఞచే పేర్కొనిరి. మరి వారెట్టి శిష్యులో తెలియరాలేదు. శ్రీ పిల్లలమర్రి రామదాస భాగవతారు గారు "చిరస్మరణీయుడు" అను శీర్షిక క్రింద చీరాల సంచికలో 210 పుటలో వ్రాసిన పద్యములో

"పరిమి పెద్దింటి పాతూరి హరికథకులు
నిన్ను గురువుగ భావించి నెగడినారు"

అని యున్నది. పరిమి యనగా శ్రీపరిమి సుబ్రహ్మణ్యదాసుగారు. పెద్దింటి యనగా శ్రీ పెద్దింటి దీక్షితదాసుగారు. వీరు దాసుగారి జీవిత చరిత్రమును హరికథారూపమున రచియించి ప్రకటించి ఊరూర నా హరికథాగానము చేయుచున్నారు. పాతూరి యనగా శ్రీ పాతూరి మధుసూదనరావుగారు. వీరు చీరాల సంచికలో 36వ పుటలో దాసు గారిని ప్రశంసించుచు – "వారి శిష్యులలో శ్రీ నేతి లక్ష్మీనారాయణ భాగవతులు, వడ్లమాని నరసింహదాసు మొదలగు వారిప్పటికిని మా వంటివారి కాదర్శముగా నున్నారు" అని యుగ్గడించిరి. హరికథకులును బరంపురము కల్లికోట రాజావారి కళాశాలలో ప్రధానాంధ్రోపాధ్యా యులుగా నుండిన ప్రసిద్ధ వాగ్గేయకారులు శ్రీ పసుమర్తి కృష్ణమూర్తి గారు దాసుగారి కేకలవ్య శిష్యులని ప్రసిద్ధి, ఆయన పార్వతీకల్యాణ మను యక్షగానమును రచించి 1921లో దాసుగారి కంకితమిచ్చిరి. దాసుగారి పెద్దన్నగారి కుమారుడు శ్రీ ఆదిభట్ల లక్ష్మీనరసింహముగారు దాసుగారి కథ సంత చెప్పుకొనకుండగనే దాసుగారి ఫక్కికను పాడ

గల సమర్థుడై, రాగము కీర్తన స్వరము పాడునప్పుడు వారి సంగతులనే ఎక్కువగా దొర్లించుచు హరికథకుడుగా వన్నెకెక్కెను. "హరికథక రాజహంస" అన్వర్థ బిరుదాంచితులు శ్రీ అమ్మల విశ్వనాథ భాగవతారుగారు దాసుగారి శిష్యులు కాకున్నను వారి భక్తుడనని సగర్వముగా చెప్పుకొందురు. వారి ప్రశిష్యుల కోవలోనికి వత్తురు. శ్రీవారి శిష్యులైన సుబ్బయ్య భాగవతుల కడ కొంత శుశ్రూష చేసిరి. సల్లలిత కవిత లల్లగల కవి తల్లజుడు. తేది 21-3-1943న పశ్చిమ గోదావరీ మండలము భట్లమగుటూరున త్యాగరాజ మహోత్సవముల సందర్భముగా దాసుగా రక్కడికి విచ్చేసి రుక్మిణీకల్యాణము చెప్పగా విని వారి యెదుట వారి సీతాకల్యాణము హరికథ తాము చెప్పి వారిచే సెహబా సనిపించుకొన్న ప్రతిభాశాలి. అతఃపూర్వమే దాసుగారి కథలను శ్రీ కొరరు వెంకట సుబ్బయ్యావంతులుగారి యొద్ద వల్లించి యీ నాడేడెనిమిది కథలు చెప్పుచు దాసుగారి యశస్సును దశదిశా విశ్రాంత మొనర్చుచున్నారు. "మరపురాని మనీషి" యను పేరుతో దాసుగారి గురించి యొక చక్కని వ్యాసమును చీరాల సంచికలో ప్రకటించిరి. సంగీతసాహిత్యములు రెండింటను సవ్యసాచియైన శ్రీ వంతుల లక్ష్మీ నారాయణశాస్త్రి గారెన్నడును హరికథ చెప్పినట్లు వినముగాని మన సార దాసుగారిని గురువుగా భావింతురు. మరి దాసుగారు వారికి కేవల భావనా గురువులో లేక సంగీత శాస్త్రమున ఆచార్యకము నెరపిరో !

వారు పీ రసనేల నాడు తెలుగునాట గంటము పట్టిన ప్రతికవికి తిరుపతి వేంకటకవులును, గజ్జెకట్టిన ప్రతి హరికథకునకు నారాయణ దాసుగారును కనీసము భావనాగురువులగుట పరిపాటి. మన హరికథకులందు అవిచ్ఛిన్న దాస సంప్రదాయాధ్వగులు నేటికిని గలరు. నేతి, వేదనభట్ల, పిల్లలమఱ్ఱి, కరూరు, వడ్లమాని ప్రభృతులైన ప్రత్యక్ష శిష్యుల మాట యటుండ పరోక్ష శిష్యులే పరశ్శతముగా నున్నారు. అందు కొందరు ముఖ్యులు : సర్వశ్రీ పెద్దింటి దీక్షితదాసు, ములుకుట్ల

సదాశివశాస్త్రి, కూచిభొట్ల కోటేశ్వరరావు, సామవేదం కోటేశ్వరరావు, యాళ్లబండి తాతారావు, దోర చినబాబు, సాలూరు సరోజిని, గీతాదేవి, కె. ఇందిరాబాల, బుర్రా శివరామకృష్ణశర్మ, అక్కిపెద్ది శ్రీరామశర్మ గజ్జెకట్టి కథ చెప్పు వారియుండే కాదు కంఠమెత్తి గానము చేయు సంగీత విద్వాంసులయందును అట్టి శిష్యు లనేకులు గలరు. కళావతులును చాలమంది యీ గాంధర్వసార్వభౌముని యేలుబడిలో పడగ తిరి.

ఈనాడు దాసుగారి అంబరీష చరిత్రమును అమ్ముల, వేదనభట్ల, ప్రహ్లాదచరిత్రమును అమ్ముల, మార్కండేయ చరిత్రమును పిల్లలమఱ్ఱి, దోర చినబాబు, చిట్యాల ఆంజనేయులు, అమ్ముల, ములుకుట్ల, కుప్పా, జానకీ శపథమును, వడ్లమాని, రుక్మిణీకల్యాణమును అమ్ముల, వడ్లమాని, సావిత్రీ చరిత్రమును అమ్ముల, యథార్థరామాయణమును అమ్ముల, పిల్లలమఱ్ఱి, కరూరు, అందులో విడిగా హనుమత్సందేశమును అమ్ముల, బుర్రా, కోట సచ్చిదానందశాస్త్రి, గుడిపాటి (శ్రీ)రామమూర్తి, సీతా కల్యాణమును ములుకుట్ల సదాశివశాస్త్రి, ప్రతాప సుబ్రహ్మణ్యము, కూచిభొట్ల, సీతాకల్యాణ పాదుకాపట్టాభిషేకములను పి. రాజేశ్వరి మున్నగువారు చెప్పుచున్నారు.

పరంపరగా నింతటి సువిశాలమైన శిష్యసంపద యుండుట దాసుగారి యదృష్టమే. ఆయన కుండిన భక్తి, జ్ఞాన కళా సంపద లాయనతోనే యంతరించినవి. కాని చివరికి మిగిలిన దీ శిష్య సంపదయే. అయితే యీ సంపద ద్వారా ఆ సంపదల సౌభాగ్యము గూడ కొంత శేషించును. "ఆచార్యః పూర్వ రూపం, అంతేవాస్యుత్తర రూపం విద్యా సంధిః" అన్నారు పెద్దలు. అందుకే శిష్యశబ్దము సార్థకమైనది. కాని దేశమంతటను దోసపాదు వలె నల్లుకొన్న దాసుగారి విద్యావంశము వలన దాసుగారికి కొన్ని అపచారములును జరిగినవి. అసలా వంశ శబ్దమును అర్థవంతమైనది. వెదురు పొదరున ముద్దుముద్దుగా రవళించు మురళికి పనికివచ్చు శలాకలుండును. నిచ్చెనలకు పనికివచ్చు బొంగు లుండును,

వడిపోవు గోడలకు పోటి పెట్టదగు నిట్ట లుండును. ఏడుకట్ల సవారి కుప యోగపడు గడ లుండును. ఎందుకును పనికిరాని యీచబోయిన జువ్వ లుండును. సరిగా దాసుగారి విద్యావంశ మట్టిదే. అందు పనికిరాని పాతర సామాను కొంత గలదు. అట్టి దాసు లాయన స్వయముగా హరికథల నెంత స్వరపరచి అచ్చువేసికొన్నను దేవదత్తమైన పాంచ జన్యము వంటి ఆ కంఠము లేకపోయిన మానెగాని ఆయన నిర్దేశించిన రాగ తాళములలో పాడలేరు సరికదా ఆయన గ్రంథస్వరూపము నున్నదాని నున్నట్టు లుండనియ్యరు. అందులో లఘుపారులైన సామా జికుల మెప్పకోస మా గ్రంథమునుండియు నీ గ్రంథము నుండియు కొంత రొడ్డను దెచ్చి కూరుచుందురు. చవుకబారు చమత్కారములను కట్టుకథలను పిట్టకథలను దిమ్మరింతురు, తమ యవగాహన కతీతమైన ఉన్న సంగతులను నుజ్జగింతురు, ఉంచిన గ్రంథమున నైన తమ అర్థ జ్ఞాన ఛందోజ్ఞానములు చాలమి పద్యములు పాడు చేయుదురు. గ్రంథ ములలో ఆంధ్రదేశపు జన్మహక్కగు అచ్చు తప్పలు సరేసరి. ఈ విధ ముగా ఆయన హరికథల కెంతో అపచారము కల్గినది. ఎంత భక్తు లైతే మాత్రము భగవంతుని శక్తిలో వారి కే పాటి యుండును ? దాసుగారి శిష్యుల దిదే వరుస. ఆయనకు సాటి వచ్చువాడును పోటి వచ్చు వాడును సభూతో నభవిష్యతి యగుగాక కాని కనీస మా చాయలకు వచ్చువాడైన కనిపించడే. ఇది దాసుగారి దౌర్భాగ్య మందమా ? లేక తగినట్లు శిష్యులను తయారు చేయలేని ఆయన చేత కాని తన మందమా ? మట్టిని గ్రహించి మనోజ్ఞ భాండములు వాన గలిగిననే కులాలుని ప్రజ్ఞ. అయితే కులాలున కెంత ప్రజ్ఞ యున్నను కుండకు తగిన మట్టి దొరకవలెను గదా. అటువంటి సరుకు ఈ బ్రతికి చెడిన చెడి బ్రతుకుచున్న దేశము భారతదేశమునందు లభించినది కాదు. వారేమి సేతురు ? ఏ మహోన్నతాదర్శములతో ఎన్ని ప్రజ్ఞల సన్ని వేశముగా వారీ హరికథను రూపొందించిరో పిదపకాలమున ఆ యాదర్శ

ములును లేవు, ఆవ్యాజ్ఞలును కానరావు. రచ్చసావిడియందును 'దేవుని కొలువు' సరస్వతి పరిషత్తు, చాక్షుషక్రతువు, శ్రవఃపర్వము కావలసిన హరికథ నేడు కోవెల నడుమ దేవర సన్నిధిని బూతులబుంగయు తైతక్కల మేళము వినోదకాలక్షేప మాత్రము నై పోవలసి వచ్చినది.

శౌనకుడు గొప్ప కులపతియే కాని ఆయనకు తగిన శిష్యులు లేరు. నలుడు గొప్ప నరపాలుడే కాని ఆయనకు తగిన అమాత్యులు లేరు. అట్లే దాసుగారు గురుకుల పారిషదుడే కాని వారికి తగిన శిష్యులు లేరు. తగిన రోగులు లేకున్న అంత ధన్వంతరి మాత్రము తన చికిత్సాచాకచక్యము నేమి చేసికొనును? అట్లైనది దాసుగారి పని. కాని ఆయన శిష్యవాత్సల్య మేమి చెప్పను! క్రొత్తగా తన కడకు విద్యార్థియై వచ్చిన నేతివారిని సహపంక్తిని భోజనము పెట్టి సత్కరించిరి. అది తనకే యెబ్బెట్టుగా తోచి నేతివా రొకనాడు చెప్పకుండ ఊరిలోనికి మాధుకరమునకు పోగా దాసుగా రాయనను ఉన్నపాటున రప్పించి అత్యకోనేటి గట్టున నున్న అన్నార్తుల కాహారము పంచి రమ్మని ఆదేశించి యథాపూర్వము పంక్తి సాగించిరి. ఆలాగుననే అభినవాగతులైన శిష్యులందరికిని సర్వసదుపాయములును దాసుగారే సమకూర్చెడివారు. తమ యింట కుదిరెనా సరేసరి, లేకున్న తా మెరిగిన సంపన్నులచే వారికి భోజనవారము లేర్పరిచెడివారు. జేబుఖర్చుకు వారికి డబ్బులు గూడ నిచ్చుచుండెడివారు దేవుని పెండ్లి కందరును పెద్దలే యనునట్లు దాసుగారి హరికథక శిష్యు లందన్యకులస్థు లెందరో గలరు — చిట్టిమళ్ల రంగయ్య, అసిరయ్య, బవరదాసు, అప్పలస్వామి ప్రభృతులు. శిష్యులకు బిడియము పోగొట్టుటకును, హరికథ కింత ప్రచారము కల్గించి వారి కిహపరముల కింత యుపాధి చూపుటకును నడివీధియందు తాను గజ్జెకట్టి నాట్యము చేయుచు వారిని పాడుమనుచు, తాను తాళము వేయుచు వారి నాడుమనుచు అక్కడి కక్కడ వారికి విద్య నూరి పోసెడివారు. ఆ రోజులలో విజయనగర ప్రజ కది యొక నిత్య వినోద

ప్రదర్శనము. దారిలో దుకాణముల దగ్గర నాగి వారి వారి అవసరము చొప్పున నొక శిష్యున కొక చెప్పులజత, మరి యొక్కని కొక దోవతుల చాపు ఈ విధముగ నిప్పించుట యొక పరిపాటి. ఒకనికి డబ్బులు వలసిన యప్పుడే శ్రీమంతుని యింటికి తీసుకొని పోయి వానిచే నృత్య పూర్వకముగ ఒక కీర్తన పాడించి ఆ గృహస్థు నాదేశించి డబ్బిప్పించుట అదియొక రివాజు. ఒకప్పుడు సుబ్బయ్యగారి కంఠము మూగవోయి హరికథ చెప్పలేక పోవుచున్నాడని తెలిసి మిక్కిలి ఖేదపడి "సుబ్బయ్యా! నీ కిప్పు డిబ్బందిగా నున్నదని తోచుచున్నది. నీకేమైన ధన సహాయము కావలసి యున్న యెడల మోమోట పడక తెల్పుము. చేతనైన సహాయము చేసెద"నని దాసుగా రుత్తరము వ్రాసిరి చొప్పలె దాసు తన కీర్తనలను గ్రామఫోను రికార్డు లిచ్చి డబ్బు గడించుకొనుచున్నట్లు తెలిసియు కాపీరైటు డబ్బులకు కక్కుర్తిపడక పోనీ శిష్యుడే గదా బ్రదుకనీయని యుపేక్షించిరి. వీణలో విశేష పాండిత్యము సంపాదించిన తన శిష్యుడైన అసిరయ్యకు అమిత సంతోషముతో "కల్యాణ దాసు" అను బిరుదు ప్రసాదించిరి. అతనిచే షణ్ముఖి తాళ సహిత నాట్య ప్రదర్శన చేయించి సన్మానించిరి.

దాసుగారొకప్పుడు హరికథార్థము విజయవాడలో వేంచేసి యున్నప్పుడు తీరస్థనీరము కలుషితమై యున్నదని గురువుగారికి విమలాంబువులు తేవలెనని శ్రీ కరూరు కృష్ణదాసుగారు కృష్ణానదీ మధ్యమునకు బోయి బిందె ముంచబోయి దానిని జారవిడిచి దాని కొరకు తాను మునుగగా తత్క్షణ మెవరో కృష్ణదాసు కృష్ణార్పణ మైనాడని తెలుపగా ఆ చేరువ నొక మేడపై విడిసియున్న దాసుగారు పట్టె మట్టగోచి మాత్రము పెట్టుకొని యున్నవారు "సిరికిం జెప్పడు, శంఖ చక్రయుగముం జేదోయి సంధింపడు..." అనునట్లుగా పంచెను కట్టక, కండువా తాల్పక, పావలు తొడుగక, చేతికర్ర పట్టక ఆదరా బాదరాగా "కృష్ణా! కృష్ణా!" యనుచు నదివైపు పరుగులు తీసిరట. ఆహా!

“తన శిష్యులన్న యెడదంగల ప్రేముడి చెప్పలేనిమెత్తన” కదా మహానుభావునకు !

ఇక చివరగా నొకమాట. ఇంక నెందరో శిష్యులను ఎందుకును పనికిరారనుకున్న వారిని పట్టిబభ్రాజమాన భజగోవిందములను చేపట్టి వారికష్టసుఖములను విచారించి వసతిభోజనములను కల్పించి ఉచితముగా విద్యాబుద్ధులు గరపిపెట్టి గావంచాతో తనకడకువచ్చిన వారు జరీకండువాలు వేసుకొనుచు వాసికెక్కుట చూచి కులుకుచుండెడి కులపతిలోక కువలయాప్తుడు దాసుగారు.



# మిత్రులు - అభిమానులు

శ్రీ ఆర్. వి. యన్. సుబ్బారావు

బహుముఖప్రజ్ఞలుగల నారాయణదాసుగారికి మిత్రులు, అభిమానులుకూడ బహుళముగా నుండుటసహజము. మనదేశములో నలుమూలల పర్యటించి, వారి హరికథాప్రదర్శనలచే పామరజనులనేకాక-కవుల, పండితుల, సంగీతవిద్వాంసుల, జమీందారుల, రాజుల, మహారాజుల మెప్పునుకూడ పొందగల్గిరి. జయపూర్, మైసూర్, విజయనగర మహారాజులు, ఖాసింకోట, చల్లపల్లి జమీందారులు, లక్ష్మీదేవి ముద్దుబిడ్డలగుటయేగాక, సంగీత సాహిత్యాది కళలందు మమకారముకల్గి సరస్వతీదేవి ఆశీస్సులుగూడ పొందియుండిరి. వారు నారాయణదాసుగారి ప్రతిభను గుర్తించి, వారినభిమానించి, ఉచితరీతిని సత్కరించిరి.

మైసూరు మహారాజు దాసుగారి ప్రదర్శనలనేకములేర్పాటు చేయించి, వారిప్రదర్శనలకెంతయు నానందపరవశులై దాసుగారిని రు 1,116/- రూప్యములతోడను, రెండుశాల్తీగుశాలువలనొసంగియు మైసూరు వీణ నిచ్చియు అఖండముగా సత్కరించిరి. మైసూరు-బెంగుళూరులలో జరిగిన వీణప్రదర్శనలను, గురించి "హిందూ" "మద్రాస్ మెయిల్" పత్రికలు ప్రశంసించి దాసుగారికీర్తిచంద్రికలను దేశము నలుమూలల వ్యాప్తినొనరించినవి.

విజయనగరమహారాజులగు ఆనందగజపతిగారు, దాసుగారి ప్రతిభను గుర్తించి, వారియాస్థానములో విద్వాంసునిగా చేర్చుకొని గౌర

వించిరి. ఆరోజులలో విద్వాంసులకంటెను, పండితులకంటెను-కవులకు, అందునా అష్టావధాన, శతావధాన కర్తలకెక్కుడు గౌరవమర్యాదలు లభించుచుండెడివి. ఒకనాడు రాజుగారు దాసుగారిని "సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్" అను పాదమిచ్చి కందములో పద్యముచెప్ప మనికోరిరి. దాసుగారు వెనువెంటనే దానినిపూరించుచు చక్కగాపద్యము చెప్పిరి. అంతవరకు దాసుగారియెడ విద్వాంసుడన్న భావనతోడనే మెలగుచున్న రాజుగారు, దాసుగారిని కవిగా గుర్తించి ఆనందపడుటే గాక వారిని మరియొకపద్యముకూడ చెప్పుమనియడుగగా దాసుగారు ఆశువుగా నూరు పద్యములుచెప్పి ఆ శతకమును రాజుగారికంకితమొన గుచు చివరిపద్యమును చెప్పిరి. ఆశతకమును పండితులచే వ్రాయించు న్నవారై, రాజుగారు ఆశతకమును కోటలోని ముద్రణశాలయందే ముద్రింపజేయించి దాసుగారి కొసంగిరి. ఆనాటినుండి రాజుగారు దాసు గారిపై ప్రత్యేకాభిమానము కలిగియుండిరి.

ఆనందగజపతుల యనంతరము, విజయనగరమునకు మరో రాజైన శ్రీవిజయరామగజపతులవారు, సంగీతకళాశాలకు దాసుగారిని ప్రిన్సిపాల్ గా నియమించి అభిమానించిరి. దాసుగారు ప్రఖ్యాత పారశీక మహాకవి యైన ఉమర్ ఖయామ్ వ్రాసిన గ్రంథమును అనువదించి, దానిని విజయ రామగజపతుల వారి కంకితముగావించిరి. దానికెంతయు సంతసించి, విజ యనగరమహారాజ్ఞి "లలితకుమారీదేవి" గారు, ఉమర్ ఖయామ్ వ్రాసిన రుబాయతులను పారశీకమూలమును, మరియు "ఫిట్జిగెరాల్డ్" చేసిన ఆంగ్లానువాదమును, దేవనాగరికలిపిలో, దాసుగారొనరించిన సంస్కృ త, అచ్చతెనుగు అనువాదములతో పాటు పొందుపరచిన గ్రంథమును అచ్చువేయించి, ప్రకటించి, దాసుగారిఅభిమానులలో ప్రాముఖ్యము వహించుటయేగాక, దేశమునకే మంచిసేవ యొనరించినవారైరి. దీనికి "భారతరత్న" డా॥ సర్వేపల్లి రాధాకృష్ణగారు పీఠికన్వ్రాసి, దాసుగారి అనువాద రచనకు వన్నె తెచ్చిరి.

దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు, కవులు పండితులేగాక సంగీతప్రియులుకూడ. వారు దాసుగారిని పలుమారులు ఆహ్వానించి, వారి ప్రదర్శనలేర్పాటుచేయించి. సత్కరించుటేగాక, హరికథకులకే దాసుగారొక గర్వకారణమని ఉగ్గడించి "తెలుగు హరికథాపిత" లని దాసుగారిని సంభావించిరి.

మద్రాసుహైకోర్టున్యాయాధీశులైన శ్రీయమ్. వి. సుబ్బారావు గారికి దాసుగారన్న నెక్కుడభిమానము. "నారాయణదాసుగారు బహుముఖప్రజ్ఞులు. వీరు కవులు రచయితలేగాక, హరికథలో ముఖ్యాంగమైన 'నాట్యము' లో కూడ ప్రపూర్ణులు. వీరి వివిధపాండిత్యరీతులు-దేశీయకళలు, విజ్ఞానములకుద్దీపన కారకములైనవి" అని ప్రశంసించిరి.

మద్రాసు హైకోర్టున్యాయాధిపతులైన శ్రీ వేపా రామేశం గారు, దాసుగారిసహాధ్యాయులేకాక, ఆమరణము దాసుగారితో సఖ్యమొనరించి, అభిమానించిరి ఇట్టిఅభిమానులలో మద్రాసు ప్రధానన్యాయవాది (Advocate General) శ్రీ అల్లాడి కృష్ణస్వామిఅయ్యరుగారొకరు.

"గాయక సార్వభౌమ" బిరుదాంకితులగు శ్రీపారుపల్లి రామకృష్ణయ్యపంతులుగారు దాసుగారిని అభినందించుచు నొక యుత్తరము లో దాసుగారిని, "సంగీతసరస కవితాది సకలకళా ప్రపూర్ణులుగా" పేర్కొనిరి. నారాయణదాసుగారి, సంగీత, సాహిత్యాద్యనేకకళలలోని పాండిత్యము, గాయకసార్వభౌముల ప్రశంసలనంది సార్థకత చెందినది.

దాసుగారిఅభినయమును వార్తేరులో ప్రత్యేకముగాచూచి,ఆనందించిన శ్రీయన్. యమ్. అయ్యరుగారు(ఐ.సి.యస్.)వారియుత్తరములో దాసుగారి నీవిధముగా ప్రస్తుతించిరి- "... హరికథా కథనములో సంగీతములో దాసుగారికిగల అసామాన్యప్రతిభ శ్రోతలను ముగ్ధులనొనరింపగా, వీరిభావప్రకటనలు - ప్రస్ఫుటమైనవై, కేటతెలుగులో ఎల్లరకవగతమై భావవ్యక్తీకరణలో సిద్ధహస్తుడైన షేక్స్పియర్ ను తలపింపజేయుచున్నవి.

వీరి సహజకవిత్వ పాండిత్యములు తోటికవులలోని గొప్పదనమును గ్రహింపగల్గు విశాలదృక్పథము నొసంగి, ఆంగ్ల, పారశీక భాషల యనువాదమునకు దోహదమొనర్చి వానిని అజరామర కళాఖండములుగ నిలిపినవి. బుద్ధీంద్రియ స్పందనముతోను, హృదయద్రవీకరణముతోను కూడిన వీరి హరికథా ప్రదర్శన- ప్రత్యంగప్రశంసనీయము-"

కవియు, పండితులునైన శ్రీపురాణం సూర్యనారాయణ తీర్థులుగారు దాసుగారిమిత్రులు. దాసుగారి హరికథా పద్ధతినొకవ్యాయము అనుకరించుచుండగా, దాసుగారినచటకు కొరొకస్నేహితులు పిలుచుకొని వచ్చిరి. తీర్థులుగారు దాసుగారిని చూచి మోమాటపడుచుండగా, 'తన్ననుకరించుట-తననభిమానించుటే' యని వారిసంకోచమును తొలగించిరి. "అనుకరణ అన్నిటికంటె మిన్నయైనపొగడ్త. అనుకర్తలు, అనుకార్యులకు చేయు గొప్పఅభినందన" అని వ్యాఖ్యానించిరి. ఇదిదాసుగారి సహృదయతను, ఉన్నతభావములను ప్రకటించుచున్నది.

సుప్రీముకోర్టు న్యాయవాదియైన శ్రీ యస్. సి. యస్. ఆచార్యులుగారు- దాసుగారి బహుముఖప్రజ్ఞను క్రోడీకరించి ఒకవ్యాసరూపమున రూపొందించు కష్టతరకార్యమును చేపట్టి కృతకృత్యులై, దాసుగారియెడల వారిసౌమనస్యమును ప్రకటించుకొనిరి. మరియు వారొక పండితుడుగ, ఒక కవిగ, ఒకనాట్యకారునిగ, అంతియుగాక, వీటికన్నింటికంటె అతీతమైన ఒకఉత్తమోపాధ్యాయుడుగ, ఒక వేదాంతిగా భారతీయ సంస్కృతి వైభవము నుపన్యసించు మహావక్తగ- దాసుగారిలో నిండినిబిడీకృతమైన గొప్పదనమునంతను, ఆచార్యులుగారు సాధ్యమైనంతమేరకు పేర్కొనిరి.

దాసుగారికి, వివిధ భాషలపై గల ఆధిపత్యము, ఒకపెట్టనిసొమ్మయినది. వారు ఆంగ్లము, పారశీకము, సంస్కృతము, తెలుగుభాషలలో కృషిచేసి వానియవధులనుజూచిరి. ఒకదానికొకటి సంబంధములేకుండ,

వీరుకూర్చిన హరికథారూపకములలోని రాగతాళములు మరియే హరిదాసును ఏర్పరచియుండడు. వీరు "హిందూస్థానీ బాణీలనేగాక, కర్ణాటక బాణీల నేర్పరచుటయందును సిద్ధహస్తుడని", మైసూరు మహారాజుగారు పేర్కొన్న విషయము సత్యదూరము కాదు.

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు వారి ఉత్తరములో దాసుగారి నీవిధముగా ప్రస్తుతించిరి. "గొప్పకవిపండితులతోను, మహనీయులతోను పరిచయమేర్పరచుకొని, వివిధభాషలను, వాని తీరులను తెలిసికొను అభిలాషవలన, భారతదేశములో బహుప్రాంతములు పర్యటించు సదవకాశము తనకు కలిగినదని, వారిలో దాసుగారిని, వారి బహుముఖప్రజ్ఞవలన ప్రముఖులుగా భావించుచుంటిననియు, అంతేకాక, సంగీత సాహిత్యాది లలితకళలందు అసామాన్యపాండిత్యము వహించిన దాసుగారితో ఈ ప్రపంచముననే పోల్చదగిన వ్యక్తి కానరాడనియు, ఇది గాక (ఆంధ్రదేశము కాక) వేరెచ్చటైనా దాసుగారు జన్మించియున్న యెడల వీరికి గుళ్ళుకట్టించి పూజించియుండెడివారని త్వరలో వీరిగొప్పదనమును ప్రపంచము గుర్తింపగలదని ఆశించుచుంటి" నని పేర్కొనిరి.

వీరిబాల్యమిత్రులైన శ్రీ చిట్టావూరి యజ్ఞనారాయణ చింతామణిగారు, దాసుగారు తీర్థయాత్రలకై 1913లో కాశీ వెళ్ళినపుడు దాసుగారిని అలహాబాదుకు ఆహ్వానించి హరికథాప్రదర్శన మీయవలసినదిగా కోరిరి. అచ్చట తెలుగు తెలిసివారు అరుదగుటచే హరికథకు బదులు వీణను రవళింపజేసి, మృదుమధురస్వరములలో తాను వ్రాసిన "హరికథామృతము, తారకము" లనుండి కొన్ని సంస్కృతశ్లోకములను గానముచేసి శ్రోతలను ముగ్ధులను గావించిరి. వారువీణపై హిందుస్థాని, కర్ణాటక బాణీలలో చేసిన సంగీతాలాపన నెంతయు శ్రోతలు ప్రశంసించిరి.

దాసుగారిని ఆనాటి రాజులు, జమీందారులు, మహారాజులు మిక్కుటముగ నాదరించెడివారు. ప్రతిసంవత్సరము దాసుగారొక్క పర్యా

యమైనను, వారి యాహ్వానముమీద వారి సంస్థానములకేగి వారిచే బహుమతులంది వచ్చుచుండెడివారు. అట్టియభిమానులలో 'పీఠకటి' సంస్థాధీశులొకరు. వారు దాసుగారి కొసంగిన బహుమతులనేకములు. ఒకవర్యాయము రాజుగారి ఆహ్వానముపొందియు, సకాలమునకు దాసుగారచటకు పోజాలక పోయిరి. కాని, ప్రతిఏటావచ్చు దాసుగారు రానందుకు రాజుగారే స్వయముగ బయలుదేరి దాసుగారికడకువచ్చి, వారు క్షేమముగానుండిరని తెలిసికొని, వారిని తనకడ యీసరి ప్రదర్శననిచ్చి ఆనందపరచి యేల బహుమతులంపలేదని యడుగగా, దాసుగారందుకు- "మహారాజులు మీరేస్వయముగా తనకడకురాగా అంతకంటెమించిన బహుమతి వేరేమియుండు"నని ఆనందపారవశ్యముతో బదులిడిరి. ఆహా! అంతరములు పాటించని పవిత్ర స్నేహమునకు రాజుగారు తార్కాణము కాగా, బాహిరమైన లౌకిక పురస్కృతులకంటె, ఆంతరంగిక అభిమానమునే బంగారుకొండగ భావించు నిందుహృదయములకు దాసుగారు నిదర్శనమై అలనాటి రఘుమహారాజును, కౌత్సుని తలపింపజేయుచున్నారు.

మద్రాసు హైకోర్టున్యాయవాది సంఘూర్ఘ్యశ్రీలగు శ్రీగంటి లక్ష్మన్నగారికి నారాయణదాసుగారన్న ప్రగాఢాభిమానము. వీరు దాసుగారిని, వారి 2-1-'39 తేదిగల లేఖలో ప్రస్తుతించిన విధానము ప్రభుత్వము వారు దాసుగారి కొసంగిన "మహామహోపాధ్యాయ" బిరుదముకంటె మిక్కిలి విలువైనది. వారు-సకల విద్యా కళాప్రపూర్ణులైన దాసుగారికి ప్రభుత్వము వారిచ్చు "మహామహోపాధ్యాయ" బిరుదు లాంఛనప్రాయము. అది ప్రభుత్వమునకే గర్వకారణము కాగలదు. అట్లే విశ్వవిద్యాలయము "కళాప్రపూర్ణ"బిరుదు నొసంగినను,అదితనుదా సంభావించుకొన్నట్లే కాగలదు. దాసుగారు ఈ యన్నింటికి నతీతులు. వారికి వివిధ కళలలోగల పాండిత్యమునకు, భాషాపటిమకు, శక్తివైవిధ్యమునకు, వారు సాధించిన ఘనవిజయములకు, ఈబిరుదములు కొలమానములు కాలేవు. ఈయన్నింటికంటె విలక్షణమై, అత్యున్నతమైన

బిరుదముకే దాసుగారు తగియున్నా"రని- దాసుగారి సామర్థ్యమును కూలంకషముగ, నిష్పాక్షికముగ వినుతించిరి.

సర్ కూర్మా వెంకటరెడ్డిగారికి, దాసుగారన్న ఎంతయభిమానమో వారు (శ్రీ)సూథర్ షర్డ్ అనువారికి 12-4-39 తేదిన వ్రాసిన లేఖవలన తెలియుచున్నది. లేఖలో "సంస్కృతము, తెలుగు లౌకిక, హిందీ, ఉర్దూ పారశీకము, ఆంగ్లము- ఈ యారు భాషలలోను దాసుగారు నిష్ణాతులు. తెలుగు, గద్యపద్యరచనలలో, సంస్కృతపద సంపర్కము లేక అచ్చ తెలుగు పదములతో వ్రాయగలసామర్థ్యము వారికుండుట వారి పాండిత్యములో నొకవిశేషము. వారు వ్రాసిన 'తారక' మను కవిత సంస్కృతములో వారికిగల అఖండపాండిత్యమునకు నిదర్శనము. అది వీరి కీర్తి చంద్రికలను నలుమూలల వ్యాప్తి నొనరించినది. పారశీకమహాకవియగు ఉమర్ ఖయామ్ వ్రాసిన రుబాయతులకు, దాసుగారొనరించిన యనువాదము వారి ప్రగతి పథములో మరియొక మైలురాయి. వీరు రచించిన సంస్కృతశ్లోక, గద్యయుక్తమైన "హరికథామృతము" వీరు మహామహోపాధ్యాయు" లన్న బిరుదునకు తగిన వారని తెల్పుచున్నది". అని పేర్కొనిరి.

వీరు సంగీతకళాశాల ప్రిన్సిపాల్ పదవీ విరమణ చేసినపిదప, పూర్తి జీతము వీరికి పింఛనుకావచ్చుటలో వీరి ముఖ్యమిత్రులైన 'బార్ట్సువెల్' గారు చాల సహాయమొనరించిరి. దాసుగారు తమ హరికథలో 'షేక్స్పియర్' రచనలలోని ముఖ్యమైన భాగములను తెలుగున ననువదించి, సందర్భానుసారముగా చొప్పించిన విధానములను జూచి, షేక్స్పియర్‌ను గురించి తెలిసినవారిలో ముఖ్యులుగ నాడు పేర్కొనబడుచున్న విదేశీయులగు నీ బార్ట్సువెల్‌గారు దాసుగారిని వేనోళ్ళ ప్రశంసించుచు 'దాసుగారికి షేక్స్పియర్‌ను గురించి తెలిసినన్ని విషయములలో సగము కూడ తనకు తెలియవేమో"యని వారు స్వయముగా 2-2-39 తేదీన వ్రాసిన ఉత్తరములో పేర్కొనిరి.

ఉన్నత కళాశాలలో విద్యనభ్యసించుచుండగా దాసుగారి ఉపాధ్యాయులగు శ్రీ భాగవతుల రామమూర్తి శాస్త్రిగారు, దాసుగారిలోని చురుకుదనము, తెలివితేటలు గమనించి, ప్రత్యేకమైన శ్రద్ధతో దాసుగారికి ఛందస్సేగాక, తెలుగులో పద్యములల్లుట నేర్పి సహకరించిరి.

విజయనగరప్రభువైన ఆనందగజపతులవారు స్వయముగ పండితుడు, కళాప్రియుడును. వారేర్పాటుచేసిన దసరా, శ్రీరామనవమి, వినాయకచవితి ఉత్సవాలకై వచ్చిన ఉత్తర హిందుస్థానీ సంగీతవిద్వాంసులైన 'శ్రీమహాబత్ ఖాన్'గారు, సంగీతవిద్వాంసులైన 'శ్రీకలిగొట్ల కామరాజు' గారు, దాసుగారికి పరిచితులగుటయేగాక అభిమానించి దాసుగారని, ఉత్తర హిందుస్థానీ సంగీతములోను, వీణ వాయించుటలోను సంగీతసాధనలో లయగీతుల రీతులను విధానములోను, ఆరోహణ అవరోహణ క్రమములలోను మంచి పండితునిగా తీర్చిదిద్దిరి.

ఉర్లామ్ జమిందారిణియైన శ్రీమతి కందుకూరి మహాలక్ష్మమ్మగారు, నారాయణదాసుగారిచే హరికథా ప్రదర్శనలేర్పాటుచేసి ప్రోత్సహించుటయేగాక వారిచే అష్టావధానములుకూడ చేయించి, సత్కరించి అభిమానించిరి. అంతియగాక, వారు ప్రతి సంవత్సరము సత్కరించు కవుల జాబితాలో దాసుగారిపేరు నమోదుచేయించి ఆదరించిరి.

బరంపురములో ప్రఖ్యాతవ్యాపారి, కళాభిమానియైన 'శ్రీభీమరాజు' గారు నారాయణదాసుగారి ప్రదర్శన లేర్పాటుచేసి రు 116/- పట్టుధోవతులు బహూకరించిరి. ఆప్రదర్శనకు విచ్చేసిన హరిదాస శ్రేష్ఠులైన 'శ్రీ కుప్పుస్వామినాయుడు' గారు దాసుగారిని దర్శించి వారి గురువుగారెవరని ప్రశ్నించిరి. వారు ఫలానా అని తెలియక, దాసుగారు తమ భావనాగురువులు శ్రీకుప్పుస్వామిగారని తెల్పిరి. తర్వాత తనను ప్రశంసించినది కుప్పుస్వామిగారే అని తెలిసికొని, గురువుగారిమన్ననకు పాత్రులైనందులకెంతయో ఆనందమును పొందిరి.

ఆ బరంపురంలోనే 'జానకీపరశతకము, రామశతకము' లను రచించిన విద్వత్కవులగు 'శ్రీజయంతి కామేశం' గారితో దాసుగారికి స్నేహ

మేర్పడినది. వారివద్ద ధ్రువచరిత్రను ప్రదర్శించునపుడు ఆ జిల్లా డిప్యూటీ కలెక్టరుగారువచ్చి పిన్నవయస్కులగు దాసుగారి ప్రదర్శన కెంతేని సంతసించి, దానిని రచించిన దెవరని యడుగగా, దానిని యువకులగు దాసుగారే రచించిరని తెలిసికొని నమ్మజాలక-ఒకవారమురోజులలో "అంబరీషోపాఖ్యానము" ను రచింపవలసినదిగా కోరెను. ఆ పణము- దాసుగారిని ఒక్కరోజులోనే మరియొక అమూల్యహరికథ "అంబరీషోపాఖ్యానము" ను రచించునట్లు చేసినది. ఆప్రదర్శనకుమెచ్చి ఆ కలెక్టరుగారు దాసుగారినెంతేని యభినందించి దీవించిరి.

విజయనగరములో వీరి హరికథా ప్రదర్శనను చూచి, "ఇంతచిన్ని బొజ్జలో ఇన్ని గొప్పవిశేషము లెట్లునిండియుండెనోగదా!" అని దాసుగారిని ప్రశంసించిన విజయనగరసంస్థానామాత్యులైన, పెనుమత్స జగన్నాథ రాజు గారు, రాజుగారి ఉన్నతపాఠశాలలో దాసుగారు ఉచితముగా F. A, చదువుకొను ఏర్పాటు చేయుటేగాక, పిఠాపురములో ప్రదర్శన లేర్పాటుచేయుటకుగాను ఆసంస్థానామాత్యులకు ఉత్తరము వ్రాసి సహకరించిరి.

ఖాశింకోట జమీందారుగారుకూడ నారాయణదాసుగారి ప్రదర్శన చూచి, ఆనందించి, దాసుగారిని వారిసోదరులైన పేరన్నగార్లను రు 116 నిచ్చి సత్కరించిరి.

పిఠాపురంమహారాజుగారు వీరి ప్రదర్శనను గాంచి మిక్కిలి సంతసించి, అనేక ప్రదర్శనల నేర్పాటు చేయించుటేగాక రు 116/- లు రెండు సిల్కుసిగపాగలు బహూకరించుచు, ప్రతిసంవత్సరమువచ్చి ప్రదర్శన యిచ్చినచో రు 116/-లు బహుమతి లభించగలదని వాగ్దాన మొనర్చిరి. అంతేగాదు, దాసుగారి ప్రదర్శనచే ఆనందభరితచేతస్కులై రాచదుస్తులను కూడ దాసుగారికొసగి స్వయముగా ధరియింపజేసిరి. షుమారు 20 సంవత్సరముల వయస్సులోనే ఇంతటి ప్రతిభను, ఇట్టిసత్కారములను పొందగలిగిన దాసుగారు ధన్యజీవులు.

కవియు, పండితాభిమానియు, విశాఖపట్టణ కళాశాలప్రిన్సిపల్ గారైన శ్రీరామయ్యగారు దాసుగారి ప్రతిభను గమనించి, F. A. సీనియర్ క్లాసుకు ఉచితవేతన, భోజనసౌకర్యముల నేర్పాటుచేసి తమ యభిమానమును ప్రదర్శించుకొనిరి. ఈయవకాశము దాసుగారికి కాలేజి చదువుకంటె, షేక్స్పియర్ నాటకాలు చదువుటకును, వానిలోని కొన్ని ఘట్టములను తెలుగు, సంస్కృతములలోనికనువదించుట రూపమున వారి యుజ్జ్వలభవిష్యత్తునకును పునాది వేసినది.

విశాఖపట్టణములోని ప్రముఖన్యాయవాదియైన "శ్రీసోమంచి భీమశంకరం" గారు ఆయూరిలోని గొప్పవారియెదుట దాసుగారి ప్రదర్శన లేర్పాటుచేయించి వారి కఖండకీర్తిసత్కారములను సముపార్జించి పెట్టి తనయభిమానమును ప్రదర్శించుకొనిరి.

విశాఖపట్టణములో జమీందారైన "శ్రీఎ. వి. నరసింగరావు" గారు దాసుగారి ప్రదర్శనకౌశలము నాలకించి, రు116/- లతో సత్కరించుటేగాక రు116/-లు వార్షిక మేర్పాటుచేసి తమ కళాప్రియత్వమును తెలుపుకొనిరి.

రాజమహేంద్రవరములో ప్రముఖన్యాయవాదియైన 'శ్రీ న్యాపతి సుబ్బారావుపంతులు' గారు భీమరాజుగారిచే పరిచయము చేయబడి, దాసుగారి కనేకవిధముల సహాయమొనరించిరి. రాజమహేంద్రవరము, అమలాపురములలో దాసుగారి ప్రదర్శన లేర్పాటు చేయించి అందరి మెప్పు పొందునట్లొనరించిరి.

కవియు సంగీతాభిమానులునైన 'శ్రీ రెంటాల సుబ్బారావు'గారు మద్రాసులో న్యాయవాదవృత్తి నవలంబించి ప్రఖ్యాతి వహించిరి. వారు దాసుగారిని మద్రాసుకు పిలిపించి వారిచే ననేక ప్రదర్శన లేర్పాటు చేయించి హైకోర్టులో సుప్రసిద్ధ న్యాయవాదులగు 'రాయబహద్దూర్ ఆనందాచార్యులు' గారితో పరిచయము గావించిరి. ఆచార్యులుగారు,

కాంగ్రెసు అధ్యక్షులుగా నొక పర్యాయము సేవ యొనరించి దానిని తీర్చిదిద్దిరి. వారు దాసుగారిచే 'అంబరీషోపాఖ్యానము' హరికథను చెప్పించి పట్టణములోని ప్రముఖులనందరి నాహ్వానించిరి. దాసుగారు చక్కని ప్రదర్శన నిచ్చి యందరి యభిమానమును, మెప్పును పొందిరి.

శ్రీ ఆనందాచార్యులుగా రొనరించిన సహాయమునకు కృతజ్ఞతగా దాసుగారు తాము రచించిన 'బాటసారి'ని వారి కంకిత మొనరించిరి. ఆనందాచార్యులుగారు దానికి సంతసించినవారై బెంగుళూరులోని వారి తమ్మునికి, మైసూరు మహారాజుగారి అంతరంగిక కార్యదర్శికి దాసుగారిని సిఫారసుచేయుచు ఉత్తరముల నిచ్చిరి. ఆనందాచార్యులుగారి తమ్ములు బెంగుళూరులో దాసుగారిచే కొన్ని ప్రదర్శనలిప్పించి రాజుగారి అంతరంగిక కార్యదర్శి తనకు బాగుగా పరిచయముండుటచే, తాముకూడ వారికొక లేఖనిచ్చిరి. ఆనందాచార్యులుగారి, వారి తమ్ముడుగారి లేఖలను గైకొని, మైసూరు మహారాజుగారు కుటుంబముతో బెంగుళూరుకు వచ్చియున్న సందర్భమున, ఆ రెండుత్తరముల సహకారముతో రాజుగారి యెదుట ప్రదర్శనలిచ్చు నవకాశము పొందగల్గిరి. రాజుగారు వారి ప్రదర్శన కానందించి, వారికుటుంబమువారుకూడ చూచుటకై వేరొక ప్రదర్శన నేర్పాటు చేయించిరి. తెలుగు బాగుగా తెలిసిన మహారాణి గారు దాసుగారి గానమాధుర్యమును కొనియాడిరి. 3 గంటలసేపు ప్రదర్శన చూచుచున్న రాజుగారికి ఆనందపారవశ్యములో కాలగమనమే తెలియలేదు. అంతవరకు ఉత్తరాదినతప్ప, దక్షిణాదిన ముఖ్యముగా ఆంధ్రులు మంచిగాయకులులేరన్న రాజుగారి భావనము దాసుగారు మార్చగలిగిరి.

మైసూరు ఛీఫ్‌జస్టిస్ (Chief Justice) గారింట్లో ఏర్పాటుగావింపబడిన ప్రదర్శన అనేకుల యభిమానమును చూఱగొనుటయేగాక, దానిని గురించి 'హిందూ' పత్రిక, ఇంకాఅనేక స్థానిక పత్రికలు విశేషముగా వార్తలను ప్రకటించినవి.

దాసుగారికి మైసూరు మహారాజు వలన జరిగిన గౌరవసత్కారములు, వార్తాపత్రికలద్వారా తెలిసికొని, దాసుగారి అభిమానులలో నొకరైన విజయనగరములోని మహారాజా కాలేజి ప్రిన్సిపాల్ డా॥ కిళాంబి రామానుజాచారిగారు, దాసుగారురాగానే వారిచే ప్రదర్శన నేర్పాటుచేయించి, ఆయూరిలోని గొప్పవారినందరను ఆహ్వానించిరి. అంతేగాక ఆనందగజపతి మహారాజుగారికిచెప్పి, విజయనగర సంస్థానములో నొక ఆస్థానపండితునిగా దాసుగారి నేర్పాటుచేయించిరి. కొంచె మాలస్యముగానైనను, విజయనగర వాస్తవ్యులు దాసుగారిగొప్పదనమును గుర్తించి వారికి తగినగౌరవస్థానము నేర్పాటుచేసిరి.

మైసూరు మహారాజుగారు దాసుగారిని మరియొక పర్యాయము పిలిపించి వారిచేప్రదర్శనలిప్పించి, రు1,116/-లు, రెండుకాశ్మీరుశాలువలు వారువచ్చినందుకైన ఖర్చులిప్పించి సత్కరించిరి.

బళ్ళారిలో ప్రభుత్వన్యాయవాదిగ, పబ్లిక్ ప్రాసిక్యూటర్ గనేగాక, గొప్పనాటకకర్తగా, నటునుగా ప్రఖ్యాతివహించిన శ్రీధర్మవరం కృష్ణమాచార్యులుగారు, నారాయణదాసుగారిచే బళ్ళారిలో ప్రదర్శన లేర్పాటు చేయించి, వారికాతిథ్యమిచ్చి సత్కరించిరి.

దాసుగారు గుంటూరు, అమలాపురం, విజయవాడ, గుడివాడ, తుని, పెనుగొండ, హైద్రాబాదు మొ॥ పలుతావులందు ప్రదర్శనలిచ్చి అచ్చటి ప్రజల ఆదరాభిమానములను చూరగొనిరి.

మదరాసులో, ఆనందాచార్యులుగారేకాక వారికుమారులైన శ్రీనివాసాచార్యులుగారుకూడ దాసుగారన్న నత్యంతాభిమానముగల్గి వారి ప్రదర్శనలనేకములు మద్రాసు నగరములో నేర్పాటుగావించిరి.

గంజాం మండలములోని జమీందారులనేకులు దాసుగారిని విశేషముగా నాధరించిరి.

1899 లో ఖాసింకోటలోని జమీందారుగారు, వారి చెల్లెలి వివాహసందర్భమున దాసుగారి హరికథాప్రదర్శన లేర్పాటుగావించిరి. అది చాల విశేషమైన సందర్భము. అచ్చట వీరికి సుప్రసిద్ధకవులు, అష్టావధానులు శతావధానులైన, తిరుపతి వేంకటకవులతో పరిచయ మేర్పడినది. దాసుగారి యభినయమునుగాంచి వేంకటశాస్త్రిగారు దాసుగారిని ఆశుకవితతో ప్రశంసించిరి.

1910 లో దాసుగారు స్వకపోలకల్పనతో రచించిన 'తారక' మను ఆధ్యాత్మికగ్రంథమును ఉత్తమగ్రంథముగా పేర్కొనుచు, జర్మనీ దేశములో 'ప్రూస్సియా' నగరములో గల 'మార్ బర్గ్' విశ్వవిద్యాలయములో సంస్కృత శాఖాధికారియైన "ప్రొఫెసర్ కె. గెల్డ్నర్" రెండు సంస్కృత శ్లోకములలో దాసుగారిని ప్రశంసించిరి.

"రవి కానిచో కవిగాంచు"నని కవి యొక్క గొప్పదనమును మొదటి శ్లోకములోను, దాసుగారి 'కవితావిశేషముల'ను రెండవ శ్లోకములోను వర్ణించిరి. దాసుగారి కవితామృతమును గ్రోలి తాను ధన్యత చెందినట్లు నుడివెను. మరియు దాసుగారిని 'కవిశేఖరు'డని అభివర్ణించిరి.

1) జానతేయన్న చంద్రార్కౌ, జానతేయన్న యోగినః
జానతేయన్న భర్గోఽపి, తజ్జానాతి కవిస్స్వయమ్॥

2) వచస్సుధామయం కావ్యమ్, పీత్వాఽహమ్ తృప్తమానసః
కృతజ్ఞోఽభిప్రశంసామి, భవంతం కవిశేఖరమ్॥

1913 లో కాకినాడలో జరిగిన గానసభలలో దాసుగారిచ్చిన ప్రదర్శనఘన విజయమును సాధించి, సభ్యులమన్నన పొందగల్గినది. ప్రశంసాచిహ్నముగా వారు దాసుగారికి రవ్వల అంటుజోడును బహూకరించిరి.

కాశీయాత్రనుండి తిరిగి వచ్చుచు కలకత్తాలో దాసుగారు సంస్కృతములో ఇచ్చిన హరికథాప్రదర్శనకు ఆయూరి న్యాయాధీశులు, నట్టూరి

మహారాజుగారు 'విశ్వకవి' రవీంద్రనాథ్‌ఠాగూర్ మొదలగువారువచ్చి దాసుగారికి సంస్కృతమునగల పాండిత్యమును కథాకథన సంవిధానమును బహుముఖములుగా ప్రశంసించిరి. జనుల కోరికపై దాసుగారు "హిందీ" లోకూడ ప్రదర్శననిచ్చి అనేకులప్రశంసల నందిరి. అదియొకఘనవిజయమై ఖ్యాతి వహించినది.

1924లో దాసుగారు బందరునకు వచ్చినపుడు చల్లపల్లి జమీందారుగారు ఘనముగ సత్కరించిరి. ఒక బంగారుగండపెండేరమును ప్రత్యేకముగ చేయించి, స్వయముగ దాసుగారికలంకరించి గౌరవించిరి. ఆసందర్భమున అక్కడకు విచ్చేసిన శ్రీచెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు మరికొందరుకవులు, పండితులు దాసుగారికి "హరికథాపితామహ" డన్న బిరుదునిచ్చి సత్కరించిరి.

విజయనగర సంస్థానమునకు ఆనందగజపతులవారి అనంతరము పదవిలోకివచ్చిన విజయరామగజపతి మహారాజుగారు, కవి, పండిత, గాయకులతో కోరుకొండలో ప్రత్యేకముగ కట్టించిన భవంతిలో సత్కాలక్షేపము చేయుచు దాసుగారన్న ప్రత్యేకాభిమానముకల్గి వారి ప్రదర్శనలుకూడ తరచు ఏర్పాటుచేయించుచుండెడివారు.

దాసుగారి ముఖ్యమిత్రులలో నొకరగు శ్రీకానుకుర్తి లక్ష్మీనరసింహముగారు రాజుగారి ప్రియమిత్రులు. వారు వయోలిన్ విద్వాంసులు. విజయనగరములో సంగీతకళాశాల స్థాపించ వలసిన అవసరమెంతేని గలదని చెప్పి రాజుగారిచే దానినెలకొల్పజేసి దాసుగారిని దానికి 'ప్రిన్సిపల్'గా నియామకము చేయించి వారి మైత్రిని ప్రదర్శించుకొనిరి.

దాసుగారుకూడ పెద్దలయెడ, మిత్రులయెడ కృతజ్ఞత కలిగియుండెడివారు. తన 'సవ'ల గురువులగు వాసాసాంబయ్యగారియెడ కృతజ్ఞతగా వారికుమారులు వీణవాద్యములో ప్రవీణులని తెలిసికొని వారిని సంగీత కళాశాలలో వీణశాఖకు ప్రొఫెసర్‌గా నియమించుటలో తోడ్పడిరి.

సంస్కృతాంధ్ర పండితులు విజయనగరములో మహారాజా కళాశాలకు ప్రిన్సిపల్ గారైన శ్రీ కిలాంబి రామానుజాచారిగారు, కాళిదాసు, షేక్స్పియర్‌ల రచనలలోని కొన్ని భాగములను నవరసములననుసరించి తెలుగులోని కనువదించి "నవరస తరంగిణి" యను బృహద్గ్రంథముగా దాసుగారు రూపొందించిరని తెలిసికొని వారిని అనేకవిధములుగ ప్రస్తుతించుచు "అట్టి యనువాదము సులభసాధ్యము కాదని, అనువాదములో దాసుగారు సంపూర్ణత్వమును సాధించిరనియు, ఏదైనా లోపముండిన అది తెలుగు భాషయంతగా వృద్ధిపొందక పోవుటయే యగునియు, ఈ రచన వలన ఆంధ్రప్రజల విశేషాభిమానమును దాసుగారు పొందగల్గిరనియు ప్రస్తుతించిరి.

శ్రీ విజయరామగజపతి మహారాజుగారి యనంతరము రాజైన అలక్ నారాయణగజపతిగారు కూడ దాసుగారిపై ప్రత్యేకాభిమానము కల్గియుండిరి. మొట్టమొదట దాసుగారిచే హరికథాప్రదర్శనను ఉదక మండలములో నిప్పించి వారిని గౌరవించిరి.

రాజా మంత్రి ప్రగడ భుజంగరావుగారు, తమ పుత్రికకు ఉర్లామ్ జమీందారుగారి కుమారునితో వివాహము చేయు సందర్భమున దాసుగారి నాహ్వానించిరి. స్వయముగా భుజంగరావుగారు పండితులగుటచేతను ఉర్లామ్ జమీందారుగారు పండితాభిమానులగుటచేతను, ఆ వివాహవాటిక వివిధప్రాంతములనుండి విచ్చేసిన కవి, పండిత గాయకాదులతో నిండి ప్రత్యేకశోభ వహించినది. అక్కడ ప్రదర్శనలిచ్చి దాసుగారందరి ప్రశంసలను పొందగల్గిరి. వధూవరులను దాసుగారు, తెలుగు-సంస్కృతము-ఆంగ్లము-పారశీకము-ఈనాల్గు భాషలలో నాల్గు పాదములు గాను పుగా చెప్పి ఆశీర్వదించిరి. ఇదియొక ప్రత్యేకాకర్షణై దాసుగారి బహుభాషా ప్రావీణ్యమును తెలియజెప్పినది.

1933 లో విశాఖపట్టణములో ప్రముఖన్యాయవాదియైన శ్రీ ప్రభల లక్ష్మీనరసింహము పంతులుగారింట వివాహమునకై విచ్చేసిన

జయపురం సంస్థాన మహారాజులగు "శ్రీ విక్రమదేవవర్మ"గారు దాసుగా రచట నొసంగిన హరికథా ప్రదర్శననుగాంచి స్వయముగా రాజుగారు కవియు, పండితుడగుటచే మిక్కుటముగా సంతసించి మంచిబహుమతుల నొసంగుటయేగాక, "సంగీత సాహిత్య సార్వభౌము"డన్న బిరుదముకూడ నొసంగి యఖండముగా గౌరవించిరి. ప్రదర్శన నేర్పాటుచేసిన లక్ష్మీనరసింహము పంతులుగారుకూడ దాసుగారి ననేకవిధములుగా సత్కరించుటయేగాక త్వరలో తాము కనకాభిషేకముకూడ దాసుగారికి చేయ సంకల్పించినట్లు ప్రకటించిరి. కాని యా వాగ్దానము నెరవేర్చు నంతలోనే పంతులుగారు విధివశమున స్వర్గస్థులైరి.

1935 లో శ్రీ భారతీతీర్థ సంస్థ పక్షమున దాసుగారిని సత్కరించుటకై డా॥ బుర్రా శేషగిరిరావుగారు విజయనగరములో భారీయెత్తున నేర్పాటుచేసిన వార్షికోత్సవమునకు జయపురమహారాజగు విక్రమదేవ వర్మగారు అధ్యక్షత వహించిరి. కవి, పండితాదులతోనిండిన ఆ సభలో దాసుగారు "ఒమర్ ఖయామ్" అను పారశీకగ్రంథమునకు అనితరసాధ్యముగా నొనరించిన అనువాదగ్రంథము ప్రశంసింపబడుటయేగాక, "ఆటపాటల మేటి" అన్నబిరుదమును, తమ కిష్టమైన అచ్చ తెలుగు భాషలో పొందిరి. ఇదియొక విడ్డూరమై చూపరుల కాశ్చర్యమొనరించినది.

దాసుగారొనరించిన ఒమర్ ఖయామ్ అనువాదమును పురస్కరించుకొని హైద్రాబాద్‌లో వీరికనేక సన్మానసభలు జరిగినవి. "హైద్రాబాద్ బులెటిన్" సంపాదకీయములో దాసుగారి ఒమర్ ఖయామ్ అనువాద గ్రంథమునుగురించి చాలాప్రశంసించినది.

అలహాబాద్ ప్రఖ్యాతపత్రిక "లీడర్" కూడ 13-10-1936 తేదీ పత్రికలో దాసుగారి ఒమర్ ఖయామ్‌ను విశేషముగా ప్రశంసించినది.

సంస్కృతవిశ్వపరిషత్ ·సంయుక్త ప్రధానకార్యదర్శియైన శ్రీ జయంతి కృష్ణ, హెచ్. ధవేగారు వారి ది23-5-36వ తేదీ ఉత్తరములో

దాసుగారి ఉమర్ ఖయామ్ అనువాదము గురించి ఈవిధముగ ప్రస్తుతించిరి. "దాసుగారి ఈ యనువాదము పండితునిగా వారిబుద్ధి పరిపక్వతను, కవిగా వారి యనంతానుభవమును, సంస్కృతభాషపైన వారికున్న ఆధిపత్యమును సమాసములూ, అలంకారములపైన వారికున్న అభిమానమును ప్రతిబింబింపజేయుచున్నది. నాల్గుభాషలలోని రచన లింపుపొందు పరుపబడుటచే తులనాత్మకాధ్యయనమునకు చక్కగా వీలగుచున్నది.

రామేశ్వరతీర్థయాత్రలనుండి తిరిగివచ్చుచు, వారిస్నేహితులగు శ్రీ బార్డ్స్‌వెల్‌గారి యింట పుదుక్కోటలోనుండి, అచ్చట తెలుగు తెలిసిన వారి కోరికపై దాసుగారు హరికథా ప్రదర్శననిచ్చి, అచ్చటి ప్రజలనేగాక, మహారాజుగారి ప్రశంసలనుగూడ పొందగల్గిరి. యమ్. యన్. అయ్యంగారి తండ్రియు, దాసుగారి పరిచితులైన శ్రీనీలకంఠఅయ్యరు గారు దాసుగారిని 'నాగల్‌కోయిల్' లో ఆపి వారిచే ప్రదర్శనలిప్పించి సత్కరించిరి. అచ్చట తెలుగుతెలిసిన వారంతగ లేనందువలన దాసుగారు హరికథను సంస్కృతములో చెప్పి పండితుల ప్రశంసలనందగల్గిరి

తిరువాన్కూరులో దాసుగారి మిత్రులుకొందరు, సంగీతవిద్వాంసులు, మహారాజు మున్నగు వారి సమక్షమున ది 23-7-38 తేదిన ఖుడియార్ భవనంలో దాసుగారిచే ప్రదర్శన నిప్పించిరి. అంతవరకు ఆంధ్రులన్న అల్పాభిప్రాయము కల్గిన రాజుగారు, ఆదిసమసిపోగా, దాసుగారిని వారికంఠధ్వనిని, నటనాప్రతిభను వేనోళ్ళకొనియాడిరి.

రామసముద్రము గ్రామములో శ్రీ ఆర్. యస్. రాజ్యంగమ్ గారికి అతిథులై వారిచే ఆదరింపబడిరి.

ది28-8-1938 న మద్రాసులో ఆంధ్రమహాసభవారు, దాసుగారిని రామేశ్వరమునుండి వచ్చుచున్నపుడు ఆపి, వారిచే సీతాకళ్యాణమును ప్రదర్శింపజేసిరి. 75 సంవత్సరములు వయసున్నను, దాసుగారు 40 సంవత్సరముల వయస్సువానివలె అలవోకగా ప్రదర్శన నిచ్చిరి.

దానిని గాంచి ఆప్రదర్శనకు విచ్చేసిన, శ్రీగోవిందరాజాచార్యులుగారు, శ్రీ వేమవరపు రామదాసుపంతులుగారు, శ్రీ గద్దె రంగయ్యనాయుడు గారు, శ్రీ కౌతా సూర్యనారాయణగారు, ఖ్యాత్రపూర్ణ శ్రీ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు, శ్రీ తాడి ధర్మారావునాయుడుగారు మొదలగు ప్రముఖులు దాసుగారి ప్రతిభను వినుటయేగాక, కన్నులారగాంచి వేవిధముల కొనియాడిరి. సందర్భానుసారముగా దాసుగారు షేక్స్పియర్, కాళిదాసుల రచనలనుండి కొన్ని భాగములను అనువదించి హాస్యధోరణిలో ఉదాహరించిన విధానము అందరి ప్రశంసల నందుకొ గలిగినది.

ది12-9-38 న గోఖలే హాలులో జరిగిన ప్రదర్శన సందర్భమున మద్రాసులోని హైకోర్టున్యాయవాదులు, శ్రీ అల్లాడి కృష్ణస్వామి అయ్యర్ గారు, శ్రీబులుసు సాంబమూర్తిగారు, మొదలగువారు దాసు గారిని ప్రశంసించిరి. అల్లాడికృష్ణస్వామిఅయ్యరుగారు దాసుగారిని "కవిగా, సంగీతవిద్వాంసునిగా, గాయకునిగా, వారిబహుముఖీన ప్రతిభాపాండిత్యములను, మీదుమిక్కిలివార్ధక్యములో వీరి శరీరపాటవమును, నటనా నైపుణ్యమును ప్రస్తుతించిరి."

ది10-4-39లో సంగీత ప్రియులు, సంస్కృతాంధ్రములందు పండితులైన రావుబహద్దుర్ శ్రీ మంత్రిప్రగడ నరసింహము పంతులుగారు దాసుగారి ప్రదర్శన నొకదానినేర్పాటుచేసి సత్కరించిరి. ఆ ప్రదర్శనకు శ్రీ క. వి. రెడ్డినాయుడుగారు, శ్రీ యమ్. వెంకటసుబ్బారావుగారు శ్రీ అల్లాడి కృష్ణస్వామిఅయ్యర్ గారు, శ్రీ వేపా రామేశంగారు, దివాన్ బహద్దుర్ శ్రీబండి శ్రీ హరిరావునాయుడుగారు విచ్చేసి శ్రీవారి హరి కథను విని శ్లాఘించిరి. (ఈవ్యాసరచనకు ఆధారము శ్రీ వసంతరావు బ్రహ్మాజీరావుగారు ఆంగ్లమున రచించిన దాసుగారి జీవితచరిత్ర......

రచయిత.)

ఈ విషయమై తెలియవచ్చిన మరికొన్ని విశేషముల నిట పేర్కొందును. సంపాదకుడు.

1) విజయనగరములో 30-8-1924 న దాసుగారిషష్టిపూర్తి మహోత్సవము అతివైభవోపేతముగా జరిగినది. ఆసందర్భమున అదే తేదీన విజయనగరమహారాజాంగ్లకళాశాల కధ్యక్షులైన దివాన్ బహద్దర్ (శ్రీ) కిళాంబి రామానుజాచార్యులుగారు M. A. D. Litt., దాసుగారికి వ్రాసిన ఒకఆంగ్లలేఖలో నిట్లువక్కాణించిరి.

"As one of your admirers, I offer my hearty congratulations and pray that God may give you the full term of life alloted to exceptional beings and shower on you His choicest blessings,"

2) ది12-1-1929న మచిలీపట్టణము బుట్టయ్యపేట నాటకశాలలో "హరికథాఽభివర్ధనీసభ" యొక్క అధ్వర్యమున (శ్రీ) దాసుగారు స్వవిరచిత "పాదుకాపట్టాభిషేకము" హరికథాగానముచేసి, వివిధ కళా వైదగ్ధ్యము, బహుభాషా వైదుష్యము ప్రదర్శించుచు సభవారిని ఆశ్చర్యవాహినిందేల్చి ఆనందసముద్రమున ముంచిరి. సభవారు దాసుగారిని ఆంధ్రదేశ గర్వకారణముగా భావించిరి.

3) దిe6-6-1936న బారువలో "చీకటి" సంస్థానాధీశ్వరుల అధ్యక్షమున జరిగిన ఆంధ్రభారతీ తీర్థవసంతోత్సవములో కవులకు, పండితులకు ఉపన్యాసకులకు తగిన బిరుదుల నొసంగుటను గూర్చి విచారించి నిర్ణయించుటకు (శ్రీ) దాసుగారి అధ్యక్షతన ఒకఉపసంఘము నియమింపబడెను.

4) విజయనగరము పార్కులో దాసుగారి శిలావిగ్రహ ప్రతిష్ఠ జరిగిన మహాసభలో పెద్దలనేకులు దాసుగారి బహుముఖప్రజ్ఞను వేనోళ్ళ ప్రశంసించిరి. ఆ శిలాప్రతిమ నావిష్కరించుచు, నాడు ఆర్థిక మంత్రులుగానున్న (శ్రీ) బెజవాడ గోపాలరెడ్డిగారు, "సంగీతం, సాహిత్యం, నృత్యం

బహుభాషాపాండిత్యం, మొదలగు అనేకవిషయాల్లో అసమానస్థానము సంపాదించిన వ్యక్తులు మనకు తటస్థపడరు. ఏదో ఒకశాఖలో పరిపూర్ణ పాండిత్యండున్న చాలామందిని మనంచూడవచ్చు. మొదటి తరగతికి చెందిన ఘనుడు 'హరికథాపితామహ'; 'లయబ్రహ్మ', 'శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాసుగారు" అని ప్రశంసావాక్యాలు పల్కినారు.

5) 1964లో ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ, నారాయణ దాసుగారి శతజయంత్యుత్సవము నతివైభవోపేతముగా జరిపినది.

6) బహువత్సరముల క్రిందటనే దాసుగారి అభిజనమగు అజ్జాడలో వారివంశీయులగు. కీ. శే. శ్రీ ఆదిభట్ల సూర్యకామేశ్వరరావుగారు దాసుగారి పేరితో నొక ఉన్నతపాఠశాలను నెలకొల్పిరి. అది దినదిన ప్రవర్ధమాన మగుచున్నది-



# చతురవచస్వి : చారుమనస్వి

శ్రీ శ్రీ ఆదిభట్లసూర్యనారాయణ

పూవు పుట్టగనే పరిమళించును. జన్మతః ప్రతిభా సమగ్రుడైన నారాయణదాసు బాల్యమునుండియు భవిష్యత్ప్రభావ సరస్వతిగా పునాదులు గట్టుకొనినాడు. ఆ మహనీయుని నిత్యజీవితమున నెన్నియో సంఘటనలాతని వ్యక్తిత్వమును ఘనతను జాటును. అందు కొన్ని మాత్రమే గ్రంథస్థమైనవి. కొన్ని కాలగర్భమున గలిసిపోయినవి. ఆతని సరసవచో నైపుణ్యమును మేధాసంపత్తిని చాటు కొన్ని సంఘటనలను పొందుపరచుటయే యీ వ్యాస పరమార్థము.

శ్రీ దాసుగారు మిక్కిలి సూక్ష్మగ్రాహి. తన బాల్యమున ఉపాధ్యాయుడొక పద్యమును నొప్పజెప్పుమనగా తత్పూర్వ మాతనికది పరిచయము కాకపోవుటచే నారాయణదా సుపాధ్యాయునితో "అయ్యా! న్యాయమా! నాకు ముందిద్దరున్నారుకదా! వారు వప్పగించిన తరువాత నేనా పద్యము వప్పగించలేకపోతే మీరు వేసిన శిక్షకు పాత్రుడను" అనెను. అట్లే ఉపాధ్యాయు డవకాశమునీయ ఏకసంథాగ్రాహియైన దాసుగారు తప్పులేకుండ వప్పజెప్పగలిగెను.

గానకళాప్రపూర్ణులైన శ్రీ దాసుగారొక పర్యాయము కాకినాడలో దక్షిణదేశపు విద్వాంసుల గానమును వినుట తటస్థించెను. ఆ విద్వాంసులు పల్లవి పాడుచు చేయు రణగొణధ్వని జూచి తన ప్రక్క-

నున్న మిత్రునుద్దేశించి "ఆ! సంగీతమా! గుద్దులాట కాదుకదా!" అని చమత్కరించెను. బహుశః ఆంధ్ర సరస్వతి అరవనోటి యుక్కబోనులో వడుబాధను సహింపలేక సభారంజనము మృగ్యమైన అట్టి సన్నివేశ మాతనిచే నట్లు పల్కించి యుండెననవచ్చును.

కందుకూరి వీరేశలింగం పంతులుగారు, వడ్డాది సుబ్బారాయుడు ప్రభృతుల సమక్షమున దాసుగారి అష్టావధానము జరుగుట తటస్థించెను. అట్టియెడ శ్రీ పంతులుగారు కాళిదాసుని "యదా లోకే సూక్ష్మం" అను శ్లోకమును తెనిగింపుమనిరి. దుష్యంతుని రథ వేగమును సూచించుచు శ్రీ దాసుగారు అంతి అంతి తునియలుగా కాళిదాసు సంధించిన విధమున చిన్న చిన్న తెలుగు మాటలతో నొక పద్యమును హృద్యముగ చెప్పిరి.

చిన్నది పెద్దదిగా విడి యున్నది కలిసినటు, వంక నురునది సరిగా
చెన్నారు దవులు చెంగట కన్నులఁ బడదెద్ది తేరు కడిపడిఁ బోవన్.

అంతతో నూరకోనక "మీరు కూడ యీ శ్లోకమును తర్జుమా జేసినారు కాబోలు ఆ పద్యమును చెప్పండి" అనెను. పంతులుగారు తన యను వాదమును జెప్పగా దాసుగారు "చూచితిరా నేనొక్క చిన్న పద్య ముతో చెప్పితిని, మీరు రెండు పద్యములు దండుగ పెట్టినారు. మరియు ఇంగ్లీషు భాషనుండి యనువదించు నపుడు ఇంగ్లీషుమాట యెట్లొప్పదో అట్లే సంస్కృత మనువదించు నప్పుడు సంస్కృతపుమాట రానీయ కూడదు." అని యాక్షేపించిరి. పంతులుగారు తన కౌశుంతలమున కట్టి నిశిత విమర్శ తన జీవితకాలమున తత్పూర్వము వినియుండరు.

ఆ దినములలోననే శ్రీ దాసుగారు తన హరికథా కాలక్షేప సందర్భమున వితంతు వివాహములను ఖండించిరి శ్రీ పంతులుగారు తరువాత న్యాయపతి సుబ్బారావుగారితో సందర్భవశమున దాసుగారి హరి కథను చూడకయే "ఛీ, విధవకథలు బాడబూతు కథలు" అనెను. అప్పుడే అక్కడకు వచ్చిన దాసుగారు "పంతులుగారికి సహవాస దోషము

కాబోలు. ఎల్లప్పుడు విధవా సంగతేగాని పాటసంగతి వారికేమి తెలియును!" సర్వకళలను సర్వాంగీణ పరిష్వంగము చేసిన శ్రీ దాసుగారి ఔచిత్యము సర్వజన శ్లాఘ్యము. కళాపిపాసువు ఆనందగజపతి కొలువున ముప్పది రూప్యముల పండిత వేతనముతో తృప్తిపడిన కళాతపస్వి శ్రీ దాసుగారు. దేవుడొప్పినను పూజారి యొప్పడను చందమున దివాను పంతులు తన యధికారమును దాసుపై తరచుగ ప్రదర్శించెడివాడు. ప్రతి ఏకాదశికి నొక హరికథ తన మాధ్వమఠములో చేయునట్లు రాజుగారి అనుమతి లేకుండగనే ఉత్తర్వు జారీచేసెను. అంత నొకనాడు తన సమక్షమున దివాను నిలువబడి యుండగా, దాసుగారు రాజుగారి దర్శనము చేసిరి. అంత రాజుగారు సగౌరవముగ దాసుగారికి ఆసనమునుజూపి సంభాషింప మొదలిడిరి. ఆ సమయమున దాసుగారు "అది, మీకును మాకును గలతేడా! మీరు మూడు వందలు పుచ్చుకొన్నప్పటికి అది జీతమే. మాకు సంస్థానము వారిచ్చునది పండితవేతనము. నౌకరీ కిచ్చునదికాదు" అనెను. దాసుగారికి నైసర్గికమైన యిట్టి 'నిర్మొహమాటపు' ధోరణి క్షుద్ర శత్రువుల సంఖ్యను పెంచినను సహృదయ శిఖామణుల మన్ననలను పొందెడిది.

శ్రీ దాసుగారును ఆనందగజపతిగారును వినోదార్థము ఒకదినమున మూడుముక్కలాటాడుచుండిరి. వారి జూదమునకు పణమగ్గిపుల్లలు. ప్రభువువారివి మూడు ఆసులు. దాసుగారివి మూడు రాజులు. దాసుగారుత్సాహముతో అగ్గిపుల్ల లొడ్డుచుండిరి. తుదకు ప్రభువువారు "దాసుగారూ! మీరు నన్ను గెల్వలేరని" తన యాటను చూపెను. అంత దాసుగారు "మహాప్రభూ! తమవంటి ప్రభువులు దొరకుటే కష్టము. అట్టిస్థితిలో ముగ్గురు ప్రభువులు నాచేతచిక్కినారు. ప్రాణమైన నొడ్డెదను గాని పట్టువిడిచెదనా"యని తనపట్టునుజూపెనట. అంత రాజుగారు "క్రిందపడినను మీదినుండియే మాట్లాడుదువయ్యా"అని సంతసించెను. నభూతో న భవిష్యతి యని కీర్తిగాంచిన యా రాజునకు తగిన కళాసచివుడీదాసు.

ఆనందగజపతిగారొకపర్యాయము తనకు గ్రీకులాటిన్ భాషలను నేర్పు దొరగారిని దాసుగారికి పరిచయముచేయుచు దొరగారు తెలుగులోగూడ పండితుడని తెల్పెను. అంత దాసుగారు తలపంకించుచు దొరగారి తెలుగుపాండిత్యము నందనుమానమును సూచించెను. దొరగారికి కోపమువచ్చెను. రాజుగారు రెండుపర్యాయములు దాసుగారితో క్షమాపణ కోరుడని చెప్పగా దాసుగారు "నేను తప్పుచేసినయెడల నొకసారి గాదు నూఱుసార్లు క్షమాపణ కోరుటకే యభ్యంతరమునులేదు. కాని ఏ తప్పునుచేయనిదే క్షమాపణ వేడుటెట్లు? నే నింగ్లీషుబడిలో చదువుకొన్నదికాక షేక్స్పియర్ మొదలగు గ్రంథములను చూచినాను. అయినప్పటికిని నే నా భాషలో పండితుడనగుదునా? అన్యభాష నెంత చదివి యంటించుకొన్నను మాతృభాషవలె నొడలుపట్టదు. లాటిభాష పొంకము కూలంకషముగ దెలియఁబడదు. తెలుగులో నాతడు పండితుడనుట హాస్యాస్పదముకాదా!" అనెను. సౌభాగ్యదరిద్రాణముగనున్న నాటి తెలుగు విమర్శకు చైతన్యచకచ్చకితమైన దాసుగారి సాహిత్యవిమర్శ మార్గదర్శకము కాకమానదు. చిత్రమేమన దాసుగారి అనంత కావ్యరచనా వ్యాసంగము, సునిశిత విమర్శనదృష్టియు మహాకవి మార్గమును త్రొక్కుచుండ ఆంధ్రావళి హరికథా పితామహునిగ మాత్రమే గుర్తించుట విచార్యము.

1911-12 సంః ప్రాంతమున శ్రీ దాసుగారు బరంపురమును దర్శించు సమయమున జిల్లాజడ్జిగా పనిచేయుచున్న టి. సదాశివయ్యగారితో పరిచయము కలిగెను. జడ్జిగారు దాసుగారితో గోష్ఠిసలుపుచు "అనిబిసెంటు" గూర్చి చెప్పుచు ఆమెవలన తాను భగవద్గీత నేర్చుకొన్నానని చెప్పగా దాసుగారు "ఆమె విదేశీయురాలు, ఆడుది. ఆమె సంస్కృతమందున్న భగవద్గీతను చదివి సాధించి యొకరికి బోధపరచునంతటి సమర్థత కల్గియుండుటకు ఆమెను గౌరవించి వేనోళ్ళ పొగడవలసినదే. కాని హిందూదేశమునపుట్టి బ్రాహ్మణజన్మమెత్తి మేధావియైన తమ

వంటివారు ఆమెవల్ల భగవద్గీత నేర్చుకొనుట యెంతయు లజ్జాజనకమని" తనయూహ వారి కెరింగించెను. పశ్యవాక్కైన ఈ మేధావిని ఎదు ర్కొనుట యెట్లు ?

తన కాశీయాత్రానంతరము దాసుగారు కలకత్తా నగరమున రవీంద్రుని సమక్షమున తన హరికథామృతముతో శ్రోతల నుఱ్ఱూత లూగించెను. తరువాత చాలకాలమునకు రవీంద్రుడు విజయనగరమును సందర్శించెను. జనులు ఒకరి నొకరు త్రోసికొనుచు రవీంద్రునకు నమస్క రించుచుండిరి. కాని దాసుగారు చిట్టచివర కూర్చొనియుండిరి. రవీం ద్రులు నల్వురితో మాట్లాడుచు దూరముననున్న దాసుగారిని చూచి పోల్చి దగ్గరకువచ్చి "మరచితిరా?" అని నమస్కరించెను. వెంటనే దాసు గారు లేచి నమస్కరించి "నేను మీకు జ్ఞాపకముంటినో లేదో తెలుసు కొనుటకై వెనుకనుంటిని. తమకు జ్ఞాపకమున్నది సంతోషము." అని అనెను. అంత రవీంద్రులు "ఆనాడు మీరు పాడిన బేహాగురాగ మింకను నా చెవిలో మ్రోగుచునే యున్నది; మిమ్ము మరచెదనా ?" అనెను. ఆ విశ్వకవి హృదయమున చోటు చేసుకొనిన కళాజగద్రవి శ్రీ నారా యణదాసు.

చమత్కార భాషణము సమయస్ఫూర్తి దాసుగారికి వెన్నతో పెట్టినవి. 1931-33 ప్రాంతములలో ఒకప్పుడు విజయనగర సంస్థానా ధీశ్వరుడగు శ్రీ అలక్ నారాయణగజపతి దాసుగారిని వేసవికాలమున ఉదకమండలమునకు గొంపోయిరి. మోటారులో దాసుగారి నెక్కించు కొని స్వహస్తములతో రాజుగారు ఎత్తుపల్లములు గల బాటపై వేగ ముగ పోనిచ్చుచుండిరి. అంత దాసుగారు వేగమును తగ్గింపుడని ప్రార్థిం పగా "నేను నడపుచుండగా మీకు భయమెందుకని" ప్రశ్నింప, దాసు గారు "అందుకే అందుకే" యని సమాధాన మొసగిరి. రాజావారు నవ్వుకొని డ్రైవరునకు వదలిపెట్టిరి.

1933 వ సం॥న శ్రీ దాసుగారు విశాఖపట్టణమున గొప్ప న్యాయవాదియు పండితుడును నగు శ్రీ వత్రభల లక్ష్మీనరసింహము పంతులు గారి గృహమున హరికథను జెప్పిరి. పురప్రముఖులతో పాటు జయపురాధీశ్వరుడగు శ్రీ విక్రమదేవవర్మగారు వచ్చి దాసుగారు నిలువబడి హరికథ జెప్పుచుండగా నేను కూర్చొని యుండనాయని నిలువబడెను. శ్రీ "దాసుగారప్పుడు" అయ్యా మీరు చూపిన గౌరవమునకు కృతజ్ఞుడను కాని నేను నిలువబడి చెప్పెదను. ఆడుతూ పాడుతూ చెప్పెదను గనుక తమరు సుఖోపవిష్టులయి చిత్తగించుటే మంచిది." పిమ్మట మహారాజా వారు నలుగురితో పాటు నవ్వుచు నుపవిష్టులయిరి. భయమును భావము నకు దాసుగారికి జూచిన నంత భయము.

ఒకసమయమున పాలకొండ యను నగరమున తనభూమికి సమీపమునగల మూడెకరముల భూమిని ప్రభుత్వమువారు వేలము వేసిరి. దాసుగా రాభూమిని కొనదలచి సర్కారుపాట 200రూ. పైని 50 రూ. వేసి పాటపాడిరి. అంతనొక వెలమదొరవచ్చి మీసముదువ్వుచు 300 రూ. పై పాట పాడెను. దాసుగారు "నాపాటకు పై పాట యుండగలదా" యని శ్లేషించి పాటను రెట్టించిరి. యథార్థమున కా భూమియంత ఖరీదు చెయ్యదు. కాని దాసుగారి పౌరుషముమాత్రము మీసమును దువ్వినది.

తన నిత్యజీవితమున మిత్రులతో కాలముగడుపు సమయమందొకనాడు మహామహోపాధ్యాయబిరుద మొకరికి తగునాయని ప్రశ్న వచ్చెను. అపుడు దాసుగారు "అతడు పరిశ్రమచేసి పడినపాటు గుర్తించి హెచ్చరించుటకుగా నీ బిరుదివ్వబడెను గనుక తగునా ? యను ప్రశ్నము రాకూడదు. నిజముగా నా మాటయొక్క యర్థముపట్టి చూచినచో ఈశ్వరునకు తప్ప ఎవ్వరికిని వర్తించదు" అని స్పష్టపరచిరి.

1943_44 వ సం॥ జయపురమువారు వేయిన్నూటపదార్లు ఇచ్చెదమని దాసుగారి నాహ్వానింప దాసుగారు నిరాకరించిరి. అయినను వారు

కోరుటతో మరల నిరాకరించుచు "బోడితల అంటవేదుక, రానివారిని పిలువవేదుక" యన్నట్లు ప్రయాస పడవలదని పంపివేసెను. పిమ్మట అన్న పేరన్న నిష్కారణముగా ధనమును వదలు కొంటివనెను. దాసుగారు నెమ్మదిగ "ఇదివరకు గడించిన వేలుండి పోయినవా? యీ వెయ్యి రక్షించునా"యని జవాబు చెప్పిరి.

1936 లో దాసుగారు రాజమండ్రి సందర్శించిరి. అపుడు ప్రసిద్ధ నటుడు స్థానం నరసింహారావు, మాధవపెద్ది వెంకట్రామయ్యగారలు పరిచయం చేసుకొన్నారు. వెంటనే దాసుగారు స్థానంవారి నుద్దేశించి "రోషనారా వేషం కడతావట నువ్వేరా అబ్బీ! నీపేరు విన్నాన్లే! అదేమిటోయ్ ఇలా ఉన్నావ్! ఆపేరుకు చిక్కావా లేక ఆపేరే నీకు చిక్కిందా" అన్నారు. అర్థముకాక స్థానంవారు సమాధానము చెప్పలేక పోయిరి.

అదేరోజున గున్నేశ్వరరావుగారి హాలులో సీతాకళ్యాణం హరికథ. వేసవి, దాసుగారికి ఉక్కపోసినది. కథను మధ్యలోఆపి దాసుగారు గున్నేశ్వరరావుగారితో "ఏమయ్యా! ఎలక్ట్రిక్ పంకాలు వేయిస్తానన్నావు; మనిషినిబెట్టి విసిరిస్తానన్నావు; బాగా ఉక్కపెట్టేస్తోంది. పోనీ ఓ విసనకఱ్ఱ నామీద పారెద్దూ విసురుకుంటాను. దగ్గిరుంటే నీమీద విసురుతాన్లే" ఈ ఛలోక్తికి ప్రేక్షకులంతా ఘొల్లున నవ్వేరు.

అయిదేండ్ల అయిదు మాసములకు దాసుగారు స్వతంత్రముగ పురాణమును చదువనారంభించిరి. అదిచూచి తండ్రి తన కొమరుడు కారణజన్ముడని సంతసించియు లాంఛనప్రాయముగ నక్షరాభ్యాసము చేసిరి. తన యక్షరాభ్యాసమునుగురించి తన మనుమడైన కంబర సూర్యనారాయణశాస్త్రితో ప్రస్తావించుచు దాసుగారు "ఒరే తాతా! మూడు మనువులు వెళ్ళి నాల్గవమనువుకు సిద్ధంగాఉన్న ఆడదానికి పెళ్ళిచేసినట్టు నా కక్షరాభ్యాసం చేసేరా!" నిజమేమరి "ప్రపేదిరేప్రాక్తన జన్మ విద్యా".

విజయనగరాస్థానపు దివానుచే పరిచయలేఖ గొని (శ్రీ) దాసు గారు పిఠాపురాధీశ్వరుని దర్శించి యచట రెండు హరికథలను గానము చేసెను. అతడు (రాజుగారు) సంతుష్టుడుకానిచో నొక చిక్కు గలదు. బ్రాహ్మణులపై కోపము వచ్చినచో వారి జుత్తును తన కైజారుతో గొరిగించి వంపును. కాని దాసుగారి హరికథకు ముగ్ధుడై ప్రశంసాపూర్వకముగ నక్కైజారు మీదుగా మూడువందల రూపాయలు దాసుగారి దోసిట బోసి "మీకు సంతుష్టియా ? అసంతుష్టో ద్విజో నష్టః" అనిరి. అందుకు (శ్రీ) దాసుగారు ధైర్యముతో "సంతుష్ట ఇవ పార్థివః" అని సమాధాన మొసంగిరి. తత్ఫలితముగ మరికొన్ని బహుమతులు దాసు గారు పొందిరి.

కాకినాడ గానసభలో నొకప్పుడు జనులందరు క్రిక్కిరిసియున్న సమయమున నొక జమీందారు పెద్దల నందరను త్రోసికొనుచు వచ్చి ముందు కూర్చుండి కొలది సేపటికే లేచిపోయెను. అది సహింపజాలక దాసుగారు కథనాపి "పుట్టగనే చచ్చు బిడ్డ యీ లోకమునకేల వచ్చునో యేమనుభవించెనో యా యీశ్వరునకే యెరుక." దాసుగారి భావమును గ్రహించిన ప్రేక్షకు లాతని యవమానమునకు కడుపుబ్బ నవ్విరి.

ఒకప్పుడు రాజమండ్రిలో దాసుగారి హరికథను విని ఆయన కంఠ ధ్వని కాశ్చర్యపడి డాక్టరు పాలకోడేటి గురుమూర్తి యను నాయన దాసుగారి గుండె యాగిపోవు ప్రమాదమున్నదని సూచింపగా పరమ భక్తాగ్రేసరుడు (శ్రీ) దాసుగారు "నాకంతటి యదృష్టమా ? హరికథా కథన సందర్భమున నా ప్రాణంబు లా హరిలో లీనమగుటకంటె గావల సిన దేమున్న" దనిరి. మరియొక సందర్భమున వృద్ధాప్యము వచ్చుటచే హరికథను మానుడని మిత్రులు సలహానీయగా "నాది యైహికమైన లౌక్యవృత్తి కాదు పరమేశ్వర గుణగానము. దీనికి విరమణ మన నెట్టిది. యావజ్జీవ మిట్లు జరుగవలసినదే మరణమునసే దీనికి విరమణ" యని దాసుగారి సమాధానము. స్వభావముచే భక్తుడయ్యు మేధాసంపత్తి

చేతను, తాత్త్విక పరిజ్ఞానముచేతను మహాద్వైతిగ రూపొందిన శ్రీ దాసుగారిట్టి సమాధానముగాక వేఱేమి బదులిత్తురు.

శ్రీ దాసుగారి దృష్టిలో వాగ్గేయకారుడుగాని వానికి సంగీత జ్ఞానిగ స్థానములేదు. "ఎందుకురా! ఆ త్యాగయ్యమాట విప్పుతావు? నీ స్వంతం ఏమైనా ఉంటే చెప్పు" అని నిలదీసి కొమ్ములు తిరిగిన సంగీత విద్వాంసులను కూడ ప్రశ్నించెడివారు.

చార్వాకుని పేరు సనాతన పండితులకు చుక్కెదురు. పరమాద్వైతి శ్రీదాసుగారు చార్వాకుని మానవతా వాదమును సమ్యగ్ దృష్టితో స్వీకరించిరి. శ్రీరంగం నారాయణబాబు ప్రభృతుల సమక్షంలో ఒకరోజున శ్రీ దాసుగారు "చార్వాకుని పేరు చదివితే మయిలపడిపోతాం అనే ప్రిజుడైస్ట్ అండ్ జాండైస్ట్ నోషన్స్ ఉన్న ఛాందసులకు చార్వాకుని యథార్థ తత్త్వం అసలు అర్థమై చస్తుందా?" అంటూ చార్వాక తత్త్వాన్ని స్పష్టపరిచారు.

శ్రీ దాసుగారి దృష్టిలో మానవునకు "ఆత్మవివేచన, అంతర్ దృష్టి, సహనం సమతాభావం" కలిగిననాడు ఆదర్శ సమాజనిర్మాణము సమస్య కాదని భావన. నిజమేమరి 'ఆత్మవత్ సర్వభూతాని'. సెట్టి ఈశ్వరావు మొదలైన అభ్యుదయవాదులు ఆదర్శ సమాజ మెట్లుండవలెనని ప్రశ్నింప ఈ విషయమునే పేర్కొనిరి.

ఒకసారి తన శిష్యుడొకడు జపముచేయుచుండ దాసుగారకస్మాత్తుగ "ఏంరా! దేముడు కన్పించాడా" అని తీవ్రముగ ప్రశ్నించి కొంత తడవైన పిమ్మట ప్రశాంతముగ "ఒరేయ్ ఎనభై యేళ్ళు నాకు వాచేయి. ఆ దేవుడు నల్లగా ఉంటాడో యింకా తెలియక కిందామీదా పడుతున్నాను. గుంటగాడివి నీకెందుకురా వాడిగోల. నీవు చదివే విద్యలో సంపూర్ణంగా మనస్సును లగ్నం చెయ్యి" అని హితోపదేశం చేసేరు. తన లక్ష్య సాధనకు శాఖాచంక్రమణము పనికిరాదనియు, భగవత్సాక్షా

త్కారము పరిణతప్రజ్ఞ లేనిచో దుర్లభమనియు, అట్టి పరిణతి సర్వ వ్యాప్తము కావలెను లేనిచో భగవద్దర్శన వాంఛ నిష్ఫలమనియు దాసుగారి యుద్దేశ్యము.

శ్రీ దాస విరచిత యథార్థ రామాయణ శీర్షిక సామాన్యులకు వింత యనిపించినది. ఏమది యీతని రామాయణమే యథార్థమా ? వాల్మీకి రామాయణము కాదా ? యిది కాదా అది కాదా ? యని వారి ప్రశ్న పరంపర. శ్రీ దాసుగారు రాముడవతార పురుషుడనియు అధ్యాత్మ రామాయణ సారమును గ్రహించి నామకరణము చేసిరి. ఒకనా డొకాయన దాసుగారిని "మీదే యథార్థ రామాయణమా యితరులవి కావా"? యని ప్రశ్నింప దాసుగారు, "ఔను, యథా = సత్యముగ, అర్థ = ధనమును ఇచ్చే రామాయణం నాది. వందలు వేలు హరిదాసు లకు బ్రతుకు తెరువు చూపినది నా రామాయణం" అని చమత్కరిం చారు.

ఇంకొక సందర్భమున నొకాయన అహల్యావృత్తాంతమును దాసు గారి దృష్టికి దెచ్చి యందహల్య తనంతట రాయిగ మారుటకును ఇంద్ర ప్రసక్తి లేకపోవుటకును నాధారమడిగెను. దాసుగారు మిక్కిలి గంభీర ముగ "దానికి నేనే ఆధారము. అది దేవరహస్యము. చూచిన దెవరు? ఇంతకూ అంతటి మహాపతివ్రతకు జారత్వ మాపాదించుట మనకు పాపము కాదా" యని సమాధాన మొసంగిరి.

1936 వ సం॥న ప్రభుత్వమువారు దాసుగారిని 'రిటైర్' చేయగా దాసుగారు "అయ్యా నన్ను పదవినుండి 'రిటైర్' చేయించారు కానీ నా విద్యను రిటైర్ చేయించగలరా ! ఇప్పుడొక మద్దిల పడవేయండి నా తమాషా చూపిస్తాను" అని అనుసరికి ప్రభుత్వమువారు నూరు రూపా యల గౌరవవేతనమును యావజ్జీవ మనుభవించునట్లు చేసిరి. మహాభక్తు డును, అద్వైతియు, సాహిత్య సత్యవ్రతుడునునైన శ్రీ దాసుగారు

మరణానంతరము గాక తత్పూర్వము 'రిపైర్' అగుట అసంభవము కాదా?

1913 ప్రాంతమున విజయనగరమునందొక ధనవంతుడు దాసుగారి పేదరికమున కసంతృప్తిని వ్యక్తపరుప దాసుగారు "ఓయీ నేను గోచి పాతరాయుడనే కావచ్చును. నీకున్న ఆస్తి నీవు ఆర్జించినది కాదు. నీ పెద్ద లెవరో గడించిరి. అది పెట్టుకొని నీవు డాబుచేయుచున్నావు. వ్యక్తిగతముగ నీవు గొప్పవాడవో నేను గొప్పవాడినో నిర్ణయించాలంటే నీకు కూడా నావలె ఒక గోచీపెట్టి ఇద్దరినీ ఒక దేశమున విడిచిపిమ్మట ఒక నియమిత కాలములో ఎవరు ఎక్కువడబ్బు సేకరించుకొని తిరిగి విజయనగరము చేరుదురో వారు గొప్పవారు. ఏమంటావ్." అని గద్దించి అడిగేరు. పాపమత డేమనగలడు ? 'విద్వాన్ సర్వత్ర పూజ్యతే' అన్న విషయం ఆతడెరుగునో లేదో.

1895వ సం॥లో శ్రీదాసుగారు తన గానముతో మైసూరురాజును తృప్తిపరుప మెచ్చుకొని ఏమికావలెనో కోరుడని దాసుగారినడిగిరి. వెంటనే దాసుగారు "ఎదురుగానున్న కొండను నా నెత్తి కెక్కించెదరా" అని యడుగ రాజుగారు చిన్నబోయియు దాసుగారి మాటయందలి సత్యమును గుర్తించి తా నీయగలిగిన దడుగుమనెను. "ఒక బుట్టెడు బెంగుళూరు వంకాయ లిప్పించండి" అని యడిగెను. ఏమట్లని ప్రశ్నింప 'ఇది మా సంప్రదాయం. మా తల్లి పద్దెనిమిది గుమ్మడిపండ్లను కోరినది. నేను భోజన ప్రియుడను. కాబట్టి ఆ విధంగా కోరాను. మీరు సెలవిచ్చేరని తలకు తగని రీతిని యథేచ్ఛగా అడగ కూడదు." యథార్థమునకు దాసుగారి జీవితమున ఈ నిరాడంబరత్వమే ఎక్కువ ప్రాముఖ్యమును వహించినది. ధనమును తృణప్రాయముగ జూచెడివాడు. కాని-చో కనీసమయిదు తరములవరకు పుష్కలముగ సరిపడు ధనమార్జించెడివారు. ఐహిక సుఖమున కేమాత్రము ప్రాధాన్యమునీయక జీవితమునందలి మర్మము నెరిగిన కర్మయోగి శ్రీ దాసుగారు.

1920 లో పలువురు విద్వాంసుల సమక్షమున 'పాదుకాపట్టాభి షేకము'ను గానముచేయుచు మధ్యలోనాపి 'శంభో' నాదమును గావించిరి. హాలు దద్దరిల్లెను. ప్రతిధ్వని మూడునిముషములు మ్రోగినది. అంత పురప్రముఖుడు సూర్యనారాయణమూర్తినాయుడు నుద్దేశించి "ఇంత కేకవేయుటకు ఎంతకాఫీ తాగాలో తెలియునా" యనిపల్కిరి. దాసుగారు కాఫీ త్రాగరు. కాఫీ గతప్రాణులు తనయట్లు నాదము చేయుట అసాధ్యమని వారియుద్దేశ్యము.

ఒకరోజున దాసుగారియింట నేతిబీరకాయ రూపావతియను గాయకురాలు గానముచేయుచుండెను కోకిలకంఠ మామెది. గానమునకు ముగ్ధుడై శ్రీ దాసుగారు "ఈపాటవింటూ యిలాగే దీనివెంట వెళ్ళిపోవాలనివుంది" అని అన్నారు. ప్రక్కనేయున్న భార్య "బాగుంది వెఱ్ఱి కుదిరినట్టేవుంది" అన్నది. వెంటనే దాసుగారు తడుముకోకుండ "పోతే ఎద్దుకేం తెలుస్తుంది అటుకుల రుచి'' అని సర్వోక్తిని విసరిరి.

చమత్కార భాషణలు సమయస్ఫూర్తితో మెలగుచుండుట వరిపాటి. జీవితమందలి కష్టములను లక్ష్యపెట్టనివారుమాత్రమే చమత్కారులగుదురు. ఒకప్పుడు కాకినాడ గానసభలో శూర్పణఖ ముక్కుచెవులుకోయు సందర్భమున ఏడ్చినపాట యొక యప్రసిద్ధ రాగమున (ఆహిరీరాగము) నున్నది. ఆ రాగము పాడినచో అన్నమునకు నోచుకొనరని జనశ్రుతి. కాని దాసుగారా పాటనుపాడి కొంతభాగము తన వెనుక పాటగాడైన పేరిబాబులయ్యగారికి వదలిపెట్టెను. మహావిద్వాంసుడు బాబులయ్య కించిదపస్వరమును పల్కిరి. పండిత ప్రకాండుల సమక్షమున నయ్యది విచార్యము. తటాలున దాసుగారు "చూశారా ఏడుపులో అన్నమ్మరాగాలు వస్తాయి. స్వరంకట్టి ఏడుస్తారండీ" యని సమర్థించారు.

ఇట్లు శ్రీ దాసుగారు క్రీ॥ శ॥ 1864 న జన్మించి ఆమరణాంతము శివజటాజూటమునందలి చంద్రవంకవలె వారమృతరోచుల నాంధ్రలోక మునుముంచి తాను ధన్యుడై యితరులను ధన్యుల జేసినాడు. తనదికాని దెంతటి విలువైనదైనను స్వీకరింపక తనదైన దెంత తృణమైనను విడువని మహామనీషి. స్వయంసంపూర్ణుడు. తన వాణి స్వకపోలకల్పితము; ఉచ్ఛిష్టము నంగీకరింపదు. జన్మతః ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసములను తనవశము గావించుకొని, భక్తుడై, మహాద్వైతియై మేధావియై ఆంధ్రలోకమును తరింపజేసెను. ఆంధ్రసాహిత్యమున నొక నూత్నప్రక్రియకాద్యుడై ఆరాధ్యుడైన కవి వతంసుడు శ్రీ నారాయణదాసు



# 'న భూతో న భవిష్యతి'

శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రి

ఆంధ్రదేశమున హరికథాకథన ప్రక్రియ ఆరంభించిన దాదిగా నేటిదాఁక శ్రీ మదజ్జాడాదిభట్ల నారాయణదాసువంటి కథకుఁడు వేఱొక డవతరించి నట్లెఱుంగము.

నారాయణదాసు బహుభాషాభిజ్ఞుఁడు. సంస్కృతము, ఆంధ్రము ఆంగ్లము, ఉరుదూ భాషలలో సాధారణ ప్రవేశమాత్రముగాక, ఆ భాషలలో కూలంకషముగ వైదుష్యము సంపాదించి, అందు స్వతంత్రముగా హేలగా కవితానిర్మాణ మొనరించి, కమనీయములగు కావ్యము లనేకములు సంతరించిన ప్రతిభావంతుఁడు. ఈయన రచించిన స్వతంత్రములగు "తారకము" మున్నగు సంస్కృత గ్రంథములును, "బాటసారి" మున్నగు నాంధ్రగ్రంథములును, "ఉమర్ ఖయ్యాం" మున్నగు ననువాద గ్రంథములును చదువరులకు సుపరిచితములు. వీరి అచ్చతెనుఁగు రచనమున కృతకత్వము లేశమును గోచరింపక ఆ కూర్పు మిక్కిలి సుబోధకమయి, రమ్యమయి చదువరుల నాకర్షించును.

బహుభాషలయందును, అనేక శాస్త్రసంప్రదాయము లందును, లలితాకళా రహస్యములందును ఈయనకుఁ గలిగిన విజ్ఞానము ముక్కాలు మువ్వీసము స్వయంకృషిచే సమార్జింపఁబడుటయే తత్ప్రతిభా సంపత్తికి ద్యోతకము.

ఈయన న్యాయ, వేదాంత, వ్యాకరణశాస్త్రముల సంప్రదాయము లను సమగ్రముగా నాకళించుకొన్న అనుభవశాలి. గానశాస్త్ర మర్మములను సాకల్యముతో సాధించిన ప్రవీణుడు. శాస్త్రవిజ్ఞాన మాత్రముగాక శ్రుతిపేయముగా, సకలజనరంజకముగా మహాసభలలో గానవిద్యను వెలయించిన ఉత్తమగాయకుడు. అఖిలానందదాయకము లగు హరికథా సంకీర్తనములను ఎన్నిటినో పండితలోకమునకును, పామర జనానీకమునకు ఆకర్షకమగు లలిత మార్గమున స్వయముగా సంతరించి, ఆ మార్గమున ఎందరెందరో శిష్యులను తీర్చిదిద్ది దేశమున కొసంగిన ధన్యజీవి. హరికథాకథన ప్రక్రియను ఒక కళగా తీర్చి లలితకళావిభాగ ములలో దానికొక సుస్థిరమగు సున్నతస్థానము కల్పించిన సుధీశిరోమణి. ఋగ్వేదమును శాస్త్రీయ సంప్రదాయాను రూపముగ, తాళలయాను బద్ధముగ గానమొనరించుటకు అనువుపడువ సంకల్పించిరి. అట్టి సరణి నేర్పడువ చిరకాలము తన కల్పనానైపుణిని వినియోగించి, దీక్షతో కృషియొనరించి, ఋగ్వేద సూక్తములను శ్రుతిరమణీయమగు సంగీత సరణిలో తాను పాడుచు, ఇతరులచే పాడించుచు, ఇట్టి యెన్నో విద్యా వినోదములతో కాలముగడిపిన భాగ్యశాలి.

భాషాపాండిత్యము, రచనా వైదుష్యము, గానప్రావీణ్యము, కథననైపుణ్యము మున్నగు నిన్నిశక్తులు తనకుగలవను గర్వమాతనిలో ఆవంతయుం గానవచ్చెడిదికాదు. పెద్దలతో పిన్నలతో అతిగౌరవముతో అమితవాత్సల్యముతో నిరంతరము మెలంగుటకు ముచ్చటపడు విశాల హృదయుడు. ఎల్లవారిని తానును, ఎల్లవారు తన్నును ఓరీ, ఓరే యని చనువుతో ఆప్యాయముతో సంబోధించుటకును, సంబోధింపం జేసికొను టకును ఎక్కువ మక్కువ పడుచుండు సుహృద్భావ సంపన్నుడు. రండీ, కూర్చోండీ, పాడండీ, వినండీ అని యీ అండీలు మనకెందుకురా యని ఆయన తఱచు అనుచుండుమాట. ఆ సువిశాల కోమలహృదయు పరిమ

శముసకు ఎండకొండఅనో పిన్నలు, పెద్దలు, పౌరులు నిత్యము కోరి చేరు చుండువారు.

ఆయన దినచర్య నియమబద్ధముగా నుండెడిది. ప్రతిదినము ఉదయము స్నానాదికము ముగించుకొని, ఒక కౌపీనము (కాసెకోక) ధరించి మేడమీది తనగదిలో ఇరుప్రక్కల గ్రంథము లమర్చబడియున్న ఒక మెత్తని పాన్పువయిని కూరుచుండి చదువుచునో, వ్రాయుచునో, పాడుచునో పరమోల్లాసముతో కాలము గడుపుచుండెడివారు. ఆయన వసించు వీధికి కానుకుర్తివారి వీధియని వ్యవహారము. ఆ కానుకుర్తివారు సంపన్నులు, సహృదయులు. ఈయనకు మిత్రులు. తన గ్రంథావలోకనములో, పరిశ్రమలో, పరిశోధనములో ఏ సమయమున ఎట్టి నూతన విశేషము స్ఫురించినను వెంటనే దిగ్గున లేచి ఆ కౌపీనముతోనే వారి మేడకేగి ఆ విశేషము తెలిపి ఆనందించుచుండువారు. వారందఱును అదియొక మహాభాగ్యముగ భావించుకొనుచు ఈయనను గౌరవించుచుండువారు.

10 గంటల ప్రాంతమున మహారాజా సంస్కృత కళాశాలా పండితులు పెక్కుమంది ఆ వీధినే కళాశాల కేగుచుండెడివారు. వారిలో పెద్దలు, వైయాకరణ సార్వభౌములగు మహామహోపాధ్యాయ శ్రీతాతా రాయుడు శాస్త్రులవారుగాని, న్యాయశాస్త్రపారీణులు శ్రీ పేరి లక్ష్మీనారాయణ శాస్త్రులవారుగాని వచ్చుసమయము గమనించి, మేడదిగి, వారినాపి "ఏమోయి, కౌముదిలో ఈ పంక్తికి ఇట్లు అర్థముచేసికొన్నాను. ధ్వన్యాలోకమున ఈ పంక్తికి ఇది అంతరార్థమని ఊహించినాను, తేడాలేదుగదా" అని ఏవేవో తెలుపుచు అడుగుచు సంప్రతించుచుండెడివారు. ఆయన అనుకొన్నదెల్ల, సాంప్రదాయికమయిన చక్కని సమన్వయముతో నిరాక్షేపమయిన సాధుమార్గము కావలసినదేగాని తబ్బిబ్బుగా నుండదనియు, ఆ ప్రతిభ అసామాన్యమనియు ఆ పండిత చక్రవర్తులు అచ్చెరుపాటుతో మెచ్చుకొనుచుండువారు. అట్టిపండిత

సార్వభౌములతో ప్రసంగించునపుడుగూడ వారి పరస్పర సంభాషణమున ఏకవచన ప్రయోగములేగాని "అండి, గారండి" అను మన్ననలు విన వచ్చెడివికావు.

మధ్యాహ్నము 3 గంటలదాక ఇల్లు కదలు నభ్యాసముగాని అవ సరముగాని ఎప్పుడును ఉండెడిదికాదు. 3 గంటలకు బజారువీథికి షికారుగా తఱచుగా బయలుదేఱుచుండెడివారు. ఆ బయలుదేఱునపుడు ఆ కౌపీనము విడిచి ధరించువేషము మహారాజవేషమును మించి యుండె డిది. ఆ దుస్తుల శుభ్రత వాటివిలువ ఆశ్చర్యకరముగా నుండెడిది. ఆ కొండజాతి కౌపీనమో ఈ నాగరిక రాజవేషమోతప్ప, మధ్యరీతి వేష మునకు తగిన దుస్తులు ఆయన కుండెడివేకావు. చేతికిని కాలికిని ఏ సంస్థానములలోనో మహారాజులు బహూకరించిన బంగరు కడియములును, మెడలో నొకనున్నితమయిన బంగరుగొలుసును. వ్రేళ్ళకు రత్నాంగుళీయకములును ఇంచు మించు ఎల్లవేళలను నుండెడివి. ఆ విలాసవేషముతో, పొడవయిన బంగరుకట్టు చేతికఱ్ఱతో ఒయ్యారపు తలపాగతో ఒంటరిగా ఇల్లువెడలి వీథిలోనికి వచ్చినది మొదలు త్రోవలో ఒకరొక్కరుగా వెంబడించుచు బజారునడుమ గంటస్తంభము చేరునప్పటికి ముప్పది నలువది మంది అనుచరులయ్యెడివారు. ఆయన వేషమునకు అబ్బురపడుచు కొందఱు, మాటలకు మురిసియుచు కొందఱు, ఆ చేతికఱ్ఱకే తెల్లపోవుచు కొందఱు, ఆ తలపాగనే తిలకించుచు కొందఱు ఇటులనేకరీతుల ఆయనను షికారులో కలిసినవారు తిరిగి ఆఱుగంటల కిలుసేరువఱకు విడిచెడివారు కారు. ఆ ఆకర్షకత అట్టిది. దాసుగారి సానుచర సంచారమును రాజవీథిలో ప్రత్యక్షముగ పలుమాఱు తిలకించిన వాఁడనగుటచే గుఱుతులోనున్న కొన్ని వివరములు వ్రాయఁగలుగుచున్నాను.

ఆ బజారు గంటస్తంభమువద్ద నిత్యము ఎవరెవరో భిక్షుకులు కూర్చుండి పాటలు పాడుచుందువారు.

ఒక్కొక్కరోజున ఒక కంఠస్వరము వినఁబడినప్పుడు మనదాసుగారు అట్లె ఆఁగి చేతికఱ్ఱ గడ్డమున కానించి, ఇంచుక వంగి నిలిచి ఆ పాట వినుచుండువారు. దాసుగారు ఆఁగి వినుచున్నారనఁగనే ఆ దారిని రాకపోకలు గావించు వారెల్లరును అదొక వింతగా అచ్చటనే ఆగెడివారు. క్రమముగా కొలఁదిసేపటికి ఆ శ్రోతల సంఖ్య రెండు మూఁడు వందలకు పైఁబడి బజారుదారి కట్టువడెడిది. ఆ సెంటరులో పోలీసువారున్నను వారుగూడ దాసుగారి ప్రక్కకే చేరి శ్రోతలలోనే కలియుటచే మఱి ఆ దారి తెఱపి అయ్యెడిదే కాదు. వచ్చిన బండ్లు ఆ కొసను నిలిచి పోవలసినదే. బండ్లు తోలువారు, బండ్లలోనివారు గూడ దిగి ఆ సమ్మర్దములో జనమును తప్పించుకొని దాసుగారి దగ్గరకే పోవుచుండెడివారు. ఈ జనమంతయు పాటగానిని జూచుటకుఁగాదు. పాటవినుటకును గాదు. పాటవినుచున్న దాసుగారిని చూచుటకు, కొంతసేపువిని దాసుగారు "అచ్ఛా" యని ఆ గాఢకంఠముతో గట్టిగ పలికి తలయూపుచు జేబులో చేయిపెట్టి తోఁచినదితీసి ఆ భిక్షకుని ఒడిలో వడివేసెడివారు. అయ్యా ఇంక చూచుకొండి. ఆ బిచ్చగానికి ప్రతివ్యక్తియు ఏకొంతో నేను నేనని ఉత్సాహముతో ఇచ్చెడివారు. ఒక్క క్షణములో ఆ భిక్షకుని ఒడి నిండిపోయెడిది. ఎప్పుడైనను బజారులో ఎచటయిన ఒకగుంపు కానవచ్చినచో అచట దాసుగారున్నారు కాఁబోలు ననియే జనులు భావించెడివారు.

రాత్రివేళలందు తఱచు దాసుగారియింట గానసభలు జరుగుచుండెడివి. అటు ఉత్తరదేశమునుండి హిందుస్థానీ గాయకులో, ఇటు దక్షిణదేశము నుండి కర్ణాటక గాయకులో విజయనగరము వచ్చినచో దాసుగారి యొద్దకే వచ్చెడివారు. విజయనగరము నుండెడి సంస్థానోద్యోగులు, ప్రభుత్వోద్యోగులు, తక్కిన పౌరముఖ్యులు అందఱును దాసుగారికి ఆప్తమిత్రులే. గానసభ చేయింపఁ దలంచి దాసుగారు కబురంపఁగనే వారెల్లరును దాసుగారి యింటిలోనే జరుగు ఆగానసభకు తప్పక ఏతెంచు

చుండెడివారు. అయాచితముగా ఆ శ్రోతలవల్ల ఆ గాయకులకు తృప్తి కరమగు సన్మానములు జరుగుచుండెడివి.

దాసుగారు జీవితము ఏ యంశములందును ఎట్టి లోటును లేకుండ తృప్తితో, ఉత్సాహముతో, ఉల్లాసముతో, విలాసములతో, భోగములతో, గౌరవముతో హాయిగా కాలము గడిపిన ధన్యజీవి. భక్తిపారవశ్యముతోడి హరికథా సంకీర్తనముల చే పవిత్రహృదయుఁడయిన పుణ్యమూర్తి.

ఆయన హరికథా కాలక్షేపము సేయుచుండ; అది భక్తిరస ప్రపూరితమగు హరికథా కథనమా? మైమఱపు గావించు గానసభయా? కమనీయమగు కవితాగోష్ఠియా ? సరసమగు శాస్త్రవిచారమా ? లలితమగు నుపన్యాసమా ? అనిపించెడిది. ఇన్నింటి రుచులును అందు మిళితములయియుండెడివి. కథా మధ్యమున తన్మయుఁడయి నృత్యము సేయుచు పద్యములో పాటలో అప్పటి కపుడు ఆశువుగా కల్పించుజాడ గూడ గానవచ్చెడిది.

సంతపట్టులలో సందుగొందులలో సంచారము గావించిన హరికథా ప్రక్రియను. చక్రవర్తుల దర్బారు లందును, ప్రఖ్యాత నగరములలో పెక్కింట పురమందిర మహాసభలయందును విశిష్ట స్థానమును గల్పించిన దాసుగారి వైదుష్య ప్రావీణ్యములను ఎవ్వరెంత వర్ణించినను అయ్యవి సశేషములై యుండును.

అసామాన్య ప్రతిభ అనేకభాషల పాండిత్యము, అనేకశాస్త్ర పరిచయము, కవితారచనా చాతుర్యము, లలితగానప్రావీణ్యము, సముచిత వక్తృత్వ కౌశలము, అసాధారణ కల్పనా నైపుణ్యము, అఖిల జనాకర్షణ సామర్థ్యము మున్నగు అనేక విశిష్ట శక్తుల సమ్మేళన సామరస్యముగల యిట్టి హరిదాసు మన దేశముననే కాదు - ఏ దేశమునను

నభూతో నభవిష్యతి.

# జీవితసందేశము

శ్రీ ఓరుగంటి నీలకంఠశాస్త్రి

జంతూనాం నరజన్మ దుర్లభ మతః పుంస్త్వం తతో విప్రతా
తస్మాత్ వైదిక ధర్మమార్గ పరతా విద్వత్త్వ మస్మాత్ పరం
ఆత్మానాత్మ వివేచనం స్వనుభవో బ్రహ్మాత్మనా సంస్థితిః
ముక్తిర్నో శతజన్మకోటి సుకృతైః పుణ్యైర్వినా లభ్యతే.

— శ్రీ శంకర - వివేకచూడామణి.

'రమణీయ చరణాః రమణీయాం యోని మాపద్యేరన్, కపూయ చరణాః కపూయాం యోని మాపద్యేరన్' (ఛాం. 5, 10, 7) అను శ్రుతి వాక్యమువలన నుత్తమ జన్మలకు పుణ్యము, నీచ జన్మలకు పాపమును హేతువుగా దెలియుచున్నది. అందు నరజన్మము, పుంస్త్వము బ్రాహ్మణ్యము, ధర్మమార్గ పరత్వము, విద్వత్త్వము - అను క్రమము సుకృత తారతమ్యము వలననే కల్గుచుండును. నిజమైన జ్ఞానము బ్రహ్మ భావమగు మోక్షమునకు హేతువగును. ఇట్టి జ్ఞానము శతకోటిజన్మల నుండి చేయు పుణ్యవిశేషము వలననే కల్గునని శ్రీ శంకరాదులు వాక్రుచ్చిరి.

శ్రీ దాసుగారు

ఇట్టి పుణ్యవ్రతులలో శ్రీ నారాయణదాసవర్యు లొకరు. కారణ జన్ములగు నీ మహానుభావులు సంగీతసాహిత్యములం దెంత పారమ్యమం

దిన వారో, తత్త్వజ్ఞతయందుకూడ నంత పారమ్యమునందిన జ్ఞాని. నిరుప పదమగు తత్త్వజ్ఞతకు బ్రహ్మ తత్త్వము నెఱుంగుట యని యర్థము. ఇట్టి తత్త్వజ్ఞుడు తాను ఏ సంగతినిగూర్చి వ్రాసినను, ఏ విష యమునుగూర్చి బోధించినను ఏ సంగతినిగూర్చి భావించినను, ఆతని గ్రంథము, ఆతని బోధనము, ఆతని భావనయు తత్త్వమునందే పరిస మాప్తమగును. ఇక తత్త్వమును గూర్చియే వ్రాయు గ్రంథములయందు ఆ విషయమెట్లు చర్చింపబడునో వేరుగా వ్రాయబని లేదు.

(శ్రీ) నారాయణదాసుల యనేకములగు ముద్రితాముద్రిత గ్రంథ ములను మనము పరిశీలించినచో, వానియం దంతటను ఈ తత్త్వజ్ఞత గోచరించును. వీరి గ్రంథములన్నియు హరికథలు, కావ్యములు, స్తుతులు, విమర్శనములు అని పెక్కు భంగుల కలవు. వానియందంతటను వారి సంగీత సాహిత్యముల యగాధపరిశీలనమువలె లోకవృత్త పర్యవేక్షణము జీర్ణించుకొనిన తత్త్వజ్ఞతయు విశేషముగ గానబడును. తా దెలిసికొనిన లోకమును తత్త్వమును లోకమున కందించుటలో (శ్రీ) దాసుగారి మార్గము అపూర్వ చరణోపస్పృష్టము, శోభాసంపన్నమును.

నేటి కుపలభ్యమానములగు నారాయణదాస గ్రంథముల బరిశీ లించినచో, (శ్రీ) హరికథామృతము, యథార్థ రామాయణము, రామ చంద్రశతకము, బాటసారి, యనునవి కేవల తత్త్వ విషయ ప్రబోధక ములుగా దెలియును. వీనిలో ప్రసంగ వశమున తత్త్వేతర విషయములు చెప్పబడినట్లు మిగిలిన వానిలో ప్రాసంగికములుగ తత్త్వవిషయములు చెప్పబడినవి. పైన దెలుపబడిన గ్రంథములలో నాధ్యాత్మిక తత్త్వము సూటిగ దెలుపబడినను, బాటసారియను గ్రంథమున మాత్రము అది అన్యాపదేశముగ దెలుపబడినది.

### అనుబంధచతుష్టయము

ఒక గ్రంథమును పరిశీలించునపుడు నాల్గు విషయములు ఆ గ్రం థమున నెట్లు నిరూపింపబడినవో తొలుత దెలియవలెనని శాస్త్రజ్ఞుల

నిర్ణయము. ఈ నిర్ణయము సామాన్య కావ్యాదుల కంటె శాస్త్ర గ్రంథములయందు సునిశితముగ జేయవలసియుండును. ఆ విషయములనే 'అనుబంధ చతుష్టయము' అని శాస్త్ర పరిభాషగా పెద్దలు చెప్పుదురు. అవి – విషయము, ప్రయోజనము, సంబంధము, అధికారి యనునవి. ఈ గ్రంథమందలి విషయమేది; దానివలని గల్గు ప్రయోజన మెట్టిది; గ్రంథమునకు గ్రంథ ప్రతిపాద్య విషయమున కెట్టి సంబంధము గలదు; ఇట్టి విషయముల దెలిసికొనుటకు ఎట్టివానికి యోగ్యతగలదు అనునవియే ఆ నాలుగును. శాస్త్ర విషయమును ప్రతిపాదింపదలచిన గ్రంథకర్త లందరును తమ గ్రంథములయందీ విషయముల సూచింతురు. దీని ననుసరించి, శ్రీ నారాయణదాస తత్త్వగ్రంథపరిశీలనము చేయుదము.

శ్రీ నారాయణదాసుగారి గ్రంథము లన్నింటనున్న 'భజరే హరిం' (హరికథా), భక్తిరేవ తరణోపాయః (హరికథా), 'భజస్వ అనవరతం హరిమ్' (హరికథా), 'భవక్ష్యభక్తి రేవాస్తు రామచంద్ర (రా. శ), 'భక్తిదప్ప నినుగ్గన దారిలేదు' (యథార్థ), 'రాముని భజించు మనసా' (యథార్థ)— ఈ మొదలగు వాక్యములచే పరమేశ్వరానుగ్రహ సంపాదకమగు భక్తియే శ్రీ దాసుగారి గ్రంథవిషయమని చెప్పదగును. ఇట్టి హరిభక్తికి ప్రయోజనము జనన మరణ రూపమగు సంసారము తొలగుట (సంసారోత్తరణము)అని 'తారయ మాం సంసార సాగరతః' (హరికథా), 'హరిభక్తి నౌకయైవ ప్రకటిత సంసార వారిధిం తరతి' (హరికథా) మొదలగు వచనములచే చెప్పవలెను. ఈ గ్రంథ సంతతి భక్తినే ప్రతిపాదించుటచే సంబంధముగూడ ప్రతిపాద్య ప్రతిపాదక రూపమని సుస్పష్టము.

ఇక ఈ గ్రంథమును జదివి, తద్విషయమును అనుభావ్యము కావించుకో దగినవాడు (అధికారి) ఎట్టివాడనగా సంసార సుఖములను అశాశ్వతములుగాను, దుఃఖహేతువులుగను తెలిసికొని, శాశ్వతానంద రూపమగు నిశ్శ్రేయసము పొందదలచినవాడు, సంసారక్లేశములచే

వైరాగ్య సంపన్నుడై దుఃఖపంకిలా సంకీర మగు నిఃశ్రేయసమును పొంద దలచినవాడును అని 'ఆరోగ్యం సుందరత్వం, విపుల భుజబలం' వేదశాస్త్ర ప్రథాః స్యుః సర్వాణ్యేతాని సౌఖ్యం నహిదధతి సదా భక్తివన్ మాధవస్య' (హరికథా)

ఆరోగ్య సౌందర్యాదులన్నియు మాధవభక్తివలె శాశ్వతానంద మును సంపాదింప జాలవు.

'కిం భ్రామయసి మాం భవాంభోనిధి భ్రమే
శుంభదాశ్రిత పక్ష కుంభి మిత్ర
దీనం కుటుంబినం అధీనం తవ జ్ఞాన హీనం అవ
అద్యమాం ప్రాణసచివ సంసార తృష్ణాం ప్రశమయ'
(హరికథా)

"ఓ పరమేశా! నన్ను సంసారసాగరమునందలి సుడిగుండమున ఏల త్రిప్పుచున్నావు ? దీనుడను, బహుకుటుంబిని, నీ యధీనుడ నయినను నీ యథార్థ జ్ఞానమును లేనివాడను. ఈ సంసార తృష్ణను శమింపజేసి నన్నుద్ధరింపుము అను వచనములచే దెల్లమగును.

ఇట్లు విషయ ప్రయోజన సంబంధాధికారి నిరూపణానంతరము శ్రీ. దాసుగారు విషయముగ నిరూపింపదలచిన భక్తినిగూర్చి కొంత తెలియవలసి యున్నది.

భక్తి

భగవన్మాహాత్మ్యప్రబోధకమగు భక్తి ఏకరూపముగ నుండునా లేక నానా రూపములుగ నుండునా-అను ప్రశ్న ముదయించును. దానికి సమాధానముగ శ్రీకృష్ణ భగవానుడు భక్తభేద ప్రతిపాదనముచే భక్తి భేదము నిట్లు సూచించుచు సమాధానము చెప్పిరి.

'చతుర్విధా భజన్తే మాం జనా స్సుకృతినోఽర్జున
అర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ' (భ. గీ 7-16)

దీనిచే ఆర్త - అర్థార్థి - జిజ్ఞాసు - జ్ఞానుల యందలి భక్తి, ప్రతియోగి భేదముచే భిన్న భిన్నములుగ నుండుననీ, మన మూహింపవచ్చును. అందు ఆర్తత్వమునకు మకర దంష్ట్రాగ్రపీడితుడగు గజేంద్రుడు, జిజ్ఞాసుత్వమునకు ఆయోధన ముఖమున గురుబంధు మిత్రాదులగాంచి, ఖిన్నుడై యుద్ధము సేయనొల్లక కర్తవ్యమునకై శ్రీకృష్ణభగవానుని

'శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రసన్నమ్'
(భ. గీ 2-7)

అని శిష్యభావమున ప్రార్థించిన పార్థుడును, అర్థార్థిత్వమునకు దారిద్ర్యముచే సంసారము గడుపలేక 'దారిద్ర్యాంధకార మగ్నులమగు మమ్ము నుద్ధరింపుము హరికృపాకటాక్ష రవిదీప్తిచే' నని ధర్మపత్నిచే ప్రార్థితుడై జీర్ణవస్త్రము కొంగున పృథుకముల మూటగట్టి హరిని దర్శించిన సుదాముడును, జ్ఞానిత్వమునకు బ్రహ్మాత్మల కభేద భావము దెలిసిన వశిష్ఠవామ దేవాదులును నుదాహరణము లగుచున్నారు. ఈ నల్వుర భక్తులలో ఆర్త - అర్థార్థులు కేవల - ఐహిక ప్రయోజన తత్పరతచే నధమ భక్తులుగను, ధర్మ జిజ్ఞాసువు మధ్యమ భక్తునిగను, జ్ఞాని ఉత్తమభక్తుడుగను ఎన్నబడుదురు. కావుననే భగవాను డర్జునునితో నిట్లనెను.

'తేషాం జ్ఞానీ నిత్యయుక్తః ఏకభక్తిర్విశిష్యతే'
'ఉదారా స్సర్వ ఏవైతే జ్ఞానీత్వాత్మైవ మేమతమ్"
(భ. గీ. 7-17,18)

ఆ నల్వురలో జ్ఞాని ఎల్లప్పుడు నాతోడనే గూడి, నా యందే భక్తిగలవాడు. ఈ నల్వు రుత్తములే యైనను, జ్ఞాని నా స్వరూపుడే.

దీనిని బట్టి యుత్తమ భక్తియన పరమేశ్వరుడే తన యాత్మస్వరూపుడు-అను నిరూఢమగు భావనయని తెలియుచున్నది. ఇట్టిభక్తినే ఔపనిషద పరిభాషలో 'జ్ఞానము - అద్వైత జ్ఞానమ'ని యందురు.

"హరిరాత్మైవ తద్జ్ఞానం భక్తిరిత్యభిధీయతే" (హరికథా)

అని చెప్పిన (శ్రీ) దాసుగారు కూడ హరియాత్మస్వరూపుడే అను జ్ఞానమే భక్తియని తెల్పి అద్వైతజ్ఞానమునే భక్తిగా చెప్పినట్లు సుస్పష్టము. సమనంతరమున చెప్పబడిన-

"జీవన్ముక్తో హరేర్భక్తః కర్మణా నవిలిప్యతే" (హరికథా)

అను వాక్యము పై అభిప్రాయమునే రూఢపరచుచున్నది. "నైనం కృతాకృతే తపతః" (బృ. 4-4-22) అను శ్రుతి వాక్యముచే అద్వైతజ్ఞానియే కర్మలేపనములేని జీవన్ముక్తుడని చెప్పుచున్నదిగదా !

మరియు పైని దెల్పిన మధ్యమాధమ భక్తులుగూడ ఫలాపేక్షా-రహితములై జ్ఞానమును గల్గించి తద్ద్వారా మోక్షసాధకములగుచున్నవని (శ్రీ) దాసుగారు-

"జ్ఞానేన మోక్షమాప్నోతి, భక్తిః జ్ఞానాయ కల్పతే,
కృష్ణప్రసాదాత్ భక్తిః స్యాత్ తస్మాత్ సేవ్యో హరిస్సదా"
(హరికథా)

అని చెప్పిరి. కావున ఈ మధ్యమాధమ భక్తులు మోక్షమునకు సాక్షాత్సాధనములుగాక పరంపరా సాధనములగుచున్నవని గ్రహింపవలయును. ఇట్టి భక్తియు భగవదనుగ్రహమున గల్గును గావున భగవత్సేవ సంతతము చేయవలయునని వారి యుపదేశము. ఇట్టి యాశయముతోడనే వారు-

"హరిభక్తి నౌకయైవ ప్రకటిత సంసార సాగరం తరతి ।
ఇతరేణ కర్మణాఽఽజ్యేనేవ నరః ప్రజ్వలయతి భవవహ్నిమ్"
(హరికథా)

అని చెప్పిరి. సంసార సాగరమును తరింప జేయునది హరిభక్తి నౌకయే గాని కర్మము కాదు. కర్మము ఆజ్యమువంటిది. అది సంసారాగ్నిని మరింత ప్రజ్వలింప జేయునేగాని చల్లార్పదు. కర్మమాచరించి తత్ఫలానుభవము

కోలుకు జన్మించుట, జన్మించినవాడు కర్మమును మఱల నాచరించుట యను నీ విధమున కర్మము సంసారమును అభివృద్ధి చేయునని భావము. లోకములో సాధారణముగ కర్మాచరణము కోరికతో గూడినదే యగు టయు, కోరిక తీరినను మఱల హెచ్చుకోరికలకై కర్మము నాచరించు టయు నగపడుచుండుటచే కామ మువభోగముచే శాంతింపదనునది సర్వజనానుభవ సిద్ధమగు విషయము. దీనినే పెద్దలు—

"న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభి వర్ధతే''

కామముపభోగముచే ఎన్నడును శాంతింపక అగ్ని హవిస్సుచే వృద్ధి పొందునట్లు వృద్ధి పొందును అని చెప్పిరి. దీనినే దాసుగారు-

''ఇతరేణ కర్మణాఽఽజ్యేనేవ నరః ప్రజ్వలయతి భావవహ్నిమ్"
అని చెప్పిరి. నిరపేక్షతో పరమేశ్వరార్పణ బుద్ధిమై కర్మనాచరించుట ఎవరికోగాని వలనుపడదు. కావున భక్తియే భవతారకమని వారిభావము.

''జపహోమ వ్రతైర్దానైః తపసా నహి శక్యతే।
జ్ఞాతుం త్వదీయ మాహాత్మ్యం భక్త్యైవ పరమేశ్వర" (హరికథా)

జపహోమ వ్రతాదులచే దెలియశక్యముగాని భగవన్మాహాత్మ్యము భక్తి చేతనే దెలియబడును. ఈ యభిప్రాయమునే వారు.

"అరయంగా సకల శ్రుతిస్మృతి పురాణాద్యర్థ సారంబు ప-
ల్మరు నాశక్తికొలంది చూచి తుదకిమ్మై రూఢిఁ గైకొంటి సం-
సరణాంభోధిఁ దరింపఁజేయుటకు యుష్మద్భక్తి దక్కన్య మీ-
నరలోకంబున లేదుపాయమురయన్నా సూర్యనారాయణా"
(సూ. శత)

రూఢముగ నగపఱచిరి.

హరిదాసుడు

"సాత్త్వికాహార నిరతః సర్వభూత దయాపరః ।
సంసారవిముఖో యోగీ హరిదాస ఇతిస్మృతః" (హంకథా)

సాత్త్వికాహారాసక్తుడు సర్వభూతదయాళువు వైరాగ్యయుక్తుడునగు యోగియే హరిదాసుడని హరిదాస లక్షణమును దాసుగారు నిర్వచించిరి. తా భుజించు నాహారమే తన మనస్సునకు కారణమగుటచే శుద్ధ-చిత్తమునకు సాత్త్వికాహారము ఆవశ్యకము.

మఱియు హరిదాస బుభూషువులకు వారి యుపదేశము :-

"దీనాయ విత్తం సందేహి గానలోలభక్త మవేహి ।
ధ్యానాకర్ణన కథనోల్లాసః త్వరయా భవ నారాయణదాసః
జ్ఞానినో మావ మంస్థాః, సతతం పరముపచర స్వస్థః ।
హీన మనోరథాన్ మా కృథాః శ్రీనాథాన్యం మా బ్రూథాః"(హరికథా)

"దీనులకు విత్తమునిమ్ము, గానలోల భక్తుని దెలియుము. పరమేశ్వర-ధ్యానాకర్ణన కథనోల్లాసుడవై త్వరగా నారాయణదాసుడవు కమ్ము. జ్ఞానులను పరిభవింపకుము. నిశ్చలహృదయముతో నుత్తముని సేవింపుము. తుచ్ఛవాంఛలను దరి జేరనీయకుము. భగవదితరుని స్తుతింపకుము." గానలోలురై సామాన్యజనుల హృదయములందు ములుకులై నాటు పలుకులుగల హరిదాసుల కీ యుపదేశ మెంతేని యావశ్యకము. కావుననే శ్రీహరి యనుగ్రహ పాత్రుఁడగు హరిదాసుని స్వరూపమిట్లు దెల్పిరి:-

"అహింసా వ్రతః సత్యవాక్ దీనబంధుః,
పరస్త్రీ పరద్రవ్య కాంక్షా విహీనః
స్వవర్ణాచారవాన్ దానశౌండః
ప్రియస్తే సఏవ ప్రభో రామచంద్ర"(రామచంద్రశతకమ్)

ఇట్టివాఁడు దేనికై యితరులను స్తుతించును. జ్ఞానుల నెట్లు పరాభవించును. ఇది ఎంతయో యుత్తమమగు యోగ్యత!

పరమేశ్వర మాహాత్మ్యమును దెలిసికొన నుత్సుకుఁడగు భక్తుఁడు సతతము భగవత్స్వరూపమును దెలిసికొనుచు, లీలలను వినుచు వినిన వానిని దెలిసికొనిన వానిని మననము చేసికొనుచు మననము చేసికొన్న వానిని నిది-ధ్యాసనము గావించుకొనుచు ధ్యానాకర్ణన కథనోల్లాసుఁడై యుండుననియు, ఉండవలయుననియు శ్రుతి యనుగ్రహముతో నిట్లు బోధించినది —

"అరే శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" (బృ 4-4-5) శ్రుతిచే నుపదేశింపబడిన విశ్వ విధాతృ విషయక వాక్యములనే దాసు గారు స్వమనీషా మూషాసిక్తములుగజేసి మనోహర కావ్యశిల్ప రూపమున సంతరించిరి.

తత్త్వజ్ఞత

సృష్టికర్తయగు పరమేశ్వరుఁడు తానేకైకరూపుఁడయ్యును సంకల్ప మాత్రము చేతనే ఈ యనంత భేదములతో వెలయు విశ్వమును సృజించి అందుఁ దాను జీవరూపమున ప్రవేశించెనని శ్రుతి ఇట్లు చెప్పుచున్నది—

"సోఽకామయత, బహుస్యాం ప్రజాయే యేతి — తత్సృష్ట్వాత దేవాను ప్రావిశత్" (తై. 2-6)

ఆ పరమేశ్వరుఁడు తాను బహురూపములతో జన్మింతునని ఈ జగమును సృజించి యందు తానే జీవరూపమున ప్రవేశించెను. ఈ విషయమును దాసుగారు ఇట్లు వివరించిరి—

"బహుస్యామితి ప్రేక్షణేనైవ విశ్వం
వినిర్మాయ మాయా మయం త్వయ్యనంతమ్
సదా క్రీడసే నిర్గుణోఽపి స్వభావాత్
అచింత్య ప్రభావ ప్రభో రామచంద్ర (రా. శ)

బహుభావమును పొందెదననుసంకల్ప మాత్రము చేతనే మాయామయ మగు జగమును నీయందే సృజించికొని స్వభావముచే నిర్గుణుడయ్యు అందు క్రీడించుచున్నావు.

"యస్య సంకల్ప మాత్రేణ లోకసృష్టిస్థితివ్యయాః" (హరికథా) సంకల్ప మాత్రముచేతనే విశ్వ సృష్టిస్థితిలయములు గల్గుచున్నవి. ఏకైక రూపమగు పరమేశుడు నానాభేద భిన్నమగు జగమునకు కారణమగుట ఎట్లు సంభవించుననుదానికి సమాధానము నిట్లు చెప్పిరి—

"ఏకత్వ సంఖ్యా ప్రతిపాదకోఽంకః
నిరంతరం బోధయతే బహుత్వమ్ ।
బింద్వన్వితః, సుష్ఠు యథాస్వభావ-
యుత స్త్వ మేకోఽపి తథాఽసి దేవ" (తారక)

"ఏకత్వమును బోధించు సంఖ్య బిందువుతో గూడినచో బహుత్వమును బోధించునట్లు నీవును మాయాశక్తితో గూడి బహు భావము నందు చున్నావు." తాంత్రిక సంకేతమున బిందువు మాయాబోధకము. 'బింద్వన్వితః' అనగా మాయావి యని యర్థము. కాంగా నీ శ్లోకము—

"మాయాంతు ప్రకృతిం వింద్యాన్మాయినంతు మహేశ్వరం" అను శ్వేతాశ్వతరశ్రుతిని స్మరించుచున్నది. వీరు ఔపనిషదమగు సృష్టి ప్రక్రియనే మఱియు నిట్లు పేర్కొనిరి.

"అలరెడు జ్ఞాన సత్యానంద లక్షణ-
ముల బ్రహ్మ సత్యనాముఁడవు నీవు
భవదీయ సంకల్ప వశమున లోక మం
తయుఁ బుట్టుఁ బెర్గెడున్ లయముఁజెందు
ద్రష్టృ దృక్ దృశ్యత్రితయ రూపుఁడవు సాధ-
నము లేక కార్యముల్ నడిపెదీవు" (యథార్థ)

"త్రిగుణ తత్త్వంబులన్ గ్రీడించెదవు నీకు
నీవె వేత్తౌచునో దేవదేవ।
కనెదవు స్వప్న జాగ్రత్సుషుప్తుల విశ్వ
తైజస ప్రాజ్ఞ భేదముల నీవు
బీజదీపంబులు వృక్షకాంతులకట్టు
లీవౌదు కారణం బిజ్జగతికి" (యథార్థ)

తైత్తిరీయ శ్రుతి జగత్కారణమగు బ్రహ్మస్వరూపమును "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అని పేర్కొని, ఆ బ్రహ్మమే సోఽకామయత బహు స్యాం ప్రజాయేయ, అని సంకల్పించి సృష్టిని గావించెననియు

యతోవా ఇమాని భూతాని జాయన్తే యేన జాతాని
జీవంతి యత్ప్రయన్త్యభి సంవిశన్తి, తద్బ్రహ్మ"

అని సృష్టమైన ప్రపంచము బ్రహ్మము చేతనే స్థితినిగాంచి మఱల బ్రహ్మమునందే లయమును గాంచుననియు దెలుపుచున్నది. ఈ విషయమునే దాసుగారు పైని అగపఱచిన తీరున దెలిపి కర్తృక్రియా కార్యరూప త్రిపుటితో నొప్పు జగము నీవేయనియు, నీకునీవే వేత్తౌచున్నావనియు నొక విశేషమును దెల్పిరి. మఱియు జాగ్రదవస్థయందు స్థూల ప్రపంచము ననుభవించుచు 'విశ్వు' డను (వైశ్వానర) పేరునందిన వాడును, స్వప్నావస్థయందు వాసనారూపమగు ప్రపంచము ననుభవించుచు 'తైజసుఁడ'ను పేరునందినవాడును, సుషుప్తావస్థయందు ప్రపంచ సంబంధమునువీడి కేవలానందమును మాత్ర మనుభవించుచు 'ప్రాజ్ఞుడ'ను పేరునందిన వాడును అగు జీవుఁడు గూడ నీవేయను విశేషమును ఇందు కనెదవు. జాగ్రత్స్వప్న సుషుప్తుల విశ్వతైజస ప్రాజ్ఞ భేదముల నీవు" అను వాక్యముచే దెల్పిరి. ఈ వాక్యము

"జాగరిత స్థానః...స్థూలభుగ్వైశ్వానరః ప్రథమః పాదః, స్వప్నస్థానః... ప్రవివిక్తభుక్ తైజసః ద్వితీయః పాదః, సుషుప్త స్థానః... ఆనందభుక్...ప్రాజ్ఞః తృతీయః పాదః" (మాండూక్య)

అను శ్రుతికి ప్రతిబింబము.

లోకములో ఒక మాయావిచే సృజింపబడిన మాయా ప్రపంచము కొలదికాలము మాత్రము అగపడి యనన్తరము మాయావి యందే లీనమగును. అపుడు మాయావి మాత్రమే యుండునుగాని మాయ యుండదు. కావున మాయచే సృజింపబడినదానికి వాస్తవికస్థితి యుండదు. మాయావికే యుండును. అట్లే మానసిక సంస్కారములచే మనస్సునుండి బయల్వెడలిన స్వాప్నిక ప్రపంచము అనుభవ సమయమున సత్యమువలెనే భాసించి కొద్దిసేపు ఉండి తదుపరి మనస్సునందే లీనమయి మేలుకువ గల్గిన వెనుక కల్లయని తెలియును ఈ విషయమునే దాసుగారు ఇట్లు చెప్పిరి—

'యతో జాయతే యత్, తతో లీయతే తత్
యథా మానస వ్యోమతః స్వప్న విశ్వమ్।
మృషైతత్ జగత్, భ్రాన్తిజన్యం సమస్తం,
భవానేవ సత్యం ప్రభో రామచంద్ర" (రా. ౪)

'స్వప్నమునందు మనస్సునందు బుట్టిన యీ స్వాప్నిక జగత్తు మరల మానసమునందే లీనమగుచు కల్లయైనట్లు నీ నుండి పుట్టిన యీ విశ్వమంతయు నీయందే లయము నొందుచు కల్లయగుచున్నది. నీవు మాత్రమే సత్యస్వరూపుడవు! జగత్తునకు పరమేశ్వర మాయయే కారణమని మాయాలక్షణ పురస్సరముగాని యిట్లు చెప్పిరి—

''దృశ్యాపి అదృశ్యా సదసత్స్వరూపా
త్వదీయ మాయా భ్రమకారణం హి।
దిగంతరేఖావత్ అతీంద్రియం తే
తత్త్వం జగన్నాటక సూత్రధార'' (తారక)

పైకి అగపడుచున్నను వాస్తవముగా లేకపోవుటయే మాయాలక్షణము. దానినే, స్థూలదృష్టికి సత్తుగా అగపడినను యథార్థమునకు అసత్తు అగునని 'సదసత్స్వరూపమ'ని పెద్దలు నిర్వచించిరి. ఉదాహరణము దిగంత

రేఖ, భూమ్యాకాశసంధి ఒకరేఖవలె యగపడినను వస్తుస్థితిచే అది రేఖ కాదుగదా! ఆత్మయందు కల్గు జగద్భ్రాన్తికి పారమేశ్వర మాయయే కారణమని భావము.

ప్రత్యక్షప్రమాణముచేగాని అనుమానప్రమాణముచేగాని తెలియబడని వస్తువును దెలిసికొనుటకు ఆప్తవచనము ప్రమాణమని పెద్దల నిర్ణయము. విశ్వజనీనమగు నాప్తవచనము వేదము. కావున వేదవాక్యము అందఱకును ప్రమాణమే. అట్టివేదము ఆత్మయందీ ప్రపంచము అధ్యస్తమైనట్లు (భ్రాంతిచే కల్పింపబడినట్లు) తెల్పుచున్నది—

ఆత్మావా ఇదమేక ఏ వాగ్ర ఆసీత్ । నాన్యత్కించన మిషత్ ।
స ఈక్షత లోకాన్ను సృజా ఇతి । స ఇమాన్ లోకానసృజత'' (ఐతరేయ)

ఏనాడు జనుడు శాస్త్రజ్ఞాన గురూపదేశములచే ఆత్మయొక్క వాస్తవజ్ఞానమును పొందునో అప్పుడీ అధ్యస్తమగు జగము తొలగిపోవును. అద్వితీయమగు నాత్మమాత్రము భాసించును. మందాంధకారమునందు రజ్జువునందు గల్గిన సర్పభ్రాంతి దీపాదిసహాకారముచే తొలగి వాస్తవరజ్జుజ్ఞానము కల్గునుగదా! దీనినే దాసుగారు ఇట్లు తెల్పిరి.

"సర్వః ప్రపంచః త్వయి కల్పితో హ స్థాణౌ భవేద్దస్యురివ భ్రమేణ"
(తారక)

భ్రాంతిచే ఱాతియందు దొంగ కల్పింపబడినట్లు అనగా దొంగ యను జ్ఞానము కల్గినట్లు, నీయందు ఈ విశ్వము కల్పింపబడినది. దీనినే పెద్దలు అధ్యాసమని యందురు. అధ్యాసమనగా-అదికాని దానియందు అదియను బుద్ధి, ఈజగదధ్యాసమును (శ్రీ) దాసుగారు విపులముగ వివరించిరి.

నభో నైల్యవత్, రూప్యవత్ శుక్తికాయాం
త్వయీదం జగత్ సర్వమధ్యస్తమేవ ।
అసంగో భవాన్ సచ్చిదానంద మూర్తిః
త్వయా పాలనీయాః ప్రభో రామచంద్ర" (రామచంద్ర)

అవకాశరూపమై వర్ణశూన్యమగు గగనమునందు నీలిమ నారోపించి 'నీలాకాశ' మని వ్యవహరించినట్లును, ముత్యపుచిప్పయందు వెండిని ఆరోపించినట్లును అసంగసచ్చిదానందరూపుడవగు నీయందు అనంతభేదముతో నొప్పు ప్రపంచము అధ్యాసచే కల్పింపబడినది. కావున ప్రపంచము మిథ్యారూపము భగవంతుడు సత్యస్వరూపుడు అని భావము.

ప్రపంచమునకు భగవంతునికిని గల సంబంధమును భంగ్యంతరముగాగూడ (శ్రీ) దాసుగారు అగపఱచిరి—

"తరంగోఽస్తి వార్ధౌ, న వార్ధిస్తరంగే
తథా విశ్వమస్తి త్వయి, త్వం న విశ్వే ।
త్వమేవ ప్రమాణ ప్రమేయ స్వరూపః
కథం విద్మహే త్వాం ప్రభో రామచంద్ర. (రా. శ)

తరంగమనునది మహాసముద్రమున లేశమాత్రము. కావున సముద్రమున తరంగముండునుగాని తరంగమున సముద్రముండదు. అట్లే అనంతస్వరూపుడవగు నీయందు స్వల్పమగు నీ విశ్వముండునుగాని ఈ విశ్వమునందు నీవుండవు. అనగా ఈ విశ్వమునకు పరమేశ్వరు డాధారమనుట. దీనినే శ్రుతి—

"పాదోఽస్య సర్వా భూతాని, త్రిపాత్ అస్య అమృతందివి"
(తైత్తిరీయ)

అని చెప్పినది. మహాసముద్రమునందు పవనునిచే అల కల్పింపబడినట్లు నీయందు మాయచే విశ్వము కల్పింపబడినదని యన్తరంగము.

తాను జగమును సృష్టించి ఆ జగమునందు తానే జీవరూపమున ప్రవేశించి ఈ సాంసారికములగు నానాయాతనల నందుటవలన తనకేమి ప్రయోజనము గల్గునని యాశంకించుకొని యిట్లు సమాధానము చెప్పుచున్నారు—

"లేనిదున్న యట్లు లీలకై తలపోని
పురుషుఁడందు బంధమోక్షములను" (యథార్థ)

మాయామయమగు జగమును సృజించి యందు బంధమోక్షము లను దానందుట యాతని కొక విలాసము. ఈ యభిప్రాయమునే శ్రీ వేదవ్యాస భగవానుడు – "లోకవత్తు లీలాకైవల్యమ్" (బ్రహ్మ సూత్ర. 2-1-33) అని సూత్రించినాడు. ఆప్తకాముడగు పరమేశ్వరునికి గూడ ఎట్టి ప్రయోజనము నక్కఱలేకయే కేవల లీలారూపమగు ప్రవృత్తి గల్గునని భావము. ఈలీల యెంతవఱకనఁగా ఇట్లు చెప్పిరి—

"విద్య యబ్బువఱకు విను చిదాభాసుఁడౌ
జీవుఁడు భవమందుఁ జిక్కువడును." (యథార్థ)

స్థాణువునందు కల్పితుడగు చోరుని గాంచినవానికిని, త్రాటి యందు కల్పిపబడిన సర్పమునుగాంచిన వానికిని చోరసర్పభ్రాంతిచే సుఖము గలుగదు. వాని వాస్తవ స్వరూపములగు స్థాణు రజ్జువులను దెలిసినపుడు మాత్రమే మనుజునికి స్వస్థత చేకూఱుచున్నది. అట్లే పరమే శ్వరునియందు కల్పింపబడిన విశ్వము సత్యమే యనుభ్రాంతి గల పురుషు నికి వాస్తవమగు సుఖము గలుగక, విశ్వాధారమగు పురుషుని సత్యస్వ రూపునిగా దెలిసికొన్నప్పుడే యథార్థసుఖము గల్గునని (శ్రీ) దాసుగారి భావన. దీనినే శ్రుతి—

ఏకో వశీ సర్వ భూతాన్తరాత్మా
ఏకం రూపం బహుధా యః కరోతి।
తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరాః
తేషాం సుఖం శాశ్వతం నేతరేషాం" (కఠ)

అని తెల్పినది. ఏ పరమేశ్వరుడు సర్వభూతాన్తరాత్ముడై యేకైకమగు తనరూపమునే బహుధా చేయుచున్నాడో, అట్టి తనలో నున్న పరమే శ్వరుని గాంచువానికే శాశ్వత సుఖముగాని యితరులకు లేదు.

ఛాందోగ్యశ్రుతి ఘటమునకు కారణమగు మట్టియే సత్యముగాని ఘటము సత్యముగాదు. అది అనృతము అని చెప్పి కారణసత్యత్వమును కార్యానృతత్వమును నిరూపించినది—

"వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవసత్యం"
(ఛాం. 6-1-4)

కార్యభూతములగు ఘటాది మృద్వికారములు అనృతములయ్యును వాని యందు తత్త్వవేత్త సత్యమగు మృద్రూపమునే గాంచును. అట్లే కారణ రూపమగు బ్రహ్మమునందు కల్పింపబడిన విశ్వపదార్థములనృతము లయ్యును వానియందన్నింటను తత్త్వవేత్త బ్రహ్మరూపమునే గనును. ఈ విషయమునే గీతాచార్యుడు అర్జునునకు తెల్పెను—

"విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని।
శుని చైవ శ్వపాకేచ పండితాః సమదర్శినః॥ (భ. గీ 5-19)

పండితాః=జ్ఞానులు 'సమదర్శి' యనగా బ్రహ్మమును గాంచువాడు. సమ శబ్దమునకు బ్రహ్మము అర్థమని సమన స్త్రీరగీతమున దెల్పబడినది. "నిర్దోషం హి సమంబ్రహ్మ" ఈ విషయమునే ఈ దిగువ శ్రుతులు దృఢపఱచు చున్నవి—

"సర్వం ఖల్విదం బ్రహ్మ" (ఛాం. 3-14-1) "ఇదం సర్వం యదయమాత్మా" (బృ. 2-4-6) "పురుష ఏ వేదం సర్వం" (ముండక 2-1-10)

ఈ యభిప్రాయమును శ్రీ దాసుగారు ఎంతరమ్యముగా నిరూపించిరో కనుడు—

"హరిరేవ జగత్, జ దేవ హరిః
హరితో జగతో నహి భిన్నతనుః।
ఇతి యస్యమతిః పరమార్థగతిః
సనరోభవ సాగరముత్తరతి॥ (హరికథా)

హరియే జగము, జగమే హరి, హరిజగములకు వేర్పాటులేదు అను పరమార్థదృష్టిగలవాడే ఈసంసారాపారమును తరింపగలడు. అట్లే మఱియొకటి —

"మృదఃకుంభో యథాఽభిన్నః తథైవ హరితోజగత్ ।
ఇతి మత్వా వీతరాగద్వేషో భవతి భక్తిమాన్ ॥ (హరికథా)

మట్టికంటె కుండ వేఱుకానట్లు హరికంటె విశ్వము వేఱుకాదని తత్త్వవేత్త తలఁచి రాగద్వేషములు లేనివాడగును.

"జలేవిష్ణుః స్థలేవిష్ణుః విష్ణుః స్థావరజంగమాః ।
అన్తర్విష్ణుః బహిర్విష్ణుః సర్వం విష్ణుమయం జగత్" (హరికథా)

దీనికే శ్రీదాసుగారి యనుభవపూర్వక శాస్త్రీయ ప్రతిపాదనము —

"ముహుర్వేదశాస్త్ర ప్రభేదానశేషాన్
మదీయానుభూతిం సమంతాత్ విచార్య ।
దృఢం నిశ్చినోమి ప్రమాణం ప్రమేయం
ప్రమాతా త్వమేవేత్యహం రామచంద్ర" (రా. శ.)

ప్రమేయం = తెలిసికోదగినది, ప్రమాతా = తెలిసికొనువాడు, ప్రమాణం = తెలిసికొనుటకు సాధనము. ప్రపంచమంతయు ఈ త్రిక రూపమునందే యున్నది. అది యంతయు పరమేశ్వరుడేయని వారి దృఢ నిశ్చయము.

ఇట నొకవిషయమును గ్రహింపవలయును. లోకములో ఒక కార్యమునకు రెండు కారణములుండును. అందొకటి ఉపాదానకారణము, అనఁగా దేనితో ఆకార్యము చేయబడునో అది. ఘటమునకు మట్టి ఉపాదానకారణము. రెండవది నిమిత్తకారణము అనగా ఎవడు ఆకార్యమును చేయునోవాడు. అనగా కర్త-ఘటమునకు కుమ్మరి నిమిత్త కారణము. ఈరెండు కారణములును జగద్గతకార్యముల విషయమున మాత్రము పరమేశ్వరు డొక్కడే నిమిత్తోపాదానకారణములు రెండు

నగుచున్నాడు. దీనికి దృష్టాంతరము ఊర్ణనాభి (సాలీడు). తాను సృజించు 'వట్టు' నకు తానే నిమిత్తోపాదాన మగుచున్నది. ఈదృష్టాంత రము పరమేశ్వరునికి లీలామాత్రముగానే యువపన్నమగునుగాని 'సర్వాత్మనా' మాత్రము పొందుపడదు.

ఇంతవఱకు దాసుగారు శ్రుత్యనుసారముగా దెల్పిన జగన్మృషాత్వ, పరమేశ్వర సత్యత్వములను తమసహజమగు చమత్కృతితో నిట్లు రూఢ పఱచిరి —

"జగమంతయు నజ్ఞానికి సత్యముగాఁ దోఁచు
పగలంతయు గుడ్లగూబకుఁ జీఁకటి కాలేదా.
పలుకు హుళిక్కియని జగము ప్రాజ్ఞుండగువాఁడు,
బళిర మేలుకొన్న యతఁడు స్వప్న మబద్ధం బనఁడా,
ఆకాశము వలె నిత్యంబవిక్రియం బాత్మ
కైకొను బహురూపంబులఁ గలఁగను మదివలె నిజము"

(యథార్థ)

జగత్ తత్కారణముల గూర్చి (శ్రీ) దాసుగారి భావములను మనము దెలిసికొంటిమి. ఇక వారు దెల్పిన జీవతత్త్వమును సూచనా ప్రాయముగ పూర్వము దెలిసికొన్నను దానిని గూర్చి గూడ మనము పూర్ణముగ తెలిసికొన్నచో అప్పటికి వారి సమగ్రహృదయము మనలకు తేటతెల్లమగును. కావున దానిని గూర్చి విచారింతము.

భక్తి స్వరూప నిరూపణ ప్రసంగమున (శ్రీ) దాసుగారు

"హరిరాత్మైవ తద్జ్ఞానం భక్తిరిత్యభిధీయతే।
జీవన్ముక్తో హరేర్భక్తః కర్మణా నవిలిప్యతే" (హరికథా)

అని వచించిరి.

పరమేశ్వరుడు ఆత్మస్వరూపుడే యని శ్రుతి యుక్తి అనుభవములచే ధ్యానించి మననము చేయుటయే భక్తియని దెల్పి అట్టి ధ్యాన

ముచే నిరూఢమగు ననుభూతి గలవాడు జీవన్ముక్తుడని తెల్పిరి. అట్టి వానికి పుణ్యపాపరూపకర్మములు అంటవు అని దీని భావము.

కర్మఫలముగా ఉత్పన్నమయి కర్మఫలానుభవమునకు సాధనముగా నొప్పు నీ దేహమును ఉపాధిగా గొని జీవుడు కర్మఫలముల ననుభవించుచున్నాడు. శరీరసంబంధమును జీవుడు భావించినంతకాలము జీవునకు కర్మానుభవము తప్పదు. ఏనాడు శాస్త్రదృష్టి గురూపదేశములచే దేహము మృషారూపమనియు, జీవుడు (తాను) అసంగ చిద్రూపుడనియు వాస్తవమగు జ్ఞానము పొందునో ఆనాడు అతడు ప్రాణధారణము చేయుచునే (బ్రతికియుండగనే) కర్మమునుండి విముక్తుడగును. అట్టి యాతడే జీవన్ముక్తుడు. ఆతనిదృష్టిలో తనకు దేహమే లేకపోవుటచే దేహమునకు సంబంధించిన కర్మము లేనేలేదని తాత్పర్యము. దీనినే దాసుగారు "కర్మణా నవి లిప్యతే" అని చెప్పిరి. జీవుడసంగ చిద్రూపుడగుటకు హేతువునే 'హరిరాత్మైవ' అను వాక్యముచే దెలిపిరి. అసంగ చిద్రూపుడగు పరమేశ్వరుడే యాత్మస్వరూపుడగుటచే జీవుని యథార్థరూపము అసంగ చిద్రూపమనియు, జీవత్వము శరీరోపాధి కల్పితమనియు ఫలించినది. కావున జీవుని యథార్థ రూపము శ్రీహరి రూపమే. ఈ యభిప్రాయమునే వారు ఇట్లు పేర్కొనిరి—

"బ్రహ్మైవ భవతి బ్రహ్మవిదితి శ్రుతిరబ్రవీత్ ।
నారాయణం విజానీహి సఏవత్వమసిధ్రువమ్" (హరికథా)

"సయోహవై తత్పరమం బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి"
(ముండక 3-2-9)

అను శ్రుతి జగత్కారణమగు ఆబ్రహ్మస్వరూపమును దెలిసినవాడు దానును బ్రహ్మమే యగును అని పలికినది. కావున నారాయణ స్వరూపమును దెలిసికొనుము. నిశ్చయముగా ఆనారాయణుడవే నీవు.

ఇందలి 'సఏవత్వమసిధ్రువం' అనువాక్యము ఛాందోగ్యశ్రుతి యందలి —

"ఐతదాత్మ్యమిదంసర్వం, తత్సత్యం, సఆత్మా, తత్త్వమసి
శ్వేతకేతో" (ఛాం. 6-13-3)

అను వాక్యతాత్పర్యమును దెలుపుచున్నది. ఓ శ్వేతకేతూ, ఈవిశ్వమంతయు కారణరూపమగు సదాత్మకమే. అసత్తే (బ్రహ్మము) సత్యము. (కార్యమగు విశ్వము అసత్యమనుట) అదియే ఆత్మ. ఆ యాత్మయే నీవు అని శ్రుతి వాక్యార్థము.

సజాతీయాది భేదరహితుఁడగు (శ్రీ)హరియే నీవని జీవునకు బోధించినపుడు జీవుడు (శ్రీ)హరియే యని గ్రహింపవలయును. కాగా సర్వవ్యాపకుడగు పరమేశ్వరునికి దనకంటె నితరవస్తువు లేకపోవుటచే రాగద్వేషాదులు పొందుటకెట్లు అవకాశము లేదో యట్లే జీవునికి గూడ రాగద్వేషాదులు లేకుండవలయును. కాని మనము జీవునియందు రాగ ద్వేషములను గాంచుచున్నామే, ఇది యెట్లుపపన్నమగునను సందేహమునకు దాసుగారి సమాధానము —

"స్వ చ్ఛాయాం దర్పణే పశ్యన్ యుధ్యతే చటకో యథా ।
మాయాయాం స్వం వీక్షమాణః తథా మూఢో విముహ్యతి ॥
(హరికథా)

తనకంటె వేఱొకపిచ్చుక లేకపోయినను ఆభాసరూపోత్పాదన సమర్థమగు దర్పణమునందగపడు స్వప్రతిబింబమునే వేఱొక పిచ్చుకయని దలంచి స్వప్రతిబింబముతో పోరు పిచ్చుకవలెనే జీవుడుగూడ ఆభాసరూపోత్పాదన సమర్థమగు త్రిగుణాత్మక ప్రకృతియందు (మాయయందు) ప్రతిబింబించి యనేక రూపములతో నొప్పు స్వస్వరూపమునేగాంచి యితరులను భ్రాంతితో రాగద్వేషముల నందుచున్నాడు.

ఇట్లు అవివేకి భ్రాంతి నొందుచుండగా వివేకి—

"నాత్మనోఽన్యత్ కించిదపి వస్త్వస్తి పరమార్థతః ।
బుద్ధ్వా బుద్ధ్వేతి సతతం 'పండితో నాను శోచతి" (హరికథా)

యథార్థ స్థితిని దెలిసిన విద్వాంసుడు తన కంటె నితరమగు వస్తు వుండుటకు అవకాశము లేదని తలచి తలచి రాగద్వేష కృతమగు శోకమును పొందడు.

'యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవాభూద్విజానతః ।
తత్ర కో మోహః కః శోకః ఏకత్వ మనుపశ్యతః' (ఈశావాస్య)

అను మంత్రార్థమునే దాసుగారు పైన మనోహరముగ చిత్రించిరి. దాసుగారు ఇట్లు జ్ఞాన్యజ్ఞానుల యవస్థా విశేషములను చిత్రించి తుదకు జనుల కిట్లు హితోపదేశమును గఱపిరి-

"ఆత్మైవేదం సర్వమితి శాంతచిత్తో భవానిశమ్ ।
ఉత్సృజాలం శుష్కవేదాంతం పిబ కృష్ణకథామృతం" (హరికథా)

సర్వమును ఆత్మస్వరూపముగా నెఱిగి సర్వదా శాంతచిత్తుడవు కమ్ము. శుష్కవేదాంతములను కట్టిపెట్టుము. కృష్ణ కథామృతము నాస్వాదింపుము. దానివలననే జ్ఞానము కల్గునని భావము. ఈ యభిప్రాయమునే తమ యంబరీషచరితమున నిట్లు దెల్పిరి-

'జ్ఞానహీను లగువారికి భవసంకటములు మదినిండున్ ।
శ్రీ నారాయణదాసులకే సుస్థిరానందము మదినిండున్'

ఇంతవఱకు జరిగిన పరిశీలనముచే (శ్రీ) దాసుగారు అనంత వేదాంత వాక్యములచే తెలుపబడిన

"బ్రహ్మ సత్యం జగన్మిథ్యా, జీవో బ్రహ్మైవ నాపరః"

అనెడి తత్త్వమును సుస్పష్టముగ దెల్పినట్లు చెప్పవలయును.

ఇట్లు శాస్త్రీయ మార్గముననేగాక ఆలంకారికముగా గూడ వేదాంత తత్త్వము నెట్లు ప్రదర్శించిరో గాంచుడు-

"సగుణోఽపి నిర్గుణస్త్వం,
సుశ్యామల విగ్రహోఽశరీరోఽపి ।

కార్యమపి కారణ మభూః,
కృష్ణ త్వాం వేత్తి కః ? శివేన వినా''  (హరికథా)

ఇందు విరోధాభాసాలంకారము. సగుణ నిర్గుణములు, శ్యామల విగ్రహాశరీరములు, కార్యకారణములు పరస్పర విరుద్ధములు. ఇవి ఒకే పదార్థమగుట కవకాశములేదు. అయినను శ్రీకృష్ణుడట్టివాడే. సగుణత్వ-సుశ్యామలవిగ్రహత్వ-కార్యత్వములు మాయాకార్యములు, కావున అసత్యములు. నిర్గుణత్వాశరీరత్వ కారణత్వములు కారణగతములు, కావున సత్యములని భావము.

శ్రీకృష్ణ - జాంబవద్యుద్ధవర్ణనమున -

"లీలా మానుషరూపే పరమాత్మని కేశవే వృథైవాభూత్ ।
జాంబవతస్సామర్థ్యం జీవన్ముక్తే యథాభవౌద్ధత్యం" (హరికథా)

సంసారమునకు గల ఉద్ధతమగుశక్తి దేనికిని ఉండదు. కావున సంసారమునకు లొంగనివాడుండడనునది సర్వలోకానుభవసిద్ధమగు విషయము. ఇట్టి మహాశక్తి సంపన్నమగు సంసారముగూడ జీవన్ముక్తుని విషయమున కుంఠీభావము నందుచున్నది. అట్లే మహాపరాక్రమశాలియగు జాంబవంతునిశక్తి పరమాత్మయగు కేశవునియందు వ్యర్థమైనదట ! ఉపమాలంకారము. ఆవర్ణనమునందే వేఱొక యుపమ —

"దరితుం పాతయితుం సం —
చలయితు మయ తిష్ఠ బహువిధోపాయైః ।
కృష్ణం భల్లూకపతిః,
కింత్వాకాశ ఇవ హరిరభూ దచలః  (హరికథా)

ఋక్షపతి శ్రీకృష్ణుని చీల్చుటకు పడగొట్టుటకు పెడలగొట్టుటకు గూడ బహుధా యత్నించెను గాని శ్రీహరి యాకాశమువలె అచలుడే యయ్యెను.

అవకాశరూపము నిరవయవము అసంగము అగు ఆకాశమునందు చేయుక్రియ ఆకాశమున కెంతమాత్రము అంటదుగదా! అట్లే భల్లాతవతి ప్రయత్నములు ఆకాశశరీరుడగు శ్రీహరియందు వ్యర్థములు. "ఆకాశ శరీరంబ్రహ్మ" (శ్రుతి).

ఇట్టివి యెన్నియో గలవు. ప్రకరణోచితముగ నిట్టి యలంకార ములను, నరనరాలకు పట్టిన తత్త్వజ్ఞత కలవారుతప్ప వేఱొకరు చెప్ప లేరు.

వారి తత్త్వజ్ఞతకు ఇది సంగ్రహరూపము —

''వలయరేఖకుఁ బోలి వశమె తెల్పంగనీ -
కాది మధ్యాంతము లప్రమేయ
ఎల్లజగంబులకీవె యాధారంబు
లెక్కల కన్నింటి కొక్కటివలె
ధర్మము వైపె యెంతయు జోగుచుండువు
బరువు వంకన్ ద్రాసు ములు విధమున
పెరుగవు తరుగవు విభజింపఁబడవు శూ-
న్యాంకమువలె నకలంక చరిత

పిన్నకుం బిన్న పెద్దకుం బెద్ద వీవు
కొలత కందవు నిన్నెన్న నలవిగాదు
చెలఁగు పరిబేసియై నీవు తలఁచినంత
భక్తమందార భవదూర పరమపురుష. (యథార్థ)

పరమేశ్వర తత్త్వము శుద్ధచిత్తులకు దక్క వేఱొకరికి నెంత మాత్ర మవగతముకాదు. కావుననే లోకములో పలువిధములగు భావ ములు ప్రబలినవి; ప్రబలుచున్నవి. అట్టి పరిశుద్ధ మానస స్థితికి పరమే శ్వరానుగ్రహ సంపాదన క్షమము అగు భక్తితప్ప వేఱొండు కాదని వారి భావన —

"నీ కటాక్షములేక నిన్నుఁ దెలియనేర-
రెంత నేర్చినఁగాని యెవ్వరైన
నూహకందవు నీవొహో మాయకాఁడవ-
న్నియు నీవయయ్యు నెద్దియునుగావు.
ఇది యిట్లని నిశ్చయింపలే కెల్ల మ
తంబు లన్యోన్యమున్ దన్నుకొనెడు
నెట్లు నమ్మినవారి కట్లు దోఁచెదు భక్తి-
తప్ప నిన్గన వేఱుదారి లేదు" (యథార్థ)

మహావిద్వదవతంసుడు అద్వైతసిద్ధినందిన మధుసూదన సరస్వతీ యతీంద్రునివలె శ్రీ దాసుగారుకూడ జ్ఞానమునుగూడ భక్తి శబ్దముతో వ్యవహరించిన భక్త్యేక పరులు. వీరి భక్త్యభినివేశమును గనుడు–

"మమ స్వప్నదృష్ట్యాఽంతతో వ్యాసమౌనేః
మతం సత్య మద్వైతమేవేతి మన్యే
తథాపి త్వదీయాంఘ్రి భక్తి రుచిర్మే
యథా జానకీ తే ప్రభో రామచంద్ర" (రా. శ)

స్వాప్నాద్యనుభవముచేత వ్యాసగ్రంథ తాత్పర్య మన్నివిధముల నద్వైత మనియే నేను దృఢముగ నమ్మినను నీకు సీతయందువలె నాకు నీ పాద భక్తియందే అభిరుచియని రామచంద్రునితో చెప్పినారు. సర్వజ్ఞులగు మహానుభావులకు సైతమిట్లుండుట అగపడుచుండును–కావుననే సామాన్య భక్తి తత్త్వమునకు మూలభూతమగు శేషశేషి భావము అద్వైతతత్త్వమునకు విరుద్ధము కాదని యెట్లు వీరు నిరూపించిరో చూడుడు—

'అహం శీకర స్త్వం సముద్రః కరోఽహం
త్వమర్కోఽస్య, హంరేణు రద్రీశ్వర స్త్వమ్
అహం నశ్వర శ్శాశ్వత స్త్వం, మృషాఽహం
యథార్థస్త్వమేవ, ప్రభో రామచంద్ర''. (రా. శ)

ఇందు జీవ పరమేశ్వరుల యంశాంశిభావమును దెల్పి అత్యుదియు సత్యముగాదని 'అహం నశ్వరః త్వం శాశ్వతః, అహం మృషాత్వం యథార్థః" అనుమాటలచే అద్వైతమును బోధించిరి. వీరి భక్తితత్పరత గాంచినచో అద్వైతమూర్తియగు శ్రీ అప్పయ్యదీక్షిత విద్వన్మణి స్మృతిపథము నలంకరించు చున్నాడు. కాని

''మహేశ్వరేవా జగతా మధీశ్వరే
జనార్దనేవా జగదన్త రాత్మని ।
నవస్తు భేదప్రతిపత్తి రస్తి మే
తథాపి భక్తి స్తరుణేందు శేఖరే''

అని భర్తృహరి వక్కాణించినట్లు ఒక్కొక్కనికి ఒక్కొక్క భగవన్మూర్తిపై హెచ్చు మోజు. అట్లే దాసుగారికి భక్తిమార్గమునందాసక్తి మెండు. ఆ భక్తి శ్రుతి స్మృత్యవిరుద్ధమగు భక్తియే —

'సంధ్యావందన భద్రమస్తు భవతే, భోస్నాన తుభ్యం నమః॥

అని వారు తెలుపలేదు. వారి వాస్తవ హృదయము నిట్లావిష్కరించిరి— "అన్ని ప్రమాణములకు మేలాప్తవాక్యము (వేదము) పన్నుగ దానిని బట్టి వ్యవహరింతము.

'వర్ణాశ్రమాచార పద్ధతి విడువక
ప్రాజ్ఞులవలనఁ గర్తవ్య మెఱింగి
సర్వశ్రుతి స్మృతి సారముగొని శ్రద్ధ -
ధానుఁడై యేకాగ్రమానసుఁడయి
స్థిరబుద్ధియై యసందిగ్ధుఁడై యున్న యా -
తనికి సత్యము తనంత తెలియఁబడు
విశ్వంబు నన్బుట్టు వింతలకెల్ల గ -
తముఁ జెప్ప నెవరికిం దరము గాదు.

కొన్ని గుణములు నైజముల్ గొన్ని వస్తు -
వులకు దేవునకున్ ధర్మవు సహజంబు
ధర్మమె జగతికెల్ల నాధార, మద్ది
నీవు నిన్గావు సన్మునుల్ దేవుఁడనిరి. (యథార్థ)

ఇది వారు దెల్పిన సర్వవేదసారము, తత్త్వజ్ఞనుగు వారి హృదయము గూడ నిదియే. భగవానునే తను గురువుగా నమ్మినవారి ముఖకమల ములనుండి వినిస్సృతములగు అమృతవచనములేల వేఱుగానుండును ?

గురువు : "పితృభ్యాం యథాజాయతే మచ్ఛరీరం
తథా మత్ప్రబోధోఽభ్యుదేతి త్వదేవ ।
నకోఽపి త్వదన్యోఽస్తి తత్త్వోపదేష్టా
గురూణాం గురుస్త్వం ప్రభో రామచంద్ర" (రా. శ)

'తల్లిదండ్రులనుండి ఈశరీరము గల్గినట్లు నీనుండి నాకీ జ్ఞానము కల్గినది. రామచంద్రప్రభో ! గురూణాం గురువీవగు నీకంటె తత్త్వోపదేష్ట వేఱొకడు లేడు, మార్కండేయచరిత్రమునందు దీనినే తేటతెలుఁగున దెల్పిరి-

"ఎవఁడు ప్రభువనఁదగినవాఁ డెవని యిచ్చ
కడ్డులేకుండు నెవఁడు సత్యస్వరూపుఁ
డాదికారణ మెవ్వఁడీ యఖిలమునకు
నట్టి సర్వేశు మద్గురు నాశ్రయింతు"

ముగింపు:- తత్త్వజ్ఞులగు శ్రీదాసుగారి గ్రంథములెట్లు ముముక్షు జనుల కత్యంతోపాదేయములగుచున్నవో యావిషయ మంతయు 'అనుబంధచతుష్టయు' రూపమున నిరూపింపఁబడినది. ఇట్టివారి తత్త్వజ్ఞతను గ్రహించి యానందించిన మహామనీషుల వచనము లీ దిగువ పొందు పఱుపబడుచున్నవి

వేదాన్త విజ్ఞాన సునిశ్చితార్థులగు శ్రీ కట్టా వేంకటరావు మహోదయులు :-

"వారుపనిషద్విజ్ఞాన సంపన్నులు. పరతత్త్వ వేత్తలు. దీనిని వారి కథలలో సందర్భనుసారముగ ఉపయోగించిరి. కాని అది చాలా లీలా మాత్రమే. ఉపనిషత్తులయందు వారికి గాఢాసక్తికలదు".

తర్క పూర్వోత్తర మీమాంసా విద్వన్మణులగు (శ్రీ) వాజపేయ యాజుల వేంకటేశ్వరశాస్త్రిగారు:—

"(శ్రీ)మన్నారాయణ దాసః హరికథాసక్తాన్ సర్వాన్ ఆంధ్రజాతీయాన్ సంసార సాగరాత్ తారయిత్వా స్వయించతీర్త్వా ధన్యస్సం వృత్తః. అతస్తేషాం తత్త్వజ్ఞాన వైభవం అనితర సాధారణమితి విశ్వసితో వయమ్".

సునిశిత మేధాసంపన్నులు సంస్కృతాంధ్రాంగ్లాది బహుభాషా విశారదులు విద్వద్వతంసులగు (శ్రీ) అప్పల్ల సోమేశ్వరశర్మగారు—

"అయితే వ్రతిభావంతులకు సాధ్యంకాని దేమున్నది గనుక ! ఆయన అఖండ ప్రతిభయే అన్నింటినీ సమకూర్చిపెట్టింది. మరొక విషయం. (శ్రీ)దాసుగారి బాహ్యలక్షణాలను, సమయాచారాలను ఆపాతతః అన్వయించేటప్పుడు తత్వాన్ని గురించిన ఇంతటి తపన మథనమూ ఆయన హృదంతరములో ఉన్నట్లు ఎవరికీ గోచరించదు... అద్వైతత్వసారాన్నే ఆయన సరికొత్త మార్గంలో ప్రబోధించేరు".

కర్మోపదేశమునకు జైమినియు, జ్ఞానోపదేశమునకు వ్యాసభగవానుడు నవతరించినట్లే భక్త్యుపదేశమునకు (శ్రీ)నారాయణదాసు లవతరించిరి. హరికథాకథన రూపమున జనులహృదయక్షేత్రములందు భక్తిబీజములు నాటిరి. అయ్యవి క్షేత్రప్రాశస్త్యము కొలది క్రమముగా అంకురించి వ్రతతి వ్రతతులై పల్లవించి పుష్పించి ఫలించి తమసౌగంధ్యమును నల్దిక్కుల వ్యాపింపజేసినవి.

-స్వస్తి-

౧

# హరికథా విభాగము

# &

# కృతిసమీక్షలు

# "హరికథా శిల్పసమ్రాట్టు ఆదిభట్టు"

— కరుణశ్రీ

ఎవరీ ముగ్ధమనోజ్ఞ దర్శనుఁ! డెవండీ శారదామూర్తి! యీ
నవ శృంగార రసావతారుఁ డెవరన్నా! శ్రీమదజ్ఞాడయే
యవునా! ఆ దరహాస! మానదకతి! రాతివి! యాదర్ప! మా
కవితాదీప్తి! యనన్య సాధ్యములురా! కైమోడ్పు లందింపరా!

పండించె నీకాలి గండపెండెరము రం
గారు ముంగారు బంగారు పంట
నర్తించె నీ కీర్తి నవనవస్ఫూర్తి యా
సేతు శీతాచలక్ష్మాతలాన
జోహరు లందె నీ సాహిత్యనందిని
కదలించి సహృదయ హృదయములను
గంభీరమయ్యె నీ "శంభో" నినాదంబు
దిగ్దిగంతాలఁ బ్రతిధ్వనించి

కాంతులీనెను రాజసభాంతరాల
నీ జయశ్రీ దృగంత నీరాజనాలు;
యక్షగాన కళా మహాధ్యక్ష పదవి
అక్షరంబయ్యె నీ పట్ల "నాదిభట్ల!"

చిఱుతాళముల జత చే ధరించినఁజాలు
లయతాళములు శుభోదయము పలుకు
కాలిగజ్జె లొకింత ఘల్లుమన్నంజాలు
భరతమ్మ నీ ముందు శిరసు వంచు
వీణ తంత్రుల మునివ్రేళ్లు సోకినఁ జాలు
సంగీత వాహిని పొంగి పొరలు
గంటంబుఁ బూని క్రీగంటఁ గాంచినఁజాలు
కవిత నీ యెదుట సాక్షాత్కరించు

నేఁటి కథకులందు నీ పేరు చెప్పక
గజ్జె గట్టువాఁడు కానరాఁడు;
తెలుఁగు వెలుఁగు దేశదేశాల నింపిన
హరికథాపితామహా ! నమోస్తు !!

"కల్యాణి రుక్మిణీకన్య" మెల్లఁగ నల్ల
నయ్య భుజమ్ముపై చెయ్యివైచె
"జనని జానకి" మహాశపథమ్ముతో సువ
థమ్ము చూపెను సతీధర్మమునకు
"వరగాత్రి సావిత్రి" వైవస్వతుని నిల్పి
మగని ప్రాణాలకై తగవులాడె
"చిన్ని మార్కండేయు" శివభక్తి పదమెత్తి
మృత్యుదేవత గుండె మీదఁదన్నె

"మ్రొక్కుబడిఁ" జిక్కువడి వేదబుక్కులెల్ల
నచ్చుపుం దెల్గు కలకండ లచ్చువోసె;
నీదు ప్రతిభకు లోనుగానిది మఱేది ?
స్వరసురత్రాణ ! అష్టభాషాప్రవీణ !

చల్లపల్లి నృపాలు సంతోష మెంతయో
గండపెండెర మిచ్చి గౌరవించె
ఆనందగజపతి మేనెంత పొంగెనో
రమణీయ రత్నహారములొసంగె
మైసూర్ మహారాజు మదిముదమ్మదియెంతొ
కనకాంబరమ్ములు కట్టఁబెట్టె
సరస విద్వన్మహా సమితి మేలెట్టిదో
ఘంటాసువర్ణ కంకణము లిచ్చె

లలిత సంగీత సాహిత్య కలిత యగుచు
భరత భారతి హారతిపట్టె నీకు
హరికథావ్యాసునకును - స్నేహార్ద్ర మధుర
హాసునకును – నారాయణదాసునకును.

"నేతి" సౌవర్ణ మాణిక్య పీఠము పెట్ట
"కుప్పా"జగా వెల్ల గొడుగుఁ బట్ట
"నౌడూరి" శిల్పసుందర కిరీటముఁ గూర్ప
"అమ్మాల" శ్రీ తిలకమ్ము తీర్ప
"చీరాల" నవరత్న హారాలు కైసేయ
"చిట్యాల" మంజు మంజీరములిడ
"కూచిభట్ల" మనోజ్ఞకుండలా లర్పింప
"ములుకుట్ల" పన్నీరు చిలుకరింప

"వాణి" యును "వేణి" "రాణి" పారాణి దిద్ద
కొలువుదీరెను హరికథా కువలయాక్షి;
మ్రొక్కె నీకు సుగాత్రి నీ ముద్దు పుత్రి
నెట్లు దీవింతువో ఆదిభట్లబాబు!

''బాలాజి'' సరిక్రొత్త పారిజాతము లివ్వి
"భోగలింగము'' జాజిపూవు లవ్వి
''పరిమి సుబ్రహ్మణ్య'' సరసీరుహము లివ్వి
''పాతూరి'' వకుళ పుష్పమ్ములవ్వి
"పెద్దింటి" మేల్ గులాబీ ప్రసూనము లివ్వి
"ములుకుట్ల" సంపెంగ మొగ్గలవ్వి
"బాల బ్రహ్మనందు" నీలోత్పలా లివ్వి
"తెల్లాకుల"వి మంచి మల్లెలవ్వి

కమ్మని సుగంధములు విరజిమ్ము నేఁడు
హరికథోద్యాన వనమందు; నందుకొనుము
నీవు నాటిన తోటలో పూవులోసఁగు
శ్రీసపర్య, నారాయణదాసవర్య!

"ఎవఁడురా! యచట తెండిఁకొక్కగ్లా" సంచు
అమృత రక్షకులకు నాజ్ఞ యొసఁగి
"సుధకంటె మా హరికథలెన్స" యని బృహ
స్పతితోడ నర్మభాషణము నెఱపి
"ఏమమ్మ వాణి! యేదీ వీణ! సరిక్రొత్త
తీవలా" యని "గిరాందేవి" నడిగి
"ఆగవే రంభ! ఆ హస్త ముట్టులు గాదు
త్రిప్పిపట్టు" మటంచు తప్పుదిద్ది

''ఏమయా! క్రొత్తసంగతు లే మటంచు
బ్రహ్మమానస పుత్రుని పలుకరించి;
ఆదిభట్ల నారాయణాఖ్యము మహన్సు
తిరుగు నిందందు స్వర్గమందిరముఁలందు.

సంగీత సాహిత్య జగదంగణము ధగ
ద్ధగిత మ్మొనర్చు గంధర్వతార
వాసిఁ గాంచిన మహా వాగ్గేయ కారుఁడై
భారతి నర్చించు భక్తమౌళి
అమరుఁడౌ "ఉమరుఖయ్యాం" రుబాయితు లాంధ్ర
సంస్కృతమ్ముల కెత్తు నన్యసాచి
హరికథా రాజ్య మూర్ధాభిషిక్తు డయ్యు
స్వార్థం బెఱుంగని పార్థివుండు

వాలు మెలి మీసకట్టు, జుల్ఫాలజుట్టు,
నొసట కుంకుమబొట్టు, మేల్ పసిడికట్టు,
విద్దెలకు పట్టు! నడయాడు వేల్పుచెట్టు!
హరికథా శిల్ప సమ్రాట్టు! "ఆదిభట్టు"



# హరికథ

శ్రీ నారాయణదాసు

ఆస్తిక్యమును ధర్మాధర్మములను సర్వజన మనో రంజనముగ నృత్యగీత వాద్యములతో నుపన్యసించుట హరికథయనఁబరగు. అట్టి యుపన్యాసకుడు కథకుడనబడును. దైవభక్తియు సత్యము భూతదయయు హరికథయందలి ముఖ్యాంశములు. దేవుని గొల్చి తరించిన ప్రహ్లాదాది పరమ భాగవతుల చరిత్రములను సావిత్రీ ప్రముఖ పతివ్రతా చారిత్రములును హరిశ్చంద్రాది వీర చరితములును దెల్పినచో మంచి యభివృద్ధి యగునని వాల్మీకి వేదవ్యాసుడు మొదలగు మహర్షులు కావ్య పురాణేతిహాసంబుల బల్కిరి. నారదుడు దొట్టి పరమ మునులు భగవన్నామ సంకీర్తనము సేయుచు నాడుచు బాడుచు లోకులం దరింపజేసిరి.

శ్లో॥ వీణావాదన తత్వజ్ఞః శ్రుతిజాతి విశారదః
తాలజ్ఞశ్చాప్రయాసేన మోక్షమార్గం నియచ్ఛతి.

యను యాజ్ఞవల్క్య స్మృతి వచనానుసారముగ యోగముచేతను సంగీతముచేతను దక్క వేరు మార్గమున మోక్షము సాధింపరాదనియు యోగముకన్న నిరపాయమగు సంగీతావలంబనముచేత,

శ్లో॥ గాయం శ్చరిత్రాణి రథాంగపాణేః
నృత్యన్నిరస్తాఖిల కర్మబంధః
నిరంకుశ స్సర్వ సమో విరాగీ
కైవల్య మభ్యేతి ముకుందభక్తః॥

అను నారద స్మృతిప్రకారము సర్వవస్తువులయందు వాసుదేవ భావనచే మనోవాక్కాయ కర్మములచే దేవుని భజించుచు సర్వజనులకు దైవ భక్తిని బోధింపదగు మోక్షసాధనము సంగీతముకన్న వేరు లేదని రూఢిగా దెలిసిన పురందర విఠ్ఠలాది వాగ్గేయకారు లిక్కలియుగమున గీత ప్రబంధ ములు విరచించి యాడుచు బాడుచుం బరుల దరింపజేసి తాము తరించిరి.

శ్లో॥ సత్యగీతస్య మాహాత్మ్యం కే ప్రశంసితు మీశతే
ధర్మార్థ కామమోక్షాణా మిదమేవైక సాధనమ్।

అను శాస్త్రమునుబట్టి వాగ్గేయకార సత్తముడగు వాల్మీకమహర్షి శ్రీ మద్రామాయణమను గీత ప్రబంధ మొనరించి కుశలవులచే జగదాహ్లాద కరంబుగ త్రేతాయుగంబున బాడించెను. భరతముని ప్రముఖుల నాది కాలమున "శివస్తుతౌ ప్రయోజ్యాని మోక్షాయ విదధే విధిః" అని బ్రహ్మరచితములగు మన్త్రకాది గీతములను శివసన్నిధిం బాడిరి. కలియు గమునందు ప్రాచీనులలో సుప్రసిద్ధులగువాగ్గేయ కారులు జయదేవుడు గీతగోవిందమును, నారాయణతీర్థులు శ్రీకృష్ణ లీలాతరంగములను, దీక్షి తులు కృతులను విరచించిరి. ఆంధ్రభాషయందు గూడ క్షేత్రయ్యుడు, రామదాసు, త్యాగరాజు, సుబ్రహ్మణ్యకవి, గోగులపాటి కూర్మన్న మొదలగు మహానుభావు లుభయతారకముగ గీతబంధముల గావించి ప్రఖ్యాతి వడసిరి. కొద్ది కాలమునుండి మహారాష్ట్రము మొదలగు పెక్కు దేశంబులలో సంగీత సాహిత్య విశారదులు కొందరు జీవనార్థమై కథక వృత్తి నవలంబించి హరిభక్త వేషంబుల ధరించి దైవభక్తిని ధర్మాధర్మ ములను జనులకు బోధించుచు పౌరాణికులు కథకులు భాగవతులు దాసులు మొదలగు సంజ్ఞలం బరగుచున్నారు.

శ్లో॥ విష్ణుభక్తా ఏవ విప్రా నానా వేదవిదా అపి.

అను స్మృతివాక్యము చొప్పున నూతాది కథకులం దలంచి బ్రాహ్మణేత రులు గూడ కథకులై యుచిత సత్కారములు వడయుచున్నారు. హరి

కథాశ్రవణము వలన శ్రోతలకు నిఖిల శ్రేయోభివృద్ధియగును. కథకులకు గూడ ధర్మార్థకామ మోక్షములు లభించును. శ్రుతి స్మృతి విజ్ఞానము శబ్దాను శాసనజ్ఞత, అభిధాన ప్రవీణత, ఛన్దః ప్రభేదవేదిత్వము, అలంకార కౌశలము, రసభావపరిజ్ఞానము, దేశస్థితి చాతురి, నానాభాషా వైశద్యము, సర్వశాకు విశారదత్వము, కలాశాస్త్రనైపుణి, తూర్య త్రితయచాతుర్యము, హృద్యశారీరశాలిత, లయకాల కలాజ్ఞానము, ప్రభూత, ప్రతిభోద్భూత భావ్యత్వము, సుభగగేయత, దేశీయరాగాభిజ్ఞత్వము, వాక్పటుత్వము, సభావిజయ సామర్థ్యము, రాగద్వేష పరిత్యాగము, ఉచితజ్ఞత, సార్ద్రత్వము, అనుచ్ఛిష్టోక్తి నిర్బంధము, నూత్నధాతు వినిర్మాణ దక్షత, పరచిత్త పరిజ్ఞానము, ప్రబంధ ప్రగల్భత, ద్రుతగీత విరచనానైపుణి, పద్యాంతర విదగ్ధత, త్రిస్థాన గమనప్రౌఢి, వివిధాలప్తి నిపుణత, విశేషవధానశక్తి, రమ్యరూపము, స్వేచ్ఛాసంచారము, స్వతంత్ర జీవనమును, వాగ్గేయకారుడగు నుత్తమ కథకుని లక్షణములు.

సీ॥ ఘనశంఖ మోయన గంఠంబు పూరించి
మేలుగ శ్రుతిలోన మేళగించి
నియమము తప్పక నయఘనంబుల బెక్కు
రాగ భేదంబుల రక్తిగొల్పి
బంతులెగిర్చినపగిది కాలజ్ఞతన్
జాతిమూర్ఛనలొప్ప స్వరము పాడి
చక్కని నృత్యము సర్వ రసానుకూ
లంబుగాగ నభినయంబుచేసె

స్వకృత మృదు యక్షగాన ప్రబంధసరణి
వివిధ దేశంబులం బిన్న పెద్దలు గల
బలుసభల హరిభక్తి నుపన్యసింప
లేని సంగీత కవితాభిమానమేల.

[1911-ఆంధ్రపత్రిక విరోధికృత్ సంవత్సరాది సంచిక]

ఈ అంబరీషోపాఖ్యానము దొట్టి మరికొన్ని యక్షగానములను వ్రాసియుంటిని. యక్షగానమనఁగా స్వరనియతములగు నక్షరసందర్భములు పద్యములవలెఁ దద్గీత బంధములంగూడి సమవ్యాకరణ చ్ఛన్దోబంధములంగఁ దెలియునది. గణసమూహ చేరికం గలుగు నుచ్చారణకాల విన్యాసము గద్యపద్య గీతబంధములకు సమానమే. పఠనశక్తి జనరంజకము కానపుడు రుచ్యముగఁ జదివి సుస్వరముగఁ బాడలేనపుడు ఛందోలయలతోఁ బనియేమి ? మనసులోఁ జదువుకొనుట చెల్లునుగాని వర్ణాత్మకముగాఁ గాని కేవలధ్వన్యాత్మకముగఁగాని యెలుగెత్తి సుస్వరముగఁబఠించినపుడు కదా గద్య పద్య గీతములకు సార్థకము. కేవల వర్ణాత్మకముగ చూచిమాత్ర మెఱుంగుటకు గద్యపద్య గీతములన్నియు నొక్కటియే. ఆంధ్రభాషయందుఁ గేవల గద్య పద్యములే యిదివరకుఁ బఠింపఁబడుటకును యక్షగానము లుల్లంఘింపఁ బడుటకుఁ గారణము గీతబంధ శబ్దమాత్రద్వేషమా సంగీతకుకార ప్రాయులకుగాకున్న సహజసుందర మృదుపద సందర్భముల తేనెలూరు నాంధ్ర యక్షగాన ప్రబంధము ఆధ్యాత్మరామాయణ మృత్యుంజయ విలాసములు సంస్కృతమున గీతగోవింద శ్రీకృష్ణలీలా తరంగములును బాఠశాలలకు వెలికానేల ? తత్పద పదార్థములు విద్యార్థులకు జేదా ? గద్యముకన్నఁ బద్యము, పద్యముకన్న గీతము రచించుటకును దెలిసికొనుటకును బఠించుటకు శ్రమకరము. నాట్యధర్మముగ నభినయించుట గీతము; లోకధర్మముగ నభినయించుట సాహిత్యముకాని యా రెంటికి బంగరు దారంగువలె వ్యత్యాసము కాన్పించుచున్నది. కొంద ఱక్షరములతోనే కాని వాని సుస్వరోచ్చారణతోఁ బని లేదని యనరాదు. మనసులో గొణుగుకొన వచ్చునుగాని పైకిఁ జదువునపుడు నీటుగల దుస్తులతో బయలుదేరునట్లు సుస్వరంబుల దను కంఠముల నలంకరించు కొనుటకు విద్యార్థులు నోమలేదా ? కావున యక్షగానములు కూడ వాగ్గేయకార ప్రణీతములైనచోఁ బాఠశాలల సంగీకరింపఁ బడవలసినదే. నేఁ దెలిసినమట్టు యక్షగానముల కుదాహరణముగ

నిందుతోఁబడి విరచించినాఁడను. రాగములు తాళములు గద్యములు పద్యములు వానిగుర్తుల కేమి గాని యక్షరములగల రసగ్రహణములకన్ని బాధములును సమానములే. ఇదివర కెందుకు పట్టువట్టి యక్షగానముల బదుల జొంనీయకున్నారు. చెప్పుమా మఱి యొకసారి యించుమించు మూగపంచాంగ మా బదులలో సుస్వరోచ్చారణ సౌందర్యము పద్య గీత పఠన సౌష్ఠవమును బాలురకు మరుగు పర్చవచ్చునా? అక్షరాంక చిహ్నములంగాంచి వానియర్థ మెఱుఁగుట యెట్టిదియో చతుష్షష్టి కళ లలో యథా స్వరోచ్చారణ మట్టిదని తెలియఁదగదా? మునపటికన్న సంగీతమున కిపుడు పొర్లుదగిలెను. ప్రస్తుత కవులు గద్యపద్యములవలె నూరూర నింటింట గీతముల గాయకులు నించుచున్నారు. యథాక్షరో చ్చారణము కోటికొక్కినచో సుస్వరగీత పఠన మొకరి కబ్బునేమో? సుశారీరము కారణము ప్రాశస్త్యముగఁ బరిణమట. మూగ కాకుంటచాలు నుచ్చారణమునకు. అభ్యసింపఁగా నొవన్యాసకులు తేలినట్టు గాయకులు కూడ నేకాలముకై నందేలరా? కావున విమర్శకులయిన పఠనియమ నాధికారులు బదులలో యక్షగానములఁ జదివింతురుగాత. సుస్వర పాఠ కులచే నెల్లలోకము రంజింపబడునుగావుత మని దేవునిఁ బ్రార్థించు చున్నాఁడను.

[అంబరీష చరిత్రము - ఉపోద్ఘాతమునుండి]



# హరికథ - యక్షగానము - దాసుగారు

శ్రీ యస్వీ జోగారావు

హరికథయన్నను యక్షగాన మన్నను నొక్కటే యని కొందఱు పండితు లభిప్రాయపడుట గలదు. ఇప్పటికిఁ దెలియవచ్చినంత మట్టుకు శ్రీ బాగేపల్లి అనంతరామాచార్యులను వారా యభిప్రాయమును మొదట వ్యక్త మొనర్చినవారుగాఁ గన్పట్టుచున్నారు. ఆయన రాయలసీమ అనంతపుర మండలము హిందూపుర వాస్తవ్యులఁట. 19-వ శతాబ్ది యుత్తరార్థమున నుండినవారఁట. ఆ ప్రాంతమునందు వారు కథోపన్యాసకులుగాఁ బ్రసిద్ధివడసిన వారఁట వారు హరికథల నుపన్యసించుటకొఱకు స్వయముగాఁ బలు రచనలు గావించిరి. అందు కొన్ని :- 1) చంద్రహాస చరిత్రము, 2) కుచేలోపాఖ్యానము, 3) మాయాసుర విజయము, 4) అనసూయా చరిత్రము, 5) సావిత్రీ చరిత్రము, 6) సుభద్రాపరిణయము, 7) శశిరేఖాపరిణయము.1

ఈ యేడింటను జివరి నాల్గును యక్షగానములుగా బేర్కొనఁ బడినవి. కాని వానిలో నట్లు బేర్కొనఁబడని వానిలోఁ గూడ రచనా ప్రక్రియ యొక్క ఫక్కిగనే నడచినది. అన్నిటను తోహరాలు, హిందూస్తానీ మట్లును గలవు. ఇవి యన్నియు నాఖ్యానశైలీ పరికృష్ట

1. ఇవి యన్నియు సముద్రితములు. వీని వ్రాఁత ప్రతులు శ్రీమాన్ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారి కడనున్నవి. వారే గ్రంథకర్తను గూర్చిన విషయమును నా యెఱుకకుఁ దెచ్చిరి. శశిరేఖ రచనా కాలము 13-5-1886

ములు. ఈ తోహారాల యునికి మొదలగు లక్షణములన్నియు నాంధ్రమున హరికథలను పేరం బ్రచారమున కెక్కిన రచనలలోనే యెక్కువగాం గన్పట్టును. అనంతరామాచార్యుల వారు తమ కృతుల నెక్కటిగా నాఖ్యానించు చుండెడివారట. హరికథా ప్రయోగలక్షణ మదేకదా. అనంత రామాచార్యుల వారి కృతులను హరికథ లనుటలో విప్రతిపత్తి యుండ నక్కఱలేదు. కాని వారే వ్రాసిని యక్షగానములనియు వ్యవహరించి యున్నారు కదా. వారేకాదు వారికించుమించు సమకాలికులు (1864-1945) నాంధ్రదేశ హరికథోపన్యాసక చక్రవర్తులుగాం బ్రసిద్ధులైన శ్రీ మజ్జాడాది భట్టనారాయణదాసుగారు తమ ప్రహ్లాద చరిత్రమను హరికథ యుపతారికలో హరికథ యన్నను యక్షగాన మన్నను నొకటేయను నభిప్రాయముతో నొక పద్యము రచించిరి.

సీ॥ ఘనశంఖమోయనం గంఠంబు బూరించి
మేలుగా శ్రుతిలోన మేళవించి ... ... ...

ఈ పద్యమునే 'హరికథ' యను శీర్షికక్రింద ఆంధ్రపత్రిక విరోధికృత్సంవత్సరాది సంచికలోం గూడ (పుట 77) దాసుగారు ప్రకటించి యున్నారు ఇది పూర్వోదాహృతము. వారు తమ అంబరీషచరిత్రమను హరికథ యుపోద్ఘాతములో ఈ యంబరీషోపాఖ్యానము దొట్టి మఱికొన్ని యక్షగానములను వ్రాసియుంటిని— నేం దెలిసిన మట్టుయక్షగానముల నుదాహరణముగ నిందులోం బదివిరచించినాడను అని తాను రచించిన హరికథల నన్నిటిని యక్షగానములనియే వ్యవహరించినారు. పార్వతీ పరిణయమను నొక హరికథను4 రచించిన శ్రీ వసుమర్తి కృష్ణమూర్తి గారు అందాశ్వాసాంత గద్యలోం దమ కృతిని యక్షగానప్రబంధమనియే

2 మినర్వా. ము. శా. ముద్రణ - విజయనగరము, 1899. దాసుగారు 1899 సం॥నకు ముందు హరికథను యక్షగానముగా పేర్కొనిన జాడ గానరాదు.

3. సరస్వతీ బుక్ డిపో ప్రచురణ, బెజవాడ 1929.

4. ప్రచురణ వివరములం దెలియవు. రాజమండ్రి గౌతమీ గ్రంథాలయమున దీని ప్రతులు కలవు.

పేర్కొనిరి. ఆయన దాసుగారికి శిష్యప్రాయులే. తమ కృతిని దాసుగారికే యంకితమిచ్చిరి.

ఊలపల్లి గంగరాజ కవి రామజనన హరికథకు[5] ముఖబంధమగు ప్రశంసలో శ్రీ కాశీభట్ల సుబ్బరాయశాస్త్రిగారు దానిని యక్షగాన ప్రబంధమనిరి. హరికథయని గ్రంథకర్త పేర్కొనెను. భమిడి మఱ్ఱి రామమూర్తిగారి సతీసక్కుబాయి హరికథ[6] పీఠికలో శ్రీ కాశరవర్తి కృష్ణశాస్త్రిగారిది యక్షగాన మనుము నా పేర్కొనే (కుండలీకరణములలో) హరికథ యని పేర్కొనిరి.

గ్రంథకర్త హరికథయనియే వక్కాణించెను. శ్రీ భక్తవిజయ మను నింకొక హరికథ[7] కూడ యక్షగాన ప్రబంధముగనే పేర్కొనఁ బడినది. తద్గ్రంథకర్తలు "శ్రీ మత్సపూర్ణ రామాయణ మహాభారత భాగవత శివపురాణాద్యనేక యక్షగాన ప్రబంధ కర్తలును హరికథోపన్యాసకులునగు శ్రీ అయ్యగారి వీరభద్రరావుగారు" "యక్షగానాల శాఖకే చెందిన హరికథ" లని శ్రీ కొత్త భావయ్య చౌదరిగారొకచో[8] ననిరి.

ఇట్లు పలువురు పండితులు, సామాన్యులుగాదు ధీమాన్యులునైన వారు, స్వయముగా హరికథా గ్రంథ రచన గావించినవారును నభిప్రాయ పడిరనగా నది కాదనలేము. వానిలో నేదో సాదృశ్యము లేదనలేము.

జక్కుల కథలు, జంగంకథలు, హరికథలు, బుఱ్ఱకథలు - ఇవి యన్నియు గానరూపమునఁ గథాఖ్యానమే ప్రధానాశయముగాఁ బ్రారంభింప బడినవి. కావునఁ దత్తద్రచనా ప్రక్రియలలోఁ గొంత

---

5. త్రిపతి ప్రెస్. కాకినాడ. 1936.
6. సరస్వతీ పవర్ ప్రెస్, ముద్రణ రాజమండ్రి. 1943.
7. రాజమండ్రి గౌతమీ గ్రంథాలయమున నొక ప్రతి కలదు.
8. చూ. "యక్షగాన నాటకములు" అనువారి వ్యాసము ఆంధ్ర మహిళ- ఆగష్టు, 1956. పుట 14.

సాదృశ్యము గోచరించినను వాని వాని ప్రయోగ ఫక్కికలు వేఱు. ప్రయోజనములు వేఱు. వాని పుట్టుపు పొలకువలే వేఱు వేఱు.

హరికథ వేదకాలము నాటికే బీజరూపముననున్నట్లును, నైతిహాసిక యుగమునఁ గుశలవుల రామాయణగానము మొదలగు సందర్భములందు దాని స్వరూపము విస్తరించినట్లును గొందఱి తలంపు 9 కాని యేదో కథ చెప్పుట, అది విష్ణు కథ యను నట్లుగాక మనమీనాఁడను కొనుచున్న విశిష్ట లక్షణములు గలదిగా హరికథ రూపొంది ప్రచారము గాంచుట మధ్యయుగమున మహారాష్ట్రమున. 17వ శతాబ్ది పూర్వార్థమున నుండిన ప్రసిద్ధ మహారాష్ట్ర భాగవతుఁడగు తుకారామ్ హరికథా కాలక్షేపములు చేయుచుండెనట్లు తెలియుచున్నది.10 హరికథ యనగా నది మహారాష్ట్రులదని ప్రతీతి. అది మహారాష్ట్రమున "అభంగ్" అనియు, తమిళ దేశమునఁ గాలక్షేపమనియు, నాంధ్రమున హరికథ యనియు (హరికథా కాలక్షేప"మనియు) వ్యవహరింపఁబడుచున్నది.

దక్షిణ దేశమునకు హరికథా కాలక్షేపము దిగివచ్చుట 17-వ శతాబ్దిలో నటు కర్ణాటకము నిటు తంజావూరాంధ్ర నాయక రాజ్యమును మహారాష్ట్రుల కైవసమైన తరువాతనే యని తోఁచును. తంజావూరు నేలిన మహారాష్ట్ర ప్రభువు లంతకు ముందాంధ్ర నాయక రాజులు మిగుల నాదరించిన యక్షగాన ప్రక్రియ తమ హరికథా సంవాదిగా నుండుటచేతను, అంతకంటె మాఱి యొక మెట్టెక్కువగా రూపక ప్రయోజనము కలిగియుండుట చేతనుఁ గాఁబోలు తాము దానిని నాయక రాజులకంటె నెక్కుడుగ నాదరించిరి. స్వయముగా నెన్నో యక్షగాన

9. Vide, "Kalakshepam" By Sir M. S. Ramaswami Aiyar,

10 చూ. "తుకారామ్‌మాచీగాథ" — నిర్ణయసాగరముద్రణ, బొంబాయి, 1927) అభంగములు 4045 – 4049.

11. కాలక్షేపమనగా Pastime అని యర్థము.

నాటకములను వెలయించిరి.[12] కానీ యాంధ్రమున వారై తమ హరికథలను వెలయించిన జాడ గానరాలేదు. కాని మహారాష్ట్రులకుఁ బుట్టినింటను బొసగు వారైన మధుర సౌరాష్ట్ర సభవారు పిదప కాలమునఁ దెలుఁగునఁ గొన్ని హరికథలను వెలయింపజేసిరి. తథాపి మనవారును కాలక్షేపార్థము రూపక ప్రదర్శనావకాశము లేనియెడ నేకపాత్రాభినయమునకైనఁ బనికి వచ్చునని యో, అన్యగీత ప్రబంధ ఛందస్సుల[13]కా కృష్టులగుట చేతనో నాఁటి నుండి హరికథా రచనకు దొరకొని యుందురు.

అసలు యక్షగానము హరికథగాఁ జెప్పబడు సంప్రదాయమొకటి కన్నడదేశమునఁ గలదఁట. అయితే అది ప్రాచీనమైన సంప్రదాయము కాదు. ఈవిషయమై (శ్రీ) మట్నూరి సంగమేశము గారేమనుచున్నారో చూడుఁడు. "అసలు వేష రచన కూడ మానుకొని మద్దెల, జేగంట, హార్మోనియం శ్రుతి అనేవి సహాయంగా తీసికొని ఒకాయన యక్షగాన రచనాగానం చేస్తూఉంటే, మరోనలుగురు వేర్వేరు పాత్రలను పంచి పుచ్చుకొని, కులాసాగా నాటకీయ పద్ధతిలో సంభాషణలు నెరవడం అనే మర్యాద కూడ దక్షిణ కన్నడ ప్రాంతాంలో పాతిక ముప్పై యేళ్లనుండి బయల్దేరింది. దీనిని తాళమద్దెల అని పిలుస్తారు ఇందులో ఆటగాని, అభినయంగాని, వేషంగాని ఏమీలేవు. ఒకరు చెప్పే హరికథ నలుగురు

---

12. చూ. నా 'ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర' ద్వితీయభాగము-ద్వితీయ ప్రకరణము.

13 ప్రా. లి. పు. భాం., ఆర్ నం. 1607, 1608 వీనిలో డోరాబ్యాక్, సాపంగి, లావణి, కేకావళి, ఖడ్గా, ఛంద్ మొ. సౌరాష్ట్ర మహారాష్ట్ర గీత ప్రభేదములు గలవు. ఆంధ్రదేశపు హరికథలందు డోరాలు, తోహరాలును దఱచు లావణి 19-వ శతాబ్ది కర్ణాటాంధ్ర యక్షగానములందును బ్రయుక్తమైనది. (ఈ మధుర సౌరాష్ట్ర సభ హరికథలు, వానిలో ఛందస్సులను గూర్చి ప్రత్యేక మొక వ్యాసము 2-5-55 త్రిలిఙ్గలోఁ బ్రకటించి యుంటిని).

పంచుకొని చెప్పుతూన్నట్లుంటుంది."14 ఈసంప్రదాయము యక్షగానములపై హరికథల ప్రభావమును మాత్రమే సూచించును. ఏదెట్లయినను మనకుయక్షగాన రచన ప్రాచీనము. హరికథా రచన ఆధునికము నేటి హరిదాసులు హరికథలను యక్షగాన ప్రబంధములని పేర్కొనినట్లు, ప్రాచీన యక్షగాన కర్తలెవ్వరును యక్షగానమును అది వైష్ణవేతివృత్తమగుచో నౌపచారికముగ హరికథ యనుట తప్ప (ఆ యనుట యుగ్గాచిత్యము) ప్రక్రియపరముగా హరికథయని వ్యవహరింపలేదు

లాక్షణికులు గూడ వస్తు ఛందో వైవిధ్యము విశేషముగఁ బ్రదర్శించి యుండుటచే యక్షగానమున కొక నిష్కృష్ట లక్షణము నేర్పరింపలేకపోయిరి. ప్రక్రియ గా నావదులు తనమే మొదటఁ దాళ ప్రధానములైన రేకులతో ద్విపదలతోఁ గొలది గద్య పద్యములతోఁ బ్రాదుర్భవించిన యక్షగాన రచనమును వివిధ దేశిపద కవితా ప్రభేదములను, కర్ణాటక సంగీతమునకుఁ బ్రచారము గలిగిన దినములలో నా యా రాగ ప్రభేదములను, దక్షిణదేశమున క్రొత్త రాహుతులతో సంపర్కము గలిగిన రోజులలో నా హిందూస్థానీ రాగములను మట్లను నిముడ్చుకొనునట్లు చేసి, రానురాను యక్షగాన మనగా ఛందో వైవిధ్య విశిష్ట గేయ ప్రబంధ సామాన్య వాచియా యని యనిపించునంతగాఁ బరిణమింపఁజేసి నేటికి హరికథలకుఁ గూడఁ బర్యాయవాచకముగా నిలిపినది. 15 అసలు హరికధ ప్రయోగవిషయమున యక్షగాన ప్రారంభదశను సూచించు

14. చూ సంగమేశంగారి "బయలాట" అను వ్యాసము ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక, 4-1-1956, పుట 64.

15. ఈ సందర్భమున గోదావరి మండల వాస్తవ్యులు. ప్రసిద్ధ హరికథోపన్యాసకులు, రచయితలునైన శ్రీ నల్లమిల్లి బసివిరెడ్డిగారి యభిప్రాయ మొకటి గమనింప దగియున్నది. కీర్తనలు, పద్యములు, గద్యములతో నడచునవన్నియు య. గా. కావ్యములే యని నా యభిప్రాయము. హరికథలన్నియు య.గా. లేయని చెప్పనగును" (ఇది యాయన స్వయముగ నాతో సెలవిచ్చినమాట వీరిటీవల తేదీ 8-12-1959 న కీర్తిశేషులైరి.)

ననవచ్చును. రచనా ప్రక్రియలో నీనాఁటి ధోరణి బట్టి రెండింటను నెట్టి ఛందస్సులనైనఁ బాటలనైన నెట్టి కథలనైన నెలకొల్పవచ్చు నన వచ్చును.

ఈనాఁడు యక్షగానము లెల్లు యక్షులచే (జక్కులచే) గానము చేయఁబడుట లేదో, యట్లే హరికథలన్నియు విష్ణుకథలు గావు. శివ కథలు చివరికి శివాజీ, గాంధీజీ కథలను హరికథలపేర "చలామణి" యగుచున్నవి. అనఁగా నిఁకఁ బ్రక్రియకే గాని యాపేరునకుఁ బ్రాము ఖ్యము పోయినదన్నమాట. కడమ ఛందస్సుల మాట యెటులున్నను కథాఖ్యానమునకు యక్షగానములలో ద్విపద, హరికథలలో డోరాలు, తోహరాలు సంప్రదాయ సిద్ధముగా వాడఁబడుచున్నవి. నారాయణ దాస ప్రభృతుల రచనలలో డోరా, తోహరాలకు బదులు మంజరి యను రచనా విశేషము కన్పట్టును. అది మన మంజరీ ద్విపద కాదు. డోరా వంటిదే. హరికథలలో మన ద్విపదలు, కందార్థములును జేరినవి. 19వ శతాబ్ది యుత్తరార్థము, తదుపరి యక్షగానములలో మాత్రము గొన్నిట డోరా తోహరాలును, మరికొన్నిట లావణి మొదలగు నన్యదేశ్య ఛందస్సులును (సాధారణముగా హరికథలలో నుండునవి) చేరినవి.16

పై విషయములను బట్టి హరికథ - యక్షగానములకుఁ గల సాదృశ్యము, సంబంధము, నెట్టివో గ్రహింపనగును. హరికథనుండి యక్షగాన ముత్పత్తియైనదని యెవరైన నన్నచో నదిముధావాద మగును. అదియుఁ గాక యీ వాదము యక్షగానమే హరికథగాఁ

---

16. చూ. నా 'ఆంధ్రయక్షగానవాఙ్మయచరిత్ర - ద్వి. భా. ౧వ ప్రకరణము - ఆంధ్రదేశ య. గా. కవులు వరగంటి శేషగిరి వెంకటరమణదాసులు, గోపాల గామదాసకవి, తిమ్మరాజు లక్ష్మణరావు, అనంతరామాచార్య నారాయణదాస ప్రభృతుల కృతుల విషయము.

బరిణమించిన దను వారును గొందఱు గలరు.17 కాని యిదియు నవిచారమూలమగు నభిప్రాయమే. రెండింటి యుత్పత్తి వేర్వేఱనియు, రెండును గొంత సదృశ ప్రక్రియలగుటచే వానికి జారిత్రక కారణముల వలన సాన్నిహిత్య మేర్పడఁగా కొంతకుఁ గొంత సంబంధమును నేర్పడె నని తలంపవలసియున్నది.

## దాసుగారి హరికథలు :

(శ్రీ) దాసుగారి హరికథ కావతారమును ఈ సంపుటి తృతీయ భాగమున దలి నా వ్యాసములో వివరించితిని. హరికథక ప్రపంచమున ధ్రువతారలైన వీరి హరికథా వాఙ్మయ చరిత్రము 'ధ్రువచరిత్ర' రచనతోనే ప్రారంభమై యుండుట విశేషము. అదీ తమ 19-వ యేట (1883లో) అవలీలగా ఒక్కరోజులో రచించి ధారణచేసి అతి హేలగా విజయనగరమున వేంచేసియున్న గానలోలుడు వేణుగోపాలస్వామి సన్నిధానమున గానము చేసిరి. 1884 లో ఆ కథనే శ్రీకాకుళ మండలము, ఉత్కల రాష్ట్రములందు పలుతావుల గానముచేసి సన్మానము లందిరి. అయితే ఆ ధ్రువచరిత్రము నేడుపలబ్ధము కాలేదు. ఆ యేడే ఛత్రపురములో నొక పెండ్లి పెద్దతో పంతమువచ్చి రాత్రికి రాత్రి అంబరీష చరిత్రమును రచించి ధారణచేసి మరునాఁ డుదయమే పెండ్లి పందిట్లో హరికథా గానము చేసిరి. తదుపరి కాలమున వారి హరికథక ప్రజ్ఞలో ఇంకను పరిణతి కనిపించును. 1894 లో మైసూరు మహారాజు సమక్షమున అంబరీష చరిత్రము, గజేంద్ర మోక్షము అను హరికథలు చెప్పి అలవోకగా ఆంగ్లానువాదము చేసి రాజావారి చేతను తత్రత్యులైన సంగీత పారంగతుల చేతను 'చాంగుభళా' అని యనిపించుకొనిరి. 1913 లో కలకత్తాలో విశ్వకవి రవీంద్రుని సమక్షమున అనాంధ్రుల కోసము

17. చూ. ౧. కవిత్వవేది 'ఆంధ్రవాఙ్మయ చరిత్ర సంగ్రహము'. – పుట 246. ౨. ప్రొఫెసర్ పి. టి. రాజుగారి - "Telugu Literature" 5వ ప్రకరణము.

హిందీ సంస్కృత భాషలలో హరికథోపన్యాసము నవలీల నతివేల మనోజ్ఞముగా చెప్పి విశ్వకవి యెప్పలందిరి. ఒకపరి చేబ్రోలులో రుక్మిణీ కల్యాణము చెప్పుటకు సిద్ధముగా నున్నపుడు సభలో ఎవరో కొంటెగా "హరికథ కాదు గిరికథ చెప్పు" డనగా అప్పటికప్పు డాశువుగా గద్యపద్య గేయములెల్ల నల్లి ఆశుగ ప్రయోగమును మించిన ఆశుకవితా పాటవముతో "గోవర్ధనోద్ధారము" చెప్పిరట! ఆ హరికథయు 'ధ్రువచరిత్ర' వలె నేడుపలబ్ధము గాదు. సంతానార్థము తల్లిగారి యాదేశానుసారము 1902 లో సావిత్రీ చరిత్రము రచించి 1903 లో పుత్రికనుబడసి యామె కా పేరిడిరి. జన్యరాగముల విషయమునను, కీర్తనలందు ముద్రాలంకార విషయమునను సావిత్రీచరిత్రమున కొంత ప్రత్యేకత గలదు. వీరి జానకీశపథమున మేళకర్త రాగముల మేలిమి పరిమళించుచున్నది. అచ్చతెలుగుపై వీరి కున్న మమకారము హరికథ మీదను పడినది. గౌరప్ప పెండ్లి అవతరించినది. అచ్చతెలుగున పూర్వులు చూపని క్రొత్త మెలకువలు కొన్ని చూపిరి. విజయనగరమున నొకప్పు డనావృష్టి యేర్పడినప్పుడు ముందుగా ప్రతిజ్ఞ చేసి "మూడు కోవెళ్ల"లో మార్కండేయ చరితము చెప్పి మూడు దుక్కులు వాన కురిపించినారట దాసుగారు. వారి పవిత్రవాక్కున హరకథయు హరికథయై ప్రత్యక్షముగా శివశంకరమై ఫలించినది. ప్రకృతి పరమాత్మల సమైక్యము కథాపరమార్థముగా రుక్మిణీకల్యాణమును రూపొందించిరి. వారి హరికథలందెల్ల వాసి కెక్కిన కృతి యిది. వారును బహువారములు గానము చేసినట్టిది. 1915లో దాసుగారొక విశిష్ట ప్రణాళికపై షట్కథా సంపుటిగా యథార్థరామాయణమును రచించిరి. ఇది నాటి నుండి నేటి దనుక యావదాంధ్రమునను హరిదాసుల కనేకుల కుపాధి కల్పించుచు (నెల బత్తెము వంటిదిది. పద్ధతిగా పూర్తిగా చెప్పినచో నెల దినములు పట్టును), జనానీకమున భక్తిభావ సద్భావసంపదను, కళారసజ్ఞతను పెంపొందించుచున్నది. ఇట్లు దాసుగారి హరికథలందు ప్రతికృతిని ఏదో

యొక్క ప్రత్యేకతయు నొక చరిత్రయు నున్నవి. వీరు సంస్కృతమునను కథాత్రయ సంపుటిగా (శ్రీ) హరికథామృతమును వెలయించిరి. మీద పేర్కొనబడినవి కాక వీరు ప్రహ్లాదచరిత్రమును, భీష్మచరిత్రమును, హరిశ్చంద్రోపాఖ్యానమును గూడ రచించిరి సంస్కృతమున మూడు, ఆంధ్రమున పదునెనిమిది వెరసి 21 హరికథలు వీరివి. అందు తెనుగున ఉదాహృతపూర్వములైన రెండు పోగా కడమ పదునారు హరికథలును ముద్రితములై ఉపలబ్ధము లగుచున్నవి. అయితే భారతీయ ముద్రణములకు భారతీకటాక్షముదరు తక్కువ. శుక్రుని వక్రదృష్టియో శివుని దృష్టియో తగులక తప్పదు. ఆ యోగమే పట్టినది దాసుగారి కృతులకు. ఆ కృతుల ఆకృతులను గూర్చిన సంగ్రహసమీక్ష లీ గ్రంథమున పొందుపరుపబడినవి. ఏ యితర యక్షగానములందును హరికథలందును లేని, వీని యందుగల సంగీతవైవిధ్య సౌందర్యముగూడ ప్రత్యేకముగా సందలి తృతీయభాగమున ప్రశంసింపబడినది.

అసలు హరికథ కోసమే ఆయన అవతరించెనో, ఆయన కోసమే హరికథ యవతరించెనో చెప్పుట కష్టము. వాద మెందుల కని ఉభయ పక్షములును సత్యసమ్మతములే యని యొప్పుకొనుట ప్రాజ్ఞ లక్షణము. బహిరంతరబంధుర భక్తిభావనాశేవధి యగు నా సుందరాకృతి, భారతీయ సంవిద్భారసర్వధూర్వహమైన ఆ మహావ్యక్తి, సంగీత నృత్యసాహిత్యాది బహుళ కళాకౌశలపేశల మామూర్తి స్వయముగా హరికథోపన్యాసము చేయునప్పుడా సన్నివేశము సనకసనందులు, సరస్వతీచతురాస్యులు, నారదతుంబురులు, పార్వతీపరమేశ్వరులు, కాళిదాస షేక్స్పియరులు కలిసికట్టుగా సాక్షాత్కరించినట్లుండును. కారణజన్ముడైన ఆ మహనీయుని హరికథల మూలమున జనసామాన్యమున భక్తిభావము జీవము పోసుకొన్నది. సద్భావసంపద పెంపొందినది. వివిధకళా రసికతలు వికసించినవి. అత్యపూర్వ మాయన హరికథాకథన వైదగ్ధ్యమునకు స్పందించని డెందము లేదు. ప్రశంసించని పత్రిక లేదు.

(వివరముల కిందలి యనుబంధము నందలి "యశశ్చంద్రికలు" చూడ దగును. ఆయన హరికథలకు గల ప్రచారము దెలియుట కిందలి ప్రథమ భాగము నందలి "శిష్యసంపద" అను వ్యాసమును, తృతీయ భాగము నందలి వ్యాసములను జూడనగును.) హరికథా పితామహుడాయన, హరిదాస జగద్గురు డాయన. గానరూప కథాఖ్యానము, కైటభారి సంకీర్తనము నగు యక్షగాన పూర్వరూపమునకు పునర్భవమును ప్రసాదించి దాని కపూర్వము చిరస్థాయికము నగు ప్రతిష్ఠను పట్టిష్ఠము చేసిన వాగ్దేవీ ప్రియ వయస్యుడాయన.



# హరికథక చక్రవర్తి

శ్రీ పెద్దింటి సూర్యనారాయణ దీక్షితదాసు

శ్రీ మదజ్జాడాదిభట్ల నారాయణదాస మహాశయులు కారణ జన్ములు. సనాతనాధునాతన సంప్రదాయముల మేలికలయిక వారి యక్షగాన రచనా విశిష్టత. సంగీత సాహిత్య సమరాంగణ సవ్యసాచిత్వము సహజమ్మై, ఆ బాల్యసిద్ధమ్మై, అసమయశః ప్రతిష్ఠితులఁ జేసి, యా మహామనిషిలోఁగల ప్రత్యేకత నుపజ్ఞతాపురస్సరముగ నుటంకించినది. "ప్రపేదిరే ప్రాక్తన జన్మవిద్యాః" యను కాళిదాసు సూక్తి అక్షరశః ఆదిభట్లాన్వయ తిలకునిపట్ల సార్థకమైన దనుట అతిశయోక్తి యనిపించుకొనదు. ఆట పాట మాట మీటల మేటియగు నాపుంభావ సరస్వతీ మూర్తినిఁ గూర్చి చెప్పుటకు ననుబోటి యల్పజ్ఞుఁడే పాటి? వారలకు వారలే సాటి. శ్రీ నారాయణదాసుగారితోఁ దులదూగఁగల పండితులు, బహుభాషావేత్తలు, నృత్యగానప్రవీణులు నిదివరలోఁ బుట్టలేదు. వర్తమానమున లేరు. భవిష్యమున నుండఁబోరని నా యచంచల విశ్వాసము.

శ్రీ హరికథా పితామహుల కథాకథన సామర్థ్యము సమగ్రముగ నభివర్ణించి వ్రాయను శక్తి నాకు లేకున్నను, నా యల్పమేధ కవగతమైన మేరకు నీ వ్యాసమున విన్నవించి ఆదిభట్లాన్వయ సుధాకరున కక్షర నీరాజన మొసంగి తృప్తిఁ గొందును. ఈ నా సాహసమును సారస్వత విభూషణులు మన్నింతురు గావుత.

హరికథారంగ ప్రవేశమునకు ముందు సంతరించుకొను వారి యాహార్య వైశిష్ట్యము కథకలోకమున కొక కసటువోని యాదర్శము. నున్నఁగా దువ్విన మధ్యపాపిడిఁ దీర్చిన యుంగరాల ముంగురుల వెనుక సిగలో ముడిచిన చిన్ని పూదండ, ఆజానుబాహువులకు కలంకరణ ములై మెఱుగారు సువర్ణ కేయూర ఘంటాకంకణములు, డాకాలఁదొడి గిన జాంబూనద గండపెండెరము, వ్రేళ్ళఁ దళ్కులీను నవరత్న ఖచితాం గుళీయకములు, వెడదయురంబున నాభివనుక వ్రేలు హేమ పతకరా జిత గ్రైవేయము, దాసుగారి యపూర్వ కడియాలములు.

ఉ॥ దాసుని మేనఁ గమ్మనగు తావులఁజిమ్మ సువర్ణ, మర్థతా
వాసితమౌట; మాదృశులు భాగవతుల్ మెయిఁదాల్చ పైడి, దు
ర్వాసనఁగొట్టు "ముప్పివలు పట్టణవీధులవోలె వాఙ్మయా
భాస నికృష్ట డాంబిక వివర్ధిత కర్దమ భావమగ్నమై

రంగారు బంగారు వర్ణముతో మిఁమిల మెఱయు పట్టుధోవతి, నడుమున బిగించు బనారసు కండువా, మైసలఁదిన మంచి గంధపు గుబాళింపు, కాళ్ల గజ్జెలు, కుడిచేతఁ బట్టిన చిప్పతాళములతో విలక్షణముగాఁ గన్పట్టు తన్మనోజ్ఞమూర్తి ద్రష్టల హృదయముల హత్తుకొని, పరోక్షమున సైతము స్మరించు మాత్రముననఁ బ్రత్యక్ష గతి సాక్షాత్కరించుననుటకు నాయనుభూతియే నిదర్శనము ప్రక్కవాద్యముల శ్రుతులు బసలోనే సరిచేయించుకొని రంగస్థలప్రవేశ మొనర్చుకే తడవుగ గజ్జెఁగదలించి ఒక ప్రబోధగేయముతో కథాప్రారంభ మొనర్చెడి వారు. గేయము తోడనే నృత్యము జతఁగొని సభాసదుల మంత్రముగ్ధులఁ గావించెడిది. మధ్యమధ్య 'శంభో' యను మేఘగంభీరనిస్వనము దిక్కులఁ బిక్కటిల్లి హిమాలయశిఖరముల నెలకొన్న కైలాసమువరకుఁబయనించి సదాశివుని రాగభరితమగు ప్రత్యుత్తరమందుకొని తిరిగివచ్చి నట్లనిపించెడిది.

ఉ॥ శ్రీయుతుఁడాదిభట్టకుల సింధుసుధాకరమూర్తియైన నా
రాయణదాసు, మేఘరవరక్తి నెసంగెడి కంఠ మెత్తి "శం

భో" యని యెల్గిడన్, బదులు మ్రోతలతో రజతాద్రినుండి "రా
వో" యని యాతనిం బిలుచుపోల్కి ధ్వనించు సదస్యకోటికిన్

శివనారాయణు లిర్వురూ నటరాజులే యని నిర్ధరించు సత్యమున కీ సదస్యానుభవ మొక చక్కని తార్కాణ మనఁదగును. ఇఁక కథాగమనమున సప్రమాణములగు వేదసూక్తులు, పూర్వకవిప్రణీతము లగు శ్లోకములు నుదాహృతము లగుచుండ కథావస్తువు పరిపుష్టమై శ్రోతృగణముల నుత్తేజపరచి, తాదాత్మ్యసిద్ధి నొదవించి తనలో నైక్యము నొనరించుకొనెడిది.

శా॥ భావం బొప్పవలెన్ ముఖాన, సిసలౌ పాండిత్య మేతత్కళా
జీవంబై రససిద్ధిఁ బొందవలె, నౌచిత్యం బుపన్యాసవా
ణీవిన్యాసమునన్ ఘటిల్లవలెఁ, దానే సర్వపాత్రంబులై
ప్రావీణ్యం బలరన్ నటింప లె విద్వాంసుఁడు సమ్యగ్గతిన్.

అను నాపద్య, మాకళాప్రపూర్ణుని దృశ్యశ్రావ్యయక్షగాన పాత్రౌచితీ సంస్కారసన్నివేశావిష్కృత సత్యానుభవమునఁ బొటమరించినది. ఆంగికాభినయ స్ఫోరకములగు హావభావము లతిరిక్తములుగాక నవరసభరితములై, నైజరామణీయకములై, యా కళానిధి ప్రత్యేకత కభిజ్ఞములుగా భాసిల్లినవి. సమయస్ఫూర్తి, సరసవచస్సంపన్నత శారీరసౌష్ఠవము, స్వరకల్పనాచతురిమ, భరతశాస్త్రానుగుణ్యముగ బహుగతుల సాగు చిందులోన వసందు, కింకిణీచాలనధ్వానమున పారిభాషికముగా, వ్యాఖ్యానముగా, విన్పించు కీర్తనాహృదయస్పందనము, శ్రీదాసవర్యుల ప్రతిభాప్రాగల్భ్యముల కజరామరత్వముఁ జేకూర్చిన వనుట నిర్వివాదాంశము.

హరికథా పితామహుల హాస్యరసము వ్యంగ్యార్థగర్భితమై, సభాస్తారుల కాత్మపరీక్షావత్రమై, సంతుష్టాధిక్షేపణమై, అజ్ఞానతిమిర భాను

మంత్రమై, సదసద్వివేక సంధాయకమై, జీవితపరివర్తనకు ప్రబోధమై గిలిగింతలతోఁ బలువింతల సంతరించెడిది.

శ్రీ నారాయణదాస వర్యుల హరికథా కాలక్షేపములు మా నర్సాపురములో "హనుమత్సందేశము" రాజమహేంద్రవరమున 'సుగ్రీవ సఖ్యము' రాజోలులో "రుక్మిణీకల్యాణము" మాత్రము విను భాగ్యము నాకు గల్గినది. ఉంగుటూరులో "భక్తమార్కండేయ చరిత్రము" ప్రారంభింపఁ బడిన పావుగంటలో ననూయాపరుల యాగడమువలన నాకస్మికముగ నాపివేయవలసి వచ్చినది. ఆ దుస్సంఘటన సదస్యుల దురదృష్టమనుకొన తప్పదు. కానిచో కళాసరస్వతి కఖండరస సామ్రాజ్య పట్టాభిషేక మహోత్సవ మానాఁడటఁ జరిగియుండెడిది.

రాజమహేంద్రవరమున వీరేశలింగం హైస్కూలులో పైయంతరువున సుగ్రీవసఖ్య కథాగాన మేర్పాటు చేయఁబడినది. పట్టణమందలి ప్రముఖులు, విద్యాధికులు, హరికథకులు, మహిళామణులుఁ బెక్కురా సభకు విచ్చేసిరి. శ్రీ దాసుగారి వెనుక భయభక్తులతో శ్రీ వాజపేయ యాజుల సుబ్బయ్య భాగవతులు, శ్రీ నేతి లక్ష్మీనారాయణ భాగవతులు, సహకారగానము చేయుచుండిరి. దాసుగారి యన్న పేరన్నగారు తంబురా మీటుచుండ, శ్రీ పేరి రామమూర్తి (పేరిబాబు) గారు వీణావాదన మొనర్చుచున్నారు. శ్రీ వీరేశలింగంగారి మృదంగం. ఆ వేదిక సరస్వతీ పీఠముగా గోచరించినది.

శ్రీ దాసుగారు సంకీర్ణజాతి ధ్రువతాళములో శ్రీరామ స్తుతి సేయుమందుకొని స్వరశబ్దముల నోటఁ బల్కుచు, ఘాత మాత్రము తాళపు చిప్ప ధ్వనితో వెల్వరించుచు నృత్యముఁ జేయుతరి శ్రీ నారాయణదాస మనీషి "లయబ్రహ్మ" బిరుదము శతశాతము సార్థకమై యాశ్చర్యానందములఁ గల్గించినది. ఏలయన అంత బహుళాక్షర సంఖ్యగల తాళము మాదృశులు వ్రేళ్ళపై లెక్కించుకొనుచు శ్రమించినఁగాని నిల్వదు.

హనుమ తనకు రామనామమువలె శ్రీ దాసుగారు ప్రతిరోమకూపము లయవిన్యాసభరితమై కొమ్ములు తిరిగిన గాయకులకుఁ గూడ వారి మానవాతీత శక్తిసంపన్నతను ఋజువు చేసినది. వారభినవ నటరాజులు.

బహుముఖప్రజ్ఞాశాలి, బహుభాషాకోవిదుడు, పండితకవిచక్రవర్తి, వరతత్త్వవిదగ్రణి, ప్రతివాదిభయంకరుడు, సునిశితవిమర్శకాగ్రేసరుడు హావభావప్రదర్శనచతురుడు, సంగీతసాహిత్యసమరాంగణ సవ్యసాచియు నగు శ్రీనారాయణదాసశిరోమణి యవతారపురుషుడని నిర్ధరించుటలో సందియము మావంతయు లేదు. "ఆదిభట్లదాసు సంగీతసాహిత్యాల సరితూచేత్రాసు" అన్న శ్రీశ్రీ వచనమెన్ని యుగములకైన సముచితమునకాదు.

దృశ్యశ్రవ్యకావ్యమగు యక్షగానము శ్రీ దాసవర్యుల కృషి ఫలితముగా సారస్వతప్రపంచమున సముచితోత్తమస్థానమును సంపాదించుకొన్నది. ఆనాట్యకళావిశారదుని కాలిగజ్జెకదలింపులో, ఆంగికాభినయములో భావపూరితమగు భాష స్ఫురించినది. ధ్వనించినది.

మా నర్సాపురంలో శ్రీ దాసుగారు "హనుమత్సందేశము" కథాగానము చేయుచు సముద్రలంఘన ఘట్టమున "రామకరుణ నపార భవాంబుధి లంఘించిన కపివీరుడ, ఈ మున్నీటిని దాటలేనా ? యేను సమీరకుమారుడ" నను కీర్తన నెత్తుకొని తన దీర్ఘబాహువులు వెనుకకు ముందుకు నూపుచు, వారి యుపాసనాదైవము నిజస్థూల కాయమునకు లఘుత్వము గల్గింప, బంతివలె పైకి కుప్పించిన సమయమున, నాయనయే వాయుపుత్రుడగను, రంగస్థల ముత్తుంగ తరంగ ఘోషాఘూర్ణిత దక్షిణాంబుధిగను దోచెననుట నా యనుభవసిద్ధ సత్యము. తరువాత మారుతి లంకానగరమున శింశుపావృక్షము క్రింద శ్రీ రామ వియోగానల సంతప్తయై కృశించిన శరీరముతో, కన్నీరోడికలుగట్టు చెక్కిలి దోయితో, వేడినిట్టూర్పులతో విహ్వలమతియై, పగిలిన హృదయము నాశతో నదుకకొనుచు, కన్నట్టిన జగన్మాత, సీతనుగని, పొంగివచ్చెడి

దుఃఖములో నడంచుకొనుచు, నిస్పృహతో దూలిపోవు చు "అమ్మా! యిట్లుంటివ సీతా ?" యని యాత్మగతమున జాలిగదుర ననుకొను, భావస్ఫోరకమగు కీర్తన డగ్గుత్తిత్తో బాడుచు శ్రీ దాసుగారు సల్పిన నృత్యము కాని నృత్య మనన్య సామాన్యమని చాటి చెప్పుటకు సంశ యింపను.

వివిధావస్థలలో నున్న పాత్రలను వాస్తవికత కెడగాని విధంబున జిత్రించి చూపుటలో దాసవర్యులు సిద్ధహస్తులు. ఉదాహరణకు "జానకీ శపథ" మందొక పద్యముటంకితును (సందర్భము) వాల్మీకి యాశ్రమ మున నున్న సీతాదేవిని గొనితెమ్మని శ్రీరామాజ్ఞను శిరసావహించి సౌమిత్రి యటకు బోయినప్పుడు కంటబడిన జానకీమూర్తి నీ రీతిని పద్య రూపమున దాసుగారు సాక్షాత్కరింపజేసినారు ఇందెంత సహజత్వ ముట్టి పడుచున్నదో భావుకులు గమనింతురుగాక.

సీ॥ పిరుదుల మీరి యుపేక్షింపంబడు నెరి
కొనలందు ముత్తెపు జినుకుతోడ
సంతత బాష్ప ప్రచారిత న్మాసి జా
డలువడి వాడు చెక్కిళులతోడ
అన్నపాన సుఖంబు లంటక, కళతప్పి
మిక్కిలి చిక్కిన మేనితోడ
నలుదట్లం నాటుక పులుగుల బెర్లింప
దొడరిన బెదరు కందోయితోడ

గీ॥ స్నానమయి నారచీరను సగముగట్టి
మిగిలిన సగంబు నొక పాదమీద నార
వైచి నిలుచున్న సీతను జూచి, కొంత
పడికి రామానుజుండు పోల్చి పలికె నిట్లు.

నాటకీయకళ నారాయణదాస యక్షగానప్రబంధములలో, నవనవోన్మేషితమై, నవరసభావపుష్టమై, నైసర్గికమై, భావుకకోటికి పరిపూర్ణానందము ప్రసాదిస్తుంది. ప్రస్తుతు లందుకుంటుంది.

రాజోలుతాలూకాలో తాటిపాకవాస్తవ్యులు శ్రీ కొచ్చెర్లకోట రామరాజుగారు సంపన్నగృహస్థులు. సంగీతవిద్వాంసులు. వారు రచించిన స్వరజతు లిప్పటికి మంచి ప్రచారములో నున్నవి. ఎడమచేత కమాను పట్టుకొని వైలిన్ వాయించేవారు. అనేకమంది శిష్యుల కింట భోజనము పెట్టి విద్యాదాన మొనర్చిన యుదారస్వభావులు. వారిసోదరులు రామదాసుగారు వీణావాదననిపుణులు.

శ్రీ రామదాసుగారి కుమారుని వివాహసందర్భమున రాజోలులో శ్రీనారాయణదాసుగారి రుక్మిణీకల్యాణకథాగాన మేర్పాటుచేయుబడినది. ఆనాడు వారొక తత్త్వముతో కథాప్రారంభము గావించిరి ఆతత్త్వము

"నరహరిభజన నోటవరా, నోటనరా, నోటనకుంటే వినరా ||న||
ధనము లేకున్న దుఃఖమురా, చాల ధనము కల్గిన దానిదాచ
దుఃఖమురా ||న||
వనిత లేకుంటే దుఃఖమురా, చాలు వనిత కల్గితే దాని వంచ
దుఃఖమురా ||న||

అని. దానిం బాడి యాడుచు మానవజీవితం సరియైన మార్గంలో నడిపించకున్నచో దుఃఖభూయిష్ఠమని ప్రబోధించి, హరినామసంకీర్తన లోకద్వయసాధక మని నిరూపించిరి. తదుపరి ప్రకృతి పరమాత్మల సమైక్యమే "రుక్మిణీకల్యాణ" కథాంతరార్థమని నిర్వచించుచున్నట్టి వారు దావరించిన వేదాంతవిషయములు శాకలుతీరిన కళాతపస్వులచే శిరఃకంపముపాయనము గొన్నవి. శ్రీ దాసవర్యులుపన్యాసమున వెలయించు భావ భాషా మోహకు మైందొడవై, నాతికఠినమై, సుబోధకమై, సుగమమై, సున్నితమై, సులభగ్రాహ్యమై సొంపుల నింపుకొన్నది.

"లేజవ్వానంబువసందు" అను కీర్తన నెత్తుకొని, మోరాశబ్దము నుపమించునట్లు, సహకారము చేయు పేరిబాబుగారు "అపవ్పఛీ పవ్పఛీ పవ్పఛీ" యని చెవికుండలము వాగాడం దలంద్రిప్పుచు పల్కు శబ్దంబులకు "ఛీఛీఛీ" యను ముక్తాయింపుతో మరల జాగాకు వచ్చి పల్లవి నందుకొన, సభారంగము పార్శ్వ స్థానములతో ప్రతిధ్వనించినది. ఆనాడు పై పద్ధతితో పాటు తీరచుకు క్రొత్తముక్తాయికూడ కీర్తనచివర చోటు చేసుకొన్నది. కథాగానము జయప్రదముగా ముగిసినది.

రాత్రి భోజనసమయమున తన ప్రక్కనే కూర్చునియున్న శ్రీదాసుగారితో, రామరాజుగారు రహస్యముగా "అయ్యా! దాసుగారూ! మీరు కీర్తన పాడుచు టుర్రంటూ వచ్చినారు. దానికేమైన సంప్రదాయ విశిష్టమగు నర్థమున్నదా?" యని ప్రశ్నింప, దాసుగారు నవ్వుచు "రామరాజుగారూ! మీకీ ఉదయం వైలిన్ వాయించుచు, దానిమీద కిర్రు మనిపించినారు. మీ కిర్రున కేమి యర్థమో, నా టుర్రునకు గూడ నదియే యర్థ" మని ప్రత్యుత్తరించి, సమయస్ఫూర్తిని వెలయించిరి.

"గద్యం కవీనాం నికషం వదన్తి" యను సూక్తికి, శ్రీ దాసవర్యుల రచనలలో గద్యము ప్రత్యేక స్థానము నాక్రమించినది. యథార్థ రామాయణ మండలి గద్యమును మెచ్చుకొని శ్రీ దాసుగారికి శత్రుస్థానములో కొంతకాలము నిల్చిన శ్రీ హరి నాగభూషణంగారు, అట్టి గద్య మల్లగల కవి నభూతో న భవిష్యతి" యని బహిరంగముగ వ్రాయుట, సమ్మతించుట జరిగినది. శ్రీ దాసుగారు వాఙ్మయములో స్పృశింపని విషయ లేదు. సమస్త శాస్త్రములు వారికి కరతలామలక ప్రాయములు.

తాడేపల్లిగూడెం తాలూకా ఉంగుటూరులో శ్రీ నారాయణదాసుగారి ప్రియశిష్యులు, స్వర్గీయ శ్రీ వాజపేయాజుల సుబ్బయ్యదాసుగారు, గురుదేవుల నాహ్వానించి, పది దినములు వారిశిష్యప్ర

శిష్యులచే నొజ్జల సమక్షమున కథాగానములఁజేయించి హరికథాపితామహుల ఆశీస్సులఁబొందు భాగ్యము కల్గించిరి. నేనొకనాడు "కలిప్రతారణము" (నలచరిత్ర) చెప్పుచుంటిని. శ్రీదాసుగారు నావెనుక కుర్చీపై చుక కూర్చొని, నేను పున్నాగతోడిలో "ప్రాణేశ! పయన మావఁగలేవా? నేనడువఁజాలకుంటి, శ్రమఁగొంటి" యను కీర్తన బాడుచుండ సహకారగానముజేసి "పండితాస్సమదర్శినః" యనుమాటకు సార్థక్యము గల్గించిరి. నాఁడు నాయదృష్టమును దలంచుకొని "ధన్యోఽస్మి" యనుకొంటిని. నారచనల వారుమెచ్చుకొని "బాగా వ్రాశావురాస్వామి!" యని నన్నుత్సాహపరచుట, వారికి నాపట్లగల వాత్సల్యమే కారణముగాని, లేనిచో నేనెంత? నాకవితావిజ్ఞానమెంత? అట్టిచో వినమ్రుడనై, కృతజ్ఞతా పురస్సరముగా, నాశువుగ నొక పద్యమిట్లు చెప్పగలిగితిని. అట్లు చెప్పుటకుగూడ వారి పరిపూర్ణకటాక్షమే కారణము. ఆపద్యమెద్దియన—

గీ॥ పండిపోయిన పాండితీపటిమకల్గు
ననుభవజ్ఞుల రచనంబు, లంబుధిపయి
గడు సమర్థత సాగు నౌకాచయంబు;
లన్మదాదుల రచనంబు, లరయ; వర్ష
జలములన్ బారు సైడుకాల్వలను, పెకిలి
దనమునం ద్రుళ్లివడు కాగితపుబడవలు.

ఉంగుటూరులో శ్రీసుబ్బయ్యదాసుగారు హరికథాపితామహుల తైలవర్ణచిత్రపటము, శ్రీమల్లాది శ్రీరామమూర్తిగారిచే తయారు చేయించి, శ్రీదాసుగారి సమక్షముననే నావిష్కరింపఁజేసిరి. అత్తరి నేను సభాసదుల నుద్దేశించి "సోదర సోదరీమణులారా! యనిసంబోధింప విని, దాసుగారు ఓరేస్వామీ! అట్లనరాదు. అమ్మలారా అయ్యలార!" యని సంబోధింపవలెనని, నన్ను వారించిరి. నాటినుండి యీనాటివరకు,

నువన్యాసవేదికపై సదస్యులనట్లే సంబోధించుచుంటిని. అదినాకు గురూపదేశమైనది.

తణుకుతాలూకా భట్లమగుటూరోక కుగ్రామము అట నేటివరకు జరుగుచున్న శ్రీరాధాకృష్ణత్యాగరాజ నారాయణదాసోత్సవము "లభినయ తిరువయ్యారు"గ దానికి ప్రతిష్ఠదెచ్చిపెట్టినవి. ఆంధ్రదేశమున ప్రఖ్యాతి వహించిన గాయకులు కథకులు, మార్దంగికులు, వీణావాయులీనావాద్యనిపుణులు ఆ మహోత్సవమున పాల్గొనిరని చెప్పుట అతిశయోక్తి యనిపించుకొనదు. దానికి వ్యవస్థాపకుడు స్వర్గీయ శ్రీ కొంతం గంగరాజు ఆయన ఆహ్వానమును మన్నించి శ్రీనారాయణదాసుగారు రామహోత్సవములలో పాల్గొని కథాగానము చేయ విచ్చేసిరి. మరునాడు వారి కథాకాలక్షేపము. రాత్రి 9గ॥ల నుండి 12గ॥ల వరకు నన్ను దగ్గర కూర్చొబెట్టుకొని, అనేక విషయములు బోధజేసిరి. అవి యన్నియూ నా జ్ఞప్తియందుంచుకొన్నచో నేనొక మహాపండితుడనై యుండెడివాడను. "A single conversation accross the table is better than ten years mere study of books" అన్న Long Fellow కవియొక్క మాట, అనుభవముఖ్యముగ నాకు సార్థకమనిపించినది. ఆ ప్రసంగములో "వాద్యములు కృతకములు, దైవదత్తమగు గాత్రమును విజృంభింపజేసి, సల్పుగానమే సహజము, సజీవము" వని సెలవచ్చిరి. తంబురా శ్రుతిలో గాత్రరవళి మేళవమందినదని తృప్తిపడుట శుద్ధభ్రమ, కొయ్యతో గొంతు కలియుట విరుద్ధమని స్పష్టీకరించిరి.

శ్రీ. నారాయణదాసుగారు రంతెర్ముఖులు. వారు నాతో మాట్లాడుచు, మధ్యమధ్య ప్రకృతి కతీతమగు పారలౌకిక పథమున విహరించి, మరల మెట్లు దిగివచ్చి "ఏమిరా! స్వామీ! నీకింతవరకు నేమిచెప్పితి" నని ధారణనిల్పుకొని, తదనంతర విషయము శ్రుతపర్చసాగిరి అప్పుడు నాకు. "There is no meaning in the writting of biographies of poets, philosphers and yogis. The reason is

they do not live in their outer actions which are visible to the people" అను నరవిందుని సూక్తి స్ఫురించినది.

విజయనగరంలో శ్రీనారాయణదాసనద్గురు సన్నిధానమున హరికథాధ్యయనము చేయు భాగ్యమునకు నేను నోచుకొనపోవుట నాదురదృష్టము. కాని నేనేకలవ్యసదృశుడగు ఛాత్రవరమాణువును, పరోక్షమగు వారి వాత్సల్యమే నన్నొక వాగ్గేయకారునిగా, కథకునిగా మలచినదని నాసంపూర్ణవిశ్వాసము. "శ్రీనారాయణదాసగురవేనమః" యని వారి ఛాయాచిత్రమునకు తొలిమ్రొక్కులిడక, కావ్యరచనకు కలము బట్టను.

సంస్కృతమున కీర్తనల్లు నభిలాష, శ్రీదాసుగారు మంగళాశాసముఖ్యముగ, స్వహస్తముతో నాకు, తాను పాత్రము బహూకరించుచున్నట్లు వ్రాసి సంతకము జేసి "హరికథామృత" మనుగ్రహించిరి. అది నేను సమన్వయించుకొనజాలని ఘట్టములు పండితులవలన తెలుసుకొనుచు నాశక్తితో పఠించితిని. సంస్కృతమున కీర్తన వ్రాయుటకు సాహసించి, మునుముందు, దాసుగారి శ్లోకము నాధారముగ తీసుకొంటిని. ఆశ్లోకమున నాఖరిపాద మించుమించు నాకీర్తనకు పల్లవియయ్యెను.

కవితాజగత్తులో యక్షగానసరణి నలతిగా బరిగణించుటయు' పద్య కవిత్వమునకే ప్రాధాన్య మిచ్చుటయు, జరుగుచున్నది. "పదకవితలు ముదిలంజలు" నను వెటకారము, పూర్వమునుండియు గొన్ని నోళ్ళను మెలవరచుచున్నది. పద్య గద్య గేయసమ్మిళితమగు ప్రక్రియయే కవిత్వ మనిపించుకొను ననియు. యక్షగాన ప్రబంధ మల్ల నేర్చినవాడే కవిశ్రేష్ఠుడనియు శ్రీ దాసుగారీ క్రింది పద్యములో వెల్లడించినారు. పరికింపుడు,

గీ॥ కవులలో నెల్ల శ్రేష్ఠుఁడుగాని యక్ష
గాన కావ్యము రచియింపఁ గలఁడె యొరుఁడు?
పలుకుచెవి చన్నుదోయి యిర్వంకలఁజవి
గైకొనక కైతలల్లుట యూకదంపు

ఇదే భావంతో, గేయ కవిత్వమును విమర్శించు విమర్శకు నుద్దేశించి సార్థకనాముడగు ఆంగ్లకవి Words worth యీ విధముగ వక్కాణించాడు

Scorn not the sonnet crit:c!
you have fowned mindless of its
honours; with this key
Shakspeare unlocked his heart

శ్రీ నారాయణదాస వర్యులలో సరస్వతి, నృత్య సరస్వతిగా, గాన సరస్వతిగా సాహిత్య సరస్వతిగా మూడు రూపముల మూర్తీభవించి భాసించినది. "రూపమేవా స్యైతన్మహిమానం వ్యాచష్టే" అను శ్రుతిసూక్తి దాసుగారి మనోజ్ఞ సుందరాకృతిలో మహిమోపేతమగు వ్యక్తిత్వమునకు నాంది పలికినది.

చ॥. ఘనులై పుట్టుచునుంద్రు కొందఱు, కృషిన్గావించి యుత్తీర్ణతన్
గనుచున్ గొందఱు పొందనేర్తు ఘనతన్ గాలక్రమం బక్రమం
బనఁగాఁ గొందఱ కంటగట్టఁబడు, యాథార్థ్యంబుఁ బాటింపకే
ఘనతల్; మూడవకోవ యెక్కుడగుమన్ గన్పట్టు నిప్పట్టునన్.

Some are born great, some become gr eat and greatness is thrust upon Some

-:Shakspeare:-

అను నాంగ్లేయ కవి నిర్ధారణలో శ్రీ దాసుగారు మొదటికోవకు జెందిన వారని వారి బాల్యమే నిరూపించినది. తన నాల్గవయేటనే పోతన

కవి విరచితమైన భాగవతదశమస్కంధము ధారాళముగా, రాగవరుసతిని జదివి శ్రోతల నాశ్చర్యచకితుల గావింపగలైను. జన్మసిద్ధమగు ఘనత యాయన ప్రత్యేకతకు మచ్చుదునుక.

శా॥ శిలా బాలా జాతా చరణరజసా యత్కులశిశోః
సఏవాయం స్సూర్యస్పదిది నిజపాదైర్గిరి శిలామ్
స్పృశన్ భూయో భూయో నఖలు కురుతే కామపి వధూమ్
కులే కశ్చిద్ధన్యో ప్రభవతి నరః శ్లాఘ్యమహిమా.

ఇతరులు చేయలేని పని చేయుట సామర్థ్యము. అట్టి సామర్థ్యము నకు మిగిలి, అసాధ్యమునను సాధించుట మేధావిత. కొమ్ములుతిరిగిన గాయకకోటికి కొఱుకుపడని "పంచముఖ" తాళప్రదర్శన శ్రీనారాయణ దాసుగారి అమేయమేధాశక్తి కడియాలము. ఒక చేతితో త్రిశ్రగతి, రెండవ చేతితో చతురశ్రగతి ఒకకాలితో ఖండగతి, మరియొక కాలితో మిశ్రగతి, నోటితో సంకీర్ణగతి, యేకకాలము నడిపించి కీర్తన పాడుచు కోరినజాగాకు ముక్తాయి నిచ్చుట, సామాన్యుల కలవికాని విషయమని నొక్కి వక్కాణింప వచ్చును.

Doing easily what others find difficult is talent,
Doing what is impossible for talent is genious.

శ్రీనారాయణదాసమనీషి కళల నన్నింటను మిన్నగా దీర్చిదిద్దిన హరికథాకథన మీనాడు వెఱ్ఱితలలువైచి, తొట్రినాగన్నవదములతో దొంటిగౌరవమును గోలుపుచ్చుకొనుచున్నది. అట్టి దుర్దశ కల్గుటకు, భావదాస్యమున బ్రతుకు సాగించుకొన, పామరజనుల మెప్పునకు పాకులాడు భాగవతుల దిగజారుడుదనమే ప్రబలకారణమని చెప్పుటకు సాహసించు నాహృదయావేదన కొందరైనను గ్రహింపకపోరు.

ఆచార్యస్థాన మలంకరించి హరికథకుడు అధఃపతితులను సైతము పరమార్థప్రబోధముతో సంస్కరింపదగునుకాని, జానపదుల మాఘ్యము

పనిముట్టుగా గ్రహించి, అశ్లీలపదప్రయోగముతో, నసభ్యవర్తనతో, నసహ్యకరవికటాట్టహాసములతో, నాతతాయితనముతో రంగస్థలమున వీరవిహారము సేయుట గౌరవప్రదము కాదు. శ్రీనారాయణదాసమహాశయులు సంతరించిన పూలబాటపై బల్లేరుకాయలజల్లు నల్లరివని, యభ్యుదయకారి యనిపించుకొనదు. వారి యాత్మకశాంతి కల్గించుట గురుద్రోహముకాని, గుర్వాజ్ఞాపరిపాలనావిధాన మెన్నటికిని గానేరదు "ప్రమాదో౽ధీమతామపి". ఇప్పటికైనను, హరికథాపితామహుల యాదర్శము, సదాశయము గుర్తించి, స్వయంకృతాపరాధములకు క్షమార్పణము జెప్పుకొని హరిదాససోదరులు, తామారాధించు కళా పవిత్రతను కాపాడ యత్నింతురుగాక. శ్రీదాసవర్యుల యాత్మ, అండదండలుగా నిలిచి, మనల ప్రగతిపథమున నడిపించుగాక. "తమసోమా జ్యోతిర్గమయ". సర్వేజనా స్సుఖినో భవంతు. సమస్తసన్మంగళాని భవంతు.

గీ॥ చిన్నకుంజిన్న, పెద్దకుంబెద్ద, బాహ్య
దృష్టి కందండు, సత్యమూహింప, నాత్మ
తత్త్వమున సిద్ధిబొందు నంతర్ముఖుండు
ఆదిభట్టాన్వయాబ్ధి సుధాంశుం డతండు.

శ్లో॥ కరోమితే నమస్కృతం, సదామదీప్సితప్రదమ్
శుభాశిషం ప్రదేహి, తత్సహాయమాత్ర మర్థితం
మయా; సరస్వతీకటాక్షలబ్ధగానసాహితీ
చణః త్వమేవ, దీక్షితార్చితః త్వమేవ హేగురో!



# అంబరీష చరిత్రము

డాక్టర్ శ్రీ యమ్. పాండురంగారావు

బ్రహ్మశ్రీ నారాయణదాసుగారు తమ అంబరీషచరిత్ర మను హరికథను శ్రీవిజయనగర గోపాలునకు కృతి యొసంగిరి. ఇందలి కథావస్తువు భాగవతములోని నవమస్కంధము నుండి గ్రహింపబడినది. కావ్యమునకు ప్రధానమైనది వస్తువు. దీనిని గూర్చి రామరాజ భూషణుడు వసు చరిత్రలో నిట్లు చెప్పెను.

ఉ॥ కేవల కల్పనా కథలు కృత్రిమ రత్నము; లాద్య సత్కథల్
వావిరిఁబుట్టు రత్నము; లవారిత సత్కవి కల్పనా విభూ
షావహ పూర్వవృత్తములు సానలఁ దీరిన జాతిరత్నముల్
కావున నిట్టి మిశ్రకథగా నొనరింపుము నేర్పు పెంపునన్.

దీనిని బట్టి ఉత్పాద్యవస్తువు కృత్రిమ రత్నము. ప్రఖ్యాతవస్తువు గనిలో పుట్టిన రత్నము. అనగా మెఱుగుపెట్టని రత్నము. మిశ్రవస్తువు సానలుతీరిన జాతిరత్నము. దాసుగారు కథావస్తువును భాగవతమునుండి గ్రహించినను కథా భాగమున కవసరమైన మార్పులను కూర్పులను చేర్చి మిశ్రకావ్యముగా రచించిరి. కేవలము భాగవతమునందలి కథను యథాతథముగా వ్రాసియున్నచో కవికి స్వాతంత్ర్యము లేదు. అతడు తాను కావ్యమున కనుపింపజాలడు. తన స్వాతంత్రతను నిలుపుకొనదలచిన కవి మూలకథ యొక్క అంగిరసమునకు భంగములేకుండ మార్పులు కూర్పులు చేయును. కవిత్రయము వారి పద్ధతి ననుసరించుటచేతనే వారి

భారతము స్వతంత్ర కావ్యముగ వన్నెకెక్కినది. ఆ మార్గమునే యనుస రించి మూల భాగవతములోని కథను అవసరమైన చోటుల దాసుగారు మార్పులనుచేసిరి. మూలములో అంబరీష రక్షణార్థము విష్ణుమూర్తి ఆయనకు తన చక్రము ననుగ్రహించెను. అంబరీషుడు ధనధాన్యాదుల యందు, ధనాగారమునందు నశ్వరమను బుద్ధినుంచి వానియందు విరక్తు డాయెను. అట్లయినచో "ఏవం భూత్ అసౌ కథం ప్రతిపక్షాన్ జయేత్" రాజ్యమునందు శ్రద్ధలేనప్పుడు ప్రతిపక్షులను ఈతడెట్లు జయించును ? అందువలననే అంబరీషుని వైరాగ్యమును చూచి విష్ణుమూర్తి రాజ్య రక్షణ కొఱకు చక్రము ననుగ్రహించెను. ఆ చక్రము 'ప్రత్యనీక భయావహః' – శత్రుసైన్యమునకు భయముకలిగించినది, భీతాభిరక్షణం' భయపడిన అంబరీషుని రక్షించునది.

ఇవ్విధమున పోతనగారు కూడ ఇదేవిధముగా వ్రాసిరి. 'ఇట్లు పుణ్య చిత్తుండు నీశ్వరాయత్తుండునై యల్లనల్లన రాజ్యంబు చేయుచున్న సమయంబున

ఆ. వె. అతని కీహమానె హరులందుఁ గరులందు
ధనములందుఁ గేళివనములందుఁ
బుత్రులందు బంధుమిత్రుల యందును,
బురమునందు నంతిపురము నందు.

అంత గొంత కాలంబున కమ్మేదినీ కాంతుండు సంసారంబువలని తగులంబు విడిచి నిర్మలుండై యేకాంతంబున భక్తిపరవశుండయి యుండ నారా చతపసికి భక్తలోక వత్సలుండగు పురుషోత్తముఁడు ప్రతిభట శిక్షణం బును, నిజ జన రక్షణంబును, నిఖిల జగదవక్రంబును నగు చక్రంబునిచ్చి చనియెనంత"– దీనిని బట్టి అంబరీషుడు రాజ్యపాలనము చేయుచున్న ట్లును, విష్ణుమూర్తి యతని రక్షణార్థము చక్రమునిచ్చి నటుల స్పష్టపడు చున్నది. దాసుగారు ఈ సందర్భమును మరొక విధముగా మార్చిరి.

గీ॥ ప్రాజ్ఞుఁడౌ మనపుత్రుడు ప్రజలనేలు
నీతి దప్పక కావున నీవు వాని
రక్షణము బొందుచుండు నేనీక్షణంబ
తపసినయ్యెద ననఁగ నత్తన్వి పల్కె.

(శ్రీ) కాంతునకెట్లు నీవు వనమున నేకాంతసేవసేయఁ జూచెదో యోకాంతుఁడ నీకట్లు పరిచర్య-లొనరింపఁగ నీ వెంటనుందు.

కం॥ అనివేడు సతీమణితో వనమునకుంబోయి యచట వానప్రస్థం
బునసుపనిషదర్థములు మునీశ్వరులచేత వించుముదముననతడున్.

దాసుగారు అంబరీషునిచేత రాజ్యత్యాగము చేయించి వానప్రస్థము స్వీకరింపజేసిరి ఇట చక్రము ప్రశంస లేదు. విష్ణుమూర్తి అంబరీషునకు చక్రమొసంగుటను దాసుగారు పేర్కొనలేదు.

దుర్వాసుడు అంబరీషుడు సలిలపారణము చేసెనని కోపించి కృత్యనుసృష్టించి, అతనిపైకి పంపెను. 'తాం ఆపతంతీమ్ జ్వలతీం అసిహస్తాం పరాభవం వేపయంతీమ్ సముద్వీక్ష్య న చచాలపదాన్నృపః' తన మీదకివచ్చుచున్న కృత్యనుచూచి అంబరీషుడు ఏమాత్రము కదలక యట్లేయుండెను. మఱి మీ యాపద యెట్లు తొలగవలెను? 'ప్రదిష్టం భృత్యరక్షాయాం పురుషేణ మహాత్మనా దదాహకృత్యాంతాం చక్రం క్రుద్ధాహిమివపావకః' - ఇచ్చట కృత్య మీదికి చక్రము పంపబడెను ఎవరుపంపిరి? అంబరీషుడా? విష్ణువా? 'పురుషేణమహాత్మనా' అని అన్వయము. ఇచట 'పురుషేణమహాత్మనా' అనగా మహాపురుషుడైన అంబరీషుడని అన్వయము చెప్పనగును. పూనా ప్రతిలో 'ప్రాగ్దిష్టం భృత్య రక్షాయాం' అని పాఠముగలదు. ఈపాఠము సరసముగానున్నది. 'ప్రాగ్దిష్టం' అనగా పూర్వమీయఁబడిన అని యర్థము. అనగా విష్ణుమూర్తిచే తనకు పూర్వము ప్రసాదింపబడిన చక్రమును అంబరీషుడే ప్రయోగించెనని యర్థము. అంతియే కాని విష్ణుమూర్తి వేరుగా

చక్రమును పంపలేదు. అట్లు పంపిన యెడల మొదట అంబరీషునకు చక్రము నొసంగుట వ్యర్థమగును. ఆ చక్రము అంబరీషునకు 'ప్రత్యనీకభయావహం' 'భీతాభిరక్షణం' కాకపోవును. తన రక్షణార్థము నొసగబడిన చక్రమునకు ప్రయోజనముండదు. అదియునుగాక మూలములో చక్రము నుపసంహారించినది కూడ అంబరీషుఁడే. ప్రయోగోపసంహారములు రెండును తనకొసగబడిన చక్రమునకు తానే చేయుట సమంజసము. ఇప్పట్టున పోతనగారు —

ఆ॥ వె॥ అప్రకారమెఱిగి హరివిశ్వరూపుఁడు
వెఱ్ఱి తపసి సేయు వేడ బంబుఁ
జక్క బెట్టు మనుచుఁ జక్రంబుఁ బంచిన
వచ్చెనదియుఁ బ్రళయవహ్నిపగిది.

విష్ణుమూర్తియే చక్రము ప్రయోగించినట్లు చెప్పెను. మఱియా చక్రము అంబరీషునికిచ్చినదో లేక విష్ణుమూర్తి వేఱుగా మఱొక చక్రమును ప్రయోగించెనో తెలియదు. దాసుగారి రచనలో నీ గొడవయే లేదు. అంబరీషుడు కృత్యనుచూచి భీతిల్లి ఆర్తశరణ్యుడైన శ్రీహరిని రక్షింపుమని వేడెను.

"ఇట్లు భక్తుఁడు వేడ శ్రీకృష్ణుచక్రము గడువేగమే కృత్యను దగులబెట్టి" యంబరీషుని రక్షించినట్లు వ్రాసిరి.

ఈవిధముగా మార్చుటవలన దాసుగారు అంబరీషుని గొప్ప తపోనిధిగాను, మహాభక్తునిగాను చిత్రించుటకు పూనుకొనిరి. వానప్రస్థమున కేగినట్లు వ్రాయుట నాయకుడైన అంబరీషుని సర్వోమాత్వమును ఋషిత్వమును స్థాపించుచున్నది. సర్వదా భగవంతుని నమ్ముకొన్న భక్తునికి సర్వకాలములయందును భగవంతుడే రక్షించుననియు, వేఱుగా ఆయుధరక్షతో పనిలేదనియు నిరూపించుటకు అంబరీషునకు విష్ణుమూర్తి

చక్రము నొసంగినటుల దాసుగారు వ్రాయలేదు. భక్తుని ప్రార్థన విని భగవంతుడే రక్షించవలయునని కవి తాత్పర్యము,

మూలములో దుర్వాసుడు ఏకాదశ్యుపవాసమున్నటుల పేర్కొన బడలేదు. ఇప్పట్టున పోతనగారు – 'అట్లు తిథియై వచ్చినముని వల్లభునకుఁ బ్రత్యుత్థానంబుసేసి కూర్చుండ గద్దియనిడి పాదంబులు గడిగి పూజించి సేమంబరసి తన యింటనన్నంబు గుడువుమని నమస్కరించిన' అని వ్రాసిరి. దాసుగారు—

"ఓ కరుణాకర యోనృపయేకాదశి నుపవసించి యెంతయునేని
ట్లాకులపడుచున్నవచ్చితి నాఁకటిచే బొగులుచుంటి నన్నంబిడలే"

అనిమార్చి వ్రాసిరి. ఇట్లు వ్రాయుటలో కవి కొంత ఔచిత్యమును గూడ సాధించెను. దుర్వాసుడు గర్విష్ఠుడు, కోపిష్ఠుడు అయినను ఋషికుల తిలకుడుగదా! అతని ఋషిత్వమునకు భంగము రాకుండ, అతనికి ఏకాదశీ వ్రతఫలితమును దక్కించుటకు చివరకు 'తపసితో పారణముసేసె ధరణీవిభుఁడు' అని ముగించెను. దీనివలన దుర్వాసుని ఋషిత్వము చెడకుండ పోషింపఁబడినది.

దాసుగారు కథాభావమును పెంచుటకు తమ హరికథలో మరి కొన్ని ఉపాఖ్యానములను చేర్చిరి. దుర్వాసుడు ఇంద్రుని రక్షింపుమని వేడుట మూలములో లేదు. ఆ సందర్భమున శ్రీకృష్ణ కృతమహేంద్ర గర్వభంగము అనగా గోవర్ధనోద్ధరణ కథ అంబరీషోపాఖ్యానములోనిది కాదు. ఈ కథ దశమస్కంధమునుండి గ్రహించబడినది. బ్రహ్మ చెప్పిన గోవత్సములను, గోపబాలకులను అంతర్ధానముచేసిన కథకూడ దశమ స్కంధమునుండి గ్రహింపబడినది. శివుడు దుర్వాసునకు చెప్పిన విష్ణువు తన మోహినీ రూపముచే తనను మోహింప జేసిన కథ అష్టమస్కంధ మునుండి గ్రహింపబడినది. కథలు అంబరీషోపాఖ్యానములోనివి కాక పోయినను కవిరస పోషణకు గ్రహించి వ్రాసెను కవి వ్రాయుచున్నది.

హరికథ కనుక దీనిలో ప్రధానముగ ఆనందించువారు శ్రోతలు గనుక వారికి రసానందము కలుగుటకై యీ యుపాఖ్యానములు మూలకథలోని భక్తిరసమునకు అనగా అంగిరసమునకు పోషకములైన అంగరసములుగా పోషింపబడినవి.

దాసుగారు తమ హరికథయందు తెలుగు దేశములోని చక్కని సామెతలను, జాతీయములను వాడిరి.

'కోట్లకొలది కొంపలు దీసి'
'తా నోరులను గొట్టు తన్ను దేవుడు గొట్టు'
'కానిదాని జేసి గడ్డిగరచితివి'
'కట్టె కుడుప కుండునే'
'నీరు పల్లమందు' 'ఒట్టుపెట్టు కొన్నవాడ'—

దాసుగారు మూలమునకు మార్పులు చేసినను అందముగానున్న భావములను, అలంకారములను తన హరికథా కావ్యములోనికి తీసికొని వచ్చుట మరువలేదు పోతనగారి క్రింది పద్యములలోని భావములను —

శా॥ బాలుండీతఁడు కొండదొడ్డది మహాభారంబు సైరింపఁగాఁ
జాలండో యని దీనిక్రింద నిలువన్ శంకింపఁగాబోలదీ
శైలాంభోనిధి జంతు సంయుతధరాచక్రంబుపై పడ్డ నా
కే లల్లాడదు బంధులారనిలుఁడీ క్రిందం బ్రమోదంబునన్.

మ॥ హరిదోర్దండము గామ గుబ్బశిఖరంబాలంబి ముక్తావళుల్
పరఁగన్ జాఱెడు తోయబిందువులు గోపాలాంగనాపాంగహా
స రుచుల్ రత్నచయంబుగాఁగ నచలచ్ఛత్రంబు శోభిల్లెఁద
ద్గిరి భిద్దుర్మద భంజియై జలధరాక్లిన్న ప్రజారంజియై.

రమణీయముగా దాసుగారు ఒక్క కీర్తనలో చక్కగా క్లుప్తముగా పొదిగిరి.

"ఈవైపునరండు మీరలందరు - నించుకైనవర్షబాధ చెందదు
గోవులతోడు తల్లిదండ్రులార - కుఱ్ఱలార పెద్దలారయనుచున్॥

తనదుచేయికామగాఁబై - ధరాధరంబున్ గుబ్బగా
ఘనవితానమామీద బట్టఁగా - బెను ముత్తెములాచుట్టు చిన్కఁగా
గొనకొని మిక్కిలి కుఱ్ఱవీడున్ - కొండ దొడ్డదని శంకింపకుఁడీ
పనిపడి నాదగుకేలల్లాడదు - బ్రహ్మాండమెల్లపైఁ బడనీయుని॥"

దాసుగారు హరికథలోని ప్రతికీర్తన తుదియందు కృతిపతియైన శ్రీవిజయనగరవేణుగోపాల ముద్రియుంచెను.

దాసుగారు రసానుగుణముగా పద్యములను రచించుటయందు కడు సమర్థుడు. భయానక రసమున కుదాహరణ—

సీ॥ అభ్రం లిహాదభ్ర విభ్రమాభ్ర భ్రమ
కృష్ణిల దీర్ఘ శరీర మమరఁ
బ్రళయకాలానల ప్రభను జక్రీకృతే
క్షణముల రౌద్ర మక్షయముగాగఁ
త్రైలోక్య కబళనోత్సాహ సూచక ఘన
వక్త్రత్ర యోగ్రత వాసికెక్క
బర్బు బర్బరకేశ పాశారుణ ప్రభ
కాల సంధ్యారాగ కాంతిఁ దనరఁ
తే॥ గ్రకచ కఠిన కరాళ దంష్ట్రలు వెలుఁగఁ
బదయు గోద్ధూత పాంసువు ల్పదలఁగప్ప
నేలఁ బదముల నింగిని నిడ్డ తలల
నత్తికొనివచ్చెఁ గృత్తి తామిత్తిపగిది.

తే॥ ఇట్లు తను మ్రింగుటకు విజృంభించి వచ్చు
ఘోరశక్తిని గనుఁగొని క్షోణివిభుఁడు

రహిని భీతిల్లి యార్త శరణ్యుఁడైన
శ్రీహరిని వేఁడె నిట్లు రక్షింపుమనుచు."

శృంగార రసమున కుదాహరణము—

సీ॥ "చిరుగంట కల్గిన చెక్కులితోడుత
నద్ది రాయద్ద మెట్లగును సాటి
ముక్కుప్రక్క మొదలు మోవిమూలవఱకు
బొల్పారు వంకకే పోల్కి గలదు
హొయలుఁగ బల్మాలు ఒకవైపు గన్పట్టు
పిన్న నవ్వున కెటు వెన్నెలయైన
నడుమ చక్కని నొక్కు తొడరినగడ్డము
పొలుపున కెద్దానిఁ బోల్పవచ్చు

గీ॥ ఛశిర యుక్త్యైకవేద్య స్వభావమహిమ
నుపమలుత్ప్రేక్షలుం దమ యూహఁ బన్ని
తప్పఁ బలుక్కుటగాక సత్యమున దరమె
యజునకైనను మఱివాని యబ్జుకైన."

వీరి వ్యాకృతివర్ణనలు ఆధునిక కవులవర్ణనలతో సాటివచ్చును.

సీ॥ చెరిసగ మెలమోవి చివురు నోళ్ళంబట్టి
కొఱుకుచుం గూసెడు కోయిలజత
పగిలిన దానిమ్మపండు గింజలు ముచ్చ
టలుపల్కుచుం దిను చిలుకలకవ
పూఁదేనె నొండొరు పుక్కిళ్ళఁ ద్రావుచు
జంటగనెగిరెడు తేంట్లజోడు
తీఁగెయుయ్యెలమీద నూఁగుచు ముద్దులు
గునియు చుండెడు పాలఁగువ్వలదుగ

తే॥ గీ॥ డెందమలరింపనత్తోట యందుఁ జేరి
యచట వింతలకెంతయు నబ్బమంది
నాల్గుమీఱఁగఁ బాలరాతిన్నెమీఁద
నొంటి యాడెడునొక్క జవ్వనినిఁ గంటి."

అలతి పదములతో వినువారలకు చదువువారలకు సులభగ్రాహ్యమై చవులూరించుచుండును. దానికీ పద్యమే యుదాహరణ—

ఉ॥ కామముఁ ద్రుంచినావు మఱి కంఠములో విషముంచినావు బ
ల్పాములఁ దాల్చినావు సులభంబుగ మృత్యువు గెల్చినావు దు
ర్భూమి వసించి నా వహహ పుత్తెను చేతధరించినావు నిన్
జామ భ్రమింప జేయుటెటు స్థాణుఁడ నిర్జిత పంచబాణుడా!

దాసుగారు తమ హరికథలో కందార్థములను, మంజరిని, తరువోజను వాడినారు. వచన రచన చేయుటలో దాసుగారు సిద్ధహస్తులు. హరికథకు వచనము ప్రాణము. ఈ హరికథలో విష్ణుమూర్తి మోహినీ రూపము నొంది శివుని భ్రమింపఁ జేయుటకు చేసిన శృంగార హావభావములను దెలుపుటకు చక్కని వచనము వాడబడినది. అది చదువునపుడు వినునపుడు, పాఠకులకు, శ్రోతలకు శృంగార రస సాక్షాత్కారము కలుగుననుటలో నతిశయోక్తి యెంతమాత్రమును లేదు. దుర్వాసుడు వైకుంఠపురమును జేరు సందర్భమున ఒక పెద్ద వచనము వాడబడినది. ఈ వచనమువలన వైకుంఠమును కవి కన్నులకు గట్టినట్లు సాక్షాత్కరింపఁ జేసినాడు.

ఈ విధముగా అంబరీషోపాఖ్యానమను హరికథాప్రబంధమును మూలమునకు కవి తగు మార్పులు కూర్పులు జేసి తన స్వతంత్ర ప్రతిభతో మిశ్రకథాప్రబంధముగ రచియించి సానలు తీరినజాతిరత్నముగా చెక్కి ఆంధ్రదేశములో తనకు గల హరికథాపితామహ బిరుదమును సార్థక మొనరించుకొ నెను.



# గజేంద్ర మోక్షము

శ్రీ పి. యస్. ఆర్. ఆంజనేయప్రసాద్.

"ధరణీ సురుడు, ప్రశాంతుడు,
గురుభక్తుడు, శుచియు, కల్పకుడు, పూర్వకవీ
శ్వర వాక్ప్రయోగ దక్షుడు,
కరుణామతి, యెవ్వరతడు కవియన బరగున్"

అని అప్పకవి వచించినాడు. మిగిలిన లక్షణముల లన్నింటి నటుంచి "పూర్వకవీశ్వర వాక్ప్రయోగ దక్షుడు" అనిన ప్రయోగము గమనార్హము. పూర్వ కవుల కవితారహస్యములు గ్రహించి వారి వాక్ప్రయోగముల సౌందర్యాస్వాదనము గాలించి వానిని ప్రయోగింపగల దక్షుడు కావలె కవి. శ్రీనారాయణదాసుగారు అటువంటి ప్రతిభా సామర్థ్యములు గలవాడు. వారిని గూర్చి ఒక వాస్తవ గాథ కలదు.

ఒకనాడు హరికథాగానము చేయుటకై వేదికపై నిలబడి హరికథ చెప్పమనెదరా, గిరికథ చెప్పమనెదరా అని శ్రోతల నడుగగా గిరికథ చెప్పవలసినదిగా శ్రోతలు కోరిరి. వెంటనే వారు గిరికథ ఆశువుగా చెప్పినారట. వారికిగల ఆ వైదుష్యమునకు, ప్రతిభకు శ్రోతలు ఆనంద దాశ్చర్యములలో మునిగినారని వినికిడి. ఆంధ్రదేశమునందు ఈరకమైన కథాగానప్రక్రియను ప్రవేశపెట్టిన మహనీయుడీయనయే. మహమ్మదీయులలో గానా బజానాలు, ఉత్తర హిందూదేశమునందు ఖవాలీలు కలవు. కానీ ఆంధ్రదేశమునందు గల ఈరకమైన హరికథాప్రక్రియ

మరెవ్వరును కానవచ్చుట లేదు. (శ్రీ)దాసుగారు యుగప్రవర్తకులలో నొకడు, జాతికి వైతాళికుడు. అందువలననే కవితాపితామహునకు వలె "హరికథాపితామహ" బిరుదము సార్థకమైనది.

"కావ్యమునకు కావ్యమే పూర్ణవ్యాఖ్యానము" అను ప్రాచీన సంప్రదాయమునకు అనుగుణముగా ఉత్తమ కావ్య ప్రకంశ మరియొక కావ్యము వ్రాయుటవలనగాని సాధ్యపడదు. కావ్యములోని సాధుత్వ అసాధుత్వములను నిర్ణయించుటకు ప్రమాణమేదియును లేదనియే చెప్ప వలసి యుండును. సహృదయుల అంతఃకరణ ప్రవృత్తి తప్ప.

"కావ్యం యశసేఽర్థకృతే వ్యవహార విదే శివేతర క్షతయే
సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మిత తయోపదేశ యుజే''

అని మమ్మటుని సూక్తి. మన భారతీయ కవిత్వ గౌరవమును ఆచంద్రా ర్కము చిరస్థాయిచేయు హేతువులుగదా ఇవి. "విశ్వశ్రేయః కావ్యం" అని ఆర్యోక్తి. ఈపై చెప్పినవన్నియు కావ్యము యొక్క ప్రయోజన ములు. 'వాక్యం రసాత్మకం కావ్యం' అనునది విశ్వనాథకవిరాజు వక్కాణ

"గజేంద్రమోక్షము" చూచినచో పై లక్షణములన్నియు పుణికి పుచ్చుకొనిన కావ్యముగా కనిపించును. ఇది వారికి యశస్సు నార్జించి పెట్టినది. మిగిలిన లక్షణములన్నియు ఒకటి వెంట నొకటి ఈ కావ్యము వలన సంప్రాప్తములే. గజ్జెకట్టి రంగస్థలముపై నిలబడి కథాగాన మాల పింప మొదలిడినచాలు. వారినోటి వెంట అనర్గళముగా గంగా ప్రవాహ ములో కథ సాగిపోయి జనుల హృదయముల నాకొట్టుకొనుచుండును.

దాసుగారికి శబ్దాలంకారములపై మోజు ఎక్కువ. కావ్యారం భము నందుననే

"ద్రౌపదికి దోడ! వెన్నెల దాకరిడ!
కల్మి చెలిరేడ! బత్తుల గాచుప్రోడ!

క్రీడి చెలికాడ, గొల్లల కోడెకాడ !
నన్ను గావుము నీవాడ నల్లవాడ !"

అన్నారు. అంతియే కాదు. అలతి అలతి తెలుగు పదములు వాడి పద్యమునకు చక్కని అందమును సంతరించినారు. దాసుగారు ఈ కథను తమ పిన్న వయస్సునందు వ్రాసినవిగా కనిపించు చున్నది. వీరు మిక్కిలి విజయనగర మహారాజుల ఆస్థానములో కథాగానము చేసి రచ్చకెక్కినవారుగాన ఆస్థానము నందలి సభావర్ణనమును కథాప్రారంభమునందలి గద్యలో వివరించినారు. అందున భక్తులు, యోగులు, కవులు, విద్వాంసులు అయిన వారున్న సభ కనుక "ఉత్సాహముతో పిన్నవాడు పలుకు పలుకులు పెద్దవారు ఊహింపగలరు." అని దాసుగారు తమ వినయ గరిమను చూపినారు.

దాసుగారు కథాగమనములో చాలపట్టుల తమకు శాశ్వతమైన మోక్షపదవికొరకే భగవంతుని కోరినట్లు తోచుచున్నది. అందు వలననే ఈ కావ్యమును సహితము కృష్ణాంకితము చేసినారు.

"దేవుడవ్వాని దలచిన దివ్యమైన
జ్ఞానమబ్బును దానిచే జనన మరణ
భయముతెగి శాశ్వతంబగు పదవి వచ్చు"

అంటారు దాసుగారు.

భగవంతుని రాజనుచు రాజైనచో మరి రాజ్యము, రాజధాని వానికి పేరులు, వృత్తులు, గుణములు, చిహ్నములు, రాణులు, సంతానము, భటులు, మిత్రులు, శత్రువులు, ఆయుధములు, ఉండవలెను కదా ! జగత్ చక్రవర్తి అయిన భగవంతునికి సైతము ఇవి అన్నియు కలవు. భగవంతుని రాజ్యము హృదయపురము, వైకుంఠము అను పేరుతో నుండును అతనికి అనంతమైన నామములు. హరి, శివుడు మొదలైనవి. ప్రవృత్తి, నివృత్తి అతని వృత్తులు. రాజస, తామస,

సత్వములు గుణములు. భూతశక్తులన్నియు అతనివి. శ్రీదేవి, భూదేవి అతని భార్యలు. సకల చరాచరములు అతని సంతానము. త్రికాలము లతని బంటులు. తత్త్వవేత్తలతని మిత్రులు, చెడువృత్తిలో జరుగువారు అతని శత్రువులు. లోక భయ కారణము లతని ఆయుధములు. ఈ విధముగా జగచ్చక్రవర్తియై భగవంతుడు వెలుగొందుచున్నాడట. ఎంతటి రమణీయ వాస్తవ చిత్రణ.

హరిదాసైన వాడు ప్రజలలో దైవభక్తి, సద్ధర్మానురక్తి, సత్కార్యాచరణాశక్తి కలిగింపవలె. ఆ రకమైన ప్రయత్నము దాసు గారు చేసినటుల ప్రతి వాక్యమునందును తోచును. భర్త దూరదేశ మందున్న సమయమున వాని చిత్రపటమును ముందుంచుకొని ఏ రక ముగా సంతోషపడుచు, కన్నీరు కార్చుచు, తన మనవి గ్రహించమని వేడుకొనునో, భక్తితో కొలుచునో, ప్రతిమాలునో, భంగపడునో, తన పరిస్థితికి బాధపడునో, ధైర్యమువదలి దీనయగునో, తన సొమ్ములు తీసి ధర్మము చేయునో, భర్త చరితము చెప్పువారిని గౌరవించునో, ఆ కథ లాలించునో, అదేవిధముగా భగవంతునియందు ఆతని చిత్రపటమునందు భావముంచి బ్రతుకుట సర్వశ్రేయమని దాసుగారు భగవంతుని సేవకు "ఈ తొమ్మిది భక్తిమార్గములు సర్వాత్మన్ హరిన్ నమ్మి సజ్జనుడై యుండుటకు" అని పోతన పలికినట్లుగా కన్నులకు కట్టినటుల చిత్రించినారు.

దాసుగారు ఈ కథా చిత్రణమునకు మూలముగా పరమ భాగవ తోత్తముడైన శ్రీ పోతరాజుగారి రచననే స్వీకరించినట్లు అగపడు చున్నది. ఆంధ్రుల ఇంటింటా, ప్రతినోటా నినదించుచున్న కథా కథనము గదా అది. అంతటిమహత్తరముగా రచయింపబడి ఆంధ్రుల శుభ రక్త నాళములలో మిళితమై, సమాజకవితా రమణీయమై, చిరంజీవమైన రచన గదా అది.

మహాకవి పోతన

"నీరాటవనాటములకు
పోరాటం బెట్లు గలిగె బురుషోత్తముచే
నారాట మెట్లు మానెను
ఘోరాటవిలోన భద్ర కుంజరమునకున్''

అని వ్రాయగా దాసుగారు

"నీరాటమునకు వనాటమునకుం బోరాటంబెటు గలిగె ఘోరాటవిలో గుంజరోత్తమున కారాటం బెటు దొలగె బురుషోత్తముచే'' అని మంజరిలో జొప్పించినారు.

'కరిం దిగుచు మకరి సరసికి
గరి దరికిని మకరి డిగుచు గర కరి బెరయన్
కరికి మకరి మకరికి గరి
భరమనుచును నతల కుతల భటుల దరిపడన్''

అని పోతనగారు కందములో అందముగా కరి మకరుల యుద్ధమును వర్ణించగా దాసుగారు

"కరియు మకరియును గరకరి బెరయుచు జరిపిరపుడు ఘోరాజిన్
కరి మకరి దిగుచు దరికి మకరియును గరినిదిగుచు లోపలికిన్
దిరదిర దిరుగుచు బిరబిర నెడయుచు నరిమురి గలయుచు నలుకన్'

అని తరంగిణిలో వ్రాసినారు. అంతియేగాదు "ఎవ్వనిచే జనించు" అను పద్యము తరువాతగల మూడు కందముల భావము. ఒక ఆట వెలది, ఒక సీస పద్యములలో గల భావము దాదాపు పదములనుకూడ మార్చక "స్మరియించెద కృష్ణున్ ఘనరోచిష్ణున్" అను ఒక కృతిలో ఇమిడ్చినారు దాసుగారు. పోతరాజుగారి కవితపై దాసుగారి కంతటి మోజు. అంతటి అభిమానము.

మూలకథలోగల పోతనగారి రచనా చమత్కృతికి పైతము దాసుగారు వన్నె పెట్టిన తావులనేకములు కలవు.

"మకరితోడ బోరు మాతంగ విభుని నొ
క్కరుని విడిచి పోవ గాళ్ళు రాక
కోరి చూచు చుండె కుంజరీ యూథంబు
మగలు తగులు గారె మగువలకును"

అని పోతనగారు ఒక ఆటవెలదిలో గజేంద్రమును విడిచిపో శాళ్ళురాని కుంజరముల గతి వర్ణించినారు. పైగా భర్తలు, ఆడువారికి తగులాటము గదా, అని ఎంతసైజమైనను పాతివ్రత్యమునకు ప్రోత్సాహము కలిగించి నారు. దాసుగారు అట్లుగాక గజేంద్రుడు పడుచున్న బాధనుచూచి, భార్యలు ఏ విధముగా తాము సాయము చేయులేని పరిస్థితులలో విల విలలాడిపోయిరో అతిసహజముగా, సజీవముగా చిత్రించినారు చూడుడు:

కనులనశ్రులు పెను కాలువలై పార
    గడగడ నొడళులు వడకు చుండ
మా నాథు రక్షించు మా నాథయని దైవ
    మునకు మ్రొక్కుడు గతి మ్రొగ్గతిల్లి
పోనొల్లగా లేము ప్రాణేశ యును మాడ్కి
    వలుద మేనుల నొడ్డు పయిని వైచి
విన్నుబీటలువార వెక్కి యూర్పుచుడస్సి
    పొరలుచు బొరలుచుఁ బొరలు దప్పి

సరను జొర బోయి చొరలేక మరియు నేయు
పాయమయినను దోచక బాయలేక
నిరు నయినను గ్రోలక సెరి గజేంద్రు
కాంత లెంతయు వగల నాక్రాంత లైరి."

పోతనగారు ఒక సంధ్యావర్ణనముతో ఏనుగులను గుహాలలోనుండి బయ టకు లాగినారు. దాసుగారు సంధ్యాస్తమయ వర్ణన, రాత్రివర్ణనలను రెండు పద్యములలో సహజసుందరము, మనోజ్ఞము, స్వయంప్రతిభా వ్యక్తము అయిన భావనలను పొదిగినారు.

"తన్ను వెంట దగులుచున్నట్టి కొడె చీ
కటుల కెదిరి నిల్చు కడిమిలేక
పశ్చిమాబ్ధియందు బడి దాగె సూర్యుండు
"ప్రొద్దు పండుటాకు పోలిక రాలె, గెం
జాయ చివురు లెత్తి, గోయిలలన
జెలగి కలిసె జీకటులు, బూచె జుక్కలు
పైని చందమామపండు దోచె"

కోడె వయస్సులోనున్న చీకటులు వెంబడించగా ఆధాటి తాగలేక వృద్ధుడైన సూర్యుడు పశ్చిమ సముద్రములో దాగి కొనినాడట. అంతియే గాక చివర ఎంతటి ప్రచండునికైనా "కాలమొక్కరీతిగడవ" దని సహజ సుందరమైన జాతీయము వాడబడుట గమనార్హము.

"రాత్రిని ఒక వృక్షముతో పోల్చి ప్రొద్దు అను పండుటాకు రాలిపోగా, సంధ్యాకాంతితో ఎఱ్ఱనైన చిగుళ్ళను కోయిలలు మ్రింగుచు కోయిలలనే చీకటులు చుట్టుముట్టగా, చుక్కలనెడి పూలు పూసి, చంద మామ పండు తోచినది." అని మనోహరమైన వర్ణనను కావించినాడు దాసుగారు. సహజమై, స్వయంకృతమై, దాసుగారి భావనా పటిమను వర్ణనా వైభవమును తెలుపు వర్ణన లిటువంటి వెన్నియో, వనవర్ణన కడ, సరోవర వర్ణన వద్ద గలవు.

కొన్ని కృతులయందు ప్రత్యేక విలక్షణత గోచరించుచున్నది. ఆంధ్రనాయక శతకమునందు కాసుల పురుషోత్తమకవి కీర్తి నింద గ పలికి గేలిచేయుట కనిపించును. ఆ పద్ధతిలో దాసుగారు గజేంద్రునిచేత ఈ క్రింది విధముగా నిందాస్తుతి చేయించినారు.

"ఇంతచేతకానివాడవా - ఇంకతెలిసె నీఘనత
కంతుని నీసుతుని కనుకనేగా శివుడుగాల్చె ॥ఇంత॥
అలనాడు నీతండ్రి ఇలువెడలఁగొట్టగా
దొలగి బంగారు వంటి ఆలిని దొంగలపాలుజేసితివి ॥ఇంత॥

ఒకనాడు నీతల్లి యొగి జెరపడెరా
ఒకనాడు నీతండ్రి యొగి జంపబడెరా
ఒకనాడు నీచెల్లెలొగి సభకీడ్వబడెరా ॥ఇంత॥

కంచెర్ల గోపన్న తాను బంధింపబడి బందిఖానాలో బాధలు పడుచూ రాముని స్తుతించుచూ, నిందించుచూ పలికిన కీర్తనలను గుర్తునకు తెచ్చుచున్నవి. గజేంద్రునిచే దాసుగారు పలికించిన కీర్తనలు.

"ఏమిటి కింకరావీ - వెందు దాగినావు
నీమము జేసినావా - నేరము లెంచినావా॥ "

అనునది.

"ఇకనైన బ్రోవవేమయ్యా - యీబాధకెట్లోర్తురా
పంకజాతనయనా - పాలింపరాదా"

అనునది, పై వాని కుదాహరణములు. కరుణరస పరిప్లుతమైన ఈ కథ యందు శోకమంగిరసమై సర్వేసర్వత్ర ప్రకాశించినది. పైన నుదహరించిన సీస పద్యము "కనుల నశ్రులు పెను కాల్వలై కార" అనునది దీనికి సరియగు ఉదాహరణము. ఇట గజేంద్రుని వదలలేని భార్యలు దురపిల్లుట చిత్రింపబడినది. కావున శోకము. గజేంద్రుని రక్షింపలేక బాధపడు భార్యలు ఆలంబన విభావములు. దైన్యమునకు ఆకరమైన వారి రూపము ఉద్దీపనము. కనుల నశ్రులు కారుట, వొడలుఁబులు వడకుట, వెక్కి వెక్కి ఏడ్చుట, నేలపై బొరలుట మొదలగునవి సాత్త్వికభావములు. చింతా, మోహ, విషాదాదులు వ్యభిచారులు. వీని సంయోగముచేత శోకము. రసీభావము పొంది కరుణరసమగు చున్నది. అంతియేగాక గజేంద్రుడు భగవంతుని విహ్వలుడై ప్రార్థించిన ప్రార్థనలన్నియు కరుణ రసమున కుదాహరణములే.

హరికథ చెప్పువాడు సాహిత్యమునందే కాక, సంగీతమునందును, నటనమునందును, పండితుడై శాస్త్రము కూలంకషముగ అభ్యసించిన వాడై యుండవలెను. అంతేగాక చతుర వచోరచనా ధురంధరుడై, లౌకిక భావనా పరిపుష్టుడై యుండవలెను. కావున దాసుగారు "ప్రత్యక్ష

శయ్య" తో శ్రోతలను తన్మయులను గావించుట అనుభవసిద్ధమైన సంగతియే.

దాసుగారిది ద్రాక్షాపాకము. మధురమై సుందరమై, రమణీయ శబ్దార్థ నిబంధనమై, శ్రవణ సుధాస్యందనమై రసోచితమైన రచన దాసు గారిది. ఉదాహరణ చూడుడు:—

"జలధులు రోమకూపములు శల్యములద్రులు సూర్యచంద్రుల
క్షులు పవనంబులూరువులు శుక్లమువర్షము మిన్నుశీర్ష మి
య్యిల జఘనంబు మేనుజగమెల్లయునై వెలుగొందు నే విభుం
డలఘు డనంతు డవ్యయు డనాదిగురుండగు వానిగొల్చెదన్"

గంభీరమై సమాసభూయిష్ఠమైన దాసుగారి రచన కొక మచ్చు తునక యీ క్రింది సీసపద్యము.

"భూరి భూత్కార సంభూత గంభీర గుం
భధ్వానమున శైలపంక్తి పడగ
దారుణవాల సంతాడనోద్ధూత తో
యకణంబులంబర మంటి కొనగ
నతులహింతాల త్వగంచిత దేహ సం
గతి జలజంతు శోణితము వార
ఖరముఖ నఖర ప్రకరకంపనంబున
గొలను సర్వమును బంకిలముగాగ
పొంచిమైపెంచి కుప్పించి పొంకరించి
యొక్క మకరీంద్రుడిభరాజు నొడసిపట్టె"

బ్రహ్మశ్రీ మదజ్జాడాదిభట్ట నారాయణదాసుగారి ఈ "గజేంద్ర మోక్షమునము" హరికథలో వారి ప్రతిభా పాండిత్యములు సంపూర్ణ ముగ కనిపించుచున్నవి. సంగీతమునందు, సాహిత్యమునందు వారి పాండితీ వైభవమునకు ఈ క్రింది ప్రయోగ వైవిధ్యము గమనార్హము.

వారు వాడిన వివిధములైన పద్యములు :-

ఆటవెలది, సీసము, కందము, ఉత్పలమాల, చంపకమాల, శార్దూలము, మత్తేభము, ద్విపద, మంజరి, లయగ్రాహి, మధ్యాక్కర,

కందుకము, తరంగిణి, ఉత్సాహ, మంగళమహాశ్రీ, మానిని, తరళ, స్రగ్విణి, తోటక, స్రగ్ధర, పాదపము, మదన, తరువోజ, హయగతిరగడ, కవిరాజ విరాజితము, మత్తకోకిల, పంచచామరము.

వారువాడిన వివిధములైన రాగములు:-

ఖమాచ్, శంకరాభరణము, యదుకుల కాంభోజి, కేదార, భైరవి, సావేరి, కాంభోజి, తోడి, వసంత, కాఫీ, ముఖారి, దేశితోడి, నాథనామక్రియ, బలహంశ, కేదారగౌళ, కమాచి, హరికాంభోజి, ధన్యాసి, వరాళి, మారువ, ఆరభి, సురట.

వివిధములైన తాళములు :-

ఆది, రూపకము, త్రిపుట, మిశ్రచాపు. ఆటచాపు చతుస్రగతి, మంజుగతి, త్రిస్యగతి, ఏక.

ముప్పది పుటలుగల ఈ చిన్న హరికథలో 28 రకముల జాతులు, ఉపజాతులు గల పద్యములు, 22 రకములైన రాగములు, తొమ్మిది రకములైన రాగములు, తొమ్మిదిరకములైన తాళములు వాడబడినవి. ఇవిగాక ఒకదండకము, గద్యము కూడ ఉన్నవి. ఈ విధమైన ప్రయోగ వైవిధ్యము కవిలోని పాండితీప్రకర్షకు నిదర్శనము.

అష్టభాషాప్రవీణుడై, ఆయా భాషలయందు కవీంద్రుడై, వీణా మృదంగ గాత్ర గానములందు సర్వసమర్థుడై, సువర్ణఘంటాకంకణ హస్తుడై, మృదుపద లాలిత్య సంకలిత మకరంద ధారాసమాన కవితా నిలయుడై, విశ్వమోహన జనకమై, శాస్త్రోక్తమై భక్తి భావ భరితమైన, సంగీత రచనాధురంధరుడైన శ్రీనారాయణదాసుగారు గాయక శిరోమణులు. విద్యావిశారదులు. హరికథాపితామహులు.



# గౌరప్ప పెండ్లి

శ్రీ "పొన్నెకంటి"

హరికథా పితామహులని ప్రసిద్ధివడసిన శ్రీ మదజ్జాడ ఆదిభట్ల నారాయణదాస మహోదయులు కేవల కథాకథన చతురులు మాత్రమే కాక విద్వత్కవివరేణ్యులని వారి వివిధ కృతులు వేనోళ్ళ చాటుచున్నవి. సంస్కృతాంధ్రాంగ్లాద్యనేక భాషాకోవిదులు, సంగీతనాట్య కళాభిజ్ఞులు నగు శ్రీ దాసుగా రాయా భాషలందు కావ్యరచన సేసినారు. శతకములు, కావ్యములు, హరికథ లనేకములు వారి కవితా కేదారమున పండిన పంటలు.

హ రి క థ లు :

సాహిత్య ప్రక్రియలలోఁ గడువిశిష్టమైన దీ హరికథ. సంగీత సాహిత్యములు సమానస్కంధముగా గజ్జెకట్టిన దీప్రక్రియ. బహుపాత్రి లొకే ముఖమున చతుర్విధాభినయ పురస్సరముగా రసజ్ఞులగు సదస్యులకు సర్వేంద్రియ సంతర్పణ గావించునదిగా హరికథను రూపొందించి శ్రీ దాసుగారు 'హరికథా పితామహు' లయినారు. శ్రీదాసుగారి హరికథలలో నచ్చ తెనుఁగునఁ గూర్చిన దీ 'గౌరప్పపెండ్లి'.

అచ్చతెనుఁగు కబ్బము :

అచ్చ తెనుఁగున పద్యరచనచేయుట, ఆయా కావ్యము లందచ్చటచ్చట ఒండు రెండు పద్దెములుగా, గలదు. కావ్యమంతయు అచ్చ

తెనుగునఁ గూర్చుట కారంభించినవాఁడు 'యయాతిచరిత్ర' కృతికర్త పొన్నకంటి తెలగన్న

"అచ్చతెనుంగు బద్దెమొకటైనను కబ్బములోన నుండినన్
హెచ్చని యాడుచుందు రది యెన్నుచు నేర్పునఁ బొత్తమెల్ల ని
ట్లచ్చ తెనుంగున న్నొడువ నందుల చంద మెఱుంగు వారెదన్
మెచ్చరొ యబ్బురంబనరొ మేలనరో కొనియాడరో నినున్.

(యయాతి. ఆ 1-12 ప)

గౌరప్ప పెండ్లి :

శ్రీ దాసుగారి 'గౌరప్ప పెండ్లి' అను నీయచ్చ తెనుఁగు హరికథ యందలి కవితాగుణాస్వాదన మొనరింప బ్రయత్నించుదము. ఇందలి "వస్తువు, పాత్రపోషణము, రసనిర్వహణము, ఛందోఽలంకారములు, భాష - శైలి" అను కవితాంశలను క్రమముగాఁ బరిశీలింతము.

వ స్తు వు :

ప్రఖ్యాత, ఉత్పాద్య, మిశ్ర భేదముచే నొప్పు నితివృత్తములం దీ కబ్బమందలి వస్తువు ప్రఖ్యాత మనఁదగును. హిమవంతుని కూఁతురగు పార్వతి, తపమొనరించి, మెచ్చించి పరమేశ్వరుని పెండ్లియాడుట ప్రధానేతివృత్తము.

చే ర్పు లు :

1) పర్వతుఁడు మోక్షార్థి కాఁగా సంతానవంతుఁడయిననే యది సాధ్యమని కశ్యపుఁడు వలుకుచు తెలిపిన మైతిహ్యము. 2) మొదట బ్రహ్మ పార్వతిని తపము చాలింపుమనియు, శివుఁడు కోరి పెండ్లాడుననియు పల్కుట. 3) పార్వతి పరోపకార పారీణతకు తార్కాణముగాఁ బలికిన "విప్రబాలుఁడు-మొసలి" అను నైతిహ్యము. 4) గౌరి యొడియందు

విప్రవటుఁడు కూర్కుట 5) హిమవంతుఁడు శత్రువులను జయించి గౌరిని గైకొమ్మని శివుని కోరుట అను ఘటనములు ఈ యితివృత్తమునకుఁ గల్పనలుగాఁ జేర్కొనఁ దగినవి.

మార్పులు : (i) పార్వతిని పరీక్షింపవచ్చిన పరమేశ్వరుఁడు అత్యంత జుగుప్సాకర రూపుఁడగు వృద్ధుఁడుగా రూపొందింపబడినాఁడు. (ii) శివుఁడే స్వయముగా హిమవంతుని, గౌరవనిమ్మనికోరుట.

కథా సంగ్రహము :

యశస్సు, అమరలోకప్రాప్తి కలుగుటెట్లని యడిగిన హిమవంతునకు కశ్యపర్షి, సంతానముఁ బొందవలయుననుచు, ఒక యైతిహ్యమును దెలిపెను, "పులికి భయపడిన బాపఁడొకఁడు ఒక బిలమునఁ జేరఁగా నందొక పిశాచము ఔరుపోచముఁ బట్టికొని వ్రేలుచు నుస్సురను చుండెను. 'నీ వెవఁడ'వని బాపఁడడుగఁగా, తా నాతని తండ్రిననియు, సంతానహీనుఁడగు కొమరునివలన తనకీ దుర్గతి గలిగెననియు, కొడుకు కూడ చనిపోయినచో తానిఁక నరకమునఁ బడుదుననియుఁ బలికెను, ఆ బాపఁడు పిమ్మట వివాహితుఁడై బహుసంతానముఁ గనెను."

విష్ణుని గూర్చి తపమాచరించిన హిమవంతునకు చక్కని కూఁతురు కలిగెను. ఆమెయే గౌరి. శివుని భర్తగాఁ బడయఁగోరి గౌరి ఘోరతప మాచరించెను. ఆమె తీవ్ర తపోఽగ్నికి నిఁగినేలలు తల్లడిల్లెను. బ్రహ్మ గౌరికి సాక్షాత్కరించి, శివుఁడే కోరి గౌరిని పెండ్లాడునని పలికి, ఇఁక తపమును చాలింపుమని కోరెను.

మహాజుగుప్సాకరమగు ముదుకని రూపమున మహాదేవుఁడరుగు దెంచి, తనను జూచి మోహముత్రిప్పుకొనక ముక్కంటిగనే భావించి తనను పెండ్లాడుమని గౌరితోఁ బలికెను. ఆమె వానిని జేసికంటిగనే భావించి, తన తలిదండ్రుల యనుమతిపై వివాహమాడుమని పలికెను తలిదండ్రుల యానుచే తనను మోసగింపవలదనుచు, అయినను తానేఁగి వారికి తన విషయ మెఱిఁగించి వచ్చెదననుచు, గౌరిని వీడి వెడలలేక విరహవేదన

నొందుచున్నంతలో హిమవంతుఁడు భార్యతోఁగూడి యచ్చటికే యేతెం చెను. తనను మించిన యల్లుఁడు వారికి లభింపఁడనియు, తాను గౌరిని పెండ్లాడుదుననియు, తనను ముక్కంటిగా నెఱుఁగుఁడనియుఁ బరమేశ్వ రుఁడు పలికెను. శివుఁడల్లుఁడగుట తమ యదృష్టమనియు, శత్రువులను జయించి శివుఁడట్లే తమకూఁతుఁ బెండ్లాడఁదగుననియు హిమవంతుఁడు పలుకుటతో శివుఁడంతర్హితుఁడయ్యెను.

చెలులోదార్చుచుండఁగా గౌరి శివునిగూర్చి తలపోయుచు విరహ ముచే తపించుచుండెను. మునుపటివాలకముతో ముక్కంటి మఱల నేఁగుదెంచి తండ్రి కూఁతులు తనను మోసగింపఁజూచిరని పలికి, తనకు పెండ్లియూసు అక్కరలేదనుచు తాను బోయెదనని శివుని మెడయందు విరిదండవేసి, యాతనిని తన సందిటఁబట్టి అతఁడే తన మగఁడని గౌరి పలికెను. అప్పుడు శివుఁడు, ఆమె తండ్రి చెప్పినట్లే గౌరిని పెండ్లాడుదునని పలికి అదృశ్యుఁడయ్యెను.

అంతలో చెఱువునొడ్డున నొక విప్రబాలుఁ డార్తనాదము చేయుచు మొసలి కెరయగుచుండెను. గౌరి ఆ మొసలితో బాలుని విడువుమని అందుకు తన తపమును ఇచ్చివైతుననియు బలికెను. ఆ మొసలి బాలుని విడుచుచు, తపమును వ్యయపఱచుకొనవలదని పలుకగా, ఆడితప్పనని గౌరి తపమును ధారవోసెను. మొసలియు, బావనపాపఁడును మాయ మయిరి. గౌరి తిరిగి తపమాచరింపఁ గడంగెను.

పరమేశ్వరుఁడు నిజస్వరూపమున వచ్చి గౌరి తాల్మి, మేల్మి తనకు నచ్చినవనియు, తానామె పెండ్లాడుదుననియుఁ బలికి, ఆమెను తలి దండ్రులకడ కేఁగుమనెను. హిమవంతుఁడు పెండ్లిప్రయత్నములు మహా వైభవముగాఁజేసెను. సర్వదిశాల్పురు విష్ణువు, ఇంద్రాదు లరుదెంచిరి. ఎల్లరచ్చెరువు పొందఁగా, గౌరి యొడియందొక బ్రాహ్మణవటుఁడు కూర్చుండెను. సురవీరులాగ్రహించి యా బాలునిపై ఆయుధములు విసరబోగా అవి యన్నియు వారి చేతులతోసహా కొయ్యబారిపోయెను.

అప్పుడు బ్రహ్మ యా బాలుని శివుఁడనుచు స్తుతించు వారిని క్షమింపు మని వేడెను. గౌరీ శంకరుల కల్యాణ మత్యంత వైభవముగా జరిగెను.

ఇతివృత్తమునఁగల చేర్పులు కథానిర్వహణమున కాటంకము లుగా లేక పాత్రపోషణమునకు, రసనిర్వహణకు దోహదములుగనే యున్నవి.

మొదటి చేర్పు : హిమవంతుఁడు సంతానార్థియగుటకు దోహదము చేసినది.

రెండవది : లోకముల నల్లకల్లోలము గావించుచున్న గౌరి తప స్త్రీవ్రతను వెంటనే నిలువరించుటయు, భావ్యర్థసూచనముచే గౌరి నుపశ మింపఁ జేయుటయు సాధ్యములైనవి.

మూడవది : పార్వతి పరోపకార పారీణత, గోబ్రాహ్మణరక్ష ణకై యసువులుఁవీడ సిద్ధపడునంతటి ధార్మిక బుద్ధుల ప్రకటనమునకీకథ యవకాశము కల్పించినది.

నాలుగవది :- హిమవంతుఁడు కోరినరీతిని శత్రుజయమును చూపుటకు శివుని రూపమది.

ఐదవది: హిమవంతుఁడు కోరినట్లు శత్రుంజయత్వమును ప్రక టించుటకే, కల్యాణమునకుముందు గౌరి యొడికుందు విప్రవటువుగా గను పట్టి, సురవీరుల నాశ్చర్యచకితులనుగాఁ జేయుట. హిమవంతుఁ డిట్టికోరిక కోరుటయే విచిత్రము. శివుఁడట్టి రూపు దాల్చుట యంతకంటె విచిత్రము. రుద్రుని పరాక్రమ మెఱుఁగనివాఁడా హిమవంతుఁడు? కాఁడు. కాన ఈ చేర్పు అక్కరలేనిదే యగుచున్నది. కాకున్న నిది యద్భుతరస పోషక మగు కల్పనము.

ఇఁక కథయందు ముఖ్యముగా గమనింపదగిన మార్పులు విశిష్ట ముగా విలక్షణముగా నున్నవి.

మొదటి మార్పు: పూర్వకావ్యములందు [1]) శివుఁడు తేజో రూపియగు బ్రహ్మచారిగా పార్వతిని పరీక్షింప వచ్చియుండఁగా, మన యీ కథయందు చీఁకు, కుంటి, గ్రుడ్డి, అవిటి యిత్యాది [2]) సర్వావయవములు పరమ వికృతముగా నున్న యొక ముదుకఁడుగా చిత్రింపఁబడినాఁడు. ఈమార్పువలన కవిగారు సాధించిన ప్రయోజనమంతగా లేదన్న నతిశయోక్తి లేదు. మీఁదుమిక్కిలి యంతవికృతరూపియై వచ్చిన శివుఁడు, తనను మోముత్రిప్పక చూడుమనియు, తనను తిన్నఁగా నెగాదిగ చూడుమనుటయు, ఆఁడు ముక్కంటియుంచామె యెఱుంగుట కథయందలి యాత్ముక్యమునకు విఘాతముకల్గించినది. ఆమెమనమును పరీక్షించుటకు శివుఁడు చేసినప్రసంగమేమి? తనను ఎగాదిగజూచుట, తిన్నగాఁజూచుటవలన నాతఁడామెకు ముక్కంటిగా గనుపట్టినాఁడన్న మాటయేగదా! ఆవచ్చిన రూపమును చూచి యామె కంటగించుకొనుటకౌ, ఆతని పలుకులకు కష్టపడుటయొ లేక తిన్నగాఁజూచుటలో ముక్కంటిని గాంచగలిగినపు డీక యా ముదుకని వేసమేల?

---

1 "అథాజినాషాఢధరః ప్రగల్భవాగ్జ్వలన్నివ బ్రహ్మమయేన తేజసా
వివేశ కశ్చిజ్జటిలస్తపోవనం శరీరబద్ధః ప్రథమాశ్రమో యథా"
(కు. సం. 5 సర్గ. 3 శ్లో)

అజినాషాఢధరుండు ప్రౌఢతర భాషాతి ప్రగల్భుండు ని
రజబంధు ప్రతిమానతేజుఁడు జటారాజిచ్ఛటా తామ్రమూ
ర్ధజుఁ డేకాకి వటుండు బ్రాహ్మణుఁడు విశ్రామార్థముంబోలె నా
త్రిజగన్మోహనమూర్తి సన్నిధికి నేతెంచెన్ వనాంతంబునన్.
(హరవిలాస, 4ఆ 15 ప.)

2 "...మిట్టపండ్లు, పుసులు వాఱెడు మిడిగ్రుడ్లు, బురక బొంది
యెలుకజానుగ త్వెట్టిసవ్వెలుసెల్లు
గూనునడ్డి, మొస్తగులొల్కన్నపోఁచ గలుగు ముత్తయవిటిపాఱుఁడు"
(గౌరప్పపెండ్లి - పుట. 7 సీసపద్యము)

రెండవమార్పు : అరుంధతితోఁగూడిన సప్తర్షులను రాయబార మంపక, తానే స్వయముగా హిమవంతుని గౌరినిమ్మని కోరుట. ఇది నాయకుడైనవాని కుచితము కాదు. కాని యిటనొక్క విషయమున్నది. గౌరికోరినట్లు ఆమె నొప్పించవలెనన్న శివునకు కాలవ్యవధానములేక, యా హిమవంతుడే భార్యతోఁగూడి యిచటకేఁగుదెంచెను. ఇఁక సముఖ ములో రాయబారమెందులకు ? కాన శివుఁడే స్వయముగా తననల్లునిగా జేసికొనుమని యడిగినాఁడు.

కాన దాసుగారు చేర్చినచేర్పులు కథనమున కాటంకములు కలుగనివి కాఁగా, మార్చినమార్పులు మాత్రము ప్రయోజనవంతముగా గను పట్టుటలేదు.

పాత్రపోషణము :-

ఈ యితివృత్తమున పాత్రలు ప్రధానముగ రెండు. గౌరీ, శంకరులు. కశ్యప, హిమవంత, బ్రహ్మ విప్రబాలుఁడు, బ్రాహ్మణ వటువులను వారు ప్రాసంగికముగ గోచరించి తొలఁగినట్టివారు. రూపు రేకలు, గుణగణములు (ఊహలు, చేష్టలు)కలిగి కథయందు ప్రాధాన్యము వహించిన పాత్రలు గౌరీ శంకరు లిరువురే.

గౌరి :

కావ్యనామమునుబట్టి గౌరప్పపెండ్లి యందు తొలుత నాయిక యగు గౌరి పాత్రగుణశీలములు బరికింతము.

1) గురుజనగౌరవము :- పరమేశ్వరుని పెండ్లియాడఁగోరి తీవ్ర మగు తపమాచరించెను. పెద్దలయందు భక్తిగౌరవములుకల గౌరి బ్రహ్మ వచ్చి కామితమీడేరునని పలికి తపమును చాలింపుమనుటతోడనే యా మొదటివేల్పుమాటలకు గౌరవమిచ్చి తపము చాలించెను. పరమేశ్వరుడు తనను వివాహమాడు మనునపుడు 'నాతండ్రి నొప్పించి

వడి' దన్ను స్వీకరింపుమని పల్కి- తండ్రిచాటుకన్యవలె సంప్రదాయోచిత ముగ వ్యవహరించినది.

2) పరోపకారపారీణ - సత్యశీల : 'ఆవులన్బాలుఱ్‌ిన్ హాయిగాఁ గావ నసుత్రైన విడిచెద'నను స్వభావముగల దామె. గోబ్రాహ్మణ రక్షణార్థము తన యసువులనైన నిత్తునన్న రామెదీక్షను సార్థకపఱచు కొనుటకు ఆమె సత్యవాక్పరిపాలనగా నిరూపితమగును. విప్రబాలుని పట్టిన మొసలితో గౌరి, వానిని విడువుమనియు అందులకు తనతపము నిత్తుననియుఁ బలికెను. ఈ వేడికోలు ఆమె పరోపకారపరాయణత్వమును చాటుచుండఁగా, బాలునివిడిచిన మొసలి గౌరిని తపమును వ్యర్థము చేసికొనకుమన్నను "ఇచ్చినది తా తిరిగి పుచ్చుకొనరా దిడుమవచ్చిన గ్గాని యేమైన..." నని తనతపము ధారవోసి తనయాడినమాట నిలుపుకొని సత్యశీలగా రాజిల్లుచున్నది.

3) ప్రబంధనాయికగా గౌరి పరమేశ్వరునిగూర్చి విరహవేదన నందుట సమంజసమే కాని, ఆవిరహమామెను మఱింత క్రిందికిగదీసి ఉన్నతస్థాయినుండి దిగజార్చుటమాత్రము విచార్యము.

ఈశ్వరుఁడని తెలియఁగనే తండ్రివలన నీయఁబడుదునని పలికి పోయిన గౌరి యిచ్చటలేదు. అప్పటికప్పుడే తనమనస్సువిప్పి యాతని మోహిల వినిచినది. తనకు 'సిబ్బితి యింకేల' యనుచు గౌరి తనయోవ లేమిని వాచ్యముసేయుట మర్యాదనతిక్రమించినది. గౌరికున్న గౌరవము లాఘవమందినది.

రెండవసారి శివుఁడువచ్చులోపల నామెయందిన విరహవేదన సర్వసాధారణ ప్రబంధనాయికవలెనుండి సమంజసముగనె యున్నదన వచ్చును. శివుఁడు రెండవసారి కనుపట్టి తండ్రికూఁతులయాట తనకు నచ్చలేదని వెడలిపోవనుండఁగా, గౌరి 'ముక్కంటి సందిట నడిమిపట్టి' వగచిన వగపు ఆమె బేలతనమును వెల్లడించుచున్నది. గౌరి అట్లు శివుని

వివాహమాడకయే సందిట పట్టఁదగునా ? అని యాలోచింతము. గౌరి తాల్మిని పరీక్షింపవచ్చిన పరమేశ్వరుఁడు తండ్రికూఁతులు తనను మోసగించుచున్నారుగాన తన కీపెండ్లియాను అక్కర లేదనుచు పోబోవుసమయమది. ఇఁక తాను చొరవతీసుకొనక తప్పదు గౌరికి. పాదముల బట్టుకొనవచ్చునుగదా ! కాదు. సందిటబట్టుటచే తన వలపు బలుపు నెఱింగించుటకును. తనకన్నుఁ తోడని యొట్టుపెట్టినది. కాన నిచ్చట గౌరిప్రవర్తన మొదట నచ్చెరువుకలిగించినను, తుదకు సమర్థనీయమగుచున్నది.

శివుఁడు :

శివుని రూపచిత్రణ మొక విచిత్రముగా జరిగినమార్పుని గుర్తించితిమి. పూర్వప్రసిద్ధపాత్రకు, ఈ శివుని పాత్రకు భేదము మిక్కిలిగాఁ గలదు. తలిదండ్రుల యాను లేకయే తనను పెండ్లికిరమ్మని గౌరిని కోరియు, మఱల నామె తలిదండ్రులకు తన నెలవు తెలిపివచ్చెదనని పలికి, శివుఁడు నాయకోచితమగు ప్రవర్తన ప్రదర్శించినాఁడు. అట్టులే శృంగార నాయకునివలె గౌరియెడల కలుగనున్న కొలఁదిపాటి యెడబాటును సైఁచలేక నిట్టూర్పులూపుచ్చుచు శివుఁడు విరహబాధనందుటయు సముచితముగనేయున్నది. అదేరీతిని హిమవంతుఁడు శత్రుజయము సాధించి గౌరిని గైకొనుమనఁగా నట్టులే, యొకఅద్భుతమును ప్రదర్శించి తన పరాక్రమప్రదర్శనము గావించి గౌరిని పెండ్లాడినాఁడు. గౌరితాల్మిని మొదట ముదుకగా, తరువాత, మొసలి-విప్రబాలునిఘట్టము రూపమునను పరీక్షించి, యామె యోరిమిని, సత్యవాక్పరిపాలనమును, పరోపకారపారీణతలను లోకమునకు వెల్లడించినాఁడు. ఇదియంతయు తన లీలయే యన్నట్లు శివుఁడే స్వయముగా గౌరితో 'నిందుతాల్మి తక్కిన దిన్నులులాగున తఱుగద'నియు, 'మేల్మి విఱుగ'దనియుఁ బలికినాఁడు. తనకు నామెకు భేదము లేదనియుఁ బలికి యామె నాదరించినాఁడు.

సప్తర్షుల సాయములేకయే నాయకుఁడే స్వయముగా కన్యాదాతను కన్యాదానముచేయుమని కోరుట యనుమార్పు. పరమేశ్వరుని యున్నతికిఁ దగలేదు. కాని యదెట్లనివార్యమయ్యెనో పరిశీలించి యుంటిమి. రాయబారమంపున్యవధిలేక, యచ్చట కేతెంచిన హిమవంతునకు శివుఁడే స్వయముగాఁ బలుకకతప్పలేదు. నాయికయందలి యనురాగము, గురుజనులయందలి గౌరవము, పరాక్రమప్రదర్శనము అను గుణములచే నందలి శివుఁడుత్తమనాయకుఁడేయయి, ధీరోదాత్త లక్షణమున కొంకించుక తగ్గినాఁడనిపించునట. తండ్రికూఁతులు చేయుచున్న మోసమునకు విసిగి, పెండ్లియూసులేకపోవుదునని భగ్నప్రేమికుని వలె ప్రసంగించుటయది. కాని యాప్రవర్తనయు, గౌరి తాల్మినిఁ బరీక్షించుటకేకాన, శివుని ధీరోదాత్తతకు వచ్చిన యెగ్గేమియు లేదనఁదగును.

రసనిర్వహణము:-

కొందఱాలంకారికులచే కావ్యమున కాత్మగా పరిగణింపబడిన దీ రసము. కావ్యమునకు శృంగార వీరములలో నొకటి ప్రధానముగా నుండ వలయుననునది ఆలంకారిక లక్షణము. ఈ 'గౌరప్పపెండ్లి' యందు అంగాంగి రసములఁ గొంతవఱకరయుదము.

1. అంగి రసము: (ప్రధాన రసము) ఇందు వీరము ప్రధానమనఁదగును. కుమారసంభవమనునది దేవతలహితము పొంటె సంకల్పింపఁబడి, పరమేశ్వరుని యనుమతి గట్టి దీ గౌరీకళ్యాణము.

'అత అహర్తుమిచ్ఛామి పార్వతీమాత్మజన్మనే
ఉత్పత్తయే హవిర్భోక్తుర్యజమాన ఇవారణిమ్'

(కుసం. 6స - 28శ్లో)

ఆసంకల్పముననే ఈశ్వరుఁడు సప్తఋషులను హిమవంతునికడకు రాయబారమంపినాడు. ఆఘట్టము ప్రకృతము 'గౌరప్పపెండ్లి' యందు వర్ణింపబడకుండుటచే ధర్మవీరమగు నాయంశమిందు కనుపట్టక యిందు శృంగా

రమే ప్రధానరసమై పోషింపఁబడినది. కాని మూలాధార మీసంకల్పమగుటయు, గౌరిని కళ్యాణము చేసికొనుటకే శివుడు పరీక్షలు చేయుటయు, తన లీలలను ప్రదర్శించి తుదకు ఆమెకు చేపట్టుటయు కారణములుగా నిందలి ప్రధానరసము ధర్మవీరమనదగును.

2. శృంగారము : తరువాత నత్యంతముగాఁబుష్టమైనది శృంగారమే. గౌరీ శంకరుల విరహవేదన కల్యాణోత్సుకతలు శృంగారరస పోషకములై యలరినవి. ఆయిరువురి దీర్ఘములైన వచోరీతులు వారి విరహవేదనాతిశయమును చాటఁజాలినవై యొప్పుచున్నవి.

'నివ్వాలకుప్పయ్యోనే యలరులపాన్పు' అన్నంతటిది గౌరి వలవంతకాఁగా (16 పుట)

'నీమీఁదిమరులు నేనావఁజాల' నన్నంతటిది శివుని వలవుబలువుగా జూతుము (18 పుట)

ఆరెండింటి పర్యవసానమే 'నీమేనే నామేనయ్యో' నని గౌరి పలుకుటయు (19 పుట) నీకు నాకు వాసిలేదు ఇఁకనేలా వేయిమాట లీవె నేను కల్లగాద'ని (22 పుట) శంకరుఁడభయమిచ్చుటయు. కావ్య ఫలము "ఎడమపై పాడుది కుడితట్టు మగవాడు"గా శక్తియు క్తుఁడై నాఁడు శర్వుఁడు (23 పుట).

3. అద్భుతము :- 1) బ్రహ్మ కనిపించి శంకరుఁడామెను కోరి పెండ్లాడుననని పల్కి తన ముడిగించి మాయమగుట 2) శివుఁడు ముదుసలి రూపు దాల్చివచ్చుట 3) విప్రబాలుని మొసలి మ్రింగి తిరిగి గౌరి కోరికపై విడిచినట్లియుండి యిరువురును మాయమగుట 4) గౌరికి కనుపట్టి కల్యాణమగుననని పల్కి మాయమగుట 5) శివుఁడు గౌరియొడి యందు విప్రవటువుగానుండి సురవీరులనుక్కడఁగించుట. అను ఘట్టము లాశ్చర్యజనకములైనవి. ఇందు బ్రహ్మ, శంకరులు అదృశ్యులగుట యంతయాశ్చర్యము కాదు. కాని విప్రబాలుఁడు మొసలి ఘట్టము, విప్ర

వటుఁడు గౌరి యెడఁజేయుందు గన్పట్టు ఘట్టములు రెండు నత్యంతాద్భుతావహములయినవి.

4. బీభత్సము : ''వలమఁగ వాచి పిల్కులుపెట్టి చీమూరు,
నడుగుల నొరసి వ్రేలాడు పుచ్చె .... ...
మురిగిపోయిన ముక్కు, మొఱ్ఱిపెదవులు,
పాచిపట్టి విస్తుఁగ్రమ్ము మిట్టపండ్లు పుసులు
వాఱుకు మిడిగ్రుడ్లు, బురక బొంది ..."
(పుట 7. సీసము)

ఇది గౌరికి కనిపించిన గూని, నడ్డి గిడ్డి, చీఁకు, కుంటి, యొవిటి, మూర్తియయిన శివునిరూపు మిక్కిలి యేవముగొల్పు రూపము.

5. హాస్యము : ఈ కావ్యమున హాస్యమెచ్చటను రసముగా పుష్టముగా లేదు. భావమాత్రముగనున్నది. అంతటి వికృతరూపియయ్యు, వచ్చినముదుసలివాఁడు తననుగూర్చి గౌరితో

"ఎమ్మెకాఁడ, నిడిదిగినవాఁడ, నీకు దగిన యొయ్యారపుమగఁడను
నా కీడైన మిటారివి నీవే...'' (7వ పుట.)

అని పలుకుటయందు పాఠకుని మనస్సున హాసరేఖ యొకటి తళుక్కున మెఱసి పోవును. అటులే హిమవంతునితో

"ఎటకునైన వెళ్లుండు లేఁడిక నావలెనల్లుఁడు (మీరెటకు)
అటమటకా దేనే మగవాఁడ నదే యూడుది ఓగుబ్బలిఱేఁడ !"
(పుట 13)

తేనిమీసమున్నైన వెట్టుచు గ్గెత్తుచు..."

అనుతావునందలి శివునిచేష్టలు వర్ణించువాక్యములందలి భావమతివ్యంగ్య చమత్కారముచే నించుకనగవు తెప్పింపకమానదు.

ఛందోఽలంకారములు :—

ఛందస్సు :- కావ్యసామాన్యములయిన ఛందముల నుపయోగించుచు, దాసుగారిది హరికథగాన, గానయోగ్యమగు కీర్తనలను గూడఁ గూర్చియున్నారు. ఛందోరీతులనుగూడ శ్రీదాసుగారు తెనిఁగించుటఁజూడ వారికి అచ్చతెనుఁగుపట్లకల అభిమానము, అధికారములు వ్యక్తములగును. దేశిమార్గఛందములందు దేశిఛందములే యధికము. వృత్తములకును దాసుగారు తెనుఁగుపేర్లిడినారు. పద్యములన్నియు లాక్షణికము లయినట్టివియే.

| వృత్తముల పేర్లు | తెనుఁగు పేళ్ళు | వృత్తముల పేళ్లు | తెనుఁగు పేళ్లు |
|---|---|---|---|
| 1. మత్తకోకిల | గండుకెంపుకంటి | 3. శార్దూలవిక్రీడితము | బెబ్బులిచెఱలాట |
| 2. మత్తేభవిక్రీడితము | ఏనుఁగు చెఱలాట | 4. ఉత్పలమాల | కలపదండ |
| 5. చంపకమాల | తుమ్మెదకంబు | 6. కందము | మూపు |
| 7. దండకము | రెట్టింపుదండము | 8. వచనము | మాట |

పాటలు :- ఈ కబ్బమున మొత్తము 20 తెలుఁగుల రాగములందు 24 పాటలు కూర్చినారు. రాగమునకు అవలి యనియు, తాళమును సూచింపుచు లఘువులు గల యనువర్థమున 'కుఱుచల కొలగల చప్పట్లు' అనియు ప్రయోగించినారు.

| ఉదా:- రాగము | | తాళము | | |
|---|---|---|---|---|
| కలిమి (శ్రీ) | ఆఱుకుఱుచల | కొలగల | చప్పట్లు |
| పొలముగారు (కేదారగౌళ) | ,, | ,, | ,, |
| దొరకొలువు (దర్బారు) | ఐదు → | ,, | ,, |
| నోటివగ (ముఖారి) | ఏడు → | ,, | ,, |
| వెన్నెల (పూర్ణచంద్రిక) | ఆఱు → | ,, | ,, |

ఇందలి విశేషము:- ప్రతికీర్తనను ఒక సీసమొ, గీతమొ, కందమొ వృత్తమొ అనుసరించుట.

అలంకారములు :- వృత్త్యనుప్రాస, అంత్యప్రాసాది శబ్దాలంకారములను, ఉపమాద్యర్థాలంకారములను సందర్భోచితముగాఁ బ్రయోగించినారు కవీశులు. పాటలు, మాటలు గలచోటుల శబ్దాలంకారప్రాచుర్యము గలదు.

ఉదా:- కరము కనికరము—(పుట 8); గిత్తత త్తడి జేడ కుత్తుక కందువాఁడ ! (పు. 16వ)

కలికి సొలువు బులువుఁగ (పుట 13)

వలదు కలదు నోము, పెన్వడకుఁ దాళలేము.

నిలువుము నీకాన్పు - నింగినేల పెన్పు.

ఈవె యాచముట్టు - నీకేల యిట్టి నిట్టు

కావు మెట్టుపట్టి - నీకాఁక కట్టిపెట్టి.

అర్థాలంకారములు:- నివ్వాలు కుప్పయ్యెనే యలరులపాన్పు — (పు-10)

నూవునవ్వించు నీ చెరమదోయి (పు-10)

నిండు జాబిలివంటి పాలుఁడు (పు-21)

గుబ్బలితేప కిన్నుబ్బిన నీ గుండియ, నీ చూపులు, నీ బాగడలు కలుకు చక్రాళ్లకన్న మిగుల బెట్టిదములు (పుట-12)

భాష : శైలి :- భాష : కబ్బము అచ్చ తెనుఁగునఁ గూర్పఁబడుటచే నెల్లెడల దేశీయత నొప్పుచున్న యీ బాసయందు 1) బందు రె డన్య దేశీయములు తత్సమ తద్భవములుగా జొలఁబాఱినవి. ఉదా:- గులాము, కుర్చీలు (పుటలు 7-22) 2) ప్రయోగవైచిత్రియు ప్రదర్శింపబడిన తావులు గలవు. ఉదా:- కన్కరము (17) తెల్యియన్గాఁని 9) సామెతలు, జాతీయములుగలిగి యందలి భాష సొంపులు నింపుచున్నది

ఉదా:- కన్నయాబిడకు పెనిమిటినౌదు నా (పు-10) తల్లికిమగఁడు (11)

బ్రతుకున నాడుదానికన్న పూటమేది (12) వండనియింటికి

నివ్వరాయిడివలె (11) కాలితో కలంచుకొని క్రైతో జుట్టు కొను (13) పొత్తిటంగల బిడ్డ సంగడిలోన వెదకునట్లు (14) 3) ఇంక పలుకుబడుల యేలుబడి మిక్కుటముగా దక్కగొన్నది భాష: పాలుపోవు, కన్నులగట్టు, ఉసురుపెట్టు, అచ్చికబుచ్చిక మాటలాడు, సంగనాచి, ముసుపటివాలకము, గొంతెమకోరిక నోముపంట, కన్నవారలు, కంటతడివెట్టు, బూటకమాడు- ఇట్టివి కొల్లలు. 4) పేళ్ళు పలుకునప్పుడు సంస్కృతపదముల కర్థకల్పనముచేయు దూరాన్వయ పదకల్పనము అచ్చతెనుగున సర్వసాధారణముగ జూచుచుందుము.

ఈశ్వరుని గూర్చి : ఎన్మిదిరెళ్ల యంగులవేల్పు – అష్టమూర్తి; కుత్తుక కందు-నీలగళుండు; అంగమొలివేల్పు-దిగంబరుడు కడలిమిసిమితాల్పు – గంగాధరుండు; బేసికంటి – ముక్కంటి; ఇరున్మూడునోళ్లోప్పువాండు – పంచ ముఖుండు;

4. పద్యములపేళ్లు, రాగములపేళ్లు ఎట్లు తెనుగుంజేయబడినవో పైనిం జూచితిమిగదా !

శైలి :- అర్థవంతమై, రసోచితమగు పదములపోహళింపు ఈ కబ్బమున జంటజంటపదములతో, శబ్దాలంకారాశోభితమై పలుకులు వాలుచున్నది. పాటలకు వంతగా పద్దియములయొద్దిక మద్దుగూర్చుచుండును.

ఉదా : తాళజాల రావదేల – దబ్బునముక్కంటి – ఎత్తుగడ
నీలోన న్జేర్చుకొమ్ము – నీవె నామగండంటి – వెరి
అంగమొలవేల్ప – ఔరా నెలతాల్ప ! } తోడు
గిత్తతత్తడి తేడ కుత్తుకకందు వాండ }

నివ్వాలకువ్వయ్యోనే – యలరులపాన్పు, మేనడికింకుం దిమ్మెర చెలంగి – సీసపాదము,

మాట :- అనుచు మెడపొంగించి పలుజిగిబిగులగపర్చు నూసర
పిల్లివలెఁ దలనాడించుచుఁ గదల కాఁగక తూఁగుటుయ్యాలతీరున
నట్టూఁటలూఁగుచు ఆడుచన్ ... పాడుచు న్గేరుచుఁ దారుచు లేని
మిూసము న్బైన వెట్టుచు న్గెలెట్టుచు... (పుట 10) నొచ్చుకొని తెల్వి
తెచ్చుకొని జడిసి దిగ్గనఁబరుగిడి యేమూఁ నో యడఁగి మడఁగి యేవంత
యున్లే కేడియూసునకున్కోక ... (పుట 11)

ఈ కబ్బమునకు 'కుదురు'గాఁగూర్చిన (శ్రీ)దాసుగారి మాటతీరు
అచ్చతెనుఁగునకు, డేశికొక నెలవనఁదగినది. రూపమున మున్నుడి -
వచనరచనమే కాని యది యొక కవితా విరాట్స్వరూపమే. శబ్దార్థా
లంకారములు, సామెతలు కుప్పతిప్పలు.

'అద్దిరా యీవ్రాఁత లీకూఁత లీమందలిఁపు లీటళాయింపు లీ
బొంకు లీయుంకు లీమినుకు లీవినుకు లీమడు లీతడు లీపొగడిక లీ తెగడిక
లీయదువకాపురము లీకొదువదాఁపురము లీయూం డ్రినుగం డ్రిపాట
లీమాట లీవేఁట లీమిూఁట లీదాఁటు లీమిూఁటు లీమాటు లీవేటు లీగోటు
లీ కాటకము లీబూటకము లీ వేల్మొ లీతాల్మొ లీపిల్పొ లీకొల్పొ లీ తెగ
లీతొఁగ లీవగ లీయుఁటు లీకఁటు లీ...' ఇట్లు సాగుచునేయుండును
జఁటమాటలు. 'వెట్టికుదిరినగ్గాని పెండ్లి కాదు_పెండ్లైనగ్గానివెట్టి కుదుర
దనునానుడిగా...' 'ఉబుసుపోని మంగలి పిలి తలగొఁఅగునట్లు'

ఇంతవరకు "గొరవ్వపెండ్లి" కబ్బమందలి కవితాగుణములు
కొంతకుఁగొంత మట్టిచూచితిమి. ఈకావ్యమున వ్యక్తమగు కవి దాసు
గారి వ్యక్తిత్వమును గొంత తెలియఁయత్నింతము.

వ్యక్తిత్వము :- కావ్యాదియందును, మున్నుడియందును (శ్రీ)
దాసుగారి వ్యక్తిత్వము వెల్లడియగును. వర్ణాశ్రమధర్మములు చెదరి
నందులకు, దేశీయభాషావైముఖ్యము పెరిగినందులకు, పాశ్చాత్యవంచికదృష్టి
యతిశయించి, ఆత్మావలోకనదృష్టి తరిగినందులకు కవిగారు మిక్కిలి

వంతఁజెందిరి. 'పదటుఁగలిసె నాల్గుతెగల - వారి కున్నమురువు' 3) స్త్రీవిద్యయందు యానాఁటి వారిదృష్టి వేరు. 'మొదలూడె న్జదువు తోనె - ముదితల వసువ'ని వారు చింతించిరి. దేశీయగు తెలుగు బాసయం దాయన కమితాభిమానము.

"కొలువుకూటములన్నందు బళిబళియనఁ
బాడియాడుచు నా సీమపలుకుకూర్పు
ముచ్చటగాన్కగా ముడుపిచ్చుకొండు" అనినాఁడు (4 పుట)

అన్నివిధములను పరమాసహ్యాకరమగు ముదుసలిరూపమందిన శివుని వర్ణనమునను, ఆవేసమున నతఁడు పొడుమ పీల్చుటను వల్కుటయందును దాసుగారికిగల లోకజ్ఞత వ్యక్తమగును. సంతానహీనులకు సద్గతులు, స్వర్గప్రాప్తి లేదనుసందర్భమునఁ బలికిన మైతిహ్యముచే కవిగారికిగల శాస్త్రజ్ఞత వెల్లడికాగలదు.

దాసుగా రాధ్యాత్మికసంపదున్నతులు. సర్వేశ్వరమయమని, సర్వమున తాతఁడే కర్త భోక్త యను భక్తిభావమును కవిగారు పలుతావుల నుద్ఘాటించియున్నారు. శివుడు పార్వతితో మాటలాడినపుడు హిమవంతుడు శివుని నుతించినపుడు, బ్రహ్మ పరమేశ్వరుని పొగడినవుడిట్టిశివుని సర్వేశ్వరత్వము, సర్వవ్యాపకత్వము, సర్వజ్ఞత్వములు బహువారములు కొనియాడి (శ్రీ) దాసుగారు భక్తవరేణ్యులయినారు.

ఒకమహాకావ్యమున వ్యక్తపఱుపఁజాలిన కవితాగుణసంపత్తిని దాసుగా రీ చిరుకబ్బమునందే ప్రతిఫలింపఁజేసినారు. అద్దమందు కొండ అమరియుండునుగదా!



# శ్రీ జానకీ శపథము

శ్రీ నాగళ్ల గురుప్రసాదరావు,

"బ్రహ్మాపదావ తీర్ణ కవితా లీలావతీ వల్లభుఁ" డయిన వాల్మీకి మహర్షి రచించిన రామాయణమును గూర్చి యుత్తర రామ చరిత నాటకములో భవభూతి

''హన్త! పాణ్డితీ మణ్డిత స్సంసారః"!

అని వాసంతిచేత ననిపించును. ఈ వాక్యమును "ఆహా! సంసారము పాండితీ మండిత మయినది" యని వేదము వేంకటరాయ శాస్త్రిగారు, "సెబాసు! అది మానవలోకమునకు నూతనాలంకారమే" యని మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు, "ఆహా! అలంకృతమైనది ప్రపంచము" అని బలిజేపల్లి లక్ష్మీకాంతముగారు తెనిఁగించిరి. రామాయణ ప్రాభవమును గూర్చి యింతకంటె నర్థవంతముగాఁ జెప్పుట దుస్సాధము. ఆ రామాయణ మాది కావ్యముగా నీ కర్మభూమిలో నతిప్రాచీన కాలము నుండి పూజలు పొందుచున్నది. భారతదేశ సాహిత్యమునందు అర్థభాగము రామాయణమును చుట్టియున్నదనుట యతిశయోక్తిగాదు. అది పండిత పామరులను నాఁటినుండి నేఁటిదాఁకఁ బరవశింపఁ జేయుచున్న దనుట వాతప్పుమాటగాదు. అట్టి రామాయణము కరుణరస ప్రధాన మని యానంద వర్ధనా చార్యుల వారి తీర్పు.

"...రామాయణేహి కరుణోరసః స్వయ మాది కవినా సూత్రితః 'శోకః శ్లోకత్వ మాగతః" ఇత్యేవం వాదినా నిర్వ్యూఢశ్చ స ఏవ

సీతాత్యంత వియోగ పర్యంత మేవ స్వప్రిబంధము పరచయతా !..."
అనునవి యాయన యన్న మాటలు. ఈ సందర్భములోన అభినవగుప్త పాదుఁడు "అత్యంత గ్రిహణేన నిరపేక్షభావ తయా విప్రిలంభాశంకాం పరిహారతి" అని వ్యాఖ్యానించెను.

రామాయణమున శోకము శ్లోకమయినదని వాల్మీకి కరుణరసమును అనూతిరించెను. ఆ యాది కవి పునస్సమాగమరహితమగునట్లు సీతావియోగమును శ్రీరామచంద్రునకుఁ గల్పించి కావ్యమును నిర్మించి యా కరుణరసమునే నిర్వహించెను. అభినవగుప్త పాదులు చెప్పినట్లు "పునస్సమాగ మరహిత మగునట్లు" అని యనుటచేత ఉత్తరరామాయణమున విప్రలంభ శృంగారమను శంక పరిహారింపఁబడినది. ఏలయన విప్రిలంభ శృంగారము సాపేక్షభావము.

ఈవిధముగాఁ గరుణరసప్రధానమయిన రామాయణమందు సీతాపరిత్యాగయుక్తమయిన యుత్తరకాండకథను స్వీకరించి బ్రహ్మశ్రీ మదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసుగారు "శ్రీజానకీశపథము" అను హారికథను రచించిరి. ఈహారికథా నామధేయము సభంగశ్లేషతోఁ గూడినది. "జానకీ + శపథము" అనియు, "జానకీశ + పథము" అనియు వింగడింపవచ్చును. రెండును షష్ఠీతత్పురుషసమానములే. జానకి యొక్క శపథము, జానకీశుని అనఁగా శ్రీరాముని పథము అనఁగా మనుమార్గము అని వాని కర్థము. ఈ హారికథావస్తువున జానకీ శపథమునకు, శ్రీరాముని ధర్మమార్గమునకు సమాన ప్రాధాన్యమే కలదు.

నారాయణదాసుగారు ఉత్తరకాండము కథను స్వీకరించిరని ముందే చెప్పితిని. కాని వారు దానిని విలక్షణముగా నిర్వహించిరి, ఆ విలక్షణతను గ్రహించుటకు శ్రీ జానకీ శపథము నిర్మాణప్రణాళికను పరిశీలింపవలయును.

''జానకీ రాముల సచ్చరిత్రంబు
మానుగ నెందఱో మాన్యులు తొల్లి
నిరుపమాన కవిత్వ నిపుణత తోడ
విరచించి రైనను 'విపులభవాబ్ధి
దరియింపఁ గోరి యిద్దాని జేసితిని
ధరను నారాయణదాసుండ నేను''

అని దాసుగారు హరికథాంతమున వక్కాణించిరి. మహాసంసారసాగర మును దరియించుటకే వారీకథను గానము చేసిరి. "ఇంక జన్మాంతర దుఃఖముల్ వొలఁగునట్లుగఁ జేసి సుఖాత్ముఁ జేయవే" యని తిక్కన హరిహరనాథుని గోరెను. మఱి పోతన యేమో "...దీనిన్ (భాగవత మును) దెనిఁగించి నాజననంబున్ సఫలంబు సేసెదఁ బునర్జన్మంబు లేకుండఁగన్" అని పలికెను. సీతారాముల చరిత్రమును దనకంటెముం దున్నవా రెందఱో రచించి రన్నమాట దాసుగారికిఁ దెలియును. ఐనను వారు మరల నాకథనే స్వీకరించిరి.

దీనికి హేతువుగా కంకంటి పాపరాజు "రాఘవేశ్వరు చరిత్రము నెంద ఱెన్నిగతులన్ వర్ణించినన్ గ్రాలదే" యని యొకమాట యెప్పుడో చెప్పెను. అంతేకాదు. "విపులభవాబ్ధి దరియింపఁ గోరి యిద్దాని జేసితి" నని దాసుగారే చెప్పిరి. రామాయణము మోక్షదాయక మని వ్యంగ్యము.

నారాయణదాసుగారు హరికథాదిని ఆంజనేయస్తుతి గావించిరి. అంతేకాక యాంజనేయు నుద్దేశించి "గణించి నిన్ గృతికర్తగాఁ జేతు" నని పలికిరి. కథాంతమున "నీకృతి దప్పు సైఁచుకొనుమా హనుమా!" అనియు ననిరి. దేవతామూర్తిని గృతికర్తచేయుట దాసుగారి భక్తి భావమునకుఁ దార్కాణము. "పలికించెడివాఁడు రామభద్రుం డఁట!" యని పోతన చెప్పినమాటను మనము మఱవరాదు.

ఆంజనేయ స్తుతికిఁ దరువాత వినాయక స్తుతి, శారదా నుతి గలవు. పిదప సదస్యులను బ్రశంసించుచు దాసుగారు "వినుఁడు సత్కథ మీరెల్ల పీనులార" యని వేఁడుకొనిరి. అనంతరము మానసబోధ, హరిభక్తి ప్రాధాన్యము ఇహభోగవైముఖ్యము వర్ణింప బడినవి. తరువాత సత్య ప్రాశస్త్య మొక సీస పద్యమునఁ జెప్పఁబడినది ఈ పద్యమున సత్య మహిమను వర్ణించుచు వర్ణించుచు దాసుగారు చివరకు

"సత్యవంతులు తుదకుఁ బ్రశస్త కీర్తి
జరుగుదురు గర్భవతి యగు జానకి వలె"

నని సదస్యులముందు జానకిని నిలిపిరి. అంతేకాక

"అకటకటా కష్టం బధికము సత్యాత్ములకే
ఒకయే డయినన్ సుఖం బొందవైనె సీతారాములకు"

ననుపాట నెత్తుకొనిరి. క్రమక్రమముగా దాసుగారు సదస్యుల చిత్తము లను గథవైపున కాకర్షించువిధము చమత్కారజనకముగా నున్నది. ఇది కథను జెప్పుటయందలి శిల్పము.

ఇట్టి శిల్పము శ్రీహర్షుని నైషధమునఁ గలదు. ఆ యుద్దండకవి నలుని సౌందర్యమును వర్ణించుచు వర్ణించుచు నొక్కసారిగాఁ గథయందు దమయంతిని బ్రవేశపెట్టును.

శ్రియాస్య యోగ్యాహ మితి స్వమీక్షితుం
కరే తమాలోక్య సురూపయా ధృతః
విహాయ భైమీ మపదర్పయా కయా
న దర్పణ శ్శ్వాసమలీమసః కృతః

(సర్గ 1. శ్లో 31)

మఱియొక విధముగఁ గూడ దాసుగారి కథాకథన శిల్పము వెల్లడి యగుచున్నది. ఉత్తరకాండము కథ యింకను బ్రారంభము గాలేదు. హరికథా తత్త్వమునుబట్టి చూచినచో "శ్రీ సీతారామ పదాబ్జాసీన

మనోద్విరేఫ" యను మొట్టమొదటి పద్యమునుండి "అకటకటా కష్టం బధికము సత్యాత్ములకే" యను పాటవఱకు నున్న యుపోద్ఘాతము సుదీర్ఘ మని చెప్పక తప్పదు దీనిని దాఁటి కథకు వచ్చుటకు సామాన్య హరిదాసులకే గంటకుఁ బయిగా కాలము పట్టును నారాయణదాసుగారి కెంతకాలము పట్టునో చూచెడి యదృష్టము నాకుఁ గలుగలేదు. మఱి యీ దీర్ఘమయిన యుపోద్ఘాతమును దాసుగారేల రచించిరి ?

నాకుఁ జూడఁగా రెండు కారణములు కనఁబడు చున్నవి. అం దొకటి హరికథా తత్త్వము. హరికథ ప్రజలలోఁ బురాణేతిహాస పరిజ్ఞాన మును, నీతిధర్మములను భగవద్భక్తిని బాదుకొల్పుటకు మొలకెత్తిన సారస్వత ప్రక్రియ. కాఁబట్టి దాసుగారు వర్ణించిన మానసబోధ, హరి భక్తి ప్రాధాన్యము సార్థకము కలుగుచున్నవి. ఇఁక రెండవది హరికథ వినుటకుఁ జేరినవారి మనస్తత్వము, ఇట్టి సమయములలో జనుల మనః ప్రవృత్తి నానాముఖములుగాఁ బ్రవర్తించు చుండును. అట్టి ప్రవృత్తిగల జనుల నొక్కసారిగా కథ కీడ్చుకొని పోవుట చెత్తసూర్పిడియే యగును. అల్లరిచేయు పిల్లలను, కథ వినుటకు వచ్చినవారిని జూచుచుఁ బరవశించు పెద్దలను గథవైపున కాకర్షించుట కొక కొంత కాలవిలంబ మత్యావశ్య కము. దాసుగారు సదస్యులను బ్రశంసించి

"అల్లరులు సేయఁ బోవని పిల్లలార !
వినుఁడు సత్కథ మీరెల్ల వీనులార !"

యని మొదలుపెట్టి తత్త్వబోధ గావించుట యీ మానవ స్వభావ రహ స్యమును గుర్తించియే. రూపకమునందలి 'ప్రస్తావన' కున్న యొక ప్రయోజన మిదే. దాసుగారుచేసిన యిష్టదేవతా స్తుతి రూపకము నం దలి "నాంది" వంటిదే.

ఈ యుపోద్ఘాత మయిన తరువాత దాసుగారు ముఖ్యకథకువచ్చిరి. షట్కాండ రామాయణము నంతయు నొక సీసపద్యముగాఁ జేసిరి.

పరిణయం బైనట్టి మఱునాఁడె జానకి
రామునితోడ నరణ్యమునకు
మామ పంపునఁ బోయి మగఁడు చెంగటలేని
తఱి దశకంఠు చేతను జెఱఁ బడి
పదినెల లటు తన పతిజాడ తెలియక
పిదపఁ బుణ్యంబున విభుని గలసి
తనదు పాతివ్రత్యమున కగ్నిసాక్షిగా
నధిపుతోడ నయోధ్య కరిగి యచట

హాయిగాఁ గొన్నియేండ్లు పట్టాభిషిక్తుఁ
డయిన పెనిమిటితో నుండి యంతవట్టి
నిందఁబడి యా సతీమణి నిండుచూలు
సమయమునఁ బొందెం దిరిగి కష్టంబు లకట !

"రామస్య అయనం స్థానం రామాయణమ్" అని కదా పెద్దలు చెప్పుచున్నది. రామునకు — రాముని చరిత్రమునకు — స్థానమయి నది రామాయణము. వాల్మీకి సర్వలక్షణ లక్షితుఁడైన యనుత్తమ పురుషుఁ డెవ్వఁ? డని నారదు నడుగుటయు, దానికి నాతఁడు శ్రీరాముఁ డని చెప్పుటయు శ్రీరాముని ప్రాభవమునే చూపుచున్నవి. కాని దాసు గారు పయి పద్యమున శ్రీరామునకుఁ గాక సీతకే పట్టముగట్టిరి. వారు సీతను జూచిన చూపుతో రామాయణమును జూచిరి. కాఁబట్టియే పద్య మున సీతను గర్త్రిగాఁ జేసిరి. వాల్మీకియు "సీతాయాశ్చరితం మహత్" అని రామాయణమును వర్ణించె నన్న మాటను మనము గుర్తుపెట్టు కొన్నచో దాసుగారు సీత కోపు వేసికొనుట కాశ్చర్యపడము. అదియును గాక యుత్తర రామాయణము సీతాయనమే. దాసుగారు సీసపద్యమును జదివినపుడు సీతాదేవి పొందిన కష్ట మింతంత గాదను తలఁపు కలుగు నట్లు చేసిరి. సీతను గర్త్రిగాఁ జేయుట యన్నచో కావ్యార్థ సూచనము చేయుటయే. రాఁబోవు కథయంతయు పరిత్యాగమువలన సీతకుఁ గల్గిన కష్టముతో నిండియుండును గదా !

తాను రచించిన "జానకీ శపథము" అను హరికథ "సదానంద శుభపథము" "మానవంతులకెల్ల మహిమలో నిదర్శనము" "జ్ఞాన ప్రదంబు" "సజ్జన సమ్మోదంబు" "కరుణరసభరితము" అని దాసుగారు చెప్పిరి. "కరుణరసభరితము" అనుమాట యానందవర్ధనాచార్యులవారి తీర్పునకు సంవాదమే. రామాయణము కరుణరసప్రధానము. ఆనంద వర్ధనాచార్యులవారు

"సన్తి సిద్ధరసప్రఖ్యా యేచ రామాయణాదయః
కథాశ్రయా న తైర్యోజ్యా స్వేచ్ఛా రసవిరోధినీ"

తేషు హి కథాశ్రయేషు తావత్ స్వేచ్ఛైవ న యోజ్యా। యదుక్తమ్- "కథా మార్గే న చాల్పోఽప్యతిక్రమః"। స్వేచ్ఛాపి యది యోజ్యా తద్రసవిరోధినీ న యోజ్యా"।

అని వక్కాణించిరి. సిద్ధరస సదృశము లని ప్రఖ్యాతి గాంచిన రామా యణాదులలో రసవిరోధ మొదవురీతిగాఁ గథాసంబంధమైన స్వేచ్ఛ తగదు. రామాయణాదుల యితివృత్తము నాశ్రయించి నానావిధ సాహితీప్రక్రియలను సృష్టించునపుడు కవి కథను తనయిచ్చవచ్చినట్లు మార్పరాదు. కథామార్గమున స్వల్పముగనైన నతిక్రమింపకుండుట యని చెప్పఁబడి యున్నది. కథాస్వేచ్ఛ యక్కఱ పడినచో అది రసవిరోధిగామాత్రము పరిణమింపరాదు. నారాయణదాసుగారు కరుణ రసప్రధానమైన రామాయణేతి వృత్తమును స్వీకరించి 'కరుణరసభరిత' మగు "జానకీ శపథము" అను హరికథను రచించియున్నారు రస విరోధము నంగీకరింపకయే వారు కథాస్వేచ్ఛ పాటించిరి. ఈహరికథ యందలి యితివృత్తము రామాయణకథాభిన్నమై విలక్షణముగా నున్నది.

పట్టాభిషేకానంతర మొకనాఁడు శ్రీరాముఁడు సీతతో శయనా గారమున నుండెను. నిండుచూలాలగు సీత నేదిక్కొమనఁ గోరుకొను

మనెను. అంత నామె "కాననమున మునిభార్యలఁ గాంచు వేడ్క చెల్లించుము. నే నప్పుణ్యసతులకడ నెమ్మితోడ సత్కథలన్ వీనుల విందు సేసికొని వేగమె సందర్శించెద" నని యర్థించెను. శ్రీరాముఁ డంగీకరించెను. కొంతసేపటికి సీత నిద్రపోయెను. శ్రీరాముఁడును "బూర్వవిధిఁ బురంబు తెరవులందలి జనుల శోధింప" వెళ్లెను.

రాజవీథి నేగుచున్న శ్రీరాముఁడు "గౌరీశంకరవిగ్రహంబుల దివ్యవివాహమహోత్సవంబునకు "సంబఁధించిన యూరేగింపు చూచెను. తరువాత చాకలిపేఁటలోఁ దిరుగు నప్పు డొకచాకివాఁడు తనభార్యతో వాదుసేయుట గనెను. ఆ చాకివాఁడు తనసెలవు లేక పుట్టినింటికిఁ బోయిన యిల్లాలిని దిట్టుచు వాకిటి కీడ్చెను. అప్పుడు శ్రీరాముఁడు "ఊరి కాపువలె నడ్డపడి, యోరి! పాప మగును. వదలకుము భార్య" ననెను. ఈమాటవిని చాకివాఁడు

"మంచితగవరివలె నీవు మధ్యఁ బడితి వేమయా
ఉంచుకొనుట తగునె దీని నొరులయింటఁ జేరుదాని
ఎంచఁగ రావణుం డొద్ద నుంచుకొన్న సీతను బిల్పించి
నింద మోసి యేలు వెఱ్ఱిరాముబంటు వోహో!

1. దుడ్డుగల్గు గొప్పవారి దోసము లెక్కింప రెవరు
గుడ్డలేని పేదవారికుల మెంచఁగఁ బెద్దలంత
అడ్డపడకు మాటఁ బొందినట్టి యాలిపొం దిఁకేల?
అడ్డంగ పౌరుషములేని సంపద నాతెడ్డునకా?

గీ॥ పంతమునఁ దొడలపై నిడి, వాఁడు దొంగి
లించి, కూటమిగోరి, పెక్కేఁడు లింట
నుంచుకొను నాలి మళ్లి రప్పించి రాముఁ
డౌర! యి ట్లాఁడు వారలన్ మీరఁబెట్టె"

నని నోటికి వచ్చినట్లెల్ల మాటాడెను. రాముఁడు "సిగ్గుపడి గిరుక్కున" "కోటకున్ మళ్లి భరింపనలవిగాని జనుల నిందను గూర్చి" కలవరపడెను.

"భూమిజాత యగ్ని సంపూత" యని శ్రీరామునకుఁ దెలియును. "నీమముగల రఘుకులమున నే నపకీర్తిపాలైతి. పామరులుం గూడ నన్నుఁ బల్చన చేసిరి యకటా!" యనియే యాయన బాధ. "భూనాథుండే గర్హితభోగము లాశించినచో పూని యతని ప్రజలు ధర్మముం దప్పుట సంశయమా?" యని యాయన తన్నుఁ దా నోదార్చుకొనెను. "అగ్గి చెదం బట్టున ట్లయోనిజ సీత వట్టి నిందం బడవలసె" నని యా జానకీ మనోహరునకుఁ దెలియును. "ప్రాణపదమైన భార్యను బాయ" వల యునా? "ఇలను ఘోరాపకీర్తి సహింపవలయునా? యనునదే ప్రశ్న. ముందు నూయి వెనుక గోయి. పోనీ! నిందకోర్చిన నేమగును? నింద కోర్చినచో "రాజానుమతో ధర్మ యన్నట్లు" ప్రజలు "అపకీర్తిన్ మాను కొనరు". కాఁబట్టి సీతాపరిత్యాగమే కర్తవ్యమని శ్రీరాముడు

"తాను గష్టంబుపడియైన ధర్మపథము
వలదు తప్పింపఁ బ్రజకు భూభర్త గాన
నిందఁ బోఁగొట్టు కొనుటకై నిశ్చయముగ
భూమిజయు నేను విడఁబడి పొగలవలయు"

నని నిశ్చయించుకొనెను.

తెల్లవారుజామున శ్రీరాముఁడు లక్ష్మణు బిలిపించి నిందమాట చెప్పి, సీత కోరిన కోర్కి నెపముగా నామెను మునిపల్లె చెంగట విడిచి రమ్మనెను. లోకనింద భరింపలేకయే శ్రీరామచంద్రుఁడు నిన్ను విడ నాడె నని సీతతోఁ బలుకుమని యతనితోఁ జెప్పెను. "సర్వజ్ఞుఁడౌ తన యగ్రజుండు సేయు నాజ్ఞకుఁ దలయూఁచి చిత్త మనుచు" లక్ష్మ ణుఁడు సీతను దోడ్కొని వెళ్లి వెళ్లి "యొక యేటి కవ్వలి యొద్దుచేరి" యచ్చటి మునిపల్లెకుఁ గూఁతవ్రేటు దవ్వున రథము నిలిపెను. అప్పటికే ప్రొద్దు నడినెత్తికి వచ్చెను. సీత "స్వాదుఫలహార మొనరించి" కనఁబడు నపశకునమునకుఁ గలవరపడి, బడలికపోవ నిద్రించి పిదప నయోధ్యకుఁ బోఁగోరెను. సీత నిద్రించినపిదప, నామెకు రామాజ్ఞ తెలిపి దానివలనఁ

గలుగు దురవస్థను కనుఁగొను గుండె దిటవులేని లక్ష్మణుఁడు "రామాజ్ఞ పత్రంబుపైని వ్రాసి" "యిదియె సమయంబటంచు సారథినిగూడి సన్న సన్నగ" జారుకొనెను.

సీత నిద్రనుండి మేల్కొన్నది. లక్ష్మణుని పొడఁగన లేదు. ఆమెకు భయము కలిగినది. దిక్కెవ్వరు లేరని మాక్రోశించినది. రామాజ్ఞ వ్రాసిన పత్రము చదివినది. మూర్ఛలో మునిగినది. తేఱిన యామెకు వెఱ్ఱియెత్తినట్లయినది. శోకము గుండెకుదుళ్లనే కదల్చి వేయఁగా నామె యేడ్చినది. మున్ముందట రాముఁడు కఠినాత్ముఁడని యెంచినది. "నీచు లాడు కొన్న నేమి? నిజము నీ వెఱుఁగవా? నాచరిత పవిత్రమనీ యనలుఁడు సాక్ష్య మివ్వలేద?" యని రాముని బ్రశ్నించినది. తుదకు నెవ్వరిపైని నేరమి మోపుట తగదని తలంచి "దుష్టరావణుచేతఁ గొంపోవఁబడిననాఁడె చావక బ్రతుకుట నాది తప్పు" అని యనుకొన్నది. మృత్యువు నాహ్వానించినది.

"చెంగటి యేటిలోన సందెవార్చెడి" వాల్మీకి సీతకడకు వెళ్లెను. ఆమె నోదార్చుచు వృత్తాంత మడిగెను. సీత తనకథయంతయుఁ బూస గ్రుచ్చినట్లు చెప్పెను. వాల్మీకి "నేను నీతండ్రివంటి వాఁడను. మా యింటికిరమ్మ. నిన్ను నీ నాథుని సమ్ముఖమునకుఁ జేర్తును. నీకు నిద్దఱు కొడుకులు పుట్టుదురు. నీభర్త నిన్నుఁ బిలుచు నుపాయము పన్నెదను." అని బుజ్జగించుచు పలికెను. మునిపల్లికిఁ దోడ్కొనిపోయి వాల్మీకి "ఆమె గోరినట్లు మాఱుపేరుపెట్టి" సీతను మౌనికాంతల కప్పగించెను.

మౌనికాంతలు కంటికి ఱెప్పమాదిరిగా సీతను గాపాడిరి. ఆమె ప్రసవించి బిడ్డల నిద్దఱను గన్నది. వాల్మీకి వారికి కుశలవులను పేర్లు పెట్టెను.

అయోధ్యలో రాముఁడు దేవయజనసంభవను దలఁచుకొని విలపించుచుండెను. విలపించి విలపించి తుదకుఁ గన్నుమూసి కలలో

జానకిని జూచెను. ఆమెను వేడుకొనుచున్న రాముని కన్నుల ముంగిట నుండి యామె మాయమయ్యెను. "మహిమతో వెలుంగుచుండిన శివ లింగము" గోచరించెను. ఆశివలింగము "నిర్గుణాద్వైతాత్మతత్త్వము"ను రామున కెఱింగించెను. ఇట్లు కలగాంచి మేలుకొని స్వస్వరూపము నెఱిఁగి రాముఁడు స్వీయధర్మంబుతోడ నిశ్చింత" నుండెను. సీతయు రామునిగూర్చి చింతించుచుండెను. ఒకనాఁడు వెన్నెల బిట్టునఁ గాసి నంతట నామె మోహపరవశ మయినది. తరువాతఁ దన దుస్థితికి వగచి నది. వగచుచున్న తల్లి కడకుఁ గుమారు లగు కుశలవులు వచ్చి యామె నోదార్చిరి. లోకమువారు తమ్మెట్లు చిన్నచూపు చూచుచున్నారో చెప్పిరి. సీత వాల్మీకి కడకు వెళ్లి మున్ను ఆ మహర్షి చేసిన వాగ్దానము గుర్తునకుఁ దెచ్చినది.

వాల్మీకి కుశలవులతో నయోధ్యదగ్గరకు వెళ్లెను. అయన "నేఁ జెప్పిన రామాయణంబు సార్థకంబుగ నిప్పురంబునఁ బ్రతి వీధి యందుఁ బాడుఁ" డని యాకుమారులతో ననెను. వారు ముని చెప్పినట్లే చేయుచుఁ "గొంత తడవునకుఁ గోటగుమ్మము చేరి గానమోహితులై మత్తుమందు చల్లినట్లు మైమఱచియున్న ద్వారపాలకుల నిరాటంకముగ గడిచి రాజసభ" సమీపించిరి. వారిగానమున కాశ్చర్యచకితుఁ డైన రాముఁడు "నబ్బాలకుల కెదురేగి యుచితాసనంబులఁ గూర్చుండబెట్టి" వారి వృత్తాంత మడిగెను. కుశలవులు తమకథ చెప్పిరి. రాముఁడు వారిని దోడ్కొని యంతఃపురమునకు వెళ్లి వారిని "తల్లులు మొదలతివలకును జూపి" రామాయణమును గానము చేయుఁడనెను. వారు రావణుఁడ శోకవనమున సీతను మరులుగొలుపు ఘట్టమును గానముచేసిరి. కుశ లవులు రాముని కుమారులని శాంత గుర్తుపట్టినది. అంతఃపురాంగన లెల్లరు నంగలార్చిరి దక్షిణనేత్రమదురుచున్న రామునకు సీతనుగూర్చి ప్రత్యాశకలిగినది. ఇంతలో పౌరులు "జానకిని నీవు విడిచిననాఁటినుండి వఱపు పట్టినది. ఆమెను నీవేలుకొనుము. ఒడలు తెలియని చాకివాఁడు

కూసిన కూంతలు నమ్మి నిర్మలనీతితో రాజ్యపాలనము గావింపఁగోరి నీవు సీతను విడిచితివి" యను యొకపత్రము వ్రాసి రామునకుఁ బంపిరి

రామాజ్ఞమీఁద సీతను దోడ్కొనిరాఁగా లక్ష్మణుఁడు వెళ్లెను. "స్నానమయి నారచీరను సగముగట్టి మిగిలిన సగంబు నొకపొదమీద నాఱవైచి నిలుచున్న" సీతనుజూచి లక్ష్మణుడు రామాజ్ఞనామెకు వినిపించెను సీత మునిపత్నుల సెలవుదీవనలుపొంది యయోధ్యకుఁ బ్రయాణమయ్యెను. అంతకుమునుపే వాల్మీకి యయోధ్యచేరి కుశలవుల కథ చెప్పెను. లక్ష్మణుని వెంటవచ్చిన జానకిని జూచి శ్రీరాముడు

"ప్రాణేశ్వరి! మనపైనిన్నాళ్లకుఁ దా నసుకాలత దైవము పొంపెను
కానినింద మును గల్గిన కతమున నేను నీసుగుణమెఱిగియు విడిచితి
మానుగ నీవనలము చొచ్చి నీదుమంచి నాఁడు కన్పఱచినటు
వాన గురిపించి నీసతీత్వ మీ ప్రజలకిప్పుడు స్పష్టంబు సేయుమా"

అని యాజ్ఞాపించెను. అంతజానకి శపథముచేసి వాన కురియించెను. సీతామాహాత్మ్యమును మునులు జనులు పొగడిరి. వాల్మీకి వైదేహి తనయులకు బట్టాభిషేకము చేసెను. సీతారాము "లన్యోన్యసౌఖ్యము పొందిరి".

ఆంజనేయుని కృతికర్త గావించిన నారాయణదాసుగారీ హరికథను శ్రవ్య కావ్యమునందువలెఁ బేరుపెట్టకుండ నాశ్వాసములుగ విభజించిరేమో యను నభిప్రాయము కలుగును. వారీ కథను గొన్ని ఘట్టములుగా వింగడించిరి. శ్రీరాముఁడు ప్రచ్ఛన్న వేషమున జనులను శోధించుటకు వెళ్లునంతవరకు ప్రథమ ఘట్టము. జానకి వాల్మీక్యాశ్రమమునకుఁ జేరునంతవఱకు ద్వితీయఘట్టము. కుశలవులను దోడ్కొని వాల్మీకి యయోధ్య దగ్గఱకు వచ్చునంతవఱకుఁ దృతీయఘట్టము. కుశలవుల పట్టాభిషేకము జరుగునంతవఱకుం జతుర్థ ఘట్టము. ప్రతి ఘట్టమునకుఁ జివర ఆశ్వాసాంత పద్యములను బోలి యాంజనేయ స్తుతిపరములగు

పద్యములు కలవు. ఈ విధముగా హరికథ నా యా భాగములుగా విభజించుటవలన రెండురకములయిన మేళ్ళు కలుగుచున్నవి. నడుమ నడుమ తా నిష్టదైవ స్మరణము చేయుటకు, సదస్యులచేతఁ జేయించుటకు హరికథా దాసున కవకాశము కలుగును. సదస్యులు రసానుభవమున విశ్రాంతి పొందుటకు వీలుకలుగును. దృశ్య శ్రవ్య కావ్యముల యందలి యాశ్వాసములవలన, అంకముల వలనఁ గలుగు ప్రయోజనములే యీ హరికథయందలి నాలుగు ఘట్టములవలన సైతము సిద్ధించును.

రామాయణగాథకు, నారాయణదాసుగారు స్వీకరించిన యితివృత్తమునకు రస విషయమున భేదములేదు. తాను రచించిన హరికథ 'కరుణరసభరిత'. మని దాసుగారే చెప్పిరి. వారిమాట యాలంకారికుల యనుశాసనముల కనుకూలముగా నున్నది. కాని దాసుగారు రామాయణకథను దనయిచ్ఛవచ్చినట్లుమార్చిరి. చిన్నచిన్నమార్పుల నట్లుండనిండు. పెద్దమార్పులెట్టివో చూతము.

1. జనులను శోధించుటకై శ్రీరాముఁడు నగరమును జూచుటకు బయలుదేరెనని దాసుగారు చెప్పిరి. ఇది యవాల్మీకము మూలమున సీతావిషయకమైన యపవాదమును శ్రీరామునకు దెలిపినవాఁడు భద్రుఁడని కలదు. భవభూతియుత్తరరామచరితములో సార్థకనాముఁడగు దుర్ముఖుడు సీతాపవాదమును దెలిపెను.

2. అపవాదము వినినరాముఁడు సోదరులనెల్ల రావించినట్లు మూలమున నుండఁగా లక్ష్మణునొక్కనినే పిలిపించినట్లు హరికథలోఁగలదు

3. లక్ష్మణుఁడు గంగాతీరమునకు సీతను దోడ్కొనిపోయినట్లు రామాయణముననుండ దాసుగారు వారినిరువురను "ఒకయేటి యవ్వలి యొడ్డు" నకుఁజేర్చిరి.

4. లక్ష్మణుఁడు రామాజ్ఞను సీతకుఁజెప్పలేక యొకపత్రముపై వ్రాసి మెల్లమెల్లగ సీత నిదురపోవునపుడు జాఱుకొనెనని దాసుగారి

వర్ణనము రామాయణములో లక్ష్మణుడే సీతకు రామాజ్ఞను దెలియఁజేసెను

5. లక్ష్మణుఁడు చనినపిదప విలపించుచున్న సీతను జూచి కొందఱు మునికుమారులామెనుగూర్చి వాల్మీకికిఁ జెప్పుటయు వాల్మీకివచ్చి సీతను దోడ్కొని పోవుటయు రామాయణమున వర్ణింపఁబడినవి. "చెంగటి యేటిలోన సందెవార్చెడి వాల్మీకి" వచ్చి సీతనుతీసికొని పోయినట్లు హరికథ చెప్పుచున్నది.

6. మునిపల్లియకుఁ దోడ్కొని వచ్చునపుడు సీత తనకు మాఱుపేరు పెట్టుఁడని వాల్మీకిని గోరినట్లు హరికథలో నున్నది: రామాయణమందు మునిపత్నులకు సీతనప్పగించునపుడు వాల్మీకి వారికామె వృత్తాంతము నెల్లఁ జెప్పెను.

"బాలకుశలవాస్తరణ మద్భువిలు కతనఁ
గుశలవులనుచుఁబేరు లన్మ్కట్టిల కిడె"

నని హరికథలోఁగలదు. ఆ స్తరణముమాట మూలమున లేదు. సీతా ప్రసవవార్తవిన్న వాల్మీకి "మహానందంబునొంది చని బాలచంద్రతుల్యులును తేజోమూర్తులును రాజపుత్రులునునగు కుమారుల,జూచి భూత నాశనమంత్రములును చదివి దర్భలమంత్రించి యిందుగొసలతో మొదటి వానికిని మొదళ్లతో రెండవవానికినిమార్జన మొనర్చెఁడు, గుశముచేఁ దుడువఁబడినవాఁడు కుశుఁడు; లవముచే నిర్మార్జన మొనర్పబడినవాడు లవుఁడు అనబడును. నే నిడిన యీపేళ్లచే నీయమళలు కుశలవులని ప్రఖ్యాతిఁగాంతు" రని యన్నట్లు మూలమునఁగలదు

8. హరికథయందలి శ్రీరాముని స్వప్నవృత్తాంతము రామాయణ మునఁగానరాదు.

9. శ్రీరాముని యశ్వమేధయాగము ప్రస్తావనయే హరికథలోలేదు. దీనినిబట్టి మూలకథయందుమాదిరిగాఁ గుశలవులు యజ్ఞవాటికయందును

దదితరప్రదేశములందును రామాయణగానము గావించుట కవకాశము లేకపోయినది. సీతాదేవి తనవాగ్దానమును జ్ఞప్తిచేయఁగా వాల్మీకి కుశలవుల నయోధ్యకుఁబంపినట్లు హరికథలోనున్నది.

10. హరికథలో నీక ముఖ్యాతిముఖ్యమయిన మార్పులు జానకీ శపథము సీతారాముల పునస్సంయోగము. కుశలవులు తనపుత్త్రులని యెఱిగిన శ్రీరాముఁడు సీత శపథము చేయునేమో తెలిసికొనిరండని దూతలను వాల్మీకి యొద్దకుపంపును. సీత శపథముచేయునని వాల్మీకి శ్రీరామునకుఁ జెప్పిపంపును మఱునాఁడాయన సీతాదేవిని దోడ్కొని యజ్ఞశాలకు వచ్చును సీతాపాతివ్రత్యమును జాటును. సీతాదేవి శపథముచేయ వలయు నని శ్రీరాముఁడు కోరును. అంత సీత "నేను రామునిఁదక్క వేఱొక్కని మనస్సునఁ దలఁపనయేని నాకు మాధవుని దేవి యగు భూదేవి దారి యొసంగుఁగాక! నేను మనోవాక్కర్మంబుల శ్రీరాముని బూజించితినేని నాకు మాధవీదేవి (భూదేవి) వివర మొసంగుఁ గాక. నేను శ్రీరాముని దక్క నన్యు నెఱుంగ నని చెప్పిన వాక్యంబు సత్యంబేని నాకు మాధవీదేవి లాఁగ నొసంగుఁ గాక" యని శపథము చేసెను. చేసినవెంటనే యద్భుతము దివ్యము నను త్తమము నయిన సింహాసనము భూతలమునుండి పైకి నెగయుదెంచెను. సీత భూదేవితోఁ గూడి రసాతలమున కేగెను. రామాయణమున సీతారాముల పునస్సమాగమము వర్ణింపఁబడలేదు.

హరికథలో దాసుగారు సీతకు వరుణపరీక్ష కల్పించిరి. ఇదివఱకే యామె యగ్నిపరీక్షలోఁ బరిశుద్ధురాలని తెలిసినది గదా! అది యెక్కడనో లంకలో జరిగినదాయె. కాఁబట్టి దాసుగారు అగ్నిపరీక్షవంటి వరుణపరీక్షను సృష్టించిరి. పౌరులమాట మీఁద శ్రీరాముఁడు సీతను దోడ్కొని రాఁగా లక్ష్మణునిబంప నతఁ డామెను దీసికొనివచ్చెను. పౌరులు వఱపునకు బలియగుటచే సీత శపథము చేసి వాన కురియించెను.

సీతాపాతివ్రత్యము వెల్లడి యైనది. పౌరులపీడ విఱుగడ యైనది. సీత లోకకల్యాణకారిణి యైనది. ఆమె శ్రీరామునితోఁ గూడి సుఖించినది.

వాల్మీకిమహర్షి రచించిన రామాయణము యథామూలముగా మనకు లభింపలేదు. అందుఁ బ్రక్షిప్తములెన్నో కలవని విమర్శకులు చెప్పిరి. ఉత్తరకాండము వాల్మీకి రచింపలే దనువాదము లేకపోలేదు. ఏది యేమయినను సీతారాముల గాథ భారతీయులపాలిటికి స్వజనగాథ యైనది. మూలరామాయణ కథకు వంకలు దిద్దుచు మెఱుఁగులుపెట్టుచు రసభావ పాత్రౌచిత్యములనుబట్టి సంస్కృతదేశ భాషాకవులు మార్పులు చేర్పులు చేయుచు రకరకములయిన సాహిత్యప్రక్రియలు సృష్టించిరి. ఈ హేతువులచేత దేశభాషారామాయణములలో ననేకములయిన యవాల్మీకాంశములు చోటు చేసికొన్నవి. కంబరామాయణము, కోన బుద్ధ భూపాలుని రామాయణము, తులసీదాసుని రామచరితమానసము, కృత్తివాసునిరామాయణము పయిమాటకుఁ దార్కాణములు.

నారాయణదాసుగారు భారతీయకవితాసంప్రదాయమునుబట్టి రామాయణగాథను మార్చి రనియే యనుకొనవలయును. వారు చేసిన మార్పులకు హరికథాతత్త్వము సైతము దోహదము చేసియుండు నని చెప్పక తప్పదు. హరికథ సామాన్యజనులకై యేర్పడిన సాహిత్య ప్రక్రియ. భక్తి నీతి ధర్మాదులయందు వారికిఁ బ్రత్యయము కల్గించుట దాని లక్ష్యము: హరికథారచయిత యీమాట మఱవఁ డని మనము నమ్మినచో యతఁడు తనచెప్పెడికథను సామాన్యప్రజల యనుభవమునకు దూరముచేయలేఁ డని యంగీకరింపక తప్పదు. అట్లు గాకుండ

తవ స్పర్శే స్పర్శే మమహి పరిమూఢే న్ద్రియగణో
వికార శ్చైతన్యం భ్రమయతి సమున్మీలయతిచ"

(సీతా! నీ నిరంతర స్పర్శ నాయింద్రియసమూహమునకు పరిమోహము కల్గించుచున్నది. ఒకానొక వికృతి నాచైతన్యము నూఁపుచున్నది.

పెకలించుచున్నది) యని సీతాస్పర్శకు మోహము పొందిన రాముఁడు పలికినట్లు వర్ణించినచో నది సామాన్యజనుల యనుభవమున కందదు. మూలకథకు నారాయణదాసుగారు చేసిన మార్పులనుగాని, వారు వాడిన "నిరాటంకము" "పడుకొనె" వంటి వ్యాకరణవిరుద్ధప్రయోగములను గాని మన మీచూపుతోనే చూడవలయును. వారు గావించిన మార్పులకు హేతువులను వానిమంచిచెబ్బఱలను వెదకి తెలిసికొనుట చదువరులకుఁ దగినపని.

ప్రచ్ఛన్నవేషమునఁ దిరుగుచు రాజు ప్రజల యభిప్రాయములను పరిపాలనాఫలములను దెలిసికొనుట పురాణేతిహాస చారిత్రిక కథలలోఁ బ్రసిద్ధమయిన యంశమే. ఆయంశమునే దాసుగారు హరికథలో స్వీకరించి రనుకొనవలయును. అదియునుగాక ప్రత్యక్షముగా సీతాపవాదమును రాముడు వినుట సీతాపరిత్యాగవిషయమునఁ దిరుగులేని నిర్ణయ మొనర్చుటకుఁ బ్రబలకారణమగును. ప్రచ్ఛన్నవేషము రాముని ప్రజారంజకత్వమును సూచించును. సీతను గొనిపోవుటకు లక్ష్మణుఁ డర్హుఁ డని యెంచెను గావునరాముఁ డతని నొక్కనినే పిలిపించుట సమంజసము. ఉత్తరరామచరిత నాటకమున రాముఁడు "దుర్ముఖ, బ్రూహి లక్ష్మణం - ఏష తే నూతనో రాజా రామ స్సమాజ్ఞాపయతి" అనును.

లక్ష్మణుఁడు సీతకు రామాజ్ఞను దెలుపలేని యశక్తుఁడై దొంగ చాటుగాఁ దప్పుకొనుట యతనిధర్మమునకు మచ్చదెచ్చునట్టి పనియే.

> రావణాసురుచేతఁ జెఱం గొనఁబడి
> నా వనుచు నిన్ను జనులు నిందను సలుపఁగ
> నాథుఁ డోర్వక నిన్ విడనాడె ననుచుఁ
> దెల్ల మొనరించి వేగమె మళ్లి రమ్మ

అని రాముడు లక్ష్మణునితోఁ జెప్పెను. చెప్పినట్లు చేయకుండుట రాజద్రోహతుల్యమే. రామాజ్ఞ వినిన తరువాత సీతకు బ్రార్థించు

దురవస్థ కనలేక లక్ష్మణుఁ డిటు చేసె నన్నమాట నిజమే. కాని కథా సందర్భమును బట్టి లక్ష్మణుడు రామాజ్ఞ నుల్లంఘింప దగ దనియే చెప్పవలయును.

సీతను జూచుటకు ముందుగా వాల్మీకియే వచ్చెననుట వలనఁ గలిగిన యధికప్రయోజన మేమియు లేదు. సీత తనకు మాఱుపేరు పెట్టు డని వాల్మీకిని గోరినది. భర్తృపరిత్యక్తయగు స్త్రీ నూతన వాసము స్వీకరింప బోవునపు డిట్లు కోరుట లోకసహజము. కాని దుర్భర ప్రసవవేదన కగ్గమయినపుడు మారుపేరు (పేరేదో తెలియదు) మాట సీతతోపాటు దాసుగారును మఱచిరి. అపుడు సీత "కట్టా! రామా నం జేపట్టుర రామా కట్టుకొన్నదాని విడువ కర్జము రామా" యనియు

"తండ్రి జనకుఁడ కావుమో తల్లి భూమి
యిప్పటికి నైన నాజీవ మేలపోదు
యక్కటా! లక్ష్మణా యొక్కరైనఁ బలుక
రేమి సేయుదు నోరామ రామ రామ"

యనియు విలపించును. ఈ పలుకులలో శ్లేష లేదు. సాధారణముగా స్త్రీ యిట్టిచోట్లఁ బలుకు పలుకులా కావు చుట్టునున్న ఋషిపత్నులకు నామె సీతయని తెలియక యుండుట సాధ్యమా? వాల్మీకి రామాయణ మప్పటికి రచింప లేదని యనుకొందము. సీత రామునిభార్య యనియు, ఆమె జనకాత్మజ యనియు నింతకుముం దెప్పుడు ఋషిపత్నులు వినలేదా? జనకుడు రాముడు అగస్త్య భ్రాతలవంటి వారా? లక్ష్మణుఁడు తిరిగి యయోధ్యకుఁ గొనిపోవుటకు వచ్చినపుడు గాని మునిపత్నులకు సీతా వృత్తాంతము తెలియలేదు. అప్పుడు 'శాబాసు రామునిసతివటే నీ వని ముద్దిడి దీవించె ముసలి దొకతె' యని దాసుగారు వ్రాసిరి. ఋషిపత్ని లలో వృద్ధాంగనలకు రాముఁ డనువాని మాట తెలియుననుటకుఁ బయి పద్యమే సాక్షి. రాము డప్పటికే ప్రసిద్ధుఁ డయ్యె నన్నమాట. అట్టిచో ప్రసవవేళ సీత పలికిన పలుకులువిన్న మునిస్త్రీ లామెను గుర్తింపకుం

డుట వింతకాదా? దాసుగారు చేసిన యీ మార్పు కథా నిర్వహణ మున దోషము పాలయినది.

బాలకుశల వాస్తరణం బ్రభవించుటచేత వాల్మీకి శిశువులకు కుశ లవులను పేరుపెట్టె ననుటవలన మూలాతిక్రమణము జరుగుటతప్ప వేఱుగా సిద్ధించిన ప్రయోజనములేదు. ఇక శ్రీరాముని స్వప్నవృత్తా తము దాసుగారి శిల్పదృష్టికిఁ దార్కాణము. సీతావియోగాగ్నికిఁ గుమిలిపోవు రామునకు హృదయోప శమనము కలుగవలయును. అది యీ స్వప్నవృత్తాంతముచే సిద్ధించినది. స్వప్నానంతరము రాడు 'స్వీయ ధర్మంబుతోడ నిశ్చింత' నుండెను. సంతప్తుల కూఱట కలిగించుట లోక న్యాయమే కాదు కావ్యన్యాయముగూడ.

వరుణపరీక్షఁ సీతారామ పునస్సంయోగము రెండును జక్కని మార్పులు. దేశము సుభిక్షముగా నుండుటకుఁ, బ్రజలు సుఖశాంతులతో విలసిల్లుటకు వర్షము ముఖ్యము. వరుణ పరీక్ష సామాన్యజనుల యనుభ వమునకు జేరి యాహ్లాదము కలిగించును. వఱపు వచ్చుట నిందవేసిన ప్రజ లకు శిక్షవంటిది. ఏ సీతను ఆడిపోసికొనిరో యామె వలననే వారి యీతి బాధ తొలఁగినది. ఈ మార్పు మనోహరము. భవభూతియు సీతారామ పునస్సంయోగమును గల్పించెను. రాజధర్మమునకు బలియైపోయిన యమాయక సీత. ఆమె బ్రతుకు కడతేఱుట యన్నది లేదా? అది దుఃఖా వధి యగుట యేనా? ఆమె సుఖమువకు పోఁచుకొనలేదా? జీవితమం తయుఁ గష్టములు పడ్డ సీతవ్య తల్లికి తిరిగి రామునితోఁ జేరకుండుట నెవ్వఁ డోర్చుకొనును? సీతారాముల పునస్సంయోగము జనులకు సీతపట్లఁ గల సానుభూతికిఁ బ్రతిబింబము. సీతతోపాటు జనులును సంతోషించు మార్పిది.

బిడ్డలగోడు చూడలేని సీత వాల్మీకిని వేడఁగా ఆ మహర్షి కుశ లవులను అయోధ్యకుఁ బంపుట లోకవృత్తమునకు దర్పణమయినమార్పు.

అశ్వమేధయాగ ప్రస్తావనము చేయకుండుట చేతఁ గలిగిన లోటేమియు లేదు.

సామాన్యజనుల నుద్దేశించి కథయందు మార్పులుచేయుటయే కాక దాసుగారు సన్నివేశములనుగూడఁ గల్పించిరి. గౌరీశంకరుల దివ్య వివాహమహోత్సవసమయమున వారు గావించిన యూరేగింపు వర్ణనము. రామాజ్ఞపై లక్ష్మణుడు సీతను దోడ్కొని పోవునపుడు వారు చూచిన కూరపాదులు, చెఱకు దోటలు, అడవులు, కొండలు మొదలగు వాని వర్ణనము, సీతాదేవి ప్రసవవేళఁ బలికిన పలుకులు ఆమె రాముని దిరిగి కలసికొనుటకై దేవతలకు మ్రొక్కుకొనుట, లక్ష్మణుడు తెచ్చిన భూషణాంబరాదులను సీత మునిపత్నులకుఁ బంచుట, వారు నామె నలంకరించి యామెకు వీడ్కోలొసగుట మొదలగునవి యిందులకు నుదాహరణములు. సామాన్యులకు సులభముగా నర్థమగు నను తలంపుతోనే దాసుగారు కాలవిరుద్ధ మయినప్పటికి మహతాబులు చిచ్చుబుడ్లు తారాజువ్వలు మొదలగు దీపావళి సామాగ్రి, రమ్ కోలు తాషా టకోరా సన్నాయి తూతాబాకా సారంగి తపలా మున్నగు వాద్యములు రామాయణ కాలమునాఁ డున్నట్లు, వేంకటేశ్వరుడు కనకదుర్గ మున్నగు దేవత లానాఁడు వెలసినట్లు వ్రాసిరి.

లక్ష్మణుడు సీతను దిరిగి అయోధ్యకుఁ గొనిపోవ వచ్చినపుడు దాసుగా రామెను వర్ణించుచు నీపద్యము వ్రాసిరి.

పిఱుఁదుల మీఱి యుపేక్షింపఁబడు నెఱి
కొనలందు ముత్తైపుచిమకుతోడ
సంతత బాష్ప ప్రచారతన్ మాసి జా
డలువడి వాడు చెక్కిళుల తోడ
అన్నపానసుఖంబు లంటక కళదప్పి
మిక్కిలి చిక్కిన మేను తోడ
నలుదట్లఁ గాటుకపులుఁగులు బెర్లింపఁ
దొడరిన బెదరు కందోయితోడ

స్నానమయి నారచీరను సగము గట్టి
మిగిలిన సగంబు నొకపొదమీద నార
వైచి నిలుచున్న సీతను జూచి కొంత
వడికి రామానుజుండు పోల్చి పల్కెనిట్టు

దాసుగారు సీతాదేవి దీనమూర్తి గన్నులకుఁ గట్టునట్లు వర్ణించిరి. వారు భావుకులని యీపద్యము చాటుచున్నది. కాని సగముచీరకట్టిన దశ యందు లక్ష్మణుఁడు సీతను జూచుట యౌచిత్య మనిపించుకొనునా? సీత పండ్రెండేడ్లనుండి యొక నారచీరనే ధరించుచు నుండవచ్చుఁగాక! అది యామె పతిభక్తిని జాటవచ్చును గాక! కాని లక్ష్మణుఁ డామె నాస్థితిలోఁ గాక వేఱొకదశలోఁ జూచిన లెస్సగా నుండును. ఎత్తుగీతి యందలి భావమును దాసుగారు మార్చియుండవలసినది. స్నానమాడి యున్న సీతనే లక్ష్మణుఁడు చూచె నని చెప్పుట వలనఁ గలిగిన విశేష ప్రయోజన మేమున్నది?

నారాయణదాసుగారి భావన యొక్కొక్కచోట వ్యంగ్యమయమై యతిలోకరమణీయముగా నుండును. మానవునకుఁ దృప్తి లేదు. దుఃఖమే తుదకు మిగులును. ఈ భావమునే వారు

"అల దిగంతపు రేఖ యట్టులను మదికిఁ
జేరువై తోఁచి సంతుష్టి దూరమగును"

అను పద్యభాగమునఁ జెప్పిరి. సంతుష్టిని దిగంతరేఖతోఁ బోల్చుట మహాకవికిఁ జెల్లును. భూమ్యాకాశములు కలసి యున్నట్లు క్షితిరేఖ మనకుఁ భ్రాంతి గొల్పును. కాని యది దగ్గఱకు వెళ్లినకొలఁది దూర మగును. సంతృప్తియు సిద్ధించిన ట్లుండును. కాని యది మానవులకుఁ జేకూరు నట్టిది గాదు.

సీత తనకోర్కెని దెలుపునపుడు "ముత్తెముల్ కెంపు లొల్కఁ" బల్కినది. ఆమె దంతములు ముత్యముల వంటివనియు, పెదవులు కెంపులవంటి వనియు వ్యంగ్యము.

శ్రీరాముడు "భూలోకమునకై స్వర్గము విడుచునట్లు క్రమ క్రమముగా సౌధాంతరములనుండి" క్రిందికి దిగెనట. శ్రీరాముడు దుష్టశిక్షణమునకు శిష్టరక్షణమునకు వైకుంఠమును వీడి భూమి నవతరించిన విష్ణువు. ప్రజల స్థితిగతులన్ సమీక్షింపబోవు శ్రీరాముడు మేడమెట్లు దిగిన తీరు నీవిధముగ వర్ణించుట యుచితము. సుఖమయము మయిన స్వర్గమును (వైకుంఠమును) వీడి భూమికవతరించి దుఃఖము లనుభవించిన విష్ణ్వంశసంభూతుడు రాముడు. మేడమెట్లు దిగుట యన నున్నతస్థితినుండి క్రిందికి వచ్చుట. సీతాపవాదమును వినబోవు చున్నాడు శ్రీరాముడు. సుఖమయమయిన యాయన జీవితము మహోన్నత దశనుండి కూలిపోబోవు చున్నది. ఉపమానమును జేపట్టి ప్రతీకగా జేసి నారాయణదాసుగారు భవిష్యత్కథాసూచనము చేసిరి.

మునిపల్లె చెంగట సీతను విడిచి రమ్మని రాముడు లక్ష్మణు నాజ్ఞాపించెను. అపుడు లక్ష్మణుడు "... సర్వజ్ఞుడౌ తన యగ్రజుండు సేయు నాజ్ఞకుఁ దలయూచి చిత్తమనుచు" వైదేహి కడకు వెళ్లెను. సర్వజ్ఞుఁ డను నొక్కపదమున సర్వోత్కృష్ట వ్యంగ్యము కలదు. రాముఁ డాజ్ఞాపించెను. లక్ష్మణుడు చిత్తమనెను. గర్భవతియగు జానకిని లోకనింద భరింపలేక రాముడు పరిత్యజించు ఘట్టమిది. రాముడు ధర్మవిచారము నాలుగువైపులనుండి చేయగలడు. లక్ష్మణుని నమ్మిక యట్టిది.

రాముడు ప్రజారంజకుడగు ప్రభువు. రాజాజ్ఞను పాటించుట తనవిధి. కాబట్టి లక్ష్మణుడు అన్న మాటకు మాఱాడక తలయూచి చిత్తమనెను. సర్వజ్ఞుఁ డను పదమున నున్న వ్యంగ్యమిది. లక్ష్మణుని భ్రాతృప్రేమ, రాజభక్తి యీ వ్యంగ్యమునఁ బుట్టిన సద్గుణములు ఆ సద్గుణములు గల లక్ష్మణుడు సీతకు రామాజ్ఞ వినిపింపలేని పిఱికివాఁడై దానిని పత్రముపైని వ్రాసి తప్పుకొనుట వింతలలో వింత.

"జానకీశపథము" సంగీతకళాత్మకము, చంపువునైన హరికథ. దాసుగారు దీనిలో వాడిన భాష సులభగ్రాహ్య మయినట్టిదే. వారు రచించిన పద్యముల నడక ధారాళముగ నుండును — పెక్కుచోట్ల. రసానుగుణమైన రీతి యున్నది. సీత లక్ష్మణు నుద్దేశించి వాపోయినపుడు కలలో జానకిని జూచి రాముఁడు దీనముగా వేడుకొని నపుడు దాసుగారు వ్రాసిన పద్యములు మనోహరములు.

శా॥ అన్నా ! లక్ష్మణ ! బుద్ధిశాలివి కదా యయ్యో ! యరణ్యంబులో
నన్నిట్లొంటిగ నుంచి పోవఁదగునా ? నన్ దల్లిగాఁ జూచె దీ
వెన్నండైన. నకల్మషాత్ముఁడవు, తండ్రీ ! రమ్ము నన్ వేగ నీ
యన్నం జేర్పుము, పల్కవే మయితివయ్యా ! వీరరామానుజా !

మ॥ అయయో పల్కవదేమి ? కోపమ ? దురన్యాయంబుగాఁ బౌరులెం
తయు మద్వంశము నీ కతంబునను నిందం జేయుటం బట్టి, స
న్నయ ధర్మంబులు తప్పకుండ జనులఁ శాసింపగాఁ గోరి, నిన్
భయదారణ్యమునందుఁ బోవిడిచి యిబ్బంగిన్ విలాపించెదన్.

దాసుగారి సీసపద్యముల కూర్పు ప్రత్యేకముగాఁ బరిగణింపఁదగ్గది. కథా సంక్షిప్తతకు, ప్రకృతి వర్ణనములకు, శృంగారరస ప్రకాశమునకు, సంభాషణములకు వారు సీసపద్యమును వాడిరి. దీని కూర్పులో వైవిధ్యము కలదు. ఏ పాదమున కాపాదము తెగిపోవు పద్యములు కొన్ని యున్నవి. తద్ధర్మాద్యర్థక సమాపక క్రియాంతములయిన పాదములతో నొయ్యార ములు పోవు పద్యములు మఱికొన్ని కలవు. పెక్కు వాక్యములతోఁ గూడిన పద్యములు అంత్యప్రాసయుతములయిన పద్యము లింకఁ గొన్ని గలవు. రాముఁడు జనులను శోధింప నేగినపుడు, సీత మునిపల్లెకు వెళ్ళు చున్నపుడు, కుశలవులు రామాయణమును గానము చేసినపుడు, జానకీ శపథమునకుఁ బిదప మేఘము లుదయించి వర్షించువప్పుడు దాసుగారు సుదీర్ఘవచనములు వ్రాసిరి. అవి సర్వవిధములఁ బ్రబంధకవుల రచనా విధానమును దలపించు చున్నవి.

నారాయణదాసుగారు వర్ణనములు చేయుటకుఁ గడు సమర్థులు. పల్లీసౌందర్యము, ప్రకృతిసౌందర్యము వారిని మైమఱపించును. ఆవర్ణనములలో నెక్కువపాలు స్వభావోక్తి రమ్యము. కథకుఁ జక్కగా నతుకునట్టిది.

సీ॥ ఉడుకెత్తి పాదులన్ ముడిఁగిన నీడలు
చల్లగఁ దూర్పున సాగుచుండె
వడదాకి తొఱ్ఱల నడఁగిన పిట్టలు
ముదముగ బైటను మొఱ్ఱిగుచుండె
కడు నెండవేఁడిమిన్ గ్రాఁగిన గాడ్పు హా
యిగ మంచుకొండకై యేగుచుండె
కొండను దిగి మేఁతకొఱకు బెబ్బులులుమ్మి
రిగఁ బల్లములఁ జెలరేఁగుచుండె

గీ॥ పాములకుఁ బుట్టలో నుండి పడగ హెచ్చె
మడువు నెడఁబాసి యేనుంగు లడవిఁ జొచ్చె
ప్రొద్దు పడమటికిన్ ప్రాలి ముద్దువచ్చె
నెగడి జానకి వాలుఁగన్నుఁగవ విచ్చె.

అయ్యలరాజు రామభద్రుఁడు దశరథుని పుత్త్రకామేష్టిని వ్యాకరణముతోఁ బోల్చెను. నారాయణదాసుగారు వానకురిసి వెలియుటను వ్యాకరణముతోఁ బోల్చిరి.

సీ॥ పల్లమువంకఁ బ్రవర్తించె నీర్ విశే
ష్యముజాడఁ జను విశేషణముభంగి
నడవి కార్చిచ్చుల కాదేశమై కొండ
వఱద యాగమమయ్యెఁ జెఱువులకును
అల ప్రకృతి ప్రత్యయములట్టు లన్యోన్య
మెడయ కేళ్లుం గాల్వలేక మయ్యె
కర్మభావ ప్రయోగంబులం దప్పని
యాత్మనేపదమట్టు లలరఁ గప్ప

గీ॥ వడి నలౌకిక విగ్రహవాక్యము వలెఁ
గోకిల రవ ప్రయోగంబు లేకయుండెఁ
బల్లవిత బహువ్రీహి సంపటల మగుచుఁ
బ్రబలి వ్యాకరణమువలె వానవెలిసె.

మొత్తముమీఁద నారాయణదాసుగారి వర్ణనములు భావనాశక్తి సంబంధమైన పౌఢికిఁ బరమోదాహరణములై యున్నవి.

"జానకీ పదము కరుణరస భరితమని దాసుగారే చెప్పిరి. కాన యీ హరికథలో కరుణము అంగిరసము, సీతారాముల శృంగారము అంగరసము. శాంతముగూడ అంగరసముగనే యున్నది. శివలింగము గావించిన నిర్గుణాద్వైతాత్మ తత్త్వబోధ యంతయు శాంతరసమయమే.

ఆర్ష కావ్యముల యందలి పాత్రములను సామాన్య జనుల జీవనమునకు దగ్గఱగాఁ దెచ్చిన ఖ్యాతి దేశ భాషాకవులది. ఆంధ్రమహాభారతము అందును తిక్కన రచించిన భాగము—, బుద్ధ భూపాలుని రామాయణము దీనికిఁ దార్కాణములు. నారాయణదాసుగారు దేశభాషా కవుల మార్గము ననుసరించిరి. వి. ఎస్. శ్రీనివాసశాస్త్రిగారు వాల్మీకి చిత్రించిన శ్రీరామునిగూర్చి యిట్లు వ్రాసిరి.

" ... I have practically no doubt in my mind that the Poet intended to show us that Rama was just like other people in such terrible and trying times ..."

"జానకీశపథము" నందలి శ్రీరాముఁడు నిట్టివాఁడే. ఆయన మానవుఁడే. "పరమాత్మునికృపవలన హాయిగాఁ బ్రాణేశ్వరి మన మింటికి మిదివఱకు" నని రాముఁడు సీతతో ననును. శివలింగము చేసిన బోధవలన రామునకు స్వస్వరూపసాక్షాత్కారమయినది. సీతాపరిత్యాగసమయమున రాముఁడు కేవలము "నీమముగల రఘుకులము" నకుఁజెందిన ప్రభువు వలె వ్యవహరించెను. "ఎన్నఁడైన లోకాపవాదం బెఱుఁగఁ బోవని సూర్యవంశ"ము వాఁడు శ్రీరాముడు "భూమిజాత

యగ్ని సంపూత" యని యాయనకుఁ దెలియును. తాను గష్టపడియైన జనులు ధర్మపథము తప్పని యట్లు చూచుట ప్రభువు విధి. ఈ విధి గుర్తించిన రాముడు సీతను విడనాడి యామెకై వగలఁ బొగిలెను. "అరయఁగ మన శోకము జన్మావధిగా. జేసెనా ... కొయ్యదయ్యము" అని రాముఁడు సీతను దలఁచుకొని విలసించును. సీతాపాతివ్రత్య మెఱిఁగిన పౌరులు పత్రము పంపినపుడు రాముడు లక్ష్మణునితో "సమ్మతిం బౌరజానుమతము సలుపవలయు గద నృపతికి" నని సీతను దోడ్కొని రాఁగ నతనిని బంపెను. సీత వచ్చిన పిదప వాల్మీకిచేఁ బ్రబోధితుఁడయ్యు శపథముచేసి వాన కురిపింపుమని యామెను గోరును. పౌర జానపదులకు సీతమాహాత్మ్యము తెలిసినదని రాముఁ డామెను స్వీకరించెను.

ఈ హరికథయందలి సీత ముగ్ధ, రామాజ్ఞను జదివినపు డామె రాముఁడు కఠినుడని మొదట తలంచినను "అపవాద మూడ్చి రాజ్యంబున నీతినిల్పుటకు నన్ విడనాడె భూమి భర్త. గానఁ బ్రాణేశుపై నేరములేదు" అని యెంచినది. ఆమె లక్ష్మణునియందు దోషమున్నదని భావింపలేదు. "రామాజ్ఞ. చెప్పినఁత నిందు గర్భిణినగు నేఁ బడు దురవస్థఁ బరికింపలే కిట్లు పత్రమందు వ్రాసిపోయిన లక్ష్మణునివలనఁ గీడు నాకు దోఁచదు" అని యనుకొన్నది. రావణుఁడు తీసికొని పోయినపుడు చావక బ్రతికియుండుట తన దేతప్పని తలంచినది. గతిగానక మృతిపాలు కాఁగా నిశ్చయించినది. సీత యిట్లు భావించినను రాముఁడు "పితిహోత్రుఁడు పల్కురీతి మునుతా వినియు" నిట్లల చేసెనోయనియు "నామగఁడేల నను విడిచెఁ బ్రేమ మొకింతయు. దల పక" యనియు ననుకొన్నది. తిరిగి యయోధ్యకు వచ్చుటకు ముందు ఆమెకు "సర్వజగం బిది రామమయంబై" గోచరించినది. ఆమె దేవతలకు మొక్కుకొన్నది. వాల్మీక్యాశ్రమమున వైదేహి సామాన్య స్త్రీ వలెనే వ్యవహరించినది. సీతాదేవి మాతృహృదయము, సఖీజనానురాగము చక్కగా వెల్లడియైనవి. రాముని జూచినపుడు "జన్మము తరించె" నని తలఁచినది. బిడ్డలకు

(శ్రీ)రాముని జూపి సాగసినది. తుదకు "వరసతీత్వనిరూఢికై" శపథము పలికి జయము పొందినది. ఇట్టి గుణగణములుగల సీత "పున్నమిసందె" మీాటినపుడు "ప్రాణవిభుని చెంతఁ దానుండకుంటకు" విచారించినది. "సామి! యిపుడు నీచెంగటఁ జరియింపఁగ మనసాయెర" యనియు "ఎన్నఁడు మోహముదీఱఁగ నీవు నేను గలసియుందు" మనియు నింక నేమేమో మాటాడుట యుచితముగా లేదు. భగ్నజీవితము మాట మఱచి సీత యీావిధముగా విరహిణియై విలపించినట్లు దాసుగారు వ్రాయుట విచిత్రముగా నున్నది.

ఉత్తరరామచరిత నాటకములో మురళ "ఈదృశానాం విపాకోఽపి జాయతే పరమాద్భుత" అని యనును. సీత వంటి వారికిఁ బ్రాప్తించిన కష్టముసైతము పరమాశ్చర్యమును గలిగించునని దాని యర్థము. ఉత్తరకాండగాథ యాశ్చర్యమును గలిగించునట్టిదే. వనవాసముచేసి పడరానిపాట్లు పడిన జనకనందిని లోకాపవాదమునకు బలియగుట విస్మయావహమే. ఇది జరుగుటకు దైవలీలయే హేతువు. అందువలననే భవభూతి సందర్భమువచ్చినపుడెల్ల "దైవదుర్విపాకాత్" "దైవాత్" "దైవవశేన" "... పాకాభిముఖ్య ... దైవస్య" అని పాత్రములచేత ననిపించును. నారాయణదాసుగారీదైవలీలారహస్యమును గుర్తించిరి. కావుననే వారు "జానకీశపథము"లో "దుర్విధి" "పూర్వకర్మము" "విధివశమున" "దుర్విధివశముచేత" "దుర్విధిహతుఁడు" అను సమాసములను వాడిరి.

ఆంజనేయభక్తులై, యద్వైతప్రీతి కలిగినవారై, సరస్వతీదేవి చనుఁబాలను గడుపారఁ గ్రోలిన నారాయణదాసుగారు రచించిన యీా "జానకీశపథము" భక్తిభావమయము. రససంపూర్ణము.

# ప్రహ్లాదచరిత్రము

శ్రీ వేదాంతం సంపత్కుమారాచార్య.

"ఉషఃకిరణాలు" అను గ్రంథములో శ్రీ యండమూరి సత్యనారాయణగారు "నారాయణదాసుగారు తెలుగుసాహిత్య సరస్వతికి ఒకక్రొత్త యలంకారమును కైసేసినారు. అదియే హరికథ. ఈ హరికథారచనలోను, గానములోను దాసుగారు మార్గదర్శి. అందుచేత ఈయనను యుగపురుషుడనవచ్చునని" వ్రాసియున్నారు.

విష్ణుభక్తిపరాయణుడగు ప్రహ్లాదునిచరిత్రమను నీహరికథ హరికథాపితామహులకలమునుండి జాలువారిన అమృతస్రోతస్విని. వీరి కంటెపూర్వులగు విజయరాఘవనాయకుడు, బాగేపల్లి అనంతరామాచార్యులు, బోడిచర్ల వేంకటసుబ్బయ్య మున్నగువారు 'ప్రహ్లాద చరిత్రమ'ను పేర యక్షగానములు రచించిరి. భాగవతము సప్తమ స్కంధమును కురుమద్దాలి వేంకటాచలము యక్షగానముగా రచించెను.

ప్రహ్లాదచరిత్రమను నీకృతిని నారాయణదాసుగారు అరసవల్లి సూర్యనారాయణస్వామి కంకితమిచ్చిరి. అనుంగుచెలికాడును, విదురుని బోలిన శ్రీ బొడ్డు వేంకటేశముగారి ప్రోత్సాహమున వారు దీనిని రచించిరట. కవిగారు —

"పూర్వ కవులందరున్ గడుపూజ్యు లందు
భాగవతులయి గోప్త నీ పాకముగను
గృతులొనర్చు నధికుల సంస్కృతమున జయ
దేవుఁ దెనుఁగున బోతనం దెలిసి యెంతు."

అని పూర్వ కవులందరిని, తనయభిమానకవులను సంభావించినారు. ఈ కృతికంటె పూర్వమే సంస్కృతమున కృష్ణజననము, తెలుగున అంబరీషచరిత్రము, గజేంద్రమోక్షము, ధ్రువచరిత్ర, మార్కండేయ చరిత్రి, రుక్మిణీకల్యాణము మున్నగు హరికథలను, ఇంకననేక కృతులను రచించియున్నట్లు ప్రహ్లాదచరిత్రిమున చెప్పినిరి.

దాసుగారు కేవలమనుకరించువారిని గురించి, కవిత్వమును గూర్చి, ఆధునిక కవుల గురించి తమయభిప్రాయము నీ పద్యము నందిట్లు తెలిపిరి.

సీ॥ పూర్వ ప్రబంధముపోల్కికై చచ్చిన
యూగ నంటించెడు హీనుడొకడు
ప్రౌఢ కల్పనలని పన్ని తనకుతానె
యర్థంబెరుగ లేని వ్యర్థుడొకడు
కృతిని నిఘంటువు వెతకి ముదురు పాటి
ముంజవలె జేయు మూర్ఖుడొకడు
తేట తెల్లంబని తెన్గుబాసకు బట్ట
తెరచి చూపించెడు దేబె యొకడు

తే॥గీ॥ కలివశంబున శారద కలుషయయ్యె
బిదప కాలంబున దలంపు పిచ్చియయ్యె
అచ్చు చవకయ్యె మూఢులు మెచ్చుటయ్యె
నహహ యెందుకు కవులైరి యాధునికులు.

సంగీత సాహిత్యములతోబాటు నృత్యమును ప్రదర్శించుచు పండిత పామర శ్రోతలకు మానసిక గ్లాని నపనయించి, నవరస భరితముగ భక్తిని నీతిని, వైరాగ్యమును సమకూర్చి, పరమానందమును కలిగించుట హరికథ యొక్క పరమోద్దేశము.

ప్రఖ్యాతమగు వస్తువును స్వీకరించి కవి తన ప్రతిభచే కల్పనము గావించి మిశ్రికావ్యముగ కావ్యమును దిద్ది తీర్చుట ప్రబంధయుగము

నుండి వచ్చుచున్న సంప్రదాయము. దాసుగారు భాగవతము సప్తమ స్కంధమునుండి ప్రఖ్యాతేతి వృత్తమగు ప్రహ్లాద చరిత్రమును స్వీకరించి కొన్ని మార్పులను గావించి తమ యనితర సామర్థ్యముతో చక్కని మిశ్రకావ్యముగ రూపొందించిరి. కథా కథనమున ఔచితీ పోషణము నకు మార్పులు గావించుటయే గాక, మహాభాగవతమునందు చెప్పియున్న వేదాంత విషయములను చాలవరకు తగ్గించి, హరికథా కావ్యమునకు తగినట్లు, సందర్భానుగుణముగ నుండునట్లు, సామాన్యులగు శ్రోతలకు పఠితలకు హరికథ యందాసక్తి జనించునట్లు రచించిరి.

పసివాడగు ప్రహ్లాదునిచే "ఇంద్రుడు తన తల్లియగు లీలావతిని అపహరించి తీసికొని వెళ్లుట" మున్నగు కథాంశములను కవి చెప్పింపక, తన తమ్ముని హరి సంహరించినందులకు క్రోధమువహించి హిరణ్యకశిపుడు తపస్సునకు వెళ్ళుటతో కథను ప్రారంభించుట ఔచిత్య శోభితముగా నున్నది. దాసుగారు లీలావతిని బేలయగు సామాన్యస్త్రీవలెగాక, క్షత్రియోచితమగు ధైర్యాది గుణములు గల కాంతగా చిత్రించిరి. అందు వలననే ఇంద్రుడామెను నిద్రించుచున్న దానిని తీసికొని పోయినాడు. ఇంద్రుడు మాయారూపమున వచ్చుట హిరణ్యకశిపుడెట్టి పరాక్రమ వంతుడో కవి చెప్పక చెప్పుటయైనది.

ఇందింద్రుడు చెప్పకుండగనే నారదు డాతని మనోగతాభిప్రాయము తెలిసికొని; ఈమె గర్భమునందున్న బిడ్డడే లోకములకు కల్యాణము గూర్చునని చెప్పి", మందలించి పంపెను. పిమ్మట లీలావతిని నారదుడు తన యాశ్రమమునకు తీసికొని వెళ్ళెను. తపోమహత్త్వంబున కృతార్థుడై వచ్చిన హిరణ్యకశిపుడు తనపట్టమహిషి లేకుండుటకు దుఃఖించుచుండ నారదు డామెను తీసికొనివెళ్ళి సమర్పించి, దానవేంద్రుని కృతజ్ఞతకు పాత్రుడయ్యెను. దేవర్షియగు నారదునకు "నా చర్మము నీ పాదరక్షలు గావించిన మైన నీ ఋణంబు నా శక్యంబె తీర్పంగ" అని హిరణ్యకశిపుడు కృతజ్ఞత తెల్పుట – దేవతలకు విరోధియగు నాతని హృద్గత కోమల

భావమునకు ప్రతీకగా దాసుగారు చూపుట ప్రత్యేక విశిష్టతతో నొప్పు చున్నది.

'లీలావతి' వేయేడులు గర్భమ్ము మోసి - చిఱుతని గనె నెల్ల చింతలు బాసి యని దాసుగారు వ్రాయుటచే పంచ శరద్వయస్కుడగు ప్రహ్లాదుఁ డంతటి వేదాంత విషయములు తండ్రితో నుడువుటలో గల శక్తికి హేతువును వ్యాఖ్యానించినట్లైనది. లీలావతి నారదుని యాశ్రమ మందుండుట ప్రహ్లాదుని మహా విద్యాసంపదకు కారణమైనను పై విషయము లోకజ్ఞుడగు కవి యొక్క మెఱపువంటి ప్రతిభను మిఱుమిట్లు గొల్పునట్లు ద్యోతిత మొనర్చుచున్నది.

సంస్కృత భాగవతమునందు ప్రహ్లాదుని హిరణ్యకశిపుడు ప్రశ్నింపగా—

శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్."

అను తొమ్మిది భక్తిమార్గములగూర్చి వర్ణించెను. ఈమార్గములనే అన్వయపద్ధతిలో పోతన విషయమును ప్రపంచించి "కమలాక్షు నర్చించు కరములు కరములు, శ్రీనాథువర్ణించుచు జిహ్వ జిహ్వ ......" అని సీసపద్యమునందు వర్ణించెను. ఈ భక్తి మార్గములనే చిన్నదగు నీకావ్యమున దాసుగారు అచ్చటచ్చట సందర్భోచితముగా—

'హరి యను నిధానము గంటినని యుబుకు నొక చోట'
'జీవించు వఱకు శ్రీహరిస్మరణ సేయు చానందమున'
హరి భజింత మన్యంబు త్యజింతము, తరింతమీాజన్మము ...'
'నినున్ భక్తి నెల్లప్పుడున్ గొల్తు నేనిన్'
'అల్పుండనైనన్ భవద్వర్ణనల్ చేసి యజ్ఞానముంబాసి'

అని ప్రహ్లాదుని నోటనే పలికించినారు.

పరమ భాగవతులలో మొట్టమొదట కీర్తింపబడినాడు ప్రహ్లాదుడు. ప్రహ్లాదుడు, నారదుడు, పరాశరుడు, పుండరీకుడు, వ్యాసుడు, అంబరీషుడు మున్నగువారు పరమభాగవతోత్తములు. సర్వేంద్రియములు భగవంతునియందే నిలిపి తన సర్వమును దేవుని కర్పించుటయే పరమభక్తి యనబడును. ఏమియు కోరక నిష్కామబుద్ధితో పరమేశ్వరుని భజించువారు భాగవతశ్రేష్ఠులు. ఇట్టి భావమునే నారాయణదాసుగారు

"నను శోధించగ నేలర, నారాయణ, జగదీశ్వర
నిను గోరిక లెల్లమాని నేగొల్చుట నీవెరిగియు - న -
... ... ... ... ... ...
ఎలమినివసించునిహ విభవముల దెలియక భృత్యజనము
గొలువవారికిడుదురు - కోర్కెలు కార్యపరులు ప్రభువులు
భళి నాకుం గోర్కెలేదు - ప్రయోజనము నీకు లేమ
పొలుపుగ గామమువృద్ధిం - బొందని వరము దయసేయుమా" - న

నృసింహస్వామిని స్తుతించు సందర్భమున ప్రహ్లాదుని ముఖతః చెప్పించినారు.

ఇందు ప్రధానమగు ప్రహ్లాదుని పాత్రను దాసుగారు చక్కగా చిత్రించినారు. ప్రహ్లాదుడు బాల్యమునుండియు "వినయముతో పెద్దల గౌరవించుట, దీనుల కనికరముతో జూచుట, కలయందుగాని నవ్వులకుగాని కల్లలు పల్కకుండుట, కులవయస్సౌందర్య బల విద్యలుగల్గి త్రుళ్ళిపడకుండుట, సజ్జనులతో గూడి యుండుట, వ్యసనములకు దూరముగానుండుట, రాజకుమారుడుగా తనకు చెల్లియున్నను నితరుల మనము నొప్పింపకుండుట, అన్యకాంతను తల్లిగా జూచుట, తత్త్వ విస్ఫూర్తి యందుతా నెంత సర్వజ్ఞుడైనను తెలియని విధముగ నుండుట" యను ననేక సుగుణములకు నెలవై యుండెను. పసివాడగు ప్రహ్లాదుడు హరిభక్తి భావనామయుడై సర్వకార్యముల యందును హరిని దలంచుచుండెను. విష్ణుభక్తితో లోకమెఱుగకయున్న కుమారుని చదివించి విద్యావంతుని

గావించిన మార్పుకలుగునని హిరణ్యకశిపుడు గురువుల యొద్దకు పంపెను. కొంతకాలము తరువాత ప్రహ్లాదుని పిలిపించి తండ్రియగు హిరణ్యకశిపుడు విద్యావిషయమై ప్రశ్నింప "విష్ణుకళా మయమగు ప్రపంచమును గూర్చియే" మాటాడెను.

దాసుగారు పరమ భాగవతులుగాన భక్తి విషయమై ప్రహ్లాదుని పాత్రిలో లీనమై-

"హరిచింతాపరవశుడై, యతడేడ్చునొకచోట,
హరి భావనారూఢచిత్తు - డై పాడునొక చోట,
హరికిదక్కవేరు లేదని నగు నొక చోట,
హరియను నిధానము గంటి నని యుబుకు నొక చోట"

అని భక్తివలని తన్మయత్వము కన్నులు గట్టినట్లు వర్ణించినారు.

ప్రహ్లాదుని భక్తి యచంచలమైనది. అతనికి దైవమునందున్న విశ్వాసము దృఢతమమైనది. అందువలననే గజేంద్రుడు "కలడు కలండ నెడివాడు కలడో ? లేడో ?" అని సంశయగ్రస్తుడు కాగా, ప్రహ్లాదుడు తానెంత తన తండ్రిచేత బాధపెట్టబడుచున్నను చలింపక, హరిని చూపింపు మని తండ్రి యడుగ,

"వెదకనేల నాతండ్రి - విష్ణుడు లేని స్థలమేది -
పదపడి భూమినభః - పాతాళములందున
జలధిన్ గాలిన్ దిశలన్ - జెలగున్ శిలన్ బవళ్ళ
నలరున్నిలో నాలో - నఖిలజగన్మయు డాహరి"

నిశ్చలముగ నిమ్మకు నీరెత్తినట్లు సమాధానము చెప్పినాడు. ప్రహ్లాదుని సమాధానమున నెట్టి సంకోచమును లేదు. దాసుగారు ప్రహ్లాదుని పాత్రియందు తాను లీనమై భక్తి తత్త్వమును నిరూపించుచు నృసింహ స్వామిని స్తుతించునపు డిట్లు చెప్పించినారు.

"నిష్ఠాబలప్రజ్ఞలున్ సచ్ఛ్రుతంబున్ జపంబున్ దపంబున్
మహిన్ జాలవాదంతియూధేశు చందంబున న్భక్తి సేయంగ
బోకున్న సత్యామలజ్ఞానదాన స్వధర్మానురక్తి క్షమా
యజ్ఞ నిర్మత్సరత్వానసూయా తపోదర్పిత బ్రాహ్మణశ్రేష్ఠ
కంటె న్వరిష్ఠుండగున్మాలడైన న్నినున్ భక్తినెల్లప్పుడున్
గొల్చునేనిన్ గడుంభక్తమందార ... ... నన్నుతించు
న్నినుంగూర్చి యల్పుండనైన న్భవద్వర్ణనల్సేసి యజ్ఞాన
ముం బాపి ముక్తిన్నరుండందుగాన .... ...."

విద్యవలని ప్రయోజనముల గూర్చి భర్తృహరి మొదలగు పూర్వులు చెప్పియున్నప్పటికిని సందర్భమును పురస్కరించుకొని "ప్రహ్లాదుని విద్యావంతుని జేసిన నడవడికయందు మార్పుకలుగునని హిరణ్యాకశిపునిచే కుమారునికి విద్యను గుఱించి" దాసుగారు తన విశిష్టపద్ధతితో చెప్పించినారు.

సీ॥ గాజు పోలికి రెట్టి గావించెడిన్నైజ
మగుతెల్వి దీపంబుసంటివిద్య
చెడ్డ గుణంబెల్ల శీఘ్రమెఖండించి
మంచి గుణములు గావించువిద్య
కష్టకాలంబున గడునొంటి పాటున
నుల్లమునోదార్చు చుండువిద్య

తే. గీ. విద్య శాశ్వత సత్కీర్తి వెలయజేయు
నిహపరంబుల విద్యతరింప జేయు
విశ్వమంతయు నడిపించు విద్యగాన
విద్య నేర్వుము వేగ నావెట్టితండ్రి.

ఇందు విద్య "ఇహపర తారకమనియు, విశ్వమంతయు నడిపించునదనియు చెప్పించుట"చే కవిగారు తన ప్రత్యేకతను చూపించినట్లైనది.

ఈ కావ్యమునందు భక్తిభావ మడుగడుగున ద్యోతకమగును. అసురార్భకులకు ప్రహ్లాదుడు విష్ణుభక్తిని బోధించుచు-

"నిక్కపు భక్తికి లోబడు నీలవర్ణుడెన్న
తక్కిన వ్రత క్రతునిష్ఠలఁ జిక్క బోడన్న
ఎక్కడి వారలకైన, మరేరూపుల వారికైన
నెక్కువ వారలకైనన్, తక్కువవారలకైనన్.

మ॥ అనయంబున్ హరి కేశవా సకలకర్తా సర్వలోకేశ్వరా
వనజాక్షా పరమాత్మ భూతదయ గోపా కృష్ణ నారాయణా
ఘనసంసార పయోధి మున్గిన మముంగాపాడి విజ్ఞాన మి
మ్మని నిష్కామత ప్రాణమున్న వఱకు న్ప్రార్థించుడీ దేవునిన్."

అని పలికించుటలో దాసుగారు విష్ణువెంత భక్తసులభుడో తెలుపుచు భక్తియు నిష్కామముతో నుండవలయునని పరమ భాగవత ధర్మమును తెలిపినారు.

హిరణ్యకశిపుని చంపుటకై యవతరించిన శ్రీ నృసింహస్వామిని దాసుగారు రౌద్రరస స్ఫూర్తితో వర్ణించిరి.

సీ॥ గంభీర భీకర గర్జారవంబున
బ్రహ్మాండభాండ కర్పరముపగుల
చటులసటాచ్ఛటా చలన సంజాత ప్ర
చండ వాతాహతిన్ గొండ లెగయ
కాలానలా భీల కీలాభజిహ్వా ప్ర
భాపఙ్క్తిన్ జగమెల్ల జేవురింప
తరుణేందు భాసుర దంష్ట్రానఖ చ్ఛాయ
లలమి దిక్కులకు వెన్నెలలుగాయ

గీ॥ కరము లురమును [illegible]రము సింగంబుమాడ్కి
వాభికిన్ గ్రింది భ[illegible]ము నరుని పోల్కి
నలర నర సింహ[illegible]ూపున నవతరించె
నా శ్రితపరాయణు[illegible]డు నారాయణుండు.

ఈ పద్యము దీర్ఘసమాసములతోడను పరుషాక్షరములతోడను గూడి ఓజోగుణముతో నొప్పుచుండుటవలన రౌద్రరసము ప్రస్ఫుటమగు

చున్నది. ఇది హరికథ గాన పద్యమునందలి పదముల పొందికను బట్టియు హరికథకులు చదువు రీతిబట్టియు నృసింహుని భీకరరూపము శ్రోతల మనోనేత్రముల యెదుట ప్రత్యక్షము గావలయును. ఇందు దాసుగారు మూర్తియొక్క భయంకర రూపమును కళ్ళకు కట్టించినారు.

ఇట్లే హిరణ్యాక్షుని రూపమును వర్ణించు పట్టున మూర్తి దర్శనము మనశ్చక్షువుముందు సాక్షాత్కరించునట్లు వర్ణించిరి.

సీ॥ నీలి కొండన్ బోలు నెమ్మేనదొాగరు దు
ప్పటి సంజకెం జాయపగిదిమెరయ
స్వప్రతాపానల జ్వాలలనంగ నె
దలమీరి పల్లజడలు వెలుంగ
నఖిల జగజ్జయప్రాప్త కీర్త్యంకురా
కారత నెలవంక కోరలమర
నోలిముప్పిరిగొన్న యుక్కుదూలమ్ముల
నదగు చేతులబెద్దగద చెలంగ

గీ॥ ధరణి యడుగుల కదరనమరులు బెదర
దిక్కులను గెల్చివచ్చెద దీవనలిడు
మన్న యని నాకుమ్రొక్కుస్వర్ణాక్షుడేగె
ననుజుని నృశిగన నోచనైతినకట.

ఇందు సమాసము లంతట లేకపోయినను, చిన్న పదబంధముల తోడనే హిరణ్యాక్షుని భీకర రూపము పొడగట్టుచున్నది.

హిరణ్యకశిపుడు తన దేవేరి లీలావతి కనబడక పోయినపుడు విలపించిన తీరు కరుణరసమునకు చక్కని యుదాహరణము.

"ఏమైతీవో ప్రాణేశ్వరి నీ - వే -
నామనోహారిణీ – నన్నొంటిగచేసి - యే -
నేమిజేగననా నిను దీయనీ - నీనుడి వినవా
భామినీమణిపూర్ణ గర్భిణివి - గదే పాడువిధి యెంతచేసె - నే

ఈవులేనివార్త - కెటుపైచునీభర్త, యేవిధానబోతి
వెటులమాయమైతి, దేవిపల్కవే నీవాతెర - తేనె
జిల్కవే - రావదేమి త్వరగ నీ కొఱకు నీ - ప్రాణనాథు
డిటులెదురుచూడ - నే -

మ॥ అకటా యోభువనైకసుందరి యొహో ప్రాణేశ్వరీ నిన్నుగా
నక నేనొక్కక్షణంబు నిల్వగలనా నన్బాసి నీవోర్వకిం
తకు వైరాగ్యముపూని బ్రహ్మమున లీనంబైతివో లేక వం
చకుడై మాయయొనర్చెనో హరి ని ను న్బాధ్వీ మరేమైతివో

ఈ విధముగా నిందు అంగిరసమగు భక్తితో పాటు అంగరసము లగు శాంత్ర కరుణసరములను చక్కగా కవి పోషించెను.

పెద్దనామాత్యునివలెనే నారాయణదాసుగారు కవిత్వ ముండవల సిన పద్ధతిని భావించినారు. ఇంద్రునికి నారదుడు హితవు చెప్పునపుడు దాసుగారి శైలి నాతికఠినమై యొప్పుచున్నది.

''ఉ॥ పంతముతోడనీపయిని బాముపలెన్నగబట్టు సుమ్ము - దు
ర్దాంతుడు లోకకంటకుడు దానపభర్త నిజంబుగా - మహా
శాంతుడు విష్ణుభక్తుడును సన్నుతశీలుడు బుట్టుదీనికి
యింతికతండు నీ హితముకై యని.... .... .... ....''

శబ్దాలంకారప్రియులగు పోతన జయదేవు లిద్దరును నారాయణ దాసుగారికి అభిమానపాత్రులు కావ్యము చిన్నదైనను పుష్కలముగా అనుప్రాసాది శబ్దాలంకారముల కూర్చినారు. కృతిభర్తయు, తన యిష్ట దైవమునునగు సూర్యనారాయణస్వామిని వర్ణించుచు

''సరోజ మిత్రలోకనేత్ర సాధుసౌఖ్యదాయకా
స్ఫురచ్చరిత్ర సత్యపాత్రభూరిదేవనాయకా
చరాచరాదికారణా యసాధ్యరోగమారణా
అరిష్టవర్గతస్కరా సదార్సవల్లి భాస్కరా!''

అని అంత్యానుప్రాసాలంకారములో పంచచామరవృత్తమునందు చెప్పినారు.

దాసుగారిట్లే అర్థాలంకారములగు ఉపమాదులను రమ్యముగా వాడి యున్నారు.

'దనుజనాథు దేవిగాని నారదుడువచ్చి మెఱుపుతోడి వెల్లమేఘమునలె'
'కల్లను నిక్కంబుగావించు నాతండు సున్న కువిలువను బన్నునట్లు'
'గాజు పోలికి రెట్టి గావించెడిన్నైజమగు తెల్విదీపంబునంటి విద్య'
'కృతిని నిఘంటువు వెతకి ముదురుతాటిముంజవలెన్జేయు మూర్ఖుడొకడు'

ఇందు వేదాంత విషయములు జనరంజకముగా నుండవని స్వల్ప ముగా స్పృశించుచు, వానినే పామరులగు వారి కర్థమగునట్లు మనో హరముగా నుడివియున్నారు.

"నరుడు .... స్వీయపరకీయ - భిన్నభావాంధకారమున – సరిగ స్వీయ కర్మమునన్గో – సనకాయ పుర్వుచందమునన్ దెరవెరుగక చిక్కుబడున్ గృహమున, దృఢ మోహపాశ బద్ధుండై – పరకళత్ర పుత్రమిత్ర బాంధవ వశుడై తుదమూఢుడై చెడున్ .... .... ...."

పట్టుపురుగు తన చుట్టును దారమల్లుకొని తానే బంధింపబడినట్లు నరుడు తానుచేయు కర్మలవలన గృహమున చిక్కుబడును. కళత్రి పుత్రిమిత్రి బాంధవవశుడై తెరవుగానక మూఢుడై చెడునని చక్కని ఉపమానముతో సామాన్యుల కర్థమగునట్లు చెప్పియున్నారు.

పరమాను దేవతత్త్వమునందు జ్ఞానము, శక్తి, బలము ఐశ్వర్యము, వీర్యము, తేజస్సు అను నారు గుణములు నిండి యుండును. ఆభగవాను డీ జగమును సృష్టించుటకును, పాలించుటకును, ప్రళయ మొందించుట కును గర్త. ఇట్టి ఈశ్వర తత్త్వమును లలిత లలితమగు పదములతో దాసుగారు మనోజ్ఞముగా చెప్పియున్నారు.

సీ॥ హరియన నెవడన యందులేని యతండె
ముఖ్యకారణమన్ని భూతములకు
ఆకాశమట్టుల నంతటనిండియు
దానెద్దియుంగాక తనరుచుండు
కల్లను నిక్కంబు గావించు నాతండు
సున్నకు విలువను బన్నునట్లు
అతనికి వేరైన దదియె శూన్యము దాని
నేమాయయని మనమెరుగవలయు

గీ॥ పెక్కులేల యెల్ల వేదాంతసారంబు
తేటనెల్లముగను తెలియపర్తు
ఎద్దికలదొ యదియె యీశ్వరతత్వంబు
ఎద్దిలేదొ యదియె యీజగంబు.

సామాన్యముగా కావ్యములు నీతిని, ధర్మమును బోధించు చుండును. దాసుగారు ప్రత్యేకముగా "ఇదినీతి, ధర్మము" అని చూపించుటగాక సందర్భముననుసరించి కొన్నిసూక్తుల కావ్యమునందు గూర్చి యున్నారు. ప్రహ్లాదుడు అసురార్భకులకు హరి తత్వమును దెలుపుచు లోకసామాన్యమగు విషయమును నుపమానముగాచేర్చి మాయ యగు జగమిది సర్వేశునొద్దనున్నట్లు తోచునని స్పష్టపరచినారు.

కం॥ కలిమిగలవాని లేమిన్
గలవాడెటు లాశ్రయించి కలిమిదెలుపునో
తెలియుడు లేనిజగంబిది
యొలయన్సర్వేశు నొద్దనున్నటుతోచున్.

విద్య యొక్క ప్రయోజనమును దెలుపుచు హిరణ్యకశిపుని ముఖమున దాసుగారు "చదువనివాడు మూఢుడై చెడు, జదువ సద సద్వివేక మొదవు" అని చెప్పించినారు. హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని చదువును పరీక్షించునపుడు పుత్రుని మాటలెట్లు తండ్రికి నానందమును గూర్చునో కవి తెలిపి యున్నాడు.

'తనయాలాపముగదా - జనకశ్రుతి భూషణము
అనుదినమును సంతోషణము — జనితశ్రమ సంశోషణము'

సాహిత్య సత్యవ్రతులందరు మననముచేయు పోతనగారి "మందార మకరంద మాధుర్యమున దేలు మధుపంబుబోవునే మదనములకు ......" అను సీసపద్యమునందలి భావమును వీరు చాల నైపుణ్యముతో చిన్న కీర్తనలో తేట తెలుగుమాటలలో మధురముగా రచించిరి.

ఇట్లే పోతనగారి "అచ్చుపుఁ జీకటింబడి గృహావ్రతులై ..." "కానని వాని నూఁతగొని కానని వాఁడు ...", "అంధేందూదయముల్ మహాబధిరశంఖారావముల్ ...", "శోధింపం బడె సర్వశాస్త్రములు" అను ప్రసిద్ధమగు పద్యములందలి భావములను కడుసమర్థతతో శ్రీ నారాయణదాసు గారొకేయొక కీర్తనలో మణిహారమువలె కూర్చినారు.

ప. హరిని విడిచి నాదుచిత్త - మన్యులజేరుటెటుల శ్రీ. హ
అ. అరవిందము మాని మదన - మందుతేటివాలునా శ్రీ. హ

పరిగా మందాకినిలో - స్నానమాడు రాజహంస
బురదనక్కగుంటలోన - మున్గుటకాసించునె శ్రీ. హ

మంచిమావిమానికోయిల - మటికొణిసెంజేరునా
మించువెన్నెలగ్రోలు చకోరము - మంచుగడ్డకొరుకున" శ్రీ. హ

ఇంత చిరుపాత్తమునందు, అందున హరికథయందు దాసుగారు వివిధవృత్తములను వాడినారు. సాధారణముగా వాడు చంపక, ఉత్పల, మత్తేభ శార్దూలములతోపాటు మాలిని, తోటకము, పంచ చామరము మొదలగు వృత్తములను దండకమును రచించి వివిధ వృత్తరచనా నైపుణ్యమును ప్రదర్శించిరి.

నారాయణదాసుగారు తన చిన్నకావ్యమునందు చక్కని జాతీయములను, నుడికారపుసొంపులను చక్కగ వాడి యున్నారు.

'పోతుటీగకైన జొరశక్యముగాదు'

'పులి మీసములు పెరుకునట్లు'

'పాము వలెన్పగ పట్టు'

'ఇది మీసంబా'

'నా చర్మంబు నీ పాదరక్షలు గావించినదైన నీ ఋణము నా శక్యంబె తీర్పంగ'

'చాల మిన్నందు'

'ఎంతటి గుండెతీసినపని'

ఇట్లు నారాయణదాసుగారి రచనలో నెన్నింటినైనను చూపవచ్చును.

తెలుగునాట పోతన పద్యము లు జనుల జిహ్వాగ్రములపై మెదలుచుండునుగాన పోతన పదములపొందికనే దాసుగారు తమ రచనయందు వాడి శ్రోతలకానందము గల్గించుట పరమావధిగా భావించిరి. అంత మాత్రముచేత తనవ్యక్తిత్వమునెచ్చటను గోల్పోవక రూపములను కన్నుల బొడగట్టునట్లు వర్ణించుటయందును, పఠితలకు భక్తిభావావేశమును కల్గించుటయందు, జాతీయములను, సూక్తులను పొదుగుటయందును తమ ప్రత్యేకతలో దృశ్యాదృశ్యముగ దాసుగారు కనిపించుచునేయుందురు. ప్రధానముగా భక్తి, నీతి, ప్రబోధమున కుద్దేశింపబడిన ఈ హరికథ కావ్యామృతమును పఠితలకు పంచిపెట్టుచున్నది.

# భీష్మ చరిత్రము

శ్రీ ఎ. ఎస్. ఆర్. ఆంజనేయులు

శ్రీ మదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసుగారు అధునాతనాంధ్ర హరికథా ప్రక్రియ కాద్యులు, పితామహులు, శ్రీ దాసుగారు సంగీత, నాట్య, సాహిత్యములు మూడింటియందును నిష్ణాతులగుటయే వారు హరికథా ప్రక్రియకు నేటి రూపము నిచ్చుటకు దారితీసిన దనవచ్చును.

## హరికథ : సాహిత్యము

సంగీతము, నాటకము, సందర్భోచిత హావభావ ప్రకటనాత్మకమైన యభినయము, కవిత్వము పెనవేసికొన్న కళాస్వరూపమే హరికథ. శ్రావ్యమైన సంగీతము. లయాను గుణమైన నృత్యము, సందర్భోచితాభినయము వాక్ వాక్య విన్యాసమున గోచరించు నాటకీయత, ప్రసక్తాను ప్రసక్తముగా దొరలు చాటూక్తులు, హాస్యప్రసంగములు. పిట్టకథలు, విమర్శలు, విసురులు, చెణుకులతో హరికథ శ్రోతల నానంద పరవశుల గావించును. సాహిత్య దృష్టితో హరికథను పరిశీలించు నప్పుడీ పైన పేర్కొనిన భాగము మరుగు వడును. సాహిత్యము హరికథ యందొక ప్రధాన భాగమే గాని సమగ్ర స్వరూపముగాదు. ఇచట సాహిత్య దృష్టితో నీ హరికథ పరామర్శింప బడుచున్నది.

## భీష్మ చరిత్రము :

ఈ హరికథ నీల శైలమున వేంచేసియున్న జగన్నాథ స్వామి వారి కంకితముగాఁ జెప్పఁబడినది. తన కవితం జేపట్టుటకు కరుణారస నివే

శుడు జగదీశుడునైన జగన్నాథునికంటె సర్వులెవరును లేరని కవి భావించి నాడు. కృత్యాదియందు కృతిపతి ప్రశంస. ఇష్టదేవతా ప్రార్థనము, శ్రోతలను సంబోధించుచు జెప్పిన పద్యములవలె నీ కృతి మూడాశ్వాస ములుగా - మూడు భాగములుగా - జెప్పబడినది. ప్రతి ఆశ్వాసా ద్యంతములయందు కృతిపతిని సంబోధించుచు జెప్పబడిన పద్యములు గలవు. బహుశః ఇది మూడు రాత్రులు గానము చేయబడు కథయేమో! లేదా - ఈ విభజనము విరామమును సూచించుట కేర్పడినదై యుండ వచ్చును.

## కథా విధానము :

ఈ హరికథయందు గంగా శంతనుల వివాహము, భీష్ముని జన్మ వృత్తాంతము, విద్యాభ్యాసము మున్నగునవి పేర్కొనబడలేదు.

> "పౌరుష జ్ఞానకీర్తులు బరగి స్వార్థ
> పరుడుగా కెన్నడైన బాపము సలుపక
> ధర్మవర్తనమునకు నిదర్శనం"

బైన శాంతనవుని చరితం జెప్ప దొరకొన్నాడు గావున శ్రీ నారాయణ దాసుగారు భీష్ముని ధర్మవీరమును ప్రతిపాదించు తావుల గథను విస్త రించి మిగిలిన తావుల గథను సంక్షేపించినారు. కథలో నొండు రెండు ప్రధానాంశములు గూడ విడువబడినవి.

## ప్రథమాశ్వాసమున :

శంతనుడు సత్యవతింగాంచి మోహపరవశుడగుటతో కథ ప్రారంభమగుచున్నది. భీష్ముడు రాజ్యపరిత్యాగ మొనర్చుటకు, బ్రహ్మ చర్య మవలంబించుటకు జేసిన ప్రతిజ్ఞలతో నీ యాశ్వాసము ముగియును.

సత్యవతి 'యోజనగంధి' యగుట యిందు ప్రస్తావింప బడలేదు. శంతనుడు సత్యవతియున్న దెస కాకృష్టు డగుటకు నామెను గాంచు టకు గారణమైన దామె యోజన గంధిత్వము.

శంతనుఁడు 'ఒకనాఁడు యమునా తీరంబున వేటలాడుచుఁ గ్రుమ్మరువాఁ డపూర్వ సురభి గంధం బాఘ్రాణించి దాని వచ్చిన వలనారయుచునరిగి యమునా తీరంబున సత్యవతిని గాంచినట్లు భారతమున నుండఁగా శ్రీ దాసుగారు ... "ఒకనాడు వేట వేడ్కతోఁ—దగిలి ఘోర వనమునను దిరుగుచు డప్పింగొని యమునానది – తియ్యని నీటిం గ్రోలి కరమరుదుగ నిసుకతిన్నె మీదం – గనియె నొక్క జవరాలి" అని మాత్రమే చెప్పినారు.

సత్యవతి యోజనగంధి యగుట పరాశరుని వరప్రభావమున కలిగినది. ఆమెకుఁ బరాశరమౌని వలన కృష్ణద్వైపాయనుడను సుతుడుదయించినాఁడు. అయ్యును ఆమె కన్యయే! అదియును ముని వరప్రభావమే!

ఆమె యోజనగంధి యనుటచేత నతఃపూర్వ మామెకుఁ బరాశరునితోనైన పొందు స్ఫురించి తీరును. సత్యవతీ శంతనుల శృంగారమును విస్తరించి వర్ణించిన కవిగారిట్టి విషయము శ్రోతల మనస్సులలో మెదలుటుచితము గాదని తలంచియుందురు

శ్రీ దాసుగారు రూపొందించిన సత్యవతి ఒక జాలర కన్నె–సిసలైన పల్లెపిల్ల – ఆమె వర్తనములు – విలాసములు – మాటతీరు–సర్వమును – పల్లెపిల్ల తనమునే స్ఫురింపఁ జేయుచున్నవి.

సీ॥ ఓడఁ గొయ్యకుఁ గట్టి యొడ్డునం దీయని
పాటఁ బాడుచునున్న పంకజాక్షి
పయ్యెద జాఱఁగఁ బలుమఱు రాయంచ
వెంబడిఁ బరుగిడు కంబుకంఠి
ఇసుక తిన్నెయ మీఁద నేమియో నాటల
నాడుచున్నట్టి బింబాధరోష్ఠి
సంజయెండకు మేనిచాయ మిక్కిలి తళ్కు
మీఱగ నొప్పు రంభోరు యుగళి

గీ॥ ఏరు దాటింతురమ్మ ప్రొద్దేగకుండ
సుంకమేమియు నడుగనంచుఁ జిరునవ్వు
మొల్క లెత్తఁగఁ దనుఁ బిల్చు ముద్దుగుమ్మ
పూర్ణచంద్రాస్య జగదేక మోహనాంగి.

ఈ యాటలు, పాటలు, నురుకులు పరుగులు పల్లెపిల్లలకు సహజములు గద !

ఆ పిల్ల "ఏరు దాటింతురమ్మ ప్రొద్దేగకుండ" అనియే శంతనుని పిలిచినదట ! ఏరు దాటవలసినవాడు శంతనుడు – అతడే ఆమె నభ్యర్థించును గదా ! కాని యీ పిల్లయే చొరవచేసికొన్నది. ఏరు దాటింతురమ్మని పిలిచినది. చిఱునవ్వులు చిందించినది. పైఁగా – 'సుంకమేమియు నడుగ' నన్నది. – ఇది యొక గడుసుదనము – ఇది యొక శృంగారము– ఇది తన హృదయమును వెల్లడించురీతి – ఇచ్చట సత్యవతియొక్క పల్లెపిల్లతనము మఱింత మెరయుచున్నది.

తరువాత శంతను డామెను గంగతోఁ బోల్చుకొనుచు గావించిన వర్ణన హృద్యముగా నుండుటయేగాక, అతని ధర్మ ప్రవృత్తికిని నిదర్శనమగు చున్నది.

"ఎవరి దానవే తరుణీ – నీ – వెందుకుంటివే కరణీ" అను కృతిలో 'ఇమ్ము రాచసుంకమ్ము – నీ – కెమ్మోవి చూనికమ్ము' అను చరణము పల్లెపిల్లతోడి సరసమునకు మచ్చుతునక; పిల్ల సుంకమడుగలేదు కాని రాజు సుంకమడిగినాడు. ఆమె 'ఏరుదాటింతు' నన్నది. ఈయన ముమ్మరంపు మోహాంబుధి దాటింపు' మను చున్నాడు. ఆ 'పల్లెబోటి ఈ రాజునకు 'పంచబాణుని ఘోటి'

రాజుగారు పరమ నాగరికుడు – నాగరికుల హృదయములు పల్లెపిల్లల హృదయములంత స్వచ్ఛతరములుగావు; రాజుగారి మాటలు చేష్టలు మోహావేశమును సూచించుచున్నవి. మఱి ఆ పల్లె పిల్లయో!–

ఆమె రాజుగారికంటె రెండాకు లెక్కువ చదివినది. రాజుగారు కోరిన సుంకము – "కేమ్మోవి"; ఆమె 'మనసిచ్చితిని; ఇదె రాచసుంక" మన్నది 'తలిదండ్రుల చాటుదాన; మా పెద్దల నొడపర్చుకొనుము' అన్నది ఈ స్వచ్ఛత; తొణకనితనము – రాజుగారిలో లేవుగదా! 'పల్లెకన్నియన్ స్వామి' అను నీ కృతి శ్రీ దాసుగారి పాత్రోచిత భాషాప్రయోగమున కొక యుదాహరణము.

పిమ్మట శంతనుడు 'ఓడపై బోవుచున్న యయ్యబ్జాక్షిని దృష్టి కందిన మేర కనుగొంచు భావి సౌఖ్యమును దలంచుచుఁ దన పురంబున కేగె' ననియే చెప్పఁబడినదిగాని శంతనుఁడు దాశరాజు నొద్ద కేగి కన్యార్థించుట – ఆతఁడు విధించిన నియమములు – హరికథయందు పేర్కొనబడలేదు. శంతనుఁడు విచారగ్రస్తుఁడగుటకు దేవవ్రతుఁడు భీష్ముఁడగుటకు దారితీసిన ప్రధానఘట్టమిదియే గదా! దాసుగారు దీనినేల వదలివేసిరో?

'యోజనగంధి రాజు చిత్తంబునం గలుగుట'ను గాంగేయుఁడు వృద్ధామాత్య పురోహిత సుహృజ్జనంబులతో విచారించి యెఱింగెనని భారతమందున్నది. హరికథలో శంతనుఁడే – 'పడయఁ గోరెద నొక్క పల్లె కన్నియ యెున్న జమున చెంగట మానసంబు గొనియె' నని కుమారునితో బలికెను. ఈ మార్పు రాజుగారి వేదనయొక్క తీవ్రతను సూచించుటకేమో!

విరహవేదనా కులమైన సత్యవతి తలంపులు 'అందరాని మ్రాని పండు' అను కృతియందును 'ఆ సంజపూట యేకాంతముగా నేల' అను సీసపద్యమందును వెలువరింపబడినవి. అందలి భావములకు అలతి యలతి యచ్చ తెలుగు పదముల కూర్పు ఒక వింత సొయగమును గూర్చి పల్లె పడుచు హృదయమును పట్టియిచ్చుచున్నది.

"ఏమి చేయుదు నీ వంత నిప్పు డెవరి
తోడఁ జెప్పుదు నిస్సిరో యాడబ్రతుకు"

వలచిన వానిని వివాహమాడుటకు గూడ స్వాతంత్ర్యములేని దాడ బ్రతుకు తన కోర్కెను తల్లిదండ్రులకుఁ జెప్పుటకుఁ గూడ జంకుచున్నదా కన్య! సమకాలీన స్త్రీ సమాజముపై కవిగారి సానుభూతి యిట్లు వెల్లడియైనది.

ద్వితీయాశ్వాసమున :

అంబోపాఖ్యానము భీష్మ పరశురాముల యుద్ధము వర్ణింపబడినది. శ్రీ దాసుగారు చెప్పఁబూనిన హరికథలో నిదియే ప్రధాన ఘట్టము. ఇందడు గడుగున భీష్ముని ధర్మవీరము పరిపోషిత మైనది.

యుద్ధమున అస్త్ర ప్రత్యస్త్ర ప్రయోగాది వర్ణనము నుజ్జగించి శ్రీ దాసుగారు భీష్మ పరశురాముల సంవాదమును విస్తరించి నాటకీయతను బోషించిరి.

ఈ ఘట్టమందు గురుశిష్యుల పలుకులలో గల వాడుక భాష కవి గారి చేతిలో తీయందనమునే గాక వాడిమిని వేడిమిని గూడ సంతరించు కొన్నది.

"అంబను నీ పిన్నతనమునకుఁ బెండ్లి సేయుము నాకుఁ బ్రియముగ" నన్న పరశురాముని యాదేశమును భీష్ముడు త్రోసిపుచ్చిన సందర్భమున తిక్కన్నగారు—

'గర్వియై కార్య మిట్టి దకార్యమిట్టి
దని యెఱుంగక లోకంబు చను పథమున
దిరుగ కున్మదవృత్తి వర్తించునట్టి
వారి గురునైన దండింప వలయు నండ్రు.

అని చెప్పిన యీ భావమును నారాయణదాసుగారు—

"తలిదండ్రుడు ల్గురు లాప్తులయ్యుఁ గడు మత్తంబైన చిత్తంబుతో
నలువుర్వోయిన త్రోపవోక నెపము న్గల్పించి యీ తీరునం
బలు దుర్దవము పాటున న్పథము దప్పం జెప్ప నేఁజేయు టె
ట్టులు? నిక్కంబుగ ధర్మవీరులకు లేడో రక్షకుం డెయ్యేడన్"

తిక్కన్నగారు ధర్మమును మాత్రము చెప్పినారు. దాసుగారు ధర్మమును చెప్పటతోఁ బాటు భీష్ముని మనస్స్థితిని గూడ వివరించినారు. 'నెపమున్ గల్పించి' – 'మద్దైవము పాటునన్' – ఇవి భీష్మునకు గురుని పట్లగల – భక్తివినయములను వెల్లడించుచున్నవి. 'పథము తప్పం జెప్ప నే జేయుచెట్టులు ?' 'ధర్మవీరులకు లేఁడో రక్షకుం డెయ్యెడన్'– గురు నెదుర్కొనక తప్పని తన సంకట స్థితికి భీష్ముడిట్లు వేదన పడుచున్నాడు.

పిమ్మట భీష్ముడు గురునితో "నీకరపుమేటి విలువనేర్పు చవిఁ జూచెదో" యనియు "మున్ను రాజుల నీవు బొలియింప గాంగేయుఁ డున్నచోఁ జెల్లునే యుల్లపుం బండువు ?" అనియు ననును. ఇచట వ్యక్త మగుచున్నది భీష్ముని యవినయముగాదు-ఆతని యాత్మవిశ్వాసము, ధర్మ వీరము. తరువాత "పడసినాఁడ నీకృప న్విలువిద్య; నిర్భయంబుగ ధర్మ యుద్ధమున న్నిల్చియుండు వాఁడ" ననుట ఆతని యాత్మవిశ్వాసమును ధర్మవీరమునే బలపఱచు చున్నవి.

"అమృతుఁడ వాఘ్యుఁడ వాచార్యుఁ డవునీవు రణములను దెప్పించె నట భీష్ముడు ! శరపుష్పముల పూజ జలుపవలసె" ననుచు అమృతుఁ డనుటలో పరశురాముని చిరంజీవిత్వము స్ఫురించుచున్నది. 'శరపుష్ప ముల పూజ !— భీష్ముండీ యుద్ధమును గూడ ఒక విధమగు గురుపూజ గనే భావించెను. ఇట్లు భావించుట భీష్ముని వినయ సౌశీల్యమునకు వన్నె వెట్టుచున్నది.

గురు శిష్యుల కలహమునకు కారకురాలైన 'అంబ'కు గలిగిన యాపద యెట్టిదో శ్రీ దాసుగారు చక్కగ వివరించినారు.

"కాపురము లేకయుండుట కన్న నాఁడు
వారికి న్వేఱె గొప్ప యాపదలు గలవె ?"

అంబకు కాపురము లేకుండఁ బోవుటకుఁ గారకులెవ్వరైన గానిండు ! ఈ కలిగిన యాపద గొప్పదియేగద !

యుద్ధరంగమున నవతరించిన పరశురాముని రూపమును శ్రీ దాసుగారు మన కిట్లు సాక్షాత్కరింపఁ జేసినారు.

"కెంజెడల్ ముడివైచి మంజులముగ మౌళి
పైని రుద్రాక్షల వరుసఁజుట్టి
వీరకాచనుగట్టి బెబ్బులి తోలుపైఁ
దాల్చి మూపునజన్నిదంబు లమర
మొలఁబెట్టి ఖట్వాంగమును విల్లుచేఁబట్టి
చండభాస్కరుని తేజమున మీటి
సింహగర్జలు చెవుల్ చెవుడు పర్వఁగఁ బ్రళ
యాగ్నికణంబుల నక్షులుమియ

భృగుకులాగ్రణి రాముండు వీరమౌని
శాంతనవుఁ బిల్చి గద్దించి సంభ్రమించి
టంకృతులొనర్చి గిరులువడంకునటులఁ
బల్కెనిటుమేఘగంబీరభాషణములు"

"జనని నైన గురు నాజ్ఞ పట్టి నేఁ - జంపినవాఁడ సుమా" అని పరశురాముఁడనుట సముచితముగ నున్నది. తల్లిని జంపిన వానికి శిష్యుఁ డొకలెక్కయా !

భీష్ముఁడా యుద్ధమున 'తన్ను గాచుకొనక తీఱదను కోర్కె' తోనే పోరాడుచుండెనఁట! పోరిట్లు సాగుచుండ - 'గంగసుతుఁ డొక్క నాఁడు భార్గవుని మూర్ఛపుచ్చి యాతని గని తలపోసె నిట్లు : అచట నొక కృతియు, నొకపద్యమును జెప్పఁబడినవి. 'ఈగనైన వాలనీక నేఁ గొల్చితి నిన్నుఁ దొల్లి'-అనునది కృతి; 'పెద్దలే యొక్కప్పు డెద్దియో కతమున, నున్మత్తులైయుండ, నున్నవారలర్థముగా మేలు నాచరించు చికిత్స సేయఁగ వలయు హింసింపరాదు ...' మొదలగునది పద్యము; ఈ రెండింటి యందును శిష్యుఁడు గురునితోఁ బోరవలసి వచ్చినందుకు విచారపడుచున్నది. పద్యమందు గురుని హింసించినందుకు, మూర్ఛ

పృచ్ఛినందుకు శిష్యుడు పరితపించుచున్నడి. గురునితో భీకరసంగ్రామ నిమగ్నుడై యున్నను, భీష్ముని యందు శిష్యధర్మము చెడకుండ మిగుల నిపుణతతో, బోషించినారు శ్రీదాసుగారు!

తుదకు భీష్ముడు

'మూర్ఛదేరిన వెన్కనీ భూమిసురుడు
నన్నుఁ బోనిచ్చెనేని వెన్నంగ నాకు

మంచిమాటయుఁ దక్క బ్రాహ్మణ హితమగు' ననుకొన్నాడు- ఇందును శిష్య ధర్మమే గాన్పించుచున్నది గదా!

మూర్ఛదేరిన భార్గవుఁడు లేచి 'ఆది వెనుకమై పొంగు తరంగము వలె మున్నుంగవయుచు నతనితో నను గంభీరముగాన్'

పల్లవి: భళిరా క్షత్రియపోత - బాగు బాగు నీసేత॥

అనుపల్లవి: అలసట బెట్టితివి న - న్నారితేరిన శిష్యుడవు॥

ఇందు శిష్యుని మెచ్చుకోనుట యున్నదా? వ్యంగ్యముగ నెత్తి పొడుచుట యున్నదా? రెండును నున్నవి.

అందుకు భీష్ముఁడు కరముఁలెత్తి మ్రొక్కి, వినయముతో నిట్లన్నాఁడు.

"ఏమి నేర్పున్న నీ - కృప గదా గురువర్య" గురుని మాట లెట్లున్నవో శిష్యుని ప్రతివచనములు నట్లె యున్నవి.

శిష్యుఁడు గురునిపై నొక యభియోగమును మోపినాఁడు. 'అంబ చాడీలు విని శిష్యుని చెఱఁజూచు చున్నాఁడట?'- నిజమేగదా! ఇచట 'చాడీలు' అను మాట వాడుటలో నెంత సొగసున్నది! పైఁగా- 'పరమ మానివి నీకు పంతము తగునా?' యని యాక్షేపించినాఁడు.

భీష్మునకు మాత్ర మంత పంతమెందుకను సందేహము కలుగు నేమో! తాను 'ధర్మమునకుఁ గట్టువడిన వాఁడు; ప్రాణములనైన దొరగును గాని దుర్ణయమున కొప్పఁడు.

మఱియు భీష్ముఁడు సౌజన్యనిధి; గురువుగారి నెత్తురులు దుడిచి వలయు సేవ లొనర్చినాఁడు.

తరువాత అంబ పరశురామునికడ కేగి

''మునుపటి బీరము వెన్కఁ బెట్టుమో - ముదుసలితాపసి నీవు
దినము లిర్వదియ్యెఁ గాన నిఁకనా- ధీరుని జయించలేవు॥
పాపము నాకొఱకై నీవీగతిఁ - బడదెబ్బలు తిన్నావా
ఓపిక తప్పినవాఁడు మునివృత్తి - నుంటయే మేలు దేవా॥''

అని పలికినది – కాదు – కెలికినది. జగడాల చీలి ఎట్లు మాటాడవలెనో అట్లే మాటాడినది. ఈ అచ్చ తెనుగు పదములు-వాడుకభాష-పాపము నాకై పడదెబ్బలు తిన్నావా?' – యీ పరామర్శ – ములుకులతోఁ బొడిచినట్లు, గుండెలలో కత్తి దూసినట్లైనది.

మరునాడు గురుడు పండ్లు పటపట గొరుకుచు శిష్యునితో – 'నీ కన్నమ్మ కడుపు చల్లగ నున్నేనియు బ్రతికెదవో రోరీ కుఱ్ఱా!' యనును. ఈ మాట లిచట నెంత వెలుగునిచ్చుచున్నవి! ఋషివాక్యములు గదా! వ్యర్థములుకావు; గంగమ్మ కడుపు చల్లనయే గదా! మఱియు నీ గురుశిష్యుల పోరు మాన్పు యత్నమున నారదునకుఁ దోడుగ గంగమ్మయు నున్నది.

భీష్ముడు ధర్మము కొఱకు గదా యుద్ధము సేయుట! – ఆతని ధర్మమును భార్గవుఁ డిట్లాక్షేపించు చున్నాఁడు.

ధర్మమనంగ సత్కర్మము పెద్దల
వర్తనమున దాని భంగి దోఁచు.
నీతిగల్గిన సర్వభూత హితంబగు;
బ్రహ్మఋషులతోడ వాదు తగదు;

లతకుఁ బందిరి మాడ్కి రమణికి మగనిని
బతిఁగూర్పఁ దలఁచుట బత్తితనమ ?
పిల్లను గ్రుడ్డువా వెక్కిరించిన యట్లు
గురునకు శిష్యుండు గఱపెఁదగవు"

ఇటాక్షేపించి నాఁటి యుద్ధమున భీష్ముని సారథిని జంపి, గాంగేయుని ధనువును ద్రుంచి, ఆతఁడు రథముపై సోలిపడునట్లు గొట్టినాఁడు.

గంగచే మూర్ఛ దేర్పఁబడిన పిమ్మట భీష్ముడు 'పరువు పూనిన పని బ్రహ్మ సెప్పిన గాని, నీతిమంతుఁడు సేయ నెట్టుకొనునె' అని 'పరశురాముని శస్త్రవహ్ని సైపగరా' దనుకొనును.

'జామదగ్న్యుకిం గినుక స్వభావము – ఆగురుని కేలను గూలిన మేలె; కాని యయ్యనఘుని గెల్చు మార్గ మొకటైనను గల్గదె ధర్మ సిద్ధికై' యనుకొనును. పరశురాముని గెలువగోరుట ధర్మసిద్ధికేగాని తనబీరమును ప్రతిష్ఠించుకొనుటకు గాదు. భీష్ముని ధర్మపిపాస యట్టిది.

స్వప్నమున వసువుల వలన (అష్టవసువులు స్వప్నమున సాక్షాత్కరించినట్లు భారతము – దాసుగారి హరికథయందు ఒక్క మహాత్ముడు కాన్పించినట్లు చెప్పినారు) సమ్మోహనాస్త్రము వడసి యుద్ధమున కరుదెంచిన భీష్ముని గాంచి భార్గవుఁ డెల నవ్వుతో నిట్లనును. 'నిన్న నరసచ్చితివి; నేఁడు న్న పని దీర్తు' 'తల్లి కొక్కఁడ వంచు వయఁ జూడ రాదు నిను' – తెనుగుదనముట్టిపడు భాష యిది – వాడుక భాషలోని వాడిమి యిది !

తరువాత 'మానవు నీకున్న బుద్ధి, మాట వినవుగా !' యనును. మొండికెత్తిన కుమారుని తండ్రి మందలించినట్లున్నది. వాత్సల్యము – కోపము – విసుగు – మూఁడును నున్నవి. తెలుగుజాతి వాడుకలో నున్న పలుకుబళ్ల కూర్పునందే యిట్టిది సాధ్యము.

భీష్ముఁడు బదులు పలుకుచు –

'చెల్లునని, పెద్దలమని, తోఁచిన విధమునఁ
జెలఁగి సంసారులను బాధ సలుపరాదు'

"పిన్నవారికైన పెద్దలకైనను మంచి చెడ్డ దెలుప మనసె సాక్షి' సమ్మోహనాస్త్రమును బ్రియోగింపఁ బోవుచు నన్న మాటలు!- గురుని హింసింపఁ బోవుటకు ముందు మనస్సును సరిపెట్టుకొనుట.

పిమ్మట నారదాదు లడ్డుపడి సమ్మోహనాస్త్ర ప్రయోగమునాపి గురు శిష్యులకు సఖ్యము గూర్చుట మున్నగు కథ నడచును.

ఈ సందర్భమున పరశురాముఁడు 'నాఁడు రఘురామునకు నేఁడు నీ కోడితిన్' అనును. ఇది ముయ్యేడు మాఱులు క్షత్రియుల నెల్ల తరిమి తరిమి వధించిన పరశురాముఁడు భీష్ముని పరాక్రమమున కొసంగిన యోగ్యతాపత్రమా! ధనుష్మదగ్రణి యగు రఘురామునకు భీష్మునిసాటి చేసినారు శ్రీ దాసుగారు.

ఇఁక తృతీయాశ్వాసమున :

కురు పాండవ యుద్ధము, భీష్ముని సేనాపతిత్వము, కృష్ణుడు చక్రి ధారియై భీష్ముని వధింపఁ బోవుట - అర్జునుఁ డాతని నివారించుట - భీష్మ స్తవము - శ్రీకృష్ణ ప్రేరితులై ధర్మజాదులు భీష్ముని జయించు నుపాయము నా మహనీయుని వలననే యెఱుంగుట - శిఖండి వృత్తాంతము - భీష్ముఁడు శరతల్పగతుఁడై శ్రీకృష్ణుని పనుపున ధర్మజునకు ధర్మము లుపదేశించుట మున్నగు కథయంతయుఁ జెప్పఁబడినది.

భీష్ముఁడు మహా ధర్మవేత్త గదా! కౌరవులు అధర్మవర్తనులని తెలిసియు, కౌరవపక్షమున నేల పోరాడెనని సర్వులును జేయుశంక-

శ్రీ దాసుగారు-

'పోరాడె ధార్తరాష్ట్ర పక్షమున - బోషింపబడి యతండు'

అని సమాధానము చెప్పిరి.

కొందరు పండితు లీ విషయమును నిట్లందురు భీష్ముఁడు దాశరాజు నొద్ద ప్రతిజ్ఞ చేయునప్పుడు—

'సః నో రాజా భవిష్యతి'

“.........యీ లలితాంగి కుద్భవించిన తనయుండ రాజ్యము నేలుఁగ సమర్థుఁడు వాఁడ మాకు నెల్లను బతి; వాఁడ కౌరవ కుల స్థితి కాపుఁ డుదారసంపదన్” (నన్నయగారి భారతము)

అనియుఁ బ్రతిజ్ఞ యొనర్చినాఁడు. తనకు సత్యవతీ సంతానమే రాజగునని తా నాతనినే సేవింతునని ప్రతిజ్ఞ. సత్యవతీ సంతాన మిరువురును మరణించిరి. వైచిత్ర్య వీర్యునితోఁ బాండురాజు గతించెను. ధృతరాష్ట్రుడు గద్దెపై నుండెను. కావున తనకు ధృతరాష్ట్రే డిప్పడు రాజు. తాను తనకుఁ దోచిన ధర్మమును హితవును రాజున కుపదేశించి సాచివ్యమును నెఱపును. తన హితవును బాటింపక పోవుట ప్రభుని తప్పు. తాను రాజు ననుసరించక తప్పదు. తన ప్రతిజ్ఞ యట్టిది.

అంతేగాని పొట్టకూటి కాశించు సేవక మాత్రునివలె భీష్మునంతటి మహాజ్ఞాని, పరమ ధార్మికుడు 'పోషింపఁ బడుట' చేత ధార్తరాష్ట్ర పక్షమవలంబించునా ? అదియే ప్రధానమైనచో పాండవు లాయనను పోషించలేరా ? ఒరులాయనను బోషించు నగత్యమున్నదా ?— దాసుగారిట్లేల వ్రాసిరో ?...

యుద్ధవర్ణనమున 'విరిగెడు నరదము లొరిగెడు గుఱ్ఱము'లను సీసపద్య మెక్కుడి కక్కుడి విఱిగెడు బహువచనాంత పదముల కూర్పుతో యుద్ధమున జరుగు హింసాకాండను వినాశమును చక్కగ స్ఫురింపఁ జేయుచున్నది.

భీష్మస్తవములోని—

'నీవె సమస్తలోకములు; నీకును నాకును భేద మెద్దియున్
శ్రీవర లేదటంచు శ్రుతి చెప్పిన యుక్తులు నమ్మవచ్చు గా

నీ; వృథయయ్యె నా తెలివి; యేమన మాటలచేత దుఃఖముల్
పోవునె? నీ సుదర్శనము పొందునఁ దప్ప; దయాపయోనిధీ'

ఈ పద్యమున భారతీయ వేదాంత సారమంతయు నిమిడియున్నది. 'మాటలచేత దుఃఖములు పోవునె?' — కేవలము పెదవులపైఁ దోలు కాడు శుష్క వేదాంత ప్రవచన ప్రబోధములవలన నెట్టి ప్రయోజనము నుండదను దాసుగారి నిశ్చితాభిప్రాయ మిందు వ్యక్తమైనది.

భీష్ముని వలన నాతని గెలుచునుపాయం బెఱింగి యామరునాడు యుద్ధభూమి కేగిన యర్జునుని హృదయమున విషాదమావరించినది. "తాతను మోసపుచ్చి పడవేయుటా!" యని విచారించినాఁడు.

"పిల్లలారా! మిమ్ము విడిచెనే మీతండ్రి
యని మిమ్ముఁ బొడగాంచి యార్తిఁ బొందు."

మొదలగు పద్యమున నిది వివరింపబడినది. లోకమున తమకు ప్రేమాస్పదులు నాప్తులునైన పెద్దలను గూర్చి పిన్నలు ఖేదపడుట యిట్లే యుండును.

పిమ్మట అర్జునుని గీతోపదేశమునకు ముందటి విషాదయోగ మావరించినది. ఇచ్చట సందు చేసికొని (శ్రీ) దాసుగారు (శ్రీ)కృష్ణునిచేత "అనుచు నిరుత్సాహుండై యుండిన యర్జునుతో" మొదలుగాగల మంజరీ ద్విపదలో గీతాసారముపదేశింపఁ జేసినారు. హరికథయందు ధర్మప్రబోధము ప్రధానము గదా!

శరతల్పగతుఁడైన భీష్ముడు భగవంతుని 'సూర్యాత్ముని, మహాత్ము, సోమాత్ము, దార్క్ష్యాత్ము" మున్నగు పద్యముతో స్తుతించినాఁడు. ఈపద్యముతో భగవానుడు చూపిన విశ్వరూపమును భీష్ముడు తాను సాక్షాత్కరించుకొనుటయేగాక, (శ్రీ)దాసుగారు మనకందర కట్టి భాగ్యమును గల్పించినారు. శాంతిపర్వమున భీష్ముడు గావించిన స్తవమందలి సారభూతములైన యంశము లీ పద్యమందును దీని తరువాతి కృతి యందును గలవు.

వైదిక ధర్మ మర్మజ్ఞులైన శ్రీదాసుగారు, భారతీయ సంస్కృతికి, ధర్మమునకు నాయువుపట్టులైన ధర్మములను, గహనములైన వేదాంత విషయములను ఈ హరికథయందు భీష్మునిచేత సులభ సుందరశైలిలో చెప్పించినారు.

## తెలుఁగుదనము :

శ్రీనారాయణదాసుగారి కవిత్వమునఁ గొట్టవచ్చినట్టు గానవచ్చు గొప్పదనము తెనుగుదనము. తెలుగు ప్రజల వ్యవహారములలో నున్న పలుకుబళ్లు, పదములు, సముచిత స్థానములలోఁ బ్రయోగింపఁ బడినప్పుడు ఎంతతియ్యగానుండునో, ఎంతసొగసు చిందునో, ఎంతదీప్తి వెలార్చునో ఎంతవాడిమి, ఎంత వేడిమి యుండునో శ్రీదాసుగారికి బాగుగ దెలియును.

దాశరాజు 'ఓడదొర' యఁట; అంబ 'జగడాల చీలి' యఁట. పరశురాముఁడు 'అగ్గిరాముఁ' డనఁగా నేమి ?– మహోగ్రుఁడనియే గదా! తెలుగువారి వ్యవహారమున నీ పదమున కొక వ్యంగ్యార్థము గూడ స్ఫురించును.

అంబ చెప్పిన చాడీలు వినివచ్చి వాడట పరశురాముడు. ఇచ్చట ఈ 'చాడీలు' అను పదమున కున్న శక్తి మఱియొక పదమునకు రాదు.

భీష్ముఁడు తొల్లి తన గురుని 'ఈగనైన వ్రాలనీక కొల్చినా'డట !

భీష్మునిచే మూర్ఛనొంది, తేరిన పిమ్మట, తన యభీప్సితసిద్ధికై పరశురాముని రెచ్చగొట్టుట కంబ పలికిని పలుకులు;

'మునుపటి బీరము వెన్కబెట్టుమో ముదుసలి తాపసి నీవు'

'పాపము నాకొఱకై నీవీగతిఁ బడదెబ్బలు తిన్నావా ?'

'ఓపిక తప్పినవాఁడు మునివృత్తి నుండుటయె మంచి దేవా'

గాయముపై కారము చల్లినట్లు లేదా ? - ఈ మాటలు పడ్డవాడు రెచ్చిపోక, వానికి వేరు దిక్కున్నదా ?

ఇట్టివిందు కొల్లలు.

ధర్మప్రబోధము :

ఈ హరికథా రంభమున శ్రోతలను సంబోధించుచుఁ జెప్పిన పద్యములలోను, పాటలలోను శ్రీ నారాయణదాసుగారి ధర్మపరిబోధ సారమంతయు నిమిడియున్నది.

గౌతమ బుద్ధుని యహింసా సిద్ధాంతమునకు సజీవాకృతి యనదగిన గాంధిమహాత్మునకు సమకాలికుడగుటచేత శ్రీ దాసుగారిపై తత్ప్రభావ మధికముగ నున్నది. ఒమర్ ఖయామ్ రుబాయతులను పారశీకమునుండి తెనిగించిన శ్రీ దాసుగారిపై ఒమర్ ఖయామ్ సిద్ధాంత ప్రభావమును మెండుగనే యున్నది.

భోగలాలసతో గాని, ధనసంగ్రహేచ్ఛతో గాని మానవులు నైతికపతనము నొందక, ఋజువర్తనులై యుండుట ప్రధానమని శ్రీ దాసుగారి ముఖ్యసందేశము.

"కూటసాక్షులు గుసగుసలాడి ప్రోత్సాహ
పెట్టినం బొంకని దిట్టలార !
వన్నెలాడుల నిడు వాల్గంటి చూపుటం
పరకులొంగని పుణ్య పురుషులార !
నవనాగరికుల సంఘంబున నుండియుఁ
బితృ పంథ నెడయని చతురులార !
కలియుగం బిట్టులఁ జెలరేగినన్సాధు
వృత్తిని విడువని విబుధులార !"

దాసుగారికి సంప్రదాయముపై నాదరమును గలదు. "పరోపకారః పుణ్యాయ, పాపాయ పరపీడనమ్" ఇది దాసుగారి ధర్మప్రబోధమున సారభూతమైన సూక్తి.

''పరోపకారమె కర్త - వ్యము కద యీలోకములో''
''బొందెత్తినఫలము సకల - భూతంబులఁ గాచుటకద''

శుష్క వేదాంత చర్చలతోను, అర్థరహిత కర్మాచరణముతోను కాలము బుచ్చునట్టి, కరుణాత్మ మహాత్మ్రదయులుగాని డాంభికులను శ్రీదాసుగా రీసడించెదరు.

సీ॥ పసుల జన్మమునఁ జంపఁగనేల నాకలి
గొన్న భూతమ్ముల కన్న మిడుఁడు.
నోరు నొవ్వఁగ వేదపారాయణములేల
నందఱిమోముల సత్యము పలుకుఁడు
తీర్థయాత్రల డస్సి తిరుగులాడఁగనేల
నార్తుల కెల్ల సహాయపడుఁడు
సన్యాసి భిక్షనెంచఁగనేల మన తోటి
పాటి వారలకునై పాటు పడుఁడు

గీ॥ ఎందు కీఁక వేయిమాట లీ యిలను సర్వ
జనుల కుపకారముగ నడువని మనుజుఁడు
జపతపంబులు నిష్ఠలు సలుపుటెల్ల
బూడిదంబోయు పన్నీటి పోల్కిఁగాదె॥

యథేచ్ఛముగ నైహికసుఖముల ననుభవించుటయే ఒమర్ ఖయామ్ తత్వమనువాదము లోకమున బహుళప్రచారము నందియున్నది. శ్రీ దాసుగారు దాని నంగీకరింపరు. మనకుఁ దెలియని పరమును గూర్చిన చర్చలతో కాలమును వ్యర్థముసేయక, ఇహసౌఖ్యమునకు మూలమగు పరస్పరమైత్రి, పరోపకారపారీణత గల్గియుండి ఒరులకెగ్గు సేయక, ధర్మవర్తనులై యుండవలెననునది శ్రీ దాసుగారి వాదము. ఈ క్రింది పద్యము ఒమర్ఖయామ్ తత్త్వమునకు శ్రీ దాసుగారి వ్యాఖ్యాన మనవచ్చును.

సీ॥ బ్రతికి యున్నంతకు స్వర్గనరకముల
సంగతిఁ దెలియ న సాధ్యముగద

తరలినవారలు పరలోకవార్తలఁ
జెప్పిరా మనతోడ నెప్పుడైన
మర్త్యుల నోళ్లతో మలయు వేదములకుఁ
గనఁ గన నొక ముక్కు మొనయుఁ గలదె
దీపమారినయట్లు తెల్వి శూన్యంబగు
దేహాంతములయందుఁ దెల్లముగను

గీ॥ మనకు గగనారవిందవర్ణనములేల
యిహమునందున స్వమతాభి వృద్ధిమీఱ
నెల్ల రన్యోన్యమైత్రికి హేతువైన
ధర్మవర్తన మెపుడైనఁ దప్పఁ జనదు॥

## ఛందస్సు:

శ్రీ దాసుగారి హరికథయం దెచ్చటను గద్యమును వ్రాయలేదు. పద్యములలో జాతులను ఉపజాతులను ఎక్కువగా నుపయోగించినారు. వృత్తములు కొద్దిగానున్నవి. ఇక పాటలు!– మంజరీ ద్విపదను లయాన్విత మొనరించి, తొహరా' లకు మాఱుగా వాడుకొన్నారు. గేయములం దెచ్చటను కీర్తనలు లేవు; అన్నియును కృతులే! పల్లవి, అనుపల్లవి, చరణములతో గూడి యుండునవి కృతులు. కేవలము చరణములు మాత్రమే యుండునవి కీర్తనలు. వీరు తమ కృతులలో ప్రాసనియమమును, యతి నియమమును గూడ పాటించుట విశేషము. పాటలను గానము చేయునపుడు, లయకు ఒకటి రెండక్షరములు తక్కువైనచో గాయకులు రాగముతో నాజాగాను పూరించుకొందురు. శ్రీ దాసుగారి కృతులలో నట్టి యగత్యములేదు. లయకు ఎన్ని యక్షరములు వలయునో యన్ని యక్షరములును వీరి కృతులయందున్నవి. ఇది యొక విశేషము.

సంగీత, సాహిత్య, నృత్యములే కత్రరూపుకొన్న కళామూర్తి శ్రీ మదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసుగారు ఆంధ్రులగుట మన భాగ్యము—

# మార్కండేయ చరిత్ర

శ్రీ అక్కిరాజు వేంకటేశ్వరశర్మ

ఆంధ్రదేశమునందు శ్రీ మదజ్జాడాదిభట్ల నారాయణదాసుగారి పేరు విననివారులేరు. హరికథాపితామహుఁడన్న బిరుదము వీరికి సార్థకము. తెలుఁగునాఁట మొట్టమొదట కాలికి గజ్జెకట్టి చేత చిఱుతలు పట్టి నడుముకు పీతాంబరము చుట్టి రంగస్థలిపై నిలిచి యురమునపూదండ వైచి యాడుచుపాడుచు నభినయించుచు ఛలోక్తులు విసురుచు నడుమ నడుమ పిట్టకథలతో సభ్యులను పొట్టలుబ్బనవ్వించుచు, నృత్యగాన కవితాత్రివేణీసంగమమందోల లాడించుచు తలయూపించుచు మైమఱపింప జేసిన వారు అజ్జాడాదిభట్లవారు.

శ్రీ దాసుగారు బహుముఖప్రజ్ఞావంతులు. మధురగంభీరమైన శారీవ్యమైనగాత్రము. స్ఫురద్రూపము. సంస్కృతాంధ్రాంగ్లేయ పారశీకాది బహుభాషలందు పాండిత్యము, సద్యస్స్ఫూర్తి, మాటలయందు చమత్కారము, ఆత్మగౌరవమును బ్రకటించురీవి, అవయవసౌష్ఠవము తోడికుదురైన యాకారము, అష్టావధానాశుకవితానైపుణ్యము, వీణావాదనప్రావీణ్యము,లయయందు కూలంకషమైన ప్రజ్ఞావిశేషము, అభినయకౌశలము, మనోజ్ఞవిశేషము, సంగీతసాహిత్యములం దనన్యసామాన్యమైనయుపజ్ఞ, ఒక్కచోట దుర్లభములైన యిన్నిగుణముల కలయికయే శ్రీ నారాయణదాసుగారు.

ఆంధ్రదేశమున హరికథాసంప్రదాయమునకాదిపురుషులైన శ్రీ దాసుగారి హరికథలలో మార్కండేయచరిత్ర యొక్కటి. సుప్రసిద్ధములై బహుళప్రచారమునుగాంచిన దాసుగారి హరికథలలో మార్కండేయచరిత్రకుకూడ స్థానముకలదు.

మార్కండేయచరిత్ర నాచూచినంతలో శివపురాణమునందు కలదు. శివపురాణమునందలి కథనే దాసుగారు స్వీకరించి రసోచితములును కథానుకూలములునునగు కొన్ని మార్పులనుచేసి రసవంతముగా మార్కండేయచరిత్రను వ్రాసిరి.

**శివపురాణకథకును శ్రీదాసుగారి మార్కండేయచరిత్రకథకును గల భేదములు :**

1) శివపురాణమునందు సంతానము లేనందున మృకండునకు బ్రహ్మలోకప్రవేశము కలుగలేదనియు - మునిపత్నులు మరుద్వతి చేతియన్నమును భుజింపలేదనియు - ఆయవమానముచే వారియనపత్యతా దుఃఖము ద్విగుణీకృతముకాగా వారు సంతానప్రాప్తికై శివునిగూర్చి తపముసేయ బూనుకొనినట్లు కలదు.

మార్కండేయచరిత్ర (హరికథ) యందు నారాయణదాసుగారు మునిదంపతులకు సంతతిలేమిచేగల్గిన యవమానములను దెల్పుకథలను విడిచిరి. మునిదంపతులు తమకు సంతతి కలుగనందుకు దురపిల్లి తత్ప్రాప్తికై శివునిగూర్చి తపము చేసినట్లు మాత్రము వచించిరి.

2) శివపురాణమునందు ఋషిదంపతులు హిమగిరిచెంత తపమొనర్చినటులున్నది.

దాసుగారు మునిదంపతులు వారణాసికేగి మణికర్ణికయందు స్నానముచేసి యందలి దైవతములనెల్ల నర్చించినవిధమును,

త్రివేణీసంగమమును, కాశీపురవైభవమును, వర్ణించి - గోమతీ నదీతీరమునంగల కాఱడవిని వర్ణించి యందా ఋషిదంపతులు తపమొనరించినటులు వర్ణించిరి. కాశీయాత్రచేసి కాశీశతకమును రచించిన దాసుగారు అనుభూతితో నిందు రసోచితముగా వర్ణనచేసి కాశీపురమును శ్రోతలకన్నులకు కట్టించినారు.

3) శివపురాణమునందు పదునాఱువర్షములు జీవించువాఁడైనను సత్పుత్రునే ప్రసాదింపుమని మృకండుడు శివునికోరగా మరుద్వతి ముందుకలుగనున్న పుత్రశోకమును స్మరించి తల్లడిలుచుండఁగా నామెను మృకండుఁడు "ఎప్పటిమేలప్పుడె - శివుఁడెప్పుడున్ కలఁడుమనకు - ఇందుముఖి! నీవప్పటి మాటదలంపకుము - పరమేశ్వరుడప్పుడును మనకు తోడుపడకపోఁడని" యూరడించినటులున్నది.

నారాయణదాసుగారి రచనలలో మరుద్వతి "కొడుకులు గలుగని కొఱతకన్న నాకడుపుశోకమే కడునధికంబనుమా! కనులముందు తనకొన్పు దొలంగుట కాంతకు మరణముకన్న బాధయనుమా" అని అతిదీనముగా జననియు జగజ్జననియునగు పార్వతిని ప్రార్థించుచు శంకరునితో తల్లీ! నీవైన జెప్పుమని మొఱపెట్టుకొనినవిధము కడురమ్యముగా రసోచితముగా నున్నది. తల్లి కడుపుతీపి యెట్టిదో లోకములకెల్ల తల్లియగు ఉమకు తెలియదా! "ఓయమ్మ! దిగులువలదు నారువోయునతండె తా నీరువోయు - ఈశ్వరుండేమితలచునో యెఱుఁగఁ దరమె" అని శాంకరి మరుద్వతినూరడించెను. శివపురాణమునలేని యీకల్పన కడుసరసముగా సమంజసముగానున్నది.

4) అయోగ్యులు గుణహీనులగు పుత్రులు చిరకాలము జీవించువారు పెక్కండ్రుకావలెనా? గుణవంతుఁడగు సుపుత్రుఁడు పదు

నాఱేండ్లు మను వాఁడొకరుండు కావలెనా! అని శివుఁడు మృకండుని ప్రశ్నించినటులు శివపురాణమున నుండగా దాసుగారి రచనయందుఁ గుణహీనుఁడై చిరకాలము మను కొడుకా వెండి యు దనియన్ మతిమంతుడై పదార్బ్దమ్ములు మను సుతుఁడా కావలయున్" అని కలదు. తల్లిదండ్రులనేడిపించు గుణహీనులు తనయులు పెక్కుఱేల ఒక్కఁడుచాల డా! యనికాబోలు దాసుగారు బహువచనమువీడి యేకవచనమును గ్రహించిరి.

5) శివపురాణమునందు లేని వసంతోదయవర్ణనము సందర్భాను కూలముగా దాసుగారిరచనలలో చోటుచేసికొన్నది. పరమేశ్వ రునినుండి వరము పడసి సంతుష్టచిత్తులై సంతానకాములైన యాదంపతులకు వసంతమెంతయు సంతసము కలిగించునుగనుక నారాయణదాసుగా రామునిదంపతుల శృంగారమునకు వసంత మును తోడు పంపిరి. మంచిపుత్రుఁడుదయింపవలెనన్న కోర్కి గలవాఁడు గనుక మృకండుడు శుభలగ్న మారసికొని యుద యంబున పార్వతీశుల కుత్సవంబుచేసి యానాటి రాత్రికై యెదురుచూచుచుండెన ట.

మరుద్వతియు "తెల్లచీరెరవికతొడిగి భుజమున వ్రేల్మిడి చిందులు త్రొక్క నుదుట కుంకుమబొట్టువెట్టి వాలుగనులందు కాటుకదిద్దె పరిమితాభరణములతో మేలుకడాని మెఱుంగగు చెక్కులమీద మంచిగంధముతో పొలుపారు మల్లెపొదలనడుమ దగుపూలపాన్పునకు పతిని సేవింపవచ్చినద ట. ముసలియవ్వకీ వన్నెచిన్నెలకై సేతలేమని యెవ్వరైన ననుకొందు రేయోయని దాసుగారు "అంత నా మరుద్వతి తపోమహిమయౌవనంబు చివురింప" అని యామెకు మరల నవయౌవనము ననుగ్రహించిరి. దాసుగారు "కేళిసల్పిరి మరుకేళి సల్పిరివారు" అని యాముని

దంపతులరతిని గూడ వర్ణింపక విడిచినవారుకారు. అలంకారికు లేమనుకొన్నను అవకాశము వచ్చిన కవులు వర్ణింపక విడిచిపుత్తురా।

6) శివపురాణమునందు మునిదంపతులు తమగృహమునకు విచ్చేయు పెద్దల కెల్లరకు తమ సుతునిచే పాదాభివందనము చేయించుచు అది తమసుతునకు ఆయుర్వృద్ధిహేతువు కాగలదని భావించినట్లు కలదు.

మార్కండేయచరిత్రమందు దాసుగారు ఒకచక్కని కల్పనను చేసిరి. తమ యింటికతిథులుగా విచ్చేసిన సప్తర్షులకు మార్కండేయునిచే నతని తల్లిదండ్రులు మ్రొక్కించిరి. వారాబాలుని రూపరేఖలకు ముద్దుమాటలకు ముచ్చటపడుచు శివుని పలుకుల చందము మరచి "చిరంజీవ" యని దీవించిరి. పిదప వారు పశ్చాత్తాపముతో తమ మాట యసత్యము కాకుండజేసికొను టకై యాబాలుని బ్రహ్మలోకమునకు గొంపోయి యాచతు ర్ముఖునకు మ్రొక్కింపగా నా విధాతయు శంకరుని వరము చందము మరచి "దీర్ఘాయుర్భవ" యని యాబాలుని దీవించెను. పిదప తానును నాలుక కొరుకుకొని తన వాక్యమసత్యము కాకుండ జేసికొనుటకై శివుని ప్రార్థించుటకై కైలాసమున కేగుచు మార్కండేయునిచే శివునిగూర్చి తపముచేయింపుడని సప్తర్షుల నాదేశించినటులు శివపురాణకథాతిరిక్తమైన యొక చక్కని కల్పనను దాసుగారు చేసిరి. ఈకల్పనకు మూలము మఱెందేని యున్నదో లేదో కాని మొత్తముమీద నిది రమ్యముగానున్నది.

ఇంటికివచ్చిన పెద్దలకు నమస్కరింపుమనుట మృకండుని తప్పు లేదు. అదియొప్పే యగును. నమస్కరింపకుండిన తప్పగును

గాని నమస్కరించుట మార్కండేయుని తప్పుగాదు. నమస్కరించినవానిని దీవింపకుండుట తప్పగునుగాని దీవించుట ఋషుల తప్పునుగాదు. ఆదీవన మరియొక విధముగానుండవచ్చునుగాని సాధారణముగా పెద్దలు పిన్నలను "దీర్ఘాయుర్భవ" యని దీవించుట పరిపాటి. అట్లు దీవించిన పిదప తమ పొరపాటును గ్రహించిన సప్తర్షులు యుక్తిగా బ్రహ్మదేవునిగూడ నిందులో నిరికించిరి. పితామహుఁడు మాట నిలుపుకొనుటకై దిక్కుతోచక కైలాసమునకు పరుగిడి శంకరునే వేడికొనవలసివచ్చెను. ఈ పెద్దలకందఱికిని మార్కండేయునిమీద జాలికంటె తమ పరువు నిలుపుకొనుటలోఁగల తహతహయేమెండు. అందఱు పెద్దలట్లు నోరు జాఱినను అందఱిమాట దక్కించి తనమాటను కూడ నిలుపుకొన్న ఘనత శంకరునిది. "ఋషీణాంపునరాద్యానాం వాచమర్థోనుధావతి" అని యనలేదా భవభూతి మహాకవి. ఇంతకందఱును బాగుగనేయున్నారు. విధినిర్వహణకై పోయిన యంతకునకిది ప్రాణాంతకమైనది. చచ్చి బ్రతికినంతపని యైనది. మార్కండేయునకు బ్రహ్మకల్పావధి యాయువు లభించినది. విధి విలాసము. ఎవరికెయ్యది ప్రాప్తింపవలెనో వారికది తప్పదుకదా! కల్పనలో నింత చక్కని శిల్పమును దాసుగారీ ఘట్టమున జూపినారు.

7. శివపురాణమునందును దాసుగారి రచనయందును నారదుని ప్రవేశము కలదు. కాని దాసుగారా పాత్రను మరింత సద్వినియోగ పరచుకొన్నారు. నారదుని కలహప్రియునిగానే కాక యుపకార పరునిగాను జాలిగుండె కలవానిని గాను దాసుగారు చిత్రించినారు.

మార్కండేయుని పైకిపోకుండ యముని మరలింప ప్రయత్నించుట. అతఁడు తన హితోక్తిని వినకపోగా మార్కండేయుని చెంతకు

వచ్చి యమునివలన కలుగనున్న ప్రాణభయము శివుని కరుణచే తొలగు ననియు యముడు శివునిచే శిక్షింపబడుననియు పల్కి మార్కండేయు నకు ధైర్యము కలిగించుట, మార్కండేయుని కోరిక మన్నించి వాని కుశల వార్తను మరుద్వతీ మృకండులకు తెలిపి శివానుగ్రహముచే మీ సుతులకు మృత్యుభయము తొలగునని చెప్పి వారి నూరడించుట, యను నవి నారదుఁ డొనర్చిన మంచిపనులు, నారదునిట్లు పరోపకారునిగా దాసుగారు చిత్రించినారు. యము డు మాత్రము "కొంటె నారదుఁడిట్లు నా కొంపదీసె"నని మొత్తుకొన్నాఁడు. త్రిమూర్తులనుగూడ ధిక్కరించి పల్కిన యమునకు చక్కగా నారదు డు గుణపాఠము నేర్పినాడు.

సంతతికొఱకై తపముచేయుచున్న మరుద్వతీ మృకండుల ననుగ్ర హింపుమని శంకరుని నారదుఁడు ప్రార్థించుట-మార్కండేయునికి మృత్యు భయము తొలగుటకై తప మొనరింప బంపుడని మరుద్వతీ మృకండుల ప్రోత్సహించుట, యమునితో మార్కండేయు, పైకి నీవు పోవుట నీ చేటునకే సుమాయని హెచ్చరించుట. మృత్యుభయము తొలగి శివుని యనుగ్రహమునకు పాత్రుఁడైన మార్కండేయుని చెంతకు మరుద్వతీ మృకండులను గొనివచ్చుట - చచ్చిచెడి బ్రతికిన యముని కుశలమడిగి చిన్నబుచ్చుట – యనునవి శివపురాణమందు నారదుఁడు చేసిన పనులు, ఇందన్నియు బాగున్నవిగాని చచ్చిన పామును చంపినట్లు తెలిసి తెలిసి యముని కుశలమడిగి యేడిపించుట యంత బాగుగాలేదు.

8. యముని పునరుజ్జీవితునిగా జేయుమని మార్కండేయుఁడు శివుని ప్రార్థించినటులు శివపురాణమునందున్నది. అది మార్కండేయుని పాత్ర ఔన్నత్యమును చేకూర్చుచున్నది. బ్రహ్మాది దేవతల ప్రార్థనచే యముని శివుఁడు బ్రతికించినటులు దాసుగారి రచన.

## సాంఘిక పరిస్థితులు :-

నారాయణదాసుగారు మార్కండేయ చరిత్రి కథాప్రారంభము నందు తమ కాలము నాటి సంఘమునుజూచి యిట్లు నిర్వేదము చెందిరి,

"అక్కటా కలిజనులకు కడుపుకక్కూర్తులుమెండుగా
నిత్యమెయ్యది యో యెఱుంగరనిత్యమునకీపాట్లేలా
కూటికొఱకయి కోర్టులోపల కూటసాక్ష్యము చెప్పగా
కోటుతో తా న్యాయవాదిగ బైటజని తలత్రిప్పగా"

అని అన్యాయవాదులైన న్యాయవాదులను గూర్చి పల్కినారు.

"పాలకులు తనకు బెట్టు జీవనముకన్న
రెండురెట్టులు గుఱ్ఱపు బండికొఱకు
సానిపాపకు మరియు సీసాలకొఱకు
నిచ్చునుద్యోగికప్పెచ్చు వచ్చుటెట్లు."

అని యానాటి యుద్యోగుల కలుషితదంభ ప్రవృత్తిని కంటగించుకొన్నారు.

"మరణభయమేలేకపోయిన దురితములకడ్డుండునా
ధరణియం దన్యాయ వాదుల ధనములకు నొడ్డుండునా
రోగభయమేలేకపోయిన భోగములహద్దుండునా
శేగిచెనటులు సేయజాలిన సేగులకు బద్దుండునా"

అని దాసుగారు విస్మయము జెందినారు. మాటలకు పదునుపెట్టి హృదయమునకు సూటిగా తాకునట్లు బాకులను వలె విసరుటలో దాసుగారు వేమన్నకు దీటగుచున్నారు.

## కవిత్వమునందు పోతన్నగారి యొరవడులు :-

దాసుగారికి సంస్కృత కవులందు జయదేవుఁడు తెలుఁగు కవులందు పోతన్నగారు అభిమాన పాత్రులు. చిన్నతనమునుండియు వీరికి పోతన్నగారి భాగవతము ప్రియాతిప్రియమైనది. పసితనమున ఉగ్గుపాలతో పాటు తల్లి నేర్పిన భాగవత పఠనము దాసుగారికి బాగుగా నొడలు పట్టినది. కవిత్వమునకు చక్కని పుష్టిని చేకూర్చినది. కనుకనే దాసుగారి పదములందు పద్యములందు పోతన్నగారి పోకడలెల్ల కడల కనబడుచుండును.

ఉదాహరణమునకీ పద్యమును జూడుడు.

"నీ పుణ్యచారిత్ర నివహముల్ వినకున్న చెవియుఁ జెవియె మొద్దుచెవియుగాని
నీనిర్మలాకృతి నియతిచూడకయున్న కన్నుకన్నె గ్రుడ్డికన్నుగాని
నీదివ్యనామముల్ నెఱి పల్కిపోవని నోరునోరె మూగినోరుగాని
నిరతంబు భక్తితో నిన్నుబూజించని చేయిచేయియె మొండి చేయిగాని
భక్తజన భాగధేయ ! దేవమునిగేయ - ఆర్తివిధ్వంసబాలచంద్రావతంస !
నిగమసంచార ! పాతకనిచయదూర ! ప్రకటకామవినాశ ! యోపార్వతీశ !"

మరియు "అనుదిన మఖిలేశు నాకృతి జూచుట యందు కన్నుంగవ లలర కున్న" ఇత్యాది పద్యములు పోతనగారి పోకడలను పుణికి పుచ్చుకొన్నవి.

పోతన్నగారి పద్యము లందువలెనే వీరి పద్యములందును పదము లందును అంత్యాను ప్రాసలు ప్రచురముగానుండి రచనకు సొగసు నాపాదించు చుండును. మచ్చుకు వీనిని చూడుఁడు.

"అమరుద్వతి - చామీకరద్యుతి
కోమలాకృతి - శ్యామలాప్రతి
పతిమాటకెదురాడదు - పరులమోమునుజూడదు
అతులగుణవతి - హంసికాగతి."

"నారదా ! తను కాంతి వర్జితపారదా ! యభయప్రదా ! చారు తర సంగీతశాస్త్ర విశారదా !" అని మరుద్వతిని; నారదుని వర్ణించు నపుడు అనుప్రాసల యొయ్యారమును దాసుగారు చూపినారు. ఇటు లుదాహరింప బూనుకొన్న గ్రంథమంతయు నుదాహరణమగును.

## జనని - జన్మభూమి :

దాసుగారికి జనని పైన - జన్మభూమిపైన ప్రేమ యనిర్వాచ నీయము. "జననీజన్మభూమిశ్చ స్వర్గాదపిగరీయసీ" యనికదా శ్రీరాముని వచనము. మార్కండేయుని తల్లియందు దాసుగారు తన తల్లిని జూచుకొన్నారు.

"ఒడలు బాగుగదోమి యుడుకునీళులబోసి
పొలుపుగఁగురులార్చి బొట్టు పెట్టు
ముచ్చటల్చెప్పుచుబూచి బూచి యటంచు
పొట్ట నిండఁగ జలిబువ్వమేపు
తలకినేపడినప్డు దబ్బునవచ్చితన
న్నుం దిట్టి కొంచునన్ను జగించు
అయ్యనాపయినల్గు నప్పు డీతప్పుగా
వందగునంచు దా వచ్చునడ్డు"

ఇదియంతయు దాసుగారి స్వీయానుభవము. దాసుగారిని చిన్నతనమున నందఱును "సూరి" యని పిలిచెడివారట. సూరి మందుడుకు బాలుఁడు. సూరి యల్లరికెల్లలులేవు. తండ్రికోపమునకు పగ్గములులేవు. తండ్రి కొట్టవచ్చినపుడెల్ల "ఈతప్పు కావందగునంచు" బిడ్డపై దెబ్బపడకుండ తల్లి యడ్డువచ్చెడిదట.

దాసుగారు గ్రంథాదిని తనబాల్యమునిట్లు తలపోసినారు.

"గుడిబూచివెరపింత - బడికేగువంత - దుడుకునొజ్జలపోటు
తొలియొంటిబాటు - జడివాననీట దొరగుట - జట్టుగగట్టి
మెట్టలెక్కితిరుగుట - పడతియనినసిగ్గుందాల్చుట."

ఇట్టి తన చిన్ననాటి ముచ్చటనుదలచుకొని దాసుగారు "చెల్లెబో నిరుప మానందాశ్లిష్టమౌనాబాల్యంబు" అని చింతించినారు. "తేహినో దివసా గతాః" యనియన్న భవభూతి రాముని తలపించినారు.

అవకాశము చిక్కినపుడు జననితోపాటు జన్మభూమినిగూడ దాసుగారు స్మరింపకపోలేదు.

మృకండుఁడు తపోవనమునుండి తమఋషివాటికకు పత్నితో గూడి తిరిగివచ్చుచు నామెకిట్లు తనజన్మభూమినిచూపి చెప్పుచున్నాఁడు.

"కంటిలే తొలిమనవారంపకంబువెట్టిన కన్నె రాలి
మింటినొరయుచు నిప్పు డెంతటి మేటిమాన్యమయ్యెనో

అల్లదేమనమేగు డెంచిన - పల్లెవారల యోడరేవు
అల్లదేవెన్నట్టు కొబ్బరులల్లుకొను మనమిద్దెటిల్లు.''

ఇచట మనకు మృకండుని మునిపల్లెయు అందలి పర్ణగృహముకాక దాసుగారి పల్లెటూరు - వారిమిద్దెటిల్లు - ఇంటిముందున్న రావిచెట్టు - ఊరిచెంతనున్న సువర్ణముఖీతీరము తలంపునకు వచ్చుచున్నవి.

దాసుగారికి ఆంధ్రాభిమానముకూడ మెండు. మార్కండేయుడు హిమవంతముచెంత గంగాతీరమున బిల్వవనమందు తప మొనరించినట్లు శివపురాణముననుండగా అతని తపోవనమును గంగాతీరమునుండి గోదావరీనదీతీరమునకు దాసుగారు మార్చినారు.

''అంతట బాలుడీశ్వర పదాబ్జములెంచుచు హాయినేగి య
త్యంత ముదంబునస్సనియె నాతతపర్వత గహ్వరాంతరా
క్రాంత మహాశ్మసంచయ నిఘర్షణ భీమరవ ప్రవాహ సం
క్రాంతనితాంతమీనమకర వ్రజ భీకరగౌతమీనదిన్''

అని గౌతమిని వర్ణించినగాని వారికి తృప్తి కలుగలేదు.

నారాయణదాసుగారీ మార్కండేయచరిత్రను పరమేశ్వరునకే యంకిత మొనరించి ధన్యులైనారు.

''గానకవితావధానని
ధానులగు మహాత్ములార దయతోగనుడీ
దీనిరచియించి యీశా
ధీనంబుగ గృతినొసంగితి న్మోక్షేచ్ఛన్''

వారు పరమేశ్వరుని చిల్లరకోరికలు కోరుకొనక మోక్షమునే కోరుకొని కృతకృత్యులైనారు.

రసజ్ఞులపాలిటి కామధేనువులై అరువదేండ్లు హరికథాగానముతో తెలుగుసీమ నుఱ్ఱూతలూగించి విజయనగరసంస్థానాధీశులైన యానంద గజపతిమహారాజుల యాస్థానమునకలంకారమై సంగీతకళాశాలకధ్య

త్ములై పీఠికాపురమహీశ్వరాదిరాజాస్థానములందపూర్వసన్మానము లంది బహు కృతులరచించి భాషామతల్లికి బహూకరించి శిష్యప్రశిష్య సంతతినిలోకమునకు ప్రసాదించిన శ్రీ నారాయణదాసుగారు తెలుఁగు నాఁట హరికథాసంప్రదాయముండునంతవరకు యశశ్శరీరులై యుందు రనుటకు సందియము లేదు.



# శ్రీ యథార్థ రామాయణము
## (భూమిక)

ఆచార్య శ్రీ గంటి జోగిసోమయాజి

వాగ్దేవిని ఉపాసించి ఆ మాతృమూర్తియొక్క కరుణాఫలముగా ఇరుప్రక్కల స్తన్యపానము నొనర్చి సంగీత సాహిత్యములనెడి రెండు సముద్రములలో అడ్డులేకుండ విహరించి, అనేక పండితమండలములందు విజయపత్రములను పొంది నిరాఘాటమైన తనకీర్తి పతాకను సుమారు ఒక అర్ధశతాబ్దము ప్రసరింపజేసి, హరికథామృతమును సాహిత్యాబ్ధి నుండి మథించి తెచ్చి, విద్వత్ కవులకును, సంగీతసాధకులకును ఆబాల గోపాలము స్త్రీ పురుషులకు పంచిపెట్టి ప్రశస్తి వడసిన శ్రీ నారాయణ దాసుగారు ఆంధ్రులకు చిరస్మరణీయులు. వారికి రాని శాస్త్రము లేదు. తెనుగు, సంస్కృతము, ఆంగ్లము, ఉర్దూ, పారశీకభాష, మొదలగువాని యందుగల రచనలన్నింటిని పరిశీలించి ఆంధ్రదేశమందు ప్రతిపల్లెలోను ఎల్లపట్టణములందును అఖిల రాజాస్థానములలోను మన్ననలు పొందిన శ్రీదాసుగారి సామర్థ్యము "యథార్థరామాయణ" రచనచే ఐహికా ముష్మికములు రెంటిని సిద్ధింప చేసికొనినది.

రామకథ యెంతగొప్పదో దాసుగారును అంతగొప్పవారు రామాయణము వ్రాసిన వాల్మీకి తనకు పూర్వులెవ్వరూ ఎరుంగని కవితామార్గమున ప్రపంచమునందలి సమస్త జనులకును ఆదర్శమూర్తి యయిన రామమూర్తిని సోపజ్ఞముగా ప్రత్యక్షీకరించుకొనెను. అట్లే

శ్రీ దాసుగారును సకలభాషావిశారదుడై సంగీత, సాహిత్య, నృత్యకళా కుశలుడై స్వోపజ్ఞమైన హరికథా రచనమును ఆవిర్భవింపజేసి, వేల కొలంది శిష్యులను సిద్ధపరచి జనులను తరింపజేసిరి. అట్టివారు యథార్థ రామాయణమును రచించుటకు ఎట్లు తగినవారో, ఎంతవరకు కృత కృత్యులైరో, దిఙ్మాత్రముగ సూచింతును.

వాల్మీకి మహర్షికి పూర్వము లౌకికచ్ఛందస్సుగాని సంస్కృతము నందు కావ్య వాఙ్మయముగాని లేదు. అట్లే కథానాయకుడైన రాముని గూడ వెదకి వెదకి పట్టుకొని తనగ్రంథమున వాల్మీకి రూపింపగలైను.

వైదిక వాఙ్మయములో కర్మకాండ మొదటి ఘట్టము. అనేక దేవతలను ఆరాధించి భిన్నములైన కర్మల నొనర్చి ఫలములను పొందుటయే ఆ భావమునందలి యుద్దేశ్యము. ఉపనిషత్ వాఙ్మయమునందు పై మార్గమునతిక్రమించి జ్ఞానమార్గమున సకల కళ్యాణ గుణ పరిపూర్ణుండును, సర్వవ్యాపియు, సర్వేశ్వరుండును, అనాది నిధనుండును, అయిన పరబ్రహ్మమును సాక్షాత్కరించుకొనిరి. అట్టి ప్రత్యక్షానుభూతివలన తరించినారు. జీవన్ముక్తులైన జనకాదులు, విశ్వామిత్ర దూర్వాసో నామకులైన మహర్షులే ఆ బ్రహ్మమును సాక్షాత్కరించుకొనుటకు, రాగద్వేషాదులను తొలగించుకొనలేక పోయినచో ఇక సామాన్యులమాట ఏమి. మనస్సుతో కూడ వాక్కునూ ప్రయత్నించి ఆ బ్రహ్మమును పొందలేక తిరిగి వచ్చెననుచో మరి సామాన్యులగతి ఏమి. జగదుత్పత్తికి నిమిత్తకారణమును ఉపాదాన కారణమును బ్రహ్మయే కదా! అట్లు అనాది అనంతము అద్వితీయము స్వపరగత భేదరహితము అయి దిక్కాలాద్యన వచ్ఛిన్నమయిన బ్రహ్మము సాదియు సాంతము నయిన జీవాత్మగా ప్రభవించుటకు హేతువేమి. ఇది తీర్పరాని సమస్య. అనంతము నుండి బయలుదేరి అనాదిలో చరించువాడు ఎక్కెక్కడ బయలుదేరి ఎక్కడికి పోగలడు. ఇట్టి పరిస్థితిలో వాల్మీకి మహర్షి జన్మించి క్రొత్త మార్గమును త్రొక్కి శ్రీరాముని ప్రత్యక్షీకరించుకొనెను. ఇవి ఎట్లు?

ఎక్కడనో ఉన్న దివినుండి దిగి దిగి భువి చేరుటలో పూర్వకవి వృషభులు కృతకృత్యులు కాలేకపోయిరి. కాబట్టి వాల్మీకి మహర్షి సుస్థిరమైన భువినుండి బయలుదేరి, దివివంక ప్రయాణము కట్టెను. దేవుడు సకల కళ్యాణ గుణ పరిపూర్ణుడు. ఆ గుణముల పేర్లే మన మెరుగము. పైగా పరిపూర్ణమైనవి. అవి అవాఙ్మానస గోచరములు. ఇక వాల్మీకి మార్గమున - శ్రీరాముడు తల్లిదండ్రులు కలవాడు. మానవునియందు ఎవ్వరే యే గుణములను ఎంతటి అవధిలో ప్రత్యక్షము చేసికొనగలరో అంతవరకు ఆ గుణములను ప్రవచించెను. అట్టి సకలగుణాభిరాముడైన రాముని పరిపూర్ణునిగ నిరూపించెను. లోకుల ఉద్యమమునందు పరిపూర్ణత యనగేమి? దానిని ప్రత్యక్షముగా ఇదమిత్థమని నిరూపించుట ఎట్లు? లౌకికముగా ఒకవిధమైన నిరూపణము చేయవచ్చును. ఏ పరిస్థితిలోనైనను పొందగలుగుటకు ఎంత లాభము వీలగునో అంతటినీ పొంది, ఎంత నష్టమును వారించగలదో అంత వారించుకొనుటయు పరిపూర్ణత అని చెప్పవలయును. దైవము అవిజ్ఞాతము. ఇక మానవుడెరిగినది పురుష ప్రయత్నమే! దాని ఫలమునుబట్టి దైవమును అనుమానించుకొనవలయును. కాబట్టి ఎట్టి ఆశయము యొక్క పరిపూర్ణానుభవమునైనను పైన చెప్పిన రీతినే సమన్వయించుకొనవలయును గదా! దీనినే వాల్మీకి రామాయణమున ననుసరించెను.

రాముడు మన్మథునివంటి సుందరుడు. అతని పరాక్రమమునకు దేవతలు భయపడుదురు. అతడు సర్వశాస్త్రపారంగతుడు. ఎల్లకళలనూ ఎరింగినవాడు. కృతజ్ఞుడు, దయానిధి, ఉదారుడు. అతనికోపహర్షములు అవన్ధ్యములు. వాక్కు సార్థకమే. నిరర్థకముకాదు. అతడు సర్వసముడు. స్వధర్మమును లోకధర్మమును ఎరింగి పాటించగలవాడు. ఆదర్శమైన పుత్రుడు. ఈడుసేసిభర్త. భ్రాతృత్వము మూర్తీభవించిన సోదరుడు. ఆడినమాట తప్పడు. ఇట్టివాడు పరముడుగా మానవులెరుంగుటకు సాధ్యమైనవాడు. ఇట్టి వానిని రూపించుకొని జనులెల్లరును ఇహధర్మ

మును నిర్వర్తించి, పరమును పరిపూర్ణముగ పొందుటకు మానవజాతికి ఒజ్జబంతియైనవాడు. కావుననే రామాయణము నదులు, పర్వతములు, ఎంతకాలముండునో అంతకాలమును భూమియందు విరాజిల్లును.

ఇట్టి రామాయణమును మూడు నాలుగువేల సంవత్సరములనుండి ఆసేతుహిమాచలపర్యంతంబును స్మరించి పఠించి వివరించి భవ బంధములనుండి జనులు విముక్తిని పొందిరి. ఇట్లు రాముని అనేకులు వేర్వేరు దిక్కులనుండిచూచి గ్రంథములయందు వర్ణించిరి. సహస్ర నామములుగలిగిన చింతామణి శ్రీరాముడు. ఒక్కొక్క ముఖము నందలి ఒక్కొక్క విశేషమును ఒక్కొక్క కవి వర్ణించెను. ఇక యేది యథార్థరామాయణము? వేలకొలది గాథలు కలవే? అను ప్రశ్న ఉదయింపక తప్పదు. ఈ సందర్భమున తనదే యథార్థరామాయణము అని రచించిన శ్రీ దాసుగారి ఉద్దేశము పరిశీలింపవలయును. దాసుగారి వంటి మేధావి, మహాకవి, విజ్ఞానమూర్తి ఈ పేరు పెట్టుటలో సార్థక్యము కనుపట్టక తప్పదు.

'యథార్థము అనునది అవ్యయీభావ సమాసము. 'అర్థం అనతి క్రమ్య యథార్థం' అని వివరణము. అర్థమునకు లోబడియుండునవి. దాని నతిక్రమింపనివి లేక అనువర్తించునవి, అను వానిలో గల సారమును సమాహరించి మనము సమన్వయ పరుపవలయును. అర్థము అనగా నేమి? అని నిర్ణయించిన తరువాతగదా పై వివరణము బోధపడుట. ఈ పదము నకు అనేక విధముల భిన్న ధాతువులనుండి పండితులు వ్యుత్పత్తి చెప్పిరి. అర్థింపబడునది కావున అర్థం ఇందు అర్థధాతువు, ఇతరులు ఋధాతువు నుండి థన్ ప్రత్యయముచేత వ్యుత్పత్తి కల్పించిరి. ఈ ధాతువునకు పొందుట, ప్రకాశింపచేయుట, చలించుట మొదలయిన అర్థములుకలవు. ఇక అర్థశబ్దమునకు అనేకములైన రూఢార్థములు కలవు. కోర్కె, ఉద్దే శము, వస్తువు, కారణము, ధనము, ప్రయోజనమున, మంచి, ఉపయో గము, స్థితి, ఫలము, లాభము, శ్రేయస్సు, మొదలయిన అర్థములన్నియూ

కలవు. కాని సామాన్యముగా యథార్థము చెప్పు అనగా ఉన్నదానిని ఉన్నట్లుగా చెప్పుము. అని మనము వ్యవహరించుచున్నాము. మొదటి రామాయణము వాల్మీకి కృతము గదా! ఆ తరువాత రాముని గూర్చిన అనేక కల్పనలు ఉపాదేయములైనవి. మహాకవుల రచనలనుండి పురాణములనుండి బయలు వెడలినవి. అవి యథార్థములు కావా అను ప్రశ్న ఉదయింపక తప్పదు. దాని నంతటిని మనసునందుంచుకొని ఒక సమన్వయమును మనము చేసికొనవలయును. శ్రీరాముని స్వరూప స్వభావములను బయటపెట్టుటలో వాల్మీకి యుద్దేశము ప్రథమమైన అర్థము. తులసీదాసు, త్యాగరాజు, మొదలైన భక్తులు నిరూపించిన స్వరూపము రెండవ అర్థము. అష్టాదశ పురాణములలో నిరూపింపబడినది. ఇంకొక అర్థము. అధ్యాత్మ రామాయణము, సీతా రామాంజనేయము నిరూపించిన శ్రీరామ స్వరూపము, ఆత్మారామ స్వరూపము ఇంకొకటి. ఇతరులయిన కార్యకర్తలు, ప్రబంధ నిర్మాతలు, రూపక రచయితలు, శతక కర్తలు నిరూపించినది. జగదభిరాముడైన పరంధాముని స్వరూపము ఇంకొటి. వాని నన్నింటినీ గ్రహించుటయు, సమన్వయ పరచుటయు నేటి యథార్థమని చెప్పక తప్పదు. ఈ యుద్దేశమే, ఇట్టి సమన్వయ ప్రయత్నమే, ఇటువంటి వర్ణనాదక్షతయే యథార్థ రామాయణమున దాసుగారు నిరూపించిరని నాయుద్దేశము అనంతకోటి గోళములచే నిండియున్న ఈబ్రహ్మాండమునకు ఒక ఐక్యము. కలదు. అట్టి జీవపిండమునందలి ఐక్యమే సకలసృష్టి హేతుభూతమైన అనగా సూక్ష్మాతిసూక్ష్మమైన అండమునందు గలదు. దానినే cell అని కొందరు వ్యవహరింతురు. పై రీతిని నిరూపింపబడిన అండ, పిండ బ్రహ్మాండములయందలి రచనయు, స్వరూపమును ఒక్కటియేగాని భిన్నముకాదు. ఇట్టి ఐక్యభావమునే మనసునందు ఉంచుకొని సర్వ సమన్వితస్వరూపమైన పరమార్థమును యథార్థ రామాయణమున దాసుగారు ప్రవచించిరనుట క్రింది వివరణమువలన తెలియనగును.

పై అభిప్రాయమును తమ ఉపోద్ఘాతమునందు వాచ్యముగా చెప్పక పోయినను దాసుగారు వ్యంగ్యముగా నిరూపించియున్నారు

శ్రీరాముని పుట్టుకకు హేతువు అయిన కథలు జయ, విజయుల చరిత్ర, నారదుని గర్వభంగము, బ్రహ్మాది దేవతలు పరమాత్మని స్తుతించుట మొదలుకొని తుదివరకు కలిగిన రచనయంతయు పై నిర్వచనమును సార్థకపరచుచున్నది.

దేవతా సమితి విష్ణుని వర్ణించుటలో చూపించిన విశేషములు సకలవేదాంత సమన్వయ స్వరూపములై, ద్వైత ప్రవృత్తిని ప్రారంభించి వైశిష్ట్యబోధకమైన సకల శ్రేయస్సును అధిగమించి, అఖండాద్వైత స్వరూపమైన సచ్చిదానంద స్వరూపములో ఇమిడి పోయినవి. ఇందు వారు త్రొక్కని మార్గములేదు. చూపించని వివరణములేదు. దశరథ పుత్రకామేష్టి మొదలయిన విషయములు నిరూపించుటలో సామాన్య జనుల కోరికలు జీవన విధానము, వారిభాష, వారిభావము, పల్లెలు, పట్టణములు, తపోవనములు, మొదలగువాని స్వభావమునంతటిని ఆయన ప్రవచించినారు. సీతాకళ్యాణమును దానికి పూర్వరంగమైన వశిష్ఠ విశ్వామిత్ర పాత్రల ప్రయోజనమును మిక్కిలి సమర్థతతో నిర్వహించినారు. ఇక శ్రీ రామపాదుకాపట్టాభిషేకము అనిర్వచనీయమైన భక్తికి, ప్రవృత్తికి, భవబంధవిముక్తికీ స్థానమై యొప్పుచున్నది. తరువాతి ఘట్టము శ్రీరామ సుగ్రీవమైత్రి. ఇందు వాలి, సుగ్రీవ, హనుమత్ స్వరూపములు అపురూపముగా నిర్మింపబడినవి. తరువాతిది హనుమత్ సందేశము. ఇందు హనుమంతుని గొప్పతనము, రావణుని పట్టుదల మొదలగునవి, శృంగార, వీర, హాస్యకరుణ రసములు ఉప్పొంగునట్లు వర్ణించియున్నారు. తరువాతిది సామ్రాజ్యసిద్ధి.

ఒక్కొక్క భాగము ఒక్కొక్క ప్రబంధము. ఒక్కొక్క ఘట్టము ఒక హరికథ. తిక్కన విరాటపర్వమునకుముందు ఈ ప్రబంధ

మండలికి నిన్ను అధినాథుని చేయుదును అని వ్రాయునప్పుడు ఎట్టి భావమును వెలార్చెనో తన యథార్థరామాయణము అనేక హరికథా సంపుటి అని అట్టిభావమునే దాసుగారు ఊహించియున్నారు. సకలవేద వేద్యుడైన పరంధాముల స్తవముతో ప్రారంభించి, లోకకంటక నిర్మూలనమను ఉద్దేశమును మనమునందుంచుకొని, పున్నామ నరకంబునుండి తప్పించుటకు మార్గమయిన పుత్త్రకామేష్టిని చేయించి, సమస్తసామ్రాజ్యమునకు సిద్ధమైన పట్టాభిషేకమును మిక్కిలి సంతోషముతో ఒక్కక్షణమున త్యజించి, సత్యరక్షణకై అరణ్యమున కేగిన మహామహుని పాదుకలకు పట్టాభిషేకముచేయించి, ధర్మభంజకమైన లోకకంటక వృత్తిని అవలంబించిన కోటానుకోట్ల రాక్షసులను నిర్జించుటను వర్ణించి, సీత పాతివ్రత్యము, సుగ్రీవునిభక్తి, హనుమంతుని అనురక్తి, జటాయువు త్యాగము, కథానాయకునియందలి శరణాగతత్రాణము నిరూపించి, తుదిని సామ్రాజ్య సిద్ధిని నిర్దేశించి కృతకృత్యత నొందిన ఈ మహాకావ్యము యథార్థము కాకున్నచో యథార్థత అనునది ఇక నెచ్చటను లేదనియే చెప్పవచ్చును.

వాల్మీకి నుండి నేటి వరకు గల రామకథలలోని మేలిమిని సంగ్రహించి అన్నిరసములను సమకూర్చి సంగీత, సాహిత్యములందలి రాగ, తాళ, నృత్య ప్రక్రియలు సమన్వయ పరచి, అనంతములైన ఛందోరీతులకు అవకాశము కల్పించి, సకలజనానందకరమైన ఈ మహాకావ్యము మోక్ష సామ్రాజ్య సిద్ధి అంతిమప్రయోజనమై అలరారుచున్నది. ఇదియేకదా యథార్థత.



# యథార్థ రామాయణము
## (సమీక్ష)

శ్రీ రాంభట్ల లక్ష్మీనారాయణశాస్త్రి

**కవి :**

శ్రీ మదజ్జాడాది భట్ట నారాయణదాసుఁడు. ఈ మహాకవిని గూర్చి యాంధ్రలోకమునకు బరిచయముగావింప యత్నించుట యాదిత్యునకు దీపనీరాజన మిచ్చుటయే. బహుభాషా విశారదుఁడు, కవిసార్వభౌముఁడునగు నీ ప్రజ్ఞానిధి భూమి కవతరించిన సరస్వతీ రూపుఁడు. సాహిత్య సౌష్ఠవమున్న మేధావులకు సంగీత జ్ఞాన మరుదు. ఉన్నను స్వల్పమేగాని యయ్యది కూలంకషముగాదు. అట్లే సరస సంగీత శాస్త్ర విజ్ఞాతలకు సాహిత్యపులోతు లందవు. కావున నీ యుభయములందును సరస్వతి సగము రూపముననే వెలయుచున్నదికాని సంపూర్ణ రూపమునఁ గానరాదు.

శ్రీ దాసుగారు సరస్వతీ సమగ్రరూప మనుట యత్యుక్తి కానేరదు. సంగీతమున నాతని ప్రతిభ యా సేతు హిమాచల వ్యాప్తము. లయబ్రహ్మయనియు, వీణాగాన తుంబురుఁ డనియు, వేనోళ్ళఁ గొనియాడఁబడి వాగ్గేయ కారకుడై వన్నెకెక్కిన యా మనీషి గాంధర్వవేద మహత్త్వము నెన్న నేరికి శక్యమగును.

సంస్కృతాంధ్రాంగ్లములలోఁ గడు రమ్యముగ గ్రంథరాజములను రచించిన యా విద్వాంసుని పాండిత్య ప్రకర్ష నుగ్గడించుట యంత కంటెను కష్టతరము.

ఆ మహాకవి తా రచించిన "యథార్థ రామాయణ" పీఠికయం దుద్ఘాటించిన పలుకులను గాంచిన ప్రతివాడును గ్రంథరచనమునకుఁ గడంగుటకు సందేహింపక తప్పదు.

"శ్రుతితల్లి, లయతండ్రి, మాతాపితృ శుద్ధిలేనివానికి సందర్భశుద్ధి, మృదుమధురపద విన్యాసకౌశలము, వాతకుఁగాని వ్రాతకుగాని రాఁబోదు. సహజసంగీతసాహిత్య ప్రతిభాలంకృతుఁడయి, శ్రోత్రియకుటుంబములో జన్మించి, మైదేండ్ల వయసులోనుండియు నాడినదాట పాడినది పాటగా నేకసంథాగ్రాహినై, జగదేకసహస్రావధాన ప్రజ్ఞాధురంధరుండై, యశేష దేవదేశ్య భాషా విశేషపాండిత్య వైభవోపేతచతుర్విధాన వద్య గద్య పద్యగేయ ప్రబంధరాజములన్ స్వతంత్రముగా శరవేగమునఁ గొంగ్రొత్త కల్పనములంబన్ని యపూర్వచతుర్విధాభినయ చాతురిన్ ఘనగంభీరమధుర త్రిస్థాయిగమక రాగరూపకలాప నైపుణిన్ గొండల న్మారుమ్రోగించుచు, సుస్నిగ్ధ దేవదత్త శంఖారావరమ్యకంఠస్వర మూర్తీభూతనవనవ రసస్ఫూర్తినై, సమవిభక్త సుదృఢారుణ సుందరాకారుఁడై, దినదినప్రవర్ధమాన యశస్సంపూర్ణదశదిగంతరుండై, సర్వవిద్యాపారంగతుండై తృణీకృతబ్రహ్మపురందరుండై, దీర్ఘాయురారోగ్య భోగభాగ్యప్రాభవాంచితుండై, "నభూతో నభవిష్యతి" యను గొప్ప మెప్పొంది, కేవలస్వతంత్రవైదిక జీవనవృత్తిన్బరగుచుఁదాఁదరించి పరులఁ దరింపజేయు విష్ణు భాగవతోత్తముండీ జగమున నలరారుట మిక్కిలి యరుదు."

గ్రంథ రచనకుఁగావలయు లక్షణములనీతీరున వివరించి యీ లక్షణములన్నియు సమగ్రముగ తనయందుఁదక్క మరియెచ్చటంగాన రావని సూచించు నామహాశయుని ప్రతిభావిశేషము నెట్లు ప్రశంసించుట ?

ఈ కవి తల్లజుఁడు సహజపాండిత్య శోభితుఁడు. పోతనాదులవలె భగవద్భక్తిపరాయణుఁడు (శ్రీ) నాథాదులవలె నానా రాజాస్థాన సంపూ

జిత చరణ యుగళుండు. త్యాగరాజాదులవలె వాగ్గేయకారకాగ్రేస రుడు. రామకృష్ణ కవి పుంగవునివలె స్వతంత్రతా శోభిత వాక్ప్రపం చుడు నారాయణ భట్టాదులవలె నీ నారాయణుడు దష్టభాషా విశారదుడు, ఇంత యేల ఆతని కాదడే సాటి.

2. కావ్యము :

ఈ మహాకవి సంస్కృతాంధ్రములలో రచించిన గ్రంథరాజ ములు పెక్కు గలవు. అందాంధ్ర భాషలో నచ్చ తెనుగు ప్రబంధ ములు గూడ నున్నవి. స్వాతంత్ర్య మీ కవికిం బెట్టని సొమ్ము. అనుకరణ మీతనికి మిక్కిలి కంటగింపు. ఈతని గ్రంథరత్నములలో నొక మాని కము "యథార్థ రామాయణము"

(శ్రీ) మద్రామాయణ మాదికావ్యము. ఆది కవి వాల్మీకి విరచి తము. సకలజన శ్లాఘాపాత్రము వేదసమ్మతము. "వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే వేదః ప్రాచేత సాదాసీత్సా క్షాద్రామాయణా త్మనా" యని యభిజ్ఞుల వచనము.

ఈ రామాయణముతోం దుల్యమగునది యధ్యాత్మ రామాయ ణము. అయ్యది బ్రహ్మాండ పురాణాంతర్గతము, వేదవ్యాస మునీంద్ర ప్రోక్తము.

ఇందు మొదటిది మహాకావ్యము, చతుర్వింశతి సహస్ర శ్లోక సంబద్ధము. సప్తకాండ సముల్లసితము. సర్వలక్షణ లక్షితము. సకల కవి సముపాదేయేతివృత్తము. సమస్తలాక్షణిక కల్పనాధార భూతము. వాల్మీకి రామాయణమువంటి గ్రంథరాజమే దేశమందును, నే భాష యందును లేదనుట యతిశయోక్తికాదు.

రెండవది యధ్యాత్మరామాయణము. ఇది పురాణము. కథా మాత్రసారము. ఆత్మతత్త్వప్రతిపాదనపరాయణము. భక్తిరససముద్దీపక

స్తోత్రవచనపరిపూర్ణము. శ్రీరామహృదయు శ్రీరామగీతారూపాద్వైత సిద్ధాంతసముద్ద్యోతితము.

కథాగమనమున నీరెండింటి యందును కొలఁది మార్పులుగలవు. దృష్టిభేదమున నిట్టి భేదమేర్పడి యుండును. రెండును పురాతనగ్రంథ రాజములే. రెండును సకలవైదిక జనసంపూజితములే.

ఇందు వాల్మీకిరామాయణము పెక్కుభాషలందుఁ బరివర్తితము. ఆంధ్రమున భాస్కర రంగనాథ గోపీనాథ రామాయణములు, తమిళ మున కంబరామాయణము, హిందీభాషలో తులసీదాసకృత రామచరిత మానసము మిగుల ప్రసిద్ధములు. ఈ గ్రంథములన్నియు పై మూల రామాయణ ద్వయము నాధారముగఁ గొని వ్రాయబడినవి. అందు వాల్మీకి కృతరామాయణానుసరణమే యధికము.

శ్రీదాసుగారు పై రెండింటిని జోడించి, యావశ్యకములగు విషయములనుగ్రహించి, కొన్నింటిని పరిహరించి, స్వాభిప్రాయాను గుణములగు వానిని కొన్నింటిని జేర్చి, యథార్థరామాణమును గేయ ప్రబంధముగా రచించెను. ఇయ్యది స్వతంత్రగ్రంథము. సంగీతసారస్వత పేటిక.

కథాగతి కనుగుణముగ వాల్మీకి తులసీరామాయణములను, ఆత్మ తత్త్వ నిరూపణమున కధ్యాత్మ రామాయణమును నీ మహాకవి గ్రహిం చెను. సకలజన సంపూజితులగు సీతారాములను నాయికా నాయకులు గఁజేసి సర్వ విద్వత్సంపూజిత వాగ్వైభవ శ్రీ నారాయణదాస కవి సార్వభౌమ విరచితంబగు నీ గ్రంథరాజ మత్యుత్కృష్టమనుటలో నాశ్చర్య మేమున్నది.

3. కృతిసమర్పణ :

ఈ మహాకవి తన గ్రంథమును తన భార్యకంకిత మొనర్చెను. తన గ్రంథమందలి యారు భాగములందును సంస్కృత శ్లోకములతో

నామెను గొనియాడుచు చివరి ఘట్టమున 'నరసమ్మా' యను నామె నామధేయము వచ్చునట్లు గావించి, యామె కొసంగెను. ఆ యంకిత మొనర్చు పద్ధతి యొక్కటియే చాలును ఆతని స్వతంత్రతా ఫక్కిని చాటుటకు - భాషలో, భావములో, ఫణితిలో ప్రత్యేకత గోచరించుచునే యుండును.

ఈ గ్రంథమున మొదటి భాగము శ్రీరామ జననము. దాని ప్రారంభమున నా మహాకవి పలుకులను తిలకింపుడు.

"ఉన్మిషత్కదళీపత్ర ధవళాంగా మృగేక్షణా
చాంపేయ నాసికాసుభ్రూః ప్రయామే కృతినాయికా"

"మొగి విరియుచున్న అరటియాకు వంటి దేహచ్ఛాయ, లేడిచూపులం బోలు కన్నులు, సంపెంగ వంటి ముక్కు, చక్కని కనుబొమలు గల నా భార్య నా కృతికి నాయిక" అని కడు రమ్యముగ నామె బాల్యమును వర్ణించి శ్రీరామ జనన బాల్య దశాస్ఫోరక కథాఘట్టమును నిరూపించెను.

రెండవ భాగము సీతారామ కళ్యాణము దీని ప్రారంభమును గనుడు.

1) ఉద్యోగ మఖిలపత్నం మాం ద్రష్టుం ప్రేషితాం బయాతరుణ
మీా, అవిదిత లజ్జాఽగ్రేమేత్వా త్వం కోహిణీ ప్రియేఽతిష్ఠః.

2) జలపూర్ణ కనక కుంభ వినిక్షిప్త క్షుద్రముద్రికా హరణే
బావేనరిణయ కాచే స్త్రీ పుంసోఽదీ దృశోఽతిని పుణేతి

3) భాగ్యవతీత్వం బావే పురుషోత్తమ ఏవతవ పతిః పశ్య.
ఇతి బాంధవైర్ని శమ్యా ద్రాక్షీః తద్వావాహ సమయేమామ్"

సీతాకళ్యాణ కథావర్ణన ఘట్టమున స్వకళ్యాణ మహోత్సవ సూచకముగ కృతినొసగుట యెంత మనోహరము. ఈ శ్లోకము లాతని పాండిత్య ప్రతిభకు మచ్చుతునకలు.

తాను తరుణు డట! ఆమెను వివాహమాడుట కంగీకరించెనట. ఆమె తల్లి వరుడగు తన్నుఁజూచుట కంపెనట. ఆమె వయస్సప్పటికి తొమ్మిది వత్సరములట. లజ్జయన నెట్టిదియో తెలియని యామె తన కెదురుగ వచ్చి నిలిచినదట ఆమె ముగ్ధత్వము. నెంత మనోహరముగ చిత్రించెను. ఆనాటి ఆచారమును ఎంత చక్కగ నిరూపించెను.

"అష్టవర్షాభవేత్కన్యా; నవవర్షాతురోహిణీ
దశవర్షా భవేద్గౌరీ, అతఊర్ధ్వరజస్వలా"

అను శ్లోకము నాధారముగ రోహిణీపదప్రయోగమున నామెవయస్సును దెల్పుట మఱియుఁ జిత్రముగానున్నది.

వివాహమయినది. నాగవల్లినాడు పసుపుబిందెలోని యుంగరమును దీయించిరి. ఆమెయే యా చిన్నయుంగరము నందుకొనినదట! స్త్రీల ప్రశంసలకామె పాత్రురాలైనదట.

ఇందామె నైపుణ్యమును తన యసామర్థ్యమును దాచక చెప్పిన యా యుదారుని తీరు సరసాతిసరసము.

బంధువులందరు నామెనుగాంచి, "అమ్మా నీవు భాగ్యవంతురాలవు నీపతి పురుషోత్తముఁడు." అని పలుకఁగా ఆమె యతనిని తల యెత్తి చూచినదట.

ఇందలి చమత్కారమును బరిశీలింపుడు. పురుషోత్తమ భాగ్యవతీ పదములు ఎంతమధురముగఁ గూర్పఁబడినవో! నీమగఁడు మిక్కిలి మంచివాఁడు. నీవు మిక్కిలి యదృష్టవంతురాలవు అని సామాన్యార్థము. పురుషోత్తముఁడనగా విష్ణువు. భాగ్యవతి లక్ష్మి. మీరిరువురు లక్ష్మీనారాయణులని విశేషార్థము మఱియొక చమత్కారము పురుషోత్తమునకు 'నారాయణ' పదము పర్యాయము. తాను నారాయణుఁడనని తనపేరు సూచించెను. తత్సహధర్మచారిణి లక్ష్మి యగుటలో నాశ్చర్యమేమి?

మూడవది పాదుకాపట్టాభిషేకఘట్టము. ఇందలి కృతిసమర్పణము గనుఁడు.

1) "కరపిహితాధరనీవిం సమౌనలజ్జం నిమీలితాక్షం తే
పులకితగాత్రం సంగమమాద్యం బాలే స్మరామిభవసారమ్

2) స్మేరాపాంగ ప్రకటితనిజానురాగం విముగ్ధ సల్లాపమ్
గాఢాలింగన కుతుకం ప్రియేద్వితీయం స్మరామితవసంగమ్

3) వ్యతిహృతచుంబన బహుళం ప్రవాస శంకాకులాతిదీన దృశమ్
విశదీకృతాభిలాషం స్మరామిసఖి తే తృతీయసంయోగమ్''

ఇది కవిస్వీయానుభవము. ఇది తనభార్యయొక్క- ముగ్ధ మధ్య ప్రౌఢతల సౌందర్యమును క్రమక్రమముగ సమౌనలజ్జత - స్మేరాపాంగ ప్రకటితనిజాభిలాషం - విశదీకృతాభిలాషం - అనుపదములచే నందముగా చూపినాఁడు.

రాజ్యలక్ష్మీకరగ్రహణమున రాజు ముదితమానసుఁ డగునట్లు స్వకాంతాసంతోషమున దానున్నట్లు సూచించినాఁడు.

నాల్గవది (శ్రీరామసుగ్రీవమైత్రి) ఘట్టము. ఇందు రామదర్శన భాగ్యమున సుగ్రీవుని యానందమవధులు దాటినది. ఆసన్ని వేశమున కనుగుణముగఁ దనకృతి సమర్పణమును గనుఁడు.

1. రక్షంతీ వంశమర్యాదాం తన్వస్త్రీ గృహసంపదమ్
సహమానాపరాధాన్మే సహోవాత్సీర్మయాప్రియే॥

2. ప్రియం తే రామచరితం పిబ రామాయణామృతమ్
తాపత్రయోపశమనం సుముఖి త్వత్ప్రియోదితమ్

3. ఉగ్రషష్టి వ్రతం కృత్వా ప్రాపోస్సంతాన సంపదమ్
చాపల్యమక్ష్ణో స్థిరతా తవైవాలోకిమానసే

4. నిశ్చిత దౌహృద లక్షణసూచన మన్మత్కులాభివృద్ధికరమ్
ద్విగుణిత రూపందయితే తవాద్య దుగ్ధోదయంస్తౌమి.

"వంశమర్యాదను రక్షించుచు గృహసంపదను పెంపొందించుచు దానొనర్చిన తప్పులను సహించుచుం దనతోఁగూడి చరించిన తన ప్రియురాలి సద్వృత్తమును సంస్మరించెను. రామకథను వినుట కుత్సాహపడు నామెను గూర్చి స్వకృతమగు రామగాథామృతమును గ్రోలుమనియు నయ్యది తాపత్రయోపశమన మనియు నామెకు బోధించెను. అనపత్యతా విచారమును చూపులందును, సత్సంతతి లభించునను ధైర్యము హృదయమందును ధరించిన ఆమెనుగాంచి యనుగ్రహదృష్టి ప్రసారణమున నీ మనోరథ మీడేరునని యామె నుత్సాహపరచెను. గర్భధారణ చిహ్నములచే నిండుగనుండు నామెను గాంచి కులాభివృద్ధి యగునని యామె నభినందించెను."

ఇట్లు స్వజీవిత రహస్యము నుద్ఘాటించు నీ రచన యతిమనోహరముగ నున్నది. రామకథామృత పానమున తాపోపశాంతి యీ ప్రకరణమున కెంతయో శోభ నొసగినది. దీనిని బట్టి తనకు సంతతి కలుగక పూర్వమే రామాయణమును రచించినట్లు తెలియుచున్నది.

అయిదవది హనుమత్సందేశ ఘట్టము. ఇందాతడు తన కాంత కిడిన సందేశము, స్వకాంతా విరహమును, సీతారామ వియోగ కథాసమ్మిళితములు.

1) కింబ్రవీమి ప్రియే హన్త విచిత్ర విధి చేష్టితమ్
త్వయా సహోత్సాహ మపి భ్రామ్యతి మే వపుః

2) కథం శక్నోమి సంవోఢుం త్వద్వియోగ భరం ప్రియే
అర్థీకృత శరీరోఽహం క్షణమప్యతి దుస్సహమ్

3) త్యజ జాగ్రద్దశాం చిత్త ప్రియా విరహ దూషితామ్
స్వప్నావస్థాం భజాజస్రం కాంతా సంయోగ భూషితామ్.

ప్రియురాలా విధి విచేష్టితము విచిత్రమైనది. ఉత్సాహ హీనమయ్యును నా దేహము నీ తోడనే కలిసి తిరుగుచున్నది. నా దేహమున సాబాలు

నీ వయ్యును దుస్సహమగు నీ వియోగమును భరింపఁజాలకున్నాఁడను ఓ మనమా! క్షణకాలమైనను ప్రియావియోగ వ్యథను భరింపజాలని యీ జాగ్రద్దశను విడువుము. కాంతా సమాగమాలంకృతమగు స్వప్న దశనే సంతతము స్వీకరింపుము.

భార్యావియోగమున నామహా మహుఁడెట్లు దుఃఖించెనో యిందు సూచింపఁబడెను. "కుకూలానాం రాశౌతదను హృదయం పచ్యతఇవ" అను భవభూతి వచనము ఇట స్మరణీయము.

సీతావియోగమున రామచంద్ర విరహ దుఃఖము స్వప్రియా వ్యసనమున తన వియోగదుఃఖము సమానములే. కాని మొదటిది కించిత్కాలానుభవ నివార్యము. రెండవది యావజ్జీవానుభవ నిర్ణోదను.

ఆరవది సామ్రాజ్యసిద్ధి ఘట్టము. సామ్రాజ్యసంసిద్ధిచే రామ చంద్రునికీర్తి యాచంద్రతారార్క మున్నట్లు ఈకృతినివేదికచే స్వప్రియ చిరస్థాయిని యగుననియు తానే తత్కావ్యరచనమున శాశ్వతకైవల్య మును గాంతుననియు నిందు సూచితము.

రసనాసరసమ్మ ఇచ్ఛతి త్వదధరసుధయా వినాప్రియే
ముహురు చ్ఛ్వసతీవ భస్త్రికా జ్వలయతి విరహానలంతనుః

2 కిం మమోత్కంఠతేచేతః త్వయిలీనమపిప్రియే
గాఢానురాగ మూఢాత్మా పశ్యన్నపి నపశ్యతి

3. శ్రీరామ చరితేనేత్థం తవనామస్థిరీకృతమ్
జానన్ త్వమేవాహమితి కైవల్యానంద మాప్నుయామ్.

"ప్రియురాలా! త్వదధరసుధనుదక్క నా నాలుక మిగిలిన రుచిని గ్రహించుట కంగీకరింపకున్నది. శరీరమను తిత్తి గాలిచే మాటి మాటికి నింపబడుచున్నది. తనువు విరహాగ్ని నినుమడింపఁ జేయుచున్నది నీయందు లీనమయినను నా మానస మెద్దానిని గూర్చియో యుత్కంఠిత మగు చున్నది. గాఢానురాగమున నా మనస్సు మూఢమై చూచియు తెలిసి

కొనలేకున్నది. ఈ విధమున శ్రీరామచరిత మూలమున నీ నామమును చిరస్థాయిని గావించితిని. నీవే నేనను సంగతిని యెఱిగి యాత్మానందము ననుభవింతును."

ఈ ఘట్టమున "రసనా నరసమ్మ ఇచ్ఛతి" యనుచోట "రసనా-న - రసం - మే - ఇచ్ఛతి" అను నర్థమును గూర్చుచు, "నరసమ్మ అను స్వభార్య నామమును గ్రంథస్థము గావించి చిరస్థాయిని గావించిన ఆ మహాకవి ప్రతిభ యనితరసాధ్యము.

### 3. ఎ) కథావిభజనము :

కృతినిడుటలో స్వసామర్థ్యమును స్వాతంత్ర్యమును జూపినట్లే కథను విభజించుపట్లను దాను స్వాతంత్ర్యము వహించెననుట నిస్సందేహము.

1) శ్రీరామ జననము
2) సీతాకళ్యాణము
3) పాదుకాపట్టాభిషేకము
4) శ్రీరామ సుగ్రీవమైత్రి
5) హనుమత్సందేశము
6) సామ్రాజ్యసిద్ధి.

అని యాఱు భాగములిందుఁ గలవు. బాలకాండ కథను శ్రీరామ జనన సీతాకళ్యాణములను భాగద్వయము గావించెను. అయోధ్యా కాండమునకు పాదుకా పట్టాభిషేకమని పేరిడెను. శ్రీరామ సుగ్రీవ మైత్రి యరణ్యాకాండ కిష్కింధాకాండలయందు వ్యాప్తము. హనుమ త్సందేశము కిష్కింధా సుందరాకాండల కథతోఁ గలిసియున్నది. యుద్ధ కాండ మంతయు సామ్రాజ్యసిద్ధిగా మారెను.

ఇట్లు మార్చుటలో హరికథాకాలక్షేపమునకు వలసిన విధమున కథను పొందికగావించుటయే ముఖ్యప్రయోజనము. శ్రీరామసీతాభరత

సుగ్రీవహనుమద్రావణు లిందు ముఖ్యులుగావున వారికి సంబంధించినట్లు కథను మలచుట యవాంతర ప్రయోజనము.

4. కథాగతి :

## శ్రీ రామ జ న న ము

ఇందు కథయంతయు మారినది. దశరథునకు మునిశాపము - ఋశ్యశృంగచరిత్రము - నారదకృత విష్ణుశాపము - దేవకృతవిష్ణు ప్రార్థనము - శ్రీరామజననము అను భాగములతోఁగూడి యున్నది. విష్ణుశాప వృత్తాంతమును తులసీరామాయణమునుండి గ్రహించెను. మునిశాపవృత్తాంతము వాల్మీకిరామాయణమున అయోధ్యాకాండమున, రామునడవికిఁబంపి దుఃఖించుచు దశరథుఁడు కౌసల్యతోఁ జెప్పినట్లు గలదు. ఆకథయచ్చటనే యతికినది. దానిని ముందుగఁజెప్పుటలో ప్రయోజనము గానరాదు. పుత్రోత్పత్తికిశాప మంతరాయమందుమా ? అట్లుగానరాదు. పుత్రవియోగమున దశరథ మరణమందు నిరూపితము. మహాకవి యూరక దానిని ముందుగూర్చునా ? ప్రయోజనములేని పనిని జేయునా ? మంచిప్రయోజనమేకలదు. గమనింపుడు.

శాపమునుబట్టిచూచిన తనకు పుత్రులుకలుగవలెను. వార్థకము పైఁ బడినను బుత్రులు కలుగలేదు. కారణమేమి ? తమరాలోచింపు డని వసిష్ఠునితో దశరథుఁడు వాపోయెను. అందులకా కథను ముందుగాఁ గూర్చియుండును. ఇది యుచితముగనే యున్నది.

ఇట్లు మూఁడు నాలుగు కథాభాగములను గలబోసి యాదివిష్ణువు రాముఁడై యవతరించెనని శ్రీరామజనన ఘట్టమును బరిసమాప్తము గావించెను.

పాయస విభాగము వాల్మీకిరామాయణమునందు వర్ణింపబడిన విధముగనే సూచించెను.

"కౌసల్యకు సగమున్ సుమిత్రకున్గయికకన్నన్నినుమడిగ" యని యాతని వచనము.

## సీతా కళ్యాణము

విశ్వామిత్రాగమనము – తాటకాహననము – యజ్ఞరక్షణము అహల్యాశాపవిమోచనము – శివధనుర్భంగము అను భాగములతో నియ్యది సంపూర్ణము.

ఇందు మూలముకంటె కొలది మార్పు గోచరించును. విశ్వామిత్రుడు జనకపట్టణమందలి శివధనుర్వృత్తాంతమును రామునితో తన యాశ్రమమందు చెప్పుచుండ రాముని పాదమునకొక రాయితగిలి యహల్యగ మారెనని చెప్పపడెను. విశ్వామిత్ర గౌతమాశ్రమములు భిన్న భిన్న ప్రదేశములలోనున్నట్లు మూలమునం గలదు. ఇచట అహల్యాస్తవము విశ్వామిత్రుని యాత్మతత్త్వనిరూపణము అధ్యాత్మ రామాయణమునుబట్టి వ్రాయబడినది. ఈరెండును కవి యాత్మజ్ఞాన వైశారద్యమును జాటుచున్నవి. తాటకావర్ణనము అతని కల్పనా చాతుర్యమునకు మచ్చుతునక.

ఇచ్చట యహల్య పాషాణరూపముననున్నట్లు చెప్పబడినది. వాల్మీకిరామాయణమున నట్లులేదు. అధ్యాత్మరామాయణ పద్మపురాణ ములందట్లు రాయి యయినట్లున్నది. దానినే యీతఁడు గ్రహించెను.

ఇక యహల్య చరిత్రయు నిందు మార్పుగావింపఁ బడినది. ఈ మార్పు ఆమె స్వభావమును చక్కదిద్దుటకు గావింపఁబడినది. ఆదిముని దంపతులనట్లు తీర్చిదిద్దుట – యెంతయు సమంజసమే. కాని గౌతమముని తపోభంగమునకై యత్నించు నింద్రుఁడు తత్పత్నిని మోసగించి యామె తోఁ గలియుటకు యత్నించుట "పృష్ఠతాడ నాద్దంత భంగః" అను నట్లున్నది. ఆ యింద్రుని యత్నమును తన దివ్యదృష్టి నరసిన యా

యహల్య తన పాతివ్రత్య మహిమంబునఁ దాను బండగా మారుటకంటె నా యింద్రునే శపించినచో స్వభర్తృ తపో నియమమున కెట్టి యంతరాయమును లేకుండునే. అట్లు చేయక తాను ఱాయిగామారి, ఇంద్రుని తన భర్త యాగ్రహమునకు గురిగా జేయుట యనాలోచిత కృత్యమేమో? ఈ కథయందలి రహస్యము దురూహము.

మిథిలాపురీ వర్ణనమనుపమానము. ఇచట విశ్వామిత్రుఁడు రామునకు క్షత్రియ ధర్మము నుపదేశించుట, జనకుఁడు సీతకు రాజ కుమారుల చిత్రపటములను దెప్పించి చూపుట, సీతారాము లుద్యానవనమున పరస్పరము దర్శించుకొనుట, వివాహమునకుఁ బూర్వము శివ ధనుర్భంజనానంతరమున వారి విరహవర్ణనములును, కవి కల్పితములు. ఇందుద్యానమున సీతారాముల కలయిక తులసీరామాయణాంతర్గతము శృంగార రస పరిపోషణమునకై కవి యిట్టి మార్పు గావించి యుండును. శివ ధనుర్భంగమునకు బూర్వమున నట్టి సమావేశమును గల్పించుట కంటెఁ దదనంతరమున నీ కల్పన ముచితముగ నుండునేమో యని పించును.

ఇఁకఁ గళ్యాణ సమయమునఁ గవి గావించిన కల్పనలన్నియు నాధునికాచార సూచకములే. ఇట్లు సీతాకళ్యాణ కథ ముగిసినది.

## పాదుకా పట్టాభిషేకము

ఇందు కథ యథాతథముగనే యున్నది. లక్ష్మణుని యాగ్రహమును విడచుటచే నాతని స్వభావము పోషింపఁబడినది. కైక పశ్చాత్తాపమును వివరించుటయుం దధ్యాత్మ రామాయణ మాధారముగ గైకొనఁబడినది. భరతుని శపథములను సంగ్రహముగ గుహునికడ వివరించుటయు యుక్తి సహముగనే యున్నది. జటాబంధనము, భరద్వాజ దర్శనము మూలముకంటె విభిన్నములు. యమునానదిని దాటిన పిమ్మట భరద్వాజ దర్శనము యుక్తి యుక్తముగలేదు. గంగా యమునల మధ్యమందే

భరద్వాజాశ్రమము నేటికిని ప్రసిద్ధమైయున్నది. చిత్రకూటమున వాల్మీకి మునీంద్ర దర్శన మిందులేదు.

లక్ష్మణ కృత పర్ణశాలా నిర్మాణము కవికల్పనా చమత్కారము నకు నిదానము.

## రామ సుగ్రీవ మైత్రి

ఇందలి కథయు కొలఁది మార్పులతో మూలానుసారముగనే యున్నది.

అనసూయ తానిచ్చిన కుంకుమాదుల ఫలములు వివరించుట యొక ప్రత్యేకత. విరాధవధ - తుంబురుశాపవిమోచనము అధ్యాత్మ రామాయణసంగృహీతములు. శరభంగాది మునీంద్రకృత స్తవము లధికముగ నధ్యాత్మరామాయణాను సారములే. శూర్పణఖాసంభాషణ మున రామ లక్ష్మణ కృతహాస్యము పరిహృతము. అయ్యది వారి యుదాత్తతకు పరిపోషకము. ఖరదూషణాది వధసమయమున సీతా లక్ష్మణులు పర్ణశాల యందుండి రామయుద్ధమును గాంచుట చిన్న మార్పు. సీతాపహరణమున రావణుఁడు భూమిని పెల్లగించి రథముపై నిడుట యధ్యాత్మరామాయణము నందలిది. జటాయు రావణయుద్ధమున నద్దానిని సమర్థించుకొనవలసి యున్నది సీతావియోగమున రాముని దుఃఖము మితిమీరలేదు. సీత లక్ష్మణునిదూషించుటఁ గానరాదు. ఇది సీతారాముల స్వభావ పరిపోషకము. ముమ్మారు ఖరదూషణ యుద్ధము . సౌకర్యార్థముపనిబద్ధమనఁదగును. హనుమంతుఁడు వానర రూపముతోడనే రామ లక్ష్మణుల కడకువచ్చి ఫలములను సమర్పించి వారిని దేవతలనుగా నుతించుట యతని రామభక్తి చిహ్నము. సుగ్రీవుఁడు రామునితో మైత్రిగావించుటతోనిది పరిసమాప్తము.

# హనుమత్సందేశము

ఇందలి కథాభాగముగూడ స్వల్పమగు మార్పులతో వర్ణింపఁబడినది.

వాలి భ్రాతృ భార్యాపహారియని సూచింపఁబడెను. వాలి సుగ్రీవ వైర కారణమిందు లేదు. రాముఁడు సుగ్రీవునిద్వారా వాలికి రాయబార మంపి, దానిని తిరస్కరించి సుగ్రీవుని వెన్నంటి వచ్చి వాలి నెదుర్కొని చంపెను. ఇందు రాజధర్మము పాటింపఁ బడినది. రామునియందుగల కళంకము నివారింపఁబడినది. చెట్టుచాటునుండి సంహరించెనను అపప్రథ పోయి లోకైక వీరుడను ఖ్యాతి రామునకు లభించినది. వాలి రాముని లోనైక్యమగుట తార వాలితో సహగమన మాచరించుట యిందలి ప్రత్యేకతలు.

గ్రీష్మ వర్షా శరదృతు వర్ణనము లిందతి మనోహరములు.

సుగ్రీవునిపై లక్ష్మణుని యాగ్రహముగాని సుగ్రీవుని ప్రమత్తతగాని యిట గానరావు. అది యాతని కృతజ్ఞతా సూచకము.

హనుమదాదులు లంక కేగుచు స్వయంప్రభను దర్శించుట ఆమె వారికి సాయముగావించి రామదర్శనమున కేగుట యథ్యాత్మమునగలదు. సంపాతిద్వారా సీత వృత్తాంతమును విని వానరులు దక్షిణ సముద్రమును చేటరుతో కథ ముగిసినది. సంపాతి చరిత్రమిట లేదు. సంపాతికంటె జటాయువు పెద్దవాడనుట సాహసమే. "ఆ జటాయువు నాయన్న యేసుండి" శీర్షికలో జటాయువు సంపాతికి తమ్ముఁడని చెప్పిన కవి యిట యన్న యని వచించుటలోఁ గారణము తెలియదు.

హనుమంతుడు సముద్రమును దాటునపుడు గాంచిన దృశ్యము లిందు వర్ణింపఁబడినవి. కాని వానిని మరియొక తీరున కవి ప్రతిపాదించెను. సురస యొక పెద్ద నీటి పాము. సింహిక పదియామడలు చుట్టుకొల్తను దిరుగు పెద్దసముద్రపుసుడి.

లంకాపట్టణమున కృత్రిమ జలయంత్రములు, విద్యుద్దీపములు, పొగవెలుపు ధూమస్తంభములు, దబ్బకాయలచుట్టవలెనున్న వీధులు కవి కల్పనావిశేషములు.

లంకిణి హనుమంతు నెఱిగి విడుచును. ఇదియు హనుమ మహిమకు నిదర్శనము.

ఇఱువది చేతులతో పదితలలతో మండోదరితో గూడి శయనించు రావణుని హనుమంతుఁడు చూచుట వాల్మీకమునఁ గానరాదు.

సీతను కాపాడుచున్న రక్కసులమూకను దన మంత్రమహిమచే నిద్రావశలనుగా హనుమంతుఁడు గావించెననియు, వారికడనున్న ఖడ్గములను గ్రహించి సీత దుఃఖమును పట్టజాలక ఆఖడ్గముతో తన తలఖండింప నుంకించుటయు, అంత హనుమంతుఁడు హఠాత్తుగ వృక్షమునుండి దిగి ఆమె హస్తమునుండి ఖడ్గమును దీసికొని తన వృత్తాంతమును జెప్పి యంగుళీయక మొసంగి యామెను గాపాడుటయుఁ గవి కల్పనమే. దీనికాధారములు లేవు. ఇంద్రజిత్తుని బ్రహ్మాస్త్రముచే హనుమ బద్ధుఁడు కాలేదు. తానే స్వయముగ బద్ధుఁడగుట కంగీకరించెను. ఇంద్రజిత్తు ఆతని రావణుని సింహాసనపు కోడునకు గట్టెను. రావణునితో మాట్లాడు సమయమున హనుమ వాలసింహాసనమధిష్ఠించెను. ఇవి యన్నియు కవి యూహలే. అమాత్రృకములు. హనుమ మహిమను దెల్పుట కిట్లు గావించియుండెననవచ్చును.

విభీషణోపదేశమిందు గానరాదు. హనుమత్సందేశము మాత్రము గలదు.

సీత యిడిన చూడామణియగాక చెప్పిన ఆనవాళ్లలో మార్పు గలదు. అవి వివాహమునకుఁ బూర్వము వివాహసమయమున గావించిన కృత్యములు. వాని నెఱింగించుటలో నౌచిత్యము గానరాదు. గండశిలక కాకాసుర వృత్తాంతములతి రహస్యములు. రామ మాత్రైకవేద్యములు.

వాని నెఱింగించుటయే యుచితము. తోటలో నున్నమామిడి పొంత సీతను జూచునవసరమున లక్ష్మణుఁడు గలడు. బిందెలో నుంగరమును తీయుపట్ల పలువురు బంధువులునుగలరు. అట్టి ఆనవాళ్లెన్నయిన గలవు. వానిని జెప్పించుటలో నౌచిత్యము గానరాదు.

## సామ్రాజ్యసిద్ధి

దర్భశయనము, సముద్రముపై నాగ్రహము, నలసేతుబంధనము, మున్నగునవి యిందు పరిత్యక్తములు. సేతు నిర్మాణము అధునాతన పద్ధతిని సూచించుచున్నది. ఇయ్యది కవి కల్పితము.

సుగ్రీవ కుంభ కర్ణుల యుద్ధమున హనుమ తోకతో కుంభకర్ణుని లాగుట చమత్కార జనకము. అగస్త్య దర్శనము, మాతల్యాగమనము మున్నగునవిలేవు. మయశక్తిని రాముఁడే ఖండించెను. లక్ష్మణ మూర్ఛ కానరాదు. సర్వవానర మూర్ఛగలదు. తన్నివారణమునకై ద్రోణపర్వతమును హనుమంతుఁడు తెచ్చుట కలదు.

రావణ మరణానంతరమున మండోదరి సహగమనము చేయును. ఇంద్రజిత్తు పెద్దకుమారునకు విభీషణుఁడు యౌవరాజ్య పట్టాభిషేకమును గట్టును. ఈ రెండును అమూలకములే.

సీత యగ్నిప్రవేశము, దేవతాస్తవము మున్నగునవి పరిత్యక్తములు. ఇవి సీతారాముల సౌశీల్యమునకు వన్నె నిచ్చును.

విమానముపై ముందు నందిగ్రామమునకు పిదప భరద్వాజాశ్రమమునకు రాముఁడు వచ్చినట్లు చెప్పుట కల్పనమే. భరతుని వేగముగా జూచుట కట్లు గావించెనని జెప్పవచ్చును. అపుడు భరద్వాజు దర్శనము నను విడచిన యుక్తముగ నుండును.

ఈ విధముగ రామాయణ కథను మార్చి యథార్థరామాయణ మను పేరున నూతన కావ్యమును జిత్రించెను, కవి స్వాతంత్ర్య ప్రతిభ:

డగుటఁ జేసి యిట్లు మూల కథను మార్చుచు హరికథా కాలక్షేపమున కనువుగ రామాయణమును రచించెను,

5. కవితారీతి :

శ్రీ దాసుగారి కవిత్వము మృదుమధురము. అతని తెలుఁగు పలుకుఁబడి యతిసుకుమారము. ఉపమానములన్నియు ప్రకృతి సహజములు అనుభవ గోచరములు. స్వోపజ్ఞ నాధారముగ గావించిన కల్పన లతి సుందరములు. ఈతని వచన రచనలోని యల్లిక జిగిబిగి యతి రమణీయము.

ఎ) కల్పనారీతులను గమనింతము :

విశ్వామిత్రుడు దశరథుని యాస్థానమున కరుగుదెంచెను. అందా ముని వర్ణన మెంత సహజసుందరముగ నున్నదో తిలకింపుడు. అతిశయోక్తి యిసుమంత యున్నను స్వభావోక్తియే యిందు ప్రస్ఫుటము.

సీ॥ ముడివడి గడ్డము మోకాళ్ళ నొరయంగ
ఘడమలకుం బల్ల జడలు దగుల,
మొలచుట్టు పులితోలు ముంజేత జపమాల
యడుగులం బావకోళ్ళ మరియుండ,
విగురు గ్రమ్ముచునున్న నిప్పులాగు న భూతి
పూసిన బంగారు బొందె మెఱయ,
వెడఁదనొసటి మీదనిడుద చంద్రము బొట్టు
చెవుల రుద్రాక్షముల్ చెలువుమీర

బ్రహ్మతేజంబు దిక్కులఁ బ్రజ్వరిల్లఁ
జూపఱకు భయమున్భక్తి యేపు మిగుల వచ్చె''

ఇందు మహర్షుల లక్షణమ్ములన్నియు కన్నులకుఁ గట్టినట్లు కనబడుచున్నవి. ఈ వర్ణనము పెద్దనాదుల వర్ణనలకేమాత్రము దీసిపోదు.

భయంకరరాక్షస రూపమును జిత్రించుటలో నాతని నేర్పును గమనింపుఁడు. ఇందు బీభత్స భయానకరసము లుప్పతిల్లుచుండును. అతిశయోక్తి యున్నను అందముగనే యున్నది.

తాటక రామలక్ష్మణులున్నచోటునకీ క్రిందివిధమున వచ్చినదట. ఇది భాస్కరరామాయణమును స్మరింపఁ జేయును. తెనుఁగు నుడికారపుసొంపులతో నీపద్యము శ్రోతృ జనాకర్షకము.

సీ. "పదఘట్టనమునకు బెదరి జంతులుపారఁ
బెనుహుంకృతికి దెసల్బీటదేఱ,
వ్రేలాడు కొప్పునవెదురు డొంకలుచిక్కు
వడినేలనూడ్చు చప్పుడునొనర్ప,
కాళ్లకుఁదగులు వృక్షమ్ము లన్నియుగడ్డి
కాడలవలెఁ జాపకట్టు కొనఁగ,
అడుగడ్డునకు మధ్యనా పాటి యీపాటి
యేఱులుంగుట్టలు నిముడుచుండ
లోనికి బయటి కూర్పు పుల్గులనులాగ,
నరకపాలముక్తాభరణంబు లెసఁగ,
అగ్నికుండములట్లు రక్తాక్షులలర,
వచ్చితాటక పిడుగులు వడగబల్కె."

సౌందర్య వర్ణన సందర్భమునసీ మహాకవి పోయిన పోకడలు సుకుమారములు, మహాకవి కాళిదాసునిచే రచింపఁబడిన మార్గమును పుణికి పుచ్చుకొన్నట్లున్నది. కొన్ని కొన్ని చోట్ల నంతకు మించియున్నవనియు నన వచ్చును. ఈ వర్ణనమందలి కల్పన లన్యకవ్యచుంబితము లనుటలో తప్పులేదు.

సీతాదేవి సౌందర్య వర్ణనము నెంత మధురముగ గావించెనో పరిశీలింపుడు. శూర్పణఖ సీత సౌందర్యమును రావణుని కెఱిఁగించు సందర్భమిది. స్త్రీముఖమున నీ వర్ణనము గావించుట మఱియు మనోహారము.

''అగును దాని చెంత రంబయైన నొక్కకోతి'
దెబ్బిన నద్దానిఁ జిదిమి దివ్వె పెట్టవచ్చు,
అబ్బోటినైనూడ నతివక్రైన వలపు హెచ్చు''

చిదిమి దీపము పెట్టవచ్చు - అతివక్రైన దానిఁ జూడవలపు హెచ్చునట- ఈ మాటలు చాలవా సౌందర్య వర్ణనమునకు, మరియొక కల్పనమును జూడుఁడు.

సీ॥ కొప్పు నిలువఁబడి విప్పిననీలి గా
జుల మలారము పోల్కి చెలఁగునేల,
ఏ వంకఁ గన్గొన్న నావై పుననె నల్ల
కల్వలు దండలు గట్టుచుండు,
చిన్నారి పొన్నారి చిరునవ్వు నవ్విన
జలజల ముత్తెము లొలుకుచుండు,
పలికిన గోయిలల్ చిలుకలు గోరలు
బ్రమసి మ్రోగుచుఁ జేరఁ బారుచుండు,
భళిర యా యింతి యద్దాని చెలువు జూచి
తీరవలెఁగాని కొనియాడ నేరితరము
ఆపెతో నొక్కసారి మాటైన నాడ
కున్న నీ మగ బ్రతుకన్న! యుత్తరిత్త''

నీలిగాజులమలారము నేలఁ బరచినట్లు ఆమె కేశపాశమున్నదనుట యెంత మనోహరము. ఇట్టిది ఏపూర్వ కవియైనగావించెనా!

ఈ క్రింది వర్ణనమును జూడుడు. సీతావియోగమునఁ బరితపించు రాముఁడు హనుమంతునితో నన్నమాట.

సీ. బిట్టు చీఁకటి నైన వెల్గు దివ్వటి వెల్గఁ
బోవదే యామించుబోడి చెంత
నిండారపండిన దొండపండైన వి
ద్వదె చిల్క యాపె కెంబెదవిఁ జూచి

విరిదమ్మినింగూడ సరకు సేయునెతేటి
యాముద్దు గుమ్మనెమ్మోము గాంచి
సీతు నందైన నచ్చెరవుగ బదులు కూ
యదె కోయిల చెలి పల్కులకించి

గండుమీల్బుల్పిల్లవా యాపెకన్నులరసి
డాగుతనకొప్పులోన నాతీగె బోడి
సొగసు మంచితనమ్ము నాముగుద సొమ్మె
యీడు పదునెన్మిదేండ్లు నాయింతికిపుడు"

మేనికాంతి, కెంపుపెదవి, నెమ్మోము, ముద్దుపల్కు, వాలు చూపులు, నిడుదకొప్పు – వీనిని వర్ణించువిధము ఎంతహాయిగనున్నది. ఆ కల్పనాచాతుర్యమనితర సాధారణమనకతప్పదు.

బ్రహ్మజ్ఞానసంపన్నుఁడగు నారదుని నోటివెంట వచ్చు కాంతా వర్ణనమును గమనింపుడు. ఇది మఱియొక పుంత త్రొక్కినది.

"మానికెయద్ద మున్మఱపించు కుంద్రని
చెక్కిలిపైఁ జిఱునొక్కు సొగసు,
ముదురుకెంపుల జతంబొదవు ముత్తెములటు
పెదవులంబల్చాలు కదియుఠీవి,
మఱి పోల్కితోఁచ దద్దిర దిద్దినట్లున్న
యానోగముక్కొర –"

ఈ విధమున చక్కనిపోకడలతో నాతని వర్ణన విశేషములు కావ్య మంతట గోచరించును.

రాక్షసస్వభావవర్ణనమును ఎంతకమ్మగఁ జిత్రించెనో చూడుడు.

"ఏమీ నరవాసన యాహా యెంత కమ్మన,
యీమనుజుల వరుగొనర్తునిల్లు ఘుమ్మన,
ఒఱ్ఱి యమృతమైన వీండ్ర యుడుకు నల్లకు
పుత్తెలాణిముత్తెములగు ముక్కుపుల్లకు

కల్లుద్రావునప్పు డూరగాయపాళము,
కొల్ల కొలగ నంచుకొనెద గొంతకాలము"

ఈ కల్పనము భయంకరమేగాక మనోజ్ఞము గూడను.

వివాహవర్ణనమును గావించు పట్ల సహజోక్తుల నలరించిన యీ కల్పనల తనికేగాని మఱి యేరికిని స్ఫురింపవు.

''పెండ్లికూతులునెప్పెండ్లి కొడుకులున్
వెలయుసొబగు భళిరా,
పెండ్లివంటి ముచ్చట యీ బ్రతుకున
వెదికిన మఱి కలదా
పసపునడిచిన యొడళ్లంబచ్చని
పట్టు పుట్టములతో,
మిసమిసమను సూనూగువయసుతో
మేలమాడు పగతో,
“అడుగులందుఁ బారాణులతోఁగ
ల్యాణపుబొట్టులతో,
నిడుప కనుల కాటుకతోఁ జెక్కుల
నివ్వెటి చుక్కలతో,
ఒకరి కొకరు పూసినగందముతో
నొయ్యారపు నడతో,
పకపక నగు మాటలతో బువ్వపు
బంతి వేడుకలతో—''

పెండ్లివంటి ముచ్చట యీ జీవితమున మఱియొకటి యెట్లు కానరాదో యీ పెండ్లి వర్ణననుబోలు వర్ణనయు మఱి గానరాదు. ఎంత సహజ సుందరముగ నలతి యలతి తెలుగు నుడులతో నియ్యది చిత్రింపబడినదో గదా!

మఱియు వివాహమందలి వేడుకలను గమనింపుఁడు.

"తలుపు తెఱచు పాటతడబడి యొండొరు
బెరొ్కనసిగ్గున న్బెనగులాట,
కెంగేలుగలిపిని సింగారపు పచారు
నడ్డడ్డున నివాళినందు పౌరు,
అఱకోర్కి మడుపులనందించుకొనునేర్పు
నిముసమ్ములోన వేసములమార్పు,
యిక్కువంబువ్వచెండ్లేయు జాణతనంబు
నెకసక్కెముల మొల్క నగుల డంబు,

గడుసుముద్దు వినీవినపడనినుద్దు,
కన్నుమెలపు కడన్గుత్తగొన్నవలపు,
క్రొత్తయాల్మగలు గయికొన్నవగలు,
పూని గణియించుటెటు నల్వయైనఁ గాని"

ఇంత మధురముగ నలువయు వర్ణింప జాలడేమో!

ఈ విధమున చక్కని సహజ వర్ణనము లీ మహా కవికి స్వత స్సిద్ధముగ సంప్రాప్తములైనట్లు గానవచ్చును,

బి) ఔపమ్యము :

ఇక నీ వర్ణనలను విడిచి యితని యౌపమ్య కల్పనమును గాంచుడు. ప్రకృతిసిద్ధములు, సర్వానుభూతములునగు నుపమానములనే యీ కవిపుంగవుడు చూపును. అవి యన్నియు పూర్వకవి వర్ణితములు గావు. తానూహించి కల్పించినవే. అందలి మాధుర్యము అనుభవైక వేద్యమే.

సీతారావణ సంవాద సందర్భమున సీత రావణుని ధిక్కరించుచు నాడిన పలుకులలో రామరావణుల తారతమ్య మెంత చమత్కారముగ వర్ణింపఁబడినదో యరయుఁడు.

''రాముఁడు మదహస్తి దోమ నీవు
అరముపతి యనంతుఁడు వానపాము నీవు,
రామచంద్రుఁడు బాలరవి నీవు మెఱుగుడు పురుగువు
రాముడంబోధి నీవు చౌడు బట్టెవు
రామచంద్రుఁడు కల్పవృక్షము నీవు ముది బొమ్మ చెముడు తుప్ప
సరసుఁడు రాముఁడు సమదసింహము
కడుగండడంగిన గాలిగాడవీవు
నాక మారామచంద్రుఁడు నరకమీవు
వీరుఁడా దాశరది దివాభీతుఁడవీవు
సిగ్గిడీ ! పొమ్ము నావిభు చే మడియుము,''

ఇన్ని యుపమానములను గూర్చిన యీ వర్ణనమున తారతమ్య నిరూపణము బహు సుందరము, సార్థకము ననదగును. క్రమముగ నొక్కొక్క పోలికతో రాముని యందున్న యొక్కొక్క గుణము నిందు ధ్వనింపఁ జేసినాఁడా మహాకవి. రాముఁడు మదహస్తివలె బలశాలి అనంతునివలె భూభారకుడు, బాలరవివలె ప్రతాపవంతుఁడు, సముద్రుని వలె గంభీరుఁడు. కల్పవృక్షమువలె వదాన్యుఁడు, సింగమువలె శౌర్య సాహసములుగలవాఁడు, స్వర్గమువలె సుఖసంధాయి, వీరుఁడు. ఈశ్వరుని వలె సర్వజ్ఞుఁడు, నీ కాతనితో సాటి యెట్లని యధిక్షేపము. మధురాతి మధురము.

ఔపమ్యపద్ధతిలో మఱియొక తీరును గనుఁడు. ఇది దశరథ వచనము, వార్థకమున సంతానము కలుగుట యసంభావ్యమను మాటను దెల్పుట కా మనీషి చూపిన యుక్తులను బరిశీలింపు డు.

''ఎండమావుల నీటినుండి యెట్టులఁజల్వ
తెమ్మెర యేతెంచి తీర్చుడప్పి.
కుందే లెదిరి తన కొనవాడి కొమ్ముల
గ్రుచ్చి పులిన్నేల గూల్చుటెట్లు,

పట్టు గొడ్రాలు బొమ్మలు చేపునకు వచ్చి
పసిబిడ్డ యా కలిం బాపు టెట్లు,
మట్టి పిత్తున్నాట మఱి దానివలన నె
ప్పుడయిన మామిడి మొలచు టెట్లు,

గాడి నిప్పునఁ దామర కలుగు టెట్లు,
ఎండమావుండు టెట్లు, ఎద్దీను టెట్లు,
ముసలివానికి పిల్లలు పుట్టు టెట్లు,
ఆఱునూరైన సాజంబు మాఱు టెట్లు."

అసాధ్యముల నన్నింటిని నొక్కచోటం జేర్చి ప్రకృతి మాఱదను నిత్యసత్యము నీ తీరునఁ బ్రదర్శించుట యాతని ప్రతిభా విశేషముల నొక మార్గ మనఁదగును.

ఆతని యౌపమ్య పద్ధతిలో మఱియొక మార్గము నవలోకింపుడు. శ్రీరామచంద్రుడు పరమాత్మయని నిరూపించుసందర్భమున నీ కల్పనము ఆతని సర్వజ్ఞతా మహిమను చాటును. అత్రిమహర్షి రాముని గూర్చి పలికిన మాటలివి.

"వలయరేఖనుబోలి పరమె తెల్పంగ నీ
కాది మధ్యాంతములప్రమేయ,
ఎల్ల జగంబులకీవె యాధారంబు
లెక్కలకన్నింటి కొక్కటివలె,
ధర్మమువై పె యెంతయు జోగుచుందువు
బరుపు వంకన్హ్రాసములు విధమున,
పెరగవుతరగవు విభజింపఁబడవు శూ
న్యాంకమువలె నకలంక చరిత"

ఈ నాల్గుపమానములలో నాతని లౌకిక విజ్ఞానమేగాక యాధ్యాత్మిక జ్ఞానముగూడ ననుపమానమని తోచక తప్పదు. వలయమునకు ఆది మధ్యాంతములు తెలియవు. అట్లే యాత్మకు జనన మరణాలులేవు. ఒకటవ యంకమును పెంచినప్పుడే మిగిలిన యంకెలన్నియువచ్చును. అట్లే

యాత్మయే జగమునకంతకు నాధారము త్రాసు ముల్లు బరువున్న వైపునకే మొగ్గును. భగవంతుఁడును ధర్మపక్షపాతి. శూన్యమన బిందువు. అది యెల్లప్పడు నొకే తీరుననుండును. అట్లే యాత్మయునేక రూపమే. అఖండమే. అట్టి భావసంపదను సామాన్య పదార్థ మూలమున వ్యక్తీకరించిన ఆ మనీషిప్రతిభ యనన్యాదృశము.

ఇట్టి యుపమానములడుగడ్డునకు నీతని గ్రంథమునఁ గలవు. వచనములందాతఁడు చూపిన యౌపమ్య సరళి మరియు నుపజ్ఞాస్ఫోరకముగనున్నది. అన్నియు ననుభవాత్మకములే! సకల జనైక వేద్యములే! పరిశీలింపుడు.

"శ్రీరామచంద్రుఁడులేని యీపాడుకొంప యయోధ్యలో నిఁక నుండుటకంటె, వృద్ధవివాహమాడినట్లు, ఊషరక్షేత్రమున విత్తులు చల్లినపోలిక, అవివేకిని సేవించిన కరణిని, సముద్రములో వానకురిసిన విధమున, అపాత్రులకిచ్చిన దానముచొప్పున, గ్రుడ్డి కద్దము చూపిన తెన్నున, చెవిటిచెంత సంకూదినరీతి, బోసి నోటికి చెఱుకుముక్కలందించిన తీరున, నీటవ్రాసినమాడ్కి, అరణ్యరోదనంబు చాడ్పున, మూర్ఖున కొనర్చిన యుపదేశంబు పగిది, కృతఘ్నునకు మేలు చేసిన విధమున, అరసికునికడ వినియోగించిన విద్యతెఱంగున, లుబ్ధుని ధనము పగిది, అస్వతంత్రుని పీఠము తీరున ధర్మశూన్యుని బ్రతుకుభంగి. ఊఁక దంపువలెవ్యర్థము కదా !"

ఈతని పాండిత్యప్రతిభా నిరూపకములగు శ్లేషపద్ధతులనుగనుఁడు. ప్రాచీన కవులనుమించి భట్టబాణుని ప్రాభవమితనియందుఁ జూపట్టును.

మహారణ్య వర్ణనమిది.

"బ్రహ్మ సమాజంబు జాడ ద్విజసంకులము, పాశ్చాత్యవిద్యా పాఠశాలలంబోలి ద్రవ్యమూలైకగమ్యము, గ్రామ్యభాషాకావ్యంబు పగిది నీచజనప్రియంబు, బాల్యవివాహంబు విధమున మన్మథదూరంబు,

ప్రియానభిజ్ఞంబుఁ నవనాగరికజీవనంబు సొబగున కాంచనప్రధాన్యైక గౌరవంబు."

వర్షాకాలముంగను డు. అది "దాతమాడ్కి బహుజీవన సంధాయకంబు, క్షేమవార్తవలె సంతాషోప శాంతికరంబు"

శరత్సమయమును బరికింపుడు

అయ్యది హరిమందిరము కరణి విమలాభాంచిత విష్ణుపదము. భాగవత సమాజంబుపోల్కి స్వచ్ఛజీవంబు, సత్ప్రభుపాలనంబు పోల్పున సముల్లసితకువలయంబు, మరీచరసంబు విధమున సమశీతోష్ణంబు.

ఈ విధమున తన పాండిత్యమును సమగ్రముగ నిరూపించెను.

ఈ గ్రంథమున తానెల్లెడ మృదులములు మధురములునగు తెలుగు సంస్కృత పదములనే యుందటి కర్థమగునట్లు ప్రసాదగుణ మచ్చుపడునట్లు గావించెను. వాని కనుగుణముగ నెన్నియో జాతీయములను ప్రయోగించెను. చక్కని నానుడులను గూర్చెను.

**సి) జాతీయత :**

ముసలి సుద్దులు – ఏబరాసి మొగము – బోరవిఱుచుకొంచు – మేకవన్నెపులి – చేతులు పిసికికొంట – లోలోన నొచ్చుకొంట–తుదకు కాళ్లు చాపుకొంట – పోగాలము – బడవా – తలకుమించినపని – పట్టు చారిన కోడిపెట్ట – వెఱ్ఱిబాగుల తల్లి, గుండెబద్దలై, – కొంపతీసె – తగువులు తంటాలు – తార్మారయ్యె – తబ్బిబ్బాడు – వెలితి తీర్చె – సనిగొట్టు., వీని యిల్గూల,

నోరు తెరపించి యుమిసెదవు,

కప్పా విప్పాసమర్థుఁడు.

కొండ తలక్రిందఁబెట్టుకొని రాల కొఱకు వెదకుట.

పిట్టకొంచెము గూతఘనము,

పుట్టిమునిగిపోయె.
తనకుమాలినధర్మము గలదా.
తానొకటిదలచిన దైవమొకటిచేయును.
సిరిరామోకాలడ్డువారుందురా.
ఎద్దీనె, గొడ్డెపులినిగఱచె.
పుత్రె నవ్వె.
పులినోటఁబట్టిన కండను వీడునా!

## డి) సంస్కృత పాండితి :

ఈతని రచనయందు సమాసజాటిల్యమును గమనింతము. పెద్దన గారి యాశుధారవలె నీతని సంస్కృతసమాసము మృదుపదజాత సమలంకృతమై రెుప్పినది. పంచవటీవర్ణనమిది : "......... సంవృత శీతాంబుకణ విరాజితవాతపోత ధూత కోమల శిఖాతుందిలచూత పల్లవాస్వాదన పరపికగీత, సల్లలితశ్రుతి స్ఫారాళిజాత శింజితమంజులాంచిత సుమకుంజ పుంజాగ్రఖేలత్కపోత ఖంజరీట, మధుస్వరావృతనికటంబు, పాటలవంజులవకులోత్కటంబు, బహుమృగశోభిత పంచవటంబు"

ఇంత దీర్ఘసమాసమందును కఠినపదములు గానరావు. శయ్యాసౌభాగ్యమెంత యోమనోహరముగనున్నది.

## ఇ) అల్లికజిగిబిగి :

ఇక నీతని కవిత యందలి మఱియొక విశేషమల్లిక జిగిబిగి. అది మఱియు ప్రశంసనీయమై కావ్యశోభాహేతువగు చున్నది. ఇందు ముక్తపదగ్రస్తత, సాదృశ్య సంపాదనము నతి సహజములు.

"రామలక్ష్మణులు విశ్వామిత్రునితో సరయూనదినిదాటి, యేటి నెఱియల నేనానులు సైనికులవలెఁ, దమపిల్లలకు వేట మప్పుచుఁ జెర

లాటలాడు బెబ్బులులన్ రాచప్రాపున విఱ్ఱవీగుచుఁ బెద్దలసిరసించు నల్పులవలె మెట్ట కొనలంగంతులిడు చీసడించు కొండమేకలన్, కొండ మేకలుండుగుట్టమిట్టలకెక్కఁ జాలక వానింగని యూటఁబూరుచునంద రాని పొందునకాసించు క్షుద్రజారులవలె నోరావులించుకొని చూచు నక్కలన్, నక్కనైచ్యంబులన్ గొంగజపంబులన్ సిరిగలవాని పంచలం బట్టి వ్రేలాడు యాచకులవలె మఱ్ఱియూడల నూగులాడు మర్కటంబులన్, మర్కట కిశోరన్యాయంబుగ వెలయాండ్ర ప్రాపునం బడు వృద్ధ విటులరీతి దీమంబుల కడ నిలువంబడు మృగంబులన్, మృగంబులవలె దిసమొలతో సంచరించు నడవిమనుష్యులన్, మనుష్యులవలె నవ్వు దుమ్ముగొండుల యొడలిదురదలు వాయ వేడినీళ్లం జిమ్ము గంధకమ్ము తావులన్, దావులలరం బుష్పించిన క్రొమ్మావికొమ్మలఁ జెఱకు గడల వలె సులభంబుగ విఱచి తిను నేనుంగులన్, ఏనుంగు కదుపుంజూచి గర్జిలు సింగములన్, సింగంబులు నోర్చాపఁ బల్గుట్టు పుడకలవలె ముక్కలంజొనిపి కోఱలఁ జిక్కువడి నలుపు మాంసపు ముక్కలనూడ బెఱుకు లావుకులవిబొంచిపట్టు పాముఁలంఖండించు ముంగులనెగదన్ను సాళువం బులదబ్బున బట్టు కఱిమూతి జాగిలములనుసికొల్పు. వేటకాండ్రఁ జప్ప రింప నుంకించు నెలుగుబంట్లఁ దెగగాల్చుమంటలంబరపు కార్చిచ్చుల జల్లార్చు కొండకాలువల నీరసపడనీక కారాకులరాల్చు కదంబవృక్షంబుల నిండిన"

ఇట్లు చక్కని యల్లికతో వచన రచనగావించు నేర్పు మహా కవులకులఁ దక్క యన్యుల కలవికాదనుటలో నాశ్చర్యముండదు గదా!

మిధిరాపుర ప్రాంత వర్ణనమున గౌడదేశాచారము నెంత సరస ముగాఁ జిత్రించెనో గనుఁగొనుఁడు.

"నీటియొద్దున స్నాన మొనర్చి సందెవార్చుచుఁ దర్పణంబులు సేయుచు. నింగిన్ కృష్ణా యని నేలం గోడిపిల్లల నెగురఁదన్ను గ్రద్దల

వలెఁ జేతఁ జిక్కు చేపలం జెంబులో దాచుకొను గౌడ బ్రాహ్మణుల సరస మొగమునకు మాత్రము ముసుగు, మగని మొగము చూడరాని చీఁకటి కూటమి మురికిదుస్తులు, మోటసింగారము, చెలఁగ నెన్నడుబరువు గిండీలఁ జంక నిముడ్చుకొని యేగు బాపనమ్మని చేతులన్మాలికగాఁ గ్రుచ్చఁబడి వారి చూపుల నీడల నందోక లాడించుచు మృత్యువుల దప్పించుకొనఁ బ్రయత్నించు వైద్యుల పోల్కిఁ దప్పని ప్రకృతి న్విదల్చుకొన నుంకించు ముముక్షువుల మాడ్కి, పదార్థ నానాత్వంబు నిరూపించు నైయాయికుల భాతి లగ్నముహూర్తంబు నిర్ణయించు జ్యోతిష్కులవలె స్వతంత్ర పరిపాలనముం గోరు కలియుగ భారతీయుల తీరున, స్వకీయ జనన మరణ స్థితుల న్వర్ణింప దొరకొను కవిలాగున నెట్లు గింజుకొనుచున్నవో ఆమిట్ట మీలు."

ఒక్క చేపలను చిత్రించుట కిన్ని పోకడలఁ జూపిన యా మహాకవి ప్రతిభా విశేషము శ్లాఘాపాత్ర మనుట కావంతయు సందియమేల?

యఫ్) గంభీరత :

ఇక సీతని కవితయందలి లోతుపాతుల నరయుదము.

వసిష్ఠుఁడు దశరథునితో రామునిగూర్చి పలికిన పలుకులను దిలకింపుఁడు.

"ఎవ రెరుంగుదురు రాముని సంగతి నేను కౌశికుఁడు దప్ప" (శ్రీ)రాముని మహిమను నేనును విశ్వామిత్రుఁడును దక్క నన్యులెరుగరు సుమా! అని భావము. ఇచట వాల్మీకి శ్లోకము స్మరింపదగినది.

"అహం వేద్మి మహాత్మానం
రామం దశరథాత్మజమ్ !
వసిష్ఠోఽప్యథవా వేత్తి
యేచాన్యేతపసిస్థితాః"

"ఈదశరథాత్మజుఁడు పరమాత్మ స్వరూపుఁడు ఈ విషయము మా యిరువురకే దెలియును లేదా తపమును గావించు మునిపుంగవు లెఱుగుదురు. ఇతరుల కాత త్త్వ మవగతము కాదు."

(మూలమున నిది విశ్వామిత్రుఁడు చెప్పినట్లుండ దీనిని వసిష్ఠుని నోటఁ బలికించి దీనికి మఱియు న్వన్నె దెచ్చి నాఁడీ మహాకవి.)

ఇది వాల్మీకి యాశయము. "వేదాహమేతం, పురుషం మహా న్తం, ఆదిత్య వర్ణం, తమసః పరస్తాత్" అను వేదమంత్ర సారమే శ్లోక మందుపనిబద్ధము. ఈ యభిప్రాయమును చక్కని పదములతో నిరూ పించి కవితా గాంభీర్యమును జూపినాఁడీ మహాకవి,

, మఱి యొక్క మాటను జూడుఁడు. ఇది యజ్ఞ సందర్భమునఁ జూపఁబడినది.

"స ప్త దశాక్షరంబుల యాజకశ్రేష్ఠులాహుతు లాచరింప"

ఈ వాక్యమున స ప్తదశాక్షరంబుల అనుపదము మిక్కిలి గంభీరముగ నిమడ్చఁబడినది. యజ్ఞములందు ఆహుతులనుగావించు పట్లనొక నియ మముగలదు ఆయాదేవతలనాహ్వానించుటకై ఋత్విక్కులు —

"ఆశ్రావయ - అస్తుశ్రౌషట్ - వౌషట్ - యే యజామహే యజ - అనుమాటల నుచ్చరించి హోమము గావిఁతురు. ఈ పంచ వాక్యములందును పదునేడక్షరములు గలవు మంత్రములను జూపుట క్లిష్టపడక యందలి యక్షరసంఖ్యచే వానిని సూచించు నీతని పోకడ గంభీరతరమనుటలో సందేహము లేదు. "చతుర్భిశ్చ చతుర్భిశ్చ ద్వాభ్యాం పంచ భిరేవచ, హూయతేచ పునర్ద్వాభ్యాం సమే విష్ణుః ప్రసీదతు" అని దీనికిఁ బ్రమాణము.

మఱియొక సన్నివేశమును జూడుఁడు. దశరథుఁడు మునిబాలకుని శబ్దవేధి బాణమునఁగొట్టి యావార్తను వానితలిదండ్రుల కెఱిగించుపట్ల నీ కవి పలికిన పలుకులు.

"అనుచుం బల్కెడు మౌనిదంపతులతో నారాజు నిట్టూర్పు వు
చ్చి నుడుల్ తొట్రిలుచుండ వారియడుగుల్ చేదోయిగీలించి త
ప్పను మన్నింపుడు నేనభాగ్యుడను మీపుత్రుస్ మృగభ్రాంతి నే
మనెదన్ శబ్ద విభేదిబాణమున నాహా నాకు నోరాడదో
ఘనులారా యన నా వధూవరులు శోకంబంది రిట్లెంతయున్"

ఇందు మరణవృత్తాంతమును చెప్పలేక బాధపడుచు రాజు పలికిన మాటలు రసస్ఫోరకము లేగాక సహజ గంభీరము లేకదా!

గౌతమముని దేవరాజునుశపించు ఘట్టమున వ్రాసిన మాటలను వినుడు,

"ఎంతయును విఫలుఁడవు కమ్మింకన్ భ్రష్ట!

ఇందలిశాపమున విఫలుడవు గమ్మికన్ అను పదము అశ్లీలజుగుప్సావిరహితమై యతిమనోజ్ఞముగ గూర్పఁబడినదిగదా! ఇట్లు గంభీరమగు రచనను గావించి యీతఁడు తనకావ్యమునకు వన్నెఁదెచ్చినాఁడు.

జి) తత్త్వదృష్టి :

అధ్యాత్మరామాయణమును ముఖ్యముగాననుసరించి యీగ్రంథమున శ్రీరామతత్త్వమునుగూర్చి చెప్పిన ఘట్టములు పెక్కుతావులం గలవు. వానినన్నింటినిందుఁజూపుటకంటె మచ్చునకొకటి రెండు విషయములను సూచించెదను.

ఈ మహాకవి యద్వైతసిద్ధాంతాభిమాని ఆసిద్ధాంతతత్త్వమును కూలంకషముగ నాకళించినమనీషి. ఈతని మాటలలో నీసత్యము సమగ్రముగ గోచరించును.

వసిష్ఠుఁడు దశరథునకుఁదత్త్వము నెఱిఁగించుపట్ల నాతఁడు చూపిన యుక్తులను గనుఁడు.

''త్రిగుణాత్మకమగు ప్రకృతి సుషుప్తిస్వప్న
జాగ్రదవస్థల జరుగుచుండు,
మనసె స్వభావంబు మఱియద్ధియేమాయ
యద్దాని కాత్మనియామకంబు,
విధివశంబుననది వింతరూపులమాఱు
మిన్నునగాలిచే మేమఘట్టు,
జగమిదికాదు వాస్తవము కలంబోలి
చిత్తభ్రమమున నీచివెన్నెలౌదవు.

ఆత్మయందు విశ్వమధ్యస్తమఖిలంబు
నింగిఁదోచునల్లరంగువలెను
విద్యయబ్బువరకు విను చిదాభాసుఁడౌ
జీవుఁడు భవమందుఁజిక్కువడును.

"బ్రహ్మసత్యం జగన్మిథ్యా
జీవోబ్రహ్మైవ నాపరః''

అను నద్వైతసిద్ధాంతమును పై పద్యమున జక్కఁగ నిరూపించెను. ఇంత కంటె నేమికావలెను శాస్త్రసారమంతయు నిందుఁబొందుపరుపఁబడెను.

''జగమంతయునజ్ఞానికి సత్యముగాఁదోచు,
పగలంతయుగుడ్లగూబకు చీకటికాలేదా,
పలుకు హంఛక్కియని జగము ప్రాజ్ఞుండగువాఁడు,
బళిరమేలుకొన్నయతఁడు స్వప్నమబద్ధంబనఁడా,
ఆకాశమువలె నిత్యంబవిక్రియంబాత్మ,
కైకొను బహురూపంబుల గలగను మదివలె నిజముగ,

''కలదనియు లేదు లేదన్న కలదు జగము
నభమునందునఁ గన్పడు నల్పు మాడ్కి
నిర్గుణుఁడు నిత్యుఁ డాత్ముఁడని శమ ప్రకృతి
నంటఁ డంటియు నీర్తామరాకు వలెను''

ఇట్లు జగదాత్మల యసత్యతా సత్యతలను జక్కగ నిరూపించి తనకుఁగల పరినిష్ఠితమగు నాత్మజ్ఞానమును సూచించినాఁడీ మహాకవి.

ఇట్లే గ్రంథమున నడుగడ్డునకు తత్త్వమును వర్ణించుచునే యుండెను. ఈ విధమున వర్ణించి రామాయణమందలి నిగూఢార్థము నిరూపించినాఁడు. అందుచేతనే శీర్షికలో "స్వాత్మ రాముఁడు, విద్యా సీత నెడసి, క్షుభిత నిజమనస్కుఁడై, మోహశోకాభి పన్నుఁడై, చేత స్స్వామిత్రి మిత్రుఁడై భవగహన గతుఁడై, శాస్త్ర సుగ్రీవ సఖ్యుఁడై, దైన్యవాలిన్గొట్టి, మదన జలధియందు ధైర్యసేతువుంగట్టి, ప్రధ్వస్తా బోధ రక్షః పతియై, యధికృత చిజ్జానకియై, యొప్పుచున్నాఁడు" అని రామాయణమునందలి గూఢార్థమును వివరించి గ్రంథనామమును అన్వర్థము గావించెను.

జి) ఉపదేశము :

కావ్యము బహుళ ప్రయోజనము. అయ్యది కాంతాసమ్మితము. పరనిర్వృతియే గాక యుపదేశము గూడ నందలి ముఖ్యప్రయోజనము లలో నొకటి. సదుపదేశ శూన్యమగు కావ్యము శ్రవణార్హ మనదగదు. "అనుమాట యిందలి యుపదేశసారము. అట్టి యీ కావ్యమున నీ మహాకవి కొన్ని ఘట్టముల గావించిన యుపదేశములు సహృదయ హృదయరంజకములు కర్ణపేయములు. వీనుల విందులు. మచ్చునకొండు రెండు గమనింతము,

ఇది విశ్వామిత్రుఁడు రాజన్యులనుద్దేశించి రామచంద్రునకుఁ గావించిన యుపదేశము.

స్వక్షేత్ర మొరులవశము చేసి వారి చా
టున మీసముల్ దువ్వుకొనుచునుంట.
మూనాళ్ల బ్రతుకుకై మూల మూలలడాగి
సిగ్గరి పొట్ట పోషించుకొంట,

తాలొంగుటయకాక తనవారిగూడ వం
చించి శత్రుల కప్పగించుచుంట,
కూటికై విమతుల గొనియాడుచుందన
శిష్టాచరణము దూషించుచుంట,

క్షత్రియున కెంతమాత్రముగాదుచితము,
వేదశాస్త్రానుసారియై వివిధ జనుల,
నేలవలయు నంతయుధర్మ మెడయఁబోక
పౌరుషజ్ఞాన కీర్తుల బాహుజుండు.

ఇందు తనకుగల చారిత్రికజ్ఞానమును లోకానుభవముతోఁగూర్చి చక్కని యుపదేశమొనర్చినాఁడా మహాకవి.

శూర్పణఖతో రాముఁడాడిన మాటలనుఁ గనుఁడు.

"నిక్కమగు మగవాని కోర్కొలి యొకమాట,
కులమునకుఁజెడి కానికూడు గుడుపగనౌన,
సలుపకూడదుహాని జగతికేమిపనైన"

"అగ్నిహోత్రంబు సాక్ష్యముగఁ బెండ్లాడిన
భార్య నెన్నఁడు నెడఁబాయఁ జనదు
తనుగోరి వలచి మీదన్పడినన్గాని
పరభామినులకు లోబడగరాదు.
తన యాలికన్న నందముగ నున్నప్పటి
కితర కాంతలను మోహింపవలదు,
ప్రాణ గొడ్డం బెద్ది వచ్చిన న్నంతయు
జనముల కపకృతి సల్పఁ దగదు,

ధర్మమార్గ మొకింతయుఁ దప్పలేము,
రఘుకులంబున బుట్టిన రాజులేము"

ఇట్టివెన్నయిన ధర్మములు, నీతులు, నీకావ్యమునఁ గనబడుచుండుటం జేసి యిది యుపదేశాత్మకమనదగును.

అనసూయాదేవి సీతకుపదేశించిన సతీధర్మములను గనుఁడు.

"నగలుగొస వలెనంచు మగని బీడింప రా
    దత్తమామల కెదురాడఁ జనదు,
ధవునికంటె మ్ముందె తాఁ దినఁ గూడదు
    పొరుగిండ్ల కొంటిగాఁ బోవఁదగదు?
పెనిమిటిన్ హాస్యంబు పొనరింపవలదు
    తన కులాచారంబు తప్ప వలదు,
పరు నన్నవావిదప్పన్నిల్వ బోలదు
    పతిసేవ నేమరవలను గాదు;

ముదిసి సంతానవతి యగు ముదితగాని
వెయ్యియేల పతివ్రత యయ్యేనేని
కాంతుఁ డీల్గిన పిదప నొక్క క్షణమైన
మనఁగ జెల్లునె యో జగన్మాత సీత.''

పతిఁదప్ప పరపురుషుల వనితలవలె గను
    నుత్తమ గుణసమేత
అన్నవలెస్టనకన్న కొడుకుగతి నన్యుఁ
    గాంచెడు మధ్యమ,
తిన్నగఁ జలించిన చిత్తము మఱల
    దిద్దుకొనుఁ గులధర్మ మరసి యధమ

బ్రతుకు నిజముగఁ గడ నస్థిరమ్మని తెలిసి
పతియెడ న్గానుపించు లోపముల సైచి
కన్నవారి కత్తింటికి వ్వాన్నెదెచ్చి
మగనితో స్వర్గమేగెడు మగువ మగువ''

రాజ్యముకంటె నటవీరాజ్యమే సుఖదాయకమని రాముఁడు లక్ష్మణునితో ననినమాటను గనుఁడు.

''ధరణి తివాసి వితానము విను నేల
    బడు దీప గోళము లుడులు వెల్గు

చూపెడు దివిటీలు సూర్యచంద్రులు కొండ
గాలి జంత్రము, తలగడలు రాలు;
సౌధరాజము పర్ణశాల. కార్ముకములు
ద్వార పాలురు, మంటి యరుగు గద్దె
కరములు బంటులు, కాళ్లు గుఱ్ఱములు, దుం
పలు బోజనము. చెట్లు పట్టుదుస్తు,

జడలు సొమ్ములు, ధర్మరక్షణము ధనము,
దుర్గము గుహ, యథా లాభ తుష్టి మౌళి
శమము మిత్రము, శుద్ధ సత్వము సచివుఁడు,
యడవి రాజ్యము మఱి మన మధిపతులము."

ఇన్ని విధముల యూహించి రచించుట యతనికే జెల్లినది. ఆతని యూహాలు ఇతరుల కందనివనుట యత్యుక్తి కాదు. కల్పనాచాతుర్యమున కొక పద్యమును గనుఁడు.

సీతారాముల కల్యాణమునకుఁ బూర్వరంగమును ఎట్లలంకరించు చున్నాడో :

"ఆ వధూవరుల కన్యోన్య వార్తలు దెల్ప
జీమ బారులుగ నేగు చెల చాలు,
వలపు జాబుల దమ గళములఁ గట్టంగ
బడి టపాలందించు పావురాలు
ప్రతి హోర కొక వింత రసమైన బొమ్మలం
బై వెల్లడించెడు పడగడాలు
నా దంపతులవలె నవ్వారి చెంగట
బలికెడు నా మని చెలుగురాలు

పంపుకొందు రొండొరులకుపాయనాలు
మానుగానెద్దియో యొక యానవాలు
ధరణిజారాముల యెడద తగులు కోలు
వినుప నాల్కలు కావలె వేనవేలు."

అంత్యాను ప్రాసతోఁ బై పద్యము స్వకల్పనాచాతుర్యము నెంతయిన చాటుచున్నది.

ఐ] పాత్రచిత్రణము :

రామాయణమున వర్ణింపఁబడిన వ్యక్తులు పలువురు కలరు అందు ముఖ్యులు సీతారామ లక్ష్మణ భరతులు, కైకేయీ దశరథులు, వాలి సుగ్రీవ హనుమంతులు, రావణ విభీషణులు.

సీత :

ఈమె యయోనిజ - భూగర్భజాత - శివధనుర్భంగము గావించి శ్రీరామచంద్రుఁ డీమెను బరిణయమాడెను. ఈమెత్రిలోకసుందరి యనుట కంటె నతిలోక సుందరియనుట సమంజసము. పతివ్రతా తిలకము, వన వాస క్లేశమును గణింపక భర్తతోఁ గానల కేగినది. అనసూయాది సతీమ తల్లులచే నారాధింపఁబడినది. రావణాపహృతయయ్యు ధైర్యమును విడువక, కష్టములనుసహించి తిరిగి రామచంద్రుని జేరినది. జగన్మాతగాఁ బ్రసిద్ధిఁగాంచినది. చిచ్ఛక్తి స్వరూపిణిసీత.

శ్రీరాముఁడు :

దశరథుని పెద్దకొడుకు. పాయస భక్షణ మూలమునఁ గౌసల్య యందు జనించినవాఁడు. సకలవిద్యా విశారదుఁడు. పితృభక్తి పరాయణుడు. గురువినీతుఁడు లోకైక వీరుడు. ధర్మసంరక్షణము ధ్యేయముగా గలవాఁడు. ఏకపత్నీవ్రతుఁడు. పరకాంతాపరాఙ్ముఖుఁడు సోదరప్రేమ గలవాఁడు. ఉత్తమమిత్రుఁడు సుఖదుఃఖములను గణింపనివాడు.

ధర్మరక్షణమునకై దుష్టసంహారము గావించినవాఁడు. సంపూర్ణ కాముఁడు. ఆత్మస్వరూపుడని మునులచేఁ గొనియాడబడినవాఁడు శరణాగతరక్షకుఁడు. సత్యసంధుఁడు. ఆడితప్పనివాఁడు. జితేంద్రియుఁడు. ఇంత యేల యీతఁడు పరమాత్మ.

**లక్ష్మణుఁడు :**

సుమిత్రా పుత్రుఁడు. రామభక్తుఁడు. పరాక్రమశాలి. సీతారాములను సేవించినవాడు. దృఢమనస్కుఁడు – కఠినదీక్షాపరుఁడు. కల్పనాచతురుఁడు. సాక్షాదనంతస్వరూపుఁడు.

**భరతుఁడు :**

రామభక్తాగ్రగణ్యుఁడు. ఉదారహృదయుఁడు. రాముని దైవముగనారాధించినవాడు. భగవదంశావతారుఁడు కైకేయీకుమారుఁడు.

**దశరథుఁడు :**

అయోధ్యాధిపతి. సత్యసంధుఁడు. పరాక్రమశాలి. ఆడితప్పని మనీషి. రామునధికముగ ప్రేమించినవాఁడు. రాముని వియోగమును భరింపజాలక తనువును విడిచినవాఁడు

**కైకేయి :**

దశరథుని భార్యలలో మూడవది. దశరథునకు ప్రియురాలు. యుద్ధరంగమున దశరథుని గాచిన వీరవనిత. అస్వాతంత్రస్వభావ. మంథర వచనములచే మోసగింప బడినది. పశ్చాత్తప్తురాలై రామతత్త్వము నెఱింగిన విజ్ఞానవతి. భరతమాత.

**వాలి :**

కిష్కింధాధిపతి. వానరప్రభువు. బలాఢ్యుఁడు సుగ్రీవభార్యాపహారి. రామబాణహతుఁడై రాముని స్తుతించి రామునిలో నైక్యమొందెను.

**సుగ్రీవుడు :**

వాలి సోదరుఁడు. బలములోవాలితో సమానుఁడు. రాజ్యనిష్కాసితుఁడై రామసాహాయ్యమున మరలకిష్కింధకు రాజైనాడు. సీతాన్వేష

ణమున రామునకు సాయపడెను. పెక్కువీరులగు రాక్షసులను చంపెను. రామమైత్రిని శాశ్వతముగా జూరగొన్న వీరుడు.

**హనుమంతుడు :**

వాయుపుత్రుడు. అసాధారణ బలసంపన్నుడు మహామేధావి. పండితుడు. కార్యసంధానకుశలుడు. రామసుగ్రీవులకు మైత్రి నొనరించిన మహనీయుడు. శ్రీరామభక్తాగ్రేసరుడు. శతయోజనపరిమితలవణాబ్ధి నవలీల లంఘించి, సీతను దర్శించి రాక్షసులను జంపి, లంకగాల్చి రావణుని నిందించి, సీతావార్తను రామునకుదెల్పి. యాతని ప్రశంసలనందు కొనిన మేటి. రాముని బరమాత్మగా నెఱిగినజ్ఞాని. మంత్రతంత్రవిశారదుడు ఊహాపోహకుశలుడు. ఈతడపరశివావతారము.

**రావణుడు :**

బ్రహ్మావరదర్పితుడు. రాక్షసరాజు లంకాధిపతి. కామరూపి. సకలలోకములనుజయించినవీరుడు .దురహంకారము గలవాడు. తెలిసీన మూర్ఖుడు. సీతాపహరణ నిమిత్తమున శ్రీరామునిచే మృతి నందిన వాడు.

**విభీషణుడు :**

రావణుని కనిష్ఠసోదరుడు. శ్రీరామ భక్తుడు. అన్నకు నీతి నుపదేశించి పరాభూతుడైనవాడు. రామునాశ్రయించి లంకకు రాజయినవాడు.

ఇట్లు సీతారామాదుల స్వరూపస్వభావములను సరళమార్గమున జిత్రించి కవి కృతార్థుడైనాడు. సీతను చిద్రూపిణిగను, శ్రీరాముని ఆత్మగను వర్ణించి రామతత్త్వమును కొనియాడి యీ మహాకవి గ్రంథ నామమును సార్థకము గావించెను.

మూలరామాయణమున వీరి చరిత్రలందుఁ దనకు అనుచితములని తోఁచిన సన్నివేశములను విడిచి, సరళముగ ఆయా వ్యక్తులను చిత్రించినాఁడు.

వాలిని చాటుగనుండి చంపుట, సీతను కూడనిమాటలతో నొప్పించి యగ్నిలోఁబడునట్లు గావించుట, ముఖ్యముగ రామస్వభావమున గోచరించు లోపములు. లక్ష్మణుని నిందించుట సీతయందున్న లోపము. ఇట్టి యవకాశములకుఁ దావీయక వారిని దానుభావించుకొనినట్లు తీర్చిదిద్దినాఁడీ మహాకవి.

జ] స్ఖాలిత్యములు :

శ్రీరామచంద్రుని వయసును సీతాదేవి వయస్సును నిర్ణయించుట చాలకష్టము. వాల్మీకి రామాయణమునందలి వచనముల నాధారముగఁ జూచిన వివాహమునాటికి రామునివయస్సు పంద్రెండ్రు వత్సరములని, సీతవయస్సు ఆఱుసంవత్సరములని తెలియుచున్నది.

"ఊనషోడశవర్షో మేరామః" అను దశరథవాక్యమునందలి యూన పదమునకు నాల్గవభాగము తగ్గించి యర్థమును జెప్పకొనవలెను. అట్లు కాక యొక సంవత్సరము తగ్గించి పదునేనేండ్లని యర్థముచెప్పిన వాల్మీకి వచనములకు పరస్పరవ్యాఘాతము గలుగును. ఆ రామాయణముననే మారీచుఁడు రావణునకు సీత నపహరింపవలదని బోధించు సందర్భమున రాము పరాక్రమమును వర్ణించుచు, "వయసా ద్వాదశాబ్దకః" అని స్పష్టపరచి యున్నాడు. కాన పైశ్లోకమందలి 'ఊన' పదమునకు నాలుగు వత్సరములు తక్కువయని యర్థముచెప్పక తప్పదు.

మఱియొకస్థలమున సీత రావణునితోఁ దనవృత్తాంతము నెఱింగించు సమయమున, "మమభర్తా మహాతేజావయసా పంచవింశకః— అష్టాదశహివర్షాణి మమజన్మనిగణ్యతే" అని పలికినది. దీనినిబట్టియు

రాముని వయస్సు వివాహసమయమునకు పండ్రెండ్రు వత్సరములనియు సీత వయస్సు భూమినుండి జన్మించినది మొదలుకొని యారువత్సరము లనియు దెలియుచున్నది. ఏమనగా సీతారాములు వివాహానంతరమున పండ్రెండేండ్లు అయోధ్యలో సకలభోగముల ననుభవించిరి. పదుమూడవ వత్సరము ప్రవేశింపగనే దశరథుఁడు పట్టాభిషేకయత్నమును గావించెను. దానికి విఘ్నముగలిగి యరణ్యవాసమునకు రాముఁడు బయలుదేరెను. మొత్తముగ ఇరువదియైదవ వత్సరమున రాముని వనవాసప్రవేశము జరిగినది. దానినిబట్టి చూచిన సీతకు వివాహమునాటికి ఆఱువత్సరము లుండును. అయోధ్యలో పండ్రెండ్రు వత్సరములు గడచినవి కావున వనప్రవేశ సమయమున సీతవయస్సు పదునెనిమిదియగుట సమంజసముగ నున్నది.

> "ఉషిత్వాద్వాదశ సమాఇక్ష్వాకూణాంనివేశనే
> తతఃత్రయోదశే వర్షే రాజా రాజ్యమకల్పయత్"

అను వచనమునుబట్టి పండ్రెండేండ్ల యోధ్యావాసము స్పష్టమగుచున్నది. కావున విశ్వామిత్రయాగ రక్షణసమయమునకు రాముని వయస్సు పండ్రెండనియు, భూగర్భమున దొరికిన యారవవత్సరమున సీత వివాహము జరిగినదికాన ఆమె వయసప్పటి కాఱువత్సరములనియు, స్పష్టమగుచున్నది. 'మమజన్మనిగణ్యతే' యనుమాట దానిని రూఢము చేయుచున్నది.

ఇట్లు పరిశీలించిన రాముఁడు పర్ణశాలలో పంచవటీతీరమును చేరుసరికి వనవాసమున సుమారు పదుమూడు వత్సరములు పూర్తియగుచున్నవి. సుమారొక వత్సరము చిత్రకూటనివాసము. దండకారణ్యమున మునివాటికా సంచారమున పదివత్సరములు గడచినవి. పర్ణశాలలో సుమారు రెండు వత్సరములు దాటినవి. కావున సీతాపహరణ సమయమునకు పదుమూఁడేండ్లు గతించినవి. లంకలో సీత పదిమాసములు నివసించినది. యుద్ధము పరిసమాప్తమగుసరికి సంవత్సరము పూర్తియైనది.

వెంటనే పదునైదవవత్సర ప్రారంభమున భరతుని రాముఁడు కలిసి కొనెను. ఇది సీతారాముల వయోనిర్ణయము

ఇట్లుండగా (శ్రీ)దాసుగారు మఱియొకవిధమున నూహించిరి. "ఊనషోడశవర్ష" అనుచోట నొకవత్సరమును తగ్గించి, విశ్వామిత్రుని వెనువెంట రాముడు వెళ్ళునాఁటికి పదునైదు వత్సరములగునని యూహించిరి. అది యుచితముగనే యున్నదని యంగీకరింతము. "పది యాఱేండ్లయిన నిండనిపాపఁడు" అని యాతని వచనము. పిదప పట్టాభిషేకము రామునకు గావింపదలంచిన దశరథుఁడు రామునితో పలుకు సందర్భమున "ఇప్పుడు నీ వయసు నిర్వదేడేండ్లు" అని స్పష్టముగావించినారు. అయోధ్యావాస వత్సరములు పండ్రెండు కలసిన నిర్వదేడేండ్లు సరిపోయినది. ఇదియును అనుచితమే.

కాని యింత జాగరూకతతో వయోనిర్ణయము గావించిన యీ మహాకవి రాముడు హనుమంతునితో సంభాషించుసమయమున "ఈడు పదునెనిమిదేండ్లు నా యింతి కిపుడు" అని చెప్పియున్నాడు. హనుమంతుని రాముఁడు చేరుసరికి వనవాసమున సుమారు పదుమూఁడేండ్లయినవిగదా అప్పటికి సీత వయస్సు సుమారు ముప్పది దాటియుండును. రాముని వయసు ముప్పదియారు దాటును.

దాసుగారి యూహనుబట్టి చూచిన రాముని వయసు సుమారు నలువది వత్సరములగును. అపుడు సీత వయసు పదునెనిమిదనుటయెట్లు? అయోధ్యావాసము పండ్రెండు, ఆరణ్యావాసము పదుమూఁడు కలిపిన నిరువదియైదు వత్సరములప్పటికే యగుచున్నదికదా! వివాహసమయమున నామె వయస్సేమి? ఇవి పరస్పర విరుద్ధములుగావా? కాన వయో విషయమున (శ్రీ)దాసుగారి నిర్ణయము ముందువెనుకలయినదని యనక తప్పదు.

కాని మహామేధావియగు నాతఁడీ మాత్రమును బరిశీలించి యుండఁడా ? జగన్మాతయు నయోనిసంభూతయునగు నా సీత నిత్య నూత్న యౌవనగావున నష్టాదశవర్ష దేశీయగాభావించి యటు పేర్కొని యుండును.

సంపాతి :

సంపాతి జటాయువులు అనూరుని కుమారులు. అందు సంపాతి యగ్రజుఁడు. జటాయు వనుజుఁడు. వీరిరువురు యౌవనమున సూర్య మండలమును జేరుటకు యత్నించిరి. అందు జటాయువు సూర్యతాప మును సహింపజాలక మూర్ఛితు డగు సమయమున సంపాతి యాతనిని రక్షించుటకై తన పక్షముల నాతని నాచ్ఛాదించి దగ్ధపక్షుఁడై దక్షిణ సముద్రప్రాంత పర్వతముపైఁబడెను. జటాయువు మూర్ఛితుఁడై దండ కారణ్య ప్రాంతమునఁ బడెను. ఇట్లు వారిరువురు దూరస్థులయిరి. ఇట్లు రామాయణమునఁ గలదు. కావున సంపాతి యన్న. జటాయువు తమ్ముఁడు. ఇట్లుండ దాసుగారు తన గ్రంథమున జటాయువే యన్న యని పేర్కొనుటకుఁ గారణము గానరాదు. ఈ విషయమాతని కచుం బితమనుటకును వలనుపడదు. తా రచించిన శీర్షికయందు జటాయు వును తమ్మునిగానే పేర్కొనెను, ఈ తారుమారెందులకయ్యెనో మఱి యెచ్చటనైన యాతనిదృష్టికీ విషయము గోచరించెనో ? సందేహము.

స్వాతంత్ర్యము ;

ప్రాచీనకవు లచ్చ తెనుగు పదములతో నెన్నియో యుద్గ్రంథము లను రచించిరి. వారు సాధారణముగ సంజ్ఞావాచకములనట్లే విడిచిరిగాని వానినిగూడ పరివర్తనము గావింపలేదు. ఏవోయొండు రెండు పదములు మాత్రము "గొంతి, ఆరంజోతి, ద్రోవది, చుప్పనాతి" మున్నగునవి గానవచ్చును. దీనినాధారముగఁగైకొని యీ మహాకవి చాల సంజ్ఞా వాచకములను మార్చెను.

దశరథుఁడు — దసరదుఁడు
కౌసల్య — కౌసల్లె
భరతుఁడు — బరతుఁడు
లక్ష్మణుడు — లచ్చనుఁడు
రాఘవుఁడు — రాగవుఁడు
రంభ — రంబ

ఇట్లు తన స్వాతంత్ర్యమును భాషయందుఁ జూపెను. నారాయణ పదమును నరాయణ పదముగమార్చి "అపిమాషం మషంకుర్యాత్ ఛందోభంగం నకారయేత్" అను నియమమును తన గ్రంథమునఁ బ్రవేశపెట్టెను. నరులకయనముగాన నరాయణుఁడయ్యెను. నరాయణుఁడే నారాయణుఁడయ్యెనుఁ

౩] శీర్షిక :

ఈ గ్రంథమునకు ముందుగ శ్రీదాసుగారు తమ యభిప్రాయములను గ్రంథప్రాశస్త్య ప్రకటన ముఖమున వెల్లడించిరి. అందు వాల్మీకి రామాయణ కర్తృత్వ విషయమున భిన్నాభిప్రాయములను జూపిరి. రామాదుల చరిత్రలందు లోపముల నుగ్గడించిరి. వానినన్నింటిని విమర్శించిచూపుట యకించిత్కరము.

వాల్మీకి రామాయణము ప్రాచీనసంహిత వేదతుల్యము. సంహితలయందలి యభిప్రాయములను గ్రహించుపట్ల దృక్పథముస్థూలము కాదు. సూక్ష్మపరిశీలనము దానికత్యవసరము.

ఆధిభౌతికాధి దైవికాధ్యాత్మిక దృష్టులతో సంహితలను బరిశీలించిన, వానియందలి సత్యస్వరూపము సంపన్నమగును.

శ్రీమద్రామాయణమున రాముఁడొక బలశాలియగు రాజపుత్రుండనియు, పితృవాక్యపరిపాలనార్థ మరణ్యమునకుఁజని రాజధర్మ

మును బాలించుచు దుష్టులను సంహరించుచు, శిష్టులను గాపాడుచు స్వభార్యాపహరణము గావించిన రావణునిజంపి పట్టాభిషిక్తుఁడై ప్రజా రంజకుఁడుగ ప్రసిద్ధినందెననునది యాధిభౌతికదృష్టి. ఈదృష్టిని మన మున నిడుకొని యాదర్శమానవునిగ రాముని జూచినను, వాని యను యాయులను జూచినను వాని ప్రవర్తనలన్నియు ప్రకృతిసహజములని పొడగట్టక తప్పదు.

శ్రీరాముఁడు విష్ణువు నవతారము. సీత సాక్షాత్ లక్ష్మీస్వరూప. ధర్మరక్షణార్థము భూభారవహనార్థ మా దంపతులవతరించి స్వకార్య నిర్వాహణమున చరితార్థులైరనుట యాధిదైవికదృష్టి. ఇట్టిచూపున రామాయణమందలి యమానుషకృత్యములన్నియు సమన్వితమగును.

నిత్యశుద్ధ బుద్ధాఖండబ్రహ్మము రామచంద్రుఁడు. సర్వకార్య సంధాన చాతురీధురీణయగు మూలప్రకృతి చిచ్ఛక్తి సీత యనుచూపు ఆధ్యాత్మికము. ఆ దృష్టిని రామున కేద్దియు నంటదు. సర్వము సీతా కర్తృకమే.

ఈ మూఁడింటిలో మొదటి రెండు చూపులను గలబోసి పరస్పర విరుద్ధము లున్నవనుకొనుట పొరపాటు. ఒకటి ప్రకృతిసహజము. రెండవది ప్రకృత్యతీతము. ఈ రెండును పరస్పరభిన్నములు. తేజస్తిమిర ముల వంటివి. కాన వేఱువేఱు దృష్టులతోఁ బరికించిన శ్రీమద్రామా యణము సర్వాంగసుందరమని యంగీకరింపకతప్పదు. అట్టికావ్యము "నభూతం నభవిష్యతి".

ఇందాధ్యాత్మిక దృష్టిని రామాయణమును బరిశీలించిన తత్త్వ జ్ఞుఁడగు శ్రీదాసుగారికి భౌతికచరిత్రము విరుద్ధముగా గోచరించినది. అందుచేతనే వాల్మీకిరామాయణముకంటె నధ్యాత్మరామాయణమునకుఁ బ్రాధాన్యము నొసంగి రామతత్త్వమును సమగ్రముగ నిరూపించి యథార్థరామాయణము నన్వర్థముగావించి తా దరించి యితరులను దరింపఁజేసెను. కవిసార్వభౌముఁడగు నా మహాత్మునకు నా నమో వాకములు.

# రుక్మిణీ కల్యాణము

కవిరత్న శ్రీ యామిజాల పద్మనాభస్వామి

అదొక హిమవన్నగం అంతర్బహిః పావనతకు. అది బార్హస్పత్య జీవితం అంతర్బహిశ్శాస్త్ర సాంగత్యానికి. అది పుంభావ సారస్వత శిల్పం సకలకళా సమ్మేళనకి. పేరు నారాయణదాసు. ప్రఖ్యాతికి ఆదినారాయణుడన అతిశయోక్తికాదు. ఆ వ్యక్తి కళా, కాంతీ, రూపూ, రేఖా, విలాసం, విభ్రమం రాశిపోసిన దివ్యసుందర విగ్రహుడు. జగన్మోహనగాన విగ్రహుడు. వేదం, శాస్త్రం బాహ్యాభ్యంతర శరీరాలకు శ్రీరామరక్ష కవచంగా, భారతదేశ సౌభాగ్య ఫలంగా, ఆంధ్రజాతి ఐశ్వర్యపీఠంగా అవతరించిన ఆర్ష మహిమోపేతుడు. అనూచానమైన సంప్రదాయానికి ఆయన పెట్టిన పేరు. వేదం అజ్జాడాది భట్టవారికి కులవిద్య. తల్లిదండ్రు లిద్దరూ చదువుకున్నవారు. తల్లితో ప్రత్యేకత రాగవరసగా ఇతిహాసాల లోని పద్యాలు చదువుతూ పురాణ ప్రవచనం చెయ్యడం. సుస్వరంగ వేదం వల్లె చెప్పడం తండ్రి జీవితధ్యేయంలో విశిష్టత. ఏ గూటిపిట్ట ఆ గూటి పలుకు పలుకుతుందనే వాడా మహనీయుడు. ఇంత జ్ఞాపకశక్తి గ్రహణశక్తీ ఎలా అబ్బాయి మీకు అని ఎవరేనా విస్తుపోయి అడిగితే భరద్వాజుని గోత్రంలో పుట్టానురా! యింక మరేమీ అడగకు. అన్నీ కావాలంటే మాకు వస్తాయి. మా గోత్రపురుషుడు ఆదికవిదగ్గర శిష్యుడుగవుంటూ ఉదయకాలంలో అందరు శిష్యులతోపాటు గురువు చెప్తున్న రామాయణం శ్లోకాలన్నీ విని

సాయంకాలానికి తాటాకులమీద వ్రాసి (తు-చ-తప్పక) గురువుగారి ముందు ఉంచేవాడు. అంత వాల్మీకిమహర్షి శిష్యుని గ్రహణధారణ శక్తులకు మురిసి ముగ్ధుడైపోయేవాడు. మిగత శిష్యుల్ని అడిగితే ఎవడికీ నోరు పెగిలేదికాదు. ఉత్తయంబ్రహ్మలు వాళ్లు. బొంగరం లాంటి వాళ్లు. విప్పితేనే తిరుగుతుంది అది. లేకపోతే అలాపడివుంటుంది ఓమూల. భరద్వాజుడివల్ల శ్రీమద్రామాయణం పుస్తకరూపం ధరించింది. ఆమహానీయుడి గోత్రంలో పుట్టినవారందరూ అప్రమేయమైన గ్రహణశక్తీ, ధారణాశక్తీ కలిగివుంటారు. చూడండిరా! మా చెళ్లపిళ్ల వెంకన్న యీ యెనభైయ్యోపడిలో కూడా శతావధానమేమిటి - సహస్రావధానం కూడా చేయడానికి సిద్ధంగా వున్నాడంటే ఏమిటి కారణం? భారద్వాజ సగోత్రుడు అని అనేవాడు. సరే! వేదం యింటివిద్య. తండ్రిశిక్షణతో పట్టువడింది. కవిత దైవదత్తం. మరి మహాభాష్యం ఆరుమాసాలలో స్వయంగా సమన్వయించుకొని నిష్ఠల గంగాధరశాస్త్రివంటి ఆనాటి ఒక వైయాకరణ దిగ్గజాన్ని తారకరచనలో ముగ్ధుణ్ణిచేసి మూడు పల్లిటీలు కొట్టించడం, మహామహోపాధ్యాయ, వైయాకరణ సార్వభౌమ, తాతా సుబ్బారాయశాస్త్రివర్యుల ప్రశంసాంజలి అందుకోవడం – యీ ప్రజ్ఞ ఎలా వచ్చిందని నేనడిగాను. 'అమ్మ చెప్పిందిరా' అన్నాడు. చిన్నపుడు భాగవతం చదవడం, అర్థం చేసుకోవడం అమ్మవల్ల రావచ్చు. మహాభాష్యం విజయనగరనివాసి అయాక చదివేనాటికి కన్నతల్లి లేదే– అమ్మ చెప్పిందంటాడేమిటి యీాయన. అయినా ఆయనకి శాస్త్ర, పరిచయం ఏమిన్నీ లేదని తెలిసిన వాళ్లంటారే - యీాయన మాటకి సమన్వయం ఏమిటా? అని మథనపడ్డాను. ఆయన గ్రంథాలు ఆనాటికి అచ్చైచ్చి ఆయన దగ్గరవున్నవి చదివాను. తీరికగా, ప్రత్యక్షరశోధగా. ఏ గురువుపేరూ ఏ గ్రంథంలోనూ లేదు. 'స్వభావపాండిత్యబలేన' అని తారకకావ్యములో గాబోలు ఒక ప్రయోగం వుంది. 'సహజపాండిత్యుడు' అని అనుకున్నాను. అలా చదవగా చదవగా 'సావిత్రి'లో ఒక పాటలో

ఆయన చెప్పిన 'అమ్మ' చూచాయగ స్ఫురించింది. అది యిక్కడ వుదాహరిస్తాను అవధరించండి.

'ఇంత భక్తవాత్సల్యము నీకీ'

ఎంతయు తగునమ్మా! త్రిపురసుందరి! . . . ఇంత!

ఆ 'అమ్మ' యెవరో తెలిసిందనుకున్నాను. ఒకనాడు నా అభిప్రాయం ఆయనకి తెలుపగా 'చిఱునవ్వు నవ్వి ఒరే తాతా! ఏ అమ్మా కనికరించకపోతే మనకి దిక్కెవరురా! అని

'నన్నుబ్రోవుమా! అమ్మా! శర్వాణీ!

పన్నుగ నాదిక్కెవరే నిన్ను వినా' —

అని పాడాడు పరవశుడై. ఆ పాట అలా పాడుతూ

'అపరిమితానందముతో

లపనజితాబ్జాహిత అద్రిపునిసుతా!

జపాసుమాభపాణి! భైరవి! - నన్నుబ్రోవుమా!

అని ఆ పెద్దకుర్చీలోంచి లేచి అడుగులు వేస్తూ సజల జలధర గర్జానుకారియైన కంఠంతో పాడడం నాకిప్పటికీ కళ్లకి కట్టినట్టుంది.

అమ్మ వాత్సల్యామృతరసాన్ని తృప్తిగా త్రావి తుష్టిగా, పుష్టిగా పెరిగిన చదువుల బొజ్జ నారాయణదాసు. ప్రకృతం వారి రుక్మిణీకల్యాణంలోని సాహిత్యవైభవం గురించి రెండు మాటలు :

రుక్మిణీదేవి బాల్యం వర్ణితమైనపాట నాకు మహాయిష్టం. కొంచెం ఉదాహరిస్తాను.

రతనపుమేడల రాగిలు బంగా

రతిగిన తూగుటుయ్యాలలో నూగు

మైనతోడ మ్రోగునెమలితో మురిపెముల నేగు

నంచలకు చతురత నడకలజూపు సమరతో ముచ్చట మదిజూపు.

ఈ చరణానికి పైన చిన్నారి రుక్మిణి బొమ్మల పెండ్లిండ్లు చెయ్యడం, వెలదులతో వియ్యమందడం, గుజ్జనగూళ్ళు వండించడం, తనతో ఆడే చెలులకు పెట్టడం... వర్ణన ఉన్నది.

ఇది (శ్రీ) రుక్మిణీదేవి బాల్యదశను చెప్తూంది. ఈ వర్ణన ముద్దరాలైన పిల్ల కాస్త ముద్దుగా పెరుగుతున్నది. ఇరుగు పొరుగు పిల్లలలో ఇంపుగా సొంపుగ లక్కపిడతలూ, బొమ్మలూ వంటసామానులూ సమకూర్చుకుని ఆడడం, బొమ్మల పెళ్ళిచేయడం, వంట, వడ్డనా వగైరా అయ్యాక తాను పెళ్ళి పెద్దలాగా వారిమధ్య తిరుగుతూ ఏవో పాటలు పాడడం, వేళాకోళాలు... వగైరా... నడిపించడం లోకసహజమైన బాలికాచేష్ట. ఇది సర్వులకూ అనుభూత విషయమే. దీనిని దాసుగారు రుక్మిణి బాల్యములో జతపరచి ఆ చిన్నారి రుక్మిణిని చదివితే పాఠకునికీ, వింటే శ్రోతకీ కళ్ళకి బొమ్మకట్టినట్టు చిత్రించారు. కనక ఈ పాట వినగానే సభలో ఉన్నవారంతా బొమ్మల్లాగా ఆయనను చూస్తూ కూర్చునేవారు.

రత్నాలు పొదిగిన సువర్ణహర్మ్యంలో కనకడోలికలో ఊగేది రుక్మిణి. ఆయన చెప్పక పోయినా 'రతనపుమేడల' అనే ప్రయోగంవల్ల మేడకూడా బంగరుపూత పూసినదని ధ్వని. కనక నేను "సువర్ణహర్మ్యం" అన్నాను. ధ్వని ప్రధానంగా ఉన్న రచనని వివరించుకోడం పాఠకునిపని. మేడ బంగారు ఇటికలతో కట్టుతారా ? అని అడిగేవారుంటారు. ఏ యిటికలతో కట్టినా రుక్మిణి తండ్రి ధనవంతుడు కనక సామాన్యుల్లాగా గోడలకి సున్నపు పూత కాక బంగారుపూత పూయించాడని చెప్పడానికి ఇప్పుడు కొందరు ధనవంతుల మేడల సింగారం చూస్తే ఆధారం దొరుకుతుంది. ఇది యిలా వుంచుదాము.

పదప్రయోగములో విశిష్టత చూడండి. '(శ్రీ)రుక్మిణీ బాల్యము దశ చెప్పెద సాకల్యము వినుము' – అనే పల్లవిలో '(శ్రీ)రుక్మిణీబాల్యము

దశ, సాకల్యము - అనే మూడు పదాలూ తప్ప పాట చివరంటా తెలుగు పలుకుబడితోనే నడిచింది. (చతురత - అనేది ప్రాసకోసం వేసినా అంచలకు తననడకల చతురత చూపడం ప్రధానవిషయస్ఫోరకంగా ఆ 'చతురత' - అంత చతురతగా ప్రయోగించారు. అక్కడ 'చతురత' - వేసితీరాలి. అది ఆజన్మసిద్ధకవితా విలాసుడు కనక ఆయన ప్రయోగచతురతకి సార్థకంగా అక్కడ చోటు చేసుకున్నది)

రతనపు - అంచ - అనేపదాలు రెండు తద్భవాలున్నాయి. మిగత అంతా తెలుగు తీయదనమే ,. ...

స్వభావాన్నీ, వయస్సునీ అర్థం చేసుకుని రచన చెయ్యవలసి వుంటుందని యీలాటి సహజకవుల కృతులు పాఠం చెప్తాయి. చిన్నారి రుక్మిణిని వర్ణించడములో ఆయన పాత్రియాన్నీ, ప్రాయానికి తగిన చేష్టలనూ వర్ణిస్తూ డబడబలాడే పదాల నుపయోగించక కుసుమ సుకుమారము లైన పదాలతో జాను తెనుగు తీయదనాన్ని వడకట్టి ఒలికించారు.

ఒకరితో ఒకరు ఉయ్యాలలో కూర్చుని పంతాలాడుతూ ఊగుతారు. అంతలో అలిగి ఉయ్యాల బల్లలుదిగి పారిపోతారు. అంతలోనే కలుసుకుని ముచ్చటగా చెట్టాపట్టాలు వేసుకుని ముద్దుగా నడుస్తూ పెరటిలోకి వెళ్ళి అక్కడ ఉన్న మొక్కలనూ తీగలను పరామర్శిస్తారు. చిన్నారి రుక్మిణిచే దాసుగారు ఆ చేష్టలు చేయిస్తున్నారు ఈ వర్ణనలో. ఆలాగే ఆమె మహారాజ పుత్రి కనక పెంపుడు నెమళ్లతో ఆడడం, హంసలతో ఆడుకోడం అలవాటు.

మైనతో మ్రోగుతూందట. మాటకిమాటా చెప్పడం మైన స్వభావం. మైనతో మాటాడి మాటాడించడం కొంతసేపు. తరువాత నెమలితో మురెపెము లొలుకుతూ ఆట లాడడం. ఆపై అంచలకి నడకలు చూపుతూంది. హంసనడకలో ఒకవిధమైన అందం, దర్జా ఉంటాయి. హంసలాగా నడవడం కాదు రుక్మిణి. తానే హంసకి నడల చాతుర్యం చూపు

తూంది. ఇదొక విధమైన అలంకారం. ఏ అలంకారం అనండి. ఆయన చేతిలో ప్రతిదీ అలంకారమే అయింది.

తరువాత గీతపద్యాలలో చెప్పారు.

'రుక్మిణీకన్య సిరికి మాఱు మహిలోన
మాన్యసహజ హరిధ్యాన ధన్య–' అని

'రుక్మిణీ కృష్ణజన్మని–వేద వేద్యుడైన పరమపురుషుడు శ్రీరాముడుగా అవతరించినప్పుడు ఆదిలక్ష్మి సీతగా పుడమిపట్టియై పుడమికి విచ్చేసింది. కృష్ణావతారంలో ఆతల్లి రుక్మిణిగా అవతరించింది. కనక 'సిరికి మాఱు'–అన్నారు దాసుగారు. ఆ కారణమువల్లనే ఆమె 'సహజ హరిధ్యాన ధన్య'–

ఒక ప్రణాళికా, సందర్భశుద్ధీ, వాక్శుద్ధీ లేని రచనికి ఎవరూ జీవం పొయ్యాలేరు. పై మూడు గుణాలూ ఉన్న రచనకి ఎవరూ జీవం పొయ్యానక్కరలేదు. దాసుగారి రచనలన్నీ ఎవరూ జీవం పొయ్యానక్కరలేనివి. అంతేకాదు, అవి పాఠకుని 'సత్తాను' పట్టి ఊపుతాయికూడా...

'ఋషీణాం పునరాద్యానాం
వాచమర్థోను ధావతి'–

అనే భవభూతి వాక్కులీ నిర్ణయానికి, దాసుగారి కృతి ఉదాహరణ కావ్యం...

ఆయన అనకపోయినా నాకు తోచిన ఊహ రుక్మిణీకళ్యాణకృతిని ఆయన కన్న కుమార్తెలాగా చూచుకున్నాడు. అన్ని హంగులూ శాస్త్రోక్తంగా ఆమెకు సంతరించాడు. రుక్మిణి పుట్టి గుజ్జనగూళ్ళు ఆడడం మొదలులో అత్తవారింటికి కాపురానికి వెళ్ళేదాకా ఆమె కథను అంత అందంగా, సలక్షణంగా రూపుదిద్దిన రచయిత యింకొకడు వాఙ్మయ రంగంలో నాకు కనిపించలేదు. కనకనే రుక్మిణి ఆయన పెంపకంలో జగము ముద్దుకన్నె– అయింది.

తల్లిదండ్రులయొద్ద అడకువ, అన్నలచేరిక మన్నన, పిన్న పెద్దల యెడ వినయము, అనయము సత్యమాడుట, మంచి జాడజనుట, వేల్పులపై భక్తి, పెద్దలననురక్తి మర్యాద, మాటతేట, పేద సాదలనెల్ల ప్రియమున బ్రోచుట, హరిని పతిగ గోరి యాసపడుట – ఈ గుణాలన్నీ మానవలోకములో రుక్మిణి రూపముతో లక్ష్మీదేవికి ఉన్నాయనీ, కన్యకలు ఈ గుణాలతో పెరగాలనీ దాసుగారి హృదయం. ఇన్నీ ఉండి కొందరు అమ్మాయిలు కురూపలై ఉంటారు. అందచందాలు ఉండవు. రుక్మిణి అలాంటిది కాదు. 'సొగసునకున్వన్నె మరుకటారి ... కనకనే ఆ అమ్మాయి 'జగము ముద్దుకన్నె'– అని మరొకమారు చెప్పవలసివచ్చింది.

ఒక మంచి ముసలి బ్రాహ్మణుణ్ణి రాయబారిగా కృష్ణునికడకు పంపింది రుక్మిణి. ఆ భూసురుడుకూడా హరిధ్యాన భాసురుడు. కనకనే సందేశ హారిత్వం జతగూడింది. తన జన్మకి ఆపని సార్థకమనుకున్నాడు. ఔనుమరి. ఆ భాగ్యం అందరికీ పట్టుతుందా? సముద్రానికి అవతల లంకలోవున్న సీతమ్మను చూచివచ్చి రామునకు సీతాక్షేమవార్త చెప్పినవాడు ఆంజనేయుడొక్కడే. ఆ జగజ్జననీ జనకులను ఆలా కలిపిన భాగ్యం అంగదాదులెందరో వున్నా ఏ ఒక్కరికీ కలగలేదు. ఆలాగే రుక్మిణీ సందేశాన్ని శ్రీకృష్ణునకు చెప్పి ఆ యిరువురనూ దంపతులను చేసిన అదృష్టం ఆ భూసురునకే పట్టింది.

కాని ద్వారకకి వెళ్ళుతూన్న ఆ ముసలి బ్రాహ్మడు పడిన అవస్థకి మనకి జాలికలుగుతుంది. కారణం. ఏమంటారా? దారిలో ఆ ముసలి బాపడు వెళ్ళిన అడవి వర్ణన... అయితే ఆ అడవి వర్ణనలో పట్టుమని పది తత్సమాలుకూడా లేవు. అంతా తెనుగు. అది తెనుగు అడవి. ముక్తపదగ్రస్తములో ఒకే వాక్యంలా వుండడం అలా ఉంచండి. స్వాభావోక్తితో చదువరుల ఎద నాకట్టుకుంటుంది. ఆ అచ్చ తెనుగు పలుకుబడిపై దాసుగారికి గల పలుకుబడి నిరవధికం అని ముక్కు వ్రేలితో తల లూపవలసిందే!

ఆయన పల్లెటూరిలో పుట్టి పెరగడం ఒక విధంగా ఆ అడవినీ, అందందు పల్లెల, ప్రజల అనుభవాలనూ, ఆచారములనూ, అలవాట్లను వర్ణించడానికి ఆధారం అయింది. స్థాలీపులాకంగా ఉదాహరిస్తాను.

'నడు ప్రొద్దు వేడియెండ న్మేల్పసిడి కరుగు నల్లెల్ల ప్రాయపుటాడలం జెమ్మటలు వారం దలచుట్టు దిట్ట చూడ్కులం దమ కష్టము ఫలింప నెదిగి వెన్నువంచిన చేలనడుమ నిబ్బరపు మనసునం దలనిడు చల్లదొంతి చెక్కుచెదరనీయక డించి మగల కలవొద్దిడు కాపుచేడెలను' చూస్తూ వెళ్ళుతూన్నాడా భూసురుడు.

ఎండ లక్ష్యపెట్టక పొలాలలో పనిపాట్లుచేస్తూ బంగారుకరిగినట్టు ఒళ్ళంత చెమటపట్టి తమకష్టం ఫలిస్తూందని వెన్నువంచిన పంటచేలని సంతోషంగ చూస్తూన్న కర్షకులు తలకి చుట్టూ గుడ్డలు చుట్టుకున్నారు. వాళ్ళకి ఆహారపదార్థాలు వంటపాత్రలలోసర్ది వరసగ వాటెని తలల మీాదవుంచి పట్టుకొని వెళ్ళారు వారి భార్యలు. ఆ భోజనం 'అలవొద్దు' అని చెప్పారు దాసుగారు. ఇప్పుడు నాగరకులకు నూటికి తొంబది తొమ్మిది మందికి 'అలవొద్దు' అంటే తెలియదు. వేళతప్పిచేసే భోజనానికి 'అలవొద్దు' అని గ్రామసీమల సాంకేతికపదం.

జాత్యాదుల క్రియలను వర్ణించడం స్వభావోక్తి. ఇదీ స్వభావోక్తి అంటే.

ఊళ్లూ, పల్లెలూ, వలసలూ దాటుతూ వెళ్తున్నాడా ముసలి బాపడు. వలసలంటే చాలామందికి తెలియదు. పదికొంపలైన ఉండని జానపదం వలస. మావైపు ఉన్నాయవి. పారన్నవలస, మోసూరు వలస... ఇలాటివి. ఊరు జనాభా పిల్లా, పిచిక అంతాకలిపి పాతికమంది ఉండరు,

'దమ్ముపట్టిన మళ్ళకు నొల్లపట్టి యొడలెల్ల బురద కానవచ్చు పాలికాపులు కనిపించారా బాపనికి. దమ్ముపట్టడం, నొల్లపట్టడం— ఏమి

టయ్యా అంటే యిప్పుడు అయిదారేళ్ళు వ్యవసాయ కళాశాలలో అతి తెలివిగ చదివి పెద్ద పెద్ద డిగ్రీలు పొందివచ్చినవారు చుక్కలవంక చూస్తారు.

ఉడవబోయే పొలానికి తొలినాడు నిండుగా నీరుకట్టి మర్నాడు దాని విస్తీర్ణాన్నిబట్టి పది పదునేను పశువుల జతల నాగళ్ళతో ఆ మడిని జారుబురదగ అయిపోయేట్టు దున్నడం "దమ్ముపట్టడం"—

ఆ తర్వాత ఒక అడుగువెత్తూ, సుమారు మూడడుగుల నిడివి ఉన్న బల్లచెక్కకట్టి పశువులచేతలాగిస్తూ ఆ దున్నిన మడిని చదును చెయ్యడం నొల్లపట్టడం. ఆ బల్లకే నొల్లబల అనిపేరు. ఇవి ఈ కృషికి సంబంధించిన సాంకేతికాలు. ఆయన కర్షకవృత్తిలో అనుభవంకల ఆసామీ. మాకూ సొంత 'సేరీ' వుండేది. కనక నేనీమాత్రం చెప్ప గలిగాను. ఈ సాంకేతికాలు మా రైతులవల్ల తెలుసుకున్నాను. ఈలాటివి పాణినీయ వ్యాకరణంలోనూ, కాళిదాసకావ్యాల్లోనూ, షేక్స్పియర్ నాటకాల్లోనూరావు. ఆయా వృత్తులనుబట్టి ఆయావ్యక్తులవల్ల తెలుసుకోవలసేవి.

ఈ వర్ణనలోనే 'అప్పసం' అని ఒక పదం ప్రయోగించాడాయన.

'అప్పసంబులం ద్రుళ్ళు మిట్టగిడసలం బొంచి పట్టులకుముకిపిట్టలు' నేటి నాగరకమ్మన్యులకు 'అప్పసము, మిట్టగిడసలు'- అనే పదాలు గగ నకుసుమవతుగా ఉంటాయి. ఒక మడిలోంచి యింకోమడికి నీరు వెళ్ళ డానికి చిన్న తెగగొట్టిన మార్గం ఉంటుంది. కావలసినంత నీరువదలి తరు వాత ఇంత మంటిముద్ద ఆ త్రోవకి గట్టిగావేసి బిగిస్తాడు. దానికే 'అప్ప సం' అని సంజ్ఞ.

నీటితో నిండుగాఉన్న ఆ మడిలోంచి అప్పసంద్వారా నీరుపోతూ న్నపుడు మడిలో వుండే పొట్టి చేపలు అక్కడికి వచ్చి తుప్పున పైకి

త్రుళ్ళుతాయి. మరి పెరగక ఆకారానికి చిన్నగాఉండి త్రుళ్లిపడే ఆ చేపలనే మిట్టగిడసలంటారు కర్షకులు.

మడిగట్ల పై వాలి ఆ అప్పసం దగ్గర ఎగిరే ఆ చేపల్ని పట్టుకుం టాయి పొడుగైన ముక్కులుగల చిన్న పిట్టలు. వాటెని లకుముకిపిట్ట లంటారు. వాటి ముక్కు అతి సూదిగా ఉంటుంది. చెట్ల బెరడును అవి పొడుస్తుంటే గొడ్డలితో కొట్టుతూన్నట్టు చప్పుడు వినిపిస్తుంది.

ఇదంతా గ్రామవాతావరణంబులో పుట్టి పెరిగినవారికి గాని తెలియదు. ఆ బ్రాహ్మడు ఏవో ఊళ్లు అవీ చూస్తూ వెళ్లాడు ద్వారకకి అని ఒక వాక్యములో చెప్పడానికి దాసుగారే కావాలా? ఎవరైనా చెప్పవచ్చు. ఏవో ఒకటి రెండు మచ్చుకిచ్చాను. ఆ వచనం అంతా చదివి అర్థం చేసుకునే బుద్ధిమంతుడు దాసుగారి సహజపాండిత్యబలాన్ని అన్ని మార్గాలలోనూ తెలిసి ఆనందించగనడు. అప్పుడే సాహిత్యం ఆలోచనామృతం అనే ఆర్యోక్తికి సార్థకత !

ఆలాగా ముసలిబాపడు పయనించి ద్వారకదగ్గరగా వెళ్లాడు. ఇక్కడ ఆటకీ, పాటకీ సందర్భం ఏమీలేదు. కనక విప్రుని ప్రయాణం ఎలా చెప్పాలని అనుకొని త్రోవను వర్ణించడం ఆయన కథాకథన పద్ధతిలోగల చాతుర్యం, అఖండసామర్థ్యం అనండి. అది అంతే. ఇంకొక తరగతికి చెందిన కవి అయితే ఆర్భాటంగా నాలుగు పద్యాలు రాసి ఆవిధంగా దుర్గమమార్గంబున నవ్విప్రుండు పయనించి 'శ్రీలకా కరంబగు ద్వారకాపురంబుజేరి' - అని ఓనిట్టూర్పు విడుస్తాడు. అది అంతే. ప్రకృతివర్ణనతో ప్రతిభాశక్తిని జోడించి కథ చెప్పేనేర్పు అందరికీ వుంటే వాఙ్మయమంతా మొదటతరగతి పీఠం మీాద ఉండ వలసిందే ఔను........

కృష్ణదర్శనం సామాన్యుల కలవడదు అనే అభిప్రాయాన్ని దాసుగారు చెప్పినవిధం అనితరసాధ్యం.

కృష్ణుణ్ణి చూడగానే రాయబారిగా వెళ్లిన బ్రాహ్మణుడు కృష్ణునితో

'నిన్నుజూచు నిగమములను
నే జదివిన వాడనయ్యా !
పన్నుగ విదర్భాదేశవాసుడ నీదాసుడ' –

అని అన్నాడు. కృష్ణుడు వేదవేద్యుడనే అంశం వేదం అధ్యయనంచేసిన వానికే తెలుస్తుంది. ఆ వేదాధ్యయనపరుడు బాహ్యాభ్యంతరశరీర శుద్ధి కలవాడవుతాడు. అలాటి శుచిత్వం కలవాడు తన కిష్టుడని గీతాచార్యుని వాక్కు. ఇంకా ఆమాత్రం అర్హత చాలదేమో అని అనుకున్నాడేమో. 'నీదాసుడ' – అన్నాడు పాపం. 'దాసోస్మి తవ మాధవ' – అనేసరికి మాధవుడు రెండు చేతులతోనూ ఆదుకుంటాడు. గజేంద్రుని కథ చదివి అర్థం చేసుకుంటే యీ దాసత్వ పదప్రయోగసార్థకత అర్థమవుతుంది.

బ్రాహ్మణులను అంటే శ్రుతివిహితకర్మానుష్ఠానపరులను నేను పూజిస్తానన్నాడు కృష్ణుడు భాగవతంలో. అందుకే భాగవతం 'శ్రీమద్భాగవతం' అయింది. బ్రాహ్మణుని మాటలు వినగానే

'పదములొత్తెద వింతవార్తలానతీవె
పెద్దవారిమాటల పిన్నల బోధించు' –

అన్నాడు కృష్ణుడు. పాదాలొత్తుతానన్నాడు. దానికి ప్రతిఫలంకోరాడు. ఏమిటది? 'వింతవార్త' కావాలట! అదికూడా ఎంతవినయ గర్భితంగా ఉందో అవధరించండి.

'ఆనతీవె' – అంటాడు,

సమయానుసారంగ గుణత్రయప్రభావాన్ని ప్రదర్శించే వ్యక్తులు చాలా అరుదుగా ఉంటారు. నూటికొకరూ, కోటికొకరున్నూ. అలాటి వారిలోనే దైవశక్తి ఉందని తెలుసుకోవాలి. నిగమవేత్తయైన విప్రుని దగ్గరఅవతారపురుషుడైన కృష్ణుడు సాత్త్వికమూర్తియై ప్రసంగించడంలో

అర్థమిది. ఇదే ఏ శిశుపాలుడివంటి తామసమూర్తులో ఐతే 'ఏం ఎవరు నువ్వు ఏమివచ్చావు? - అని బెడిదంగ అడిదం జళిపించినట్టంటాడు.

'మీకు కింకరులము మేము
ఆనతీయండి గురుదేవా'.

ఏమి చెయ్యాలి' - అని శ్రీరాముడు విశ్వామిత్రునితో అన్నట్టు శ్రీమద్రామాయణంలో ఉంది. శ్లోకతాత్పర్యం ఇచ్చాననుకోండి. మరి రాముడంతవాడు నేను మహారాజు కొడుకును అనే మూర్ఖభావన కలవాడైతే అంత వినయంగా అంటాడా? అలాటి రాముని దృష్టిలో ఆ గడ్డాల విశ్వామిత్రుడూ తలమాసినవాడే ... అయితే కథలో వచ్చే పాత్రలను పోషించే ప్రతిభావ్యుత్పత్తులు కృతికర్తకి ఉండాలి. అలా ఉన్నవారే సర్వలక్షణ లక్షితంగా కావ్యం వ్రాసి జీవలోకానికి హితకరులౌతారు. 'అంతా కవులము కామా!' అనే చిరాలోకి అక్షరక్రమంలో చేరినవారు రాసే కావ్యాలు కావ్యాలవుతాయి. వాటిబ్రతుకు మూన్నాళ్ల ముచ్చటగా భరతవాక్యం చెప్పేస్తుంది.

దాసుగారు నిగమవేత్త! ఇది చాలామందికి తెలియదు. కొన్ని ఋక్కులు 'మొక్కుబడి' - అనే పేరుతో తెలుగు వెలుగులోకి తెచ్చారు. వానితో కొన్నిటిని గూర్చి ఒకప్పుడు 'భారతి'లో పరిచయ వ్యాసం వ్రాశాను. ఆయన అధ్యక్షులుగా పనిచేసిన శ్రీ విజయరామ గానకళాశాలలో వేదఋక్కులను వీణావాదనంతో విద్యార్థులచే గానం చేయించేవారు. అది దైనందిన కార్యకలాపానికి నాంది.

రుక్మిణీ సందేశాన్ని శ్రీకృష్ణునకు విన్నవించిన ముసలిబ్రాహ్మణుని గొంతులో నారాయణదాసుగారి కంఠం వినిపిస్తుంది.

'దేవ దేవ ! నీ సేవచేయ నడ
తెంచునయా లక్ష్మి - రుక్మిణి -
నీవు పెండ్లికొడుకు వౌదువిప్పుడు
నీల నీరదశ్యామ ! శ్రీకృష్ణ'' దేవ !

రుక్మిణి 'లక్ష్మికి మాయరూపు' అన్నది మానవసమాజానికి వారం వారం బోధించడం, కృష్ణుడు సామాన్య యాదవుడుకాడు పరమ పురుషుడని ప్రవచించడం ఆయన కర్తవ్యంగా భావించడం మనవంతు.

'ఎంతపుణ్యమని మనవిసేతు నీ
యంతవానిగంటి' –

అహంకారాలకు లొంగిపోయి కారాలూ మిరియాలూ నూరే మూర్ఖులు అవివేకులు శ్రీకృష్ణుణ్ణి గ్రహించలేరు. తాను నిగమవేత్తకనక 'నీయంత వానిగంటి' – అని చెప్పుకోగలిగాడు.

'ఆదిమధ్యాంతరహితా! అని సంబోధించడంలో అచ్చంగా దాసుగారి పిలుపే వినిపిస్తుంది.

"ముజ్జగంబులను మోయుచున్న చిరు
బొజ్జ గలుగు తండ్రి !—"

చిరుబొజ్జగల కృష్ణుడు జీవలోకానికి తండ్రి. మూడులోకాలూ ఆ బొజ్జలో ఉన్నాయి. తామసాంధులు వాటిని చూడలేరు. 'యోవేదా దౌ పరః ప్రోక్తః' – అనే శ్రుతిసూక్తికి అర్థం తెలిసినవాడే కృష్ణుని చిరుబొజ్జలో ఉన్న మూడు లోకాలనూ చూడగలుగుతాడు. ఆగమాలూ, ఆగమాంతాలూ, ఆగమాంగాలూ వాడి వడబోసిన చిరుబొజ్జ వాడు నారాయణదాసుగారు. కనకనే పై ఉదాహృతవాక్యం ఆయన నోటవచ్చింది.

సందేశహారి రుక్మిణిని వర్ణిస్తూ

"కలికికి మేన్ పసిడిమేన్
క్రొక్కారు మించురా !—" అన్నాడు.

రామాయణంలో ఆదికవి సీతమ్మను వర్ణిస్తూ 'కనకాంగి' నవ హేమాంగి – ఇలా జాయతా పసిడి వన్నెగల మైచాయగలది అని చెప్పాడు. ఆమె లక్ష్మికి మారటపుట్టువు. ఇక్కడ రుక్మిణీకూడ ఆ తల్లి కదా! ఆ అర్థాన్ని సూచిస్తూ

'మేల్పసిడిమేన్' క్రొక్కారుమించురా' అన్నారు దాసుగారు. దీనికి పురుషసూక్తం ఆధారం.

'నీలతోయదమధ్యస్థా
విద్యుల్లేఖేవ భాస్వరా' -

మెరుపుతీగ బంగారు తీగలాగా ఉంటుంది. ఈ పాదాలన్నీ దాసుగారు ఆంధ్రీకరించారన్నా వెలితి లేదు. ఈ శ్రీదేవిచేతనే చివర

'భళిర పురుషసూక్తాను సారముగ
ప్రత్యక్షమైతి విష్ణుడో దేవ' - అని చెప్పించారు.

ఏది తెలిసినా తెలిసినదానిని సందర్భశుద్ధిగా చెప్పడం ఒకటి కవికి ఉండవలసే ముఖ్య లక్షణాలలో ఒకటి. అది దాసుగారికి ఉన్నదని చెప్పడం గొప్పకాదు. మనం తెలుసుకోగలిగామని ఒప్పుకొని సంతోషించాలి.

రుక్మిణీ సందేశం విన్నాడు కృష్ణుడు. ధారుణీసురుణ్ణి వెంటబెట్టుకొని స్వయంవరానికి బయలుదేరాడు.

ఈ కథంతా మహాభాగవతంలోనిదే. అందరికి తెలిసినదేగదా! కొన్నిచోట్లమాత్రం దాసుగారు చేసినకల్పన అనల్పభావ సంభరితము, ఔచిత్యపోషకము అయివున్నది. వృద్ధబ్రాహ్మణుడు ఉత్తరం పట్టుకుని కృష్ణుని దగ్గరకు వెళ్ళాడు. తిరిగివచ్చేవరకు పెండ్లికూతురు ఏమిచేస్తున్నట్టు? కథానాయిక రుక్మిణి. ఊరక మీనమేషాలు లెక్కిస్తూ కూర్చుంటుందా? అలా కూర్చోడానికి మనస్సు అంత తీరుబాటుగ వున్నదా? అన్న చలపాది. శిశుపాలుడికి తప్ప కృష్ణునికి నా చెల్లెలినిచ్చి పెండ్లి చేసేది లేదన్నాడు. అలా చెయ్యడానికి వీల్లేదన్నాడు. తల్లిదండ్రులు లా గండమూర్ఖుణ్ణి కాదనలేకపోయారు. తన కా కృష్ణుడు తప్ప శిశుపాలుడి పేరంటేనే గిట్టదాయె. ఇక తనకు గతియేమి? ఆ ముద్దరాలి మనస్సును నారాయణదాసు వ్యక్తం చేసినవిధం చూడండి;—

"అంత నటన్ దురంత శశిహాసము
వెన్నెలగాయ రుక్మిణీ
కాంత వనాంతమందు తనుగానని
చేడెల పిల్వెరుంగ కా
వంతయు ధైర్యమూనక యహోయని
కృష్ణుని చెల్వు నందుఁ దా
నెంతయు లీనమౌచు వివరింపగ
శక్యముకాని వేదనన్-"

చంద్రుని నవ్వు వెన్నెల. ఎల్లవారికీ చల్లదనమిచ్చేదే విరహులకు తప్ప. పూదోటలోకి వెళ్ళిపోయింది. రుక్మిణి ఎక్కడా కనిపించలేదని చెలులు గాభరాపడి పిలుస్తూన్న ఆ పిలుపు ముద్దరాలి చెవిదాక లేదు. కారణం? ఆ ముద్దరాలు కృషుని చెలువునందు లీనమైపోయింది. ఇక బాహ్యాస్మృతి ఎక్కడిదీ ? తాదాత్మ్యావస్థఅది. ఆది జగమెరుగని ధ్యానస్థితి... అది క్రమంగ ఉన్మాదావస్థకి దారితీసింది.

'వెర్రియై తిరుగు; పూల కొలనులో
వింతసాహసము చేయు,
తొత్రలకాపరియౌ శ్రీకృష్ణుని
తోడిదె బ్రతుకని మ్రోయు -

పూలకొలనులో వింతసాహసం చేయడం.అంటే ఆత్మార్పణ చెయ్యడానికి సిద్ధమయింది. శ్రీకృషునితోడి.దే బ్రతుకు అంటే 'అన్యథా శరణం నాస్తి త్వమేవశరణం మమ'- అని ప్రపత్తి ప్రకటన-ఆయవస్థలో హృదయాకాశములో శౌరి దర్శనం అయింది.

నాథా ! యో వనమాలీ నామీద దయమాలి
శ్రీధర ! యెటులుంటివో నను గంటివో .. ......
సాధురక్షక ! నిన్ను సర్వేశ్వరునిగ
బోధించె నా వేధ' -

ఇలా ప్రార్థించిం దా యింతి. ఇక లౌకికావస్థలో విరహిణినై చంద్రాదులను నిందించడం ఎంతముద్దుగా, చమత్కారంగా వుందో చూడండి.

'ఆగుమా చందురుండా పొక్కి పడెదేల
నీకంటె చక్కని నెమ్మొగంబు
మలయసమీరుడ నిలునిలు నిన్మ్రింగు
త్రాచు పానుపుగల దైవతమ్ము,
కేరకే శారిక నీరంగు నిరసించి
పెల్లు తొల్కరిమబ్బు లల్లుచాయ,
వింతజగమ నన్ను వెట్టి జేయకె రేపు
విశ్వమోహను డిట వెలయునంచు

వాలుకస్తవ వేడి నీద్వరదచేయు
రెప్పలల్లార్చి నిద్దురం దప్పద్రోయు
తపము సల్పెద నిపుడు ప్రత్యక్షమౌను
శ్రీహరి యటంచు రుక్మిణి యూహసేయు' -

చంద్రునికన్న చక్కనైన నెమ్మొగము కలవాడు కృష్ణుడు. గాలిమే పరిపాన్పు. శారికమైచాయమించే మైచాయగలవాడు. విశ్వమోహనుడు. ఉపమానానికి న్యూనత. గాలిని మింగేది పాన్పు. ఇక గాలేమిచేయ గలదు! శారికరంగుని నిరసించడమేకాదు. తొలకరి మబ్బులల్లేచాయ. దయారసం చిమ్మే మైచాయవాడు. అర్థచమత్కృతిలో సారస్యం. ఈ మొగానికి కృష్ణునితో సంబంధమా ? అని ఎవరేనా అనుకుంటే అది వెర్రితనం. విశ్వమోహనుడు రేపువస్తాడు. అంతవరకే లోకం వెర్రెక్కువ,

అక్షరం తీసేయడానికి సాధ్యంకాని పదబంధం. పాదపూరణ ఫలకమైన పొల్లు అక్షరం ఒక్కటీ లేని రచన. ఏడెనిమిది తత్సమాలు తప్పిస్తే అంతా జాను తెనుగు. మాటలనడానికేమి ? అంత మెత్తగా, శ్రుతిప్రేయంగా పద్దెం రచిస్తే తెలుస్తుంది. చందాదుల దూషణ ప్రబం

థాల పిచ్చి కేకలకి పాఠం చెప్పేదిగా ఎంత శుచిగా, రుచిగా వుందో హృదయం గల విమర్శకుడు గ్రహించగలడు.

తరువాత కిన్నెరపట్టి దేవుడగు కృష్ణుని తెలిసి పాడింది.

ఇలా వేగుజాము వరకూ కృష్ణనామ సంకీర్తనముతో గడిపింది.

శౌరీ ! నాదు జీవంబు నీవెకదా !
సంశ్రిత పారిజాత - సర్వేశ్వరా !-

అని అంతతో ఆప లేదు.

'సామి రాపచేమిరా ఓ
సర్వాంతర్యామి రా ..

సర్వాంతర్యామి కనక కృష్ణునకు తన మది తెలుసు. 'నినునమ్మినాను తను వమ్మినాను నీకు దయరాదేమది'– తనకు కావలసినది సాంసారిక సుఖం! కాదు.

'దాసత్వ మిమ్ము దయతోడ రమ్ము
దక్కితి నీకు నే జిక్కితి ..........

నవవిధ భక్తులలో దాసత్వం ఒకటి. నీ దాసిగా నన్ను స్వీకరించు. దేవా అది చాలునన్నాది పాపం ..

ఆలకించాడు సర్వాంతర్యామి. త్రికరణ శుద్ధిగా ఆత్మార్పణం చేసు కున్న ముద్దరాలిని అనుగ్రహించాడు.

ఒక పూవుదోట మూల పొంచున్న శ్రీహరింగాంచింది. ఇలా సత్యభామని అనుగ్రహించాడా అంటే సముచితమైన సమాధానం రాదు.

"మురళి వాయించుచు మోక్షనాయకుడు శ్రీ
హరి నీలమేఘంబు కరణి మెరసి
ముందర గనబడ్డాడు''

అప్పటికా చెల్వకు నవ్వు మెరిసింది నెమ్మోమున– కృష్ణ పాదపద్మాలు పట్టుకున్నది.

తలపు తెల్పగ సిగ్గున తలను వంచుకున్నది. ముగ్ధకదామరి. చాటుగ వార్తపంపిందిగాని, దర్శనమివ్వగానే చేపట్టవలసిందని చెప్ప డానికి సిగ్గుపడదా ? ఔచిత్యం అదే...

ఇంతవరకుగల ఘట్టం దాసుగారి కల్పన. ఇంకా వివరించాలనే వున్నదికాని వ్యాసం గ్రంథావతారం ధరిస్తుందనే భయంతో సూచించి విడిచాను.

తెల్లవారింది. చలువనదీతోయాలలో స్నానమాడింది. ఆ తరు వాత దాసుగారామెను ఒక పాటతోనూ, ఒక సీసపద్యంతోనూ ముస్తాబుచేసిన విధం అనన్యసామాన్య రచనాపథం. మాతృభాషని ఎక్కువగా వాడడం ఆయన దీక్ష. ఆ పాటలోనూ, పద్యంలోనూ అచ్చు తెనుగు స్వచ్ఛత, చారుత మానసైకవేద్యంగాని మనమాటలలో వివరించ జాలినదికాదు. ఇలా నోరూరించడంకన్న ఆ సీసపద్యం ఉదా హరిస్తాను. ఆ తెనుగు తీయదనం, వర్ణనలో సరసతా అనుభవించండి.

'దూర్వాంకురమ్ములతో సన్నజాజులు
మొగలిరేకులు జారు సిగను జుట్టి,
తళుకుచెక్కు గులాబిదంతపు నిగనిగ
రవలకమ్మలజోడు చెవులబెట్టి,
లేతప్రాయపు బిగిచేతిగాజులు, రైక
యొడ్డాణమున్వ్రేలి యుడుపుగట్టి
ముద్దుమొగంబున ముత్తైదుచిన్నెల
నంబపేరిట నోగిరంబు బట్టి,

వెన్నెలలు చీకటులు పర్వు కన్నుదోయి,
ముత్తెముల్గెంపు లొల్కెడు ముద్దు వాయి,
నందమగు రుక్మిణీ కన్య కలరుహోయి
ఛాటిచెప్పగ వెయినోళ్లు చాలవోయి' -

సంప్రదాయాభిజ్ఞుడు కనక రాచరికపు సంప్రదాయాన్ననుసరించి దూర్వాంకురాలు కూర్చిన సన్నజాజులు సంతరించిన మొగలిరేకులు జారుసిగను చుట్టించాడు. పార్వతీదేవిని పెండ్లికూతురుగ అలంకరించి నపుడు కాళిదాస మహాకవి సిగసాగసుకి దూర్వాంకురాలతో సొబగు సంతరించాడు.

ఈ వర్ణనలో మూడోపాదంలో సింగారం ఎంత నిసర్గరమణీ యమో ఊహించి ఆ మహాకవి ప్రకృతిని ఎంతసూక్ష్మదృష్టితో పరిశీ లించాడో అని ఆనందించండి. అబ్బురపడండి.

లేతప్రాయంతోవున్న రుక్మిణీకన్య చేతికి తొడిగిన గాజులు బిగిగ వున్నాయట! ఆ వర్ణనలో అంత జిగివున్నది.

వెలియుడుపు కట్టింది. వివాహసమయంలో రంగుచీరలు కట్టిం చరు. పార్వతి మంగళస్నానః అయాక వెలియుడుపులే ధరించింది.

'సా మంగళస్నాన విశుద్ధగాత్రీ
గృహీత పత్యుద్గమనీయవస్త్రా
నిర్వృత్త పర్జన్య జలాభిషేకా
ప్రఫుల్లకాశా వసుధేవ రేజే' — (కుమారసంభవం)

వర్షధారతో అభిషేకం అయాక దట్టంగ పూసిన రెల్లుపూలతోవున్న వసుధలా వున్నది మంగళస్నానం అయాక తెల్లనిఉడుపులు ధరించిన పార్వతి—

ముత్తైదు చిన్నెలంటే పసుపు, కుంకుమ తిలకం, కనుదోయికి తీరుగా దిద్దిన కాటుక. ఇది దాసుగారి నాటికింకా వున్నది. యిప్పుడైతే ఆయన రుక్మిణి.కన్య – కన్య అందాం – ఎలాటి ముస్తాబులో వుండేదో!

'వెన్నెలలో చీకటులుపర్వు కన్నుదోయి' చిత్తగించండి వర్ణనలో చమత్కృతి. వాక్కు నను సరించి అర్థం గ్రహించాలి. ఆ ముద్దరాలు

కనుదోయి వెన్నెలనూ, చీకట్లనూ చిమ్ముతూంది. తెల్లతామరపువ్వుల వంటి కన్నులు. కనుక వెన్నెలలను అంటే అవదాత వర్ణాన్ని చిమ్ముతున్నాయి. చీకట్లు ఎలావస్తాయి ? కాటుక పెట్టుకున్నది కనక

'ఋషీణాం పునరాద్యానాం
వాచమర్థోనుధావతి' –

అని భవభూతి చెప్పినది ఇక్కడ జ్ఞప్తికివస్తే ఋష్యంశలేనివాడు కవి కానేరడనే అభియుక్తోక్తి సమన్వితం అవుతుంది. అంతశ్శరీరం అణువణువు ఆర్షత్వాన్ని అంగరక్షగ చేసుకున్నదే.

ఇంతాచెప్పి "చాటి చెప్పగ వేయినోళ్ళు చాలవోయి" అంటాడా గడుసరి కైతబొజ్జ. శేషుడుకూడ చాలడంటాడు. తన పతికి పాన్పై అణగివున్నవాడు వాయి తెరిచి ఆమెను వర్ణించడానికి సమర్థుడెలా అవుతాడు ? వెయ్యినోళ్ళవాడయితే ఏమిలాభం ?...

ఇంతవరకూ ప్రధానమైన కల్పన, దాని ప్రాముఖ్యం శృంగ గ్రాహికయూ చెప్పాను. విస్తరించి చెప్పడానికి, విశేషాలు వివరించడానికి స్థలమూ చాలదూ, సామర్థ్యమూ లేదు. ఇక 'జనముద్దుగా' ప్రచారంలోవున్న ఆయన పాటలు రెండు మూడు ఉదాహరిస్తాను.

ప్రారంభంలో రుక్మిణిని వర్ణించిన తీరుతియ్యాలు.

'లేజవ్వనంపు పసందు నాల్గోజాముక్రొంబ్రొద్దు
వేగినసందు' – ॥లేజ॥

గాజులనేర్పు - జాజులకూర్పు .... ... ... ॥లేజ॥

ఎచ్చు తక్కువలు లేకుండా గాజులు తొడిగే నేర్పు, జాజులు దండగా కూర్చే కూర్పు – చూడముచ్చటగా వుంటుందిగాని ఆ పనులు చెయ్యడం కష్టసాధ్యం. ఆమెను అంత అందంగా లేజవ్వనపు పసందులో దాసుగారు చూపుతున్నారు. (నాల్గోజాము – క్రొంపొద్దు వేగినసందు –

అంటే వేగుచుక్క దూరిన తరువాత అరుణోదయానికీ ముందలి సంధి కాలం. అప్పటి ప్రకృతిశోభ ఉషోరేఖ. అది సుషమ. ఆ శోభతో వుంటుంది రుక్మిణి లేజవ్వనపు పసందు. అందరికీ తెలిసినదే కనుక యీ పాటలో ఆయన ఉపయోగించిన అచ్చ తెనుంగు పసందు, అందమైన అంత్యప్రాసలూ వివరించనక్కరలేదనుకుంటాను. చివరిపాదంలో రుక్మిణి వయస్సును చెప్పడంలో ఆయన శబ్దాధికారం హృదయంగమంగా వుంటుంది. అందులో విశేషం అచ్చ తెనుగుపదాల్లో సభంగా భంగశ్లేష వెయ్యడం – 'వయసు ముద్దుగారు' – అప్పటివయస్సు ముద్దుగ+ఆరు= దుగఅంటే రెండు. ముద్దుగ=మూడురెళ్లారు+ఆరు=పన్నెండేళ్లు – కనకనే 'లేజవ్వనంపు పసందు' – అనే ఆరంభానికి ఔచిత్యపోషకం అయింది.

సామాన్యార్థం 'ముద్దుగారు = ముద్దుగావుంది' – అని.

ఈ గీతంలోనిదే ఒకచోటగల అర్థచమత్కారం చవి చూడండి.

'హాయిర నెమ్మోము తీరు నో
ర్మాయుర చందురుసౌరు' –

నెమ్మోము తీరు చందురు సౌరుకి నోర్మాస్తుంది. 'నీ శోభ ఎంత? మా రుక్మిణి నెమ్మోము చూడు. నోర్మూయ్' – అంటూంది. ఆధిక్యం వున్నచోట అల్పత్వానికి జరిగే సత్కారం యిలాగే వుంటుంది. రుక్మిణి మోము సొబగు చందమామ సౌరుకి మించి వున్నాదని సారం. ఈ చమత్కృతి

'అన్నన్న మొగము వెన్నుని
అన్నన్న జయించు' -

అనే 'చేమకూర' ప్రయోగ చమత్కృతికి పై చేయి అయిపోయిందని నా అంచనా,

అర్థాలంకారాలు ఎంత హాయిగా ఆయన పలుకుబడిలో తిరిగాయో శబ్దాలంకారాలు కూడా అంత సహజసుందరంగా దొరలిపోయాయి.

'అడకువ గలయింతి
నడలకు చౌదంతి
పడతులఁ జేమంతి
బులురతనపు దొంతి' -

తెలుగు పలుకుబడిలో మచ్చుకి ఇది. ఇక సంస్కృత సమాస గ్రథన శక్తికి దానితోపాటు శబ్దాలంకారశక్తికీ మాటవరుసగా ఉదాహరిస్తారు.

పడకగదిలో విరాణ్మూర్తిగా ప్రత్యక్షమైన కృష్ణుణ్ణి వర్ణించే గేయంలోన

'భళిర ! పురుషసూక్తాను సారముగ
ప్రత్యక్షమైతి విప్పుడో సామి !
నలువయైన చిలువపతేడైన ని
న్నంస్తుతింప జాలరు నా తరమా !
కలుషవిదూరా ! సాధుమనః కంజవిహారా !
విలసితోదార సచ్చిదానంద
విగ్రహా ! ప్రకటాగ్రహా ! ఖలనిగ్రహా !

ఇది చాలు ననుకుంటాను ఆయన శబ్దాధికారిత్వానికి సాక్ష్యం.

ఇక 'గానలోల నీకిడెనిదె యానవాలురా !'
'నాధా యో వనమాలి - నామీద దయమాలి'
'సామి రావదేమిరా' -

అనే గేయాలు సర్వేసర్వత్ర ఊపిరి తీస్తున్నట్టు పాడుకుంటూవుంటారు. వీటిలో 'లేజవ్వనంపు పసందు' 'గానలోల నీకిడెనిదె' - అనేవి తెరమీాద జట వేశాయి.

పడకగదిముందు నిల్చివున్న వదినెను లోనికి వెళ్లమని సుభద్ర అనేమాటలు ఎంత నింపుగా, సొంపుగా పాట అయ్యాయో చిత్తగించండి :—

'ఏదినె యెంతటి ముద్దరాలవె సే
బాసు మోహము తెల్పజాలవె - ॥వ॥

గదిమెదేల తోటికాంతల, సిగ్గైన
గరితవు నా యన్నన్ గడు నలయించకె ॥వ॥

పదం పడి పసి నాటినుండియు వలచినావు సరోజలోచను
అదునెరిగి రమ్మని రాయబార మంపుకొన్న
వగలవంకాయ ॥వ॥

లోనికి వెళ్ళమంటూన్న చెలికత్తెల్ని ఏమిటేమిటో అంటున్నావు. అబ్బా! ఎంత సిగ్గూ! చిన్నప్పటినుంచీ మా అన్నని వలచిన దానవు. సమయం చూసి రమ్మని రాయబారం పంపేవు. ఇప్పుడు వగ వోలుక బోస్తున్నావా? వగలవంకాయా!- 'వగలవంకాయ' అనే జాతీయోక్తిని గడుసరి పడతి బుడిబుడి సిగ్గుని ఆక్షేపిస్తూ వరసైన పడుచులు వాడడం తెలుగునాట తరతరాలుగా వస్తూన్న పలుకుబడి. అదునెరిగి ప్రయోగించడంలో ఆయనకు తెలుగు పలుకుబడిపై గల పలుకుబడి అలాటిది.

అంతలో ఊరకుండలేదు సుభద్ర. చిన్న హెచ్చరికతో ప్రేమ పాఠం చెప్పింది.

'వెన్నదినెడు గాన కృష్ణుడు మెత్తన
కన్నెరో నీ రాచ కఠినత చూపకే
పిన్నాడ బిడ్డకు ప్రియముగ గదిజొరు
చిన్ని మేనల్లుని శీఘ్రమె కనవలె'-

మా అన్న వెన్న తినేవాడుకనుక చాలా సుకుమారుడు. నువ్వో రాచ పుట్టువు. నీ క్షత్రియ కాఠిన్యం మా అన్నమీద ప్రయోగించకుమా.

ఓపలేదు. యిక వెళ్లువదినా! గదిలోకి వెళ్లు. మరి మాకు చిన్ని మేనల్లుడు కావాలి ... వెన్న తినడం సౌకుమార్యానికి లక్షణం. క్షత్రియత సహజ కాఠిన్యానికి ఉపాధి - పైగా స్త్రీ హృదయం కఠినం. కవి నిరూఢంగా చెప్పడం గమనించదగ్గది. ఆడుబిడ్డ సుభద్ర పరియాచకం పైపొర.

పోతనామాత్యుని మలిజన్మ దాసుగారు. యోగులన్నారు. ఆయన గ్రంథాలు చదివిన నేను నమ్మాను. ఒక్క విశేషం! మాతృభాషలో గ్రంథాలు వ్రాసిన కవులు చాలా తక్కువమంది. వారి కెవరికీ పట్టుపడని తేట తెనుగు తీయదనం రుక్మిణీ కల్యాణంలో దాసుగారి లేఖిని నుండి నిరర్గళంగా ప్రవహించింది. దానికి జోహారు లర్పిస్తూ ఆ మహనీయుని కృతులను క్షుణ్ణంగా పఠించి తత్కవితాచాతురీధురీణతను తెలుసుకుని ఆనందించవలసిందని సారస్వతోపాసకులకు మనవిచేస్తూ సర్వ శుభలక్షణ సమగ్రంగా ఇంత ఆనంద సంధాయకంగా కవితా కుమారిని సృష్టించిన మహాకవి మా తాతగారని గర్విస్తూ ఇంతతో ముగిస్తున్నాను.



# సావిత్రీ చరిత్రము - సాహిత్యామృతము

డాక్టర్ శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి

ఇది హరికథ. హరికథ అనఁగానే స్ఫురించు వ్యక్తి కీ. శే. ఆదిభట్ల నారాయణదాసుగారు. ఆయన హరికథాపితామహుఁడు. ఆంధ్రావని మోదమునందిన అద్వితీయుఁడు. గజ్జెను కదలించిన గంభీరమూర్తియే కాదు; గంటమును విదళించిన అక్షరమూర్తి. ఆయన రచనమే ఈ సావిత్రీ చరిత్రము. నారాయణదాసుగారి సుమారు ఏఁబది రచనలలో ఇది ఒకటి. అంతేకాదు. ఆయన హరికథా రచనములలో రామాయణ హరికథ తర్వాత అగ్రస్థానము వహించునది సావిత్రీ చరిత్ర మని సాహిత్యాచార్యుల కతపత్రము.

ఆపాతమధురమైన సంగీతము, ఆలోచనామృతమైన సాహిత్యముల ద్వైరాజ్య భారమును అధ్యక్షించు ఒక అపూర్వమైన ప్రక్రియ హరికథ. ఏకకాలమున కర్ణరసాయనము, హృదయ రసానందము కలిగించు ప్రదర్శన విశేషము. అచ్చ తెనుఁగు జగజెట్టులు, గీర్వాణ గిరాం ధురంధరులు మాత్రమే గాక, సంగీత కళారహస్య నిధులు, సాహిత్య పాథోనిధి మంథనోద్యమ పరమావధులు అయిన నారాయణదాసుగారి కంఠసౌష్ఠవమున రూపకల్పన మందిన ప్రక్రియ హరికథ. అది వారి హస్తవాసినే ప్రాణప్రతిష్ఠ నందుట కూడ విశేషము. ఏవం విధమైన నారాయణదాసుగారి సావిత్రీ చరిత్ర హరికథా సాహిత్యామృతమును చవిఁజూచుట ప్రకృత విషయము.

సావిత్రీ చరిత్రము ప్రసిద్ధమైన పురాణగాథ. అది ప్రథమతః తెనుఁగున ప్రబంధ పరమేశ్వరుఁడైన ఎఱ్ఱన పరిఢవించినది. తదుపరి, దక్షిణాంధ్ర యుగ వాఙ్మయమున శృంగార సావిత్రి అను ప్రబంధసుందరి అవతరించినది. వర్తమాన శతాబ్దిని పద్యకావ్యముగ, వచన గ్రంథముగ ద్విపద కావ్యముగ, నాటకముగ, యక్షగానముగ బహువిధముల వెలువడినది. అందు ప్రథమపంక్తిని ముద్రణ భాగ్యమునందినది నారాయణదాసుగారి సావిత్రీ చరిత్ర హరికథ. 1907-వ సంవత్సరమున ప్రథమ ముద్రణము. హరికథా ప్రక్రియను ప్రప్రథమ రచనము.

నారాయణదాసుగారు సావిత్రీ చరిత్రమును హరికథా గానము చేయుటకు సమకాలికమైన సామాజిక స్థితిగతులు ప్రేరణకలిగించినట్లు అనుమేయము. నాస్తికుల విశృంఖలత ఆస్తికుల అజ్ఞతకూడ ఆయన హృదయమును మథించినవి. ఆ మాటకు వచ్చిన నాస్తికుల విశృంఖలత కంటె ఆస్తికుల అజ్ఞతయే ఎక్కువ వ్యథ కలిగించినట్లు కృత్యాదిని వ్యక్తమగును.

"దుర్జన సహవాస దోషంబునం దొల్త
 సఖిల దుర్వ్యసనంబు లభ్యసించి
మానజాలక నభిమానంబున న్నింద
 పాలయ్యు మఱి సిగ్గుపడక ముదిరి
పరవశులై యెల్ల పాపంబుల నిరాశ
 పడి సల్పి వయసెల్ల పాడుచేసి
తమవలె దుష్టవర్తనలేని వారల
 శక్తులటంచు నజ్ఞానులనుచు

మెట్ట వేదాంతులౌ చెడుగొట్టు లెల్ల
వర్ణధర్మంబు లొల్లక వావివరుస
లనక విహరించి నాస్తికులగుచు నరక
మరుగుచుందురు చెనఁటుల గురువులగుచు."

సహవాస దోషమున దుర్వ్యసనములకు లోనై, లజ్జాభిమానములు విడిచి, పాపకృత్యములు చేయుచు, ఇతరులను అశక్తులని అజ్ఞానులని దూషించుచు, చెనఁటులకు గురువు లగుచు చెడిపోయినవారెల్ల నాఁడు నాస్తికులయిరఁట! అట్టి నాస్తికులకు అవశ్యగమ్యము నరకమని ఆయన నమ్మకము. అంతమాత్రమున నాస్తికుల బెడఁద ఆయనకు వదలినది· కాని, ఆస్తికుల అజ్ఞత తీవ్రవిమర్శ చేయించినది.

"స్వర్గములోన రంభాభోగమిట బహు
మానము గొన యజమానుఁడొకఁడు
దక్షిణకై ఒక ధ్యానంబు సల్పుచుఁ
బండితమ్మన్యుఁడౌ బ్రహ్మయొకఁడు
సకలక్రియలఁ బృథగ్గనముల నియమించి
దంభుఁడై తిరుగు నధ్వర్యుఁడొకఁడు
కడుపు కక్కుర్తికై కమురుకంపున కోర్చి
యుక్కిరి బిక్కిరౌ హోత యొకఁడు

శ్రుతుల సారంబు దెలియక క్రతువులందుఁ
బశువులం జంపి సౌఖ్య మల్పంబు గొందు
రుచిత మెఱుఁగక నిదియె విధ్యుక్త మంచుఁ
గ్రూర కర్మలకుం దయ దూరము కద"

స్వర్గములోని రంభా సంభోగము మాట దేవుఁ డెఱుగునుగాని, ఇక్కడి యజమానుల బహుమానలోభము, పురోహితుల దక్షిణార్థమైన ఒక ధ్యానము, అధ్వర్యుల ఆధిపత్యదంభము, హోతల కడుపు కక్కుర్తి ప్రధానమైన ఆనాఁటి యజ్ఞకాండ దాసుగారికి దహనకాండ అనిపించి నట్లు స్పష్టము. అంతేకాదు. యజ్ఞములందలి పశువిశసనము ఆయనకు పూర్తిగా అనిష్టము. అది సద్ధర్మము కాదని ఆయన సిద్ధాంతము.

"మొగి నహింసాత్సర్వభూతాని యను శ్రుతి
నాదరింపక పశుమాల భేత

యను నట్టి యధమ మంత్రానుసారంబుగ
నల నీచకులము లెల్లమ్మ కొఱకు
బలువిచ్చు తెఱఁగునఁ బండితమానులై
విప్రుల మంచును విఱ్ఱవీఁగి
జన్మంబునం బేద జంతువులం జంపు
కటికి యాజులకును గలదె ముక్తి ?''

అని నాటి ప్రశ్న. "అహింసాత్సర్వభూతాని" అను శ్రుతివచనమును విడిచి "పశుమాలభేత" అను అధమమంత్రమును అనుసరించుట తగదని ఆయన హెచ్చరిక. అంతేకాదు. నీచకులములవారి ఎల్లమ్మ జాతరలు అగ్రకులమువారి యజ్ఞయాగాది క్రతువులు పశువిశసనమునుబట్టి సమాన మని ఆయన సమన్వయము.

''యజ్ఞము మోక్షదాయకమగు పశుంహిస
విధిచోదిత మటన్న వేదవాక్కు
లన్నియుఁ దా నమ్మి యజమానుఁ డెంతయు
సాహస ధైర్య విజ్ఞానములను
మానవులను బట్టి మఱి యూపములఁగట్టి
ముక్కు సెవుల్నోరు మూసి చంపి
వపదీసి యగ్గిలోపల వ్రేల్చి తాఁగూడ
నంత్యహోమంబుగా నగ్నిలోనఁ

బడి మృతిం బొందవలెనని నుడువు శ్రుతులఁ
జెనఁటు లిప్పుడలక్ష్యంబు చేసి తమకు
ప్రాణములు బెల్లమని సోమయాజి పేరు
లొంద మేకలఁ గోయుచు నుందురకట !''

సోమయాజి అని పేరు తెచ్చుకొనుటకు పరవిషయమున వేదవాక్కులు వెలికిఁదీసి, స్వవిషయమున అంతర్ధానముచేసి, అంత్యహోమము మాట తలపెట్టని పెద్దల గుట్టును బట్టబయలు చేసిన గుండె దిటవుకల వ్యక్తి నారాయణదాసుగారు. అంతేకాదు,

"క్రూరులై మాంసముందిను కొంటె ఋషులు
పశుల జన్నంబులం జంపవలయుననుచు
శ్రుతుల నొక కొన్ని బన్నిరి చూడఁ దొల్లి
నుండి యవివేకులటు చేయుచుండి రహహ !"

అని దాసుగారు అసలు రహస్యమును బాహాటముగ ప్రకటించుట గమనింపఁదగిన విశేషము. ఇది విప్లావక ధోరణి. ఇందలి సత్యాసత్యములు తజ్ఞపరిషద్విజ్ఞేయము. అదటుంచి, పశువిశసనాత్మకమైన యజ్ఞకలాపము నారాయణదాసుగారికి ఎంతమాత్రము ఇష్టము లేదని స్పష్టము. ఉపరి,

"అత్యంత కృపాసముద్రుఁడై - నీ
లాచల మందవతరించు బుద్ధుఁడు
ప్రత్యహము నాస్తి ధర్మోదయా
పర యని బోధింప వినక పొగరున-"

అని కూడ ఆదిభట్ల నారాయణదాసుగారి అభిభాషణ. దయ కంటె గొప్ప ధర్మము లేదని బోధించు బుద్ధుని మాట వినక పోవుట 'పొగరు' అనుట సామాన్యమైన విషయముకాదు. ఇంత మాత్రమున ఆయన బౌద్ధుఁడు కాదుగాని, అహింసా సత్య దయలే మానవునకు అవశ్య ధర్మములని ఆయన సిద్ధాంతము. అందుకు వేదమతము బౌద్ధమతము ప్రమాణమే. ఆ సిద్ధాంతమును ప్రచారము చేయుటకు హరికథ ఒక ఆలంబనము. అందుకు సుజనావళిని ఎన్ను ఆయన మదిలో సావిత్రి మెదిలినది.

"ధాత్రిని భర్తకున్ మఱియుఁ దక్కిన బంధులకున్ మహాయశః
పాత్రతఁ గల్గఁజేసి యిరువంకల వంశజనంబు లంది హా
ముత్ర సుఖంబు లన్నిలిపి మోదముఁ గాంచిన పుణ్యసాధ్వి సా
విత్రి తలంపువచ్చె నరవిన్ సుజనావళి నెన్ను నా మదిన్."

సావిత్రి భర్తకు అక్షరాల ప్రాణమిచ్చినది. అత్తమామలకు అంధత్వము లేకుండఁ జేసినది. పోయిన రాజ్యమును పునరుద్ధరించినది. తల్లిదండ్రులకు

పుత్త్ర సంతానప్రాప్తి కలిగించినది. ఎట్లు? పశువిశసనాత్మకమైన యజ్ఞము చేసికాదు; పరమ విశృంఖలమైన ప్రవర్తనము వలన కాదు. మఱి? హింసారహితమైన, సత్యదయాత్మకమైన సాధుశీలము వలన. సావిత్రి సాధ్వి. సావిత్రీ సత్యవంతులు పుణ్యదంపతులు. నిఖిలసాధుజన స్తవనీయులు. కనుక సావిత్రీ చరిత్రమును హరికథాగానము చేసెదనని దాసుగారి స్పష్ట ప్రతిపాదనము.

"పున్నెపుం దంపతులలోన వన్నెకెక్కి
పుడమి సావిత్రి సత్యవంతుఁడును మిగుల
నిఖిల సాధుజన స్తవ నీయులగుట
వారి చరితంబు పల్కెద వాసిమీఱ."

సావిత్రీచరిత్రము మహాభారతములోని ఉపాఖ్యానము. ఒక ఉపాఖ్యానమును మఱొక ప్రక్రియగా మలఁచవలెననిన ప్రపంచీకరించుట అపరిహార్యము. అది కవిప్రతిభకు పరీక్షానికషము. ప్రపంచీకరణముతో పాటు పరిష్కరణమును చేయుట విదగ్ధలక్షణము. అంతేకాదు. కవి ఆత్మీయత కావ్యమున ప్రతిఫలించుటయును సహజము. స్వాతంత్ర్యమైన ప్రపంచీకరణము, సకృన్మాత్రమైన పరిష్కరణము, సముచితమైన ఆత్మీయతా ప్రతిఫలనము రాశీభూతమైన రచనము నారాయణదాసుగారి సావిత్రీచరిత్రము.

అశ్వపతి మద్ర దేశాధిపతి. అని మాత్రమే భారతకథ. అశ్వపతి గుణగణములు దాసుగారి సావిత్రీ చరిత్రమున మూఁడు పద్యగేయముల ముచ్చట. అందు ముఖ్యమైన పద్యమిది.

"పేదసాదలనెల్ల వెదకి వెదకి తల్లి
దండ్రుల వలె మేటి దయను బ్రోచు
నవివేకమున వివిధాన్యమతస్థుల
నిరయ భాజనులని నిందసేయఁ

డ్తే జీవమునకైన హింస యొనర్పఁడు
సకల భూతములందు సమతఁబరగు
కలనైన దబ్బర వలుకఁడు మఱి యేక
పత్నీవ్రతుఁడు దీన బాంధవుండు

మచ్చునకు నైన నే మహామహుని రాజ్య
మునను మాంసాశనులు త్రాగుఁబోతు జనులు
లేరొ వ్యభిచారులుం గానరారొ యట్టి
యశ్వపతి వంటి రాజెన్నఁడైనఁ గలఁడె ?''

ఇందు అశ్వపతికి ఆపాదించిన లక్షణములు దయ, పరమత సహనము, అహింస, సమత, సత్యవ్రతము మొదలైనవి దాసుగారు కృత్యాదిని కోరినవి. అంతేకాదు. మాంసాశనులు, త్రాగుఁబోతుజనులు, వ్యభిచారులు కానరాని అశ్వపతి రాజ్యము దాసుగారి ఆదర్శరాజ్యమే.

ఇఁక అశ్వపతికి సంతానము లేదని భారత కథ. సంతానము లేమిని సంతాపమును దాసుగారి వర్ణనము. అందు హృదయమును జలదరింపఁజేయు పద్యమిది :

''కొడుకు లెందఱటంచుఁ గ్రొత్తవారెవరైన
నడుగ నేనేమని నుడువు వాఁడ
వడుగులు పెండ్లిండ్లు బుడుతల కొనరించు
చుట్టాల నేనెట్లు చూడఁగలను
సాలంకృతముగఁ గన్యాదానముంజేసి
యీ మేను దరియింప నోచనైతి
నాకుఁ గల్గిన విద్య నా రాజ్యమంతయు
నెవ్వాని కిఁక నప్పగింపఁ గలను

కడుపు ఫలియింప కుండిన కారణమున
నెంత యవ్వంత చేఁ గృశియించుచున్న
ప్రాణ నాయిక నెటు సమాధాన పరతు
నేనుఁ బున్నామ నరకంబు నెట్లుగడుతు''

ఇది అశ్వపతి పరిదేవన. రాజ్యమునకు వారసులు అవసాన దశలోని సమస్య. పున్నామ నరకము మరణానంతర విషయము. అదటుంచి బ్రతికినంత కాలము అనుక్షణము బాధించునది భార్యను సముదాయించుట. కడుపు ఫలింపనందున వంతచే కృశించు ప్రాణనాయికను సమాధానపఱచుట ప్రాణాంతకమే. ఇంటి కంటె గుడి పదిలమని వీథికి వచ్చిన "కొడుకు లెందఱు ?" అని క్రొత్తవారు అడుగవచ్చును. అట్లడిగిన మనస్సు చివుక్కుమనును. నవనాడులు క్రుంగిపోవును. అంత కంటె చావే నయమనిపించును. మర్మస్పృశమైన ఈ ప్రశ్నకు సమాధానము లేదు. అంతేకాదు. బంధువులు వడుగని పెండ్లని లేక వడుగు పెండ్లి అని కూడ ఆహ్వానింతురు. అట్లు తాను ఆహ్వానించుటకు లేదు. అట్టి స్థితిలో ఆహ్వానించిన వారిని చూచుటకే మనస్సురాదు. ఇంట, బయట, బంధువుల ఎదుట దయనీయమైన స్థితి. ఇది మన స్తత్త్వమును పసిగట్టి చేసిన వర్ణన.

అశ్వపతి సంతాన కాంక్షను పదునెన్మిదేడులు సావిత్రిని కొలువ ఆమె ప్రత్యక్షమైనట్లు మాత్రమే భారతకథ. ఎట్లు ప్రత్యక్షమైనది నారాయణదాసుగారి వివరణము. అది వేదమాత విశ్వరూపము.

చేమంతి పూవుగ శీతాంశు గీలించి
యొప్పుగ గగనంబు కొప్పుఁబెట్టి
తారల న్ముత్యాల చేరుచుక్క నమర్చి
నుదిటిపై సూర్యుఁ డన్బొట్టు దిద్ది
చందోయిగా మేరు మందరములఁజేర్చి
జలధి తరంగముల్వళులఁ జేసి
రోమావళి న్వన స్తోమంబుఁ గావించి
ఘనజఘనము భూమిగా నొనర్చి
తన యథఃకాయ మఖిల పాతాళమగుచు
నశ్వపతి జ్ఞాన దృష్టి యందవతరించె
విశ్వరూపంబు తోడుత వేదమాత
పాలి తాశ్రిత వర్గ సువర్ణదుర్గ."

నీలాకాశము నీలకబరీభారము. సుధాకరబింబము సిగలోని చేమంతి పూవు. తారావళి ముత్యాల చేర్చుక్క. సూర్యబింబము నొసటి తిలకము. మేరు మందరములు వక్షోజద్వయము. సముద్రతరంగములు వళులు. వనస్తోమము రోమావళి. భూమి ఘనజఘనము. అఖిలపాతాళము అథఃకాయము. ఇది అశ్వపతి జ్ఞానదృష్టిలో అవతరించిన వేదమాత సావిత్రి విశ్వరూపము. శ్రీకృష్ణపరమాత్మ విశ్వరూప ప్రదర్శనమును, వామనమూర్తి బ్రహ్మాండాంత సంవర్ధిత రూపమును గుర్తునకు తెచ్చునది. అంతేకాదు. కల్పనాచమత్కారమును ప్రకటించునది.

ఇట్లు ప్రత్యక్షమైన సావిత్రిని అశ్వపతి వినుతించుట రెండు పాటలు, ఒక సీసపద్యము, మఱొక దండకముగ విపులీకరించఁబడినది. అది సందర్భోచితము. భక్తిరసభరితము. ఉపరి, హరికథను హావణించునది. అట్లు వినుతించిన అశ్వపతికి వేదమాత, "జనియించు... ఒక కూఁతు రాపెవలనం దరియింత్రిరువంక వారు" అని వరమిచ్చుట భారత కథను అనుసరించినదియేకాని, "మదంశమునం జనియించు" ననుమాట మాత్రము దాసుగారి స్వతంత్రకల్పనము. ఇది సావిత్రీ చరిత్రమునకెల్ల జీవనాడి. సావిత్రి సావిత్రీ వరప్రసాదినియేగాక, సావిత్ర్యంశానుసారిణి అయిన సావిత్రీ చరిత్రములోని సంఘటనలెల్ల సుసంగతములగును. కనుక "మదంశమున" అనుమాట అలఁతి పలుకైనను కథాపథమున స్థగితమైన మణిపూస. సముచితమైన సంస్కారణమిది.

వేదమాత వరప్రసాదమున సావిత్రి జన్మించినది. పెరిగి పెద్దదైనది. "దాని వయసు చక్కఁదనముఁ దరమా వర్ణింప" అని దాసుగారు వర్ణించిరి. అందు సౌందర్యము కంటె సౌశీల్యమునకు ప్రాధాన్యమిచ్చుట గమనింపఁదగిన విశేషము. ఆ పద్యమిది.

"అఖిల కళాప్రౌఢి నందియు సుంతయుం
గర్వంబు దెలియని కమలగంధి
జగదేక మోహన సౌందర్య ఖనియయ్యు
నద్దము చూడని ముద్దరాలు

ఒగి రాకుమారియయ్యును భృత్యులన్నిర
సనము చేయని శుద్ధసత్వమూర్తి
అతి సుకుమారాంగియయ్యు నార్తులఁ జేరి
పనిఁబూని రక్షించు నెనరుకువ్వ
దానమున వేల్పుటావు సత్యమ్ముక్రోవు
మెఱుఁగు మరుదంతి పల్కుల మేలుబంతి
శీలపుంగొట్టు ఖలులకుఁ జెంపపెట్టు
ఎలమి సావిత్రి కెనఁగలదే ధరిత్రి."

ఒకింత కళాప్రౌఢి ఒదవిన ఎక్కడలేని గర్వము బలియుట పరిపాటి. అట్టిది సావిత్రి అఖిలకళాప్రౌఢి నందియును ఎంతమాత్రము గర్వము ఎఱుఁగదు. అంత నిగర్వి. అది సుగుణము. కాసంత అందము కలదేని అద్దమునకు అంకితమై పోవుట అలవాటు. అట్టిది సావిత్రి జగదేక మోహన సౌందర్య ఖని అయినప్పటికి అద్దము చేపట్టదు. అనఁగా మిడిసిపాటు లేదని అర్థము. సౌందర్యమునకు తగిన సౌశీల్యము అరుదైన విషయము. అందుకు సావిత్రి అపవాదము. అది మేటిగుణము-మేలిగుణము కూడ. ఏపాటి అధికారమున్నను పరిచారకుల మీఁద ప్రభుత్వము చెలాయించుట నైజము. కాని రాకుమారి అయినను - అనఁగా సర్వాధికారములున్నను - సేవకురాలను చిన్నచూపు చూడని శుద్ధ సత్వమూర్తి సావిత్రి. రాజస ప్రవృత్తికి విరుద్ధమైనది సత్వగుణము. అయినను సావిత్రి శుద్ధసత్వమూర్తి. అది మహాగుణము. ఒకమాదిరి సుకుమారత కలదేని ఒడలు వంగుట కష్టము. అట్టిది సావిత్రి అతి సుకుమారాంగి అయిఁకూడ కోరి, ఆర్తరక్షణము చేయు దయార్ద్రహృదయ. అంతేకాదు. దాన పరాయణ. సత్యనిరత. శీలనిధానము. ఇది నారాయణదాసుగారి నాయికా వర్ణనము. నాయికా వర్ణనమనిన నఖశిఖపర్యంత ప్రత్యంగ వర్ణన మయిన సముదాచారమును సంస్కరించిన వర్ణనమిది. అంతేకాదు. ఇతివృత్తమునకు తగినది. ఔచిత్య విలసితము.

ఇక సావిత్రి వినుకలిని సత్యవంతుని ప్రేమించినట్లు భారతకథ. వినుకలిని ప్రేమించుట విపరీతము కాదు. కాని ప్రేమకు కాణాచి అయిన వ్యక్తికి ఏడాది ఆయుర్దాయమను ఘోరకలి ముందు వినుకలి నిలుచుట విశేషము. అది ప్రేమించిన సావిత్రి అంతరంగ మర్యాదకు నిదర్శనము. అది చాలదని ఆదిభట్లవారి అన్యథాకల్పనము సాగినది. ఆ కల్పనమిది.

''—అంతఁదనకు ననుకూలపతి యెట్టులబ్బుననుచు సావిత్రి
చింతించుచుఁ గలఁగాంచె నిటా సుస్నిగ్ధగాత్రి యొకరాత్రి.

బిరుసు నీలంపుటుంగరముల వలెను ముం
గురులు నెన్నొసటిపైఁ గునిసియాడ
ఆలుచిప్పలఁబోలు వాలు కన్నంగవ
కొనల వెంబడి మంచినెనరుఁ జింద
ముప్పిరిఁగొన్న మేల్పుత్తడి మూపున
బలితంపు గండ్రగొడ్డలి వెలుంగ
మోము చందురునందు మొల్కమీసలు కప్పు
చిఱునవ్వు వెన్నెల చెలఁగుచుండ
తల్లి దండ్రులు ముసలి ముద్దులు గలిగిన
నెత్తలన్ మోయు గంపను నేల డించి
జలకమాడించి తీయపండులను జలువ
నీడఁదినిపించు నొక రాచకోడె కాని.

కాంచిన యట్టు లెంతయును గారవ మొప్పఁగఁ బ్రాణనాయకీ !
మంచి మరంద పానమిడి మామకు నత్తకుఁ దృప్తిజేసి క
ల్పించుము పూలపాన్పు మఱి వీచుము చల్లనిగాలి నేనుఁ గా
వించెద పాదసేవ యను చింపుగ నాతఁడు పల్కినట్టులున్.

తానుఁగూడ నతనిఁ దన
ప్రాణేశ్వరుగాఁ దలంచి భయభక్తులతోఁ
బూని దదాజ్ఞ సలుపు చా
లో నిద్దుర మేలుకాంచి లోలేక్షణయున్,

తనకుఁ గలలోన నాథుఁడై తారసిల్లు
నతని రూపంబు పలుమఱు నచ్చుపడఁగ
చిత్తమందున తలపోసి క్రొత్తవలపు
తత్తరంబునఁ జిగురింపఁ దలఁచెనిట్లు.

ఔను నీవె నా నాథుఁడవైతి వింతనుండి—"

సావిత్రికి కల వచ్చినది. స్వర్గలోకమున విహరించినట్లు కాదు. భూలోకమున సంచరించినట్లే. ఆ కలలో కనిపించినది ఒక రాచయువకుఁడు. అందగాడే. కాని, అమాంతము బోరవిఱిచి, బారసాచి యువకుఁడతఁడు యుగళగీతము అందుకొనలేదు. బాహునిగళమున బంధింపనులేదు. అసలా యువకుని భుజస్కంధముల భుజకీర్తులు లేవు. గంద్రగొడ్డలి కలదు. నెత్తిమీఁద రత్నకిరీటము లేదు. ఉన్నదొక గంప. ఆ గంపలో ముసలి ముద్దలయిన అతని తల్లిదండ్రులు. ఆ తల్లిదండ్రులకు జలకమాడించి తీయనిపండులు తినిపించుట అతఁడు చేసినపని. అంతేకాదు. "ప్రాణనాయకీ!" అని సంబోధించి, అత్తమామలకు – తమకు కాదు – పూలపాన్పు సిద్ధపఱుచుమనుట అతఁడు చేయుచున్నపని. పైఁగా అతఁడు చేసెదనన్నపని ఏకాంతసేవకాదు; తలిదండ్రులకు పాదసేవ. అయినను సావిత్రి అతనిని ప్రాణేశ్వరునిగా తలఁచినది. తదాజ్ఞ నలిపినది. అంతలో మెలకువ వచ్చినది. అమ్మయ్య పీడకల విరగడయినది అని సావిత్రి అనుకొనలేదు. కలలో నాథుఁడై తారసిల్లిన ఆతని రూపమునే తలపోసినది. ఆ తలపోఁతలో అతని గుణగణములు గతార్థములు. అయినను క్రొత్తవలపు చిగురించినది. "ఇంతనుండి నీవే నా నాథుఁడవు" అని సావిత్రి ఇదమిత్థముగ నిశ్చయించినది. ఇది వినుకలి ప్రేమకాదు. కనుకలి ప్రేమయునుకాదు. మఱి? స్వప్నవివాహము. అది సత్యవివాహము కావలెనని సావిత్రి సంకల్పము. వజ్రసంకల్పము.

సావిత్రి స్వప్నసుందరుని చిత్రపటమున వ్రాసినది. చెలికత్తెకు వివరించినది. వర్ణించినది. ప్రతిజ్ఞ చేసినది. ఏమని ?

"నెలఁతా నిక్కముగా నితండు కలఁడే నిన్ వీనితో నాకుఁ బెం
డ్లియౌ వేగమె తప్పకుండు నటులన్ సిద్ధింపకున్నన్ పరున్
గలనైనన్ వరియింపఁ జుమ్ము మఱి దుర్గాపాద పంకేరుహ
మ్ములఁ జింతింపుచు భక్తియోగమున నే మోక్షంబు సాధించెదన్."

కలలోని సుందరుఁడు కలఁడేని ఆతనితో సావిత్రికి పెండ్లిఅగును. లేనిచో సావిత్రి కలనైన మఱొకని వరింపదు. భక్తియోగమున మోక్షమును సాధించును. అంతే. ఇది సావిత్రి దృఢనిశ్చయము. ఇంతకు సావిత్రి కలలోని సుందరుఁడు ఊహామూర్తి కాదు. ఉన్నమూర్తియే. అతఁడు సత్యవంతుఁడు. అరణ్యావాసియే. అనఁగా కల నిజము. కల నిజమైన కలలోని దాంపత్యము నిజము కావలెను. సత్యవంతుఁడు అల్పాయుర్దాయము కలవాఁడని తెలిసినను, అది సావిత్రి ప్రతిజ్ఞకు భంగము కలిగించునది కాదు. ప్రతిజ్ఞాపాలనమే సావిత్రి కర్తవ్యము. ఇట్లు దాసుగారి అన్యథాకల్పనము సుసంబద్ధము.

అశ్వపతికి ఆ చెలికత్తెవలన సావిత్రి ప్రతిజ్ఞ తెలిసినది. నారదుని వలన సత్యవంతుని అల్పాయుర్దాయమును తెలిసినది. ఆత్మజను బుజ్జగించి, "ఆతని కాయువింకకట! యేఁడులు రెండట యేమి చేయుదున్–గావునఁ దల్లీ! యతనిన్ భావింపక చిరము బ్రతుకు వరు నింకొకని సేవించు" మని సూచించెను. "మాఱుమనువు లేదు తండ్రీ మన వంశమున" అన్నది సావిత్రి. అనఁగా సావిత్రి అంతరంగమున స్వప్నవివాహము సత్యవివాహమే. ఇది వినుకలి ప్రేమ వివాహముకంటె ఇతోధిక విశేషము, పైఁగా.

"కనకదుర్గయు మన పాలంఁ గల్గెనేని
యరయ సాధ్వికి మాహాత్మ్య మలరునేని
యితఁడు చిరజీవి యగుచు నన్నేలఁ గలఁడు
వే నుడువు లేల తండ్రి! నన్వీనికిమ్ము."

అని సావిత్రి తండ్రికి హితబోధచేసినది. "కనకదుర్గ చెప్పినదెల్ల నిజము కాకపోదని తలంచిన" అశ్వపతి అందుకు సమ్మతించుట జరిగినది. ఇది

భారతకథను నారదుని ఆదేశము. నారదుని ఆదేశముకంటె వేదమాత మీఁది విశ్వాసము సుసంగతమైన కల్పనము.

సావిత్రి వివాహము కొఱకు సత్యవంతుని యొద్దకు బయలు దేఱుటకు అశ్వపతి మంచి ముహూర్తము పెట్టెను. వివాహము ముహూర్తము అనఁగానే వసంత ఋతువు జ్ఞప్తికి వచ్చును. వసంత ఋతువు జ్ఞప్తికి వచ్చిన తర్వాత వర్ణించకుండ విడిచి పెట్టుట కవికి సాధ్యము కాదు. దాసుగారి వసంతర్తు వర్ణనమిది :

''చెవులకుఁ జల్లగఁ జెలఁగి కోయిలకూసె
సందడి పెండ్లి బాజాలు మ్రోసె
కన్నె వేపయుఁ దొగర్గున్న సమర్తాడెఁ
జలివేంద్ర దాపున సంత గూడె
కమ్మ మామిడితోట కాపులపని హెచ్చెఁ
బిల్లగాలులు మురిపించి వచ్చె
గొడుగులు జోళ్లెండ చిడిముడిఁ జల్లార్చెఁ
దాటిముంజలు కడుదప్పిఁ దీర్చె

కారడవి వెల్గెఁ బడవ షికారు గల్గె
సందె లింపాయెఁ గౌగిళుల్సడలిపోయె
ప్రొద్దు లేపాటి మాపులు పొట్టివాఱె
ఆమని మొదలు పెట్టి ఒక హాయి పుట్టె.''

వసంతకాలమున పెండ్లి బాజాలు మ్రోగుట, కన్నె వేప చిగిరించుట, చలివేంద్ర దాపున సంతగూడుట, గొడుగులు జోళ్లు ఎండ చిడిముడిని చల్లార్చుట, తాటిముంజలు దప్పితీర్చుట, పడవషికారు కల్గుట పాడిన పాటలు కావు. సహజములైన విషయములివి సంతరించుట వలన వసంతర్తు వర్ణనకు నూతనశోభ వచ్చినది. ఇది సహృదయ హృదయంగమము.

ఇంత వఱకు నాయిక ఇతివృత్తము నడిచినది. వసంతఋతువు వచ్చిన వెంటనే కథ నాయక చరితమును ఆశ్రయించినది. అడవిలో

పులివాతఁబడిన కొదమలేడిని కాపాడి, లేతపచ్చికలు మేపి, భయమును బాపి, దానికి విశ్రాంతి ఇచ్చిన దయార్ద్రహృదయముతో నాయకుని పరిచయము చేయుట నారాయణదాసుగారి రచనమున నవ్యతాగుణము. అంతేకాదు. సావిత్రీచరిత్ర రచనకు ప్రేరణ కలిగించిన అహింసా సత్య దయలు మూర్తీభవించిన వ్యక్తిగ సత్యవంతుని పాత్రచిత్రణము సాగినది. సత్యవంతుని తలిదండ్రుల సేవ కూడ పరకోటి నందినది. ఆ సమయమున శంఖకాహళధ్వనుల తోడి చతురంగ బలముతో వచ్చు అశ్వపతిని చూచి, శత్రువని భ్రమపడి అంత దయార్ద్రహృదయుఁడును విజయలక్ష్మిని పెండ్లాడుటకు సిద్ధపడును. ఆ విజయలక్ష్మి వివాహ ప్రయత్నము చక్కఁగా వర్ణింపఁబడినది. ఆ పద్యమిది :

"భూమి పీఠము నభంబున్ మేటి పందిరి
బహుశస్త్రతతి సాక్షివహ్ని గాఁగ
ముకుట తనుత్రాణములనుండి డుల్లెడు
రవ ముత్తెముల్ తలఁబ్రాలుగాఁగ
జంబుక స్వస్తి వాచకులకు శత్రుల
తలలెంతయి ఫల ప్రదానములుగఁ
గూలెడి భటహయ కుంభి భూరిధ్వను
లోలి బాజాబజింత్రీలు గాఁగ

బలు వసంతము నెత్తురు వరదగాఁగ
నాకబలి ముగ్గు లట్టు లాంత్రములు మెఱయ
మఱియుఁ బగయొజ్జ ఠంకృతి మంత్రములన
పెండ్లియాడును నన్నహో విజయలక్ష్మి."

పీట, పందిరి, సాక్ష్యగ్ని, తలంబ్రాలు, స్వస్తివాచకులు, వారికి ఫలప్రదానములు, బాజాబజింత్రీలు, వసంతము, నాకబలి ముగ్గులు, పురోహితుఁడు, మంత్రములు పెండ్లికి సంబంధించినవి. విజయలక్ష్మి తోడి పెండ్లి మామూలు పెండ్లి కాదు. అందుకు నేలయే పీట, నింగియే పందిరి; శస్త్రతతియే సాక్ష్యగ్ని, కిరీటకవచములనుండి రాలిపడు రత్నాలు

ముత్యాలు మాత్రమే తలంబ్రాలు, జంబుకరాజులే స్వస్తి వాచకులు, వారికి శత్రువుల తలలే కొబ్బరిబొండములుగ ఫలప్రదానములు, గజాశ్వ సైనికుల హాహాకారములే బాజాబజంత్రీలు. నెత్తురువరదయే వసంతము. ప్రేలవు ప్రోవులే నాకబలి ముగ్గులు. ప్రతీకారమే పురోహితుఁడు. ప్రతీకార ఠంకారములే మంత్రములు. వీని సంపుటియే విజయలక్ష్మి వివాహము.

ఇది సత్యవంతుని ఊహాగానము. ఇంతకు అశ్వపతి శత్రువుగాదు. ఆయన వెంట విజయలక్ష్మి లేదు. ఉన్నది శుద్ధ సత్వమూర్తి సావిత్రి. సావిత్రీ సత్యవంతుల కల్యాణమహోత్సవము జరిగినది. ఆ కల్యాణ మహోత్సవము దాసుగారు కల్యాణి రాగమున గానము చేయుట గమనింప దగిన విశేషము.

"పూలదండ సత్యవంతు బూరిగళంబందిడియె సావిత్రి
వాలుగ మేల్చూపున్ గ్రొవ్వాడి తూపు లెదం దూయ—
మాలతీకుసుమ జాలముం దలఁబ్రాలుగా గురియ
నాడ చిల్క నివ్వాళిఁ బాడ
మావి చిగురుటగ్గి పజ్జ కోయిల యొజ్జ మంత్రమున—
తలఁప మృగారవములు తూర్యధ్వనుల జాడగా
మెలపున నెమళ్లు సానిమేళ మాడఁగా
అలరు విలుకాడు పెండ్లి పెద్దగ
సకుల మ్రోఁత దీవనల దిద్దగ—
లలితశ్రోణి నీలవేణి
లావణ్యగుణ కలిత కల్యాణి.॥"

సావిత్రి మేలి వాల్చూపులను క్రొవ్వాడి తూపులు హృదయమును దూసికొనిపోవునట్లు సత్యవంతుని కంఠమున పూలదండ ఇడినది. మాలతీ కుసుమ రాశులు తలంబ్రాలుగా కురిసినవి. ఆడచిలుక నివ్వాళి పట్టినది. మావి చిగురు సాక్ష్యాగ్ని అయినది. తత్సంబంధి కోకిల పురోహితుఁడు మంత్రములు చదివెను. మృగారావములు తూర్యధ్వను లయినవి.

నెమలిపిండు సాని మేళ మాడినది. మన్మథుఁడు పెండ్లి పెద్ద. తుమ్మెదల స్తోత్ర దీవనలు. ఇట్లు ప్రకృతి పరముగ సావిత్రీ సత్యవంతుల కల్యాణ మహోత్సవము సమకూడినది. కారణము సత్యవంతుఁడు రాజ్యభ్రష్టులైన తలిదండ్రులతో అరణ్యవాసము చేయుటయే. సమకాలికమైన సాని మేళము మహేతిహాస కాలమునకు సరఫరా చేయఁబడినది. ఈ కల్యాణ మహోత్సవ వర్ణనమును కల్యాణిరాగమున గీతాలాపన చేయుట మాత్రమేగాక, అది కల్యాణిరాగమని అందే ముద్రవేయఁబడినది. ఇది ఒక విధమైన ముద్రాలంకారము. ఈ ముద్రాలంకారము ఇక్కడ మాత్రమే కాదు; సావిత్రీ చరిత్ర మంతట సంఘటితమైన వైచిత్రి.

వివాహ వేదికను సావిత్రీ సత్యవంతుల పరస్పర విలోకనములును దాసుగారి కవితాదర్పణమున చక్కగ ప్రతిఫలించినవి.

"పలలిత పాదాంబుజాతంబులందునఁ
గొదమ తుమ్మెద కవ కూడునట్లు
భాసుర నిమ్ననాభీ సరోవరమున
గండు బేడిస జోడు గలయుభంగి
ప్రథిత పీనోన్నతోరః ప్రదేశంబున
ఖంజరీటము జతగట్టు మాడ్కి
కమనీయ వక్త్ర రాకాసుధాకరు పజ్జ
ఘన చకోరముజంట నెనయు కరణి

ఏకముగ వలపు జిగురున నెదల నతికి
పన్నిధిం జేరిన కొలంది చనువు మిగిలి
రెప్ప లెగసిన క్రమమున గొప్పమీటి
దంపతుల చూపు లొండొంటఁ దారఫిల్లె."

ఇది ప్రబంధ ధోరణి. ఇందు కవిసమయముల మీఁద కల్పనము సాగినది పాదములను పద్మములనుట, చూపులను తుమ్మెదలనుట కవి సమయము. కనుక పాదముల వంక ప్రసరించిన చూపుల జంటకు

పద్మముల మీఁద వ్రాలిన తుమ్మెదల జంటగ రూపకము. ఇట్లు నాల్గు సీసపాదములు నడిచినవి. ఎత్తు గీతము ఎత్తుగడయే వేఱు. ఉభయుల చూపులు ఉభయుల హృదయములను ఒకటిగ వలపుజిగురున అతికి వేసినవఁట. రెండు హృదయములను ఒకటిగ అతికివేయు వలపుజిగురు దాసుగారు కనిపెట్టినదే.

కన్నకూఁతురిని పెండ్లి చేసి, ఒక అయ్య చేతికి అప్పగించుట తల్లి దండ్రులందఱికి తప్పనిసరి. అయినను కూఁతురుని అప్పగించు సమయమున తల్లడిల్లిపోవుటయు సహజమే. పెంచిన కూఁతురు విషయమున కణ్వుఁ డంతటి మహర్షి కంఠ స్తంభిత బాష్ప వృత్తి కలితుఁడగుట జరిగినది. మఱి అశ్వపతి దంపతులును "కాల్వలై బాష్పములు కన్నుఁగవను జాఱ నెలమి డగ్గుత్తికను పలుకు" నెడ దాసుగారి కవితా లేఖిని పరవళ్లు త్రొక్కినది. ఆ పద్యమిది :

"కాత్యాయనీ పూజకై సన్నజాజులు
గోయు మా యమ్మకుఁ జేయిగందు
ఒకసారి సాష్టాంగము మాకిడ మాపిల్ల
చెక్కిళ్ళ ముత్తెంపుఁ జెమట గాఱుఁ
గూఁత మేరను దుర్గ గుడికి నడువగ మా
బొట్టె యడుంగులు పొక్కు లెక్కు
హంసతూలిక తల్పమైన మా కూఁతున
కొత్తిగిల్లిన పక్క లొత్తుకొనును

బలు తపంబున సావిత్రి వరము వడసి
కాంచి యెంతయు ముద్దుతోఁ బెంచినార
మకట యిమ్మందయాన నీ యలరుఁబోడి
నెట్టు లే లెదొ తండ్రి నీకిచ్చినాము.'

అశ్వపతి తపస్సుచేసి సావిత్రీదేవి వరప్రసాదమున సావిత్రిని కన్న మాట కథార్థము. ముద్దుతో పెంచిన మాట యథార్థము. అట్టి సావిత్రిని

అరణ్యావాసముచేయు సత్యవంతునికి పెండ్లిచేసి అప్పగించుట బాధాకరమే. రాకుమారి, సుకుమారి అయిన సావిత్రి అరణ్యావాసము చేయవలసి వచ్చినది. ఎంత సుకుమారి ?- కాత్యాయనీ పూజకు సన్నజాజిపువ్వులు కోసిన చేయి కందిపోవును; సాష్టాంగపడిన చాలును ముత్యాల చెమటలు పట్టును. దగ్గఱిలోని దుర్గగుడికి నడిచివెళ్ళిన అడుగులు బొబ్బలెక్కును. హంసతూలిక తల్పమున ఒత్తిగిల్లినను పక్కలొత్తుకొనిపోవును. అంత సుకుమారి. అని తలిదండ్రుల ఆవేదనము. ఇది కవితార్థము. ఇందు సావిత్రి దైవభక్తి, పితృభక్తి కూడ ప్రసక్తము.

అశ్వపతి సత్యవంతుని తన రాజ్యమునకు ఆహ్వానించును. ఇల్లఱికము తగదని, దైవానుగ్రహమున స్వీయరాజ్యమును సాధింతునని సత్యవంతుని సమాధానము. అల్లుని నీతికి అద్భుతమందినను తనయను విడిచిపెట్టక తప్పదని వగచు తండ్రికి చెప్పిన సమాధానములో,

"మగువ యెదిగినంత మగని సొమ్మైయగు
మాయమ్మ నీ కెట్లు మఱి లభియించె"

అను మాటలు వరహాల మూటలు. ఇందు మొదటిమాట జనవాక్యము. రెండవమాట దాసుగారి తిరుగు లేని తీర్మానము. తిరుగు ముఖము పట్టక తప్పలేదు అశ్వపతి దంపతులు. సావిత్రీ సత్యవంతుల సంసారము ప్రారంభమైనది. అది పర్ణశాల కాపురము. అందు సావిత్రి దినచర్య —

"ప్రొద్దు దూరకమున్నె నిద్దురలేచు, ని
ల్పవరించుఁ జెర్వున స్నానమాడి
మంచినీటిం దెచ్చు మామకు నత్తకుఁ
బరిచర్య సేయు నాపైని వండి
వడ్డించు నందఱుఁ బరితృప్తులైన నం
తట గౌరి నర్చించి ధవుని భుక్త
శేషము భుజియించుఁ జీరె లుతుకు ని
వ్వరి దంచి బియ్యంబు బాగునేయు

ఆవునకు కుడితిడు ఫలహారములను
బెట్టి గురులకు శయ్య గల్పించి హాయిఁ
బాట బాడుచు మెల్లన పదములొత్తి
పిదప నొక కొంత రేయికి విభునిఁ జేరు.''

ఇది దాసుగారి వివరణ. సన్నజాజులు కోసిన చేయి కంది పోవు, సాష్టాంగపడిన ముచ్చెమటలుపట్టు, నాలుగడుగులు నడిచిన అడుగులు బొబ్బలెక్కి పోవు సుకుమారి సావిత్రి నిర్వర్తించిన దినచర్య. ప్రాచీన భారత నారీ జీవనము. ఆవునకు కుడితి పెట్టుట ఆంధ్రదేశ వ్యవహారమే.

ఇట్లు సంసారము సాగుచుండఁగా సత్యవంతుని ఆయుర్దాయము గడువు సమీపించినది. సత్యవంతుని వెంట సావిత్రి అరణ్యా మధ్యమునకు వెళ్లినది. అత్తకు మామకు అచటి విప్రులకు ప్రణమిల్లి సావిత్రి వెళ్లి నట్లు భారతకథ. పరమేశ్వరిని ధ్యానించి ధ్యానించి వెళ్లినట్లు దాసుగారి హరికథ. అంతేకాదు. సావిత్రీ సత్యవంతులు వనవిహారము చేసిన అనంతరము, సత్యవంతుఁడు గండ్రగొడ్డలిచే కట్టెను కొట్టు సమయమున శిరో వేదన పొందినట్లు భారతకథ. కట్టెను కొట్టునెడ కాక సరసులో మృణాళ సమితిని సేకరించి ఒడ్డునకు వచ్చినపుడు తల నొప్పి చెలఁగినట్లు దాసుగారి మార్పు. సావిత్రి అంకతలమును ఉపధానము చేయఁగా సత్యవంతుఁడు వ్రాలి, సోలి నిశ్చేతనుఁడయిన కొంత తడవునకు యమధర్మరాజు వచ్చినట్లు భారత కథ. ఆ కొంత తడవును సావిత్రీ విలాపమునకు దాసుగారి హరికథను వినియుక్తమయినది. ఆ మీఁద యమధర్మరాజు ఆగమనము. ఆయువు పట్టైన ఘట్టము. అది భారత కథను క్రమబద్ధము. సుప్రసిద్ధము. అయినను దాసుగారి అన్యథా కల్పనము సాగినది. "ఏదైన వరముఁ గటాక్షింప నీ కిష్టమయ్యెనేని ... జాత్యంధులైన నా యత్తమామలకుఁ గనుంగవ నిమ్ము" అని సావిత్రి తానుగా వరమడుగును. అంతేకాదు. అత్తమామలకు కన్నులిచ్చిన యముని కృపచేత "కొడుకునుం గోడలిం జూచుకొంద్రు వారు" అని

వివరించును. ఇది గడుసుదనము. ఇందు సత్యవంతుని బ్రదికింపుమనుట గతార్థము. సావిత్రి అత్తమామలకు కన్నులిచ్చి సావిత్రిని వెడలి పొమ్మన్న యముని "ఆపవలయుఁ బ్రశ్న మడిగి యడిగి" అని సావిత్రి నిశ్చయించును. ఇది గడుసుదనము కాదు. చిలిపిదనము. చిలిపిదనమును గాదు. స్వీయసిద్ధాంత ప్రచారమునకు దాసుగారి అన్యథాకల్పనము. పాప పుణ్యముల స్వరూపము, వాని వాని ఫలములు సావిత్రి అడిగిన ప్రశ్నలు. ఆ ప్రశ్నలకు యముని సమాధానము సువివరము. అందు ముఖ్యము లైనవి –

"పాలు చెక్కెర ధాన్యఫలములన్నాని దు
　　ష్టాశనులౌ మనుష్యాధములను
యంత్ర వితతి నభీష్టార్థము ల్సలుపక
　　పశుల బాధించెడి పాతకులను
అధికారమున నంధులై వ్యర్థముగ సేవ
　　కులను బీడించెడి క్రూరమతుల
తమకు సంపదఁ గోరి దైవతములకు జం
　　తువులను బలియిచ్చు దుర్జనులను

పలురకంబుల మఱియును బ్రాణిహింసఁ
బఱపు కఠినాత్ములంబట్టి విఱిచి కట్టి
మేని చర్మంబు లొలుచుచు మీఁద వేఁడి
చమురుఁ జల్లుచు నాభటు ల్సంతసింత్రు."

ఇందు మాంసాశనులు, పశువిశసనకర్ములు, జంతుబలిప్రదాతలు, ప్రాణి హింసా పరాయణులు చర్మము లొలిచి వేడి చమురు చల్ల వలసిన వారని దాసుగారి ఆశయము. అధికార బధిరాంధకులును ఆ కోవను చేరుట గమనింప వలసిన విషయము.

"లాతికొంపలు దీసి లంచముల్మెయు మూ
　　ర్ఖులను అంపంబులఁ గోయుచుంద్రు
తగఁ దీర్ఘదైవ నిందకుల నెల్లప్పుడు
　　మంచి నిప్పులఁ బొరవించుచుంద్రు

లలి గురుద్రోహులం బలుశూలములఁ బొడి
పించి పాతరలఁ ద్రొక్కించుచుంద్రు
త్రుళ్ళి లోభులఁ బట్టి నోళ్ళ మన్నుం గొట్టి
చెట్టులకు ద్రేవలగట్టుచంద్రు

పోరి బోరి వర కన్యాశుల్కములను దినెడు
కుత్సితుల డొక్కజీల్చి రాల్నొట్టుచుంద్రు
మఱి కృతఘ్నులఁ బట్టి మా నరకమందుఁ
జెలఁగి సకల శిక్షలకుఁ బాల్సేయుచుంద్రు.''

ఇప్పుడు బ్రతికుండఁగ అంపముల కోసినను కుటుంబమైన సుఖపడు నని లంచములు మేయు స్థితి వచ్చినది. కన్యాశుల్కము లెట్లో కడముట్టె నవి కాని వరశుల్కముల వైభవము నేఁడు పతాకస్థాయినందుకొన్నది. అది డొక్కచించి డోలుకట్టినను వెంటనే అంతర్థానమగునదికాదు. నరకమును నరకయాతనలును నమ్మిన కాలమున దాసుగారి ప్రబోధమిది. అందును హరికథ ఆబాలగోపాలము వినుట ఆనాఁటి పద్ధతి. కనుక సమ కాలికమైన సంఘశ్రేయస్సును కోరి రచించినది దాసుగారి సావిత్రీ చరిత్రము.

సావిత్రి తానుగా వరమడిగినట్లే, దాసుగారి హరికథను యముఁడు తానుగా సత్యవంతుని బ్రదికించును. వేదమాత సావిత్రి దయను గగన గతి, యముని కృపను హృదయపతి లభించిన సావిత్రి దివినుండి భువికి దిగి సత్యవంతుని మేల్కొల్పును. సత్యవంతుఁడు సావకాశముగ లేచి, "ఇంతసేపయ్యె నను లేపకేల జాగుచేసినావు?" అని ప్రశ్నించును. ఆశ్చర్య విషాద సంతోషములు ముప్పిరిగొన్న సావిత్రి ముందుపలుకు-

''జీవితేశ! నన్ను ముందు గౌఁగిటఁ
జేర్చుకోర పైసంగతిఁ జెప్పెద"

అని దాసుగారి స్వతంత్ర కల్పనము. ఈమాట సావిత్రి హృదయ భారమును సమీకరించునది. సహృదయునికి హృదయ స్పందనము కలిగించునది.

ఇట్లు భారత కథను ప్రపంచీకరించి, అక్కడక్కడ పరిష్కరించి, అన్యథా కల్పనములు సంతరించి, ఆత్మీయతాముద్ర ప్రతిఫలించునట్లు రసవత్తరముగ రచించిన హరికథ ఆదిభట్ల నారాయణదాసుగారి సావిత్రీ చరిత్రము.



# హరిశ్చంద్రోపాఖ్యానము

శ్రీ కోగంటి సీతారామాచార్యులు

"ఎన్నఁగ తల్లిదండ్రులకు నెక్కుడు వేల్పులులేరుగాన, న
ఖ్యాన్నతి యక్షగాన కృతిఁ బున్నెపు దంపతులేల నిచ్చి నన్
గన్న ఋణంబుఁ దీర్చుకొనఁ గల్గితినంచిటు సన్నుతింతు మా
కన్నిటఁగాచి పెంచు వరసాంబను వేంకటచైని పండితున్"—

అని శ్రీదాసుగారు జననీ జనకులకు అంకితము చేసిన హరికథ యిది. అన్నివిధములైన హరికథా మహాగుణసంపత్తికి అద్వైతస్థితిని గల్పించిన ఒక మహాగాంధర్వరేఖ శ్రీ నారాయణదాసుగారు. వారిది సహజమైన భక్తిభావము. ఆ భక్తియు చమత్కారముతోఁ గూడినది. భక్తిభావాభివ్యక్తికి శహానశ్యామలు ప్రసిద్ధములు. ఆరాగములలో ప్రశమలక్షణమున్నది. సత్వసందీప్తి యున్నది. సాత్త్వికభక్తికదా ప్రశస్తము! హరికథాప్రయోజనము భక్త్యుత్పాదకతయే కదా! ఇంతదూరమైన చూపు మహర్షులకు తప్ప సామాన్యుల కెట్లుండును? ఈ వీరి చూపులోని నిర్దుష్టత, ఆర్ద్రత ప్రార్థనముననే మనకు గోచరించును. చాలమంది యనధికారులు హరికథా ప్రవక్తలగుటయే నేడు హరికథా సాహితికి పట్టిన తెగులు.

ప్రార్థనాత్మకమైన యీ కీర్తనను గమనింపుఁడు.

"నను బ్రోవర! ప్రోవర! ప్రోవర! – దేవ!"

త్రిరావృత్తమైన యీ క్రియాపదము అనంతరప్రయుక్తమైన యీ సంబోధనము జీవుని వేదనను భగవంతుని యందలి పరమభక్తిని వెల్లడించుచున్నవి.

''కననురా! మోదంబు నీభక్తి వినా ఖగరాజగమనా!
మనవిగైకొనరా! పాపంబుల దురిమి నా కోర్కెల నొసంగర!
నిరంతరమున్ నీపాదాబ్జము స్మరించెద నిను వేడెదన్, శ్రీ
హరీ నారాయణదాస నుతినందుటకు నీవె తగుదువురా!''

భగవద్భక్తి తప్ప వారికి మోదములేదట! వారి మనవి ఒక్కటే ఒక్కటి. అది వారిపాపముల పోద్రోలి కోరికలిచ్చుట! ఇది వారి చమత్కృతి. నారాయణదాస నుతినందుటకు శ్రీహరియే తగునట! చివరిక్రియలోని చనవు – ఎంత ప్రౌఢోక్తి!

హరికథయే కదా యని ఏవేవో నాలుగు పాటలతో పద్యములతో కాలక్షేపణచేయుట వారికి గిట్టనిది. కంఠదఘ్నముగా వారనుభవించి శ్రోతలకు తలమున్కలు చేయుట వారి కథారంభముననే నాందీ పద్యమున హరిశ్చంద్ర కథా బీజమును నిక్షేపించినారు.

''ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోఽనుధావతి'' కదా!

మంగలాచరణమైన వారి జనక స్తుతిలో హరిశ్చంద్రగుణ వర్ణన మిట్లు చేసినారు.

''భూసురపుంగవున్, విబుధపూజితవర్తను. సూనృతవ్రతున్,
భాసుర విగ్రహున్, విపుల బాహుపరాక్రమశాలి, పండితా
గ్రేసరు .... ... ...''

బ్రాహ్మణ శ్రేష్ఠత, పండిత సమ్మాననార్హ వర్తనము, సత్యనిష్ఠ సుందర రూపత, బాహుబలశాలిత, విద్వదగ్రేసరత, ప్రకృత నారాయణ దాసు కవిజనక స్తుతి విషయము. అట్లే ప్రకృత కథానాయక గుణసూచకములైన విశేషణములు అప్రయత్నముగా హరిశ్చంద్రుని చెప్పుచున్నవి.

భూలోక దేవేంద్రత, సర్వదేవతా ప్రశంసనీయ సద్వర్తనము, సత్య వాగ్వ్రతము, సర్వలోక పరికాశమాన ప్రశస్యమాన విగ్రహము అనగా ఎడబాటు. భార్య పుత్రుడు తాను వేరగుట, లేక లోకము మెచ్చునట్లు సత్య రక్షణకై యుద్ధము చేయుట, విస్తృత బాహు బలశాలిత, జ్ఞాన వంతులలో శ్రేష్ఠత. — ఇవి హరిశ్చంద్ర ముఖ్యలక్షణములు.

రెండవదియగు గీతమునను;

"ఆయు రారోగ్య సంపద నలరినారు
పుణ్యదంపతులని పేరు పొందినారు
సర్వ సంపత్సమృద్ధిని జరిగినారు"—

అనునవి ఉభయ సాధారణములైన విశేషణములే! ఇట్లు కావ్యార్థ సూచన చేసి బీజ బిందు పతాకాది వివేకముతో కావ్యరచనచేయుట స్వతస్సిద్ధులకే చెల్లును.

ఈ హరికథయందు ఆంధ్రకవు లవలంబించిన కృతి సమర్పణ విధానము ప్రత్యేకముగా గోచరించును. ఆశ్వాస విభాగము లేక పోయినను ఆశ్వాసాద్యంతములందువలె కృతిపతి సంబోధనములుండుట ఈ కథా విశిష్టత.

విశ్వామిత్రుడు వసిష్ఠునితో పందెము వేయుటవరకు ప్రథమాశ్వాసము. హరిశ్చంద్రుని కాశీ ప్రయాణమువరకు రెండవ యాశ్వాసము. హరిశ్చంద్రుడు కాటికాపరియగుట వరకు మూఁడవ యాశ్వాసము. విశ్వామిత్రుడు ప్రత్యక్షమై తన పన్నుగడ తెల్పుకొని హరిశ్చంద్రుని మెచ్చుట రాజ్యప్రాప్తి నాల్గవ యాశ్వాసము. హరికథకు ఈ మర్యాద నే నెఱిఁగినంతవరకు లేదు. భగవత్ప్రార్థనములందు తమ పేరును దాస పదముతో చేర్చి లగించుట పరిపాటి. అంతట తృప్తిపడక తలిదండ్రులకు కృతి సమర్పణోత్సవము నెరవేర్చిన శ్రీ నారాయణదాస మహాకవి హరికథా సాహితి పరమేష్ఠి. ఆద్యకర్త.

పఠన శ్రవణాదికముచే హృదయానంద హేతువులగు నిర్వార చమత్కారార్థమునిచ్చు వ్యంజకములైన శబ్దముల విన్యాసమే కావ్యము. మనకు నిత్య ప్రత్యక్షములగు సుఖదుఃఖాదులే కవిభావనా వ్యాపార ముచే కావ్యమున రసభావములుగా పరిణమించి సహృదయులకు అతిలోక రమణీయకతా జనకములగుట అనుభవసిద్ధము.

ప్రాచీనార్వాచీన భేదముల తెఱ తొలంగించి కేవల కావ్య మాత్రాను సంధానముచే సహృదయుడు ఆ యా దేశకాలాది పరిచ్ఛేద మును అతిక్రమించి కథా కాలీన దేశకాలాది మహానుభవములచే పరవశు డగును. అది సహృదయానందము. పాక్షికము కృతకమునైనది ఆ భాసమే యగును. అట్టి పారవశ్యమును కల్పించు రసవద్రచన కవికిని, అహంకార మమకార ప్రముఖ పాక్షిక భేదరాహిత్యము సహృదయునకు కలిగినపుడే కావ్యము కావ్యముగా భాసించుట! వైయక్తికములగు గుణ దోషాదులను కావ్యములం దారోపించుట జేసి కావ్యానందమునకు భంగమే కాని ఆనందాస్వాదము కలుగదు.

శ్రీ నారాయణదాస మహాసారస్వత శిఖరినుండి వెలువడిన కావ్య వాహిను లన్నియు అకలుషములు నాపాతమధురములును.

ఇష్టదేవతా ప్రార్థనానంతరమున సామాజికులను పాంచభౌతి కములైన వికారములనుండి దూరముచేసి కథా విమల వాహినిలో నవగాహింపఁ జేయవలెను. ఆ విషయమున వీరి యీప్రజ్ఞ తీరు చూడుడు.

''దిక్కుమాలినయట్టి దీనులఁ బొడగాంచి
జాలితో గరుగు దయాళులార !
పరులచే మంచికి బదులు కీడుంబొంది
శోకింప బోవని సుజనులార !
ధనముల నార్జించుకొనుటకు క్షుద్రబు
ద్ధులెడయు నల్పసంతుష్టులార !

స్త్రీ భోగములకు నిస్పృయని వైరాగ్య
వృత్తికై యత్నించు విమలులార!

దంభముం జూపఁబోని సత్యరతులార!
నీచమనుజుల గొలువని నిపుణులార!
వినుడు మీరెల్ల దేవుని గుణకథనము."

ఇందు దయాళుత్వము శోకరాహిత్యము క్షుద్రత్వాభావము అల్పసంతుష్టి వైరాగ్యప్రవృత్తి దంభరాహిత్యము సత్యరతి నీచాశ్రయనిరాసముఖప్రీతిహేతుకాసత్యవచనాప్రవృత్తి సామాజికధర్మములుగా ప్రబోధించి వారిని ఇంత సాధుమార్గమునకు మరలించి కథాప్రస్తావము చేయుట ఎంత ఉచితము.

వెంటనే తన ధీరవినయముద్రతోఁడి అల్పజ్ఞతను విడబడిచెప్పి, సంపూర్ణపాండిత్యమూనినట్లు చెప్పుకొనుట పిచ్చికళలని తన వ్యక్తిత్వముతోఁపాటు వేసగాండ్రమోసమును చాటుట ఎంత చమత్కారము!! ఈ దినుసు అందరియెడ దొరుకదు. వీరికడ నిధి. దంభము వారికి బొత్తిగా గిట్టనిది.

"ధనభోగంబుల యాశచేఁబొడము నీతత్త్వప్రబోధంబు లీ
వినయంబుల్ మడిపంచెలున్నగరములన్ వ్రేలాడుమాలల్ నొసం
టను నామంబులు చేత బొత్తములు కంఠంబందు రుద్రాక్షలున్
దనవాంఛన్ విడనాడువారలకు నీదంభంబు లింకేటికిన్?—"

అని ఒక మత్తేభమును విడిచి యూరకున్నారా? తాళానుగతితో శ్రుతి మేళవించి నృత్యభంగ సంగతముగా మిశ్రగతిలో భైరవముగా ఒక గీతి నాలాపించినారు. పరమార్థ మెటుజిక్కునని ఏవపడినారు. ఇందలి రాగతాళములు సాభిప్రాయములే! విశేష్యమైన గీతమునకు రాగతాళములు విశేషణీభూతములే! కావున విశేషణము సాభిప్రాయమైనపుడు పరికరాలంకారము, సాక్షాద్వాచ్యతాస్థితినందక వ్యంగ్యమగుటచే పరికరధ్వని.

తమకు నచ్చని యంశమును మొగమాటములేకుండ నవ్వుచు నెదుటనే త్రోసిరాజనునేర్పు వారి సహజసంపదలలో నొకటి. వసంత రాగము చతురస్ర గతిలోని ఈ కీర్తన

"జన్మము లెత్తనేల ? సమసి జముని దరిగూల
.... .... .... ... ...
పాగా కోటులతోడ రచ్చగా పటాటోపములుసేసి,
వేవేగ లంచములుమేసి, కడుబీద కొంపలందీసి,
చెడుకూట సాక్ష్యములగూసి,— జన్మములెత్తనేల ?—
ఇచ్చకముల బల్కుచు రాజులకడ యెంగిలిబ్రాందింద్రావి
కలు ముచ్చులతోడంబోగి, పరుమెచ్చక కొండెమువాగి,—

ఇప్పుడెక్కడ చూచినను ఈ ధర్మములు చతురస్రములుగా వసంత సమృద్ధివలెనే నిండియున్నవి. చెడిచెదారములైన నాలుగు వర్ణములను అచ్చముగా చిత్రించినారు. ఇది వర్ణనముగాదు. 'ఎక్సరే' తీయుట వంటిది. జాతిగతమైన ఒక దౌష్ట్యమును నిరూపించుటయేగాక దానిని వినగనే నవ్వుపుట్టించుట వారి నేర్పు.

తాను చూచిన దృశ్యమును భావించిన భావనను ఇబ్బడి ముబ్బడిగా సహృదయానుభవమునకు వచ్చునట్లు చిత్రించుట మహాకవి లక్షణము. ఆ లక్షణము వీరికి ఆజన్మసిద్ధమైన వరప్రసాదమో! లేక గురుప్రసాదమో! వారి లక్ష్యమున ఎన్ని విరోధము లేర్పడినను పట్టు విడక ప్రక్కదానిని పొదుపుకొనుచు వచ్చుట వీరి మరొక విశిష్టత.

దేశము భక్తి దరిద్రమైనపుడు, భారతీయవాసనా దూరమై నపుడు, అన్యవాసనాదూషితమైనపుడు అచ్చమగు భారతాత్మ పడియెడి తహతహను చూడుడు.

"సర్వ శ్రుతి స్మృతి శాస్త్రంబులకు మూల
కందమై విఖ్యాతిఁజెందె నెద్ది
సంతత జపతపస్స్వాధ్యాయ సత్యవ్ర
తావనీసురులచే నలరెనెద్ది

స్వచ్ఛంద రాజ్యసంపదగల్గి పావన
చరితులౌ నృపతుల పరలెనెద్ది
గణియించుటకు నశక్యంబైన కాలంబు
నుండి నాగరకత నిండెనెద్ది

మొదట దేవుని యున్కి నీ భూజనముల
కందరికి నెద్ది తెల్పెనో యట్టి భరత
ఖండమునఁ జెట్టు చచ్చెడు కాలమునకు
మురుగు పిందెలవలె నిప్పు పుట్టె జనము.

వెనుకటి ఔన్నత్యము నేటినైచ్యము నెంత సూటిగా చెప్పిరో ! ఇది వారి తహ తహ.

ఉపకారమెంతయో చేసి ప్రతిఫలముగా బక్కచిక్కి కన్నీరు గార్చుచున్న పశువుల జంపు మార్కట్టు, అసంభవసుఖమును గోరి చేయు నజమేధము, బ్రాందికి తోడుగా బీఫు భక్షించు (బీఫునకు అర్థము నాకు తెలియదు. కాని పెద్దలవలన దాని యర్థము గోమాంస మని తెలిసితిని) జాతిమాత్రోపజీవుల హేయవృత్తి, అతిబాల్యమున వృద్ధునితో స్తనంధయకు గావించెడి పెండ్లి వారిమనసును కొంచెము కలవరపెట్టినను తీర్పజాలిన భగవంతుని కేకపెట్టుట ఉత్తమభక్త లక్షణము. బ్రహ్మ సత్యస్వరూపముగదా ! ఆ సత్యస్థితిని గమనింపుఁడు-

కేవల ధనమునకై తగనిబేరములు చెప్పు వర్తకుల నోటికి గడ గడ వడకివడకి పోవుచున్నది. దీనుల కొంపల దీయుటకై ప్లీడరులు పలికించెడి కూటసాక్ష్యములకు మిక్కిలి కుందుచున్నది. లంచముల మేయు నున్నతాధికారుల కలముల కన్నీరు గార్చుచున్నది. సోమరి పోతులై తత్త్వము నెఱుఁగక కావించెడి మతగురువుల దురుపన్యాసాగ్నికి మలమలమాడిపోవుచున్నది.

సాధుమైత్రి చుక్కానిగా కులాంగనల సొమ్ముగా సువ్రతములలో ముఖ్యమ్ముగా వేదసరస్సులలో విహరించు సత్య రాజహంసి స్థితి మనము

మరచిపోదమన్నను మరపునకు రాకున్నది. ఆహా! ఏమి కథాప్రవేశ వైచిత్రి! దానికి హరిశ్చంద్ర కథ కావలెను. కథాప్రవృత్తి హేతువును సోపపత్తికముగా సరసముగా సాధుసుందరముగా ఎంతటి చిత్రణము చేసినారు! ఈ చిత్రణముతో సభయంతయు పాలరాప్రతిమల కొలువు వోలె కలకల లాడదా!

ఇకను కథాప్రారంభము చేయవలెను. అయోధ్యాపుర వర్ణనముతో కథ మొదలైనచో దేవలోకవృత్తాంతము జారిపోవును. జారవిడువరాని దేవలోకవృత్తాంతము నెట్టులందగించుచున్నారో చూడుడు.

మానవుల వాసనలులేనిచోటు. నిద్రాక్షుత్పిపాసలు లేనిచోటు. నీరోగములైన శోకరహితములైన మనస్సులు. బాధకములుగాని ఋతువులు శాశ్వతమన్న బ్రిదుకులుగల చోట నీ సత్య ప్రసక్తి వచ్చినది. పూర్వులు నిట్లే నడచిరి. కాని తన్నిరూపణములో భేదమున్నది. ఏవిధమైన యొత్తిడి లేనపుడు పలికెడి సత్యవచనమునకును, ఒత్తిడి వచ్చినపుడు పాలించెడి సత్యదీక్షకును పోలిక లేదు.

కవిత్వమునకు సామాన్యముగా ధారాశుద్ధి అలంకార నిర్వహణము అర్థాభివ్యక్తి వ్యంగ్యమర్యాద మొదలుగా వారివారి తాహత్తుననుసరించి పట్టికను వల్లెవేయుదురు. దాసుగారి తొట్టతొలి పద్యము నుండి మట్టమలి పద్యమువరకు ఒకే విధముగా భాసించుటను పెద్దలు గ్రహించియే యుందురు. (శ్రీ) దాసుగారు సాహిత్యమున కారణజన్ములైనారు. ఏమనగా తడవులాట ఏ భాగమునకు తోపదు. "ప్రవేదిరే ప్రాక్తనజన్మ విద్యాః" అనిగదా కవికులగురుని అనుశాసనము!

భావుకుడైన కవి రససిద్ధుడైన కవి పలికెడి ప్రతిపద్యము రసభావ సమన్వితముగా ఉండుట, సముచితాలంకారాది గుణసుందరముగా నొప్పుగుట మహాకావ్యములనుండి మనము గ్రహించుచున్న విషయము

అల్లీ వీరును సర్వాంగ సుందరముగా భావించి కావ్యము కావించుట మనము ప్రత్యేకముగా గమనించవలసి యున్నది.

కవిత్వమునకు ముఖ్యమైనది ధారాశుద్ధి. ఇది లేక ఒక పద్యము గాదు సరిగదా ఒక పాదమేని జరుగదు. జరిగినను అందచుకులుగా నుండును. కాన ధారాశుద్ధి ముఖ్యము. వీరి పద్యము వచనము మొత్తము ధారాశుద్ధికి దృష్టాంతములే యగుచున్నవి. క్లిష్టాన్వయములుగాని అపృష్టార్థతలుగాని వారి కవితకు సంభవింపనివి. కమ్మచ్చున తీగెలాగినట్లు నిర్మల గంగాప్రవాహము సాగినట్లుగా ఊఱుకులు తీయునే గాని మెఱకలు వేయదు.

"కలువలు తామరల్ గల మంచికోనేళ్ళ
యొడ్డునఁ గోవెల లొప్పుమీర
చౌకమౌవీథుల జలయంత్రముల ప్రాపు
నెగడి తీగెలు చెట్లు నీడలొసగ
కటిక దుకాణముల్ గలుగక యంగళ్ళ
మిగులవస్తు సమృద్ధి మిగులుచుండ
వైద్యశాలలు నెల్లవిద్యలకుం బడుల్
ధర్మసత్రమ్ములు దనరుచుండ

కర్మసంపూతులౌ వారి కాపురమ్మొ
కాంచనాంబర విభవాల కాపురమ్మొ
తగు హరిశ్చంద్ర కీర్తికి దాపురమ్మొ
అరిభయంకరమౌ నయోధ్యాపురమ్మొ"

"రోగులు పాపకర్ములు గురూపులు మచ్చునకైనఁ దోచ రీ
నగరులందటంచు మునినాథుడు కౌశికు డద్భుతంబునన్
డొంగుచు కంటఁజొచ్చి కనె తోయజమిత్రున కర్ఘ్యమిచ్చుచున్
సాగిలి మ్రొక్కుచుండిన త్రిశంకు తనూభవు దివ్యవైభవున్"

"సప్తద్వీపము లేలునప్పుడు, సమస్తప్రౌఢ సామంత రా
డ్నృపవ్యూహము దోలునప్పుడు, పురంధ్రీరత్న మిల్లాలితో
గుప్తక్రీడలఁ దేలునప్పు డిపుడుం గోరంతయు న్వాసి మ
త్తృప్తిందోచదు నిత్యసత్యరతునిన్ ద్వేషించుగా సంపదల్."

"మిముఁ బొడఁగాంచి సంతసము మీరితిఁ దేనియలొల్కు మీదు గా
నము వినినంత మైమఱచినాఁడను మీ ఋణమెట్లు దీర్తు బో
య మగువలార! మంచినగలా! మణులా! సరిగంచు చీరెలా!
క్రమమగు గోర్కె యేమయినఁ గాదనకిచ్చెద వేడుఁడిత్తఱిన్."

ఈ పద్యమునందు క్రమమగుపదము లేకున్నచో హరిశ్చంద్రుని ఆత్మీయత నశించెడిది.

ఇవి యవి యని పేరెత్తి చెప్పఁబనిలేదు. మొత్తమే యుదాహరణ మంటెనిగదా! నా యనుభవములో పరీక్ష వేరొకటున్నది. కొంత కథాభాగమున నాపి మరల కొన్నాళ్ళకు ప్రారంభించిన వెనుకటి తీరునకు నేయంశమునను భేదములేకుండుట ధారాశుద్ధియని నా నమ్మకము.

ఈకథ యంతయు ఒకపట్టున ఒకఊపున వ్రాసినట్లే తోచును గాని రోజుల వ్యవధానమైననున్నట్లు సన్నని సందేహము పొడమదు. ఆ ధారాశుద్ధి యట్టిది.

ఇక లోకోక్తులను సమయోచితముగాఁ గూర్చుటలో వీరి కృత హస్తతను తిలకింపుఁడు.

ఇంద్ర సభలో సత్య ప్రసక్తిరాగా వసిష్ఠుడు హరిశ్చంద్రుని ప్రస్తావించుచు పలికిన పలుకు.

"ఒడిఁగల బిడ్డంగానక
నడలుచు నూరెల్ల వెదకునట్టులు"

విశ్వామిత్రుడు వసిష్ఠుని యాక్షేపించు సందర్భములోని

"తలుపు ద్వారబంధమ్ములేక
తాటించెదవా నీ నాల్క ?"

విశ్వామిత్రుని అవహేళనచేసెడి వసిష్ఠుని యీతీరు మెచ్చదగినది.

"ఎద్దు మంచమెక్కినట్టు
లెనసితివా బ్రహ్మఋషిత్వము ?—"

ఎద్దులు మంచమెక్క వీలులేదు. కవి సమయసిద్ధముగాదు. కాదని యెక్కిన నా మంచము నిలువదు.— దీనినుండి ఫలశ్రుతి స్ఫురించుట లేదా !

ఇట్లే వీరి సామెతలన్నియు సందర్భశోభితములు. ఆ సామెతతో ఆ ప్రకరణము శోభించుటేకాక పాఠకునకు శ్రోతకు ఒక సన్నని చిఱునవ్వు పుట్టించు నంతశ్చమత్కారముగలవి. చూడుడు ! వసిష్ఠ విశ్వామిత్రులకు తొలినుండి "పులి పంది వారడి నెగడుచున్నదట ! భ్రమపడకుండుటకై క్రమాలంకారముతో రక్షించుచున్నారు.

"పాము చావదు పగులదు కఱ్ఱ"

వ్యర్థ సంభాషణమనుటకు శ్రీవారి జాతీయము.

ప్రజలు క్రూరమృగబాధ సహింపలేక హరిశ్చంద్రునితో విన్నవించుకొనెడి సందర్భములోని

"తంటమారి దయ్యమేదో యున్నది"

నిజముగా తంటమారి దయ్యము విశ్వామిత్ర మాత్సర్యము ఉన్నదేకదా !

"అందరాని పండున కాసించుట" "రోగవంతునకు విందు రుచింపదు" "దయ్యమువలె తాళనీడు" ఇవి మూలకన్నెల మాటతీరులు. ప్రకృత కథానుకూలముగా వారి మనస్సులు ఈ సామెతలలో రూపు కట్టుచున్నవి.

హరిశ్చంద్రుఁడు మాలకన్నెలను తిరస్కరించి రాజ్యమిత్తుననగా మాలెతలు తమ బాధను తెలిపిన తీరు

"లోనఁ గౌరవిపెట్టి పై నీరుచల్లునట్లు—"

వారి బాధమాత్రము నిజముగ నట్లేయున్నదని శ్రీదాసుగారి ప్రత్యక్షర సాక్ష్యము సత్యదూరముగాదు.

హరిశ్చంద్రుడు సందిగ్ధావస్థలోనుండగా చంద్రమతి భర్త సత్యవ్రత రక్షణకుగా మాట సాయము సేయుట;

"పుట్టించిన వాఁడు పూరిమేపునా !"

రాజ్యమిచ్చి వెడలు హరిశ్చంద్ర కుటుంబములో నక్షత్రకుడు "ఎదురుచుక్కగా" వచ్చినాఁడట !

"మీనమేషములు లెక్కించుట" ఋణముతీర్పక ఆలసించు హరిశ్చంద్రుని తొందరించు నక్షత్రకుని వాక్చమత్కారము. మీతో తిరుగు నాకు "మోక్షమా స్వర్గమా !" అని విసువు.

చంద్రమతిని కొనుటకు వచ్చిన వృద్ధమర్కటాకారుడైన విప్రుడు "ఏలినాటి శనివలె" దాపురించినాడట !

అమ్ముడుపోయిన చంద్రమతి కొడుకుతో వెనుకటి తమ వైభవమును, ఇప్పటి తన స్థితిని— పోల్చి,

'నేతిబీరవలె నున్నది'— భేష్.

రాజ్యముపోవుట, బానిసతనము ఈ రెండును "గోరుచుట్టుపై రోఁకటి పోటువలె" నున్నవట ! ఎంత సమయస్ఫూర్తి !

వీరబాహు పోలికతో వచ్చిన విశ్వామిత్రుడు హరిశ్చంద్రుని గర్హించెడితీరు "వట్టి గొడ్డు తాకట్టు పోల్కి" నిన్ను గొనుటచే "ఒట్టు పెట్టినట్లు లొక్క పీనుఁగుగూడ వచ్చుటలేదట !" ఒట్టునకంత నిష్ఠ.

వీరి సామెతలు లోకానుభవ ప్రసిద్ధములైనవి. కృతకములుగావు. రత్నమును బంగారున పొదిగినట్లుగా భూషణ భూష్యభావము కాళిదాసు నకువలె వీరికి సహజమేమో అనిపించును.

వీరి యలంకార నిర్వాహణము మరింత విస్మయావహము. అందును "ఉపమైక శరణాః కవయః" అను నాలంకారికోక్తికి చాలమంది కవులు లక్ష్యము కాలేకపోయిరి. సంస్కృతమున కాళిదాసే ప్రసిద్ధుఁడు. ఆతనికిని వాల్మీకియేగదా జీవము! తెలుగున వీరి ఉపమా ప్రతిభ దిగ్భ్రాంతి గొల్పును.

"కలలోన కష్టముల్ తొలఁగినయట్టులు
　　　నప్పు దేలిన నూపిరాడినట్లు
పెనునగాధము దాటి వెల్లడిగనునట్లు
　　　చెదరిన సిరి మళ్ళిచేరునట్లు
సతత శంకితము విస్పష్టంబునైనట్లు
　　　మూర్ఛదేరిన తెల్వి మొనయునట్లు
ఆసవిడుచు నర్థమది యుట్టిపడ్డట్లు
　　　ముప్పను గారడి ముగియునట్లు

హాయిగా రాచదంపతు లర్భకుండు
బ్రతుకుగని కౌశికమునీంద్రు బ్రస్తుతించి
ఎల్లదేవతలకు మ్రొక్కి ఋషుల కెరగి
యెంతయుం గల్మి పుట్టిలౌ యిల్లుచేర."

ఈ పద్యమునందలి యుపమలు హరిశ్చంద్రకథా ప్రతిబింబములు. కల గనుట, అప్పుపాలౌట, అంతులేని కష్టములందుట, సిరి చెదరుట, సతత పారస్పరిక క్షేమశంక, దుఃఖాది విశేషముచే మూర్ఛ, ఆశవదలుకొన్న లోహితాస్య జీవితము, ముప్పను గారడిలో నూపిరాడక తిరుగుట— ఈ చివరి క్రియావిశేషణములు పైవానికి విరుగుడు. తొలఁగిపోవుట, ఊపిరాడుట, వెల్లడిగనుట, మళ్ళిచేరుట, విస్పష్టమగుట, తెల్వి మొన

యుట, ఉట్టిపడుట, ముగియుట, ఈ యెనిమిదియుపమలును అష్టకష్ట ములను తొలగించుకొని అష్టైశ్వర్యముల నందుటకు ప్రతిరూపము. ఇది నిర్వాహణములోని ప్రజ్ఞ. ఈ సింహావలోకనప్రజ్ఞ మహాప్రసిద్ధ కవులకే లేదనవచ్చును. వీరి యీ యుపమామాల రత్నమాల వంటిది. "ఉపమా కాళిదాసస్య" వలెనే "నారాయణస్యోపమా" అని మెచ్చ దగినది.

శబ్దాలంకారములు చాలమంది తెలుగు కవులకు ఆదరపాత్ర ములు. అవి రసభంజకములా ? రసాభివ్యంజకములా ? అన్న ప్రశ్నతో పనియే వారికి కలుగదు. ప్రబంధములో కొన్నితావుల ఈ శబ్దాలంకార రజ్జుబంధము సర్పబుద్ధినే కలిగించి బెదరించి రసానుభవ నిధానము వంకకు పోనీయవు. అవి కొన్ని తావుల రసప్రవణులగు కవుల శబ్దాలంకృతులు రసవిరోధులుకాక రసానురోధులగుట మన మెఱుఁగుదుము. ఈ హరి శ్చంద్రోపాఖ్యానమునందలి శబ్దాలంకారములు రసాభివ్యంజకములగుట సహృదయులు గుర్తింపవలసినది.

"చదువులకుఁ జెంపపెట్టు దోసములపట్టు
వ్యసనములకొట్టు పుణ్యకార్యముల తిట్టు
పాపములమెట్టు కడుబట్టబయలు గుట్టు
నీచు పనిముట్టు సత్తెమే రాచపుట్టు."

పై సీసమునందలి యుబ్బి యుబ్బి, క్రొవ్వి క్రొవ్వి, మునిగి మున్గి, పెట్టి పెట్టి అను నామ్రేడితములు అర్థవిశేషముతోపాటు శ్రవణసౌభాగ్యమును కూడ సంతరించుకొన్నవి. ఇట్లే హరిశ్చంద్రుఁడు మూర్ఛితుడైనప్పటి అవస్థను వర్ణించు విశ్వామిత్రుని వచనములు అప్రయత్నముగా అంత్యా నియమముతోనే వెడలినవి. కూర, మీర, జార, వార ఈ శబ్దములు ప్రస్తుత కరుణకు భంజకముగావు. పోగా గేయపద కవితలకు శబ్దాలం కృతి యలంకృతియగుట పెద్దలెఱిగిన విషయమే! తాళానుగతిని

మృదంగసంగతిని పరిపోషించునవి యని గేయకవితా రహస్యజ్ఞులకు విదితమే! ఇట్టివి పెక్కులున్నవి.

నారాయణదాస వచనములన్న ప్రఖ్యాతి హరికథా కథకలోకమునకు శ్రోతృలోకమునను నిబిడముగా నావరించుకొన్నవి. రాగముతో మేళగించి వచనమునుసాగదీసి చదువునప్పుడు సామాజికులకు మైమఱపు కలిగించుట ఈ వచన ప్రత్యేకత. మరియు ముక్తపదగ్రస్తత, ఉపమా సుందరత, యీ వీరి వచనములలో అలవోక తొణికిసలాడుచుండును. బాణభట్టు కాదంబరీ వచన విధానము వీరికి మిక్కిలి ప్రీతిపాత్రము. "యజ్ఞశాలంబోలి పశుహింసకాకరంబై, వంటపుట్టి భోజనంబు మాడ్కి సంతతాపవిత్రంబై, జారిణిపోల్కి పరమనీచంబై, కృతఘ్నుకరణి హేయంబై, నాస్తికురీతి వేదబాహ్యంబై, నవనాగరక మతంబుతీరున హాస్యాస్పదంబై, శత్రునికైవడి మార్గదూరంబై, గర్వితదృష్టి తెన్నున నిమ్నోన్నతంబై, సేవకు తెఱంగున కష్టజీవనంబై, శుష్కవైయాకరణు తెఱంగున యుక్తవిరహితంబై"-ఈ విధముగా నెంతదూరమేని ఎన్నివిధములైన యుపమలతోనేమి చిత్ర చిత్ర భంగులలో సాగిపోవునేకాని యాగదు. ఆగుట వారి యభీష్టమేగాని వారి ప్రతిభా పాండిత్య దారిద్ర్యము వలనగాదు.

ఇక వీరి వర్ణనయు ప్రత్యేకముగా విశిష్టముగా గుర్తింపదగినది. వీరి యుచితజ్ఞత వర్ణనలనుండి, పదప్రయోగమునుండి, రాగతాళనిర్ణయములనుండి మనము తెలియవచ్చును.

హరిశ్చంద్రుఁడు వేటకు బయలుదేరినమార్గము నారాయణదాస వచనమువలె మనోజ్ఞమనోజ్ఞముగా నున్నది. ఛందోనిబంధములేని వచనములలోకూడ ఛందోమర్యాదలను పాటించినట్లు (వృత్తగంధివలె) హరిశ్చంద్ర దూరప్రయాణమువలె వచనము సాగినవి.

తరువాత పవలురాతిరి యనక సాగిన హరిశ్చంద్రుని పయనము మరల వచనమున నప్పినది. మరల హరిశ్చంద్రు డమ్ముడువోయి వీర బాహుని వెంట మాలవాడ కరుగుఘట్టము కాదంబరీ జ్ఞాపకముగా దొరలి వచ్చినది. ఇవి మహాప్రబంధాలంకారములు కాగల వచనములు. అధి కారియగు వీరబాహుడు నీవేమి చేయగలవనగా

"కొండనైనఁ బిండిగొట్టఁగఁజాలుదు
నబ్ధినైన నింకునట్లొనర్తు
శస్త్రవహ్నిచేత జగమైనఁబొలియింతు
కాని ఆడి తప్పలేని దొకటి''

పై కొండపిండిగొట్టుట, అబ్ధినింకించుట, శస్త్రవహ్నిచే జగమును పొలి యించుటలు అసంభవములు. ఆమాటని హరిశ్చంద్రుడు సంభవములు చేయగలడు. కాని లోకమున ప్రత్యక్షమగుచున్న ఆడితప్పుట నాతఁడు చేయఁజాలడు. అట్టి ప్రభుని కొలువు ప్రదేశము— ఒకచోట వెదురు నిచ్చెనలపై పీనుగులు, కుండల నుబుకు మంటలొకచోట, కటికియొజ్జల మంత్రకర్మములు, అత్తెసరులుడుతంపులు, శవములకు శకునములుతీర్చు కాకులు, ఏడ్చెడి బందుగులు పాతినశవములను పైకిపైకిలాగు నక్కలు, ప్రేవులీడ్చుకొనిపోవు గ్రద్దలు.— ఇది యాతని కొలువుపట్టు. ఇట్టిస్థితిలో ఎవ్వడేని ఎంతవాడేని యేమిసేయగలడు ?

ఆలుబిడ్డ లేమయిరో! అంతటి విభవమెటుజనెనో!
కాలెడి పీనుగు బట్టల గట్టగ వ్రాసితివ విధీ!
కాటికి దిగతుడుచు కూడు కాకుల బెదిరించితినగ—''

అని వాపోయినాడు.

ఈవిధముగా పూర్వహరిశ్చంద్రవైభవమును ఇప్పటి హరిశ్చంద్ర దైన్యమును సూటిగా చెప్పగలిగిన నారాయణదాస కవివృషభులు దీని హరికథామాత్రముగాగాక మహాకావ్యముగా తీర్చినారనుట నిస్సం శయము.

ఇక్కడ కృతిపతి సంబోధనము చేసినారు. ఇది ఆశ్వాసాంత మన్నమాట. ఈ విరామము హరిశ్చంద్ర నిబిడదుస్సహార్దైన్యవ్యంజకము.

నాలుగుభాగములుగా కథను సర్దుటలో ధర్మార్థకామమోక్ష స్వరూప ప్రతీకతను సంపాదించినారు. ఇట్లే సమయోచితముగా వర్ణనము లందు వారుచూపిన నేర్పు స్తుతిపాత్రమైనది.

సంక్రాంతిభోగి పుష్యమాససంపద ఒకటిరెండు పద్యములలో వర్ణింపఁబడినది.

''ముంగిట వాకిళ్ళ ముగ్గులఁజెన్నొందు
కల్మికూర్పుల నెలగంటముందు
అత్తవారింటిలో నల్లుఁడున్న పసందు
వెల్లుచూపుల బోగివేగు సందు
పెతలకెల్లరికిఁ బేర్వేరుసఁ బిలుపంపు
రచ్చపండువగు సంక్రాంతి పొందు
పాటలాటలు దక్కి పనులన్నిటికిబందు
కమ్మజాతర పేదకాపువిందు

ప్రొద్దురాకకు నిట్టూర్పు పొగలజిమ్మ
క్రొత్తచావును వడ్లను గుత్తకమ్మ
కుంపటులు గౌగిళుల్ కోరికొన్న సొమ్మ
పౌష్యమాసమ్మ సర్వసంపోషణమ్మ.''

ముందువాకిళ్ళముగ్గులు అత్తవారింట నల్లుడున్న పసందు 'శ్వశురగృహ నివాస స్వర్గతుల్యోనరాణామ్' అనిగదా! చాటూక్తి. భోగిమంటలు, విందుపిలుపులు, పేదకాపులవిందులు, క్రొత్తపంటనైవేద్యములు, కుంపటులు, కౌగిళ్ళు ఇవన్నియు నీపండుగకు అసాధారణ చిహ్నములు సర్వ సంపోషణమన్న విశేషణము త్రికాలాబాధితమైన సత్యము.

చంద్రమతి కావించెడి యూడిగము అప్పటి ఆమె వెతలు దుర్భరములు. రసపరిపోషణము ఇట్టి సముచిత వర్ణనముచేతగాని కలుగదు. ఆమె దినకృత్యమిది.

"మొరుము గన్పడక విసరవలె వేకువ
తోనె గంపెడు పిండి తోడులేక
ఇలుగుమ్మమలికి ముగ్గులువెట్టి యంతట
బుట్టెడు పిడుకలు పెట్టవలయు
చిటిగిన చిఱుతాటి చేదతో కూర పా
దులకు బండెడునీళ్ళు దోడవలయు
చిల్లర పనులెన్నిచెప్పిన చేసి చే
తులు చిల్లివడ నంట్లుతోమవలయు
తివిరి యజమానుడిట్లు బాధింపజొచ్చె
నింతపంతము మౌని కిదేలహెచ్చె
బాపురే యెంతవారి కీపాట్లుదెచ్చె
నాకు శోకము బదులుగ నవ్వువచ్చె."

గంపెడు పిండి మొరుము లేకుండ విసరుట, ఇల్లలికి ముగ్గువెట్టి పిడకలు సిద్ధముచేయుట, చిటిగిన తాటిచేదతో కూరపాదులకు సమృద్ధిగా నీరు తోడుట, చిల్లరపనులుచేసి చేతులు చిల్లులువడునట్లు అంట్లుతోముట, పూర్వవైభవమునకు ఇప్పటిదైన్యమునకు తనకు తనకే శోకమునకు బదులు నవ్వువచ్చుట ఆమె హైన్యమునకు పరాకాష్ఠ. ఈవర్ణన

"మన్నదనంబుగా నలుగు నూరియుఁ జందనమట్లు రాచియున్
.... ... మున్నటులున్న పాణితలముల్ బలుగాయలుగాచె చూచితే !"

ముగ్ధకులవధూ మందహాస సహోదరమై గుర్తునకు తెచ్చుచున్నది. అనగా సజాతీయమైన పలుకుబడి గలిగినపుడు గుర్తునకు తెచ్చుటలో నభ్యంతరములేదు. అన్నిటికంటె కొన్నయజమాని కసరుకొనుచు

"తరిపిదూడవలె నీతనయుడు సుంతయైన బనికిరాడా ?"

ఈ మాట విను వారికెంత వజ్రాఘాతముగా నున్నదో!

సందర్భ శుద్ధికి ఈ పద్యములు మచ్చుతునకలు—

"చేపువచ్చిన పాలు చిఱుతల కిడుటకై
సందెమళ్ళెడు నాలమందలార!
పుక్కిళ్ళ నాహారములు నించుకొని రహిం
బట్టుల కెగరెడి పిట్టలార!
చలువనీళుల మొలను గిడ్డు గదించి
యిల్లుచేరెడు పిల్ల తల్లులార!
మేటి కష్టముపడి పూట కూలింజేసి
తనయ పోషణకేగు తండ్రులార!

కుఱ్ఱఁడెచ్చోట నున్నాఁడొ గురుతుచెప్పఁ
దమ్మలా రయ్యలార! వృక్షమ్ములార!
సూర్యుఁడా! చంద్రుఁడా! భూమి! చుక్కలార!
యనుచుఁ బలవించు చక్కాంత యడవిఁ జొరగ."

"తనవంశజుఁడగు బాలుని మృతికై యబ్ధి
స్నానమ్ము సలుప భాస్కరుఁడు గ్రుంకె
పేదసాదల పాల పెనుభూతమై సంజ
మంచు దిక్కుల నీట ముంచుచుండె
పుల్గుల మూల్గులు పులి బొబ్బరింతలు
నడవి బీరెండల యార్పులొదవె
కొరవి దయ్యంబుల మరపించుమంటలు
పరికళ్ళముల యున్కి లెరుకఁజేసె

సందె యిట్టుల మీర నచ్చంద్రమతియు
నట్లు గానక కలయందు నరుగుపగిది
నెవ్వరో దారిచూపఁగ నేగి తుదకు
కొడుకు నొక్కెడఁ గాంచి యిట్లడలఁజొచ్చె"—

చంద్రమతి తనయాన్వేషణకై బయలుదేరినపుడు ఎదురువచ్చెడి యాలమందలు, పిట్టలు, పిల్లతల్లులు, తండ్రులు వీరందరును. సంతానపోషణకై శ్రమించి శ్రమించి బిడ్డలకై యింటికి మరలినవారే! ఇప్పుడు చంద్రమతి

బిడ్డనిక్తై యింటినుండి యడవికి బయలుదేరినది. దైవకాలవైపరీత్యమును ఎంత సుకుమారముగా ధ్వనింపఁజేసినారు. కరుణకు పై శకునములన్నియు నుద్దీపకములుగదా ! ఇపుడా తల్లి హృదయమెట్లుండునో! "ఏకోరసః కరుణఏవ" కదా। ప్రబంధములలో నిట్టి వ్యంగ్యధ్వనులు కానరావు.

రెండవ పద్యములోని సూర్యాస్తంగతత్వమును సూతకస్నానము నకై సముద్రమునఁ గ్రుంకినట్లుగా ఉత్ప్రేక్షారీతి అద్భుతావహము.

ఏ పద్యమునకాపద్యము ఏ పాటకాపాట ఏ మాటకామాట రస రాజధానిగా మలఁచుకొను నదృష్టమెందఱి కవులకడ నున్నది ? వీరి సందర్భశుద్ధి సముచితవర్ణనము రసపరిపోషణ అనన్యసామాన్యము.

చివరికి వీరు అయోధ్యకు తిరిగివచ్చుటను ద్విపదలో చెప్పినారు. ఇన్నాళ్ళుగాఁ గాశికి నడచిన వీరు భావింపలేని బాధలనందిన వీరు, చెడి చెదారమైన వీరు సత్యఫలముగా విజయమునుపొంది రెండడుగులలో దేవవిమానమున మళ్ళివచ్చిరను నర్థచమత్కారమును ఈ ద్విపద స్ఫురింపఁజేయుచున్నది. ఆహా ! సరసభావ భావనాంతః కరణుఁడుగనుక కావించిన కావ్యము ఏదైన రసభావ నిధానమేకదా ! చిత్తగింపుఁడు.

"రమ్యం జుగుప్సిత ముదార మథాపి నీచ
ముగ్రం ప్రసాది గహనం వికృతంచ వస్తు
యద్వా ప్యవస్తు కవిభావుక భావ్యమానం
తన్నాస్తి యన్న రసభావ ముపైతిలోకే".

పరస్పర భిన్నములైన సంగీత సాహిత్య నృత్య కలాసాహిత్యము ఏక రూపముగా నవతరించిన సారస్వతావతారము శ్రీ నారాయణదాసు గారు.. శ్రీ నారాయణదాసభారతి సర్వసుందరము. ఆలోచనామృతము.

జయంతిస్తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తి తేషాంయశః కాయే జరామరణజం భయమ్.

౨

# అచ్చతెలుఁగు విభాగము

## కృతి సమీక్షలు - వ్యాససమీక్షలు

# నారాయణదాసు నాటు తెన్గుసొగసు

శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

తెనుఁగు సారస్వతమున పందొమ్మిదవ శతాబ్ది నడిమి భాగము చాల ఉద్దండమైనది. ఆ ప్రాంతమున పుట్టువందినవారు ఎంత దిట్టలో అంత సంస్కర్తలు. ఎంత అభినివిష్టులో అంత భావోపప్లవ దక్షులు. ఆలోచింపగా, అదియొక విచిత్రక్షేత్రము! ఆదిభట్ట నారాయణదాసు ఒక్కఁడుకాదు; కందుకూరి వీరేశలింగముపంతులు, వేదము వేంకట రాయశాస్త్రి, చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి, గిడుగు రామమూర్తిపంతులు, మఱి తరువాత, గురజాడ అప్పారావు— వీరు వీరు ఎట్టివారో మన మెఱుఁగుదుము. ప్రహతమైన యొకసాహిత్యమార్గము వేయి యేండ్లుగా మనకు ఏర్పడియున్నది. పయి పెద్దలందఱు ఈ ప్రజ్ఞానమున పేరు మోసినవారుకాని, సాధారణులు కారు. వారి వ్యుత్పత్తిశక్తులు అసందిగ్ధములైనవి. ఒకటిమాత్రము మనము స్పష్టముగా అనుకోవచ్చును. ఈ వర్గములోని వారియొక్క ప్రతిభ చాల వైలక్షణ్యము కలది. ఆ వైలక్షణ్య మెట్టిదనఁగా, పరిక్షుణ్ణమైన త్రోవబడి నిమీలితనయనములతో పోవుటకాక, ఒక ప్రత్యగ్రమైనచూపు సంస్కారాపేక్షా సమార్ద్రిమైన యొక త్రోపు నిండుగా దీపిల్లిన గుణముకలది. ఈ గుణము ఒక్కొక్కనిలో ఒక్కొక్క విధముగా అంశభేదముతో అభివ్యాప్తమై లేదని చెప్పజాలము.

ఇపుడు ప్రసంగము నారాయణదాసు సంబంధి. హరికథా పితామహుఁడైన నారాయణదాసు మూర్తి లోకోత్తరమైనది. ఆయన మహాకవిత్వములో సాఁబాలు హరికథాకళలో స్ఫురితప్రసుప్తముగా నున్నది. ప్రఖ్యాతమో, అన్యమో ఏదేని ఇతివృత్తము తీసికొని వర్ణనప్రధానమైన ప్రబంధము వ్రాయుటతో కవి యనిపించుకొనుటకాక హరికథా రచనలో మహాకవిత్వదీక్షావిధి నందినవాఁడు నారాయణదాసు. ఆయనకు ఆయన సాటి. అనన్వయాలంకారమునకు ఉదాహరణభూతుఁడు. ప్రాఁతమార్గమున ప్రవణత్వము కలవాఁడు. శతకములు వ్రాసెను; సూర్యనారాయణ, ముకుంద, మృత్యుంజయాదులు. ప్రబంధములు వ్రాయకుండలేదు; బాటసారి గొప్పస్వతంత్ర రచన. ఆత్మ తత్త్వము మెత్తని మేలి తెలుగుఁలో నగపఱుచుటకు యత్నముచేసి కృతకృత్యమైన మంచి రచన. నాటకములును నారాయణదాసు వ్రాసెను; ప్రహసనములును వ్రాసెను. సారంగధర, దంభపుర ప్రహసనము ఆయన చిన్ననాఁటివి. నవరసతరంగిణి, జగజ్జ్యోతి మున్నగు వచనములు సరేసరి.

మఱి వక్తవ్యమైన మహోదార సాహసము, దుస్సాధములైన కొన్ని గ్రంథములు నాటు తెనుగులోఁ బెట్టుట యొకటి. లలితాసహస్రము తెనుఁగు పద్యములలో; విష్ణుసహస్రనామము, భగవద్గీత తెనుఁగు పద్యములలో; నారాయణదాసు ధిషణానైశిత్యమునకు ఈ గ్రంథములు నికషశిలలు. తెనుఁగుభాషపై తెనుఁగుపలుకుబడిపై తెనుఁగుతనముపై నారాయణదాసు నభినివేశానురాగాదరములు వేఱొకచోట చూడము. "నాటు తెనుఁగనఁగా దేశీయమైనది; జాత్యమైనది; నాటు తెనుగులో నైసర్గికమైన సొగసున్నది. ఆ సొగసు ఎడ్డెలకుఁ దెలియదు. బండిఱా, అఱసున్న, ళకారము తెనుఁగుభాషకు ప్రత్యేకములు. అవిలేని సంస్కృత భాషనుండి తెలుఁగు పుట్టెననుట తప్పు. ఆ మాటకు వచ్చినచో తెనుగు మాటలనుండియే కొన్ని సంస్కృత శబ్దములు పుట్టినవి. కానిచో,

తెనుఁగు జనసామాన్యము నోళ్ళనుండి సంస్కృతపదములెట్లు దొరలును! కుప్పతెప్పలుగా తెనుగుశబ్దములు మనయూరిలో వాడబడుచున్నవి. మనము వినిపించుకొనము. మనకు పొరుగింటి పుల్లకూర రుచి, మనకు నెరవు సొమ్ములమీద మక్కువ.

"మొలకలేఁతదనము తలిరుల నవకంబు
మొగ్గ పోగదనము పూవుఁదావి
తేనె తీయఁదనము తెల్గున కేకాక
పరుష సంస్కృతాఖ్య భాష కేది !"

పయివి, తెనుఁగునుగూర్చి ఆదిభట్ల నారాయణదాసు కంఠోక్తులు. నారాయణదాసు నభిప్రాయము దురవగాహగంభీరమైనది. ఆయన సంస్కృతకవులలో జయదేవుని, తెనుఁగుకవులతో పోతనను మెచ్చెను. తెలుగు పల్కులల్లు నేర్పు పోతనకుఁదప్ప మఱేమాట లల్లువారలకుఁ గన్పట్టదట. నాటుమాటలలో చవిలేదన్న వారినిగూర్చి ఆయన "ఎద్దే మెఱుఁగు నటుకుల చవి" అని గేలిసేయును.

పరిహాసము చేయుటకాదు. నాటు తెనుఁగున మేటిరచనలు చేసి తాను నాటి పండితులను మెప్పించెను.

"మదమాతంగ తురంగ కాంచన లసన్మాణిక్య గాణిక్య సంపద" ఇత్యాది భారత పద్యమునకు "మస్తీ కిలాపము మంచి రెయొంట్రింపు లాలుపూస వెలవెలంది కలుములు ..." అనియు "సహసా నఖంపచ స్తనదత్త పరిరంభ మామూాల పరిపీడితాధరోష్ఠము ..." పెద్దనగారి యీ పద్యమునకు "వడి గోరువెచ్చ గుబ్బలఁ గ్రుమ్మ కౌఁగిలి గట్టిగ మొదలంట బట్టుమోవి" అని యీ విధముగాను నాటు తెనుఁగు వ్రాసి చూపెను.

మన పూర్వులలో కూచిమంచి తిమ్మన, పొన్నిగంటి తెలగన, ఈనడిమి వారిలో వీరేశలింగము అచ్చ తెనుఁగున కబ్బములు వ్రాసిరి.

కొక్కొండ వారన్నట్లు వీరు స్వీయ భాషాభిమానమాన్యులు. మిశ్రీ భాషలో మహాకావ్య రచనచేసిన వారిని గూర్చి నారాయణదాసు నంతరంగమున గౌరవము లేకపోలేదు. 'నాటు తెనుఁగు' ఒక ప్రచార ప్రస్థానముగా ఆయన కయికొనెను. తెనుఁగును గాదన్నవారిని ఆయన 'ప్రాచీనవిత్తులు' అని ఎత్తిపొడిచెను. 'తిప్పకాయ'లని తిట్టెను; సంస్కృత పదములకు డుమువు లతికి చెఱచిన మాటలతో బాజాఱు తెలుఁగు పలుకులు వ్రాసిన వ్రాయసకాండ్రను 'వదరుఁబోతు'లని విసరికొట్టెను. మన ప్రబంధకవులు 'కుకవినింద'లలో నన్న మాటలు వేయిరెట్లులు చేసి నారాయణదాసు వారిని మొగము వాయఁదిట్టెను. ఇది యంతయు నెందులకు! తన గొప్పకుఁ గాదు. తన జాతియొక్క తన భాషయొక్క స్వత్వము సౌందర్యము సమరసత్వము విస్మరించరాదనుటకే. నారాయణ దాసు 'సీమ పలుకు వహి' అచ్చ తెనుఁగు మాటలపేర్పు కూర్పు – ఇది యొక నిఘంటువు. ఈ పరిశ్రమ చూచినచో ఆయన అసాధారణమైన మేధాసమాధి మనము కొంతలోఁగొంత అర్థము చేసికోగలము. నేఁటి వారిలో నాటుతెనుఁగునకు వాగనుశాసనత్వము వహించుటయకాక, ఆ తెనుఁగు యొక్క సొగసునకు తన రచనలు లక్ష్యముచేసి చూపిన దొడ్డ కైసరుఁడు నారాయణదాసు. ఆయన కబ్బములనుండి. తెనుఁగు సేఁత కృతులనుండి, హరికథలనుండి కుప్పతెప్పలుగ దొప్పలు దోరలు తారాకాణములు ఎత్తి చూపవచ్చును.

ఓ చెలి! నీవు న్నేను మ
టీ చప్పని బడుగు బ్రతుకు లెనయుట కన్నన్
దోఁచినటు పొలిసి కోరిన
యాచవిఁ గొనఁ గ్రొత్తమంద లందుట మేలౌ!

ఇక్కడ 'మటీ చప్పని బడుగు బ్రతుకు' ఎంత ప్రౌఢసుందరముగా నున్నది! మఱియొకటి యిట్టిదే.

నడికారునకున్ జేలకు
నడుమ నలరు తోటలోన నావిడిదఁట; సం
దడి లేదు కొద్దిగొప్పల
గొడవ మఱి బ్రదుకు కోరుకొన్నటు కడచున్.

'బాటసారి'లోని యీ సీసము సువర్ణము నారయునది.

సీ. తొలి తెల్లకొండలవలెనున్న మొగుళులు
గొప్పలై నీలిరంగులఁ దనర్చె
దూదిపింజెలలాగు దొడ్డమబ్బుల నేకి
కరువలి పఱపులుగా నొనర్చె
వెండిచబుకుఁ ద్రిప్పివేసిన యట్టులు
మెఱుముతోడుతఁ బెద్దయుఱుము పుట్టె
నేలఁగమ్మనితావి నెగడించు చందంద
వలుదలై లెక్కచిన్కులు మొదలిడె

మింటికిన్మంటికిఁ దఱచు మీఁఱ వాన
యడుగులను దీఁగెల బిగించి యాఱవవడి
వీణె వాయించు నెఱజాణ గాణమాడ్కి
నందముల గుప్పి గాలి పాడం దొడంగె.

నారాయణదాసు హరికథలలోని తెనుఁగు సొగసు అనుభవైకవేద్యము.

' కిటికీలసందున దళుక్కున మెఱసి దోబూచులిడు రాణివాసము వలె తటాలువ దోచి తోచకుండు తీగెమెఱపులు''

"లేజవ్వనంపు పసందు, నాల్గవజాము గొంబ్రొద్దు వేగినసందు"

"పులుగులుం బ్రొద్దునకు మేలుకొలుపు పాడె''

"పసిఁడిమేనుల న్వెల్లయాకుటుడుపులం జుట్టుకొని ముత్తైదువల వలె పైకి పచ్చనికొసల మాత్ర మగపర్చు చెఱకుపైరు"

మఱియు నెన్నో యున్నవి. నారాయణదాసు నాటుతెనుఁగున కొక విజయస్తంభము నాటెన ఆటపాటల మేటి.

# దాసుఁగారి తెనుఁగు వహిల తీరులు

[అచ్చతెనుఁగు కృతుల సమీక్షలు]

శ్రీ మిన్నికంటి గురునాథశర్మ

## 1 సీమపలుకువహి.

చరాచర ప్రపంచము భూతభవిష్యత్తులందు మిథ్యయని సాధించి తద్ద్వారమున వర్తమానమందును మిథ్యయే యని యద్వైతులు నిరూపించినను వ్యావహారిక సత్యత్వమును మాత్రము వారి కంగీకరింపక తప్ప లేదు. అట్టి వ్యవహారము సక్రమముగా జరుగుటకు భాష యావశ్యకము. భాష లేకున్న భావములు సుస్పష్టముగా నన్యోన్యము వ్యక్తములు కావు. అట్టిభాష తొలిచదువులయందుండక తప్పదు. అందలిది తొలి బాసయనక తీఱదు. అది నేడు చూడ సంస్కృతమై వెలుఁగుచున్నది. అది దేశకాలాదులం బట్టి క్రమక్రమముగా నుచ్చారణాదులుం దోడుకాఁగా నానావిధములైనది. అందలి యొక విధమే తెలుఁగు విలాతి యందలి తెలుఁగుబాస. కాన తెలుఁగు తద్భవమని కొందఱు. తద్భవ మిశ్రమని కొందఱు. రెండును గాదని కొందఱు. మన నారాయణదాసుగారి దేమిటి? తెలుఁగు దేశ మున్నపుడు తెనుఁగుబాస యుండదా? తద్భవ పదములేర్పడక పూర్వము తెనుఁగు సీమలో వ్యవహారములు జరిగియుండవా?. ఇసీ! తెలుగు ప్రత్యేకమైన భాషయని పలికి, పలుకుటయేగాక అనేక గ్రంథములు నాటు తెలుగులో నవ్వారిగా రచించి నిరూపించినారు.

దాసుగారు తెనుఁగునందింత యభిమానము ఆదరము పట్టుదల చూపుటకుఁ గారణ మూహింపవలసినదే. సహగమన నివారణమునకు రాజారామమోహనరాయలేల పాటుపడెను ? స్త్రీ పునర్వివాహమునకు వీరేశలింగము పంతులుగారేల పాటుపడెను ? వ్యావహారిక భాష కొఱకు గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారేల పాటుపడెను ? ఒక్కొక్క కార్యమున కొక్కొక్క రవతరించినట్లు కన్పించుచున్నది.

వెనుకపడిన నాటు తెనుఁగును ముందునకుఁ దెచ్చుటకు నారాయణదాసుగా రవతరించిరా యని యనుకొందును. వీరు బాల్యమున నాంధ్రనామసంగ్రహ, శేషముల, కంఠస్థము చేసిరి. సాంబనిఘంటువు, ఆంధ్రభాషార్ణవము శ్రద్ధగా పఠించిరి. ఆవల మెల్లమెల్లఁగా శుద్ధాంధ్ర పదపారిజాతమును, వేంకటేశ్వరాంధ్రమును, లక్ష్మీనారాయణీయమును మఱికొన్ని నిఘంటువులను చెంతనుంచుకొని, ఆయా పదముల, నర్థముఁల, నిస్సందేహముగా నాకళింపు చేసికొని తనకు నిత్యోపయోగముకొఱకు, ఆవశ్యకమైన పదము వెంటనే లభించుటకొఱకు దండెమున నారవైచిన వస్త్రములవలె శబ్దములెల్ల స్పష్టముగాఁ గన్పించుచుండుట కొఱకు అకారాదివర్ణక్రమమున సార్థముగా తెలుఁగు పదములనెల్ల వ్రాసికొనిరి. అదియే దివసక్రమమున మార్పులు చేర్పులు కూర్పులతో పుస్తకరూపము వహించి "సీమపలుకువహి" యైనది. ఈ విషయమునే దాసుగారి "తెలుగు నోస్నేమరులు వెదకి యేర్చి కూర్చుకొననేరకపోయిరి" అను వాక్యము వెల్లడించు చున్నది.

ఎంత పండితుఁడును మొదట పామరుఁడే. పామరుఁడు శబ్దార్థాదుల సమగ్రముగ నెఱిఁగిన పిదపనే పండితుఁడగునది. విషయస్వరూపాదులంబట్టి శబ్దము పుట్టును. శబ్దముచెవిఁబడిన నర్థమునకు యత్నింతుము. శబ్దములు రూఢములు యౌగికములు నన రెండు తెఱఁగులు. పగడ, బైజ, కీర్తి, నుంకు, ఉజ్జ, మున్నగునవి రూఢములు. రూఢముల కవయవార్థములుండవు. యౌగికములకుండును. నిట్టపుట్టువు, మొయితాల్పు

మున్నగునవి యౌగికములు. యౌగికముల సృష్టించుకొనవచ్చును. తదర్థముల నతికష్టము మీఁద బయటికి లాఁగవచ్చును. రూఢపదముల మనము సృష్టింపలేము. వాని సంకేతితార్థముల నెంత తన్నుకొనియు బయటికి లాగలేము. ఇఁక గతియేమి ? నిఘంటువులే. ఇది యెఱింగి దాసుగారు ముందుగాఁ దనకు లభించిన నిఘంటువులనెల్ల వెదకి వెదకి తెలుఁగు పదముల నన్నింటి నొకచో నక్షరక్రమమున వ్రాసిరి. ఆ వ్రాయుటలో "తేనె తీయని తేట నాటు తెనుఁగు మాటలనే" తెచ్చుకొనిరి. తద్భవపదములన సడ్డచేసినట్లు కన్పించుచున్నది. ఈ 'సీమ పలుకువహి'లో 'కందు' పదమువఱకే కలదు. తక్కిన నిఘంటువంతయుఁ జూచి కాని దాసుగారి తలంపుంబట్టలేము. ఏలన తద్భవములఁగూర్చి వారి భావము వినుఁడు.

"బండిఱా, అఱబుజ (అర్థబిందువు) శ, లేని వేల్పునుడులనుండి తెలుఁగు కలిగెననుట వెడనుడుగు. కొన్ని పారసినుడువుల వేల్పునుడుల నుండి పుట్టిన తెలుఁగనుటతప్పు. సీమతెలుఁగుంబట్టియే కొన్ని వేల్పు నుడులు (సంస్కృతపదములు) పన్నఁబడెనేమో ! కానిచో వేల్పునుడి మంది (జనుల) నోళ్లకెటులబ్బును ? మిన్నేఱు నేలన్పాఱునా ?" అని యీ నిఘంటువులో తెలుఁగు సంస్కృతమునుండి పుట్టలేదు. మీఁదు మిక్కిలి తెలుఁగుంబట్టియే సంస్కృతము పన్నఁబడనేమో ... ... "ఎవరెవరికిఁ బుట్టిరో మొదలెవరైనఁ దెల్పగలరా ?" అనునంతవఱ కావేశముతో వెళ్లిరి. నాటు తెనుఁగుంగూర్చి సాటిలేని పాటుపడిన యీ యాటపాటమాటలమేటి మదితేటనే మనము పాటింపవలసియున్నది

ఇంతవఱకునున్న పండితకవులు తద్భవముల విడిచి నాటు తెనుఁగున కబ్బములు వ్రాయలేదు. మొదట 16-వ శతాబ్ది యయాతి చరిత్ర వ్రాసిన పొన్నిగంటి తెలఁగనార్యుడు, నడుమ 18-వ శతాబ్ది అచ్చ తెనుఁగు రామాయణమువ్రాసిన కూచిమంచి తిమ్మకవి, ఇటీవల 19-వ శతాబ్ది ఉత్తర భాగమున నైషధము వ్రాసిన కందుకూరి వీరేశలింగం

పంతులుగారు మఱికొందఱును అచ్చ తెనుఁగులో గ్రంథములు వ్రాసిన వారందఱును తద్భవ పదములం గూడఁ దీసికొని యెట్లో గట్టెక్కిరిగాని వానినివిడిచి సాముచేసినవారుగారు. కాకపోతే అచ్చ తెనుఁగు తోఁబాటు నిరోష్ఠ్య నియమముల గొందఱు పెట్టుకొనిరి. నిర్దద్య నియమముం గొందఱు పెట్టుకొనిరి. కొందఱుభయముం బెట్టుకొనిరి. అంతేకాని తద్భవ రాహిత్య నియమము నొక్కరుం గూడఁ బెట్టుకొనరైరి. అట్లైన భావముల నెల్ల స్పష్టముగా వివరింపలేమని వారు భయపడిరనక తీఱదు. మన దాసుగారొక్కరే యిప్పటికి తద్భవముల జోలికిఁబోక అనర్గళముగానే విషయమునైనను నాటు తెనుఁగులోఁ దెల్పిరి. కనుకనే దాసుగారు "నేల దినుసు లన్నిటిం గూర్చిన పలుకులకు నాటు తెనుఁగునఁ గొదువ సుంతయును లేదు" అన్నారు.

దాసుగారు తెనుఁగు, తెలుఁగు పదములను వాడుచుండిరి. తద్భవముల నంటరనెదరేమి ? అని మీరడుగవచ్చును. చెప్పెద వినుఁడు. దాసుగారి మాటలు "తెలువుడను పల్కు తెలుఁగనియు, తనివు-తెనుఁగు నోడువుగా వాడుక నలరుచుండును. బండిఱాలు, అఱ బుజలు (అరసున్నలు) గల నుడువుల నేర్పాటు గావింప నెంత చదువరి మేల్బంతులకైన నరముగాదు. తెలివిగలవారి పలుకునకుఁ దెలుఁగని పేరు. ఆ తెలుఁగు మాట్లాడగల వారే నిక్కముగాఁ దెలివిగలవారు. తక్కువారెల్ల మొక్కడులేయని యనకతీరదు. తెనుఁగు-తెలుఁగు-లను పలుకులు రెండు త్రినగము, త్రిలింగములను వేల్పునుడులనుండి పుట్టిన వనియు, స్బెక్కేల వేల్పునొడువునందలి పగడవ్రాయి (ఒకఅక్షరము) యైన నదియు నెట్లు మాఱిపోయిన:గాని యున్నఁజాలు నట్టి తెనుఁగు పల్కు వేల్పునుడి నుండి పుట్టినదని తెలుఁగుపలుకు పాడి తెలిసీ తెలియక, అఱవము ఇంటన్మాటాడుకొనుచు, వహి (పుస్తకము) నుండి తెనుఁగు నేర్చుకొనుచు, అఱవసీమకు, నెలుఁగునాడునకు, న్నడుమ నెలకొని తాము గూడఁ దెలుఁగు చదువరుల మనుకొను త్రుళ్లుఁబోతులు, కూటికక్కూఱితి

నేమేమో చెత్తకవిలె ఎల్లన్ వ్రాసి, అచ్చొత్తింపించి బొప్పంద్రన్నొప్పించి, దుద్దుకూర్చుకొనుచు నెఱుకగలవారివలెఁ దెగనీల్గుచు, సగటున వేల్పు నుడువుల నుండి తెలుఁగుపలుకులు పుట్టినవని వదరుచున్నారు" అని వ్రాసిరి.

వీరు వేల్పునుడి వలెన్నన్నట్టు నాటుతెనుఁగు నుడుగుల 395 పదములం జూపిరి. వానిని అక్షరక్రమమున వ్రాసిరి. అవి ఒకర్థమున సంస్కృతము మఱొక అర్థమున తెలుఁగు

గురువు-(తెనుగున) వేగపుపరుగు. (సంస్కృతమున) ఉపాధ్యాయుఁడు.

పంకము - (తె) క్షీరము - పాలు. (సం) బురద.

గాత్రము - (తె) లావు. (సం.) శరీరము.

ఇత్యాదులు.

తల్లి - (సంస్కృతమున) జవరాలు. (తెలుగున) మాత.

మూల - (సం) ఒకనక్షత్రము. (తె) కోణము.

ముసలి - (సం) ఉడుము, బలరాముఁడు. (తె) వృద్ధుఁడు.

కల - (సం) చంద్రకళ (తె) స్వప్నము.

మొదలైనవి.

మనకు వినుటతోడనే గురువు, పంకము, గాత్రము, మొదలగునవి సంస్కృతములనిపించును. తల్లి, తాత, మూల, ముసలి, కల, తల, ఈ మొదలైనవియు తెలుఁగులనిపించును.

ఇంకను వారు లోతుకుదిగి చేసిన పరిశ్రమను చూడుడు. "నాటు తెలుఁగని కొందఱు, కాదని కొంతమంది, వేఱువేఱుగాఁ జేర్కొన్న తెలుఁగు పలుకులు" అని కొన్ని వందలు చూపిరి. మఱియు "వేల్పునుడి బోలి యినుమంతయు నెలకున్నప్పటి కెద్దియో పగడవాఁయిపోల్కి (ఒక్క అక్షరసామ్యము) ఉన్నంజాలు." అని వేల్పు నుడినుండి పుట్టిన

వనియే భావించి వారు వారు తమ తమ నిఘంటువులలోఁ జేర్చిరని యట్టి పదముల కొన్ని వందలు చూపిరి.

మఱియుఁ జూడుడు. "పారసి మలకనుడులు (పారసీకము-ఉరుదు) తెలియక గుడ్డెద్దుచేనునఁ బడినట్లుగఁ దాముగూడ నుడువుల యానెఱిగిన వారివలె తాము పన్నిన తెలుఁగు పలుకుల పట్టీలో కొన్ని నాటు నుడులన్ని, వేల్పు నొడిమార్పులని (తద్భవములని) వ్రాసినవి" అని కొన్ని పదముల పట్టీ నిచ్చిరి.

ఇంకను వారి విచక్షణజ్ఞానముం జూడుండు. "నాటు తెలుఁగు పలుకేదో, వేల్పునుడి మాఱుపాటు నుడి యేదియో తెలియనేరక... కక్కిరి బిక్కిరి పట్టీ కవిలెల న్గుదిగ్రుచ్చుచున్నారు" అని యా పదాల పట్టీ నిచ్చిరి. ఈ విధముగా తెలుఁగు పలుకులను గాలించి గాలించి చూచిన పూర్వ పండితు లెవరున్నారు ? దీని కెన్ని గ్రంథములు కావలయు ? ఎంత సమయము కావలయు ? ఎంత శ్రద్ధ కావలయు ? ఎంత పరిజ్ఞానము కావలయు ?

ఎంతో శ్రద్ధతో తెనుఁగులో పరిశ్రమించిన మహాపండితుఁడు గాననే యిట్లు గట్టిగాఁ జెప్పఁగలుగుచున్నాఁడు. ఏమని ? ఏ వేల్పు నుడి జోలి సుంతయున్లేని తేట నాటు తెలుఁగు మాటలనే, పొందుగా నల్ల వలయుగాని యడ్డాదిడ్డిగా నోటికివచ్చినట్లెల్లఁ గట్టుమట్టు గుట్టెఱుంగక కలగూరగంపగా వేల్పు నొడువులకు డు-ము-వు-లతికి చెఱచిన నుడుగుల న్గలిపిన బాజారు తెలుఁగు పలుకులు వ్రాసి, మాటకారుల మనియు, చదువరులమనియు......తలంచుచున్నారు" అని సంస్కృత భాష బాగుగా వ్యాపించి నాటు తెనుఁగు నణఁగఁద్రొక్కినది. అందువలనఁ గ్రమముగా నాటు తెనుఁగు మాటుపడినది. సంస్కృతము డు ము వు ల బురఖా వేసికొని వ్యవహారములో మితిమీఱి విజృంభించినది. అక్కతన సామాన్య పండితులు నాటు తెనుఁగును గుర్తింపలేక పోయిరి. ఏదో

వర్ణవికారాదులున్న తద్భవమని యొక లక్షణ మేర్పఱచుకొని వానిని నాటు తెనుఁగులోఁ గల్పుకొని యా రెంటి సమ్మేళనముతో నచ్చ తెనుఁగు పొత్తముల కొందఱు వ్రాసిరి. ఇప్పుడు దాసుగారు చేసినపని యేమన ఎంతయో కృషిచేసి నాటు తెనుఁగుల బయటికి లాగిరి. అక్షర సామ్యాదులున్నంత మాత్రాన తద్భవములు కావనిరి. సంస్కృత సాహాయ్యము లేకున్నను వ్యవహారములు నడుపుకొనవచ్చును. గ్రంథములు వ్రాయవచ్చును- అని తానాపని చేసి చూపిరి. మఱి యూరక చెప్పిన నమ్మరుగా.

తానిట్లేర్చి కూర్చుకొన్న పదములు గలదియే యీ 'సీమపలుకు వహి'. ఇది నిఘంటు లక్షణప్రకారము సిద్ధము చేయఁబడినది. అక్షర క్రమమున వ్రాయఁబడినది. ఇందు నానార్థములు గలవు. రూపాంతర ములును గలవు. పర్యాయపదములును గలవు. తత్త్వద్విశేషములుం గలవు. సర్వము తత్సమముల జోలికిఁబోక తెలుఁగులోనే వ్రాయఁబడినది.

"ఇప్పుడు మీరిట్టి గ్రంథము లెవరికిఁ గావలయునండీ" అని యడుగవచ్చును. నిజమే. నన్ను వ్యాసము వ్రాయుఁడనుచు దాసుగారి తెలుఁగు పొత్తముల నిచ్చిన వారితోనే నిట్లంటి. ఇదివఱకు దాసుగారి 'శతజయంత్యుత్సవసంచిక'లో నాటు తెనుఁగున వ్రాసితి. ఇప్పుడు నట్లే వ్రాసెదనన వారు "వలదు వలదు. నాటు తెనుఁగెవరి కర్థమగును? దాని నెవరు చదువుదురు? తత్సమభాషలోనే వ్రాయుఁడు. వ్యావహారికమున వ్రాసిన మఱీ మంచిది" అనిరి. అవును. ఆంధ్రదేశమందిప్పుడు గ్రాంథి కాంధ్రాభిమానముగల పెద్దలేరి? అట్టివారిం దయూరు చేయు పరిస్థితులేవి? బళ్లలో సంస్కృతాంధ్రముల జదువువారే తక్కువ. ఉన్నను వారికి విద్య గఱపువారింగ్లీషున పరిశ్రమించిన వారేకాని యాంధ్రమునఁ బరిశ్రమించిన వారుకారు. వారే విద్యార్థులకు పాఠ్యగ్రంథముల నిర్ణ యించునదియు, బోధించునదియు, భాషానిర్ణయము చేయునదియు, ప్యాస్ చేయించునదియు, ప్రత్యేకముగాఁ బరిశ్రమ చేసినవారికిఁ దప్ప

నితరుల కాంధ్రమందాదర మెందుకుండును? అట్లు పరిశ్రమించిన వారు న్నను గొద్దిమందియే. అట్టివారిక్రింద నెందఱు విద్యార్థులు చదువఁ గలరు? నేటి విద్యార్థులేకదా భావిపండితులు. బీజములేనిది మొలక యెట్లు? ఇంకఁ బత్రికల జూతమా అవి సర్వత్ర వ్యాపించుటకు వ్యావహారికమునే యుపయోగించుచుండె. ప్రజలా కష్టించి చదువరు. ఒక రిద్ద ఱున్న వారికిఁ బ్రోత్సాహము లేదు. రచయితలా నాలుగుడబ్బుల కొఱకు వచ్చిన భాషలోనే అన్ని తప్పులు కమ్ముకొనిపోవునని వ్రాయసాగిరి. వారికి భాషయేకాదు. ఛందస్సును అక్కఱలేదు. నియమనిబంధన లక్కఱలేదు. పండితులా అటే మొగ్గ చూపుచుండిరి. అందును గొందఱు పిచ్చివారవకాశము లభింపఁగనే భాగవతమువంటి పూర్వ గ్రంథములపైఁబడి యేదో వంకతో వ్యావహారిక భాషలోనికి దిద్ది లాగ సాగిరి. ఇది నేటి కాలపరిస్థితి. అయినను నాకొక్కటే యాశ. "లోకో హ్యాయం నిరవధిర్విపులాచపృథ్వీ" గ్రాంథికమునకెప్పటికైన మంచి రోజులు రాకపోవు. నేఁడైనను తెలుఁగునాట నాటు తెనుఁగునందత్యంతా భిమానముగల వారక్కడక్కడ లేకపోలేదు. ఇంత దేశమందందఱు నొకే యభిప్రాయము గలవారని తలంపరాదు. ఎప్పుడును బ్రజలందఱుఁ బండితులుగారు. కవులుగారు. అట్టివారు కొలఁదిమందియే యుందురు. అట్టివారికే యీ పొత్తములు కావలసినది. అందులకే దాసుగారిట్టి వాని వ్రాయుచుండిరి. "అందులకేవారు" తినకచవిచొరక లోఁతు తెలియునా? నాటుతెలుఁగునకలవాటు పడినకొలఁది నద్దానిసొగసు నెఱుంగుదురు" అని వ్రాసిరి.

కాన దాసుగారి యందభిమానముగలవారీ నిఘంటువును సాంతము జాగ్రత్తగా నిర్దుష్టముగా నచ్చువేయింపవలె. అక్షరస్ఖాలిత్యములున్న పెద్ద చిక్కువచ్చును. ఇందే "విస్సగతుపాసి" అని అచ్చుపడినది. ఇది తప్పని యెందఱికి దెలియును? "విస్సిగతుపాసి" అని యుండవలె. ఇది కథాకావ్యముల వంటిదిగాదు. ఒకసారి చూచి యవ్వలఁబాఱవైవఁ

బడునదిగాదు. ఇది అజరామరమైనది. ఎంతో కష్టపడి వ్రాయఁబడినది. ఇది సంపూర్ణముగా నచ్చెచ్చె లోకమున వ్యాపించిన దాసుగారి ఆత్మ శాంతించును. 'తమ పగడ నాటుమాటల నాడి పాడి చదివి వ్రాసి పేరెక్కెదరుగాక" అన్న దాసుగారి వాంఛను నెఱవేర్పఁ గోరెదను.

## 2. మన్కి మిన్కు

మన్కి అనఁగా ఆయువు. మిన్కు అనఁగా వేదము. ఈ ఆయుర్వేదమను గ్రంథమున నాయువుం గూర్చియుండును. ఆ ఆయువు శరీర ధారికిఁ గదా యుండునది. కాన నా శరీర మెట్లేర్పడునో ముందు చెప్ప వలె. అందులకు దాసుగారు గరుడపురాణము ననుసరించి జీవోత్పత్తిని నాటుతెనుఁగున పీఠికగా వ్రాసిరి. ఆ పీఠికకు "కుదురు" అని పేరు పెట్టఁ బడెను. దాని నిట వ్రాసిన నప్రస్తుతముగాదు. మఱియు దాసుగారి నాటు తెనుఁగు నేరుపు గోచరించుం గూడ. ఆ నాటు తెలుఁగు పదముల కచ్చటనే యర్థమును వివరించెదను.

మేనితాల్పు (శరీరి) తాఁ జేసికొన్న పని యంటు (కర్మానుబంధము) చొప్పున పుట్టువు నొందును. ఆల్మగల కలయికలో విత్తనము (శుక్రము) ఎక్కువైనచో మగవాఁడు, నెత్తురు (శోణితము) మిక్కిలియైన నాడుది, నెత్తురు విత్తనములు సాఁబాళ్లు (సమభాగములు) అగు నెడ అన్నగళ (షండుఁడు) పుట్టును. ఒక్కనాటి కా నెత్తురు విత్తనములు చూలాలి కడుపులో ముద్దగట్టును. ఐదునాళ్లకు బుడగ (బుద్బుదము) అగును. పదు నాల్గవ నాటికి, గాలి, కిత్తి, తెమడలు (వాత, పిత్త, శ్లేష్మములు) కలిసి చియ్య (మాంసము) అగును. ఇరువదినాళ్లకు గట్టి నంజుఁడు (మాంసపు ముద్ద) అయి తల్లి కడుపులోని మైతాలుపు వరుసగా ముదురుచుండును. ఇరువదైదునాళ్లకు అలవు (బలము) లావు (పుష్టి) తో నుండును ఒక్క నెలకాఁగానే నింగి, గాలి, డిగ్గి, తడి, నేలల, యోజను (ఆకాశాది పంచ భూతముల తత్త్వమును) తాల్చును ... రెండు నెలలకు అంట (చర్మము) నెత్తికొవ్వు (మెదడు) పొడమును. ఎముకలయందలి నేయి (మజ్జ) ఎము

కలు మూఁడు నెలలకుఁ గలుగును. తలవెంట్రుకలు, వ్రేళ్లు, నాల్గవనెలకుఁ బుట్టును. ఐదవ నెలకు వీనులు (చెవులు) ముక్కు, బోర (గుండె) తోఁచును. గొంతుకన్నము, కడుపు, ఆఱవ నెల కేర్పడును. ముడి మొదలు (ఆసనము) ఏడవనెల కొదవును. మేను, మేనివఁతులు, (అంగ ప్రత్యంగములు) ఎనిమిది నెలలకు చూలునకు (పిండమునకు) నిండాగును. ఎన్మిది నెలల పిమ్మట తల్లికడుపులో నుసుఱు (జీవుఁడు) మాటిమాటికి న్గదలాడుచుండును. తొమ్మిదవ నెలకు కందు (శిశువు) ముదిరి గట్టిపడును...తల్లి పేగు కన్నమందు ఇరికికొని యుండును. తల్లి తిని తాగిన కూడు నీళ్ళం బట్టి యామె కడుపులో మేను పెంచుకొనుచు, అన్నివైపుల నలఁగుడు పడుచుఁ బెరుఁగు చుండును. తా నదివఱకుఁ గొన్న పెక్కు పుట్టువులం గన్న మేల్కాస్తులం (మంచిచెడ్డల) గూర్చి తలపోసికొనుచు బ్రతుకుపై రోఁతపడుచుండును. కడుపునుండి వెలువడిన తోడనే ఆ మునుపటి పుట్టువు లందువలె తప్పుపనులు చేయక తిరిగి పుట్టిచావని తెన్నున నడచుకొనెదను. మంచిపనులే కావించుకొనెదను. అని తలపోయుచు, తొమ్మిది గాని, పదిగాని నెలలు నిండిన పిమ్మటఁ బుట్టును. పుట్టిన పిమ్మట ఆ పెరుమాళ్ళగారడము (దైవమాయ) తను గ్రమ్మఁగా నద్దానికి లోనై తన తెలివిన్గోలుపోవును. ఎఱుక దొఱఁగి యేడ్చును. మూఁడేండ్లలోపున చంటిపాపయై, ఎన్మిదేండ్ల యీడువఱకు చిఱుతయై, ఆవల కోడెయై, అంత ముసలియై చచ్చుచుం దిరిగి పుట్టుచుండును. ఇట్లు పుట్టుక సుడింబడి తిరుగుచుఁ దనమంచి పనులవలన వేల్పుటెంకిని (స్వర్గమును) మలయుచు, తన చెడుగు సేఁతలం బట్టి బిస్తన్ (నరకమున) నొగులుచు నుండును.

దానుగారి యద్భుతప్రతిభ నీయొక్క పుస్తకముం జూచి యెఱుఁగవచ్చు. శరీరమునందలి ప్రతిభాగమునకు తెలుగునే వాడెను. శరీరమునంగల పంచభూత ధర్మములల్లెల్ల దెనుఁగుననే చెప్పెను. ప్రతి వృక్షలతాదులను, ప్రతిరోగమును, తత్తదంశములను తెలుఁగుననే

చెప్పెను. అట్టి నాటు తెనుఁగుల నెక్కడఁబట్టెనో, ఎట్లు వెదకెనో యేమి చెప్పఁగలము !

ఎనుబదినాలుగు వేవేలలెక్క మేర నెన్నఁబడిన మేనితాల్పులలో (జంతువులలో) గ్రుడ్డుకానుపులు (అండజములు) చెమటపుట్టువులు (స్వేదజములు) నేలన్వెల్లగించి మొలుచుచెట్లు మొదలైనవి (ఉద్భిజ్జములు) మావివలనఁ బొడమునునుఁబులు (జరాయుజములు) నా నాలుగు తెగలు గలవు.

ఇందు దాసుగారి చాతుర్యముంజూచితిరా ! చతురశీతిలక్షలు జీవరాసులు. అనఁగా 84 లక్షలు. దాసుగారు లక్ష పదము సంస్కృతమని లచ్చయనిన తద్భవమగునని వానిని వాడక వేవేలు అని వాడినాఁడు. నూఱువేలు లక్ష. వేయివేలు పదిలక్షలుగదా. ఇంకొకటి. ఉనుఁబు అను ధర్మపదమును ధర్మిపదముగా వాడినాఁడు, ఇందులకు ప్రయోగము లున్నవనుకొనుఁడు. ఎవరైనఁ గాదు కూడదన్న "అడుకొండ్రు"లలోఁ జేర్చు కొనుఁడందురు.

మెయితాల్పులకెల్లఁ జావుతప్పదు. చచ్చిన పిదపఁ జేయున దేమియు లేదు. చావకపూర్వమే ధర్మార్థకామమోక్షముల సాధించుకొనవలె. వానిని సాధించుకొనుచున్నప్పుడు వ్యాధులు కలుగును. వ్యాధులవలన మరణము కల్గును. ఇపుడు దాసుగారు విషరోగాదుల నడంచుకొని యాయువు నిల్పుకొనుట కనేక సాధనోపాయములను ఆయుర్వేదమునుండియు, అధర్వవేదమునుండియు, తైత్తిరీయారణ్యకము నుండియు, ఐతరేయ బ్రాహ్మణము నుండియు, ఛాందోగ్యమునుండియు, యజుర్వేదమునుండియు, మంత్రములను తంత్రములను, ఓషధులను, ఎన్నో ప్రక్రియలను, ఈ గ్రంథమునఁ జూపిరి. మఱియు నాయుష్కాల మెఱుంగుగుఱుతులును, శుభాశుభములఁ దెలిసికొన స్త్రీ సాముద్రిక పురుష సాముద్రికములను, కొన్ని శకునములంగూడ నిందుఁ బ్రదర్శించిరి. వాని

వలనఁ దమకుఁ రాబోవు కీడు నెఱింగి ముందుగా జాగరూకులై తన్నివారణమునకుఁ గడంగవలయునని దాసుగారి భావము. ఐతే రాబోవు కీడును పురుషప్రయత్నమువలన నివారించుకొన శక్యమా ? అని యడుగుదురా ? అది పెద్దప్రశ్న. ఆ దైవపౌరుషముల సమగ్రవిచారము నాజీవ విచారమను గ్రంథమున జేసితి. ఇచట నాకుఁ జోటు చాలదు

"పూర్వజన్మ కృతం పాపం - వ్యాధిరూపేణ బాధతే
తచ్ఛాంతి రౌషధై ర్దానై ర్జపహోమార్చనాదిభిః॥

అని కలదుగాన పూర్వమందు చేసికొన్న పాపమునకు ఫలముగా వ్యాధి కల్గును. తన్నివారణార్థ మౌషధము సేవింపవలయు. ఆ యౌషధములు రస విష గంధక పాషాణాదులు కారాదు. "ఓషధయః సమవదంత సోమేన సహరాజ్ఞా" మందు ఋఘలు తమ దొరయగు జాబిల్లితో నిట్లనె. "మమ్మె పాలుఁడు వాడుకొనుచుండునో యతని కోరిక చొప్పున మేమెల్ల తెవ్వుళులం దప్పక మాన్పెదము."

వృక్ష లతాదులయొక్క వేరు, బెరడు, ఇగురు, ఆకు, పూవు, కాయ, పండు రసము, సమూలభస్మము, వివిధ రోగములకు మందు లగు. ఆ వృక్ష పరిజ్ఞానమునకే పూర్వులు బళ్ళలో పిల్లలకు వినాయక చతుర్థికి వినాయకుని పూజార్థమని 21 పత్రములం జెప్పిరి.

సీ॥ సిద్ధి విఘ్నేశుఁ బ్రసిద్ధిగాఁ బూజింతు
నొనరంగ నిరువదియొక్క పత్రి
దానిమ్మ, మరువము, దర్భ, విష్ణుక్రాంత;
ఉమ్మెత్త, దూర్వయు, నుత్తరేను
గల్జేరు, మారేడు, గన్నేరు. జిల్లేడు,
దేవకాంచన, రేగు, దేవదారి
జాజి, బల్రక్కసి, జమ్మి, దాసనమును,
ఆరె, మాచపత్రి, ఆలరుమునగ,

ఈ పత్రి కొఱకు విద్యార్థులు పొలములకు నున్నతావులకుఁ బోయి తెచ్చుకొందురు. అందువలన చెట్ల నొకరికొకరు చూపి తెలిసికొందురు. ఇట్లు వృక్ష పరిజ్ఞానము వ్యాపించుచుండును. ఈ 21 చెట్ల ప్రయోజన మీా పొత్తమునఁ గలదు.

1) "నింగి నేలల నెల్ల నెలకొను దినుసు

లన్నియు న్మందులే యారసిచూడ" ఈ లోకమందున్న వృక్షము లన్నియు మందులే. ఒక్కొక్కటి యొక్కొక్క రోగమున కుప యుక్తము. దీనికి ప్రమాణము "ఋతవ ఓషధీః పచస్తీ దం సర్వం..."

2) నేలయందలి దినుసులెల్ల, తడి, పొడి, వాసినెండేరకము. తడివి జాబిలి, పొడివిడిగ్గి (అగ్ని). ఇందుకు ప్రమాణము "ద్వయంవా ఇదం, నతృతీయమస్తి. ఆర్ద్రించైవ శుష్కంచ. యచ్ఛుష్కంత దాగ్నేయం, యదార్ద్రం, తత్సౌమ్యం.

3) సీసపు బిళ్ళ గొడలి న్దాల్చిన యెడల నల్లత్రాగుడు దెత్తులు (నెత్తురు పీల్చు దయ్యాలు) మొదలగునవి చేరకుండును. ఏ తెగులు నంటదు. ఇందుకు ప్రమాణము "సీసాయాధ్యాహ..."

4) ఉలిమిడి చెట్టు చెక్క అఱఁగఁదీసి యొడలికిఁ బూసికొన్న యెడల నిప్పు చుఱుకదు. ఇందుకు "తస్మా ద్వరణోభిషజ్య ఏ తేన హి దేవా ఆత్మాన మచాయంత"

5) తినుబడి దినుసుల నెల్లఁ దేనె మిక్కిలి మేలైనది. "పరమస్యా న్నాద్యస్య...యన్మధు"

6) మేడుచెట్టు క్రింద నెల్లపుడుండి పండ్లతోఁ బొట్ట నించుకొను వాఁడే తెవులు న్దగుల, కెవ్వరి ప్రోపున్నోరక హాయిగాఁ బెక్కేండ్లు బ్రిదుకును. ప్రమాణము "ఉదుంబరేవ సత్యార్గుదుంబర ఊర్జ మేవా వరుంధే"

7. నూతేండ్లు మందికుసులు (జనులయాయువు) తెలివి పనులన్గావించు నొడలి పది దినుసులలో (జ్ఞానేంద్రియ కర్మేంద్రియములపదిలో) కన్ను మొదలగు దినుసుల కొక్కొక్కంటికిఁ బదినరముల (నాడుల) యందు నడకమాఱుపులం బట్టి (పరివర్తనంబట్టి) నూఱు మేనిదినుసులు (శతేంద్రియములు) అగును.

దీనికి ప్రమాణము "శతాయుః పురుషః శతేంద్రియః ఆయుష్యేవేంద్రియే ప్రతి తిష్ఠతి."

8. కల్లరికి (అసత్యముపల్కువానికి) నీటికడుపు తెగులు (జలోదరము) రాకమానదు. ప్ర॥ "అనృతేఖలు వై క్రియమాణే వరుణో గృహ్ణాతి"

ఈ పుస్తకమున మంత్రములుం గొన్ని కలవు. ఒక్కటి వ్రాసెద. పాము మంత్రము.

9. "1) దిదిర్హి మహ్యాంవరుణో దివః కవిర్వచోభిరుగ్రైర్నిరిణామి తే విషం
ఖాత మఖాత ముతస క్తమగ్రభమిరేవ ధన్వన్నిజ జాన తే విషం.

2) అలిగీచ విలిగీచ పితాచ మాతాచ
విద్మవః సర్వతో బంధ్వర సాః కిం కరిష్యథ.

3) ఉరుగూలాయాదు హితా జాతాదాస్య సిక్నిః
ప్రతంకం దద్రుషీణాం సర్వాసామర సంవిషమ్.

ఈ మూఁడు మిడియల (మంత్రముల) చెప్పుచు పాముకరచిన వానిచుట్టు ముడివేసిన యెడల నెక్కడ నున్న చిలుము (విషము) అక్కడనే నిలిచి పోవును.

తేనెటీగల నిప్పచెట్టు మొదటనున్న పారి (మన్ను) కలిపి నూతి నీళ్ళలోఁ గలిపి పాముకఱచినవానిచేఁ ద్రాగింపవలయు.

మఱియు నెయ్యి నీళ్ళలోఁగలిపి త్రాగింపవలయు అన్నిరకాల చిలుములు నశించును.

10. "యథా మనోమనస్కేతైః పరాపత్యా తత్యాశుమత్
ఏవా త్వం కాసే ప్రపత మనసాను ప్రవాయ్యమ్"

ఈ మంత్రముతో మంతరించి వేలపిండి జావను త్రాగవలెను. తెమడ దగ్గు, తెవులు తగ్గును.

మంత్రార్థము :- ఎట్లు తెలివిగల యుల్లముయొక్క తలం పొదవి నంత నే (బుద్ధితోఁగూడిన మనస్సు) తలంచినతోనె, అన్నిచుక్కలకన్న మీదుగా నున్న చుక్క (ధ్రువనక్షత్రము) స్థాడఁబరుగిడునో యట్లే నీవో తెమడ దగ్గు తెవులా (కాసశ్లేష్మరోగాత్మకమా) తలంపు వడితో (మనోవేగముతో) ఈ తెగులు గొంటున్ (కాసశ్లేష్మరోగిని) విడిచి పరుగిడి పొమ్ము.

ఈ పుస్తకమునఁ జెప్పినవన్నియుఁ జెప్పినట్లు సలిపిన తత్తత్ఫల ములు లభించునా ? సందేహమేల ? తప్పక లభించును. అయితే అవి యెటువంటి ప్రవర్తనగలవానికి లభించునని చెప్పెనో యదియుఁజూడుఁడు. అదిగాక యిందు గురుకీలకము లేకపోలేదు. ఉత్తరేను, సహదేవి, మేడి, మున్నగు వృక్షములనుండి వేరులు మున్నగువానిని రోగాదులకు వినియో గింపఁదలఁచుకొన్నచో వానింగైకొనుటకు తిథివార నక్షత్రములు మం త్రాదులునున్నవి. వాని నెఱింగి తీయవలెను. ఆ తీయువాఁడును సిద్ధుఁడై యుండవలయును. ఆమందరి (వైద్యుఁడు) ఎట్టివాడుగా నుండవలెనో దాసుగారు చెప్పకపోలేదు.

"తొల్లింటి మందరు లెంతయో పాటుపడి యెట్టి యిడుమలకోర్చి యైనఁ దమతోడి పాటివారి కేమాటు న్గోరకయే, మందులిచ్చి తెవుళ్ళ న్గుదుర్తురు..... ఏఫ్రూరి పుడకనైనఁ గల్లరులై పుచ్చుకొనక, తమ నుదుటి చెమటోడ్చి తమకూడు గుడ్డలం దామే సమకూర్చు కొందురు... పై వారి యాంద్రంగాని, డబ్బుగాని, సుంతయుం గోరకే, తగులున్గాని లేని మంచివాని కొక్కనికే ... ఈ పొత్తమందుఁ జెప్పఁబడినవి ఫల

మిచ్చును. మఱియు దాసుగారు మందరుల (వైద్యుల) లక్షణము లెన్నియో చెప్పిరి ..ఏకీడులంటక, తనలేమి చెప్పకొనక,...కొండెము లాడక, పిసినారిగాక, డాబులుం గొట్టక, యెవ్వరిమీఁదనైన న్పగపట్టక, వినువక, తనతల్లిదండ్రులవలె తన పిల్లలమాడ్కి తన యక్కచెల్లెం డ్రిన్నదమ్ముల తీరున ..తెగులు గొంటులను (రోగులు) కనుచు ... ఇచ్చిన కొంచెమైన న్గొప్పగానెంచి తనివిం జాటుకొనుచు మందులియ్య వలెను. వైద్యుఁడు మందులు మొదలగువానిం దెలిసికొనుటకు గొప్ప వేల్పు నెప్పుడును గొల్చుచుండవలయు" అనిరి. ఇట్టి మంత్రసిద్ధుఁడైన సజ్జనుఁడైన వైద్యున కాయుర్వేదమందుఁ జెప్పబడినవి జరుగుటలో నించుకంతయు సందేహము లేదు. మనోవాక్కాయముల దుర్మార్గము చేయు వానికి మాత్రము జరుగవు. నిశ్చయము.

ఈ పుస్తకము చాలమంచిది. ఇట్టి వేదమును మనకు ప్రసాదించిన భగవంతుని నిర్వ్యాజానురాగము నెవరుకొండాడఁగలరు! ఇతరములఁగాక యొక్క అథర్వవేదమునే యెందుకెత్తుకొని వ్రాయకపోయిరో? సాయణకృత వేదభాష్యభూమికా సంగ్రహము విషయసూచికగాఁగలదు. ఏ యనిష్టము నెట్లు పాపుకొనవలెనో? ఏ యిష్టము నెట్లు సాధించుకొనవలెనో సర్వమందు గలవు. దానిం బట్టి వ్రాసిన చక్కగా నుండెడిది. యుద్ధములం దాయుధములచే శరీరము జల్లెడ తూంట్లుంబలె నైనవాఁడు మఱల మఱునాఁడే యుద్ధమున కెట్లేగఁ గల్గెను? ఏతదాది సర్వ చికిత్సలందుఁ గలవు. మానవుల కాశ్యకములైనవన్నియు నందున్నవి. సరే దానికేమి దాసుగారు అథర్వమునేగాక యితరవేదముల గూడ వెదకి కావలసినవాని వెలికిఁదీసిరి. దాసుగారిందే మంత్ర మే తావునఁగలదో యది స్పష్టముగా వ్రాసినఁ గావలసినవారది చూచుకొనుట కవకాశముండెడిది. 'ఇవి అథర్వ సంహిత' లోనివి అని చెప్పినంత మాత్రమున లాభమేమి? వాని నెక్కడ వెదకి పట్టుకోఁగలము, "శివేన వచసా" "అధ్యవోచ దధివక్తా" "నమోరోహితాయ" 'యాస్తేరుద్ర శివా

తనూః' "ఋతంచ మేఽమృతంచ మే" "ప్రీహాయశ్చ మేయవాశ్చ మే మిత్ర శ్చమ ఇంద్రశ్చ మే" ఇట్లిచ్చిరిగాని యవియెక్కడివో తెల్పలేదు. నా నిత్య పారాయణవలన దీనిం గుర్తించితి. ఇవి తైత్తిరీయ సంహిత చతుర్థకాండ పంచమ ప్రశ్నాత్మకమగు రుద్రాధ్యాయమందలివి. దాసుగారిందు మంత్రము నాదిపదమును మాత్రమే కొన్ని తావుల నిచ్చిరి. కొన్ని తావుల వాక్యము నిచ్చిరి. కొన్ని తావుల వలసినంతయు నీయకపోలేదు. అన్నిటికిఁ దాత్పర్యము వ్రాసిరి. మఱియు కావ్యములందువలె నిందును ఒక పదముం బట్టియెన్నియో భావముల వ్యక్తపఱచిరి.

ఇక నొక మాటచెప్పి ముగించెద. ఇది నాటు తెలుఁగు. పైఁగా మంత్రములు. ఇవి యెవరికి నర్థముకావు. కాన నచ్చువేయుంచుటలో నెంతయో జాగ్రత్తపడవలసియున్నది. ఇందొక మంత్రమున కింకొక దాని తాత్పర్యముపడినది. పేరాల విభజనలో ఆ తార్మారు జరిగినది. అందువలన పుస్తకమంతయు తప్పుగా పడినది. దాసుగారు ముందు తాత్పర్యమువ్రాసినదానికి. ప్రమాణముగా నామంత్రము నిచ్చిరి. అచ్చులో మంత్రము ముందుండి తాత్పర్యము దానినానుకొనియున్నది. ఇది పెద్ద తప్పు. మంత్రములందును అచ్చుతప్పులుగలవు. పునర్ముద్రణ మందు తప్పక వీనిని సవరించుకోవలె. మఱియు కొన్ని తావుల మంత్రము వ్రాసి దాని తాత్పర్యమును వ్రాసిరి. అట్టివియుఁ గలవు. కుదురు అనునది పీఠిక. ఇది ప్రధాన గ్రంథముగా నచ్చుపడినది. అదియు సవరించుకోవలె.

## 3. ప్రొక్కుబడి (ఋక్సంగ్రహః)

ప్రొక్కుబడి యన దేవతాప్రార్థనము. ఈ ప్రార్థనమును ఋగ్వేద మంత్రములతో దాసుగారొనర్చుచున్నారు. ఇందు దాసుగారి వేదజ్ఞాతృత్వమేగాక సంగీతప్రావీణ్యముగూడ వెల్లడింపబడినది.

"ఇష్టప్రాప్త్యనిష్టపరిహారయో రలౌకిక ముపాయం యోగ్రంథో వేదయతి స వేదః" కీడును దొలఁగించుకొని మేలుంబొందుట కుపాయము

లోకమందు లేదు. వేదమందే కలదు. ఆ వేదములు ఋగ్యజుస్సామాథర్వణములన నాలుగు కలవు. అందు దాసుగారు మొదటిదగు ఋగ్వేదమును బట్టుకొనిరి.

"తేషాం ఋగ్యత్రార్థవశేన పాదవ్యవస్థా"(మీ. 2-1-36) అర్థవశమున పాదవ్యవస్థగలది ఋక్కని జైమిని వచించెను.

"సాయణార్యోమమానుజః సర్వంవేత్త్యేష వేదానాం వ్యాఖ్యాతృత్వే నియుజ్యతామ్" అని విద్యారణ్యులవారు బుక్కరాయలకుఁ జెప్పుటచే తదనుమతిని సాయణాచార్యులవారు వేదభాష్యమును వ్రాసిరి. మనదాసుగారా భాష్యముం బట్టి నాటు తెనుఁగున పద్యములు వ్రాసిరి.

వేదము నిచ్చవచ్చినట్లు పఠింపరాదు. అసలు వేదమంత్రముల నెందులకుచ్చరించుచున్నాము? అభీష్టార్థము లొసంగుననికదా! అపుడే ఫలము కావలెనని తలంతుమో ఆఫలము నొసఁగు నర్థముఁవచ్చునట్లు ప్రార్థింపవలె. అటులైన నాఫలము వచ్చును. సందేహము లేదు. ఆ యడుగుటలోనే యున్నది మనజాగ్రత్త. కుంభకర్ణునివలె నొకటి యడుగ దలఁచి మఱొకటి యడిగిన నెట్లు? ఆ యడిగినదే వచ్చునుగాని మనము తలంచినదిరాదు. లోకములోని పదముల నెట్లుచ్చరించినను అర్థమొక్కటేకాని ఉచ్చారణవశమున పదముల యర్థము మాఱదు. (ఇచట అంతమందలి కాక్వాదులు కావనుకొనుఁడు) వేదమందట్లుగాదు. ఉచ్చారణ వశమున నర్థము మాఱును. అందువలన నతీంద్రియద్రష్టలగు మహర్షులు వేదమందలి యొక్కొక్క యక్షరము నెట్లుచ్చరింపవలయునో యనుశాసించిరి. ఎట్లుచ్చరించిన నేఫలము వచ్చునోగూడఁ జెప్పిరి. 'మా' అను పదమును ఉదాత్తముగా నుచ్చరించిన 'వద్దు' అను నిషేధార్థము వచ్చును. అనుదాత్తముగా నుచ్చరించిన 'నన్ను' అను నర్థము వచ్చును. వేదాక్షరముల ఉదాత్తము అనుదాత్తము స్వరితము అను మూఁడు స్వరములతో నుచ్చరింతురు. "ఉదాత్తశ్చానుదాత్తశ్చ స్వరి

తశ్చ స్వరాస్త్రయః" (పా. శి. 11.) ఈ మూఁడు స్వరములను దప్పి పోకుండ పలుకుటకే గురువులయొద్ద వేదముం జదువుకొనునది. అందులకే వానికి శ్రుతులను పేరును వచ్చినది. ఇటీవల వ్రాతవచ్చిన పిదప ఉదాత్తానుదాత్త స్వరితముల నేర్పరచి వేదములను ముద్రించిరి.

ఈ వేదముల ప్రయోజనముం బొందునది మానవులు. మానవుల సర్వావయవములు సక్రమముగాఁ బనిచేయుచున్న నే వ్యవహారములు జరుగునదియు సుఖానందములు గలుగునదియు, ఆయవయవములు పని చేయుటకు నందున్న దేవతలయనుగ్రహము కావలసియుండును. త్వక్చక్షు శ్శ్రోత్రజిహ్వాఘ్రాణములు శబ్దస్పర్శరూప రసగంధముల నెఱుంగుట ఆ జ్ఞానేంద్రియములందున్న యధిదేవతల యనుగ్రహము కారణము. నేత్రమందు సూర్యుఁడు, జిహ్వయందు వరుణుఁ'డు', ఘ్రాణమందశ్వినీ దేవతలు, హస్తమందింద్రుఁ'డు', నీవిధమున సమస్తేంద్రియములందు దేవతలుందురు. ఎవరెక్కడనుందురో నేను వ్రాసిన శ్రీమద్గురుభాగవతము ఏకాదశస్కంధము 22 వ అధ్యాయమునఁ గలదు. వారు లేకున్న మన పని సున్నయే. సూర్యుఁడు కంటినుండి తొలగిన కన్ను కన్నుగానే యుండునుగాని మనము రూపమును గ్రహింపలేము. దాసుగారి మాటల విందము "ఈ వేల్పులం గొనియాడి లోఁబఱచుకొను వారికెల్లఁ దమ కోరికల చొప్పున బ్రదుకు హాయిగా సమకూరును. వేల్పులొనర్చిన మేలుచేతలంబొగడుటకన్న వేల్పుల న్లోబఱచుకొనఁదగు వెరవింకెద్దియుంగాదు. తోటివారల సంతసపఱచు మంచి నడతగలిగి వేల్పులం గొనియాడువారికి బ్రదుకు హాయిగాఁ గడచును. అందువలన పెద్దలేర్చి కూర్చిన 304 ప్రాఁబల్కు (వేదము) పద్దెములను దర్వులుగామార్చి యచ్చ తెనుఁగు పద్దెములచేత వివరించి యున్నాఁడను" అనిరి. ఇందు కందము, ద్విపద, మంజరి వాడఁబడెను. కందమునకు తాఁడి అనియు, ద్విపదకు సైదోడు అనియు, మంజరికి బడి అనియు నామములుంచఁబడెను.

ఇందు వరుణుని 41, ఇంద్రుని 66, ఉషాదేవిని 32, అశ్వినీదేవతల 48, బృహస్పతిని 21, సూర్యుని 19, మిత్రావరుణుల 15, అదితిని 9, సరమను 11, ఋక్కులతో సలుపు ప్రార్థన మీా మ్రొక్కుబడి కాన నిందు 304 ఋక్కులుగలవు. దాసుగా రొక్కొక్క గ్రంథమున నొక్కొక్క ప్రజ్ఞ చూపిరి. ఈ గ్రంథమునఁ దన సంగీతప్రజ్ఞ చూపిరి. ఇది వాగ్గేయకారులకుఁగాని శక్యముగాదు. "సంగీతజ్ఞానము భక్తివినా సన్మార్గముగలదే" అని త్యాగరాజు స్వాములన్నట్లు దాసుగారు తన దేవతాభక్తికి గానము జోడించి చరితార్థులైరి. వేదము సస్వరముగా కున్న నిష్ఫలముగదా! చూడుడు వారిప్రజ్ఞ. సంగీతము సరిగమపదని అను సప్తస్వరములతో నుండును. వేదము ఉదాత్తానుదాత్త స్వరితములను త్రిస్వరములతో నుండును. దాసుగారు ఉదాత్తమును స స్వరములోను, అనుదాత్తమును ని స్వరములోను, స్వరితమును రి స్వరములోను జేర్చిరి. 'స'ను షడ్జస్వరముతోను, 'ని'ని కాకలినిషాదస్వరముతోను, 'రి'ని చతుశ్శ్రుతిఋషభముతోను పల్కవలయు. అట్లు దాసుగారీ ఋక్కుల వీణపై పల్కించిరి. ఇతరులు వాయించుకొనుటకును ఋక్కులను అనగా సాహిత్యమునకు సంగీతస్వరములనిచ్చి తాళమునకు దారిచూపిరి. ఎంతచేసినను గాయకులు దీని ప్రయోజనముం బొందుట కష్టమే యని వారు వ్రాయకపోలేదు. "జగమందు నిక్కపు వడిరవళ్ల (స్వరముల) గుఱుతెఱింగిన చదువరులు మిక్కిలి యరుదు. పెద్ద లేర్పరచిన కట్టుపాట్లంబట్టి సరిగా వ్రాయుటగాని పలుకుటగాని యెవ్వరికి న్దరముగాదు. అయినను ఎట్లో తంటాలుపడి పీలైన పడికట్టేర్పర్చుకొని పెద్దలుంచిన వ్రాఁతగుఱుతులంబట్టి ముత్తీరుల వడిరవళ్లను (ఉదాత్తాదుల) వెల్లడించితిని" అని పల్కిరి.

ఉదాత్తాది వేదస్వరముల లక్షణమిచట అవసరమైనంతవఱకు వ్రాయక తప్పదు. "ఉచ్చైరుదాత్తః, నీచైరనుదాత్తః, సమాహారః స్వరితః" అని లక్షణము. వీనికి బిగ్గఱగా పల్కిన ఉదాత్తమనియు,

చిన్నగా పల్కిన అనుదాత్తమనియు, రెంటి నడుమగాఁ బల్కిన స్వరిత మనియు చాలమంది అర్థము చెప్పెదరు. అట్లైన దీర్ఘస్వరితమందుదాత్త త్వము వచ్చిపడును. వారేదో టూకీగా అట్లుచెప్పెదరని భావించి శాస్త్రీయ లక్షణమిచటఁ జూతము. బాలమనోరమలో "ఉచ్చైరు దాత్తః" అనుచో "నాదధర్మ విశేషః ఉచ్చైస్త్వం నేహావివక్షితం, కింతు ఉచ్చైశ్శబ్దః అధికరణశక్తి ప్రధానః ఊర్ధ్వభాగే ఇత్యర్థేవర్తతే. ఊర్ధ్వావయవస్య చావయవ్యపేక్షాయాం తాలుకంఠాది వర్ణాభివ్యక్తిస్థానా నామిత్యర్థాల్లభ్యతే" అట్లే "నీచైరనుదాత్తః" అన్నపుడును, "తాల్వా దిషు అధోభాగే నిష్పన్నోఽచ్ అనుదాత్త సంజ్ఞః స్యాత్" అని కలదు. అనఁగా ఉచ్చైరుదాత్తః అనుచో ఉచ్చైశ్శబ్దమునకు బిగ్గఱగా పల్కుట అని నాదధర్మ విశేషముగా నర్థము చెప్పరాదు. ఆ ఉచ్చత్వము స్థానకృతమైనది. ఊర్ధ్వభాగమందని యర్థము. తాలువు కంఠము మొద లైన వర్ణాభివ్యక్తిస్థానములయొక్క ఊర్ధ్వభాగమందని ఫలితార్థము. నీచైరనుదాత్తః అనుచోఁగూడ నట్లే నీచపదమునకు ఆ వర్ణాభివ్యక్తి స్థానములగు తాలువు కంఠము మొదలగు వానియొక్క అధోభాగమం దని యర్థము. అచ్చటినుండి పలుకఁబడు అచ్చు అనుదాత్తమని యెఱుఁ గవలె. మఱియు ఉదాత్తమును పలుకునపుడు కంఠనాళము ముడుచు కొని యుండును. స్వరము తీక్ష్ణముగా నుండును. గాత్రము బిగఁబట్టఁ బడి యుండును. అనుదాత్త ముచ్చరింపఁబడునప్పుడు గాత్రము శిథిలత నొందును. స్వరము మృదుమధురముగా నుండును. కంఠనాళము వెడ ల్పయి పెద్దదగును. "సమాహారః స్వరితః" అనఁగా ఉదాత్తానుదాత్త ములు రెండును ఏ యచ్చునందు కలిసియుండునో ఆ యచ్చునకు స్వరితమని సంజ్ఞ. ఆ యచ్చు హ్రస్వమైనను దీర్ఘమైనను ప్లుతమై నను. మొదటి అర్ధమాత్రమే ఉదాత్తము - మిగిలిన దంతయు అను దాత్తము. సమాహార మన ముందు ఉదాత్త స్వరము, ఆవల అనుదాత్తస్వరము కలిసినదని యర్థము. అట్లుగా నుచ్చరించవలె.

అప్పుడు తాల్వాదుల ఉపరిభాగమునుండి యధోభాగమువఱకు నాదము సాగును. అనఁగా నాదముపైనుండి క్రిందికి దిగునన్నమాట. మంత్రాక్షరము గురులక్షణము కలిగియున్నను, మఱియు సంత్యాక్షరము లఘువైయున్నను వేదమున గురువుగానే పరిగణింతురు. దాసుగారీ గురువుల కన్నింటికి సంగీతస్వరముల దీర్ఘముగానేయుంచిరి. కాన దీర్ఘస్వరితము నెత్తుకోలేదను కొందును.

పూర్వులు వేదమును వ్రాయుచు నుచ్చరించవలసిన ఉదాత్తాదులకుఁ గొన్ని గుర్తు లేర్పరచిరి.

1. ఉదాత్తముగా నుచ్చరింపవలసిన అక్షరమున కేగుర్తు ఉండదు. దాసుగారట్టి అక్షరము మీద "స" ఉంచిరి.
2. అనుదాత్తముగా నుచ్చరించవలసిన అక్షరమునకు క్రింద నొక అడ్డగీఁత ఉండును. దాసు రాయక్షరముపై 'ని' ఉంచిరి.
3. స్వరితాక్షరమునకు ఆ అక్షరముపై ఒక నిలువు గీఁత ఉండును. దాసుగారాయక్షరముపై 'రి' ఉంచిరి.

సాహిత్యమున గురువుగానున్న దానికి దాసుగారు దీర్ఘమగు సంగీతస్వరము నుంచిరి. ఇందుల కుదాహరణముగా పూర్వులెట్లుదాత్తాదుల సంజ్ఞలతో వేదము వ్రాసిరో అదిచూపి, ఆవలి పదవిభాగము ప్రతి పదార్థము వ్రాసెదను; పిమ్మట ఆ ఋక్కునకు దాసుగారెట్లు సంగీతస్వరముల నిల్పిరో అదియు దానికి వారి పద్యమును వ్రాసెదను.

య చ్చి ద్ధి తే వి శో య థా ప్ర దే వ వరుణ

వ్ర తం మి నీ మ సి ద్యు వి ద్య వి

పదవిభాగము:- యత్, చిత్, హి, తే, విశః, యథా, ప్ర, దేవ, వరుణ వ్రతం, మినీమసి, ద్యవి, ద్యవి,

అర్థము : వరుణ, దేవ = ఓ వరుణ దేవుఁడా; విశః = మనుష్యులు; యథా = ఎట్లో; (అనగా తమతమ వ్యాపారములనే ఆలోచించుకొను చుందురో అట్లే మేమును) తే - నీయొక్క; యత్, వ్రతం = ఏపనిగలదో దానినే; ప్ర,మినీమసి = ఎక్కువగా ఆలోచించుచుందుము. అనఁగా ఆచ రించుచుందుమని భావము. మేమెల్లప్పుడు నిన్నారాధించుచుందుమని సారము. చిత్ - హి ఇత్యవ్యయద్వయం పాదపూరణార్థమ్ అని భాష్యము.

'విశోయథా' అనుదానికి భాష్యమందు మఱొకఅర్థమునుగలదు. విశః = మనుష్యాః అజ్ఞానినః యథాతద్వత్ ఇత్యర్థః. మదీయవ్రతలోప నిమిత్తకాపరాధం క్షమస్వేతి వాక్యశేషః. దీనికి దాసుగారు వ్రాసినది.

ఒంటిదరువు. ఏంతులు 9. పడి 3.

సా నీ స నీ స రీ స నీ స రీ స స స సా ని సా
య చ్చి ద్ధి తే వి శో య థా ప్ర దే వ వ రు ణ వ్ర తం
ని నీ స నీ స రీ స సా
మి నీ మ సి ద్య వి ద్య వి

సైదోడు॥ నిన్నుఁ దిన్నఁగఁగొల్వ నేరని మమ్ము
మన్నించుమా రేపు మాపు నోవేల్ప!

## 4. భగవద్గీత - వేల్పుమాట

దాసుగారన్నింట స్వాతంత్ర్యము జూపుదురు. సుప్రసిద్ధమైన భగ వద్గీతను మనస్సునందుంచుకొనిరి. అందలి శ్రీకృష్ణుని అర్జునుని మాత్రమే తీసికొనిరి. స్వేచ్ఛగా కథనల్లిరి. వేల్పుమాట అని పేరిడిరి. ఆ బోధ వేఱు. ఈ బోధ వేఱు. దానికి దీనికి నేమియు సామ్యములేదు. ఇది యాంధ్రీకరణము గాదు. అందు 18 అధ్యాయములుండ నిందు 8 భాగాలు కలవు. అందు సాంఖ్యయోగము, కర్మయోగము, జ్ఞాన యోగము, భక్తియోగము మున్నగునవి యుండ, నిందు అందిక, పొందిక, అచ్చిక, మచ్చిక, ఎమ్మిక, నమ్మిక, కోరిక, చేరిక అను భాగములు గలవు. దాసుగారు శ్లోకములనుగాని ఆ వ్యాఖ్యానమునుగాని అంటలేదు.

ముట్టలేదు. తాను వేదాంతగ్రంథములం జదివి నిర్ణయించుకొన్న బాటలో సాగిపోయిరి. వ్యాసులవారువలెఁ దానును అర్జునుని నిమిత్త మాత్రముగా నెదుటనుంచుకొని వేదాంతోపన్యాస మొసంగిరి.

అర్జునుఁడు కురుక్షేత్రమునకువచ్చి తన వారింజూచి యుద్ధముచేసి వీరి నెట్లు చంపుదునని విషణ్ణుఁడై రథముపై చతికిలఁబడగా నొగలపై 'అందిక' లోనున్న కృష్ణుఁడు చూచి నవ్వి యిట్లనె.

ఓ నిండుమగవాఁడ ! మ పోటు బంట
అడంగితన మెట్టు లబ్బె నీ కిపుడు...
పెద్దల పెరువెల్ల ! బెంటలోఁగల్పి
పేరెల్లఁ జెడఁగొట్టి పిటికివైనావ ?

అని యెగతాళిచేసి పౌరుష మెక్కించును.

ఎఱుకువగలవార లేదియెట్లైన
తల్లడిల్లరు బిగితప్ప రుల్లముల

అని ధైర్యము చెప్పను.

నీవు చేయక తీరని పనిమానుకొన
నీ తరమా లెమ్ము నిబ్బరపడుము.

అని యుత్సాహము గొల్పును. ఏదియో యొకశక్తి నిన్నాడించు చున్నది. నీవు వేనికిం గర్తవుగావు. జరుగవలసినది జరిగితీరును. ఊరక యేల బయటపడెదవు.

నీ కొలంబు పరువు నిలపెట్టుకొనుము
నీ పెద్ద లరుగుతెన్నె పొమ్ము నీవు.

అని కృష్ణుఁడు పల్కినను అర్జునుఁడు మార్గమునకురాకున్న మరల 'పొందిక' గా నిట్లనియె.

ఎందుకూరక యేడ్చె దిట్టు లోయప్ప
చెడ్డపోఁగొట్టి మంచిం బెంచవలయు
నీవారి మర్యాద నిలుపఁ బుట్టితివి
జగడమాడుట నీకు పాడిమౌతగవు.

కనుక నీ క్షత్రియధర్మమును నీవు నిర్వహింపవలెనయ్యా! నీ పూర్వులు నట్లేనడిచిరి.

తనకన్నఁ బెద్దలదారి నెవ్వాఁడు
నమ్మక నప్పక నడువ నుంకించు ..
నిండారుతన్వి యానిజమరి కబ్బ.

కనుక సందేహింపకుము.

నోరెత్త కరమర గొనకొనరించు
నీపని నింతకంటె నాదరిలేదు.

అని కృష్ణుఁడనఁగనే యర్జునుఁ డమ్మాటలచే తన మదిలోని 'అచ్చిక' తీఱకిట్లనె.

ఏల నన్నురికొల్పె దిక్కూళపనికి

అనఁగానే కృష్ణుఁడోహో యిది కూళపనియా ? ఎవరిని నీవు చంపునది ? శరీరమునా ? ఆత్మనా ?

ఏను నీ వీజోదులెల్ల నిక్కముగ
నొక్కపోలిక మాఱకుంటి మెప్పటికి

అని జ్ఞానశంఖ మూదసాగినాఁడు. శరీరమునకుఁ చావు పుట్టుక లున్నవి గాని ఆత్మకు లేవు. ఆత్మ శాశ్వతమైనది. శరీరము నశ్వరమైనది.

నిజముగాదు జగంబు నింగినల్పట్లు

ద్రవ్యము నాశ్రయించుకొని గుణముండునుగాని నిరాధారముగానుండదు. ఆకాశమునకు రూపము లేదు. అది నల్లగా నున్నదందురు. ఎంత భ్రాంతియో చూడు! అట్లే మిథ్యయగు జగమును సత్యమని భ్రాంతిలో పడుచున్నావు.

నీ నీడ పరికించి నీ వుల్కనేల ?

నీవు చిత్స్వరూపుండవు. అంతఃకరణమందలిది నీ నీడ. ఈ నీడ చిదాభాసము, ఆ చిదాభాసుని యందాత్మాభిమానముగల్గినది. చిదా

భాసుని గుణము లాత్మయందు, ఆత్మగుణములు చిదాభాసునియందు నారోపించుకొనుటవలన జీవత్వ మేర్పడినది.

ఎఱుక నీరూపు నీకేజోలిలేదు.

నీవు జ్ఞానస్వరూపుడవు. జ్ఞాని కేతగులమునుండదు. మఱి జ్ఞానినైన నాకీ వగపేలకల్గె ? ఎఱుకయేలలేదు అని అందువా

ఎఱుక రూపైన నే నెఱిఁగింపకున్న
నిక్కమెఱుఁగ లేఁడు నెమ్మేని తాల్పు.

నీవు శరీరమను నుపాధిని ధరించితివి. ఆ మునుగున్నదికాన నీకు వగపుకల్గినది. అది జ్ఞానస్వరూపుఁడనైన నేను బోధించి యా మునుఁగుం దొలఁగింపవలె. అంతఃకరణోపాధి తొలఁగిన నీ నిజరూప మేర్పడును. మన మిర్వురము జ్ఞానస్వరూపులమేనా ? అందువా ? అవును.

ఓర్పున నీవు నే నొక్కటయ్యెదము.

వైరాగ్యోపరతులు గల్గిన జ్ఞానివైనచో నపుడు నీవు నేను ఒకటి యయ్యెదము. ఏకోరికయు లేనివాఁడు బ్రహ్మమేనయ్యా అని చెప్పెను. అపుడర్జునుఁడు 'మచ్చిక' మీఱ నిట్లనె.

ఊరకే తెలియక యూఁ కొట్టుచుంటి ...
ఒప్పదు నీవు నే నొకటనుమాట
నీవు నిజంబు, నీ నీడను నేను
మునుపటికంటె నిప్పుడు కొంతదారి
యగపడుచుండె నీ యానరాచేత
తెల్లముగా నచ్చతెనుఁగుతోఁజెప్పు.

అని కిరీటి యిప్పుడు కొంతదారి కనఁబడుచున్నదన్నాడు. అనఁగా అడిగి తెలిసికొనవలసిన దున్నదని గ్రహించినాఁడనుట. ఆజ్ఞేయమును తెలియని సంస్కృతములోఁ జెప్పునేమోయని భయముకల్గి తెలిసెడి తెలుఁగులోఁ జెప్పుమన్నాఁడు. అందులకు దాసుగారి కృష్ణుఁడు నవ్వి యిట్లనె.

కడముట్టె పెట్టి బోఁకలి తలచుట్టు
మనునట్టు లడిగెదో యబ్బాయి! నీకు
చెవిపట్టలేదు నా చెప్పినమాట ...
కోరిక తప్ప నీకుఁ బగవాడెఁడు ?

అని అంతశ్శత్రువగు కామము నెత్తుకొన్నాఁడు. కామపదముతో తక్కిన క్రోధాదుల నైదింటిం గ్రహింపవలె. అరిషడ్వర్గమును జయింపవలె. అందుకు ప్రధాన మల్లనిబర్హణ న్యాయమునఁ గామము జయింపుమన్నాఁడు. ఆవలఁ దక్కిన విజయ్యములగు ననుచున్నాఁడు

కోర్కున్న దనుకఁ జేకూరదు తనివి
కోరిక చేతనే కోరికంగొట్టు.

కామ మున్నంతవఱకు నిరతిశయానంద మబ్బదు. కాన ఆ కామమును కామముచేఁ గొట్టివేసి కామము లేకుండఁ జేసికొమ్మన్నాఁడు. ఇది విచిత్రముగా లేదా ? అవ్వలి కామముం బాఱఁగొట్టిన కామము, తనయందుండఁ దాను నిష్కాముఁ డెట్లగు ? చెప్పెద. కామము జగత్తుపై కల్గుచున్నది. ధన కాంతాది జగము భోగ్యపదార్థమని యనుకొనుచున్నంతవఱకు కామముండక తప్పదు. కాన నట్లుగాదు. ఈజగత్తును భోగ్యముగాఁ జూడక దృశ్యముగాఁ జూడు. దృశ్యమైన బ్రహ్మము. బ్రహ్మముం జూచిన వానికి నిరతిశయానందము గలుగుటలో సంశయమేమున్నది? ఐతే జగమును బ్రహ్మముగా నెందుకు చూడవలె? నందురా ఈ జగము బ్రహ్మమునందే వివర్తముగాఁ దోఁచుచున్నది. కాన బ్రహ్మము కారణము. జగము కార్యము. అని చెప్పి 'మచ్చిక'ను నిండించినాఁడు.

ఆవల నర్జునుఁడు 'ఎమ్మిక' పొలుపొంద కృష్ణుంజూచి

నడువనొల్లం గ్రుడ్డి నమ్మికతోడ...
కతమైన నీవెటు కర్తమైనావు...
పుట్టని నీవెట్లు పుట్టినావప్ప !

అని నిలువఁదీసి యడిగినాడు. కారణము కార్యమగుటేమిటి? పుట్టుక లేని భగవంతునకుఁ బుట్టుక యేమిటి? చెప్పమన్నాడు. అప్పుడు స్వామి,

నీచూపు నీకుఁ గాన్పించిన జగము
నీకంటె వేఱు గానేకాదు నమ్ము....
నీకంటె వేఱుదిన్నేలేదు సుమ్మ.

బ్రహ్మమందు జగము వివర్తముగాఁ దోఁచుచున్నది. కాని బ్రహ్మము కంటె జగము వేఱుగాలేదు. త్రాడుంజూచి పామనుకొన్నాము. త్రాడు వేఱుగా పాము వేఱుగా నున్నది. కాన బ్రహ్మముకంటె మరొకవస్తువు లేనేలేదు. ఆ బ్రహ్మము నీవేనయ్యా! అని దృక్కు-దృశ్యము ద్రష్ట వీనినిగురించి చెప్పెను. పుట్టినట్లు నేను గన్పించుట నీ అజ్ఞానమువలన. అజ్ఞానమున్నంతవఱకు త్రిపుటియుండును. అజ్ఞానము నశించిన త్రిపుటియుండదు. త్రిపుటిలేకున్న భేదములేదు. భేదము లేకున్న నాకు పుట్టుక యెక్కడిది?

ఎద్దియుం దలఁచక యీవూరకుండు
కోరికమాను నీకుందోచు నిజము.

కామము మనోధర్మము. మనోవ్యాపారము నడఁచుకొనుము. మనోవృత్తులే జాగ్రత్స్వప్నసుషుప్తులు. అని తత్స్వరూపవిశేషములను జీవన్ముక్తుల లక్షణమును వివరించి మనోవృత్తి నడంచుకొని సుఖమొందుమని చెప్పెను. అంత నర్జునుఁడు 'నమ్మిక' కలవాడై.

ఈవీ జగంబున కేలికవనుచు
నెఱిఁగించినావు నాకెట్టులో నీవు....
నినుగూర్చి నంతయు న్దెలియలేకుంటి....
హాయిగాఁజూపు నీ యందమౌరూపు.

అని యడిగినాఁడు. తనయెదుట రథమునొగలఁపై గూర్చుండి నేనీశ్వరుఁడ నని చెప్పుచుండ నీశ్వరునిది మనుష్యమాత్ర పరిమాణముగల శరీరముగా దనుకొన్నాఁడు. నిక్కమైనరూపమేదో యున్నదనుకొన్నాఁడు. దానిం

జూపుమన్నాఁడు అర్జునుఁడు. అప్పుడు కృష్ణుఁడు మానవుడు స్వధర్మమునఁ బ్రవర్తించిన నీశ్వర సాక్షాత్కారమగును. అని నాలుగు వర్ణముల తద్ధర్మముల నాల్గాశ్రమములఁ దద్ధర్మములఁ జెప్పను. వర్ణాశ్రమధర్మముల నడపుచు

ఉల్లము నిల్పు నీ వొడ్డెక్కఁగలవు....
ఈవు నిన్నప్పు మఱెద్దియు గనవు
ఎఱిఁగిన పిదప నీవే మిగిలెదవు.
ఎఱుక నీరూప మఱెద్దియుఁగాదు
కనువిచ్చినాఁడ నన్ననుము నిక్కముగ
నిన్నీవు మఱచి నన్నే చూడుమన్న.

అని జ్ఞానోపదేశము చేసినాఁడు. జ్ఞానమునిచ్చి చూడుమన్నాఁడు నిజస్వరూపము కన్పించునన్నాఁడు. దాసుగారి విశ్వరూప సందర్శన మిదియే. ఆవలి నోయబ్బాయీ !

సోమరియై కున్కుచు బ్రదుకు దేబె
కల్ల జగము కలగని యుల్కుచుండు
కనుక నీ సాజమౌ కట్టడి నడిచి
యెదరి నోరిచి బ్రదు కీడేర్చుకొనుము.

అని స్పష్టపఱచినాడు. అప్పుడర్జునుడు 'తనుఁ గనఁ జాలునంతటి తెల్వియిడు నల్లవేల్పు నెంతేఁ బరికించి' 'కోరిక' యీడేఱినదన్న సంతోషముతో స్వామిని బొగడుచు

జగమెల్ల నను జూచి సంతోషమొంద
నన్ను నీలోఁ జేర్చు నా యిలువేల్ప !

అని తన కోరికం దెల్పును. అపుడు స్వామి యర్జునుం జేరఁదీసి కొని 'చేరిక' గలవాఁడై.

ఒరుల నొప్పించుట కొల్లనివాని
ఇఱ్ఱు పొర్గులకు మేలే కోరువాని....

మాటి కొరుల తప్పు మన్నించువాని ...
ఇచ్చకము న్మోసమెఱుగనివాని
ఉన్నదాన ద్దన్వి నొందెడువాని ...
తనకూర్మి బత్తునిఁ దనలోనఁ జేర్చి
యేలుచునుండె హాయిగ నల్లవేల్పు.

ఇట్టి గుణములున్న నరుఁడు తప్పక బ్రహ్మైక్య మందడా ?

ఇట్లు నారాయణదాసుగారు తన వేల్పుమాటను ముగించెను. ఇందు భగవంతుఁడు బోధించుచుండెఁ గాన నిది భగవద్గీతగాకేమి ? అది సంస్కృతమని "వేల్పుమాట" అని తెలుఁగు పేరిడిరి. ఇది మంజరీ ద్విపదలో వ్రాయఁబడినది. ఈ మంజరికిని 'బడి' అని పేరుపెట్టుకొనిరి. కీ. శే. రెంటాల వేంకటసుబ్బారావుగారు 'అదృష్టదీపిక' వ్రాసి అందులో ప్రశ్న చూచుకొను పద్ధతిం గూడఁ జేర్చిరి. మనదాసుగారు నట్లే యీ పుస్తకమున ప్రశ్న చూచుకొను ప్రక్రియను గూడ నుటంకించిరి. ఇందు మంజరీ ద్విపద కలదుగాన నొక్కొక్క పాద మొక్కొక వాక్యముగా సాధారణముగా నుండును. ఆ వాక్యముం బట్టి ఫలము నూహించుకొన వలె. పూర్వము పెద్దలు శ్రీమద్భాగవతముం బట్టి ప్రశ్న చెప్పెడివారు. ప్రశ్న నడుగవచ్చిన వారిచే భాగవతమును బూజ చేయించి కన్నులు మూసికొని భగవంతుని ధ్యానించి నీ ప్రశ్నను మనస్సులో ననుకొని పుల్లతో మూసియున్న నీ భాగవత మందొకచో గ్రుచ్చుమనెడివారు. వారు గ్రుచ్చిన పిదప నా పుల్లయున్న పొరటను దెఱచి యెడమపేజీలో నెన్మిదవ వంతు క్రింది నుండి కుడిపేజీ చివఱకు చదివి దానిని బట్టి ప్రశ్న ఫలముం జెప్పెడివారు.

## 5. గౌరమ్మ పెండ్లి

దాసుగారు గౌరమ్మ పెండ్లి హరికథగానచ్చ తెలుఁగులో వ్రాసిరి. "ఎన్బదవపడి న్గాన్క మొదటి వేల్పున కిడినాఁడ" అనుటచే దీనిని వారు 80-వ యేట వ్రాసి వినాయకునకుఁ గాన్కగా నిచ్చిరి. ఈ యీడునను

వారికి నాటు తెలుఁగు పలుకుల మఱపులేకునికి కచ్చెరువు గలుగుచున్నది. బాస యిచ్చగొలఁది నొదిగినట్లు కతయుఁ దలంపుకొలఁది మెలంగినది. కాళిదాసు కుమారసంభవమందలి కథ నంటుకోలేదు. మఱెట్లు వ్రాసిరందురా? వినుఁడు. హిమవంతుఁడు తపస్సుచేసి బ్రహ్మవరమున నొక పుత్రికం బడసె. ఆమెయే గౌరమ్మ. ఆమె శివుఁడు భర్తకావలయునని తపమొనర్చె. బ్రహ్మ ప్రత్యక్షమై తపస్సు మానుము. శివుఁడేవచ్చి నిన్నుఁ బెండ్లాడునని చెప్పిపోయెను. తపము మానియున్న గౌరికడకు శివుఁడు వికార వృద్ధ రూపమున వచ్చెను. కుమారసంభవమునందువలె నజినాషాఢధరుఁడుకాఁడు.

సీ॥ వలముగావాచి పిల్కలు పెట్టి చీమూరు
నడుగుల నొరసి వ్రేలాడు పుచ్చె
బొడ్డు కయికి నందఁబోనట్లు పొడవుగా
ముడుతలఁ దోఁగాడు పొడకపొట్ట
ఎండిపోయిన లోఁతుగుండియ కిరుతట్టు
సొట్టయై కదలాడు వట్టిరెట్ట
ముటిగిపోయిన ముక్కు, మొటి పెదవులు, పాచి
పట్టి విస్తుంగ్రమ్ము మిట్టపండ్లు
పుసులు వాటెడు మిడిగ్రుడ్లు, బురుకబొంది
ఎలుక జానుగ, ల్వెట్టిన, వ్వేల్గు లెల్గు
గూనునడ్డి, మొల స్గగుల్కొన్న పోఁచ
గలుగు ముత్త యవిటి పాటుఁ డులికి పలికె.

(వలముగా = ఎక్కువగా; పొడకపొట్ట = గాదెపొట్ట; విస్తు = దుర్వాసన; బురుకబొంది = పొట్టిదేహము; గూను = పూర్వకాయము ముందఱికి వంగియుండుట; నడ్డి = పూర్వకాయము వెనుకకువంగియుంట; పోఁచ = జందెము: ముత్త = ముసలి; అవిటి = అంగహీనుఁడు)

ఆ ముసలి 'నాకీడైన మిటారివినీవే. నన్ను గులాముగ నేలుకోవే' అనును. ఆమె యతఁడీశ్వరుఁడని గ్రహించి పూజించి యట్లే సలిపెద.

నా తలిదండ్రుల నడుగుమనును. అతఁడబ్బో నేనంతదాఁక నోర్వఁగలనా? యని యామె యాపాదమస్తకము వర్ణించుచుండ హిమవంతుఁడు భార్యతో నచ్చటికి రాఁగా నీ వృద్ధువారితో నీ కూఁతు నాకిచ్చి పెండ్లి చేయుమనును. వారితఁడు శివుఁడే యని యెంచి సరేయందురు.

కం॥ అనఁ దెట్టి వెట్టినగి జ
ట్టునఁ బొడుముం బీల్చి విద్రుచి టొడ్డకయింగి
ట్టున ముది యెలుఁగువలె న్నా
ననయం బంగమొలవేలు పడలుచు వెడలెన్.

దిగంబరుఁడగు నావేలుపు వెట్టినవ్వు నవ్వి జుట్టున పొడుముపీల్చి ఎడమచేతిలో శింఘాణమును విదిలించివైచి వెళ్ళిపోయెను. దాసుగారి శివుఁ డిట్లు వెళ్లిపోఁగా గౌరమ్మ విరహవేదన పడును.

సీ॥ అలరు విల్తుని తిమురడఁచిన నీకాఁడు
దానిపైఁ గోరిక తగులదేమొ
గడుసుబిత్తరి బూటకపుమాట నమ్మట
తగవు కాదని పాటి తప్పెదేమొ
చదలేరు నాయేర లెదురయి నివ్వన
బిగి కౌఁగిటం గ్రుచ్చి విడువదేమొ
నామంచి తలిదండ్రులే మఱి నీ వెడ
వాలకమున కొప్పఁ జాలరేమొ
నిన్నుఁ గానక నులియైన నిల్వనోప
మించిపోనీకు నన్ బ్రతికించు వడిగ
నేలజాలము నన్నిఁక నేలుకొనుము
కడలి మిసిమితాల్ప! కను మంగమొలనేల్ప!

అని వేఁడుకొనుచుండ ముక్కంటి మునుపటివలె వచ్చి మరులు తలకెక్కి మాటలాడి యిసీ యీ పెండ్లి యగచాట్లు నా కెందుకని గౌరమ్మ సందిట నదిమిపట్టినను నాగక వెళ్లును. అంత నొక యేడ్పు వినఁబడ గౌరమ్మ జాలికలిగి యా సవ్వడిం బట్టిపోయి యొక చెఱువులో

మొసలి, బ్రాహ్మణ బాలుం బట్టుకొని మ్రింగఁబోవుచుండ దానితో అయ్యో ఆ బాలుని విడువుము. అందులకు నా తపస్సు నీకు ధారపోసెద నన నది యింతమాత్రమునకే తపస్సును వ్యర్థపరచుకొందువా యనుచు నా మొసలియు నా బాలుఁడు నదృశ్యులగుదురు. అంత గౌరి మరలఁ దపస్సునకుఁ బూనుకొన శివయ్యవచ్చి తపస్సుమాని యింటికేగి వివాహ ప్రయత్నము లొనర్ప మీ తండ్రితోఁ జెప్పు. నేను వచ్చి నిన్ను బెండ్లా డెదనని పల్కి యంతర్థానమగును. హిమవంతుఁడు పెండ్లి పందిరి వేయును. వేల్పులందఱు పెండ్లికి వత్తురు. గౌరమ్మయుఁ బెండ్లి పందిరిలోనికి రాఁగా నెట్టులో నా యొప్పులాడి యొడిలో పంచ శిఖల బ్రాహ్మణ బాలుఁడు నిద్రించుచుండ వేల్పులు చూచి యది సహింపక యాయుధములతోఁ గొట్ట నుంకింప నా చేతులెత్తిన వెత్తినట్లే నిల్చిపోయెను. అప్పుడు బ్రహ్మ వేడుకొన నా వేల్పుల గోడుడిగెను. శివుఁడు నిజరూపమునవచ్చి గౌరిం బెండ్లాడెను. ఏదియో యొక తీరున మనకుఁ గావలసినది భగవత్ స్మర ణము. మొసలితనమున నంతకన్న ముఖ్యకార్యమేమున్నది? ఉన్నది యున్నట్లు వ్రాసిన చమత్కారమేమున్నది ? భగవల్లీల లెన్నియుండవు? అని దాసుగారి తలంపు. వారే "నిన్నటి యూపిరే నేఁడు రేపు నీడ్చికొనక తప్పునట్లు వ్రాసినదే పలుతెలుంగుల మార్చుచు వ్రాయక తీరని నానేర మి న్నాయిలు వేలుపు మన్నించుగాక" అన్నారు. అంతేకాదు. "నన్నే నే నెఱుంగని ములుచన్నా తలిదండ్రులన్గూర్చి తెలుపనుంకించు నా వెఱ్ఱి కేమనవలయు ?" అనియు ననకపోలేదు. మఱి యెందుకు వ్రాయవలసి వచ్చినది? అదియుం దెలిపిరి. "నా కల మెలకువలన్ని కనిపెట్టఁ గలిగినదిను సుల న్గాయెన్నిన మంచిసెబ్బరలం బైవారలంబట్టి నా నేర్చిన కొలంది. . . తెలుప కూరకుండఁ దరముగాక ఉబుసుపోని మంగలి చీలితల గొఱిగి నట్లు ఇట్లు వ్రాయవలసివచ్చెను" అన్నారు. ఇంతేకాదు "ఈ నా పనులు నాకుఁగాని, నాతోటి పాటివారికిఁగాని, నా కోరినమేలు సమకూర్చునను నమ్మకము నుంతయున్నాకులేదు" అన్నారు. మఱి అచ్చతెలుఁగు హరి కథ యెవరి కర్థమగును ?

ఇందు భాషయే అచ్చతెలుఁగుగాదు. రాగములకు తాళములకు సైతము తెలుఁగు పేరు లుంచఁబడినవి. తాళములకు నడకఁ జూపిరి. రాగమునకు అవలి యని పేరిడుటయేగాక రాగసంజ్ఞలకును మాఱుపేరిడిరి.

ముఖారి రాగము — నోటిపగ అవలి. (శబ్దముబట్టి పెట్టిరి)
శంకరాభరణము — లేనెల అవలి (అర్థముంబట్టి పెట్టిరి)
పూర్ణచంద్రిక — వెన్నెల అవలి
కాంతామణి — పెండ్లాము అవలి
కేదారగౌళ — పొలముగౌరు అవలి
శ్రీ (రాగము) — కలిమి అవలి
దర్బారు — దొరకొలువు అవలి
వసంతము — ఆమని అవలి.

ఇవ్విధమున రాగములకుఁ బేర్లిడఁబడినవి. ఇవి యెందఱకుఁ దెలియును? పుస్తకాంతమునైన నిట్లు తెలిపిన బాగుగానుండెడిది. అట్లు తెలుపలేదు. ఇఁక పద్యాలకో,

చంపకమాల — తుమ్మెదకంటు
ఉత్పలమాల — కలువదండ
మత్తేభ విక్రీడితము — ఏనుఁగు చెలలాట
శార్దూల విక్రీడితము — బెబ్బులి చెలలాట, పులి చెలలాట,
మత్తకోకిల — గండుకెంపుకంటి
వచనము — మాట

అని అర్థానుగుణ్యముగా పద్యములకుఁ బేర్లిడిరి. సరే. కందమునకు మూః అనిమాత్రము వ్రాసిరి. ఇది మూపు ఐయుండునని యెంచెద. గ్రంథాంతమున నర్ధనారీశ్వరుఁ డెట్లువ్రాసెనో చూడుడు.

సీ॥ ఎడమవైపాడుది కుడితట్టు మగవాఁడు
నడుబొంది నిరువుర బెడఁగుదోఁప
ఇటుకవ్వ గొప్పకొ, ప్పటు మినువాక పొ
లుక డాఁగు పస్సె వెంద్రుకల కొండె

ఈ క్రేవ బిర్రైక, యాకెలఁకునఁ బాప
పేరిటఁ గండటఁ (?) బెరుఁగుడాలు
రెంటతాగుడు తిండి పెంటి తేరీవల,
నాచక్కి క్రొవ్వాఁడి యాలఁబోతు
పిన్నజాబిలి మూఁడవకన్ను, నింగి
నేల లేలెడు నేరుపు నిండుతన్వి
యెదురెఱుఁగక మిటిమిటి బ్రతుకువేడ్క
గౌరు ముక్కంటులకు వంతుగాఁ జెలంగు.

ఇచట నేను రచించిన గౌరీకళ్యాణము షష్ఠాశ్వాసములోని పద్యము గూడఁ జూప వేడ్కగలిగినది.

సీ॥ అటు పింగళ జటాలమగు జూటికాబంధ,
మిటు నీలచికుర సంఘటితవేణి
అటు నిరంజన కరుణార్ద్రిమౌలోచన,
మిటు నల్లకాటుక యెసఁగుకన్ను
అటు విశాల సమానమైన వక్షస్థల,
మిటు గబ్బిగుబ్బ పయ్యెద ముసుంగు
అటు కరినార్ద్రి గజాజిన సంవ్యాన,
మిటు క్రొత్త హొంబట్టు మృదుదుకూల,
మటు త్రిశూలహస్త! మిటు గాజులకరమ్ము
అటు పురుష శరీర, మిటు సతితను
వెవఁడవీవు ? పురుషుఁడవొ ? స్త్రీవొ ? యర్ధనా
రీశ్వరా ! వచింపు మెఱుఁగువాఁడ.

## విష్ణుసహస్రనామ సంకీర్తనమ్

## 6. వెన్నుని వేయిపేర్ల వినకరి

దాసుగారు విష్ణుసహస్రనామ సంకీర్తనమునకు వెన్నుని వేయిపేర్ల వినకరి అను తెనుఁగువహి వ్రాసిరి. ఇది యెంతయో ధైర్యసాహసములతోఁ గూడినపని. ఎటులైన వారిని స్మరించిన నఖిలపాపహరముగదా,

"హరిర్హరతి పాపాని దుష్టచిత్తైరపి స్మృతః
అనిచ్ఛయాపి సంస్పృష్టో - దహత్యేవహి పావకః

దుష్టులు హరిని స్మరించినను వారి పాపములు నశించును. తెలియక ముట్టుకొన్నను నిప్పు కాల్చునుగదా. ఎన్నిసారులు స్మరింపవలెనందురా? ఒక్కసారియైనను జాలును.

"సంకీర్త్యనారాయణశబ్దమాత్రం విముక్తదుఃఖాస్సుఖినోభవంతి" అట్టిది వేయిసారులన్న నిఁకఁజెప్పవలయునా? ఒక నామమును వేయి సారులనుటయు జపమే. వేయినామములఁ గ్రమముగా నొకసారి యనుటయు జపమే. నారాయణుని వేయినామముల వేదవ్యాసులవారు లోకరక్షణార్థము శ్రీమద్భారత మానుశాసనిక పర్వమున వ్రాసిరి. నేను జూచిన అనుశాసనిక పర్వములలో నొకదానిలో సహస్రనామములున్న అధ్యాయము 254 గాఁ గలదు. మఱొకదానిలో మఱొకరీతిగాఁ గలదు. శంకరులవారు వ్యాఖ్యానించినది "అనుశాసనిక పర్వణి మోక్షధర్మే భీష్మయుధిష్ఠిరసంవాదా శ్రీవిష్ణోర్దివ్య సహస్రనామస్తోత్రంనామ ఏకోన పంచాశదధికశతతమోధ్యాయః" అని 149వ అధ్యాయముగాఁ గలదు.

ఈ భారతాంతర్గత విష్ణుసహస్రనామములను జపమందు వినియోగించుకొందురు. అన్నిమంత్రములకున్నట్లు దీనికిని ఋషి, ఛందస్సు, దేవత, బీజము, శక్తి, మంత్రము, కీలకము, అస్త్రము, నేత్రము, కవచము, యోని, దిగ్బంధము, ధ్యానము మొదలైనవి కలవు. గురూపదేశముతో నీ సహస్రనామముల జపింతురు. ఇది స్వానుభూతి.

ఈ సహస్రనామాలకు జగద్గురు శ్రీశంకరస్వాములవారు చక్కని వ్యాఖ్యానము వ్రాసిరి. అదే దాసుగా రిట్లనిరి. "ప్రాఁజదువుల (వేదాల) నారితీరిన జగమునొజ్జ (జగద్గురు శ్రీశంకరాచార్యులవారు) వెన్నుని వెయిపేరను బ్రాఁజదువుల నేర్చుకొనఁదగిన తెలివిగల వారికొఱకే వేల్పుబాసయందు (సంస్కృతమందు) వివరించెను. జగమునొజ్జవంటి తెలివితేటలుగలవారికేగాని తొలుఁబలుకును (వేదమును) వేల్పుబాస

యును సరిగాఁ దెలియఁబడనేరవు. కాఁబట్టి పిన్ననాటనుండియు నల వాటుపడిన తెలుఁగు మొదలగు నాటుమాటలతోఁ దెల్పినంగాని సగ టునఁ గొంతవఱకైన వెన్నుని వెయిపేర్లు తెలిసికొన నలవిగాదనియు, వేల్పుబాసను వేల్పుబాసచేతనే వేల్పుబాసరాని వారి కెఱిఁగించుట కొఱగానిపని యనియును, నానేర్చినకొలంది నచ్చతేఁటతెనుఁగున నిట్లు వెన్నునివెయిపేర్ల వినకరిచేసినాఁడను" అనిరి.

## జ్యోతిషము.

చిత్రము. ఈ యిరువదవశతాబ్ది యుత్తరభాగమున బళ్ళలో తెలుఁగు పండితులకు సంస్కృతమురాదు. సంస్కృతపండితులకుఁ దెలుఁగు రాదు. సంస్కృతమును జదువుకొనవలెఁగాని తెనుఁగు నేమి చదువుకొన వలె? అది పుట్టుకతోనే మనవెంటనుండెఁగదా యందురు. తెనుఁగులో జదువుకొనవలసిన గ్రంథములున్నవని తెలియక వారట్లందురనుకొందును. పైగా సంస్కృతము డుముపుల బురఖా తగిలించుకొనివచ్చి మనల మోసగించుచున్నది. నాటుతెనుఁగు నణఁగఁద్రొక్కి లేనట్లుచేసినది. అట్టి తెనుఁగు దుఃస్థితింజూచి దాసుగారు తెలుఁగుల మేల్కొల్పుటకు నాటుతెలుఁగున నిరాఘాటముగా గ్రంథములు వ్రాసిరి. ఏ విషయము నైన సంస్కృతమునంటక తెలుఁగులోఁ జెప్పవచ్చునని యనేకవిషయ ములం జెప్పిచూపిరి. ఇచట జ్యోతిషముం జూఁడుదు. దాసుగారి జననము తెనుఁగులో వ్రాసిరి. "నెత్తురుగంటియేడు తూఁపురిక్కనెల బూది పెద్ద వారము రేయి పదిగడియలకుఁ బొలకీబొంగుచుక్క నాలవయడుగున నేఁ బుట్టితినఁట. అప్పటికి దొమ్మిదిగాములయొక్క నిక్కపుటునికి నడకలు రెండుం బ్రొద్దువేల్పు లెక్కంబట్టి ... ఏర్పఱచితి. నేల నడుమునుండి దాఁపలి వైపునకుఁగల ౫౦౦ వంతులలో నజ్జాడయూరునకు వంతులు ౧౮౦ అని కలదు. ఇచ్చట అచ్చుతన్నుఁగనుఁగొనలేనట్లు ఒకసున్న నిల్పి ఐదువేలను ఏబదివేలను చేసినది. ఇది పెద్దతప్పు. 5400 అని యుండవలె గాని 50400 అని యుండరాదు.

నెత్తురుగంటియేఁడు = రక్తాక్షినామ సంవత్సరము. ఇది 1864 లోనిది. కాని 1924 లోనిది కాదు.

తూఁపురిక్కనెల = శ్రావణమాసము

బూది = కృష్ణచతుర్దశి. నల్లబూది అనవలసినదే కాని కొన్ని గ్రంథములు బూది యన్నను కృష్ణచతుర్దశి యని వ్రాసినవి.

పెద్దవారము = బుధవారము. ఇది మిశ్రసమాసము. 'పెద్దవంతు' అనవలసినది. పాలకీబొంగుచుక్క నాలవయడుగు = మఖానక్షత్ర చతుర్థపాదము. దాసుగారు స్కంధత్రయముం బరిశీలించిరి. ఇతరులు వ్రాసిన పంచాంగముం బట్టి తన జాతకమును వ్రాసికోలేదు. సూర్య సిద్ధాంతముం బట్టి వ్రాసికొనిరి. గ్రహస్ఫుటమును సాధించి దానిం దెల్పిరి. గతిని గూడ నిచ్చిరి. కాని ఏలాకో లగ్నముం దెలుపరైరి. ఇంత గొప్ప వాని జాతకచక్ర మెట్లుండునో గదా యని దానిం జూడ వేడుకపడువారి కొఱకు నేనిచట రాశిచక్రము వేసి యందు లగ్న గ్రహముల భాగల సంఖ్య గూడ నిచ్చెదను.

| | | | |
|---|---|---|---|
| | కే24 | ల6 కు9 | |
| | రాశి | | |
| | | | ర16 చం6 |
| | గు1 | రా24 | బు11 శు0.28 శ21 |

కొందఱు సంస్కృతము లేకున్న వ్యవహారము సున్న. వారములకు తెలుఁగుపేర్లేవి అనిరి. అందులకు వ్రాయుచున్నాను. సూర్యసిద్ధాంతమున "హోరేశాః సూర్యతనయా దధోధః క్రమశ స్తథా. మందాదధః క్రమేణస్యు శ్చతుర్థాది వసాధిపాః...మందామరేజ్య భూపుత్ర సూర్య

శుక్రేందు జేందవః” శని, గురు, కుజ, రవి, శుక్ర, బుధ, సోములు కక్ష్య యందధఃక్రమమున నుందురు. దినమునకు 24 గంటలు. శని మొదలు కొని యేడుగురు ఒక్కొక్క గంటకాల మధిపతులుగా నుందురు. కాన శన్యాదులు దినమునఁ దిరుగుచో మూఁడుసార్లు కాఁగా $3 \times 7 = 21$ గంటలగును. నాలవసారి తిరుగుచో ముగ్గురికే దినముసరిపోయి 24 గంట లగును. పిదప నాలవవాని వంతు సూర్యోదయమునకు వచ్చును. వాఁడా దినమున కధిపతి. అందువలన కక్ష్యలోని శని గురు కుజ రవి శుక్ర బుధ సోములు క్రమముగామాఱి సూర్యోదయమునకు రవి సోమ కుజ బుధ గురు శుక్ర శని క్రమమేర్పడును. వారమునకు వంతు అని తెల్గుపేరు.

| సంస్కృతము పేరు | | తెలుఁగు పేరు |
|---|---|---|
| రవి వారము | — | ప్రొద్దువంతు |
| సోమవారము | — | నెలవంతు |
| మంగళవారము | — | పొరిపట్టివంతు |
| బుధవారము | — | పెద్దవంతు |
| గురువారము | — | బేస్తవంతు |
| శుక్రవారము | — | చుక్కవంతు |
| శనివారము | — | సనివంతు. |

తెలివిడికై మాసములకును వ్రాసెద. అప్రస్తుతమని కినియకుఁడు.

| | | |
|---|---|---|
| చైత్రమాసము | — | ముత్తెపురిక్కనెల |
| వైశాఖమాసము | — | చేటరిక్కనెల |
| జ్యేష్ఠమాసము | — | తాటిరిక్కనెల |
| ఆషాఢమాసము | — | నీటిరిక్కనెల |
| శ్రావణమాసము | — | తూఁపురిక్కనెల |
| భాద్రపదమాసము | — | ముక్కంటిరిక్కనెల |
| ఆశ్వయుజమాసము | — | తొలురిక్కనెల |
| కార్తికమాసము | — | కత్తెరనెల |
| మార్గశిరమాసము | — | పొంగటినెల |

| | | |
|---|---|---|
| పుష్యమాసము | — | పొట్టరూపురిక్కనెల |
| మాఘమాసము | — | జన్నపురిక్కనెల |
| ఫాల్గునమాసము | — | ప్రొద్దురిక్కనెల |

ఇట్లు తిథివారనక్షత్ర మాస ఋతు రాశి సంవత్సరాదులకు తెలుఁగు పదాలు కలవు. వాడుక లేక అణఁగియున్నవి.

దాసుగారు వానిం బయటికిఁదెచ్చుటకు బూనుకొనిరి. అందులకే వెన్నుని వెయిపేర్లంగూడ నెత్తుకొనిరి. నిజమునకిది చాల పెద్దపని. జగద్గురువులు వ్యాఖ్య వ్రాసిననే వానిం దెలిసికొనుట కష్టముగానుండ నిపుడు దాసుగారు తెలుఁగువివరణములేని తెలుఁగుపేరులు వ్రాసిన నెవరి కర్థమగును? అసలు వ్రాయుటయు నెంత కష్టము? స్వాములవారి వ్యాఖ్యలో నొక్కొక్క పదమున కొక్కొక్కచో నెన్నియో అర్థములున్నవి. ఎన్నియో భావము లున్నవి. తాత్పర్యము నెఱుఁగుట కెన్నియో పద్ధతు లవలంబింపబడినవి. ఎన్నియో ప్రమాణములు చూపఁ బడినవి. అట్టి నామములకుఁ దెలుఁగు వ్రాయుట కెంత ప్రయాస పడ వలయు? పైఁగా వచనమైనఁగాదు. పద్యబంధము. గణయతిప్రాసనిర్బంధముకలది. ఐనను దాసుగారు వెనుకంజవేయలేదు. వేయి నామముల నకారాదిక్రమమునఁ దొలుత నేర్పఱచుకొనిరి. ఆద్యక్షరముతో నెన్ని పేర్లున్నవో సంఖ్యనిచ్చిరి. ఒకేపద మెన్నిసారులు వచ్చెనో అదియు నంకె నిచ్చిరి. సంస్కృతపదమును ప్రథమాంతమగు తత్సమము చేసికొని తెలుఁగు వ్రాసిరి. ఒకచో తెలుఁగుపదము నొకదానిని నే యిచ్చిరి. ఒకచో వాక్యము నిచ్చిరి. ఒకచో రెండు మూఁడు వాక్యములనిచ్చిరి. సీసమాలికలు వాడిరి. పద్మనాభ, పద్మగర్భ,* చక్రి, గదాధరాదుల కంతరార్థమునే వ్రాసిరి.

"కృష్ణుండు మంచికి దారిచూపించు వేల్పు"

'కృష్ణుండు* తప్పులనెల్ల యొప్పులుచేయు' అని కృష్ణపదము రెండు తావులరాఁగా నర్థభేదము* వ్రాయఁబడెను. శంకరవ్యాఖ్యననుసరింపలేదు.

చాణురాంధ్రనిషూదనః - దీనికి "చాణూరాంధ్రనిషూదనుం డెంతయుం బొగరుబోతు దాడినడంచున్"

'కాలనేమినిహుం' డగడుద్రుంచు మగఁడు ।
కేశిహుండు న్గిడు గెంటుబంటు"
మధుసూదనుఁడెల్ల మంటమారుల నడఁచున్.

అని పేరు నెత్తక వ్రాసెను.

యత్, తత్, కః, కిమ్, ఇవియు విష్ణువాచకములే. వీనికి దాసుగారు యత్తగునంతయు నడిపెడు సత్త అని వ్రాసిరి. శంకరులవారు 'యచ్ఛబ్దేన స్వతస్సిద్ధ వస్తూద్దేశ వాచినా బ్రహ్మ నిర్దిశ్యతే ఇతిబ్రహ్మ యత్. తత్తంతకాసరా అని వ్రాసిరి. శంకరులవారు 'తనోతీతి బ్రహ్మ తత్' అనిరి. కుఁడువోయిరూపయి కొనియాడఁబడువాఁడు అని దాసుగారి పద్యము.

శంకరులవారు 'కశబ్దస్సుఖవాచకః తేనస్తూయతే ఇతికః' అనిరి. కిమ్మగు నెల్లరికిఁ దెలియఁదగు విద్దె అని దాసుగారు. "సర్వ పురుషార్థ రూపత్వాత్ బ్రహ్మైవ విచార్య మితి బ్రహ్మ కిమ్" అని శంకరులవారు.

## ఛ ం ద స్సు

దాసుగారు ఛందస్సులోను విచిత్రమైన స్వాతంత్ర్యముం జూపిరి. తన కాలమందున్న మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు సీసముఁడఁగా వెండి, బంగారము, రత్నావతి యేల యుండరాదని వాని కొక లక్షణము నిర్ణయించి వానిని వ్రాసిరి. మన దాసుగారు నదిమెటింగి కాఁబోలు క్రొత్త పద్యాల సృష్టింపకున్నను ఉన్న పద్యాలకు తెలుగుపేరులు పెట్టిరి. గౌరమ్మ పెండ్లిలో చంపకమునకు తుమ్మెదకంటు, ఉత్పలమాలికకు కలువదండ, మత్తేభ విక్రీడితమున కేనుఁగు చెలలాట, శార్దూల విక్రీడితమునకు పులి చెలలాట, మత్తకోకిలకు గండుకెంపుకంటి అని వృత్తాలకు తత్తదర్థబోధ కాంధ్రనామములు

నుంచిరి. ఈ తనపేళ్లనే వాడుకలోనికిఁ దెచ్చిన లెస్సగా నుండెడిది. కాని యీ వహిలో మరలఁ దనయిచ్చవచ్చినట్లు క్రొత్తపేరులు పెట్టిరి.

"నా యల్లికయందలి పద్దెములన్నియును బెద్దలేర్పఱచిన కట్టు పాట్ల చొప్పుననే వీలైనంతమట్టుకు నాచేతనైనంతవఱకును నడపినాడను. మఱియు తొల్లింటి పెద్దలు పద్దెములకుఁ బెట్టిన పేర్లకుఁగూడ మాఱుగా నాయిచ్చకొలంది నీ క్రింది తీఱున మేలుకావించు మెత్తని యచ్చ తెనుఁగు పేర్లుంచి నాఁడను" అనిరి.

| పూర్వనామము | | తాను పెట్టిన నామము |
|---|---|---|
| సీసము | ... | ఒజ్జ |
| సీసమాలిక | ... | తల్లి |
| కందము | .... | తండ్రి |
| తేటగీతి | .... | ఇలువేల్పు |
| ఆటవెలఁది | — | గెలుపు |
| ద్విపద | — | సైదోడు |
| మంజరి | — | బడి |
| ఉత్పలము | — | పాలబువ్వ |
| చంపకము | — | పూలపాన్పు |
| శార్దూలము | — | పుట్టుచేవ |
| మత్తేభము | — | పుట్టిల్లు |
| మత్తకోకిల | — | ముద్దుపల్కు |

ఇంకనుగలవు. ఈ రీతి పూర్వపద నామములకు మాఱుపేరులు గలవు. కందమున నొకచోఁడ 'మూఁపు' అనియు మఱొకచోట 'తండ్రి' అనియువాడిరి. పృథ్వీవృత్తమునకొకచోట 'అందము' అనియు మరొకచో 'చక్కదనము' అనియు వాడిరి. పద్యనామములు సంజ్ఞలుగదా. వానిని మార్చుచున్న నవి వ్యాపక మెట్లగును? పరులెఱుంగుటెట్లు? మఱియు నీ పుస్తకమున చాల క్రొత్తవృత్తముల క్రొత్త పేరులతో వాడిరి. అది

యట్లుండ మఱొకటి చూడుడు, "ఇందు నా క్రొత్త పన్నిక పద్దెముల పేర్లు 'హెచ్చరిక, హెచ్చరికలోని తాల్మి, చెల్మి, కల్మి, చుక్కాని, చూలు, నోము, అనునవి" అని వ్రాసి యూరకుండిరి. ఇవి యేవృత్తములు, వేనికీ మారుపేరులు? అవి వ్రాయకున్న చదువరులెట్లు తెలిసికొందురు? నేనేదో తంటాలుపడి వాని యానుపానులెఱిఁగితి. మనవి చేసెద. కాళిదాసు రఘువంశము రెండవసర్గలో తుదిదాక ఉపజాతిని వాడిరి. వీరు ఇంద్రవజ్రోపేంద్రవజ్రలతోనే ఉపజాతి, వ్యత్యస్తోపజాతి, సమోపజాతి, వ్యత్యస్తసమోపజాతి, వైపరీత్యోపజాతి వాడిరి. మన దాసుగారట్లుగాదు. 32వ పద్యముజూఁడుడు. వారు వ్రాసినది.

హెచ్చరిక :- ఇందు మొదటి యడుగు తాల్మి. తక్కినవి కోరని కోర్కులు.

మఱిమఱి దమయిత రాజయి యేలుచు మంచిని సల్పు జగమ్మునన్
మరువక దర్పదుఁడిచ్చును మేలె యొనర్పెడు వారికి హెచ్చరికన్
గుఱుతుగ దర్పహుఁ డెల్లపుడు న్జెడుగొట్టుల కెంతయుఁ గ్రొవ్వడఁచున్
బిఱబిఱఁ దా ద్రవిణప్రదుఁడు న్దను వేడిన సాదులకోర్కెలిడున్.

హెచ్చరిక. స్వస్థానార్ధసమవృత్తము.

ఇందు ప్రథమపాదము 'తాల్మి' యఁట - ఇదియే వృత్తమో చెప్పఁబడలేదు, తక్కిన మూడుపాదాలు "కోరని కోర్కులు" ఇది కవి రాజ విరాజితమునకుఁ బెట్టిన మాఱుపేరు.

**175 వ పద్యము.**

చెల్మి - దొడ్డకాపురము. సిద్ధుఁడెల్లప్పుడుం జేటులేకుండెడున్
కైవారము. సిద్ధుండు తా సెబ్బర చేయఁడెన్నఁడున్
దొడ్డకాపురము. సిద్ధసంకల్పుఁ డాసించు మేల్నడ్వడిన్
కైవారము. సిద్ధార్థుఁడు న్సాదుల చెల్మిగోరెడున్.

చెల్మి - ఇదియు స్వస్థానార్థ సమవృత్తములోఁ జేరును.

దొడ్డకాపురమున స్రగ్విణీ వృత్తము. కైవారము అన ఇంద్రవంశ వృత్తము.

శంకరులవారి వ్యాఖ్య — అనన్యాధీన సిద్ధిత్వాత్ సిద్ధః. తనకే యధీనమైన సిద్ధిగలవాడు. "నిత్యనిష్పన్నరూపత్వాత్ సిద్ధః. 'నిరతిశయరూపత్వాద్వా'

సిద్ధసంకల్పుఁడు - సిద్ధో నిష్పన్నః సంకల్పోఽస్యేతి సిద్ధసంకల్పః

సిద్ధార్థుఁడు - సిద్ధో నిర్వృత్త అర్థ్యమానోఽర్థోఽస్యేతి సిద్ధార్థః.

176 వ పద్యము.

కల్మి - పాలబువ్వ. సిద్ధియు లంచగొండులకుఁ జిక్కనితాలిమి కల్మిపంటయౌ,
సిద్ధిదుఁ డెల్లవారలకుఁ జేతలకుం దగునట్లు మాటిడున్
ముద్దుపల్కు. సిద్ధిసాధనుఁడు స్వనంతట పెమ్మెయి వెలిఁగించెడున్
బుద్ధి దివ్వెను మంచివారి కనుంగుతోడయి యెప్పుడున్.

ఈకల్మి. పరస్థానానార్థ సమవృత్తము. పాలబువ్వ అన ఉత్పలమాల. ముద్దుపల్కు అన మత్తకోకిల. 1-2 పాదాలుతల్పము. 3-4 పాదాలు మత్తకోకిల.

శంకరవాఖ్య — సర్వవస్తుషు సంవిద్రూపత్వాత్ సిద్ధిః. సకల వస్తువులందు చేతనారూపుఁడై యుండువాఁడు సిద్ధి.

సిద్ధిం ఫలం కర్తృభ్యః స్వాధికారానురూపతో దదాతీతి సిద్ధిదః.
సిద్ధేః సాధకత్వాత్ సిద్ధిసాధనః. కార్యసిద్ధికి సాధకమైనవాఁడు.

182-వ పద్యము.

చుక్కాని - పండుగు తాఋమారుకాని తెల్విదాపు తా సుమేధుఁడౌ
పూలపాన్పు - అరమరలేని సాదుల సుయామునుఁడు స్వనచెంతఁ జేర్చెడున్
మేడ - సురాధ్యక్షుఁడు న్మేలు చుక్కానిఁ ద్రిప్పున్
మేల్గడన - సురానందుండు న్మెత్తని యెదలలోఁ జొక్కుఁ దనివిన్.

చుక్కాని. ఇది సర్వపరస్థాన విషమవృత్తము. పండుగు అన సుగంధివృత్తము. ఈ విషయము దాసుగారు చెప్పలేదు. రెండవపాము

పూలపాన్పు చంపకము. మూఁడవపాదము మేడ. భుజంగ ప్రయాతము. 4-వ పాదము మేల్గడన అన శిఖరిణీ వృత్తము.

శంకరవ్యాఖ్య : శోభనా మేధా ప్రజ్ఞాఽస్యేతి సుమేధాః. మంచి బుద్ధిగలవాఁడు. శోభనాయామునా యమునా సంబంధినః దేవకీ వసుదేవనంద యశోదా బలభద్ర సుభద్రాదయః పరివేష్టారోఽస్యేతి సుయామునః (యద్వా) గోపవేషధరాయామునాః పరివేష్టారః పద్మాసనాదయః శోభనా అస్యేతి వాసుయామునః. దేవకీవసుదేవులు, నంద యశోదలు, బలభద్ర సుభద్రలు మొదలగు మంచివారితోఁ గూడినవాఁడు సుయామునుఁడు. లేదా గొల్లల రూపులుదాల్చిన బ్రహ్మాది దేవతలతోఁ గూడి యుండువాఁడు

'లోకపాలానాం సురాణాం అధ్యక్షః సురాధ్యక్షః
సురా నానంద యతీతి సురానందః. వేల్పుల సంతోషపెట్టువాఁడు.'

దాసుగారు సమవృత్త భేదములనేగాక, అర్థ సమవృత్త విషమవృత్తములంగూడ వాఁడెను. ఏ తెలుఁగు కవియు నిట్టి సాహసమున కొగ్గలేదు.

## 7. వేల్పువంద

వేల్పువందయన స్వామిశతకము. సింహాద్రి నృసింహస్వామి శతకము. శతకలక్షణప్రకార మిందును 'రెంటద్రాగుడు తిండి మెట్టంటు వేల్ప' అను మకుటము గలదు. రెంటద్రాగుడు = ఏనుఁగు. రెంటద్రాగుడు తిండి = సింహము. రెంటద్రాగుడుతిండిమెట్ట = సింహాద్రి. రెంటద్రాగుడు తిండిమెట్టంటువేల్ప = సింహాద్రియందున్న దేవుఁడా, అని సంబుద్ధి. ఇందన్నియు సీసపద్యములు. భద్రగిరి దాశరథిశతకము, కాళహస్తీశ్వర శతకము మున్నగు వానివలె నిదియు భక్తి శతకములలోఁ జేరినది. ఇదియు దాసుగారి ప్రియమైన అచ్చ తెనుఁగుననే విలసిల్లినది. ఇందు నిందాస్తుతులు; స్తుతినిందలు, ప్రపంచ స్థితిగతులు, స్వీయావస్థలు; ఆకాంక్షలు; కొన్ని యితర విశేషములుగలవు. మచ్చుచూడరా ?

సీ. పప్పు, సాదము, పుల్సు, పచ్చడి, యూరుఁగా
య, పొగపుచల్లిక, ట్టట్టు, కుడుము,
చిమ్మిలి, యిడ్డెన, చేగోడి, జీడియ
పుడుకు, లవుఁగు, రొట్టె, సడికుడకలు,
పుణుకులు, బడికోడి, మణతలు. ముక్కులు,
బొణిగలు, పొంగరము, వడ, పప్పు,
బుడుకులు, ప్రేణీలు, బొండ్లెముల్, నాన్తెల,
ద్రబ్బెడ, నిప్పటి, కొబ్బెరుండ,
బొంగరాల్, బటాసాల్, స్రైఁదము, సరడాలు,
మినుపబొం, దించిమంచి, యిమిడికఁ, దొట్టి
యంగరొల్లెలవిందు నీ చెంగటనగు
రెంటద్రాగుడుతిండి మెట్టంటువేల్పు!

సాదమన యన్నము. అంగరొల్లెల విందు = పిండివంటల భోజనము. అర్థమెఱిఁగిన నోరూరునని వ్రాయలేదు.

పుడుకులను, పుణుకులను, తెమ్మన్నపుడు వాఁడు తెచ్చునది ఒక పదార్థమునే.

సీ. ఓటిల్లుచిందటు, బోటిరాళ్లు, డిప్పట్లు,
కుందెనగిరి, యిర్కి, కుందికాళ్లు,
గూవనాలు, ఆలంకి, గుడుగుడుగుంచములు,
అల్లి, గడ్డెనబొద్దు, తాళ్ళపాము,
కాలికంచము, కిట్టుగానుఁగు, నెట్టులు,
గొబ్బిళ్లు, చెడుగుడు, గుళ్లు, చెండు,
చిక్కనాబిళ్లలు, చీఁకటిమొటికిళ్ళు,
పుడికిళ్ళు. పులియాట, బోర్లపక్క,
జిటుకు రాతిదాబాటలు, చిట్టుబుట్టు,
వ్రేలుబొట్టన. చంద్రాళ్ళు, వెన్నెలకడి
దొట్టియందలముల నాకుఁ దోడయితివి
రెంటద్రాగుడుతిండి మెట్టంటువేల్పు!

ఈ యిరువది తొమ్మిది బాలుర మాటలయందు దాసుగారికి శ్రీనృసింహుఁడు తోడయ్యెనఁట. ఏమిభాగ్యము !

## 8. నూఱుగంటి

ప్రాచ్యులేగాదు సర్వులు సంతతము సౌఖ్యపడుచు సంతోషముతో నుండనే కోరుకొనుచుందురే మఱి వారికి దుఃఖము లేల కలుగుచున్నవి ? అవికలుగుట కనేక కారణములున్నవి. కొన్ని దైవికముగాఁ గల్గవచ్చు. కొన్ని తన యవివేకము వలనఁ గలుగవచ్చు. కొన్ని పరుల స్వార్థము వలనఁ గలుగవచ్చు. వానిం దాను తెలివితోఁ దప్పించుకో వలె. దైవికములఁ దప్పించుకోలేఁడు గాని తక్కినవానిం దప్పించుకోవచ్చు. అందుకు తెలివితేట లుండవలె. ఆ తెలివి కల్గుటకు, ఆపదలు రాకుండఁ జేసికొనుటకు, సౌఖ్యములొందుటకు నీతిశాస్త్రము లావశ్యకములు. సత్యంవద – ధర్మంచర–నానృతంవదేత్, ఇట్లు బండగాఁ జెప్పిన నెవ్వరు చెవిబెట్టరు. వానినే కథామూలకముగాఁ జెప్పిన నత్యంతాసక్తితో విందురు. అందులకే కథాసరిత్సాగరాది గ్రంథములు మన కున్నవి. పాశ్చాత్యులకును లేకపోలేదు. బహుకాలము క్రిందట యూసఫ్ (Aesop) అను పాశ్చాత్యుఁడు యూసఫ్ కథలు వ్రాసెను. అదే దాసుగారు చెప్పుచున్నారు. "జగమంతటిన్నిగులఁ దెలివిగలవారిచేత నెన్నికకెక్కి యడుగడుగునకు మంచి తెలిపెడి యీ ముచ్చటలు వందల కొలఁది మూఁడు నాలుగు వేల యేండ్ల క్రిందట ఒక పడమటి నాటు చదువరిమిన్న పన్నెను" అని. ఇప్పుడు దాసుగారా యూసఫ్ కథల నుండి మంచి నూరు కథలను మాత్రము దీసికొని బాలావబోధముగా నుండ నాటు తెనుఁగున వ్రాసి 'నూఱుగంటి' అని పేరిడెను. దీనిం జదివినవాఁడు జగమునఁ దిరుగునపుడు నూఱు కన్నులతోఁ జూచుకొనుచునే యాపద రాకుండఁ జేసికొనునని సూచించుటకు 'నూఱుగంటి' అని గ్రంథమునకు నామముంచెను. నూరు కథలను కన్నులుగల గ్రంథ

మనియు నర్థమే. ఇందలి కథలు పౌరాణికములుగాదు. పంచతంత్ర మందువలె పశుపక్ష్యాదులపైఁ బెట్టి వ్రాయఁబడినవియుఁ గలవు. మనకు నిత్యప్రత్యక్షములగుచుండు సంఘటనలంబట్టి నీతులేర్పుటయు గలదు. కథవ్రాసి చివర నీతికి పద్యముతోఁ దెల్పిరి.

కోళ్లు కాళ్లతోఁ జిమ్ముచు నాహారముం దినును. అందుండి నీతిని దీయుచున్నాఁడు.

## కోడిపుంజు - రవ

ఒక కోడిపుంజు కాళ్ళతోఁ బెంటను దువ్వి గింజలేరి తినుచుండఁగా దానికొక రవ (వజ్రము) దొరకెను. దానిని జూచి యా పుంజు ఱెక్కలు విదల్చుచు "ఓ రాయీ ! నీవందముగా నున్నావుగాని నీవంటి వెన్నిమా నికలైన నొక బియ్యపుగింజపాటి కానేరవుకదా"అని తలయెత్తికూసెను.

తనకుదొరికినట్టి దాని మేలెఱుఁగక
పనికిరానిదనుచుఁ బలుకుఁ జెనఁటి
పెంటపైనికోడి పెద్దరవం జూచి
విలువకానిదనుచుఁ దెలుపలేదె ?

తెలివ తక్కువవాఁడు వజ్రము దొరికినను దాని ప్రయోజనముం బొందలేఁడు అనెడినీతి నీ కథ తెల్పును.

అచేతనములు మాటాడుకొను మాటలను కవిమాత్రమే వినఁ గలఁడు. ఇతరులు వినలేరు.

## పొడుముడబ్బి - ముక్కద్దము

ఒక ముసలివాఁడు చదివి చదివి పొడుము పట్టుపట్టి డబ్బిపై ముక్కద్దముంచి పీల్చుకొనుచుండెను. అపుడు పొడుముడబ్బి ముక్కద్ద ముతో "చాలుఁ జాలు. దిగుదిగు - వానికిఁ దెలియదుగాని నీవెఱుఁ గవా ? నాకంటె నీగొప్ప యేమి ? ఇదిగో చూడు నాపని వచ్చినప్పుడు

నిన్నేలా గూడలాగినాఁడో నేనే లేకున్నచో వానికిఁ దెలివి యెక్కడ? అని గద్దించెను. అది విని ముక్కద్దము "కూయకు కూయకు. నే నే లేకున్నచో వాఁడు చూచుటెట్లు? పనిలేక నిన్నలవాటు చేసికొన్నాఁడు. నీ కంపునకు నీ సొంపునకుఁ దోడు నీకుఁ బెద్దమాటలేల? అని బదులు చెప్పెను.

నేనెగొప్ప నాకు నేనెగొప్ప యటంచు
తవిలి పోరుచుంద్రు తగని వాండ్రు
మొనసి పొడుము డబ్బియును కంటిజోడును
పట్టి జగడమాడ నెట్టుకొనవె!

ప్రతి ప్రకృతి సంఘటనమున వివేకికి విశేషము స్ఫురించుచుండును.

## చింతచెట్టు, తెల్లుమబ్బు

ఒకయేటియొద్దనుఁ జింతచెట్టొకటి గాలికి విఱిగి యేటఁబడి కొట్టుకొనిపోవుచు నా యొద్దుననే చెక్కుచెదరక నిలచియున్న తెల్లుదుబ్బును జూచి 'ఏమీా వింత. నాయంతవానినే కూకటి వేళ్ళతో నూడలాగిన పెనుగాలికొకింతయైనఁ జెదరకున్నావు?' అని యడిగెను. అందు కాదుబ్బు చింతచెట్టుతో 'అయ్యో గొప్పవాని నెదిరింపక లొంగి తిరుగువాఁ డెన్నటికిని జెడఁడు సుమా' అని తలయూచి పలికెను.

గీ. లొంగితిరుగుచోట లొంగక యెదిరెడు
వాఁడు తప్పకెపుడు కీడుఁ బొందు
పెద్దగాలికెదిరి విఱ్ఱవీఁగిన చింత
వేళ్లతోడఁ గూడఁ బెఱుక పడదె.

దాసుగారిట్లు వింతవింతలగు విషయములతో నీతులు వెల్లడించు నీతిపాత్తమును వ్రాసెను. ఇందును దాసుగారు తన ప్రియమైన నాటు తెనుఁగును పిల్లలకర్థమగు శైలిలో వాడెను. ప్రతి పెద్దవాఁడును చదివి ఆశ్చర్యములో మునిఁగి ఆలోచనలోఁ బడునట్లుండును.

## 9. అచ్చతెలుఁగు పలుకుబడి

దాసుగారు మంజరిలో అచ్చతెలుఁగును గుఱించి యొక చిన్న పొత్తము వ్రాసిరి. అందులోఁ దన భావములెల్ల వెల్లడింపఁబడినవి. రెండు రెండు పాదాల కంత్యప్రాసము నలంకారమును బెట్టిరి.

తీయన మెత్తన తేఁటతెల్లంబు
నుడులలో నచ్చతెనుంగు నయంబు.

సంస్కృతాంధ్ర శబ్దములలో నాంధ్రశబ్దము తీయనిది మృదువైనది అనిరి.

అచ్చతెలుఁగువార లచ్చతెనుంగు
తెలియనియెడ వారి తెల్వి దొసంగు.

తెలుఁగువాఁడై పుట్టి తెలుఁగును దెలియక పోవుటేమిటి ?

తేఁట తీయని యచ్చతెలుఁగు రాకున్న
తెలుఁగువారి కిఁకెద్ది తెలియుట సున్న.

తేట తెనుఁగునే తెలిసికోలేనివాఁడు మఱి దేనిం దెలిసికోలేఁడు.

వేల్పుబాసాడిన వెలయునా ? మెప్పు.

.... .... ....

వేల్పులకే చెల్లు వేలుపు పల్కు
మానిసికిన్దగు మానిసికుల్కు

సంస్కృతము దేవభాష. తెలుఁగు మనుష్యభాష.

దయ్యపు పలవింత తగదు మానిసికి

... ... ....

మనుగడకు న్నాటుమాటలే చాలు

.... .... ....

బ్రతికున్నతల్లి యిప్పటి నాటుబాస

... .... ....

ఎల్లపల్కులఁ దెలుఁగే మేలుబంతి
పజలలో నన్దెలువాఁడే వలంతి
తెన్గునాడే నలుదెసల నాడెమ్ము
పాట లాటలు తెల్గువారల సొమ్ము.

అన్ని భాషలలోఁ దెలుఁగే శ్రేష్ఠము. అందఱిలో తెలుఁగువాఁడే మేటి. అన్ని దేశములలో తెలుఁగు దేశమే యుత్తమము. సంగీతము భరత నాట్యము తెనుఁగువారి సొమ్ము అని ఆంధ్రాభిమానము చూపిరి.

తేటతీయని యచ్చతెనుఁ గనువాఁడు
· వాసికెక్కిన చదువరి మొనగాఁడు.

అని గ్రంథాంతమున మంగళము పాడిరి.

మీసము మెలిపెట్టి, తెప్పలుపై కెత్తి, ఱొమ్మువిఱిచి గుండెపయి చెయిపెట్టుకొనియే తోడక్కఱలేని తల్లి బాసగల తెలుఁగు బిడ్డను నేనని ఱంకెవేయగల మొనగాఁ డజ్జాడాదిభట్ల నారాయణదాసు.

దాసుగారి తొమ్మిది గ్రంథములనేగాదు పదియవదానిని "ఉమర్ ఖయా" మను గ్రంథమునుగూడ నాటుతెనుఁగు పద్దెములలోను సంస్కృత శ్లోకములలోను వ్రాసిరి. దానినిందే మఱొకచో చూడఁ గలరు. ఇప్పటికే నాపని పెరిగినదిగదా! పెద్దలమాట మీఱలేక నేగాదు నేనిది వ్రాయుట. చూడుఁడు. సంగీతము త్యాగరాజుస్వాములందు, నాట్యము నాగరాజు సుబ్బారావుగారియందు, వ్యాకరణము రాయడు శాస్త్రులవారియందు, వేదాంతము బెల్లముకొండ రామదాసు మిత్రు లందు, ఆశుకవిత్వము కొప్పరపు సోదరకవులయందు, అచ్చతెనుఁగు కూచిమంచి తిమ్మకవియందు, పాండిత్యము వేదము వేంకటరాయ శాస్త్రులవారియందు ముఖ్యముగా నున్నవి. మఱి యివియన్నియు నొక్క నారాయణదాసుగారియందే కలవే! వారెంత పుణ్యపురుషులన వలయు! అట్టి పుణ్యపురుష సంస్మరణభాగ్యము లభించుచుండ దానిం బోఁగొట్టుకొనవచ్చునా? అందువలన డెబ్బదియేడవపడి పైబడినను ఈ పనికి సాహసించితి. ఎందువలన?

మొలకలేఁతదనము, తలిరుల నవకము
మొగ్గసోగతనము, పూపుతావి
తేనె తీయఁదనము తెనుఁగునకేగాని
మోటు లాఁతి నాటుమాటకేది?

ఓమ్ - తత్ - సత్.



# 'నాటు తెనుఁగు' మేటిజెట్టి

## [దాసవ్యాస సంగ్రహసమీక్షా సముపేతము]

డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తం

నాటుమందు, నాటువైద్యం, నాటుమనిషి అనే వాడుకలు విన్నాను కాని, 'నాటు తెనుఁగ'నే వ్యవహారం చూచి ఆశ్చర్యపోయాను. అంతకుముందు 'అచ్చ తెనుఁగు' 'అచ్చ తెనుఁగు కబ్బాలు' అనే వ్యవహారం బాగా పరిచయమైంది. 'అచ్ఛ' శబ్దభవం 'అచ్చ'. 'అచ్చ తెనుఁగ'ంటే సంస్కృత సమేతరమైన తెనుఁగనే నిర్వచనం సుప్రసిద్ధమైంది. సంస్కృత సమేతరమంటే 1) సంస్కృతభవం 2) ప్రాకృతసమం 3) ప్రాకృతభవం 4) దేశ్యమనే నాల్గు విధాలుగా ఉన్న పదజాతం అన్న మాట. దీన్నిబట్టి తెనుఁగు పదజాతాన్ని రెండే రెండు విభాగాలుగా నిరూపించుకోవచ్చు. 1) సంస్కృత సమం 2) సంస్కృత సమేతరం అని. ఇదంతా సంస్కృత ప్రాకృతాల్ని మనస్సులో నిల్పుకొని చేసిన విభాగంగా స్థూలంగా చూస్తేనే గోచరిస్తుంది.

ఏ భాషకైనా ఆ భాషలో నిసర్గంగా ఉత్పన్నమైన పదజాతమే జీవం. ఆ నిసర్గ పద నిర్మాణాన్ని (Structure) అనుసరించే అన్య భాషా పదాలు తదనుకూలంగా మార్పుజెంది అటువంటి నిర్మాణాన్నే పొందుతాయి. సంస్కృత ప్రాకృతాలు కూడా తెనుగుభాష కన్యభాషలే అవుతాయి. కాలాంతరంలో తెలుగు భాషకు అరబ్బీ, పారసీక, తురు

ష్కాది భాషల్తో సన్నిహిత సంబంధ మేర్పడింది. ఆ యా భాషాపదాలు చాలావరకు తెలుగు దేశీయ పదనిర్మితి ననుసరించే మార్పులుచెంది తెనుగులో చేరాయి. ఇట్లే అద్యతన కాలంలో ఫ్రెంచి, డచ్చి, పోర్చుగీసు, ఆంగ్లాది భాషలతోను సంబంధాలు ఏర్పడ్డాయి తెనుగు భాషకు. ఇందుండే పదాలు చాలా మార్పులకు లోనై తెలుగులో వ్యవహృత మాతున్నాయి. ఇలాంటి పదాలన్నీ క్రమంగా 1) ప్రాచీన తద్భవాలు 2) అర్వాచీన తద్భవాలు 3) నవీన తద్భవాలు అని వ్యవహరించవచ్చు. ఇట్టి తద్భవా లేర్పడటానికి హేతువు తెనుగునాటిలో సహజంగా పుట్టిన దేశీయ పదజాల నిర్మాణమే.

దేశీయ పదజాల నిర్మితి ననుసరించి మార్పునకు లోనుకాకుండా శిష్టుల వ్యవహారంలో విశేషంగా వాడుకలో ఉన్న పదాలను పై క్రమాన్ని అనుసరించి 1) ప్రాచీన తత్సమాలు 2) అర్వాచీన తత్సమాలు 3) నవీన తత్సమాలు అని వ్యవహరింపవచ్చు. వీని నిర్మితి భిన్నంగా ఉండటంచేత వీటిని పృథక్కరిస్తే, తద్భవాలు, దేశ్యాలు ఒకేఒక శ్రేణికిచెంది సమాసాది నిర్మాణాలకు తోడ్పడుతున్నాయి.

ఈవిధమైన దేశీయ పద ప్రాముఖ్యాన్ని మనస్సులో బాగా మననం చేసుకొనే ఆ మహావ్యక్తి "నాటు తెనుఁగ"నే పదాన్ని కల్పించి ఉంటారని భావించటంలో విప్రతిపత్తి ఉండదు. 'నడవబడ్డ దేశం—నాడు' అటువంటి 'నాడు' లో పుట్టిన పదజాలం 'నాటు తెనుఁగు' అని నిర్వచింపవచ్చు. ఇట్టి 'నాటు తెనుఁగు' లో రచనచేయటం రచయితలకు క్రమక్రమంగా ప్రవాహానికి ఎదురీతే అయింది; అనాగరకమే అయింది. అయినా ఆ మహామనీషి "నాటు తెనుగు" లో రచన చేయటమే తనజీవిత పరమధ్యేయంగా పెట్టుకొని ఎటువంటి కృతకత్వాంశానీక అలవోకగా ఆ "నాటు తెనుగు" లో బహుముఖీనంగా రచన కావించి, మేటిజెట్టిగా విఖ్యాతి నార్జించాడు. ఆ మహామనీషే—శ్రీమదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసు మహోదయులు. వారి ఈ

భాషావిషయికమైన ఆగ్రహానికి అంజలించటానికే ఈ వ్యాసరచనం. అంతేకాని దాన్ని ఆద్యంతాలుగా నిరూపించి, పఠితల ఆగ్రహానికి గురి కావాలని కాదు.

శ్రీ నారాయణదాసు మహోదయులు ఎంతో రచన చేశారు. 'పుంభావసరస్వతుల'ని శాస్త్రకూర్చో చదువుకొన్నవాళ్ళందరిని సంభావిస్తారు కొందరు. సరస్వతి చతుష్షష్టి కళల కధిదేవతగదా! అంతదూరం ఆలోచించటానికి అవకాశం లేకపోతే – కనీసం విభిన్న స్వభావాలు కలిగినప్పటికీ; ఒకదానికొకటి ఆశ్రయమై, క్షీరనీరంగా కలిసిపోయిన సంగీత సాహిత్యాల్లోనైనా పారం ముట్టిన వ్యక్తినే; సరస్వతీదేవి మధుర స్తన్యాన్ని రెండువైపులా కడుపునిండా త్రాగి, త్రేపగలిగిన మనిషినే 'పుంభావ సరస్వతి' అని సంభావిస్తే కొంత సముచితంగా ఉంటుంది. తెలుగుదేశంలో ఇటువంటి గౌరవాని కర్హమైన వ్యక్తి — ఈ విషయంలో అనామికాన్ని సార్థకం చేయగల మూర్తి. శ్రీ మదజ్జాడవారే అని చాటటానికి భయపడే పనిలేదు.

తెలుగులో నన్నయనుండి నేటివరకు రచనలు చేసినవారిని ఈ క్రింది రీతిగా వింగడింపవచ్చు.

1) ఇది సంస్కృతం, ఇది దేశ్యం అనే విచక్షణలేకుండ, ఉదాత్త విషయాన్ని ఉదాత్తశైలిలో రచించేవారు.

2) దేశ్యపదం లభిస్తుండగా సంస్కృతాన్ని వాడకుండా, అత్యవసరం పట్లనే సంస్కృతాన్ని పరిమితంగా వాడేవారు. వీరిని "జాను తెనుఁగు" రచయితలనవచ్చునేమో!

3) సంస్కృతాన్నే రానీకుండా సంస్కృత సమేతర పదజాలంతో రచనలు సాగించినవారు.

నన్నయాది మహాకవులు తొలివరుసలోనివారు. వీరి కావ్యాలే జనానీకంలో విశేష ప్రచారాన్ని అందుకొన్నాయి. మనం తినే 'అన్నం'

కూడా సంస్కృతమే కావడంచేత; ప్రజానీకం సంస్కృతభాషను దేవతా భాషగా పరిగణించి, మన సంస్కృతి అంతా ఆ భాషలోనే నిక్షేపించ బడిందని భావింప బడడంచేత ఆరీతి రచనా వ్యాసంగమే ఆదరణీయ మైంది. దీన్ని ప్రవాహమార్గం అనవచ్చు.

తిక్కనాది మహాకవులు రెండవశ్రేణికి చెందినవారు. పై రచనల కన్న ఈ రచనల్ని అర్థం చేసుకోవడమే క్లిష్టమనిపిస్తుంది. ఇట్టి రచనలు చేయటంలో రచయితలకెంతో నిగ్రహంకావాలి. "జాను తెనుఁగు" బాగా తెలియాలి. తెలుగు నుడికారం సొగసు ఆకళింపుకావాలి. ఇది ప్రవాహానికి కొంత ఎదురీత.

పొన్నకంటి తెలగన్నతో మూడవ శ్రేణి రచయితలు ప్రారంభ మౌతారు. ఈ విధమైన రచన ఒక ఉద్యమంగా సాగింది. కందుకూరి వీరేశలింగంగారు కూడ ఈరీతి రచనలు కావించి తమ అభినివేశాన్ని చూపారు. శ్రీ మదజ్జాడవారు తమ రచనావ్యాసంగం - ఏకొద్దిగానో మినహాయిస్తే - ఈ పద్ధతికే అంకితంచేసారు. ఇది ప్రవాహానికి పూర్తిగా ఏదురీతే అనాలి. ఎందుకంటే ఇది ఒక విధంగా కృతకమై పోయింది. దేశ్యపదాలు చాలా సంస్కృత పదఘట్టనానికి కృశించి నశించిపోయాయి. కొన్ని అచ్చ తెనుగు పదాలు సంస్కృతభావచ్ఛాయల్లో కల్పించబడ్డాయి. 'సీత' అంటే సులభంగా తెలిస్తుంది. కాని 'పుడమి మొలనూలి చేడియ కనిన పడుచు' అంటే కొండను త్రవ్వి ఎలుకనుబట్టినట్లే అసావాదితో వ్య బ్రిహ్మలాగా తలచుట్టు చేతినితిప్పి, ముక్కును జూపించే రీతిలోనిది. అప్పకవి యిట్టి భాషను "తెనుగు మఱుగులు" అన్నాడు.

శ్రీ మదజ్జాడవారి నీ పద్ధతి రచనే ఎందుకో విశేషంగా ఆకర్షిం చింది. అయితే వీరి రచనల్లో పై శ్రేణికి చెందిన చాలా రచనల్లో కని పించే కృతకత్వం సాధారణంగా కానిపించదు. నిసర్గమనోహరంగా, అల వోకగా వీరి రచన సాగుతోంది. అనేక హరికథా కాలక్షేపాల్లో 'నాటు

తెలుగు'లో నెలకొన్న దాసుగారి వర్ణనలు విని పరవశించిన సందర్భా లనేకం ఉన్నాయి.

ఆకాలంలో శ్రీవారు అనేక విషయాలపై పత్రికలకు వ్యాసాలు కూడా 'నాటు తెలుగు'లోనే రచించారు. అందులో ఏమాత్రం మోటు తనం కనిపించదు. "వేల్పుముచ్చట" "ఎచ్చరిక" "తెనుఁగు" "మంచి బ్రతుకు" "మానిసులు" మున్నగు వ్యాసాలు ఇటువంటివే. ఈ వ్యాసాల్లో వారి విశేషదృక్పథం, ప్రగతిశీలం గోచరిస్తుంది. అక్లిష్టమనో హరమైన భాషలో మనోజ్ఞమైన భావాలను, తెనుగుజాతి ఆరోగ్యంగా బ్రతకాలని ఆశిస్తూ రచించారు ఆ వ్యాసాల్ని.

ప్రతివ్యక్తి తాను సంపాదించిన సొమ్మును తన గ్రామ సౌభా గ్యానికే వ్యయం చేయాలని వీరి ఆశయం. కష్టించి పనిచేయాలి ప్రతి వాడు అని వీరి హెచ్చరిక. పరోపకారబుద్ధిని పెంపొందించుకోవాలని వీరి ప్రబోధం. ఎవరు పాఉలో, ఎవరు దొరలో, ఎవరు కోమటులో, ఎవరు కాపులో శ్రీ దాసుగారు "మంచి బ్రతుక"నే తమ వ్యాసములో బాగా వివరించారు. ఆదర్శ గ్రామంలో ఇండ్లు ఎట్లా నిర్మించుకోవాలో కూడా నిరూపించారు. "ఊటి (రి) కి నడుమ వేయిమంది కొల్వుచేయఁ దగిన రచ్చచావడి యొక్కటి నెలకొల్పఁదగున"ను వీరి సలహాను ప్రభుత్వ మిప్పటికైనా పాటించాలి.

"పదునెన్మిదేండ్లలోపున మగవానికిం బన్నెండేండ్లయీడులోపున నాడుదానికిం బెండ్లితగదు" అని ఆకాలంలో వీరనగల్గటం ఎంతో అభ్యుదయదృష్టి ఉండబట్టే వివాహం ఎట్లాఉండాలోకూడా శ్రీదాసు గారు బాగా పేర్కొన్నారు. "పెండ్లికూతురుకన్న బెండ్లికొడు కై దేండ్ల కన్న నీడున మించియుండకూడదు. ఏ తెగలకుఁ జెందనీగాని యాల్మగ లొండొరులనెంచుకొని వెల్లడిగా నొప్పుకొన్నఁగాని పెండ్లిచేయరాదు." అనేవాక్యాల్లో వీరి పరిశీలనాదృష్టి ఎంతనిశితమో విదితం. ఆరోజుల్లో

ఆడపిల్లల్ని ముప్పదియేండ్ల మగవానికిచ్చి చేసేవారు-శుల్కంతీసుకోని. ఇప్పుడు వరునికన్న నాలైదుశ్రేండ్లు మిన్నగా వధువున్నా కట్నాలిచ్చి అంటగడుతున్నారు. ఈ వైపరీత్యం అనారోగ్యకరమైంది. సామాన్యంగా కనిపించే సంగతులుగానే కన్పట్టినా శ్రీదాసుగారు ప్రతిచిన్న విషయాన్నిఅయినా ఎంతలోతుగా చూస్తారో ఈ 'మంచిబ్రతుక'నే వ్యాసం నిరూపిస్తుంది.

ఇటువంటిదే ఇంకో వ్యాసం 'ఎచ్చరిక'. ఆటపాటల్లో అందెవేసిన చేయిగదా శ్రీదాసుగారు. ఈ విద్యలు భగవత్సేవకు కైంకర్యము కావాలేకాని, మానవుల మెప్పుకో; ప్రభువుల ప్రశంసలకో పనికిరావని శ్రీదాసుగారు అనేకసందర్భాల్లో ఘాటుగా హెచ్చరించారు. ఐదో యేడునుండి పోతన భాగవతం కంఠస్థంచేసిన శ్రీదాసుగారికి ఈరీతి దృక్పథం ఏర్పడటంలో ఆశ్చర్యంలేదు.

రచనల్లో సంస్కృతానికి దాస్యంచేసేబుద్ధి దాసుగారి కేమాత్రం గిట్టదు. "మదమాతంగ తురంగసద్భట లసన్మాణిక్య గాణిక్యసంపద" అనే పద్యపాదం ఎంతమనోహరంగా శబ్దాలంకారశోభితంగాఉన్న, వారి కెందుకో రుచింపలేదు. "మస్తీకిలాతము, మంచియొంట్రింపు లాలుపూస వెలవెలందికలుములు" అంటమే శ్రీదాసుగారికి విహితంగా ఉంటుంది. "బాత్తిగాఁ గొఱగాని కల్లచదువరుల లేనిపోని, తెలిసీతెలియని వేల్పుమాటల న్బొప్పండ్ర చెంగట సొరకాయల న్దగనఱకుచుఁ బొట్టకక్కుఱితి న్దాబుచేయుచున్నా రారారా! అని శ్రీదాసుగారు ఆశ్చర్యపడుదురు. భాషావిషయకముగా వీరికున్న 'పీఁక' యితరులకు కొంత 'పిరువీఁకు' గొల్పునేమోగాని వారికట్టి దేకోశంలోను కానిపించదు. తమిళులకుగూడా నింతటి 'పీఁక' లేదేమో అనిపిస్తుంది.

'మాటలల్లువా'ని లక్షణాల్ని శ్రీ దాసుగారిట్లా వివరించారు. "వేల్పునుడిజోలి సుంతయున్లేని తన పాలెన్ము తెనుఁగు మాటలెల్లతు

ద్నేటతెల్లముగాఁ దెలియఁజాలునట్లు జానళులు, పాటలు, దబ్బులు, పెక్కు రకంబుల నాల్గడుగుల మాటల కూర్పులు ద్నొల్లింటి పెద్దల కట్టు పాట్లకులోనై యెంగిలి ముక్కల తుగకొరుల న్వొంబడింపక, తనయుజ్జ లనే వెలువరించుచు, లయకాఁడై యాటపాటల మేటియై, మాటకారి మేటరియై నిండుకొలువులం జదివి, పాడి, పలుసీమ నుడువులజెప్పి, యొప్పింపఁదగు నాతఁడే మాటలల్లువాఁడు" ఈరీతిగనే 'పాటకాని' 'ఆటకాని' లక్షణాల్ని యథాశక్తిగా నిరూపించారు శ్రీ దాసుగారు.

తెలుగునుడుల నెఱిఁగి, వానిని వాడుకోలేని తెలుగువారి బేల తనాన్ని ఎన్నోమార్లు దాసుగారు ఎగతాళిచేసారు - అనేక వ్యాసాల్లో వారి ఎద్దేవా చాల అందంగా ఉంటుంది. "ఎవరిసీమ వారికిమ్ము. దేని పిల్ల దానికి ముద్దు. ఎవ్వనిముక్కు వానికిఁదిన్నన. ఎవరికంపు వారికింపని తెలిసీతెలియని తెలుఁగుదేబ నాటు తెలుగున్నాటింపకున్న నేమి ? పులుసు చవి తెడ్డెఱుఁగునా ? తన యింటి నాల్గుమూలలే తెలియని వెడగు మింటి చుక్కల న్లెక్కించునట్లు తఃపయూరి తెల్గు పల్కులనే గుఱుతింప నేరని యెడ్డె యెట్లు వేల్పునొడవుల న్దెలియఁగలఁడో ?" ఇలాఁటి పలుకు బండ్లు వారి రచనలంతటా తామరతంపరగా ఉంటాయి.

శ్రీనాథాది మహాకవులు మరీ బరితెగి డు, ము, వు, లను జేర్చి సంస్కృతాన్నంతా తెనుగనే రీతిగా మరీ స్వతంత్రించారు. దీనికో విధ మైన తిరుగుబాటే అచ్చతెనుగు రచనోద్యమం. ఆ ఉద్యమంలో కడ పటి మేటిజెట్టి శ్రీ దాసుగారుగా గోచరిస్తారు. "వేల్పునుడి జోలి సుంతయు నేని తేటనాటు తెనుఁగు మాటలనే పొందుగా నల్లవలయు న్గాని యడ్డాదిడ్డిగా నోటికివచ్చినట్లెల్లఁ గట్టుమట్టెఱుఁగక కలగూరగంపగా వేల్పు నొడువులకు, డు, ము, వు, లతికి చెఱచిన నుడుగులన్గలిపిన బాజారు తెలుగు పలుకుల వ్రాసి, మాటకారులమనియు, మాటలల్లు వారమనియు, వ్రాయసకాండ్రమనియు న్జెప్పుండ్ర చెంగట సొఱకా ఋలు నఱకు వదర్పఁబోతులు నిక్కపు చదువరుల వలెఁ బ్రాచీన్ద్రవిత్తులు

తెగనీల్గుచున్నారౌరా పగడనాటు తెలుఁగు పలుకులన్గాని వేల్పునోడ వుల నాని వేఱువేఱుగా మాటలల్లి వహిన్గావించి చదువరులన్ మెప్పించుడస తోఁకముడిచి తాము మాటలల్లువాంధ్ర మనుకొను నిప్పటి తిప్ప కాయలెల్లఁ బటాపంచలై పరుగిడకుందురా ?" అను రీతిగా విమర్శిస్తారు తమ "తెనుఁగు" అనే వ్యాసంలో.

శ్రీ దాసుగారి ఎన్నికలో, ఇరువురే మహాకవులు. (i) సంస్కృతంలో శ్రీ జయదేవుఁడు. (ii) తెలుఁగులో పోతనామాత్యుఁడు. ఏమంటారో వినండి. "నా యెఱయికన్నట్టి వేలుపు నుడువుల కూర్పు తెలివి జయదేవునకు నైగుపలుకునల్లునేర్పు బమ్మెర పోతనకున్నప్ప మఱేమాట లల్లువారలకు న్నప్పట్టదు. వీరిట్లా ఎన్నికచేయటానికి కారణం అందరిలాగా వీరు కవిత్వాన్ని వరించలేదు. కవిత్వమే వారిని వరించింది. కవిత్వం అభ్యాసమూలంగా వచ్చేదికాదనే మాటను దాసుగారెలా చెప్తారో వినండి. "వినవింపగ కుత్తుక, మాటలల్లు నేర్పు తనంత నోజమైఁ బుట్టుక తోనే రావలయున్గాని వాయింపులు, వ్రాతలు, వాలకములవలె నేర్చుకొన వీలులేదు."

తెలుఁగు పదానికి వీరి వ్యుత్పత్తి విచిత్రమైంది. "తెలివిగలవారి పలుకునకుఁ దెనుఁగని పేరు. ఆ తెలుఁగు మాట్లాడఁగలవారే నిక్కముగా తెలివిగలవారు. తక్కినవారెల్ల మ్రుక్కడులే యనకతీరదు." ఇట్టి రచన కెవ్వరు కోపగించుకోరాదు. ఇది వారి అభిమానానికి పరాకాష్ఠ. త్రినగ శబ్దభవం తెనుఁగని; త్రిలింగశబ్దభవం తెలుఁగని వచించే వారిని వీరిట్లా నిర్దయతో ఖండించారు. అంతే వారి సిద్ధాంతంపట్ల వారికిగల నమ్మిక అటువంటిది.

"త్రినగము, త్రిలింగములను వేల్పునుడులనుండి పుట్టిన వనియు న్చెక్కెల? వేల్పునోడవు నందలి పగడవ్రాయి యైనదియు నెట్లు మాఱిపోయినఁగాని యన్నఁజాలు నట్టితెలుఁగు పలుకు వేల్పు

నుడినుండి పుట్టినదని తెలుఁగుపలుకుపాడి తెలిసీ తెలియకటవ మింట న్మాటాడుకొనుచు, వహినుండి తెనుఁగు నేర్చుకొను చఅవ సీమకు న్దెలుగునాడునకు న్నడుమ నెలకొని తాముకూడఁ దెలుగు చదువరుల మనుకొను త్రుళ్ళుబోతులు కూటికకుక్కాఱితి నేమో చెత్త కవిలెల(న్వ్రాసి, యచ్చొత్తింపించి, బొప్పంద్ర న్మెప్పించి, దుడ్డుకూర్చు కొనుచు, నెఱుకగలవారివలెఁ దెగనీల్గుచు, సగటున వేలుపు నుడువుల నుండి తెలుగు పలుకులు పుట్టినవని వదరుచున్నారుగాని యెవరెవరికిఁ బుట్టిరో మొదలెవరైనఁ దెల్పగలరా ?"

పై మాటలకేమిగాని, శ్రీ దాసుగారు, తెనుగు మున్నగు భాషలు సంస్కృతజన్యమనే వాదం ఆనాడు ప్రబలంగా అందరి పండితుల్ని పట్టుకొన్నది, కాదని సరసంగా ఖడించటం వారికిగల భాషాదృష్టికి నిద ర్శనం. "ఎద్దీనెనగ గొందిలోఁ గట్టుమన్నట్టు వేలుపునుడి యెల్లనుడువు లకు న్దల్లిపలుకని పెద్ద లన్నంతతోడనే తెలుగుమాటలెల్ల నెద్దిబ్రాయి పోల్కియుండినఁజాలు న్దెఱగంట్ల నుడువులనుండి వెల్లడించు వెంగళు లిస్సీ యేమీా విడ్డూరము? కొంత మలక పోల్కికలదు గనుక, నిప్పాఱుఁడీ దొర యిక్కో-మటి, యిక్కాపామలకకుఁ బుట్టినాడని యనవచ్చునా?" ఇలా మంచి హాస్యధోరణిలో వ్యాసాన్ని నడిపించటమేకాక, అవసరం పట్ల విషయసేకరణంకూడా చేసారు. నాటు తెలుగు నుడువుల్ని సంస్కృ తాలుగాను, తద్భవాలుగాను భ్రాంతిపడ్డారని ఎన్నోపదాలు వీరు సేకరించారు.

సంస్కృత భాషా పాండిత్యమే పాండిత్యమని, ప్రతి తెలుగు పదాన్ని సంస్కృతానికి ముడిపెట్టుకొని ముచ్చటపడే పండితులకోవకు చెందని పండితమాన్యుడు, పరిశోధకుడు, ఉపజ్ఞగలమనీషి, స్వతంత్ర ప్రతిపత్తిగల వ్యక్తి శ్రీదాసుగారంటే అభిప్రాయ భేదముంటుం దనుకోను.

నాటు తెలుగులో వారెంతటి శాస్త్రీయ విషయాన్నైనా అల వోకగా ఉపజ్ఞతాస్ఫోరకంగా ఎలా చెప్తారో ఒక్క ఉదాహరణం పరికించండి :

"చత్వారి శృంగా త్రయో అస్యపాదా
ద్వేశీర్షే సప్తహస్తా సో అస్య,
త్రిధాబద్ధో వృషభోరోరవీతి
మహాదేవో మర్త్యా ఆవివేశ (ఋగ్వేదం 3-8-3)

"రెండు తలలు, నాల్గు శృంగముల్ చెలువొంద
మూఁడుకాళ్ళు, చేతులేడుగల్గి
త్రివిధ బద్ధమైన వృషభరాజము మహా
దేవుఁడై ప్రజాళి నావహించు."

ఈ ఋగ్వేద మంత్రాన్ని అన్ని శాస్త్రాలకు అన్వయించారు మన పూర్వులు. దీన్ని నాటు తెల్గులో శ్రీ దాసుగారిలా వ్యాఖ్యానించారు సంగీతపరంగా. "మాట యను బసవడు పలుకుల్క తళ్కు బెళ్కులను నాల్గు కొమ్ములు తత్తఱ నడినడులను మూఁడు కాళ్ళు; మీఁదు క్రిందులను రెండు తలలు, నెమలికూఁత, యెద్దుఱంకె, మేఁక గునుపు, బాతుమ్రోఁత, కోయిల పల్కు, గుఱ్ఱము సకిలింపు, ఏనుగు గీకలను నేడు చేతులు తనరార, హెచ్చు తగ్గు మందడి రవళుల మూట గట్టఁబడి, మగఁటిమి వగ యోర్పు నగవు హాొయలు, వెఱపబ్బుర మలుక వెగటులను తొమ్మిది చవుల న్వ్రాల్లి గొల్పుచు మిన్నుమన్నులు పిక్కటిల్ల నిచ్చలు ముఱియుచుండును."

"గానమ"నే వ్యాసం మాత్రం నాటు తెనుగులోగాక మామూలు తెలుగులో రచించినారు శ్రీ దాసుగారు. నాట్య వేదోక్తుల కుపజ్ఞతో నెంతో వివరించారు. నాట్యశాస్త్రానికే శ్రీ దాసుగారు వ్యాఖ్యానం రచిస్తే ఎంతో సముచితంగా ఉండేది. సంగీత నృత్య విద్యాదుల్లో స్వయంగా అభినివేశంలేని వారి వ్యాఖ్యానాలు అనుభవహీనంగానే

ఉండిపోయాయి. వారి వ్యాఖ్యానవైఖరిని బాగా ఆకలించుకొనే నృత్య సంగీతాదులు నాకు తెలియలేదు. కాని మధ్యమధ్యలో వారిదృక్పథాన్ని వివరించే మాటలెన్నో నా గుండెకు గుచ్చుకొన్నాయి. "(1) డబ్బు కొఱకు నృత్య గీత వాద్యములు జీవనవృత్తి కావించుకొనరాదు. భరత వర్షమున హిమవత్పర్వత మెట్లనాది సిద్ధమో చాతుర్వర్ణ్యమట్లనాది సిద్ధము. (2) నిజమైన శూద్రునకు బ్రాహ్మణ ద్వేషముండదు; మఱియు నిక్కమగు బ్రాహ్మణుఁడు శూద్రుని జుల్కనాడఁడు. తమతమ పెద్దల నాటి మర్యాదను గాపాడుకొనుచున్నంత కాలము బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులు నలువురును బరస్పరము ప్రేమ గౌరవాతిశయముల జూచుకొనక తప్పదు.

(3) సభాముఖమున నాట పాటలు ప్రదర్శించదగినది వేశ్యా కన్యక యొక్కతయే. ధనాశలేని వేద విద్వాంసుడు హరికథా సంకీర్తనమున నృత్య గీత ప్రావీణ్యమున జనసత్కారమును బొందుట మేలు గాని యబ్బిడ్డ వాడెల్ల స్వార్థపరుడై డబ్బాసతో నాట పాట మాట మీటల జీవన వృత్తిగాఁ జేసికొని తాఁజెడ్డకోఁతి వనమెల్లఁ జెఱచు నట్లొరుల మోసపుచ్చి తా మోసకపోక తప్పదు.

(4) వినపడునదెల్లఁ బాటయే. అగపడునదెల్ల నాటయే. "నామ రూపాత్మం జగత్" - జగమంతయు నాటపాటలరూపే - యాట పాటలు కాని దినుసే లేదు.

(5) తనతోటి జీవుల సేవగించక, పాటుపడి కూడుగుడ్డల స్గూర్చుకొని, తన్గాపాడుమని ముప్పేళల న్రొబ్బిద్దు వేల్పునకు మ్రొక్కలిడు వారికన్న సంగీత విద్వాంసు లితరు లెవ్వరు ?

శ్రీ దాసుగారి లౌకికాలౌకిక ప్రజ్ఞాపాటవం వారి యిష్ట దైవమైన సూర్యభగవానుని వంటిది. ఆ భగవంతుడికి అంజలిస్తున్నాను.

శ్రీ ఆదిభట్ల నారాయణదాస

# సారస్వత నీరాజనము



తృతీయ భాగము

## సాహిత్య వైభవము



# తారక కావ్యము

— అప్పల్ల సోమేశ్వరశర్మ.

"ఉతో త్వస్మై తన్వం విసస్రే
జాయేవ పత్య ఉశతీ సువాసాః" (ఋగ్వేదం)

అని ఆర్ష వచనము. ప్రియమైనభార్య భర్తకు తన శరీరమును సమర్పించు కొనినట్లుగా, వాగ్దేవి ఒకానొకమహానుభావునికి తన్ను తానుగా సమ ర్పించుకొంటుందని దీని భావము. ఆ విధముగా వాగ్దేవిని పొంది ఆమెను సరససల్లాపాలతో, కేళీకలాపాలతోను ఉర్రూతలూగించిన అదృష్టవం తులు కొందరే ఉంటారు. అటువంటివారిలో అగ్రేసరుడు ఆదిభట్ల నారా యణదాసుగారు. ప్రయత్నసాధ్యాలైన వ్యుత్పత్త్యభ్యాసాలతో సమ్ బంధము లేకుండానే బాల్యమునుంచి ఆయన ప్రతిభ వేయి విధాలుగా విజృంభించింది ఎన్నో కమనీయ కావ్యఫలాలను రసికులకు అందించినది. శ్రీ దాసుగారిని సాక్షాత్తు సహస్రవదనుడు, సహస్రాక్షుడు, సహస్ర కరుడు అని అందరిచేత పొగిడించినది. అట్టి ప్రతిభావికాసమువల్లనే ఆయన అమరుడయ్యేడు.

శ్రీ దాసుగారి గంభీరభావసాగరంనుండి వెలువడిన అనర్ఘము లైన కావ్యరత్నాలలో తారక కావ్యము ఒకటి. ఆయనకు సంస్కృత మనగా ఎనలేని భక్తి ప్రపత్తులు. "సా దేవభాషా అఖిలలోకమాన్యా" అని తారక కావ్య ప్రారంభములోనే ఆయన అన్నారు. అందుచేతనే

అనన్యసాధారణమైన మార్గంలో దానిని నడిపించి "సెబాసు" అనిపించు కున్నారు.

సరసగంభీరమైన సంస్కృతంలో తారకకావ్యం నాట్యంచేసినది. ఆనాట్య భంగిమలను యథాశక్తిగా, సంగ్రహముగాను పరిశీలించటం ప్రకృత కర్తవ్యము.

"తారకుడు" అనే నాయకుని చుట్టూ కథ తిరుగును కాబట్టి ఈ కావ్యం పేరు "తారకమ్" అయినది. ఇది ఆకారంలో చిన్నది; గుణంలో పెద్దది. అయిదే సర్గలు. మొత్తం ఇంచుమించు మూడువందల శ్లోకాలు. మొదటి సర్గ ఉపజాతులతో, రెండవసర్గ మాలినీ వృత్తములో, మూడవ సర్గ అనుష్టుప్పులతో, అయిదసర్గ ప్రహర్షిణీ వృత్తముతోను సాగింది. నాలుగవసర్గలో మాత్రం కనీవినీ ఎరుగని వృత్తాలన్నీ కలగూరగంపగా ఉన్నవి. సుముఖి, తన్వి, వైశ్వదేవి, మొదలయిన వృత్తాలను కండలు తిరిగిన ప్రాచీనకవులుకూడా ప్రయోగాలలో ప్రస్తరించలేదు. సహృదయ హృదయాహ్లాదకరములైన శబ్దార్థాలు, శ్లేషప్రసాదాది గుణాలు, ఉపమాద్యలంకారాలును - మొత్తం బాహ్యమైన కావ్యసంపద అంతా ఈ కావ్యంలో కొల్లలుగా కనబడును

దీని ఇతివృత్తము చాలా చిన్నది :-

వింధ్యప్రాంతము చంచన్నదీతీరము. అక్కడ "సంశ్రిత కల్పము" అనే గ్రామము. అందులో సుదతీ మహేశ్వరులను బ్రాహ్మణ పుణ్య దంపతులు. వారికి కడగొట్టు కుమారునిగా సాక్షాత్తు శివుడే ఉద్భవించి నాడు. దేవతలందరు "ఈ అవతార మెందుకు ?" అని ప్రశ్నింపగా ఆ బాల శివుడు "కలియుగంలోని మానవులను ఉద్ధరించుటకు" అని సమాధానించినాడు. బాల్యంలోనే భగవల్లీలలను ప్రదర్శించినాడు. అత నికి "తారకుడు" అని పేరుపెట్టిరి. ఉపనయనం అయినది. సకలవిద్యలు కర తలామలకాలుగా అయినవి. కొన్నాళ్ళకు తారకునికి దేశాటనము చెయ్య

వలెనని బుద్ధిపుట్టినది. అలా తిరుగుతూ "విబుధనగరము వెళ్ళినాడు. అక్కడ రాజుగారి కుమారునితో గాఢమైత్రి ఏర్పడినది. వారిరువురు కలిసి నౌకాయానంచేసి చంద్రద్వీపము వెళ్ళి రాజధాని అయిన చంద్రమతీనగరమును చేరుకొన్నారు. చక్రవర్తిని కలుసుకొని తమ ప్రాభవంతో ఆయనను వశంచేసుకొన్నారు. చక్రవర్తితమ్ముడిని శత్రువులు ముట్టడించగా – శత్రువులను చంపి రాజసోదరుని రక్షించి – చక్రవర్తి అనుగ్రహానికి మరింతగా పాత్రలయిరి. చక్రవర్తి కుమార్తెకు తారకుని మిత్రుడైన రాజకుమారునిపై అనురాగం అంకురించినది. అది తెలిసి చక్రవర్తి సంతోషించి వారిరువురకు పాణిగ్రహణము చేయించాడు. చివరకు చక్రవర్తి భారతవర్ష సామ్రాజ్యమును అల్లునికి అప్పగించాడు. బ్రాహ్మణుడైన తారకునికి సకలగౌరవాలను కలిగించేడు. మిత్రులిద్దరు స్వదేశం వచ్చారు. రాజకుమారుడు భారతరాజ్యాన్ని పాలిస్తూ సుఖంగా ఉన్నాడు. తారకుడుకూడ వివాహము చేసుకొని సంతానాన్ని పొంది సంతోషంతో కాలక్షేపం చేస్తున్నాడు. — ఇదీ ఇతివృత్తం యొక్క రేఖాచిత్రము. ఈ చిన్న కథ కావ్యోచితమైన వర్ణనలతో అయిదు సర్గలుగా అల్లుకున్నది.

కావ్యంలోని వర్ణనలలో "నౌకాయాన వర్ణనం" లోకోత్తరంగా ఉంది. మూడవసర్గ ప్రారంభంనుండి సుమారు ఇరవై శ్లోకాలు, తారకుడు అతని మిత్రుడైన రాకుమారుడు కలిసి, నౌకపై సముద్రయానము చేసినట్లు వర్ణిస్తాయి. ఆనౌక ఆధునికమైన పెద్ద "స్టీమరు". దానిని, అందులోని యంత్రపరికరాలను, నావికులను, వారి ప్రావీణ్యాన్ని సముద్రయానంలో కలిగే అనుభవాలను – సహజంగాను, సుందరంగాను, మృదువుగాను, మధురంగాను, సముచితమైన ఉపమలతో, ఉత్ప్రేక్షలతో భావుకుల కళ్ళముందు ఉంచేరు శ్రీ దాసుగారు.

"అంతర్దధౌ మహీ దూరే ప్రజ్ఞాన ఇవ సంసృతిః।
పయోధియానే దిక్కాలభేద ఏవ న దిద్యుతే"

నౌక, సముద్రంలో దూరదూరంగా పోతున్న కొలదీ, భూమి కనబడకుండా పోయింది. ఆతీరు ప్రజ్ఞానంలో సంసారం అంతరించిపోయినట్లు ఉంది. సముద్రయానంలో దిక్కు- కాలం తెలియకుండా అయిపోయేయి.

"అంతస్సముద్రే భూమిధ్రాః తస్థురౌకాపకారిణః।
సజ్జనోపద్రవకరా రాడ్వాస ఇవ సూచకాః"

సముద్రం అడుగున నౌకలకు అపకారంచేసే కొండలు ఉన్నాయి. అవి, సజ్జనులకు అపకారంచేస్తూ రాజుగారిదగ్గర మసలేటటువంటి "చెవికొరుకుడుగాళ్ళ" వలె ఉన్నాయి.

ఆ ఓడ ఒక విధంగా కోడివలెఉంది. మరోవిధంగా వైద్యుడువలె ఉంది. ఇలా ఎన్నో ఉపమలు, ఉత్ప్రేక్షలూ విహరించాయి. ఈ వర్ణనం పరిశీలిస్తే శ్రీ దాసుగారు నిజంగా "అపరవాల్మీకి" అనిపిస్తుంది.

తరువాత మొదటి సర్గలోని తారకుని అవతారఘట్టం. బాల క్రీడల సందర్భమున్న ఎన్నదగినవి. పరమశివుడు భవిష త్తారకుడుగా పుట్టునపుడు దేవతలందరు అతనిని స్తోత్రం చేసేరు. "ఈ క్రొత్త అవతారం ఎందుకు ?" అన్నారు. దానికి ఆ దేవదేవుడు సమాధానం చెప్పినాడు. ఇక్కడ అనుభూతములయ్యే భావాలన్నీ ఉపనిషత్తులలోను, పురాణాలలోను, ముఖ్యంగా భగవద్గీతలోనున్న పరిచితములై, తాత్త్విక లోకంలో అతి ప్రసిద్ధములై ఉన్నట్టివే. వాని విన్యాసం మాత్రం వినూత్నమార్గంలో విలసిల్లింది:—

ప్రభో మహాదేవ దయామయేశ
త్వం లీలయేత్థం జగతీం తనిత్వా ।
.... .... ... ....
దృశ్యాఽప్యదృశ్యా సదసత్స్వరూపా
త్వదీయమాయా భ్రమకారణం సా ।
.... ... ... ....
కాన్ భాగ్యయుక్తానిహ తావకీన -
మిత్రత్వమాప్తుం తవ గూఢచర్యామ్ ।

ఈ విధంగా దేవతలన్నారు. "సత్తు అసత్తు నీ మాయయే. నీ మాయ చాలా విచిత్రమైనది. ఎవరూ తెలుసుకోలేరు............ ప్రకృతం ఎందుకు అవతరిస్తున్నావు?" అని సారాంశం.

తస్మాదహంతాన్ బహుమూఢ చిత్తాన్
సంసార ఘోరార్ణవతో మనుష్యాన్
ఉద్ధారయిష్యా మ్యుచితక్రమేణ,
.... .... .... ....
విస్మృత్య తత్త్వం మమనిత్య సత్య
మక్రాంత మానందమయం. యథేష్టమ్ ।
వశో భవిష్యా మ్యఖిలార్థబంధ-
సంధానమూల ప్రకృతేః కదాచిత్.

ఇత్యాదిగా పరమేశ్వరుని ప్రత్యుత్తరం జరిగింది. "నేను అప్పుడప్పుడు ప్రకృతికి లోబడి, సాధుసంరక్షణార్థం అవతరిస్తూ ఉంటాను." అని భావం. ఈ విషయాలన్నీ "సంభవామి ఆత్మమాయయా" "దైవీ హ్యేషా గుణమయీ మమమాయా దురత్యయా" "యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత" "పరిత్రాణాయ సాధూనామ్" మొదలగు భగవద్గీతా వచనాలలో సుప్రతిష్ఠితాలేగదా! ఏది ఏమయినా ఈ ఘట్టంలో పరతత్త్వమీమాంస పరాకాష్ఠలో మలచబడింది.

తారకుని బాలలీలలు, క్రీడలున్నూ పసందైన కవిత్వ పరిపాకంలో పడ్డాయి. బాలుని పెరకువ, ఊయలలో ఊగడం, చనుబాలు త్రాగడం అమ్మా అని పిలవడం, తండ్రిఒడిలో ఆడుకోవడం, పూజావిగ్రహాలను పారవేయడం, కుండలు బ్రద్దలుకొట్టడం మొదలయిన అంశాలనన్నింటిని మధ్యమధ్య పరతత్త్వ సమీక్షలతో మేళవించి అనిర్వచనీయమైన ఆనందాన్ని అందించేరు నారాయణదాసుగారు.

ఇక రెండవసర్గలో విబుధనగరవర్ణనం, ఆ ప్రసంగంలోనే కవికాలపు మానవుల స్వరూప స్వభావాల వర్ణనం, మూడవసర్గలోని చంద్రమతీ

నగర వర్ణనమున్ను స్వభావోక్తులతో, మనోజ్ఞమైన భావపరంపరల తోను పరిస్తరించబడ్డాయి. ఆ సందర్భంలోని ఒక్కొక్క శ్లోకం ఒక్కొక్క 'జిలేబి' లాగ ఉంటుంది. సహృదయులు స్వయంగా అనుభవించడం మంచిది. అస్తు.

ఈ కావ్యంలో పరిశీలించవలసినవి ఇటువంటి అంశాలు కానే కావు. ఇవి సర్వసామాన్యాలు. అంటే అందెవేసుకొన్న మహాకవియొక్క కావ్యంలో ఇవి స్వతస్సిద్ధంగా అమరుతూ ఉంటాయి. అన్నింటినీ మించిన ఘనాఘన విషయం ఒకటుంది. అది భాషావిషయం. (శ్రీ) నారాయణదాసుగారు పాండిత్యవీరుడు, సాహిత్యయోధుడు, కవిత్వశూరుడు, బహుభాషామల్లుడు. తమ సంస్కృతభాషా ప్రాభవాన్ని తారకంలో తారస్థాయిలో చూపించారు. వీరసంస్కృతాన్ని వాడి "సంస్కృత వీరుడు" అన్న బిరుదాన్ని సమకాలికులచేత పొంది విజయపతాకను శాశ్వతంగా ప్రతిష్ఠించుకున్నారు.

కావ్యం ప్రారంభంలోనే వచనరూపంగా ఆయన కొన్ని ప్రతిజ్ఞలు చేసినారు. వానిలోకెల్ల భయంకరమైనది 'పాణినీయ సూత్రాణామవైదికానా ముదాహరణమేతత్కావ్యమ్' అన్నది. 'వేదభాషనువిడిచి లౌకిక సంస్కృతానికి సంబంధించిఉన్న పాణినీయ వ్యాకరణ సూత్రాలకు ఈ కావ్యం ఉదాహరణంగా రూపొందించబడింది" అని భావం. ఈ ప్రతిజ్ఞను నిర్వహించిన తీరును స్థాలీపులాక న్యాయంగా పరిశీలిద్దాము :-

మొదటి మూడు సర్గలలోను వరుసగా లుఙ్, లఙ్, లిట్ అను లకారాలు మాత్రము వాడబడ్డాయి. ఇవి మూడున్ను భూతకాలాన్నే సూచిస్తాయి. అయితే కొంచెం తేడా మాత్రం శాస్త్రీయంగా ఉంది. లుఙ్ అన్నది భూతసామాన్యాన్ని చెప్తుంది అనద్యతనభూతాన్ని లఙ్ అనే లకారం సూచిస్తుంది. లిట్టు, అనద్యతన పరోక్ష భూతకాలాన్ని బోధిస్తుంది ఏతదంత రూపాలు క్రియాపదాలన్నది విజ్ఞులకు విదితమే.

వీనిలోని వింతవింత ప్రయోగాలు మూడు సర్గల్లోను కనిపిస్తాయి. అభాక్షీత్ (సేవించెను), అవవర్ణత్, (గట్టిగా వర్ణించెను) ఉపాక్రంస్త (ప్రారంభించెను), అబూబుధతామ్ (బాగా తెలిసికొన్నవి) ఆలులోకత్ (చూచెను) న్యభాన్త్సీత్ (కట్టెను) ఆశిశత్ (తినిపించెను) అవీవిదత్ (తెలియజేసెను.) అసోషుప్త (బాగానిద్రించెను) అవివిదిషత్ (తెలియ గోరెను) అపూర్ణచంద్రత్ (నిండుచంద్రునివలె భాషించెను) అనులో భూయాంబభూవే (అనుభవించబడెను) మొదలయినవి. కర్త్రర్థంలో కర్మార్థంలోను, ధాతువులకు - వికరణప్రత్యయాలనే కాకుండా అనేక విశేషార్థాలను తెలిపే ణిచ్చు, సన్ను, యఙ్, యఙ్లుక్కు, క్యజు, క్విప్పు, మొదలయిన ప్రత్యయాలు చేర్చిన రూపాలు కొల్లలుగా ఉన్నాయి.

నాలుగయిదు సర్గల్లో, లకారాల నియమం లేదు. వింత వింత ప్రయోగాలు మాత్రం చాలాచోట్ల కనిపిస్తాయి. మౌక్తికంతి (ముత్యాల వలె ఉన్నాయి) తుహినంతి (మంచులాగఉన్నాయి) పిపురతి (పాలిస్తు న్నారు) వ్యచ్ఛైత్సీత్ (ఛేదించెను), అభాషిషి (మాటాడితిని) దిధక్షతి (కాల్చగోరుచున్నది) మొదలగునవి. ఇటువంటి క్రియాపదాలను కవులు సామాన్యంగా ఒకటి రెండు స్థలాల్లోనే వాడుతూ ఉంటారు. తత్రాపి యఙ్లుగంతరూపాలను వాడడం కనబడనే కనబడదు. వానిని లౌకిక భాషలో వాడకూడదని కొందరు వ్యాఖ్యానించారు కూడ. అటువంటి సమయ నియమాలను తారకకవి లక్ష్యపెట్టలేదు. ఆయన నిజంగా నిరంకుశుడు!

సొగసయిన సమాసాలు, భాషీయపదాలు, గ్రంథం అంతటా అక్కడక్కడ చోటుచేసుకున్నాయి :—

విశ్వావారః, (ప్రపంచసముదాయం) దేవసభమ్ (దేరతలసమూ హం), జానుచరః, (ప్రాకేవాడు), తీర్థధ్వాంక్షః (చదువులేకుండా పది పాఠశాలలకు తిరిగేవాడు) కింపచానః (లోభి), ఖట్వారూఢః (మూర్ఖుడు)

కద్వదః (చెడుమాటాడువాడు), అశ్నీతపిబతా (తినడం – (త్రాగడం) కేశాకేశి, ముష్టీముష్టి, బాహాబాహి, మొదలయినవి.

కలాచణ, జాంఘిక, ఆప్రపదీన, అనుపదీన, సాప్తపదీన, కాంతిక, కావచి, శాక్తీక, మహాకులీన, మొదలైన రమ్యమైన తద్ధితాంతశబ్దాలు పదింబదిగా అంతటా కనిపిస్తాయి.

ఇలాగే :- భేదం భేదమ్, - దారం దారమ్, (బాగాచీల్చి) లవణం కారమ్, (బాగులేనిదానిని బాగుందనుకుంటూ తినడం) సర్పిర్ని దాయమ్ (నేతివలెఉంచుకొని) ప్రియాకృత్య (మంచిచేసుకొని) దుఃఖాకృత్య (ఏడిపించి) సమూలఘాతమ్ (అందరను చంపి) మొదలయిన చిత్రమైన కృదంతాలు, భాషీయ సమాసాలున్ను చాలా ఉన్నాయి.

అప్రయుక్తాలు, అప్రసిద్ధాలున్ను అయిన పదాలు కూడా క్వాచిత్కంగా కనబడతాయి:- మంక్షు (శీఘ్రంగా), పంచజనః (మనుష్యుడు) పృథుకః (బాలుడు), అహంయుః (అహంకారం గలవాడు), యాయజూకః (యాగాలనుచేయువాడు), భిస్సా (అన్నం) వక్తః (చెప్రుతున్నారు) మహాబ్రహ్మః (గొప్పబ్రాహ్మణుడు) అస్మదినః (మన ప్రభువు) మొదలయినవి.

ఈవిధంగా సుబంత, తిజంత, తద్ధితాంత, కృదంతావ్యయాదు లన్నీ పాణినీయానుసారం ఉదాహరించబడ్డాయి. వీనిని లాక్షణికంగా వివరించాలంటే "సిద్ధాంత కౌముది" ని పాఠంచెప్పినట్లవుతుంది. కాబట్టి ఆజోలికి పోలేదు. ముఖ్యంగా సుబంతాలకన్న తిజంతాల విషయంలోనే శ్రీ దాసుగారు వీరవిహారం చేసినారు. మీద చూపిన శబ్దాలన్నీ శాబ్దికులకు కర్ణామృతంలాగ ఉంటాయి. ఆలంకారికులు మాత్రం చాల చోట్ల పెదవి విరుస్తారు. అయితే ప్రతిజ్ఞానుసారం నడిచినందువల్ల పెద్దగా ఏమీ అనలేము.

ఎప్పుడో క్రీస్తుశకం ఏడో శతాబ్దంలో భట్టి అనే కవి ఇలాగే పాణినీయానికి లక్ష్యంగా "రావణవధమ్" అనే పెద్ద కావ్యాన్ని రచిం

చాడు. అతని తర్వాత మళ్లా ఎవరూ అట్టి సంకల్పం చేయలేదు. ఈ శతాబ్దంలో శ్రీ నారాయణదాసుగారు ఆ సంకల్పం చేసి అఖండ విజయాన్ని అందుకున్నారు.

పై ప్రయోగాలను తప్పిస్తే, నూటికి తొంభైవంతులు శబ్దార్థ సంపద అంతా, తారకంలో ద్రాక్షాపాకంలోనే నడచిందనడానికి సందేహం లేదు. "పాణినీయంలో, ఇంతటి ప్రావీణ్యం గ్రంథకర్తకు ఎలా సాధ్యమైందని" అనిపిస్తుంది. దీనికి సమాధానం కావ్యం ప్రారంభంలోనే ఉంది. "స్వభావ పాండిత్యబలేన కుర్వే" – అన్నారు శ్రీ దాసుగారు. అన్ని విషయాలలోను ఆయనది సహజ పాండిత్యమే. మా పరమ గురువులు వైయాకరణ సార్వభౌములు – మహామహోపాధ్యాయులు శ్రీ తాతా సుబ్బారాయశాస్త్రిగారే, శ్రీ దాసుగారి సుబంత తిఙంతాలను కొన్నింటిని చూసి, ముక్కు మీద వేలు పెట్టుకొనేవారు. మా వంటి వారు లెక్కేమిటి! సంగీత సాహిత్య దర్శనాది సకల రంగాలలోను, శ్రీ దాసుగారికున్న ప్రతిభాప్రాభవం ముందు "మహాగజాః పలాయంతే మశకా నాంతు కా గతిః"? భవతు.

పోతే – తారక కావ్యం అందించే సందేశం ఏమిటి? ఇది ధ్వని కావ్యం కాగలదా? ఆలంకారికులు దీని విషయంలో ఏమని భావించవచ్చు? —— ఇటువంటి అంశాలను కూడా కొద్దిగా స్పృశించడం సముచితమే అవుతుంది. తారకంలోని కథ కేవలం కల్పితం. "పరిసాధయామ్యద్య తయా మదూహామ్" అనే మొదటి పద్యంలోని వచనమే ఈ విషయాన్ని సూచిస్తుంది. అన్యాపదేశధోరణి ఇందులో అధికంగా కనిపిస్తుంది. నాయకుడైన తారకుడు నారాయణదాసే అన్నది ఇంచుమించు స్పష్టంగానే ఉంది. తారకుని బాల్యచరిత్రకు, దాసుగారి బాల్యచరిత్రకు చాలా పోలికలు ఉన్నాయి. క్రమంగా తారకుడు –

అతులలలితరూపః సర్వవేదః ప్రశాంతః
సకలజన సమానః సర్వతంత్ర స్వతంత్రః।
విజితసమవయస్కో విద్యయా సద్యశస్కః।

అయ్యేడు. విబుధనగరంలో.— "ద్రుతలయ పరిమేయం గీతముద్బద్ధ తారం బహుగుణలలితం సంగాయ వాగ్గేయకారః" వాగ్గేయకారుడై చక్కగా పాడినాడు. చంద్రమతీ నగరంలో కూడ సంగీతాన్ని వినిపించేడు. ఈ సన్నివేశాలు - ముఖ్యంగా-వాగ్గేయకార శబ్దమున్న మీది విషయాన్ని వాచ్యాయమానంగా చేస్తాయి.

తాను, స్నేహితుడైన రాజకుమారుడున్ను కలిసి వెళ్ళిన ద్వీపం ఇంగ్లండు. చంద్రమతీనగరం 'లండను' మహానగరమే. పదునాలుగు శ్లోకాలతో వర్ణింపబడిన ఆ నగర విశేషాలు బ్రిటీషువారి స్వరూప స్వభావాలను ఆచార వ్యవహారాలను విస్పష్టం చేస్తున్నాయి. స్నేహితులిరువురు చక్రవర్తిని కలుసుకొని, తాము భారతదేశీయులమని స్పష్టంగా చెప్పి, తమ దేశంలో చక్రవర్తి పరిపాలన సర్వజన సంతోషకరంగా ఉందని పొగడుతారు. దీనివలన ద్వీపం, రాజధానీ నగరమున్ను కల్పితాలు కావని తెలుస్తుంది.

ధర్మభ్రష్టులై స్వేచ్ఛాచారులయిన మానవుల ప్రవృత్తి విబుధ నగర ప్రస్తావంలో పలువిధాలుగా చిత్రించబడింది. అది (శ్రీ) దాసుగారు స్వయంగా పరిశీలించిన - నాటి భారతదేశస్థితియే అనవచ్చును. ఆ పరిస్థితులు - నాడేమిటి - నేడూ అలాగే ఉన్నాయి కదా! ("ఎప్పుడు బాగుపడతామో!" అని నిరీక్షించడమే సామాన్యులపని.)

ఈ విధంగా కావ్యంలోని చాలా ఘట్టాలు కవికీ, కవికాలానికీ సంబంధించినవే అని స్ఫురిస్తుంది.

ఇక ఈ ప్రబంధమిచ్చే సందేశం :—

ప్రబంధరచనాకాలం క్రీస్తుశకం 1908—1910 ప్రాంతం. బ్రిటిషు వారు భారతదేశానికి స్వాతంత్ర్యం ప్రసాదించాలన్న విషయంలో నెమ్మది నెమ్మదిగా ఉద్యమాలు సాగుతున్న రోజులవి. మితవాదం, అమితవాదమున్ను ప్రక్క-ప్రక్కను వినిపిస్తూఉండేవి. అందులో మిత

వాదమే మంచిదని ఈగ్రంథం సూచిస్తుంది. చక్రవర్తిని కలుసుకోవాలి. మంచితో అతన్ని వశపరచుకోవాలి. ప్రశంసించాలి. కష్టసుఖాలు మనవిచేసుకోవాలి. యుద్ధంలో అతనికి బాగా సాయంచేయాలి. తద్వారా స్వాతంత్రాన్ని సంపాదించాలి. ఈ భావాలు ఇతివృత్తంలో స్పష్టంగా నే ఉన్నాయి.

అయితే ఈ సందేశానికి ప్రస్తుతం ఆవశ్యకత ఏమీలేదు. "ఖడ్గ వాదంకన్న కార్యవాదం మంచిది" అన్న సందేశసారంమాత్రం శాశ్వతమైనదే.

అంతేగాక— "తారకుడు బ్రాహ్మణుడు. అతని మిత్రుడు క్షత్రియుడు. వీరు ఉద్దండులు. వీరిచాతుర్యంవల్ల భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చింది" అన్నకథాంశం ఉంది. ఇక్కడ జాత్యావేశం జోలికిపోకుండా కేవలం సాంకేతికంగా భావాన్ని స్వీకరిస్తే మంచి ప్రబోధమేఉంది. సకలజ్ఞానవిజ్ఞానాలకు, సదాచారాలకు ప్రతీకం బ్రాహ్మశక్తి. బాహుబలానికి ధైర్యస్థైర్యాదిగుణాలకున్న సంకేతం క్షాత్రశక్తి. సమాజంలో ఈ రెండే ముఖ్యాతిముఖ్యమైనవి. సమాజప్రగతికి ఈ రెండే ఎల్లప్పుడూ దోహదం చేస్తాయి. కాబట్టి బ్రాహ్మక్షాత్రతేజములను పరిరక్షించుకోవాలన్న ఉద్బోధం సనాతనము, సార్వకాలికమున్నూ కావాలని కోరడంలో తప్పు లేదు.

ఇంకా సముచిత సంఘసంస్కార సందేశాన్నికూడా ఈవిధంగా అందిస్తుంది - స్వధర్మం, స్వదేశం, స్వవేషం, స్వభాష ఇత్యాది 'స్వమ్ము'లను వమ్ముచేసుకోకుండా కొన్ని సద్దుపాటులనుమాత్రం అంగీకరిస్తూ, నౌకాయానమైనా చేయవచ్చు. విమానయానమైనా చేయవచ్చు. దేశదేశాలు తిరగవచ్చు. అక్కడివారితో స్నేహం చేయవచ్చు. వారిలో ఉన్న మంచినంతను స్వీకరించవచ్చు.

చంద్రమతీ నగరంలోని మానవులు ఎంతగానో ప్రగతిని సాధించేరు. వారు శ్రేయోరాజ్య శిఖరాలను అందుకున్నారు – చూడండి – అక్కడి జనులు —

చంద్రికాధవలచ్ఛాయా స్తత్రిత్యా రేజిరేజనాః।
అన్యోన్యమైత్రీం కుర్వంతః సంజానంతో యథాయథమ్।
విద్యయా సమయాకృత్య ప్రియాకృత్య ముహుర్గురూన్ ।
... ... .... ....
ఏకతానాస్సాంయుగీనాః వాగ్మినో హృదయాలవః
క్షేమంకరా మహోత్సాహాః ఉరస్వంతో యశస్వినః
సమానపంక్తి భోక్తారః సమవర్ణవిభూషితాః।
సామాన్యభాషావక్తారః సమానాచారవర్తినః ।
వయః పరిణయం స్త్రీణాం విద్యాభ్యాసం స్వతంత్రతామ్।
ప్రాపయంతః ... ..... ....
సామాజికా ఆస్తికాస్సత్కులీనా ధార్మికా బుధాః
శాకాహారా వావదూకాః కృతినః పురుషోత్తమాః।
తత్రిత్యికా బభూవ స్త్రీ వీరమాతా సులక్షణా ।
గృహకార్యపరా ప్రాజ్ఞీ బుధమాన్యా పతివ్రతా ।
వీథీర్వీశాలా అమలా జలయంత్ర పరిష్కృతాః।"

ఈ విధంగా ఉన్నారు. ఈ శ్లోకాలు అత్యంతం సుబోధములే. భావం వేరే వ్రాయనక్కరలేదు. ఇక్కడి విశేషణాలన్నీ సమాజంలో పూర్తిగా ఎదిగిన వ్యక్తులకు చెందుతాయి.

'ఏ దేశమయినా చంద్రద్వీపంలాగ ఉండాలి. ఏనగరమైనా చంద్రవతీ నగరంలాగ ఉండాలి. ఏసమాజమైనా "ఏవం గుణవిశేషవిశిష్టమై వర్ధిల్లాలి." – అన్న ప్రగతి భావాలు ఈ సందర్భంలో తప్పక స్ఫురిస్తాయి.

కాగా — "బ్రాహ్మక్షాత్ర తేజములే, సర్వతోముఖాభివృద్ధిని సాధించడంలో సమర్థమైనవి. సమసమాజం, శ్రేయోరాజ్యం, అన్నవి మానవుని భౌతిక జీవనయాత్రకు ముఖ్య గమ్యాలు." — ఈ సనాతన

ధర్మప్రబోధమే శ్రీ నారాయణదాసుగారి తారక ప్రబోధమని నామట్టుకు నాకు తోస్తున్నది.

శ్రీ దాసుగారు రచించిన "జగజ్జ్యోతి" ని పరిశీలిస్తే, వైదిక మ్మన్య పండితబ్రువ బ్రహ్మబంధుసంఘ సంస్కారంకోసం ఆయన ఎంత మథనపడిందీ విపులంగా తెలుస్తుంది. ఆ విషయాలు తారకంలో బీజ ప్రాయంగా ఉంచబడినాయి.

ఇక — ఆలంకారికుల మానదండాన్ని నూటికి నూరుపాళ్లు ప్రయోగిస్తేమాత్రం, తారక కావ్యం రసధ్వని కావ్యం కాజాలదు. రసానుభూతికి ఇందులో ఎట్టి అవకాశమున్నూ లేదు. కావున ఇది వస్తు ధ్వని కావ్యం అవుతుంది. పాణినీయానికి ఉదాహరణంగా, శబ్దప్రయోగాల కోసం బయలుదేరిన కావ్యం, సామాన్యంగా రసవత్కావ్యం కావడానికి అవకాశాలు ఉండవు. వెనకటికి "భట్టికావ్యం" పనీ ఇంతే అయింది. నేటికి "తారకం" పనీ ఇంతే అయింది. ఒకవిధంగా ఇటువంటివి "ఉపదేశకావ్యాలు" అవుతాయి. ఇలా అన్నందువల్ల ప్రకృత కావ్యాన్నిగాని, తత్కవినిగాని ఏదో అన్నట్లు భావించకూడదు. ఇతర గుణగణాలముందు ఇటువంటి చిన్న మాటకు విలువను కట్టనక్కరలేదు. శ్రీ దాసుగారే ఈ కావ్యం మొదట్లో ఇట్లా అన్నారు.

> ''సదోష మప్యుత్తపతే కవిత్వం
> యథా కలంకాంకిత మిందుబింబమ్''

తారకం ఆచంద్రతారకముగా ప్రకాశిస్తూనే ఉంటుంది.

శ్రీ నారాయణదాసుగారు తమ రూపురేఖలను కూడా, ఈ కావ్యంలో రెండుచోట్ల తీర్చిదిద్దినారు.

> "న దేవతాధీన మనః ప్రవృత్తిః
> స్వాతంత్ర్య సంకల్పిత చారుకావ్యః

దయార్ద్రి చిత్తోంచిత సత్యవాక్యః
కలాచణః సత్కవిశేవ నాఽన్యః''

— — — —

నవరుచి వేదీ సర్వభూతానువాదీ
లలితచరణధారీ సాధ్వలంకారధారీ।
పరవశ సుఖయోగ శ్చిత్ర సంకల్పభోగః
కవిః" — — —

ఇవి స్వయమర్థ సమర్పకాలు. వీటిని భావిస్తే శ్రీ దాసుగారే ఎదురుగా వచ్చి, భావుకునిముందు నిలుస్తారు.

పాశ్చాత్య పండితుడు ప్రొఫెసరు "గెల్డనర్" అనే ఆయన తారకాన్ని చదివి ఆనందించి అభినందనంగా ఈ రెండు శ్లోకాలను రచించి శ్రీ దాసుగారికి పంపినాడట:-

''జానతే యన్న చంద్రార్కౌ జానతే యన్న యోగినః
జానీతే యన్న భర్గోఽపి తజ్జానాతి కవిః స్వయమ్॥
వచస్సుధామయం కావ్యం పీత్వాఽహం తృప్తమానసః।
కృతజ్ఞోఽభి ప్రశంసామి భవంతం కవిశేఖరమ్".

ఇవి పరంపరగా వస్తున్నవి. ఇంతకన్న పెద్దమాటలను మనం మాత్రం ఏం చెప్పగలం?

సర్వథా పై శ్లోకాలనే మననం చేస్తూ "తారకం నిజంగా కవి సహృదయ తారకం" అని నేనంటాను.

# శ్రీ హరికథామృతము—
## [హరికథలు]

శ్రీ కె. ఎ. కృష్ణమాచార్యులు

ఆంధ్రభాషలో గల వాఙ్మయ ప్రక్రియలలో హరికథ యొకటి. ఇది గద్య పద్య గీతాత్మకమయిన రచన. సామాజికుల యెదుట భావ రాగ తాళయుక్తమగు పద్యగీత పఠనాదులచే సామాజికుల మనసును రంజింప జేయుచు కథా వివరణమునకై యుద్దేశింపబడిన ప్రక్రియయిది. ప్రసిద్ధ పౌరాణిక ఘట్టము దీనికి కథావస్తువుగ నుండును. సామాన్యముగ భక్తిరస ప్రాధాన్యమును కలిగియుండును. అట్టి ప్రక్రియా పద్ధతి ననుసరించి హరికథా పితామహేత్యాది బిరుదాంచితులు, గాన కవితా విశారదులు నయిన శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాసుగారిచే సంస్కృతభాషలో రచించబడిన గ్రంథము "శ్రీహరికథామృతము." శ్రీమద్భాగవతమునందలి శ్రీకృష్ణ చరితమునకు సంబంధించిన కొన్ని ఘట్టములు ఇందు కథావస్తువుగ గ్రహింపబడినవి.

ఇది మూడు భాగములుగ విభజింపబడియున్నది. ఈ భాగములు బిందువులని పేర్కొనబడినవి. మూడు భాగములందును ప్రత్యేకముగ ప్రారంభమున శ్రీకృష్ణ విఘ్నరాజ శారదాంబల స్తవములును, అంతమున శ్రీకృష్ణమంగళమును రచింపబడియుండుటచే మూడుభాగములును ప్రత్యేకమగు హరికథలుగ నుద్దేశించి రచింపబడినట్లు తెలియుచున్నది.

ప్రథమ బిందువునకు శ్రీకృష్ణజననమని, ద్వితీయ బిందువునకు పితృబంధ విమోచనమని, తృతీయ బిందువునకు ధర్మసంస్థాపనమనియు కథాంశ పరముగ నామకరణము చేయఁబడియున్నది. దానివలన ఆ యా బిందువులందలి ప్రధాన కథా భాగములు స్పష్టమగుచున్నవి.

శ్రీకృష్ణుని జన్మవృత్తాంతము మొదటి బిందువునందలి ప్రధాన కథాభాగము. ఉగ్రసేనునకు దేవకీదేవియు కంసుడును జన్మించుట - దేవకీవసుదేవుల వివాహము - దేవకి యష్టమగర్భ సంజాతుఁడు కంజుని చంపునట్లు ఆకాశవాణి పలుకుట - కంసుడు దేవకిని చంపబోవుట-వసుదేవుడు బ్రతిమాలి యామెకు కలిగిన సంతానమును కంసుని యధీనము కావించునట్లు వాగ్దానము చేయుట - దేవకి గర్భము ధరించిన వెంటనే యా దంపతులను కారాగారబంధితులను గావించుట - జన్మించిన వెంటనే దేవకి బిడ్డలను కంసుడు చంపుట - దేవకి యష్టమ గర్భమునుండి శ్రీమన్నారాయణుడు శంఖచక్రాది దైవ చిహ్నములతో నిశీథ సమయమున అవతరించుట - బ్రహ్మాది దేవతలు, దేవకీవసుదేవులును ఆ పరమాత్మ స్వరూపుని స్తుతించుట - ఆశిశువు తల్లిదండ్రులకు కర్తవ్యము నుపదేశించుట - ఇవి మొదటి బిందువునందలి కథాంశములు. ఇందు ఒక పావురమువలన కిరాతుఁడు 'అహింసయే పరమ ధర్మము' అను నీతి నెరింగిన వృత్తాంత మొకటి యవాన్తరకథగ కూర్పబడియున్నది. హాస్యజనకములయినట్టియు, నీతిబోధకము లయినట్టియు చిన్న చిన్న కథలను ప్రధాన కథతో చేర్చి చెప్పుచుండుట హరికథా ప్రక్రియలో నొక యాచారముగ నున్నది.

శ్రీకృష్ణుడు కంసుని సంహరించి కారాగారబంధితులై యున్న దేవకీవసుదేవులను విడిపించుట రెండవ బిందువు నందలి ప్రధాన కథాభాగము. శ్రీకృష్ణుని జనన సమయమున లోకులందరు నిద్రాపరవశులై యుండగా వసుదేవు డాతనిని గొనిపోయి యశోదకడనుంచి యచ్చటి శిశువును గైకొని వచ్చుట - పిమ్మట ద్వారపాలురు మేల్కొని దేవకికి

శిశువు జన్మించిన వృత్తాంతమును కంసున కెరిగించుట - కంసుడా స్త్రీ శిశువును నిర్దయుడై చంపబూనుట-ఆ శిశువు శక్తిరూపముతో పై కెగసి పోయి కంసునియొక్క మృత్యుహేతువగు బాలుడు మరియొకచోట పెరుగుచున్నట్లు తెలిపి యంతర్ధానము నందుట- కంసుడు సకలమాయా విశారదులగు రాక్షసులనుబంపి నానాదేశములందు పెరుగుచున్న బాలురను చంప నాజ్ఞాపించుట - శ్రీకృష్ణుని చంపవచ్చిన పూతనా తృణావర్తాది రాక్షసులు సంహరింపబడుట-నంద వ్రజమునందలి యుత్పాతములకు భయపడి యాదవులందరును కలసి బృందావన ప్రాంతమునకు వలసపోవుట - అచ్చట శ్రీకృష్ణునిచే బకాసురాదులు చంపబడుట - కాళియమర్దనము - రామకృష్ణులు ధనుర్యాగ సందర్శన వ్యాజముతో మధురానగరమున కేగుట - కువలయాపీడమను యేనుగును చంపుట - చాణూర ముష్టికులను మల్లులవధ - కంసునిచంపి దేవకీవసుదేవులకు బంధ విముక్తిని గావించుట-ఇవి రెండవ బిందువు నందలి కథాంశములు.

బలరామకృష్ణులు కాశీనగరమున విద్యాభ్యాసము చేయుట-జరాసంధుని పదునేడు సారులు జయించి యనేకాక్షౌహిణీ సైన్యమును సంహరించుట - ద్వారకాపురమునకు నివాసమును మార్చికొనుట - శమంతకోపాఖ్యానము - నరకాసురవధ - ఆతనిచే బంధితులయిన పదునారు వేల కన్యలు విడిపింపబడుట - కుచేలోపాఖ్యానము - నారదుడు శ్రీకృష్ణ మహిమ నెరుంగగోరి ద్వారక కేతెంచి దాని వైభవమును గాంచి యచ్చెరువందుట - శ్రీకృష్ణుని బహువిధముల స్తుతించుట - ఇవి మూడవ బిందువునందలి కథాంశములు. ఇందు అనేకాక్షౌహిణీ దుష్ట రాక్షస సంహారము కావించియు బలాత్కారముగ నరకునిచే నిర్బంధితులయిన అనేకకన్యలకు విముక్తిని కల్గించియు, లోకమునందు ధర్మమును స్థాపించిన వృత్తాంతముండుటవలనను, "తుదిని మానవుల కవశ్య కర్తవ్య ధర్మము కేశవ సంకీర్తన" మను విషయమును బోధించుటవలనను దీనికి ధర్మసంస్థాపనమని పేరిడియుండును,

హరికథలో సంగీతము ప్రధానాంశము. భక్తితత్త్వమును, తత్ప్రతిపాదకములగు పౌరాణికఘట్టములను ప్రచారముచేయుట హరికథయొక్క ముఖ్యోద్దేశ్యములు. తత్ప్రయోజనసిద్ధికై సంగీతము ప్రధాన సాధనముగ గ్రహింపబడుచున్నది. అందు సాహిత్యమానుషంగికమై భాసించును. సంగీతప్రధానమగు వాఙ్మయములందంతటను ఇట్లే యుండును. ఉదాహరణమునకు త్యాగరాజు సంగీతవాఙ్మయమును పరిశీలించునది. అందు సంగీతము ప్రధానాంశము. అయినను కొంత సాహితీ వైశిష్ట్యముగూడ అందుకలదు. కాని యది యప్రధానము. అందాతని భక్తివ్యక్తిత్వములు ప్రతిఫలించుచున్నవి. అట్లే సంగీతప్రధానమగు వాఙ్మయము లన్నింటిలోను సాహిత్య మప్రధానముగనే భాసించుచుండును. కాని యా కవియొక్క ప్రతిభావిశేషమునుబట్టి, అట్టియెడ గూడ ఉత్తమసాహిత్యసృష్టి కొంతవరకు జరుగుచునే యుండును.

ప్రకృతమున "శ్రీహరికథామృతము"ను గ్రంథమునందలి సాహిత్యతత్త్వమును వివరించుట యీ వ్యాసరచనాలక్ష్యము. ఇందు శ్రీదాసుగారి కవిత్వవ్యక్తిత్వములతో భక్తిభావన పెనవేసుకొని యున్నట్లు గోచరించును. శ్రీదాసుగారు సహజముగ పరమభక్తాగ్రేసరులగుటచేతను, ఇది భక్తితత్త్వ ప్రచారమునకై యుద్దేశింపబడిన గ్రంథమగుటచేతను, అట్లుండుట సహజమే.

కవిత్వమునకు భావసంపద, భావవ్యక్తీకరణపద్ధతి, వర్ణనలు, కల్పనలు, అలంకారములు, భాష, శైలి మున్నగునవి ప్రధానాంగములు. అట్టి కావ్యాంగములతోనిండిన ఈ రచనలో కవియొక్క భక్తి, ఆధ్యాత్మికదృష్టి, ధర్మపరాయణత, దేశభక్తి, లోకజ్ఞత, శాస్త్రజ్ఞత మున్నగు విశిష్టలక్షణములు గోచరించుచున్నవి.

ఈ గ్రంథమునందలి భావానుగుణమగు భాష, రాగతాళలయానుకూలమగు పదవిన్యాసము, సుందరమగు అలంకారములు, సందర్భోచి

తమగు వర్ణనలు శ్రీదాసుగారి గానకవితా వైశారద్యమును భాషా పాండిత్యమును వెల్లడిచేయుచుండగా ఇందలి భావములు, లోకోక్తులు, వేదాన్తార్థములును వారి విజ్ఞానవైశిష్ట్యమును వెల్లడించుచున్నవి.

వందే సంశ్రిత కల్పం,
సుందరగోపాంగనా హృదయతల్పమ్।
బృందావన సంచారం,
నందయశోదాత్మజం దయాపూరమ్॥

అను శ్రీకృష్ణపరమాత్మని వందనముతో నారంభించి తరువాతి శ్లోకములో "సహరిర్మే కావ్యమంగీక్రియాత్" అని శ్రీహరిని తనకావ్యము నంగీకరింప వేడుకొని అనంతరగీతములో "కురుమే కావ్యం సదా నిర్దుష్టం యశోవిశిష్టం" అని ఆ శ్రీహరినే తన కావ్యమును నిర్దుష్టముగను యశోవిష్టముగను చేయింపవేడుకొనెను. దీనివలన శ్రీదాసుగారీ గ్రంథమును శ్రీహరికి అంకితముగా భావించి రచించినట్లు తెలియుచున్నది. పిమ్మట విఘ్నరాజ శారదాంబల స్తవమాచరించి, దృశ్యకావ్యపద్ధతిలో ప్రకృత సభాస్వరూపమును తన గ్రంథమునందలి కథానాయకుడగు శ్రీకృష్ణ పరబ్రహ్మమాహాత్మ్యమును పేర్కొని ఆ మహాసభయందు వారికథను చెప్పబూనుట సాహసమేయగునని సహజధోరణిలో తమ నిరహంకారతను ప్రకటించి, కాళిదాసాదులవలె సాత్త్విక మహాకవి భావమును నిరూపించుకొనిరి.

శ్రీ దాసుగారు వర్ణించిన ప్రకృతసభాస్వరూపము గమనింపదగినది. సకల వేదవేదాంగ పురాణేతిహాస కావ్యాలంకార విచక్షణులు ప్రకట వైదిక లౌకిక కార్యనిపుణులు నగు బ్రాహ్మణులతోడను, విపుల సాహసౌదార్య గాంభీర్య శౌర్య చాతుర్య ధురన్ధరులగు క్షత్రియులతోడను, సకలవస్తు సంపాదన ప్రయోజన వ్యవహార ధీయుతులగు వణిజులతోడను, సన్తత నవధాన్యాది సస్యాభివర్ధనకరణభద్రులగు శూద్రులతోడను, అనవరత పురుషరక్షణైకాయత్తచిత్తలగు కుల

స్త్రీలతోడను, సరస సంగీత విమోహిత రసికస్వాన్తులగు వారాంగనల తోడను, సంకల్పమాత్ర ప్రత్యక్షీకృతాదృష్టలోకనికరులగు కవీశ్వరుల తోడను, ఆ సభ విరాజిల్లుచున్నదట. అందువలన శ్రీ దాసుగాని కథను విని సంతసించువారు పామరమాత్రులేగారు, పండితోత్తములు గూడ యని తెలియుచున్నది. ప్రతిభావ్యుత్పత్తి, పరిపూర్ణ పాండిత్యము, సరస సంగీత సాహిత్య సముల్లసిత సౌమనస్యము కలవారి హరికథలనే సర్వులు మెచ్చగలరు. సామాన్యుల హరికథలను సామాన్యులు మాత్రమే మెచ్చ గలరు.

ఇక ప్రకృతహరికథా నాయకుడు- "నిఖిలభువన రక్షణ ధురీణుడు, సంతతాఖిల దేవముని చింతిత పాదకమలుడు, దుష్టనిగ్రహ శిష్ట పరిపాలన చతురుడు, విలాసార్థమై భూమిాగతుడు, సర్వ చరాచరాత్మకుడు, దేవకీ గర్భశుక్తిముక్తాయమానుడు. వ్రజ వధూ హృదయాబ్జ బంభరాయమాణుడు, వేణుగానార్ద్రీకృత శిలాతరుషండుడు, పర బ్రహ్మ స్వరూపుడు నయిన మురారి."

ఆ సభలో ఈతని చరితమును చెప్పబూనిన శ్రీ దాసుగారు "సంసార బన్ధనమువలన మందీకృత బుద్ధిమంతులట"

అయినచో వారా సాహసమునకేల పూనిరి? ఈ ప్రశ్నకు శ్రీ దాసుగారు స్వయముగా నిట్లు సమాధానము చెప్పుకొనిరి.

> "యథా కురూపేతి విదన్నపి స్వయం
> వినోద యత్యల్ప మతిః స దర్పణే।
> తథాహ మజ్ఞోఽపి భవత్సమక్షం—
> ఆత్మాను మోదార్థ మిదం బ్రవీమి॥"

(తాను కురూపియని తెలిసి కూడ అద్ధములో తన ప్రతి బింబమును చూచుకొని అల్పబుద్ధి కలవాడు మురిసిపోవునట్లే అజ్ఞుడనైన నేను ఆత్మానుమోదము కొరకే మిా యెదుట ఈ కథను చెప్పుచున్నాను.)

ఇచ్చట లోకానుభవసిద్ధమయిన ఉపమానము పొందుపరుపబడినది. ఉపమాద్యలంకారములను గూర్చుటవలన కావ్యమునకు శోభకలుగుటయే కాక చెప్పదలచిన యర్థము గ్రహీతల మనస్సునకు హత్తుకొనునట్లు వివరించుటకు వీలగును. సుప్రసిద్ధమయిన ఉపమానమువలన ఉపమేయ తత్త్వము వెల్లడియగును. కురూపి అద్దములో చూచుకొనుట ఆత్మానందము కొరకే గాని తన సౌందర్య ప్రకటనకొరకుగాదు. అట్లే శ్రీ దాసుగారు ఈ కథను వివరింపబూనుట ఆత్మానందముకొరకేగాని తమ యాధిక్యమును ప్రకటించుటకు గాదను విషయము ఈ యుపమానమువలన స్పష్టము చేయబడుచున్నది.

తరువాత ప్రసంగ వశమున కలికాలచేష్టితములను వర్ణించిరి. ధనికుడు అతినిద్రకలవాడు. దాత దరిద్రుడు. జనపాలుడు నీచరతి గలవాడు. న్యాయాధిపతి జాల్ముడు......ఇది నేటి మానవుల స్వభావము. రాజు రాజ్యమునుబొంది దుష్టులతోగూడి వారాంగనలను సేవించును. మంత్రి దర్పమును బొంది కర్షకులనుండి రాజధనమును వశపరచుకొనును. ఉద్యోగులు మూఢులను దుర్బలులను పీడించి విలసిల్లుదురు... ఇది నేటి మానవుల చేష్టితము. ఇట్టి కలికాల చేష్టితము లెవ్వరిచేతను వారింపబడుట లేదేయని శ్రీ దాసుగారు మిగుల వాపోయిరి. ఇది వీరి ధర్మపరాయణతకు నిదర్శనము.

"ఈ భరత వర్షము పరమర్షులకు ప్రమోదదాయకము. పరరాష్ట్రములకు హృదయ శల్యము. దేవేంద్ర సామ్రాజ్యముతో సమానము. సాగరపర్వత పరివేష్టితము. సదాచార సంభృతము. నదీ సరోవరవిరాజితము. సమశీతోష్ణ సమన్వితము. స్వచ్ఛంద పాలనా పద్ధతి విశిష్టము. సంపత్సమృద్ధము. సద్వర్ణ యోగి పరిపూతము."

ప్రాచీనమయిన యిట్టి భరతభూమి యందలి పరిస్థితులు దైవ దుర్విపాకముచే తలక్రిందులయినవి. "వర్ణ సాంకర్యము కలిగినది. లక్ష్మి

చాంచల్యమేర్పడినది. వేదములు పరిభవింపబడినవి. గోవులు క్రూరభక్షితములయినవి. ఋషి మతము భూమిలో పాతిపెట్టబడినది. కన్యాశుల్కమపేక్షింపబడినది. ద్విజులచే శ్వవృత్తి అనుసరింపబడినది.” అయ్యో! భరతవర్ష యోగమిట్లున్నదే యనుచు శ్రీ దాసుగారు మిక్కిలిగా విలపించిరి. ఇది వారి దేశభక్తికి తార్కాణము కాగలదు.

సత్యము, పాతివ్రత్యము, ఐకమత్యము ఉన్నచోట సౌఖ్యము కలుగును. అవి కొరవడియుండుటచే నేటికాలమున ఈశ్వర భజనము సర్వమానవ కర్తవ్యము అని సభాసదుల నుద్దేశించి ప్రకృత కథాసంగతిని చక్కగా వివరించిరి- “తస్మాదీశ్వర భజనం యథేచ్ఛ మస్మాభిరద్య కర్తవ్యమ్”

“నశ్రోత్రం నిష్ణునామ శ్రవణ విరహితం కింతు మృత్కుడ్యరంధ్రం
నేత్రం నాంభోజ నాభగ్రహణ విఫలితం కింతు కాచోపమానమ్।
వాఙ్న ప్రద్యుమ్నసేవా వ్యతికరరహితా కింతు కాకోలఘోషా
నాన శ్రీకృష్ణభక్తి ప్రతికృత హృదయః కింతు తిర్యక్సమానః”

(భగవన్నామ శ్రవణము చేయని చెవులు మట్టిగోడయందలి రంధ్రములతో సమానము. భగవత్సందర్శనము చేయని నేత్రములు గాజుపూసలతో సమానము. భగవత్సేవా వ్యతికరముగ రచించబడిన వాక్యము కాకిఘోషతో సమానము. భగవద్భక్తిలేని మానవుడు తిర్యగ్జంతువుతో సమానము)

అందుచే మృతికరణమైన దుష్టకామినీ విహారణమును విడచి శ్రీకృష్ణ భజనము చేయదగినది. ధనాశా పిశాచమును వదలించుకొని వాసుదేవభక్తి పరిగ్రహింప దగినది...అని యీ విధముగ మానవజీవితమునందు పరిత్యజింపవలసినవానిని పరిగ్రహింపవలసినవానిని మున్నగు పలు విషయములను వివరించి అస్థిరమయిన యీ జీవితమునకు సంబంధించిన కార్యములతో వృథాకాల యాపన చేయక నారాయణ స్మరణము చేసినచో శాశ్వతానందమును బొందవచ్చునని పేర్కొనిరి. ఈ వివర

ణములన్నియు శ్రీ దాసుగారి లోకజ్ఞతకు ఆధ్యాత్మిక దృష్టికి నిదర్శనములు కాగలవు.

"శ్రూయతాం నారాయణచరితం-పీయతాం హరినామామృతమ్" నారాయణ చరితమును వినండి, హరినామామృతమును త్రాగండి అని చెప్పి పిమ్మట నారాయణచరితమును చెప్పుట కుపక్రమింతురు. ఇంతవరకు శ్రీహరికథామృతముయొక్క ప్రాశస్త్యము, ప్రాధాన్యము, పరిగ్రాహ్యత్వము వివరింపబడినవి.

శాపగ్రస్తుడైన పరీక్షిన్మహారాజు స్వాత్మరక్షణార్థమై యనేకోపాయములను గావించుకొనియు తక్షకాగమన శంకాకలితుడై మనఃస్థైర్యమును పొందజాలక అసంతుష్టుడై తనకు హృషీకేశ చరితములను చెప్పి సంతోషపెట్టుమని జీవన్ముక్తుడగు శుకమహర్షిని కోరగా ఆతడీ కథలను చెప్పినట్లును, దానిని వినుచున్న పశుపక్షిగణము కూడ చిత్తరువు నందున్నవివలె నిశ్చలమై వినదొడంగినట్లును శ్రీ దాసుగారు వర్ణించిరి ;—

"ఇత్యృషికోణ పరిపూర్ణ శుగశ్రు జాలం
సౌభద్ర సూను మఘహీన మువాచమౌనిః ।
తద్వాక్య తత్త్వ విమలామృత గానబద్ధ
శ్చిత్రీకృతోవ పశుపక్షిగణో బభూవ."

ఇందలి కథాంశములన్నియు పరీక్షిన్మహారాజు ప్రశ్నలకు శుకమహర్షి యొసంగిన సమాధానరూపములుగ వెలువడినట్లు వివరింపబడినవి. జిజ్ఞాసువగు పరీక్షిత్తునకు శుకమహర్షి చెప్పినట్లుగ ఇచ్చటను మూడవ బిందువు ప్రారంభమునను అనేక వేదాన్తార్థములు వివరింపబడినవి. భక్తితత్త్వముయొక్క ప్రాశస్త్యము పలురీతుల నుగ్గడింపబడినది. ఇవియన్నియు శ్రీ దాసుగారి శాస్త్ర వైదుష్యమును, ఆధ్యాత్మిక దృష్టిని విశదము చేయుచున్నవి.

వీనిని విన్న పరీక్షిత్తు భక్తిపరవశుడై మురహరి చరితమును గురించి వేయుప్రశ్నలు శుకమహర్షికి రోమాంచమును కలిగించినవట. కన్నులలో ఆనందాశ్రువులను నింపినవట. శ్రీహరిచరితమును చెప్పు వాడు వినువాడును ధన్యులని భావించెనట. శ్రీదాసుగారి స్వానుభావ మునే యిట్లు పొందుపరచిరేమో!

కృష్ణచరితమునకు ప్రారంభమున మధురానగరము నొక గద్యలో వర్ణించిరి;

"రథాంగ సారస హంస మధుపప్రలుబ్ధ పరిమళమిళితోత్పల్ల పద్మకైరవ ప్రసన్నమధుర జలాంచత్ కాసారవిరాజితము - జితాశేష నందన ప్రసూనఫలసంభరిత వివిధవృక్షలతోద్యాన విభాసురము - సురేశ్వరానన్దకరైరావణోచ్చైశ్శ్రవోదర్పాతిశయ మనోహర చరన్మద ద్విపాశ్వపదసముద్ధూతధూళి ధూసరిత దశదిశావకాశము - కాశాభాశ్మ వినిర్మిత ఘనాఘనమండలాభ్రం విహాదభ్ర విభ్రమ కృతౌసౌధ వినిర్గత ధూమపటలాంబుదవిలోకన కుతూహల నృత్యన్మయూర సముదయము- దయాసత్యశౌచ శుభగుణాస్పద విహితాచారానువర్తనపర బ్రాహ్మ క్షత్ర వైశ్య శూద్ర పంచజన విభాసితము - సితాచలమువలె శంకర సతీపద చిహ్న ప్రపూతము - పూతక్రతు ధనువువలె వివిధ వర్ణ మధు రము - సంశ్రిత కల్పవల్లి - నగరీమతల్లియగు మధురానగరము".

ఆ మధురానగరమునకు రాజగు ఉగ్రసేనునకు లోకకంటకుడగు పుత్రుడు, సత్స్వభావ సౌందర్యములుకల పుత్రిక జన్మించిరి. అతని పేరు కంసుడు. ఆమె పేరు దేవకి. దేవకిని శ్రీ దాసుగారిట్లు వర్ణించిరి:

"దేవకి సుగుణవతి, భూదేవత, సహనయుత, పూతచరిత, ఆతామ్ర పంకజ పదయుగళ, శీతాంశుముఖి, కంబుగళ, చిత్తజకరిణి, స్మితవిజిత చంద్రిక, రదనహాసితమల్లిక, తతచికురషట్పద, హైమతనువల్లిక, దర పంకేరుహనయన, చంచరీకచికుర, గిరిపయోధర, కపోలాధరితముకుర,

భక్తినిరత” ఆమె ప్రతిదినము సూర్యోదయమునకు ముందుగనే మేల్కొని స్నానముచేసి దేవతాపూజలు గావించును. ఎల్లప్పుడు సత్యమును హితమునే పలుకును. ఎల్లప్పుడు నవ్వుమోహముతో నుండును. బంధుజనమునందు దాక్షిణ్యమును వహించును. తల్లిదండ్రులను సేవించును. ఆమెను వసుదేవునకిచ్చి వివాహము కావించిరి. ఆ వసుదేవునిట్లు వర్ణించిరి :

“ఆతడు సంతత విష్ణుభక్తుడు – సన్నుత క్షత్రియ ముఖ్యుడు – సూనశరాకారుడు – ధీరుడు – దీనజనాధారుడు – దిగ్వ్యాపి దివ్యకీర్తి పూర్ణుడు – సత్యవాగ్ధురీణుడు – సమధీత సకలాగమ బృందము కలవాడు – నిత్యదాన పరితుష్ట విబుధుడు – నిఖిల సుగుణ కందుడు.”

ఆ నూతన దంపతులను రథారూఢులను గావించుకొని కంసుడు స్వయముగా రథచోదకుడై కొనిపోవుచు ఒక వనప్రదేశమున విశ్రమించు సమయమున, ఆకాశవాణి కంసునితో దేవకి కనిష్ఠ పుత్రుడు నిన్నుచంప గలవాడని చెప్పెను. వెంటనే కంసుడు క్రుద్ధుడై దేవకిని చంపబూనెను. అప్పుడు భయపడిన దేవకి ‘మదవ్యాఘ్ర సంగ్రస్త మృగివలె’ నున్నదట. చక్కని యుపమానమిది. మదించిన పులికి జిక్కిన లేడి యెంతభయ పడునో యూహించుకొనిన ఆ సమయమున దేవకికి కలిగిన భయము తెల్లమగును.

ఆమెను కాపాడుటకై వసుదేవుడు వారిరువురి నడుమకు వచ్చి కరుణారసానుకూలమయిన మాటలతో కంసుని ప్రార్థించెనట. ఎట్లనగా–

“నాకు జీవనాధారమైన నీ చెల్లిలిని చంపకుము. నీవు భోజకులమున కలంకారమైనవాడవు. భూతదయాపరుడవు. శూన్యమునుండి వెలువడిన వాక్యము నమ్మదగినది కాదు. అది భీరువులకు భ్రమను కలిగించునది. నీవు త్రిజగదీశ్వరుడవు. స్త్రీ హత్య తగదు. నీవు దయాళుడవు. కోపమును విడువుము. అఖిలబన్ధుతాపమును కలిగింపకుము. నీకు ఈమె ఒక్కతియే చెల్లెలు. నీయందు ప్రేమాతిశయముకలది. ఈమెకు సంతా

నము పుట్టగనే నీయధీనము చేయుదును. భయముతో వణకుచున్న ఈమెను కాపాడుము. నీవు గొప్పజ్ఞానివి. ఈ నీ బావ ప్రార్థన నాలించుము. నీ గొప్పతనమును ప్రకటించుము" అని పలువిధములుగా అతని మనస్సు కరగునట్లు ప్రార్థించెను.

ఈ వసుదేవుని మాటలు నిజముగ కరుణరసానుకూలముగా నున్నవి. కాని దానిని కవి స్వశబ్దవాచ్యము చేయరాదనునది యాలంకారిక సిద్ధాంతమయినను ఇచ్చట "కంస దేవకీమధ్య మాగత్య కరుణ రసాత్యనుకూలం శంసాపూర్వమసౌ వసుదేవః సమారభత వాగ్జాలమ్॥" అని శ్రీదాసుగారిచే వసుదేవునిమాటలు కరుణరసానుకూలములని చెప్పబడినది.

వసుదేవుని మాటలకు దయార్ద్రీకృతచిత్తుడయిన కంసుడు స్వాహంకారమునకు సిగ్గుపడుచునే దురంకారపూరితములగు పలుకులను పలుకుట యాతని రాక్షసప్రకృతిని వెల్లడిచేయుచున్నది. దానినిట్లు వర్ణించిరి:

"క్షమాధాం మామజ్ఞం ప్రకట దురహంకార విహితం
నజానే మూఢోఽహం నహి మనుజమాత్రః స్పృశతి మామ్।
హరిః క్వాస్యాః సూతిః క్వ, బత విపరీతా గగనగీః
అలంకుర్వీయాథాం రథవర మముం పుణ్యమిథున॥"

(అజ్ఞుడనై మీయెడల క్రోధమును ప్రకటించినందులకు నన్ను మన్నించుడు. నేను మూఢుడనయితిని. మనుజమాత్రుడు నన్ను స్పృశింపజాలడుగదా! హరి యెక్కడ? ఈమె సంతతి యెక్కడ? ఆహా! ఆకాశవాణి యెంత విపరీతముగ నున్నది! అనుచు దేవకీ వసుదేవులను రథారూఢులను గావించుకొని వెడలును. అంతలో సాయంకాలమయ్యెను. దానినిట్లు వర్ణించిరి:

"జపా పుష్పచ్ఛాయామయ మఖిల వస్తుషు కిరన్
ప్రతీచీ దిగ్భాగే విగళతి రవిర్మన్దకిరణః।

అహో సన్ధ్యావాతః ప్రసవ మధుగన్ధ ప్రసవితా
తనూతాపం హన్తి ప్రకటిత భుజంగోత్సవ కరః”

(సాయంకాలము అన్నివస్తువులయందు జపాపుష్పముయొక్క ఛాయను వెదజల్లుచు సూర్యుడు మన్దకిరణుడై పశ్చిమదిక్కున వాలిపోవుచున్నాడు. సంధ్యావాతము పుష్ప మధుగంధమును ప్రసరింపజేయుచు శరీరతాపమును హరించుచున్నది. భుజంగముల కుల్లాసమును కల్గించుచున్నవి.)

కొంతకాలమునకు దేవకి గర్భమును ధరించెను. అప్పుడామె స్థితి నిట్లు వర్ణించిరి :

“కృశాంగి - రతిప్రతికూల - పాండుకపోల - రాజిత చూచుక భృంగి - అలసగతి - మృత్సక్తమతి - సాయాస సుమన్దాలాప - స్రస్త కాంచీకలాప - వర్ధిత స్తననితంబ - రసనాచపల - కబరీవిపుల - రమ్య ముఖ చంద్రబింబ”

కంసుడామె గర్భమును ధరించినట్లు విని భయపడి దేవకీ వసుదేవులను కారాగార బంధితులను గావించెను. అది కిరాతుడు చిలుకలజంటను పంజరములో బంధించినట్లున్నదట.

దేవకి బిడ్డను కనెను. సత్యనిష్ఠుడగు వసుదేవుడా శిశువును కంసున కప్పగించెను. కంసు డతిక్రూరహృదయుడై యా శిశువును చంపుట కోతి పక్షిపిల్లను పట్టి చంపినట్లుగ నున్నదట.

ఈ సందర్భములో (శ్రీ) దాసుగారు అసురభూసుర లక్షణములను చక్కగ వివరించిరి. అకారణముగ భూతహింసను చేయువాడే అసురుడట. అపరాధిపై కోపముగలిగినను వానికి ఉపకారము చేయువాడే భూసురుడట.

“అకారణ భూతహింసాం చికీర్షతి యః సఏవాసురః।
ప్రకుపితోప్యపరాధిన ముపకరోతి యః సఏవ భూసురః”

దీనుడగువానిని జూచి కన్నీటిని గార్చనివానిని, పతివ్రతపై నిన్దమోపు వానిని, తల్లిదండ్రులు లేని బిడ్డను ప్రేమతో జూడనివానిని, యతులు గూడ దగ్గర జేరనీయరట. సులభమూల్యములు, ఆరోగ్యకరములును అగు ధాన్యాదులుండగా ఉదరపోషణార్థమై కొందరు అపరాధరహిత జంతువులను హింసింతురట.

ఈ విషయములన్నియు శ్రీ దాసుగారి హృదయమార్దవమునకు నిదర్శనములు కాగలవు.

దేవకికి బుట్టిన యేడుగురు బిడ్డలను కంసుడు సంహరించెను. క్రమముగా దేవకికి అష్టమగర్భ మేర్పడెను. కంసభటులు కావలియుండ గనే శ్రావణ బహుళాష్టమీ నిశీథసమయమున శ్రీకృష్ణుడు జన్మించెను. ఆతడు జన్మించునాటికి బృన్దావనప్రాన్తమంతయు పాడిపంటలతో నిండి యుండెనట. గో,గోపసంతతి వృద్ధిబొంది యుండెనట. శ్రీకృష్ణుడు శంఖ చక్రాది దైవచిహ్నములతో జన్మించగనే బ్రహ్మాదిదేవతలు బహువిధ ముల స్తుతింతురు దేవకీవసుదేవులుగూడ విష్ణుస్వరూపముతో విల సిల్లుచున్న యా శిశువునుగాంచి భక్తి పరవశులై స్తుతింతురు.

ఈ సందర్భమున విష్ణుస్తవరూపముగ నొక దండకము రచించబడి నది. అది దశావతార స్తోత్రములతో కూడియుండి భక్తులకు నిత్యపారా యణ యోగ్యమగునట్లుగ నొప్పియున్నది.

"జయ జయ సర్వలోకేశ ... ప్రభో కృష్ణ గోవిన్ద మాం పాహి తుభ్యం నమః"

అంతట శ్రీకృష్ణుడు కంసుని చంపి, దేవకీ వసుదేవులకు బంధ విముక్తిని కల్గించి, భూభారమును తొలగించునట్లు తెలిపి, యశోదకు జన్మించియున్న శిశువును దెచ్చి తన నా శిశువు స్థానమునందుంచుమని చెప్పి సామాన్య బాలునివలె మారిపోయెను. దేవకీవసుదేవులాతనికి మంగళమును బాడుదురు.

దేవకీ వసుదేవులు తమ బాలుని కారాగారమునుండి తప్పించుట యెట్లని చింతించుచు, ఆలస్యమయినచో కంసుడు ఇంతకుముందు జన్మించిన బిడ్డలను జంపినట్లుగనే యీతనిని గూడ జంపునేమో యని తలచి భయపడి యాబిడ్డను జూచుచు తమవంటి దీనులకేల జన్మించితివని విలపించిరట. ఇది దీనజన సహజమైన విలాపము చక్కని భావన.

''సుందర శ్యామల విగ్రహ ప్రియసుత కింజాతో మాదృగ్దీనతః ।
బన్దికాపి సంప్రత్యన్ధకారబంధురా దీప్యతే తే భానుతః ॥"

( సుందరమైన శ్యామలవర్ణ విగ్రహముగలవాడా! ఓ పుత్రుడా! మావంటి దీనులకేల జన్మించితివి? నీ కిరణములవలన అంధకారబంధురమైన ఈ కారాగారమే వెలుగొందుచున్నదిగదా! )

ఇంతలో హఠాత్తుగా కారాగృహద్వారములు విడివడగా వసుదేవుడు ఆ బాలు నెత్తుకొనిపోయి యశోదకడ నుంచి యచ్చటి శిశువును దెచ్చెను. అంతవరకు శ్రీమన్నారాయణుని మహిమవలన మధురా నగరమునందును నందవ్రజమునందును జనులందరు నిద్రాపరవశులై యుండిరట. యమునానది కృష్ణసందర్శనోత్సాహముతో పొంగి పొరలుచున్న దయినప్పటికిని దాటిపోవుట కనుకూల మార్గ మేర్పడినదట. పదునారు యోజనముల దూరము పోయివచ్చుట స్వప్నమునందువలె నిమిషమాత్రములో జరిగినట్లున్నదట.

పిమ్మట శిశుజననవృత్తాంతమును విని కంసుడు వచ్చి, దానిని చంపబోగా దేవకి పలికిన పలుకులామె బేలతనమునకు దగియున్నవి.

"అన్నా! ఈమె ఆడుబిడ్డ. మేనల్లుడుగాడు. నిర్దయుడవై యీమెను జంపకుము. స్త్రీహత్యకు పాల్పడకుము. ఇదియే నా చివరి సంతతి కావచ్చును. నీ వింతకుముందు ఏడుగురు పుత్రులను జంపినను మిక్కిలి దుఃఖమునొందికూడ నీయెడ సమ్మోదమునే వహించియున్నాను. వృథాకోపమును విడనాడి ఈ స్త్రీ శిశువును కాపాడి నన్నుఅవశ్యను గావించుము."

బలరామకృష్ణులు నందవ్రజములో క్రమక్రమముగా వయోను గుణమైన చేష్టితములతో, ఆటపాటలతో పెరుగుట ఇందు చక్కగా వర్ణింపబడినది. ఆ సందర్భములో గావించిన యొక కల్పన యతి మనో హరముగానున్నది :—

''తను సంలగ్న ధరణీపరాగ విభూత్యా, ఫాలాంచన్ముక్తా
లలామ బాల చంద్రలేఖయా, లలాట విలసత్కస్తూరీ
తిలక తృతీయ నేత్రేణ, గ్రీవాబద్ధేన్ద్రనీలమణీచ్ఛవినా,
హారవల్లీ ఫణిహారవల్ల్యాపి శివసారూప్య ముపయన్తౌ రేజతుః''

ఆ బాలుర శరీరము నందంటిన ధూళి విభూతివలె, నుదుట ముంగురులవద్ద ప్రేలాడుచున్న మౌక్తికము బాలచంద్రునివలె, కస్తూరీ తిలకము తృతీయ నేత్రమువలె, కంఠమునందు ధరించిన ముత్యాలహారములు సర్పములవలె, అందలి యింద్రనీలమాణిక్యకాంతి కంఠము నందలి కాలిమవలె నుండుటచే వారు శివ సారూప్యమును బొందినట్లు ప్రకాశించిరట.

అక్రూరుడు ధన్యురాగ సందర్శన వ్యాజముతో బలరామకృష్ణులను మధురకు గొనిపోవుచుండగా బృందావనమునందలి గోపికలందరును శ్రీకృష్ణుని విడచియుండ నొల్లక, యక్రూరుని క్రూరునిగా భావింతురట; ఇది యొక చక్కని కల్పన.

స్వస్మై హిత్వా క్రూరనామ చక్రిం దూరం నయత్యసౌ ।
యద్యక్రూరో న గచ్ఛేత్కిం త్యక్త్వాస్మత్ప్రియవల్లభమ్ ॥

అక్రూరుడు అపరిచితులైన పురస్త్రీలకు పురుషోత్తమ సాంగత్యమును కల్పించి, పల్లెపడుచులగు తమ్ము విరహాగ్నియందు పడవేయునేమో యని భయపడిరట. పట్టణమునందలి స్త్రీలు అందమయినవారు. వారి చూపులకు, సరసాలాపములకు నర్మభోగములకు మోసపోయి, కృష్ణుడు తమను విడచునేమో యని శంకించిరట.

ఈరీతిగ నేమేమో తలంచుకొనుచు గోపకన్యలు విలపించినరీతి యిట్లు వర్ణింపబడినది.

''బాలా వికీర్ణచికురా వివశాః కపోల
విన్యస్తహస్త కమలాస్త్రపయావిహీనాః
స్రస్తాంశుకాః పవన ధూతలతాభదేహ
అస్మానవాబ్జనయ నేత్యరుదన్నుగీతైః ॥

ఈ కల్పనలన్నియు సహజసుందరములై యున్నవి.

శ్రీకృష్ణుడు మధురానగర వీథులలో ప్రవేశించునప్పుడు ఆతని జూచు వేడుకతో పురస్త్రీలందరును ఒకరి నొకరు పిలిచికొనుచు సౌధోపరితలములకు చేరుదురు. ఆ సమయములో భోజనముచేయుచున్న వారు భోజనమును విడచి, నిద్రపోవువారు నిద్రను విడచి, అభ్యంజనము చేయుచున్నవారు స్నానమును పూర్తిచేయక, గురువునొద్ద విద్యాభ్యాసము చేయుచున్నవారు విద్యాభ్యాసమును మాని, గృహ కృత్యము లందు ప్రవర్తించియున్నవారు గృహకృత్యములను విడచి, యెవ్వరి చేతికందిన వస్త్రాదులను వారు ధరించుచునే పరుగెత్తుచు వచ్చిరట. అంతేకాదు తమభర్తలతోగూడి రమించుచున్న స్త్రీలుగూడ భర్తలను విడచి పరుగెత్తివచ్చిరట.

ఆవిధముగ వచ్చి కృష్ణుని జూచి వారు చెప్పుకొను మాట లెంత సహజముగా నున్నవో గమనించునది. "ఈ బాలుడేనా పాలు ద్రావి పూతనను జంపినవాడనికొందురు, ఈతడేనా తల్లికి వదనములో సర్వ ప్రపంచమును గనుపరచిన వాడనికొందురు, ఈతడేనా కూర్ర దైత్యుల మదమణగించిన వెన్నదొంగ యనికొందురు, ఈ కోటి మన్మథాకారుడేనా నంద కుమారుడనికొందురు పరస్పరము సంభాషించుకొనుచు కన్నులద్వారా యాతనిని లోనికాకర్షించుకొని తమ తమ హృదయములలో నిల్పుకొనిరట.

శ్రీకృష్ణుడు కంసుని జంపి దేవకీ వసుదేవులను కారాగార విముక్తులను గావించి పలికిన మాటలు సర్వుల కుపదేశప్రాయముగానున్నవి.

"జననీజనకౌ వృద్ధౌ, తనయాన్గురు విప్ర సాధు దారాదీన్
యశ్శక్తోఽపి నపోషతి, స ఏవ జీవన్మృతో మహీవలయే ॥

(వృద్ధులగు తల్లిదండ్రులను, తనయులను, గురువులను, విప్రులను, సాధువులను, భార్యను తన శక్తికొలది పోషింపనివాడు జీవించియు మరణించినవానితో సమానమే యగును.)

దేవర్షియగు నారదుడు శ్రీకృష్ణ మహిమను దెలియగోరి ద్వారకకు వచ్చినప్పుడు అచ్చట శ్రీకృష్ణపరమాత్ముని లీలలను గని యచ్చెరువంది యిట్లు పేర్కొనును.

"షోడశ సహస్ర కన్యాః, షోడశసాహస్ర విగ్రహైః స్తోషయసి ।
అష్టమహిషీభిరప్యా, శ్లిష్టో ఽస్యేక క్షణేఽప్యహో కృష్ణ ॥

శ్రీకృష్ణుడు పదునారువేల శరీరములను ధరించి పదునారువేల కన్యలను సంతోషపెట్టుచున్నాడట. అట్లే యేకకాలమునందే యెనమండుగురు పట్టపు రాణులతోగూడి యానందింపజేయుచున్నాడట.

ఇది యింతకు ముందు పరీక్షన్మహారాజు ప్రశ్న కొక దానికి శుకమహర్షి యొసంగిన సమాధానమునకు సమర్థకముగా నున్నది.

సర్వధర్మస్థాపనకొరకై భూమియందవతరించిన విష్ణువు పరనారీ రతుడగుట యెట్లు సమర్థనీయ మనునది యచ్చటి ప్రశ్న. దానికి శుకమహర్షి యొసంగినట్లు పేర్కొనబడిన సమాధాన సారమిది — సర్వభక్షకుడయిన యగ్నికి ఏ పదార్థము వలనను దోషము కలుగకుండునట్లే తేజోవంతులకు దేనివలనను దోషము కలుగదు. కాని యనీశ్వరుడు (సామాన్యుడు) చెడుపనిని జేసినచో నాతడు దుష్టుడగును. కావున అసామాన్యుల కృత్యములు సామాన్యులకు చేయశక్యముగాదు. గౌరీశ్వరుడు హాలాహలము మ్రింగెనని యితరులకు మ్రింగ శక్యము కాదు

గదా! అందుచే ఉత్తముల కృత్యములనుగాంచి యచ్చెరువందవలసినదే గాని యందలి దోషము లెన్నరాదు. మునీంద్రులు సయితము ఎవ్వని పాదపంకజపరాగ ధ్యానము వలన యోగనిరూఢిని బొంది యఖిల బంధములను విదలించుకొనగలుగుచున్నారో యట్టి భగవంతునకు సంసార బంధములు వర్తింపవని యెరుంగదగును. ఆతనికి గో, గోప గోపీ జనాది సర్వ జంతువులయందు స్వకీయభావముండుట సహజమే.

ఈ శుకమహర్షి సమాధానములో 'ఉత్తముల ఉపదేశములే ప్రమాణముగా గ్రహింపదగునుగాని వారి అసామాన్యకృత్యములను గురించి సామాన్యదృష్టితో తలంచుట, వాని ననుకరింపబూనుటయు తగదు' అను ధర్మసూక్ష్మముగూడ సూచించబడినట్లున్నది. ఈ విషయమునే "వేదోధర్మమూలమ్। తద్విదాంచస్మృతిశీలే దృష్టోధర్మవ్యతిక్రమః। సాహసంచమహతామ్। అవరదౌర్బల్యాత్" అను గౌతమ ధర్మ సూత్రములు విశదపరచుచున్నవి.

ఇవి నా స్వల్ప బుద్ధికి గోచరమయిన కొన్ని విశేషములు.

సహృదయుల హృదయ పరిపాకమునుబట్టి (శ్రీ) దాసుగారి రచనలో నెన్నియేని విశేషములను గ్రహింపనచ్చును. (శ్రీ) దాసుగారు సహజపాండితీధురీణులు. దానికితోడు విశేషమగు వ్యుత్పత్తిని గూడ సంపాదించినవారు. స్వతఃసిద్ధమగు సరసకవితాధారకలవారు. అసాధారణ ప్రతిభాసంపన్నులు - అను భావన వారి గ్రంథ పర్యాలోకనము చేసిన వారికి గలుగు ననుటలో నతిశయోక్తి లేదు.

# కాశీశతకమ్

శ్రీ సూర్యశ్రీ

౧

శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాసుగారు క్రీ. శ. 1914 వ సంవత్సరములో సతీసమేతముగా కాశీయాత్ర గావించుకొనిరి. అప్పుడు తామక్కడ దర్శించిన యనేక విషయములను, తమ యనుభూతి విశేషములనుగూర్చి సంస్కృతశ్లోకములతో నొక చక్కని శతకమును రచించిరి. అదియే 'కాశీశతకమ్.'

పెక్కురు యాత్రలు చేయుదురు. దివ్యక్షేత్రములను దర్శించువారు కొందరు. చారిత్రక స్థలములను దర్శించువారు కొందరు. సౌందర్య నిలయములను దర్శించువారు కొందరు. ఇంకను వేర్వేరు ప్రదేశములను, వేర్వేరుదేశములను దర్శించువారు కొందరు. అచ్చట తాము దర్శించిన విషయములను సన్నిహితులకు వర్ణించి చెప్పుటయు సాధారణముగా కనిపించు విషయమే. కొందరు గ్రంథములు కూడ వ్రాయవచ్చును. నేటి కాలమున యాత్రా గ్రంథములు (Travelogues) అనేకముగా కనబడుచున్నవి.

కవుల దృష్టికిని, తదితరుల దృష్టికిని మిక్కిలి భేదము కలదు; అట్లే కవులు చెప్పెడి రీతికిని, తదితరులు చెప్పెడి రీతికిని భేదమెంతో యుండును. ఈ దర్శన వర్ణన విశిష్టతయే కవులకు విశిష్టతను కల్పించును. ఇతరుల దృష్టి ప్రధానముగా వస్తువు నాశ్రయించుకొని యుండును; అంతరంగమును స్పృశింపలేదు. కవులదృష్టి ప్రధానముగా ఆత్మాశ్రయమై

యుండును; వస్తుతత్త్వ సందర్శన సముద్భూతమైన యనుభూతి నాలంబము గావించుకొనియుండును. కావుననే కవుల వర్ణనముచేత భావుకులు ప్రభావితులై తదనుభూతి సాక్షాత్కరణ సమర్థులు కాగలుగుచున్నారు.

శ్రీ నారాయణదాసుగారు శతకమునందలి చివరిశ్లోకమునందు తమ విషయము నిట్లు ప్రస్తావించిరి.

'వ్యరచీత్థం మయా కాశీ
శతకం నైజధీమతా
శ్రీనారాయణదాసేన
కవితా గానశాలినా'

నైజధీమంతుడు, కవితాగానశాలి యన్న రెండు విశేషణములను కవిశ్రీ యుపయోగించిరి. కేవలము గురువుల నాశ్రయించి, బహుగ్రంథ పఠనమువలన శ్రమించి, వ్యుత్పత్తిని సాధించుకొని యెట్లో కవిత్వము వ్రాసితి మనిపించుకొనుట నారాయణదాసుగారికి నచ్చని విషయము. ఈ విషయమును తమ యుమరుఖయ్యాము పీఠికయందు స్పష్టముగా చెప్పిరి. కవితాలత వనలతవలె స్వభావసుందరముగా నుండవలయు నన్నది వారి యభిలాష. తమ కలవడిన కవిత యట్టిది. తమ కలవడిన పాండిత్య సర్వస్వము సహజము; అకృత్రిమము. కావుననే, ఆయన నైజధీమంతుడు, సహజపాండిత్యధురీణుడు. ఇంక, ఆయన చెప్పుకొన్న రెండవలక్షణము కవితాగాన శాలిత్వము. "సంగీత మపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయమ్" అని యనుటచేత సరస్వతీ వాత్సల్యమును సమగ్రముగా చూరగొన్న వారికి మాత్రమే సంగీత సాహిత్య శాలిత్వము లభ్యము కాగలదు. తదన్యుని కాధన్యత లేదు. నారాయణదాసుగారు ఆపాత మధురమైన సంగీతమును, ఆలోచనామృతమైన సాహిత్యమును – రెండింటిని నిండుగా సంతరించుకొన్న సరస్వతీపుత్రులు. కావుననే ఆయన కవితలో సంగీతానుకూలమయిన వర్ణ పద సంయోజనము కానిపించును. భావరసానుగుణమైన అక్షర సమాకలనము శ్రవఃపేయమై సద్యఃపరనిర్వృతిని గలిగించును.

౨

ఈ శతకమునందు యౌగికార్థము మాత్రమే యంగీకారమైనట్లు సరిగా వంద శ్లోకములు మాత్రమే యున్నవి. ఈ శ్లోకము లన్నియు ననుష్టుప్పులే. సంస్కృత సాహిత్యమునందు 'అనుష్టుప్పు' మిక్కిలి విస్తృతముగా నుపయుక్తమైన ఛందము. అందువలననే 'శ్లోకము' అని యన్నప్పుడు రూఢినిబట్టి అనుష్టుప్పు మాత్రమే యుద్దిష్ట మగుచున్నది. వాల్మీకి నోట మొట్టమొదట వెలువడిన శ్లోకమే లౌకికచ్ఛందమునకు మూలకందము.

'మానిషాద ప్రతిష్ఠాం త్వ
మగమః శాశ్వతీస్సమాః
యత్క్రౌంచమిథునా దేక
మవధీః కామమోహితమ్'

ఇది యనుష్టుప్పు. నిజమునకు 'అనుష్టుప్పు' అన్నది ఎనిమిదక్షరముల పాదప్రమాణముగల యొక ఛందస్సు పేరు. ఇందు రెండువందల యేబదియారు సమవృత్తములు పుట్టును. విషమత్వము వలన ఆ సంఖ్యను మరింత పెంచవచ్చును. ఇన్నింటిలో నొక్కటిగా పరిగణ్యము కాదగిన శ్లోకము తన వ్యవహార సామర్థ్యమునుబట్టి 'అనుష్టుప్పు' అన్న ప్రసిద్ధిని గడించుకొన్నది. దానికి లక్షణకర్తల లక్షణమిది –

'శ్లోకే షష్ఠం గురు జ్ఞేయం
సర్వత్ర లఘు పంచమం
ద్వి చతుః పాదయో ర్హ్రస్వం
సప్తమం దీర్ఘ మన్యయోః'

శ్లోకమునందు ప్రతిపాదమున ఆరవ యక్షరము గురువు ; ఐదవ యక్షరము లఘువు. సరిపాదములందు ఏడవ యక్షరము లఘువు ; బేసి పాదములందు గురువు – ఇది నియమము. వాల్మీకి 'మానిషాద' శ్లోకమున నీనియమమున్నది. నారాయణదాసుగారు రచించిన పెక్కు

శ్లోకము లీ నియమమునే కలిగియున్నవి. కాని కొన్ని శ్లోకములందు ప్రకృత నియమమునకు భిన్నత కలిగినది. ఏడవ శ్లోకమునందలి మొదటి పాదము 'నానాభాషమాణాః' అని యున్నది. ఇచ్చట ఐదింట గురువును, ఆరింట లఘువును వెలసినవి. తొమ్మిదవ శ్లోకమునందలి మూడపాదము 'ఇతి సంతుష్ట మనసా' అని యున్నది. ఇచ్చట ఐదవ, ఆరవ, ఏడవ స్థానములందు లఘువులే నెలకొని యున్నవి. ఇరువదవ శ్లోకము నందలి మొదటి పాదము 'ఆస్తిక్యం విస్తారయితుమ్' అని యున్నది. ఇచ్చట ఐదవ యక్షరము గురువై, తరువాతి రెండక్షరములును లఘువులై యున్నవి.

లౌకిక దృష్టితో చూచినప్పుడు నియమము తప్పినట్లే యనిపించును. ఈ తప్పట బేసి పాదములందు మాత్రమే కానవచ్చును ; ఇదియు నైదవ యక్షరము మొదలుకొని యేడవ యక్షరము వరకు - అనగా మూడక్షరముల నాశ్రయించుకొన్నది. ఇచ్చటిది అనియతియే యైన యెడల, ఛందోభంగము జరిగెననియే యనవలసి యుండునుగదా ! పై మూడక్షరములు నటునిటు మారుట వలన ఎనిమిది గణము లేర్పడ వచ్చును. కాని, పైని చూపిన చోటులందు మూడు గణములే యుపయుక్తములైనవి ; లక్షణము ననుసరించి యొక గుణము ప్రయుక్త మగును - మొత్తము మీద నాలుగు గణములు మాత్రమే స్వీకృతములై, తక్కిన నాలుగును అప్రాకృతములైనవని చెప్పవచ్చును. దీనిని బట్టి వీనియందుసైత మొకరీతి యున్నదని, దానిని గుర్తింపవలసిన బాధ్యత మనపైనే యున్నదని తేలుచున్నది.

మొదటి వ్యత్యయము యగణమునకు బదులుగా రగణముండుట. భగవద్గీత యందలి 'ధృష్టకేతుశ్చేకితానః' (1 : 5) అన్న పాదము సరిగా ఇటువంటిదే. ఇక్కడ కూడ లఘువై యుండవలసిన యైదవ యక్షరము గురువై యున్నది. అందువలన తరువాతి రెండక్షరములతో కలిపికొని యిచ్చట రగణమున్నదని నిర్ణయింపవచ్చును. [నిజమునకు గణప్రసంగ

ముతో నిచ్చట పనిలేదు. సంప్రదాయ భిన్నమే యైనను, సౌకర్యము నపేక్షించి యట్లు చెప్పవలసి వచ్చుచున్నది.] రెండవ వ్యత్యయము యగణమునకు బదులుగా నగణముండుట. గీతయందలి 'నానాశస్త్ర ప్రహరణాః' (1 : 9) అన్న పాదము సరిగా ఇటువంటిదే. ఇక్కడ గురువులై యుండవలసిన ఆరవ యేడవ యక్షరములు లఘువులైనవి. అనగా యగణస్థానమును నగణము కైవసము చేసికొన్నదన్నమాట ! మూడవ వ్యత్యయము యగణమునకు బదులుగా భగణ ముండుట. గీతయందలి 'అవాచ్య వాదాంశ్చ బహూన్' (2 : 36) అన్నపాదము సరిగా ఇటువంటిదే. ఇక్కడ లఘువు కావలసిన యైదవయక్షరము గురువైనది ; గురువు కావలసిన యేడవ యక్షరము లఘువైనది. మొత్తము మీద యగణమును తొలగించి భగణము నిలద్రొక్కుకొన్నది. లక్షణకర్తల నియమమునుబట్టి వీనిని వ్యత్యయములని వాడుటజరిగినది. నిజమున కివి వ్యత్యయములుకావు. లక్షణము లౌకికచ్ఛందమునకు మాత్రమే చెల్లుచున్నది. ఆర్షచ్ఛందము ప్రకృతలక్షణాతిశాయియై యుండును. భగవద్గీతనుండి యుద్ధరించిన పైపాదములందులకు సాక్ష్యములు. కవి(శ్రీ) లక్షణకర్తల లక్షణమునుగాక లక్ష్యముల ననుసరించినట్లు దీనినిబట్టి స్పష్టముగా చెప్పవచ్చును. ఇది వారి నైజధీమత్త్వమునకు నిరూపకమై యున్నది. ఇంకొక సంగతి. ఛందోగ్రహణము ఆర్షసంప్రదాయము ననుసరించుట దాసుగారి ఆర్షసంప్రదాయాభిమానమును స్ఫురింపజేయుచున్నది.

## 3

ఈ వంద శ్లోకములలోను దాసుగారు పెక్కువిషయముల నుల్లేఖించి యున్నారు. స్థూలముగా వస్తువర్ణనమును మొట్టమొదట సంభావింతము.

జాహ్నవి యుత్తరముఖముగా ప్రవహించుచున్నది. వారణాసీయందలి సౌధపంక్తి అర్ధచంద్రాకృతి కలిగియున్నది. గంగాస్నాన

మును గావించువారికి సూర్యు డభిముఖముగా నుదయించును. మణికర్ణిక చుళుకప్రాయ మైనప్పటికిని అర్బుదముల కొలది తీర్థజనులను స్నానము చేయించుచున్నది. వారణాసి పంచక్రోశముల ప్రమాణము గలది- మొదలయిన విధముగా కాశీపట్టణ నైసర్గిక రూపాదికమును వర్ణించు విషయము సమృద్ధముగా నేయున్నది. కాశీశతకము నొక యాత్రాగ్రంథముగా నే పరిగణించినయెడల, ఈవిధమైన వర్ణనము ప్రప్రథాన మనకతప్పదు.

స్త్రీలు అవకుంఠనములను, పురుషు లుష్ణీషములను ధరింతురు. కాశి జలయంత్రములచేత నుపయోజితమైయున్నది. అచ్చటి అంతర్లీన ప్రణాళికలు గంగాజలమును తీసికొనివచ్చును. కాశియందు రాచబాటలు, పాఠశాలలు, విశాలములయిన తోటలు, దిగుడుబావులు, నానాశిల్పాకరములయిన గృహములుకలవు - మున్నగు వర్ణనము కాశియందలి జనుల యాచార వ్యవహారములను, నవీన సౌకర్యములను సమీక్షచేయును. అట్లే చింతచెట్లు, వెదురు పొదలు, గోధుమ పంటలు మున్నగునవికూడ వర్ణితములైవి. అచ్చటి కోతులు, పావురములు మున్నగునవికూడ ప్రసక్తములయినవి. నారికేళముల యభావముకూడ భావితమైనది.

ఉన్నయూరు విడిచి యింకొకయూరు వెళ్లుటయన్న, ఎన్నియో కష్టముల నెదుర్కొనవలసియుండును. ప్రయాణమధ్యమున నయ్యెడి శరీరాయాసము, ధననష్టము మొదలయినవి తప్పవు. ఐహికసౌఖ్యము కలుగనే కలుగదని యనవచ్చును. కాశియందు యాత్రికులకై కొన్ని సౌఖ్యములు గలవు. అనేకరాజులచేత అన్నసత్రము లనేకములు నెలకొల్పబడినవి. అచ్చట ద్రావిడ భూసురులకు మృష్టాన్నము పెట్టుదురు; దక్షిణలనుగూడ సమర్పింతురు. క్రొత్తవారు నగరసంచారమున కొంతశ్రమకు పాలుగాక తప్పదు. యాత్రికులు పద్మవ్యూహమువలె అల్లుకొనియున్న మార్గజాలమునందు పరిభ్రమించి, అతికష్టముమీాద స్వస్థానమునకు చేరుకొందురు. కాశియందలి దేశీయభాష రానియెడల యాత్రికులు ధైర్యమును గోల్పోక తప్పదు; ఎంతటి ధనవంతులైనను కోరిన వస్తువులను భాషాసాధనము నుపయోగించి కోరుకొనలేకపోవుటచేత దరిద్రులే యగుదురు.

కాశికా నగరము బహుముఖములుగా ప్రశస్తికెక్కినది. కవిశ్రీ తద్వైభవమును చక్కగా గుర్తించి, మంచి యభినివేశముతో కీర్తించిరి.

'సర్వక్షేత్రోత్తమా కాశీ
సర్వసంపత్సమన్వితా
ప్రత్యక్ష కైలాసపురీ
ముముక్షూణాం నికేతనమ్'

కాశి సర్వక్షేత్రములయం దుత్తమమైనది ; సర్వసంపత్సమన్విత మైనది ; ప్రత్యక్షముగానున్న కైలాసము ; మోక్షేచ్ఛగలవారికి నివాస స్థానము - అని భావము. కాశియందు సర్వదేవతలయందును విశ్వేశ్వరుడు విశిష్ట దైవతము. ఆయన మందిరము స్వర్ణగోపురము కలది ; త్రైలోక్య పూజితము. ప్రతి గృహమునందును లింగరూపమున విశ్వనాథుడు ప్రతిష్ఠనొందియున్నాడు. కాశికాపురమనగా ఒకేచోట సంచితమైన దేవతాభక్తి సర్వస్వము. స్నానపవిత్రులై పాదయాత్రికులైన తీర్థజనులు విశ్వేశ్వరాది దశదేవతాగణమును నిత్యము సేవించుచుందురు. కాశీపట్టణము నిత్యవిశ్వేశ్వరోపేతము ; నిత్య గంగా సమన్వితము ; నిత్యోత్సవ యుతము ; నిత్యానంద ప్రదాయకము. కాశియందు నాలుగు వర్ణముల ప్రజలును శిష్టాచారము నవలంబించి ప్రవర్తింతురు. అచ్చట మర్యాదారహితు డెవ్వడును కానరాడు. భారతవర్షమునందలి పట్టణములలో కాశికంటె నుత్తమమైనది కాని ప్రాచీనమైనది కాని మరొకటి లేదు. భగవంతుడగు కృష్ణుడే స్వయముగా సాందీపుని వలన నచ్చట విద్యాగ్రహణము చేసెననగా, ఇంక నచ్చటి విద్వాంసుల మహత్త్వమును వేరుగా చెప్పనేల? కాశియందలి సర్వవీథులును కల్పలతలే యగును; ఎక్కడెక్కడ నెవ్వరేది కోరినను వారి కది యక్కడక్కడనే లభించును.

కాశియందు శివరాత్రి దినము ప్రత్యేకముగా పరిగణింపదగినది. శివునకు మిక్కిలి ప్రీతిపాత్రమైనది శివరాత్రి. శివరాత్రి దినమున విశ్వ

నాథుని మహిమచేత జారచోరాదులు కూడ మహోత్తములై దివ్య భక్తి వశీకృతు లగుదురు. వారణాసి రాత్రింబగళ్ళు శివనామముచేత నినదించుచుండును; ఇంక శివరాత్రినాడు చెప్పవలసిన దేమున్నది? దుర్జనుడు కూడ సజ్జనుడే యగుచున్నాడు. ఆనాడు బాలవటువులు సంక్షీభావముతో అన్నపూర్ణాలయమున దేవిని స్తుతింతురు; వారిని చూచిన ప్రేక్షకులు ఆశ్చర్యచకితులగుదురు. శివాలయమున నభిషేక జల మన్నివైపుల జానుదఘ్నమై యుండును. తౌర్యత్రిక ప్రయోగముతో, పురాణ శ్రవణముతో శివరాత్రినాడు జనులెల్లరును జాగారము చేయుదురు.

కాశియందు ఫాల్గునమాసమున శుక్లపక్షమునందు హోలికోత్సవము జరుగును. ఆదినమున నెంతో యుత్కంఠతో, ఎంతో యనురాగముతో శ్రీకృష్ణ కీర్తనము చేయుదురు. నౌకలపై వెళ్ళి గంగయందు దీపములను విడిచివత్తురు; ఆదీపము లాకాశమునందలి నక్షత్రరాజిని నవ్వుచున్నట్లుండును. ఆనాడు సర్వవీథులందు నింధనములను సమకూర్చి మంటలు రగిలించి కామదహనోత్సవము చేయుదురు. పాడుచు, నవ్వుచు పరస్పరము నిందించుకొనుచు, కుంకుమ నొకరిపై నొకరు చల్లుకొనుచు, మూర్తీభవించిన యానందమువలె జనము సంచరింతురు.

వారణాసి సంకీర్ణ సంస్కృతి కాలవాలము. అనేక వేషములతో, అనేక మతములతో, అనేక భాషలతో నిండియున్నది. మ్లేచ్ఛులకాలమున వారణాసి దెబ్బతిన్నది; ఆంగ్లేయుల కాలమున తిరిగి చైతన్యము నొంది సౌఖ్యము ననుభవించుచున్నది. బౌద్ధమునుండి యహింసను, యవనులనుండి యవకుంఠమును, ఆంగ్లేయులనుండి లోకవిజ్ఞానమును వారణాసి గ్రహించియున్నది; స్వభావసిద్ధముగానే శ్రద్ధ యలవడినది. అనేక భాషా భాషమాణులు, అనేక వేష విరాజితులు, అనేక దేశాగతులు కాశియందు భక్తిపూర్వకముగా గంగాస్నానము చేయుదురు.

కాశియందు పౌరాణికులకు గౌరవము కలదు. వేర్వేరుఘట్టము లందు వేర్వేరు పండితులు కాలక్షేపము చేయుచుందురు. కంఠముల నుండి పుష్పమాలలు వ్రేలాడుచుండగా, శ్రోతలు పరివేష్టించియుండగా, ఉన్నతములైన యాసనములపై నాసీనులై పౌరాణికులు సాయంసమ యములందు కనుపించుచుందురు.

సాధారణముగా నిటువంటి పవిత్రస్థలములందు మాలిన్యముకూడ వీలుచూచుకొని ప్రవేశించుచుండును. ప్రపంచమే ద్వంద్వముల కూడలి గదా! మహాపండితుల కాలవాలము కాశీపురము; కాని పండితమ్మన్యులు వేషధారులు గూడ నక్కడ లేకపోలేదు. ప్రాతస్సాయం వేళలందు నానామతావలంబకులైన పండితమ్మన్యులు పరస్పరము వివాదములు గావించుకొనుచుందురు. గంగానది పవిత్రమైనదే; అందు తేలివచ్చెడి శవములు మాత్రము హేయములు భయంకరములు కాకతప్పవు. కాశి యందలి రేగుపండ్లు తియ్యనివే; కాశియందలి పట్టువస్త్రములు విలువైనవే; కాని అచ్చట నున్న వంచకులు మరెచ్చటను లేరనవచ్చును. స్వయముగా స్థాపించిన దేవతాప్రతిమ నాశ్రయించుకొని అర్చకులు కొందరు పొట్టపోసికొనుచుందురు. ఇది నిజముగా నయవంచనమే. ఈ సన్నివేశమున కుక్షింభరిత్వమునకే ప్రాధాన్యము; మోక్షప్రసంగము ముచ్చటకైనను లేదు. అయినను కవిశ్రీ 'స్వయం తీర్త్వా పరాం స్తార యతి' అన్న ఆధ్యాత్మిక వాక్యమును సున్నితముగా ఐహిక విషయమున కన్వయించి 'స్వయంతీర్ణ స్తారయతి స పరాన్దేవపూజకః' అని చెప్పి చమత్కరించుచున్నారు.

కాశియందలి వారస్త్రీలు కళానిపుణలు. ఒక వారస్త్రీ జఘన భాగమున హస్తమును విన్యసించి రాజహంసివలె నృత్యము చేయుచు, ప్రేక్షక జనమునకు మోహమును గలిగించుచున్నది. ఒక వారసుందరి ప్రాతఃకాలమున భైరవి నాలాపించుచు నృత్యముచేయుచు మోహనాస్త్రమై సభాసదులను మూర్ఛిల్ల జేయుచున్నది. వారస్త్రీలు సాయం

కాలములందు సౌధగవాక్షములందు కూర్చుండి, వీక్షాజాలములతో విటులను ఝషములవలె నాకర్షించుచుందురు.

ఇట్లు కవి(శ్రీ) మంచిచెడ్డలను రెండింటిని గుర్తించి, గ్రంథస్థము చేసియున్నారు. ఎటువంటి సత్కార్మమునకైనను దోషము లేశము స్పర్శ మాత్రముగానైన నుండకుండదు. అట్లే యిటువంటి బహుజనసంకీర్ణము లయిన స్థలములలో, అవాంఛనీయములు కొన్ని తలయెత్తుచుండును. అట్టివానిని గుర్తించుట యావశ్యకమే. అందువలననే యాత్రికుడు తానెంత జాగరూకుడై యుండవలయునో గుర్తింపగలుగును. యోగ్య మార్గమును నిర్ణయించుకొని ప్రవర్తింపగలుగును.

౪

ఇంతవరకును విషయమునే ప్రధానముగా గ్రహించి పరిశీలించితిమి. విషయము నావిష్కరించిన శైఖరినిగూర్చి, విన్యాసమునుగూర్చి యిప్పుడాలోచింతము. కవిత్వమని యన్నంతనే 'ఉక్తివైచిత్రి' తలపునకు వచ్చును. ఇది పెక్కువిధములుగా నుండవచ్చును. వానినన్నింటిని వింగడించుట కిది స్థలము కాదు. అలంకారము కూడ దానియందే యంతర్భవించు ననుకొనుట ప్రకృతమునకు చాలును. 'సౌందర్యమలంకారః' అని యనుటచేత, అలంకారములను కావ్యసౌందర్య సంపాదకములని యనవచ్చును. కాశీశతకము అలంకార భూయిష్ఠము; కవితాగుణ గరిష్ఠము. ఇందలి యలంకారముల నన్నింటిని గుర్తింపవలయునన్న గ్రంథవిస్తర మగును. కావున, ప్రధానములయిన కొన్నింటిని మాత్రమే పేర్కొందము.

'సంశ్రితాభీష్టదం దేవం
సచ్చిదానంద విగ్రహం
సమస్త భువనాధారం
కాశీ విశ్వేశ్వరం భజే'

సంశ్రితాభీష్టదుడు, సచ్చిదానంద విగ్రహుడు, సమస్తభువనాధారుడునైన కాశీవిశ్వేశ్వర దేవుని భజింతును-ఇది భావము. ఇక్కడ పరికరాలంకారము కలదు. ఇది గ్రంథారంభ శ్లోకము. నాటకమునందు నాంది యెట్టిదో యిదియట్టిది. ఇచ్చట కవి శ్రీ విశ్వేశ్వర దేవునికి వాడినవిశేషణములనుబట్టి, ఆయన కోరికను గ్రహింపవచ్చును. సచ్చిదానంద విగ్రహుడైన దేవుడు తన్ను సచ్చిదానందమయునిగా అనుగ్రహింప వలయునన్నదే భక్తుని యభిలాషము. అది యిట్లు విన్యస్తమైనది.

'శ్యామలత్వం శీతలత్వం
సాధుత్వం నామ విందతి
కృష్ణా చ్చంద్రధరా జ్జహ్నోః
క్రమాద్గంగా భగీరథాత్'

శ్యామలత్వము, శీతలత్వము, సాధుత్వము, నామము - అను నాలుగింటిని కృష్ణుడు, చంద్రధరుడు, జహ్నుమహర్షి, భగీరథుడు-అను నలుగుర నుండి గంగ గ్రహించెను - ఇది భావము. కృష్ణుడు శ్యామసుందరుడు; కావున నతనినుండి శ్యామలత్వము గ్రహించెను. చంద్రుడు శీతమయూఖుడు; కావున నే చంద్రధరుడైన శివునినుండి శీతలత్వమును గ్రహించెను. జహ్నువు సాధువు; కావున నతనినుండి సాధుత్వమును, భగీరథునివలన భాగీరథియన్న నామమును గంగ గ్రహించెను. ఇక్కడ యథాసంఖ్యాలంకారమున్నది.

'కాశ్యాం దేశీయభాషాయాం
సర్వదా భోజ్య వస్తుషు
మర్త్యవేషేషు సంగీతే
సర్వత్ర మధురో రసః'

కాశి యందలి దేశీయభాషయందు, భోజ్యవస్తువులయందు, మర్త్యవేషములందు, సంగీతమునందు, అన్నియెడలను మధుర రసమే - ఇది భావము. ఇక్కడిది తుల్యయోగితాలంకారము.

'ఆరోగ్య ప్రతికూలాపి
కాశీ సంసేవ్యతే సదా
ముముక్షుణాతి దుష్టోఽపి
భర్తేవోత్తమ భార్యయా'

అతిదుష్టుడైనప్పటికిని భర్త నుత్తమభార్య సేవించునట్లుగా, ఆరోగ్య ప్రతికూల మైనప్పటికిని కాశిని ముముక్షువు సేవించుచున్నాడు - ఇది భావము. కాశియం దారోగ్యవిధులు పాటింపబడుట యరుదు. అనేకవిధములయిన యశౌచములచేత, జనసమ్మర్దముచేత అంటురోగములు మున్నగువాని కచ్చట అవకాశ మధికముగా నుండును. ఈ వాస్తవమును వచించుట కవి యభిప్రాయము. కాని, దీని నిట్లే చెప్పిన శుష్కముగా నుండును. కావున, లోకరీతినుండి యొక సామ్యమును సంతరించి సన్నివేశమునకు సౌందర్యమును సంపాదించుట జరిగినది. నిజమునకిచ్చటి సామ్యము తన్మాత్రముననే పరిసమాప్తి నొందక, వ్యంగ్యముగా కర్తవ్య బోధకముగా పర్యవసించుచున్నది.

'యమునాప్రముఖా నద్యో
గంగాయాం సంప్రవేశనాత్
తస్యా నామైవాప్నువంతే
పత్యుర్గోత్రం యథాస్త్రియః'

గంగయందు యమునాది నదులు కలియుచున్నవి. అయినప్పటికిని, పతియొక్క గోత్రమునే స్త్రీలు పొందునట్లుగా, ఆ నదులుకూడ గంగా నామమునే పొందుచున్నవి. ఇది ఉపమాలంకారము. ఇచ్చట సైతము లోకరీతినుండియే సామ్యము గ్రహింపబడినది. పెండ్లియైన తర్వాత స్త్రీకి భర్తయిల్లే తనయిల్లగును ; భర్త గోత్రమే తనగోత్రమగును ; తన పుట్టింటిపేరు కాక భర్తయింటిపేరే తనయింటిపేరగును. ఇట్లే గంగానదిలో ఎన్ని నదులు కలిసినను, వానికన్నింటికి 'గంగ' యన్నపేరే చెల్లును ; అంతకుముందున్న పేళ్లు చెల్లవు. ఈ విధముగా నిచ్చట లోకరీతి, భారతీయధర్మము ప్రసక్తములైనవి.

'గభీరం నిర్మలం స్నిగ్ధం
మాపూర్ణం భాతి జాహ్నవీ
అసీ వరణయోర్మధ్యే
శిశిరే యోగిదృష్టివత్'

అసీవరణామధ్యమున జాహ్నవీనది గభీరముగా, నిర్మలముగా, స్నిగ్ధముగా, నిండుగా ప్రవహించుచున్నది. అది యోగదృష్టివలె నున్నది. యోగులు తమ దృష్టిని నాసికాగ్రముపై కేంద్రీకరించి యుందురు. అట్లు ఏకాగ్రచిత్తముతో నున్నప్పుడు వారి దృష్టియు మీాది లక్షణములను కలిగియుండును. 'శిశిరే' అన్న పదము దేహళీదత్త దీపికా న్యాయముగా ప్రయుక్తమైనది. శిశిరమునందలి జాహ్నవి శిశిర కాలమున యోగిదృష్టివలె నున్నదని భావము. ఇచ్చటనైతె ముపమాలంకారమే యున్నది.

'సౌధస్యాగ్రేఽరుంధతీవ
మధ్యే సౌదామినీ యథా
అధస్తాత్వాం చాలికేవ
కాశ్యాం భాతి కులాంగనా'

సౌధముయొక్క మీాది భాగమున అరుంధతివలెను, మధ్యభాగమున మెరపుదీగవలెను, క్రింది భాగమున రత్నపు బొమ్మవలెను కాశీ నగరము నందలి కులస్త్రీ కనిపించును. ఒక్కతెయేయైనను స్థానభేదము చేత వేర్వేరు వ్యక్తులతో నౌపమ్యమును బొందుచున్నట్లు కవిశ్రీ చమత్కరించినారు. ఇది యుపమాలంకారకోటిలోనిదే. రత్నపు బొమ్మ వలె నున్నదనుటచేత ఆమె సౌందర్యము, విద్యుల్లతవలె నున్నదని యనుటచేత ఆమె మేనికాంతి, అరుంధతివలె నున్నదని యనుటచేత ఆమె పాతివ్రత్యమహత్త్వము ప్రతీయమానము లగుచున్నవి. ఇదంతయు నిట్లుండగా, సౌధాగ్రము నక్షత్రలోకమునం దున్నదనియు, మధ్య భాగము మేఘావరణ ప్రదేశమునందున్నదనియు స్ఫురింపజేయుటచేత సౌధౌన్నత్యము చమత్కార సుందరముగా అభివ్యక్తమగుచున్నది.

'గంగాయాం ప్లవమానో న్ను
కుణపో భీషయన్ జనాన్
సంస్మారయతి జంతూనాం
ముహూరస్థిర జీవితమ్.'

గంగయందు తేలుచున్న నరకళేబరము జనమును భీతిల్లి జేయుచు, జీవుల యస్థిరజీవితమును స్మరింపజేయుచున్నది. శవమును చూచినప్పుడు 'జీవిత మెంత యనుభవించినప్పటికిని చివర కిట్లు కావలసినదే కదా! యన్న వైరాగ్యము కలుగుట సహజము. దీనినే శ్మశాన వైరాగ్యమని లోకము వ్యవహరించుచున్నది. నదియందు శవము తేలివచ్చుట యీ సత్యబోధమునకు హేతువగుచున్నది. ఇది నిదర్శనాలంకారము. శవదహనకార్యము కూడ వ్యాపారముగా మారుటచేత, ధనసంపాదనమే ప్రధానముగా నెంచుకొన్న శవదాహకులు సగముకాలిన శవములను గంగయందు త్రోసివేసెడి దురాచారము నిరాఘాటముగా కాశియందు సాగుచున్నది. ప్రకృత శ్లోకము దానిని స్ఫురింపజేయుచున్నది.

'మద్రూషైణైవ గంగాయాం
త్వత్కృతం స్నాన ముద్భవేత్
తారయేత్త్వాం భవాబ్ధేర్నౌ
ర్వదంతీవేతి రాజతే'

నావలననే గంగానదియందు మీ స్నానము సంపన్నమగుచున్నది; అదియే సంసార సముద్రమును తరింపజేయునని యన్నట్లు నౌక యొప్పుచున్నది. ఇదియు నిదర్శనమే.

'యాతాయాత జనాస్తీరే
శ్రేణీభూత పిపీలికాః
అసివరణ యోర్మధ్యే
జాహ్నవీ మణికర్ణికా'

వచ్చుచు వెళ్ళుచున్న యాత్రికులు తీరమున బారులుతీరియున్న పిపీలికలు; అసీవరణానదుల నడుమనున్న జాహ్నవి మణికర్ణిక. ఇచ్చట యాత్రి

కులకు పిపీలికలకు అభేదము చెప్పుటచేత రూపకము. మణికర్ణిక పద్మము నందలి దుద్దువంటిది. అందలి మధువు నాస్వాదించుటకై పిపీలికలు చేరు నట్లే మణికర్ణికాఘట్టమును యాత్రికులు చేరుచున్నారన్నది వ్యజ్యమాన మగుచున్నది. ఇచ్చట వీరికి భక్తిరసమనుభూయము.

'యేనకేనాప్యుపాయేన
బహ్వన్నం ప్రాప్నుయాదితి
పునస్సమ్ముషితం వస్త్రం
దదాత్యన్నాయ వానరః'

ఏదోయొక యుపాయముచే అధికముగా నన్నమును సంపాదింపవలయు నని పూర్వము దొంగిలించిన వస్త్రమును వానర మన్నముకొరకై యిచ్చుచున్నది. గుడ్డలయందు మూటకట్టిన యన్నమును దొంగిలించి, గుడ్డలను పారవేయుట కోతులు సాధారణముగా చేయుపని. కాని కవిశ్రీ తమయూహావైభవముచేత ఒక విశిష్టత నాపాదించుచున్నారు. దాని నుండి ఒక జీవిత కర్తవ్యమును గుర్తించుచున్నారు. దొంగిలించిన సొమ్మును దొంగలు బయటపెట్టరు. కోతి తాను దొంగిలించిన వస్త్ర మును తిరిగి యిచ్చివేయుచున్నది. అట్లిచ్చివేయుటవలన, యాత్రికులు దానిని విశ్వసించి ఆ వస్త్రమునందే యాహారమును మూటగట్టుకొనగా దానిని దొంగిలింపవచ్చునన్నది దాని యభిప్రాయము. ఇచ్చట ఉత్ప్రేక్ష యున్నది. ఇందలి మొదటిపాద మొక ప్రసిద్ధమైన యాభాణకమునుండి గ్రహింపబడినది. అది యిది-

"ఘటం భిద్యాత్పటం ఛిన్ద్యాత్
కుర్యాద్వా గార్దభస్వరం
యేనకేనాప్యుపాయేన
ప్రసిద్ధః పురుషో భవేత్"

ఇందలి తృతీయపాదముతో శ్లోకము నారంభించి, తైత్తిరీయోపనిష ద్వాక్యముతో ద్వితీయపాదము నమరించుట జరిగినది. అందు 'అన్నం

న నింద్యాత్ తద్వ్రతం, తస్మాద్యయా కయా చ విధయా బహ్వన్నం ప్రాప్నుయాత్' అని యున్నది. ఉపనిషద్వాక్యమును తీసికొనివచ్చి వానర ప్రసంగమున వాడుట యొక చమత్కారము. ఈ రెండు పాదములవలన ఉత్ప్రేక్షతోపాటుగా లోకోక్తికూడ ఉనికిని సంపాదించుకొన్నది.

"భుంక్తే యథేష్టం బలవాన్
భోగాన్ రుదతి దుర్బలే
శత్రూన్ జిత్వా వశామేత్య
బలీవర్దః ప్రగల్భతే"

దుర్బలు డేడ్చుచుండగా బలవంతుడు యథేష్టముగా భోగముల ననుభవించును. శత్రువులను జయించి తనకు వశపడిన గోవునుపొంది యెద్దు ప్రాగల్భ్యము వహించును. ఇచ్చట లోకరీతి సమీకృతమైనది. ఇతి దృష్టాంతాలంకారము.

"గంగా విశ్వేశ్వరౌ స్తోతు
మనన్తేన నశక్యతే
స్తూయేతే తౌ మయైవార్క
శ్ఛాద్యతే కిం నపాణినా"

గంగా విశ్వేశ్వరులను స్తుతించుట శేషునకును శక్యము కాదు. మరి, నా చేత వారు స్తుతింపబడుచున్నారు ; అరచేతితో అర్కుడు మూయబడుటలేదా ? – అని భావము. అర్కుని మూయుట శక్యము కాదు ; గంగా విశ్వేశ్వరులను స్తుతించుటయు శక్యము కాదు. కాని, అరచేయి అడ్డుపెట్టుకొని సూర్యతాపమును వారించుకొన్న తృప్తిని పొందవచ్చును. అట్లే కవి తన కవిత్వము వలన వారిని స్తుతించినట్లు తృప్తిని పొందవచ్చును. తులసీదాసు 'స్వాంతస్సుఖాయ' యని చెప్పినట్లు కవి స్వతృప్తి కొరకే కవిత్వము వ్రాయును. అదే భావము నీ దృష్టాంతము సరస సుందరముగా వ్యక్తము చేయుచున్నది. దీనివలన దాసుగారి వినయశీలము కూడ వెల్లడియగుచున్నది.

'సూత్రేణోత్క్షిప్త మాకాశే
వీక్ష్య శ్యేనః పతంగకం
ప్రహర్తుం తం ప్రయతతే
సహతే కః పరోన్నతిమ్'

దారముకట్టి యెగురవేసిన గాలిపటమునుచూచి, డేగ దానిని దెబ్బ కొట్టుటకై ప్రయత్నించుచున్నది. ఇతరుల యున్నతి నెవ్వడు సహించును? ఇచ్చట అర్థాంతరన్యాసమున్నది. కాశియందలి వినోదములలో గాలిపటముల నెగురవేయుట యొక్కటి యని తెలియుచున్నది.

ఇంతవరకు భిన్నభిన్నములయిన యలంకారముల యుపయోగ మును చూచితిమి. నారాయణదాసుగారి కత్యంత ప్రీతిపాత్రమైనది యుత్ప్రేక్షాలంకారమని యూహింపనగుచున్నది. పై యలంకారము లన్నియు నెంత సంఖ్యలో నున్నవో, అంతకంటె నెక్కువ సంఖ్యలో ఒక్క యుత్ప్రేక్షాలంకారమే యున్నది. దీనినిబట్టి దాసుగారిని 'ఉత్ప్రేక్షావల్లభు' డనియన్న ననవచ్చును.

'నౄః కైలాసం నయన్తీవ
యాతి జాహ్నవ్యుదఙ్ముఖమ్'

ఇచ్చట ఉత్ప్రేక్షాలంకారమున్నది. జాహ్నవి యుత్తర ముఖముగా ప్రవహించుచున్నది. కైలాస ముత్తరభాగముననే యున్నది. కావున మానవుల నుత్తరముననున్న కైలాసమునకు తీసికొనిపోవుటకై జాహ్నవి యుత్తరమునకు ప్రవహించుచున్నదట! భౌగోళికమైన వాస్తవము నాశ్రయముగా చేసికొని, కవి తన కల్పనా సాహాయ్యముచేత వస్తువున కొక యుదాత్తతను సముపాత్తము చేసిరి

'విశ్వేశ్వరాభిషేకాయ
సతి భాగీరథీ జలే
కాశ్యాం కో మాం వాంఛతీతి
నారికేలో న జాయతే'

విశ్వేశ్వరుని యభిషేకముకొరకు భాగీరథీ జలము లభించుచుండగా నన్నెవ్వడు కోరుననని కాశియందు కొబ్బరికాయ జనించుట లేదు. కాశి యందు నారికేళ వృక్షములు లేవు. కొన్ని స్థలములు కొన్ని పంటల కనుకూలముగా నుండును; కొన్నింటికి కనుకూలముగా నుండవు. ఇది వాతావరణమునుబట్టి భూసారమునుబట్టి నిర్ణయమగును. ఈ భౌతిక విష యమును గ్రహించి కవి తన భావనాబలముచేత నొక చమత్కారము చేయుచున్నారు. విలువ గలిగి మధురమైన గంగాజలము లభించెడిచోట, నారికేళమున కంతటి యుత్కృష్టగుణములు లేనందువలన పనికిరాక పోయెనని, అందువలన నది పుట్టుకయే లేదని కవిశ్రీ యుత్ప్రేక్ష.

కాశియందు మూడెడ్లు లాగెడి బండ్లు గలవు. ఆంధ్రదేశమున ఒంటెద్దు బండ్లును, రెండెడ్ల బండ్లును గలవు; కాని మూడెడ్ల బండ్లు కానరావు. కావున, అవి ఆంధ్రులయిన దాసుగారిదృష్టి నాకర్షించినవి. అపూర్వదృష్టము లాశ్చర్యకరములుకదా! అందువలన వానిగురించి ముచ్చటించుట యపేక్షితమైనది. ఉన్నది యున్నట్లే చెప్పిన నది వాస్త వము కావచ్చును గాని కవిత్వము కాజాలదు. దానిని సామాన్యస్థితినుండి తన కల్పనాభృతిచేత మాన్యమగుసముదాత్తస్థితికి తీసికొనివెళ్ళవలయును. ప్రపంచము సత్త్వరజస్తమోగుణాత్మకము. ప్రపంచము శకటమైనచో, ఈ మూడు గుణములును మూడెడ్లు కావలయు. ఆశ్లోకమిది.

'త్రిగుణై రేవ సంసార
చక్రం భ్రమతి తత్త్వతః
బ్రువన్నితి వా నడుద్భి
శ్శకటో గచ్ఛతి త్రిభిః'

ఈ కల్పనము నాధారము గావించుకొనుటవలన ఒక భౌతిక వాస్తవ మున కాధ్యాత్మికౌన్నత్యము లభించినది. ఇచ్చటిది యుత్ప్రేక్షాలంకా రము.

'భాషేతే హృదయౌన్నత్యం
వారణాసీ నివాసినాం

బిందు మాధవ దేవస్య
స్తంభా వంబర చుంబినౌ'

బిందుమాధవదేవుని యంబరచుంబి స్తంభములు రెండును వారణాసీ వాస్తవ్యుల హృదయౌన్నత్యమును ప్రకటించుచున్నవి. అచ్చటి స్తంభముల యౌన్నత్యమును 'అంబరచుంబినౌ'అన్న విశేషణము వెల్లడిచేయుచున్నది. ఇంక ఆ స్తంభములు కాశీవాసుల హృదయౌన్నత్యమునకు ప్రతీకములనుట కవి యూహాసామర్థ్యమునకు సాక్ష్యము. ఇది యుత్ప్రేక్షాలంకారము.

'దండపాణి భయం నాస్తి
మదంతిక నివాసినామ్
ఇతి బ్రువన్నివాత్రాస్తే
దండపాణి స్సదాశివః'

నా సమీపమున నివసించువారికి దండపాణియగు యమునివలన భయము లేదని చెప్పుచున్నట్లుగా సదాశివుడు దండపాణియై యిక్కడనున్నాడు. మార్కండేయ కథ పురాణప్రసిద్ధము. శివుడు కాలకాలుడు; కావున శివభక్తునికి యమభయము లేదు. కాశియందు దండపాణియైన సదాశివుడుండుట విశేషము. దానిని వెల్లడించుచు, కవి(శ్రీ) తన యూహాశక్తి చేత దాని నొక యలంకారముతో నలంకరించుచున్నారు. ఇది కూడ నుత్ప్రేక్షయే.

ఇట్లు ఉత్ప్రేక్షాలంకారము బహుస్థలములందు బహుధా ప్రయుక్తమైనది. అనంతుడు మేదినిని ధరించినట్లు వారణాసిని నేను ధరింతునని చెప్పుచున్నట్లుగా 'కాశి' యనుపేర నొక దేవత గలదు. ఈ భావము గల శ్లోకమిది-

'దధామ్యహం వారణాసీ
మనంత ఇవ మేదినీమ్
ఇతి బ్రువంతీవ కాశీ
నామ్నాస్తే కాపి దేవతా'

ఇచ్చట ఉపమాలంకార ముత్ప్రేక్షతో చేతులు కలిపినది. దీని నిట్లుంతము. ఇచ్చట కవిశ్రీ యింకొక చమత్కారమయిన యూహను పోహళించుట జరిగినది. భూమికున్న యనేక పర్యాయపదములలో 'అనంత' యన్నది యొకటి. ఈ యనంతను శేషుడు మోయుచున్నాడు. నన్నయగారి "బహువన పాదపాబ్ధి ... దుష్కృతాంతకు డనంతుఁడు మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్" అన్న పద్యమునందు శేషుడనుటకు అనంతుడనియే ప్రయుక్తమైనది. 'అనంత'ను మోయుటచేత శేషునకు 'అనంత' నామము కలిగెనా? దీని కాకరము కానరాదు. కవి యూహయే దీని కాకరము కానోపును. దీని నాశ్రయము చేసికొని కవి కల్పనము సాగినది. కాశియందలి యొక దేవత పేరు 'కాశి'. ఆమె కా పేరెట్లు కలిగెను? కాశీధారణ మామె కర్తవ్యము. అనంతను ధరించుట వలన అనంతనామము ప్రాప్తించినట్లే కాశిని ధరించుటవలన కాశీ నామము ప్రాప్తించెనని కవిశ్రీ నిశ్చయము. దీనినే యుత్ప్రేక్షావైభవముతో నుటంకించుట జరిగినది.

ఇట్లే చక్కని సూక్తులు, పదబంధములు, కల్పనలు సహృదయ హృదయరంజకములై గ్రంథమునం దెల్లెడల సాక్షాత్కరించుచున్నవి. అసూర్యం పశ్యో మహాజనః, సదా కల్పలతాయన్తే కాశ్యామఖిల వీథయః, నాదత్త ముపతిష్ఠతి, దుర్జనః సజ్జనాయతే, సహతే కః పరోన్నతిమ్— మున్నగునవి యుదాహరణములు.

౨

మమ్మటాచార్యులు కావ్యప్రయోజనముల నారింటిని పేర్కొనిరి. అందు చిట్టచివరిదైనను, ప్రాధాన్యమునుబట్టి మొట్టమొదటిది. 'కాంతాసమ్మితతయోపదేశయుజే' అన్నది. కాంతాసమ్మితముగా నుపదేశించుట కావ్యప్రయోజనములలో ప్రధానము. ఉపదేశమే లేనియెడల 'విశ్వశ్రేయః కావ్యమ్' అని యనుటయే పొసగదు. కావున

తత్త్వము లేనిదే కవిత్వము లేదని నిర్ణయించుకొనవచ్చును. ఆ తత్త్వముదాత్తమై, విశ్వశ్రేయస్సునకు సహకరించునది కావలయును. అప్పుడే కావ్యము చతుర్విధపురుషార్థ సాధకమై, కవికి కీర్తిని, పాఠకునకు ప్రీతిని సంపాదించిపెట్టును.

మానవుడు ప్రధానముగా మూడింద్రియముల నాధారము చేసికొని లోకయాత్రసాగించును. అవి బుద్ధి, హృదయము, హస్తము. ఆంగ్లమునందు వీనినే Head, Heart, Hand అని చెప్పుదురు. ఈ మాటలన్నియు 'H' అను వర్ణముతోనే ప్రారంభమగుచున్నవి. ఈ మూడు 'హె' చ్చుల వలననే లోకయాత్ర సాగుచున్నదన్నమాట! ఈ మూడింటివలన జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి అన్నవి యుత్పన్నము లగుచున్నవి. ఏదైన నొక విషయమునుగూర్చి తెలిసికొనుట (జానాతి), దానిని సాధింపవలయునని కోరుకొనుట (ఇచ్ఛతి), దానిని సాధించుటకై ప్రయత్నించుట (కరోతి) – ఈ మూడు నొక క్రమమున వ్యవహరించును; పరస్పర సహకారకములై వ్యవహరించును. ఒక్కొక్కప్పుడు తత్తత్కార్యమునుబట్టి ఒకొక్కశక్తికి ప్రాధాన్యము లభింపవచ్చును. అప్పుడు తక్కిన రెండును ప్రక్కకు తప్పుకొని, యుపాంగములై తమ యునికిని నిలబెట్టుకొనును.

ఇవి యిహలోక యాత్రయందే కాక పరలోక యాత్రయందు కూడ మోక్షసాధనములుగా ఆవశ్యకములై యున్నవి. భారతీయ తాత్త్విక పరిభాష ననుసరించి జ్ఞానమార్గము, భక్తిమార్గము, కర్మమార్గము – అని వీనిని పరిగణింతురు. జ్ఞానమార్గము చాలవరకు సైద్ధాంతికమే. అది యాదర్శమే కాని యందుబాటులోనికి వచ్చునదికాదు. కర్మమార్గము బహువ్యయప్రయాసలతో కూడినది. భక్తిమార్గము సర్వజన సులభము. వివేకచూడామణియందు శంకరాచార్యులవారు "మోక్షకారణసామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ" అని చెప్పిరి. మోక్ష

మును సాధించు మార్గమునందు భక్తియే గొప్పది. కావుననే, యే మార్గమునందు ప్రవర్తించువారైనను భక్తిని విడువరు.

'స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే' అని శంకరాచార్యులవారి నిర్వచనము. ఆత్మానుసంధానము చేయుటమే భక్తి. అనగా ఆత్మను పరమాత్మతో ఐక్యానుసంధానము చేయుటకే భక్తి యనిపేరు. ఇది సాధనమువలన సమకూరవలసినదే. నారాయణదాసుగారు శతకమునందు సముచితస్థానమున నీ విషయము నిట్లు నిక్షేపించిరి.

"దిష్ట్యా శ్రద్ధా మానుషేషు
కేష్వేవ పరిదృశ్యతే
తస్యా నవవిధా భక్తి
మార్గా అవయవీకృతాః'

మనుష్యులయం దేకొందరలోనో అదృష్టవశమున శ్రద్ధ కనిపించుచున్నది. దానికి తొమ్మిది విధములయిన భక్తిమార్గము లంగములై యున్నవి. భాగవతమునందు నవవిధ భక్తిమార్గములు-

'శ్రవణం। కీర్తనం। విష్ణోః
స్మరణం। పాదసేవనమ్।
అర్చనం। వందనం। దాస్యం
సఖ్య। మాత్మనివేదనమ్.'

అని వరుసగా పేర్కొనబడినవి. శ్రవణకీర్తనాదులతో మొదలిడి యాత్మనివేదనమువరకు భక్తుడు సాధనచేసినప్పుడు ఐక్యానుసంధానము సిద్ధించును. శ్రవణకీర్తన స్మరణాదులకు వాఙ్మయ ముత్తమ పరికరము. ఒక్క కవిత్వముచేతనే వీని నన్నింటి నధిగమింపవచ్చును. నీలకంఠదీక్షితులవారు "సిద్ధః కవీనాం కవితైవ యోగః" అని చెప్పిరి. కవులకు కవిత్వమే సిద్ధమగు యోగము. అట్లే కవితాపాఠకుడును సహృదయుడై తదైక్యానుసంధానమున సిద్ధి నొందవచ్చును. ఇట్లు కవిత్వము సాధనమార్గములకు సహకార సన్నివిష్ట సాధనమగుచున్నది.

లోకమున నందరును స్వయంసిద్ధులు కాలేరు. కొందరకు విష యావగాహన సామర్థ్యము స్వతస్సిద్ధముగానే యుండును; కొందరకు సన్నిహితుల సాహాయ్యమువలన తత్సామర్థ్యము సంక్రమించును. 'సంగతి స్సజ్జనై స్సహ' అని యనుట యిందులకే కదా! సజ్జనులతోడి సాంగ త్యమువలన, సజ్జనులతోడి సంభాషణమువలన నెన్నియో లాభములు కలవు. కాని, యెల్లరకు నా సౌకర్యము కలుగదు; అట్టియెడల పుస్త కములే ఆప్తోపదేశ సాధనములు కాక తప్పదు. అందువలననే కవిశ్రీ యిట్లు చెప్పిరి-

'కాచిచ్ఛిలా దేవతేతి
కశ్చిద్రాజేతి మానవః
జ్ఞాతుం వినాప్తోపదేశం
స్వయం శక్తః కథం భవేత్'

ఒకానొక శిలను దేవతయని, ఒకానొక మానవుని రాజని తెలిసికొను టకు ఆప్తోపదేశ మవసరము. తెలిసినవాడు తెలియనివానికి తెలియజెప్ప వలయును. ఇట్లు జ్ఞానము పరంపరాయాతమై యుండును. గ్రంథములు సుమార్గస్థులకు సైతము సుష్ఠుగా జ్ఞానప్రబోధము చేయగలుగును. కావున గ్రంథోపదేశ మాప్తోపదేశమే.

'తీర్థముల విశిష్టత యేమి? భగవంతుడు సర్వవ్యాపకుడు కదా!' అని ప్రశ్నించువారు కొందరు గలరు. వారికి సమాధాన మిది -

'ఆస్తిక్యం విస్తారయితుం
తేన పాలయితుం జనాన్
ధర్మార్థ మీశమహిమా
తీర్థేష్వేత్థం ప్రదృశ్యతే'

ఆస్తిక్యమును విస్తరింపజేయుటకు, దానితో జనములను పాలించుటకు, ధర్మమును నిలబెట్టుటకు తీర్థములందు భగవంతుని మహిమ యీ విధ

ముగా ప్రత్యక్షమగును. ఎవనికి వాడు భక్తిసంపన్నుడై యున్నప్పటికిని తీర్థములు సేవనీయములే. తీర్థములవలననే ధర్మప్రతిష్ఠ జరుగును ; తీర్థముల వలననే ఆస్తిక్యబుద్ధి విస్తరించును; తీర్థములవలననే జనసముదాయమందు భగవత్సంబంధమైన యేకాత్మికత కలుగును. ఇట్టియెడల నెన్నో సన్నివేశములు హృదయమును స్పందింపజేసి, ప్రగాఢ విశ్వాసము నందింపజేయును.

భక్త్యావేశముతో కవిశ్రీ హృదయోద్గారము గావించు వైఖరి తద్భావభావుకులకు రోమాంచము నొదవింపజేయు ననుటలో నించుకయు సందియము లేదు.

'నిత్య విశ్వేశ్వరోపేతా
నిత్య గంగా సమన్వితా
నిత్యోత్సవయుతా కాశీ
నిత్యానంద ప్రదాయినీ'

అనిత్యమగు లోకమున నిత్యత్వస్ఫూర్తిని గలిగించుటకేమో నిత్యశబ్దమును పునః పునరావృత్తము చేసి వాడుట ! దీనివలన శ్రవఃపేయత, ఒక ధారావాహికత, ఒకానొక యావేశము కలుగుచున్నవి.

'కాశీం ముక్తిస్థానమితి
చాతుర్వర్ణ్యం ప్రసేవతే
తద్వర్ణనేనైవ కవిః
కృతీ భవతి నాన్యథా'

ముక్తిస్థాన మన్న నిశ్చయముతో జనులెల్లరును కాశిని సేవింతురు. అటువంటి కాశిని వర్ణించినప్పుడే కవియు ధన్యుడగును ; మరొకమార్గమున అట్టి ధన్యత కలుగదు. పునర్భవము లేకుండుటయే కవి యాకాంక్ష ; అదియే మోక్షము ; అదియే ఆయన యపేక్షించిన ధన్యత.

ఇతరులు తమ సాధనవలన తాము సిద్ధిపొందవచ్చును. కవి తన కవిత్వమువలన తనకే కాక, తన పాఠకులకును సిద్ధిని చేకూర్చును. స్వస్పంద సుందరమైన మార్గమున కాశీశతకమును రచించి తాము ధన్యులగుటయే కాక, సద్యః పరనిర్వృతి సంపాదకత్వముచేత మధుర మంజుల మంగళోపదేశముచేత సహృదయ పాఠకులకు ధన్యతను చేకూర్చినవారు ఆదిభట్ల నారాయణదాసుగారు.



# శ్రీ రామచంద్ర శతకమ్

భాషాప్రవీణ జన్నాభట్ల వీరేశ్వరశాస్త్రి M.A.,

శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాస మహాశయుడు జగమెఱిగిన పండితుడు. అపారప్రతిభా సముద్దీపితుడు. హరికథాపితామహుడు. సహజపాండిత్య సంశోభితుడు. సంస్కృతాంధ్రాది భాషలలో నాశువుగా నలవోకగా రసధునియగు కవిత నల్లగల ప్రజ్ఞాశాలి. ఆదిశంకరుల అద్వైత వేదాంత సారము నంతర్లీన మొనర్చుకొన్న మనీషి. మందారమకరంద మాధుర్యధుర్యమగు కవితానిర్మాణ కర్మఠుడగు బమ్మెరపోతనామాత్యుని శ్రీరామభక్తికి పునారూపము. నిధికన్న రాముని సన్నిధి చాలసుఖమన్న నాదబ్రహ్మయగు త్యాగయ్యగారి సంగీత ప్రౌఢిమకు కాణాచి. ఇంతకుముందు తరములో వీరి సమున్నత విగ్రహమును గాంచి హరికథా గాన మరందపాన మత్తచిత్తులై ధన్యులైనవారు పలువురు ఈనాటికిని వీరి ప్రతిభావిశేషములను కథలనుగా జెప్పుచుండుట వినుచుందుము.

సుధామాధురీ ధురీణమైన ఈసుధీమణి కవితాగంగానది పాఠకుల కిహపరదాయిని. ప్రతిభావ్యుత్పత్త్యభ్యాస ప్రశస్తయగు నీయన కవితా కామిని కాంతయై గీర్వాణవాణిలో నజరామరయై యున్నది. కావ్యములు శతకములు హరికథలు మున్నగు ప్రక్రియావైవిధ్యము గల అనేక గ్రంథముల నీయన సంస్కృతభాషలో రచించెను.

సంస్కృతభాషలో శతకనిర్మాణ సంప్రదాయము ప్రాచీనము. మంత్రజపము నష్టోత్తరశతము జేయుట, పూజాద్యుల నాయాదేవతల

అష్టోత్తరశతనామోపయోగము మున్నగునవి శతకరచనమునకు మూలములని విజ్ఞుల భావన. సంస్కృత వాఙ్మయమున మహాభారతాదులందును ఇతర పురాణములలోను అష్టోత్తరశతములు సహస్రనామ స్తోత్రములు, దశశ్లోకులు, అష్టకములు మున్నగు స్తుతిప్రక్రియలు కలవు. వీనిలో పరమేశ్వరుని లీలావిలాసములు, మహాత్త్వములు మొదలగు ననంత విషయములుండును.

ఇతివృత్తము లేకుండుట, ఏకవృత్తమును పాటించుట, మకుటము నిర్వహించుట, ఆలంకారిక రచన మున్నగు లక్షణముల నాంధ్ర కవులు శతకనిర్మాణమున ననుసరించిరి. శతకములలో భక్తి, నీతి, శృంగారము మున్నగు విషయముల నేదోయొకటి ప్రధానమై విరాజిల్లును. సంస్కృతమున భర్తృహరి రచించిన సుభాషితత్రిశతి నీతి శృంగార వైరాగ్యములను మూడు శతకములు గలది. ప్రతిశతకమున పది పద్ధతు లుండును. ఇందు శతక లక్షణములు కొన్నిమాత్రము కలవు.

శ్రీనారాయణదాసుగారు రచించిన శ్రీరామచంద్రశతకము ఆంధ్రభాషలోని శతకలక్షణములకు లక్ష్యము. ఇయ్యది భక్తి జ్ఞాన వైరాగ్యముల త్రివేణీసంగమము. "రామచంద్ర" అను మకుటము పాటింపబడినది. భుజంగప్రయాతవృత్తములో ఈరచన సాగినది.

భుజంగప్రయాతం భవే ద్యై శ్చతుర్భిః :

—వృత్తరత్నాకరము.

భుజంగప్రయాతవృత్తమునకు నాల్గు పాదము లుండుట ప్రతిపాదమునందును నాలుగు యగణము లుండుట, పాదాంతమున యతి అనునవి లక్షణములు. ఇందలి లయహొయలు సర్పగమనమును జ్ఞప్తికి దెచ్చును. ఆది లఘువగు యగణము దీని కుపకారి. లఘ్వక్షరములవద్ద కుంటువడుచు గుర్వక్షరములతో సాగుచుండుట ఇందలి విశేషము.

భుజంగప్రయాతవృత్తము మూలాధారచక్రమునుండి బయలుదేరి ఆజ్ఞాచక్రమును జేరు కుండలినీశక్తిని వ్యంజించును. శ్రీమన్నారాయణుడు పన్నగశాయి. ఆయన అవతారము శ్రీరామచంద్రుడు. కావుననే ప్రస్తుతశతకమున నీవృత్తము సమర్థ్యముగా స్వీకృతము. మనస్సు చంచలమై ముందువెనుకలకు బోవుచు నరుదుగా నిశ్చయాత్మకస్థితిని బొందును. ఇది సహజముగా వక్రగామిగాని ఋజుగామి కాదు. భావవ్యక్తీకరణమున సక్రమ పద్ధతికి దూరమైన ఈ లక్ష్యమున వృత్త లక్షణము సమన్వయించుచున్నది. శ్రీ దాసుగారు ప్రాచీన గీర్వాణ స్తోత్రరచయితల మార్గానుసారమున అల్పాక్షరము, సారవంతము, సులభము, శ్రవణ సుభగము, లయహొయలు గల యీ వృత్తమును గ్రహించుటలో నెంతయు వైశిష్ట్యమును వ్యక్తీకరించిరి.

శ్రీ నారాయణదాసుగారు శ్రీరామభక్తులు. హరికథా గానామృతముచేత నీయన భక్తిలత మూడుపూవు లారుకాయలుగా విలసిల్లినది. ఈ శతకమునకు మూలాధారము భక్తి. ఉపనిషత్ప్రతిపాదితములు బాదరాయణ పరిపోషితములు శ్రీ శంకరభగవత్పాదులచే సుప్రతిష్ఠములగు నద్వైతవేదాంత పరమరహస్యములు సమీచీనముగా నిందు వ్యక్తీకృతములు. "సర్వేషాం వేదాన్తవాక్యానా మద్వితీయే పరబ్రహ్మణి తాత్పర్యమ్" అని ప్రాచీను లన్నట్లు సర్వలక్షణములకు నేకైక లక్ష్యమగు పరబ్రహ్మ తత్త్వము శ్రీరామచంద్రమూర్తియే యని ఈయన తాత్పర్యము. దీనికి మూలము సుప్రసిద్ధమగు నధ్యాత్మరామాయణము. హరికథా సుధారసము నందఱకి పంచియిచ్చు శ్రీ దాసుగారికి అధ్యాత్మరామాయణ మంతరంగ మైయుండును. ఇట్లే భక్తివిషయ ప్రతిపాదనమున శాండిల్యభక్తిసూత్రములు కవిమనమును స్ఫూర్తిమంతమును జేసినవి.

ఇందలి శ్లోకము లన్నియు నర్థగంభీరములు, సరసరచనా సంశోభితములు, కవిహృదయ వ్యక్తీకరణ సమర్థములు. కావున దిఙ్మాత్రముగా కొన్నింటిని పరిశీలింతము.

ఖసీమేవ కించిజ్ఞతా వంచతేమాం
జరావిద్ధ సర్వేంద్రియాణి ద్విషన్తి।
న మే రోచతే నశ్వరం వస్తు ప్రాగ్వత్
ప్రసీద ప్రసీద ప్రభో రామచంద్ర॥ 10

రామచంద్రప్రభూ! అల్పజ్ఞత ఆకాశాంచలము వలె నన్ను వంచించుచున్నది. జరాక్రాంతములై సర్వేంద్రియములు ద్వేషించుచున్నవి. పూర్వమువలె నశాశ్వతవస్తువు ప్రీతిజనకము కాదు. అనుగ్రహింపుము.

సమారబ్ధ వార్ధక్య దౌర్బల్య యోగా -
దలభ్యార్థ భోగాతి తీవ్రానురాగాత్ ।
విధి ప్రాతికూల్యా ద్భృశం పీడ్యమానం
కృపావారిధే! పాహిమాం రామచంద్ర॥ 11

కృపాసముద్రా! శ్రీరామచంద్రా! సమారబ్ధమైన వార్ధక్యము వలన గలిగిన దౌర్బల్యమువలన, అలభ్యములైన విషయములను అనుభవింపవలెనను తీవ్రకాంక్షవలనను, విధిప్రాతికూల్యము వలనను మిక్కిలి పీడితుడు నగు నన్ను రక్షింపుము. ఈ శ్లోకములలో వార్ధక్యప్రస్తావన యుండుటచే ప్రస్తుత శతకమును శ్రీ దాసుగారు జీవితోత్తరార్ధమున రచించినట్లు తెలియును.

అహం సర్వదా న్యాంగనా సక్తదృష్టిః
నమే విద్యతేఽర్థార్జనే కాపి తుష్టిః।
మమాతీవ సద్వంచనాయాం ప్రహృష్టిః
ఖలో మత్పరః కః ప్రభో రామచంద్ర॥ 9

రామచంద్రప్రభూ! నే నెల్లప్పుడును అన్యస్త్రీసక్త దృష్టి గలవాడను. ధనసంపాదనమున నేమాత్రము సంతృప్తిలేదు. సజ్జనులను వంచించుట నాకు పరమానందకరము. నాకన్న ఖలు డెవ్వడు?

క్వచి ద్రాగవిద్వేష సంతాపయుక్తం
క్వచి ద్ద్యూతపానాంగనా భోగసక్తమ్ ।
క్వచి ద్దేహమాత్సర్య గర్వానురక్తం
బధాన త్వయీదం మనో రామచన్ద్ర ॥ 7

శ్రీరామచంద్రా ! ఒకపరి నామనస్సు విద్వేషసంతాపయుక్తము. మఱియొకతడవ జూదము, పానము, స్త్రీభోగము నందాసక్తము. ఇంకొకచో దైహికమగు మాత్సర్యము గర్వములం దనురక్తము. ఈ విధముగా చంచలమగు దీనిని నీ పాదములందు బంధింపుము.

పై శ్లోకములు దాసుగారి వైరాగ్యమును వ్యక్తీకరించును. "సంతోషించితిఁ జాలుచాలు" ఇత్యాదిగా శ్రీకాళహస్తీశ్వర శతకకర్త చెప్పినట్లు లౌకిక భోగానుభవము తరువాత వైరాగ్యము గలుగును. ఇది నిర్వేదమును విశదము జేయును. ఇట్టి వైరాగ్య నిర్వేదములను సూచించు శ్లోకము లిందున్నవి. భక్తకవులు సర్వమానవ సామాన్యము లగు దౌర్బల్యములను తమయం దారోపించుకొని శతకాది రచనలలో వానిని వ్యక్తీకరింతురు. కావున నిందు ప్రస్తావింపబడిన లౌల్యాదులు కవికి సంబంధించినవి కాక సర్వమానవ సంబంధులును నని సంభావించుట సముచిత సమన్వయము. చివరి రెండు శ్లోకములలో నంత్యప్రాస ముండుట గమనింపదగును.

ఈ శతకమందలి అనేక శ్లోకములు శ్రుతి స్మృతి విషయములకు ప్రతిబింబములై యున్నవి.

"నిదిధ్యాసితవ్యోఽయ మాత్మే"తి వాక్యం
దృఢం విశ్వస న్మర్త్యమానా నపేక్ష్య ।
భజేత్వాం శరణ్యం త్రిలోకైకనాథం
ప్రసీద ప్రసీద ప్రభో! రామచంద్ర ॥ 51

ఈ ఆత్మ నిదిధ్యాసితవ్యము (ధ్యానింపదగినది) అను వాక్యమును సుదృఢముగా నమ్మి మర్త్యమానముల నపేక్షించి త్రిజగన్నాథుడవు,

శరణ్యుడవగు నిన్ను సేవింతును. రామచంద్రప్రభూ ! ప్రసన్నుడవు కమ్ము.

ఇందలి ప్రథమపాద విషయమునకు బృహదారణ్యకోపనిషత్తు మూలము. యాజ్ఞవల్క్యుడు మైత్రేయితో నన్న దీమాట.

"ఆత్మావా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః"

4. అ. 5. బ్రాహ్మణము.

"అరే మైత్రేయి ! ఆత్మయే ద్రష్టవ్యము, శ్రోతవ్యము, మననము చేయదగినది నిదిధ్యాసన (ధ్యాన)ము చేయదగినది." ఆత్మసాక్షాత్కారమున కావశ్యక మగు సాధన చతుష్టయము సమ్యగ్రీతిని ప్రదర్శితము. నాల్గవది ప్రస్తావితమగుటచే త్రయ మింతకుమున్నే సిద్ధించిన ట్లూహ్యము.

"బహుస్యా"మితి ప్రేక్షణేనైవ విశ్వం
వినిర్మాయ మాయామయం త్వయ్యనన్తం ।
సదా క్రీడసే నిర్గుణోపి స్వభావా
దచిన్త్యప్రభావ ! ప్రభో ! రామచంద్ర ॥ 51

"అనేకమగుదును గాక" అను ప్రేక్షణముచేతనే మాయామయము, అనన్తమునగు విశ్వమును నిర్మించిన అచింత్యప్రభావము గల రామచంద్రప్రభూ ! నీవు సహజముగా నిర్గుణుడవైనను ఎల్లప్పుడు క్రీడించుచుందువు.

తదైక్షత । బహుస్యాం ప్రజాయే యేతి -

ఛాందోగ్యోపనిషత్తు.

సోఽకామయత । బహుస్యాం ప్రజాయే యేతి -

తైత్తిరీయోపనిషత్తు.

ఆకాశకారణమగు ఆబ్రహ్మ అనేకమగుదునుగాక, ఉత్పాదింతునుగాక అని తలంచెను. స్వతంత్రము సాధనాంతరానపేక్షకము నగు

పరబ్రహ్మమునకు శ్రుతి ఇచ్ఛాదికము నారోపించుచున్నది. ఇచట భాష్యకారులు ప్రతిపాదించిన విషయములను దాసుగారు ప్రసన్నగంభీర రీతిని వ్యక్తీకరించిరి.

అలం శుష్కతర్కేణ శంకాస్పదేనా -
మునా వేదవాఙ్నిత్యతా దూషకేన ।
సుశీల వ్రత ధ్యాన భక్తి ద్విషాతః
పరం త్వాం భజేఽహం ప్రభో రామచన్ద్ర ॥ 32

"అనంతములగు శంకలకు ఆస్పదమును, వేదవాక్య నిత్యత్వమును నిరాకరించినది. సుశీలము వ్రతములు, ధ్యానము భక్తిని ద్వేషించునది యగు శుష్కతర్క మనవసరము. పరాత్పరుడ వగు నిన్ను సేవింతును." ఇందు తర్కశాస్త్రనింద వ్యక్తీకృతము. ఈశ్లోకము -

"నైషా తర్కేణ మతిరాపనేయా"

"ఈఆత్మతత్త్వము తర్కముచేత నప్రాప్యము" అను కఠోపనిషత్తులోని వాక్యవిషయమును ధ్వనింపజేయుచున్నది. యమధర్మరాజు నచికేతునకు ఆత్మవిద్యను బోధించు సందర్భములోని దీవాక్యము. పై వాక్య భాష్యమున శ్రీశంకరులు ఇట్లు వ్రాసిరి.

"తార్కికో హ్యనాగమజ్ఞః స్వబుద్ధి పరికల్పితం యత్కించిదేవ కథయతి. అత ఏవచ యేయ మాగమప్రసూతా మతి రన్యేనై వాగమాభిజ్ఞే నాచార్యేణైవ తార్కికా ప్రోక్తాసతీ సుజ్ఞానాయ భవతి." "ఆగమానభిజ్ఞుడగు తార్కికుని స్వబుద్ధి పరికల్పిత మగు వాక్సరణి ఆమోదయోగ్యము గాదు. ఆగమసంజాతము ఆగమాభిజ్ఞుడగు నాచార్యునిచే ప్రోక్తమగు తార్కికమతి సుజ్ఞాన సంపాదక మగును." అను నభిప్రాయమును శ్రీదాసుగారు "శుష్కతర్కేణ" అను మాటచే సూచించిరి. శారీరకభాష్యమున ఈ పదము యథాతథముగా నుపయుక్తము.

నభః ఖండశో ముద్గరేణేవ భేత్తుం
పదార్థస్థితిం తర్కతో వేత్తు మీహే । 37

ఆకాశమును ముద్గరముతో ఖండఖండములనుగా జేయగోరినట్లు పదార్థస్థితిని తర్కశాస్త్రముద్వారా తెలిసికొనగోరుదును.

అభావోఽపి నానాప్రకారై ర్విభక్తః
తమిస్రం యథా సూర్యవ త్తార్కికేణ । 105

"తమిస్రమును సూర్యునివలె తార్కికులు అభావమును నానా ప్రకారముల విభజించిరి." ఈ విధముగా తర్కశాస్త్ర స్వరూప స్వభావములను పరమార్థ జ్ఞానమున తదుపయోగమును, అనుపయోగమును దాసుగారు దిక్ప్రదర్శనముగా నిరూపించిరి. అద్వైతవేదాంతాను సారము ఆత్మతత్త్వమును కొన్ని శ్లోకములలో వ్యక్తీకరించిరి.

నభోనైల్యవ ద్రూప్యవ చ్ఛుక్తికాయాం
త్వయీదం జగత్సర్వ మధ్యస్తమేవ ।
అసంగోభవా న్సచ్చిదానందమూర్తి
స్త్వయా పాలనీయా వయం రామచంద్ర ॥ 15

ఆకాశమున నైల్యమువలె ముత్తెపుం జిప్పయందు వెండివలె శ్రీరామచంద్రా! నీయందు ఈజగమంతయు నధ్యస్తము. సచ్చిదానంద మూర్తివగు నీవు అసంగుడవు. మేము నీకు పరిపాలింప దగినవారము.

ఇందలి యుపమానములు వేదాంతశాస్త్రమున సుప్రసిద్ధములు. గుణము వస్తువు నాశ్రయించియుండును. ఆకాశము వస్తువా? కంటికి కన్పించుచున్నది గదా! ఏమి కన్పించుచున్నది? నైల్యము. అనగా గుణమునుబట్టి తదాధారమైన వస్తువు నూహించుచున్నాము. యథార్థముగా నాకాశము రూపరహితము. అరూపము రూపవంతముగా గన్పించుచున్నది. అట్లే నిర్గుణతత్త్వము ఆకాశము వంటిది. నైల్యతుల్యము జగము.

ముత్తెపుచిప్ప లోపలిభాగము మిలమిల మెఱయుచుండును. అది వెండివలె నుండును. ఇచట ఆధారము కంటికి కన్పించునదే. కాని దాని యందు కన్పించునది వెండిమాత్రము గాదు. మిలమిలమెఱయుట యను గుణమును బట్టి దానిని రజతమని భ్రాంతిపడుచున్నాము. ఈ విధముగా నిందు ద్వివిధమగు అధ్యాసము నిరూపితము. "అధ్యాసో నామాతస్మిం స్తద్బుద్ధిః" (బ్ర. సూ. భా. 1-1-1) "తత్పదార్థమునందు తద్భిన్న పదార్థము నారోపించుట అధ్యాసము. ఆకాశము అప్రత్యక్షము. కాని ఈ ఆకాశమునందు బాలకులు (అవివేకులు) మలినతాది ధర్మముల నారోపింతురు. ఇట్లే ఆత్మ ప్రత్యక్షముకానిదైనను శరీరధర్మారోపము జేయుట అస్వాభావికము గాదు. ఈ విధముగా నీ అధ్యాసము అనాది అనంతము నైసర్గికము మిథ్యాప్రత్యయరూపము." మున్నగా శ్రీ శంకరులు చెప్పిన విషయమే ప్రస్తుత శ్లోకస్వరూపము. "అసంగో హ్యయం పురుషః" అను నుపనిషద్వాణియు నిందు వ్యంజితము. 12-వ శ్లోకము నందును ఈ అధ్యాసవిషయము ప్రస్తావింపబడినది.

అజా త్వద్దశా సత్సదంకా గుణత్ర
య్యుపేతా స్తి మాయా త్వయి భ్రామ్యమాణా ।
యథేష్టం పుమాంస్తాం నరీనర్తయం సం
తతం క్రీడసి త్వం ప్రభో రామచంద్ర ॥ 58

సదసద్రూపయు గుణత్రయోపేతయు అజయు నీదశయగు మాయ నీయందే నిరంతరము పరిభ్రమించుచున్నది. రామచంద్రప్రభూ! పురుషుడవై నీవు యథేష్టముగా దానిని నర్తింపజేయుచు నెల్లప్పుడు క్రీడించుచుందువు.

"అజా మేకాం లోహితకృష్ణశుక్లాం బహ్వీం ప్రజాః జనయంతీ సరూపాః" మున్నగు నుపనిషద్వాక్య భావము ఇందు ప్రతిపాదితము. ఇందు మాయాలక్షణములు నిరూపితములు. ఆత్మమాయాసంబంధము సుష్ఠుగా సమన్వితము.

తరంగోస్తి వార్ధౌ, నవార్ధి స్తరంగే
తథా విశ్వమస్తి త్వయి, త్వం న విశ్వే ।
త్వ మేవ ప్రమాణప్రమేయ స్వరూపః
కథం విద్మహే త్వాం ప్రభో రామచంద్ర ॥ 31

సముద్రమునందు తరంగమున్నది. తరంగమునందు సముద్రము లేదు. అట్లే విశ్వము నీయందున్నది. నీవు విశ్వమున లేవు. ప్రమాణ ప్రమేయ స్వరూపుడవు నీవే. శ్రీరామచంద్రప్రభూ నిన్ను ఎట్లు తెలిసి కొనగలము ?

"పాదోస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి" ఈ పర మాత్మలోని ఒకభాగము విశ్వప్రపంచ మైనది. తక్కినపాదత్రయము అమృతరూపమై దివముననున్నది. అను శ్రుతి ప్రమాణానుసారము వార్ధిలో నేకదేశము తరంగమగును గాని, తరంగమే వార్ధి కాదు. అట్లే పరమాత్మలో నేకదేశము విశ్వము. విశ్వమే సంపూర్ణపరమాత్మ కాదు.

వివర్తత్వ దృష్ట్యా హమాది ప్రపంచః
పున స్సంవృతత్వేక్షణే నాత్మతత్త్వం ।
త్వయాలోక్యతే క్రీడయా నిర్గుణేన
స్వభావేన నిత్యం ప్రభో రామచంద్ర॥

"ప్రభూ రామచంద్రా! నిరతము నీవు నిర్గుణస్వభావముతో వివర్తత్వదృష్ట్యనుసారము "అహం, మమ" మున్నగు ప్రపంచమును, సంవృతత్వదృష్టితో నాత్మతత్త్వమును క్రీడగా నాలోకించుచున్నావు." అద్వైత సిద్ధాంతమున కాధారస్తంభ మగు వివర్తవాద మిందు సూచింపబడినది.

పరబ్రహ్మమే ఈజగమునకు ఉపాదానకారణము, నిమిత్తకారణమును. బ్రహ్మ కారణము, జగత్తు కార్యము. ఏకమాత్రము కారణ రూపమగు బ్రహ్మమే అవినాశి, నిర్వికారము సత్పదార్థము. తజ్జన్యమగు

ఈజగత్తు మిథ్య - కల్పనామూలకము. కారణ మొక్కటే సత్యము. కార్యము మిథ్య లేక అనిర్వచనీయము. జగత్తు మాయకు వికారము. పరబ్రహ్మమునకు వివర్తము. వికార వివర్త భేదములను వేదాంతసార మిట్లు చెప్పినది. "తాత్త్విక పరివర్తనము వికారము, అతాత్త్విక పరివర్తనము వివర్తము". ఇంతటి విషయమును శ్రీదాసుగారు ఇందు అల్పాక్షరములలో నిరూపించిరి. అద్వైతమత సిద్ధాంతములో స్వప్నదృష్టాంతము ప్రముఖము. దీనిని రచయిత అనేకశ్లోకములలో ప్రతిపాదించెను.

యతో జాయతే యత్ర తతో లీయతేతత్
యథా మానస వ్యోమతః స్వప్నవిశ్వమ్ ।
మృషైత జ్జగ ద్భ్రాంతిజన్యం సమస్తం
భవానేవ సత్యం ప్రభో రామచంద్ర॥

మానసాకాశమునుండి స్వప్నజగము వలె నీజగము దేనినుండి జనించుచున్నదో దానియందే లీన మగుచున్నది. భ్రాంతిజన్యమగు నీజగ మంతయు మిథ్యయే. రామచంద్రప్రభూ! నీ వొక్కడవే సత్యస్వరూపుడవు.

త్వయి స్వప్నవ ద్వ్యోమ్ని మిథ్యాప్రపంచం
భ్రమే ణైవ పశ్యన్ వృథేత్థం వికుర్వే ।

ఆకాశమువంటి నీయందు స్వప్నమును వలె మిథ్యాప్రపంచమును భ్రాంతితోడనే చూచుచు వ్యర్థముగా నిట్లు వికలుడ నగుచున్నాను. ఇట్లే ఇంకను ననేకములగు వేదాంతరహస్యములు ఇందు ప్రతిపాదితములు.

భక్తిమార్గము సద్యోపగమ్యము, సులభము. శాండిల్యభక్తిసూత్రముల నీయన ప్రముఖముగా గ్రహించెను.

భవద్భక్తి సూత్రాణి శాండిల్యమౌనిః
హితాయైవ సంప్రోక్తవా న్మానుషాణామ్ ।
మతం తస్య లోకోత్తరం విశ్వసం స్త్వాం
భజేషాం శరణ్యం ప్రభో రామచంద్ర ॥

రామచంద్రప్రభూ! శాండిల్యమౌని నీ భక్తిసూత్రములను మానవహితార్థమే చెప్పినాడు. ఆయన మతము లోకో త్తర మని దృఢముగా విశ్వసించి శరణ్యుడ వగు నిన్ను సేవింతును.

శాండిల్య భక్తిసూత్రము లందు పరాభక్తి గౌణభక్తి యని భక్తి ద్వివిధముగా విభక్తము. గౌణభక్తివలననే పరాభక్తి సిద్ధింపగలదని నిరూపితము. ఆద్వివిధభక్తిలక్షణములు నిందు ప్రపంచితములు. పరాభక్తియే వేదాంతసిద్ధాంత మగు బ్రహ్మసాక్షాత్కార జ్ఞానము.

"తదైక్యం నానాత్వైకత్వ ముపాధియోగ హానా దాదిత్యవత్" మున్నగు సూత్రము లీవిషయమును విస్తరించును. కాననే దాసుగారి కీగ్రంథము నచ్చినది.

శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం।
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్॥

అని శ్రీభాగవతము సూత్రించిన నవవిధభక్తులను శ్రీనారాయణదాసు గారు స్వానుభవ పూర్వకముగా నిందు ప్రస్తావించిరి. శ్రీరామునే పరమేశ్వరునిగా భావించి శ్రీరామభక్తియే తన ప్రధానలక్ష్య మను భావమును దాసుగారు అసంఖ్యాక శ్లోకములద్వారా స్పష్టముచేసిరి.

సమం శూన్యవాదేన సోఽద్వైతవాదః
తతః కిం వరిష్ఠో న చార్వాకవాదః।
మహారాజమార్గో భవద్భక్తిరేవా-
స్తు లోకోపకారక్షమా రామచంద్ర॥

ఆ అద్వైతవాదము శూన్యవాదసమము. దానికన్న చార్వాకవాదము శ్రేష్ఠము గాదా? లోకోపకారము చేయ సమర్థ మగు మీ భక్తియే మహారాజమార్గ మగుగాక." మేధావులకు సుగమము అద్వైత మార్గము. తదితరులకు అది శూన్యవాద సమము. భగవద్భక్తి సర్వ

సులభము. ఇది సామాన్యదృష్టితో జెప్పబడినది. భక్తిప్రాధాన్యమును జెప్పుటయే దాసుగారి తాత్పర్యము గాని అద్వైతనింద ఆశయముగాదు.

అలం తత్త్వజిజ్ఞాసయా శూన్యదృష్ట్యా
భవద్భక్తి శేవాస్తు మే రామచంద్ర ॥

శ్రీరామచంద్రా ! శూన్యదృష్టిని గలిగించు తత్త్వజిజ్ఞాస యేల? మీ పాదభక్తియే నాకు గలుగు గాక! సంప్రదాయ సిద్ధములగు ఆచార్యోక్తులం దేమాత్రము ప్రామాణ్యబుద్ధి లోపించినను అద్వైతవాదము శూన్యవాద మను తలంపు కలుగును. భక్తిమార్గ మట్టి క్లేశకరముగాదు.

ఫలం హస్తయో స్త్వావకీనాంఘ్రిపూజా
ఫలం నేత్రయో స్త్వచ్ఛుభాకారవీక్షా ।
ఫలం జన్మన స్త్వత్పదాంభోజభక్తిః
కృపాసాంద్ర! సీతాపతే రామచంద్ర ॥

కృపానిధీ! సీతాపతీ! శ్రీరామచంద్రా! నీపాదపూజయే చేతు లుండుటకు ఫలము. నీశుభాకారమును వీక్షించుటయే నేత్రము లుండుటకు ఫలము. నీపాదభక్తియే భూమిపై జన్మించుట ప్రధాన ఫలము.

భవత్పూత నామైవ జిహ్వా వదేన్మే
భవత్ ఖ్యాతిమేవ శ్రుణోతు శ్రవోమే ।
భవద్దివ్య పాదారవింద ద్వయం మే
మనశ్చింతయే త్సంతతం రామచంద్ర ॥

శ్రీరామచంద్రా! నా నాలుక మీ పవిత్ర నామమునే సంకీర్తించుగాక. నా చెవులు మీ కీర్తినే వినుగాక. నామన స్సెప్పుడును మీ దివ్యపాదారవింద ద్వంద్వమునే ధ్యానించుగాక.

అశేషై రశేషై ర్శేష లోకో భజం స్త్వాం
త్వయి ద్రాగ్విలీయేత గాయ న్నృత్యన్ ।
సమ స్తైహికం కర్మ తే భక్తిరూపం
త్వదన్య న్న వస్తు ప్రభో రామచంద్ర ॥

రామచంద్రప్రభూ! ఈ లోక మంతయును నశేషరసములతో నిన్ను భజించుచు నృత్యగానములతో తన్మయమై నీయందు సత్వరము సంలీన మగుగాక. ఇహలోకమునకు సంబంధించిన సర్వకర్మలును నీభక్తి రూపములే. నీకన్న భిన్నమగు వస్తువే లేదు.

ఈ విధముగా దాసుగారు భక్తకవిశ్రేష్ఠులగు పోతనగారివలె ననేక విధముల స్వీయభక్తి నుద్ఘాటించిరి. ఐహికకర్మ మంతయు భగవంతునియందలి భక్తిచే పరవశులై నిర్వర్తించుట వారి యుద్దేశము. గానన్రృత్యములతో సర్వజనులు భగవంతునియందు త్వరగా విలీను లగుదు రను సత్యమును పై శ్లోకమున సూచించిరి.

శ్రీ దాసుగారి భక్తిలత కాధారభూతుడగు శ్రీరామునిగూర్చి ఆయన భావములను పరికింతము.

పవిత్రేతి మత్వాపి సీతాం విహాయా
పవాదం విధూయ ప్రజాం తోషయిత్వా ।
స్వసౌఖ్యం త్యజన్ ధర్మమే వాభ్యరక్షీ
స్త్వదన్యో న రాజా ప్రభో రామచంద్ర ॥

రామచంద్రప్రభూ! పవిత్రురాలని తెలిసియు సీతాదేవిని త్యజించి అపవాదమును పోగొట్టి ప్రజలకు సంతోషముం గూర్చి స్వసౌఖ్యమును వదలి ధర్మమునే రక్షించితివి. ఇట్టి నీకన్న నితరుడు రా జెవ్వడు?

మదీయాపరాధాన్ క్షమస్వేతి మాం ప్రా
ర్థయే చ్చే దహం రావణం జీవయేయమ్ ।
ఇతి ప్రాకరో స్త్వం ప్రతిజ్ఞాం సభాయా
మహో ధర్మవీర ప్రభో రామచంద్ర ॥

రామచంద్రప్రభూ! విభీషణ శరణాగతి సమయమున వానర వీరుల సభలో 'నా అపరాధములను క్షమింపుము అని ప్రార్థించినచో రావణునికి గూడ నేను అభయ మిచ్చి రక్షించెదను.' అని ప్రతిజ్ఞ చేసి

తివి. ఆహా నీ వెంతటి ధర్మవీరుడవు! మున్నగు వానిలో శ్రీరామ వైశిష్ట్యము సూచితము.

అహం శీకర స్త్వం సముద్రః కరో౽హం
త్వ మర్కో౽ప్యహం రేణు రద్రీశ్వర స్త్వం ।
అహం నశ్వర శ్శాశ్వత స్త్వం మృషాహం
యదార్థ స్త్వమేవ ప్రభో రామచంద్ర ॥

రామచంద్రప్రభూ! నేను నీటిబిందువును. నీవు సముద్రుడవు. నేను కిరణమును. నీవు సూర్యుడవు. నేను అణువును. నీ వద్రీశ్వరుడవు. నే నశాశ్వతుడను, నీవు శాశ్వతుడవు. నే నసత్యము. నీవు సత్పదార్థమవు. అహమునందు ఆత్మస్ఫూర్తి కలదని ఇట వ్యక్తీకరింపబడినది.

భవన్నామ మంత్ర ప్రభావం స్వయం నే
శ్వరో బుధ్యతే కా కథా ప్రాకృతానామ్ ।

నీనామమంత్ర ప్రభావమును సాక్షాత్తుగా పరమేశ్వరుడే తెలిసికొనలేడనగా ప్రాకృతులగువారి మాట చెప్పనేల? శ్రీరామమంత్ర ప్రభావమును అనేక పురాణములు ముక్తకంఠముగా ఘోషించుటను ఈ శ్లోకపాదము సూచించుచున్నది.

శ్రీ దాసుగారి అలంకారికరచన కొక ఉదాహృతి-

మహీజాధరోష్ఠ ప్రవాళే౽లికల్పా
పురద్విట్ ధనుః కాననే౽గ్నిచ్ఛటా౽భా ।
సకృ త్కౌశికాంఘ్రి స్థితాంభోజతుల్యా
చకాస్తే స్మ తే దృక్ ప్రభో రామచంద్ర ॥

శ్రీరామా! సీతాదేవి అధరోష్ఠప్రవాళమున తుమ్మెదవంటిదియు, శివధనుస్సను నడవికి అగ్నిజ్వాలవంటిదియు, విశ్వామిత్రపాదములందు పద్మతుల్యమునై నీచూపు ప్రకాశించుచున్నది.

ఈవిధముగా శ్రీనారాయణదాసుగారు భక్తితన్మయులై భావాంబరవీథి విశ్రుతవిహారులై నానావిషయములను కవితామృతమున మిళితమొనర్చి ఇందందించిరి. సంగీత సాహిత్యాది లలితకళలచే లలితలలితమైన ఆయన కోమల హృదయమును, శ్రీరామచంద్రదేవుని సందర్శనమునకై ఆయన నానా ప్రకారముల పరితపించిన విధమును వ్యక్తీకరింపనీశతకము సర్వసమర్థము.



# నవరసతరంగిణి

[షేక్స్పియర్ కాళిదాసకవితాపరిశీలనము - సాంధ్రానువాదము]

ఆచార్య శ్రీ గోగులపాటి లక్ష్మీపతి

'జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తి యేషాం యశః కాయే జరామరణజం భయం'

రససిద్ధులైన కవీశ్వరుల యశః కాయమునకు జరామరణభయములు లేవు. శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాసుగారు అట్టి రససిద్ధులు. వీరి రచనలలో 'నవరస తరంగిణి' యొక యపురూప గ్రంథము. ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన షేక్స్పియరు, కాళిదాస మహాకవుల రచనలలోని సొగసులను వానిలోని తారతమ్యములను ఆంధ్రులకు తెల్పుటకై ఆ మహాకవుల గ్రంథములన్నియు సాకల్యముగ చదివి, వారి వివిధ రచనలలోనుండి రసవంతములగు ఘట్టముల నేరి, యొక్కచో కూర్చి, వానిలోని సౌందర్యము, కవితా మధురిమ, భావనా వైశిష్ట్యము మనకందరకు తెలియునట్లుగ వానిని తెలుగుభాషలోనికనువదించి, ఇందు పొందుపరచిరి. అంతియె కాక, ఆ వివిధ ఘట్టములను నవరసములలోనికి విభజించి, ఆ యా రసముల నా మహాకవులు తమ వివిధ రచనలందు పోషించిన తీరును, ఆ రసపోషణా సంవిధానమున ద్యోతకమగు వారి అనన్యసామాన్యమైన ప్రతిభను చూపుచు, ఆ రచనలకు భాషాంతరీకరణమను పేర తన ప్రతిభను జోడించి, వారి మూలరచనల నొక ప్రక్కను, తన యనువాదము నొకవైపున ప్రచురించి, దాసుగారు ఒక విలక్షణము,

విశిష్టమునైన గ్రంథమును ఆంధ్రభాషాయోషామతల్లికి కానుకగా నర్పించి, యెనలేనిసేవ యొనర్చిరి.

ఈ గ్రంథారంభమున ఒక బృహత్తరమైన పీఠిక కలదు. అందీ యిరువురి కవుల తారతమ్యములును, వీరి కథాకల్పనలోని బాగోగులను గురించిన చర్చయు, కావ్యప్రయోజనము, నాటక ప్రయోజనము, చతుర్విధాభినయములు, వానిలో సహజకృత్రిమ భేదములు, గీత, వాద్య, నృత్యముల తీరుతెన్నులు— వీనిపై వారి యభిప్రాయములు సుబోధకముగ వివరింపబడినవి. దీనితోపాటు ఆనాటి పండితలోకములో వివాదములు చెలరేపిన కొన్ని మత, సాంఘిక సంస్కరణోద్యమముల గూర్చిన తన యభిప్రాయములనుగూడ నిర్మొగమాటముగ, నిర్భయముగ వ్యక్తముచేసి, ఆ పీఠిక నెంతయో విమర్శనాత్మకముగ రచించినారు.

"వీరిరువురు జగత్ప్రసిద్ధినొందిన కవులు-వారి యూహాలు అత్యామోదకరములయ్యు దురవగాహములు - సముద్రమువలె వారి కవితాశక్తి యపారము. దిగంతరేఖ కరణి వారి యుద్దేశ్యము కొన్ని తావుల అందీ యందకుండును. వారి వాక్చమత్కృతి అనిర్దేశ్యము - సరియే. ఆ మహాకవీశ్వరులు లోకప్రసిద్ధులు. నే వేరే తెల్పనేల"— అని వారిని గూర్చిన దాసుగారి ప్రశస్తి. షేక్స్పియర్ ప్రతిభ, కాళిదాసు ప్రజ్ఞయు నట్టివేకదా! ప్రాతిభ చక్షువులకు దేశకాలమితి యంత్రములు లేవు. 'నాటకేషు వయమేవ' అను దీమసమునకు నెంతేని యర్హులనదగు నీ యిరువురి మహాకవుల భావ, అర్థ, ఉక్తి వైచిత్ర్యములు, చమత్కారములు, ఉపమాద్యలంకారములు వారి రచనలలో మనకు వెల్లుగ దోచును.

"ఆ యిరువురి కబ్బములందలి సౌందర్యములను కొనియాడ వేనోళ్ళు చాలవు" అనుచు, "పేదవాడొక తావున నవరత్నము లపరిమితముగ నొండొండు మీరి కన్పడ నెద్దానినైన తృప్తిపడక నెద్దియుం

దోచక తుదకెవ్వియో కొన్నిమాత్రము తెచ్చుకొనునట్లు" తనకు తోచి నవి కొన్నింటి నేఱితిననియు, ఇంకను ఇట్టివి చాల యున్నవనియు, సహృదయులు, పండితులు వారి వారి ఓపికకొలది గ్రహించవచ్చుననియు వ్రాయుటలో నీ మహాపురుషుని నమ్రత ఆ కవులపైగల గౌరవము మనకు గోచరించుచున్నవి.

వీరిరువురి తారతమ్యమును గూర్చి చర్చించుచు, ఇద్దరు కవులును రెండు వేరువేరు భాషలలో వ్రాసియుండుటవలన ఇద్దరిని బోల్చి చెప్పుట కష్టము. కాళిదాసుని కవిత భారతీయ సంప్రదాయానుసారముగ వైదిక సమయములతో, భరతముని ప్రముఖ లాక్షణికుల శాసనాను గుణముగ నడచుచుండును. మనకున్న కావ్యరచనా నిబంధన లాంగ్ల భాషకు లేనందువలనను, మన భారతీయ విధానమునకు విరుద్ధములుగ అలవాట్లు, ఆచారవ్యవహారములు పాశ్చాత్య నాగరికతలో సహజముగ నున్నవి కావునను, భారతీయ ఆలంకారికు లేర్పరచిన దోషములు షేక్స్పియరు రచనలయం దున్నను, "షేక్స్పియరు కృతులు లోకోత్త రములనుట కే సందియమును లేదు." అని దానుగారు భావించిరి.

కాళిదాసుపైకన్న వీరికి షేక్స్పియరు పైనే మక్కువ ఎక్కువ. "వీరిరువురిలోను షేక్స్పియరు అధికుడు—షేక్స్పియరు వ్యాసుని యంతటివాడు — తన కావ్యదర్పణమునందు జగమెల్లచూపిన మహాను భావుడు ... భారతీయ గ్రంథములలోని ఊహాలన్నియు కలిపినచో షేక్స్పియరుని ఊహాలగు నేమో...ఎన్ని మహానదులు కలసిపారినను, సముద్రమునకు ఒక మూలకు వచ్చునా ... లోకమునందలి కవులలో షేక్స్పియరుకు సమానుడుకాని, అధికుడుకాని లేడనవచ్చును ... దేవు డంతట వ్యాపించినట్లు షేక్స్పియరుని జ్ఞానము అఖిలమానుషానుభవ మును పొదవెను ... వీనివంటి కవి శిఖామణి 'న భూతో న భవి ష్యతి' "— ఇది దాసుగారి అభిప్రాయము. మొత్తముమీద నాటక రచనమునందు కాళిదాసుకన్న షేక్స్పియరు ప్రతిభ అత్యధికమని,

కాళిదాసునకు, షేక్స్పియరునకు గల వ్యత్యాసము పల్లెకు, పట్టణమునకు, ఉద్యానవనమునకు మహారణ్యమునకు గల భేదము వంటిదని విస్పష్టముగ చాటినారు. ఇట్లనియు చివరకు "నిజమగు కవులు ఒకరికొకరు తీసిపోరు. వారిలో ఒండొరుల పోల్చుట వీలుగాదు. ఎవనిమటుకు వాడే ఘనుడు" అనినారు. దాసుగారి అభిప్రాయములో "లోకములో సార్వలౌకికులు నాబరగు కవులు వీరిద్దరే."

దాసుగారికి షేక్స్పియరుపై నింత మక్కువగలుగుటకు కారణము లేకపోలేదు. విజయనగర ప్రభువులైన శ్రీ ఆనందగజపతి సమక్షములో తరచుగ షేక్స్పియర్కాళిదాసుల గురించి కవితావ్యాసంగము, చర్చలు జరుగుచుండెడివి. మహారాజావారు కేవల కవిపండిత పోషకులే కాక స్వయముగ కవులు, పండితులును. శ్రీ లింగం లక్ష్మాజీ పంతులు గారి వద్ద ఆంగ్లవిద్యాభ్యాసముచేసి పాండిత్యము సంపాదించినవారు. బహుభాషావేత్తలు. విజయనగరం మహారాజావారి కాలేజి ప్రిన్సిపాలు కిళాంచి రామానుజాచారిగారు, నిష్ఠల రామశర్మగారు, మహారాజా వారును ఎల్లప్పుడు షేక్స్పియరు కావ్యములగూర్చి వానిలోని సొగసులను గూర్చి తర్కించుచుండెడివారు. దాసుగారు ఆ సందర్భములలో షేక్స్పియరు నాటకములలోని ఘట్టములను అప్పటికప్పుడు తెలుగులోనికి అనువదించి, వారిని ఆనందపఱచెడివారు. మహారాజావారు ఈ అనువాదముల జాల మెచ్చుకొని మూలములోని భావవైశిష్ట్యము సమగ్రముగ గల్గియున్నవని ఆనందించి దాసుగారి నభినందించెడివారు. ఆస్థానములోని ఆంగ్లభాగ నెఱుగని పండితులు కూడ ఈ తెనుగుసేతనుండి షేక్స్పియరు యొక్క గొప్పతనము, ఆ కావ్యములలోని సొగసులను అర్థము చేసికొనగల్గుచుండెడివారు. ఈ విధముగ ఆనందజగపతి కాలమున ఆరంభింపబడిన కవితా వ్యాసంగమే చివరకు వారి మనుమడు శ్రీ అలక్ నారాయణ గజపతికాలమునాటికి గ్రంథరూపమై 'నవరస తరంగిణి' గ వెలువడి "కాళిదాస షేక్స్పియరు కవితలపై ప్రేమపడెదవుగాన నర్పించినాడ" అను విజ్ఞాపనముతో వారికి అంకితమైనది.

నాటకమను నదొక యధమ కవిత్వ పద్ధతి యనియు చుల్కన పని యనియు అజ్జాడవారి యభిప్రాయము. 'నాటకాంతం హి సాహిత్యమ్' అన - 'ప్రసూతాంతం యౌవనము' వలె "చెట్టు చచ్చుకాలము నకు కుక్కమూతి పిందెల"వలె కవికి కల్పనాశక్తి తగ్గి, ఉత్తమరచనలు వ్రాయుశక్తి, ఆలోచనాపటిమ అంతరించు కాలమున నాటకలు వ్రాయ మొదలిడును - అని వ్యాఖ్యానించి, కథాసందర్భము తెలుపుటయందు నాటకము ద్రావిడ ప్రాణాయామమువలె అస్వాభావికము, అపహాసాస్పదమునగు ప్రయోగము అని భావించిరి.

"నాటక రచన అధమమైననేమి, ఉత్తమమైననేమి, గడచినదానికి వగపేల?" అని తిరిగి ఉపక్రమించి, షేక్స్పియర్కాళిదాసుల నాటకములలో నుత్తమమైనవి అని యెంచబడు 'Hamlet, శాకుంతలము' నాటకముల దీసుకొని, వానిలోని కథాకల్పనముల నతినిశితముగ విమర్శించి, వానిని బహుదోషయుతములుగ బేర్కొనిరి. "ఇట్లవివేకముగా తన వంశమును గూర్చి తాజేసిన కుర్రని దుస్సాహస మొక నాటకముగా పన్నుట లోకులకు సునీతిబోధన మెంతమాత్రము గాదు- ఒకవేళ పూర్వగాథ ననుసరించి చేసినను షేక్స్పియరువంటి మహాకవి ఇంత అసందర్భముగ నొక పడుచువాని దుస్సాహసముచే కులనాశన మగునట్లు దుఃఖపర్యవసాన నాటక మొనర్చుట సునీతిబోధన ఫలకమగు కావ్యమునకే తలవంపు తెచ్చె" అని అతిసాహసముగ విమర్శించిరి. అట్లే కాళిదాసుని శాకుంతలమును గూర్చి, "ఇట్టి కథను ప్రచురించుట లోకులకు దుర్నీతిబోధించుట కదా ! - ఈ నాటక మెంతయు నసందర్భముగ నున్నది- నాటకరచనమందు కాళిదాసునకు శక్తి చాలదు- కాళిదాసుని నాటకముల కన్న యాతని కావ్యములు బాగున్నవి" అని తీర్పునిచ్చిరి. కాని దాసుగారి ఈ యభిప్రాయముతో చాలమంది యేకీభవింపరు. 'కావ్యేషు నాటకం రమ్యం - నాటకేషు శకుంతలా' అని కదా పండితోక్తి. 'కాళిదాసగిరాం సారం, కాళిదాసః సరస్వతీ, చతుర్ముఖోఽథవా సాక్షాద్విదు ; ర్నాన్యేతు మాదృశః' అని మల్లినాథ సూక్తి.

"Wouldst thou the young year's blossoms and the fruits of its decline,
And all by which the soul is charmed, enraptured, feasted, fed ?
Wouldst thou the earth and heaven itself in one sole name combine ?
I name thee Sakuntala, and all at once is said."

అని సహృదకవిచక్రవర్తి 'గీటే' ప్రశంస. అయినను వారి ఆక్షేపణలలో కొన్నింటిని ప్రత్యాఖ్యానము చేయుట కష్టమని అంగీకరించక తప్పదు.

నాటకములో పాత్రపోషణ బాగుగనుండవలెనన్న నటుడు దేహసౌష్ఠవము కల్గియుండవలెను. ఇది లేనిచో వాడెంత శాస్త్రీయముగ యాడినను, బాడినను జనరంజకము కానేరదు - నటన రక్తి కట్టవలెనన్న ఆ నటన లోకసంప్రదాయానుసారముగ నుండవలెను - నాట్యప్రయోగమునకు లోకమే ప్రధానము. సంప్రదాయము విస్మరించినచో నపాయసూచకమగు. రైలుబండికి ఎఱ్ఱజండా బదులు పచ్చజండా చూపినపుడు కలుగు ప్రమాదమువలె వైపరీత్యము కలిగి హానికలుగును - సర్వజనరంజకముగ యథేష్టముగ అభినయింపవలెను - నాటకము నడుమ యథోచిత సంగీతమేగాని తెగబారెడు దీర్ఘములు పనికిరావు - సకల పండిత పామర జనహృదయ రంజకమగుటయే సలక్షణ సంగీతసాహిత్యములకు గుర్తు - బిడ్డలకు శరీరసౌష్ఠవము, భావవైశాల్యము, మానసికౌన్నత్యము కల్గించుటకై షేక్స్పియర్కాళిదాసుల కవితలలోని భాగములను ఏరి పాఠశాలలో సంగీత నిబంధనావళితో నేర్పవలెను. సమస్త, వృత్త, జాత్యుపజాతులను రాగ, తాళ సహితముగ పాడుట - ఆడుట బిడ్డలకు నేర్పుట చాల యవసరము. ఏలయన వ్రాసినది చదువుటకన్న కంటితో చూచి చెవులతో వినిన దానివలన కలుగు రసాస్వాదనము అధికము కదా ! - ఇవి దాసుగారి తలంపులు. ఏతదభిప్రాయానుసారముగనే యీ షేక్స్పియర్కాళిదాసుల

పద్యములలో కొన్నింటిని నటనకు పాటకు అనుగుణముగ, ఏ పదము నెట్లభినయించవలెనో, నాట్యశాస్త్ర రహస్యములతో, హస్తాభినయ విన్యాసములతో, హస్తభేద లక్షణములతో, నాట్యప్రయోగ వివరణములతో నీ పీఠికలో వివరించిరి. షేక్స్పియరుని 'Come Hither' అను పాటకు బిలహరి రాగములో తెనుగుదరువు వ్రాసి దానిని రూపక తాళమున పాడురీతి, అభినయ విధానము ; కాళిదాసుని 'ఈషచ్చుంబితాని' అను శ్లోకమునకు తెలుగులో వసంతరాగములో త్రిపుట తాళముతో నొకపాట వ్రాసి, దాని పాడుక్రమము, అభినయపద్ధతి ; కాళిదాసుని విక్రమోర్వశీయములోని 'వేదాంతేషు యమాహురేకపురుషం' అను నాందీ శ్లోకమునకు తా మొనర్చిన తెలుగు అనువాద పద్యమును "పలికెద రెవ్వని ప్రాచదవుల కొనల" అను దానిని నభినయించువిధము పూర్తి వివరములతో దెలుపుచు వర్ణించిరి.

కవిత్వమన నేమి ? కావ్యమన నెట్టిది ? సత్కావ్యమన నేది ? అసలు కవి వ్రాయుటకు కారణమేమి ? ఈ ప్రశ్నలకు సమాధాన సరళిలో దాసుగారి యాశయములు, వైదుష్యము మనకీ పీఠికలో నగపడును. "సర్వసాధారణానుభవము యథోచితంబుగా తెల్పి, జనుల హృదయంబునకెల్ల రసముప్పతిలన్ చేసి, నీతినుద్బోధించుటయే కవితకు గల ప్రయోజనము - రసము చెడనీక యమక పుష్టిగ చెప్పుట, సందర్భశుద్ధికల పదప్రయోగము, స్వతంత్రముగ కథను కల్పించి, యపూర్వమగు నూహాలను దెల్పుట, యతుకుంచక పద్యములల్లుట, పండితపామర రంజకముగ మృదుమధురోచిత శబ్దముల పొందుపఱచుట - ఇవి కవిత్వమున ముఖ్యాంశములు - దండి చెప్పినట్లు ఇష్టార్థోపేతమగు పదావళి కావ్యము - ప్రతి శబ్దమున కేదియో యొక అర్థము లేకపోదు. ఆ అర్థబోధనమునం దేదేని రసముప్పతిలక మానదు. గుణదోషాలంకారములు వివక్షామూలములు. ఒకప్పుడు గుణము దోషముగా, దోషము గుణముగ, అలంకారము హేయముగ మారెడు ;

అన్నము అజీర్ణమున విషమగు; విషమొకప్పుడు పథ్యమగుకదా! కావున మనసున కింపగు శబ్దార్థములు కావ్యమనదగినది' అని కావ్యమీమాంస చేయుచు, "ప్రతివస్తువునం దేదో నొకరసము ప్రధానముగను, తక్కిన రసము లంగరసములుగనుండును గదా! ఉత్తమ జనులన్ గాన్పించు వీర, శాంత, కరుణలు సత్వగుణ ప్రధానములు. మధ్యమ జను లగపర్చు శృంగార, హాస్య, అద్భుతములు రజోగుణ ప్రధానములు. అధమజను లలో నుండు రౌద్ర, బీభత్స భయానకములు తమోగుణ ప్రధానములు. కనుక జనులకే శబ్దార్థ సమూహామువలన మనసుల కుల్లాసముకలిగి సత్కార్యాచరణమున కుత్సాహము పుట్టునో యదియే సత్కావ్యము.జను లకు భయ, శోక, జుగుప్స, క్రోధములను పుట్టించి, దుర్మార్గమునకు పురి కొల్పునది అసత్కావ్యము. ఇట్లు నవరసంబులగపడుచు సజ్జనుల నడవడిన్ వర్ణించు నిర్దుష్ట శబ్దార్థముల సమూహము సత్కావ్యంబు నాబరగు. అట్టి సత్కార్యము లొనర్చువారే సుకవులు - కవిత్వమన కావ్యము పన్ను నూహ - కావ్యము సకలజగము నద్దమువలె జూపుటయే కాక మానవులకు వివిధావస్థలయందు తలంపు లెట్లుండునో వానిన్గూడ బయ ల్వెట్టును- ఈ కవితాశక్తి వలననే జగమున నెల్ల కృత్యములు ప్రబలు చున్నవి- కవిత్వము ప్రత్యక్షము న్దెలుపుటయేకాక పరోక్షమున్ కూడ బయలుపెట్టును-కనుకనే"కోవేత్తి కవితాతత్త్వం శివోజానాతి వానవా" అనినాడు కాళిదాసు. 'కవి కవిత్వము నెందుకు వ్రాయనిచ్ఛగించును?' అను విషయములో "లోకమున కల్గు సకలక్రియలును దైవిక, మానుష, సంకల్ప వశముననే కలుగుచున్నవి- సమస్త జగత్కారణమగు శక్తి యెద్దియో వాగ్గేయకారాది కవిరూపమున నూహించుచు వ్రాయుచు, పాడుచు, ఆడుచు వాయించుచు, సకల కర్మల నాచరించుచు, ప్రభావి తము చేయుచుండును. వేయేల? సర్వజగద్రూపమై, సత్వ, రజస్తమో గుణములన్ దనలో దానాటాడుకొనుచుండును ... దాని కారణము నూహింప మానవుల కలవిగాదు - దైవమాయ నెరుంగ నేరితరము?"

ఈ వాక్యములలో దాసుగారి భావవైశాల్యము, కావ్య విషయ విశ్వా
సములు మనకు వ్యక్తమగుచున్నవి.

తానొనర్చిన యనువాద సరళినిగూర్చి ప్రస్తావించుచు "భాషాం
తరీకరణ మతిక్లిష్టమైనపని. లాతిభాష పొంకము కూలంకషముగ
తెలియబడదు. మూలములోని భావము గ్రహించుకొని తద్రసమును
పఠితలకు మరియొక భాషలో యథాస్థితిగ తెలియబడునట్లు చెప్పుట
కష్టము. చాలమట్టు ఊహ దెల్పునట్లు మాత్రమే మార్చవచ్చును గాని
తద్రసముత్పాదింప చేయుట కష్టము. మేనమామ పోలికగా కొంతవఱకు
నూహ తెల్ప పీకులాడవచ్చును." అని, మరియు "ఈ గ్రంథమున నా
యుపయోగించిన భాషయున్ పద్యలక్షణము పూర్వకవి మతాను
సారము - ఆంగ్లేయభాష కాంధ్రమొనర్చునెడ యాంగ్లభాషాపదముల
వాడుకెట్లు తగదో దేవభాషన్ దెనిగించునపుడు తత్సమ మట్లుపయో
గింపరాదు" అను నియమమునకు బద్ధుడై కాళిదాస పద్యములకు తెనుగు
వ్రాయుచో నచ్చతెలుగునే వాడుటచే నీ గ్రంథమున కొక యపురూప
వైశిష్ట్యము సమకూరినది. ఇట్టి నియమము ఎంతయు నష్టము, క్లిష్టము
నైనది. 'విధిప్రేరితుడనై సాహసంబున వ్రాసినాను' అని యీ సందర్భ
ములో వీరు వినయము చూపిరి. ఈ భాషాంతరీకరణమును గూర్చి
విజయనగరం కాలేజీ ప్రిన్సిపాలైన (శ్రీ) కిళాంబి రామానుజాచార్యులు
M. A., B. L., D. Lit. (రామావతారం) గారు ఈవిధముగ వ్రాసిరి :—

'Knowing as I do, the difficulty of translating into Telugu passages from an ordinary English work, I cannot say how I admire the skill you have displayed in rendering some of the sublime passages of Shakespeare; if there is room for improvement here and there it is mostly due to the undeveloped state of Telugu as compared with English.

Your translations of Kalidasa are beautiful. You have earned the gratitude of the Andhra Public by your excellent rendering of the immortal poets.'

ఈ గ్రంథము అనువాద గ్రంథము కాన దీనిలోని ఊహలు అసలు గ్రంథకర్తలవి. వాని భావ సౌందర్యము వివిధ రసపోషణ విధానము మూలకవులవే. కనుక దాసుగారి స్వీయ ప్రతిభ ఈ అనువాద సరళిలోను, తెలుగు పద గుంఫనములోను ఎంతవరకు ద్యోతకమయినది- అనునదే చూడవలసిన విషయము. భాషాంతరీకరణము సామాన్యకవులకు సాధ్యముకాదు. రెండు భాషలలోను అసమాన పాండిత్యము కలిగియుండి ఒక భాషలోని సొగసులను, పలుకుబడులను, జాతీయములను అర్థము చేసికొని వానిని రెండవ భాషలోనికి యథాతథముగ తాక సహజ సౌందర్యము ఉట్టిపడునట్టుగ మార్చుటకు మంచి భాషా కౌశలము రచనా పటిమ, వాక్స్వాధీనత కావలెను. "ఒక భాష ఇంకొక భాషకు సరిగ మారదు. యథాస్థితిగ భాషాంతరీకరణ మసాధ్యము" అని దాసుగారే పీఠికలో అనియుండిరి. ఈ అనువాదములో తెలుగు పద్యముల లోని భాష అన్వయ క్లిష్టతలేక నే విధముగ సమకూర్చబడినదో చూడవచ్చును.

ఈ గ్రంథముద్వారా దాసుగారు తాను కథకుడేకాదు, నటుడే కాదు, గాయకుడే కాదు, కవియే కాదు, మహాకవుల కోవలోనికి చెందిన వాడనని నిరూపించుకొనిరి. కవి తన రచనల వలన చిరంజీవి కాగలడు. చిత్రకారుడు తన చిత్రముల రూపేణ తరువాతి తరములవారికి కనబడగలడు. గాయకుని ప్రతిభ ధ్వనిగ్రాహి యంత్రమున తరతరములు నిలుపవచ్చును. కాని గాయకుడు, నటుడు, కవి అయి, త్రిమూర్తి స్వరూపము కలిగిన తౌర్యత్రికుని చాతుర్యము, ప్రతిభ, ఒక్కసారి యాకర్షింపజాలు యంత్రము లేకపోయెడు గదా ! అని దాసుగారు పీఠికలో మనకు తమ బాధ వ్యక్తముచేసిరి. ఆ కాలమునకు చలనచిత్రములు ఇంత విరివిగ వ్యాప్తిచెందక యుండుటచే దాసుగారి తౌర్యత్రిక ప్రతిభ శాశ్వతముగ మనము నిల్పుకొనలేక పోయితిమి. కాని వారి కవితాశక్తి వారి రచనల ద్వారా మనకు పొందుపఱుపబడియున్నది.

వీరు ఏ కావ్యము చదివినను, దానిలో కవియొక్క అంతర్గత భావమును గ్రహించుటకే యత్నింతురు. 'సమస్త జగత్కారణమగు శక్తి యేదో సర్వజగత్కల్యాణార్థము కవిచేత వ్రాయించును.' అను భావన మనఃస్ఫూర్తిగ నమ్మినవారగుటచే దాసుగారికి సమస్తకావ్యములయందు అంతర్గతవాహినిగ వేదాంతబోధ గానవచ్చుచుండును. పారసీక మహాకవి ఒమర్ ఖయ్యామ్ సందేశమును ఐహిక పరముగ కాక యాధ్యాత్మిక దృష్టితో చూచి, ఆ కావ్యమునకు సంస్కృత, దేశ్యాంధ్ర భాషలలో ననువాదములు వ్రాసిన మహాత్త్వికుడు దాసుగారు. తాను చిన్నప్పటినుండియు భక్తి ప్రఫుల్ల హృదయుడు, వేదశాస్త్ర పారజ్ఞుడగుటచే షేక్స్పియర్ కాళిదాసుల కృతులలో గూడ వారికి అంతర్గతముగ వేదాంతబోధ గోచరించినది. "మదాతిశయంబున లేని వస్తువులు నిజముగ కాన్పించునట్లు, అజ్ఞానదశయందు స్వప్నావస్థయందు బోలి తనకంటె యన్యమెఱుంగని నిత్యముక్త బుద్ధ స్వరూపుడగు జీవున కాత్మరూపకమగు జగత్తు తోచుచుండును. కాని వైరాగ్యమునలేక ప్రజ్ఞాన దశయందు మదముడిగిన పిదపగ, మరియు నిదుర మేల్కాన్న పిమ్మట వికారము లగపడనట్లు ఈ లోకవిచిత్రము కాన్పించకుండును. సచ్చిదానంద స్వరూపుడగు పరమాత్ముడొకడే మిగులుననుచు, గాని మరియు సముద్రపు టొడ్డున పలు తెరంగుల యిసుకగాలిచే రూపించు తీరున మనుష్యులు పరవశులై దైవవశంబున వివిధస్థితుల మారుచున్నారనుచున్ గాని, "కర్తా, భోక్తా, జనార్దన" యనుచు గాని ఆప్తవాక్యము తెలిసికొనువారు సంసారదుఃఖము నంటరు— అను వేదాంతము కాళిదాసు కృతులు బోధించుచున్నవి. అట్లే షేక్స్పియర్ కృతులను చదివినప్పుడు మనకు సంసారము దుఃఖభూయిష్ఠము; మానవులది యనుభవించక తీరదు; పాపాచరణమున నిత్యము నరకమున్ పుణ్యమున నిత్యానందపదవియును, జీవులకు పరమాత్మునిచే నొసంగబడునని బోధపడుచున్నదనియు వ్యక్తీకరించిరి.

ఈ విధముగ వివిధ విషయములతో నీ పీఠిక సర్వాంగసుందరమై దాసుగారి యాశయములకు, వారి మనోభావములకు, వారి సర్వతంత్ర స్వతంత్రమగు ప్రకృతికి, వారి బహుముఖ ప్రజ్ఞకు నిదర్శనము.

గ్రంథారంభమున అమర్చిన పీఠికతోపాటు గ్రంథాంతమున గ్రంథమున కనుబంధముగ, గ్రంథస్థ విషయముల సులభముగ నేరుకొనుటకై కాళిదాస షేక్స్పియరుల కవితావిశేషముల పట్టికయు వారి కావ్య నాటకముల కథాసంగ్రహముల యాంధ్రీకరణములును కూర్పబడినవి. ఇంతియ కాక, తాను వ్రాసిన "తెలుగు పద్దెములలోని కఠిన శబ్దములకు టిప్పణి వ్రాసి– యాంధ్రజనోపకారమగునని యెంచి–చదువరుల విశేషబోధకై విరచించినాడ" నను వాక్యముతో నీ పీఠికముగియును.

ఈ కావ్యమందున్న దాసుగారి భావములు, ప్రతిభ సందర్భశుద్ధి గల పదప్రయోగము, యమకపుష్టి చెడక మృదుమధుర శబ్దములతో పండిత పామర రంజకముగ షేక్స్పియర్కాళిదాసుల రచనా సౌందర్యము మనకు ఎత్తిచూపిన పాండితీ ప్రకర్ష నిట చూపుటయే నా ఉద్దేశ్యము.

1) సంస్కృతమును తెలుగు సేయునపుడు మూలములోని సంస్కృత పదములను ఏమాత్రము రానీయనను నియమము చాల కఠినమైనదని చెప్పకతప్పదు.

ఉదా :– 1) కాళిదాసు 'రఘువంశము'లోని 'ఆకార సదృశః ప్రజ్ఞః' అను దిలీపమహారాజు వర్ణన శ్లోకమునకు–

గీ. సొగసునకు దగునట్టి తె - ల్వి గలవాడు
తెలివికిం దగు చదువుల - వెలయువాడు
చదువులకు దగిన పనిని - సల్పువాడు
పనికి దగినట్టి పెంపున - దనరు వాడు॥

రఘువంశం. స. 1 శ్లో. 15.

2) 'కుమార సంభవము'లోని 'అపమేఘోదయం వర్షం' అను హిమవంతుని వాక్యములకు-

కాసుమబ్బుగ్రమ్మ - కయె కురిసెడు వాన
పువ్వు కానరాక - పొడము పండు
తలతు మీరలిట్లు - దరిసెన మిచ్చుట
యౌర నాకుగోర - నట్టికోర్కె॥

II. షేక్స్పియరు పద్యములను తెనిగించునపుడు కూడ తత్సమ పదములు వాడరాదను నియమమేర్పరచుకొనకున్నను, వీరు చాలచోట్ల అచ్చతెనుగే వాడిరి.

ఉదా :- 1) తన కుమారులు మూడవ రిచ్చర్డు రాజుచే చంప బడగా ఎలిజబెత్ రాణి దుఃఖించుట. Ah! My young princes! ah! my tender babes అను దానికి

ద్వి. తొలగిరా యకట న - న్నారబిడ్డలార।
పరువడి - నాముద్దు - పసికూనలార।
వావిడకుండిన - ననలార - క్రొత్త
గా వెలసిన మంచి - గందమ్ములార।
సంకెళ్ళు వడబోక - జమునిచేగాలి
నింక మీయాతుమ - లెరుగుచునున్న
మీ గాడ్పు ఱెక్కల - న్మెదలి నామీద
మూగుచు మీ తల్లి - మొఱ్ఱను వినుడు॥

(Richard III Ac. IV. Sc. IV)

అనువాదములో కరుణరసము ఏ మాత్రము చెడక మన మనసునకు హత్తుకొనుచున్నది.

III. దాసుగారి పాండిత్యము ప్రాక్తనజన్మ విద్యగదా! వీరి పద్య ములలో నొక విశిష్టతగల్గి, యితరకవుల యనువాదముకన్న నొక్కవింత సరళి యగపడును. శ్రీ కందుకూరి వీరేశలింగముగారి 'అభిజ్ఞాన శాకుం

తల నాటకము', 'మాళవి కాగ్నిమిత్ర' నాటకములనుండి (శ్రీ) వేదము వెంకటార్యశాస్త్రిగారి 'విక్రమోర్వశీయ' నాటకమునుండి, శ్రీ నండూరి రామకృష్ణాచార్యగారి 'విక్రమోర్వశీయ' నాటకమునుండి, (శ్రీ) మల్లంపల్లి శరభయ్యగారి 'మాళవికాగ్నిమిత్ర' నాటకమునుండి కొన్ని పద్యముల దాసుగారి పద్యములతో పోల్చిచూచుట యప్రస్తుతము కానేరదు.

1) దుష్యంతుని రథవేగము వర్ణించు 'యదాలోకే సూక్ష్మం' అను శ్లోకమునకు—

క. చిన్నది పెద్దదిగా - విడి
యున్నది కలసినటు - వంక - మరునది సరిగా
జెన్నారు - దపుల జెంగట
గన్నుల బడదెద్ది - తేరు కడువడిబోవన్. (నా. దా.)

దీనినినే రెండు పద్యములలో—

గీ. ఏది కడుజిన్నదైయుండు - నిప్పుడదియ
క్షణము లోపల గొప్పదై - కానిపించు
నేది నడుమను నెడముండి - యెసగుచుండు
నదియు నొకటిగా కలిసి యు - న్నట్లు తోచు॥

గీ. ప్రకృతి చేతను నెయ్యది - వక్రమగునొ
పరగ నయ్యది సమరేఖ - వలెనెయుండు
దూరమిది చేరువిదియని, - తేరివడిని,
నిర్ణయింపగ రా దేక - నిముషమననె॥ (కం. వీ)

2) 'సరసిజ మనువిద్ధం శైవలేనాపి రమ్యం' అను శకుంతలా వర్ణన శ్లోకమునకు—

గీ. తమ్మి పొలుపారు నాచున - దగిలియైన
మెఱుగునిడు నలుపయ్యు - జం - దురునిమచ్చ,
నారచీరైన నీమె చె - న్నారు - నంద
మైన రూపులకు దొడవు - కానిదెద్ది॥ (నా. దా.)

చ. నలినము శైవలంబున బె - నంగొని యుండియు రమ్యమేయగున్ ;
మలిన కళంకముం గలిగి - మంజుల తన్వహియించు జంద్రుడున్ ;
చెలువున మించె నీజలజ - నేత్రయు వల్కలధారణంబునన్ ;
తలపగ సుందరాంగులకు - దాను విభూషణమేదిగాదిలన్॥ (కం. వీ.)

3) దానిలోని దే యగు 'అనాఘ్రాతం పుష్పం' అను శ్లోకమునకు-

ఉ. క్రోలని క్రొత్తతేనె - మొన - గ్రుచ్చని మానికె - గోరునాటులన్
దాలచనట్టి లేజివురు - తావి గొనంబడనట్టి పూవునుం
బోలిన దాని సోయగము - ముందిటి నోముల మేటి పంటగా
బోలును - దాని నేలుటకు - బుట్టిన యాతనిదెంత పున్నెమో. (నా. దా.)

ఉ. వాసన చూడనట్టి ప్రస - వంబు, నఖంబుల ద్రుంపనట్టి నూ
త్నాసమ పల్లవంబు, బరు - లానని క్రొవ్విరితేనె, సూచి వి
న్యాసము లేని రత్నము, మ - హోతత పుణ్యఫలంబు బోలు నా
భాసుర గాత్రి సోయగమె - వండు భుజింప విరించి వ్రాసెనో. (కం. వీ.)

ఇదే విధముగ 'విక్రమోర్వశీయ నాటకమునుండి కొన్ని పద్యములకు దాసుగారి యనువాదములు; వానికి అనుగుణములగు శ్రీ వేదం వెంకటరాయశాస్త్రిగారివి, శ్రీ నండూరి రామకృష్ణాచార్యగారివి పద్యములు :—

1) 'ఏషామనోమే ప్రసభం శరీరా'— అను శ్లోకమునకు-

గీ. చదల నెగురుచు నీవేల్పు - సాని, నాదు
డెందమున్లాగు బల్మిమై - బొంది నుండి
త్రుంచబడినట్టి కొనగల - తూడునుండి
యాడు రాయంచదారము న్లోడునట్టు॥ (నా. దా.)

గీ. నా యొడలి నుండి సుందరి - నామనమును
తండ్రిమధ్య పదముకై - తానెగయుచు
నాచికొనె రాజహంసి లూ - నాగ్రమైన
కమలనాళంబునుండి సూ - త్రమునువోలె॥ (వే. వేం.)

గీ. ఈ సురాంగన మింటికై - యెగసినపుడు
నా శరీరమునుండి మ - నస్సు నూడ
దీసె దెగినట్టి తామర - తీగెనుండి
పోగులను రాజ హంసిక - లాగునట్లు॥ (నం. రా)

2) 'ఉష్ణాలు శ్శిశిరే నిషీదతి' అను శ్లోకమునకు—

చ. ఉడుకున కోడిజుట్టు పులు - గుండెడు జల్లని చెట్టుపాదునం
దెడబడజేసి గోగుమొగ - లెంతయులోన నణంగుఁదేటి - బి
ట్టుడికిన నీటిఁబొసిచను - నొడ్డున గల్గిన దమ్మికంచ - నీ
రడిగెడు గూటిచిల్కఁదగ - నల్లలలాడుచు నాటపట్టునన్॥ (నా. దా.)

దీనిని వేదం వెంకటార్యశాస్త్రిగారు రెండుపద్యములలో—

గీ. ఉలికి వేడికి నెమలి గూ - ర్చుండు సరిగ
పలిదొలకు తరుమూలాల - వాలమందు
కొండగోగున ముకుళంపు - కొనను దెఱచి
లోన నిందిందిరమ్ము దా - లీనమగును॥

గీ. క్రాగిన జలంబు విడదన్ని - కన్నెలేడి
గట్టునగు మెట్టదామర - చెట్టుచేరె
కేళి గృహమున పంజర - కీరమదిగో
వినుము క్లాంతమై సారెకు - వేడు జలము॥ (వే. వెం.)

ఇక నందూరి రామకృష్ణాచార్యుల వారిపద్యము—

చ. తలచగు చెట్టునీడ తల - దాచుకొనెన్ శిఖియెండవేడిచే
నరవిడు కర్ణికార సుమ - మందున దుమ్మెదడాగె. దీరవా
రిరుహలతా నివాసము వ - రించె గరండవ మెండమాడి, పం
జరమున బోదిచిల్క పొడి - నాలుకతోడ జలమ్ము వేడెడిన్॥

మాళవికాగ్నిమిత్రములోని శ్లోకములకు దాసుగారి యనువాదములు, శ్రీ మల్లంపల్లి శరభయ్యగారి, శ్రీ కందుకూరి వార్ల యనువాదములు బోల్చిచూడవచ్చును.

2) 'అవ్యాజ సుందరీం తాం' - అను శ్లోకమునకు-

గీ॥ నెపములేని సొగసు నెగడు నాయింతిని
హాయి యైన విద్దె - నలరజేసి
నలువచేత విసము - నం బాయ బడునట్టు
లలరు విలుతు ములికి - నలుపబడియె [నా. దా.]

గీ॥ సకియ కవ్యాజ మధురత చాలనట్లు
దాని పయి గూర్చి లలిత విజ్ఞాన మకట
అంబుజ భవుండుచేసె పం - చాధికముగ
నతను మూర్తికి విషదిగ్ధ - మైన శరము'। [మం. శ.]

గీ॥ విద్యచేతను సౌందర్య - విభవమునను
ధాత యిట్టి యవ్యాజ సుం - దరిని జేసి
విషము పూసిన బాణంబు - వేఱొకండు
పంచ బాణున కిపుడు క - ల్పించెదాను । [కం. వి.]

ఈ విధముగ నెన్ని పద్యములనైనను ఏరి, మనము దాసుగారి ప్రతిభను ఇతరకవులతో బోల్చిచూచిన, మొదటినుండియు సహజ గాన, కవిత్వశాలియైన వీరి పద్యములలోని తారతమ్యము, అచ్చతెను గులో వారు కనబర్చిన సొగసు బోధపడగలదు. అతుకుంచక పద్యము లల్లుట యనునది ఉత్తమకవితా లక్షణమని దాసుగారి యభిప్రాయము. పద్యపాద పూర్తితో పూర్తికాని భావప్రకటనా సౌలభ్యము కొఱకు పదములు తరువాతి పంక్తిలోనికి దొర్లిపోవుచుండును. ఈ పొర్లుటలో నన్వయక్లిష్టత లేకపోవుట వీరి కవిత్వములోని విశేషము. పొల్లుపదము లిందు మృగ్యములు.

IV. ఈ గ్రంథము అనువాద గ్రంథము కనుక వివిధరసపోషణ లోని గొప్పదనము మూలకవులకే చెందవలెను. కాని నవరసపోషణలో సిద్ధహస్తులైన దాసుగారి షేక్స్పియర్కాళిదాసుల రచనలలోనుండి తత్తద్విభాగములను ఏరుకొనుటలోను, వానిని తెలుగులోనికి యనువ

దించుటలోను, ఆ రసపోషణ చెడనీయకపోవుటయే కాక, మూలములోని మధురిమములను కోమల భావములను పోషించిన తీరు పరికింపుడు.

## ౧. వీర రసము :

1) Macbeth తన భార్యతో నన్న మాటలు :—

'I dare do all that may become a man.
Who dares do more is none.'

ద్వి॥ నరున కర్హమగు నం - తకును దెగింతు
మఱిచేయ జనువాడు - మనుజుడు కాడు॥

(Macbeth Act I Sc. VII)

2) "Why, what should be the fear?
I do not set my life at a pin's fee;
And, for my soul, what can it do to that
Being a thing immortal as itself?"

(Hamlet Act I Sc. IV)

గీ॥ ఏందు కేటి భీతి - చెందెదు - నొకగడ్డి
పరకపాటి నాదు - బ్రతుకు సరకు
గొనను - మఱియు - నాత్మగూర్చి - యేమది సేయ
గలుగు - శాశ్వతంబు గనుకనద్ది॥

3) 'కాత్వం శుభే కస్యపరిగ్రహోవా'- కుశుడు అయోధ్యానగ రాధి దేవతతో నను మాటలు-

గీ॥ ఎవతె వీవు చెలువ - ఎవని కిల్లాలవు
నాయెదుటికి వచ్చి - న కతమేమి
యడకువగల రగుల, యెడ - పెడమొగమిడు
వెలపడంతుల కని - యెఱిగి నుతువు॥ [రఘువంశం స. 16 శ్లో. 8]

## ౨. శాంత రసము :

1. 'To mourn a mischief that is past and gone' — అను రాజుమాటల్లకు —

ద్వి॥ గడచిన ముప్పుకై - కలగుట క్రొత్త
యిడుము పైకొనుట కెం - తే చేరుత్రోవ
దైవముచేయు నొ - త్తడి తప్పకున్న
నేవతో దానినో - ర్పు వెక్కిరించు

గొల్లవోయినవాడు - కొలకొలనగిన
ద్రుళ్ళుముచ్చులనుండి - దొంగిలున్గొంత
పనికిమాలినవంత - పడుచున్నవాడు
మొనసి తనకు దానె - మోసంబు చెందు॥ (Othello Ac. I Sc. III)

2) 'అపరాధీ నూనమహం' అను రాజు తన దేవేరిని ప్రార్థించుట

గీ॥ నాదే తప్పు - నిజమ్ముగ - నన్నుసైచి
విడువుమా చిడిముడి - నంటి తొడలదాన
యేలికకు నల్కవొడమిన యెడ - నదెట్లు
భానిసీకుడు నేరము నానకుండు॥

[విక్రమోర్వశీయము]

## 3. కరుణ రసము:

1) 'Rape of Lucrecy' లో లూక్రెసీ తన్ను బలిమిని చెఱచ వచ్చిన టార్క్విన్‌తో నను మాటలు - 'My husband is thy friend' అనువానికి —

ఉ॥ నాదు మగండు నీకు జెలి - నన్ను మిగుల్చుము వాని గూర్చి-నీ
వాదట గొప్పవాడవది యైన దలంచుము - విడువ్నన్ను నెం
తో దయ - మోసకానివలె దోచవు - నన్నిటుమోసపుచ్చ - కే
బేదను - బల్మిబట్ట - కొక పెట్టున నావలి యూరువునిన్ను బై
గా దెగదీయదాయె - నిటు, కాటియ పెట్టకు మాడుదానినిన్॥

2) 'Romeo and Juliet' లో జూలియట్ మూర్ఛదేరి, విషము త్రాగి మృతుడైన రోమియోను గూర్చి పల్కిన పల్కులు :— 'What is here? a cup closed in my true love's hand' - అనువానికి -

గీ॥ ఏమిటిచ్చోట - నొకగిన్నె - నా మనోహ
ర కర సంలగ్నమైన - దౌ రా - విషంబు
వాని కపమృత్యుకరమయ్యె - బరమలుబ్ధ
క్రోలితివ యంతయు - మరిమిగుల్చలేద
ప్రణయ బిందువు నాకు తో - డ్పడుట కింక,
ముద్దు బెట్టెదనేను నీ మోమి నిప్పు
డంటుకొని యుండవచ్చునేమైన గొంత
విసము - నన్నది చంపు నిర్వృతి చెలంగ॥

3) పూదండ పాటునకు మృతిచెందిన తన భార్యకై అజ మహారాజు పొగలు సన్నివేశములో - 'స్రగియం యది జీవితాపహా' అను శ్లోకమునకు :—

గీ॥ ఈ పువులదండ యునురెడ - బాపిన యెడ
నా యెడద నిడగా నినున్ - జంపదేల ?
యగు విసము బ్రీతికించు మం - దుగ నొకప్డు
కాచునది వేల్పుటిచ్చ నొకట విసమవు॥

(రఘువంశం స. 8. శ్లో 46)

4) శివుని ఫాలాగ్నిచే మన్మథుడు దగ్ధమైనపుడు రతివిలాపము - 'ఉపమాన మభూద్విలాసినాం' - అను శ్లోకమునకు —

గీ॥ పౌరు కతన, హొయల్గను - వారికెల్ల
నీదు నెమ్మేను పోల్కయై - నెగడుచుండె
నట్టి దిదిగో యిపుడు పొందె - నిట్టిపాటు
వ్రయ్యబడకుంటి - గడుగట్టి వారతివలు.

[కుమారసంభవం స. 4 శ్లో. 5]

## ౪. శృంగారరసము :

1) 'Fair ladies masked' - అనుదానికి :—

గీ॥ కొమరుగల స్త్రీలు మాఱుముఖముల దాల్చు
నపుడు మొగలౌ గులాగుల యట్టివారు

వేసముల విప్పి తమవన్నె - వెల్లడించు
తటి మబ్బుల దిగెడు న - చ్చరలు - మఱియు
నందముగ వికసించు గు - లాబు పువులు॥

(Love's Labour's Lost. Ac. V. Sc II)

2) 'What seest thou in the ground' అను వీనస్ ఎడొనిస్‌తో పలికిన పలుకులను :—

గీ॥ ఎందుకటు క్రిందు బూచెద వెత్తు శిరము
చూడు నాకంటిపాప - లచ్చోటను నీదు
సొగసు నెలకొను - జూపుల- జూపులుండ
నేల పెదవులు పెదవుల - నెనయరాదు॥

(Venus and Adonis)

3) 'కుమారసంభవ' కావ్యములో శివుడు ప్రత్యక్షమైనపుడు, పార్వతి స్థితిని వర్ణించు – 'తం వీక్ష్య వేపథుమతీ సారసంగయష్టి' – అను శ్లోకానువాదము —

గీ॥ వాని జూచి - చెమట పట్టి - వడకు పుట్టి
యడుగు పెట్టలేక - యాగలేక
దారి నడ్డుకొండ - తాకున సుడివడు
వంకవలె వలిమల - పట్టియుండె॥ (కుమారసంభవం, స. 5. శ్లో. 8)

4) 'విక్రమోర్వశీయములోని రాజు పల్కులగు – 'అనధిగత మనోరథస్య పూరం' – అను వానికి :—

గీ॥ నాదు కోరిక తీరకున్న తటి మునుపు
రేయి నాకబ్బెడున్నారు - రెట్టులగుచు
నీదు కూటమి యందట్లు - నెగడునేని
పునెము నాదె - చక్కని కను - బొమలదాన॥

## ౫ హాస్యరసము :

హాస్యము దాసుగారికి వెన్నతోట్టిన విద్య. సామాన్యముగ ఆయన అవకాశమున్నప్పుడెల్ల, హరికథలలో హాస్యము చొప్పించుచుం

డెడివారు. ఆ ధోరణియే వారి యీ అనువాద పద్యములలో గూడ గోచరించుచున్నది.

1) 'By medicine life may be prolonged, yet death will sieze the doctor too'

ద్వి॥ బ్రతుకు పొడ్గింపగ - బడు మందుచేత
మృతి వైద్యునిం గూడ - మ్రింగెడుగాని

(Cymbaline Ac. V. Sc V)

2) 'None wed the second, but who killed the First'

ద్వి॥ 'తొలి వాని జంపిన - తొయ్యలి తప్ప
మలి వాని పెండ్లాడి - మన దేవతైన'

(Hamlet Ac. III Sc II)

3. 'అజ్ఞాత్వా వనితోపమంత్రణ' - అని కాళిదాసు ప్రహసనములోని శ్లోకమున కనువాదము :—

గీ॥ చెలియ మంతన మెఱుగక - చీకటి నడ
గనక - బెడిదుడగు తలారి . కనుమొఱుగక
గొప్ప గోడదాటక - జుట్టు కోతవడక
పెర చెలింగూడు నెవడు - పోకిరి తెరువిది॥

## ౬. అద్భుతరసము :

1) అడవిలో రాజ్యభ్రష్టుడైన ప్రభువుతో జాక్విస్ అను మాటలు - 'All the world is a stage' అను ప్రఖ్యాత ఘట్టమునకు :—

(As you like it. Act. ii Sc, Vii)

చంపకమాలిక :

అరయగ నాట్యశాల జగ - మంతయు-నందలి నాటకుల్నరుల్
పొరిపొరి వారికిన్ గలుగు - బోకలు రాకలు - నొక్కడొక్కడి
త్తెరగున నేడు వేషముల - దెల్పెడు నాతని కాలమందు - గ
న్దెరవక దాదిచేతుల గ - దించిన నేడ్చెడు కందుముందు - బై
ఘుటియుచు తేతయొందబడి - మోమున జెన్నలదార జంకలన్

జరుపుచు బుస్తకంబులిడి - సొగసి డెందముతోడ - నత్తుకా
య రహిని బ్రాకుచున్ బడికి - నర్గెడు కుఱ్ఱడు - వెన్కగొల్మిపై
నొరసిన మాడ్కి వేంద్రమగు - నూర్పులు పుచ్చుచు - జొక్కచొక్క యె
త్తటి - దనలేమ కన్బొమ బ - దంబున పాడెడు వన్నెకాడు - పై
దురమున గోరమీస మెగ - దువ్వుచు - బల్పిరుదంద బాసల
న్నెఱపుచు - నీటిబుగ్గవలె నెగ్గడికీర్తి బిరంగి నోటిలో
నటిముటి దేవులాడు మగ - డాపయి - గుండ్రని బొజ్జ యందమై
తఱచుగ గ్రొప్పుచూపు ముదు - తల్వ్రడ - దిద్దిన గడ్డ మొప్పగా
విటివిగ గన్నులం దన - గభీరత మించగ మంచి పద్ధతిన్
గఱపుచు లక్ష్యముల్ దెలుపు - న్యాయవిచారణకర్త - యంత - బెం
పటి వదులైన పల్వతొడు గట్టిటు వ్రేలగ - ముక్కునందు డా
లురలు సులోచనంబు లిర - వొందగ - బ్రక్కను సంచియుండ-న
క్కఱ మెయి జిన్ననాట నిడు - గాల్తొడు గొక్కెడ నొప్పమీఱ-జె
చ్చెఱ మగగొంతు సన్నగిలి - చిన్నతనంబున నుండు పోలికన్
మఱిమఱి కీచు కీచనుచు - మాఱగ నాఱవ వేషమేగు - నం
త-రయము తోడుతన్ - బసితనంబు పదంపడి వచ్చెనా-మయిన్
దొరగిన కన్ను - పల్లు - చవితో దుదకెవ్వియు లే-కికేవియున్
గుఱుతు లెఱుంగ నీ కలిమి - గొబ్బున నేడవవేష మిట్టులం
దఱు కడువింతగా దన క - థల్పుడుపంగ ముగింపు బొందెడున్.

2) 'ప్రవాతనీలోత్పల నిర్విశేషం' – పార్వతీ సౌందర్యవర్ణనము.

గీ. బలుకరువలి యందలి నల్ల - కలువమాడ్కి
వెలయుచుండెడు వాల్గంటి - బెదురుచూడ్కి
యాడుజింకలనుండి యా - చేడెగొనెనొ
యాపె వలన నేర్చుకొనెనో - యాడులేళ్ళు.

[కుమారసంభము సర్గ. 1 శ్లో. 46]

## 8. రౌద్రరసము

1) Consumptions sow

In hollow bones of man అను వైమను పల్కులకు—

సీ. నరుల ఎముకలెల్ల నుఱుము సేయుడు, వారి-
మోకాళ్ళ నఱుకు డిప్పుడె మడిమల
నరముల ద్రెంచుడు, న్యాయవాదికి, గొంతు
బ్రద్దలుసేయుడు - వాడబద్ధ
పత్రములంబట్టి వాదించనీక సూ
క్ష్మాంశముల కికెన్న-డఱవ నీక
మతగురువుంబట్టి మైచర్మ మొలచుడు
వాడందరికి దప్పు వట్టుగాని

గీ. తాను దిన్నగనుండ డెం - తయును, వాని
ముక్కు గోయుడు మఱి - వాని డొక్కజీల్చు
డెవ్వ డందఱి జనముల - కెగ్గుసలిపి
యైన మిక్కిలి తన లాభ - మరయుచుండు.

ద్వి. వంగిన కురులున్న - వెన్నెకాంద్రను గ
డంగి బోడిగ జేయు - టకు దలకొనుడు.

కం. అని లోన దెబ్బలకు ద
ప్పిన కతనన్ బొగడు కొనెడు బిరుదు మగల జే
తనయిన యిడుమల బెట్టుడు
జనముల దుదముట్ట బాడునలుపుడు మీరల్.

(Timan and Actns Ac IV Se III)

2) 'సరోషదష్టాధిక లోహితోష్ఠ'— అను శ్లోకమున రణరంగ మున దెగువీరుల వర్ణన—

గీ. కినుకమై గర్వపడి కడు - గెంపు మిగుల
పలు దెఱలు - మీది శేకల దెలుపు బొమము
డులు - ములుకుల దెగిన కుత్తుకలును - బొబ్బ
లొప్పు పగఱ తలల నేల - గప్పె నతడు.

## ౮. బీభత్సరసము

1. **'Rape of Lucrecy'** అను కావ్యములో-బల్మి చెఱజరిగిన పిమ్మట టార్క్విన్ యొక్కయు లూక్రెసీయొక్కయు స్థితిని దెలుపు మాటలు

'He, like a thievish dog, creeps sadly thence'— అను వానికి,

సీ॥ అతడు దొంగ కుక్కట్టు లక్కడనుండి
యజడిం బ్రాకెడు - నాపెయచట
గడు రోజుచుండెను బడలికంబడు గొత్త
పిల్లకైపడి - వాడు బిట్టుసెచ్చు
కొంచు దన్నుం దిట్టుకొంచుండె దనతప్పు
గుఱిచి - యాపెయు దన గోళ్ళతోడ
మైజీల్చు కొనుచుండె మఱియు నాన దొఱంగి
నేరము జంకుల జైమటపట్టి

గీ॥ యతడు పర్విడు మెల్లన - నామె నాటి
బెడిదమౌ శేయికై మొఱ్ఱ - బెట్టుచుండె
వాడు పరుగెత్తుచు స్రోత - బడుచునుండె
సుంతలోన మునిగియు తన - సుఖముగూర్చె॥

2) 'ఋతుసంహార' కావ్యములోని గీష్మర్తువర్ణన – 'సముద్ధృతాశేష మృణాలజాలకం' అనుదానికి—

గీ॥ మెండుగా బెర్కబడు తమ్మి - తూండ్లు, నడుమ
బడిన మీలు - వెఱచి పాఱు - తెలిపులుగులు
కలిగి యొండొంట దాకు చే - గల మెకముల
పోరుచే దట్టముగ రొంపి -మీఱు మడుగు॥

## ౬. భయానక రసము:

1) 'Alas, What dawger will it be to us' —

ఆ. వె అకట మనకికేమి - యాపద కల్గునో
యంత దప్పు నడచు నపుడు - మనము
పడుచు కన్నియలము - బంగారు కన్న దొం
గలను రేచు సోయ - గంబు వడిగ॥

(As You Like it Act. I Sc, III)

2) 'గ్రీవాభంగాభిరామం' – అను శాకుంతలములోని లేడి వెఱపు –

ఉ॥ వెంబడు తేరు - పంక మెడవెట్టి పొరిం బొరుచూచు-నమ్ము పై
నింబడునంచు వెన్దలకు నివ్వెర ముందటి మేనుకంచు-బొం
తం బరుపు న్నగంబు తిను - దబ్బను డయ్యుచు నోరువిప్పి-యే
గుం బరికించుమా దిగువ - గొద్దిగ మెండుగ మింట దాటులన్॥

భయానక రసానుగుణముగ నున్నశైలి – యా బెదరిపారు లేడిని మనకు సాక్షాత్కరింపచేయును.

V. మహాకవులైన షేక్స్పియరాక్కాళిదాసులు ఒక్కొక్కతరి ఒకే భావనను వేర్వేరు ఘట్టములలో ప్రకటించిరి. వానికి మన నారాయణదాసుగారి యనువాదములు –

1. అ. నాయిక దుఃఖముతో నాయకుని వీడ్కొనలేక వీడ్కొనుట :–

'Love goes toward love, as school-boys from their books
But love from love, toward school with heavy looks;'

గీ॥ వలపు వంకబోవు వలపు - పొత్తమ్ముల
విడిచి యరిగెడు బడి - పిల్లలవలె
గాని - దానినుండి కదిలెడు నదిబడి
కేడ్పుతోడ వార - లేగునట్లు॥

ఆ. శాకుంతలములో నాయకునిరీతి :–

శ్లో॥ 'గచ్ఛతి పురశ్శరీరం ధావతి పశ్చాదసంస్తుతం చేతః
చీనాంశుకమివ కేతోః ప్రతివాతం నీయమానస్య॥

కం॥ బొంది ముసు నడచుచున్నది
డెంద మెఱుక లేక పారె - డి న్వెనువెన్కన్
దొందరగ - నెదురుగాలిన్
జెంది పడగనున్న పట్టు - చీర వితమునన్॥

VI. పెక్కుసందర్భములలో దాసుగారి యనువాదశైలి మూలము కన్న ఉదాత్తసరళిలో సాగినది.

1) 'Not the King's crown' —
(Measure for Measure) (Act. II Sc. II) లోని పై భావమును దాసుగారు —

ఉ. కాదు నృపాలమౌళియును - కాదదికారికి గల్గు కత్తియున్
గాదు చమూనియంతృగద - కాదు సభాపతి మేటి యంగియున్
గాదరవీసమైన దయ - కైవడి శ్రేష్ఠ విభూషణంబు-పే
రేదిన గొప్పవారియెడ - నింపు తలిర్చెడు చిహ్నమెద్దియున్.

అని అనువదించుచు, మూలమున లేని శబ్దాలంకారమును గూడ నిందు ప్రవేశపెట్టుటతో భావప్రకటనలో ఒక వింత శోభ ఏర్పడినది.

2. 'Two Gentelmen of Verona'
'His words are bonds' – అనుదానికి —

ఉ. ఆతని నుళ్ళోడంబడిక - లాతని యొట్టులు దేవవాక్కులౌ
నాతని ప్రేమ నిష్కపట - మాతని యూహల కల్మషంబులౌ
నాతని మానస ప్రచలి - తామలదూతలు వాని యశ్రులౌ
నాతని యాత్మవంచనకు నౌదవు - స్వర్గము భూమికింబలెః.

(Act. II Sc. VII)

3. 'విక్రమోర్వశీయము'లో పురూరవుని విరహవేదన —
'హృదయ మిషుభిః కామ్యస్యాంత స్సశల్య మిదంతతః — అను శ్లోకమునకు —

చ॥ మది నవవిల్లు తూపులను - మాటికిగాయము లందుచుండగా
నిదురెటు పోవగా గలను - నెచ్చెలినిం గలనైన బొంద జా
లుదునన - బోని - చిత్తరువులో నయిసన్నం బ్రాసిచూడ గ
ల్గుదునని నీరు నాకనులలో - నెటునిండక మాను, సంగడీ !

4. 'శాకుంతలము'లో శకుంతల స్వభావమును గూర్చి కణ్వుడు పూల మొక్కలతో ననుమాటలు —

శ్లో॥ ''పాతుం న ప్రథమం వ్యవస్యతి''—

ఉ॥ ఎవ్వతె ముందు మిమ్ము దని - యింపక త్రాగదునీరు దాల్చబో
దెవ్వతె మీపయిం జెలిమి, నింపయినం జివురాకుసొమ్ము - మీ
పువ్వు సమర్త యెవ్వతెకు - బొల్పగు పండువు - చెల్వునింట నా
జవ్వని యీ శకుంతల యె - సంగు నొసంగుడి యాన నెల్లరున్॥

VII. రసము చెడనీయక యమక ప్రష్టిగ కవితను చెప్పట సత్కవితకు ముఖ్యాంగమని దాసుగారి అభిప్రాయము. రసపోషణముకు వలయు సామగ్రి వీరికి కోకొల్లలు గలదు.

1. 'When beggars die there are no comets seen'
The heavens themselves blaze forth the death of princes.
అనుదానికి —

కం॥ కనుపడవు తోకచుక్కలు
మిను చక్కనిచ్చగాండ్రు మృతులైన యెడన్
పనివడి రాజుల చావున్
జనములకు దనంత బయలు చాటుచు నుండున్.

(Julius Caeser Ac. II Sc. II)

2. Virtue itself turns vice, being misapplied,
And vice sometimes by action dignified''

గీ॥ గుణమె దోషంబుగామాఱు గొన్ని చోట్ల
కర మప్రయుక్తంబగు కారణమున
విరచనా కౌశలంబున మఱియునొక్క
కాలమందున దోషమే గణుతి కెక్కు.

(Romeo and Juliet Ac. II Sc. III)

3 శ్లో॥ నీవారాశ్శుక గర్భకోటరముఖ - శాకుంతలములోని తపోవన వర్ణన-

ఉ. కిందికి రాలుచుండు వరిగింజలు చెట్టుల చిల్కతొఱ్ఱలన్
మందట గారపండ్లు చిదు - మన్ గడుసున్నగ నుండురాలు-బల్
నందడి కోర్చు మచ్చికల - సాగుచు నిచ్చకొలంది నిఱ్ఱులున్
బొందెడు నీటిపట్టు తెరు - వు ల్తడి కోకల చిమ్ము జాడలన్.

VIII. ఒక భాషలోని జాతీయములను యథాతథముగ మరొక భాష లోనికి మార్చుట రాణింపదు. కనుక అనువాదకుడు మూలము లోని పదములను, పలుకుబడులను, అవసరమైనచోట మార్చి భావమును మరింత సౌలభ్యముచేయుట కర్జము.

1. కణ్వుడు శకుంతల నత్తవారింటికి పంపునపుడు —

శ్లో॥ శమమేష్యతి మమశోకః । కథంనువత్సే త్వయా చరిత పూర్వమ్
ఉటజద్వార విరూఢం । నీవారబలిం విలోకయతః॥

అను శ్లోకమునకు —

కం. పట్టీ యెటు నా వగ కడ
ముట్టున్ - నాయింటి గుమ్మమున దొలి నీచే
బెట్టంబడి యిప్పటికిన్
బుట్టినటుల చెదరకున్న ముగ్గున్గనన్.

'నీవారబలి అక్కడి సాంప్రదాయము – 'ముగ్గులెట్టుట' మన గృహిణుల యాచారము.

2. "... ... ... for beauty is a witch ;
Aganist whose charms faith melteth into blood."
"…. …. …. పొలపొక మంత్రకాడతని బూమెలనెమ్మికరంగు మర్లగాన్"
(Much Ado About Nothing - Ac. II Sc II)

3. 'His nature is too noble for the world ;
He woult not flatter Neptune for his trident,
Or Jove for's power to thunder.'

చ॥ "అతని స్వభావ మీ జగతి, కత్యధికం – బొనరింపబోడు ప్రస్తుతి వల యీశు నాతని త్రిశూలము గూరిచి–యింద్రుదువాని గర్జితము గుఱించి..."
Neptune, Jove – పాశ్చాత్యుల దేవతలు – శివుడు, ఇంద్రుడు మనవారు.

(Coriolanus Ac. III Sc. I)

IX. సందర్భశుద్ధిగల పదములనేరి వాడుటలో దాసుగారు అందె వేసిన చేయి. ఈ క్రింది పదముల కనువాదములోని సొగసుల పరికింపుడు.

1) "So lust, though to a radiant angel liked,
Will sate itself in a celestial bed",
And Pray, on garbage

దివ్యమూర్తిని గలిసియుఁ దృప్తిపడక
గుహ్యచాపల్య మెంగిలి కూళ్ళు గుడుచు

(Hamlet Ac. I Sc V)

2) "Contend not, Sir; for we are gentlemen
That neither in our hearts nor outward eyes
Envy the great, nor do the low despise"

గీ॥ అయ్య కలహింపబోకు - మేమనగ - మేము
తగుమనుసులము - మాదు హృదయములందు
గాని - మాయాకృతులగాని - ఘనుల కీర్ష్య
పడ మలంతుల నవమాన పర్చ మెవుడు.

(Pericles Ac. II Sc. III)

2) శ్లో॥ 'అర్థోహి కన్యా పరకీయ ఏవ । తామద్యసం ప్రేష్యపరిగ్రహీతుః
జాతోమ మాయం విశదః ప్రకామం । ప్రత్యర్పితన్యాస ఇవాంతరాత్మా,'

గీ. వెల్లడిగనుగన్న పెరవాని సొమ్మెగా
యాపెమగనిచెంత కంపి - యిపుడు
దాచబెట్టినట్టి - డబ్బప్పగించిన
యట్లు నాయెడంద హాయిజెందె.

(శాకుంతలము)

X. పండిత పామర రంజకముగ యల్పాక్షరముల ననల్పార్థ రచన చేయుట, మూలములోని గూఢమైన భావమును రసవంతముగ వెలికి దెచ్చుట వీరికి నల్లేరుపై బండినడక వంటిది—

1) There is nothing either good or bad, but thinking makes it so :—

మంచిచెడ్డలు తలంపున దప్ప బైటలేవు.

(Hamlet Ac. II Sc II)

2) So Play the foolish throngs with one that swoons;

Come all to help him, and so stop the air
By which he should revive.

గీ. మూర్ఛనున్న వాని బోషింపగోరి - వి
వేక హీనులెల్ల - బిండుగట్టి
వానిచుట్టుమూగి - వానిదేర్పగలుగు.
నట్టి గాడుపు నరి - కట్టు దురటు.

(Measure for Measure. Ac. III Sc. IV

3) 'That what we have we prize not to the worth'—

కం. మనకు గలదాని విలువను
మనము న్గొనియాడ - మద్ది మన చెయిజాఱన్
మన కది కావలసినచో
గనబడు నద్దానికున్న - ఘన సుగుణంబుల్.

(Much Ado About Nothing Ac IV Se. I)

4) శ్లో. 'ఉన్నతేషు శశినః ప్రభాస్థితా'

గీ. చందురు వెలుగు మిఱ్ఱుల - యందునుండె
మాపు చీకటి పల్లంబు - ప్రాపు దవిలె
దమకు దగిన గొనముట్టి దో-సముల నడత
నిక్కముగ దమ్మిచూలిచే - నెరపబడియె.

(కుమారసంభవము స. 8. శ్లో. 66)

5) శ్లో. 'పాత్ర విశేషన్య స్తం'—

గీ. పాతరల బట్టి పనివాని - పనితనంబు
తనరు చుండెడు నొకవింత - గొనము పొంది
కడలి ముత్తెపు జిప్పలో - బడిన మబ్బు
నీరు సుప్రాణియౌచు దా - మాఱునట్లు.'

(మాళవికాగ్నిమిత్రము)

XI. షేక్స్పియర్ రచనలనుండి, కాళిదాస రచనలనుండి ఘట్టములను తెలుగులోనికి అనువదించుటయే కాక, షేక్స్పియరు రచనను సంస్కృతములోనికి - కాళిదాసు శ్లోకములను ఆంగ్లములోనికి యనువదించి చూపి, తన పాండితీ ప్రకర్షకు గీటురాయి నేర్పర చిన మనీషి శ్రీ దాసుగారు.

1) Hamlet (Ac. I Sc. I)—

'He was a man, take him for all in all,
I shall not look upon his like again'—

ద్వి. పురుషు డాతండు సంపూర్ణ గుణుండు
నరయబోవనిక నే - నతనికిసాటి.

శ్లో. 'సోఽభూత్పుమాన్సర్వథైవ - సంపూర్ణ సుగుణాకరః
నాహం కదాపి వీక్షిష్యే - తస్య ప్రతినిధిం పునః.'

2) King John (Ac. IV Se. II)—

'To guild refined gold, to paint the lily,
To throw a perfume on the violet,
To smooth the ice, or add another hue
Unto the rainbow, or with taper - light
To seek the beauteous eye of heaven to garnish,
Is wasteful and ridiculous excess.

ద్వి. బంగరు పూత మే - ల్బంగారమునకు
జెంగలువకు రంగు - సేత నెత్తావి
నురవొన్న కెరవు తె - చ్చుట - మంచుగడ్డ
మరి నున్పుసేయుట - మఱియొక రంగు
నగవైరివింట నొ - నర్చుట - పట్ట
పగులు వెలించెడు - భానుని కాంతి
హెచ్చింప జేవత్తి - నెత్తిపట్టుటయు
నచ్చుపు నగుబాటు - నధికము - వృథయు.

శ్లో. స్వర్ణే హేమ విలేపనం సమధికే రక్తోత్పలే రంజనం
చాంపేయ ప్రసవే సుగంధకలనం హైమోపలే స్నేహనమ్
దేవేంద్రస్య శరాసనే సముదితే వర్ణాంతర ప్రాపణం
దీపే నార్క రుచి ప్రదీపన, మతి వ్యర్థమ్మహాసాస్పదమ్.

3) Romeo and Juliet (Ac. I Sc. V)—

'O, she doth teach the torches to burn bright!
It seems she hangs upon the cheek of night
Like a rich jewel in an Ethiop's ear;
Beauty too rich far use, for earth too dear!

So shows a snowy dove trooping with crows,
As yonder lady o'er her fellows shows.

గీ॥ చిలుకల కొలికి దివిటీల - వెలుగ నేర్పు
కలికి వజ్రంబు పగిది జీ - కటిని మెఱయు
నందమందు నత్యధికంబు - నవని కరుదు
కాకులం దంచ యది తోడి - గరితలందు.

శ్లో॥ అత్యంతం ప్రజ్వలితు మబలా శిక్షతే - హో ప్రదీపాన్
రాత్రౌ కాళీ శ్రవణ విచల ద్రత్న భూషేవభాతి
సౌందర్యం చానుభవతు మతిశ్రేష్ఠ మురొ్వ్య అమూల్యం
వాయన్యోఘే చరతి వరటావత్సఖీ మండలేసా.

4) మేఘసందేశము (స. 2. శ్లో 21)

శ్లో॥ తన్వీశ్యామా శిఖరి దశనా పక్వబింబాధరోష్ఠీ
మధ్యే క్షామా చకిత హరిణీ ప్రేక్షణా నిమ్ననాభిః
శ్రోణిభారా దలస గమనాస్తోక నమ్రా స్తనాభ్యామ్
యాత్రతా స్తే యువతి విషయే సృష్టిరాద్యేవ ధాతుః.

సీ॥ పల్చని మైదీగ - బరగెడు నెలనాగ
నడు జవ్వనంబున - న్దనరు చామ
నూది పలాచ్చలున - సొంపగు ముద్దియ
నిండార బరడిన - దొండపండు

నగెడు వాతెఱగల - ననబోడి సన్నని
కౌనుకుల్కెడు మచ్చె - కంటి బెదురు
లేడిచూపుల వన్నె - లాడి లోతైన పొ-
క్కిలిగల్గు చిలుకల - కొలికి పిఱుదు

గీ॥ బరువుమై నడుప్పె మెల్లన - వలగు నుంత
చన్నుగవ వ్రేగుతోడనే - యన్ను మిన్న
యలరుచుండెడు - జెలువల నలువ దలచి
నలువ యొనరించు తొలిమచ్చు - నాగనచట.

'She who is there a lovely and delicate woman of middle age, sharp toothed, scarlet lipped, tender waisted, gazzle - eyed, deep navelled, slow footed, on account of heavy loins, slightly bent down by breasts; like the first female creation of the creator.'

5) రఘువంశము (స. 1 శ్లో 15) —

శ్లో॥ ఆకార సదృశ ప్రజ్ఞః ప్రజ్ఞయా సదృశాగమః
ఆగమై సదృశారంభ ఆరంభ సదృశోదయః

గీ॥ పొగమునకు దగునట్టి తెల్వికలవాడు
తెలివికిందగు చదువుల వెలయువాడు
చదువులకు దగిన పనిని సల్పువాఁడు
పనికి దగినట్టి పెంపున దనరువాడు,

'He is as intelligent as beautiful, as learnd as intelligent, as engaged, as learnd, as famous as engaged.'

6) విక్రమోర్వశీయము —

శ్లో॥ ఆభరణస్యాభరణం ప్రసాధన విధేః ప్రసాధన విశేషః
ఉపమానస్యాపి సఖే ప్రత్యుపమానం వపుస్తస్యాః

కం॥ తొడవులకు దొడవు వేసం
బుల చందంబునకు వేసముల చందంబో
చెలికాడ - దాని యందం
భలరారెడు రూపు - పోల్కియా బోలికకున్.

'Ornament of ornaments, decoration of decorations, simile to simile, friend! her beauty is.'

ఈ విధముగ తనకు వాణీవిలాసము వాచోవిధేయమని ఋజువు చేసికొనిరి. శబ్దార్థముల పొందిక పార్వతీ పరమేశ్వరులవలె వీరి సరళిలో సంపృక్తమై యుండును.

XII. లోకములోని సామాన్యానుభవములు చిన్నచిన్న వాక్యములలో రసవంతముగ చూపుటయన్నది షేక్స్పియర్కాళిదాసుల రచనలలోని ఒక సొగసు. దానికి దాసుగారి యనువాదములును అట్లేయుండును.

1) 'Moderate lamentation is the right of the dead,
Excessive grief the enemy to the living.'

ద్వి॥ మితమగు దుఃఖమ్ము మృతులకు సొమ్ము
బ్రతుకు వారల కతిపరితాప మెదిరి.

(All Is Well That Ends Well Ac. I Sc. I)

2) 'all that lives must die,
Passing through nature to eternity'

ద్వి॥ బ్రతికెడు నది చాప - వలయు మర్త్య ప్ర
కృతినుండి పోవు చ - మృత పదంబునకు.

(Hamlet Ac I Sc II)

3) 'And I have heard it said, unbidden guests
Are often welcomest when they are gone'

ద్వి॥ పిలువని విందులు - వెళ్ళిన వెన్క
నెలమి నింపొదు రం - చే విన్నవాడ.

(Henry VI Part I Ac. II Sc. III)

4) But when the fox hath once got in his nose,
He'll soon find means to make the body follow'

ద్వి॥ తన మూతి దూరిన - తరువాత నక్క
తనువెల్ల దూర్చు సా - ధనమందు వేగ.

(Henry VI Part III Ac. IV Sc. VII)

5) 'There was never yet Philosopher
That could endure the toothache Patiently'

ద॥ పలునొప్పికి న్బాధ - బడబోక సైప
గలిగిన వేదాంతి - కలుగ డిప్పటికి.

(Much Ado About Nothing Ac. V Sc. I)

XIII దాసుగారు చిఱుత వయసు నుండియు ప్రకృతిని, ప్రకృతి సౌంద ర్యమును జాగరూకతతో బరిశీలించెడివారు. తన కవితలోని ఉపమానములను, సొగసులను ఆయన ప్రకృతినుండియే గ్రహిం చెడివారని ప్రతీతి. కాళిదాస షేక్స్పియరుల కవిత్వములలో ప్రకృతి వర్ణనలకు వెదుక నవసరము లేదుకదా! ప్రకృతిలోని ఋతువులను, చెట్లను, వర్షమును, పూలను, ఒకటేల - సమస్త చరాచర వస్తువులను కాళిదాసు హృదయంగముగ వర్ణించి నాడు. వానిలో కొన్నింటికి దాసుగారి యనువాదములు —

1) 'సుభగ సలిలావగాహాః' - అను శాకుంతలము నందలి వసంతర్తు వర్ణన —

కం॥ చల్లని నీరాటములఁ
మెల్లగఁ బందిరులతావి - మెలగెడు గాలుల్
మొల్లపు నీడల పడకలు
నెల్లెడ ముగిసిన కొలంది - నింపగు పవళుల్.

2) 'జ్వలతి పవన వృద్ధః పర్వతానాం దరీషు' - అను ఋతుసంహారము (స 1 శ్లో. 52) లోని గ్రీష్మర్తువర్ణన —

గీ॥ మెట్ట పల్లంబుల న్గాలి - మీటిమండు
బెను రొదల [గాలు నెండిన - వెదురు పొదల
గడ్డి దిరుగు నొక్కుమ్మడి - న్గసిమసంగి
కండ దగిలి కారు చిచ్చు మొ - గముల గలచు.

3) 'శృంగార తిలకము' లోని 'క్షురతుసార శీకరాః' - అను చంద్రో దయ వర్ణనము —

గీ॥ తొరగుచుండెడు మంచు తుం - పరలగల్గి
మిగుల గల్వల తొగలను -మేలుకొల్పి
తొగల రాయని చేతులు - జగములందు
నేపు మీఱుచు నుండెడు - నాపిదపను.

(స 2 శ్లో 53)

ఈ విధముగ నీ గ్రంథములోని సొగసుల నెన్నియైన జూప వచ్చును. కాని గ్రంథవిస్తర భీతిచే కొన్నిమాత్రము చూపి, విరమించు కొనుచున్నాడను. వీనిలోని భావములు, విశేషములు దాసుగారి స్వంతము కాదు కాన ఒక విధముగ నిది ఎఱువు సొమ్మనియే చెప్పవలెను. కాని వీరి విద్వత్ప్రౌఢికి, రమ్యమైన పద్యరచనా ప్రాగల్భ్యమునకు నిది యొక నవ్యనిదర్శనము. నలుబది మూడు షేక్స్పియర్ గ్రంథములను, పండ్రెండు కాళిదాసు గ్రంథములను సమగ్రముగను, విమర్శనాత్మక పరిశీలన దృష్టితోడను చదువుట, వానిలోని రసవత్తర ఘట్టముల నేరుట, ఆ ఘట్టములను నవరస దృక్పథముతో విడదీసి, వాని నన్నింటిని తెలుగులోని కనువదించి, సముచితముగ విరచించుటకు దక్షత గలవాడు సామాన్యుడు కాడు. శారదా కటాక్షపాత్రుడు తప్ప మరియొకడీపని చేయలేడు. చిన్నప్పుడు విద్యాభ్యాసకాలములో సాధారణముగ గురుశుశ్రూష వలన జరుగు గ్రంథపఠనము పరిశ్రమ వీరికి అంతగా లేదు. వీరిదంతయు స్వయంకృషి వలన అబ్బిన విద్యయే. ఉపరి, వీరు ఎక్కువ హరికథలకు, కచేరీలకు, రాజదర్శనములకు దిరుగుచుండెడివారు. అంత తీరికలేని వ్యాపకములున్నను వీరు పెక్కు గ్రంథముల పఠించుటకు, పలుభాషల నేర్చుకొనుటకు స్వయముగ కృషిచేసిరి. వీరి విజ్ఞాన గంగా వాహిని నుండి సముత్తుంగ గ్రంథతరంగము లనేకము వెలువడినవి. ఇట్టి బహుముఖ సాహిత్యసృష్టికి వీరికి తీరిక యెక్కడిదో ! అన్నింటికన్న ఆశ్చర్యకరమైన విషయమేమన - మహాకవులైన షేక్స్పియర్కాళిదాసుల రచన లితః పూర్వ విద్యాధికులందరు చదివి, యానందించుచునే యున్నను, ఆ కవుల రచనలలోని సొగసులను నొకచోట గూర్చి

తెలుగువారి కందించవలెననెడి యాలోచన వీరి కొక్కరికే తట్టినది. ఒక మహాకవి గ్రంథమును మరియొక భాషలోని కనువదించుట యనున దంతటి మహాకవికే సాధ్యము. లేకున్న మూలకవి ప్రతిభను గ్రహింప లేడు. మూలములోని స్వారస్యము నందింపలేడు. దాసుగారే మరియొక చోట —

'A born Poet or a musician only can criticise his like, but the borrowed feathers, the manufactured scholars become helplessly unqualified either to appreciate or criticise a born poet or a musician' అని అనియున్నారు.

వీరి శైలి, శాస్త్రవిజ్ఞానము, కల్పనా చాతుర్యము అపురూపము. వీరు పద్య గద్య రచనా సరళిలో పూర్వకవుల సిద్ధాంతములనే అనుస రించిరి. యతి ప్రాసాది ఛందో నిబంధములను పాటించుచు, అవకాశ మును బట్టి అనుప్రాస, అంత్యప్రాసలు ఉపయోగించుట వీరి కభిమతము. మూలములోని రచన కనుకూలముగ తెనుగుసేతలో ద్విపద, వచనము, గీతము, వృత్తము - ఆ మూలభావ పరిస్ఫూర సౌలభ్యమునకై ఉపయో గించిరి. ఇది కావ్యమా? దీని ప్రయోజనమేమి? అని తర్కించినచో హృదయము రంజింపజేయుట, ఉపదేశించుట - ఇవి రెండు కావ్యధర్మ ములు కదా! అందులో ఉపదేశ విధాన మెట్లున్నను, సహృదయ మనః ప్రకాశ మొనర్చి ఆనందింప జేయుట కావ్యమునకు ముఖ్య ప్రయోజన మని యంగీకరింపక తప్పదు. జనుల కుల్లాసము కలిగించి యున్నతపథము నకు తీసికొని పోవునదియు, రసానుభూతిద్వారా పఠితల కానందము కలి గించునదియే సత్కావ్యము. 'ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్' కవి యొక్క రచన ఉత్తమమైనచో రసజ్ఞులైన వారు దానిని పలుమారులు చదువుచుందురు. అదియే కవి ప్రతిభకు తార్కాణము.

'అపారే కావ్య సంసారే కవిరేవ ప్రజాపతిః
యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే'

కవి తాను నివసించు కాలమునకు ప్రతినిధి. ఉత్తమ కవియొక్క సృష్టిలో నాటి మానవ సంఘములోని సముచిత భావములు, నిబిడమైన లోక ప్రకృతి, ప్రస్ఫుటమగుచుండును. కాళిదాసు, షేక్స్పియరులు ఎంత మహాకవులైనను, వారు కూడ సంఘజీవులే. కనుకనే వారి కవిత ఆనాటి సంఘజీవితమునకు దర్పణమని చెప్పవచ్చును. లౌకిక సంబంధములేని కవిత నేలవిడిచిన సామువంటిది. సంఘజీవితములతో ముడిపెట్టబడని సాహిత్యము చిరకాలము మన్నదు. షేక్స్పియరు ఆకాలములోని పాశ్చాత్య జీవిత విధానమును ఆకళింపు చేసికొని స్వరచనలలో తత్కాలపు మానవ జీవితగతులు, మానవ ప్రకృతులు ప్రతిఫలింపజేసి చూపిన మహాత్ముడు. కాళిదాసు తన యితివృత్తములను ప్రాచీన సాహిత్యము నుండియే గ్రహించినను, తన కాలమునాటి భారతీయ సంఘ సాంస్కృతిక పరిస్థితులను తన రచనలలో రసవత్తరముగ ప్రతిబింబ చేసిన మహాకవి. అటువంటి సాహిత్య స్రష్టలు ద్రష్టలు అయిన మహాకవుల కవితాసృష్టిలోని సొగసులను మనకెత్తిచూపిన వారు మన నారాయణదాసుగారు. ఈ నవరసతరంగిణి గ్రంథమంజూషలో నవరస రూపమైన రత్నములను నిక్షేపించి వీరు ఆంధ్రుల కర్పించిరి. ఇది పరివర్తన గ్రంథమైనను, ఒక స్వతంత్ర గ్రంథమువలె తమ పాండితీ ప్రకర్షణమునకు, తమ సిద్ధాంత ప్రబోధమునకు నాధారము చేసికొని వారి విజ్ఞాన చతురత నిరూపించుకొనిరి. ఈ మహాకవిని నవరస సామ్రాజ్య చక్రవర్తి యనిన అత్యుక్తి కాదని అస్మదభిప్రాయము.

ఈ గ్రంథ విమర్శనలో నేను దీనిలోని లోపములు చూప ప్రయత్నింపలేదు. 'సుకవుల సూక్తులందు సరసుల్ నెరసుల్ వెదకంగ బోరు' కదా! రససిద్ధుడు, సాహితీ స్రష్టయైన ఈ మహామహుని గ్రంథము రసమయము ఆనంద ప్రధానమైన గ్రంథము కనుక దానిలోని రసము గ్రహింపవలయు ననియెడి తలంపుతో ప్రయత్నించితిని. గ్రంథమున కవియొక్క సంకల్పమేమి? అది ఎంతవరకు నెరవేరినది? కవి

యొక్క కల్పనాశక్తి ఎంతవరకు నిందు ద్యోతకమగుచున్నది? - అను విమర్శనా దృష్టితో పరిశీలించిన ఈ గ్రంథము సహృదయులకు హృదయ పరిమోద ప్రదమై, ఆమోద యోగ్యమై యుండునని చెప్పదగు. ఏనాడో గతించిపోయిన కవిపుంగవులలో నెవరికన్న నెవరధికులని చర్చించుటకన్న, వారిద్దరి వర్ణనా చమత్కృతి, భావ గాంభీర్యము, రస పోషణ గ్రహింపగలిగినచో నీ గ్రంథ రచనలో రచయిత సంకల్పము పరిపూర్ణత జెందినదని భావింపవచ్చును.

తిక్కన 'భారతామృతము కర్ణపుటంబుల నారగ్రోలి ఆంధ్రావళి మోదమున్ బొరయునట్లుగా' భారతము వ్రాసితినన్నను, పోతన 'చెప్పె భాగవతంబు జగద్ధితంబుగన్' అన్నను, నారాయణదాసు 'ఆంధ్ర జనోప కారమగునని యెంచి' - అనినను - ఇదియే కదా! 'విశ్వశ్రేయః కావ్యమ్' రసజ్ఞుడు, సహృదయుడునైన పఠిత యే గ్రంథమును చదివి బ్రహ్మానంద సబ్రహ్మచారి యగు నానందము బొందగలడో - అట్టి కావ్యమే రసాత్మకమైనది.

'రసోవైసః, రసగ్ం హ్యేవాఽయం లబ్ధ్వానందీభవతి'

[నవరసతరంగణి 1922 లో ప్రకటితము. విజయనగర ప్రభువు శ్రీ అలక నారాయణ గజపతి మహారాజున కంకితము. ఈ ఉత్తమ గ్రంథము ప్రతులిప్పుడు మిక్కిలి అరుదై పోయినవి. త్వరలో పునర్ముద్రణావశ్యకత యెంతైన నున్నది - సం.]

# ఉమరఖైయామురుబాయితు

## [సంస్కృతాంధ్రానువాదములు]

ఉపోద్ఘాతము : శ్రీ తల్లావజ్ఝల శివశంకరస్వామి

సామాన్యభాషలలో ఉండే ఉత్తమగ్రంథాలు సంస్కృతములోనికి అనూదితాలు కావు; అటువంటి అదృష్టం ఏగ్రంథానికో గాని పట్టదు. మ్లేచ్ఛభాష అయిన పారసీలో ఉమర్ ఖైయామ్ రుబాయీలు (రుబాఇయాన్) గీర్వాణవాణిలోకి వచ్చిన వంటే ఆనందమూ, ఆశ్చర్యమూ కలుగక తప్పదు. అనువాదకుడు ఉభయభాషలలో ఉత్తీర్ణుడైన కవికూడా కావాలి. అన్నిగుణములు కలిగిన ఆదిభట్ల నారాయణ దాసుగారు రుబాయీలును సమర్థతతో సంస్కృతమున సంతరించినారు.

ఒకానొక, సందర్భములో నారాయణదాసుగారు సంస్కృతమున ప్రసంగిస్తూ ఉండగా వ్యాకరణదోషము దొరలిన దట. "హరికథలు చెప్పుకొనేవారికి సంస్కృతపాండిత్యము దుర్లభము" అని అక్కడి పండితు డొకడు ఆక్షేపించినాడట. అనంతరము దాసుగారు బాగా కృషిచేసి శబ్దేందుశేఖరము వంటి గొప్పవ్యాకరణశాస్త్రగ్రంథము స్వంతముగా అన్వయించుకొనేవారట. మహోపాధ్యాయ కల్లూరి వేంకటరామశాస్త్రిగారినీ, నారాయణదాసుగారికీ అటువంటి ప్రతిభ ఉండేదని దువ్వూరి వేంకట రమణ శాస్త్రి గారు ఒక సందర్భములో మాతో అన్నారు.

దాసుగారు సంస్కృతభాషలో అనేక కృతులు రచించినాడు. గ్లాడ్‌స్టన్ మహాశయుడు వార్ధకమున గ్రీకుభాష నేర్చుకొన్నట్టు, దాసుగారు 60 యేండ్ల తరువాత ఫారసీ అభ్యసించి, 70 సంవత్సర ప్రాంతములో రుబాయీలు సంస్కృతీకరించినారు.

**EDWARD FITZ GERALD** గత శతాబ్దిలో కొన్ని రుబాయీలు ఆంగ్లీకరించి ప్రకటించినతర్వాత ఉమర్ ఖయ్యాముకు జగద్విఖ్యాతి వచ్చింది. మన దేశములోని వివిధ భాషలలోనికి ఉమర్ రూబాయీలను చాలమంది కవులు అనువదించినారు. కాని సంస్కృతములోనికి మార్చినది వీరే.

ఈ గ్రంథము చాలా బాగా ముద్రితమయినది. ఫారసీ రుబాఈ; F. G. ఆంగ్లపద్యము; సంస్కృత శ్లోకము, గీతిక; ఆంధ్రమున కందము, మంజరి మొదలైనవి; గ్రంథాంతమున ఫారసీపదముల నిఘంటువు వ్యాకరణ విషయములు; ఇంగ్లీషు, తెలుగు, సంస్కృత అర్థములూ ఇచ్చినారు, ఆదిలో ఆంగ్ల సంస్కృత ఆంధ్రములలో పీఠిక లున్నవి. సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు తొలిపలుకు వ్రాసినారు.

కాశ్మీర దేశమునుంచి ప్రాచీనకాలములలో పారసీక దేశానికి బ్రాహ్మణ కుటుంబాలు రాజాహ్వానముమీద వెళ్ళినవి. అందులో ఒకానొక విద్వత్కుటుంబానికి చెందినవాడు ఖైయూమ్ అని దాసుగారు వ్రాసినాడు. కాని అందుకు తగినంత ఉపపత్తి చూపలేదు. సర్ మొహమ్మద్ ఎక్బాల్ కవి తాతముత్తాతలు బ్రాహ్మణు లయినట్లు, ఖైయూమ్ పూర్వులు బ్రాహ్మణులు కావచ్చును. ఎందరు బ్రాహ్మణులు కారణాంతరాలచేత మతాంతరులు కాలేదు? అతని ప్రతిభావిశేషాలను పరికిస్తే అతనిలో బ్రాహ్మణ రక్తము ఉన్నట్టు తోస్తుంది. కుర్షీద్ కమందీ ... అఫ్‌గండ్ అనే ప్రథమ పంక్తిలో కుర్షీద్ శబ్దమునకు సూర్యుడని అర్థము. ఖైయూమ్ సూర్యోపాసకుడనీ, ఖగోళశాస్త్రజ్ఞుడనీ దీనివలన తెలుస్తుందని దాసుగారు వ్రాశారు. కావచ్చును.

వాక్కులను బట్టి ఖైయామ్ కౌళికుడు అని కూడా చెప్పవచ్చును. మద్యము మగువ అనేశబ్దములు తరుచుగా కనబడుచున్నవి. శాక్తేయుల 'రుద్రయామళ' గ్రంథములో "సురాశక్తిః, శివోమాంసం, తద్భక్తో భైరవః స్మృతః" అని ప్రమాణవచనము. "పీత్వా, పీత్వా పునః పీత్వా యావత్ పతతి భూతలే పతన్నపి పునః పీత్వా జీవన్ముక్తో భవేన్నరః అనే కౌళికవచనము ప్రసిద్ధము కదా !

ఉమర్ ఖైయ్యామ్ ఉత్తమ పురుషుడు. ఆయన ప్రశంసించే మదిరాదులను యథాతథముగా గ్రహింపగూడదు. అంతరార్థ బోధకాలుగా సంకేత పదాలుగా వాటిని భావించాలి. మదిర అన్నపుడు భక్తి అనీ, మహిళ అంటే శ్రద్ధ అనీ తాత్పర్యము. పారశీక దేశములో మతగురువులనీ, తత్త్వవేత్తలనీ తిరిగే డాంబికులమీద ఉమర్‌కు హేయభావము. నైయాయికుల శుష్కతర్కము, డాంబికుల ఆచార నిష్ఠా ప్రకటన, కేవల గ్రాంథికుల శుకానువాదము, విని విని, చూచి చూచి విసుగుపుట్టి ఖైయ్యామ్ కవి వక్రోక్తిలో ఒక విధముగా కర్మమార్గము సూచించినా డనవచ్చును. ఇహలోక విషయములను పూర్తిగా నిర్లక్ష్యముచేసి పరలోకమని మాటలతో పాకులాడే వారిని మందలించడమే ఆయన పెట్టుకొన్న విధానము. దృశ్యమాన ప్రపంచము నశ్వరమనీ, శాశ్వత పదార్థము ఒకటి ఉన్నదనీ ఆయన హృదయము. ఖైయామ్ ఒక రకమైన Pragmatist అనిపిస్తుంది.

ఖైయ్యామ్ నూరుసంవత్సరములు జీవించినాడట. జీవితమున ఉత్తరార్థములో పట్టణానికీ పంట పొలాలకూ మధ్యలో అడవి పక్కన ఉన్న సెలయేటి ఒడ్డున తోటలో, సౌధములో తన మనసు కెక్కిన మగువతో కాలక్షేపం చేసేవాడట. తనమీద ఆదరముచేత అక్కడికి వచ్చిపోయే వారితో సరస సల్లాపములాడుతూ ప్రసంగ వశాత్తూ ఏదో రుబాయి పలికేవాడట. ఈ విధముగా ఆయన రుబాయీలు పెరిగినవి. కొందరు కవులూ, విద్వాంసులూ, తత్త్వవేత్తలూ వాటి సంకలనము

చేసినారు. ఉమర్ అనేక శాస్త్రములు తెలిసినవాడు. నిష్ఠతో కూర్చుని గ్రంథరచన చేసినట్లయితే, అంత పునరుక్తి, పిష్ట పేషణము స్వల్పవిషయ పరిజ్ఞానమూ ఆయన రచనలో ఉండేవి కావు. రుబాయాత్ -ఇ- ఉమర్ ఖైయామ్, అంతేకాని ధివానీ ఇత్యాది నామము లేదు. ఏమయినా పద్యాలు మణిఖండములు.

మనలో వేమన పద్యాలు ఇటువంటివే. ఏదో సందర్భములో ఆయన ఆటవెలది చెప్పేవాడు. ఎవరో అభిరామయ్య భద్రము చేస్తుండే వాడు. ఈ విధముగా అనేకము పెరిగినాయి. చివరకు ఆయనవి కానివి కూడా ఆయనదే అని సంకలన కర్తలు నమ్మారు.

ఉమర్ ఖైయ్యామ్ రుబాయీల స్థితికూడా అలాగే అయింది. Fitz Gerald ఆంధ్రీకరించే నాటికి, Prof. Cowell వ్రాత ప్రతిలో కొన్ని వందల రూబాయీలే ఉన్నవి. తర్వాత కొంతకాలానికి జర్మనీలో Dr. Rosen ఆరువందల రూబాయీలు సంగ్రహించినాడు. Einjielo మహాశయుడు ఐదువందల రుబాయీలు ఆంగ్లీకరించినాడు. తర్వాత కొన్నాళ్ళకు జర్మనీలో Dr. C. H. Rempies పన్నెండువందలు రూబాయీలు సంకలనము చేసినాడు. మన దేశములో దాతార్ పండితుడు (తర్వాత గోవిందతీర్థస్వామి) (1320) రూబాయీల సంకలనం ప్రకటించి నాడు. ఖైయ్యామ్ రూబాయీల మీద ప్రపంచములో ప్రథమ ప్రామాణికుడని ప్రతిష్ఠగావించిన Rempies మహాశయుడు గోవింద తీర్థస్వామి సంకలనము సర్వవిధములా శ్లాఘనీయమని సమ్మతించినాడు.

నేను ఆ ముద్రణము రెండు పర్యాయములు పఠించినాను. ఆంధ్రీకరింప వలెననెడి కుతూహలము కలిగినది. ఆరు మాసములు దాని మీద బుద్ధి నిలుపుదామను కొన్నాను. ఏవో అంతరాయాలవల్ల పని సాగలేదు. ఆంధ్రీకరిస్తే భుజంగప్రయాతములోగానీ, వైశ్వదేవీ వృత్తములోగాని ఆంధ్రీకరింపవలె. మూలగ్రంథములోని రుబాయీ నడకకు ఇవి సరిపోతవి.

(శ్రీ) నారాయణదాసుగారు సంస్కృతాంధ్రములలో రెంటనూ ఫిట్జిగెరాల్డు యొక్క ఆంగ్ల కృతిని పద్యశ్లోకములుగను, పార్సీ రుబాయీలను గీతులరూపంలోను అనువదించారు. వారు ఉభయభాషా రచనలోను సిద్ధహస్తులు.

ఈ కావ్యానువాద విధానంలో (శ్రీ)వారి రచనా స్వభావం తెలియ డానికి ఉదాహరణములు :

1. తంగీయి మైఈ లాల్ ఖాహం వ దీవానీ
సద్ది రమకీ బాయద్ వ నస్ఫి నానీ
వాంగహ్ మన్వ తూ నిష స్త దర్ వీరానీ
ఖు ష్తర్ బూద్ అజ్ మఘ్లు కత బుల్తానీ. (పార్సీమూలం)

**Have, with a bread beneath the Bough**
**A flask of wine, a book Verse and thou**
**Beside me singing in the wilderness**
**Oh, wilderness were Paradise enow !** **(tr. by F. G.)**

కం॥ పచ్చిక బీ డచ్చోటన్
మచ్చికతోనీవు కొలది మైమరపున నె
ల్గిచ్చిన పాటల గుల్కుట
నెచ్చెలి! మన కారు బ్రతుకునె మెచ్చుదగున్.

గీ॥ కోరుకొన్న కెంపుకోపు గంగాళముల్ మాటలల్లువాని తేటప్రాత
ఈవు నేను వేడ్క నెనయగల్గిన పాడు తోడ నీడుకాదు దొరలమేడ.

శ్లో॥ "ఇక్షుచ్ఛాయేకదుష్యాన్న మభీష్టం మధుపుస్తకం
త్వమత్రయదిగాయస్తి నూనం స్వర్గాయతే మహీ."

గీ॥ అరుణాసవమపి కాంక్షే మహాకవి కృతాని చాటుకావ్యాని
అర్థగ్రాస మవశ్యం ప్రోత్సాహతాం మామకాంత్య నిశ్వసితమ్
అప్యనవరత మహాంత్వం పరిరభ్య పరస్పరం వసేవరహః
శత శతకోటి గుణం స్వాదదం వనం చక్రవర్తినః సౌధాత్.

2. గర్ బర్ ఫలకం దస్త్ బూదీ చూన్ యజ్దాన్
బరాష్తమీ మన్ ఈన్ ఫల్కి రాజి మియాన్
అజ్ నవ్ ఫలకీయి దిగర్ చునాన్ సా ఖ్తమీ
కాజాద బకామీ దిల్ రసిదీ ఆసన్. (పార్సీమూలం)

**Ah, Love ! Could you and I with Fate conspire**
**To grasp this sorry scheme of Things entire,**
**Would not we shatter it to bits - and then**
**Remould it nearer to the Heart's Desire (tr. by F. G.)**

కం॥ ఓచెలి, నీవున్నేను మ
రీ చప్పని బడుగు బ్రతుకు నెనయుట కన్నన్
దోఁచినటు పొలిసి కోరిన
యాచవిఁ గొనఁ గ్రొత్తమంద లందుట మేలౌ.

గీ॥ వేలుపునకు వలె నిన్ను నాకయిన
నున్నచోనిది మార్చుకుందునా నేను ?
కావించనా కొత్తగా నేల నెల్లఁ
గోరు కొన్నటు హాయి కుడువ దెవ్వాఁడు.

శ్లో॥ ప్రతిరుంధ్యావచేద్దైవ మహం త్వమపి వల్లభే।
శశ్వన్మిథః పరీరంభా మృతం నైవం పిబేవకిమ్ ?

గీ॥ దివమహ మఖిలేశ్వర ఇవహంత కరగ్రాహ మగ్రహీష్యంచేత్
అద్యకిమనాశయిష్యం సుతరా మప్యంతరిక్షలోక మముమ్.
అదౌదివ మన్యన్నవమేవ యథేష్టం నకిమహ మగ్రసక్ష్యమ్
తచ్చారవ్ర భవిష్య చ్చేన్నా నిష్యత్కిం యథా సుఖం కోఽపి.

Edward Fitz Gerald ఉమర్ రుబాయీలను సక్రమంగా ఆంగ్లీకరించలేదు. అక్కడ ఒకపంక్తి అక్కడ ఒక పంక్తి తీసుకుని మంచి భావం సమగ్రత వచ్చేటట్టు ఆంగ్లములో మొదటి 75 చతుష్పాదులు రచించినాడు. కొన్నాళ్ళకు వాటికే ఇంకొక పాఠం సిద్ధం చేసినాడు. ప్రథమ పాఠముకన్న ద్వితీయ పాఠమే రుచిరమని విజ్ఞులు నిర్ణయించినారు. రెండవ పాఠములోని 75 పద్యాలు జగత్ప్రసిద్ధములైనవి.

శ్రీ నారాయణదాసుగారు రెండు పాఠములలోని పద్యములు కలిపి 110 పద్యములుగా తయారుచేసి అనువదించినారు.

జర్మన్ దేశ పండితుడు ప్రపంచ భాషలలోని మహాగ్రంథములను పరిశీలించి పాఠము సిసల్ చేసిన ప్రతిభావంతుడు. మ్లేచ్ఛకవి ఉమర్ ఖైయ్యామ్ రూబాయిూల పరిష్కృత పాఠం సిసల్ చేసినది కర్ణాటక పండితుడు దాతార్. రుబాయిూల తొలిసారి సంస్కృతములోనికి అనువదించిన ఆంధ్రపండితకవి నారాయణదాసుగారు. ఇక ఎవరైనా రుబాయిూలు ఏ భారతీయ భాషలోనైనా అనువాదం చేయదలచితే దాతార్ (శ్రీ గోవిందతీర్థస్వామి) గారి రుబాయిూల పాఠముల ననుసరించడం అత్యుత్తమం.

ఈ ఉభయులకు పాఠకలోకం సర్వదా కృతజ్ఞమై యుండవలెను. శ్రీ నారాయణదాసుగారు సర్వతోముఖ ప్రతిభావంతులు. వారి రచనలనుసమానమని ఘంటాపథముగా చెప్పవచ్చును.



# ఉమరు ఖైయామును రుబాయతు

సమీక్ష :- శ్రీ రాంభట్ల లక్ష్మీనారాయణశాస్త్రి

'ఉమర్ ఖయామ్' రచించిన రుబాయత్ ఉత్తమకావ్యమున్నఁ దగును.

ఈ కావ్యము పారసీక భాషలో నున్నది. ఈ కవియుఁ బారశీక దేశీయుఁడే. ఈతఁడు గొప్ప పండితుఁడు. సంగీతసారస్వత సారసంగ్రహ ధురీణుఁడు. బహురాజాస్థాన సమాసాదిత సత్క్రియాసముపార్జిత యశస్కుఁడు. ఖగోళ పరిశీలన పరిణత ప్రజ్ఞాప్రాభవుఁడు. ఏతత్కావ్య రచన వలనఁ దా నమరజీవి యయ్యెను.

ఈ కావ్యమున నూటపది రుబాయత్తులు గలవు. ఖండకావ్యము వలె గోచరించినను నిది మహాకావ్య శ్రేణిలోఁ జేర్పదగినదే. మద్యపానము, మహిళా సహయోగము, ఐహికభోగానుభవము, ఈ మూడే జీవిత పరమార్థములనియు, మిగిలిన చింతలన్నియు వ్యర్థములనియు నిందున్నట్లు స్థూలదృష్టికి గోచరించును. నాస్తికవాద ప్రబోధదాయకముగఁ గాన్పించును. ఈ గ్రంథమందలి యాంతర సౌందర్యము నరయవలయును. అయ్యది సహృదయులగు భావుకులకుఁ దక్క నన్యులకు గోచరింపదు. సమ్యగ్దర్శనమునఁగాని పరమార్థ మెఱుంగబడదు గదా! మహాకవుల యాశయము లతినిగూఢములు.

ఇందలి సౌందర్యము నామూలచూడముగ నాకళించిన కవిరాజు శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాసుఁడు. ఈ మహాకవి బహుముఖ ప్రజ్ఞాశాలి. సంగీత సారస్వతముల సిద్ధహస్తుఁడు, సహజ సంప్రాప్త సత్కవితా సమాశ్లేషిత హృదయుఁడు. "విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమం" అన్నట్లు తానట్టి విద్వాంసుఁడగుటంజేసి యుమరఖయామ్ కావ్యమును గూలంకషముగ నాకళించుకొనెను. అందలి రుబాయత్తుల ననువదించుటకుఁ బూనుకొనెను. ముందుగ నామహాకవి నామము నే సార్థకముగావించెను. 'అమరకాయ' మహాకవియని యాతనికి నామాంతరమును సమకూర్చెను. అమరకాయకవి యెంతటివాఁడో నారాయణదాస కవియు నంతటివాఁడే. సహజపాండిత్య ప్రతిభా సంపన్నుఁడు. సకలభాషా సముపార్జన సంశోభిత శేముషీ విశేషుఁడు. సంగీతశాస్త్ర సర్వస్వ సంగ్రహ చణుఁడు. ఆతని బుద్ధి కసాధ్యమగునది కాన్పింపదు. అచ్చ తెనుగు నందు, దేవభాషయందు నీ మహాకవి చూపిన ప్రజ్ఞావిశేషము లనితర సాధారణములు. పూర్వజన్మ సత్కర్మపరిపాక విశేషమునఁ బుడమి నవతరించిన పుణ్యమూర్తి. శంకరాదులవలె కారణజన్ముఁడు. ఈ యనువాద మీతని ప్రజ్ఞాప్రాభవమునకుఁ బెట్టనియాభరణము. ఇందాతఁడు చూపిన ప్రతిభా విశేషము లనల్పములు.

మూలగ్రంథము పారశీకభాషా పరిశోభితము. దానియందనుభవము లేని వారా గ్రంథమునుగూర్చి వ్రాయుట హాస్యాస్పదము 'ఎడ్వర్డ్ ఫిట్జ్ గెరాల్డు' అను నొక పాశ్చాత్యపండితుఁడు దీనిని ఆంగ్లభాషలోని కనువదించెను. ఆ యనువాదము స్వతంత్రము. మూలమందలి సారమును మాత్రము సంగ్రహించెను. శ్రీ నారాయణదాస మహాకవి, పాశ్చాత్య పండితుని మాటలను సంస్కృతమున అనుష్టుప్ శ్లోకములలోనికి, అచ్చ తెనుఁగున కందపద్యములలోనికి ననువదించెను. మూలమందలి రుబాయత్తులను సంస్కృతమున గీతికలలోనికి, తెనుఁగున చెండులను పేరునను రచించెను. సంస్కృతమున శ్లోకము-గీతి-యనియుండ, నచ్చ తెలుగున మూఁపు, చెండు, అను పేరులిడెను.

సంసారాంబుధి నుత్తరింప నుంకించు మానవులకు శాస్త్రములు రెండుమార్గములను సూచించినవి. అందొకటి కర్మమార్గము. రెండవది జ్ఞానమార్గము. క్రమక్రమముగ నీరెండుమార్గముల నడుమ మఱియొక త్రోవ చూఁబడినది. అదియే భక్తిమార్గము.

కర్మమార్గమునఁ బయనించువారు వారివారి కర్మానుసారముగ ముత్త్రివిధముల యాతాయాతములను గావించుచున్నారు. అజ్ఞానోపహత చిత్తులగు మానవు లధమాధమకృత్యముల నాచరించి యధోగతులగు దురు. అది యధమమార్గము. క్రిమికీటక పశుపక్షివృక్షాదిరూపము లన్నియు నట్లావిర్భవించినవే. ఫలాపేక్షచేఁ గొందఱు మానవులు కర్మ ముల నాచరించుచుందురు. కాని వాని నాచరించుసమయముల యుక్తా యుక్తముల నరయక యథేచ్ఛముగఁ బ్రవర్తించి యనుచితములఁ గావింతురు. అట్టి మిశ్రకర్మప్రవణులు ధూమాదిమార్గమున నరకాదుల కేగి యచ్చటఁగొంత నాఫలముననుభవించి మరల భూమిలో జన్మింతురు. వారే బధిరపంగ్వంధదరిద్రాదులు. ఇది మధ్యమమార్గము. కొందఱు ఫలాపేక్షచేతను దానధర్మాది సత్క్రియాచరణ సమర్థులగుదురు. అట్టి పుణ్యపురుషులు అర్చిరాదిమార్గమున స్వర్గమున కేగి పుణ్యఫలము నట ననుభవించి, "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి" అనువచనముచొప్పున మరల భూమి కేతెంచి యుత్తమమానవులై జన్మింతురు. ఇది యుత్తమ మార్గము. ఈమార్గత్రయసంచారులకును యాతాయాతములు దప్పవు.

ఈకర్మమార్గమునఁ బయనించువారిలోఁగొందఱు ఫలాపేక్షావిర హితముగ సత్కర్మముల నాచరింతురు. అట్లాచరించుటంజేసి వారికి చిత్తశుద్ధికలిగి జ్ఞానముదయించును. ఆ జ్ఞానమహిమను వారు ముక్తులగు దురు. వారికి పునరావృత్తి లేదు. ఈమార్గ ముత్తమోత్తమము. అట్లే జ్ఞానవైరాగ్యము లబ్బిన వెంటనే సర్వకర్మములను పరిత్యజించి, యాత్మా రాముతై యుండువారును ముక్తులగుదురు. ఇది సర్వోత్తమము. కాని యాచరించుట మిగుల కష్టసాధ్యము. "నతస్య ప్రాణా ఉత్క్రామన్తి" అను

వచనమునుబట్టి యాజీవన్ముక్తులు దేహపతనానంతరమున నాత్మభూతు లగుదురు. ఘటాకాశము ఘట వినాశనానంతరమున నాకాశముగ మారలేదా ?

ఇట్లు ఈమార్గములనడుమ భక్తిమార్గమొకటి ప్రవేశించినది. ఇందు భక్తికిఁ బ్రాధాన్యమునొందు. ఎంతటి భక్తుఁడైనను సకాముఁడై నచో ముక్తుఁడు కాఁజాలఁడు. అనన్యభక్తుఁడు కావలెను. అయ్యది నిష్కామకర్మయోగము వంటిదే యగును. అట్టిభక్తునకు ఆత్మజ్ఞానము జనించును. "భక్తిర్జ్ఞానాయకల్పతే" అనిసిద్ధాంతము. అట్టిజ్ఞాని ముక్తుఁ డగును. "జ్ఞానాదేవహికైవల్యం" అని సిద్ధాంతవచనము. ముక్తునకు జ్ఞానమావశ్యకమని సారాంశము.

భక్తకోటిలో నుపవర్ణింపఁబడిన "ప్రహ్లాద నారద పరాశర పుండరీక వ్యాసాంబరీష శుకశౌనక బకదాల్భ్య విభీషణ హనుమదాదు' లందఱును మహాజ్ఞానులే. "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" అను గీతావచనానుసారము సర్వమును విస్మరించి సంతత భగవదారాధనమే మోక్షోపాయమనుట సిద్ధము.

ఈ యమరకవి వీని నన్నింటిని జక్కఁగఁ బరిశీలించిన పండితాగ్రణి. స్వతంత్ర ప్రతిభాసమలంకృతుఁడు. కావునఁ దన గ్రంథమున నిష్కామ నిర్మల భక్తిమార్గమును తరణోపాయముగఁ జూపినాఁడు. కర్మమార్గ మును నిరసించినాఁడు. జ్ఞానమార్గ మసాధ్యమని సూచించినాఁడు.

"స్వర్గ నరకాదులు భ్రాంతికల్పితములు. విధిబలీయము. స్వభా వము దురతిక్రమము, ఏది యెట్లు జరుగునో యేరికి నెఱుంగ శక్యము గాదు. తెలిసి చెప్పువారెవ్వరును గానరారు. ప్రాక్తన సంస్కారబల మున మానవుఁడు ప్రవర్తింపక తప్పదు. జగత్కారణ మెవ్వఁడో యొకఁడు గలఁడు. అతఁడే బొమ్మలను సూత్రధారుఁడువలె నీ జంతు జాలము నాడించుచున్నాఁడు. ఈ జగము బొమ్మలాటవంటిది. చద

రంగపు పావులవంటివారీ జీవులు. కందుకక్రీడవంటిదీ బ్రతుకు. కులాలుని వంటివాఁడీ సృష్టికర్త. కుండలవంటి వీ దేహములు. వీనికి శాశ్వ తత్వములేదు. జనన మరణములు దేహక్షైనైజములు. ఎంత విమర్శించి చూచినను బ్రకృతి రహస్య మేరికినిఁ దెలియదు. వాదోపవాదము లన్నియు బుద్ధి భ్రాంతికల్పితములే. కర్మఫలానుభవమును దప్పించు కొనుట యెట్టివారికైన నసాధ్యమే. ఆయువు క్షణికము. ఐశ్వర్యము నశ్వరము. సార్వభౌముఁడు మొదలు సంసారివఱకు సర్వులును బ్రకృతి బద్ధులే. ఈ జీవి యస్వతంత్రుఁడు.

భక్తిశ్రద్ధలతో భగవంతు నారాధించుటయే మానవకర్తవ్యము. గతమునకు విచారపడరాదు. ఆ గతమున కాశింపరాదు. వర్తమానమునఁ దృప్తుడయి యుండుట మంచిది. యథాలాభతుష్టుఁడై జీవితమును గడు పుటకంటె మానవుఁడు చేయున దింకెద్దియును గానరాదు. అదియే కైవల్య హేతువు. ఆత్మ యెచ్చటనో గలదనుకొనుట భ్రాంతి. తనలోనున్న దానిని విడిచి బయట దానిని వెదకుటకు యత్నించుట వెఱ్ఱితనము. తన్నుతా నెఱుంగుటయే ప్రధానకర్తవ్యము. మాయాంధతమసము సం పూర్ణముగఁ దొలగినఁగాని యాత్మ యెవ్వరికిని స్పష్టముగ గోచరింపదు. అది సూక్ష్మబుద్ధి గమ్యము.

భగవద్భక్తియే మద్యము, ఆభక్తి నానుటయే మద్యపానము. శ్రద్ధయే మద్యమునందించు ప్రేయసి. ఏతద్భక్తి మాధ్వీపరవశుఁడు శ్రద్ధా ప్రేయసీ గాఢాలింగనమున పరవశుఁడై విగళిత వేద్యాంతర మతియై ముక్తుఁడగును"

ఈ సిద్ధాంతమును అమరమహాకవి. ధ్వనిమార్గమునఁ దనకావ్య మందు స్ఫురింపఁ జేసెను.

సంతతమద్యపానాసక్తి-స్వాభిలషిత ప్రియకాంతా సమాశ్లేషము- సకలభోగానుభవపరాయణత- ఈమూఁడే జీవితపరమార్థములని యీ

గ్రంథమున స్థూలదృష్టికి గోచరించును. కాని యాదికవి యాశయమునకు విరుద్ధము.

కావున భావుకాగ్రేసరుఁడగు శ్రీ నారాయణదాసమహాకవి యీ కావ్యాశయమును సమగ్రముగ నాకళించి తదనుగుణముగ నా గ్రంథము ననువదించెను.

ఈ గ్రంథమున ఎడ్వర్డుఫిట్జ్‌గెరాల్డు గావించిన యనువాదము సారరూపము. దాని యనువాదము సరళము సారవత్తరమగుట దాని నిందు పాఠకలోకమున కందించుచున్నాను. దానిని బట్టి యీ మహాకవి ద్వయముయొక్క, లేక, త్రయముయొక్క శక్తి సామర్థ్యము లవగతము లగును.

పారశీక కవి యగు నమరకాయుని భావము లజరామరములు. వానిని గైర్వాణభాషలోని కనువదించిన మహాకవి నారాయణదాసు గారి పదగుంఫన మనన్య లభ్యము. వీనిని గూర్చి వ్రాయుట యెట్లు? విమర్శించుటయేమి? వాని నాకళించుకొని యానందించుటయే యుక్త మార్గము.

మచ్చున కటనట వారుచూపిన ఫోకడల నందించుచున్నాను.

"గతే మాయావతమసే। ప్రాతః పాన మజాగదీత్,
హృద్విష్ఠం దైవతం మూఢ। గవేషయసి కిం బహిః"

వేకువ చీఁకటి సోఁకుడు
తోఁక మడచి పరుగువెట్టెఁ దోడ్తో వినిచెన్
నా కానుడి నీలో నీ
జోక వెదకు కనకుము వెలిచోటుల ననుచున్.

మాయ గాఢాంధకారమువంటిది. "అది తొలఁగినకాని యాత్మ తత్త్వమవగతముకాదు. ఆ యాత్మయు నీలోనే యున్నది. దానికై బాహ్యస్థలములందేల వెదకుచుంటివి."

"పానాగతా అవోచన్మాం। బోధావుషసి ఘోషతి,
ఉన్మీలయ కవాటం ద్రాక్। నావర్తంతే గతాః పునః."

మేలగు క్రొక్కారము విని
శాలక కోపు గదితలుపు తట్టి యనెన్ వాఁ
డీ లోగుమ్మము తెరువవు ఇ
దేలా యుగమెడల మళ్లి యిటురామనుచున్.

"జ్ఞానమను ప్రభాతము వచ్చినది. ఏల యాలసింతువు. త్వరగా కవాటమును తెరువుము. వెడలినవారు మఱి తిరిగిరారు" అని పానార్థము వచ్చినవారు పలుకుచున్నారు.

ఈ భావములు భక్త్యుద్దీపకములు, జీవితము త్వరత్వరగా దాటును. భక్తిచే భగంతు నారాధించుటకన్న మఱియొకటి యేదియు నిష్ప్రయోజనమే యగును. కావున త్వరపడుము అని భావము. సూర్యోదయమన జ్ఞానోదయమనియు, మద్యపాన మన భక్త్యతిశయమనియుఁ గవి యాశయము.

"శ్లాఘతేఽప్సరసం యజ్వా। వయం ద్రాక్షారసం స్తుమః,
శ్రావ్యా భవేద్దూరభేరీ। పిబ హస్తగతామృతమ్.
"నిత్యం స్వర్గనగర్యాం రమ్యా అప్సరస ఇతి వదంత్యేకే,
ద్రాక్షాసవ ఏవాయం మనోజ్ఞ ఇతి సర్వదా ప్రశంసామి,
హస్తగతం మాత్యాక్షీః సస్పృహధామా భవిష్యదర్థాయ,
కామం భ్రాతః శ్రావ్యః స్యాదేవ దవిష్ఠదుందుభిధ్వానః,
అస్తాం త్రివిష్టమపి స్వర్గంగా సంతతం తతః ప్రభవేత్,
మార్ద్వీకమతిస్వచ్ఛం మైరేయం విద్యుతా మపీక్షుసితా,
పూరయ చషకం పరితో గంధోత్తమయా శయే నివేశయమే,
హస్తగతం విత్తం స్యాత్ భవిష్యదర్థాత్సహస్రగుణమేవ,
నశ్యంత్య సంభవత్స్వర్వేశ్యా ప్రాసాదలంపటా ధూర్తాః
జాతు న జానేఽహ మహో మా మప్సాక్షీ దిహైవ యఃకోపి,
స్వర్గాయ వాపి భీకరనరకాయాపి స్వయం నియుంజీత
మృష్టాన్న మపి శ్యామా కేదారతలే హాలిప్రియాపానమ్,
మమ ధన మేతత్త్రితయం భాండస తవ భావ్యనిశ్చిత స్స్వర్గః."

"వినువలనున వెలవెలఁది మేలంౘడు,
నికముగ నంగూఁకు నే నయమందు,
పోకు మరువుజోలి ముడుపుగైకొనుమ,
యెడ మున్న డప్పున్న యింపుగానుండుఁ,
దెఱగంట్లపీట నెత్తిన వేల్పుటేఱున్,
అనసీ మంచి తీయని కోపు మడ్డి,
చిన్నియలరుతేనె చెఱకునవాతు
నించు కెంగోపుగిన్నియ యోరమిఱఁ
గ్గచ్చర నీవు నాకయి డొప్ప నిడుమ,
అస్తి వేరెట్లు అర్వాకన్న నయమ్మొ,
తెలిపియు న్దెలియక తెగ నీల్గువారు,
నీల్గనీ వేల్పుబానినపొందుఁ గోరి,
యరయఁ బుట్టించిన యతఁడింక నన్నుఁ,
దేల్చునో ముంచునో తెలియ నాతరమ.
కావలసిన బువ్వ - కలికి - కెంగోపున్,
ఈమూఁడు నాపైకము ఇఁక మీఁదలేని,
పోని యంకుల యరువునవరు నీది.

ఇందు, యజ్ఞాదుల నొనర్చి యచ్చరలకూటమి నాశించుటకంటె నవివేకము లేదు. భావినభిలషించుటకంటె వర్తమానమునఁ దృప్తిపడుట యుత్తమము. అరువాఱుకంటె రొక్కము మూఁడు అయిన మంచిది. భావిస్వర్గఫలాదు లనిశ్చితములు. భక్తిశ్రద్ధలను విడిచి కర్మపరతంత్రుడవై కుందకుము'' అని ప్రబోధించుచున్నాఁడీ మహాకవి.

"వర్ధతాం వా వినశ్యంతు మనుష్యాణాం మనోరథాః,
క్షణభంగుర మేవాయుః సైకతే హిమబిందువత్.
"దివానిశాద్వారమధ్యే దేహయాత్రా పరోనరః,
ధనికోవా దరిద్రోవా విపణౌ సార్థవాహవత్.

మెయితాల్పు బ్రదుకు కోరిక
నయముగఁ దొలుతొలుతఁ దోచినన్ పిమ్మటన్,

ఎమ్మెయినయినన్ చెడున్ రగిలిన
ప్రొయిమీఁదన్ రాలు మంచుబుగ్గ తెఱఁగునన్.

తలఁచు బ్రతుకు అరుగు చావడి
తలుపులవలె మూయుఁ దెఱచుఁ దమకడకన్ మా
పులు పవళులు అచట దొరలు ఎ
ట్లు అలరుచుఁ గన్మొఱఁగుచుందురు అదనుకొలందిన్.

ఇందు, జీవితమున నశ్వరమనియు, ఎట్టివాఁడయినను దేహయాత్రా పరుఁడై యిందు పరిభ్రమింపక తప్పదనియి సూచించుచున్నాఁడు. "ఇసుకపై నిఁబడిన మంచుబిందువువలె, విపణివీథిలో నటు నిటు దిరుగు వణిజునివలె" అను నుపమానములెంతో మధురములు. ప్రకృతి సహజములు. ఇసుకపైఁబడిన మంచుబిందువను దానిని, "రగిలిన పొయ్యి మీఁద రాలిన మంచుబిందువు ననుట" మఱియు సరముగ నున్నది.

"పురాహం తత్త్వజిజ్ఞాసుః వేదశాస్త్రాణ్యధీతవాన్
గమనాగమనద్వార మేక మేవ న సంశయః."

"స్వయం వపన్ జ్ఞానబీజం తతోవృక్షమజీజనమ్,
తత్ఫలాస్వాదనేనాహం జగన్మిథ్యేత్యబోధిషి."

బడిదద్దడముల యెడలన్
బడి కట్టుల కడరుచుంటి మడిపొడితడులన్
బుడుతఁడనై తొలిన్, ఇంకన్
వెడలిన గుమ్మంబె మళ్లి వెళ్ళుచు నుంటిన్.

ఇప్పట్ల నాయెఱింగిన
చొప్పునఁ దగ నరసికొంటిఁ జొరవమెయిన్ నేఁ
దప్పక చెప్పెద నిక్కంబు
ఎప్పట్లన్ మాఱుచుండును ఏ దినుసైనన్.

ఇందు, "జననమరణములకు మార్గమొక్కటియే. సర్వమాత్మనుండియే వచ్చును. ఆత్మయందే లీనమగును. కావున సముద్రమునుండి వచ్చు తరం

గముపలె నీ జగమావిర్భవించును. సముద్రమున లీనమయిన ట్లందే లీన మగును. కావున సర్వము బ్రహ్మమే. ఈ తత్త్వమును నేను జ్ఞానము వలన గ్రహించితిని. బ్రహ్మముకంటె వేరుగ జగముగలదను భావన మిథ్య" అను ఆధ్యాత్మిక రహస్యమును ధ్వనింపఁజేసినాఁడామహాత్ముఁడు.

"భవబంధా వినశ్యంతి పరమార్థవిదశ్శనైః,
జీవన్ముక్త స్సఏవైకః సదానందో విశిష్యతే.

మంతునన్ ఆవేలుపు కడు
వింతగన్ ఈదినుసులెల్లన్ పేరిమిఁ దానై
వంతలు ఉడిపి తన పన్నిన అ
లంతులన్ పోకార్చి యతఁడు అలకొన మిగిలెడున్.

"సంతుష్యత్యేవ తత్త్వజ్ఞః సదా సర్వత్ర సర్వదా,
కేనాపి కర్మణా నైవ లిప్యతే పరమార్థవిత్."

తలఁపోదవిన తోడ్తోనే
చెలువుగ ఈ బొమ్మలాట చెలగించున్ దాఁ
దెలియున్ తెలుపుఁ దెలిపించుఁ
పలుమఱున్ ఆవేల్పు కానిపని లేదు ఎదియుఁ.

"జీవన్ముక్తుఁడానంద రూపుఁడగును. ఆనందమే బ్రహ్మస్వరూపము. ఆతఁడు నిత్య తృప్తుఁడు- ఆతనికెట్టి కర్మములు నంటవు" అను రహస్యము నీచోట వివరించినాఁడు.

జ్ఞాతుం పునర్జన్మ తత్త్వం ప్రేషితం మాయయామనః
ఆత్మైవ స్వర్గనరకావితి తన్మామబూబుధత్.

కనరానివాని చెంగటి
కనిపితి నాయుల్ల మతని నదియుఁ గొలిచి నె
ట్టన మళ్లివచ్చి నాతో
ననెఁదానే మేలుసేగు లవి యివి యనుచుఁ.

"మనస్సు సర్వమునకుఁ గారణమనియు, బంధమునకు మోక్షమునకుఁ గారణమదియే యనియు, సూచించి, "మనఃకల్పిత ఏవాయం" "మన ఏవ

మనుష్యాణాం కారణం బంధమోక్షయోః” అను తత్త్వము నిటచక్కఁగ నిరూపించెను.

“అవిద్యయాత్మా బద్ధశ్చేత్ విద్యయాముచ్యతే పునః,
బ్రహ్మ సత్యం జగన్మిథ్యా కిం వృథా తప్యతే మయా.”

కోరిక లేకుండుట మే
లేరికి కనికరము గొనుట యెందే నెగ్గా
నేరక చీఁకటి యడుగునఁ
జేరి మునింగినకొలందిఁ జేటే వచ్చున్.

ఈ పద్యమున తత్త్వమంతయు సంగ్రహముగ నిరూపింపఁ బడెను. “అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయామృత మశ్నుతే” అను ఉపనిష ద్రహస్యమిట గ్రాహ్యము.

జగత్కాండపటే సూర్యదీపేనాస్మన్మహానటః,
ప్రయుజ్యాప్యుప సంహృత్య యథేష్టం క్రీడతి ప్రభుః.

చతురంగఫలే ఖేల న్నహోరాత్ర్యభివర్ణితే
ప్రవర్తయన్నపి బలం నివర్తయతి స ప్రభుః.

క్రీడాద్యూతః క్షిపేద్యత్ర పతేత్తత్రైవ కందుకః
యథా నియుంజ్యా న్నోదైవం వర్తేమహి తథావయం.

ఇందు వర్ణింపఁబడిన భావస్వరూప మతి మనోహరము. “తెరపై బొమ్మలాడించునట్లు దేవుఁడు (ఆత్మ) మనల నాడించుచున్నాఁడు” ఈ యభిప్రాయ మెంత సరసముగనోయున్నది. ఇయ్యది శాస్త్రప్రమాణము నకు విరుద్ధముగాదు. “ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా” అను గీతా చార్యుని వచన మిట తప్పక స్ఫురించుచున్నది.

చదరంగమున నాటగాఁడు, తనబలమును ముందునకు నడిపించును. వారల వెనుకకుఁ దెచ్చును. ఆ చదరంగ ఫలకమున సగము గడులొక

రంగుతోను మిగిలిన గడులు మఱియొకరంగుతోను నలంకరింపఁబడి యుండును. ఇది యందఱకును అనుభూతమగు విషయమే. ఈజగమొక చదరంగపుబల్ల. ఇందు పగళ్ళన్నియుఁ దెల్లని గళ్లు. రాత్రులన్నియు నల్లని గళ్లు. ఈ జీవులన్నియు నాయాటలోని పాత్రలు. ఇందులో నన్ని రకములును గలవు. అవి ముందు కేగుచున్నవి. వెనుకకు మరలుచున్నవి. కొన్ని చనిపోవుచున్నవి. మానవజీతము నెంత సహజముగ మనోహరముగఁ జిత్రించెనో గనుఁడు.

జీవితమొక బంతియాట. ఆటగాఁడా బంతి నెచ్చటకు విసరునో యది యచ్చటనే పడును. అట్లే దైవమెవ్వరి నెట్లు నియమించునో వారట్లే గావింతురు. ఆ నిర్ణయమును దాట నేరికిని శక్యముగాదు. ఇదియు మధురాతిమధురమగు సత్యము.

మతభేదములను నిరూపించుట కామసీపి యొక చిత్రమగుగాథను కల్పించెను. ఆతఁడొకసారి కుమ్మరియింటి కేగెనట. అట నా కుండలన్నియు మెల్ల మెల్లగ నిట్లనుచున్నవట!

"నన్ను ఈ కులాలుఁడు వ్యర్థముగ మట్టితో నిర్మింపలేదు. త్వరగా నాతఁడు నన్ను తనలోనే చిన్నదానిని గావించి కలుపుకొనును" అని యొకటి పలికినదట!

"ఎట్టి వెఱ్ఱివాఁడయినను తాను పాతిన విషవృక్షమునైనను తన చేతులతో నూడఁబెఱికి పారవేయునా? అట్లే నన్నుకూడ నీ కుమ్మరి యేదో యొక ప్రయోజన మాశించియే నిర్మించెను" అని మఱియొక కలశము పలికినదట.

"ఈ కుమ్మరియుఁ దన చేతులతోఁ దాను నిర్మించిన నన్ను పగులగొట్టుటకు యత్నించు సమయమున తనచేతులను వణకించుకొనును. ఆ పనిచేయుటకు విచారపడును," మఱియొక భాండమనెనట!

"బ్రతుకనఁగానేమి ? బ్రద్దలుకొట్టుట యననేమి ? కడవనగాఁ నెట్టిది ? కుంభకారుఁడెవఁడు ? ఇది యంతయు మిథ్య" అని మఱియొక ఘటము పలికినదట !

"ఈ దైవము మాయావి, ఈ జగమును నిర్మించుచున్నాఁడు. సంచరింపఁజేయుచున్నాఁడు. కర్మఫలము ననుభవింపజేయుచున్నాఁడు. ఆ మాయావిమాయ యేరికిని తెలియదు" అని మఱియొక భాండమనిన దట !

"ఎవఁడో యొకఁడు ఏదో విధమున మనలను నియమించు చున్నాఁడు. దానిని విమర్శించిన నేమి ప్రయోజనము. నన్ను మధువును ద్రాగనిమ్ము." అని మధురముగ మఱియొకటి పలికిదట !

ఇట్లు ఆ కడవలు తమలో తాము గుసగుసలాడుచుండ, మఱియొక ఘటములేచి, "సోదరా ! చూడు చూడు, ఆ దిక్కును గనుము. ఆ వ్యక్తి సురాభాండ భారమును వహించి యెల్లగుచున్నాఁడో" అనినదట!

ఈ విధమున నొక కథనుదెల్పి, జగద్రహస్యమును, జీవితవైవిధ్య మును, జీవుల మనః ప్రవృత్తులను, ఐహికాముష్మిక చింతలను, సూచించి చివరకు భక్తిచేతనే తరింపవలెనుగాని యితర చింతలతో నిమిత్తము లేదని తన యాశయమును గంభీరముగ సూచించినాఁడు. ఇట్లు అడు గడుగునకు ధ్వనివిశేష మీ కావ్యమందంతట సూక్ష్మదృష్టి నరసిన ప్రస్ఫుట మగుచుండును. ఇంతయేల ! ఈ గ్రంథ మొక యాధ్యాత్మిక మధుకోశము-

నారాయణదాస మహాకవి యీ యనువాదమునఁ దనకుఁగల యుభయభాషాపాండిత్యము నత్యద్భుతముగఁ బ్రదర్శించెను. ఇందాతని కవితాస్రవంతి బహుముఖముగఁ బ్రవహించినది. ఇందలి ధారాశుద్ధి యతిసరళము. బహుగంభీరము. భారవి మాఘాది కవివతంసుల మార్గ ములు గాంభీర్యమునకును, కాళిదాసకవీంద్రుని పోకడలు సారళ్యము

నకును నిదర్శనములు. ఉదాహరణమున కొండు రెండు పద్యముల నరయుదము.

మిథ్యైవ స్వర్గనరకౌ సత్యమాయుర్వినశ్యతి,
అనర్థకం ప్రేతకర్మ జాతస్యమరణం ధ్రువమ్.
భుంజానోప్యఖిలాన్భోగా న్విదేహః పురుషోత్తమః,
జగద్గురుః పురారాజీ జీవన్ముక్తః పరంతపః,
అయం స్వతంత్ర సిద్ధాంతః కథమాక్షిప్యతేజనై,
శ్వోఽజాతస్య పరాసోర్వ్యః సుఖమద్యైవ దేహినః.
శుష్కవేదాంతమీమాంసా వృద్ధభార్యామతిత్యజమ్,
హాలాకన్యాముద్వ్యవాక్షం జగన్మిత్రమబీభవమ్.
అత్యాశయా దుఃఖ్యతి యస్సదేవానాం ప్రియాగ్రణీః,
యావజ్జీవం సుఖ్యతి యస్సవిచక్షణగ్రామణీః,
జీవిత మిదం ద్రుతపదం పారద ఇవ చంచలం ముహుర్భవతి.
వృథారహస్య జిజ్ఞాసు స్సమాపయసి జీవితమ్,
సత్యాసత్యగతి సూక్ష్మాస్వైరం విహర సుందరి.

ఇట్లు ప్రతిశ్లోకము భావగంభీరము, మృదుమధుర పదభూయిష్ఠమునై యొప్పుచున్నది.

ఇంక నీతని పదప్రయోగచాతురుని దిలకింపుడు. వ్యాసఘట్టముల వలె నటనట సందర్భానుకూలముగ నూతనపద ప్రయోగములు కంట బడుచుండును. ఈ ప్రత్యేకత యితని గ్రంథమందే గోచరించును. మచ్చునకుఁ గొన్నిపదముల నిటఁజూపుచుంటిని. అ ప్రసిద్ధ పదప్రయోగ మను దోషమున కిటఁదావులేదు. అన్నియును బ్రసిద్ధములే.

| | | |
|---|---|---|
| తెషమః | = | వర్తమాన సంవత్సరము |
| సత్యాపనమ్ | = | బయానా |
| సౌహిత్యమ్ | = | సంతృప్తి - తనివి |
| గంధోత్తమా | = | సుర |
| కుక్కుభః | = | కోడి |

శౌవాస్తికమ్ = భావిదినస్థాయివస్తువు
పితృవనమ్ = శ్మశానము
పితృగృహమ్ = పుట్టినిల్లు
కుంచికా = తాళపుచెవి
కాండపటమ్ = తెర
పరిస్రుతా = మదిర
అవతమసమ్ = క్షీణాంధకారము
అష్టాపదమ్ = సొగటాలపాళి
సిక్థకమ్ = మైనము
పంచజనాః = మనుష్యులు
చక్రీ = కుమ్మరి
వీవధికాః = కావడి మోయువారు
ఖట్టిమ్ = శవయానమును

భాషయందాతనికిఁగల సామర్థ్యము నివి సూచించుచున్నవి.

ఇఁక దెనుగున నాతని స్వాతంత్ర్యమును బరిశీలింపుఁడు. ఇట నొకమాట యవసరము. ప్రస్తుతము గ్రాంధికమని పిలువఁబడు నాంధ్ర భాషయంతయు నిక్కమగు తెలుఁగుకాదు. ఇందు భాషాంతరముల సంపర్క మధికముగఁగలదు. సంస్కృతపదములు చాలవఱకు తెలుఁగు దనమునుపొంది సంస్కృత సమములయినవి. అట్లే కొన్ని సంస్కృత పదము లెక్కువమార్పులనంది సంస్కృతభవములయినవి. ప్రాకృత భాషాపదములుగూడ నిట్లేమారి ప్రాకృతభవములయినవి. ఈ నాల్గు రకములయిన పదములన్నియుఁ దెనుఁగునఁజేరి యాంధ్రమని నేఁడు వ్యవహరింపఁబడుచున్నవి. భారతాది లాక్షణిక గ్రంథములన్నియు నీ యాంధ్రభాషా సమలంకృతములే.

ఇట్లుండఁ గొందఱు ప్రాచీనకవులు, కేవల సంస్కృతములను విడిచి, మిగిలిన నాలుగు భేదములను గ్రహించి వానికి నాచ్ఛికపదము లని పేరిడి, యట్టిభాషతో గావ్యములను నిర్మించిరి. అచ్చ తెలుఁగు

రామాయణము - నీలాసుందరీపరిణయము - యయాతిచరిత్రము - మున్నగున వాకోవకుఁజెందిన గ్రంథరాజములు. వాని ననుసరించి తరువాతి కవులు నట్లే యచ్చతెలుఁగు ప్రబంధములను వ్రాసిరి. కవ్యాదికత మున్నగునవి యధునాతనములు.

ఇట్లుండ నీ మహాకవి యొకవింతమార్గమునఁ బయనించి తన సామర్థ్యమును, స్వాతంత్ర్యమును ప్రస్ఫుటము గావించుకొనెను. ఇది యితని ప్రత్యేకత.

పదునారవశతాబ్దిని పండితరాయలు (జగన్నాథపండితుఁడు) రసగంగాధరమను నొక యలంకార శాస్త్రమును వ్రాయుచు నీ క్రింది విధమునఁ బలికెను. లక్షణములను వ్రాయఁ బూనుకొనిన నేను లక్ష్యములను గూడ నేనే వ్రాసి చూపుదును. ఇతరుల రచనలలోని శ్లోకముల నేనేల యుదాహరణములుగాఁ గైకొందును? నాకాశక్తి లేదా! అని చెప్పకొనెను.

"నిర్మాయ నూతన ముదాహరణానురూపం
కావ్యం మయాత్రనిహితం న పరస్యకించిత్.
కిం సేవ్యతే సుమనసాం మనసాపి గంధః
కస్తూరికాజననశక్తిభృతా మృగేణ.

కస్తూరిని సృష్టించు గంధమృగము పూలవాసన కాశపడునా? అట్లే నా కితరుల గ్రంథముతోఁ బనియేమి? పాండిత్య మీరమునఁ బలికిన పలుకిది.

ఈ నారాయణదాసమహాకవియుఁ బండితరాయలే. కావుననే, తన గ్రంథమున కేవలములైన తెలుగుపదములనే యుపయోగించెను. సంస్కృత సమములు, సంస్కృతభవములు, ప్రాకృత సమములు, ప్రాకృత భవములు కృతకములు. వానితో నాకుఁబనిలేదు. తచ్చతుష్టయ భేదమును బరిహరించి అచ్చతెనుఁగునే వాఁడుదునని యూహించుకొని యీ

గ్రంథమును రచించెను. ఇంతవఱ కెవ్వరు నిట్టి తెనుగులో గ్రంథరచ నమునకుఁ బూనుకొననివారు గానగారు.

ఆ రచనమందు గూడ నాతని పద్యముల పోకడెట్లున్నవో చూడుఁడు.

వ్యాకరణశాస్త్ర పరిజ్ఞాన మా మహాకవి కెంత వాచో విధేయ ముగ నున్నదో గనుఁడు. ఆ శాస్త్రమున సంపూర్ణానుభవములేని మనీషి యిట్టి పదప్రయోగమును గావింప సమర్థుఁడనుటలో సందేహముండదు.

శబ్దప్రయోగము :—

యాయజూకః = ఎక్కువగా యజ్ఞములను గావించువాఁడు
దేవానాంప్రియ = మూర్ఖుఁడు
జంజపూకః = ఎక్కువగా జపము నాచరించువాఁడు
పాణౌకృత్య = చేతియందుంచుకొని

ధాతుప్రయోగము :—

అటటిషీత్ = తిరిగెను
పిపక్షిష్యతి = అణగఁద్రొక్కఁబడఁగలదు
దీదాంసిష్యతి = ఈయఁదలంచెను
అదిదృక్షిష్యత = చూడఁగలుగుదురు
ప్రపోపూర్యాత్ = నింపఁబడినచో
పంపతిష్యామి = పడఁగలను
అజూఘుషత్ = ఘోషించెను
ఈర్షిషిషేత్ = అసూయపడును
దీదాంస్యేరన్ = చిదుకఁగొట్టఁదగినవయినచో
అచికిత్షయిష్యే = ఆచరింపఁగలను
వినిర్మిత్సతి = నిర్మింపఁదలంచెను
క్షుమ్నాతి = బెదరుచున్నది
అజీగపత్ = చెప్పెను
వరీవృత్యతే = ప్రవర్తించుచున్నది

నిరణేణీయిష్ట = నిర్ణయించును
జాగ్లేయేయ = విసిగితిని
అజంగమిష్ట = పయనింతును
దుఃఖ్యామి = దుఃఖించుచున్నాను
సుఖ్యామి = సుఖించుచున్నాను
మా - యోకీః = కలుపకుము
అన్వైవ్షిషీత్ = వెదకెను
అచికీబన్ = మైమరచిరి
ప్రాసోష్ట = నివసించెను
అలీలపమ్ = విప్పితిని
మా - చాచర్చీః = చర్చింపకుము
వావద్యంతే = వాదించుచున్నారు
వావచ్యంతే = పలుకుచున్నారు
అక్షైప్సీత్ = విసరెను
అజాగరీత్ = మేలుకొనెను.

ఇట్లు ఎన్నియో క్రియాపదము లిందు గోచరించును. యజంతములు, యఙ్లుగంతములు, సన్నంతములు ఆతనికెంత స్వాధీనములైనవో గనుఁడు. సామాన్య పండితుల నోట నిట్టి పదములలో నొక్కటియు వెలువడుట కష్టతరము. భట్టి–మాఘు–బాణాది కవిపుంగవుల ప్రయోగములను మించియున్నవి. శాస్త్రమునకు విరుద్ధముగాకుండ స్వప్రతిభా విశేషమున నీ ధాతువులను సృష్టించి సమయానుసారముగఁ బ్రయోగించిన యాతని పాండిత్య ప్రాభవము నెంతయని నుతించుట! ఆ గ్రంథము నా మూలాగ్రముగఁ జదివి యానందించుటయే కర్తవ్యము.

ఉసురుసురను మిడుకెసఁగని
కొసముసముస మసఁగు ముసుగు గుసగుస వింటిఁ,
గసిదీఱ న్పసమీఱఁ
దుసికిలు నాకొసరు పిసరు తొలుచదువులగుఁ.

పడి పిడుత గడి వెడలనీ
కుడికెడు నొడుదొడుకుబడి యనుడివడిఁదడిగా,
నడుగున నడలుచు దడదడ
లుడగక చెడువెడఁగు బడుగు నొడలెడఁబుడుకున్.

ఈ రచన యనితరసాధ్యము. అన్నియు నచ్చ తెనుఁగులే. తత్స మాదులిటఁ గోచరింపవు, ఈ పద్యములందేగావు, ఈ గ్రంథమందే లేవు. ఈ పద్యములు పోతనామాత్యుని పద్యములను స్మరింపఁ జేయుచున్నవని చూపితిని.

"అడిదెదనని కడువడిఁ జను
నడిగిన తను మగుడ నుడువడని వెడయుడుగుల
అడుగిడు నడుగిడదు జడిమ నడుగిడు నెడలన్.

తన గ్రంథమున నుపయోగించిన యచ్చ తెనుఁగు పదములెంత చిత్రములో గమనింపుఁడు.

కోపు = సారాయిబుడ్డి
ఉగము = ఊపిరి
పోటి = పెంకె పడుచు
చెంగు = వీణ
అడువ = ప్రాఁత
ఆవి = గాఁలి
ఒడమి = సిరి
దద్దడము = చిన్నగుడి
తేమానము = వడ్డి
పారి = మన్ను
ఉలి = కొంచెము
బుగ్గ = బొట్టు
పుంట = సంజ
తాపి = గుట్టు

ఉజ్జ = ఇచ్ఛ
టంకు = నెలజీతము
గోల = ముద్దరాలు
సాగరము = సిద్ధి
రకము = దినుసు
ములుచ = మొద్దు
ఈబరి = తెలివిమాలినవాఁడు
గొటిజ = డేరా
దుందుమ = చిన్నదివిటీ
నెరసు = తప్పు
మూల = తలవెంట్రుకలు

ఇట్టినొప్పు పదము లిందుఁగలవు. వీనినిఁ జూడ నీ పండితరాజునకుఁ దెనుఁగునందు నెంత స్వాతంత్ర్యముగలదో యని చదువరులకుఁ దోఁపక మానదు.

ఇట్లుభయభాషలందు పరినిష్ఠితమైన ప్రజ్ఞాప్రాభవముగల యీ మనీషి యధునాతన యుగమున నపరసరస్వతి యనుటలో నాశ్చర్యము లేదు. ఆ మహాకవుల కనేక నమోవాకములు.

[ఈ గ్రంథము 1930 ప్రాంతమున విరచితము. 1932 లో ప్రకటితము. విజయనగ ప్రభువు, దాసుగారిలో వేంచేసియున్న సరస్వతిని సత్కరించుటకై సంగీత కళాశాలను స్థాపించి వారిని ప్రప్రథమాధ్యక్షులను చేసి గౌరవించిన శ్రీ విజయరామగజపతి మహారాజుగారికి వారి రాణి శ్రీ లలితకుమారీదేవిగారికిని అంకితము. గ్రంథాంతమున 132 పుటలు పారసీక పద టిప్పణియు, 6 పుటలు నాటు తెలుగు మాటల టిప్పణియు గలవు. నాడు ఆంధ్రవిశ్వకళా పరిషదుపాధ్యక్షులుగా నుండిన డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ పండితులు 22-10-1932 న దీనికి తొలి పలుకు వ్రాసిరి. అందుండి రెండు పంక్తులు :-

"I have glanced through M. A. Narayanadas's Telugu and Sanskrit Translations of omar Khaiyam and was greatly streck by his varied talents, remarkable linguistic equipment, and technical power of versification. It is a matter of great pleasure to know that Mr. Das maintains a virile and vigorous mind even at his ripe age of 69, and I am tempted to congratulate him on a performance which, taking all things into account, is certainly astounding."

— సంపాదకుడు]



# బాటసారి

కావ్యసమీక్షకులు : డాక్టర్ అమరేంద్ర
శ్రీ క్రొవ్విడి రామం
శ్రీ జమదగ్ని

## ౧. డాక్టర్ అమరేంద్ర :-

హరికథా పితామహులు శ్రీ నారాయణదాసుగారు పాతికేళ్ళు నిండని పరువంలో రచించిన లఘుకావ్యం "బాటసారి".

కావ్యం చదివి ముగించగానే నాకు ఎప్పుడో విన్న హిందీపాట "ఛోడో ముసాఫిర్ మాయానగర్ అబ్ ప్రేమనగర్‌కో జానా" అనేది మనస్సులో మారుమ్రోగింది. విశ్వకవి రవీంద్రుని అగ్రజులు ద్విజేంద్ర నాథ్ రచించిన "స్వప్నయాన్" అనే ప్రబంధం జ్ఞాపకం వచ్చింది. ఆంగ్ల సాహిత్యంలో అద్వితీయస్థానం అలంకరించిన జాన్‌బన్యన్ "యాత్రికుని ప్రస్థానం" మనస్సులో మెదిలింది. అంటే యిది వాటికి అనుకరణమూ, అనుసరణమూ కాదు. ఆ కోవకు చెందిన ఒక విశిష్ట స్వతంత్ర రచన. ఆలివర్ గోల్డుస్మిత్ రాసిన ట్రావెలర్ అన్న కావ్యానికి యిది అనువాదం అని పొరబడిన పెద్దలు ఈ రెండు కావ్యాలు సరిగా చదవలేదనే చెప్పాలి. ఈ రెంటికీ ఎక్కడా పోలికలేదు.

నారాయణదాసుగారు ఆంగ్లంలో రాసిన పీఠికలో తమలక్ష్యాన్ని స్పష్టంగా ప్రకటించారు.

**"In writing this small poetical work my main object had been to present to the Telugu reading public an attempt at something**

original as to plot, coupled with vividness of natural descriptions told in easy Telugu deviod of all the artificialities of the usual ornate style" అంటూ మూడు అంశాలు పేర్కొన్నారు. స్వతంత్రమైన కథాకల్పన; విపులమైన సహజసుందర ప్రకృతిదృశ్యవర్ణన; సాధారణంగా అలంకారభూషితమైన కావ్యశైలిలో కనబడే కృత్రిమత్వాన్ని విసర్జించిన సరళరచన.

పైన పేర్కొన్న లక్ష్యాలను సాధించడంలో నారాయణదాసు గారు ఎంతవరకు కృతకృత్యులైనారనేది మనం పరిశీలించాలి. అద్వైత వేదాంతం ఉగ్గుపాలతో ఆస్వాదించిన భారతదేశంలో పుట్టిన కవి దృష్టిలో మానవుడు నిత్యయాత్రికుడు. అతని మనుగడ అనుపదమూ మంటి నుంచి మింటిదాకా సాగే మహాప్రస్థానం. ఆహారవిహార భయ నిద్రాదులలో తక్కిన జంతువుల సరసనే నిలబడినప్పటికీ, మానవునిలో విజ్ఞానజ్యోతి వెలుగొందుతున్నది. అందువల్లనే కూడూ గూడూ గుడ్డా దొరకినంతమాత్రాన తనివి చెందక అందని ఆకాశాలకోసం ఆరాట పడుతూ వుంటాడు. అన్నంనుంచి ఆనందం దిక్కుగా అతని పయనం సాగుతున్నది. అందువల్లనే మాయావరణం దాటి ఆత్మస్థానమైన దివ్య ధామం వైపుగా సాగిపోయే "ఒక్క మహానుభావు"డైన మానవుని తన కథానాయకునిగా స్వీకరించారు దాసుగారు.

ఆంగ్లసాహిత్యంలో ఇటువంటి రచనను allegory అంటాము. పైకి కనబడే అర్థంతోపాటుగా కొంచెం లోతుకు దిగితే తగిలే అర్థం యింకోటి వుంటుంది. మామూలుగా శబ్దాలలో శ్లేషవల్ల రెండు అర్థాలు స్ఫురిస్తాయి. కాని ఏలిగరీలో ప్రతి సన్నివేశమూ, ప్రతి పాత్రా, ప్రతి దృశ్యమూ అంతర్గతమైన మరొక అర్థాన్ని స్ఫురింపజేయాలి.

స్థూలంగా చెప్పాలంటే ఈ కావ్యంలో కథ చాలా చిన్నదే. ఒక బాటసారి భార్యాబిడ్డలతో ఓడలో వెడుతూ వుండగా తుఫాను వచ్చి ఓడ ఒక కొండకు తాకి ముక్కలై పోతుంది. బాటసారీ, ఆయన

భార్యా బిడ్డడూ తలోకచోటా తేలుతారు. ఒకరి క్షేమం మరొకరికి తెలియదు. ఒడ్డుకు చేరిన బాటసారి ఒంటరివాడై పోతాడు. భార్యాబిడ్డా మునిగిపోయారనుకుని దుఃఖిస్తాడు. తెల్లవారిన తరువాత ఒక కొండా, దాని నుంచి జాలువారే సెలయేరూ, ప్రక్కన ఒక తోటా కనబడతాయి. తోటచెంత ఒక రాతిబండమీద పగలంతా ఒళ్ళు తెలియని నిద్రపోయి రాత్రి వెన్నెట్లో కళ్లు తెరుస్తాడు. పండు వెన్నెలలో పయనించి ఒక సూదికొండనుచూసి, ఒక రాతిమీద వెన్ను వాల్చి తన భార్యనూ బిడ్డనూ తలచుకుంటూ విచారపడతాడు. కొంతసేపు గడచిన తరువాత అక్కడి కొలనులో స్నానమాడి, నీళ్లు తాగి దప్పికతీర్చుకొని, అక్కడ వున్న తోటలో రంగురంగులపూలూ, రకరకాలచెట్లూ, చూసుకుంటూ పోయి ఒక దివ్యభవనం కనిపిస్తే అందులో ప్రవేశించి అక్కడి అందచందాలకు మురిసిపోతాడు. తన జనానా సుందరులతో అక్కడికి ఒక పాదుషా వస్తాడు. దిగంబరుడుగావున్న బాటసారికి దుస్తులువలిచ్చి నువ్వెవరని ప్రశ్నించాడు. బాటసారి తన కథంతా చెబుతాడు. పాదుషా తన కోటకు తీసికెళ్ళి బాటసారిని తన దగ్గర కొన్నాళ్లు ఉంచుకుంటాడు. కాని బాటసారి ఎప్పుడూ ఖిన్నుడై వుంటాడు. ఇది చూసి పాదుషా ఒకనాడు బాటసారిని ఓడరేవు సమీపంలోవున్న గంటస్తంభం దగ్గరకు తీసుకెళ్ళి ఆ స్తంభపు పలకమీద వున్న అక్షరాలు చూపిస్తాడు. ఆ అక్షరాలద్వారా తన భార్యాబిడ్డా ఇంకొక నావలో మరొకనగరంచేరి సురక్షితంగా వున్నారని తెలుసుకుంటాడు. ఆ పాదుషా తన అన్నగారి కుమారుని తోడు యిచ్చి బాటసారిని ఆ నగరానికి పంపిస్తాడు. ఆ నగరంలో పాదుషా అన్న కొడుకు తను ప్రేమించిన సుందరిని కలుసుకుంటాడు. అక్కడే బాటసారి తన భార్యనూ బిడ్డనూ కలుసుకొని వియోగదుఃఖంనుంచి విముక్తిపొందుతాడు. అప్పుడు అందరూ కలిసి పాదుషావున్న సుందర నగరానికి తిరిగివచ్చి అక్కడ సుఖంగా వుంటారు.

ఈ కథలో ఇమిడ్చిన తత్త్వం తెలుసుకోవడానికి మనకు నారాయణదాసుగారు కొన్ని సూచనలు అందించాడు. మాయా గర్భనరక

విముక్తుడై పూర్వజన్మవాసనవల్ల ఆత్మస్థానం చేరుకోవాలని ఆరాటపడే జీవాత్మ బాటసారి. భార్యవిద్య, కొడుకు వివేకం. సముద్రం సంసారం. ఓడ పుణ్యం. ఓడకు తగిలి పగలగొట్టిన కొండ పాపం. కనిపించిన సూది కొండ ప్రకృతి. సరస్సూ, నదీ, పట్టణమూ జాగ్రత్ స్వప్న సుషుప్తి అవస్థలు. ఏడంత స్థులూ, ఏడురంగులూ ఇరవై ఎనిమిది గదులూవున్న మేడ సప్తధాతువులనూ, ఏడు ఉపాయాలనూ అరిషడ్వర్గాలనూ, పంచకోశాలనూ, నాలుగు పురుషార్థాలనూ స్ఫురింపజేస్తుంది. పాదుషాదంపతులు జ్ఞానవైరాగ్యాలు. తొలిరాజధాని ఐహికజీవనం. రెండవది ఆముష్మిక జీవనం. గంటస్తంభం మీాది రాత కర్మం. కొత్తదంపతులు భక్తిశ్రద్ధలు. బాటసారి భార్యనూ, కొడుకునూ మళ్ళి కలుసుకోగలగటం కైవల్యప్రాప్తి. గుఱ్ఱం బుద్ధి. బాకు, తుపాకి, బల్లెము, ఈటెలు సాధనా చతుష్టయం. పులిరాగం, పందిద్వేషం. దాది సంప్రదాయం. గడియారం ఆయుర్దాయం. ఆసవం దీక్ష. ఉంగరం లక్ష్యస్థానం. మామ గురువు, బావ మిత్రుడు

ఈ విధంగా కావ్యంలో ప్రయోగించిన ప్రతీకలన్నీ దాసుగారు వివరించారు. బాటసారి కావ్యంలోవున్న కథాంశాలన్నీ వేదాంతపరంగా అన్వయించుకోవలిసిందని కవివాక్కు. విభ్రాంతిలో మునిగిన జీవుడు ప్రబోధం పొంది, ప్రబోధం ద్వారా ముక్తిని సాధించిన కార్యకలాపంగా కథలోని సన్నివేశాలన్నీ గ్రహించుకోవాలని దాసుగారు చదువరికి చేయూతనిచ్చి కావ్యహృదయంలోకి ప్రవేశం కల్పించారు.

అంటే, "బాటసారి" ప్రతిమానవుడి కథనూ సూచించే కావ్యం అన్నమాట. "ఎచ్చటినుండి నేనిచటి కెట్టుల వచ్చితి ?" అన్న అనాది ప్రశ్న వేసుకునే మానవులందరి కథా ఇందులో వుంది. దివ్యధామంనుంచి దిగివచ్చిన చిన్నారి అతిథిని, ఆ దివ్యసీమకే తిరిగి చేరుకోవాలని పరితపించే బాటసారిని అనే భావం మనస్సులో మెరిపించగల చక్కని చిక్కని రచన ఇది.

ఇందులోవున్న ఒక పద్యం "ఔరగారడి

సూర్యుండ, యబ్బురంబు,
కద బ్రదుకువలె నీకరకౌశలంబు
అల్పభౌమంబులన్జూపి, యధిక దివ్య
ములను గన్పట్టనీయక మోసపుచ్చు"

చదవగానే జోసఫ్ బ్లాంకోవైట్ రచించిన సానెట్ జ్ఞాపకం వచ్చి తీరుతుంది.

"Who could have thought such darkness lay concealed
Within thy beams, O Sun ! or who could find
While fly, and leaf, and insect stood revealed
That to such countless orbs thou madst us blind?
If Light can thus deceive, wherefore not life ?
[ Night and Death ]

ఆంగ్లకవి భావానికి అలరిన అంతరంగంతో దాసుగారు తమ పద్యం రాసివుంటారు. లేకపోతే ఇద్దరిభావాలకూ ఇంతదగ్గర పోలికవుండటం కాకతాళీయం అనటానికి వీలులేదు.

ఇక కావ్యశైలివిషయం. దాసుగారికి తేటతెలుగు పదాలమీాద మక్కువఎక్కువ. ఈ కావ్యంతో ప్రారంభించిన ఈమోజు రానురాను ఎక్కువైపోయి, తత్సమ తద్భవ పదాలులేకుండా రచనఅంతా అచ్చ తెనుగులోనే నడిపించాలనే విపరీతవాదానికి దారితీసింది. వస్తువుకూ, సందర్భానికీ, పాత్రకూ రసానికీ అనుగుణంగా శైలి దానంతట అది స్వచ్ఛంగా బయలుదేరి రావాలి. అల్లాకాకుండా ముందుగానే ఏర్పరుచుకున్న కొన్నిసిద్ధాంతాల ఇనపచట్రంలో శైలిని బిగించటానికి పూనుకున్న కవి ఎంతగొప్పవాడైనా పరాజయం పొందకతప్పదు. అంతా సంస్కృతంతో నింపటమూ, అంతా తెలుగులోనే నడపటమూ రెండూ విపరీతసిద్ధాంతాలే మరి. సరళ సుందరమైన సంస్కృతం తెలుగుతో కలిసినప్పుడు పాలలో తేనె కలిసిన చందంగా శైలికి ప్రసాద మాధుర్య గుణాలు ఇనుమడిస్తాయి. అదికాదని అంతా తెలుగులోనే

నడపాలనే పూనుకొన్నప్పుడు శైలి మామూలు చదువరికి కొరకరాని కొయ్యగా తయారవుతుంది. అచ్చ తెలుగు వాడినప్పుడు కూడా నారాయణదాసుగారు సూటిగా తేటగా చెప్పగలరు.

"నిడు వాలు కనులు తీయని
నుడువులు ముంగురులు చెదురు సుదురు నెమ్మేల్పు
త్రడి మేను, నన్ననడుము, పొ
గడ దగు నీ నడక కనులగట్టున్నమ్మీ."

అన్నట్లు తేట తెలుగులో నడిచిన పద్యాలు "బాటసారి"లో ముచ్చట గొలిపేవి చాలావున్నాయి. అయినప్పటికీ సంస్కృతశబ్దాలని వెలివేస్తేకాని తెలుగుశైలికి పెంపు సొంపులు చేకూరవని తలపోయటం సమంజసంగా తోచదు. మనుషులు నిత్యజీవితంలో వాడుకునే తేలిక మాటలతోనే కవిత్వం రాయాలని కంకణం కట్టుకున్న విలియం వర్డ్సువర్తుకవికూడా ఉన్నతభావాలు ఆవేశించినప్పుడు ప్రౌఢశబ్దాలను ప్రయోగించక తప్పలేదు. అల్లాగే దాసుగారు కూడా సన్నివేశాన్నిబట్టి "చటులానిల సంచలదూర్మిమాలికా ఘనవికటధ్వని ప్రబల కన్ది సముత్ప్లవమాన రమ్యా, నూతన రవిబింబ" వంటి సమాసరచన చేయక తప్పలేదు. ఎల్లా తప్పుతుంది మరి?

సందర్భాన్ని అనుసరించి దూసుకు వచ్చినప్పుడే కవిశైలి సహజ సుందరంగా మెరిసిపోతుంది. ముందుగానే ఏర్పరచుకున్న సిద్ధాంతాలకు కట్టుబడిన శైలి అసహజంగా వుండక తప్పదు.

మొత్తం మీద నారాయణదాసుగారి "బాటసారి" నిజంగానే ధ్వనిమనోహారి, సరస సత్పద విహారి, నవ్యకథాధికారి, సాధువృత్తి ప్రచారి. వెలువడిన తరుణాన్నిబట్టి చూస్తే ఇదొక ప్రయోగాత్మకరచన అనాలి, కావ్యసంప్రదాయాలకు బానిసత్వం వహించని, స్వతంత్ర ధోరణికీ, నవ్యత్వాన్ని కాంక్షించే ఉపజ్ఞకూ "బాటసారి" ఒక నిదర్శనం.

శ్రీ కొవ్విడి రామం

నిండుజవ్వనాన్ని సంతరించుకొన్న శుభసమయంలో ఆదిభట్ల నారాయణదాసుగారు ఆంధ్రదేశానికి అందించిన గూఢార్థ ప్రతిపాదకమైన వినూత్నవిశిష్ట కావ్యం యీ బాటసారి. ఈ కావ్య రచనాకాలము నాటికి దాసుగారికి యిరువది నాలుగేండ్లు. ఏభాషలోనైనా గూఢార్థ ప్రతిపాదకములైన కావ్యాలు అరుదుగా ఉంటాయి. ఇలాంటి కావ్యాలని ఆంగ్లభాషలో ఎల్లెగరి అని పిలుస్తారు. ఇంగ్లీషులో బనియన్ వ్రాసిన పిలిగ్రిమ్స్ ప్రోగ్రెస్ ఏ విధంగా చిరస్థాయిగా ప్రముఖమైన స్థానాన్ని ఆక్రమించుకుందో యీ బాటసారి కూడా అదేవిధమైన అగ్రస్థానాన్నే ఆక్రమించుకుంది.

స్వతంత్రమైన కథావస్తువుని ఎన్నుకొని సహజమైన వర్ణనలతో కమ్మని తేటతెనుగు భాషలో మనోరంజకమైన కావ్యాన్ని సృష్టించడమే దాసుగారి ధ్యేయం. ఈ కావ్యాన్ని రాయబహద్దూర్ శ్రీ. పి. ఆనందాచార్యులవారికి దాసుగారు అంకితం చేశారు. ఈ రచన యే యితర కావ్యానికి అనుసరణ కాని, అనువాదంకాని యెంతమాత్రం కాదు. దీనిలో తెనుగు నుడికారపు సొంపు ముద్దులొలుకుతూ ప్రతిపద్యంలోనూ హృద్యంగా వ్యక్తమవుతూంది.

సంసారసాగరంలో ఒడుదుడుకుల బడి కైవల్యప్రాప్తిని బొందిన జీవునిగాథ రమణీయంగాను, నిగూఢంగాను యిందులో వివక్షితమయింది. విభ్రాంతుడై "బద్ధుడగుచు ప్రబుద్ధుడై ముక్తుడగుచుంట" ఆత్మయొక్క సహజ క్రీడలు. వేదాంతపరంగా బాటసారి కథను యీ విధంగా వూహించుకో వలసివుంది.

ఇంక యీ గూఢార్థం కంటే నేయార్థం ఎంతో హృదయంగమంగా చవిగల పలుకుతో కమ్మని భావంతో శ్రవణపేయంగా దాసుగారు ఉటంకించారు. ప్రకృతి వర్ణనలలో ఏ ప్రాచీన ధోరణని అనుసరించ

కుండా, సర్వస్వతంత్రంగా పాఠకుని కండ్లకు కట్టినట్లు వర్ణించడం దాసు గారి సొమ్ము. మచ్చుకు యీ క్రింది సీసపద్యం చూడండి—

"ఒంటిపాటున బొక్కి యిరువయి కెంపెక్కి
విన్ను తూర్పున దూరె వేగుజుక్క
రెక్కలు జాడించి ముక్కును గోడించి
కొక్కొరోకోయని కూసెఁ గోడి
నీటి తావుల దారి తోటల గడిదేరి
యొడలుచల్లన జేయుచుండె గాలి
యైదు జాముల పద్దుగా దోచు నిక బ్రొద్దు
పొడమెడునని చాట దొడగె గంట

పట్టు లెడబాసి పిట్టలు బయలుబారె
దలలు రిక్కించి మొక్కలు చెలువుమీరె
బలిమితోడుత నిద్దురబరువు జారె
దెబ్బున స్వేనపి బ్రేయి తెల్లబారు"

ఈ ప్రభాతవర్ణన ప్రాచీన ప్రబంధవర్ణనలతో ఏమీ జోక్యం పెట్టుకోకుండా సహజంగాను స్వభావసిద్ధంగాను ఉన్నదనడంలో అతిశయోక్తి లేదనుకుంటాము.

రాజు అన్నకొడుకు యొక్క విప్రలంభ శృంగారాన్ని యీ కవి బహురసవత్తరంగా చిత్రించారు.

"వాని మేనరికము పసితనంబుననుండి
చనువుచేత ఎంచుకొనిన సొమ్ము
దవ్వు లయ్యె నిండుజవ్వనపు స్గోర్కి
కరవు దీర నెపుడు గనెద నిన్ను."

అని అతడు వాపోతాడు.

"మొదట వాపులెరింగిన ముద్దుచూపు
పిదప గురులుంచు దాపున బెదరుచూపు

తగిలి యెడబాయజాలని దిగులు చూపు
కనుల దోబూచి చూపు నాకన్నె చూపు."

అని విరహోత్కంఠుడై ఆ రాకుమారుడు విలపిస్తాడు.

సంఘటనలను యథార్థంగా చిత్రించడంలో దాసుగారిలేఖిని ప్రత్యేకతను చేకూర్చుకుంది. ఓడ రేవులో గంటకంబం దగ్గర తన ప్రేయసి వ్రాసిన విషయాన్ని బాటసారి చదివినప్పుడు అతనికిగల ఔత్సుక్యాన్ని హృదయోద్వేగాన్ని దాసుగారు చక్కగా చిత్రించారు. గంటకంబం పైన ఉల్లేఖించబడిన విషయాన్ని వివరించడానికి దాసుగారు యెన్నడూ కనివిని యెరుగని "చక్కెర" అనే క్రొత్తవృత్తాన్ని సృష్టించారు. ఆ చక్కెరను చదువరులకు నిక్కడ రుచి చూపిస్తున్నాము.

''పెనుగాలి నోడ మున్నీట గొండపై విడిచెడన్గ
వెనుకొన్న యింకెదో నావ యందరన్పొనిచి తెచ్చె
నను గట్టుకొన్న యాతండొకండె కన్పడక యుండె
నినుగొల్తు గంబమా వానిగాంచి నన్వేదక బంపు."

నాలుగు భగణాలు, మూడు నలాలు, ఒక గురువుగల 'నట్టువు' అనే యింకొక క్రొత్తవృత్తాన్ని యతిప్రాస నియమాలతో వీరు సృష్టించేరు. నాలుగు భగణాల తరవాత యతి వుంది. ఈ వృత్తం నర్తకులకు, గాయకులకు అనువుగా వుండవచ్చును.

పాత్ర పోషణలో యీాయన సిద్ధహస్తుడు. భార్యాబిడ్డలను కోల్పోయి ఒంటరిగా సంచరిస్తున్న బాటసారి దివ్యహర్మ్యంలో ప్రవేశిస్తాడు. అప్పటి బాటసారిస్థితిని దాసుగారు యీ క్రింది పద్యంలో స్వభావసిద్ధంగా వర్ణించేరు.

"పలుకు లెవ్వియు లేక మ్రాన్పడిన వాని
నార్తి మూర్తీభవించిన యట్టు లున్న
దిన్న మొలవాని మిక్కిలి డస్సి సొలయు
బాటసారిని........"

విధివశంచేత బాటసారి యీ విధంగా క్రుంగి కృశించినా స్వభావ సిద్ధంగా గొప్ప పరాక్రమవంతుడు. రాజుగారితో వేటకు వెళ్ళి అడవి పందిని పులిని చంపి తన ఏలిక మెప్పును గొన్నవాడు. గూఢార్థంలో సూకర శార్దూలాలు రాగ ద్వేషాలకు మారుపేర్లుగా నిలుస్తాయి. రాజుగారి సాహచర్యంలో అనగా గూఢార్థంలో జ్ఞానం యొక్క సాహచర్యంతో రాగ ద్వేషాలను మర్దించ గలుగుతాడు.

దాసుగారు యీ చిన్ని కావ్యంలో కొన్ని సరికొత్త విషయాలను గూడ చదువరులకు ఎరుక పరిచెను.

మింటిని మంటినీ కలిపే వర్ష ధారలను వీణతంత్రులతో సరిపోల్చి ఆ వీణతీగెలను బిగించి షడ్జమస్థాయిలో గాలి పాడుతూందని యీ గాయక కవి తన వ్యక్తిత్వాన్ని యీ విధంగా ప్రదర్శించేరు.

"మింటికి న్మంటికి దరచు మీర వాన
యడుగులను తీగెల బిగించి యారవపడి
వీణెవాయించు నెరజాణ గాణమాడ్కి
నందముల గుప్పి గాలి పాడందొడంగె."

సంసారసాగరంలో పురోగమించే జీవి ఒడుదుడుకులను యథార్థంగా వివరిస్తూ జ్ఞానసహాయంచేత కైవల్యప్రాప్తిని బొందే వుపాయాన్ని యీ భక్తగాయకకవి ఒక విశిష్టమైన పద్ధతిలో చదువరులకు రుచి చూపేరు. గూఢార్థం గ్రహించలేని సామాన్య జనానికి నేయార్థము ఆహ్లాదకరంగా వుండేటట్టు వర్ణనాచమత్కృతి, రమ్యమైన పాత్ర పోషణ, హృదయరంజకమైన సంఘటనలు ఈ కావ్యంలో ప్రదర్శించేరు. అందుచేతనే ఆనాడుకూడా (శ్రీ) కొక్కొండ వెంకటరత్నం పంతులుగారి వంటి మహాపండితులు యీ చిరుకబ్బాన్ని వేనోళ్ళ కొనియాడేరు. ఆటపాటలమేటి మాటలల్లికకు యీ కబ్బము మేటి గీటురాయి.

శ్రీ చెఱుకుపల్లి జమదగ్నిశర్మ

ఆటపాటల మేటి శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాసుగారు పరదేవతానుగ్రహమునకు పాత్రులైన ఒక మహావ్యక్తి. ఆయనను నిమిత్తముగా చేసికొని పరదేవత ఈ తెలుగు దేశమునే అనుగ్రహించినది. కలిప్రభావమున నాస్తికత ప్రబలి పురాణ వైరము పెంచుకొని కేవలమింద్రియవశులై పశుప్రాయులగుచున్న జనులకు బహుముఖీనమైన తమప్రజ్ఞచే జనులనాకర్షించి హరికథలు వినిపించి వివేకము కలిగించి ఆస్తిక్యము నిలువబెట్టిన దీ మహానుభావులే గదా! నారాయణదాసులే యవతరించి యుండకపోయినచో ఈ తెలుగుదేశమున నిప్పుడింత మాత్రముగా నున్న ఆస్తిక్యమైనను ఉండెడిదిగాదని నా నమ్మకము. తత్త్వబోధక గ్రంథము లసంఖ్యాకముగా నుండవచ్చును. వానిని వివరించి చెప్పెడి పండితులకును కొఱత లేకపోవచ్చును. కాని విషయసుఖ పరవశులై ఈగలవలె శ్లేష్మమున దూకు జనులకు తత్త్వమునందాభిముఖ్యము కలుగుట యెట్లు? ఒక వంక సంగీతములో మఱొకవంక నభినయములో, వేఱొకవంక సాహిత్యములో సర్వతోముఖప్రజ్ఞాశాలియై నారాయణదాసు లవతరించి కళాచాతుర్యమున జనుల నాకర్షించి కాంతాసమ్మితముగా ఆస్తిక్యమును బోధించి తెనుగుజాతి నుద్ధరించినారు. వారికిని వారి శిష్యపరంపరకును తెలుగుజాతి మనినంత కాలము కృతజ్ఞమైయుండి తీరవలయును,

శ్రీ నారాయణదాసుగారి సాహిత్యము చాల విస్తృతమైనది. ఎంత విస్తృతమో అంత అగాధమైనది. జగత్ప్రసిద్ధములైన సంస్కృతాంధ్రము [illegible]దలి హరికథలేకాక వారు రచించిన ఇతరగ్రంథము లసంఖ్యాకము[illegible]గా నున్న[illegible]. వాని యందలి వైవిధ్యము నింతయు నంతయు కాదు. [illegible]రతత్త్వ[illegible] మొదలు పాకకళవఱకు వారు స్పృశించని విషయము లేదు. దేనినిగు[illegible]ర్చి చెప్పినను స్వానుభవముతో, సంపూర్ణమైన ప్రత్యయముతో, నింతకంటె చెప్పుటకు వీలు లేదనునట్లు చెప్పుటయే గాని పైపై స్పృశించుట కానేకాదు. అయినను దాసుగారికి లోకము

నందు పేరు ప్రతిష్ఠలు కలిగినవి హరికథలను పురస్కరించుకొనియే. తక్కిన గ్రంథములను గూర్చి లోకమునకు తెలియనే తెలియదు. అది లోకము తప్పుగాదు. తన దగ్గరకు వచ్చినవాని నది మెచ్చుకొన్నది. రాని వాని దగ్గరకు పోవు వివేకము దాని కెన్నడును లేదు.

ఒక విధముగా చూచినచో నారాయణదాసుగారు హరికథల కొఱకే జన్మించినారు. సాహిత్య ప్రక్రియలలో హరికథ కొక ప్రతిష్ఠ వచ్చినది వారి వలననే. ఇది యంతకు ముందున్న యక్షగానముల కంటె విశిష్టమైనది. ఇందు కథకుడొక్కడే వక్త. పాటకు సహాయ కుడు ప్రక్కవాద్యగాండ్రు నుండిన నుండవచ్చునుగాక! యక్ష గానములలో వలె నితరులతోడి సంభాషణ ముండదు. కథకుడొక్కడే సర్వ పాత్రల నభినయించును. ఇట్టి వైశిష్ట్యముతోడి ప్రక్రియను దాసుగారికంటె ముందెవరైన నిర్మించి యున్ననను దానికి సంపూ ర్ణమైన సర్వాంగసుందరమైనమూర్తి నేర్పరచి జీవముపోసిన వారు మాత్రము దాసుగారే. కావుననే హరికథాపితామహులని లోకము వారి నాదరించినది. అచ్చయిన హరికథలు వారు చెప్పినవానికి సజీవ ప్రతికృతులుకావు. సంగీతాభినయములు ప్రధానములయిన ఆ హరికథ లకు సజీవప్రతికృతుల నచ్చొత్తించుటయు సాధ్యముకాదు. వారో వారివంటి శిష్యులో వాని నావిష్కరింపవలసినదే. కాగా అచ్చయినవి అసలువానికి ఎక్స్‌రే ఫోటోలవంటివి. వట్టి ఎముకలగూళ్ళు. వానినిబట్టి వ్యక్తుల శరీరసౌందర్యముల నూహించుట యెంతకష్టమో వీనినిబట్టి హరికథలు విన్నప్పటి పారవశ్యము నందుటయు నంతేకష్టము. వట్టి సంగీతాభినయముల చేతనేకాక కథకుని లోకజ్ఞత, బహువిషయపరిజ్ఞా నము, సమయస్ఫూర్తి మున్నగు ననేకాంశములచేత హరికథ రక్తి గట్టును. దాసుగారి తక్కిన గ్రంథములన్నియు వారంత గొప్పకథకు లెందుకయినారో తెలిసికొనుటకు తోడ్పడు సామగ్రి. వానిలో సర్వ జ్ఞత్వమునకై వారుచేసిన కృషియంతయు నున్నది. హరికథా కథన

ములో దాసుగారు ప్రకటించిన సర్వజ్ఞత్వమునకు లోకమానందముగ్ధ మైనది. కావుననే హరికథాకథనమున వారిని మించిన వారు లేరని అంగీకరించినది.

ఆమాటసరే. హరికథా రచయితలుగా, హరికథకులుగా వారి స్థానము సర్వోన్నతమైనదే. కాని కవిగా వారిస్థానమెట్టిది? హరికథ సాహిత్యములో నంతర్భాగమే అయినను, దాసుగారెన్నో అత్యుత్త మములైన హరికథలను రచించియున్నను వారికి మహాకవులుగా లోకము నీరాజనమేల పట్టదు? వారు రచించిన యితర కృతులలోని కవిత్వము మాటయేమి? ఈ ప్రశ్నములకు సమాధాన మరయుటయే ఈ వ్యాసము ముఖ్యోద్దేశము.

ఇచట కొన్ని విషయములను విస్పష్ట మొనర్చికొనుట యవస రము. వాక్కుతో సంబంధమున్న వ్యక్తులందరును కవులు కావలసిన యవసరములేదు. కవి యనిపించుకొననంత మాత్రమున వ్యక్తుల వ్యక్తి త్వమున కెట్టి హానియు లేదు. గ్రంథకర్తలైయుండియు కవులు కాని వారనేకు లున్నారు. త్యాగయ్య వంటి మహానుభావులను వాగ్గేయ కారులనుటలో నున్నంత గౌరవము కేవలము కవులనుటలో లేదు. వారి నట్లనుట వారి వ్యక్తిత్వమును తగ్గించుటయే ఇట్లే శ్రీశంకరభగవ త్పాదులవంటి వారి విషయమునగూడ. శ్రీవారిని ప్రస్థానత్రయ భాష్య కారులని, షణ్మత స్థాపనాచార్యులని, దేశికోత్తములని, అపర శంకరులని శిరసావహింప వలసినదేగాని, పరమ సుందరములైన, స్తోత్రములను రచించిరిగదా యని వట్టి కవులని దిగదీయరాదు.

కవియనుపేరు రససిద్ధులై విశిష్ట లక్షణ యుక్త ములైన కావ్య ములు రచించిన వారికే చెల్లును. కాళిదాసాదు లట్టివారు. శ్రీ దాసు గారి సమకాలికులలో తిరుపతి వేంకటకవు లట్టివారు. వారి నన్నట్లుగా దాసుగారిని గూడ కవులనవచ్చునా?

ఈ దృష్టితో దాసుగారి సాహిత్యమును పరిశీలించినప్పుడుగూడ వారిని కవులనియేకాదు ఉత్తమ కవులని అంగీకరించి తీరవలసిన రచనలు కొన్ని యున్నవి. వానిలో 'బాటసారి సర్వోత్తమము. హరికథలలో కవిత్వ మెంతయున్నను వానినిబట్టి దాసుగారిని కవులనరాదు. దాసు గారు రససిద్ధులే. హరికథలు రసవంతములే. అయినను వానిలో కవి తాంశముకంటె సంగీతాభినయములకే ప్రాముఖ్యమెక్కువ. అక్కడి రసనిర్వహణము కావ్యమార్గానుసరణమున మాత్రమే జరుగదు. వాని యందు తప్పనిసరియై వాగ్వ్యాపారము కావ్యమార్గము నానుషంగికము లగుచున్నవి. అంతియేకాని వానికి ప్రాధాన్యము లేదు. అందుచే హరి కథలనుబట్టి దాసుగారిని కవులనుట వానియందలి తక్కిన వాని ప్రాము ఖ్యమును గుర్తింపక పోవుట యగును. హరికథలుకాక దాసుగారు రచిం చిన యితర గ్రంథములలో ఎక్కువ భాగము శాస్త్ర విషయికములు. శాస్త్ర గ్రంథములు పద్యరూపమున నున్నంతమాత్రమున కావ్యములు కావుగదా! ఇవికాక సంస్కృతమునను తెలుగునను కొన్ని శతకము లున్నవి. ఉమర్ ఖయ్యామ్ రుబాయీల కనువాద మున్నది. వాని యన్నింటిలోని కవితాంశము మాట యటుంచి ఈ బాటసారి యందలి విశిష్టత యెట్టిదో చూతము.

దీనిని రచించునాటికి దాసుగారి వయస్సు ఇరువది నాలుగేండ్లట. ఆ యీడుననే యింత విశిష్టమైన కావ్యరచన చేయగలిగిన వారు కావ్య మార్గమునే అంటిపట్టుకొని యుండినచో వారి లేఖినినుండి మహోత్కృష్ట కావ్యములే వెలువడియుండెడివి. వారవతరించిన కాలమున జాతి కవ సరములైనవి పట్టి కావ్యములు కావు. కొంత అవసరమున్నను వాని కితరులున్నారు. కావున పరదేవత వారి నా మార్గమున నుంచలేదు. సంగీతాభినయములలో ప్రావీణ్యమును సంపాదింపజేసి వారిచేత చేయింప దలచిన పని చేయించినది.

బాటసారి రచన నాటికే దాసుగారెంతయో ముదిరిన తాత్త్వికులు. కథకథగా నిర్వహించుచునే వెనుక నెంతయో తాత్త్వికార్థము నిక్షేపించినారు. నౌకాభంగ హేతువున నొకానొక గృహస్థు భార్యాపుత్త్రి వియుక్తుడయి వారికొఱ కాందోళనమంది దైవికముగా నొకానొక రాజపురుషాశ్రయము బడసి తిరిగి వారిని కలిసికొనుట కథావస్తువు. రసము నెంతైన పండించుట కవకాశమున్న యితివృత్తము. దాసుగారా పనిని అత్యంత సమర్థముగ నిర్వహించిరి. కొన్ని చోట్ల అనితర సాధ్యమైన పనితనమున్నది. సామాన్యుల కందని ఔచితీ నిర్వహణమున్నది.

బాటసారి నీటబడి స్మృతిహీనుడై యుండగా నొడ్డునకు నెట్టివేయబడినాడు. స్మృతికలిగిన వెంటనే అపరిచిత పరిసరములందుండుటకు విస్మయము ప్రకటించుచు నతడు స్మరించినది.

చిన్ని కొడుకుతోడఁ జెలియ యేమయ్యెనో అని సంసారము నే. అందును ముందు కొడుకు, తరువాత చెలియ. సంబంధమున చెలియ ముందును తరువాత కొడుకును. అయినను మోహమున నిది తలక్రిందులగునుగదా! బాటసారి దైవము చేతకు విస్మయమంది ధైర్యము తెచ్చుకొని జనసంచారములేని యా ప్రదేశములలో కొత్తలోకములో తిరుగాడినట్లు తిరుగాడి యెందును భార్యాపుత్త్రిలనుగానక పోయిపోయి యొకానొక దివ్యసౌధమును ప్రవేశించినాడు. అక్కడను మనుష్య సంచారములేదు. స్త్రీ పుంరూపయంత్రములు నడయాడుచున్నవి. విస్మయముతో వానిని చూచుచుండగా అనుచరులతో దివ్యపురుషుడవతరించినాడు. బాటసారి మాన్పడి చూచుచున్నాడు.

పలుకు లెవ్వియు లేక మ్రాన్పడినవాని
నార్తి మూర్తీభవించిన యట్టులున్న
దిన్న మొలవాని మిక్కిలి దన్నియున్న
భాటసారిని కన్గొని పలికె నిట్లు.

ఆదివ్యపురుషు డన్నమాట లోక మత్తకోకిలములో నున్నవి.

"అని దువ్వలువ నొసఁగిన న్గొని"

ఈ నిర్వాహణమునందలి ఔచిత్యమెంత లోత్తైనదో గమనింపుడు. బాటసారి ఒడ్డునబడి మేలుకొనునప్పటికే దిగంబరుడు. కాని యప్పటి నుండి యింతవరకు నతనిచే దిగంబరత్వమును స్మరింపనీయలేదు కవి. అతనిని జూచిన పురుషుడామాట యనువఱకు పాఠకులకు గూడ నా విషయము స్ఫురింపనీయలేదు. దివ్యపురుడామాట యని దువ్వలువ నిచ్చెనో లేదో బాటసారి దానిని గొని మొలపై బిగియఁజుట్టుకొని లేచినాఁడట. ఆ సౌధములో బాటసారి స్త్రీ పుం రూప యంత్ర సంచారమును గమనించినప్పుడే తన దిగంబరత్వమునకు సిగ్గిలి కూర్చుండి నాడన్నమాట. దివ్యపురుష దర్శనముతో మరింత సిగ్గిలి యున్నాడు. బట్ట కట్టుకొని లేచినాడు. ఈ నిర్వాహణ మెంత లోకోత్తరముగా నున్నది? బాటసారి దిగంబరత్వమును మొదటనే స్మరింపజేసినచో తత్ప్రతిక్రియ వెంటనే జరిగింపవలెను. అట్లుచేసినచో భార్యా పుత్రులపై కంటె తనయందే మోహమెక్కువ కలవాడని చెప్పినట్లగును. ఇట్లు చేయక అతడనేక ప్రదేశములను దిగంబరుడయియుండియే చూచినా డన్నచో ఏతద్వర్ణనాసందర్భమున పాఠకుల నా స్మృతి వీడక జుగుప్స కలిగించుచునే యుండును. మొదటకాక యిప్పుడా విషయమును చెప్పుటచే ఆ దుష్ఫలితము లేదు సరిగదా బాటసారి తన దిగంబరత్వమును గూడ పాటింపక భార్యా పుత్రాన్వేషణకై నిర్జనారణ్య సంచార మొనర్చుట తోఁచి వారికై యాతడందిన తహతహ యెంతటిదో సువ్యక్తమైనది. ఇంతటి లోత్తైన ఔచిత్యముతో సన్నివేశముల నిర్వహించుట ఉత్తమ కవులయందే యుండును.

బాటసారి యడవులలో తిరుగాడు నపుడు ఒకచో సొమ్మసిలి నిద్రించినాడు. లేచుసరికి తెల్లవారినది. ఎదుట సూర్యుడు తోఁచినాడు.

ఔర గారడి సూర్యుండ యబ్బురంబు
కద బ్రతుకవలె నీకర కౌశలంబు
అల్ప భౌమంబుల న్జూపి యధిక దివ్య
ములను గన్పట్టనీయక మోసపుచ్చు.

అని యిట్లు బ్రతుకుపై రోతపుట్టి నిష్ఠురములాడినాడు లోక బాంధవుని.

తరువాత నచటి ప్రకృతి సౌందర్యమునకు చకితుడై తిలకించినాడు. స్నానమాడి తపనున్గని అర్ఘ్యప్రదాన మొనర్చుచు-

అడలు గొలిపెడి చీకటి కడలి నుండి
కడపి మముగాచు తరణి నీ కిదెద మ్రొక్కు
అహితముల గొట్టి గొప్ప మేళ్ళాచరించి
యేలుచుండెడు మిత్ర నీకిదె జొహార్లు.

అని ప్రశంసించాడు.

ఆ దెప్పేమి ఈ మెప్పేమి ?

వీనిలో సృష్టితత్త్వమంతయు వ్యాఖ్యాతమైనది. సూర్యుని కర కౌశలము బ్రతుకవలె నధికదివ్యములను గప్పిపుచ్చి అల్పభౌమములను జూపి మోసపుచ్చుచున్నదట. బ్రతుకవలెననుటలో పరమార్థమంతయు నున్నది. అజ్ఞునకు బ్రతుకు చేయుచున్న దంతియేగదా! కాని ఆ బ్రతుకే లేకపోయినచో ప్రాజ్ఞుడైనను చేయగలిగినది లేదు. బాటసారి అజ్ఞత తాత్కాలికము మాత్రమే. జీవితము భోగమునకే కాక ముక్తికని తెలిసినవాడు. సూర్యుడా వివేకమును కలిగించుచున్నాడు. అజ్ఞానత మస్తరణమునకు హేతువగుచుండుటచే తరణి. అహిత నిరాసములో హితకరుడగు చుండుటచే మిత్రుడు. జీవుడు ప్రకృతి నెట్లుపయోగించు కొనవలెనో, దేనికి మోహితుడు కారాదో, వివేకము నెట్లు పొంద వలెనో కవి యీ ఘట్టముచే ఉపదేశించి నట్లయినది.

ఈ కావ్యము శాంత రస ప్రధానమయినది. అంగభూతములై కరుణ శృంగార వీరాదు లన్నియు నున్నవి. కాని ప్రధానము శాంత మగుటచే వేనికిని పొంగుండదు. హద్దులోనుండి యెచట వచటనే పొటము రించి యణగారు చుండును. ఇట్లు నిగ్రహముతో రసనిర్వాహ మొనరించుట చాల కష్టసాధ్యమైనవి.

పాపపు దైవ మెంత పొరపాటొనరించెను నన్నిగిల్చి న
య్యో పికవాణి ! వికసితోత్పలలోచన ! నిన్ను బాసి యె
ట్లోపుదు జాము క్రింద మనముంటిమి ముచ్చటలాడుకొంచు నా
హా ! పరిపూర్ణ చంద్ర వదనా ! మన కింక ఋణంబు చెల్లెనా !

.... ... .... ....

కట్టుకొన్న చెలిమి కట్టులఁ దప్పితి
నట్టుకొన్నవాడ నెట్టులైతి
కట్టరాని మనసు కట్టి బ్రతికితి ని
న్నట్టుకొన్నవాడ గనుకఁజెల్లె

బోటి బ్రతికినదని నాకుఁ దేట వడియెఁ
గాని నాయున్కి నెఱుఁగ దచ్చాన యకట
పిట్టవలెనాకు ఱెక్కలు వెలయునేనిఁ
బడఁతిఁ గనకుందునే ఱెప్పపాటులోన.

.... ... ... ....

తరుణీ ! కన్గవబోలి తెల్వియెడ నిద్ర న్డొక్కునట్టింటి పా
టరయన్బోవని నిన్ను నన్నెడపె నేయక్కాళ దయ్యంబు కా
ని రవంతైనఁ దొలంగకుండును గదా నీ రూపు నాలోన న
ద్దిర నాకిద్దియెచాలుఁ జూచుకొనెద న్గల్లంబుగా నెప్పుడున్.

ఇవి వేఱు వేఱు సందర్భములలో బాటసారి భార్యను తలపోసిన విధానము తెలుపునవి. సామాన్య కవు లిట్టి పట్టులలో ఉద్వేగము నట్లే పొంగించి పదు లిరువదులుగా పద్యములు వ్రాయుదురు. దాసుగారు ప్రయత్న పూర్వకముగా నొకటి రెండింటితో ముగించి విషయాంతరము నుపక్రమించుట గమనింప దగిన విషయము. ప్రధానరసమునకు తక్కిన

వాదిగియుండవలెనను వివేకము కలవారే యిట్టి నిగ్రహము పాటింప గలరు.

కలయం దెత్తెడు మేను తోఁచెడు జగత్కార్యంబులు న్జిత్త సం
చలతన్ వాస్తవమందు చందమున నీ సర్వ పపంచంబు న
జ్ఞులకు న్నిక్కముగాఁ గనంబడెడుఁ బ్రాజ్ఞుల్ పూర్ణభావంబు ని
శ్చల మౌటన్ దమకన్న వేఱుగన రీశత్వంబు బ్రాపించుచున్.

బాటసారి కాశ్రయ మొసగిన పాదుసాహి పెద్ద లేర్పాటుచేసిన దిద్దుపాట్లు తెలిపెదననుచు అతనితో నాడిన మాటలలో నిదియొకటి. అసలీకావ్యము తెలుపదలఁచిన మూలభూతమైన సిద్ధాంతమే యిది. ఉపాధివశమున జీవులు భిన్నత్వమును భావింతురేగాని ఉన్నది పూర్ణమైన పరబ్రహ్మ మొక్కఁడు మాత్రమే. దాసుగా రన్నట్లు ఈ బాటసారి మాయాగర్భనరక విముక్తుఁడగుచుఁ బూర్వజన్మ వాసనచేఁ జింత నందుచున్న యాత్మ్మఁడు. దారసుతులు విద్యావివేకములు. మహోదధి సంసారము. ఓడ పుణ్యము. ఓడను పగిల్చిన కొండ పాపము. పాపఫలముగ తరుణోపాయము విచ్ఛిన్నమయి విద్యావివేకములకు దూరుడయి [illegible]వుడాపన్ను[illegible]డైనాడు. కాని వానికి పూర్వపుణ్యము సమృద్ధిగానున్నది. ఒంటి కంబము మేడ కనవచ్చినది. అది పరమార్థ సాధనోపాయ[illegible]ు. రాజ[illegible]పతులు కనవచ్చిరి. వారు జ్ఞానవైరాగ్యములట. బాటస[illegible]రికి స్వదా[illegible]సుత పునస్సమావేశమే కైవల్యప్రాప్తియట. ఏమి యీ[illegible] య[illegible]స్ఫుత కల్ప[illegible]ము! అసంసారరూపమగు ముక్తికి మార్గము బోధించు కా[illegible]ముమున సా[illegible]నాంగముల నన్నింటిని సంసారాంగములతో నుపమించు స[illegible]హసమా! దీనికెంత విజ్ఞత, జాగరూకత, నిగ్రహము కావలయును? ముక్తిని భార్యాపుత్రులను గోరినంత గాఢముగా వాంఛించి వారికై తహతహలాడునట్లు ముక్తికై తహతహ లాడువానికే ముక్తి. కామిగాక మోక్షగామిగాడన్న వాక్యమునకు నిదియే యర్థముకాబోలు.

ఈ కావ్యములో ఎనిమిది తొమ్మిది ముఖ్యపాత్రములున్నవి. ఒక్కదానికిని పేరులేదు. ఒక్క మహానుభావుడని యారంభము. అతడే బాటసారి. అతని భార్యాపుత్రులు. ఆశ్రయమిచ్చిన రాజు, ఆ రాజు కన్నకొడుకు, అతనిని వలచిన మేనమామ కూతురు. ఇచ్చుట కంగీకరింపని మేనమామ. ఇట్లే యిందలి పాత్రల కన్నింటికి వ్యవహారము. ఇట్లు ఏ పాత్రకును పేరులేకుండ కథనడపుట సాహిత్యములో నితర కావ్యములం దెచ్చటను నుండదు. కాళిదాసుని మేఘసందేశములో పేరులేని కశ్చిద్యక్షుడొక డున్నాడు. అక్క డాతడొక్కడే యగుటచే సరిపోయినది. మరి యిచ్చట నట్లుకాదే! ఇన్ని పాత్రలున్నను పేరులేల పెట్టలేదు? నారాయణ దాసుగారు జీవనానాత్వము నంగీకరింపని పరమాద్వైతి. కావ్యము తత్త్వ బోధకము.

ఒక సూర్యుండు సమస్తజీవులకు తానొక్కొక్కడై తోచు పోలిక ఒక్కటియే పరబ్రహ్మము భిన్నోపాధులయందు ప్రతిఫలించి భిన్న జీవులుగా తోచుచున్నది. భేదమంతయు వ్యవహారమున నవస్థాభేదముచే వచ్చినదేగాని వాస్తవము గాదుగదా! ఆయవస్థానామము లుండనే యున్నవి. మరి వేరు పేరు లెందుకు?

శ్రీ దాసుగారి రచనలలో భక్తి పారవశ్యమున్నది. అద్వైతామృతము కోళ్లాల్లలుగా నున్నది. అన్నింటి నన్నింటినుండి వెలువరించి చూపుట కింతకు మరింత సావకాశ ముండవలయును. ఇప్పటికే వ్యాసము చాల సుదీర్ఘమైనది.

శ్రీ దాసుగారిలో పరమోత్తమవాగ్గేయకారుడు త్యాగయ్య యున్నాడు. అభినయ పరమార్థవేత్త క్షేత్రయ్య యున్నాడు. అద్వైత దేశికోత్తములు శ్రీ శంకరులున్నారు. పై మువ్వురికంటె విలక్షణముగా దాసుగారికే చెందిన ప్రత్యేక వ్యక్తిత్వమున్నది.

పుంభావసరస్వతులగు శ్రీ దాసుగారికి నా కైమోడ్పులు. నారాయణ సాహిత్య సేవన సౌభాగ్యము సర్వాంధ్రులకు కలుగుగాక!



# మేలుబంతి - చాటుప్రబంధము

డాక్టర్. ప్రసాదరాయ కులపతి, M.A., Ph.D.

శ్రీ దాసుగారి చాటుపద్యముల సంకలనగ్రంథ మిది. దీనికి మేలుబంతి యనుపేరు వారే పెట్టిరి. నిజముగా నిది మేలైన పంక్తియే. చాటుపద్యముల ప్రకృష్టమైన బంధముగా దీనిని పరిగణింపవచ్చును. చాటుపద్యములనగా ఒక కావ్యాంతర్గతములుకాక ముక్తకములుగా అప్పుడప్పుడు చెప్పినవని అర్థము. తెలుగుదేశమున ఈయర్థమున చాటు శబ్దము రూఢమైనది. నిజమునకు చాటువనగా ప్రియోక్తియని యర్థము. ప్రాచీన సంస్కృతకవు లీయర్థముననే ఉపయోగించిరి.

1. ప్రియః ప్రియాయాః ప్రకరోతి చాటుం

—ఋతుసంహారము 6-14

2. శిప్రావాతః ప్రియతమ ఇవ ప్రార్థనాచాటుకారః

—మేఘసందేశము — 31

3. విరచితచాటువచనరచనం చరణరచితప్రణిపాతం

—గీతగోవిందము — 11

4. పటుచాటుశతై రనుకూలం —గీతగోవిందము — 2

తెలుగు కవులును ఈయర్థమున ప్రయోగించినవారు పెక్కురు.

1. చాటుప్రౌఢికి చేసె ధూర్జటి మహాశ్లాఘాశిరః కంపమున్

—శ్రీనాథుడు - కాశీఖండము

2. చాటుప్రౌఢిఁ బిసాళమాడెదవు కాసన్నాటి బాపండవో
—క్రీడాభిరామము – 92

3. హాటకగర్భవధూటీ
వీటీకర్పూరశకలవిస్ఫురసౌర
భ్యాటోపచాటుకవితా
పాటవమరుదవని వల్లభన్నకు నమరున్.
—క్రీడాభిరామము – 24

4. ఘోటకలాటకిరాటవ
రాటమరాటాంగవంగరాజన్యసభా
ఘూటనిరాఘాటనట
చ్చాటుకవిత్వాంకు డరయ జగ్గన ధరణిన్.
—కూచిమంచి తిమ్మకవి-సింహాశైల మాహాత్మ్యము

పైన ప్రయోగింపబడిన చాటుప్రౌఢి, చాటుకవితలలోని 'చాటు' శబ్దము మృదుమధురోక్తి యను నర్థముననే కనిపించుచున్నది. ఆ దృష్టితో కావ్యాంతర్గత కవితయు చాటుకవితయే. కాని ఏకారణము చేతనైనను కాలక్రమమున చాటుకవిత్వమనగా కావ్యములలోనిదికాక విడిగా వివిధవిషయములపై వివిధసందర్భములలో పలుకబడిన కవిత్వమని లోకరూఢి వచ్చినది.

కావ్యము నిలుకడగా ఆలోచించి నవరసాత్మకముగా కవి నిర్మించెడి ప్రకృష్టమైన బంధము. చాటు వట్లుగాక తత్కాలావసరమునుబట్టి సామాన్యముగా ఆశువుగా పలుకబడినది. శాంతచిత్తముతో విశ్రాంత చింతనతో నిర్మితమగు కావ్యమున సహజముగా రససిద్ధియుండును. కాని ముక్తకములలో ఆయవకాశము తక్కువ. రససిద్ధి కవసరమగు విభావానుభావవ్యభిచారిభావములకు పీలుండదు. అట్లని రసస్థితి రాదనజాలక ముక్తకములలో అసంలక్ష్యక్రమమున రసనిష్పత్తి యగునని కొందరాలంకారికులు భావించిరి,

విమర్శక వరేణ్యులు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు వేమననుగూర్చి వ్రాసిన గ్రంథములో నొకచోట ప్రాచీనకవుల కావ్యములలోకంటె వారి చాటువులలోనే రసవంతమగు కవిత్వము కనబడుచున్నదని పలికిరి. అల్లసాని పెద్దననుగూర్చి ఉదాహరించుచు మనుచరిత్రములోని పద్యము లన్నింటికంటె కృష్ణదేవరాయల నిర్యాణానంతరము వ్రాసిన "ఎదురైనచో తన మదకరీంద్రము డిగ్గి కేలూతయొసగి యెక్కించుకొనియె..." అను పద్యము మిక్కిలి రసవత్తరమైనదని వ్రాసిరి. దానికి కారణ మేమనగా మనుచరిత్ర రాజు కొరకు, తోడిపంతుల మొగము చూచుచు తన ప్రజ్ఞాప్రాభవము ప్రదర్శించుటకు వ్రాసినది. రాయల మరణానంతర పద్యమో దుఃఖావేశముచే సహజముగా వెలువడినది. ఆసహజత దానికా రససిద్ధి నిచ్చినదని శర్మగారు భావించిరి. కావచ్చును. కొన్నిసార్లు చాటువులలో పరమరమణీయములైన కవితా జలపాతములు కావ్యమహితత్వము నధిగమించినవి లేకపోలేదు.

నారాయణదాసుగారి చాటువులలోను ఆవిధమైన వైశిష్ట్యము, మృదుమధురోక్తిసంవిధానము, చమత్కారచారుత్వము కలవనుట అతిశయోక్తి కాదు. సహస్రాధికములైన ఆముక్తకములలో అనేక సమయములలో అనేకసందర్భములలో పలికినవికలవు. వ్యక్తిగత జీవితము, వేదాంతము, శృంగారము, భక్తి, లోకపరిశీలన, దేశభక్తి, భాషాభక్తి, ఉత్తమపురుషకీర్తనము, ప్రకృతివర్ణనము, దేశవర్ణనము, నగరవర్ణనము, సంగీతాదికళాప్రాశస్త్యము మొదలగున వెన్నియో ఆయన చాటువులలో చోటుచేసికొన్నవి.

ఈ చాటువులన్నియు నొక వరుసగా పీటవేసికొని కూర్చుండి దాసుగారు చెప్పినవో, వ్రాసినవో కావు. అనేకానేక సందర్భములలో వివిధ దేశకాలములలో అప్పటి కప్పుడు పలికినవి. వీని నన్నింటిని ఏర్చికూర్చి ఒక గ్రంథముగా ప్రకటింపవలెనని రసజ్ఞ శిరోమణులు, సాహిత్య ప్రియంభావుకులు శ్రీ కర్రా ఈశ్వరరావుగారు భావించిరి. బంగారము

నకు పరిమళమబ్బినట్లు వారికి మధురసరస్వతీ బిరుదాంచితులు, పరమ భావుక పట్టభద్రులు, ఖండఖండాంతర రసకవితా కాంతా పరిష్వంగ పులకిత హృదయులునైన ఆచార్య శ్రీ యస్వీజోగారావుగారు తోడై. ఆ చాటుపద్యముల నన్నింటిని వివిధ స్తబకములుగా విభజించి చక్కని సంపాదకీయము రచించి ఒక పుష్పరాశిని అందాలమాలగా మార్చి సరస్వతీ కంఠహారముగా తీర్చిరి. ఈ మాలాగ్రథనమున పండితపరమేశ్వరులు బ్రహ్మశ్రీ ఓరుగంటి నీలకంఠశాస్త్రిగారు సకల మార్గముల సహకరించిరి. తుదికిది ఆరితేరిన అనుభవశాలి యగు మాలకరి కట్టిన మేలు బంతియై సర్వ సహృదయ మధువ్రతముల కించుకదైనది.

ఈ గ్రంథము పరికించిన కవిసామ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు

"ఈ యఖిలమ్మునందు పరమేశ్వరు డెట్టులు నిండియుండెనో
యా యఖిలమ్మువచ్చి తనయందున నుండెన యాదిభట్ల నా
రాయణదాసులో హరికథాకృతి భారతి సర్వశిల్ప వి
ద్యాయుతి సంస్కృతాంధ్రముల యాకృతియై పెరమూర్తులై మరిన్"

అని భావించిరన్నతో ఇది యెంత మహోదాత్తస్థితి నందుకొన్న రచనయో విద్వల్లోకము గుర్తింపవచ్చును.

ఈ గ్రంథము పండ్రెండు స్తబకములుగా విభజింపబడినది. అందు మొదటిది దైవస్తుతి స్తబకము. ఇందు రెండు తెలుగు కీర్తనలు, ఒక సంస్కృత కీర్తన, ఆరు సంస్కృత శ్లోకములు, నాల్గు తెల్గుపద్యములును కలవు. రచనలో పోతనగారివలె అంత్యప్రాస యందాస్థ జూపిరి దాసుగారు. అందలి సూర్యనారాయణస్తుతిలో తన్నామాంకితులైనవారు స్ఫురిత ప్రసుప్తకల్పముగ తమవ్యక్తిత్వమును నిక్షేపించిరి.

ద్వితీయము ప్రభుప్రశంసా స్తబకము. ఇందు దాసుగారిని గౌరవించిన ఆంధ్ర ఆంధ్రేతర ప్రభువుల ప్రశంస లనేకములుకలవు. అందు

విజయనగర రాజులగూర్చి పద్యములు కొంత ఎక్కువ. విజయనగరము ఆయన నివాసస్థానమగుటయు, విశేషించి తన నత్యంత గౌరవ భక్తులతో చూచుటయు దానికి హేతువు కావచ్చును. విజయనగర రాజులతో పెదవిజయరామగజపతినుండి నేటి పి. వి. జి. రాజుగారి తరమువరకు ఆయనకు గల అనుబంధము అట్టి బహురచనలు చేయించినదన్న అతిశయోక్తి. ఆయన వారి ఆస్థానమున రాజాశ్రితునివలె కాక రాజమిత్రునివలెనే మెలగెడివాడు. వారింకను మైసూరు, సేతూరు, పుదుక్కోట, జయపురము, పిఠాపురము, చల్లపల్లి, సంగమవలస, బొబ్బిలి, తుని, ఉర్లాము మొ॥ సంస్థానములు సందర్శించి హరికథలు, పాటకచ్చేరీలు మాత్రమే కాక తిరుపతి వేంకటకవులవలె అవధానములును అసాధారణ ప్రజ్ఞతో చేసి అపూర్వ సన్మానములంది అఖండకీర్తి నార్జించిరి. ఆయా సందర్భములలో వివిధ రాజన్యులను గురించి పలికిన పద్యము లీ స్తబకములో చేరినవి.

మూడవది మహావ్యక్తి ప్రశంసా స్తబకము. కులమతభేద భావన లేని దాసుగారు ఎందరో మహానుభావుల నిందు సంస్తుతించిరి. అంబరీషునివంటి భాగవతాగ్రణినే కాక క్రైస్తవ మహమ్మదీయ మతప్రవక్తలను గూడ సభక్తికముగా సంభావించిరి. తమ్ము సత్కరించిన జయంతి కామేశం, ప్రభల లక్ష్మీనరసింహంపంతులు, న్యాపతి సుబ్బారావుపంతులు, ప్రభృతులను, నాటి జాతీయ నాయకులైన టంగుటూరి ప్రకాశంపంతులు రాజగోపాలాచారి, కాశీనాథుని నాగేశ్వరరావు, దుగ్గిరాల గోపాల కృష్ణయ్య మొదలగువారిని, వివిధ రంగములలో ప్రసిద్ధికెక్కిన సర్ కూర్మా, సర్ అల్లాడి, సర్ రఘుపతి వేంకటరత్నం నాయుడు ప్రభృతులను, ఆప్తమిత్రులు సోమంచి భీమశంకరం మొదలగువారిని, తన ఆంగ్ల కళాశాలాధ్యాపకులను మనఃపూర్వకముగా ప్రశంసించిరి.

నాలుగవది విద్వత్ప్రశంసా స్తబకము. ఇందు నాటి విద్యారంగ ప్రసిద్ధులు సుమారు నలువదిమంది ప్రశంసలు కలవు. (శ్రీపాద కృష్ణ

మూర్తిశాస్త్రి, ఆకొండి వ్యాసమూర్తి, వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రి, రుద్రాభట్ల రామశాస్త్రి, దంటు సుబ్బావధాని, వల్లూరి జగన్నాథరావు, పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి, పసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రి, ముడుంబ నరసింహాచార్యులు, కొంపెర్ల సుబ్బరాయశాస్త్రి, పరవస్తు రంగాచార్యులు, బులుసు పాపయ్యశాస్త్రి, తిరుపతి వెంకటకవులు, కొక్కొండ వెంకటరత్నశర్మ, తాతాసుబ్బరాయశాస్త్రి ప్రభృతులెందరో యీ స్తబకమున ప్రశంసితులైనారు. నాటి హరికథకశ్రేష్ఠులనుగూర్చి, తిరువళ్ళూరు రాజాయిపాటవంటి గానముల గురించి, హృదయపూర్వక మైన మెచ్చుకోలు పద్యముల నిట వీక్షింపవచ్చును.

ఐదవది దేశప్రశంసా స్తబకము. ఇందడుగడుగున ప్రతిపంక్తి దాసుగారి దేశభక్తి కెత్తిన దీపికవలె నున్నది. అందును తెలుగుసీమ యన్న వారి కెక్కువ మక్కువ. హరికథాపితామహునిగా యావద్దక్షిణా పథమున నిరాఘాట స్వైరవిహార మొనర్చిన దాసుగారు తాము చూచిన పలు తెలుగు పట్టణములను, దక్షిణదేశ నగరములను ఈ స్తబకమున సులలితసూక్తి సువర్ణసుందరముగా వర్ణించిరి. నీలగిరివర్ణ నము ఉపమా నిరుపమానము కాగా, మైసూరుదండకాదులు ప్రౌఢ సంస్కృతపదబంధురములైనవి. పిఠాపురమును గూర్చి వీరు వ్రాసిన చతుర్భాషాసీసము మిక్కిలి వాసికెక్కినది. సికిందరాబాదునుండి సింహా చలము వరకును, మచిలీపట్టణమునుండి మదరాసువరకును అనేక తెలుగు పట్టణములను గూర్చి వారు చెప్పిన పద్యములు హృద్యములై ఆ యా ప్రదేశములకు శాశ్వత కీర్తిని తెచ్చిపెట్టినవి. ఇందాంధ్రుల కర్తవ్యమును గూర్చియు, బ్రిటిష్‌వారి పాలనుగూర్చియు, దాసుగారు తమ అభిప్రా యములను వెల్లడించిరి.

ఆరవది సంగీతసాహిత్య స్తబకము. సంగీతసాహిత్యములు దాసు గారి ఉచ్ఛ్వాసనిశ్వాసములు. ఇందు కొన్ని ఖండికలందు సాకల్యముగ సంగీతకళాప్రాశస్త్యమును, గాణబయకారుల హరిదాసుల లక్షణమును,

వీణావాద్య నిర్మాణప్రక్రియను, లాక్షణిక విచక్షణచణమైన ప్రజ్ఞతో నిరూపించినారు దాసుగారు. అరవబాణీకంటె విలక్షణమైన తెలుగు బాణీ తీరుతీయములను తేటతెల్లమొనర్చినారు. ఆయన భరత శాస్త్ర వేత్తయగుటచే నిందు నృత్యలక్షణ శిక్షణపాండిత్యమునుగూడ ప్రకటించి "తెలుగుగొండ్లి"లో ఆనాటి సంగీతవిద్వాంసులను పేరుపేరున ప్రశంసించిరి. వారు రచించిన తదరనా అను తిల్లానయు, చల్లపల్లి సువర్ణ ఘంటాకంకణ స్వీకారసందర్భమునందలి సంగీత సమస్యాయుతమైన కీర్తనయు నిందు పొందుపరుపబడినవి. కావ్యనక్షత్రమాల, చదువులు, కవిత్వము, కవిత్వము-కవులు అనుఖండికలనుబట్టి చూచినచో దాసుగారు దొడ్డకవి యగుటయేకాదు సారస్వత పరమాత్మస్వరూపము నంతశ్శుద్ధిగా గుర్తించిన ఆలంకారికమూర్ధన్యుడనియు విశదమగును. దేశ్యాంధ్ర భాషయన్నను దేశిచ్ఛందస్సులన్నను వీరి కభినివేశము మెండనియు నీస్తబకమున విశదమగును. అట్లని సంస్కృతాభిమానము లేనివారుకారు. సంస్కృతమున పలురచనలు పరిఢవించినవారు. వీరి సంస్కృతకీర్తనలు ముత్తుస్వామి దీక్షితరు కీర్తనలవలెను శ్లోకములు హితోపదేశ ఛందశ్చరణములవలెను చతురస్రముగ నుండును. సంగీతసాహిత్యములగూర్చి వీరు ప్రకటించిన అభిప్రాయములు కొన్ని విస్తారముగను, ఉగ్గడించిన నియమములను కరణదుశ్శకములుగను నుండును. అయితే అవి యన్నియు సకలకళాసరస్వతీ నైపథ్యమైన ఆయనకే చెల్లినవి.

సప్తమము వర్ణన స్తబకము. ఇందలి శృంగారచాటువులలో దాసుగారి రసికహృదయము సాక్షాత్కరించును. కాని వారిది వాణిపలికిన చోట చేసిన వైశికమేగాని పారదారికము మాత్రముకాదు. ఈ విషయమున శ్రీనాథుడు వారికాదర్శముగా తోచును. వీరోత్సాహమన్న ఖండికలో వారి దేశభక్తిపీరమును చూడవచ్చును. దేవుడన్నను, దేశమన్నను వారికిగలభక్తి నిరుపమానము. 'ఖరవత్సరపు కరవు" "నందన వత్సరపు సువృష్టి" ఖండికలు అలంకార లలితాకారములు, గోదావరీ

కృష్ణానదులు, దిగంత రేఖ, మైదానము, వేగుజుక్క, శీతకాలము ఇత్యాదులన్నియు ప్రకృతి వర్ణనాత్మకములు. ఇందు వారి సువిశాల లోకజ్ఞత, సురుచిరశృంగారమర్మజ్ఞత సునిశితప్రకృతి, పరిజ్ఞత- వ్యక్త మగుచున్నవి.

ఎనిమిదవది హితోపదేశ స్తబకము. దీనియందు దాసుగారి నయ కోవిదత్వమును, ధర్మనిష్ఠను, దేశకాలమానపరిస్థితి పరిశీలనక్షమమైన దృష్టిని దర్శింపగలము. మొదటి యెనిమిది ఖండికలును సంస్కృతఘటిత ములు. 63 అనుష్టుప్పులు, ఒకగీతి. రచన రమణీయార్థరుచిరము. ప్రసాద గుణాంచితము. భాగవతుని పరమోత్కృష్టమూర్తిగా దాసుగారు విశ్వసించి చిత్రించినారు. ఉగము నరయిక అను ఖండికలో మానవుడు ఆయుఃప్రమాణము గుర్తెరుగుట కొక చిట్కా చూపినారు. పెండ్లిగోడు అను పెద్దఖండికలో వివాహవ్యవస్థనుగురించి వారుప్రకటించిన అభిప్రా యములు విచిత్రమైనవి. శిశుసంరక్షణ విధానమునుండి, వేదపాఠక లక్షణమువరకు అనేకవిషయముల నిందుప్రస్తావించుట చూడవచ్చును.

తొమ్మిదవది అనువాద స్తబకము. కొన్ని ఆంగ్ల సంస్కృత రచన లకు దాసుగారు సంస్కృతాంధ్రాంగ్లములందు చేసిన అనువాదములు మూలసహితముగా చూపబడినవి. ఆయన బహుభాషావేత్త. బహు సాహిత్య కోవిదుడు. అవధానములలోను హరికథలలోను అప్పటికప్పుడు పృచ్ఛకు లడిగిన మీదట ఆశువుగా కాళిదాస షేక్స్పియర్ ప్రభృతుల కవిత లనువదించినట్లు నాటి పత్రికల వార్తలను బట్టి తెలియుచున్నది. వారి అనువాదము మూలవిధేయము, అన్యూనాతిరిక్తమునయ్యు స్వతంత్ర రచనమువలె భాసించుచుండును. కాని అనువాదమున నాటు తెన్గునే వారు గ్రహించిరి.

దశమము — ఆశాసన స్తబకము. ఇందు వ్యక్తిగతములైన ఆశాసనము లటుండ కష్టజీవులైన కార్మికులను దాసుగారు సానుక్రోశ ముగ సమాశ్వాసించుట గమనార్హము. 1931 లో గుంటూరులో జరి గిన అఖిలాంధ్ర గాయక మహాసభ కధ్యక్షులై తమ యుపన్యాసము;

చివర దేవభాషలో సంగీతాత్మక మంగళాశాసనము పలికిరి. భారతధర్మ భావుకమగు దానిని ప్రతి హరికథాంతమున వారు పాడెడివారట.

ఏకాదశము స్వవిషయ స్తబకము. ఇందు దాసుగారి యుదంతము హృదయము కొంత ప్రకటమైనవి. ఆయన జీవుని వేదన, భక్తిభావ పావిత్ర్యము, ఆధ్యాత్మిక భావధార, వ్యక్తములైనవి. నిగూఢాధ్యాత్మికాంతరార్థముగల 'వింతకల' యను ఖండిక అట్టి విశిష్ట రచనలలో నొకటి.

ద్వాదశము మణిప్రవాళ స్తబకము. ఇందు చేర్చబడిన రచనలసలు మేలుబంతిలోనివి కానేకావు. అవి యన్నియు గ్రంథస్థములుకాని అనిబద్ధ రచనలగుటవలనను, ఇది యొక చాటుప్రబంధమగుట వలనను ఇందు చేర్పబడినవి.

ఇది ఈ గ్రంథము యొక్క స్థూలస్వరూపము. ఇక దాసుగారి కవితాత్మ స్వరూపమును గుర్తించుటకు సోదాహరణముగా కొన్ని ఘట్టములు పరిశీలెంచదముగాక!

దాసుగారి దైవభక్తి నిరుపమానము. ప్రాచీన సంప్రదాయానుగతమైన భావపరంపరకు తోడు వైయక్తికమైన నిశ్చలచిత్తవృత్తి అందుకు బాగుగా తోడ్పడి వారినొక ఉత్తమ సారస్వతోపాసకునిగా తీర్చిదిద్దినవి. విద్యాధిదైవతమగు వినాయకుని వారెట్లు స్తుతించిరో చూడుడు—

శ్లో॥ హేరంబ లంబోదర వక్రతుండ
సదావతంసీకృతచంద్రఖండ
సమస్తభక్తాభయదానశౌండ
నిజప్రభాభాసితపద్మజాండ

అంత్యప్రాససుందరమైన ఈపద్యమునకు తీసిపోనిదే యీక్రింది తేటగీతి

గీ॥ బొజ్జ నుండ్రాళ్ళ నించిన గుజ్జువేల్ప
పాప జన్నిదములు నెలవంక తాల్ప
రమ్మ భక్తుల భవసాగరమునఁ దేల్ప
తగునె నా బోటి నీదు తత్వంబు బోల్ప

కవి ఆదేవతలాంతవా డనియే దాసుగారి నమ్మిక. కవి సాక్షాద్వేదపురుషు డనియే వారు పలికిరి. పరికింపుడు—

శ్లో॥ కవి స్సాక్షాత్ త్రయీమూర్తిః కావ్య మేత చ్చరాచరమ్
నకశ్చి ద్వస్తుతో భేదః కార్యకారణయో స్తయోః

శ్లో॥ ధర్మార్థకామమోక్షాణాం కావ్య మేకైక సాధనం
ప్రత్యక్షదేవతామూర్తిః కవిరేవ నసంశయః

నర్తించుచు, పాడుచు, స్వకార్యము నాలాపించుచు కవి తాను తరించి పరులను తరింప జేయునట!

శ్లో॥ నృత్యన్ గాయన్ స్వరచితం కావ్య మాలాపయన్ కవిః
స్వయం తీర్త్వా తారయతి సంప్రదాయాత్ పరా నపి.

వారి సిద్ధాంతము ప్రకారము కవులందరును నర్తకులు, గాయకులు కాకున్నను వారు మాత్రము నర్తకులు, గాయకులు, నైన కవులు. ఈశ్లోకము వారివిషయమున నన్వర్థము.

సంగీతసాహిత్యముల సంబంధమును, వానిఫలమును వారు చాల సుందరముగా భావించిరి.

శ్లో॥ సంగీతం పుష్ప ముద్దిష్టం సాహిత్యం తద్రజః స్మృతం
ఆస్తికత్వం ఫలం ప్రోక్తం కైవల్యం రస ఈరితం.

సంగీత మొక పూవు, సాహిత్యము పుప్పొడి. సంగీసాహిత్యముల పరమావధి రసానుభవము. అది అందరు నంగీకరింతురు. కాని ఆస్తికత్వమను ఫలమునుండియే అది యుదయించునని దాసుగారివంటి తాత్త్వికుడు తప్ప పలుకజాలడు.

కావ్యము వైదికము లౌకికము రెండు విధములట! దేవతాస్తోత్రాత్మకమైనది వైదికమనియు, మర్త్యవర్ణనము లౌకికమనియు వారిట్లనిరి.

శ్లో॥ వైదికం లౌకికమితి ద్విధా కావ్యం విభిద్యతే
వైదికం దేవతాస్తోత్రం లౌకికం మర్త్యవర్ణనం.

అటులే కావ్యము ఛాందసము, ఆర్షము, భాషారూప మని మూడు విధములుగా వారు భావించిరి. వేదము ఛాందసమనియు, రామాయణ మార్ష మనియు, గీతగోవిందము భాషారూప మనియు నిట్లు వర్గీకరించిరి.

శ్లో॥ కావ్యం త్రిధా ఛాందసార్షభాషారూపేణ కీర్తితం
సామ, శ్రీరామచరిత, గీతగోవిందనామకం.

ఇట్లు కవితాతత్త్వమునుగూర్చి ఒక నక్షత్రమాలిక పలుకుచు "కావ్య నక్షత్రమాలేయం కృతా మందధియా మయా" అనిరి. ఇందు "మంద ధియా" అని విడదీసిన "మందః కవియశః ప్రార్థీ" అన్న కాళిదాసువలె వినయమును సూచించును. లేక "అమందధియా" అని సంధివిడదీసిన చతురాహంకారము స్ఫురించును. రెంటను యోగ్యులే దాసుగారు.

మరియొకచోట కవిత్వము కవులు అనుశీర్షికపై పలుకుచు సహజ కవితా లక్షణము నీరీతి నిర్వచించిరి.

గీ॥ సాగి కమ్మెచ్చునన్ వచ్చు తీగకరణి
సాలెపురుగు కడుపులోని నూలువలెను
దబ్బునన్ దొర్లిపడు కొండ ధార మాడ్కి
సహజకవిత బయల్వడి నన్నుతిగను.

తిక్కన "జాత్యముగాని నొప్పయిన సంస్కృత మెయ్యెడ జొన్ప" నని తెనుగు కవిత్వమున సంస్కృతోపయోగమును నియమబద్ధముగా గావించెను. దాసుగారును అటులే

గీ॥ అతుకు లుంచక పద్యము లల్లవలయు
యమకమున్ జెప్పవలెను రసము చెరపక
అనవసరముగ జొన్పరా దాంధ్రకృతుల
రచన చేయు కవి తన గీర్వాణమెల్ల.

అని పలికిరి. ఇందలి "గీర్వాణ" పదప్రయోగములోని సొగసు సహృదయ వేద్యము.

బాణ, భవభూతి, కాళిదాసాది మహాకవుల గ్రంథములు చూచిన వాడెవడైనను తాను నొక కవియని కవిత వ్రాయబూనుట సాహసమే. ఐనను లోకములో కవు లుదయించుచునేయున్నారు. కావ్యములు పలుకుచునే యున్నారు. దాసుగారును ఆభావననే వినయపూర్వకముగా నిటు లందించినారు :

గీ॥ కాళిదాసుని రఘువంశకావ్యము కను
గొనియు భవభూతి నాటకమును జదివియు
బాణు గద్య మరసియు, కవనము చెప్ప
వెరవ డద్దిర నావంటి వెఱ్ఱివాడు.

పూర్వకవులలో సంస్కృతమున గీతగోవిందకారుడగు జయదేవు డన్నను, ఆంధ్రభాగవతకర్తయగు పోతనయన్నను వారికి మిక్కిలిభక్తి:

గీ॥ పూర్వకవులంధఱున్ గడు పూజ్యులందు
భాగవతులయి గోస్తనీపాకముగను
కృతు లొనర్చు నధికుల సంస్కృతమున జయ
దేవు తెనుఁగున పోతనఁ దెలిసి యెంతు.

వారిద్దరు భాగవతు లగుటయు తానును "భాగవతార్" అగుటయు ఆభక్తికి హేతువు కావచ్చును.

సంస్కృతకవితకంటె తెనుగుకవిత యనిన వారికి ప్రీతి అధికముగా కన్పించును.

1. తల్లి నుడ్వెఱుగని ద్రాబకు జేజేల
నుడి గ్రుడ్డి కద్దము వడువగుఁ గద
2. తిన్ననివాఁ డచ్చ తెనుఁగునఁ బల్కు
టక్కరి వేల్పు మాటల డాబు సేయు
3. మొలక లేఁతదనము తలిరుల నవకము
మొగ్గ సోగదనము పూవు తావి
తేనె తీయదనము తెలుఁగునకే గాక
పరుషసంస్కృతాఖ్యభాష కేది,

4. తేట తీయని అచ్చతెలు గల్లువాడు
సాటిగానని కయిసరి మొనగాడు
తియ్యని తెలుఁగన్నదే పలుక్కు వెరవు
దయ్యపు నుడుప్ గోతాల్కొయు తెరవు.

దేవభాషను వికృతిలో దయ్యపు నుడు వనుటలోని చమత్కారము గమనింపదగినది.

అచ్చతెను గనిన దాసుగారికి ప్రాణాధికము. అందు వారనేక గ్రంథములే రచించిరి. పోతనగారి పద్యమువలె శబ్దాలంకార శైలీసమన్వితమగు ఈ యచ్చ తెనుగు సీసము చూడుడు—

సీ॥ అంకుల కొల్పున కంకింప కున్నచో
 నాట కాదది పేకులాటగాని
జన్నపుఁ దిండుల నెన్నఁ బోవని యెడఁ
 బాట కాదది బంగిపాటకాని
వేల్పుల గొప్ప తోపింపనేరని చోట
 మీట కాదది మోట మీట గాని
జేజేల నెపుడు కైసేయని పట్టున
 మాట కాదది కానిమాటగాని

గీ॥ మ్రోలఁ దెలిగంట్ల రావింప జాలనప్డు
 చదువు కాదది నెటి గ్రుడ్డి చదువుగాని
జియ్యల న్మది నెలకొల్పఁ జెల్లనపుడు
 వ్రాఁత కాదది చెదపుర్వు వ్రాఁత గాని.

తెనుఁగు సీమ యనిన దాసుగారికి ప్రేమాస్పదమైన నేల. రాష్ట్రభక్తిపూరితమైన వారి హృదయమునుండి తెనుగుసీమ వర్ణన మిట్లు వెల్వడినది.

సీ॥ పాడి పంటల నెల్ల నాడులన్ మించిన
 దనయము మన మంచి తెలుఁగు సీమ
కలిమికి నలువ నెచ్చెలి కున్కిపట్టు ని
 చ్చలు మన పుట్టిన తెలుఁగు సీమ
వేయేం డ్లెదురు లేక రాయలు మొదలు జేం
 డ్లలరిన మన మేటి తెలుఁగు సీమ

తిక్కన్న పోతన్న తిమ్మన్న పెద్దన్న
వెలసిన మన గొప్ప తెలుఁగు సీమ

గీ॥ చెలఁగు నన్ని యిమ్ముల మన తెలుఁగు సీమ
చెలఁగు పెద్ద యేరుల మన తెలుఁగు సీమ
తనరు పొడవు గుడుల మన తెనుఁగు సీమ
పొనరు వేల్పు కొండల మన తెనుఁగు సీమ.

దాసుగారు అచ్చ తెనుగుపై మోజు పెంచుకొనిరి. కాని అది కొంత మితిమీరిన దేమో ! అనిపించును.

"తెలుఁగు పలుకు చేను వలనుగాఁ బెరుగదు
వేల్పు నుడువు కలుపుఁ బెరుకకున్న"

ఆంధ్రసాహితీక్షేత్రములో సంస్కృతపదములు కలుపుమొక్కల వంటి వనుట అత్యంతసాహసము. అనేకసందర్భములలో సంస్కృతభాషాభక్తిని ప్రకటించిన దాసుగారు – పోతనవంటికవివరుల సంస్కృతపదబంధుర కవితను స్తుతించిన దాసుగారు అంతగా సంస్కృతమును తిరస్కరించుట ఏదో ఆవేశవశమున పలికినదై యుండునని భావించుట సముచితము.

దాసుగారు చాల అష్టావధానములు చేసిరి. వారి గంగాప్రవాహమువంటి ఆశుధార, అపారపాండిత్యమును, దానికి వన్నె చేకూర్చినవి. కాని హరికథకునిగా వారికి వచ్చిన కీర్తి ఇతర నైపుణ్యప్రజ్ఞాప్రాభవలబ్ధ కీర్తులను మ్రింగివేసినది.

ఒక అవధానములో "అమితవిజృంభణమ్ము లబలా ! తగునా ? సుజనాళి కెప్పుడున్" అని సమస్య నొక రిచ్చిరి. దానిని దాసుగా రెంత శృంగారమధురముగా పూరించిరో చూడుడు—

చం॥ క్రమ మెఱుఁగంగలేని విధి వ్రాత బలమ్మునఁ దమ్మి మోయి మ
ధ్యము పయి నీదు చన్ను లిసుమంతయు నక్కటికంబు మాని యు
బ్బి మదకఠోరభావమున విస్తరమంది చలింపఁజేసి జృం
భము నటు చూపకున్న క్షతమర్దనబాధల పాలుగావుగా
అమితవిజృంభణమ్ము లబలా ! తగునా ? సుజనాళి కెప్పుడున్ –

శృంగారము దాసుగారికి కావ్యమునను, జీవితమునను మిక్కిలి యిష్టమైన రసము. అటువంటిదే మరొకటి పరికింపుడు—

చం॥ వలపుల మీరి మీరి నను వాతెర తేనియ లాని యాని గు
బ్బల నెదఁ గ్రుమ్మి గ్రుమ్మి పలుభంగుల ముద్దులు పెట్టి పెట్టి నే
వలచిన వన్నెకాడ! యిక వద్దుర జాగని పైకి లాగు నిన్
దలఁచిన గుండె ఝల్లుమని తల్లడ మందుగదే! తలోదరీ!

ఇంకను చిత్తగింపుడు——

ఉ॥ సన్నపు మోటికల్ కలుగు చక్కని చన్నుల పైట జారఁగా
చెన్నగు వీణ మోపి శ్రుతిఁ జేయుచు మెట్టు లమర్చి తీగెలన్
క్రొన్నెలవంక లొప్పు కొనగోళ్ళను మీటుచు నీదుచెంత నా
చిన్నది వాద్యగానములచేత దలంచెద భీమశంకరా!

వినవచ్చు వీణాగానముమీాద నెంత శ్రద్ధయున్నదో వీణియ మీాటు చెలువ పైట జారగా బయటపడు వక్షోజములపై నంత శ్రద్ధయు దాసుగారి కున్నది. మనసు గానముపైన - చూపు స్తనములపైన.

శ్లో॥ చతుర్భుజే చంద్రకళావతంసే!
కుచోన్నతే! కుంకుమరాగశోణే!
పుండ్రేక్షుపాశాంకుశపుష్పబాణ
హస్తే! నమస్తే జగదేకమాతః!

అని జగన్మాత కుచౌన్నత్యమును విస్మరింపని కాళిదాసును,

గీ॥ పద్మకోశాభినయహస్తపల్లవంబు
చూపె నచ్చోట రమణికి పొబగు డొక్క
డంత యోగిర మడిగెనో అంతలేసి
మెఱుగు పాలిండ్ల నడిగెనో మెలత నతఁడు.

అని భోజనసందర్భమున నైషధములో పలికిన శ్రీనాథుడును నారాయణదాసుగారి కాదర్శకవులై వారిచేతను అట్టి పద్యములు పలికించియుండవచ్చును.

భర్తృహరి శృంగారశతకశ్లోకమునకు వారి అనువాదమును ఇట గమనార్హము.

శ్లో॥ ఉరసినిపతితానాం స్రస్తధమ్మిల్లకానాం
ముకుళితనయనానాం కించిదున్మీలితానాం
ఉపరిసురతఖేదస్విన్న గండస్థలానాం
అధరమధువధూనాం భాగ్యవంతః పిబంతి.

అనువాద మిది—

ఉ॥ అక్కున వ్రాలి వాలి బుజమందున క్రొమ్ముడి వీడి చిందులన్
ద్రొక్క సగంబు మోడ్పువడు తొంగలి రెప్పల విప్పి చెమ్మటల్
చెక్కుల గ్రమ్ముచుండ మగసేతల చొక్కెడు తీఁగబోండ్లలో
దక్కిన మోవి పానకము త్రావెడువా రెటువంటి ధన్యులో.

స్రస్తయనుటకు చిందులు ద్రొక్క యనుటయు వధూ శబ్దము నకు తీగబోడి యనుటయు మేల్తరమగు ననువాద నైపుణ్యమునకు సూచన. పురుషాయితమునకు "తీగబోడి" మిగుల సమర్థురాలుగదా!

ఈ శృంగారపు పట్టులోనే ఏ మధురస్మృతులు హృదయమున మెదలినవో గాని ఈ క్రింది పద్యమును గూడ పలికినారు.

ఉ॥ వీడిన రైకతో సగము వీడిన కొప్పున రాలు పూలతో
బేడిసమీల కన్గవను వింతగు నిద్దుర మబ్బు చొక్కుతో
వీడిన నీవి నొక్కకయి వెల్లగ బట్టి మహానుభావ! నన్
గూడుము ప్రాణముల్ నిలిపి గొబ్బునఁ బ్రోవుము చేడిఁ జంపగా
గూడ దటంచు నాడు పలుకున్ వినవా! యది నీవెరుంగవా!
వేడి తమిం బయిం బడిన వెట్టక కూడిన పాప మున్నదా?
కూడు మటంచు నన్ను మును కొంగును లాగు నొయారమైన నీ
జాడలు గంటి గాదె? యిక చాలదె! స్వర్గము వేరె యున్నదే?

ఆ స్త్రీ యెవరో గాని వరూధినివలె

"వెతలఁ బెట్టకు మింక నన్నుచుచు నీవిబంధ మూడఁ"

పై బడినది. కాదనుటకు దాసుగారేమి ప్రవరుడా? కాదు కనుక ఆ తరుణియు ధన్యురాలైనది. వారును భూలోకస్వర్గము ననుభవించిరి.

దాసుగారు జగదాకర్షకమూర్తియని ప్రసిద్ధి. అట్టి వ్యక్తిని స్త్రీలు వలచుట పెద్ద ఆశ్చర్యము కాదు. గోదావరీతీరప్రాంతముల శ్రీనాథుని కాలమున పంచారామప్రౌఢేందుబింబాననలు కానుకలంపి మన్మథతుల్యుడగు బెండపూడి అన్నామాత్యుని కవయుటకై కబురులు పెట్టెడివారట. అట్టి అనుభవములు దాసుగారికిని కలిగినట్లు తోపింపఁజేయునదీ క్రింది పద్యము. ఇందు వారిరూపవైభవముకూడ కన్నులగట్టినట్లు వర్ణింపఁబడినది.

ఉ॥ చక్కని నవ్వుమోము కడుసన్నపు కాను వెడెందరొమ్ము బల్
నొక్కుల కొప్పు సోగయగు మున్నని చామనచాయ మేను పై
నిక్కు బుజంబులన్ జివురు నిగ్గుల మోవి దయారసంబు నల్
దిక్కుల జొక్కు వాల్గనులు తీయని మాటలు మొల్క మీసముల్
గ్రక్కున జుట్టిరా బవిరిగడ్డము దిద్దిన జవ్వనంబుతో
నిక్కడి కేగుదెంచి నను నిట్టుల మాటలపాటలన్ గడున్
జొక్కగజేసి నామనము చూరగగొంటివి భూసురేంద్ర! నే
దక్కితి నీకు నన్నొదను దాల్చెదొ మారుని కప్పగించెదో
నిక్కము చెప్పుమా! యిపుడు నిన్ బ్రతిమాలెద నందు వేడు నా
చక్కఁదనాల కుప్ప! నిను సంస్మరియించెద జీవితేశ్వరీ!

ఇట్టి దాసుగారిని గూర్చి కాముకుడనియో అహంకారియనియో ఏవో అధిక్షేపణలు చేయువా రుండకపోరు. అట్టి వారినిగూర్చి ఏనుగు పోవుచుండగా మొరుగు కుక్కలవంటివారని ఆయన తిరస్కరించెను.

కం॥ దొరవేపి మొరగినంతన్
వెరపున నాకొమ్ము కేన్గు వెనుక దిరుగునే
కొరగాని మాట వదరిన
నరకు గొన రొకింతయైన చదువరి మిన్నల్,

కవి యన్నవానికి కొంత సాత్వికాహంకార ముండక తప్పదు. అది లేనిచో కవిత్వమే పుట్టదు. దాసుగారును శ్రీనాథాదుల వంటి వారు.

"నాల్గేండ్ల యీడున నాకెల్ల చదువు
లబ్బె తమంతనే నరసిన కొలది
నేఁబుట్టులయకాడ నేమాటకాడ
నాటపాటల మేటి ననిపించుకొంటి
నాకెదు ర్లేరికే నాడులనైన
వేవేలమందికి వినుచు నాగొంతు"

అనియు బహురాజసన్మానము లందితిననియు, బహురాష్ట్రములు నిరాఘాట పరిపాటి సంచరించితిననియు దాసుగారు చెప్పకొన్నారు. తమ వ్యక్తిత్వము యొక్క విశిష్టత నిటులే అనేక స్థలముల వారందించిరి. నాలుగేండ్ల యీడుననే విద్యలు వారిని వరించెనట. "ప్రపేదిరే ప్రాక్తన జన్మవిద్యాః" అను కాళిదాసోక్తి వారియం దన్వర్థమైనది. ఆయన పలికినట్లే తాను జన్మభాగవతుడు. భాగవతకళాభ్యుత్థానమునకై జన్మించిన మహాత్ముడు.

ఆయన చాటుపద్యములలో నీవిధముగా వారి వ్యక్తిగత జీవిత రహస్యములనుండి లోకరహస్యపరిశీలనమువరకు అనేకశతాధికవిషయములపై నాధికారికమైన చిత్రణము కానిపించును.

నాటి దేశపరిస్థితిని, దేశదౌర్భాగ్యమును వర్ణించుచు దానికి హేతువులను 1942 సం॥ ఎడ్వైజరు అను పత్రికలో కొన్ని శ్లోకములు ప్రకటించిరి. అందులో కొన్ని

శ్లో॥ ఆర్యాణాం మ్లేచ్ఛసాంగత్యం పునర్భూపాణిపీడనం
హీనజాతి నమస్కారః కదర్యధనసంచయః ॥

శ్లో॥ అత్యంత స్వార్థపరతా సామరస్యవిహీనతా
పరధర్మానుసరణం శిష్టాచార విదూషణం॥

శ్లో॥ స్వవర్ణాశ్రమసంత్యాగః శుష్కగ్రంథావలోకనం
అనర్హోద్యోగాధిపత్యం పుణ్యభూమి వినాశనం ॥

వారుపలికిననట్లు పుణ్యభూమియగు భారతసీమ నాశనమునకు కారణము లగు మ్లేచ్ఛ సాంగత్యము, గోమహీసురనిందయు, అనర్హోద్యోగాధిపత్యము మొదలగునవి ఇంకను అధికాధికముగా సాగుచునే యున్నవి. ఈజాతి యెప్పటికి బాగుపడునో! ఈభూమి యెప్పటికి ప్రాచీనౌన్నత్యమును చెందునో!

ఇట్లే వారి చాటువులలో నీతి ధర్మప్రబోధకములు, సంస్కార ప్రేరకములు నగు నెన్నో విషయములు కన్పించును. ఆస్తికుడైనను నాస్తికుడైనను ప్రజాశ్రేయోరతుడైనచో జగత్పూజ్యు డనియే వారి హృదయము.

శ్లో॥ స్యాదాస్తికో నాస్తికో వా సర్వలోకహితేరత!
యస్స ఏవ జగత్పూజ్యో నాత్రకార్యా విచారణా ॥

సంస్కారరహితయగు స్త్రీయును, గ్రంథతస్కరుడగు కవియును, తీర్థరహితమగు దేశమును, వ్యాధిపీడితమగు దేహమును ఉండియేమి? లేకేమి యనుచు దాసుగారు

శ్లో॥ కిం స్త్రీసంస్కారరహితా ? కిం కవి ర్గ్రంథతస్కర ?
కిం దేశ స్తీర్థరహిత ? కిం వపు ర్వ్యాధిపీడితమ్ ?

అని ప్రశ్నించిరి.

వట్టి కవికంటె పండితునికంటె భాగవతుడు శ్రేష్ఠుడని వారి సిద్ధాంతము. విద్వాంసుడు పాడిన డెల్ల ఆడవలెనని వేదము చెప్పుచున్నది గాన వట్టి మాటలు చెప్పిన మెచ్చరాదని వారి అభిప్రాయము

గీ॥ కొసరి సంగీతసాహిత్యరసికులెల్ల
హాయి హాయి యనంగ తానాడి పాడి
అఖిలదేశంబులందు ప్రఖ్యాతిగన్న
భాగవతుకన్న సన్మానపాత్రు డెవరు ?

అని భాగవతుని విశిష్టత వారు బహుముఖముల కీర్తించినారు. ఈవిధముగా భాగవతులగూర్చి, నాటి సమకాలీన కవులగూర్చి, రాజులగూర్చి, ప్రాంతములగూర్చి, పరిస్థితులగూర్చి వా రనేకపద్యములు పలికినారు. కాళిదాసు షేక్స్పియరు మొ॥ సంస్కృతాంగ్ల కవుల రచనలకు నిపుణమగు ననువాదములును చేసినారు. ఇట్లు బహువిధముల విస్తరించిన దాసుగారి చాటుపద్యప్రపంచము ఆంధ్రసాహితీ కోక చక్కని జ్యోత్స్నా విహారభూమి.

ఈ 'మేలుబంతి' గ్రంథమును ఆంధ్రరసజ్ఞుల కందించినపుణ్యము శ్రీ కర్రా ఈశ్వరరావుగారిది. వారి కోరికపై దానికి పీఠికారచనము కూడ నేను చేసితిని. గ్రంథము ముద్రితమైనపిదప దాసుగారి సాహిత్య సర్వస్వమునకు ఈ గ్రంథముపైననే వ్యాసము రచింపవలసినదిగా ఆచార్య శ్రీ జోగారాయమహోదయులు నన్నాదేశించిరి. వ్యాసమున నేను పూర్వము రచించిన పీఠికకంటె సమగ్రతరముగా తీర్చుటకు వారి సంపాదకీయమునుండి పుస్తకవిభాగమునకు సంబంధించిన విషయములు తీసికొంటిని. చాలచోట్ల వారి వాక్యములకు వాక్యమునే గ్రహించుట జరిగినది. గాసటబీసటగా, కలగాపులగముగానున్న ఈ చాటువులను వివిధ స్తబకములుగా తీర్చి సంకలనముచేసిన సుకృతము జోగారావుగారిది. వారి సంపాదకీయములోని అంశములను గ్రహించుటకును, వారి వాక్యముల నుపయోగించుటకును అనుమతించినందులకు వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు సమర్పించుచున్నాను. ఈశ్వరరాయ, జోగారాయ సహృదయతా సౌహార్దములకు నాసాధువాదము. దాసభారతి వర్ధిల్లును గాక !

# సూర్యనారాయణ శతకము

కుమారి గోగులపాటి సత్యశ్రీ

అనేక విద్యలలో అఖిలకళలలో నారితేరినను, తానొక సర్వ స్వతంత్రుడగు మహాపండితునిగా కాక, ఒక భక్తమాత్రునిగ నుండుటయే తమ కభిమతమైనట్లు దాసుగారు వక్కాణించిరి. చూడుడు :

'అరయంగా సకలశ్రుతిస్మృతి పురాణాద్యర్థసారంబు బ
ల్మేఱు నాశక్తికొలంది జూచి తుద కిమ్మై రూఢిగైకొంటి సం
సరణాంబోధి దరింపజేయుటకు యుష్మద్భక్తి దక్కన్య మీ
నరలోకంబున లేదుపాయమని యన్నా సూర్యనారాయణా'

వీరి తల్లితండ్రులగు శ్రీమతి నరసమాంబ, వెంకటచయనులకు సూర్యభగవానునిపై భక్తి యధికముగ నుండెడిది. ఆ సమయమున జన్మించిన వారగుటచే వీరికి 'సూర్యనారాయణ' యని పేరిడిరి. కాల క్రమమున నదియే 'నారాయణదాసై'నది.

దాసుగారు తా జెప్పదలచిన భక్తినంతయు హరికథలు, శతక రచనల మూలముననే బోధచేసిరి. సంస్కృతాంధ్రముల రెంటియందు వీరి రచన సాగినది. రామచంద్రశతకము, శివ ముకుంద సత్యావతి శతక త్రయము, మృత్యుంజయశతకము, వేల్పువంద సూర్యనారాయణ శతకము మొదలగు పెక్కుశతకములను సంస్కృతాంధ్రములందు రచించిరి. కాని పైయన్నింటిలోను భక్తికి, భావసంపదకు 'సూర్యనారాయణ శతకమే' మిక్కిలి పేరుప్రఖ్యాతులనంది, అగ్రగణ్యమైనది.

'ఔన్నత్యం బెద వొంద నీ విమల దివ్యాకారముం జూపి నా
కెన్నం డీ వభయం బొసంగి మఱి నా యిష్టంబులం దీర్చెదో
చిన్నప్డే నిను నమ్మికొంటి నిక నీ చిత్తంబు నా భాగ్యమో
యన్నా వేల్పుల మిన్న లోకముల కన్నా సూర్యనారాయణా'

ఈ పద్యమునుబట్టి వీరికి బాల్యమునుండియు భాస్కరునిపై మనసు లగ్నమైనదని తెలియుచున్నది. అయ్యును ఈ 'సూర్యనారాయణ శతకము' యౌవనదశ దాటి మనసు పరిపక్వస్థితిని బొందిన పిమ్మట వ్రాసి యుండవచ్చునని యూహింపవచ్చును. 'తనరంగా పరిపూర్ణ భావమున మద్బాల్యంబు వోవన్, వినూతనమౌ యౌవన సన్నిపాతదశచేత భ్రాంత చిత్తుడనైతి. వయసిప్పుడు ముదర నెంతే బుద్ధియున్నట్లు టక్కున గన్పర్చితి' అనుటచే పై యూహ కల్గుచున్నది.

ఆదిభట్లవారును మహాకవి యగుటచే వీరి రచనలయందు లోకజ్ఞత మిక్కుటముగ గానవచ్చును. భక్తి సూత్రము అనుస్యూతముగ, మణులలో దారమువలెనుండ, దానికి వేదాంత, తత్త్వ, లోకసామాన్య శాస్త్రీయాది విషయముల నీతఁడు గ్రుచ్చినాడు. లోకమును విమర్శించుచు, భక్తిపూర్వకముగ తాను చెప్పదలచిన భావముల లోకమున కందించినారు :

'పనినాసింపక యే మహాత్ముడు మనోవాక్కాయ కర్మంబుల
న్నిను సేవించుచునుండునో యతనికిన్నిత్యంబు, గామాదిశ
త్రు నికాయం బెడ యౌను వెండియును నీ రూపంబుగా లోకమె
ల్ల నిరూపించు ప్రమోదకారియయిలీలన్ సూర్యనారాయణా'

భక్తి శతకములు సామాన్యముగ కవి దైవముతో చేయు సంభాషణలనవచ్చును. కవి ఆత్మపరిశీలనము చేసికొని, తన దోషములకు పశ్చాత్తప్త హృదయుడై, తన యాపదల నివారించి, తన్ను రక్షించుమని తన మనసుకు నచ్చిన వేల్పుల గుణగణముల వివరించుచు, మహిమల గొనియాడుచు, ప్రార్థించును. కాననే ఇవి సామాన్యముగ నాత్మాశ్రయ కవితారీతి నుండును.

పూర్వము మయూరుఁడు 'సూర్యశతక'మను పేర నొక శతకమును సంస్కృతమున రచించెను. కాని, దానికిని, ఆదిభట్లవారి 'సూర్యనారాయణ శతకమునకును ఎట్టిసంబంధములేదు. ఆ శతకమున కేవలము సూర్యభగవానుని కిరణముల, వాని వైభవముల గూర్చి తెలుపబడినది. కాని ఇందు పద్మప్రియుని గొప్పదనము, భక్తప్రీత్యతిశయము, ఆయన లోకోపకార పారీణత చక్కఁగా వర్ణింపబడినవి.

భక్తి :-

ఈ శతకమున ప్రతిపద్యము గంభీరమగు భావములతోఁగూడి ఎంతయో భక్తిరసపారమ్యమును నిరూపించుచున్నది.

త్రిమూర్తిస్వరూపుడగు సూర్యభగవానుని వలననే ఈలోకమంతయు గల్గుచున్నది. ఆయన యొక్కఁడే యనాదిలయుడు; ఆ మహాత్ముని మాయాసంభూతులౌ జీవులు తెలివొందియు తెలియక రజ్జువునందు సర్పమటు, నిత్యప్రమోదావష్టబ్ధ జగంబునందు భ్రమచే నత్యంతము నొక్కకము భావింతురనియు; ఇట్టి సృష్టి, స్థితి లయములకు కారకుడగు భగవానుడు ప్రత్యక్షదైవముగ నుండగ, అజ్ఞానులగు మానవులు కానరాని దేవతలగూర్చి ప్రార్థనలు సల్పుచున్నారనియు ఆశ్చర్యమును ఇట్లు వెలిబుచ్చిరి.

'ప్రత్యక్షంబుగ నీవు లోకమలరింపం బెంపు ద్రుంప భళీ
నిత్యంబుం బొడగాంచు చుండియు జను ల్నీ భక్తులై యుండబో
కత్యంతంబును లేని దైవముల నూహాంబన్ని సేవింతురో
స్తుత్యప్రాభవ యేమొకో భువనబంధూ సూర్యనారాయణా !

అని మొట్టమొదటి పద్యమునందే యర్కుని బ్రహ్మలక్షణసంపన్నుఁడగు పరబ్రహ్మమూర్తిగా బోల్చి,

'యతోవా ఇమాని భూతాని జాయన్తే - యేన జాతాని జీవన్తి
యత్ప్రయన్త్యభిసంవిశన్తి తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మ – తై - శ్రుతి'.

అని వేదముచెప్పిన పరమేశ్వరరూపముతో సూర్యుని స్తుతించెను.

"అరవిన్దప్రియ! నీవు మూరమగునపుడు దుర్దాంతదుస్తర ఘోరాంధ తమిస్రమగ్నమయి భూతవ్రాతము ఆపత్పరంపరలం బొందును. నీదు తత్త్వమెడలింప సర్వము స్వ్యాన్యమౌను. అరయగా నీవె చరాచరాత్ముడవు" అని జగచ్చక్షుని లేమిచే గల్గుబాధల వర్ణించునెడ 'చరాచరాత్ముడవు' అనుటచే సూర్యతేజస్సు వలననే చరాచరము లన్నియు కంటికి గానవచ్చునను భావము స్ఫురించుచున్నది. సూర్యోదయానంతరమే ఈ సమస్తలోకము దృగ్గోచరమగును. ఆయన కాంతి వలననే విరాజిల్లి, తుదకాయన అస్తమయముతో నా మహాత్మునిలో లయమగుచున్నది. వృక్షాదులును సూర్యకాంతికారణముగ జనించి, ఆ వేడినుండి చక్కని జీవితమును సంతరించుకొని, పెరిగి, చివరికా తీక్ష్ణత వలననే నశించును. ఇట్లు సృష్టి, స్థితి, లయములు మూడును వెలుగు తేని వలననే కల్గుటచే కవి ఆయనను "త్రిమూర్తిస్వరూపమా"యని సంబోధించెను. "తరమా నీదగు దివ్యతత్త్వ మిదమిత్థమంచు యోచింప నెవ్వారికైన" అని బొగడినాడు.

'నీ కంటెన్మటి వేఱులేదయిన నిన్నే నీవు నానావిధా
స్తోక స్థావర జంగమాఖిల జగచ్ఛోద్యంబుగా బన్నుచు
స్వీక సత్వరజస్తమోగుణముల స్గ్రీడింతువాహాకల
న్లోకంబెల్ల మనంబెఱ్ఱైవగతి నెంతో సూర్యనారాయణా'

అని "సర్వం ఖల్విదంబ్రహ్మ" బ్రహ్మైవ ఇదం జగ'త్తను సూత్రసమన్వయముల సూర్యునియందు గావించెను.

భక్తియొక్కయు, భక్తులయొక్కయు గొప్పదనమును కూడ విపులముగ, నద్భుతముగ వర్ణించిరి.

'దీపం బే విధముగ నిరుల స్వరూపముగ ప్రజ్వలింపించునో, నీపై భక్తియట్లే సదాత్మనుండి కామాదుల వేఱుజేయును. ఓ పద్మప్రియా ! నిత్యతృప్తికై నీ ధ్యానంబుతప్ప యన్యమార్గమును మర్త్యుడిలలో ననుసరించ లేడు.

'సరిగా వేదములెల్ల రువ్వియును శాస్త్రంబుల్గడు గ్రోలియు
స్గురు బోధల్వినియు న్నిజానుభవము న్బొందించియు న్మర్త్యుఁడె
ల్లెఱుగు న్నీదగు నిత్యతత్త్వ మహాహా యెందగ్ననంజాలునే
ధరనెందైనను గ్రుడ్డగూబ పరమాత్మా సూర్యనారాయణా'

యని భక్తితప్ప భగవత త్త్వము నెఱుంగునది మరిలేదని యలంకార సహితముగ జెప్పిరి. 'భవదీయాంఘ్రి సరోజభక్త్య మృతముం బల్మాఱు నాసించు నాకు "వర్ధన బెండ్లి" యన్నటు లిదేలా శుష్కవేదాంత తత్త్వ విచారంబు ప్రతిక్షణంబు మదిలో బ్రాపించి పీడించుచున్నది. భువియం దీప్సిత వస్తు వబ్బుట యరుదుకదా! ఎద్దేశంబుననైన యద్దంబున దక్క గన్నుగవ స్వీయాకారమును చూడజాలనట్లుగనే త్వద్దివ్యాంఘ్రి సరోజ భక్తియెడ దప్ప న్సర్వ వేదంబులన్మొద్దల్మూ్నటి గ్రసించినం జనుఁడు తన్నుందా నెఱుంగడు' అని భక్త్యాతిశయమును కంఠోక్తిగ చెప్పి, జ్ఞానముకన్న భక్తి గొప్పదని సమన్వయించిరి.

'నిను వీక్షింపని కన్నుపోయి మఱియు న్నీ పూజలన్సేయజా
లని హస్తంబులు సీదు నామమును బల్కంబోని నోర్నికు మ్రొ
క్కని శీర్షంబు భవచ్చరిత్ర సుధవేడ్క గ్రోలగాలేని వి
న్కి నినుం గొల్వని జన్మమెందుకుర, తండ్రీ సూర్యనారాయణా'

సర్వేంద్రియములు దైవమునం దర్పించుటయే భక్తియొక్క పరమావధి అని చాటెను.

భక్తులను గూర్చియు నీ విధముగనే చెప్పబడినది. 'దయతో బ్రాణులనెల్ల నాత్మవలె సందర్శించుచు న్సాధు సంచయముం గొల్చుచు, సూనృతం బనుచు, యుష్మత్పాద పంకేరుహ ద్వయమున్నిక్కల భక్తిమై సతతము ధ్యానించు పుణ్యాత్ముఁడు నీకృపా మహిమవలన నెట్టి భయ మును పొందడు. నీ దాసుల కాపదలు రానేరావు; ఒకప్పు డబ్బినను సూదిన్నిళులు నిల్వనట్లు వడినెంతో దూరమైపోవు; త్వత్పదాంభోరుహ చింత నౌషధముతప్ప న్లేదుపాయంబు వేరేదైన భవరోగమ్మూడ్చుటకు;

'నీ భక్తుండగువాడె రూపబలశాంతి స్థైర్య లక్ష్మీయుతుం
డౌ భావింపగ సర్వభూతసముడౌ నత్యంత సత్యవ్రతు.
డౌ భవ్య ప్రతిభాన్వితుండగు వదాన్య శ్రేష్ఠుడౌ ఖ్యాత పూ
తాభిఖ్యుండగు దీర్ఘజీవి యగు నన్నా సూర్యనారాయణా'

'ధనకాంతా లగ్నచిత్తుండు జాగ్రత్స్వప్నకాలంబుల కనుచుండు స్సుఖ దుఃఖ రూపములను; కనలేడెయ్యదియు న్సుషుప్తియందు; కాని నిను గొల్చు మహాత్ముడీ జగముల న్నిత్యంబు వీక్షించియు న్మనమందు వికార ముల రవంతయు నందడు. మఱియు, జగమందెల్ల క్రియ ల్నిజంబుగ భవత్సంకల్ప మూలంబులన్చు రూఢిగ నమ్ము భాగవతుండు ఈ లోకము నందలి ఖేదమోదములం దగులంబోవక సాక్షిమాత్రుడయి, యానందిం చును అని పల్విధములుగ భక్తుల బాగడి చివరకు 'నీ భక్తికన్న గడింప న్భవవార్థి తారకమెదన్నా' యనుటచే తానొక భక్తిరసమూర్తిగా గోచరించుచున్నాడు. పై పల్కులలో సూర్యభక్తుని స్వరూపముతో పాటు భంగ్యంతరముగ తనను వర్ణించుకొనినట్లు. తెలియును.

కవి వ్యక్తిత్వము :-

ఈకవి మానవుల చిత్తవృత్తుల వైచిత్ర్యముల నతిసహజముగ వర్ణించిరి. 'ధనమా రాదు దురాశపోదు పరతత్త్వజ్ఞానమా లేదు యౌవ నమా నిత్యముకాదు వార్ధకమున న్వామాక్షియాజేదు జీవనమా యెన్నగ బాదు దుఃఖములకు' అని యెఱుంగక మదాంధులై యుందురు. మొదట తానును నట్టివాడే యనియు, తుదకు 'అవని న్మానవ జన్మ మందుగల సౌఖ్యంబెన్నగా నెల్కతోక విధానం గడుసన్నమా, దుదకు దుఃఖం బెక్కువా . నేటి పొర్లువలె నని తన యాత్మానుభవముచే దెల్సికొని,

'ఏలా వేయి విధాల యుక్తులిటు లీవీ లోకజాలంబుల
న్లీలం బన్నుచు బెంచుచుం దునుముచున్ క్రీడించుచున్నావటం
చోలి న్నమ్మి త్వదీయ పాదభజనం బొక్కింతయు న్మాననన్
బాల న్మంచిన నీళ్ళముంచిన సరేనా సూర్యనారాయణా'

ఇట్లు భగవానుని ప్రార్థించుటలో నాయన వ్యక్తిత్వము గోచరించు చున్నది. "బంద్రాతి నరిగింపజాలెడు ఘనధ్యానంబుతో, ఉత్సాహంబున తావకీన యశమెంతో లోకులుప్పొంగ నుద్యత్సంగీత కవిత్వవైభవము చేతం చాటగాబూనితి న్మాత్సర్యంబు దొలంగి యెల్లప్రజ నన్మన్నించున ట్లీవు బల్వాత్సల్యంబున బ్రోచుచుండు"మని కంఠోక్తిగ ప్రభాకరుని ప్రార్థించినాడు. 'నీపై నెంతయు భక్తితో శతకమున్నే నీదయావాప్తిచే నీ పొంతన్మిగియించి' తనిచెప్పి చివరకు 'సకలశ్రుతిస్మృతి పురాణాద్యర్థ సారంబు బల్మలు నాశక్తికొలందిజూచి, తుదకు సంసరణాంబోధి దరింప చేయుటకు యుష్మద్భక్తి దక్క అన్య మీ నరలోకంబున ఉపాయంబు లేదని యిమ్మైన్మ రూఢిగ్గైకొంటి, అను నిర్ణయముగ్గైకొని, భక్తిరసపు అంచులదాకినాడు. 'ఎన్నివిధాలజూచినను నీపాదంబు దక్కన్య మియ్యిలలో జింత్యముకాదటం చెఱుగబోకెంతే వృథాయాసమును, పలు మోసంబు దురంతశోకము దుదిన్గావించు కాంతాధనంబుల కాసింతురు నన్నుబోలు జనులు' అని తన్ను అత్యంతాల్పునిగ, జడునిగ బోల్చుకొనుట లోనే యాయన నిరహంకారిత్వము బోధబడుచున్నది.

లోకజ్ఞత :

కేవల భక్తిభావముతోడనే యొప్పచున్నను సమయానుకూలముగ కవి తన రచనయందు తన లోకజ్ఞతను, తత్త్వశాస్త్ర విషయములగూడ ప్రవేశపెట్టిరి. ఇందు లోకపరిశీలన నిర్భరముగ నున్నది. ప్రకృతితో సంబంధములేక ప్రజలకు బోధించుటకు వీలుకాదు. కాననే వీలుచిక్కినంత విడువక తన రచనలయందు ప్రకృతి పరిశీలనమునకు చోటిచ్చినాడు.

పద్మప్రియుడు తూర్పున బుట్టుటకు కారణము చక్కగా సమన్వయింపబడినది. 'వనజములు కనువిచ్చిచూడ, గలువల్వాడ, దమంబూడ చెల్మినిజక్రంబులుగూడ, దెమ్మెరలకున్లేదిగల్లాడ, వేడ్కనానావిధ పక్షి

సంఘములుపాడ, ధాపసుత్వేడగా అనురక్తుడై సూర్యనారాయణుడు దూర్పున పొడచునట! ఇందు సూర్యోదయసమయపు ప్రకృతిశోభ, సొబగులు చక్కగా వర్ణింపబడినవి.

'ఉదయాద్రి న్నిను జూచినంత పెటపెంతో పాలు చీకట్లు వెం
టదగు ల్మి ప్రభకోడి వానిదగు కూనల్పాదుల న్నీడలై
యొదుగ న్వానిని రేయి తల్లికడ కోహో తూర్పునం బంపు నీ
దుదయ, న్నాతరమా గణింప గుణసింధూ సూర్యనారాయణా'

ఇట ప్రాతఃకాలమున సూర్యోదయానంతరము ఇనుఁడు దూర్పున బుట్టు టచే నీడలు పశ్చిమము దిక్కుగ, భానుడు నడినెత్తిపైకి వచ్చిన నీడలు, క్రిందుగ నుంట, అర్కుడు పశ్చిమాద్రిజేరిన నీడలు తూర్పుదిక్కున నుండుట లోకసహజము. ప్రకృతి సహజమగు నీ విషయమునే సమన్వయించి, మార్తాండు నొక కరుణామూర్తిగ సృష్టించిరి. 'సరిగా సంపద గల్గునపుడు మహోత్సాహోన్నతిం బొంది, పలుమార్లు ఈ సర్వజగంబబద్ధ మని సంభాషించు వేదాంతియు కష్టము రవంత వచ్చినను, నార్తితో తనను రక్షించుమని వివేకహీనుడై పరుల వేడును.' అను లోకసామాన్య మానవ ప్రకృతియే వారి రచనలో చోటుచేసికొనినది.

శాస్త్రజ్ఞత :-

ఈ సూర్యనారాయణ శతకము పేరునకు భక్తి శతకమే యయ్యెను, ఇందు కవి సర్వతోముఖ ప్రతిభ గానవచ్చును. తత్త్వ వేదాంతాదులకు తోడు అచ్చటచ్చట శాస్త్రజ్ఞానము కూడ ప్రదర్శింప బడినది.

'తొలి రంగెద్దియులేని నీ కిరణ సందోహంబు వాశ్శీకరం
బుల నానావిధ వర్ణయుక్తమగు, నపో్వల్కి న్నిరాకార ని
ర్మల నిర్లేపిత నిత్యకేవల పరబ్రహ్మంబు నీవయ్యు ని
మ్ముల మాయం బలురూపులం జెలగె దబ్జోఫ సూర్యనారాయణా'

ఏరంగుయులేని సూర్యకిరణములు నీటి బిందువునుండి ప్రసరించిన ఇంద్ర ధనసులోని ఏడురంగులు ఏర్పడునని శాస్త్రీయ దృక్పథము. ఈ విషయ మునే తన రచనయందు పొదిగెను. ఛాయానాథునికి 'నిరాకార నిర్మల నిర్లేపిత నిత్యకేవల పరబ్రహ్మ' యను నొక విశేషణము వేసినాడు. చమత్కార సహితమగు ఈ విశేషణములోనే వారి ప్రతిభ గోచరించు చున్నది.

## వేదాంతము :

ఈ శతకరచనయందు భక్తి రచనతోపా టెడనెడ తత్త్వ బోధకూడ చేయబడినది. పూర్వము తత్త్వబోధము ప్రధానముగ, లేక యప్రధానముగ గల శతకములును గొన్నికలవు. కాని యవి చాల అల్పసంఖ్యాకములు. వేమన శతక మిట్టివానిలో ముఖ్యమైనది. కాని ఇందలి నీతులుకాని, తత్త్వబోధనములుకాని వాడిములుకులవంటి పద జాలముచే చెప్పబడినవి. దాసుగారి రచనయందట్లుగాక సుతిమెత్తని మాటలతోకూడి మనసును బాధించునవికాక, మనసు నానందపరచు నవిగ చెప్పబడినవి. అందువలననే వీరి పద్యపఠనముచే సహృదయులు సంతృప్తినందగలరు.

'పరగ క్షితిపులు సంచరింతు రథరోర్ధ్వ ప్రక్రమత్వంబుగా
నరయ న్వెండియు నామరూపములు శూన్యంబంచు సూచించు ద్వ
త్కరము ల్గుంద్రగ నింటికొప్పదగు రంధ్రస్తోమముం జొచ్చి య
ద్దిర భ్రాంతాణు పరీవృత్తంబులయి ధాత్రి న్సూర్యనారాయణా'

అని కిరణప్రసారములనుండి తత్త్వపరిశీలనము జేసిరి. 'నీవొక్కండవె వనాది కారణుడవు; నీమాయవలననే జీవులు సంభూతులగుచున్నారు' అను అద్వైత సిద్ధాంతమును, సూర్యుని యధిష్ఠాన బ్రహ్మముగను పేర్కొనెను.

'నేటి నీలీలకునై సమస్తజగము ల్నీలోన గల్పించుచు, వేద ముఖంబున బ్రజలకు గర్తవ్యముం దెల్పుచుండుదువు.' 'భూతాదర్శము

వంటి మాయయెడ సంపూర్ణైక జీవుండు ప్రస్ఫీతంబైన ప్రవృత్తిచే దను జగచ్చిత్రంబుగాజూచి మోహాతిక్రాంతుడునై నివృత్తిమెయి స్వీయా ద్వైతభావంబు సంప్రీతింగాంచును.' 'అమరు స్వంగరునుండి దానిదగు చాయస్వేరుసేయంగ శక్యము కానట్టుల నిజ్జగంబెడప రాదయ్యారె నిన్నుండి చక్రమునం గోణమురీతి నారయగ నీత్రైలోక్యమేపారి నాశము నీయందున జెందుచుండు'— ఈ మొదలగు ఉపనిషద్వాక్యార్థముల బెక్కులు తమ రచనయందు కూర్చిరి. 'అవధూత లోచ్ఛవు కైవల్యాగేహ మణీ వృత్తనిదానమా' 'మందేహధరాధర ప్రబల వజ్రంబ' ఇత్యాది సంబోధనలవలననే యోగవైదిక భావనలు రూపకాలంకారమున జెప్పం బడినవి.

'భళిరా నాదగు పుట్టువు న్మృతియు నప్రత్యక్షత న్లేవిక... ..' 86
'జ్ఞాతంబైన పదార్థతుల్యమగు నజ్ఞాతంబు దోతేరగ.......' 88
'ఏకే మేకయినట్లు సంసృతి మదీయేచ్ఛా కృతంబయ్యు .......' 18

అను పద్యములలో గూడ వేదాంతతత్త్వము బోధింపబడినది. వేదోపని షద వాక్యములే వాడుక భాషయందు పెట్టబడినవి.

'వేదాంతంబునకు న్నిజాను భవ మూర్వీం జాలదూరంబు నిః
ఖేదాద్వైత మదేడ యిట్టుల భవాగ్నిం గుందు నేనేడ యీ
భేద జ్ఞానము దేహమున్న వఱకుం బీడించెడు న్నన్ను నిం
కేదారి న్సుఖపెట్టజాలెదవు తండ్రీ సూర్యనారాయణా'

అని తన కేమాత్రము వేదాంతానుభవము లేదను సంతాపము వెలి బుచ్చెను. 'ఊహాపోహాలు, శాస్త్ర శోధనములు న్యుక్తుల్కుతూ స్నానము లోనేహమ్మంచు వచించుటలు వృథనియు, 'సత్యంబు దయన్గల్గి యుత్సా హంబొప్పగ భక్తితో భవదుదంచన్నామ సంకీర్తనంబు సేయకున్న మోక్ష మెట్లబ్బగలదు ? ఈ విధముగ మోక్షమను నదెట్టివారికి అరచేతి ఫలమో, ఎట్టివారికి మృగతృష్ణయో చక్కగా చెప్పిరి.

లోకబాంధవుని లోకమునవెట్లు భావింతురనునది రెండు పద్యము లందు చెప్పిరి. బౌద్ధుల భావముగ, హంసల్పత్తుగ, దార్కికుల్పరమాణు స్థితిగ భావించ, కొంద అజ్ఞజనులు అగ్నిద్రావకంబంచు, కొందఱు లోకాయత నేత్రమంచు, మఱి కొందఱు తప్త సౌవర్ణ భాసురగోళంబని ఒక్కొక్క రొక్కొక్క గుణమునేచూచి పోల్చుటచే 'జాత్యంధులు దంతినాథుని పోల్చినట్లు' పోల్చుచున్నారని చమత్కరించినాడు. 'మరి నేనో నీవె సర్వస్వమని యందుననుటలో, తన భక్తిభావము వెల్లడించు కొనుచున్నారు.

భావసంపద :-

సూర్యభగవానుని గొప్పదనము గుఱించి చెప్పిన పద్యములలో వీరి భావనాశక్తి గోచరించుచున్నది.

'సరవిన్మేఘములందు జంచలత, నక్షత్రంబులన్ దేజము, వేడిమి జాతవేదునెడ, జ్యోత్స్నాపూరము చంద్రునందు, రహిం జూడ్కి నేత్రి గోళములయందు, న్నైకవర్ణంబులు భూతములందు' గల్గుట పంకజ నాథుని వలననే యని, సూర్యకార్యంబులు ప్రకృతియందెట్లగపడునో తెలిపిరి.

'నలుసైనం భువిలోన జూపి పరిమాణం బెంతయోకల్గు చు
క్కలకుం జాటొనరించి, భూమి జలమింకంజేసి ధారాధరం
బుల మింటగలిగించి శూన్యమునకుం బొల్మెర గల్పించురా
యె..మి న్నీకర [illegible]శలం బహహా మాయీ సూర్యనారాయణా'

'మాయీ' అ సహస్రా[illegible]సుని ఒక మాంత్రికునిగ సంబోధించి, ఆయన నొక నైంద్రజాలికునిగ, [illegible]క శిల్పిగ చిత్రించిరి. ఇందు గొప్ప భావనా శక్తి యున్నది.

ఇట్లే నిత్య నిర్గుణుడగు అబ్జనీపతిని సకల రసమూర్తిగ వర్ణించిరి. 'కమలాళిని వికసింపజేయునెడ శృంగారహాస్యరసంబులు, దుర్ధమ

ము దేహ తమిస్రమారణమున నైర్దాద్భుతోద్వీర సంక్రమ బీభత్స భయానకంబులు, లసత్కారుణ్యమును తన భక్తులయందు, అస్తగిరి ప్రాంత స్వాంత భావంబును భాస్కరుండు కల్గియుండునట.

హృదయ పరిపాకము :-

'యుక్తాయుక్త మెఱింగియు హితులెన్నో మార్లు బోధించినను నక్తంబుందివముస్సృతాఘములకు న్సంతాపం బొందియు, భక్తిన్నిన్భజియించుచుండియును, మానంజాల దుస్సంగమాసక్తి' అనుటలో మనశ్చాపల్యము గోచరించుచున్నది. శిష్టాచారము సల్పలేను, దుశ్చేష్టలు విడజాలలేను, బల్ నష్టం బొందియు నీ పదాబ్జములను డెందమున నిల్పలేను, ఇష్టముండియు దుర్వృత్తి మానలేకున్నాను.

'కట్టా మూర్ఖుడ దామసుండ దురహంకారుండ నజ్ఞుండనే
నిట్టు ల్చేనుసఁబడ్డ గ్రుడ్డి పశువ ల్లైద్దాని నాడెంబు గ
న్పెట్టంజాలక దేహయాత్ర గొనుచుంటి న్మోహ శోకంబుల
న్బిట్టల్లాడుచు నెట్లు ప్రోచెదవొ తండ్రీ సూర్యనారాయణా'

ఇట్లు తన తప్పుల దెలిసికొని, తాను మారదలచి చేయు ప్రయత్నంబులన్నియు వ్యర్థములగుచున్నవనియు, ప్రతిపాదంబు ప్రమాదయుక్తమయి, అజ్ఞాన సంయుక్తమగుచు, క్షణభంగురంబయి మఱెంతో బల్సుఖాభాసమై బ్రదుకున్నమ్మి వృథాప్రయాసమున స్వప్నప్రాయ సంసార భోగతతి నెఱింగియు మానలేకున్నా' ననియు, కాన తనను రక్షించు బాధ్యత దైవముదేయని ప్రార్థించునెడ వారిహృదయ పరిపాకము దృశ్యమానమగుచున్నది. 'కలలో నీదగు దివ్యదర్శనంబిడి మహాకారుణ్యముంజూపి నాకలరన్నిదు ప్రసాదమిచ్చితివి. నా భీతిందొలగించి, పక్కన నను నవ్వించినా వద్దిరా నీభక్తావన చాతురింబొగడగా నేనెంతవాడ' అను పల్కులచే సూర్యభగవానుని అనుగ్రహాతిశయము, భక్తులయెడ గల ప్రేమ వ్యక్తమగుచున్నవి.

'ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్' అను శిష్టోక్తి ననుసరించి, కొన్ని పద్యములు రచించిరి. సృష్టి, స్థితి, లయ హేతువులకు మూలకారకుం డగు భాస్కరుడు ప్రత్యక్షంబుగ నున్నను, 'పెనుకొండ దలక్రిందబెట్టు కొని యుర్వి న్రాలకై దేవులాడు నటుల్మానక చిత్తపద్మమున నెప్పు న్బాదుకొన్నట్టి నిన్ను నజస్రాశ్రిత వత్సలుని భువనబాంధు న్మాని యారోగ్య మిమ్మని నే మర్త్యభిషక్కుల న్దలచుచుంటిని.'

> 'అయయో నీపయిభక్తి నామది దృఢంబై నిల్వకుంటన్గదా
> మయికి న్గొంచము బాధగల్గినపు డిమ్మై మర్త్య భైషజ్యము
> న్భయ మూఢాత్ముడనై కొనన్వలసె వాహ్వా నీవుగాకెవ్వడా
> రయ వైద్యుండు భవాధి మాన్పుటకు నౌరా సూర్యనారాయణా'

ఈ విధముగ ప్రజల ఆరోగ్య సౌభాగ్యములకు ప్రత్యక్షకారణము రవియే అని చెప్పి, 'సకల రోగారణ్యదావాగ్ని' అని సంబోధించుటచే పై శిష్టోక్తిని జ్ఞప్తికి దెచ్చినాడు.

శైలి :

వీరి కవిత్వము అతిమృదుల పదఘటితంబై, కర్ణరసాయనంబై, పండిత పామరజనులకెల్ల మనోరంజకంబై, వారి హృదయారవిందంబుల కానందం బీయగలదు. కేవల ద్రాక్షాపాకముననే వీరి రచన యంతయు సాగినది. ప్రసాద మాధుర్యాదిగుణములు కావ్యమంతయు వ్యాపించి యున్నవి. ఎచ్చటను పదాడంబరముకాని, వ్యర్థపదంబుకాని ప్రయోగింపబడక, శతక మాద్యంతము భక్తిరసము పొంగి పొరలుచున్నది. ఎడ నెడ లోకసామాన్య విషయములనుగూర్చి పాఠకులకు మానసోల్లాస జనకంబై వారి మనంబులం బాదుకొనునట్లుగ రచన చేసిరి.

'పృథక్ పదత్వం మాధుర్యమ్' ఈ మాధుర్యగుణము శతక మాద్యంతము పోషింపబడినది.

'శిష్టాచారము సల్పలేను మఱి దుశ్చేష్టల్విడన్జాల బల్
నష్టం బొందియు నీ పదాబ్జముల డెందంబుం గడున్నిల్పలే
నిష్టం బుండియు దెన్నెఱింగియును దుర్వృత్తి న్వడిన్మాననే
గష్టాత్ముండనుగా చెడెట్లు నను నింక న్సూర్యనారాయణా'

వీరికి అచ్చ తెనుగుపై మక్కువ యెక్కువ. కాని ఈ సూర్య నారాయణ శతకము ఆంధ్రభాషయందే రచించినను, సుకుమారశైలి, సులభపదములతో గూడిన దీ రచన.

'అవురా గొంగళిలోన దించు దలపోయ న్వెంద్రుకల్లెక్క సే
యు విధిం దప్పులు పట్టుచుండ్రు కడు నన్యోన్యంబు విభ్రాంతులై
యవనిం బండితమానులౌ జనులు మాయాకల్పితంబైన యీ
భవమందెట్లు వివేక మబ్బగలదబ్బా సూర్యనారాయణా'

కాని కొన్ని యెడల కష్టప్రాసలను కఠినశైలిని కూడ వేసి రచనసాగించిరి

'పుండ్రాం చన్ముఖపద్మ, నీదు యశము న్పొల్పారగీర్తించు .... ' 32
' .... దుష్కార్యంబుల లోనడంచి పయికెంతో నక్కనైత్యంబుల;
న్మష్క ప్రేమయ' ... 60

'వర్షంబున్పడనీయ కాకసమున న్వర్థంబుగా వారిదోత్కర్షంబు — 36

ఇట్టి రచన చేయగల్గినను, ఎల్లరకు సులభావబోధ మగుటకుగాను ఎక్కువ భాగము సులలిత పదజాలముతోడనే యున్నది. వీరిలోని మరియొక విశేష మేమన తన రచన కేవల మనీషులకే కాక, సామాన్య మనుష్యులకు కూడ నర్థమగునట్లుగ సులభశైలిలో రచించుట, ఝటితర్థస్ఫూర్తికై ప్రతి పద్యమునందు ఒక లోకోక్తినో, సామెతనో, ఉపమానమునో యుపయోగించుటయు :—

అలరంగా జగమెల్ల వెట్టియెకదా, యా "వెట్టి కిన్వేవిధా
లి" లలో „నెవ్వని పిచ్చి వానికి ముదం బెం"తేని యున్మాదము
జ్జ్వలమైనం గడు హానిసల్పు మఱి శాంతంబైన నీ ధ్యానము
న్గలి లోకోపకృతిం బొనర్చు .... .... .... ' 62

ఇట్లే 'రజ్జువునందు సర్పమటు' 'ఏకే మేకయినట్లు' 'చేనునబడ్డ గ్రుడ్డిపసు వటు' "లుబ్ధశ్రీ విధానంగడున్" వంటి లోకోక్తులను, "పెనుకొండం దలక్రింద బెట్టుకొని యుర్వి న్నాలకై దేవులాడునట్లు" "మోదకము వేడ్క నేమప శ్వానం బఖాదమ్ముం దబ్బున మెక్క నేగునట్లు" "గొంగళి లోన దించు దలపోయ న్వెంద్రుక లెక్కసేయ విధిన్' వంటి సామెతలను 'ఎట్టమతాబుపోల్కి,' 'దివ్యాంఘ్రి సరోజముల'వంటి ఉపమానములను,

'అరయన్మానుష జన్మమందుగల దుఃఖాగ్నిం గడున్వేపెడు
న్నరిగా నైహిక భోగవాంఛయను నాజ్యంబ, ట్టులౌట న్భవ
త్కరుణావృష్టిని మామకీన భవ సంతాపంబు జల్లార్చి న
న్త్వరగా బ్రోవుము నీకు మ్రొక్కెదను దేవా సూర్యనారాయణా'

'తమముంగొట్టు ఫిరంగిగుండ,' 'సకల రోగారణ్య దావాగ్ని' వంటి రూపకములను ప్రవేశపెట్టి ప్రతిపద్యమునకొక ఉన్నతమగు విలువనిచ్చిరి.

తమ రచనలో పలు అలంకారముల ప్రవేశపెట్టినను, ఉపమాలంకారమును వాడుటలో వీరికొక ప్రత్యేకతగలదు. ఇతః పూర్వకవులకు అచుంబితములైన, అపురూపములైన, మనోజ్ఞములైన, సందర్భ సుందరములైన, లోకజ్ఞతా సమాకృతములైన ఉపమలు వాడుటలో సంస్కృతమున కాళిదాసున కెట్టి స్థానము గలదో తెలుగున ప్రాచీనులలో శ్రీనాథునకు, ఆధునికులలో వీరికిని అట్టి స్థానము గలదు.

ఉదా : 'అవని న్మానవ జన్మమందుగల సౌఖ్యం బెన్నగా నెల్క తోక విధానం గడుసన్నమౌ దుదకు దుఃఖం బెక్కువౌ నేటి పొర్లు వలె'49

'త్వద్దివ్యాంఘ్రి సరోజభక్తియెడ దప్ప న్సర్వవేదంబుల
న్మద్దలూన్నతిగ్రసించినం జనుడు తన్నుం దానెఱుంగండహో
యద్దంబందున దక్క కన్నుగవ స్వీయాకారముం జూచునె
ట్లైద్దేశంబునన్నైన నారయగ దండ్రీ సూర్యనారాయణా'

ఎక్కడ పట్టిచూచినను అలతి యలతి పదముల లలితాతి లలితమైన శైలీవిలసముతో అతిగంభీరములైన భావముల నావిష్కరణము బట్టుట కానవగును. అందు సందర్భసుందరములైన అలంకారములు, అతిసరసములైన చమత్కారములు బోలెడు. ఆయన తత్త్వజ్ఞతకు శాస్త్రజ్ఞతకు, లోకజ్ఞతకు అంతే లేదు. బంధురమైన భక్తి శతకమంతటను తొణికిసలాడుచున్నది. ఆంధ్ర శతక వాఙ్మయ ఖనియందిది యొక నిక్కంపు మంచి నీలము. అపూర్వమైన అనర్ఘరత్నము.



# మృత్యుంజయ శివ శతకము

## ముద్రితము : 1908

చివుకుల సుందరరామశర్మ

వాఙ్మయ ప్రక్రియలందు శతకమతి విశిష్టమైనది. ఈ శతకములందు కవిహృదయ స్పందన, ఆతని జీవుని వేదన, నవమౌక్తికమునందలి నైగనిగ్యమువలె గోచరించును. పరాశ్రయ ఫక్కికమైన కవితయందు కంటె ఆత్మాశ్రయ ఫక్కికమైన కవితయందు ఎక్కువగా స్వాద సరస్వతిపీఠము పెట్టుకొనును. అందును భక్తిశతకముల కా లక్షణము బాగుగ పట్టును. భారతీయ భాషా సాహిత్యములకీ ప్రక్రియ సంస్కృత సరస్వతీప్రసాదము. మహాభక్తుడును, హృదయవాదియు నైన దాసుగారికి ఈ శతక రచన మెంతయు దగియున్నది. ఆయన సంస్కృతాంధ్రముల యందనేక శతకములు రచించిరి. ఆశువుగ హరికథలే చెప్పిన సరస్వతి పిలచిన పలుకునట్టి ఆ హరికథ పితామహునకు ఈ శతక మొక్కకోవలోనిదికాదు.

నామమాత్రముచేగాక నడవడిచేగూడ నారాయణదాసుడై, హరికథకు జీవితము నంకితముచేసిన ఆయన, శివక్షేత్ర శిరోమణియగు కాశీక్షేత్రమును దర్శించుట దానిపై నొక శతకము చెప్పుటయు ఆశ్చర్యమేమియు కాదు. ఒక ప్రతీకపై ప్రత్యయ బుద్ధియు, ప్రతిపత్తియు గల భక్తుడు, అన్యప్రతీకలనుగాని, తదారాధకులనుగాని, నిరసించనపుడే వాని భక్తి పావిత్ర్యము ప్రశంసాపాత్రమగును. గీతాప్రోక్తమైన ఈ పద్ధతికి చెందిన మహాభక్తుడు దాసుగారు. అయితే 'తథాపి భక్తి స్తరు

ణేందు శేఖరే' అన్న భర్తృహరి వైఖరిగా వీరు హరిదాసులైరి. మరి యొక చిత్రమేమనగా వీరి విశాల వాఙ్మయమును పరిశీలింపగా వీరెంత మహాభక్తులో అంత పరమాద్వైతియన్నది తోచవచ్చును. అయితే యిందు వైరాస్యము లేదు. వీరికి భక్తియన్నది జన్మసిద్ధముగావచ్చి యావజ్జీవితము స్వభావము నంటుకొని యున్నది. పరిణతి వలన వీరు పరమాద్వైతులైనప్పటికి, జనుస్సంస్కార వాసనా వశమున వ్యక్తిత్వము నాశ్రయించిన భక్తితత్త్వము వదలజాలకపోయిరి. అదియుగాక కారణజన్ములైన ఈయన కొక తారణమునకు వేదాంతము గహన మార్గమగు ననియు, భక్తియే సులభతరము సర్వోపజనగమ్యములగు మార్గమగుననియు, యెంచి తన పందొమ్మిదవ యేటి నుండి మొదలు ఆమరణము భక్తి ప్రచారమునకై హరికథా కథన దీక్షా కంకణము కట్టుకొనిరి.

(శ్రీ) దాసుగారు అంతటి సర్వసమర్థులు. సమగ్రకవితా కళా ప్రపూర్ణులు సర్వజన హృదయస్థాన కవిశేఖరులు నగుటకు ప్రత్యక్షముగా వారి ప్రతిభ వ్యుత్పత్తులే కారణమయినను పరోక్షముగా వానిని సానదీర్చి, సమపాళముగా మేళవించి, సరసముగా నిర్ణయించి, విలువ పెంచినవారు వారి యన్నగారు ఆదిభట్ల పేరన్నగారు. అన్నలు నలుగురైనను వీరిపై దాసుగారికి ఎనలేని యభిమానము. తరగని గౌరవము. తానెంత చిందులలో నున్నను చేతులెత్తి నమస్కరించెడివారు. తానెందఱకు పాటనేర్పుచున్నను పాదాభివందనము చేసెడివారు. తానెంత శిష్యులతో కాలక్షేపము చేయుచున్నను శీర్షముతో వినతి ప్రకటించెడివారు. కేవలము తనకు నామమాత్రపు పేరన్న గారు మాత్రమే కాదు. తనకొక రూపమునిచ్చి, తన కథకు గానము కూర్చి, తన పాటకు ప్రాణమిచ్చి, తన యభినయనమునకు ఊపిరి పోసి, తన చిందులకు చేతనత్వమిచ్చి తనను తీర్చిదిద్దిన మహావ్యక్తి ఆయన. ఇంత చేసినను తన హరికథా గానములో నడుగులు తడబడిన ఆ నడవడి

తీర్చిదిద్దిన పుణ్యమూర్తి. నిత్యజీవితమున దొసగులు దొరలిన వానిని తొలగించి నడిపించిన దివ్యమూర్తి. వ్యవహారమున కలవరమునందిన బలమునిచ్చిన ధీశాలి. దినదినమే కాదు. క్షణక్షణము తనను వెన్నంటి, కంటికి రెప్పవలె కాచి, సంరక్షించి, పెంపొందించిన మార్గదర్శకుడు. తన జీవిత నావకు చుక్కాని - తన బ్రతుకు తేరికి సారథి - తన మనుగడ నిలుకడకు నిశ్చలమూర్తి. ఒక్క మాటగా చెప్పవలయునన్న ఆయనే దాసుగారి జీవితమునకు రక్షకుడు-దాసుగారి పాండిత్యమునకు శిక్షకుడు.

ఈ అన్న పేరన్నగారు దాసుగారు హరికథ చెప్పుచున్న సమయమున వెనుక వంత పాడెడివారు. వంతపాడినంత మాత్రముచేత సొంత గొంతుక లేనివారు కాదు. దాసుగారితోపాటు పలువురి పండిత ప్రశంసలకు పాత్రులైరి. రాజ సన్మానములకు ఆలవాలమైరి - వీరి గానమాధుర్యమునకు పరవశులై మైసూరు ప్రభువు జయ చామ రాజేంద్ర వడయారు "It lulls me to sleep" అనుటయేకాక 'లడ్డు మీద పన్నీరు చల్లినట్లుంది' అనినారట-లడ్డు మాధుర్యమే ఎరుగుదుము గాని ఆ పన్నీరు సొగసు రాజులకే అవగతము. ఎంతగా వీరు వంతపాడినను దాసుగారి గళమాధుర్యము నాన్యతో దర్శనీయము. అందువలననే వీరి యనుబంధమును 'రామకృష్ణుల యనుభవము వంటిదని' ఆచార్య యస్వీ జోగారావుగారు అన్నమాట సమంజసమైనది. రామకృష్ణులలో బలరాముని కంటె శ్రీకృష్ణుడు ప్రఖ్యాతి నందినవాడు. యాదవ కులమున శ్రీకృష్ణుని కున్నంత ప్రాముఖ్యము బలరామునకు లేదు. అంత మాత్రముచే బలరాముడు నిర్వీర్యుడును కాదు.

అట్టి పేరన్నగారికి 1908 వ సంవత్సరమున చాలా జబ్బుచేసెను. వ్యాధిగ్రస్తులకు ఆపత్సమయమున మృత్యుంజయ జపము చేయుట మనలో గల యొక నమ్మకము. ఆ నమ్మకమును పురస్కరించుకొని అన్నగారి వ్యాధి సమయమున ఆశువుగా ఈ మృత్యుంజయ శతకము చెప్పిరి. పరమశివుడు మృత్యుంజయుడు. ఆపన్నివారకుడు. ఆతని గూర్చి చెప్పిన

దగుటచే మృత్యుంజయ శతకము. 'శివ' యనునది ఈ శతకమునకు మకుటమగుటచే, సామాన్యముగా మకుట నామముతో శతకనామ ముండుట లక్షణమగుటచే శివ యను పదముచేర్చి మృత్యుంజయ శివ శతక మనిరి.

ఈ శతకము స్తుతిరూపముగానున్న శతకము. పరమాత్మునకు పరమభక్తుడు తన యాపదను నివేదించును. తన దీనస్థితి వ్యక్తము చేసికొనును. తనను కాపాడుమని వేడును. ఆ భగవంతుని యౌన్నత్యము నుగ్గడించును. ఆతని మాహాత్మ్యమును కొనియాడును. అంతేకాదు. అట నట చనవుతో బెదరించును. నిందించును. ఆశ చూపును. భాగవతోత్త మునకు గల చొరవ యట్టిది. సామాన్యముగా శతకస్వరూపమిది. అట్లే ఈ శతకమున ఈ పై లక్షణము లన్నియు గోచరించును.

ఇందు కవితా విషయముగా గాక వస్తువిషయకముగ వ్యక్తమగు నంశములు మూడు. (1) పేరన్నగారితో దాసుగారి యనుబంధము (2) దాసుగారి వ్యక్తిత్వము (3) దాసుగారు స్తుతించిన పద్ధతి -

'ఓనాథ దీన రక్షక' యని శతకముయొక్క ఎత్తుగడ - ఆ సకల లోకనాథుని దీనరక్షక యని సంబోధించుటలోనే యున్నది చమత్కా- రము - సమయమునకు తగిన సంబోధనము. నిక్కమైన ఆ ఈశుని దిక్కు కలిగి వేడుకొందురు. తనకే కాదు తన యింటి పెద్దలకు గూడా నాతడే ధ్యేయమట - 'ఏ పొద్దు భక్తి తోడుత నా పెద్దలు నేను నిన్ను నమ్మితిమిగదా' యనును - కేశవుని భక్తులు శివుని భక్తులగుటయు నొక విశేషమే - అద్వైత బుద్ధి గలవారని తోచును - దాసుగారును ఆ కోవలోని వారేకదా! ఆ పరమేశుని 'నీ కీర్తి చాటుకొనెదము' - ఒక్క ఈ లోకముననే కాదుట 'పదు నాల్గు భువనములలో పదపడి నే జాటుదు' - అని యందురు. 'చిరకాలము నీ రూపము చూచుకోర్కె- నధికము చేయు' మని ప్రార్థింతురు. ఆ చూచుట తానొక్కడే కాదు

'తన బ్రతుకు జంట తోడుత నిరతము యతడే 'గతి' యని కీర్తింతురట లోకములో వారిరువురి 'సొగసులన్నియు' ఆతని కరుణచేతనే తమకు అందినవని కృతజ్ఞత చూపుదురు. ఇంతగా వేడినను తన మొర యాలకించి అన్నను కాపాడునో లేదో యను భయముతో బెదరించు చున్నారు. ఆ బెదరించుచున్నది దాసుగారు కాదు. ఆయన అంతరంగము లోని నిశ్చల భక్తుడు.

నా కోర్కెఁ దీర్చనియెడ

తన యంత భక్తులు లేరనుట సాహసముకాదు. వాస్తవము. 'నీదయను మరువము' తానేకాదు 'నీ ప్రాపు చవి యెరిగిన ఏపామరుడైన గాని ఎట్టుల మరచుఁ' అని వినయభావము ప్రకటింతురు. 'ఆముజ్జగముల వేలుపును బొజ్జ లదరగ' పాడుదురట - తనవంటి ఆశ్రితుని కాపాడుటకు 'సమయమిది శ్రీమవాపగ వేగతండ్రీ' యని సమయ సూచనము చేసినారు.ఎంతటి దైవమైనను అసమయమున ఆదుకొన్న ఫలితము లేదుగదా! "లోకములో నీ కసాధ్యమేదియును లేదు! నీభక్తి కన్నను భువిలో నెక్కువ సుఖము లేదు, అని పారవశ్యమును వ్యక్తీకరింతురు. "ఏదిరా నీకుండిన యౌదార్యము చూపుమని నిలదీసి ప్రశ్నింతురు. ఇంతగా స్తుతించినను, నిలదీసినను తన మొర నాలకింపడేమో యని ఆ పరమేశ్వరిని కూడ ప్రార్థించిరి. 'అమ్మ' గిరిరాజసుత గీతమ్ముల నామనవి విని ముదమ్మున చిరకాలము మమ్ముఁ బెంచగ "ఆ పరమేశుని నెమ్మది గరగించు గాద"! అని వేడుదురు. అంతటితో నాగరు 'తల్లీ పార్వతి జాలిగని ఆలించుము. ఆస్థాణుని మేలుకొలిపి మా జంటన్ బాలింపుమనెద అనుటలో ఎంత వేడినను కనికరింపని ఆ శివుని 'స్థాణువు' అనుటలో నున్నది చమత్కారము. చివరకు తనను తానుగా సమర్పించుకొందురు. 'ఈ విధముగా వేడుట గడుసుదనముగాదిది నీ యడుగులబడి వేడుకున్న యాశ్రితులము, రక్షింపక తప్ప'దని పలికినారు.

విడువను సుమ్మీ నీదగు నడుగులపై భక్తి సమయమబ్బినచో
నాకడ నీవుండక తీరదు కడువడి యాయన్న బ్రోవగా రమ్మీ శివా !

ఇక వారి వ్యక్తిత్వము. కష్టములు సమీపించినపుడే ఆ భగవం తుని యెదుట దోషములన్నియు వెలికి రాగలవు. అన్నను రక్షింపు మన్న వేడుకోలులో తన దోసగుల గూర్చి కొంతకు కొంత వ్యక్తీక రింతురు. 'నీయెరుగ నట్టివి ఉన్న వే మాకొక్కలు సర్వవేత్త మన్నించి కృపన్ అన్నన్ బ్రతికింపు'మందురు. ఆ కొక్కలు మరేమోగాని 'సర్వ వేత్త'కే తెలియవలెను. తాను తన జీవితకాలమున నంతవరకు, ఎందరు అసమర్థులను అవసరమునకై స్తుతించిరో మరి 'నీచుల కొనియాడి నోరు నీచయ్యగదా, నీ చరితామృతమున నా వాక్కులు అలరింపవలెనని' కోరుకొందురు. అంతేకాదు 'ఈ దొంగదాసుని యెడ నీదయ గన్పర్చు'- అనినారేగాని తన దొంగ రంగెట్టిదో వివరింపలేదు. తన శివభక్తి పరా యణత్వ మెంతటిదో వివరించుచు 'మృత్యుంజయుడవని నిత్యము శ్రుతి బాడుచుండ నిక్కంబేనిన్, నీభక్తుని జంటన్ సమకూర్చుము' అని యం దురు. అంతేకాక తన కొక ధైర్యము కలదట 'ఒక ధైర్యము మాత్రమే తావక సేవకులందును గలదు, బహువత్సరము లుసకరముగ నింబాడుట దీర్ఘాయుల' చేయుగలవని. తన భక్తిలక్షణము వివరించుచు 'నాలోపల నా వెలుపల. అంతయు నీ లావణ్యముచే భక్తి నిలచినద'ని యందురు. దాసుగారు తన జీవితయాత్రలో ఎన్నడును ఎవరి మాటను విని ఎరుగరు. ఆ శివునితో 'కలనైనం బరుల నమ్మగా బోను శివా ! నీదిక్కుం దప్ప నాకేదిక్కుం గానరాదు ఎంత వెతకినన్' - అని తన వ్యక్తిత్వ లక్ష ణమును వ్యక్తీకరింతురు. అంతేకాదు 'భోగముల గోరనొల్లము, భోగీ శ్వరభూష ! బ్రతుకు పొడిగించినచో' అని భోగనిరాసనమును ప్రకటిం చుటయేగాక "నీ గానము సంతుష్టిగా బాగుగ ప్రకటింప నాసపడితిమిర శివా !" అని విన్నవించుకొందురు. ఎంతకాలమని విన్నవించుకొందురు "ధైర్యము దక్కె స్రుక్కితి ... శౌర్యం బెడబాసె" అని యనుచు

ఒక్క 'నీదు సేవకు తప్పన్' - ఒక్క ఈశ్వరసేవకే ఓపిక గలదట - తన స్వభావ లక్షణము గూర్చి 'ఎంతటి చలచిత్తుడనో, పంతముతో నాక్క మొగిన్ బద్యశతంబును చెప్పించుకొంటివని' ఈశుని అందురు. "సత్యంబీ శతక"మని మెచ్చికోలునకు, అవసరమునకు, చెప్పినదికాదని ప్రమాణము చేతురు.

ఇక అన్నగారితో వారికిగల యనుబంధము ప్రారంభముననే వివరింప బడినది. అయినను ఈ శతకమున కొంత వివరించిరి- అసలు వారి యారోగ్యము కొఱకే శతకము చెప్పిరిగదా!- 'తానొక్కడేకాదు ఆతనిని ఆశ్రయించునది' 'నీదు పావన చరణంబుల నాశ్రయించు జంటన్మమ్మున్ కరుణించు' అని 'కరుణించుము డెబ్బదేడులు' అందురు. 'కలౌషష్టి' కదా! మరి - అట్లు ఆయువు నిచ్చిన 'ధరణిన్నికీర్తి నిల్పెదము' అందులకేగాని మాకొరకు గాదు యన్నట్లు - మరొక్క మాటగా వారి యనుబంధమును గూర్చి

> జోడుగ నీడగ తోడుగ వేడుకతో శ్రుతుల మేలవించుచు నిన్నుంబాడ కని
> దీర్చుకొందము వేడెద మాజంట బెంచు పెక్కేండ్లు శివా।

అని వ్యక్తీకరింతురు. పోనీ పెక్కు ఏండ్లైనను కాకపోనీ 'కావుము తోడలర న్నే జీవించినంతవరకు జంట చేపట్టు శివా!' అని యనుటలో వారి ఆంతర్యము గమనింపదగును. తాను తన యన్నను వీడి ఆ దుఃఖమును భరింపలేరు. అందులకే తాను జీవించునంత వరకు అన్నను కాపాడుమనుచున్నారు. వీరి మొర నాలకించెనో యోమోమరి. ఆ పరమేశ్వరుడు వారినోట పలికించెనేమో మరి, ఎరుగము కాని, వారు కోరినట్లు అన్నకన్నను తానే ముందు గతించినారు. ఆయన ఎడబాటు నెరుగకయే వీడినారు. వీరి మరణానంతరము ఈ పేరన్నగారు వ్యథితమనస్కులై తన శేషజీవితకాలము నంతయు దుఃఖించుచు గడిపిరట - నీ కీర్తన జేయుట మా కెట్టి శ్రమయును లేదు,

> అశ్రితులము నీ కీర్తన కీ శ్రమ ప్రాణంబులనక యెల్లదెసలు రాగాశ్రిత
> ములుగాగవగా మిశ్రలయల బాడ జిరము మెలగించు శివా!

అని యందురు. తా మిరువురును కలసి కీర్తన గానము చేయగా లోకుల కాశ్చర్యమొదవినదట - ఇట్టి అపూర్వ సోదర సంయోజనము ఆశ్చర్యము నిచ్చుననుటలో నాశ్చర్యములేదు. 'నీ పాటలలో ముదమున పెక్కేండ్లుండుదుము శివా' యని విన్నవింతురు. వారితో వీరి యనుబంధమునకు ఈ పద్యమొక కలికి తురాయి.

> నేబ్రతికిన సార్థకమే మీ, బుజములు కాళ్లు కనులు మెదలేనట్లొ నా బ్ర
> తుకు జంట నలరంగా బ్రోచిన నిన్ను బాడి కడగందు శివా। 68

అందుచే జంటను వేరుచేయక 'నాతోడునీడ బలపడునట్లు చేయుమని' వేడుదురు. తన యన్నగారితో తమ దేశ సంచార యాత్రనుగూర్చి పలుకుదురు. ఒక్కమాటగా అన్న లేనిచో అతమ్ముడు లేడు - తమ్ముడు లేనిచో అన్న నిలువడు. భిన్నత్వములో ఏకత్వము నందినది వీరి సోదరత్వము.

కవితాపరముగా చూచిన ఆత్మాశ్రయ కవిత్వమగుచే కవిత్వము పిండుటకు అవకాశము కలిగినను యిందు అంతగా కనము- కారణము, అన్నగారి రుజాభరమునకు వగచి, విలపించు హృదయమునందు కవితా విజృంభణమునకు సమయము కాదని గ్రహింపగలము - మొరయే ముఖ్యముగాని తన కవితాశక్తికాదు - అయినను హృద్యమైన రచనము- సహృదయ వేద్యమైన భావనలు- వందయు కందపద్యములే ఆశువునకు వెసులుబాటు నీయగల పద్యములివి- ఎచ్చటను అన్వయ క్లిష్టత, సమాస భూయిష్ఠత కనము. నల్లేరుపై బండివలె నడకసాగును. రెండు సందర్భములందు మాత్రము 'బ్ర' అను ప్రాసాక్షరమునకు మిగిలిన పాదములలో 'వ' ను అక్షరము నుపయోగించిరి.

> నాబ్రతుకు జంట బెంచిన
> నీ వాహ్వా

భావజ

కావుము

అష్టే 81-వ పద్యము

కావని కాకుల పోలిక

నీబ

భావి

నా బ్రతుకు

ఇక, 'నక్కదివితలం బన నేగ' 'ఆలికిగోకలు గొంటయే యూరికి యుపకార మంట' మొ॥ జాతీయములు పెక్కుగలవు. కొన్ని పదబంధములు విచిత్రముగా దోచును. 'జతజంట'- 'నా ప్రక్కను కాపాడుము కలమా కన్నీరోడ్చకు' మొ॥ చమత్కారముగా నున్నవి.

మొత్తముమీద నీ శతకము దాసుగారి అద్వైత ప్రవృత్తిని వ్యక్తిత్వలక్షణమును, సోదరానుబంధమును - వ్యక్తముచేయుచున్నది. చిన్న శతకమైనను దొడ్డగుణములు కలది ఆశువు ఐనను పరవశత్వము నందింప చేయునది-



# సారంగధర నాటకము

డాక్టర్ జంధ్యాల జయకృష్ణ

స్వధర్మ సంరక్షణార్థము అసువులు బాయుటకును సంసిద్ధుడైన సారంగధరుని కథ ఆంధ్రదేశమున ప్రసిద్ధికెక్కినది. 16 వ శతాబ్ది నుండి అనేక ద్విపద, పద్య, కావ్య, యక్షగాన, నాటకముల రూపమున వెలసినది.

శ్రీ నారాయణదాసుగారి పేరెన్నికగన్న రచనలలో నొకటి సారంగధర నాటకము.* ఆయన ప్రాక్ ప్రతీచీ నాటక నిర్మాణ మార్గములను రెంటిని మేళవించి దీనిని రచించెను. ధర్మవరమువారి "విషాద సారంగధర" తరువాత మరల నంతటి బహుళజనాదరము నందిన ఆది భట్లవారి "సారంగధర" ప్రాశస్త్యమెట్టిదో ప్రకృతము స్థాలీపులాకముగ పరిశీలించుదము.

## ఇతివృత్తనిర్వహణము

నాటకరచనమునందు మున్నెన్నదగినది ఇతివృత్తము లేక వస్తువు. సారంగధర వృత్తాంతము గౌరన నవనాథ చరిత్రములోనిది. కావున కొంత వఱకు ప్రఖ్యాతము. దానిని దాసుగారు అలంతి యలంతి మార్పులతో నందగింపజేసిరి. అందుచే మిశ్రమమగుచున్నది.

---

* 1921 లో విజయనగరము ఎస్. వి. వి. ప్రెస్సులో ముద్రితము.

మూలమున మాళవదేశములోని మాంధాతపురము కథాస్థలము కాగా నాటకమున ఆంధ్రదేశములోని రాజమహేంద్రవరము కథాస్థలము. మూలమున సారంగధరుని తండ్రి రాజమహేంద్రుఁడు. నాటకమున రాజరాజనరేంద్రుఁడు ఇట్లు కథాస్థలికి కథాగతపాత్రలకు తెలుఁగు వాలకము వేయుట వలన ఆత్మీయతాముద్ర అచ్చువడి అది పాఠకుని లేదా సామాజికుని ఆసక్తిని అతిశయింపజేయును.

మూలమున రాజమహేంద్రుని భోగసతి చిత్రాంగి. నాటకమున ఆమె రాజరాజు రెండవభార్య. ఉంపుడుకత్తె పట్లకంటె రాజునకు భార్యపై అభిమానము, అనురాగము అధికముగనుండుట సహజము. తన కొడుకు భోగసతి నవమానించినాఁడనుటకన్న భార్యనే యవమానించెనన్న తండ్రికి గలుగు క్రోధము, మనస్తాపము అత్యంతముగ నుండును.

నాటకములోనున్న జబ్బన్నయను తలారి నాయకుఁడు మూలమున లేడు. రాజాజ్ఞ ప్రకారము శిక్షల నమలుపఱచుట యితని విధి. ఇతఁడు చిన్నప్రభువగు సారంగధరుని సత్ స్వభావము నెఱిఁగినవాఁడగుట చేతను, చిత్రాంగి మోసమును గుర్తించినవాఁడగుటచేతను తన యనుచరులకు చెప్పి సారంగుని కరచరణములను ఖండింపనీయక కాపాడును. ఆ విషయమును కవి గోప్యముగనుంచి చివరకు హంతకుల ద్వారమున బయల్పఱచును. ఇందువలన సామాజికుల సముత్కంఠ ఎక్కువగును. హంతకుల మంచితనమును వ్యక్తమగును.

మూలమున సారంగధరుని కాలుసేతులు ఖండితములై మీన్మాట మీననాథునిచే నొసంగబడినవి. కాని నాటకమున సారంగుని యవయవములు ఖండింపబడనేలేదు. అందువలన వాస్తవమును తెలిసికొని చేసిన తప్పును దిద్దుకొనుటకై ఉరుకులు పరుగులతో సారంగునికడ కేతెంచిన రాజరాజు పితృహృదయము, పశ్చాత్తప్త చిత్తము ద్యోతకములైనవి. శిక్షను పొందకయే సారంగుని యంతరంగములో వైరాగ్య బీజము

లుద్భవించి స్థిరపడుట, నిమిత్తమాత్రముగనైన మీననాథుని ప్రసక్తియే లేక సారంగుఁడు తనంతటతానే సిద్ధుఁడుగా రూపొందుట నిసర్గమనోజ్ఞములు. ఈమార్పుచే ఖండితములైన కరచరణములు పునరావిర్భూతములయ్యెనను అభూతకల్పన అనావశ్యకమైనది.

సారంగధర నాటకము మొత్తము ఐదంకములుగా విభక్తము. అంకములు మరల రంగములుగా విభజింపబడినవి. ఇట దాసుగారు పాశ్చాత్య పద్ధతి నవలంబించిరి. ఇందుచే ప్రయోగ సౌలభ్యము చేకూరును. అట్లు రంగములుగా నున్నప్పుడే నటించుటకు నటులకుగాని, దర్శించుటకు సామాజికులకుగాని ఎక్కడికక్కడ నూతనోత్సాహము సమకూడుచుండును. నాటక మందెచ్చటను సుదీర్ఘరంగములు లేవు. ఒకే రంగము దీర్ఘమైయున్నచో నటునివిషయ మెట్లున్నను ప్రేక్షకునకు ఓర్మి సన్నగిల్లి విసుగు జనించును. అందువలన అరిస్టాటిల్ వాక్రుచ్చినట్లు కథావస్తువు సంక్షిప్తముగా నుండవలెను. ప్రస్తుత నాటకములోని వస్తువు కూడ అట్టిదే. ఇతివృత్తమును సంగ్రహించి వలసినంతవట్టు ప్రధాన విషయములను మాత్రమే స్వీకరించి ప్రస్తరించినాఁడు కవి. రాజరాజు వేటప్రయాణము, సుబుద్ధిసారంగధరుల పారావతక్రీడ, చిత్రాంగీ సారంగధరుల సమావేశము, చిత్రాంగీ రాజరాజుల సమావేశము, ధర్మసభలో రాజ నిర్ణయము, సారంగధరుని వైరాగ్యము అనునవి ఇందలి ముఖ్యవిషయములు. వీనిని సామర్థ్యముట్టిపడ కవి నిర్వహించినాఁడు.

ఆదిభట్టవారు నాటకారంభమున సంస్కృతనాటక మర్యాదను కూడ పాటించి నాందీ ప్రస్తావనలను రచించినారు. అట్లే నాటకాంతమున భరతవాక్యమును నిబద్ధమైనది. నటీసూత్రధారుల సంభాషణములో వసంతఋతువర్ణనము గేయరూపమున గావింపబడినది.

ప్రాచ్యలాక్షణికులు నిషేధించిన వధాదులను దాసుగారు నాటకములో ప్రత్యక్షముగా చూపింపలేదు. పరోక్షముగా సూచించిరి.

చిత్రాంగి మరణమును రాజుకు భటులద్వారమున చెప్పించుట ఇందు కుదాహరణము.

ధర్మవరమువారు సారంగధరుని మరణముతో తమనాటకమును ఖేదాంతము (Tragedy) చేయగా ఆదిభట్టవారు సారంగధరుని సిద్ధుని గావించి (ఇట రాజరాజుచే కవి యనిపించిన "చక్రవర్తులుగ నుంటకన్న సర్వజ్ఞులగు సిద్ధులగుట గొప్పకదా!" అన్న మాటలు స్మరింపదగినవి.) తమ నాటకమును విషాదదృశ్య శబలితమైన మోదాంతముగా (Tragi - comedy) నొనర్చిరి.

రస పరిపోషణము:-

కవియొక్క నైపుణ్యమునకు నికషోపలము రసపరిపోషణము. సారంగధర నాటకములో శాంతము అంగిరసము. చక్రవర్తి కావలసిన ధీరోదాత్త నాయకుఁడు సారంగధరుఁడు తుట్టతుదకు తల్లియగు రత్నాంగితో "అమ్మా! సంపదలు మోహకారణములు. కాలకర్మము లెట్టివారికి నవశములు. కావున నే యతినై కాలముగడుపఁ బ్రతిజ్ఞ పట్టితిని" అని నిత్యానిత్య వస్తువిచారజన్యమై విషయవిరాగరూపమైన నిర్వేదముతో నాడిన మాటలు శాంతరస పర్యవసాయు లగుచున్నవి. సారంగధరునితో పాటు సుబుద్ధియు, రాజరాజును, రత్నాంగియు, మంత్రియు, మహాకవి గాయక శిరోమణియు, విదూషకుఁడగు గిలిగింతయు నందఱును నిర్వికార చిత్తవృత్తితో వైరాగ్యమార్గము నవలంబించిరి. కనుక ఈ నాటకము శాంతరసాంతమైనది.

అంగరసములలో నగ్రతాంబూలము కరుణమున కీయబడినది. సారంగధరునకు కర-చరణఖండన శిక్ష విధింపబడినప్పుడు రత్నాంగి మనోవేదన యందును తప్పు తెలిసికొన్న రాజరాజు పరిదేవనమందును. ఇష్టజనవియోగ రూపమైన కరుణము పొంగులు వాఱినది. అది సామాజికునకు కూడ చిత్త విద్రుతిని కలిగించినది.

ఉదా;- రత్నాంగి - నా ముద్దుతండ్రీ ! నా ప్రాణధనమా ! నాబంగరు కొండా! నా నాయనా ! నా మదపుటేనుంగా ! నాకేమి దారిరా? నే నెందుఁ జొత్తునురా ? చక్కనినాన్నా ! నీకై యెన్ని నోములు నోఁచితినిరా. నే నెందఱి వేల్పులకు మ్రొక్కితినిరా (తలమోఁదుకొనుచు) సర్వేశ్వరా ! నాబిడ్డనిఁ గాపాడవా?

హాస్యము "గిలిగింత" నాశ్రయించి చక్కగ ప్రపంచితమైనది. ఇందుచే సామాజికులకు హృదయభారము కొంత తగ్గి మానసికవిశ్రాంతి కలుగుచున్నది. సుబుద్ధి సారంగుల పావురములు పైపైకి పోయి హాయిగా విహరించుచుండ తన పావురము ఎగురుటకు శక్తిచాలని దానివలె నేలపైనుంట జూచి గిలిగింత "నా పావురము నావలె నాఁకలికూటిది కాఁబోలు నెంత యెగురవైచిన నెగురక గింజల నేఱికొని తినుచున్నది" అన్నప్పుడును, వేటనుండి వచ్చిన రాజును గిలిగింత ఏలినవారు కనులపండువుగా విచ్చేసిరి. ఎన్ని సొట్టనక్కల వేటాడినారు. మఱెన్ని గుడ్డికొంగలకు వలవైచినా రింకెన్ని చచ్చుతొండల కురిబన్నినారు. మఱియు నెన్ని యడవి దోమలం జంపి తెచ్చినారు. తమ వేటవైభవ మొకసారి సెలవిండు అని వెటకార మొనర్చి నప్పుడును, అందుకు రాజు అతనితో "మేడమెట్లపైఁబడి దొర్లెడు దంతపుకాయవలె నీ నోరాఁగదేమిరా ?" అని పలికినప్పుడును, గిలిగింత తన కుక్కపిల్లయాటను వర్ణింపుమని కోరగా మహాకవిగాయక శిరోమణి-

"కుక్కపిల్లరొ ! నీ యాట చక్కదనము
నెగడు రబ్బరుచే బంతి యెరుగునట్లు
ఉడుకు నన్నముపై సిబ్బి వడకునట్లు
కుడితిలోఁబడ్డ యెలుక ద్రుళ్ళిడినయట్లు"

అని వర్ణించిన తీరునందును సున్నితమైన హాస్యము తొంగిచూచినది.

ఈ నాటకమున శృంగారము చిత్రాంగియందే నిక్షిప్తమగుటచే ఏకపక్ష గతమైనది. అంతేకాక ఆమె సారంగధరునకు తల్లివరుస. అందుచే అనుచిత విభావము. కనుక ఇది శృంగారరసాభాసము.

"మేనుల మదుల నొక్కటిగా నొనర్చి
రక్తిలోనఁ బ్రపంచవిభ్రమము దొఱఁగి
వాసి మీఱఁగ నిప్పు డద్వైతసిద్ధి
పొందుదము రార"

అను చిత్రాంగి గాఢవాంఛితము సారంగునెడ నిష్ఫలమైనది.

రౌద్రము రాజరాజు నావేశించినది. సారంగధరునియందు దోష దర్శనము చేసిన రాజున కాతఁడు శత్రువుగా కన్పట్టినాఁడు. ఆశత్రు కృతాపరాధమువలన నుద్బుద్ధమైన మనఃప్రజ్వలనముతో "ఎవండ్రురా! ఆలస్యము సేయక యీ ద్రోహికిఁ గాలుసేతులు నఱికి వేగమిటురండు. మీవార్త కిచటనే యెదురుచూచుచుందుము." అని యిచ్చిన ఆజ్ఞలో క్రోధము పరవళ్లు త్రొక్కినది.

ఉత్సాహస్థాయికమైన వీరము అనేక విధములగు ఉపాధుల నాశ్రయించి యుండును. నాయకుఁడు ధర్మాచరణముపట్ల ఉత్సాహ మును ప్రకటించినచో నది ధర్మవీరము. అది సారంగధరుని చేబట్టినది. అధర్మకార్యాచరణమునకు తలయొగ్గక చిత్రాంగితో "అమ్మా! నేఁడిం టలో రేపు మంటలో నరగడియ తుచ్ఛసుఖము? ఘోర పాపము నే సహింపఁజాల నికనాగ్రహము వచ్చుచున్నది.

నిను నన్నుంగూర్చి విభుని కన్నీరు చూడు,
మిఱిచాటెడు నపకీర్తి నోరు చూడు,
సైపఁజాలని నాదు కైజాఱు చూడు,
బుద్ధిగాని తుచ్ఛమో మోహము విడనాడు.

అడ్డము తొలఁగు తొలఁగు" అని పలికి ధర్మదీక్షాదక్షుఁడైనందున సారంగ ధరుఁడు ధర్మవీర నాయకుఁడైనాఁడు.

రాజరాజు నిజము చెప్పుమని గద్దించి కత్తిదూసి తలపై నిడినపుడు చిత్రాంగి చెలికత్తె అంటింత వడవడవణకుచు చేతులుమోడ్చి "మహా ప్రభూ! కూటికొఱకుఁ జేసినదాననుగదా? యూపె చెప్పినట్లు వినకున్న

నా తల నిల్చునా? ఇపుడు నిజ మొప్పుకొనక విధిలేదు. నన్నుఁ గాపాడెద మన్న మనవి చేసెదను" అని యనుటలో భయానకస్ఫూర్తి యున్నది.

ఎంతకును తనమాట వినక విదలించుకొని పోవు సారంగధరుని వెంటబడి అడ్డమువచ్చి -

"రక్తి కన్పర్చుఁ బిలిగిన రయికఁజూడు;
కోరి మొలపయి జాఱిన కోకఁ జూడు;
గడగడవడఁకు మై మారుకాఁకఁ జూడు;
మాఱుపల్కక నన్నొక్క మాఱుకూడు."

అని ఆడుదాననన్నమాటే మఱచి ఎగ్గుసిగ్గులులేక పలికిన చిత్రాంగి పలుకులలో జుగుప్సాస్థాయికమైన బీభత్స ముప్పతిల్లుచున్నది.

సారంగధరుని అవయవ ఖండనము సంభవించి యుండునని వందురుచున్న డెందములతోనున్న రత్నాంగీ రాజరాజులకు ఆకస్మికముగ ప్రవేశించిన హంతకులు "సజీవులై చిన్నప్రభువువారున్నా రతనికే యపాయమును లేదు" అని సారంగుని కుశలవార్త నెఱిఁగించి నప్పుడు రాజదంపతులయందే కాక సామాజికుల యందును విస్మయ స్థాయికమగు అద్భుత ముద్భవించుచున్నది. ఇట్లు చివరి యంకమున అద్భుతస్ఫురణ మొనగూర్చుట కవియొక్క సంస్కృతాలంకారిక వచన సమాదరణమునకు తార్కాణము. ఈ రీతిగా నవసరములును రుచిరముగ రంగరింపబడిన రసికరసాయనము. సారంగధరము.

## సన్నివేశ సౌభాగ్యము :

నాటకసౌధాంగణమునకు ముద్దులొలుకు రంగవల్లికల వంటివి సన్నివేశములు. నాటకము ముక్కు సూటిగా నడచినచో అది ఆసక్తి దాయకము కానేరదు. మిట్టపల్లములుగాని వంకరలుగాని లేని తిన్నని దారియు, ప్రక్కన ఎట్టి వృక్షసంపదయు పుష్పసంపదయు లేని నిశ్చల

మైన నీటి మడుగును, మెల్లగా ప్రవహించెడి నదియును చూపరులకు ఔత్సుక్యమును కలిగింపవు. అట్లుగాక వివిధవర్ణ విలసితములైన పుష్పఫల సమన్వితములైన పచ్చపచ్చని తరులతాదులతో, నల్లని శిలాపంక్తులతో, లోతైన అగాధములతో కూడిన మార్గము; తామర తీవెలతో తెల్లని ఎఱ్ఱని కమలములతో, కలహంసములతో నిండిన సరోవరము; సుడులు తిరుగుచు ఉత్తుంగతరంగములతో పొంగి పొరలుచు గలగల ధ్వనులతో సాగిపోవు నదీప్రవాహము ప్రేక్షకుని దృష్టిని వెంటనే ఆకట్టుకొని అతనిని కౌతూహలవ్యగ్రుని గావించుటయే కాక ఆహ్లాద పరవశునిగా కూడ కావించును. మార్గమునకు, సరస్సునకు, నదికి క్రమముగా వంపుసొంపులు, పుష్పాదులు, ఔద్ధత్యము ఎట్లు దర్శనీయత నాపాదించుచున్నవో అట్లే నాటకమున సముచిత సన్నివేశముల సంఘటనము వలన సామాజికుని అనుభూతి ద్విగుణీకృతమగును.

"సారంగధర"లో నెన్నియో మనోహరములగు సన్నివేశము లున్నవి. అవి కవియొక్క చాకచక్యమును కూడ ప్రకటించును.

ప్రథమాంకమున మంత్రి కవి విదూషకాది పరివారముతో కొలువుదీర్చియున్న రాజరాజనరేంద్రుని వద్దకు "పిల్లనగ్రోవుల నూఁదు కొనుచు దలలపైఁ బలురకముల పిట్టఱెక్కల కుచ్చులల్లాడ" పాటపాడుచు చెంచునాయకుఁడు భార్యయగు సింగితో ప్రవేశించుటతో నొక నూత్న సన్నివేశ మారంభమైనది. అసలు నాటక కథలో ప్రధానమైన మార్పు వచ్చుటకు వారి యాగమనమే హేతుభూతము. వారు రాజుకు కాను కలు సమర్పించి "కారుదున్నలు, గారబోతులు, దుప్పులు, పులులు, పందులు క్రొవ్వి చెలరేఁగి మాపంటచేలంబడి చెఱచుచున్నవి. వేటాడ రండు మాయేలికా!" అని యర్థించిరి. పాలితుల ప్రార్థనను మన్నించుట పాలకుల కర్తవ్యముకదా! రాజు వారికి సెలవిచ్చిపంపి 'వేటకై ప్రయాణపు ప్రయత్నములఁ జేయు' మని మంత్రి నాజ్ఞాపించినాఁడు. చెంచుదంపతులు కనుక రాకున్నచో రాజు వేటకై వెడలెడివాఁడేకాదు. అప్పుడు

చిత్రాంగీ సారంగధరుల సమావేశమే లేదు. కథయే లేదు. కావున కథాగమనమున కీ సన్నివేశము గాఢోపస్కారకమై నిల్చినది.

సుబుద్ధి సారంగధరుల సుస్నిగ్ధ సంభాషణముతో కూడిన పారావతకేళి కూడ ఒక చక్కని సన్నివేశము. ఈ సందర్భముననే ఆకసమున కెగురవేయబడిన సారంగుని పావురము పోయిపోయి చిత్రాంగి సౌధముపై వ్రాలినది. తన్మూలమున చిత్రాంగి ఆ పావురమును పట్టుటదానికై సారంగుఁడు ముందు గిలిగింత నంపుట పిదప తానే వెళ్ళవలసి వచ్చుట జరిగినవి. కనుక ఈ సన్నివేశముకూడ అనంతరకథకు దోహద మొనర్చినది.

ఇట్లే సుబుద్ధి సారంగున కడ్డుపడి హితబోధచేయు సన్నివేశము, చిత్రాంగీ సారంగధరుల సంవాదసన్నివేశము, చాకలి గిజిగన్న యింటి వద్ద గిజిగన్నకు భార్యయగు అంటెంతకు జరిగిన సంభాషణమును చాటుగా నున్న హంతకనాయకుఁడు జబ్బన్న ఆలకించి సారంగుని నిరపరాధిగ గుర్తించిన సన్నివేశము, రాజరాజు న్యాయసభలో ఒకమాటు చిత్రాంగి వైపు వేఱొకమాటు సారంగధరునివైపు మ్రొగ్గుచున్న డోలాందోళిత హృదయముతో తనలో తాను ధర్మాధర్మ విచికిత్స చేసిన సన్నివేశము, రత్నాంగీ సారంగధరుల సమాగమ సన్నివేశము, చిత్రాంగి సారంగునకు వ్రాసిన ప్రణయలేఖను మహాకవి గాయకశిరోమణి చదువగా రాజు నిర్విణ్ణుఁడై ఆలకించిన సన్నివేశము, హంతకులువచ్చి సారంగుని క్షేమ సమాచారమును రాజదంపతులకు విన్నవించు సన్నివేశము మిక్కిలి రమణీయములు. ఈ సన్నివేశములన్నియు నాటకచర్యకు శీఘ్రగతి కల్పించి నాటకరక్తికి ఉపశ్రుతిప్రాయములైనవి.

పాత్రచిత్రణము :

ఏ నాటకకర్త ప్రతిభ నెన్నుటకైనను విమర్శకులు పరిశీలింప వలసిన అత్యంత ప్రధానాంశములలో నొకటి పాత్ర చిత్రణము. పాత్ర

యనునది బాహ్యప్రపంచము నందువలెనే కావ్యప్రపంచమునందు కూడ రసమున కాధారము. పాత్రలు ప్రధానములు, అప్రధానములు అని రెండు రకములు. అది యే పాత్రయైనను రసోత్కటముగా లేదా రసాభిముఖముగా చిత్రింపబడినప్పుడే ఆ నాటకము సర్వతస్సుందరముగ నిలువగలుగును. కనుక ప్రతిపాత్రను కవి వివేకముతో, లోకజ్ఞతతో పరిశీలించి భావించి ముచ్చటగ దిద్దితీర్చవలెను. పాత్ర చిత్రణ పరామర్శనమందు కొన్ని ముఖ్యాంశములను మనము మనమునందుంచుకొనవలెను. అవి యివి :—

1. పాత్రలో జీవకళ యుట్టిపడుట. [సజీవ పాత్రల వలన సామాజికునకు కలుగు అనుభూతి గంభీరము, చిరస్థాయికము.]

2. పాత్రలు నిత్యనిసర్గ జీవిత స్వభావోచితములుగ నుండుట. [అప్పుడే అవి సామాజికునకు అత్యంత సన్నిహితములై యొప్పారును.]

3. పాత్రలు వాని పేరునకు తగినట్లు రసనిర్భరములై యుండుట. [రసహీనమైన పాత్ర సామాజికునకు రక్తిగొలుపదు.]

4. పాత్రలు ప్రదర్శనానంతరము ద్రష్టృస్మృతిలో స్థావరమేర్పఱచుకొని యుండుట. [సామాజికుల మనోమందిరములలో పదికాలములపాటు పదిలముగ నుండగల పాత్రలను నిర్మింపగలుగుట, స్మరణమాత్రముననే వానిని నేత్రపురఃప్రదేశమున ప్రత్యక్షము చేయించుట క్రాంతదర్శియైన కవికిగాని సాధ్యముకాని పని.]

"సారంగధర" లోని ప్రధాన పాత్రలు రాజరాజనరేంద్రుఁడు, రత్నాంగి, చిత్రాంగి, సారంగధరుఁడు, సుబుద్ధి, మహాకవి గాయక శిరోమణి (సుబుద్ధిసారంగుల ఆచార్యుఁడు), మంత్రి (సుబుద్ధి తండ్రి). అప్రధాన పాత్రలు గిలిగింత (విదూషకుఁడు), వలవంత (రత్నాంగి చెలికత్తె), అంటింత (చిత్రాంగి చెలికత్తె), చెంచునాయకుఁడు, సింగి, జబ్బన్న

(హంతక నాయకుఁడు), గిజిగన్న (అంటెంతభర్త, రజకుఁడు), గురుభట్టారకుఁడు (పురోహితుఁడు, చిత్రాంగి వలన లంచము గ్రహించి సారంగునకు వ్యతిరేకముగ సాక్ష్యము చెప్పిన వ్యక్తి), భటులు, హంతకులు, ద్వారిక.

ఉపర్యుక్త పాత్ర లన్నియు లోకవృత్త పరిశీలనానుభవముతో నిర్మితములై సజీవచైతన్యచకచ్చకితములై సామాజికులకు చిరస్థాయికమగు గభీరానుభూతిని ప్రసాదించుచున్నది.

సామాన్యజన జీవితమునకుకూడ ఈ నాటకకథలోని సంఘటనల వంటి సంఘటనలు యాదృచ్ఛికముగా సంభవింపవచ్చును. రాజరాజు వంటి వ్యక్తి చిత్రాంగివంటి భార్యచేసిన మోసము నెఱుఁగలేక సారంగధరునివంటి కుమారుని క్రూరముగ శిక్షించుట, రత్నాంగివంటి ఆ కుమారుని కన్నతల్లి గుండె బ్రద్దలగునట్లు దీనాతిదీనముగ శోకించుట ఎంతేని సహజములు. సత్యాసత్యములు తెలిసిన సుబుద్ధిని బోలిన స్నేహితులు, శిష్యుని గుణగణములు తెలిసిన మహాకవిగాయక శిరోమణిని బోలిన విద్యాదాచార్యవర్యులు, అప్పుల స్వభావము కూలంకషముగ తెలిసిన మంత్రిని బోలిన సజ్జనులు, లంచమున కాసపడి యనృత సాక్ష్యమిచ్చు గురుభట్టారకుని బోలిన దుర్జనులు, ఏమిచేయుటకును అధికారములేక జరుగుచున్న అన్యాయమునకు ఆక్రోశించు గిలిగింత జబ్బన్న గిజిగన్నలను బోలిన దుర్బలులు, మంచిచెడులకు మాఱుపేరైన వలవంత అంటెంతలను బోలిన చెలికత్తెలు లోకమున తండోపతండములుగ కన్పించుచుందురు.

సారంగధరుఁడు ధర్మవీరశాంతములకు, రాజరాజు రౌద్రమునకు, రత్నాంగి కరుణమునకు, చిత్రాంగి శృంగార బీభత్సములకు, గిలిగింత హాస్యమునకు, అంటెంత భయానకమునకు, జబ్బన్న అద్భుతమునకు ప్రతీకలు.

సుబుద్ధి బుద్ధిచాతుర్యము - నిర్భయత్వము, సారంగధరుని ధీరోదాత్త స్వభావము - స్నేహానురాగము - పితరులపట్ల భక్తి - ధర్మ

ప్రవృత్తి - విజ్ఞాన వైభవము, రాజరాజు ఉచితానుచిత విచక్షణా జ్ఞానశూన్యత్వము - లోకాపవాద భీతి - పరిపాలనాదక్షత - పశ్చాత్తప్తత, రత్నాంగి పాతివ్రత్యము - పుత్త్రవాత్సల్యము, చిత్రాంగి మోహాంధత్వము - సంగనాచితనము, మహాకవి గాయక శిరోమణి శిష్యాభిమానము - కవితాసంపత్తి, మంత్రి వాదనైపుణ్యము - నయ శాలిత, గిలిగింత గిలిగింతచేతలు - మాటలు, జబ్బన్న ఔదార్యము, గురుభట్టారకుని కుటిల వర్తనము జ్ఞప్తికి వచ్చినప్పుడెల్ల ఆయాపాత్రలు మన కనులముందు కదలాడుచుండును.

ప్రత్యక్ష పద్ధతి, పరోక్ష పద్ధతి అని పాత్రచిత్రణము రెండు విధములు. కవి తనకుతానై పాత్రయొక్క స్వరూప స్వభావములను వివరించినచో నది ప్రత్యక్ష పద్ధతి (Direct Method). ఇది శ్రవ్యకావ్య పద్ధతి. అట్లుకాక కవి ఒక పాత్ర ద్వారమున మఱియొక పాత్ర స్వరూపస్వభావాదికమును నిరూపించినచోగాని, ఏ పాత్ర స్వభావము నా పాత్రయొక్క వాగ్వేషచేష్టాదికమున ఆవిష్కరించినపుడుగాని యది పరోక్ష పద్ధతి (Indirect Method). ఇది దృశ్యకావ్య పద్ధతి. మేల్తరమైనది. ఈ రెండు పద్ధతులయందును పాత్రయొక్క ఆంతరస్వభావము కూడ ఊచముట్టుగ ఉగ్గడింపబడవలెను.

పరోక్ష పాత్రచిత్రణ పద్ధతికి ద్వితీయాంకములోని ఈ క్రింది చిత్రాంగి స్వగతము ఉదాహరణీయము.

చిత్రాంగి - (తనలో) అంటేంత నెరజాణయే. ఏదైన నొక పన్నుగడ పన్ని నా ప్రాణధనము నిక్కడికిఁ దెచ్చెను. ఎంత చక్కని వాఁడు! చందురునికైన మచ్చగలదు. దేవుఁ డీలాగు వ్రాసెను గాని నేఁ గోరుకొన్న మగఁడు వాఁడేకదా. ఇంతకును దేవుడు రక్షించి యాయనగూడ నూరలేకుంట గొప్పలాభమే. పిట్టకైనను దెలియనీఁ గూడదు. వాఁడు వచ్చినతోడనే కొడుకు మిషపైఁ గౌఁగిలించుకొనె

దను ... వలపునకు వావియేమి? ... పాపమో గీపమో కోర్కెదీర్చు కొనని బ్రతుకు మఱేమి బ్రతుకు? మనసున్నవాఁడే మగఁడు. వాఁడు వచ్చునంతలో సొగసుగ నలంకరించుకొనెదను ... అలమేలు మంగ దేవతా! నా కోర్కె దీర్చినయెడల నీ గోపురమునకు బంగరు రేకు తాపించెదను.

అధర్మమార్గానుయాయినియై కూడ తన తప్పిదమును తానే సమర్థించుకొనగలుగు చిత్రాంగి చిత్రమనస్తత్వము, కామోద్రేక పూరిత చిత్తవృత్తి, కాఁబోవు కారాని కార్యమునకు సహాయము గమ్మని దేవతలకు సైతము ఆసవెట్టి మ్రొక్కుకొను తెగింపు పై స్వగతము వలన సమగ్రోదితమగుచున్నది.

"చావునకు విచారించనుగాని యపవాదమునకుఁ జింతించెదను" అను సారంగధరుని ఆత్మగతము, తనపై ఆగ్రహించియున్న తండ్రిని చూచి అతఁడు -

"సాముచదువులందు సంతోసమున నన్ను
కురులు దువ్వి ముద్దుగొనెడి తండ్రి
యిపుడు నత్యమెఱుఁగ కిట్లల్కఁ జూపుట
మిత్తికంటె నాకు మేటిశిక్ష"

అని వచించినపట్టు సారంగుని యాత్మాభిమానమునకు, పరకోటి ముట్టిన ఔదాత్త్యమునకు మచ్చుతునుకలు.

మఱియు ప్రథమాంకములో సారంగధరుని గూర్చిన ఈ క్రింది మహాకవిగాయకశిరోమణి నోటనుండి వెలువడిన -

"సహజసంగీత సాహిత్యసంపదయును
ధైర్యగాంభీర్య విక్రమౌదార్యములును
చక్కదనము స్వతంత్రరాజ్యంబు నోర్పు
బరగు రాజేఁడి? సారంగధరుఁడు దక్క"

అను పద్యము లక్ష్యప్రాయము. ఇందు మూలమున సారంగుని లలిత కళాభినివేశము, పరాక్రమౌదార్య సౌందర్యాదులు వ్యక్తములైనవి.

శిక్షననుభవించుటకై హంతకుల వెంటవచ్చుచున్న సారంగధరుని మాటలలో నైకముఖీనమైన రత్నాంగి పుత్రప్రేమ ద్యోతకమైనది.

సారంగధరుఁడు –

నాబిడ్డకన్న సుందరుఁడు లేఁడని పొరిం
బొరి మోవి నొక్కి నన్ ముద్దుపెట్టు ;
నాయన్న జగదేకనాయకుఁ డగునని
మఱిమఱి నన్ దన యురముఁ జేర్చు ;
నాయయ్య చదువులోనం బ్రోడయని పలు
మఱు చెంతఁజేర్చి నాకురులు దువ్వు ;
నాతండ్రి శాశ్వతఖ్యాతి నొందునటంచు
నన్నుఁ గన్నప్పుడెల్ల మిన్నుముట్టు ;

అట్టి ననుఁ గన్నతల్లి నా యాపద విని
యెట్లు భరియింపఁగల్గు ; నింకెట్లు బ్రతుకు ;
హరహరా ! సర్వలోకేశ ! పరమసాధ్వి
నిట్లు కుందింప నను సృజియించినావ.

పాత్రలను చిత్రించు సమయమున అప్పుడప్పుడు కవి ప్రతియోగము (Contrast) నేర్పాటు చేయుచుండును. పరస్పర వైరుధ్యముగల రెండు పాత్రల భేదనిరూపణము ఇందు జరుగును. రత్నాంగీ చిత్రాంగుల పాత్రలు, చిత్రాంగీ సారంగధరుల పాత్రలు పోషింపబడిన వైఖరి యిందుకు నిదర్శనము.

ఉదా :– చిత్రాంగి – వద్దుచుమీ, వినవుగదా పోవుచున్నావా ? కానీ చూడు. రేపు నీ రక్తము బొట్టుపెట్టుకొనక నా పగ దీఱునా ?

సారంగధరుఁడు – మా తండ్రిగారితో నెద్దియో పాపము కల్పించి చెప్పి

చంపించెదవు ఇంతియే కదా ! సత్యాహృదయముతో హాయిగా జచ్చెదను.

ఇట చిత్రాంగిది దుర్మార్గము. సారంగునిది సన్మార్గము. ఇరువురికి నిదియే భేదము.

నాటకములో మూడు ముఖ్యమైన స్వగతము లున్నవి. అవి త్రివిధ ప్రధాన పాత్రల తీవ్రమైన అంతస్సంఘర్షణా నిరూపకములై నట్టివి. అందు మొదటిది వజ్రపు పొడి మ్రింగి మరణించు చిత్రాంగికి సంబంధించినది. రెండవది ధర్మపీఠము నధిష్ఠించి న్యాయనిర్ణయము చేయు రాజరాజనరేంద్రునకు సంబంధించినది. మూడవది ఉత్తరపుటడవి పూఁదోటలో విరాగచిత్తుఁడగు సారంగధరునకు సంబంధించినది. ఈ స్వగతములు ఆ పాత్రల మానసిక స్థితిగతుల పరిణామమును, విధి చేసిన విపరీత ఘటనను వ్యక్తీకరించుచున్నవి.

ఈ విధమగు దాసుగారి పాత్రచిత్రణ విధానము పరమాహ్లాదమునకు పెన్నిధానమనుటలో విప్రతిపత్తి లేదు.

## వర్ణనవైదగ్ధ్యము :

సమయోచితములగు వర్ణనములు శ్రవ్యకావ్యమునకు వలెనే దృశ్యకావ్యమునకును ఆవశ్యకములు. అట్టి వర్ణనములను కథాసూత్రబంధురములైన వానిని యొనర్చుట నారాయణదాసుగారి ప్రత్యేకత. అవి అత్యంతము సహజసుందరములుగ నుండును. క్రింది వర్ణనములు ఇందులకు ఉదహరింపదగినవి.

## అటవీ వర్ణనము :

ఎంతయుఁ జొరనీక యెదిగి బల్లిదుచుఁగ
నల్లుకొన్నట్టి వెదుళ్ళపొదలు ;
కొండలఁ బోలియు బెండులై తేలి మ
డుఁగుల నీఁదాడు నేనుఁగుకదుపులు ;

మేనులుబ్బగ నెఱ మ్రింగి లావగు చెట్ల
కుం జుట్టుకొన్నట్టి పెంజిలువలు ;
తోడనె బండరాల్ దొర్లించుకొనుచు గ
ట్టు దిగువకుం ద్రుళ్లెడు సెలయేళ్లు ;

గలుగు కాఱడవులలోనఁ గాపురంబు
బఱపుచుఁ బులుల లేఁగలఁ బగిది నిండ్ల
గట్టివైచుచుఁ గలనైనఁ గల్లవలుకఁ
బోని యెఱుకలఁ బొడగన్నఁ బున్నెమబ్బు.

## వేసవి వర్ణనము :

వేసవిప్రొద్దు నట్టనడి విన్నున నిల్చడి యెండనిప్పు గాఁ
జేసెడు ; మేనినీడ కడుఁ జిన్నఁగఁ దగ్గి యడుంగు చెంతకున్
డాసెడుఁ ; జెట్లతొఱ్ఱలనడంగి దగంబడి పిట్టలెల్లెడన్
గూసెడు ; రెండుజాములదిగో గడియారము కేకవేసెడున్.

## చిత్రాంగీసౌధ వర్ణనము :

ఇరుదట్ల కీల్బొమ్మ లింపుగఁ బొడంగ
స్వర్గంబు వెక్కింపఁజాలు మెట్లు ;
అద్దంబువలె మేని నంతయుఁ గన్పర్చఁ
జారిన సున్నని పాలగచ్చు ;
జీవకళలతోడఁ జెలఁగి నవరసముల్
చెలువారఁ జూపెడు చిత్తరువులు ;
మాటిమాటికి వింతమాటలాడుచుఁ బంజ
రము అలరించు గోరలు చిలుకలు ;

కలుగు నీమేడపైనుండి కాంచునపుడు
క్రింది జనములు చీమల చందముగను
తోఁటలుం బూరిబయిళుల వాటముగను
గానఁబడుచుండె దిరిగెడి కన్నుఁగవకు.

సుబుద్ధికృత చింతాక్రాంత సారంగధర వర్ణనము :

కెందమ్మిరేకుల యందమౌ నీతని
కందోయి నిద్దురఁ జెందకునికి ;
దీర్ఘవిచారంబు దెల్పుచు నీతని
హస్తము ఫాలమం దమరియుండె ;
అవశమై వచ్చెడు నశ్రుపూరమ్ము ని
ట్టూరుపువేఁడిమి నాఱుచుండె ;
అపకీర్తి వెన్నంటి నట్టు లుపేక్షింపఁ
బడి యీతనికిఁ గొప్ప విడి చెదరెను ;

అకట నేననుకొన్నట్టు లయ్యెనేమొ !
కానిచో నన్నుఁ జూచిన తోనె కొండ
పగిదిఁ బొంగుచు నవ్వుచుఁ బల్కరించు
చిన్నప్రభుఁ డిప్డు డెందుకు మిన్నకుండె.

పారావతవిహార వర్ణనము :

గాలికెదురుగఁ జనగ ఱెక్కలు విదలుచు
గాలితోడనె పోవగఁ గదలకుండు
ఏటి కెగువ దిగువలందు నీఁదునట్లు
పారుచున్నది నా ముద్దు పావురంబు.

ఈవర్ణనములు కవియొక్క క్రాంత దర్శనమునకు నిదర్శనములు.

అలంకార సమలంకరణము :-

వాస్తవిక జీవితమునందువలెనే కావ్యజీవితమునందుకూడ అలంకారము ప్రముఖస్థాన మాక్రమించియున్నది. భావ వ్యక్తీకరణములోని ఒకానొక వైచిత్రి నాశ్రయించి అలంకారము ప్రాదుర్భవించుచున్నది. ఏ భాషలోనైనను సరియే అలంకారము లత్యంత సహజముగా చోటు చేసికొనియుండును. నిత్య వ్యవహారములో మానవుడు తనకు తెలియకుండగనే అనేకాలంకారములను ప్రయోగించుచుండును. ఉదాహర

ణమునకు "నీకు నీవే తగుదువు" "కొండంత పత్తి" "చంద్రునికొక నూలుపోగు" "ఆమె రంభ" ఇత్యాదులు. ఏకదేశగతములగు కటకాదులు శరీరమునంతటిని అలంకరించునట్లు ఒకచోటనుండి కావ్యసామస్త్యము నలంకరించునవి అలంకారములని ఆచార్య విశ్వేశ్వరుఁడు తన "చమత్కార చంద్రిక"లో వ్రాసిచ్చినాఁడు.

ఉపమాలంకారము :-

ఉపమానోపమేయములకు చక్కని సాదృశ్య సంపద ఎచ్చట ప్రకాశించునో అచ్చట ఉపమ.

అలంకారములలో ఉపమది అగ్రస్థానము. ఉపమ ఒకనటియై చిత్ర విచిత్రములైన వేషభేదములను ధరించి కావ్యరంగమున లాస్యమొనర్చుచు రసజ్ఞుల మనస్సులను రంజింపజేయుచున్నదనియు, బ్రహ్మజ్ఞానము వలన సమస్తవిశ్వము తెలియబడునట్లుగా ఉపమాజ్ఞానమువలన సమస్తాలంకార జ్ఞానము సంప్రాప్తించుననియు మహాపండితుఁడైన అప్పయ్యదీక్షితులవారు తమ 'చిత్రమీమాంస'లో సెలవిచ్చినారు. అట్టి ఉపమాలంకారమును నిపుణప్రయోగ మొనర్చినారు నారాయణదాసుగారు.

ఉదా :- రత్నాంగి వలవంతతో ననుచున్నది. "నీవంటి మంచి నడతగల దానియందలి చదువు పరిశుద్ధపాత్రమందున్న భక్ష్యమువలె నింపవునుగదా !"

"సన్నమబ్బునఁ దోఁచెడు చందురువలె,
ఆకుచాటుండిన గులాబి యలరుమాడ్కి,
నీటఁ బ్రతిఫలియించు మానికము వోలి,
చీరముసుగునఁ జిత్రాంగి చెలువుమీటి" నదట.

రాజరాజు చిత్రాంగితో ననుచున్నాఁడు. 'నీవున్నయెడఁ జీఁకటి వెల్లడి గదా ! మసిగాజులోని దీపమువలె మాసినచీర నేల నీయొడలు వెలిగించుచున్నది ?'

గిలిగింత రాజరాజును గూర్చి యనుచున్నాఁడు. "తలక్రిందు చేయఁబడిన దివిటీవలె నీ వెఱ్ఱిరాజు ముఖము దించఁబడియు నగ్నిజ్వాలల నెగిరించుచున్నది."

మహాకవిగాయకశిరోమణి మూర్ఛనుంచి తేఱుకొనుచున్న మహారాజును చూచి మంత్రితో ననుచున్నాఁడు.

"మంచుదోఁగెడు శోణపద్మములమాడ్కి
కన్నుఁగవఁ గ్రోధశోకముల్ గ్రమ్ముచుండ
మూర్ఛదేఱెడుఁ బెద్దపఱ్ఱిభుపకటా ! ము
డింగి మెల్లన విడు నిద్రభంగిపలెను."

ఉత్ప్రేక్షాలంకారము :- సంభావనము ఉత్ప్రేక్ష.

మహాకవిగాయకశిరోమణి మట్టమధ్యాహ్న కాలమును వర్ణించుచున్నాఁడు.

"తమ్ముమాలిన ధర్మంబు తగదఁటంచుఁ
దలల నలరించు తమ మొదళులను గావఁ
బూని చాఁచిన నీడల ముణుఁచుకొనియోఁ
బాదపంబులు ; నడుమింట భానుఁడొప్పె"

స్వభావోక్త్యలంకారము :-

మనోజ్ఞమైన యథావద్వస్తువర్ణనము స్వభావోక్తి. పావురముల యాట సందర్భములో సుబుద్ధి సారంగునితో ననుచున్నాఁడు. "అయ్యా! చిత్తగించితిరా ? ఈ గోధుమవన్నె మగపావురము మాటిమాటికిఁ తన కవపిట్ట టెక్కలందుఁ దన టెక్కలం జొనుపుచు దాని నోటికి గింజలేటి యందించుచుఁ జిందులు ద్రొక్కు చెట్లు వేడుక చేయుచున్నదో !"

కోపించి శయనించియున్న చిత్రాంగిని చూచి రాజరాజు అనుకొను చున్నాఁడు.

"లాలనఁ బొందఁగోరి కనులంబడు దబ్బఱ వంత ముత్తెపుం
జాలెగఁ జిమ్ముచున్ బెదవి చాటొనరించుచుఁ గోటమూపులన్
గేలుల నొడ్డుకొంచు గిలిగింత కొకంతట నవ్వి పక్కనన్
దాలిమిదూలపోలు నెలతం దమితీఱఁగ ముద్దులాడెదన్."

అర్థాంతరన్యాసాలంకారము:- సామాన్యమును విశేషముచేగాని విశేషమును సామాన్యముచేగాని సమర్థించుట అర్థాంతరన్యాసము.

సారంగధరుఁడు తన మిత్త్రివాక్య నిరాసమునకు విచారపడుచు సుబుద్ధితో నిట్లనుచున్నాఁడు.

"అపదకు హేతువులుదోఁచియైనఁ దన్ను
బ్రాణమిత్త్రులు వారించియైన, నన్నుఁ
బోలి తప్పుతోవంబడి పోవుఁగాని
యకట! దైవోపహతుఁ డెట్టులాఁగఁగలఁడు."

శ్లేషాలంకారము :- నానార్థ సంశ్రయము శ్లేషము.

"ప్రొద్దుపోవుచున్నది గనుక నేఁబోవలెను. కటాక్షించి బిడ్డనికి సెలవిప్పించఁ గోరెదను" అని పీడుకోలు కోరిన సారంగధరునకు "నిన్నుఁ గటాక్షించి యెవతె విడువఁగలదు. మంత్రితో నావల రాచకార్యముల కేమిగాని నాతో నీవలరాచకార్యములఁ జూడుము" అని చిత్రాంగి వీడ్కోలు. ఇట 'కటాక్షించి' అనఁగా సారంగుని యుద్దేశము "దయదలచి" అని. కాని చిత్రాంగి యుద్దేశమున 'నిన్ను కటాక్షించి' అనఁగా 'నిన్ను కడకన్నుల తిలకించి' అని. కటాక్షించు అను పదమునకు దయదలచు, క్రీగంటచూచు అని రెండర్థములున్నవి. అట్లే 'ఆవల రాచకార్యములు' 'ఈవలరాచకార్యములు' అనుచో అవతల రాజకార్యములనియు, ఈ మన్మథక్రీడలనియు రెండర్థములు. కనుక శ్లేషాలంకారము. ఇట్లు ఆది భట్టవారి అలంకారములు ముచ్చటగొలుపుచుండును.

సూక్తివైచిత్రి :

అర్థవంతమైన ప్రతిశబ్దమును ఉక్తియే. ఒక లోకోత్తర విషయమునుగాని సత్యమునుగాని హార్దమైన యనుభవమునుగాని తాత్త్విక

మైన భావమునుగాని కవి సమయమునుగాని సంప్రదాయమునుగాని లక్ష్యముగా చేసికొని సందర్భసుందరముగ సంఘటింపబడి లోకము ప్రత్యేకముగా కూడ వాడుకొనుటకు తగిన పలుకుల పొందిక కలిగి యున్నచో అప్పుడది యొక సూక్తియగును.

సరసములైన సూక్తులు సాహితీ సరస్వతికి సౌవర్ణ హారములు. ప్రాచీనములైనను - నవీనములైనను, సంప్రదాయ సిద్ధములైనను - కల్పితములైనను, సంస్కృత సంబంధులైనను - దేశీయములైనను అవి సహృదయ హృదయంగమములై అర్థస్ఫూర్తిని కలిగించుటకు మిక్కిలి తోడ్పడుచుండును. సూక్తులు సార్వకాలికములు, సార్వజనీనములు. సందర్భశుద్ధిగల సూక్తుల నుపయోగించుటలో మేటి ఆదిభట్టవారు. అట్టి సరసోక్తులును సామ్యములును గొన్ని :-

అట్టెడమనఁ దెట్టెడ మనుట ; ఎంతవానినైన కొలువు లొంగఁ దీయునుగదా ! ; ఆపాటి ముఖమునకే యద్దశేరు పసపు ; అందరాని పండ్లు కాశీ యెందుకు ; పాపపుబుద్ధి గలవారు గోడనుజూచి సయితము బెదరెదరు ; మతి యొకచోట మన్నన మఱొకచోట ; బూడిదలోఁ బోసిన పన్నీరు ; కడుపే లేదనఁ గొడుకు పేరు సోమలింగ మన్నట్లు ; వట్టి గొడ్డునకు దాఁపులు మెండు ; మ్రింగ వాటము కాదు కక్క-వాటము కాదు ; వేడినీళ్ల కిండ్లు కాలునా ? ; వాఁడి వయసున ముదుసలి పల్కు-లేల ? ; నీతులు పోతపాల వంటివి ; చేతగలవాని నూతఁ బడినట్లు.

కేవలము సూక్తులేకాక ఎన్నియో జాతీయములు కూడ మనకీ నాటకమున దృగ్గోచరములగును. జాతీయములు భాషాయోషకు సహజ సిద్ధములగు ఆభరణములు. వానిని ప్రయోగించుటలో కూడ కవి ఉచిత జ్ఞత చూపవలెను. మచ్చునకు కొన్ని దాసుగారి జాతీయములు.

కడుపుచల్లగా - పాపమొడిగట్టుట - కన్నకడుపు - చిన్నితండ్రి-గొడ్డుదేవుఁడు - కడుపుమండుట - జానెడుపొట్ట - గయ్యాళిగంప-వగల

వంకాయ - రాలుగాయ - కన్నులారఁజూచుట - మాటవాసికనుట - కన్నుగానకవదరుట - శనివలెపోగగుట - చుక్కవలెదిగుట - గిలిగిచ్చ లాగు వాగుట-

## శైలీ లాలిత్యము :-

శైలి లేక శయ్య యనునది శబ్దధర్మము. వినిమయాసహిష్ణువులైన పదములయొక్క నిరతిశయమైన మైత్రియే శయ్యయని "ప్రతాపరుద్ర యశోభూషణము"న విద్యానాథుని వక్కణము. పుష్పమాలికను కట్టువాఁడు ఏ పుష్పము తరువాత ఏపుష్పమును కూర్పవలెనో సమ్యగ్విచార మొనర్చి కూర్చునట్లు సుకవి సావధానుఁడై ఏ శబ్దము తరువాత ఏ శబ్దమును కూర్చిన లెస్సగా నుండునో విచారించి కావ్యరచన కావింపవలెనని "కావ్యాలంకారము"న భామహాచార్యుఁ డభిప్రాయపడినాఁడు.
"A great writer possesses, so to speak, an individual and unchangeable style, which does not permit him easily to preserve one anonymous."
[గొప్ప రచయిత ఆత్మీయమైనట్టిది, తిరుగులేనట్టిది యగు శయ్యను కలిగి యుండును. అది అతనిని అంత సులువుగా విస్మృతిపాలు చేయదు.] అను ఓల్టైర్ మహాశయుని అభిభాషణము ప్రత్యక్షర సత్యము.

దృశ్యకావ్యమునందలి శైలి సాధ్యమైనంత సరళముగా నుండవలెను. అప్పుడే సామాజికుడు సులభముగ అర్థము చేసికొనగలఁడు. నారాయణదాసుగారిది నిరాడంబరము సుకుమారమునైన శైలి. నిండైన యేరువలె ఎట్టి కుదుపులును ఉరవడులును లేక అది అల్లనల్లన సాగిపోవును. అది ఆయన విశిష్టత. తెలుగు పలుకుబడి పౌలపము వారిసొమ్ము. అది ప్రదర్శించుటలో అప్రతిమాన కౌశలము నతివేలమైన అభినివేశము జూపుదురు.

## గద్య శైలి :-

చిత్రాంగి - ఆహా! యేమి ఠీవి? యెంతసోగ? చూడ రెండు కనులు చాలునా? ఫీనితో నేలాగున, గలిపెదవో సుమా? కోర్కె

దీర్చుకొనక నిల్వలేను. పిమ్మట నేమైనను సరియే. ఏమి చక్కఁదనము? చేరువైనకొలఁది నీతని చాయ పసిఁడినిగ్గులు వెలుచుచుండె. ఎంతలేసి చూపులు! చూపులా నెమ్మికిం బ్రాపులు. నెలతలకుం దూపులు. వక్షస్స్థల మెంత వెడల్పు? నేనెప్పుడందు సోలెదనో? ఏనుఁగు తొండములు కాని చేతులు కావు. నా చేతులార గంధమెప్పుడు పూసెదనో? ఏమి యద్భుతమోసెమ్మ! నా చూపు వీని రూపునందు చిక్కుకొని మరలఁ జాలకున్నది. వీనితో నేనెట్లు మాటగలిపెదనో గదా? నాకు బరవశ మగుచున్నది.

పద్యశైలి :

చల్లనిగాలి నిండుగల జాబిలి యామనిపండు తోఁటలో
నల్లిన మల్లిపువ్వుపొద యచ్చటఁ జిన్కులఁ జిమ్ము జంత్ర మా
మొల్లపు చిల్కపాటయట మోహము దీఱుట వన్నెకానితో
మెల్లని సోయగంబు నడ మీఱుట యబ్బునె యట్టిముచ్చటల్.
చూడవిదేమి యొక్కమొగిఁ జూపులు చీఁకటివెల్గులీన; మా
టాడవిదేమి పల్వెదవులందున ముత్యము కెంపులొల్కఁగాఁ;
జాడవిదేమి కన్గవల వాలిచి చిల్కలు నాలకింపఁ; గే
ల్మోడుచు బంటుపై నలుక బొందుటలేలనె ప్రాణనాయికా,

గేయశైలి :

అగపడవేల రామా - యయ్య లోకనాయకా
జగంబులఁ గన్నతండ్రీ - సాధుసౌఖ్యదాయకా ॥అగపడ॥
నేనెచటం గానరా - నిన్ను సత్యమందుఁ దప్ప
గానలోలా వేవేగఁ - గావరాదా మాయప్ప ॥అగపడ॥
దేహమోహమూర్ఛరా - దివ్యజ్ఞానమీయరా
ఓహో సర్వేశ్వరా నీ - యునికి బయలు సేయరా ॥అగపడ॥

ఛందస్సౌందర్యము :-

కొందఱు పాశ్చాత్య నాటక కర్తలు విషాదాంత నాటకములలో పద్యమును, ఆహ్లాదాంత నాటకములలో గద్యమును ఆద్యంతము

నుపయోగించిరి. కాని సంస్కృత సంప్రదాయానుసారముగ నారాయణదాసుగారు గద్యపద్యములతో సారంగధర నాటకమును రచించినారు. అంతేకాదు. సందర్భానుగుణముగ గేయములను కూడ చొప్పించినారు. స్వయముగా గాయకాగ్రేసరులగుటచే వానికి రాగతాళగతుల నిర్దేశము కూడ వారే కావించినారు. ఇట్లు గేయములను పాడుటవలన సామాజికునకు అర్థావబోధము శీఘ్రమే యగును. లయాన్వితమైన సంగీతము మూలమున మానసికోల్లాసమును కలుగును.

దాసుగారు డెబ్బదియైదు తేటగీతులను, పదునెనిమిది గేయములను, పది సీసములను, తొమ్మిది ఉత్పలములను, ఐదు కందములను, రెండు ద్విపదలను, రెండు మత్తేభములను, ఒక శార్దూలమును, ఒక చంపకమును రచించిరి. ప్రధానముగా సంవాద సందర్భములలో తేటగీతిని - కందమును, పాత్రగతమైన సంతోషమునుగాని సంతాపమునుగాని వైరాగ్యమునుగాని వ్యక్తముచేయు సందర్భములలో గేయమును, వర్ణన సందర్భములలో సీసమును - ఉత్పలమును, కథనాత్మక సందర్భములలో ద్విపదను ఉపయోగించిరి.

పెక్కు పాత్రలు ఏకవిషయమునే భిన్నవిధముల వ్యక్తీకరించు సందర్భములలో ఒక్కొక్క పద్యపాదము నొక్కొక్క పాత్రద్వారమున పలికింపజేసినారు ఆదిభట్టవారు. ఈ పద్ధతిని ధర్మవరమువారు ప్రవేశపెట్టిరి. ఇది ఆనాటి నాటకరచయితలను, ప్రేక్షకులను విశేషముగ నాకర్షించిన యొక విలక్షణ విధానము. పద్య గేయచ్ఛందస్సులను పరిగ్రహించుట మూలమున దాసుగారి నాటకము "పాఠ్యే గేయే చ మధుర" మైనది.

వ్యక్తిత్వ ముద్ర :

కవియొక్క ఆత్మీయత అప్రయత్నముగనే కావ్యదర్పణమున అటనట ప్రతిఫలించుచుండును. ప్రకృత నాటకమున ఆదిభట్టవారి

స్వీయాభిప్రాయములు కొన్ని పాత్రముఖమున ప్రకటీకృతములైనవి. ఉదాహరణమునకు - "కవిత్వమునకుఁ బ్రాణముపమ గదా" "తెనుఁగునకు స్త్రీలాలిత్యము, సంస్కృతమునకు పురుషగభీరతయు సహజములు" అను రాజరాజు మాటలలోను,

"సాఁగి కమ్మెచ్చునన్ వచ్చు తీఁగెఁ బోలి,
సాలెపురుగు కడుపులోని నూలుఁ బోలి"

కవిత కదలిరావలెనను సుబుద్ధి సారంగధరుల వాక్కులలోను,

"మొలక లేఁతదనము, దలిరుల నవకంబు,
మొగ్గ సోగదనము, పువ్వుతావి,
తేనె తీయదనము, తెనుఁగునకే కాని
పరుషసంస్కృతాఖ్య భాష కేది ?"

"ఏమి భృత్యత ! సంతుష్టి ! యెంత నయము !
నమ్మకం బెంత ! సాధువినయము నెంత !
దోసమొఱుఁగని యిక్కిరాతులనుఁ జూచి
బూటకపు నాగరులు సిగ్గు వొందవచ్చు"

అను మహాకవిగాయకశిరోమణి పలుకులలోను నారాయణదాసుగారి మానసమే కన్పించుచున్నది.

ఉపసంహృతి :

ఏవం విధముగా ఆదిభట్ల నారాయణదాసుగారి సారంగధర నాటకము ప్రాచ్యపాశ్చాత్యనాటక లక్షణముల సరసమన్వయ సంవిధానముతో సామాజికులకును పాఠకులకును ఆపాతమధురము ఆలోచనామృతము నగుచు ఆనందమును ఉపదేశమును అందించుచు రసజ్ఞమనోజ్ఞమై రాజిల్లినది.



# జగజ్జ్యోతి

## [నారాయణదాస విజ్ఞాన భాండాగారము]

శ్రీ వేమూరి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి

### —: ప్ర వే శి క :—

'జగజ్జ్యోతి' యను గ్రంథము హరికథా పితామహులుగా ప్రసిద్ధి చెందిన శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాసుగారు తమ ప్రౌఢవయఃపరిపాక దశలో రచించిన ఆధ్యాత్మిక విజ్ఞాన వ్యాస సంపుటి. నిజమాలోచించగా, జగజ్జ్యోతి యను పేర ఆ గ్రంథమునకే గాక, లోకోత్తర విద్యావైభవము కలిగియుండుటకు తోడు లోకులందరకు తన తాత్త్విక విజ్ఞాన భాండాగారమును పంచియిచ్చు స్వభావము సామర్థ్యము కలిగిన యా గ్రంథకర్తకు గూడ నొక బిరుదముగా సరిపడియున్నది. శ్రీ దాసుగారి మధుర హరికథా గానములు, సర్వమానవ సౌభ్రాత్ర చర్యలు, ఉత్తమ కవితాశిల్ప సమ్మిత రచనలు, దురూహ్యశాస్త్ర సిద్ధాన్తబోధక ప్రకరణములు తెలుగునాడుకి మాత్రమే కాక యావద్భారత దేశానికి జగజ్జీవితానికి గూడ ప్రకాశము నొసగిన ప్రదీపాలు. అన్నిటికన్నను, ఆయన అంతిమకృతి యనదగిన యీ జగజ్జ్యోతి సర్వాతిశయదీప్తియుతము.

శ్రీవారికి 'జగజ్జ్యోతి' పదముపై విశేషాదరము కలదు. గ్రంథాదిలో ప్రార్థనమునందు 'ద్వాదశాత్మా! జగజ్జ్యోతీ! ప్రభాకరా!' అని సూర్యుని

సంబోధించినారు. వారి యిష్టదైవములలో సూర్యనారాయణుడు ప్రధానుడు. అసలు తనకు తల్లిదండ్రులు సూర్యనారాయణ యనియే పేరు పెట్టిరట. వారలకుగూడ సూర్యోపాసన యుండెడిదని, ఆ దేవుని యనుగ్రహముతోనే వీరి యావిర్భావము సంభవించెనందురు. కనుక దాసుగారు స్వయముగా సూర్యాంశ సంభవులు, మానుషరూపము దాల్చిన జగజ్జ్యోతి యని చెప్పవచ్చును. ఆ త్రయీమయుని ప్రసాదముచేతనే దాసుగారికి వేదవేదాన్తాది విద్యలన్నియు నాజన్మసిద్ధములైనవి. కృతజ్ఞతతో సూర్యనారాయణ శతకమును గూడ వారు రచించిరి. అసలు ఆర్యజాతికి సూర్యుడు ప్రత్యక్షదైవమాయె, అందులోను ద్విజులకు సవితృ దేవత ప్రథమోపాస్యము గదా! ఏ విధముగా చూచినను, కృతికర్త ఏన్నుకొనిన గ్రంథనామము సముచితమైనదే.

సాధారణముగా ప్రతి యుత్తమ రచనయు తద్రచయిత యొక్క యసాధారణ కృషికి ఫలితముగ నుండును. కృతికర్త తన జవసత్త్వములను రక్త మాంసములను గూడ ధారవోసినపుడే యేదేని గొప్ప గ్రంథము వెలువడుచుండు నందురు. కాని దాసుగారి వంటి యాశుకవితా ధురీణులకు అపార దేవతానుగ్రహ పాత్రులకు విశిష్ట తపశ్శక్తి సంపన్నులకు దివ్యమహిమాన్వితులకు అంతటి కష్ట నిష్ఠురములతోను వ్యయప్రయాసలతోను పనిలేకుండగనే శాస్త్ర కర్తృత్వము సుసాధ్యమగుననుట తథ్యము. అయితే జగజ్జ్యోతి వంటి గ్రంథరాజమును రచించుటకు కావలసిన నిఖిలశాస్త్ర నిష్ణాతృత్వము గడించుటకు దాసుగారు కూడ కొన్ని దశాబ్దములు శ్రమించియుందురనుకొనవలసియున్నది. ఎట్లైనను, దాసుగారు తమ వివిధ కళా వ్యాసంగముల మధ్య ఇట్టి సమగ్రశాస్త్ర విజ్ఞాన సర్వస్వమును రూపొందించ గల్గినారంటే అద్భుతావహమైన విషయమే. ముఖ్యముగా గాయకులు కవులు నటులు ఇతర కళాకారులు గురుకుల క్లేశ సాధ్యములయిన గణిత జ్యోతిష తర్క-వ్యాకరణ మీమాంసాది శాస్త్రముల జోలికి పోజాలక యుండుట కద్దు. అందు

లోను సాంఖ్యము యోగము ఉత్తరమీమాంస యను పరతత్త్వ దర్శన రహస్యములను అధిగమించ గల్గుట మరింత యరుదు. దీనిని బట్టి గూడ దాసుగారు కారణజన్ములే గాని సామాన్య మానవకోటికి చెందిన వ్యక్తి కాదని తెలియుచున్నది. లేకున్నచో మునుపటి మహా మేధావు లలో ఎన్నదగిన కాళిదాసు, త్యాగరాజు, శంకరభగవత్పాదులు మున్నగు వారిలో గూడ కన్పట్టని సర్వతోముఖ ప్రజ్ఞావిశేషము సకల కళావిశారదత్వము దాసుగారిలో మేళవించి యుండుట సాధ్యపడు టెట్లు? సరస్వతియే యిట్లవతరించి యుండుననుసూహ గూడ సమంజసమే యని తోచుచున్నది.

అలనాడు వ్యాసమునీంద్రులకు నిఖిలవేదశాస్త్ర సంవిధానము కన్నను పురాణేతిహాసాది రచనమే అధికప్రీతి దాయకమయ్యెను. అందులోను శ్రీమద్భాగవత కథనమే ఆత్మసంతృప్తి జనకమైనదట, తుదకు బ్రహ్మసూత్ర గ్రథనమే యాతని యశేష విద్యావైభవ పర్యాప్తి సూచకమైన సంగతి తదజ్ఞు లెరిగినదే. నేటికిని విద్వద్వరిష్ఠులరీతి యట్లులే యుండునని అభిజ్ఞుల యూహ. దీనికి నిదర్శనముగా దాసుగారుకూడ లౌకిక విద్యలందుగాని ఐహిక వ్యాపారోద్యోగములందుగాని శ్రద్ధ వహింపక నిరంతర భగవత్కథాగాన సరళినే అభిమానించిరి. అంతటితో నాగక ఋగ్వేద సూక్తములను ఉపనిషత్తులను భగవద్గీతను విష్ణుసహస్ర నామావళిని లలితాసహస్ర నామావళిని తెలుగు సేయుటకు గడంగిరి. తుదకు సర్వశాస్త్ర పురాణసార మనదగు జగజ్జ్యోతి యను స్వతంత్ర దార్శనిక గ్రంథమునుగూడ నిర్వహించి తృప్తి చెందిరి. ఈ రచనలనుండి శ్రీ వారు ఆశించిన ఫలముకూడ అసామాన్యమైనదే. స్వార్థపరత లేని దాసుగారికి తన గ్రంథములద్వారా కీర్తిగడించుటగాని ద్రవ్య సముపా ర్జనగాని లక్ష్యముకాదని వేరే చెప్పవలసిన పనిలేదు. కలియుగప్రభావము చేతను విదేశీయ యాంత్రిక నాగరికతానుసరణ వ్యామోహ వశమునను మనదేశమున శుష్కప్రాయమై పోవుచున్న సదాచారనిష్ఠకు సనాతన

భారతీయ సంస్కృతికి ఉజ్జీవనౌషధిగా ఉపకరించగల యుపదేశ సారముగా తీర్చబడియున్నది యీ జగజ్జ్యోతి. కనుక లోకానుగ్రహ కాంక్షయొకటే దాసుగారి యాశయమని నిర్ధరింపవచ్చును. "లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి" అను భగవద్గీతా వచనము ననుసరించియే తన సహస్రమాసోపరి దీర్ఘాయుష్యమును నిష్కామ కర్మయోగమున గడపి తరించిన జీవన్ముక్తుడు శ్రీ దాసుగారు. ఆయనలాటి వ్యక్తి "నభూతో నభవిష్యతి" అని యాబాలగోపాలము ఎగిరిన విషయము. ఇందుకు తోడు కాలక్రమేణ యీ యుగములో ఆర్షసంస్కృతి శిథిలమయి పోవుచేగాక, శ్రీవారి వంటి సర్వతంత్ర స్వతంత్రులు సకల కళాభిజ్ఞులు ఇంకొక మారు ఇప్పట్లో లభ్యమగు అవకాశము కానవచ్చుట లేదు. ఈ కారణమువలన గూడ శ్రీవారి యాత్మకృత్యమును పరిశీలించుటకు ఉత్సహించుచున్నాను.

దాసుగారు జీవించియున్న కాలములోనే వారి మహత్త్వకవిత్వపటుత్వ సంపదలను గుర్తించి యెందరో మేధావులు వారిని కొనియాడి బిరుదములు బహుమానములు నివేదించి సత్కరించిరి. ఆతడజాత శత్రుడు. కొంద రాయనను అష్టసిద్ధియుతుడనిరి, మరికొందరు బ్రహ్మవేత్తయనిరి, ఇంకా కొందరు అవతారపురుషుడనిరి. ఇంతటి సర్వజనాకర్షణశక్తియు, సర్వలోకాహ్లాదకర విశేషమును దాసుగారి కెట్లు అబ్బెనో గమనించుటకు జగజ్జ్యోతి ప్రారంభమున వ్రాసిన "వంశావళి" పద్యములు కొంతవరకు ఉపకరించును.

శ్రీ నారాయణదాస విజ్ఞాన భాండాగార మనదగియున్న 'జగజ్జ్యోతి' గ్రంథమందలి ప్రకాశముల నొక టొకటిగా జిజ్ఞాసాపూర్వకముగా విమర్శ గావించుటకై యారంభింపబడిన నా ఈ సమీక్షకు భూమిక ఇంతవరకు అయినది. ఇక సమీక్షా ప్రాంగణ ప్రవేశికగా గ్రంథారంభమందు శ్రీ దాసుగారు వ్రాసిన 'వంశావళి' పద్యములు, 'ప్రార్థనము' అను ఖండముల బరిశీలించుట యొప్పును.

(శ్రీ) దాసుగారికి తన పూర్వులపై దృఢమయిన భక్తివిశ్వాసము లుండెనని ఈ 'వంశావళి' పద్యముల ధోరణి రుజువు పరచుచున్నది. ఆయన తన బాహ్యప్రవర్తనయందు ఒక్కొక్కపరి పోకిరివలె కన్పట్టుచుండినను, అంతఃకరణము మాత్రము ప్రాచీనార్య సంస్కృతిపై సదభినివేశముకల్గియే యుండెననుట సత్యము. ఈ పద్యావళి కేవలము తన యుత్కర్షను తన పితృ మాతృవర్గములోని వారల యౌన్నత్యమును ప్రశంసించుకొనుటకే యుద్దేశింపబడెననుటకు వీలులేదు. అయితే మానవ మాత్రులలో ప్రతిష్ఠావాసన యేమాత్రమును లేని వారు కడు నరుదనుట తథ్యమే కావచ్చును. అందులోను రజోగుణ సంపర్కమే యొకింత యేని లేని కవులుగూడ దుర్లభులనుటయు నిశ్చయమే. కాని జగజ్జ్యోతి రచనా కాలమునకు దాసుగారిలో చిన్నతనమునుండియు కన్పట్టిన నిజాయితీకి పైపెచ్చు జ్ఞానవైరాగ్యములు గూడ నిరూఢములైనందునగాబోలు వారి హృద్గతములు అద్దములోవలె సుస్పష్టముగా తన రచనలో ప్రతిఫలించినవి. తనలో నేదోమంచియు, నేదోచెడ్డయు, గూడ సమ్మిశ్రమై యుండి వివిధ దశాంతరములలో మానవ సహజములైన సుఖదుఃఖములకు తావిచ్చుచున్నట్లును, చెడును నివర్తించి క్రమముగా ఊర్ధ్వభూమికల నధిరోహించుటకుగాను దేవర్షి పితృప్రసాదము ఎంతేని యావశ్యకమని తోచుచున్నట్లును, ఈ 'వంశావళి' 'ప్రార్థనము'ల యందు వ్యక్తము చేసియున్నారు. ఇప్పట్టున గమనించదగిన భాగములు దిగువ నుదాహరింపబడుచున్నవి.

"కావ్య రచనకు వాల్మీకి కావలయును, తగును వ్యాసుడొకండె శాస్త్రంబు తెలుప శక్తి లేమి నెఱిగియు లజ్జన్గొఱంగి, వేత్తవలె నటియించెద విధివశమున" "తెలిసీ తెలియని నరపశువను నేను. సర్వజగదుపకారకముగా హాయిగా సూర్యేందుల్లు నన్ను బెంచుము. ధర్మమార్గము నుండి నను జాఱిపోనీకు మోజగన్మాతా! నిన్ను తెలిసి వర్ణింపనేరను."

ఇంతేకాక, ప్రతివ్యక్తి యొక్క చరితయు గుణములును ముఖ్యముగా మూడు అంశములపై నాధారపడియుండును. తన పూర్వజన్మ

కర్మల సంస్కారములు, ఈ జన్మ నొసగిన వంశీయులనుండి సంక్రమించు భౌతిక లక్షణములు, తాను పెరుగుటలో పరిసర ప్రకృతినుండి పొందిన ఉత్తేజము అనునవి సాధారణముగా సమ ప్రాధాన్యము వహించును. ఒక్కొక్కప్పుడు ఏదోయొక యంశము తక్కిన వానికన్న ప్రాబల్యము చెందుటయు కద్దు. ఈ నిజమును గుర్తెరిగినవారు గావున దాసుగారు తన వంశీయుల విజ్ఞానౌన్నత్యమువలన కూడ ప్రభావితుడై తాను నిట్టి గుణశక్తి వైశిష్ట్యములతో విరాజిల్లుచున్నట్లుగా భావించినారు. ఈ భావనతోనే తన వంశమునకు మూలపురుషు డనదగియున్న గోత్రఋషి భారద్వాజుని గూర్చి ఒక పద్యములో

"నీ మూలము నాగోత్రము, నామంచియు జెడ్డ నీదె, నడిపింపుము న
న్నీ మది కొలది న్మాదృశ పామర జన కల్పభూజ, భారద్వాజా!"

అని ప్రార్థించినారు. జగజ్జ్యోతి గ్రంథమును ప్రత్యేకించి అంకితము అను పేరుతో సమర్పింపక పోయినను, ఆరంభములో

"భరద్వాజ, తపస్విరాజ, రవి నిభతేజా! అవధరింపుము"

అన్నినుడువుటలో ఈకృతికి భరద్వాజ మహర్షియే ఆలంబనము, సాక్షి, గమ్యము అను విషయమును సూచించియున్నారు. ముఖ్యముగా నీపద్యములో తానొక పామరుడనని సవినయముగా చాటుకొనుటకు గూడ సంకోచించలేదు. నిజమాలోచింపగా, వ్యాస వసిష్ఠ భరద్వాజాది మహర్షులు చిరంజీవులు, ఆర్తితో నుపసేవించు జిజ్ఞాసువులకు నిత్య సన్నిహితుగానుండి సంశయనివృత్తి గావించి ధర్మపథమున ప్రోత్సహింతురు. ఆది శంకరులకు వ్యాసభగవానులు సాక్షాత్కరించి, పరీక్షించి, ఆశీర్వదించిన కథ యందరకు తెలిసినదేగదా! వసిష్ఠులు యుగయుగములందు ఇక్ష్వాకు వంశపు రాజన్యులచే సేవనందుటచేగాక నేటికిని జ్ఞానయోగపరులగు తీవ్ర సాధకులకు సూక్ష్మరూపమున దివ్యోపదేశము నొసగుచుందురని వినికి, నేటి దివ్యజ్ఞానసమాజమువారి సిద్ధాంతములలోగూడ నిట్టి నమ్మకము రూఢమైయున్నదందురు. వాల్మీకి రచిత రామాయణముగాక మరే

యుతర రామాయణమందో భరద్వాజుని గూర్చి యొక యాఖ్యాయిక యున్నట్లు వింటిమి; శ్రీరామచంద్రుడు పరిపాలించు కాలమున ఒకపరి వనాంతరమున కుటీరగతుడైన భరద్వాజుని దర్శించి రాజోపచారముల స్వీకరించుచు అనుగ్రహించవలసినదని ప్రార్థించగా, మహర్షి తాను అనేక యుగములనుండి తపోనిష్ఠలోనుండి రామావతారముల నెన్నింటినో చూచియుంటిననియు తనకు దైవోపలబ్ధమయిన సౌకర్యములను మించి భోగభాగ్యములతో పనియేమీ లేదనియు, చెప్పి వైరాగ్య ప్రబోధము గావించిరట.

హరిభక్తి ప్రచారమున ప్రహ్లాద నారద పరాశరాది పరమభాగవతోత్తములతో సాటియగు దాసుగారికి గూడ భరద్వాజుల సాక్షాత్కృతియో, ధ్యానప్రత్యక్షమో అయియుండు ననుటకు సందేహము లేదు. ఈ కలికాలమున గూడ యిట్టి యనుభూతులను విశ్వసింపవలసిన దేనా? యని ప్రశ్నింతురేమో? శ్రీ దత్తాత్రేయోపాసకులని ప్రసిద్ధిగాంచిన వాసుదేవానంద సరస్వతీస్వాములు ఇటీవలనే తమ యష్టసిద్ధిమత్వమును ప్రదర్శించుటేగాక అనేకులకు దత్తాత్రేయ దర్శనభాగ్యము గూడ ప్రసాదించి యుండుటను స్వయముగా నెరిగిన పెద్దలు చెప్పగా వినుటయైనది.

ఏతావతా చెప్పదలసినది యేమనగా, శ్రీ దాసుగారు ఎంతటి స్వతంత్రాలోచనా తత్పరులో అంతటిసనాతన ఋషిధర్మానుయాయులు; ఎంతగా ఒరుల మాటకు లొంగక లెక్కింపక గడుసరిగా వర్తించియుండిరో, శ్రుతి స్మృతులయందు, పూర్వాచార్యులయందు, తన వంశదీపకులైన పూర్వులందును, అంతటి అడకువ ఆదరము కలవారు అను విషయము మనుస్మృతిలో చెప్పినట్లు.

యేనాస్య పితరో యాతాః యేన యాతాః పితామహాః।
తేన యాయాత్సతాం మార్గం తేన గచ్ఛన్ నరిష్యతే॥

అను సూత్రమును శక్తికొలది ఆంతరంగికముగా నమ్మి నడచినవారు దాసుగారు. కనుకనే తనకు ఈశ్వరావేశముచేతనో, అనేక జన్మార్జిత

పూర్వపుణ్య సంసిద్ధి చేతనో జన్మతః లభించిన ఉద్దామగుణ వైభవమం తయు తన స్వార్జితమేయని యెంచక, తన వంశములో మున్ను ప్రఖ్యాతి గాంచిన మహనీయులలో కరుడుగట్టియుండి, తనకు వారి యనుగ్రహము చేతనే వారసత్వములో భాగముగా లభించెనని యూహించి యుందురు. అట్టి యుపకారమునకు తన కృతజ్ఞతా భావమును వెల్లడిచేయునవియే 'వంశావళి' పద్యములు.

ఈ పద్యముల సాయమున శ్రీవారి గుణవిశేషములను పేర్కొన దలచి, యాయా పూర్వీకులకు తన పద్యములలో దాసుగారు అనుసంధించిన విశేషణ పదములను సంగ్రహించి, యాపదములను నాలుగు గణములుగా విభజించి పరిశీలింపగా అవి యన్నియు దాసుగారియందు మూర్తీభవించియున్నట్లు తోచినది. మొదటి విశేషణగణము: మారాకారుడు, ఇహపరతంత్రవేత్త, త్యాగభోగరాయుడు; ఇవి స్థూల దేహ స్వరూపమును వర్ణించునవి. రెండవ విశేషణ గణము: మొనగాడు, ప్రభావమున నెదురులేనివాడు, శాత్రవ భీకరుడు, భూసుర క్షాత్రతేజము ల్మూర్తిగొన్న పోలుపువాడు, విక్రమశాలి, బ్రాహ్మణ చక్రవర్తి, వైదిక లౌకిక వైభవోపేతుడు ఇవి సూక్ష్మదేహస్వరూపమును వర్ణించునవి. మూడవ విశేషణగణము: గీర్వాణ వాగ్విశారదుడు, అఖిల వేద శాస్త్ర నిపుణుడు, కోవిదశిరోమణి, పండితాగ్రణి, ఆచార్య సార్వభౌముడు, జగత్సమ్మానితాచార్యుడు, సరస్వతి మగరూపున బరగువాడు: ఇవి కారణ దేహస్వరూపమును వర్ణించునవి.

నాలుగవ విశేషణగణము : బహుతపః ప్రభావుడు, అన్నదాత, ఈవికి వేల్పుజెట్టు ఉదారుడు, సత్వగుణప్రధానుడు, వైదికుల తుదిమెట్టు, గోత్ర పావనుడు ఇవి మహాకారణ దేహస్వరూపమును వర్ణించునవి.

ఈ సందర్భములో ప్రధానముగ గమనింపదగిన విషయము ఏమంటే, పూర్వమునుండియు చెప్పుకొను నానుడులుకొన్ని చూడగా సమస్త సద్గుణములు ఒకే వ్యక్తి యందు కానవచ్చుట ఈ ప్రపంచ

సృష్టిలోనే అరుదైన విషయము అని. లక్ష్మియున్నచో సరస్వతి యుండదు. సరస్వతీ కటాక్షమున్నచో లక్ష్మీప్రసాద ముండదు. "నైవ వ్యాకరణజ్ఞమేతి పితరం, నభ్రాతరం తార్కికం...కవితాకన్యా." అన్నట్లు కవిత్వమున్నచోట, శాస్త్రవైదుష్యము కొరవడుచుండును. కాని 'ఆట పాట మాట మీటలమేటి యని యశేష జనులచే ఆరాధింపబడి దాసుగారిలో, సకల దేవతాత్మకుడై సమస్త కల్యాణగుణాశ్రయుడైన శ్రీ విష్ణుదేవుని యందునతె, తన పూర్వులలో ఒక్కొక్కరినుండి ఒక్కొక్క విశేషము ప్రాప్తించి యవి యన్నియు కలిసి యొక విశిష్ట పాకములో మేళవించి, వారిని సర్వతోముఖ ప్రజ్ఞాళువుగాను నిఖిల శాస్త్రకళా నిష్ణాతునిగను తీర్చినవి యని చెప్పవచ్చును.

శ్రీ దాసుగారి ప్రబోధ ప్రచార కృషి పూర్తికావలెనంటే, హరిదాసులుమాత్రమేగాక శాస్త్ర విద్వాంసులు గూడ చాలమంది వారి అడుగుజాడలలో మెలగి నిష్ణాతులు కావలసియున్నది.

'జగజ్జ్యోతి' గ్రంథమునందు ప్రకాశములను పేరుతో మొత్తము ఎన్మిది ప్రకరణములు ముద్రితములై యున్నవి. మొదటి నాలుగు ప్రకరణములు గల ప్రథమ సంపుటము 1959 వ సంవత్సరములో ప్రభుత్వము వారి విరాళములతో ప్రకటింపబడినది. మిగతా నాలుగు ప్రకరణములు గల ద్వితీయ సంపుటము 1960 వ సంవత్సరములో ఇతర మహాజనుల విరాళములతో ప్రచురింపబడినది. ప్రచురణకర్తలు, విజయనగరము నందలి శ్రీ ఆదిభట్ల నారాయణదాస అముద్రిత గ్రంథప్రచురణ సంఘము వారు. రెండు సంపుటములును కలిసి అచ్చులో 879 పేజీలుండును.

గ్రంథాదియందలి విజ్ఞాపనలో గ్రంథరచనా ప్రారంభము 1922వ సంవత్సరమున అని తెలుపబడినది. దీనిని బట్టి అప్పటికి శ్రీ దాసుగారికి 58 యేండ్ల వయస్సుండెననుకొనవచ్చును. కనుక వారికి మంచి ప్రౌఢ వయః పరిపాకము కూడ కల్గిన పిదపనే యీ విజ్ఞాన సర్వస్వాత్మక గ్రంథ

రచన సాగెనన్నమాట. అయినను, ఇదే వారి చరమ రచన అనుటకు వీలులేదు; ఇంకను ముదిమిపై కొన్నాళ్ళ తరువాత కూడ వారు 'లలితా సహస్రనామస్తోత్ర'మున కనువాదము తల్లి విన్కి మొదలయిన యుద్గ్రంథములను రూపొందించక పోలేదు. బహుశః జగజ్జ్యోతి గ్రంథమును వారే స్వయముగా పునఃపరిశీలన కావించి పునరుక్త్యాది దోషాభాసములను తొలగించి సర్వాంగ సుందరముగా తీర్చిదిద్ది వెంటనే అచ్చొత్తింపజేయు భాగ్యము తెలుగు ప్రజలు నోచుకోలేదు కాబోలు! లేదా, జిజ్ఞాసువుల శాస్త్రాధ్యయన దీక్షను తీవ్రతరము చేయనెంచి దాసుగారు తమ జగజ్జ్యోతి ప్రకరణమును అనేక ఖండశః వదలి ఆ యా ఖండములలోని మూలసూత్రములను పాఠకులే అన్వేషించుకొనుడీ యని సవాలు చేసినట్లు ఊరుకొనిరేమో!

మొత్తము మీద 124 శీర్షికలక్రింద యీ గ్రంథమందలి వ్యాసములు విభజింపబడియున్నవి. కొన్ని శీర్షికలు ఒకే విషయమును మఱల మఱల కొద్ది తేడాతో చర్చించునవిగా కన్పట్టును. ముఖ్యముగా విషయ సూచికను పైపైన తడవిచూచు వారి దృష్టికి ఇవి పునరుక్తి దోషములుగనే భావించవచ్చును. కాని యీ దోషములు ఆభాస మాత్రములే. లోతునకుదిగి పరిశీలించి సమీక్షించినట్లైనచో ఆ విధముగా చెప్పిన యంశమునే మఱల చెప్పు ఫక్కికూడ ఒక క్రొత్త యలంకారముగనే తోచగలదు. అంతేగాని యేమాత్రము వినుగుపుట్టింపదు, వెగటు గొల్పదు. సంగీతమునందు కొన్ని విశిష్టములైన ప్రస్తారములు తిరిగి తిరిగి వినపడినను హృదయంగమముగనే యుండునుగదా! దాసుగారికి సంగీత శాస్త్రమునందు మున్ముందు కలిగిన యభినివేశము సారస్వతరంగమునందు ప్రవేశించిన పిదపగూడ సన్నగిల్లక తొల్లిటి యభ్యాసము తత్త్వబోధన ప్రక్రియలోగూడ ప్రసరించి ఇదొక నవ్యరీతిలో పాఠకుని చిత్తమున ముఖ్యాంశములను శాశ్వతముగను దృఢముగను హత్తుట కుపకరించెననుకొందము.

ప్రకాశిక :

ఈ గ్రంథములో దాదాపు పదివేల వాక్యము లుండవచ్చును. అందులో సామాన్యముగా ప్రతియొక్క వాక్యముకూడ ఒకానొక సిద్ధాంతమును ఉద్ఘాటించు వచనమై యున్నది. షడ్దర్శనములు, అష్టాదశ విద్యలు, చతుష్షష్టికళలు అధిగమించిన వారికిగాని దీనిలో కొన్ని సిద్ధాన్తముల మూలములు ఎఱుక కందవు. కొన్ని వాక్యములకు బ్రహ్మ సూత్రములు, మఱికొన్నిటికి ఉపనిషత్తులు, ఇంకను కొన్నిటికి భగవద్గీతలు, వేరె కొన్నిటికి పురాణగాథలు, కొన్నిటికి ప్రకరణ గ్రంథములు, ఇంకొన్నిటికి తర్క-వ్యాకరణ మీమాంసాది శాస్త్ర చర్చలు మూలములై యున్నవి. కొన్నిపట్ల శ్రీ దాసుగారు స్వతంత్రాలోచనతో యోచించుకొని నిర్ధారించుకొన్నట్లు కన్పడు నవీన మతము గోచరించుచుండును. ఆ యా ఘట్టములందు సనాతన సంప్రదాయాభిమానులతో వారేకీభవించనట్లు సుస్పష్టమగును. అయితే శ్రీ శంకరభగవత్పాదాది ప్రాచీనాచార్యులుగూడ పూర్వమీమాంసాది శాస్త్రార్థములను పూర్వపక్షముగావించి యుండలేదా, అట్లే వీరును అనుకొందము.

విషయానుక్రమణికలో ఒక్కొక్క ప్రకాశమునందున్న శీర్షికలన్నింటి పేర్లు వివరముగా ఇవ్వబడినవి. అయితే, ప్రతి ప్రకాశాంతమందు ఆ యా ప్రకాశమందలి విషయమును స్థూలముగా నిర్దేశించుటకు ప్రకాశ ప్రథమ శీర్షికనే ఉట్టంకించి దాని నిర్వచనమే ఇందున్న సంగతియని సూచించినారు. కనుక స్థూలముగా చూచినతో యీ గ్రంథమందలి విషయము నిట్లు నిరూపించవచ్చును. ఇప్పట్టున ఒక్కొక్క శీర్షికక్రింద వ్యాసమును ఒక్కొక్క కిరణము అని పేర్కొందము.

| ప్రకాశముక్రమసంఖ్య | కిరణములసంఖ్య | విషయము[ప్రకాశము మొత్తం] |
|---|---|---|
| 1 | 12 | దైవపౌరుష నిర్వచనము |
| 2 | 16 | దైవపౌరుష నిర్ణయ నిర్వచనము |

| | | |
|---|---|---|
| 3 | 10 | నిష్కృష్ట ప్రత్యభిజ్ఞాన నిర్ణయ నిర్వచనము |
| 4 | 42 | కాలగతి నిర్ణయ నిర్వచనము |
| 5 | 12 | శబ్దసిద్ధి నిర్వచనము |
| 6 | 9 | పంచమశబ్ద మర్యాద నిర్వచనము |
| 7 | 16 | దైవపౌరుష నిర్ణయ విచారణనిర్వచనము |
| 8 | 7 | నిత్యశుద్ధ బుద్ధముక్త బ్రహ్మస్వరూప నిర్వచనము. |

ఇందు మొదట రెండవ ఏడవ ప్రకాశములందలి విషయములు ఆపాతతః ఒక్కటేయని తోచినను నిజమునకు వివరముల బరిశీలింపగా భిన్నములేయని తేలును. బహుశః వివిధ ప్రకాశములందలి విషయములను విశదీకరించుటకు వేరొక ప్రక్రియను సంపాదకులు అవలంబించి యుండినచో పాఠకులకు మఱింత ఉపకారముగ నుండెడిదేమో! ఉదాహారణకు ప్రతి ప్రకాశాంతమునందు దాని సారాంశమును సంగ్రహించి పొందు పఱచినచో బాగుండును. ఈ ఉద్దేశ్యముతో నేనొక్కింత కృషి గావించి జగజ్జ్యోతి ప్రకాశ సారసంగ్రహమును సమకూర్చి యీ దిగువ నిచ్చుచున్నాను. ఇందులో సాధ్యమయినంతవరకు దాసుగారి వాక్య రచననే ఆధారముగ చేసికొన్నాను.

మొదటి ప్రకాశము :- 1) మర్త్యుల యూహాలకందని దైవమెద్దియో పురుషప్రయత్నములకెల్ల హేతువై మఱి యా ప్రయత్నములను ఫలింప జేయుచున్నది. 2) లోకోపకారమగు వర్తనము వలని ఫలమెప్పటికిని జెడని మనస్సంతుష్టి. నిత్యసంతోషమే పరమపురుషార్థము. బ్రతుకు యొక్క ప్రయోజనము పరమపురుషార్థ సంపాదనమే. 3) లోకోపకారము చేయగల యుపాయ మష్టాదశ విద్యారూపముగా ననాదికాలము నుండియు లోకోపకారపరాయణులగు మహాత్ము లుపదేశించుచువచ్చిరి. 4) అష్టాదశ విద్యారహస్యముల నారితేరినవారికిదప్ప సర్వమును దైవమే యను వివేకము కలుగనేరదు. 5) దేవుడే యీ జగము. మఱి యీ

జగమే దేవుడు. దేవునకును జగత్తునకును భేదమేమియును లేదు. దైవ పౌరుషములకును భేదమెయ్యదియును లేదు. 6) జనులు తమతమ రుచులం బట్టి యా యా యుగానుసారముగా వేదశాస్త్రార్థము గావించుకొని, మానసికముగాను వాగ్రూపముగాను శరీరస్వరూపముగాను స్మరించుచు సంకీర్తించుచు భగవంతు నారాధించుచున్నారు. మఱి యే జీవమున కైన హింసజేయక సకలభూత దయాపరులై యే కోరికలులేక తమ మనోవాక్కాయకర్మములను భగవదధీనము జేయువార లుత్తములు. 7) ఈ సమస్త జగత్తును వికృతియే. సుషుప్తియే ప్రకృతి. స్వప్నజాగరములు మనోవికృతి. ప్రకృతి వికృతుల ప్రవృత్తి కాధారమాత్మ. ఆత్మ నిర్గుణము. 8) ప్రకృతి యనిత్యము. మఱి ప్రకృతి కాధారమును కారణమును నగు నాత్మ నిత్యము. 9) స్మృతిదశ శక్తి, విస్మృతిదశ శివుడు. చూచునది చూడబడునది యీ రెండు నొక్కటియే. అది ఆత్మ, అదియే బ్రహ్మము. ఇట్లు "ద్వైతాద్వైత సమం బ్రహ్మ" అనునది పొసగును. కనుక దైవపౌరుషము లను సమబలముగా నొప్పుకొనక తీరదు.

10) సకల ధర్మములును సత్యదయలలోనే నిమిడియున్నవి. "భక్తిర్జ్ఞానాయకల్పతే" "నాద్వైతవతః కర్మాణి విధీయన్తే." సర్వజగమును విష్ణుస్వరూపముగాజూచు యతులకుదప్ప, తక్కిన మనుష్యులందఱికిని బౌరుషము తప్ప దైవము లేనేలేదు. యతులకు దైవముతప్ప పౌరుషము లేనేలేదు. 11) నైష్ఠికదౌర్జన్యము, ఆస్తికులమను దంభవేషముతో పామరజనులను బెదరించుట, తమ సుఖముకొఱకై యితరులకు వృథావ్యయ ప్రయాసముల గలిగించుట యుపశమిల్లినపుడుగదా మనుష్యులు మనుష్యులనిపించు కొందురు. 12) వాస్తవముగా నెందఱు జీవులో యన్నివిధముల కర్మములు ధర్మములు మతములును గలవు. మొత్తముపై ననంత మతముల సారము పదేనుగా విభజింపబడినది. స్వసుఖాభిలాషియగు చార్వాకుని మతము సకలలోక విరుద్ధమగుటయే గాక దుర్బుద్ధిమూలకము. ఇది సకల జంతువులకు సహజమైయున్నది.

హింస ద్వైతమునకు, మఱి యహింస యద్వైతమునకును లక్షణములు. ఈ దేహయాత్రకు చార్వాకమతము మొదటిమెట్టు, వేదాంతసారమగు జగద్గురు శంకరాచార్య మతము తుదిమెట్టు, నడుమనున్న మెట్లు మొత్తము పదుమూడు. 13) కాలమునుగాని పంచభూతములనుగాని తన పురుషప్రయత్నానుసారముగ నడుపుట యసాధ్యమని వివేకవంతు డెరుగడా ? "దైవాధీనం జగత్సర్వం" దైవాధీనము పౌరుషముగాని, పౌరుషాధీనము దైవము కాదు. 14) జ్ఞాని తనకు లభించిన కష్టసుఖ ముల నొక్క తీరుగా నుపేక్షించి యేకాగ్రచిత్తముతో సమస్త జగత్కా ర్యములు కల్లలనిగాని, కేవల దైవకృతములనిగాని సిరూఢముగా భావిం చుచు మంటి నంటియు నంటని కుమ్మర పురువు చందమున నిర్లిప్తుడై నిత్యానందమున నుండును.

రెండవప్రకాశము :- 1) చతుర్విధాభినయములకును జగత్సృష్టి స్థితి లయతత్త్వము నిర్దేశించుటకు మఱియు నతీంద్రియమగు దైవముయొక్క యునికిని స్థిరపర్చుటకును బురుషప్రయత్న రూపకమగు పౌరుషమే కారణము. 2) ఉభయ తారకముగా సకలలోకోపకారకమగు తెన్నున దన కాప్తులగు తల్లిదండ్రులు మొదలగు పెద్దలు తన కొనర్చు నుపదేశ మాప్త వాక్యము - ప్రత్యక్షానుమానోపమాన ప్రమాణము లొకప్పుడు పనికిరాక పోవచ్చునుగాని యాప్తవాక్యమును నమ్ముకొన్నవారి కెన్న డును గీడు వాటిల్లదు. అవ్యక్త శబ్ద బ్రహ్మ మపౌరుషేయమే యైనను వేదములు పౌరుషేయములే, కాని యవి యపౌరుషేయములని చెప్పుట లోకోపకారార్థమై మునులుచేసిన యర్థవాదము. అయినను వేదశాస్త్ర ముల సాయముతోనే తత్త్వనిర్ణయము చేయగల్గుదుము. ఆశక్తి యురు దుగా లభించును. సందర్భమునుబట్టి భిన్నార్థములు ఒకే వేదమంత్రము నకు జెప్పబడవలసియుండును. తక్కిన జంతువులకన్న మనుష్యులు కేవల లోకోపకారమునకై పాటుపడుట మాత్రము సార్థకమైన పౌరుషకర్మము. 3) "వేదాదృతేఽపి కుర్వన్తి కల్పైః కర్మాణి యాజ్ఞికాః, నతుకల్పై

ర్వినా కేచి న్మంత్ర బ్రాహ్మణ మాత్రకాత్" అని కుమారిలభట్టు నిర్దేశించినట్లు శ్రౌతస్మార్త కర్మములన్నియు నిదివఱకు వివేకవిహీనులైన క్రూర మానవులనంత ప్రవచనమూలకములగు ననంత సంఖ్యాక వేద శాఖలను సమన్వయ మొనర్చి "అహింసా పరమోధర్మః" అను నిత్య శ్రేష్ఠధర్మము ననుసరింపక తాముచెడి యొరులను జెఱచుచుంట దుర్దైవము పాటు. 4) "పశుమాలభేత" యను వాక్యమునకు సరిగా నర్థము చెప్పవలెనన్న, జంతువులను దేవతాప్రీతికై చంపవలసినదను నర్థము రవంతయైనను జెప్పనొల్లదు. చిత్తమును దైవాయత్తము చేయవలయు నని చెప్పవచ్చును. లేదా, దేహారోగ్యమునకై పశువునుండి పాలు కోరు వాడు ఆ పశువును దాని లేగదూడను లాలింపవలయునని చెప్పవచ్చును. సకలప్రాణి లోకోపకారమే విహితమగు పౌరుషము.

మూడవప్రకాశము :- 1) 'ఊరికి జోగివెఱ్ఱి, జోగి కూరు వెఱ్ఱి' అన్నట్లు సంసారి కాని జోగి యూరికి రానేరాడు. మఱియు సంసారములోనున్న వాడు జోగి కానేకాడు. 'బ్రహ్మసత్యమ్ జగన్మిథ్యా' యను గీర్వాణము మాకు దెలియదు, భగవద్గీతలు తెలిసికొనుటకు నిద్రాశనాది లోలురము మే మొకింతయు నధికారులముకాము. మంచినడవడి నొరులకు మేల్చేయుచు బొరబాటున దారితప్పినపుడు పెద్దలబోధను విశ్వసించి తెలివి తెచ్చుకొని తప్పులు దిద్దుకొని సకలజన సమ్మతముగా నడచుకొను చుందుముగాక. "సర్వేజనాః సుఖినోభవంతు" అను మంత్రముకన్న దగు మనుష్యుడు జపింపదగిన మంత్ర మింకెద్దియును లేదు. 2) మనుష్యుడే పనినైనను జరుపలేడుగాని జరిగిన మంచిచెడ్డ లనుభవించక తీఱదు. దైవము పనులన్నియు న్నెఱవేర్చునుగాని తా నెరవేర్చు పనులవల్ల గలిగిన కష్టసుఖములు రవంతయు ననుభవించదు. చావక తీఱని గూనివంపు వలె మనుష్యాది దేహధారులు దైవకృత్యములవలన దమకు వచ్చు కష్టసుఖములు యావజ్జీవ మనువించకతీఱదు. 3) స్వర్గాపవర్గ స్వరూపుడై సమస్త జగద్రూపము యజ్ఞమూర్తియై సకల భూతాన్తర్బహిస్సంగ

తుడై ప్రత్యక్షస్వర్గమై సకలప్రాణి జీవనస్వరూపముగానున్న శ్రీకృష్ణ పరమాత్మను మిథ్యాశ్రౌత కర్మలన్ సాధింపబూనుట యొడిలో నున్న బిడ్డను వెదకుట. రుచ్యములగు నన్నపానములు తన తోడిపాటివారి కిచ్చి తా గుడిచి సుఖింపక స్వార్థపరుల ధూర్త ప్రలాపముల నమ్ముకొని పాలు పెరుగు నేయి మొదలగు తినుబడి పదార్థములన్నియును భ్రాంతులై యజ్ఞము నెపమున నగ్గి బుగ్గి పాల్గావించుకొను మూర్ఖుల దుర దృష్ట మెంతయును శోచనీయము.

నాలుగవ ప్రకాశము :- 1) వేదములు (ఆరణ్యకములు) కేవలము సన్న్యాసులకు మాత్రమే యుద్దిష్టములుగాని, నిద్రాహార విహార సౌఖ్య తత్పరులగు సంసారుల కెంతమాత్రము న్గాదు కాదు. 2) సర్వభూత దయాపరమై యహింసా వ్రతమూలమై సోమరితనము న్మాన్పించి స్వకాయకష్టార్జితము సంపాదించుకొన్న నన్నపానములు తోడిపాటి జనులకు వంతు పంచియిచ్చి "సర్వేజనాః సుఖినోభవంతు" అని జపించు పరమ భాగవతమొక్కటి మనుష్యధర్మమును సర్వలోక శ్రేయస్కరమును సప్రమాణమును సహేతుకమును మఱి వివేక విలసితమని మనుష్యులంద అవలంబించదగిన మతము. 3) బ్రాహ్మణము లడ్డదిడ్డ క్రూరకర్మములను వ్యర్థమగు న ద్రవ్య వినియోగమును వృథోద్యమములను సోమరిపోతు పనుల నుబుసుపోని కథలను బుక్కిటి పురాణములను సోదెలను దంభ వేషములను పామరరంజకములగు పిట్టకథలను ముచ్చటలను వాలకములను మొదలగు బుద్ధిలేని మనోవాక్కాయ కర్మములను బోధించుటకు మును లెంతమాత్ర ముద్దేశింపలేదు. క్రమక్రమముగా వివేకులు వంచకులు స్వార్థపరులీ శ్రౌతవిధానములం గల్పించిరని సిద్ధాంతీకరింపక తీఱదు. జీవహింసయును వ్యర్థకాలక్షేపమును జనుల కన్యోన్య విద్వేషముం బరమకారుణికులును సర్వజ్ఞులగు మునులు వేదవేదాంగముఖమున నెంత మాత్రము న్బోధింపరు బోధింపరు. 4) గోపథ (ఆది) బ్రాహ్మణ శాస్త్రము కాలవశమున నామమాత్రావశిష్ట మగుటచేత త్రైలోక్య

పదార్థతత్త్వజ్ఞానము ప్రస్తుత జనులకు బొత్తిగా లేకుండెను. ఆశాస్త్రమే సమగ్రముగా దొరకినయెడల వాయుస్తంభ జలస్తంభాద్యమానుష ప్రజ్ఞలు ప్రచారమందుండకతీఱదు. 5) సాత్త్విక యజ్ఞదీక్షితులకుం దప్ప నితర జీవులకు గైవల్యానందపదవి యెన్నటికి న్రాదురాదు. మఱియును సంసార తాపత్రయము తప్పదు తప్పదు. 6) ఆ చిచ్ఛక్తి లీలరూపమగు నా యీ దేహస్మృతియే నేగనిపెట్టుచున్న సమస్తజగద్విశేషములకును గారణము. మఱియును నా స్మృతికన్న యథార్థవస్తు వింకెద్దియునులేదు) కావుననే 'ప్రజ్ఞానం బ్రహ్మ, యను మహావాక్యము ప్రవర్తిల్లెను. 7. స్వార్థపరతలేక సకలభూత దయామయుడైనవాని చిత్తమే బ్రహ్మధ్యాన పరవశమగుటచేత నట్టి పుణ్యాత్ముని మనోవాక్కాయ కర్మము లెట్లుండినప్పటికిని లోకులకు మిక్కిలి సంతోషకరులేయగును గాని ద్వేష హేతువులు కావు, సంసారపుం జిక్కులలో మెలగుచుండియును నానా మతములుగల జనులతో వ్యవహరించుచుండియును యోగియైనవాడు తన యంతస్సునకు గామ క్రోధ లోభ మోహ మద మత్సరము లంటనీక కేవల లోకోపకారముకొఱకే తన జీవనము గడుపును. 8) శబ్దబ్రహ్మమాకాశమను నుపాధితో సచ్చిదానందలక్షణమై శాశ్వతమై యున్నది. ఆకాశమునకుగాని యాయాకాశోపాధితోనున్న చైతన్యస్వరూపకమగు నాదబ్రహ్మమ్మునకుగాని యుత్పత్తిస్థితి నాశము లెన్నడును లేవు. చైతన్యాత్మకమగు నాదబ్రహ్మయే యీ సర్వజగత్కార్యములకు మూల కారణము. నాదబ్రహ్మమే యీ జగద్రూపముగా నాకాశోపాధియందు అద్దమందు కొండవలె బ్రతిబింబించుచున్నది. 9) ఈ (జీవ) చైతన్యము శివశక్తిపరస్పర సంపర్క మహిమమున నొదవిన శివశక్తుల ప్రతిబింబము గాని వాస్తవముకాదు. మఱి యీ జగము చైతన్యాత్మక త్రిగుణమయ స్వప్న జాగరసుషుప్త్యవస్థా విశేషమున నొదవిన చైతన్య ప్రతిబింబము గాని వాస్తవము కాదు. ఇంతకు గౌతమ వ్యాసాద్యాప్త వచనప్రమాణమున దేలిన ఫలితము శివశక్త్యాత్మక నిర్గుణపరబ్రహ్మముకన్న వాస్తవ పదార్థమింకెద్దియున్గాదని తేలిన ఫలితము. 10) యథార్థవస్తువు శివశక్త్యా

త్మకమై సర్వజగత్కారణమగు వాసుదేవ పరబ్రహ్మము. అది సర్వదృశ్య జగన్నిషేధావధి. నేతినేతియని యీ జగత్కార్యములందు సక్తతపొందక వైరాగ్యమూనుచే వాసుదేవుని నవవిధభక్తిమార్గముల సేవించుట. ఐహిక సుఖము లాసింపక సకలజగమును నారాయణుడే యనియును సకల భూతదయయును సర్వజన సమతయు స్వార్థత్యాగము లోకోప కార పరతయు గ్గల పరమ భాగవతు నా శివభక్తియు నిఖిల వన జననియునగు బాలాత్రిపురసుందరి తన కన్నబిడ్డలవలె సంరక్షించి సంసా రాంబుధినుండి నౌకవలె దరింపజేసి శివుడను కైవల్యానందవటము జేర్చును. 11) ఈ జగమంతయును మనోవిభ్రాంతి జన్యముగాని వాస్త వముకాదని మాత్రము నిస్సందేహముగా జెప్పగలనుగాని యీ మనో విభ్రాంతికి మూలమేమో సమాధ్యవస్థయందు మాత్రమే గోచరమగును మఱి యట్టి తురీయావస్థ యిట్లుండునని యీ జాగ్రదవస్థ నిర్ణ యింప జాలదు. 12) కాలవ్యవస్థయు నుదాత్తాది స్థాయివ్యవస్థయు అకార కకారాద్యక్షర వ్యవస్థయుం దలపక కేవల స్వరమాత్ర మాలిం చుటచేత "స్వతోరంజయతి శ్రోతృచిత్తం సస్వర ఉచ్యతే" అనునట్లు చిత్తమునకు రంజకమగు ధ్వనిని సంతతము వినుట కాసించు సంగీతప్రేమికుల యదృష్టవంతులే పరమభాగవతులగు జీవులు. 13) శ్రుతి జాతి తాళ నియమముతో విలంబకాలమున గీత వాద్య నృత్యముల ననగా జతుర్విధాభినయములం బ్రవర్తించు మనుష్యుడు జనన మరణాత్మక సంసా రమున యథేష్టముగా సుఖింపగలడు. సత్త్వగుణ ప్రధానుడు లోకోపకా రముగా సత్యముగా బ్రవర్తిల్లుటచేత నియమిత మనోవాక్కాయ కర్ముడై హితమిత మృదువాక్కు మందకటాక్షము మందగమనము నియమిత నిద్రాహార విహారములు కలవాడగుటచేత స్వాధీనోచ్ఛ్వాస నిశ్వాస ముతో భీష్మునివలె స్వచ్ఛంద మరణ సంపల్లాభము పొందుచున్నాడు. 14) "కలౌ పారాశరః స్మృతిః," "దానమేవ కలౌయుగే," "కలౌ కేశవ కీర్తనమ్" వీనినిబట్టి 'పరోపకారార్థ మిదం శరీరమ్' అనునదే పరాశర

స్మృతిలోని ముఖ్య సారాంశముగ స్పష్టపడుచున్నది. "సతాంకే నాపి కార్యేణ లోకస్యారాధనం వ్రతమ్" అని భవభూతి దీనిని విశదీకరించెను.

ఐదవప్రకాశము :- 1) పదునల్గురు ప్రహ్లాదాది పరమభాగవతులు విలసిల్లి శ్రీవిష్ణుస్వరూపమును వెల్లడించుట ప్రాజ్ఞులెల్లరు గనిపెట్టవలసిన ముఖ్యాంశము. ఏ యింద్రియ ప్రవృత్తియైనం గలుగనీక సర్వమున్ విష్ణుమయమని నిరూఢ జ్ఞానమున కేవలానందమున బ్రహ్లాదుడు, నాద బ్రహ్మోపాసనమున హరికథల బాడుచు నారదుడు, సమాధినంది పరాశరుడు, తపస్సుచే బుండరీకుడు, త్రిభువనములకును జ్ఞానోపదేశముచే వ్యాసుడు, సజ్జనారాధనముచే నంబరీషుడు, బ్రహ్మజ్ఞానముచే శ్రీ శుకుడు పురాణ కథనముచే శౌనకుడు, బ్రహ్మచర్యవ్రతముచే భీష్ముడు, బ్రహ్మధ్యానముచే దాల్భ్యుడు, అనశన వ్రతముచే రుక్మాంగదుడు, దుష్టసంహారముచే నర్జునుడు, సధర్మ పరిపాలనముచే బలిచక్రవర్తియు, నవవిధ భక్తిమార్గములచే విభీషణుడును, సార్థపరతమాని లోకోపకార పరాయణులై సర్వ కర్మములును భగవదర్పితముల గావించుటచే పరమ భాగవతోత్తములు నాబరగిరి. 2) దేవతాప్రీతికై మఱియుం దమ శరీరారోగ్యముకొఱకై లోకులకు దైవభక్తి బోధించుటకొఱకై కృష్యాది శ్రమలందిన జనుల మనస్సుల కుల్లాసము పుట్టించుటకొఱకై యన్నపానములచే గుంపు గుంపులుగా జనులందఱుం గూడి వేడుకగా గాలక్షేపము చేయుటకొఱకై యిహపరసాధనముగా యజ్ఞమును శ్రౌత కర్మమును సర్వజగదుపకార పరాయణులు సర్వజ్ఞులుం బరమ కారుణికులునగు మునులేర్పర్చిరి. మునుల యభిప్రాయ మెఱుంగక వారొనర్చిన సూత్రముల కపార్థములుచేసి మాంసాశన వ్యసనపరులు స్వార్థపరులు ధూర్తులు పండితమ్మన్యులు శ్రోత్రియమ్మన్యులగు బ్రాహ్మణ బ్రువులు పశుహింసాది క్రూరకర్మములును భస్మహవ్యములును గల్పించి లోకుల కపకార మొనర్పదగదు తగదు. 3) జ్ఞానస్వరూపుడై, ప్రత్యక్ష దేవుడగు సూర్యనారాయణునకు మ్రొక్కుచుంటకన్న నీవుచేయవలసినయజ్ఞములు

గాని జపములుకాని మఱేయాచారములైనగాని లేవోశ్రోత్రియమ్మన్యుడా! శిక్షక వైయాకరణ ఛాందస నైరుక్తిక జ్యోతిష్కులతో నాకెద్దియు స్పని లేదుగాని యో పశుమారణ దారుణకర్ముడా! యో దంభ శ్రౌత స్మార్తకర్మఠుడా! నీకు దప్పక భూతదయయును సకలజన సమ్మతాచరణ విధానమును బోధించి నిన్నొప్పించి నిన్ను సేవల భాగవతుని జేసినగాని నా చదువు నేర్పున ఫలమేమియీ? ఇంతకష్టపడి గ్రంథము రచించిన సాఫల్యమేమియీ? 4) పాణిని చేసిన 3992 సూత్రములందు దప్పులు పట్టుచు గాత్యాయనుడు 10000 దోషము లుద్ఘాటించుచు 4000 వార్తికము లొనర్చుట కోర్వక పతంజలి కాత్యాయన వార్తికము లను ఖండించుచుం బాణిని మునిని సమర్థించుచు స్వయముగా దానిష్టు లను విరచించెను. పాణిని సూత్రములను వివరించుటయును గాత్యాయ నుని వార్తికములం దఱచుచూచుటయును బతంజలియొనర్చిన వ్యాకరణ మహాభాష్య ప్రయోజనము. కావున (అటులనే) బశుహింసను బ్రతిపా దించునట్లు లోచు శ్రౌతకల్పమును ఖండించుటకొరకు మఱియు నుపని షత్సారభూతమగు "నహింస్యాత్సర్వభూతాని - అహింసా పరమో ధర్మః" అను వాక్యమును సమర్థించుటకొఱకు నిష్టి రూపముగా నీ గ్రంథము రచింపబడెనని ప్రాజ్ఞులెఱుంగవలయును. 5) అందులో (పాణిని, కాత్యాయన పతంజలులలో) ఎవరిది తప్పు, ఎవరిదొప్పు? ఇదిగో నిజమిప్పటికి దేలెను: పౌరుషము తప్పు, దైవమే యొప్పు. దైవమునకు బౌరుషము లొంగక తీఱదు. పౌరుషమునకెల్ల దైవమే మూలము. దైవమే వాస్తవము. మఱియు పౌరుషమంతయు కలవలె మనో విభ్రాంతి మూలమును మిథ్యయునుగాని సత్యమెంతమాత్రమున్నాదు. "ఊరకున్నవాడె, యుత్తమయోగిరా విశ్వదాభిరామ వినురవేమ" 6) శబ్దముల రూపనిష్పత్తిని గుఱించిగాని శబ్దార్థములగూర్చిగాని నానాభి ప్రాయములు ప్రాచీన వైయాకరణు లిచ్చుటచేతను, లక్ష్యలక్షణములు దేశకాలానుసారముగా సకల కర్మములందు మాఱుచుండుటచేతను

మనుష్యులేర్పర్చిన పద్ధతులకు వ్యవస్థ యెద్దియును లేదు. వేదశాస్త్రము లందు మునులు లోకోపకారకములు సర్వభూతదయా పరములయిన కర్మ ములను మాత్రమే యుపదేశించిరని నమ్మవలెను.

ఆఱవ ప్రకాశము :- 1) మనుష్యులలో జాతినీతులు కులాచారములు వావివరుసలు నిహపరతారకములుగా సర్వజ్ఞులగు మునులు లోక సం గ్రహార్థమే దేశకాల పాత్రోచితములుగా నేర్పరచిరి. బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర పంచములను నైదుజాతుల నలరారు మనుష్యులు స్వభా వములగు బుభుక్షాపిపాసలన్నిర్చు పంచేంద్రియ ప్రవృత్తులవలె జీవాత్మ నుభయలోకములం దరింపజేయుచున్నారు. మేముగొప్ప మేమేగొప్ప యని యీపంచవిధ జనులు తమలోదాము కలహించుకొనుట కడుపుతో నల్గిన పంచేంద్రియముల తీరున గోరి తమకుదామే చేటుతెచ్చుకొనుట వంటిది. తమతమ సహజనియత మర్యాదలతిక్రమింపక పరస్పర ప్రేమాను రాగములతో గలిసిమెలసి యిహపరములను సంపూర్ణముగా తరింప గల్గినకాలమే పుణ్యయుగము. 2) ధ్వన్యాత్మక వర్ణాత్మక శబ్దము వాచికాభినయము నామమనంబడుచు వినిపించదగియుండును. కని యగ పర్చదగు నాంగికాహార్య సాత్త్వికాభినయము రూపమనంబడును. సర్వ లోక రంజనముగా జతుర్విధాభినయములం బ్రయోగించి యొరుల సుఖ పెట్టి తా సుఖపడు సజ్జనుడే "తస్మాద్విద్వాన్ ప్రేవవదేత్ పీవన్నృత్యేత్ దానకామా అస్మై ప్రజాభవంతి" అని శ్రుతి పేర్కొన్న మనుష్య గంధర్వుడు, పరమభాగవతుడు. 3) కేవల సత్త్వగుణమైనం గేవల రజో గుణమైనం గేవల తమోగుణమైనను జ్ఞానము మిక్కిలి శుద్ధమై యానందదాయకమగును. త్రిగుణములు పరస్పరసమ్మేళనమున సాంక ర్యము చెందుటచేత జ్ఞానము శుద్ధముకానేరక కలకనీటివలె సంసార హేతువై కర్మస్వరూపమై దుఃఖానుభవస్వరూప "శూద్ర" శబ్దవాచ్య మగుచున్నది. అనగా శుద్ధ సత్త్వగుణము బ్రాహ్మణశబ్దవాచ్యము. కేవల రజస్సు క్షత్రియము, కేవల తమస్సు వైశ్యము, త్రిగుణ సాంకర్య

జన్యమగు నీజగమంతయును శూద్రశబ్దవాచ్యమే. వేదాధ్యయనము శ్రౌతకర్మానుష్ఠానమును సాధనచతుష్టయసంపన్నులగు పరమార్థచింత గల ముముక్షువులకుమాత్రమే యుద్దేశింపబడెనుగాని సంసారుల కెంత మాత్రమునుగాదు. దేశకాలపాత్రానుసారముగా ప్రాచీనపద్ధతుల మార్చుకొని ప్రాణిహింసమాని సుఖించుట బుద్ధిమంతులకు తగినపని.

ఏడవ ప్రకాశము :- 1) ఈ జగమంతయును దేహేంద్రియ జ్ఞప్తికి లోబడి స్పష్టమగుచున్నది. దేహస్మృతి కేవల పురుషకార మయమే. కనుక సజ్జనులు పూర్ణానందము నందుటకు బురుషప్రయత్నముకన్న మఱెద్దియును సాధనమే లేదనినమ్మి లోకులకు నట్లే వెల్లడించుచుం దమ మంచి ప్రయత్నము కొనసాగి లోకోపకారముగా ఫలించినపుడు కేవల దైవకృపయే యట్టి మంచికి గారణమని తమలోపలనే భగవన్మాహాత్మ్యమును మెచ్చుకొనుచు దమ సదుద్యమము కొనసాగనపుడు తమ ప్రమాదాలస్యములచేతను దమ పురుష ప్రయత్న లోపముచేతను లోకులకు సదుపాయము చేయలేకపోతిమని జాలిపడుచుందురు. కాని దుర్జనులవలె దమ బుద్ధి విశేషముచేత జయమును మఱి దైవలోపము చేత నపజయమును గల్గునని యెంతమాత్రమును జాటరు. 2) దేహస్మృతికి ధర్మమోక్షములు కేవలమగోచరములు. ఈ లోకవ్యవహారము స్వప్నజాగ్రద్దశలయందు సత్యమే. లోకవ్యవహారము సత్యముకానిచో వేదశాస్త్ర ప్రవృత్తి వ్యర్థమేకదా! కాబట్టి మీ లోకము సాధకులందఱకు వాస్తవమే. మనుష్యసామాన్యులకు దత్తద్దేశకాలపాత్రోచితముగా నాచరింపదగు సకలవర్ణాశ్రమ ధర్మము లవశ్యానుష్ఠేయములని సిద్ధాంతీకరింప దీఱదు. 3) పురుషప్రయత్నము లేకయే యాకస్మిక సుఖదుఃఖములు దేహధారులకు గలిగించు నతీంద్రియ కారణమే విధి, నియతి, యదృష్టము, కర్మము నను పేర్లంబరగు దైవము. దైవగతిన్దప్పుకొనుటకై పురుషప్రయత్న మొక్కింతయు న్గొఱగాదు. రేబవళ్ళను రానీక అడ్డుకొనదరముకాదు, అవి ప్రవర్తిల్లుట కవాఙ్మానసగోచరమగు దైవ

మను నెద్దియో సహజకారణము కలదు, కారణములేక కార్యము ప్రవర్తిల్లుట ప్రమాణ విరుద్ధము కనుక సహజ పంచభూత ప్రవృత్తికి గూడ దైవమనుపేరున నొక కారణము కల్పించుకొనక తీఱదు. ఈ పాంచభౌతిక శరీరోత్పత్తికి సంసార రథమునకు దైవపౌరుషములు రెండును రెండు చక్రములని యాజ్ఞవల్క్యముని చెప్పిన ప్రకారముగా దైవమంబౌరుషమును రెండును ముఖ్య పురుషార్థోపాయము లేగాని పురుష ప్రయత్నము దేహధారుల వశము, దైవగతి దేహధారులు తప్పించుకొననేరరు. ఏ పురుషార్థమును సంపాదించుకొనుటకై పురుషప్రయత్నమెట్లు చేసికొనవలయునో ప్రాకృతులు కించిద్‌జ్ఞులగు మర్త్యులెఱుగరు గనుక లోకోపకారపరాయణులు సర్వజ్ఞులు నతీంద్రియద్రష్టలగు మునులు వేదశాస్త్రములద్వారా హితోపదేశము గావించిరి. 4) శరీర స్మృతిచేతఁ ద్రిగుణాత్మక సంసారబంధమును దేహవిస్మృతిచేత నిర్గుణానందాత్మక మోహమును ఆత్మ డొకదానివెంబడి నొక్కటిగా బంధమోక్షములనుభవించుట స్వభావము. స్మృతి విస్మృతి రూపక సగుణ నిర్గుణ బంధమోక్షము లాత్మునికి నిజలీలా నటన విశేషములు. స్వప్న వికారములవలె సంకల్పమాత్రములుగాని వాస్తవములు కావు. "నచబద్ధో నవాముక్త ఇత్యేషా పరమామతిః" అనునట్లు దేవుడు తప్ప నితర వస్తువేలేదు. 5) వేదశాస్త్రానుసార ధర్మములందు సంసార వ్యవహార ధర్మములు చేరనప్పటికి లోకోపకారము లయ్యెనేని యట్టి సంసార వ్యవహార ప్రవర్తనకు జాతిమతానుసార ప్రవర్తనముగూడ సకల ముని సమ్మతమై యుభయలోక సంతారకము తప్పకగును. శంకరాచార్యు లాజన్మసిద్ధు డద్వైత బ్రహ్మమూర్తి యైనప్పటికి లోకసంగ్రహార్థమై షణ్మతస్థాపకుడయ్యెను. కాబట్టి వేదశాస్త్ర విహిత ధర్మాచరణము మనుష్యులతిక్రమింపగూడదు. దేశకాల పాత్రానుసారముగా బెద్దలు నియమమున నడచిన జాతినీతులం బిన్న లనుసరింపక తీరదు. మఱియు నాస్తికులై శ్రద్ధాభక్తులన్నాని వితండవాదముతో విపరీతజ్ఞులై జనకంట

ష్ఠులై దురభిమానమున స్వతంత్రించి ప్రాచీన శిష్టాచారముల న్నాని యనాది సంప్రదాయ సిద్ధములగు జాతినీతులన్నాని తప్పి మెట్ట వేదాంత ములు బల్కుచుం జెడగొట్టులు కాగూడదు. జనులం బరస్పర ప్రేమానురాగములు పుట్టించు విధమున బూర్వులేయే వేదశాస్త్ర పద్ధతులనుసరించి తరించిరో యట్టి ధర్మమార్గమునం బిన్నలు నడువక తీరదు.

ఎనిమిదవ ప్రకాశము :— 1) విస్మృతిదశనుండి స్మృతినందుటకు జనునకు దనప్రయత్నమున్నటు లనుభవము లేదుగాని స్మృతితొలగి మత్తుమందు మొదలగు సాధనలచేత విస్మృతిచెందు తన ప్రయత్నసాధ్యమగుట యనుభవములోనున్నది. కాబట్టి సుఖదుఃఖాత్మకముల స్మృతి రూపమునగు బ్రతుకు సంసారమున సహజమును దైవికమును, విస్మృతి రూపకమగు ముక్తి పురుషప్రయత్న సాధ్యము. లోకోపకారులగు ధర్మాత్ములు తమ పౌరుషముచే గలిగించుకొను విస్మృతి రూపకమగు ముక్తి శాశ్వతము; లోక ద్రోహులగు పాపాత్ములు మత్తుమందులచే కలిగించుకొను విస్మృతి రూపకమగు ముక్తి క్షణికము. నేను నాదియను నహంకార మమకారములు దొలగి లోకోపకారమునకై మాత్రమే జీవించు సజ్జనులకు జిత్తమేకాగ్రతజెంది తమ దేహమును మఱపించి శాశ్వతముక్తి న్గలిగించును. మరియును లోకోపకార పరాయణులకు మాత్రమే యీ సంసార రోగము శాంతించి నిత్య సుఖారోగ్యము కలుగును. 2) విద్యయనగా దెలివి. అన్ని విద్యలలో గొప్పవిద్య యాప్తవాక్యమును నమ్మకొని యా ప్రకారము ప్రవర్తిల్లుట, మునులందఱు నాప్తులే కాని వారిలో గౌతమ మహర్షి వ్యాసమహర్షియుం బరమాప్తులు. గౌతముడు పదార్థతత్త్వ జ్ఞానముచే నిశ్శ్రేయసము లభించుననియును వ్యాసుడు బ్రహ్మజ్ఞానముచే గైవల్యమబ్బు ననియుం దెల్పిరి. గౌతమునివలన సత్కర్మాచరణమును వ్యాసునివలన స్వకర్మ సన్న్యాస విధియు నేర్చుకొనవలసిన యంశములు. 3) విద్యచే వైరాగ్యము

వైరాగ్యముచే కైవాల్యానందము స్సిద్ధించును, నిత్యబుద్ధుడగు పర మాత్మునిలో సమదర్శనులగు జీవన్ముక్తులు మాత్రమే కలిసి నిత్యానందు లగుచున్నారు. కాని తదితర సర్వప్రాణులును అందులో ముఖ్యముగ విప రీత బుద్ధులగు పామరమనుష్యులు లేని దున్నట్లు మఱి యున్నది లేనట్లు భావించి సుఖదుఃఖము లందుచున్నారు. పరోపకారపరులకు మాత్రమే దైవానుగ్రహమబ్బును. దైవానుగ్రహమున యథార్థజ్ఞాన మబ్బిన జీవు లకు భ్రాంతిజన్యమగు సంసారదుఃఖము లంటనేరవు.

శ్రీ నారాయణదాసు సకలవిద్యా ప్రకాశికగా వెలువరించ దలచి రచించిన జగజ్జ్యోతి గ్రంథమునకు సార సంగ్రహరూపముగా పైన సమకూర్చిన ఖండికలు ఒక విధముగా అందలి ముఖ్యాంశములనైన ప్రకా శింపజేయగలవని నమ్ముకొన్నాను. ఇవి గ్రంథమందలి సమగ్ర విజ్ఞాన మును ప్రతిఫలింపజేయుటకు జాలకపోయినను స్థాలీపులాక న్యాయముగా శ్రీవారి యాంతర్యమును ప్రతిబింబింపజేయగలవనియే నాయాశ. అయి నను, ఇంకెన్నియో ప్రధానాంశములు పాఠకుల యభిరుచులను బట్టియు నిందులో జేర్చబడదగినవిగా గోచరించవచ్చును. నిజముగా సంగీతవిద్యను గురించియు చతుర్విధాభినయముల గురించియు, వేదమంత్ర స్వరశిక్ష మున్నగు వాని గురించియు శాస్త్రవిశేషాంశము లెన్నియో ప్రసక్తాను ప్రసక్తముగా గ్రంథమందు లభ్యమగుచున్నవి. కాని పై సార సంగ్రహ మును రూపొందించుటలోని యుద్దేశ్యము శ్రీవారి విజ్ఞాన భాండారము లోని వస్తువుల నన్నిటిని ప్రదర్శించుటగాదు. వారు భావితరముల జను లకు అందించదలచిన సందేశములోని మూలసూత్రముల రహస్యము నొకింత యావిష్కరించుట మాత్రమే. ఇకపైన కొంతవరకు శ్రీవారి శైలిని గురించియు, భావనావైశిష్ట్యమును గురించియు, విద్యా వైదగ్ధ్య మును గురించియు గూడ విపులీకరణాత్మక విమర్శను సాగించెదను.

## —: ప్రబోధిక :—

మున్ను శంకరభగవత్పాదులు మున్నగు నాచార్యులు 'జ్ఞానా దేవతు కైవల్యం', "తరతి శోకమాత్మవిత్" అను సూక్తుల నాశ్రయించి

జ్ఞానమార్గమును కర్మమార్గమునకంటె విశిష్టమైనదిగను ఉత్కృష్టమైన దిగను నిరూపించుచు ముఖ్యముగా జ్ఞానకర్మ సముచ్చయ వాదములను ఖండించిరి. అంతకుమున్ను గీతాచార్యులైన శ్రీకృష్ణభగవానులు జగద్గురువులన బరగి జ్ఞానమేకాక భక్తికూడ కలసి ఒక ప్రక్కను, కర్మముతోపాటు యోగమును మరొకప్రక్కను త్రాసులో రెండువైపుల పళ్ళెములందుంచి తూచిన విధముగా పరిశీలించి యొండొంటికి గల సంబంధములను దేనికెట్టి మానవుడు అధికారిగనుండునో యను నంశములను వివరించి భక్తిజ్ఞానముల యౌత్కృష్ట్యమును ఉద్ఘాటించి యున్నారు. గౌతమబుద్ధునివంటి కారణపురుషులు కొందరు మౌలిక నీతులను శీలప్రాధాన్యమును పేర్కొని, వేదశాస్త్ర చోదిత ధర్మావలంబకులమని చెప్పికొనుచు కొందరు సంఘమున కొదవించు హానిగ్లానులను నిరసించిరి. 'ముఖేముఖే సరస్వతీ' యన్నరీతిగా ఒక్కొక్క మహాత్ముడు ఒక్కొక్క విశిష్టదృక్కోణమునుంచి బోధించుచున్నను వారందరును సమీక్షించినది మానవజీవిత ధ్యేయమును గురించియు లక్ష్యసిద్ధికై సాధకులవలంబించదగిన పురుష ప్రయత్నమును గురించి యునై యున్న సంగతి విజ్ఞులకు స్పష్టమే. కనుక శ్రీ దాసుగారు ప్రస్తుత దేశకాలపాత్ర పరిస్థితులను దృష్టిలోనుంచుకొని పురుషకారము దైవము అను ద్వంద్వమును చర్చనీయాంశముగా ముందునిడుకొని వాదనలుచేసి యీ పురుషకారముయొక్క యావశ్యకతను ప్రతిపాదించుచు సంఘములో పాతుకొనియున్న సోమరిపోతుతనమును స్వార్థపరతను వంచకత్వమును నిర్మూలించు నుద్దేశ్యముతో జగజ్జ్యోతి గ్రంథరచనకు పూనుకొన్నారని తోచుచున్నది.

ఈ సందర్భములో ప్రాచీనార్యులలో ప్రశస్తివహించిన యాపస్తంబ మహర్షి వచనములు కొన్ని గుర్తుకు వచ్చును. కల్పగృహ్య సూత్రకారులైన యాపస్తంబులు జీవకారుణ్యాపరులని నిరూపించు కథలు కొన్ని ప్రచారములో నున్నవి. అంతేకాక వారి సూత్రములందలి ఎన్నిదవ

పటలములో ఆధ్యాత్మిక యోగ సంహిత విస్పష్టముగా వారి విశ్వజనీన భాగవత నీతిని ప్రకాశింపజేయుచున్నది. దానికిని శ్రీ దాసుగారి లోకోపకార చర్యావాదమునకును సాదృశ్యము గలదు.

శ్రీ నారాయణదాసుగారికి అద్వైత తత్త్వమునందును శ్రీ శంకరాచార్యుల యెడను గల భక్తి యపారము. 'జగజ్జ్యోతి' లో ప్రతిపాదించిన యుపదేశములందు ధర్మమోక్షములకు ప్రాధాన్యమీయబడినది. కాని సామాన్య మానవునకు అర్థకామముల యావశ్యకతను గుర్తించి విశ్వజనీన మయిన ముఖ్య నియమములపై మానవతాదృష్టితో ప్రత్యేక శ్రద్ధ చూపబడినది. క్రోధాది దోషములు దేహధారులకు ఆజన్మసిద్ధులు. అవి పూర్వజన్మములలో వారార్జించిన కర్మకారణముగా ప్రాప్తించి యుండుటచే సాధారణముగా కర్మనిమిత్తముగనే కలిగిన యీ దేహము పతనమగువరకును తమంతట తాము ఉపశమనము చెందకనేయుండును. కనుక అభ్యుదయము నిశ్శ్రేయసము కోరుకొను జీవులు దోషనిర్ఘాతము నకై విశేషప్రయత్నము చేయవలసియుండును. అయితే ఒక్కొక్క సమయమునందు కామమును క్రోధముచేజయింపగలము, అటులే క్రోధమును లోభముచే జయించవచ్చును, కాని కామక్రోధలోభాద్యరిషడ్వర్గమును పూర్తిగా జయించవలెనన్నను, లేదా శ్రీ ఆపస్తంబులు చెప్పిన క్రోధాది చతుర్దశ దోషములు ఉపశమించి నశించవలెనన్న యెడలను ఆత్మజ్ఞాన ప్రాపక సమ్యగ్యోగముల నవలంబించకతప్పదు. నిజమాలోచించినచో నీ క్రోధాది దోషములు మిథ్యాజ్ఞాన సహకారులగుటచేత తత్త్వజ్ఞాన సహకారులగు నీ క్రోధాది యోగములకన్న బలహీనములు కనుకనే దుర్బలములగు దోషములకు బలవంతములగు సదాచార లక్షణములచే నాశనము నిశ్చితము. అదిగాక దోషోపశమన మాత్రముచేత గూడ ననాత్మవేత్తలకు నిరతిశయానందప్రాప్తి సమకూడదు. కనుక దోష నిర్వారణమే లక్ష్యముగ నుంచవలెను, మరియు బ్రహ్మవేత్తలలోగూడ మందమధ్యమోత్తమ తారతమ్య ముండుటవలన

వేదాంతశాస్త్ర మొక్కటిగ నున్నను బ్రహ్మజ్ఞాన పటిమమాత్రి మంద
లకు సమానముకాదు. మంద మధ్యమాధికారులు జ్ఞానవంతులైనను
వివేకాతిశయము, వైరాగ్యేంద్రియ జయ పరమశాన్తి సంపాదనకొరకై
క్రోధాదిదోష నిర్మూలము చేసికొనకతప్పదు. అక్రోధాది యోగముల
మధ్య పేర్కొనబడిన సంవిభాగ మను పదములకు "ఆత్మనో యాత్రా
సాధన స్యార్థిభ్య స్సంవిభజనం"- తనకు లేకుండినను సరేయని యాచకు
లకు దాన మొసంగుట యర్థము. లోకోపకార పరాయణత్వమునకు
పరాకాష్ఠ యిదియే యనుకొందును. 'సర్వభూతై రవిరోధః' అనునది
ప్రత్యేక యోగలక్షణము, పరివ్రాజకులకు మాత్రిమే సంభవించును.
అయినను "ఆర్య, ఆనృశంసం, తుష్టిః' అను మూడు సర్వాశ్రమముల
వారికిని సమానములు. కావున నే యివి సర్వులకు నవశ్యానుష్ఠేయములు
అనగా క్షుద్రిత లేకుండుట, క్రౌర్యము లేకుండుట, దొరకదగినది దొరక
కుండినను దొరికినటుల చిత్తమును నిర్మలముగ నుంచుకొనుట యను
మూడు లక్షణములు అనుష్ఠించువారు జ్ఞానాభివ్యక్తి క్రిమముగ సర్వ
లోక వ్యాపకులై ముక్తులగుదురు. ఈ సందర్భమున శ్రీ దాసుగారు
శ్రీ ఆపస్తంబులవారి సూత్రములలో స్థగితముకాని విషయ మింకొకటి
చెప్పియున్నారు, అదియేమనగా; చతుర్విధాభినయములచే జ్ఞాని లోకు
లకు భగవద్భక్తి పారమ్యము నుద్బోధించవలె ననుటయే. జీవన్ముక్తులు
కూడ శాస్త్ర సంప్రిదాయ ప్రివర్తకత్వ ప్రియోజన మపేక్షించి ఉత్తమ
శిష్యులు ప్రాప్తించినపుడు తగురీతిగా నుపదేశము లీదగుననియే గదా
ఔపనిషద సిద్ధాన్తము! అవధూత పదము నందిన బ్రిహ్మవిద్వరిష్ఠుడుగూడ
తన యాత్మానుభూతిని గూర్చి సాధారణముగా పేరిలక యుండునని
చెప్పినను, ఒకవేళ యెప్పుడైన తన యానందోద్గారమును ప్రికాశింప
నిచ్చి నప్పటికి వానికి అంతమాత్రిముచే నెట్టి హానియు నుండదని,
అదియు నీశ్వరసంకల్పవశమున లేదా శిష్య ప్రారబ్ధవశమున జరుగునదే
గనుక జ్ఞానికేమాత్రిమును బంధహేతువు కానేరదని సిద్ధాన్తము కదా!

ముఖ్యముగా శ్రీమద్భాగవతములో ఏకాదశస్కంధమునందు ద్వితీయా ధ్యాయమున విదేహునికి కవి చెప్పిన వచనములు స్మరింపదగియున్నవి.

"శృణ్వన్ సుభద్రాణి రథాంగపాణే ర్జన్మాని కర్మాణి చయానిలోకే
గీతాని నామాని తదర్థకాని గాయన్ విలజ్జో విచరే దసంగః॥
ఏవం వ్రత స్స్వప్రియ నామకీర్త్యా జాతానురాగో ద్రుతచిత్త ఉచ్చైః
హసత్య థో రోదితి రౌతి గాయత్యున్మాద వన్నృత్యతి లోక బాహ్యః॥

అద్వైత ప్రపంచము సంకల్ప వికల్ప రూపమయిన మనస్సుచేతనే భాసించుచున్నది. కనుక మనోనిరోధముద్వారానే భగవంతుని యందే కాంత భక్తియు అభయ ప్రాప్తియు కలుగునని చెప్పి, యీ మార్గ మత్యంతాశక్యముగ కన్పట్టునేమో యని మరొక ప్రకారమైన సుగమ మార్గమును నిర్దేశించినది భాగవతము, అదియేమనగా; లోకప్రసిద్ధము లైన పురుషోత్తమ జన్మకర్మ బోధక నామములను గానమొనర్చుచు నిస్పృహుడై లోకమున సంచరించును-సాధకోత్తముడు. ఇట్లు భజించు చుండగా సంప్రాప్త ప్రేమలక్షణ భక్తియోగుడగు భాగవతోత్తము నకు సంసార ధర్మాతీతమగు గతియబ్బును. హృదయము ప్రేమతన్మయతచే వదులిచ్చి ఒకానొకప్పుడతడు భగవంతుని సాక్షాత్ప్రతి బడసి బిగ్గరగా పక పక నవ్వునట—ఇప్పటికైన నాకు లొంగిపోతిలే యనుకొని కాబోలు! మరొకప్పుడు వెక్కి వెక్కి యేడ్చును — ఇంతకాలమువరకు నేనుపే క్షింప బడితినిగదా ఎంత దురదృష్టము అని కాబోలు! ఇంకొకప్పుడు పొలికేకలువెట్టి పిలుచును — ఓ దేవా నన్ననుగ్రహింపరావోయీ అని కాబోలు! వేరొకప్పుడు మధురగాన మాలపించును — ప్రాప్తాను గ్రహత్వము వలని హర్షోద్రేకము కాబోలు! మరల నొకప్పుడు నృత్యము గావించును— 'జితం జితం' నా మనోవాంఛ పూర్తియైనది యను విజయోత్సాహముచే కాబోలు! ఇట్టి చర్యాయంతయును డాంబికము నకై ఇతరులకు ప్రదర్శించు నుద్దేశ్యముతో కాదు — పిచ్చివానివలెను భూతాదిగ్రహ గృహీతునివలెను వైవశ్యము పొందుటచేతనే అయి యుండవలెను! నిజముగా హరికథా పితామహులకు నిట్టి భాగవతోక్త

భక్తి పారవశ్యము లభించుటచేతనే కాబోలు! సర్వథా సర్వదా చతుర్విధాభినయములచేతను హరిభక్తి ద్యోతనమే వారికి జీవగఱ్ఱయై విలసిల్లినది! దాసుగారి సంగీత సాహిత్య నృత్య వాద్య నైపుణ్యము లన్నియును ధనార్జనకును కీర్తి కాంక్షకునుగాక బ్రహ్మానందానుభవము కొరకును వినువారలను ఇహపర తారక మయిన పరమానందమున నోలలాడించుటకొరకును మాత్రమే వెలుగొందెనుగదా! అందుచేతనే యతడు కేవలము మనుష్య గంధర్వుడు గాడు. దేవగంధర్వుడు కూడ కాదు, బ్రహ్మాత్మ నాద గంధర్వుడేయని చెప్పుట పొసగును!

(శ్రీ) దాసుగారి అద్వైత నిష్ఠకు అనుబంధముగా మరికొన్ని శీల సంపత్తులు కానవచ్చును. "నైతాదృశం బ్రాహ్మణస్యాస్తి విత్తం యథైకతా సమతా సత్యతాచ శీలం స్థితిః దండవిధాన మార్జవం తత స్తపశ్చోపరమః క్రియాఖ్యః" అను శ్లోకములో వారి వైశిష్ట్యము నిరూపితమయి ఉన్నతి. నిత్య నూతనము సనాతనము అయిన ఏకాత్మ మానవతా దృష్టితో బాటు సత్యసంధత ఆర్జవము వారికి పుట్టని సొమ్ములు. అట్లయ్యును వారి వినయసంపదగూడ విచిత్రమైనదే, 'యస్యామతం తస్యమతం మతం యస్యన వేదసః' అను రీతిగా తన దాక విశిష్టమతము అని చెప్పుటకుగాని తనకు తెలిసిన విజ్ఞానము లోకోత్తరమైన భాండారము అని గాని ఆయన నొక్కి వక్కాణించరు. పైపెచ్చు నిర్గుణ పరబ్రహ్మతాదాత్మ్య నిష్ఠారూప తురీయావస్థగాని అందలి సహజ సమాధ్యానందము గాని చవిచూడ లేకపోతినే అని పరితపింతురు. "ఆశాపాశముం ద్రెంచుకొన 'మునినైయైన జాలడన నల్పజ్ఞుడగు ప్రాకృత మానవుడన నేపాటి? 'జాతు న్తే హృది లీయ న్తే దరిద్రాణాం మనోరథాః' 'పునర్దరిద్రః పునరేవపాపీ' యను చందమున నీ సంసారదుఃఖ పాశబంధ మూహించి యున్నంతవఱకు స్వార్థత్యాగులై వైరాగ్యవంతులై కేవల లోకోపకార పరాయణులగు పరమభాగవతులకు దప్ప నస్మదాదిని ద్రాహార విహార సౌఖ్య తత్పరులకు దప్పదు తప్పదు," అను వచనములో వారి

నిరహంకారిత్వము సూచితము. అసలు నారాయణదాసను నామమును సంతుష్టితో స్వీకరించుటలోనే వారికి భక్తిప్రపత్తులయందు గల పరమాదరభావము స్పష్టము. "యుక్తి కంతము లేదు. యుక్తిపై యుక్తి యుండకమానదు. ఇంతకును జగత్కారణమగు దేవుడు భక్తిగోచరుడు గాని యుక్తిగోచరుడెంత మాత్రమున్నాడు. శాస్త్రములన్నియు నొకవిధమైన యాత్మ నిశ్చయాత్మక మగు నమ్మికం బట్టియే రచింపబడెను. 'యతో వాచో నివర్తన్తే' యనునట్లే వేదము లీ శాస్త్రము లీ మానవ వైఖరీ గ్రంథములు యథార్థ తత్వము దెల్పజాలవు." అని వారి యాంతర్య విశ్వాసము. "సగుణ ద్వైతమగు స్మృతిరూపక స్వప్నజాగరములాగంతుక మిథ్యా విద్యా స్వరూపములు. నిర్గుణ ద్వైతమగు విస్మృతి రూపక సుషుప్తియే సహజ యథార్థ విద్యాస్వరూపము. స్వప్నజాగ్రత్సుషుప్తులకు సాక్షియై పరమభాగవత జన సంసేవ్యుడై తురీయావస్థాత్మకుడు నారాయణుడు జీవాత్మలను స్ఫులింగముల కాలవాలమగు స్వయం ప్రకాశక సర్వ జగజ్జ్యోతి" అను సూక్తిలో తనకు పరత్వమునకు గ్రంథమునకు గల సంబంధము సూచించి అని యున్నారు.

## —: ప్రదీపిక :—

శ్రీ నారాయణదాసుగారి వచనశైలి యనితర సాధారణము. పూర్వమహాకవుల పోకడలన్నియును అవలీలగా ప్రదర్శించగల్గుటేకాక యొక్కొక్కప్పుడు వినూత్నపక్కిలో నడుగిడి బహు సమర్థముగ నిర్వహించగల నేర్పరి యాయన. సంగీత సాహిత్య సంబంధగంధము అనునొక చిన్న కిరణము ఎనిమిదవ ప్రకాశమందు కన్పట్టును. పుంభావ సరస్వతియగు దాసుగారు ఈ ఘట్టములో తానొక దివ్యభూమికలో నుండియే సంగీతసాహిత్యములను నిర్వహించసాగెనా యనిపించును.

"సకలదుఃఖ విముక్తికై జనులు చేయదగిన కార్యముల గురించియే యష్టాదశ ప్రస్థానాత్మకములగు నానా విద్యలును మనుష్యుల యందసా

దిగ ప్రవర్తిల్లుచున్నవి. సంగీత సాహిత్యాత్మకమై విద్య రెండు విధముల నున్నది. సంగీతముపని మఱియు సాహిత్యము ఆపని నొనర్చు తెలివి. దృశ్యము సంగీతము, దృక్కు సాహిత్యము. సంగీతము జగమును, సాహిత్యమాత్మయును. సంగీతము పౌరుషము, సాహిత్యము దైవము. సంగీతము భోజ్యము, సాహిత్యము భోక్త. లోకోపకారము సంగీతము, లోకోపకారమునలుపునేర్పు సాహిత్యము, సంగీతము ప్రకృతి, సాహిత్యము పురుషుడు. సంగీతము లౌకికము. సాహిత్యము పారమార్థికము. సంగీతము జగత్తు, సాహిత్య మీశ్వరుడు. (ఇవియే) జాగ్రత్స్వప్నములు సంగీతము వికృతి, సాహిత్యము ప్రకృతి. సంగీతము జీవితము, సాహిత్యము మరణము. సంగీతము మిథ్యయు ననిత్యమును, సాహిత్యము వాస్తవమును శాశ్వతమును. సంగీతము సగుణము, సాహిత్యము నిర్గుణము.

మొత్తము మీద చూడగా (శ్రీ)వారి యభిప్రాయములో సంగీతము కార్యము, సాహిత్యము కారణము; సంగీతము రూపము, సాహిత్యము వస్తువు. అని తేలును.

ఇటులే మహత్తర విషయముల నెన్నిటినో నిగూఢ సాంకేతిక పదములను సైతము సుళువుగా నిర్వహించుటద్వారా దాసుగారు సుబోధము గావించియున్నారు. ఉదాహరణకు "విద్యయనగా సహజముగా జీవులు తమకు గల తెలివిచే నెల్ల వస్తువుల నెలిసికొని యొండొరులకు దెలుపు నేర్పు. విద్యవలన ఫలమన్ని విధములచే జీవుడు తా సుఖపడి యొరుల సుఖపెట్టుట." "దేహమునకు జీవమెట్లో మనసునకు కోరికట్లు. జీవ మున్నంతవఱకు స్థూలదేహము నశించదు. కోరిక యున్నంతవఱకు సూక్ష్మదేహమగు మనస్సు నశించదు. ఆధారములేని వారాధారము నకై దేవులాడునట్లు సజీవమగు స్థూలదేహమను నాధారమును విడిచిన కోర్కెతోడి మనస్సు మఱల స్థూలదేహమను నాధారమునొంది తన కోరిక తీర్చుకొనుటకై వేసగి యందాకసమున లయమై తిరిగి భూమికి వచ్చుటకు స్వభావముగా బ్రివర్తిలు నీరువలె దేహమందు జొచ్చుటకై

యహ్లాదుచుండును. కోరికతో నున్న మనస్సే జీవుడనబడును. కోరికే కర్మ మనబడును. కర్మానుసారముగా జీవుడు ఫలమనుభవించుటకై సహజముగా నానా శరీరములు దాల్చుచు బొత్తిగా కర్మస్వరూపమగు కోర్కి నశింపగా సంతుష్టుడై నిర్బాధకమగు శాశ్వతకైవల్యానందమున నుండును."

నిజమాలోచింపగా యేశాస్త్రమందైన బాగా నైపుణ్యము సంపాదించినవారే ఆ శాస్త్రాంశములపై సరళసులభశైలిలో నిగూఢమైన విషయములను గూడ విశదపరచగలుగుట అనుభవములోనున్నదే. శ్రీ శంకరాచార్యులు గూడ ఆత్మపదార్థముయొక్క స్వయంజ్యోతిష్ట్వమును గూర్చి యేక శ్లోకమునందే వివరించిన యుదంతము గుర్తింపదగియున్నది- "కింజ్యోతిస్తవ భానుమా నహనిమే..." అను ప్రసిద్ధ ప్రాకరణిక శ్లోకము విజ్ఞులకు సుపరిచితము. అంతేగాక, బాదరాయణుల బ్రహ్మసూత్రములకు మహాభాష్యమును రచింపదొడగిన శంకరులు, భాష్యమం దొక్కొక్కచోట స్వయముగా సూత్రములవంటి వాక్యములను వాడియున్నారు. ఉదాహరణ "పశ్వాది భిశ్చావిశేషాత్" ఇది వ్యాసులవారి 'తత్తు సమన్వయాత్" అను సూత్రముతో తులతూగుచున్నట్లుండును. ఇదేవిధమైన శైలిలో దాసుగారి జగజ్జ్యోతియందు 'అల్పాక్షర మసందిగ్ధం...' అను లక్షణమునకు లక్ష్యములనదగిన సూత్రప్రాయములైన కురుచ వాక్యములు కొల్లలు.

శ్రీ నారాయణదాసు సకలశాస్త్ర విజ్ఞాన విశేషములను జగజ్జ్యోతి గ్రంథమున ప్రకటించి చూపినదంతయు నొక యెత్తు, వేదమాతయగు గాయంత్రీమంత్రము యొక్క తాత్పర్యమును తమ యసాధారణ వివరణ నైపుణ్యముతో వాఖ్యానించి యదే తమ చరమోపదేశముగా నిరూపించినది మరొక యెత్తు. ఈ ఘట్టమునందు పూర్వాచార్యులలో శ్రీమన్నారాయణ మంత్రమును సర్వజనులకు బాహాటముగా వెలువరించిన శ్రీ రామానుజాచార్యాదులు స్మృతిపథమునకు వత్తురు. దాసుగారివంటి మహాపురుషులకు స్వపరభేదముగాని విద్యామదప్రేరిత భేషజములుగాని

మచ్చునకైన కానరాకుండుటలో నాశ్చర్యములేదు. వారి గాయత్రి వాఖ్య యిట్లున్నది :-

"మేము సంపూర్ణమగు బుద్ధి సంపద నొందుటకై త్రికరణశుద్ధిగా బాటుపడక తీఱదు. కారణమేమనగా బుద్ధియొక్క లక్షణము చెడని సంతోషము. ఇపుడు మేము మిక్కిలి బుద్ధిహీనుల మగుటచే భ్రాంతులమై (యుంటిమి.) కోరికలు తీర్చగలిగి మాబాధలం బోగొట్ట జాలి మాకు శాశ్వత సంతుష్టినీని వాస్తవముగా మాకు మేలుచేయదగిన యథార్థ విహిత వస్తువుల నగపర్చు సరియైన మార్గమును దప్పి తప్పు త్రోవల న్నడచి దుఃఖపడుచున్నాము. మాకోర్కెలు తీరకున్నవి. మా మనసు లోని వెలితి పోకున్నది. కలనైనం జిత్తశాంతి లేకున్నది. నానాటికి మా తాపత్రయానలము క్షణక్షణమును ప్రజ్వరిల్లుచున్నది. కాబట్టి బుద్ధి యెట్లు వచ్చునో యందుకు దగిన వేదశాస్త్రము లభ్యసించెదము. నిత్య సంతోషులయిన పరమభాగవత సహవాసము తృటియైనం దప్పక చేసి కొనెదము. మా బ్రతుకంతయును లోకోపకారమునకై మాత్రమే ధార పోసెదము. దృఢవ్రతులమై శాశ్వత మనస్సంతోష లక్షణమగు బుద్ధిని సంపాదించుకొనుటకై ముఖ్యమైనత్రోవ పరోపకారము చేయుటకై త్రికరణశుద్ధిగా బాటుపడుట తప్ప మఱే యాశ్రమమున్నాదు కాదని వేనోళ్ళజాటిచెప్పెదము. మాపురుషోద్యమమందు కసింతయుం బొరపాటు రానీక కేవల లోకోపకారముగా మా బ్రతుకుం గొనసాగించి మాతోటి పాటి జనులందఱును హాయిగానున్న సమయమున నోకర్మసాక్షి ! యో జగజ్జ్యోతీ ! యో లోకబాంధవా ! యో జగచ్చక్షూ ! యో సకలజగ దుద్భవస్థితిలయ మూలకారణమా! యో సకలజన నిత్య ప్రత్యక్ష దేవతా! సూర్యనారాయణా ! సద్బుద్ధియోగ మిమ్ము."

గాయత్రీమంత్రమునకు 'ధీమహి' 'ధియః'అను పదములు కీలకమయము లని దాసుగారి యూహ, అందువలననే సద్బుద్ధి నిమ్మని వేడుకొనుటే మంత్రోద్దేశ్యమనిరి. భగవద్గీతలోకూడ బుద్ధియోగమునుగూర్చి విశేష

ప్రశంస కలదు కదా! బ్రహ్మసూత్రములందలి మొదటి సూత్రమును గూడ దాసుగారు బుద్ధిపరముగానే వ్యాఖ్యానించుట చిత్రముగానున్నను వారి దృక్పథము వ్యవసాయాత్మికబుద్ధి యేకరూపమే యని తేలు చున్నది. 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' యను సూత్రమున బ్రహ్మశబ్దమున కర్థము దాసుగారిట్లు వివరించినారు.

"కేవల పురుష ప్రయత్న సాధ్యమగు వ్యవహారయోగ్యమగు యథార్థ జ్ఞానాత్మక బుద్ధి (యే బ్రహ్మ పదార్థము) గాని నిర్గుణ మతీంద్రియ మగ్రాహ్య మలౌకికమగు పదార్థమెంతమాత్రమున్నాదు."

ఇట్టి యర్థమునే దాసుగారు గౌతమమహర్షి ప్రణీత న్యాయశాస్త్ర విషయమునుండి గూడ సాధించినారు. "ప్రమితి విషయాః పదార్థాః" అను న్యాయసూత్ర తాత్పర్యము; ప్రమితి యనగా మనుష్యుడు తన పురుష ప్రయత్నముచేత సంపాదించుకొనగలిగిన బుద్ధియను నణిమాద్యష్టైశ్వర్యకారకమగు నొక సుగుణ విశేషము." "బుద్ధి కగ్రాహ్యముగాని యసాధ్యముగాని నిర్గుణాద్వైత బ్రహ్మపదార్థమొకటి యతీంద్రియమై యలౌకికమై యున్నదని "తత్తు సమన్వయాత్" అని వ్యాసర్షి యుపదేశించుటయందలి తాత్పర్యము: మనుష్యుడు తన బుద్ధిని దన పురుష ప్రయత్న బలము కొలది న్వికసింపజేసికొని త్రిగుణమయ శరీరస్మృతి రూపక సమస్త ప్రపంచమును తానేయై తనకు వేఱు గానక సుఖ దుఃఖాత్మక సంసారభ్రాన్తినొందారంగి 'సాక్షీ చేతాః కేవలో నిర్గుణశ్చ' అను రీతిగా జీవన్ముక్తుడు కాగల సామర్థ్యమును సంపాదించుకొనుటయే పరమ పురుషార్థమని 'ఆత్మావ్యారే ద్రష్టవ్యారే...' అను ప్రాబల్యములును 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' అను తన మీమాంసను లోకోపకారమునకై మొట్టమొదటిసూత్ర ముపదేశించెను.

అసలు దాసుగారి వేదాంతశాస్త్ర ప్రజ్ఞ యెంత కూలంకషమైనదో నిర్ధారించుటకు వారు పదేపదే ఉట్టంకించిన సంక్షేప శారీరక

గ్రంథకారులగు సర్వజ్ఞాత్మ మహామునిరచిత శ్లోకమొక్కటి చాలును. అది యేమనగా: 'బ్రహ్మైవ సంసరతి ముచ్యత ఏతదేవ దౌవారికం భవతి సంసరణంతు తస్య, ముక్తిః పునర్భవతి చిద్వపుషైవ తస్య స్వాజ్ఞానతః స్వమహిమ ప్రతిబోధతశ్చ.' దీనిని బట్టి దాసుగారు లోకోపకార వ్యవహారమును గురించియు నారాయణ చరణ శరణాగతిని గురించియు యెంతగా ప్రశ్నంసించినను బృహత్ స్తోత్ర కదంబముల రచించియున్న శ్రీ శంకరాచార్యాది మహామహులవలెనే వారి లక్ష్యము మాత్రము సోపాధిక బ్రహ్మప్రాప్తి కాదని నిరుపాధిక బ్రహ్మవిద్యయే యని విశదమగుచున్నది. ఇందులో రహస్యాంశ మేమనగా : మన సంసారిత్వము పరమాత్మరూపముతో కాదు, అవిద్యోత్థ లింగశరీరద్వారకమే. అయినను మన ముక్తి మాత్రము జీవరూప సూక్ష్మోపాధి సాపేక్షము కాదు, నిరుపాధికమే నిరపేక్షమే స్వాభావికమే నిత్య సత్య వస్తువగు బ్రహ్మము యొక్క మహిమానురోధియే యని సంక్షేప శారీరక సుబోధినీ టీక నుండి పర్యవసించుచున్నది. అయితే ముక్తి యజ్ఞాన నివృత్తి రూపముచే ఉపనిషద్వాక్యజన్య వృత్త్యధీనమే యైనప్పటికిని స్వరూపానందావిర్భావ రూపముచే అన్యాపేక్షా రహితమే యను సిద్ధాన్తము అన్వయార్థ ప్రకాశిక యను టీకనుండి తేలుచున్నది. కనుకనే శ్రీ నారాయణదాసాది భాగవతోత్తములుకూడ యీ నిత్య సిద్ధ బ్రహ్మవస్తు ప్రాప్తికై ఉపకరణము లేవియు నక్కర లేదని యొప్పుకొనుచును కూడ దేహస్మృతి రూపక మూలాజ్ఞాన నివృత్తికై ఆత్మవిద్యా శ్రవణ మనన నిధిధ్యాసాది సాధనముల యుపయోగము నుద్ఘోషించుచునే యుండిరి.

శ్రీ శంకర భగవత్పాదులుకూడ శ్రవణాదుల యావశ్యకతను గుర్తించి చెప్పిన శ్లోకము లిట గమనించదగినవి :—

నాదాను సంధాన నమోస్తు తుభ్యం త్వాం సాధనం తత్వపదస్య జానే
భవత్ప్రసాదా త్పవనేన సాకం విలీయతే విష్ణుపదే మనోమే॥
నాదానుసంధాన సమాధి భాజాం యోగీశ్వరాణాం హృదివర్ధమానం
ఆనందమేకం వచసా హ్యగమ్యం జానాతి తం శ్రీ గురునాథ ఏకః॥

శ్రీ దాసుగారు 'నాదబ్రహ్మముపాస్మహే' అనియు, 'శ్రుతిర్మాతా లయః పితా' యనియు 'వీణావాదన తత్త్వజ్ఞః శ్రుతి జాతి విశారదః తాళజ్ఞశ్చాప్రయాసేన మోక్షమార్గం నియచ్ఛతి' అనియు అడుగడుగున తన నాదానుసంధానసాధనా పారమ్యమును వెల్లడించుచునే యుండిరి. ముఖ్యముగా యీ 'వీణావాదన తత్త్వజ్ఞః...'అను శ్లోకమును ప్రసాదించిన స్మృతికారుడు సకల బ్రహ్మవిచ్ఛిరోమణి యగు యాజ్ఞవల్క్య మహర్షి. ఇహపరములను సమర్థముగా సిద్ధింపజేసికొన్న యీ యుదార చరితునిపై దాసుగారికిగల భక్తి యపారము. మరియొక విశేషమేమనగా శ్రీ దాసుగారు సంగీతవిద్యా ప్రధానముగా గోచరించు పై సూక్తులకు గూడ లోకోపకార పారమ్యార్థకముగనే వ్యాఖ్యానించిరి. "యాజ్ఞవల్క్యముని ముఖ్యాభిప్రాయము సకల జనచిత్తరంజక ప్రవర్తనముగల మనుష్యుడు మాత్రమే యిహపరములం దరించగల్గునని కాబట్టి లోకరంజకుడు కాని స్వార్థపరు డార్యు డెంతమాత్రము న్గాడు. మఱి యట్టి రిమొంటి గొట్టురాకాసి కేవల స్వార్థపరుడై పఠించు వేదముగాని సల్పు యజ్ఞముగాని బూడిదనోసిన పన్నీరువలె వ్యర్థమును మఱి శ్రుతిస్మృతి విరుద్ధమని చాటి చెప్పవలయును. సర్వజనరంజకుడైనవాడే నిక్కమగు శ్రోత్రియుడు విద్వాంసుడు బ్రాహ్మణుడు మఱి యార్యుడనదగువాడు. తన తోటిపాటివారితో విరోధపడువాడు మిక్కిలి పనికిమాలి యెద్దియో క్రూరజంతువగును, గాని మనుష్యుడెంత మాత్రమున్గానే కాడు." ఇట్లు నిష్పక్షపాతముగా స్పష్టరీతిలో మొగమాటమిలేకుండ హితోపదేశ మొనర్చు నభ్యాసము దాసుగారికి ఆజన్మసిద్ధము. వారేగనుక యీ ఇరువదవశతాబ్ది యుత్తరార్థమందు యావనస్ఫూర్తితో మెలగియుండెడిచో నేటి ప్రపంచ చరిత్రలోనే కొంత మార్పు వచ్చియుండెడిదేమో యని నాకు తోచును. యునైటెడ్ నేషన్సు అనబడే ఐక్యరాజ్యసమితిలాంటి సంస్థలలో దాసుగారి 'శాంతిసందేశ హరికథాకాలక్షేపము' ప్రదర్శింపబడియున్నచో వివిధ దేశములలోని రాజకీయవేత్తలు అగ్రరాజ్యాల

అధినేతలు తమ యాదర్శములను ఆశయములను కొంతవరకైన మార్చు కొన గల్గెడి వారేమో యను నూహకల్గుచుండును. కాని సర్వజ్ఞుడు సర్వకర్త సర్వనియామకుడు నగు జగదీశ్వరుని సంకల్పమెట్లుండునో యెవరి కెఱుక! కొన్ని సంక్షోభములు కల్లోలములు భూభారహరణ పరములై సాగిపోవుచుండుట యీ జగజ్జాతక చర్యలో యవశ్యం భావి భావమేమో! పరిపక్వ కషాయులగు కొందరు పరిణతచిత్తులు పరిప్రశ్న మొనర్చు సన్నివేశము సృష్టించినపిదప కాని పరమేశ్వరుడు వారి ప్రశ్నలకు సమాధాన మీయగల కారణజన్ములను శ్రీ నారాయణదాసాదుల వంటి వారిని సృష్టిచేయడు కాబోలును!

'ఏతావతా, స్వతో రంజయతి శ్రోతృచిత్తం సస్వర ఉచ్యతే' యను సూక్తిని బట్టి దాసుగారు సకలజనరంజకమగు ప్రవర్తనమే సకల శ్రుతిస్మృతి శాస్త్ర సమ్మతమని సకల ముని ముఖ్యమతముగా సిద్ధాన్తీకరించి, తన సర్వగాన మాధుర్యమును సఫలము సార్థకము సర్వజనాంగీకారయోగ్య మొనర్చుకొనియుండిరి. వారి పునరావిర్భావము ఎన్నటికో!



# తల్లి విన్కి

## [లలితాసహస్రనామ పరమార్థప్రకాశిక]

ఆచార్య శ్రీ ఓరుగంటి నీలకంఠశాస్త్రి

భారతదేశము అధ్యాత్మ విద్యకుఁ బుట్టినిల్లు. ప్రాచీన భారతీయులు ఐహిక సుఖములకంటెఁ బారలౌకిక సుఖములకుఁ బ్రాధాన్యము నిచ్చినవారు. వారు సామాన్య మానవుల కత్యంత ప్రీతిస్థానములగు నింద్రియసుఖములందు దోషమును గనిరి. ఇంద్రియములను నిగ్రహించి వశులై విషయవివర్జితమగు నధ్యాత్మ సుఖము ఉత్తమోత్తమమని భారతీయ తత్త్వవేత్తల నిర్ణయము. కావున అధ్యాత్మ జ్ఞానము వీరలకుఁ బ్రధానస్థానము నాక్రమించినది. లోకమునఁ గోటానుకోటులగు జన సమూహమున ఆత్మజిజ్ఞాసువులు అల్పాల్పసంఖ్యాగలవారు. అట్టి వారల జ్ఞానమునకే ప్రాధాన్యమునిచ్చినచో మిగిలిన జనుల పురుషార్థముల గతి యేమి కావలయును? మహర్షులీవిషయమును మఱువలేదు. తమ శాస్త్రములలోఁ బెక్కింటిని జనబాహుళ్యమునకే యుపయోగపడునట్లు చెప్పిరి. అట్లు చెప్పియుఁ దుదిని అధికారిని (యోగ్యతగలవానిని) బట్టి పురుషార్థమతిశయించుచుండుననుచుఁ గూడఁ దెల్పుచుండిరి. ఇది భారతీయ శాస్త్రకారుల ఫక్కిక. కావుననే భారతదేశమున పాకశాస్త్రము మొదలు పరబ్రహ్మశాస్త్రము వఱకు ననేక విధములగు తత్త్వశాస్త్రములు బహురూపములతో వెలసినవి.

ఇట్లు వెలసిన యీ శాస్త్రములు భారతీయులకుఁ బరమప్రమాణ స్థానము నలంకరించిన శ్రుతివిహితమగు ధర్మమునకు విరుద్ధములగు సిద్ధాన్తములను బ్రవచింపఁగూడదని శాస్త్రకారుల యాజ్ఞ. శ్రౌతధర్మ

విరుద్ధ సిద్ధాన్తమును బ్రతిపాదించిన యాతఁడెట్టి మనీషియైనను ఎంతటి మహానుభావుఁడైనను ఆ సిద్ధాన్తము అనుపాదేయమనియే వారల చండతరశాసనము.

భారతీయులకిట్టి ప్రధాన ప్రమాణ పదవి నలంకరించిన శ్రుతి సకల ప్రాణిజాతమునకుఁగూడఁ గల్యాణ సంధాత్రియే యగుచు నట్టి కల్యాణ మును ఆయా యధికారులద్వారా లోకమునకు సమకూర్చుచున్నది. ఈ శ్రుతి దాను కర్మ - ఉపాసన - జ్ఞానములనెడి మూఁడు భాగములతో నొప్పుచున్నది. ఇందుఁ గర్మభాగము మనుష్యమాత్రునకు వలయునట్టి ధర్మ - అర్థ - కామములను వారివారి యోగ్యతకుఁ దగు విధమునఁ జేకూర్చుచు నవ్వానికి సాధకములగు నుపాయములను బోధించును. ఇది కేవలము బాహ్యసాధన ప్రధానమయి యొప్పుటచే అనంత భేదము లతో వెలయుచుండును. కావుననే యొక్కొక్క వేదమున నీకర్మము లే విపులమగు భాగముచే బోధింపఁబడుచుండును.

ఇఁక రెండవదియగు నుపాసన భాగము గూడఁ గర్మకాండముచే సాధింపబడు ప్రయోజనములనేఁ గాక యవ్వాని కంటె విశిష్టములగు ప్రయోజనములను సాధింపఁగల ప్రస్థానము: ఈ యుపాసనమంతయుఁ బ్రధానముగా మనోవ్యాపారాధీనమై యొప్పుచుండుట వలన దీనిని సాధింప యత్నించువారలు కర్మాధికారులకంటెఁ గూడ మానసశక్తి గలవారలు కావలయును. ఏలయన - ఉపాసన స్వరూపమే, విధిచోదిత మగు నేదేని యొక దేవత నుద్దేశించి యితరమానసవృత్తులు చొరకుండ తైలధారవలె ఏకాకార చిత్తవృత్తి కరణము. ఇట్లు ఏకాకారముగాఁ జిత్తవృత్తులను నిలుపుటకు సాధకుఁడు అతిచంచలమగు మనస్సును నిగ్ర హింపఁ గల్గియుండవలయును. ఇది చిరకాలాభ్యాససాధ్యము. అంతఃకర ణమునకుఁగల తైక్ష్ణ్యము కార్యసాధకతా సామర్థ్యము బాహ్యకరణము లకు లేదు. కావుననే శిష్టులు అంతరంగ సాధనము ప్రవర్తించుచున్న ప్పుడు తద్విరుద్ధముగ బహిరంగసాధనము ప్రవర్తింపనేరదని చెప్పినారు.

ఇతరములగు సామాన్యైహిక ఫలములెన్నట్లును ఉపాసనమునకు ముఖ్యఫలము దేవతాసారూప్యము. ఇట్టి ప్రధానసారూప్యమునకే గౌణ సారూప్యము శాస్త్రముచే విధింపఁబడుచున్నది. ఇట్టి గౌణసారూప్యముతోనభ్యస్తమగు నంతఃకరణము క్రమముగా ఉపాసనానైశిత్యముతో ముఖ్యసారూప్యమునందును. 'నాదేవో దేవ మర్చయేత్' 'నాశివశ్శివమర్చయేత్' అను నుడులు ఈభావమునే తెల్పుచున్నవి తానే దేవత నుపాసించునో యాదేవతా భావము దనయందు సంక్రమింపఁజేసికొని తన్నిమిత్తముగఁ దాద్రూప్యమునంది యనంతరము తద్దేవతోపాసనమును గావింపవలయును. అట్లుగానిచో నా దేవతనుపాసింపఁగూడదని పై స్మృతివాక్యములకర్థము. కావుననే యుపాసకుఁడు స్వప్రమాణమగు నుపాస్యదేవతా భావమును దనయందుఁ గల్పించుకొని యనన్తరము ఆ దేవతారూపమును ధ్యానశ్లోకోక్తప్రకారము భావించుచు నుపాసనమును గావింపవలయునని శాస్త్రతాత్పర్యము. అట్లే సంప్రదాయముగూడఁ బరగుచున్నది. కావుననే మంత్రాత్మకమగు దేవతా రూపమును ఉపాసకుఁడు దనయందుఁ దొలుత న్యాసము గావించుకొని (ఆరోపించుకొని) అనంతరము ఉపాస్యదేవతారూపమును భావించి యుపాసనము గావించును. అపరిశుద్ధమగు నీ మానుష దేహమునకు దేవతారూపధారణమునకుఁ దగుయోగ్యత లేకపోవుటచేఁ బాంచభౌతికమగు నీ దేహమును దేవతారూపధారణమునకుఁ దగు యోగ్యతగల్గునట్లు తొలుతఁ బరిశుద్ధుని చేయవలయును. అట్లు పరిశుద్ధిచేసిన వెనుక ఈ దేహము దేవతారూపధారణాయోగ్యమగును గావున అపుడు దేవతారూప మంత్రన్యాసమును దేహమునందుఁ గావింపవలయును. అప్పుడుపాసకుఁడు దేవతారూపము నందినవాఁడగును గావునఁ దద్దేవతోపాసనమున కర్హుఁడగును. ఉపాసకుఁడు దనయందు మంత్రన్యాసమును జేసికొనుటకుఁ బూర్వము తాను న్యసించు మంత్రముయొక్క ఋషిచ్ఛందో దైవతాది రూపములను దొలుత గు రెఱింగి యనంతరము న్యాసము గావించుకొనవలయును. అట్లుగానిచో ననర్థము గలునని —

"యోహ వా అవిదితార్షేయ ఛందో దైవత బ్రాహ్మణేన మంత్రేణ యజతే యాజయతి వాఽధ్యాపయతి వా స్థాణుం వర్ఛతి, గర్తేవా పద్యతి, ప్రవామీయతే, పాపీయాన్ భవతి, యాతయామాన్యస్య ఛందాంసి భవన్తి। తస్మా న్మంత్రే మంత్రే ఏతాని విద్యాత్"

అని శ్రుతి పలుకుచున్నది. కావున ఋష్యాది పరిజ్ఞానము తోడనే యుపాసనమును గావింపవలయును.

ఈ యుపాసనము శాస్త్రప్రతిపాదితమగు దేవతానుగ్రహ సంపాదనమునకు సాధనమగుచుఁ దొలుత భేదదృష్టితో నొప్పుచున్నను గ్రమముగా నుపాసకుని యధికారానుగుణముగ దేవతతో నభేదభావము నందింపఁజేయు సామర్థ్యముగలది. కావుననే యుపాసనము భేదాభేద రూపమున వెలయుచుండునని మునులు వాక్రుచ్చిరి. ఇట్టి యుపాసనము శ్రుతియందుఁ గేవల భేదబోధకమగు కర్మకాండమునకును గేవలాభేదబోధకమగు జ్ఞానకాండమునకును మధ్యస్థానము నలంకరించి కర్మజ్ఞానములకు సేతురూపమునఁ బ్రకాశించుచు మార్గత్రయమునను బ్రాధాన్యమును వహించియున్నది. ఇఁకఁ దృతీయభాగముగా శ్రుతియందుఁ బ్రతిపాదింపఁ బడిన జ్ఞానకాండము అత్యుత్తమమైనను అధికారివైరళ్యముచేతను, విరతాధికారులుత్తమ చిత్తశుద్ధిగల్గినవారగుటచే సూత్రప్రాయముగఁ దెల్పినను గ్రహించువారలగుటచేతను వేదాంతములందుఁ గొలఁదిభాగముల చేతనే ప్రతిపాదింపఁబడుచున్నది. జనులలోఁ బెక్కురు పురుషార్థత్రయముననే యాసక్తులగుటచే సామాన్యాధికారముగల్గిన వారలనియే చెప్ప వలయును. కావుననే యట్టివారల కుపయోగించు గ్రంథభాగము కర్మకాండ రూపమున విపులముగా నొప్పుచున్నది. అంతకంటె సునిశిత ప్రజ్ఞులయి పురుషార్థత్రయముననేగాక తురీయ పురుషార్థమును గూడ సాధింప యోగ్యతను బడయుటకుఁ దగుయత్నమును గావించువారలకు నుపాసనకాండము ప్రతిపాదింపఁబడినది. ఇఁకఁ బూర్వకాండ ద్వయానుష్ఠానముచేఁ జిత్తశుద్ధిగల్గి · సాధనచతుష్టయ సంపత్తిచేఁ బరిణత ప్రజ్ఞులగు

నుత్తమాధికారులకు నీయాగమశిఖారూపమగు నుపనిషత్కాండము (జ్ఞానకాండము) అనుగ్రహింపఁబడినది.

ఇట్లు వేదమునందలి కాండత్రయమును గేవల పురుషార్థసిద్ధికై యే యనుగ్రహింపఁబడినను గాలక్రమమున శ్రౌతమార్గము నవలంబింపఁ జాలనివారలు తత్ఫలములనందుటకై స్మృతులు తంత్రములు వెలయింపఁ బడినవి. మధ్యమాధికారులగు జనులీ స్మృతితంత్ర గ్రంథముల ననుసరించియే తమ కర్మ - ఉపాసన - జ్ఞానములను దెలిసికొని తరించుటకుఁ దగు నవకాశము కల్పింపఁబడినది. జనులకిట్టి యాదరము స్మృతి తంత్రులయందుఁ గల్గుచుండుటచే వైదికమార్గమునం దాసక్తిలేనివారలు కూడఁ దమసిద్ధాన్తములను జనులలో వ్యాపింపఁ జేయుటకు స్మృతితంత్రముల పేరఁ గొన్ని గ్రంథములను బ్రచురింపఁజేసిరి. కావునఁ బెద్దలు స్మృతి తంత్రములను వైదికములనియు నవైదికములనియు విభజించి వైదికమార్గానుయాయులచే వైదికస్మృతులు, వైదికతంత్రములే యనుసరణీయములుగాని పెఱయవిగావని నిర్ణయించిరి. ఇట్టి స్థితిలో వైదికమార్గరతులు ఏయవి వైదికములో ఏయవి కావో దెలిసికొని తత్తద్గ్రంథములను బ్రామాణ్యముతో గ్రహించుట యవసరము.

మఱియు ధర్మప్రవర్తకులగు నాచార్యులు ధర్మజిజ్ఞాసువులగు జనుల యుద్ధరణము కొఱకు ఇట్టి కర్మ - ఉపాసన - జ్ఞానబోధకములగు స్మృత్యాదులను జనసామాన్యములందు విశేష ప్రాచుర్యమును గను పురాణాదులయందుఁ గూడ నేదేని యొక ప్రసంగమున సమకూర్చుటయుఁ గలదు. ఇట్టి యత్నమువలన నాయాగ్రంథములు సామాన్యజనులకుఁ గూడ వారల యోగ్యతనుబట్టి విషయావబోధకములగుచున్నవి. కావుననే సూత సంహితయందు రుద్రాధ్యాయము, మహాభారతమున భగవద్గీత, సనత్సుజాతీయము, విష్ణుసహస్రనామము మున్నగునవియు సమకూర్పఁ బడియెను.

పై న్యాయము ననుసరించియే బ్రహ్మాండ పురాణాన్తర్గతముగ లలితారహస్యనామములను నుత్తమగ్రంథమును బ్రహ్మర్షులు సమకూర్చిరి. ఈ లలితారహస్యనామముల విశిష్టతను దెలిసికొనుటకు ముందుగా నీ లలితోపాసనమును గూర్చి కొంచెము దెలిసికొనవలసియున్నది.

అష్టవర్ష దేశీయుడగు బాలుఁడు వేదవిద్యను గ్రహించుటకుఁ దగు చిత్త సంస్కారమునందుటకై వేదసారమగు గాయత్రీవిద్య యుపదేశింపఁ బడును. ఈ గాయత్రి బ్రహ్మవిద్యయయ్యుఁ బసిబాలునికి నుపదేశింపవలసిన యవసరమున మాత్ృరూప విద్యాకల్పనముతో నుపదేశింపఁబడును. కావుననే గాయత్రీ రూపకల్పనము ధ్యానమున స్త్రీ భావము నందినది. ఈ గాయత్రియే ప్రకట గుప్త భేదముతో ద్వివిధమగుచున్నది. శాస్త్ర చోదిత విధిని జనకుఁడు తన పుత్రునికి అష్టవర్ష ప్రాయముననే యుపదేశించు నీ గాయత్రి ప్రకటగాయత్రియనియు, శాస్త్రపర్యాలోకనముచే విజ్ఞతా సంపాదనేచ్ఛతో యథావిధి గురూపసదనాదులఁ గావించి జిజ్ఞాసువు గుర్వనుగ్రహమునంది తన ప్రియత్నముతో నుపదేశమునందు నీ లలితావిద్యను గుప్తగాయత్రి యనియు సంప్రదాయజ్ఞుల వ్యవహారము. కావున నీలలితావిద్య ప్రకట గాయత్రివలె వయస్సుతో సంబంధింపక చిత్త సంస్కారము జిజ్ఞాసుత్వములతో మాత్రమే సంబంధించియుండును. ఈ విద్య విద్యలలోకెల్ల నుత్తమమైనదిగాఁ బ్రశంసింపఁబడుటవలన నిద్దానిని "శ్రీవిద్య" యనియుఁ బేర్కొందురు. అట్లే లలితా పరదేవతోపాసనమునఁ బ్రధాన ప్రతీకమునకు "శ్రీచక్ర" మనియు నందురు. దీనిని బట్టియే యీ విద్యయొక్క యతిశయము స్పష్టమగుచున్నది. కావుననే కొన్ని జన్మలనుండి చిత్తశుద్ధి యేర్పడినగాని యీ విద్యయం దాసక్తి గలుగదనియు, శ్రీ విద్యోపాసనము గావించు జన్మమే ద్విజునకుఁ దుదిజన్మమనియు—

''చరమే జన్మని యథా శ్రీవిద్యోపాసకో భవేత్ ।
నామ సాహస్ర పాఠశ్చ తథా చరమజన్మని ॥''

యను స్మృతి వచనము బోధించుచున్నది.

ఇట్టి యుత్తమమగు శ్రీవిద్యోపాసనమునకుఁ బ్రధాన ప్రమాణ గ్రంథము 'గుణనికా' రూపమగు శ్రీలలితా రహస్యనామములే. ఇయ్యవి లోకమున 'లలితాసహస్రనామ' శబ్దముచేఁ బ్రథితములై యున్నవి. లోకమున 'శత-సహస్ర' శబ్దము లనన్తపర్యాయములుగాఁ గూడఁ బ్రసిద్ధినందుటచే 'సహస్ర' శబ్దమునకు సంఖ్యావరత్వమే చెప్ప వలయునను నియమము లేదు.

## లలితా రహస్యనామ విశిష్టత :—

ఉపాసకుని కామనా విశేషమునుబట్టియు భక్త్యతిశయమును బట్టియు అంబికా శివ విష్ణు గణనాథ సూర్యాయతనములలో నాతని యుపాసనము వరలుచుండును. ఏయేదేవతలైనను నీ పంచాయతన ములయందే యంతర్భవించుచుండును. మహోపాసకులగు మహర్షులు తమతమ యభీష్టదేవతోపాసనానుభవముచేఁ గొన్ని కొన్ని దేవతా నామ రహస్యములకు ద్రష్టలై వెలసిరి. వీరలనే యనుకరించుచుఁ గొందఱు భక్తులుగూడఁ దమ యభీష్టదేవతలకు నామసాహస్రములను సంతరించుకొనిరి. ఈ విధముగా నేఁటి కాలమున సహస్రనామ గ్రంథ ముల సంఖ్య సహస్రాధికమే కాఁజొచ్చినది. ఏది యెట్లున్నను అవ్వాని ప్రసక్తితో మనకుఁ బనిలేదు. ప్రాచీన ఋషి దృష్టములను మాత్రమే మనము పరిశీలింతము. ఇయ్యవి శివ – విష్ణు – (రామ-కృష్ణ-హయగ్రీవ) గణపతి – అంబికా – (లక్ష్మీ-సరస్వతీ) సూర్యాదిదేవతా సహస్రనామ రూపములతోఁ బెక్కులు గలవు. వీని యన్నింటిలోను బ్రకృతమగు 'లలితారహస్యనామస్తోత్రము' ఉత్తమోత్తమమైనదని చెప్పవలయును. ఈ ప్రశస్తి 'వ్రతానాముత్తమంవ్రతం' అను స్తుతివంటిది మాత్రము గాదు. ఏలయనఁగా మిగిలిన సహస్రనామములలోని పదములన్నియు తత్తద్దేవతానామ బర్యాయములు, దేవతా సామాన్యరూపబోధకములు,

దేవతా విజయవాచకములు భక్తానుగ్రహ ప్రతిపాదకములే యగు చున్నవి. కాని యీ లలితారహస్యనామము లట్లుగాక 'శ్రీమాతా' యను తొలినామము మొదలు 'శ్రీ శివాశివశక్త్యైక్య రూపిణీ-లలితాంబికా" యను తుదినామమువఱకును గంభీర బహురసార్థ భావములతో వెలయుచు వ్యర్థమగు పదముగాని వర్ణముగాని యెందును గానఁబడక సూత్రశైలితోఁ బ్రకాశించుచున్నవి. ఒక్కొక్క నామము ఒక్కొక్క మహాభాష్యమున కర్హమై యొప్పును. ఈనామ గాంభీర్యమును బరిశీలించినచో వాస్తవముగా వాగ్దేవతలు జగదధిష్ఠాత్రియగు పరదేవత నెట్లు స్తుతింపవలయునో యట్లే స్తుతించినవని విద్వాంసులకుఁ దోఁచును. ప్రతి పదముగూడ సామాన్య జనావబోధ్యమగు వాచ్యార్థమునే గాక-లక్ష్య-వ్యంగార్థములను బహుభంగుల బోధించుచుండును. యథార్థమును దెలియఁ జెప్పవలయునన్నచో వేద చతుష్టయమునందును దెలియఁ జెప్పఁబడిన విషయజాతమునంతను సంగ్రహరూపమున సార్థమగు నూట యెనుబదిరెండు శ్లోకములతో వాగ్దేవతలు గానము చేసినవి. అట్టి యద్భుతమగు దర్శనము వాగ్దేవతలకే చెల్లినది. అది సామాన్యులకు ఎంత మాత్రము అలవిగాదు.

ఇందు శ్రీ పరదేవతా ప్రతీకమగు శ్రీ చక్రస్వరూపము తచ్చక్ర విలేఖన క్రమము ననుసరించి సూచింపఁబడినది. ఉపాసనక్రమమునకు అవశ్యోపాదేయమగు యోగమార్గానుసారముగ షట్చక్ర భేదము ద్వారా సహస్రారప్రాప్తి కుండలినీప్రసారము - తన్నిరోధము సుషుమ్నా మార్గగమనోపాయము - మున్నగు రహస్యములు వ్యంగ్యముగఁ గీర్తింపఁబడినవి. అట్లే గర్భోత్పత్తి, గర్భావస్థలు-దానికి వలయు నాహారాది నియమములు సూచింపఁబడినవి. శ్రీ చక్రార్చన క్రమము దెలుపఁబడినది. బహువిధ ఫలసాధకములగు మంత్రములు ఫలసాధన ప్రక్రియగూడఁ గీర్తింపఁబడినవి. ఇట్టి నానావిధ లౌకిక ఫలప్రాపకము లగు మంత్ర తంత్రములను బహుభంగులఁ దెల్పి యవ్వాని కనురూపము

లగు దేవతా స్వరూపమును గూడ సూచించుచుఁ దుదిని పరదేవత యొక్క వాస్తవ రూపమును నిరూపించెను. ఈ నిరూపణమునుబట్టియే శ్రీ లలితాదేవి యొక్క నిజరూపముమనకు సుస్పష్టమగును. దేవతా నిజ రూపమును మనము గుర్తెఱుంగక తదుపాసనమున నెన్నడును బ్రవర్తింపఁ గూడదు. కావున నుపాస్యదేవత యొక్క వాస్తవ రూపమును దొలుత దెలిసికొనవలయును. సామాన్యముగ లోకమున. శ్రీదేవి నిజరూపము స్త్రీరూపమనియుఁ గావున దదుపాసనము 'స్త్రీవిద్య' యనియు నొక ప్రతీతి గలదు. రహస్యనామములయందు శ్రీదేవి జగదుత్పత్తి స్థితిలయ కారణము ఉపనిషద్వేద్యమునగు పరబ్రహ్మముగాఁ జెప్పఁబడియెను. "శ్రుతిసీమంత సిందూరీకృత పాదాబ్జధూళికా, సకలాగమ సందోహశుక్తి సంపుటమౌక్తికా, సర్వోపనిషదుద్ఘుష్టా, సర్వవేదాంతసంవేద్యా, సచ్చిదానందరూపిణీ, చితిః, తత్పదలక్ష్యార్థా, చిదేకరసరూపిణీ, నామ రూప వివర్జితా, సృష్టికర్త్రీ, బ్రహ్మరూపా, గోప్త్రీ గోవిందరూపిణీ, సంహారిణీ రుద్రరూపా। తత్త్వమయీ, తత్త్వమర్థస్వరూపిణీ, నిర్లేపా నిర్మలా-నిరుపాధిర్నిరీశ్వరా, గాయత్రీ, వ్యాహృతిః సంధ్యా, ద్విజబృంద నిషేవితా" మున్నగు నామజాతము శ్రీదేవి నిజరూపమును వేదవేద్య త్వమును బేర్కొనుచున్నవి. దీనిని బట్టి రహస్యనామములందు వినఁబడు "మహాదేవీ, భవానీ, మహాత్రిపురసుందరీ, మహాదేవీ,మహాకామేశనయన కుముదాహ్లాదకౌముదీ, మహాకామేశ మహిషీ మున్నగు స్త్రీ రూపతా ప్రతిపాదక నామములకు బృహదారణ్యక ప్రతిపాదితమైన సృష్టి ప్రతి పాదక వాక్యములను దిలకించి యవ్వానిని బట్టి యర్థమును దెలుప వలయును. అందు-

"ఆత్మైవాగ్ర ఆసీత్పురుషవిధః సోఽనువీక్ష్య నాన్యదాత్మనోఽ పశ్యత్, సోఽహమస్మీత్యగ్రేవ్యాహరత్-సవైనైవరేమే, తస్మాదేవా-కేనైవరమతే, సద్వితీయమైచ్ఛత్, సహైతావానాస, యథా స్త్రీ పు-

మాంసా సంపరిష్వక్తౌ, స ఇమమే వాత్మానం ద్వేధాఽపాతయత్'
తతః పతిశ్చపత్నీచా భవతాం తస్మాదిదమర్ధ బృగళమివస్వః''
(బృహ. 1-4-1, 3)

దీనిని బట్టి జగత్కారణమగు బ్రహ్మమే స్త్రీ పుంభావములనందినట్లు తెలియుచున్నది. ఇట్టి ప్రథమస్థితికి మనోహరమగు రూపకల్పనము గావించి శాస్త్రము దంపతి భావముతో బ్రహ్మరూపమును వర్ణించెను. కావుననే శిష్టులు

''స్త్రీరూపం వాస్మరే ద్దేవీం పుం రూపంవా విచింతయేత్ ।
అథవా నిష్కలం ధ్యాయేత్ సచ్చిదానంద రూపిణిమ్''

అని వాక్రుచ్చిరి.

పైని నిరూపించిన విషయమును బట్టి శ్రీదేవి వాస్తవరూపము స్త్రీ మాత్రరూపముగాదనియుఁ, దద్విద్య సకలోపనిషదుద్ఘుష్టమగు బ్రహ్మవిద్యయే యనియు, శ్రీ విద్యోపాసనము వైదికమేగాని శుద్ధ తాంత్రిక మెంతమాత్రము గాదనియు మనము దెలియవలయును. కావుననే వైదికధర్మప్రవర్తకులగు శ్రీశంకరభగవత్పాదులవారు తాము నెలకొల్పిన పీఠచతుష్టయమునందును పరదేవతాప్రతీకములగు శ్రీ చక్రములను బ్రతిష్ఠించి శ్రీవిద్యను బ్రవర్తింపఁజేసిరి. ఇయ్యదియే యవైదికమగుచో నట్టి కార్యమును వారలొనర్తురా ?

అగ్నిస్వరూపుఁడగు సూర్యుని నుండి ప్రత్యక్షముగా మనము అగ్నిని పొందఁజాలనపుడు, విమర్శదర్పణమును (భూతద్దమును) మధ్యఁజేసి మనమగ్నిని సంపాదించిన విధమున సాక్షాద్వేదమునుండి మనమొక యర్థమును సంపాదింపలేనియపుడు తదనుసారి స్మృతులవలననో తంత్రములవలననో యా యర్థమును సంపాదింపవలయును. అంతమాత్రమున నావిద్య అవైదికమనియుఁ గేవల తాంత్రికమనియుఁ జెప్పఁగూడదు. శ్రీవిద్య వైదికమే.

కర్మాచరణమున వాచికమగు మంత్రోచ్చారణముతోఁ గూడిన దైహికక్రియ యెట్టి ప్రధానస్థానము నాక్రమించునో యట్లే యుపాసనమునందు వాచికమగు మంత్రోచ్చారణముతోఁ గూడిన మానసిక క్రియ యట్టి ప్రధానస్థానము నాక్రమించును. ఇయ్యది జ్ఞానమునకు సన్నిహితమగుటచే దేవతాస్వరూప స్వభావాదికమును అవిరతము శుద్ధ చిత్తముతో మననము చేయవలసిన యావశ్యకత యెంతేనియుఁగలదు. వాఙ్మయమున మననమున కుపయోగించు రచనాపద్ధతులు రెండు మాత్రమే భారతీయులచే నంగీకరింపఁ బడినవి. అవి 1) పద్యరచనము 2) సూత్రరచనము. ఈ రెండింటిలో విషయ విమర్శనము ప్రధానముగా గల శాస్త్రములకు సూత్రరూపము, స్తుతిరూపమున నెల్లప్పుడు స్వరూప స్వభావాదుల నవగతముగావించుకొని తద్భావ భావితులగునట్లు స్తుతించుకొనుటకు పద్యరూపము (ఛందోరూపము) గ్రహింపబడినవి. కావుననే దేవతా స్తుతులన్నియు ఛందోబద్ధములుగాను దర్శనాదులు సూత్రరూపములుగాను వెలయుచున్నవి. సామాన్యముగాఁ బ్రాచీనులు ఈ స్తుతుల నన్నింటిని గీర్వాణవాణియందే వెలయించిరి. అద్దానియందు గాంభీర్యమను నొక విశిష్ట ధర్మముండుటచే బహువిధములగు నర్థములను ననేక రీతులఁ దెలుపుటకుఁ దగునవకాశము గలదు. కాని కాలక్రమమున జనసామాన్యమున కాభాష యర్థముగాక స్తుతుల కుద్దేశింపఁబడిన ఫలమును జనులు పొందలేకపోవుటచేఁ బ్రతి దేశమునందును దేశభాషల యందే యా గీర్వాణ స్తుతులకుఁ బరివర్తనములు వెలువడఁ జొచ్చినవి. ఈ పరివర్తనములన్నియు వచనవివరణము రూపమున నేయున్నవి. లలితా రహస్య నామ ములకుఁ గూడఁ బెక్కులు వచనరూప వివరణములున్నవి.

**తల్లి విన్కి :-**

మిగిలిన నామసహస్ర స్తుతులెట్లున్నను భారతవర్షమున ఈ లలితారహస్యనామ స్తుతిమాత్రము అర్థగాంభీర్యమున నేమి విషయ ప్రాశస్త్యమున నేమి రచనా సౌందర్యమున నేమి అత్యుత్తమ స్థానము

నందినట్లు పూర్వమే నిరూపించితినిగదా! ఇయ్యది వాగ్దేవీ గానరూప స్తుతి. కావున నిది "వేదానాం సామవేదోఽస్మి" యను భగవత్స్మృతిచే భగవద్రూపముగా నెన్నఁబడు సామశాఖకు సంబంధించిన యామ్నాయ మని సంప్రదాయ ప్రవర్తకాచార్యుల యాశయము — అట్లగుటచే నియ్యది దేశభాషలందుఁ గూడ గానయోగ్యమగు ఛందోబద్ధమే యగుటలెస్స. కాని యట్టివి మాత్ర మింతకుముందున్నట్లు కానరాదు. ఈ స్తుతికి వైకృతములయందు గానయోగ్యముగఁ దొలుత నవతరించిన గ్రంథ మియ్యదియే. శ్రీ వాగ్దేవతా పరావతార రూపులు మహాభక్త శేఖరులు హరికథా పితామహులు గీర్వాణాద్యష్టభాషా తత్త్వవిదులు సకలశాస్త్ర రహస్యకోవిదులు సర్వతంత్రస్వతంత్రులు నగు శ్రీ మజ్జాడాదిభట్ల నారాయణదాసుగారు ఇద్దానిని "తల్లి విన్కి" యను పేరఁ దెలుగులోనికిఁ దెచ్చుట తెనుఁగువారికి వెలుఁగు చూపుటయే యని చెప్పవలయును. ఇయ్యది తెలుఁగునాడు భాగ్యము. సకల మోక్షమార్గములను బాగుగా నెఱిఁగి యవ్వానిని అనవరతము ప్రచారము గావించి భారతీయ జనోద్ధరణమునకుఁ దనజీవితము నంకితము గావించిన శ్రీ దాసవర్యులు సంపూర్ణానుభవమును గడించి తమ యశీతి తమవర్షమున నీ రహస్యనామమును జేతఁ బట్టుటలోనే యిద్దాని యతిశయము వ్యక్తమగుచున్నది. దానినిబట్టియే వారి దృష్టిలో నీ రహస్యనామ స్తుతి కెట్టి స్థానముగలదో మన మూహించుకొనవచ్చును. వారి యీ రచనమును బరిశీలించినచో సకల పురుషార్థములను గలుగఁజేయు సామర్థ్యము ఈ రహస్యనామ స్తుతికి మాత్రమే గలదని శ్రీ దాసుగారి హృదయమను నభిప్రాయము మనకుఁ గలుగకమానదు. వారు తమ జగజ్జ్యోతి యందు "కన్నతల్లీ, ఆదిశక్తీ, బాలత్రిపురసుందరీ, తెలిసీ తెలియని నరపశువును నేను. సర్వజగదుపకారముగా హాయిగా నూఱేండ్లు నన్నుఁ బెంచుము. ధర్మమార్గమునుండి నన్ను జారిపోనీకు మోజగన్మాతా" యని జగద్ధాత్రిని వేఁడుకొనినారు. మహాభక్తవతంసులగు శ్రీ దాసుగారి

యీ పవిత్ర కృతివలనఁ దీర్ణులయి, వారు అర్థజ్ఞానరహితులకుఁ బారాయణఫలమును అర్థవేత్తలకు మననానుకూల్యమును వమకూర్చి తరింపఁ జేసినారనుటలో లవంత యేనియు నతిశయోక్తి లేదు. ప్రతి నామము తుదినిగూడఁ దత్తన్నామసంకీర్తన ఫలవిశేషమును జేర్కొనుటలోనే యీ గ్రంథము ఒక రూపమున శ్రీదేవీ నామస్తుతికి భాష్యమా యనిపించును. మంత్రార్థజ్ఞానమనఁగా మంత్రప్రయోజనజ్ఞానమని శిష్టవ్యాఖ్య గలదు. అట్టి యాశయముతోడనే శ్రీ దాసుగారు నామప్రయోజనమును దుదియందుఁ జేర్కొనుట. ఇయ్యది యీ గ్రంథమునకుఁ గల విశిష్టత.

ఈ గ్రంథము శ్రీ దాసుగారిచే అచ్చతెలుఁగునందుఁ గీర్తింపబడినది. సహజముగ వారికి అచ్చతెలుఁగనిని నెనలేని యభిరుచి. తాము గీర్వాణభాషయందుఁ జిన్ననాటినుండి బహుగ్రంథములను సంతరించియుఁ దనకు హృదయము మాత్రము అచ్చతెలుగునందేయని —

''మొలకలేఁతఁదనము తలిరుల నవకంబు
మొగ్గసోగఁదనము పూవుఁదావి
తేనె తీయఁదనము తెన్గునకేగాక
పరుష సంస్కృతాఖ్య భాషకేది''

అని నుడువుచుఁ దమ యీ పద్యమునందే తెలుఁగు సౌకుమార్యమును సంస్కృతభాషాకాఠిన్యమును దెలిపినారు. ఈ యభిప్రాయమిట్లున్నను దాము తమ ప్రధానగ్రంథములను దెలుఁగులోనే వ్రాయుటకు హేతువు ప్రతిజ్ఞారూపముతో నిట్లు వ్రాక్రుచ్చిరి.

"తెలుఁగువారలకు స్పేటతెల్లముగను, దెలుఁగులోనెల్ల విద్దెలఁ దెలుపనెంతు అన్నివిధముల ననుఁగాంచు నాంధ్రదేశమునకు నాయచ్చియున్నయప్పనముఁ దీర్తు" దీనివలన శ్రీ దాసుగారి దేశభక్తి, స్వదేశీయులయందుఁగల గాఢమగు ప్రేమయుఁ దెల్లమగుచున్నవి. ఇట్టి తమ యభిప్రాయమునే ఈ గ్రంథాదియందు 'తల్లివిన్కుడుదురు' న సంప్ర

దాయానుసారముగఁ దా నీవివరణమును వ్రాయుచున్నాననియు నా వ్రాఁతగూడఁ దెలుఁగుజాతి పద్దెములలోనే యచ్చ తెలుఁగునందే వ్రాయుదుననియు అట్లు వ్రాయుటయే న్యాయమనియుఁ దమ హృదయ మును వెల్లడించిరి—

''అన్నిటికిన్ గతమౌ గట్టుపట్టి,
వేయి పేర్లకు వరుస వివరమొనర్తు,
మాటకూర్పులఁ దగుమట్టు లేర్పర్తు
వంచ చెండడ్డు చెప్పన్ దోడెడల్చి
టీకలో నుడు-వు రెంట్టింపను పేర
తొల్లింటి చదువర్ల త్రోవఁ ద్రొక్కెదను
పగడ నాటుతెలుఁగు పల్కె పల్కెద.
ఎల్లనుడువ్వలకుఁ దెల్గే మేటిమాట,
అని చాటిచెప్పెద నందఱ కిటుల".

సామాన్యముగ ఉత్తమ గ్రంథములను అర్థజ్ఞానపూర్వముగ బఠించుచు విషయమును మననము జేసికొనువారలు చాల యరుదు. అట్టి యుత్తమాధికారులు పరిపూర్ణ ఫలమునందగలరు. అయినను సామాన్యులుగూడ నుత్తమగ్రంథమును జదువవలసినదే. అట్టివారికి సంపూర్ణ ఫలము లభింపకపోయినను బారాయణ ఫలము లభింపకపోదు. ఈ యభిప్రాయమునే శ్రీ దాసుగారు ఇట్లు నుడివిరి.

"వేల్పునుడుల తల్లి వెయిపేర్లుదెలిసి - వినికి సలుపుఁదగు విన్నాణి యెవఁడొ''
''తొలిపలుకులనోట దొర్లించినంత - కోరిక లీడేర్పు గుబ్బలి పట్టి
తెఱగంట్లనుడిగాని - తెల్గునన్గాని, తనుఁగొల్చువారి న - త్తల్లి కాపాడు.
వెలితివ్వటెంకి వేపేర్ల వినకరి, పొగడు డింగరుల కెప్పుడు లోటురాదు."

కావున నర్థము దెలిసినను తెలియకపోయినను శ్రీ మాతృనామ ముల నెల్లప్పుడును గీర్తింపవలయును. శ్రుతిరూపమగు మూలనామము లను జదువనధికారము లేనివారలకు ఈనామములు సర్వథా సముపాదేయ ములై యుపాసింపవలననే తత్ఫలము నందవచ్చునను విషయముగూడ వేఱఁ జెప్పఁబనిలేదు.

ప్రధాన సామయిక ధర్మము :-

శ్రీ విద్యాదీక్షయందు నాచార్యుఁడు దీక్షితుఁడగు శిష్యునకుఁ గొన్ని ధర్మముల నుపదేశించును. అవ్వానినే సామయిక ధర్మములని" యందురు. అందు - "స్త్రీ సామాన్యే దేవతాబుద్ధిః - జాయాంవినా" అనునది ప్రధాన సామాన్య ధర్మము. అట్టి యుత్తమధర్మమును విశేష వివరణముతో (శ్రీ) దాసుగారిట్లు వివరించి సంప్రదాయ ధర్మమును లోకమునకు నెఱుకపఱచిరి.

"ఆడుదేనికముగా - నగపట్టు వేల్పు, పొలఁతులకెల్ల వేల్పుదు సల్పువలయు, మగువ నేఁచెడువాఁడు - మగవాఁడుగాఁడు."

"లేమలు కినియ నల్గెదరు వేలుపులు, చెలువలలరఁదని - సెదరు జేజేలు" ఈ యాశయమునే మనువుగూడ.

"యత్రనార్యస్తు పూజ్యన్తే రమన్తే తత్ర దేవతాః!
యత్రైతాస్తున పూజ్యన్తే సర్వాస్తత్రా ఫలాఃక్రియాః (మను.3-56)
తస్మాదేతాః సదాపూజ్యాః భూషణాచ్ఛాదనాశనైః
భూతికామై ర్నరై ర్నిత్యం సంస్కారేషూత్సవేషుచ॥ (మను.3 - 59)

సత్యమే, "కలకంఠి కంటికన్నీరొలుక సిరియింట నుండనొల్లదు గదా! భారతీయులు స్త్రీలయందెట్టి యాదరమును బ్రదర్శించిరో దీనిని బట్టి మనము గ్రహింపఁగలము.

"మాతృదేవోభవ" (తైత్తిరీయ) యనెడి యుపనిషదుక్తికిని "(శ్రీ)మాతా" యను రహస్యనామ ప్రథమ్యమునకును భాష్యప్రాయ ముగాఁ దమ యుపోద్ఘాతమున నిట్లు పేర్కొనిరి-

"పిల్లలరయెడఁ గన్నతల్లి కన్నఁ బైవారికిఁ గూర్చి యంతగానుండదు కనుక నోజగా నింగినేలల దిన్నులన్నియు న్దనయాటకై దాఁచుట్టించి పెంచి తనలోఁ జేర్చుకొనఁగల్గిన చేవయే తల్లియన నొప్పునని తెలిసిన తొల్లింటి పెద్దలు కన్నతల్లినే వేల్పుఁగా గొల్వాజొచ్చిరి."

"ఆడుకూఁతుళ్లే మందిలో నెల్ల నిండుకుండలుకన్న తల్లులు. కనికరము ఓర్పుగలవారలాడువారల న్మగవారలన్నూడఁ దమ కడుపునఁ బది నెలలు మోసి కని పెంచి మంచినడువడి న్మప్పి యందరికి న్మేలు సల్పఁగల వారు...తల్లి నోర్పల్పఁ గొంతవఱకైన వీలున్నదిగాని తండ్రినెప్ప నెవని తరము? కావున నాడుది నిక్కము. మగవాఁడు కల్ల. కావుననే తొంటి పెద్దలు తల్లినే వేల్పుగా నమ్మి కొల్పుట తగవని నమ్మవలసివచ్చెను".

ఇట్లు సామాన్యజనులకుఁ దెలియునట్లు పరదేవతా స్వరూపము స్త్రీ రూపముగా వర్ణించియు నుత్తమాధికారుల హైమవతీరూపము నిట్లు పేర్కొనిరి —

"మైమఱచిన కూరుకు, మెలకువ, కలకూర్కుల న్మించినది నాల్గవ యునికి. అట్టి నాల్గవయున్కిఁబుట్టిన నిండుతనుపే వైదవయున్కి గట్టు పట్టి యనన్బడును".

దీనినిబట్టి పరదేవతా వాస్తవరూపము మనోవాగతీతమగు పరబ్రహ్మరూపమేయని వారు భావించినట్లు సుస్పష్టము.

ఇట్లు స్త్రీ గౌరవము గలవాఁడే శ్రీవిద్యా గౌరవమును బాటించిన వాఁడగునని దెల్పుచు శ్రీ దాసుగారు ఇట్టి యుత్తమ విద్యయందు అధికారియగువాఁడు గల్గియుండవలసిన సుగుణములను నిట్లు పేర్కొనిరి.

"నిండారు నోరిమి - నిబ్బరికంబు, మాటనిల్కడతన్వి - మంచినడువడి తాల్మిదలుగఁబోని - దక్కోలు బ్రతుకుజంజాటమెడిలి పీచ మెడసి మిగుల, నడఁకువ - తోడుత - నందఱపట్ల నడుచుచుఁ - ద్రాగక - నంజుడు దినక, చదువు గోటునఁ దెగసాగక, పనికిమాలిన కోర్కులం బడయక లేని, పోని తలంపులఁ బొరయక తనకుఁ గలదానితోడుత న్గడుఁ దన్విఁబొంది గుండె బిగువు కల్పు-గోలుతనమ్ము, ఇమ్ములఁగూర్పువాఁడే తల్లివిన్కి, గిడియతోఁ జాటఁదగిన మొనగాఁడు"

పైని శ్రీ దాసుగారు చెప్పిన లక్షణములన్నియు బ్రహ్మవిద్యాధికారి యొక్క లక్షణములుగా బ్రహ్మవిదులు పేర్కొనినవి. ఇయ్యవియే - "నిత్యానిత్యవస్తు వివేకము, ఇహాముత్రార్థ ఫలభోగవిరాగము, శమ - దమ-ఉపరతి - తితిక్షా - శ్రద్ధా - సమాధానరూపమగు సాధనసంపద, ముముక్షుత్వమను సాధనచతుష్టయ సంపత్తి. ఇట్టి సాధన చతుష్టయ సంపద గలవాఁడే బ్రహ్మవిద్యాధికారి - కావుననే బృహదారణ్యకమున యాజ్ఞవల్క్యమహర్షి జనకున కుపదేశమును గావించుచు నాతని గుణ శీలముల నిట్లు పేర్కొనెను.

"తస్మాదేవం విచ్ఛాన్తోదాంత ఉపరత స్తితిక్షు స్సమాహితో భూత్వా ఆత్మన్యేవాత్మానం పశ్యతి, సర్వమాత్మానం పశ్యతి, నైనం పాప్మాతరతి, విపాపో విరజోఽ విచికిత్సో బ్రాహ్మణో భవతి, ఏష బ్రహ్మలోకః సమ్రాట్" (బృ. 4-4-23)

దీనిని బట్టి యీ శ్రీ విద్యోపనిషత్తుగాఁ జెప్పఁబడు నీ రహస్య నామముల యందధికారి, పై బ్రహ్మవిద్యాధికారియే యనియు శ్రీవిద్య యనఁగా బ్రహ్మవిద్యయే యనియు శ్రీ దాసుగారు నిర్వచించినట్లు స్పష్టమగుచున్నది.

గ్రంథరచనాపద్ధతి :-

శ్రీ దాసుగారు ప్రతినామమునకును దొలుత అర్థమును తరువాత నద్దాని వివరణమును ఫలమును వివరించుచుఁ దమ వివరణ గ్రంథమును రచియించిరి. మచ్చునకు — దుర్గా (191 నామము) శబ్దార్థ నిరూపణమున —

"ఇడుమలోర్చినవారికే చిక్కువేల్పు, ఎప్పటికి న్దొమ్మిదేండ్లయీడు చెలి సమరతపర్వ ముచ్చటలూరుపడచు, కాల్దొరిక్కు కానిముగతిమెట్టబొట్టె మగవానినెఱుఁగదామల దొరపిల్ల, ఆద, సేఁత, నుడుల కందనియంకు అల్మగల్ దానెయూ నా గట్టుపట్టి, వరవుఁగోటవలెఁ గాపాడెడు వేల్పు"

ఇందుఁదొలుత యౌగికార్థ వివరణముతోపాటు ఆగమమున 'దుర్గా' నామమెంత వయసుగల కన్యకకుఁ జెప్పఁ బడినదో, యట్టి విశేషము, ఆ దేవతాస్వభావము, అట్టి విశేషములతో దుర్గాదేవ్యుపాసనము గావించువానికిఁగలుగు ఫలముగూడఁ దెలుపఁబడినవి.

'త్రిస్థా' యను (874) నామార్థ ప్రదర్శన ప్రసంగమున —

''మూఁడు లెక్కలనిల్చు ముద్దులగుమ్మ, ముచ్చోట్లు, చదువులు మూఁడు ముత్తెగలు
దారులు ముచ్చయై దారలు మూఁడు, కోర్కెలుతివ వెలుగులు మూఁడు మేళ్లు
మూఁడు పాడులు మూఁడు మూఁడు పలుకులు, దొనగులు మూఁడు బ్రతుకుతీర్లుమూఁడు
తరుణము ల్మూడేడు తరువిరువంచ, కొలతలు మూఁడెటుకువలు మూఁడిటుల.
బలుమూళ్ళ నిల్వఁగున్వలిగట్టు వట్టి, ఘండని ముత్తెఱఁగుల నేలువేల్పు''

ఇట్లాగమానుసారముగ నర్థమును బెక్కునామములకు వివరించియు విశేషించి బహుభంగుల నర్థమును వివరింపవలసిన గంభీరములగు కొన్ని చోటులయందు నాయర్థము సంప్రదాయ రహస్యమగుటచే గురుముఖైకవేద్యమే యను దలంపుతోఁ గాఁబోలు అట విశేషించి యర్థమును వివరింపలేదు. కావుననే ''శ్రీమద్వాగ్భవకూటైక స్వరూపముఖ పంకజా, కంఠాధః కటిపర్యంత మధ్యకూట స్వరూపిణీ, శక్తికూటైకతాపన్న కట్యధోభాగధారిణీ;

ప్రతిపన్ముఖ్యరాకాంత తిథిమండల పూజితా, గురుమండల రూపిణీ, మున్నగు నామరహస్యములను లఘువుగానే నిరూపించిరి. ఇందుఁ గతిపయ నామార్థ వివరణ ప్రసంగమున భాస్కరరాయ నిరూపితమగు వామాచారమును (శ్రీ) దాసుగారు కీర్తించినను అయ్యది ద్విజేతర విషయమే యని వారి యభిప్రాయము. కానిచో అధికార నిరూపణమున వారు దెల్పిన ''తాంత్రిక, నంజుడు దినక'' అను ప్రభావ లక్షణములు విరోధించుమగదా !

ఇట్టి స్తుతిగ్రంథము, గానానురూపమగుటంజేసి శ్రీ దాసుగారు తమ వివరణ గ్రంథమునకు దేశీయచ్ఛందమగు మంజరీద్విపదను 'చెండు' అను పేరఁ బరిగ్రహించిరి. దేశీయచ్ఛందములలో ద్విపద గానానుకూలమైనదను విషయము వేఱఁజెప్పఁబనిలేదు. సామాన్య ద్విపదకును మంజరీ ద్విపదకును గణములలో భేదములేకపోయినను ప్రాసనియమము మాత్ర మీ మంజరీద్విపదకు లేదని—

"శక్రతోయంబును సవిత్రుండుపాద - విక్రీడితులు మృదుద్విపదికి నెపుడు వళియుఁ బ్రాసంబును వలయు దీనికిని; వలదు ప్రాసంబంద్రు వరుస మంజరికి" (కావ్యాలంకార సంగ్రహ) అని విన్నకోట పెద్దన చెప్పెను.

ఇందు హెచ్చుగా 'చెండ్లు' వాడఁబడినను అటనట గీతపద్యములు సీసములు కందములు గూడ వాడఁబడినవి.

ఇట్లు దాసుగారు శ్రీ దేవీరహస్యనామములకుఁ దెలుఁగు వారలకు మహోపకారము గల్గునట్లు వివరణమును వ్రాసియుఁ దమ గ్రంథము అచ్చతెలుఁగులో నుండుటచేతను, అయ్యది ఆంధ్రులందఱకు సుగమము కాకపోవుటను గ్రహించి యవ్వారల కుపయోగపడునట్లు తొలుత నే యొక ప్రతిపదార్థ సూచికను గూడ వర్ణక్రమానుసారముగ సంతరించిరి. దీనివలన అర్థజిజ్ఞాసువులకు గొంత శ్రమ తగ్గినది. కష్టించియైనను ఈ తల్లివిన్కిని పారాయణముసేయు తమసాటితెలుగుప్రజలకు ఆ మహానుభావుఁడు కోరిన ఫలము—"నాయీవ్రాఁత నాతోటిపాటివారలకు మేలుచేకూర్చుఁగావుత మని తల్లి వేయిపేర్ల విన్కి నిల్లేనాటు తెలుగున నాయీ యెనుబది యేండ్ల యీడున వ్రాయించిన నా యిలవేల్పు నన్ను న్నామముఁచి చదువఁ గల న్దగుకోరికలొసంగి కోరిన న్నేండ్లు హాయిగా బ్రతికించి తనయండెల్లరికిని నమ్మిక హెచ్చించి యీ మేనులతో నే తనలోఁ జేర్చుకొనుఁగాక."

ఇట్లుపాసన విషయమునఁ బ్రధాన ప్రమాణమగు శ్రీదేవీ రహస్య నామ గ్రంథమునకుఁ దనసాటి యాంధ్రుల నుద్ధరించి తరింపఁజేయుటకై మనోహరమగు వివరణమును రచించి యనుగ్రహించిన తాము నాటు తెనుఁగులో నీ స్తుతిని వ్రాయుటకుఁ దగు హేతువులను అద్దానివలనఁ గలుగు విశేషఫలములను ఎంతయో వినీతితోఁ దాము పరదేవతకు విపులముగ శ్రీ దాసుగారే తమ "కుదురు" లో నివేదించుకొనినారు గావున ఆ విషయము లీ నా వ్రాఁతలో సూత్రప్రాయముగనే పేర్కొన బడినవి.

ఇట్లు సాటివారలకై తమ వార్ధక్యమునందు మిక్కిలి పాటుపడిన శ్రీ దాసుగారు ఆంధ్రుల కందఱకును బరమపూజ్యు లగుచున్నారు. వారనుగ్రహించిన యీ "తల్లివిన్కి" ని దెలుఁగువారందఱు పరమ ప్రమాణభావముతో గ్రహించి దేశమునం దెల్లయెడల నీ పవిత్ర గ్రంథ మును బ్రవర్తింపఁజేసి తాము ధన్యులై తోడివారలను ధన్యులనుగాఁ జేసినప్పుడే శ్రీ దాసుగారి యాశయము నెరవేరును గావున నట్లుచేయుట మనవిధియై యున్నదని తెలుగువారలందఱు కృతజ్ఞతతో గ్రహింప వలయును.

# నా యెఱుక

## [ శ్రీ నారాయణదాస స్వీయచరిత్ర ]

కుమార ధూర్జటి శ్రీ వావిలాల సోమయాజులు

౧

"నా యెఱుక" సర్వతోముఖ ప్రతిభా విజ్ఞాన ప్రపూర్ణులు, సంగీత సాహిత్యరత్నాకరులు, "హరికథాకర్తృ కాలక్షేప పితామహ" బిరుదాంకితులు, ప్రసాదిత హరిదాసజన జీవనులు, ప్రముఖాంధ్ర మహాపురుషులు, కారణజన్ములు, చిరస్మరణీయులు అయిన శ్రీ ఆదిభట్ల నారాయణదాసుగారి స్వీయచరిత్ర.

ఆధునికాంధ్రసాహిత్య యుగకర్తలుగా పేరెన్నికగన్న శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారు సి. వై. చింతామణి ప్రభృతులైన మిత్రప్రముఖుల ప్రోత్సాహముతో ఆత్మకథారచనమునకు పూనుకొంటిననియు, 'తెలుగుభాషలో స్వీయచరిత్ర రచనకిది ప్రథమప్రయత్న' మనియు తమ గ్రంథావతారికలో చెప్పియున్నారు. దీనినిబట్టి స్వీయచరిత్ర రచనాభాగీరథులు కందుకూరి వారనిపించును.

"తెలుగులో స్వీయచరిత్రలు లేవనియు, అట్టి వానిని తాము వ్రాయవలయుననియు దాసుగారికి తోచెను. అంతట తన చరిత్రము ముప్పది యేండ్లవరకు దాసుగారు వ్రాసిరి. ఇంతలో వీరేశలింగం పంతులుగారి స్వీయచరిత్ర ప్రథమభాగము బయల్వెడలెను. దాసుగారు

త్తాము వ్రాయుచుండిన స్వీయచరిత్రము నాపివేసిరి" — అని శ్రీ నారాయణదాస జీవితచరిత్రకారులు (పే. 237) తెలిపినారు. శ్రీ వీరేశ లింగంగారి స్వీయచరిత్ర ప్రథమభాగము 1903లో చింతామణీ ముద్రణాలయమున ముద్రణనొంది ప్రకటితమైనది. దీనినిబట్టి ప్రకటనదృష్ట్యా శ్రీ కందుకూరివారి స్వీయచరిత్రకు ప్రాథమ్యమున్నను, రచనదృష్ట్యా శ్రీ ఆదిభట్లవారి ఆత్మపరిచయమే" ['నా యెఱుక'] తెలుగున పుట్టిన తొలి స్వీయచరిత్ర అనవలసియున్నది. ఆదిభట్లవారే ఆత్మకథాభగీరథులు ; వారి 'నా యెఱుక'యే ప్రథమాంధ్ర స్వీయచరిత్ర రచన.

శ్రీ ఆదిభట్ల నారాయణదాసుగారు పార్వతీపురమున కెనిమిది మైళ్ళ దూరముననున్న సువర్ణముఖీనదీతీరమందలి అజ్జాడ గ్రామములో రక్తాక్షి శ్రావణ శుద్ధ చతుర్దశి బుధవారమునాడు [31-8-1864] అవతరించిరి. కారణజన్ములైన వీరు బాల్యమాదిగ శక్రధనువువలె శబలిత కాంతులతో శోభిల్లిన సహస్రమాస జీవితమును గడపి, సర్వప్రయోజనములను సాధించి 2-1-1945లో నిర్యాణమొనర్చిరి. పూర్ణపురుషాయుష జీవులైన ఈ మహనీయుల తొలి ముప్పది సంవత్సరముల జీవితచరిత్ర [1864 – 1897] 'నా యెఱుక' అను స్వీయచరిత్రకు కథావస్తువు.

1903 లో శ్రీ వీరేశలింగంపంతులు స్వీయచరిత ప్రకటితమగుటకును శ్రీ దాసుగారు తమ స్వీయచరిత్రను ఆపివేయుటకును గల సంబంధము అతర్కితోపనతము; కేవలము కాకతాళీయము. తెనుగున స్వీయచరిత్రలు లేనిలోపమును తీర్చుటకె 'నాయెఱుక'ను రచింపనుద్యమించిన శ్రీ దాసుగారు శ్రీ వీరేశలింగంపంతులుగారి ఆత్మకథా ప్రకటనతో ఆలోపము తీరినదిగదా యని భావించి, తమ స్వీయచరిత్రను ఆపివేసిరనుట అంగీకరింపదగినదికాదు. శ్రీ కందుకూరివారి స్వీయచరిత్ర రచనారామణీయకమునగాని, సత్యార్థ ప్రకటనా వైశిష్ట్యమునగాని తమరచనకంటె మిన్నగ సాగినదనుటచే వెఱచి ఆపివేసిరనుట అపచారము.

శ్రీ దాసుగారు మొదటినుండియు 'నాయెఱుక'లో తమ ముప్పది సంవత్సరముల జీవితమునే నిక్షేపించ నుద్దేశించినారు. తొలుత ప్రకటిత మైన శ్రీ కందుకూరివారి స్వీయచరిత్ర శ్రీ దాసుగారిని పునరాలో చనకు పురికొల్పి, తమ మొదటి ఉద్దేశమును దృఢతరమొనర్చుటకు తోడ్పడియుండును. "ముప్పదియేండ్ల జీవితకథతోనే తమ స్వీయచరిత్ర నేల ఆపివేసి" రని ప్రశ్నించినపుడు శ్రీ నారాయణదాసుగారు ఇట్లు చమత్కారముగ సమాధాన మిచ్చిరట!

"ఎవ్వని చరిత్రమైనను ముప్పదియేండ్లు వఱకే లోకమెఱుగవల యును. ఆపైని అనవసరము. ముప్పదియేండ్ల వరకే సుగుణముండును. ఆపైన పేరాసయు, అసంతుష్టియు పెచ్చురేగిపోవును. దైవత్వము నశించును. దేవతల నందుకే త్రిదశు లన్నారు. ముప్పదియేండ్లు దాటిన మీదట నందరు రాక్షసులే."

ఇందు శ్రీ దాసుగారు వెల్లడించిన అభిప్రాయములలోని సత్యా సత్యము లెట్లున్నను స్వీయచరిత్రకు వారు మొదటినుండియు ఉద్దేశించిన వస్తువు తమ ముప్పదియేండ్లు జీవితకథ మాత్రమే అని ప్రస్ఫుటమగు చున్నది. 'ముప్పదియేండ్లు దాటిన మీదట అందఱు రాక్షసులే' అన్న శ్రీ దాసుగారి భావము ప్రముఖాంగ్ల సాహితీవేత్తలలో నొకడును, విశిష్టభావుకుడు, చమత్కారచతురుడునైన జార్జి బెర్నార్డుషా వెలి బుచ్చిన "Every gentleman over forty is a scoundrel" అన్న ఛలో క్తిని స్మృతికి తెచ్చుచున్నది.

'నాఱుక'ను శ్రీ దాసుగారు తమ ముప్పదియేండ్ల జీవితకథతోనే ముగించుటయందలి సామంజస్యమును మరొకరీతిగ భావింపవచ్చును. గురుముఖతః విద్యలార్జించువారు, ఆగురువర్యులిచ్చు ప్రోత్సాహ దోహదములతో విజృంభించి ఇంటగెలిచిన పిమ్మట రచ్చగెలుచుచు జీవిత విజయపరంపరలను చేకూర్చుకొందురు. 'స్వశక్తితో విద్యలార్జించు వారు, పరంపరాగతములైన ప్రోత్సాహదోహదములు సహజముగ

సంప్రాప్తింపనందున వ్యతిక్రమమార్గమున స్వైరవీరవిహారము లొనర్చి తొలుత రచ్చ గెలిచి తదుపరి ఇంటగెలిచి విజయపరంపరలను చేకొందురు. శ్రీ దాసుగారు రెండవకోవకు చెందిన ప్రతిభావంతులు. విద్వాంసులందలి స్పర్ధాసంశయములు హేతువులుగా స్వస్థానమునం దేర్పడిన వ్యతిరేకతలవలన వీరికి ఆరంభదశలోనే ఆత్మప్రభువులైన ఆనంద గజపతుల ఆదరగౌరవములు లభించలేదు. అందుచే వీరు ప్రథమమున మైసూరు పర్యంతము పరస్థానములందు విద్యావైతయాత్రలొనర్చి, దిగ్విజయ గౌరవధన్యులై, కీర్తిప్రతిష్ఠలతో తిరిగివచ్చి విజయనగర ప్రభువుల ఆహ్వానసత్కారము లందుకొనిరి. ఇట్లు "సర్వత్రపూజ్యత" "స్వస్థల విజయ పరితృప్తి" లభించినదశ శ్రీ దాసుగారి ముప్పదియేండ్ల వయసుతో ముగిసినది. శిష్యశిక్షార్థము ప్రదర్శింపవలసిన సమస్త ముఖ్య లక్షణములుగల వారి ప్రౌఢవ్యక్తిత్వము ఈ వయసునకు పూర్ణముగ రూపొందినది. లోకమునకు మార్గదర్శకములుగ వెల్లడింపదగిన జీవితానుభవములన్నియు వారికీ కాలమునకే చేకూరినవి. ఈ సమస్త విశేషమును 'నాయెఱుక' రచనకు పూనుకొనుటకుముందే సింహావలోకన మొనర్చి యుండుటవలననే శ్రీ దాసుగారు తమ స్వీయచరిత్రకు ముప్పది సంవత్సరముల జీవితకథనే వస్తువుగా పరిమితమొనర్చి స్వీకరించియుం దురు. శ్రీ దాసుగారి ముప్పదియేండ్ల జీవితచరిత్రను వెల్లడించుటకు అనేక హేతువులదృష్ట్యా వారే యోగ్యులు. అది స్వీయచరిత్ర రూపమున ప్రదర్శితమగుటయే సముచితము, పరమప్రయోజనకరము. శ్రీ దాసుగారు తరువాత గడపిన ఏబది సంవత్సరముల జీవితము ఎంతగ రసవంతము, పండితపామరజన సమ్మోహకరము, లోకజ్ఞతాప్రదర్శకము నైనదైనను క్షుణ్ణమార్గమున మందాకినీ మహనీయతతో కొనసాగినది. కావున దానిని వారే చెప్పపనిలేదు. భావికాల జీవితచరిత్రకారునకు, లోకమునకు విడిచిపెట్టవచ్చును. ఉచితజ్ఞులైన శ్రీ దాసుగారట్లే యొన ర్చిరి. శిష్యులెన్నదైన ఆ ఏబది సంవత్సరముల జీవితవిశేషములనుగూర్చి

ప్రశ్నించినపుడు వారు "అందుకు లోకమే ప్రమాణమని దాని రచన లోకమునకే విడిచిపుచ్చితిని" - అని సమాధానమిచ్చినట్లును వినికిడి. "స్వీయముగ చెప్పవలసిన అగత్యమున్నంతటి తన జీవితకథను మాత్రమే స్వీయ చరిత్రకారుడు వస్తువుగా స్వీకరింపవలయును. అన్యమైన జీవిత కథను ప్రదర్శించుపని జీవితచరిత్రకారునిది" - ఇది అనుభవజ్ఞులైన శ్రీ దాసుగారు సాహిత్యోపాసకులకిచ్చిన అమలిన సందేశము. జీవిత చరిత్రను ప్రదర్శించు విషయమున ఇట్టి పరిణతదృష్టి గల శ్రీ దాసుగారి స్వీయచరిత్ర 'నా యెఱుక'.

౨

'నా యెఱుక' స్వీయచరిత్ర అను సాహిత్య ప్రక్రియకు చెందిన కృతివిశేషము. వైషయికముగ స్వీయచరిత్ర, జీవితచరిత్ర ఒకేజాతిలోనివి. ఇవి ఆత్మకర్తృకమును, అన్యకర్తృకములై యుండుటయే ముఖ్యవిభేదము. శిల్ప విషయమున రెంటియందును వైధర్మ్యములకంటె సాధర్మ్యములే విశేషము. రెంటికిని మహాపురుషజీవితముపై నుదయించు ప్రణయ గౌరవములే ప్రధానోద్బోధకములు. స్థూలదృష్టికి రెండును జీవితచరిత్రలు. ఈ ఇరుతెగల కృతులు చెప్పినవారును జీవితచరిత్రకారులు.

"ఉదాత్తజీవనుల జన్మమువలె ఉత్తమజీవితచరిత్రకారుల జన్మమును అరుదు." "జాన్సను లెందఱో ఉండవచ్చును; బాస్వెలు లెన్నడో గాని ఉదయింపరు" - ఆంగ్లభాషలోని ఈ జిజ్ఞాసాత్మక వాక్యము జీవిత చరిత్రకు అర్హులైన వ్యక్తుల ఆధిక్యమును, ఉత్తమ జీవితచరిత్రకారుల, అతిశయమును వేనోళ్ళ చాటుచున్నది.

జీవితచరిత్రకారునకు మహాపురుష జీవితమునకు సంబంధించిన సత్యాంశకథనము ముఖ్యలక్ష్యము. కావ్య నాటకాది ప్రక్రియలను చేపట్టినవారివలె నితఁడు విషయకల్పనలకు ఆసక్తి వహింపరాదు. సత్యప్రియులైన పాఠకలోకమును తృప్తిపరచి గౌరవానురాగములను చూరగొనుటకై ఇతడు గుణదోషములను రెంటిని యథాతథముగ,

ప్రదర్శింపవలయును. సౌందర్యోపేతముగ సత్యాంశకథన మొనర్చిన గాని ఇతని కృతి సాహిత్యసృష్టి కాఁజాలదు. సత్య సౌందర్యముల రెంటిని సమన్వయించుకొన్న జీవితచరిత్రల విషయముననే "Biography is a literary work of art rivalling sculpture itself" అన్న విమర్శకవాక్యార్థము చెల్లదగియున్నది. ఇట్టి సత్యసౌందర్య సమన్వయమును సంపాదింపని యెడ జీవితచరిత్ర కేవలచరిత్ర రచన అనియో, కేవల సౌందర్యసృష్టి అనియో అనిపించుకొనును. ఉత్తమ జీవితచరిత్రకారుడు మహాపురుష జీవితమునకు సంబంధించిన సత్యాంశములతో వినిర్మితమైన పంజరాకృతి నాధారముగ గ్రహించి, కళాకుశలుడై, నిత్యసౌందర్య పరిశోభితమైన జీవత్ప్రతిమను గండరింపవలయు నన్నమాట! జీవితచరిత్ర ఇంతటి బృహద్భారనిర్వాహణముతో గూడినదియు, క్లేశకరము, శ్రమసాధ్యమునైన దగుటవలననే అసిధారానృత్యమగు మన్నది. జీవిత చరిత్రలనుగూర్చి యొనర్చిన ఈ జిజ్ఞాస స్వీయచరిత్రలకును అన్వయించుట సత్యము.

అత్యంత ప్రాచీనకాలముననే పాశ్చాత్యదేశములకు ప్రాచీన గ్రీకు రోమను జీవితచరిత్రల నిబద్ధమొనర్చి యిచ్చినః గ్రీకు జీవితచరిత్ర కారుడగు ప్లూటార్క్ మహాశయుడు [క్రీ శ. 64–120] జీవితచరిత్రకారులు పాటింపవలసిన ప్రధాన సూత్రములనెల్ల నిర్దేశించి యిచ్చినాడు. కాని అవి ఆతనితోనే విస్మృతములైనవి. జీవితచరిత్ర రచన మరల మధ్యయుగమునందు పుణ్యపురుష జీవిత ప్రశస్తులతో **(Panegyrics of Saints)** పునః ప్రారంభమైనది.

అయినను 19వ శతాబ్దిలోని మహారచయితలైన జాన్సన్, బాస్వెల్, సథీ, కార్లయిల్, ప్రౌఢే, మెకాలే, ఆబట్‌ల తీవ్రకృషివలన గాని జీవితచరిత్రకు ఒక సాహిత్యశాఖగా నెలవుకొను అవకాశము లభింపలేదు. ఈ రచయితలు తమ పాత్రల గుణములను మాత్రమే స్వీకరించి రచన సాగించుటవలన వీరు వ్రాసిన జీవితచరిత్రలు వీరపూజను ప్రోత్సహించునవైనవి. ఈజాతి జీవితచరిత్రలకు కార్లయిల్ మహాశయుని

"హీరో అండ్ హీరో వర్షిప్" చక్కని ఉదాహరణము. వీరి పాత్రలు భయగౌరవములను పొందగలిగిన దేవతాప్రతిమలైనవేగాని, సమకాలీన సహజీవనులై ప్రజల అభిమానానురాగములను పొందలేక పోయినవి.

ఇట్టి స్థితినుండి 20-వ శతాబ్దమున పాశ్చాత్య జీవితచరిత్రను సముద్ధరించి, పునరుజ్జీవనమును కల్పించి, బహుముఖీన వైభవ వికాసము లను ప్రసాదించిన ఉత్తమరచయితలు ఎ. జి. గార్డనర్, లిట్టన్ స్ట్రాచీ ఎమిలి లుడ్విగ్, ఆంద్రేమూరా ప్రభృతులు. జీవితచరిత్రల మూల మున విషయబోధన మొనర్చుటకంటె, చిత్తాహ్లాదనమును చేకూర్చు టయే ('delight than teach') ముఖ్యాశయముగా 'ప్రాఫెట్స్, ప్రీస్టస్ అండ్ కింగ్స్' (1908) 'పిల్లర్స్ ఆఫ్ సొసైటీ' వంటి ఉత్తమజీవితచరి త్రములను రచించి ఎ. జి. గార్డనర్ ఆంగ్లదేశమున నూతన శకారంభ మొనర్చినాడు. లాయడ్ జార్జి మొదలు చార్లీచాప్లిన్ వఱకుగల అపూర్వవ్యక్తులను ఇతడు భయసంకోచములులేక యథార్థరూపములలో దర్శించి ఆ యా పాత్రలను మానవాతీతులనుగా కాక సమకాలీన సామాజికులనుగా ప్రదర్శించినాడు

లిట్టన్‌స్ట్రాచీ 1918లో "ఎమినెంట్ విక్టోరియన్స్" రచనతో ఆధునిక జీవితచరిత్రకు స్వయంసంపూర్ణత నొసగి సకలప్రపంచసాహిత్య కుల దృష్టి నాకర్షించినాడు. ఇతడు పూర్వులవలె పాండిత్యప్రదర్శనకై అసంఖ్యాకముగ పాత్రల జీవితాంశములను సేకరించి వెల్లడించుటయెడ మిక్కిలి మక్కువను ప్రదర్శింపలేదు. పాత్రల ఆంతరికవ్యక్తిత్వమును తేజోవంతముగ బహిర్గతమొనర్పగల అల్పాంశములతోనే ఇతడు వ్యక్తి త్వోన్మీలన మొనర్చినాడు. సమకాలీన ప్రజలచే మానవాతీతులుగ పరిగణితులు, పూజితులునైన విక్టోరియానాటి స్త్రీపురుషశ్రేష్ఠులం దితడు సామాన్యులలో కన్పట్టు దోషములను సహితము దర్శించి వెల్ల డించుటకు వెనుదీయలేదు. ఖారటూంవీరుని మద్యపానవ్యసనిగను,

కార్డినల్ మానింగును సదా భావవైక్లబ్యునిగను రూపొందించుట ఇందుకు నిదర్శనము. ఇతడు చిత్రించిన ఫ్లారెన్సునైటింగేల్ ప్రజానీకము ఊహాతూలికలలో మనోభిత్తికలపై తీర్చిదిద్దుకొన్న అశ్వనీదేవతలను బోలిన అమరకాంతకాదు; ధైర్యసాహసములతో ప్రబలప్రభుత్వమును ప్రతిఘటించి, "సైనికవైద్యసేవ (Army Medical Service) యందున్న దోషములను తొలగించుటకై పోరాడి విజయమును చేకొన్న వీరనారి, స్ట్రాచీపాత్ర లెల్లరు బలదౌర్బల్య గుణదోషయుతులైన మానవులేకాని అందీయందని ఛాయామూర్తులుగాని, దిగ్భ్రమగొల్పు తేజోమూర్తులుగాని కారు. స్వీయచరిత్రరచనయందు నూతనశకారంభ మొనర్చిన ఈతని తరువాతి కృతియైన "క్వీన్ విక్టోరియా" యందును ఇతడు విక్టోరియారాజ్ఞని, ఆమె భర్తను, మెల్బోర్న్ ప్రభువువంటి అగ్రవర్గముల వారినైనను ప్రదర్శించుటకు పూనుకొనలేదు. ఇతడు స్త్రీజననైజ దోషములైన ఆత్మప్రామాణ్యము, ప్రగల్భత, కార్కశ్యములతో విక్టోరియారాణిని, అట్లే ఇతరదోషములతో ఆమెభర్తను, మెల్బోర్న్ ప్రభువును ప్రదర్శించినను ఈ పాత్రలుగాని, లోపయుతములుగ ప్రదర్శితములైన ఇతని ఇతరపాత్రలుగాని శోభారహితములని భావింపరాదు. ఇతని పాత్రలన్నియు పటిష్ఠములై పాఠకులదృష్టి నాశ్చర్యకరముగ నాకర్షింప జాలియున్నవి. విచిత్రమైన ఒక విడంబనధోరణి లేదా అవక్షేపధోరణి (Mocking strain) లిట్టన్ స్ట్రాచీ రచనారీతికి జీవాతువు. ఇతనినుండి ఉద్బోధమునొందిన ఆధునిక జీవితచరిత్రకారులలో మఱొక "క్వీన్ విక్టోరియా" చెప్పిన ఎడిత్ సిట్వెల్, శ్లాఘనీయముగ "అక్బరు"ను రచించి యిచ్చిన లారెన్సు బినియన్, "పామెర్‌స్టన్" కృతితో ఘన విజయమునుగైకొన్న ఫిలిప్ గొయొడెల్లాలు ప్రముఖులు.

ఎమిల్ లుడ్విగ్ అను జర్మను జీవితచరిత్రకారుడు, మహాపురుష వ్యక్తిత్వమును అసాధారణభావనాశక్తితో ఒడుచుకొని, కవితోద్వేగము, అతీంద్రియతలను ఊతగా జీవితచరిత్ర రచన యొనర్చినాడు.

పిడుగులు కురియనీ పెటిలి బ్రహ్మాండముల్
పేలాలపోలిక బేలిపడని
ప్రళయము పెట్టనీ భైరవుండు త్రిశూల
ధారుడై ఫాలనేత్రము తెరువని

యేదియెట్లైన గాని యెక్కింతయైన
నా ప్రతిన తప్పిపోవదు నమ్మవలయు
అఖిల పావని నాతల్లి యయ్యోనేని
ధర్మమెప్పుడు నా తండ్రి తప్పడేని.

భీష్ముని స్థిరసంకల్పమును హరికథా కథన వేళ సంగీతాత్మకముగా పాడుటకు అనువైన శైలిలో దాసుగారు ఈ పద్యమును చక్కగా వ్రాసిరి.

ఈ విధముగ పాత్రల జీవలక్షణమెఱిగి వానిని ఔచిత్యానుపాన ముతో రచనావిన్యాసౌషధముతో పునర్జీవితములుగా జేయుట ఈ హరిదాసునకు నిత్యానుష్ఠానము.

భాష:-

కళాకారుడు తనకుగల్గిన అనుభూతిని తనచేతగల ప్రతిభాసాధన ముచే ప్రతిబింబింపజేయ ప్రయత్నించును. గాయకుడు గానముచేత, శిల్పి శిల్పముచేత, కవి భాషచేత అనుభూతులు లోకమునకు అందీయ బోవును. ఎంత సన్నిహితముగ తన అనుభూతి దగ్గఱకు కళాకారుడు సహృదయుని తీసికొని వెళ్లగలుగునో అంత తన ప్రయత్నమునందు కళాకారుడు కృతకృత్యుడైనట్లు లెక్క. అభిప్రాయప్రకటన సాధనము లలో ఉత్తమోత్తమమైనది భాష. ఈ భాషను ఏకపత్నిగ నేలెడివాడు కవి. ఒక కులసతియే తన పతిచెంత వివిధ సందర్భములలో దాసిగా, వేశ్యగా, మాతగా ఎట్లు వర్తించునో, అట్లే కవితా లతాంగికూడ కవి చెంత భావ భారమునకు తగిన నడకలతో, అలంకారములతో వైవిధ్య మును ప్రదర్శించుచు వర్తించును. పతివ్రతకు గుణసౌందర్యముతో పాటు

సౌందర్యగుణము కూడ నుండిన భర్త యెట్లు అధికతరముగా స్వాధీన మగునో అట్లే భామకూడ లక్షణానుకూలతతో పాటు రసిక హృదయాను కూలమైన లక్షణము కూడ కల్గినచో పాఠకులు పాత్రలవలె కవికి వశు లగుదురు.

దాసుగారికి రచనా పద్ధతిపై కొన్ని అభిప్రాయములున్నవి. సమ కాలికులలో గల కొన్ని లోపములను ఎత్తిచూపి, రచనాపద్ధతి యిట్లుండ రాదని నిషేధమార్గములో మేలుబంతియను చాటు ప్రబంధములో ఎట్లు చెప్పుచున్నారో పరిశీలింపుడు.

పూర్వప్రబంధము పోల్కికై చచ్చిన
యీగ నంటించెడు హీనుడొకడు
ప్రౌఢకల్పనలని పన్ని తనకుదానె
యర్థంబెఱుగలేని వ్యర్థుడొకడు
కృతిని నిఘంటువు వెతకి ముదురు తాటి
ముంజవలెజ్జేయు మూర్ఖుడొకడు
తేటతెల్లంబని తెన్గుబాసకు బట్ట
తెరచి చూపించెడి దేబె యొకడు.

కలివశంబున శారద కలుషమయ్యె
పిదపకాలంబున దలంపు పిచ్చియయ్యె
ఆచ్చు చవకయ్యె మూఢులు మెచ్చుటయ్యె
అహహ! యెందుకు కవులైరి యాధునికులు.

ఈ చక్కని పద్యము దాసుగారికి కూడ బాగుగా నచ్చినది కాబోలు. తరువాత ప్రహ్లాద చరిత్ర హరికథలో జేర్చినారు

రచన యిట్లుండవలెనని వారు విధి మార్గమున మేలుబంతిలో చెప్పిన కొన్ని మేలుబంతులను ఆలకింపుడు.

సాగి కమ్మెచ్చున వ్వచ్చు తీగకరణి
సాలెపురుగు కడుపులోని నూలువలెను

దబ్బునన్బొర్లిపడు కొండధారమాడ్కి
సహజ కవిత బయల్వెడి సన్నుతిగను.

ఎంత సహజములైన ఉపమానములను గ్రహించెనో!!

అతుకు లుంచక పద్యము లల్లవలయు
యమకము నైప్పవలెను రసము చెఱపక
అనవసరముగ జొన్ప రా దాంధ్రకృతుల
రచనచేయు కవి తన గీర్వాణమెల్ల.

గీర్వాణశబ్ద మిచట ఎంత సొగసుగ కుదిరినదో!

కావ్యదోషంబు లరసి జగదుపకృతిగ
నుల్లసము నీతి ప్రజ కుప్పతిల్లునట్లు
వింతవలె బాతసంగతి వెల్లడించు
వేడబము మాని సహజ కవిత్వశాలి.

దాసుగారి గ్రంథములను భాషాదృష్టితో మనము విభాగించినచో నాల్గింట ఒకవంతు సంస్కృతము; రెండువంతులు మిశ్రభాష; ఒకవంతు సీమపల్కులు (నాటుతెలుగు) కన్పడును.

సంస్కృతశ్లోక రచన యెట్లుండునో స్థాలీపులాకన్యాయముగ నైన తెలిసికొనుటకు కొన్ని శ్లోకములను బరిశీలింపుడు.

1. కవిస్సాక్షాత్ త్రయీమూర్తిః కావ్యమేతచ్చరాచరమ్
నకశ్చిద్వస్తుతో భేదః కార్యకారణయోస్తయోః

2. దివ్య మర్త్య విభేదేన ద్విధా కావ్యం నిగద్యతే
దివ్యం ప్రకృతి సంసిద్ధం మర్త్యం భవతి కృత్రిమమ్.

3. సంగీతహీన స్సాహిత్యం యః ప్రయోక్తుం యతేతచేత్
హాస్యాస్పదో భవేదద్ధ వన్నేత్రాభి నయోత్సుకః

4. నృత్యన్గాయన్ స్వరచితం కావ్యమాలాప యన్కవిః
స్వయం తీర్త్వా తారయతి సంపత్రిదాయాత్పరానపి

5. ధర్మార్థ కామమోక్షాణాం కావ్యమేకైక సాధనమ్
ప్రత్యక్షదేవతామూర్తిః కవిరేవ న సంశయః

కావ్యనక్షత్రమాలలోని ఈ శ్లోకములు దాసుగారి సంస్కృత శ్లోక రచనతోపాటు వారిదృష్టిలో కవికి కావ్యమునకు నెంత ప్రాముఖ్యమున్నదో గూడ తెలియజేయును.

దాసుగారు తమ జన్మభూమియైన త్రిలింగదేశము నెట్లు గీర్వాణ భాషలో (ఆంధ్రపత్రిక 23-11-1941) ప్రశంసించిరో పరిశీలింపుడు.

1. త్రిలింగదేశభాషైవ పరుషాక్షర వర్జితా
విస్పష్టా సర్వసులభా స్వతంత్రా సార్వలౌకికా

2. సమశీతోష్ణసిత్యా సంతత ధనధాన్యభోగ సంపత్యా
విద్యావినయ విభూత్యా త్రిలింగదేశశ్చకాస్తి విఖ్యాత్యా

3. త్రిలింగ దేశవాస్తవ్యః స్వతంత్రః సూనృతవ్రతః
దానధర్మదయావీరః సర్వతోముఖ పండితః

4. స్వోపజ్ఞాకృతకావ్యః స్వతంత్ర నిష్కలుష జీవనః ఖ్యాతః
నిత్యదయాంత కరుణః త్రిలింగదేశోద్భవః సురూపాఢ్యః

5. త్రిలింగ భూరేవభూమిః త్రిలింగ నరఏవ నా
త్రిలింగ భాషైవ భాషా నాత్రకార్య విచారణా

వీరి గీర్వాణభాషా యోషాగీర్వాణము నెఱుగుటకు ఈ యుదాహారణములు చాలును.

ఇక వీరిమిశ్రభాషాశైలూషీ న ర్తన ప్రవర్తనములను పరిశీలింతము. మచ్చునకు సూర్యనారాయణ శతకములోని రెండు ఉదాహరణములు.

అలరంగా జగమెల్ల వెట్టియెకదా యా వెట్టికిన్ వేవిధా
లిలలో నెవ్వని పిచ్చివానికి ముదంబెంతేని యున్మాద ము

జ్వాల మైనం గడుహోని సల్పు మఱి శాంతంబైన నీ ధ్యానమున్
లలిలోకోపకృతిం బొనర్చు నిజమన్నా ! సూర్యనారాయణా!

సులభాస్వాదన మెట్టులబ్బునిక నోర్పూనీ బిలంబంత యా
కలి కొండంతను నట్టులాయు వరయంగా నల్పమిద్ధాత్రి లో
పల భోగేచ్ఛ ఘనంబుగాపున రసాభాసంబు సంసార మ
న్బు లలిఁ బ్రొజ్జు డెటింగి నిన్గొలుచుచుండున్ సూర్యనారాయణా!

ఇటువంటి సహజ సుందరమైన భాష దాసుగారికి స్వాధీనము కాగా, ఈ భాషపై దాసుగారికి మనసు కుదరలేదు. తనంత తా వలచి వచ్చిన చుల్కన యగును గదా !

ఇక వీరి నాటు తెలుగు పస ఎట్లున్నదో చూతము.

బాటసారియను కల్పిత ప్రబంధములో తన చెలిని విధివశమున పోగొట్టుకొనిన ఒక బాటసారి ప్రకృతిలోని జంటలనుజూచి నిజజాయను స్మరించు సందర్భము నెట్లు చిత్రించుచున్నారో చూతుడు.

పించియంబుల విప్పి పెండ్లియాటల రొప్పి
యాడు నట్టువ పిట్ట జోడు జూచి
తన మిటారికి డంబు తలిరుటాకు విడెంబు
వాడు కోయిల మిన్నదాడి జూచి
పడతి తోడుత నచ్చపండు గుజురు ముచ్చ
టోడుచు దిను చిల్క ప్రోడజూచి
కమ్మ తేనెల మెక్కి కొమ్మ కౌగిట జొక్కి
పాడు లేదుమ్మెద కోడెజూచి

అంతగంతుల హెచ్చి రవంతనచ్చి
నేర్పరియనుచు మెచ్చి నిట్టూర్పు పుచ్చి
బయులు కౌగిళులకు జొచ్చి హాయులు విచ్చి
నొచ్చి పొగులుచు నుంటి జాసయిటువచ్చి.

ఈ పద్యములో "పించియంబు, ప్రోడ" యని వైకృత శబ్దములను వాడెను. కాని పోనుపోను ఈ వైకృత శబ్దములనుకూడ వాడక

కేవలము దేశ్య పదములతో గూడిన భాషను దాసుగారు వాడిరి. గౌరప్ప పెండ్లి రచననాటికి ఈనాటు తెలుగుభాషపై వీరికి మోజు అధికమైనది.

గౌరప్ప పెండ్లిలో పరమేశ్వరుని ఉద్దేశించి పార్వతి పల్కిన భాషను గమనింపుడు.

నీ పలుకప్పుతేనియ గ్రోలజనక నా
దెప్పరమగు దప్పి తీఱుటెట్లు ?
నీ తీయని నవాతు నిండు పల్కు వినక
నా వీనులకు గ్రుప్ప పోవుటెట్లు ?
నింగినేలల మించి పొంగారు నీ హొయల్
గనక నా కనువాపు గడచుటెట్లు ?
నీ బిగి కౌగిటన్ బింకము గ్రాదగు
ల్కొనక నామేని కాగుడుఱు టెట్లు ?

ఏను నీకు డామేను నన్నీ తెఱగున
వేఱొనర్చుట పాడియే ? వింతవారు
నవ్వ నీకు నిల్లాలనౌ నన్నువిడువ
నేల ? ఒకదాళజాల నన్నేలు మగడ !

అలరు విల్తుని తిమురడచిన నీ కాడు
దానిపై గోరిక తగులదేమొ !
గడును బిత్తరి బూటకపుమాట నమ్మట
తగవుకాదని పాటి తప్పెదేమొ !
చదలేఱు నా యేర లెదురయి నిన్దన
బిగి కౌగిటన్ గ్రుచ్చి విడువదేమొ !
నా మంచి తలిదండ్రులేఁమఱి నీవెడ
వాలకమున కొప్ప జాలరేమొ !

నిన్ను గానక నులియైన నిల్వనోప
మంచి పోనీకు నక్రన్నతికించు వడిగ

ఏలజాలము ? నన్నిక నేలుకొనుము
కదలి మినిమి తాల్పు ! కనుమంగ మొలవేల్పు !

ఆట పాటల మేటియైన దాసుగారి ముచ్చటలకు ఆటపట్టయిన నాటు తెలుగు భాషయిదే.

ఈ నాటు తెలుగుపై వ్యామోహము పోనుపోను అధికమై ప్రసిద్ధములైన పేర్లనుగూడ నాటు తెలుగు భాషలోనికి మార్చిరి. భగవద్గీతను వేల్పుమాటయని, ఋక్సంగ్రహమును మొక్కుబడియని తెన్గొనరించిరి. అంతేకాదు ప్రసిద్ధములైన ఛందముల నామములను కూడనెట్లు మార్చిరో చూడుడు.

| | | |
|---|---|---|
| మంజరీద్విపద | — | పూగుత్తి, చెండు, బంతి. |
| ద్విపద | — | అద్గుదోయి, జంట. |
| మధ్యాక్కరము | — | నడియక్కరము. |
| కందము | — | మూపు. |
| మత్తకోకిల | — | కోయిల |
| చంపకమాల | — | బంగారము. |

ఈ యుదాహరణములతో దాసుగారి నాటు తెలుగు చాదస్తము ముదిరినదని చెప్పక తప్పదు. ఈచాదస్తము శ్రుతిమించిరాగాన పడి, అచ్చతెనుగును కించపరచు వారి నెట్లు కించపరచుచున్నారో తెలిసికొనుడు.

ఒప్పగ సీమపలుకుల
జెప్పంజాలరు కలుపక జే జే నుడులన్
జప్పనయని తప్పింతురు
దొప్పచెవుల కన్ననాకొడుకులందఱిసి.

వీరికిష్టమైన సీమపల్కులను ఆక్షేపించెడివారికి గారప్ప పెండ్లిలో ఎట్లు తర్కసహితముగా సమాధాన మిచ్చుచున్నారో గమనింపుడు.

"తమ సీమవల్కు పరువు నిల్పుకొను తగు చదువరులు తమవారి చెంగట నీమ తేఁట నాటు పల్కునఁదప్ప వ్రాఁతల నొల్లించుకొని యెరువు తెచ్చుకొన్న వచ్చీరాని లాఁతి యాట పాట మాటలన్నోటు సల్ప నోడుదురు-నిక్కమైన తెలుఁగు వాఁడఱవయేసన్నాఁడునా - యిరు బుట్టు వెవ్వఁడైన తన బిడ్డఁడు మలకపోలిక నుండఁగోరునా - ఎవ్వని మట్టునకు వాఁడే యెక్కువ - యెవని గొప్పవానిది - పరువైనవాఁడు లాఁతి వానివలె వాలకము వేయ నీయకొనునా - యెదిరికి న్లొంగునా - తనకుఁ దోఁచినట్లు పాడి యాడి వ్రాఁత కూఁతల న్నెఱవేర్చుకొనున్గాని పై వారల త్రోవఁ ద్రొక్కునా - ఏసీమవారి కాసీమ న్దొల్లింటి నాఁటి నుండి వాడుకలోనున్న యాటపాట మాట మెలపొలోజమైనింపు - ఎవరి వంటలు వారి వెవరి నడవడికలు వారివే సీమ పల్కులా సీమ వారల కింపు"

## వర్ణనలు :-

"కావ్యమున వర్ణనకొక ప్రయోజనమున్నది. నాట్యమునకు రంగ ప్రసాధనమువలె, గీతమునకు వాద్యమువలె కథకిది యొక హంగు. కావ్యకథా సౌధాంగణమునకు రంగవల్లికలు వర్ణనలు" అని డాక్టరు యస్వీ జోగారావుగారి సాహిత్యబోధనాంబుధిలోని ఒక ఉపదేశ తరంగము. ప్రతిభా ద్యోతకములైన వర్ణనలు లేనిచో గ్రంథము కావ్యము కాదు. కర్త కవికాడు. కథకుడు మాత్రమే యగును. కవి ప్రతిభా లతకు వర్ణనలు ప్రాకుడు కొమ్మలు. కీర్తి సౌధమునకు సోపానములు.

"నహికవేః ఇతివృత్త మాత్ర నిర్వాహణేన కించిత్ ప్రయోజనమ్. ఇతిహాసాదేవ తత్సిద్ధేః"

ఇక దాసుగారి ప్రతిభ వారి రచనములందు వర్ణనలను మారు పేరుతో ఎట్లు ఆకృతి ధరించెనో పరిశీలింతము. నీలగిరిపై వీరి ప్రతిభా దృష్టి ఎట్లు ప్రసరించినదో తిలకింపుడు.

వేసవి యెండైన ప్రియమగు చుండు ని
ల్లాలి చూపుల పొలయల్క మాడ్కి
హితమయ్యెడు నకాల హిమపాతమయ్యు వి
వాహమందలి యుపవాసమట్లు
పురుష ప్రకృతియయ్యు బహు ఫలదంబగు
ననవరతంబు పిత్రాజ్ఞ కరణి
అభ్యున్నతంబయ్యు బహు ఫలదంబగు
సాధులకు భగవత్ప్రసాదమువలె

చెమట పట్టనితావు సౌఖ్యముల ప్రోవు
అలసటల గొట్టు దొరలకు నాటపట్టు
క్రూర జంతుల వెర్వెత్తు క్షోణినత్తు
కనుక ఈ నీలగిరియె స్వర్గంబు తునుక.

ఉపమాలంకార నిర్వహణమున ఈ హరిదాసు అపరకాళిదాసు. నీలగిరి దృశ్యములవలె ఈఉపమానము లెంత మనోహరములుగానున్నవి! ఈ చల్లనిచూపు బెంగుళూరుపై నెట్లు ప్రసరించి చాటుపద్యమైన చాటుపద్యముగా మారినదో చదివి యానందింపుడు.

అలరు తేనియలూరు తలిరుల జిగిమీరు
విన్న గరవుతీరు బెంగుళూరు
చిఱుత మబ్బులకారు చెమటరాని షికారు
వేడుకలింపారు బెంగుళూరు.
చెఱకు తీయనినీరు చేల పచ్చనిజారు
వేల్పునగరు కేరు బెంగుళూరు
ఆవుల పాలేరు తావుల వేమారు
విలువదగినపేరు బెంగుళూరు.

వింత నగనాణెముల నారు బెంగుళూరు
పెను తెవుళ్లకు మందు వేరెబెంగుళూరు
వెల్లదొరలను రాగోరు బెంగుళూరు
వేనుడువులేల ? బంగారు బెంగుళూరు.

కవి భావకోశాగారమునకు ప్రకృతివర్ణనము ముఖద్వారము. ఆ తలుపు తట్టని కవియే యుండడు. ప్రకృతికి కవిని వేశ్యవలె ఉడికించి యేడ్పించుటయే ప్రకృతి. ఈ ప్రకృతి తాను భగవత్స్వరూపమని తెల్పుటకో యన్నట్లు ఒక్కొక్క కవికి ఒక్కొక్క అవతారముతో ప్రత్యక్షమగును.

దాసుగారికి గజేంద్రమోక్షణములో చంద్రోదయము ఎట్లు వృత్త సంపదగా సాక్షాత్కరించినదో వీక్షింపుడు.

ప్రొద్దు పండుటాకు పోలె రాలె, కెం
జాయ చివిరులెత్తె; కోయిల లన
జిలిగి కవిసె చీకటులు; పూచె చుక్కలు
పైని చందమామ పండుతోచె.

వీర బీభత్సరసములకు కదనరంగము ప్రధానరంగస్థలము. కల్యాణ మంటపము శృంగారరసము తాళికట్టి అధికారము సంపాదించు శుభ లగ్నము. ఈ విరుద్ధరసములను దాసుగారు తమ ప్రతిభా బంధముచే బం ధించి ప్రక్క-ప్రక్కన పీటలపై ఎట్లు సావిత్రీచరిత్రమునందు కూర్చుండ బెట్టుచున్నారో పరిశీలింపుడు.

భూమిపీఠము నభంబు న్మేటి పందిరి
బహుశాస్త్రతతి సాక్షి వహ్నికాగ
ముకుట తనుత్రాణములనుండి డుల్లెడు
రవ ముత్తె ముల్ దలంబ్రాలు కాగ
జంబుక స్వస్తివాచకులకు శత్రుల
తల లెంతయు ఫలప్రదానములుగ
కూలెడు భట హయ కుంభి భూరిధ్వను
లోలి బాజాబజంత్రీలు కాగ

బలు వసంతము నెత్తురు వరదకాగ
నాకబలి ముగ్గు లట్టు లాంత్రములు మెరయ
మఱియు పగయొజ్జ రంకృతి మంత్రములన
పెండ్లి యాడుదు నిప్డహో విజయలక్ష్మి.

దాసుగారికి ఒక అవధానములో ఒక పృచ్ఛకుడు "అమిత విజృంభణమ్ము లబలా ! తగునా ! సుజనాళికెప్పుడున్" అను ఒకసమస్య నిచ్చెను. ఆ సమస్య నెంతరమణీయముగ పూరించిరో చూడుడు.

క్రమమెఱుఁగంగలేని విధివ్రాత బలమ్మునఁ దమ్మిమోయు మ
ధ్యముపయి నీదు చన్ను లిసుమంతయు నక్కటికంబు మాని యు
బ్బి మదకఠోర భావమున విస్తరమంది చలింపఁజేసి జృం
భము నటు చూపకున్న క్షత మర్దన బాధల పాలు గావుగా
అమిత విజృంభణమ్ములబలా ! తగునా ! సుజనాళి కెప్పుడున్.

## ఉ ప మో ప జ్ఞ :-

దాసుగారి వర్ణనలందు శబ్దాలంకారములైన యమకము, అంత్య ప్రాసము కన్పడుచున్నను, ఎక్కువగా పెత్తనము చలాయించునది అర్థాలంకారమైన ఉపమయే.

కొన్ని శబ్దాలంకారములు :-

1. నవరసమ్ముల కాపు మన్మథుని తూపు
మిట్టిమీలను రేపు క్రొమ్మించుదాపు
నిర్మల వినీతికిని ప్రాపు నెనరుచేపు
నట్టి నీచూపు గనకెద కెట్టులోపు.

2. బంధుగుల సేమ మరయని వాని గొప్ప
యడవిగాచిన వెన్నెల యౌ గదప్ప.

కొన్ని ఉపమాలంకారములు :-

1. సొగసైన పురుషుని మగువ చేరుచునుండు
పల్లంబు వంక నీర్వాఱునట్లు

2. దైవంబుచేత యంతయు మేలె సూచించు
దిక్సూచి యంత్రం బుదీచి వలెను

3. కొప్పు నిలువబడి విప్పినఁ నీల్గి గా
ఝుల మలారమ్ము పోల్కి వెలుగు నేల (న్నృ)

ఇక వచనమందున దాసుగారి ఉపమాలంకారమునకున్న శక్తికి ఉపమానమే లేదు. మానవుని విజ్ఞానమంతయు దాని కసరత్తునకు గరిడి సాలయే.

యథార్థ రామాయణమునందు వచనము వచ్చినదన్నచో, దానిలో కట్టలకు కట్టలుగ ఉపమానములుండును. అచ్చట దాసుగారికి కలము మనస్సుకంటె ముందు పరువులెత్తును. అప్పుడు దాసుగారి కలమునకు మానవుని విజ్ఞాన మంతయు దాసోఽహా మనవలసినదే. ఒక్క ఉదాహరణముతో తృప్తి చెందుడు.

"తన భార్య న్వెంట నిడుకొని విదేశాటనంబు చేయువాడు మొద్దు నోర్చదించు నొజ్జవలె, సన్నిపాత చికిత్స చేయు వైద్యుని కరణి, శ్లేషప్రబంధ మల్లు కవి మాడ్కి, ఎలుగుబంటి నెదుర్కొను వేటకాని పగిది, తుపానున నోడ నడుపు నోడంగి భంగి, గడపైగిజి తిరుగు వీటి వాని పోల్కి, ద్రుతకాలంబున నుఱుకు జాఱులజూపు సంగీతజ్ఞుని పోలవున, కారకార్థవాద మొనరించు శాబ్దికుని చందమున, అధ్యారోప వాదంబుల నిరూపించు నద్వైతి చెలువున, అనుమానంబు సాధించు నైయాయికుని రీతిని, విధి లిఖితంబు న్వరియించు మాహూర్తికుల వడువున, లంచగొండి న్గొలుచు సత్యశీలుల గమనికను, మ్లేచ్ఛాధీనుండగు నార్యుని విధమున, లుబ్ధురాలితో కాపురము చేయు దాత లాగున, సంసారమున జిక్కు ముముక్షువు తెఱంగున బరువు దక్కించుకొనుట దుస్తరముగదా."

దాసుగారికి ఉపమాలంకారము అరచేతిలోని చిటితాళము వంటిదని చెప్పుటకీ యుదాహరణము చాలును.

## కల్పనలు :-

దృష్టపూర్వా అపి హ్యర్థా కావ్యే రస పరిగ్రహాత్
సర్వే నవా ఇవా భాంతి మధుమాస ఇవ ద్రుమాః

మెఱుగుపెట్టబడిన ప్రాతనగలు క్రొత్తనగలవలె తళతళలాడినట్లు, క్రొత్తకల్పనలతో నిత్యము మనకు పరిచితములైన విషయములే క్రొత్త కాంతులతో ప్రకాశించును. శబ్దబ్రహ్మ నుపాసించు కవిబ్రహ్మలకు ఇట్లు క్రొత్తకాంతులతో ప్రకాశింపజేయుట బ్రహ్మవిద్యకాదు. వారికిది సాధారణవిషయము. కాని బ్రహ్మసృష్టికి వీరి సృష్టికి ఒకభేదము కలదు. బ్రహ్మ సృష్టిలో ముందు కాంతి. దానివెనుక శబ్దము పరువులెత్తును. కాని కవిబ్రహ్మ సృష్టిలో ముందు శబ్దము, తరువాత శబ్దము ననుసరించి కాంతి పరువులెత్తును.

కల్పనములవలన క్రొత్తదనము కల్గుననెడి రహస్యము నెఱిగిన వారగుటచే దాసుగారు వారి గ్రంథములలో ఎన్నియో కల్పనములను చేసిరి.

అంబరీష చరిత్రమునందు విష్ణు చక్రము దూర్వాసమహర్షి వెంట బడి తరుమగా, దానికి భయమంది మహర్షి పాకారిని, పరమేష్ఠిని, పర మేశ్వరుని శరణు వేడును. తరువాత పంకజనాభుని శరణు వేడును. ఈ సందర్భమున దాసుగారొక కల్పన చేసిరి.

దూర్వాస మహర్షి వారిని శరణు వేడగా, ఇంద్రుడు తాను గోవర్ధనోద్ధారణ వృత్తాంతములో భంగ మొందిన ఉదంతమును, చతు ర్ముఖుడు గోవులను గోపాలురను మాయమొనరించి అవమానము పాల యిన సందర్భమును, శివుడు తాను జగన్మోహినీ ఘట్టమున వెఱ్ఱిపోయిన విధమును చెప్పి తమ అశక్తతను వెల్లడించిరి.

దాసుగారు చెప్పిన ఈ మూడుకథలు భాగవతాంతర్భాగములే కాని ఈ కథలకును అంబరీషుని చరిత్రమునకును ఎట్టి సంబంధములేదు. ఈ మూడు కథల నిట్లు అంబరీషుని చరిత్రతో ముడిపెట్టినది దాసుగారి లేఖినియే.

జానకీ శపథమను యక్షగాన ప్రబంధములో చివర జానకీదేవి శపథము చేయును. జానకి శపథము చేయుట ఉత్తరరామాయణములో గూడ నున్నది. కాని ఉత్తరరామాయణములో గల శపథమునకును, దాసుగారి జానకీ శపథములో గల శపథమునకును సంబంధమే లేదు. ఈ శపథము వీరి కల్పనమే. తాను చేసిన కల్పన వెంటనే స్ఫురించుటకు భాసమహాకవి తన నాటకమునకు ప్రతిమ యని పేరెట్లు పెట్టెనో, దాసుగారుకూడ తమ కల్పనము వెంటనే స్ఫురించుటకు వారి హరికథకు జానకీ శపథమని పేరు పెట్టిరి. దాసుగారి జానకీ శపథములోని అవాల్మీకమైన జానకీ శపథమును చూడుడు.

సురుచిరముగ నే సాధ్వి నైన - చో నిపుడొక్క గడియలోన
కరువుదీర బ్రతుకు హాయిగా - గురియించుగాత పర్జన్యుడు వాన

జానకి తన తల్లి యైన భూదేవి యొడిలోనికి చేరుట ఈ యక్షగాన ప్రబంధమున లేదు.

ఈ జానకీ శపథమున చిన్నచిన్న కల్పన లింకను గొన్ని కలవు. అందులో లక్ష్మణుడు పత్రముపై వ్రాసిన లేఖయొకటి. రామపత్ని అరణ్యములో అటునిటు తిరిగి ఎండ బడలికచే నిద్రించును. రామాను జుడు కఠినమగు రామాజ్ఞను రామసీతకు నివేదింపలేక, రామాజ్ఞను ఒక పత్రముపై వ్రాసి నిద్రించుచున్న సీతప్రక్క పడవైచి రాజధాని కేగును. ఈపత్రిలేఖ విషయము అవాల్మీకము. ఈకల్పనము దాసుగారి లేఖినీ జల్పనమే.

సారంగధర నాటకములో విదూషకునకు గిలిగింత అనుపేరు, చిత్రాంగి పరిచారికకు అంటింత అనుపేరు దాసుగారి సార్థక కల్పనములే.

ఈ నాటకమునందు చిత్రాంగీ సారంగధరులకు మొదట వివాహ ప్రయత్నము జరిగినట్లు తరువాత రాజరాజునకు చిత్రాంగికి వివాహమై

నట్లు చెప్పబడినది. ఈ కల్పనము వలన చిత్రాంగిపై కొంత సానుభూతి ప్రేక్షకునకు కల్గును.

ఈ నాటకమునందే మఱియొక కల్పనము. అది సారంగధరుని కరచరణములు ఖండింపకుండ కల్పించిన సన్నివేశము. ఈ సన్నివేశ కల్పనము వలన సిద్ధుడువచ్చి రక్షించు అతిమానుషచర్యకు అవసరము కలుగలేదు. అంతేకాక కథ వాస్తవికతతో చుట్టఱికము కలిపెను.

సారంగధరుని రాజమహేంద్రవర పాలకుడైన రాజరాజనరేంద్రుని కుమారుడుగా భ్రమపడినవారలలో దాసుగారొకరు. ఇది పొరపాటో? లేక ప్రాంతీయాభిమానమో?

ఇట్లే రుక్మిణీకల్యాణములో రుక్మిణీకృష్ణుల కల్యాణము నాటికే సుభద్రను అర్జునుని భార్యగా వర్ణించిరి. మొదట రుక్మిణీ కల్యాణము పిదప సుభద్రా పరిణయము కదా!

ఇక యథార్థరామాయణములో అవాల్మీకములగు కల్పనలెన్నియో కలవు. లోకమునకు సీతారాముల చరితమును ఆదిభిక్ష పెట్టినవాడు వాల్మీకి మహర్షి. ఆ భిక్షను బాలవాల్మీకులు రకరకములుగా ఆరగించిరి. ఎవరెన్ని పంటలు పండించినను పొలము వాల్మీకిదే. ఆ వాల్మీకి పడథ్యాయికి వెనుకటి వారివలె దాసుగారుకూడ వీరి భాష్యము వీరు చెప్పిరి.

అహల్య రాయిగా మారుట వాల్మీకముకాదు. అహల్యను రాయిగా మొదట మార్చినవాడు అధ్యాత్మరామాయణ కర్త. దాసుగారుకూడ యథార్థరామాయణములో అహల్యను రాయిగా మార్చిరి. కాని భర్తయగు గౌతముని శాపమువలన రాయిగా మారలేదు. ఇంద్రునకు చిక్కక, తన సతీమాహాత్మ్యముతో తానే రాయిగా మారును. దాసుగారి మాటలలోనే ఆ భావమును జూచుట సమంజసము.

ఇంద్రునితో అహల్య :-

"పాడుచేయుట కిట్లు పన్నితివా ? వట్టి
రట్ట నాపైనిక బుట్టు గనుక
స్వయముగా ధర్మదేవత వచ్చి నన్నంటు
పలుకు బాషాణ రూపమున నుందు"

అట్లే వాలి వధ సందర్భములో, వాల్మీకమున సుగ్రీవునితో యుద్ధము చేయుచున్న వాలిని శ్రీరాముడు చాటుగానుండి బాణమేసి చంపగా, యథార్థ రామాయణమున రామునియొద్దకు గావుమనుచు పర్వె త్తెడి సుగ్రీవుని తఱుముచున్న వాలిని ఎదుట నుండియే రాముడు సంహరించును. చూడుడు.

అని పిడికిట బొడిచిన రా
ముని చెంతకు గావుమనుచు బోయెడి సుగ్రీ
వుని వెంట దఱుము వాలిం
జను మఱిశరమేసి రామచంద్రుడు గూల్చెన్.

ఇట్లే రామ జనన వృత్తాంతమునకు నారదముని శాపమొకటి కారణముగా కల్పించెను.

మార్కండేయ చరిత్రములోని కథయంతయు క్రొత్తరీతిగా నున్నది. అది యే పురాణమునుండి గ్రహింపబడినదో తెలిసినగాని, అందులో దాసుగారి కల్పనలను నిర్ణయింపలేము.

ఇట్టి కల్పనలేకాక ఒక్కొక్కసారి పురాణప్రసిద్ధములైన విషయములకు దాసుగారు లౌకికదృష్టితో చక్కని సమన్వయములు చేయుట కూడ కలదు.

గజేంద్రమోక్షణమునందు పురాణప్రసిద్ధములైన దశావతారములను స్తుతించిరి. అట దశావతారములను సృష్టిక్రమపరిణామాను సారముగా (Evolution theory) అన్వయముచేసిరి. ఇది వీరి లౌకిక సమన్వయదృష్టికి నికషదృషదము. అభినవగుప్తపాదులు నాట్యశాస్త్రాంశములకు లౌకిక దృష్టితో సమన్వయముచేసిన విధమిట్టిదే గదా.

ఒక్క వాక్యములో జెప్పవలెనన్న దాసుగారి లేఖిని కల్పనలకు కల్పవృక్షము.

## చమత్కారములు :-

"సచ అతృప్తి వ్యతిరేకేణా వచ్ఛిన్నో భోగావేశ ఇత్యుచ్యతే.
భుంజాన స్యాదద్భుత భోగాస్పంద విశిష్టస్య చ మనశ్చమత్కరణం చమత్కార ఇతి"

(అభినవగుప్తుడు రససూత్రవ్యాఖ్య)

చమత్కారమును హాస్యమునకు పర్యాయపదముగా పొరబడి వాడుచుందురు. ప్రతిహాస్యోక్తి చమత్కారజనకమగును గాని ప్రతి చమత్కారోక్తి హాస్యజనకము కానేరదు. హాస్యము శాస్త్రవాసన లేని సామాన్య పాఠకునకు గూడ నందుబాటులోనుండు విషయము. కాని చమత్కారమట్లుగాదు. అది యేశాస్త్ర సంప్రదాయముతోడనో ముడిపడి యున్నచో ఆశాస్త్రమునందు ప్రవేశములేని వానికి కొఱుక రాని కొయ్య యగును. అంతేకాక చమత్కారము హాస్యరస మొక్కటే కాక ఏరస సంబంధమైనను గల్గియుండవచ్చును.

ఉదాహరణమునకు దాసుగారి ఒక చాటుపద్యమును జూడుడు. ఈ పద్యమే పిదప జానకీశపథములో జేర్పబడెను.

పల్లము వంక ప్రవర్తించె నీర్విశే
    ష్యము జాడ జను విశేషణము భంగి
అడవి కార్చిచ్చుల కాదేశమై కొండ
    వరద యాగమమయ్యె జెరువులకును
అల ప్రకృతి ప్రత్యయము లట్టు లన్యోన్య
    మెడయ కేళ్లుం గాల్వ లేకమయ్యె
కర్మ భావప్రయోగంబులం దప్పని
    యాత్మనే పద మట్టు లలరె కప్ప

వడి నలౌకిక విగ్రహ వాక్యమువలె
గోకిల రవప్రయోగంబులేక యుండె
బల్లవిత బహువ్రీహి సంపటల మగుచు
ప్రబలి వ్యాకరణము వలె వాన వెలిసె.

వైయాకరణఖసూచి యగు పాఠకుడు కేవల శబ్దార్థజ్ఞానముచేత ఈ పద్యములో కవి సూచించిన చమత్కారము నందుకొనలేడు. వ్యాకరణశాస్త్ర ప్రవేశమున్నకాని పాఠకుడు దీనిలోని పారిభాషిక పదముల కూర్పుతో కవి సాధించిన చమత్కారమును గ్రహింపలేడు. అందులకే ఆలంకారిక మూర్ధన్యుడైన ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకమున —

శబ్దార్థ శాసన జ్ఞాన మాత్రేణైవ నవేద్యతే
వేద్యతే స తు కావ్యార్థ తత్వజ్ఞైరేవ కేవలమ్.

అని చెప్పినది. ఈ పద్యమునకు హాస్యవాసనకూడ లేదుగదా! దీనిలో చమత్కారము లేదని ఏ రసికుడును అనలేడుకదా!

అంతమాత్రమున సాహిత్యములోని ప్రతి చమత్కారము శాస్త్ర పాండిత్య ప్రభావితమై యుండవలెనని నియమముకాదు. శాస్త్రవాసన లేని చమత్కారముండవచ్చును. అట్టి చమత్కారము నర్థముచేసికొనుటకు శాస్త్రజ్ఞానహీనుడయిన సామాన్యపాఠకుడు చాలును. ఉదాహరణమునకు దాసుగారి గజేంద్రమోక్షణములోని ఈ పద్యమును జూడుడు.

మొసలిచే బట్టువడి నీట మునిగి యున్న
గజమును సుదర్శనంబున గాచు శౌరి
మోహమున బట్టువడి భవమున మునుంగు
మనలగూడ సుదర్శనముననె కాచు.

ఈ పద్యములోని చమత్కారము నర్థము చేసికొనుటకు శబ్దార్థ జ్ఞానమున్న చాలును. సామాన్య సాహిత్య పరిజ్ఞానమున్న చాలును. సుదర్శనశబ్దమునందు గల అర్థద్వైతయము నర్థము చేసికొన్న చాలును.

ఈ చమత్కార పద్యమునందుగూడ హాస్యమున్నదని పల్కుటకు ఎవడును సాహసింపలేడుకదా!

సావిత్రీ చరిత్రమునందు దాసుగారు మఱియొక రకమైన చమత్కారము చేసిరి. ప్రతికీర్తన చివరను ఆ కీర్తన ఏ రాగములో పాడవలెనో ఆరాగముయొక్క పేరును అతికించినారు. ఈ చమత్కారము శిష్యులైన హరిదాసులకు, సంగీతవిద్వాంసులకు సూచనగాగూడ నుపయోగించును. సంగీతశాస్త్రములోని రాగముల నామములైన తెలియని వారికి ఈ చమత్కారము అంధేందు దర్శనము.

మఱియొక చమత్కారము. బందరులో పంతులుగారి మేడమీాద దాసుగారు సంగీతనాట్యములతో, ఛందస్సంభాషణములతో అసాధ్యాష్టావధానమును జేయగా, బుధవిధేయినీ పత్రికకు ప్రకటన కర్తయగు పురుషోత్తమరావు "చిన్నపనులగుంపు" అని దాసుగారి అవధానమును గూర్చి చులకనగా వ్రాసెను. దానికి దాసుగారు కోపముతో విష్ణుపరముగా నిందాగర్భముగా పత్రికాధిపతి జీవితములోని లోపముల నెట్లు బయలు చేసిరో గమనింపుడు.

ఆలి యొరుల కాయె అత్త నీపాలాయె
ముద్ది తుడుపులాయె బుధవిధేయి
నేతి బీరకాయ రీతి నీపేరాయె
ఉత్తముండ పూరుషోత్తముండ.

ఈ చమత్కార పద్యమునందు హాస్యముకూడ నున్నదని ఎవరికైనను (పురుషోత్తమరావుగారికి తప్ప) స్ఫురించును. పద్యమే చాటుపద్యము గనుక దాని రామణీయకమునుగూర్చి చెప్పబనిలేదు.

దాసుగారు పీఠికాపురముపై చెప్పిన ఒక చమత్కార చాటుపద్యము చిత్రాతి చిత్రవిలసితము. విద్వదాపధము. బహుభాషాకోవిదులకుగాని పరిచయముకాని పద్యము.

సంస్కృతము

సీ. భ్రాజతే కుక్కుటేశ్వర మాధవాలయాభ్యాం నభశ్చుంబి సౌధాంతరేణ.

పారసీకము

హాసిల్ల మీషజ హాతాబన్నమూ నబి హిషస్తు సౌఫిర్జి హీర సాల.

ఆంగ్లము

రావు సూర్యారావ్ది రాజాబహాదుర్ది చారిటబిల్ రూల్ ప్లెజంట్ఫరెవ్రి.

తెలుగు

చదువుల పుట్టిల్లు చల్లగాలి న్వెదజల్లుఁ బొగ్గడ్త లివెల్లఁజెల్లు.

తెలుగు

తే॥ గీ॥ మేటి పంటల పెంకి కల్మి మెడలంకి

ఆంగ్లము

బెస్టు టౌని న్గొడావరీ యూస్టిసీ జె

పారసీకము

మర్జ పీర్వ జవాల్జవాల్ మీర్జనాన

సంస్కృతము

పీఠికా పుర మస్తి త్రివిష్టపమివ.

దాసుగారి బహుభాషా ప్రవేశమునకు ఈ సీసము చక్కని నిదర్శనము. ఇన్ని భాషలలో వ్రాయుటే దీనిలోని చమత్కారము.

చమత్కార మొక రసగుళిక. అది ప్రతిభయొక్క ఒక విలాసము. దాసుగారికి చమత్కార మొక ప్రేయసి. సాహిత్యమునందే కాదు. ఆట పాటలందు కూడ దానిని వారు వదలిపెట్టరు.

చమత్కార చంద్రికను రసికలోకముపై ప్రసరింపజేయుటకు కళాచంద్రుని నెత్తిపై పెట్టుకొన్న విశ్వేశ్వరుడు ఈ హరిదాసు.

## వ్యక్తిత్వము :-

కావ్యవిషయ సాక్ష్యములతో కవియొక్క వ్యక్తిత్వము చెప్ప బూనుట ఒడ్డునకూర్చుండి సముద్రపులోతును అంచనావేయుట. కవిత్వము రమణీయ కథనమునకైన మథనము చెందినంత యథార్థకథనమునకైన తాప త్రియము చెందదు. ద్రవమును ఏ పాత్ర లో పోసిన, ఆ పాత్రయొక్క ఆకృతి నెట్లు ధరించునో, అట్లే కవికూడ పాత్రల నూహించుకొని తానా పాత్రగా మారి వర్ణించును. కవి యని బిరుదప్రదానము చేయునది ఈ లక్షణమే. ఒకేకవి భిన్నభిన్న సందర్భములలో భిన్న భిన్న విధములుగా అభిప్రాయములను వెలిబుచ్చును. సత్కవి ధరింపరాని వేషములేదు. వేశ్య నటియై రంగస్థలముపై పతివ్రతగా నటించి మెప్పుపొందవచ్చును. అంత మాత్రమున పతివ్రత యనగలమా ? పతివ్రతయని యనుటకు ఈనటన యనెడి కారణము చాలునా ? ప్రతిభ వేరు. జీవితము వేరు.

ఇక కవియొక్క వ్యక్తిత్వమును నిరూపించుట ఎట్లు ? నిరూపిం చుట కష్టమే. ఇతివృత్తమున్న కావ్యవిషయమున మఱింత కష్టము. కాని అభిరుచి మానవసామాన్య లక్షణము. కనుక వాగాయుధుడైన కవి ఆ అభిరుచిని కొంతలోకొంతైన సూచింపకుండ నుండగలడా ? ఇది మానవ మనస్తత్వము మనకు పెట్టెడి ఆశ.

ఎంత ఎత్తైన భవనమునకైనను పునాది భూమిలో నుండక తప్పదు. అట్లే కవి యెంత ప్రతిభావంతుడైనను తన గ్రంథమునందు అక్కడక్కడ వ్యక్తిత్వ పరిమళమును గుబాళింపజేసి తృప్తి చెందును. కాని ఆ పరిమళమును పసిగట్టుటకు పాఠకునకు జాగరూకత చాల అవసరము.

తీగమీద నడచు గారడివానివలె పదము తప్పకుండ పరిశీలింతము.

దాసుగారు మొట్టమొదట మిశ్రభాషను చేపట్టినను వయసు ముదిరినకొలది అనుభవము పెరిగిన కొలది వారికి క్రమక్రమముగా నాటు తెలుగుపై మోజు హెచ్చినది. సారంగధర చరిత్రలో —

మొలక లేతదనము తలిరుల నవకంబు
మొగ్గ సోగదనము పువ్వుతావి
తేనె తీయదనము తెనుగునకేకాని
పరుష సంస్కృతాఖ్య భాషకేది ?

అనియు, "తెనుగునకు స్త్రీ లాలిత్యము, సంస్కృతమునకు పురుష గభీరతయు సహజములు" అని పాత్రలచే చెప్పించిరి.

ఈ సంభాషణము లేకపోయినను కథ కుంటుపడదు. కథకు ఈ సంభాషణ మనావశ్యకము.

కథకు అవసరమైన పట్టులందు కవి వ్రాయు భావములు అతని వ్యక్తిత్వమునకు ఆయువుపట్టులు.

ఈ నాటు తెలుగన్న దాసుగారికి ప్రాణముకన్న తీపి. అందులకే ఈ భావమును మాటి మాటికి వెలిబుచ్చుచుందురు.

మొలక లేతటికము తలిరు పిదపిదన
చెలగు తీగె చెలువ మలరు తావి
తేనెతీపి - తెనుగునకే కాని
తపుల బోదికే నుడువులకైన.

మొలక లేతటికము తలిరుల నవకము
మొగ్గ సోగతనము పూవుతావి
ఆలరు తేనెతీపి తెలుగునకే కాని
మోటలాతి నాటు మాటకేది ?

దాసుగారి గ్రంథములలో దాదాపు అన్నియు భక్తిభావ ప్రధానములైనట్టివే. ఇతివృత్త స్వీకారమున కవి సంపూర్ణ స్వేచ్ఛాజీవి. కనుక దాసుగారు భక్తిభావ భరితాంతః కరణులని ఇతివృత్తస్వీకరణాభిరుచి సాక్ష్యమిచ్చుచున్నది. దాసుగారు పొట్టభక్తులుగాక పుట్టు భక్తులు.

ఒక్కొక్క భక్తునకు ఒక్కొక్క భగవదవతారముపై భక్తి కుదురును. దాసుగారు భగవంతుని ఎపుడు వర్ణించినను సృష్టి, స్థితి, లయ కారుడుగనే వర్ణింతురు. ఇది వీరి గ్రంథములందు మాటి మాటికి దర్శన మిచ్చు అంశము.

ఈ విధముగనే, వారు గ్రంథములందు సత్యము, భూతదయలను గూర్చి ప్రస్తావన కల్పించుకొనియైన వర్ణించుచుందురు. దయనుగూర్చి వారు సావిత్రీచరిత్రలో వ్రాసిన పద్యమును విడువలేకున్నాను.

ఎట్టి యాకలియైన చెట్టుకాయం ద్రుంప
 జెల్లవు చివురైన జిక్కలేవు.
ఈగల న్బాధించి యెంతయు కోర్కితో
 తేనె పట్టులదీయ బూనుకొనవు
దవ్వులనుండి యందంబగు పూలు గ
 న్గొనుచు నుందువుగాని కోయబోవు
తొడరి నీపయివచ్చు దుష్టజంతుల జంప
 నొప్పవు నేర్పున దప్పుకొనెదు

ఆత్మవలె ఈ సమస్త చరాచరముల
నెంచి ప్రేమించు నీకు హింసించ దగిన
వస్తువెయ్యది ? యింకెట్లు బ్రతుకవచ్చు ?
కటకటా ! దయకన్నను గష్టమేది ?

శతకములు, చాటువులు కవుల ఆదర్శములను ప్రతిబింబింపజేయు ఆదర్శకములు. ఆత్మాశ్రయ కవిత్వమునకు ఆశ్రయములు. వీనిలో ఇతి వృత్తముండదు. కనుక కవికి ఈ మార్గముననే నడువవలెననెడి బాధ యుండదు. పాత్రల ప్రసక్తియే వీనిలోరాదు. కనుక స్వీయభావ సూచనమునకు అడ్డుతగిలెడి పాత్రపోషణ బాధ్యత తలయే యెత్తదు.

దాసుగారు వ్రాసిన శతకములన్నింటిలోను వీరి ప్రవర్తనను, అభిరుచులను దెలుపు పద్యము లెన్నియో యున్నవి.

మేలుబంతియను చాటు ప్రబంధము వీరి వ్యక్తిత్వముయొక్క సంపూర్ణావతారము.

స్త్రీ పురుషులు వివాహములు మానుకొనవలెనని; మద్యపానము, మాంసభక్షణము వదలుకొనవలెనని; గీర్వాణభాషను వర్ణింపవలెనని ఎట్లు చెప్పుచున్నారో మేలుబంతిలోని వారి పంక్తులను పరికింపుడు

మగయాడు పెండ్లిండ్లు మానుకోవలయు
నంజుడు త్రాగుడు న్మాను కోవలయు
వేలుపు నుడువుల న్వీడనాడవలయు
పొత్తుగా నెల్ల రిమ్మగ మనవలయు
వాయింపు వ్రాతలు వదులుకోవలయు
కడలితో తమ సీమ కాపాడవలయు
మైపంచి యందఱుం బొట్పడవలయు
ముది పిన్నయ లిటుల బోవగావలయు
నామాట లివ్వి విన న్మేలు కలుగు.

"మనము మాటాడుభాష తెలుగు కావున మనము తెలుగు వారలము. అంతేకాని మనభాష ఆంధ్రముకాదు. మనము ఆంధ్రులము కాము." అని పత్రికాముఖమున వారెట్లు నివేదించుచున్నారో గమనింపుడు.

త్రిలింగ భాషైవాస్మాకం నాంధ్రభాషా కదాచన
వయం ప్రమాదతో హ్యాంధ్రా ఇత్యాఖ్యాతా నసంశయః
వేదబాహ్యా ద్రావిడా అప్యాంధ్రా తే మ్లేచ్ఛజాతయః
రామేశ్వర ప్రాంతజనాః తస్మాదాంధ్రాః కథం వయమ్.

తెలుగు మాటాడు వారలు తెలుగువారు
కాని చెడుగులౌ నాంధ్రులు కారు కనుక
ఆంధ్రరాష్ట్రము మాది మే మాంధ్రులమని
చెప్పుకొనరాదిక న్దెల్గు సీమవారు.

పద్యముకాని కీర్తనగాని పైకి చదివినపుడు సుస్వరముతో సంగీతాత్మకముగా చదువవలెనని ఈ పంచముఖీ పరమేశ్వరుని నిశ్చితాభిప్రాయము. లేనిచో ఛందోలయలవలన ప్రయోజనమేమని వీరివాదము. అంబరీషచరిత్రపీఠికలో ఈ భావములెట్లు అక్షరాకృతిని ధాల్చినవో చూడుడు.

"పఠనశక్తి జనరంజకము కానపుడు రుచ్యముగ జదివి సుస్వరముగఁ బాడలేనప్పుడు ఛందోలయలతోఁ బనియేమి? మనసులోఁ జదువుకొనుట చెల్లును గాని వర్ణాత్మకముగాఁగాని కేవల ధ్వన్యాత్మకముగాఁగాని యెలుగెత్తి సుస్వరముగఁ బఠించినప్పుడు కదా గద్య పద్యగీతముల సార్థకత."

ఆట పాట మాట మీటలు ఏకగ్రీవముగా నెన్నుకొన్న చతురాస్యులు శ్రీ ఆదిభట్ట నారాయణదాసుగారు.

వారి ఆయువు తెలుగువారికి హరికథలపై ఆసక్తి యున్నంత కాలము.

తెలుగుదేశములో హరికథకులకు నారాయణదాస నామస్మరణము ఇష్టదేవతా మంత్రము.

"ఆకార సదృశ ప్రజ్ఞః ప్రజ్ఞయా సదృశాగమః
ఆగమైః సదృశారంభః ఆరంభ సదృశోదయః"

# దాసుగారి రసప్రపంచము

శ్రీ ప్రతాప వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి M. A.

ఏ వాఙ్మయమునందైనను రసవద్రచనలు విశ్వశ్రేయస్సును శివేతరక్షతిని సద్యః పరనిర్వృతిని కలిగించుచు చిరకాలము సజీవములై యుండును. 'నహి రసశూన్యం కావ్యం కించి దస్తి' అను ఆర్యోక్తిని పరికించినచో రసహీనమగు రచన కావ్యమే కాజాలదు.

ఆంధ్రదేశమునందే కాక యావద్భారతమునందును హరికథా పితామహులుగా సంగీతసాహిత్య కోవిదులుగా రసవత్కవీంద్రులుగా లబ్ధ ప్రతిష్ఠులైనవారు శ్రీ నారాయణదాసుగారు. వారు అష్ట శతసహస్రావధాన పారీణులు. అష్టభాషా పండితులు. పలుమాటలేల ? వారొక 'పుంభావ సరస్వతి'. శ్రీ దాసుగారి నడక, నడత, పలుకు, కులుకు అన్నియు రసవంతములనుట అతిశయోక్తి కాదు. వారి యక్షగానాది రచనలన్నియు రసస్ఫూర్తితో విరాజిల్లుచుండును.

## యథార్థ రామాయణము

శ్రీ దాసుగారి యక్షగానములలో యథార్థరామాయణము తల్లమానిక మని చెప్పదగును. వాల్మీకీయమునకు ఇది అనువాదమయ్యు స్వతంత్ర కల్పనాభరితమై నవరసభావాలంకృతమై యొప్పారుచున్నది.

శ్రీ దాసుగారి యథార్థరామాయణములో 'శ్రీరామ జననము సీతాకళ్యాణము, శ్రీరామ పాదుకాపట్టాభిషేకము, శ్రీరామ సుగ్రీవ

మైత్రి, హనుమత్సందేశము, సామ్రాజ్యసిద్ధి,' అను ఆరు భాగములు గలవు. శ్రీరామజననమున కరుణరసవాహిని కూలంకషముగా ప్రవహించి పాఠకులకు కంటితడి గలుగునట్లు చేసినది.

దశరథుడు వేటకేగి చూడక శబ్దభేది బాణమున మునిబాలకుని గూల్పగా వృద్ధులగు వాని జననీ జనకులు వాపోయిన విధము పాషాణహృదయమునైన వ్రక్కలు గావించు రీతిలో నున్నది.

''ఎట్లుంటివమ్మ నీకేమి కావలెనయ్య
యని యింక మమ్మెవ్వ రడుగువారు
ముసలి ముద్దలము మమ్మం దానమాడించి
బువ్వ దిన్పించు వారెవ్వరింక
వాన కెండకు గొడ్గువలె మమ్ములోబడ
నీక కాపాడు వారెవ్వరింక
వేదవేదాంగముల్ వినిచి మా వీనుల
కింపు గావించు వారెవ్వరింక

వీడు రానేల నిట వీని వేటగూల
నెఱుగలేమైతి మింతలో నిటులగునని
యేమి సేయుదు మింక మాకేదిదారి
యకట విధి చేఁత నెవరైన నడ్డఁదరమె ?''

"ముసలి ముద్దలు, బువ్వ దిన్పించు, వీని వేటగూల, మాకేది దారి, మున్నగు ప్రయోగములు జాతీయములై కరుణరసమును వెల్లివిరియింప జేయుచున్నవి. 'అపి గ్రావారోదిత్యపి దళతి వజ్రస్య హృదయం' అన్నట్లు ఈ పద్యమును విని గుండె ద్రవింపని భావుకుడుండడు.

విష్ణువు కామవిజయము నందితినని గర్వించు నారదుని యహంభావమును అణచు సందర్భమున విష్ణుమాయాపురవిభుడు తన కుమార్తెకు స్వయంవరము చాటును. అచటికి నారదుడురాగా ఆరాజు తన పుత్రిక నామునికి జూపి యీామె కెవడు పతియగునని యడిగిన నా నారదు

డామె సొగసునకు ముగ్ధుడైన ఘట్టమున దాసుగారు శృంగార రసమును సహృదయ హృదయ రంజకముగా వర్ణించినారు.

యమునా కళ్యాణి - త్ర్యస్రగతి

ప॥ కొమ్మా! గాకిది మేలి బంగారు బొమ్మా!
యారారా యీ ముద్దు
గుమ్మ సొగ సువర్ణింప నాతరమ్మా హా ॥ కొమ్మా ॥

1. చూపా! పువ్విలుకాని క్రొవ్వాడి తూపా! తమి ద్రుళ్ళెడు జేసిన
చేపా! దీనిజూచి శక్యమ ధైర్య మూప హా ॥ కొమ్మా ॥

2. కురులా! మానిమానసంబులకైన నురులా తమ్మి మునురుకొన్న భ్ర
మరులా! కారావేల్పులైనఁ గింకరు లాహా ॥ కొమ్మా ॥

ఈ కీర్తనలోని పదాలు శృంగార రసాస్పదాలు. అనుప్రాసలు రసవ్యంజకములు. భావము రసస్ఫోరకము. ఈ ముద్దుగుమ్మకు వేల్పులైన కింకరులనుట వలన ఆ కన్య జగదేక మోహన లావణ్యమును స్ఫురింప జేయుచున్నది.

సీతాకళ్యాణ కథలో విశ్వామిత్రుడు మాటతప్పిన దశరథునితో మాటాడు ఘట్టమున ...

అఠాణ - రూపకము

ప॥ ఏర యింత నక్కవినయ మేల చూపినావు ఛేడ ॥ ఏర ॥

అ॥ కోరిన దొసగెద దని వేకొనలేదా నాతోడ ॥ ఏర ॥

1. కల్లలాడు వాడు నిక్కముగ నొక్క మగవాడా
చెల్లరే సంప దంధుల కిసీ మాట పరువేడ ॥ ఏర ॥

అని గాధేయుని క్రోధము వర్ణితము. 'తుచ్ఛసంబోధనే త్వరే' అని సంస్కృత పండితోక్తి. ఈ కీర్తనలో 'ఏర!' అని దశరథుని సంబో

ధించుటయు నక్కవినయము చూపితివనుటయు విశ్వామిత్రుని రౌద్రము ప్రకటితమైనది.

స్వయంవరమునకు శ్రీరాముడుగూడ వచ్చెనని హెచ్చిన తమకముతో సీత ఉద్యానవనమున తన నెచ్చెలితో ఇట్లు పలికినది.

పూర్వకళ్యాణి - రూపకము

ప॥ ఏడే కాన్పించ డెట - నున్నాడే రాముడేడీ ॥ ఏడీ ॥

అ॥ నేడే నా జన్మము సఫలము - వాడే హా అందకాడే ॥ ఏడే ॥

1. పొందియవ్వాని బల్కరించి నే మంచిసమయమేరా ॥ డేడీ ॥

2. చూడు క్రొమ్మబ్బు వన్నెకాడు వాడు
లేడా కనరాడా యయ్యయో ॥ ఏడే ॥

ఇందు సీతకు శ్రీరామునిపై గల అనురాగము, శ్రీరామ దర్శనము కానందుకు గల్గిన వంత ఎంతయో స్పష్టమయినది. 'నవినా విప్రలంభేన శృంగారః పుష్టిమశ్నుతే' అని పెద్దల మాటనుబట్టి సీతారాముల విప్రలంభ శృంగారము సువర్ణితము. ఇక శ్రీరాముడుకూడ ఇట్లు భావించెను.

వసంత - ఖండగతి

ప॥ క్రొక్కారు మెఱుగులాగున తళుక్కన మెఱసి ॥ క్రొ ॥

అ॥ ఇక్కడ మఱుగుపడ దదేమొకో తమ్ముడా ॥ క్రొ ॥

1. కెంబెదవి గఱచుకొని క్రేగంటి చూపుగా
లమ్మున న్నా మనసు లాగుకొనె నెవ్వతో ॥ క్రొ ॥

చూపుగాలమున సీత తన మనసును లాగుకొనెననుట వలన శ్రీరాముని భావన శృంగారరస పరిపుష్టమేగదా.

పాదుకా పట్టాభిషేక కథలో గరళ కంధర మంధర శ్రీరామ పట్టాభిషేక వార్తను విని కైక కడకు వెళ్ళు ఘట్టమున అద్భుతరసము పోషింపబడినది.

"మంధర కేకయి చెంతకు
తొందరగా నేగి వంత తోడుత నాపెన్
క్రిందా మీదా కనుగొని
కొందలపడి గుండెబాదుకొను చిట్లనియెన్"

మంధర వంతతో కైకేయి చెంతకు తొందరగాబోయి ఆపెను క్రిందా మీదా కనుగొనినదట. అనగా శ్రీరామ పట్టాభిషేక వార్త విన్నను కైకేయిలో ఏ వికారముకూడ లేనందులకు మంధర అబ్బురపడినది. క్రిందా మీదా చూచియు, ఏ అవయవములోను మార్పు లేనందులకు విస్తుపోయినది. ఇది ఎంతటి రసవద్రచనయో సహృదయులు గ్రహింపగలరు. మంధర గుండె బాదుకొనుట వలన రసపుష్టి కల్గినది.

వనవాసగమనమునకు అనుమతింపుమని తనను ప్రార్థించు శ్రీరాముని తో దశరథుడు పొంగిపొరలి వచ్చు దుఃఖముతో గద్గదికతో పలుకు ఘట్టమునందు -

సావేరి - రూపకము

ప॥ ఎటుల విడతు నిన్ను పుత్రి యేమనందు కులపవిత్ర ॥ ఎటు ॥

అ॥ కటకట నే నెఱుగనైతి కైకయింత చేయునంచు ॥ ఎటు ॥

1. నేను నీకు రాజ్యమొసగ నేడు నిశ్చయించుకొంటి
తానొక్కటి తలచినంత దైవ మొకటి చేయునయ్యో ॥ ఎటు ॥

శ్రీ దాసుగారి వచన రచనయు రసవంతమే యయి యున్నది, లక్ష్మణుడు మహారణ్యమున నిద్రించు తన అన్నను వదినెను చూచి అందోళనపడు ఘట్టమున -

"విధిచేత యెంత విచిత్ర-మయ్యో ! మంచివారు పరోపకారము నకై మర్యాద తొలంగనేర కెట్టికష్టములకైన నోడికట్టెదరుగదా - మృష్టాన్నముల గుడిచి దివ్యసౌధాంతరమునందు హంసతూలికా పర్యంకంబున నచ్చరలు సురటీలు విసర దిక్పతులు బరాబరికసేయ గంధర్వులు లాలిబాడ బంగరు తూగుటుయ్యెలన్ నిదురించు నీ ప్రియ దంపతులీ ఘోరారణ్యములో నీ చెట్టుక్రింద నీ వట్టినేల నిట్లు బడలి నిదురింపజూచు నా దురదృష్ట మేమనుకొనెద నన్నన్నా నా గుండె నీరగుచున్నదెంతా పుకొన్నం గన్నీరు కట్టకున్నది." అని కరుణ చిప్పిలునట్లు రచించినారు.

ప్రతి పదము తూచి ప్రయోగించినట్లున్నది. సీతారాములు నిద్రించు స్థితినిచూచి లక్ష్మణుని గుండె నీరయినది. ఈ రచనను చదివిన రసజ్ఞ పాఠకుల గుండెలు నీరయి పోకపోవు. ఈ సన్నివేశమున ఒక లక్ష్మణునికే కాదు పఠితలకు గూడ నిజముగా కన్నీరాగదు. సౌమిత్రి శోకము బహుధా వర్ణితమై ఆతని మృదుల స్వభావమును భ్రాతృభక్తి పరాయణతను విశదమొనర్చు చున్నది.

శ్రీరామ బాణమున నేలగూలుచు మాయాహరిణము 'హా లక్ష్మణా !' యనగా విని సీత భయభ్రాంతయై తనచెంతనున్న మరదితో మాట్లాడు సందర్భమున భయానక రసము పరిపోషింపబడినది.

సావేరి - ఆదితాళము

ప॥ అన్నా ! లక్ష్మణ యిటు పిల్చె న్నీయన్న
యేమిజరిగెనో కదా కను ॥ మన్నా ॥

అ॥ అన్నన్నా ! యెద్దియు దోచకుండె నరుగుమటకు
వేగ నా మాట విను ॥ మన్నా ॥

1. ఊరకుండలేక నేనేల నయయో పంపినాను నా భర్తనట్టు ।
దూర మెంతయో లేదు వే పొమ్ము తోడుకొని రమ్ము
నీ తోడబుట్టు ॥ నన్నా ॥

తనను గొనిపోవ నుంకించు దశాస్యునితో జానకి రౌద్రముతో నిట్లు భాషించినది.

కన్నడదర్బారు - ఆదితాళము

ప॥ అగ్గిలో దుముకబోవు మిడుతవలె – నోరా! యధమ!
రాక్షసాధమా! చెడెదవు ॥ అగ్గి ॥

అ॥ సిగ్గటి ముక్కు సెవులు చెఱచుకొన్న – చెల్లెలవలె
సీతల గోల్పడెదవ ॥ అగ్గి ॥

శ్రీరామునితో చెలిమిచేసిన సుగ్రీవుడు వాలికడకేగి శ్రీరాముని పౌరుషమును తెల్పును. అంత వాలి తెలివిమాలి తూలి క్రోధముతో కన్నుమిన్ను గానక ... ... ...

"ద్రోహీ! యాలిని కోలుపోవు నరుడెంతో శూరుడంచీవు వ
న్నాహాహా బెదిరింప వచ్చితి వొకో యా మర్త్యునిన్ గిర్త్యునిన్
బాహాగర్వముమీర నొక్కత్రుటిలోనన్ మట్టిమల్లాడి యి
ప్డే హింసించెద నిన్ను నీకిపుడు దిక్కెవాడురా దుర్మతీ!

అనుచు సుగ్రీవుని పిడికిటితో బొడుచును. ఈ పద్యములోని ప్రతి పదము రసస్ఫోరకమై భావభరితమై యున్నది. 'మర్త్యునిన్ గిర్త్యునిన్' అను ప్రయోగమువలన వాలికి శ్రీరామునిపై గల అనాదరము వ్యక్తమగుచున్నది. ఈ ద్విరుక్తి అనాదరార్థద్యోతకము. 'మట్టిమల్లాడు' 'నీకిపుడు దిక్కెవ్వాడురా' అను ప్రయోగములు రసపోషణమునకు పరాకాష్ఠగానున్నవి.

సీతాన్వేషణ పండితుడు హనుమంతుడు లంకకేగుచు తోటి కపీంద్రులతో శ్రీరామమాహాత్మ్యము నిట్లు వివరించియున్నాడు.

"రామ పాదాంబు జారాధకునకు నసా
ధ్యంబగు కార్య మెందైవలేదు

రామకథాసుధన్ ద్రావెడువానికి
బ్రళయాగ్నిగూడ వెన్నెలవలెనగు
రామనామముబల్కు పామరుండున్ బృహ
స్పతికన్న బుద్ధిసంపద వహించు
రాముని భక్తులన్ బ్రేమించువానికి
ముంగొంగు బంగారు మోక్షపదవి

రామకార్యార్థమై పుట్టినాము మనము
రామచంద్రుడు మన మనోరథము దీర్చు
రాముదేవుని వీక్షించి రహినివత్తు
ధైర్యమున నుండుడీ రామదాసులార।"

భక్తిరసమో కాదో కాని యీ సీసపద్యము మాత్రము హనుమంతునికి శ్రీరాముని యెడలగల భక్తిని రసవంతముగా నిరూపించుచున్నది. కవితాశైలియు ద్రాక్షాపాకమున బడి మనోరంజకముగానున్నది. శ్రీరామభక్తులను ప్రేమించువానికి పరమపురుషార్థమగు మోక్షము ముంగొంగుబంగారమని శ్రీ దాసుగారు చక్కగా వివరించినారు.

అశోకవనముననున్న సీత తనను బలవంతపెట్టిన రావణుని తృణీకరించి వాడు వెడలినపిమ్మట మహత్తర శోకాగ్ని సంతప్తమై ఆత్మహత్య కొడంబడి ప్రక్కన నిదురించు రాకాసి చేకటారి లాగుకొని నీటిబుగ్గలవలె కన్నీరు ప్రవహింపగా నిట్లు చింతించినది.

ముఖారి - రూపకము

ప॥ జీవితేశ సెలవిమ్మా చేరెద నీలోన ॥జీవి॥

అ॥ నీవేనా పెనిమిటివగు మెన్నిభవములైన ॥జీవి॥

1. ఈరాతిరె నీకు నాకు ఋణము చెల్లునాథ
యేరితోడ చెప్పుకొందు నిప్పటి నాబాధ ॥జీవి॥

2. ఇన్ని దినములయ్యె నింక నెప్పుడు నిను గందు
నెన్నగ నీ విరహాబ్ధికి మృత్యువే తగు మందు ॥జీవి॥

ఇందు సీతా శోకవహ్ని మిన్నుముట్టినది. మన విరహాబ్ధికి మందు మృత్యువేనని నిర్ణయించినది. రామా ! జీవితేశ్వరా ! నీలో జేరుటకు సెలవిమ్మని యడిగినది. ఈ కీర్తన భావమును మది నిల్పిన సహృదయుని కన్నులు చెమ్మగిల్లకపోవు. ఎవరితో చెప్పుకొందుననుటలో 'అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ' అను ఆర్యోక్తిలోని ప్రపన్నత్వము సువ్యక్తమగుచున్నది. కరుణరసమును అపారముగా వర్ణింపజేయుటలో శ్రీ దాసుగారు వాల్మీకితో సాటి కాకపోరు.

కుంభకర్ణుడు ప్రళయభైరవునివోలె తాండవమునలుపుచు పిడుగు సవ్వడివలె విలయాట్టహాసము గావించుచు వానరులతో పోరుఘట్టమున శ్రీ దాసుగారి వచనరచన బీభత్సరసాభివ్యక్తికమై యలరారినది.

"ఇట్లు కుంభకర్ణుడే తెంచి యేడీ రాముడేడీ రాముడని సింహ గర్జనలు సల్పుచు నొడుగఱచుచుఁ గపులఁ గొందఱన్ గాల్సేతుల నల్లులమాడ్కి నేలరాయుచు, గొందఱన్ సెనగలవలె నమలుచు, గొంద ఱన్ వెన్నముద్దల కరణి మ్రింగుచు, గొందఱన్ బొడుమట్లు దిగఁబీల్చుచుఁ బ్రళయభైరవునిరీతిన్ విజృంభింప నద్దనుజుని యుచ్ఛ్వాసనిశ్వాసంబుల నవశులై చిక్కువారును మఱియు రోమకూపద్వారముల వెడలు వారును ... అయ్యసుర దెబ్బ తప్పించుకొనుచు నతని కను ముక్కు చెవుల జొచ్చి బాధించుచు చచ్చుచు నొచ్చుచుండ సుగ్రీవు డా రాక్ష సవీరుని నడినెత్తి నొక పర్వతశిఖరంబువైచి నొప్పింప జలింప కమ్మా నుషాశను డా వాలితమ్ముని బిడికిటబొడిచిన నెత్తురుగ్రక్కుచు గనులు తేలవైచి రామచంద్రా యని నేలసోలినవాని నొక కేలబట్టుకొని రెండవ కేలన్ శూలముంద్రిప్పుచు కపివీరులన్ దనదరి జేరనీక రొప్పుచు ..."

ఈవిధమున రసమును స్ఫురింపజేయుచు శ్రీ దాసుగారి రచన కాటికిఁ గాళ్ళుసాచినవానినిసైతము యుద్ధమునకు బరువెత్తించు రీతిలో నుండును.

వాల్మీకి రచనకు వందలకొలది గద్యపద్యోభయాత్మకములగు అనువాదములున్నను శ్రీ దాసుగారి యథార్థ రామాయణము విశిష్టమై యున్నది. ప్రాబంధిక శైలిలో రసవంతముగ- వాల్మీకి రామాయణమునకు యక్షగానగౌరవమును గూర్చిన శ్రీ దాసుగారి యుపజ్ఞ సర్వదా ప్రశంసనీయము.

## భీ ష్మ చ రి త్ర ము

ఇందలి మంజరులు, కీర్తనలు, తరువోజలు తెలుగు జాతీయతను చాటుచు రసవంతములై యున్నవి.

శంతను మహారాజు యమునానదిలో నిసుకతిన్నెపై నున్న పల్లె కన్నియను జూచి మదను దుడుకులకులోనై ఆ ముద్దరాలితో భాషించిన తీరు రసస్ఫోరకము.

### శహన - చతురస్రగతి

ప॥ ఎవరి దానవే తరుణీ నీ-వెందుకుంటి కీవీ కరణి ॥ఎ॥

అ॥ చివురు చేతులకు గరుకు వెదురుగడ
చెల్లునె యోడం గడుప జమునకడ ॥ఎ॥

1. ఇమ్ము ధాచసుంకమ్ము నీకెమ్మోవి మానికమ్ము
కొమ్మా నీకటాక్షమ్మున దాటంగోరెద ముమ్మరంపు
మోహాంబుధి ॥ఎవ॥

'కన్నియరా నిన్ను గూడగ కాంక్షపుట్టె నెట్టులేలెదో నన్ను నీ చెట్టపట్టి' అని తత్తరపడిన శంతనుని ఆవేదన శృంగార రసాత్మకము.

త్రాను ముమ్మరంపు మోహాంబుధి దాటుటకు ఆమె కటాక్షమే సాధన మని పల్కుట గమనార్హము.

భృగుకులాగ్రణి యగు రాముడు శాంతనవుతో పోరికేగునప్పటి వేషవర్ణనము మిక్కిలి రసవంతమై యున్నది.

'కెంజడల్ ముడివైచి మంజులముగ మౌళి
పైని రుద్రాక్షల వరుస జుట్టి
వీరకాచను గట్టి బెబ్బులితోలుపై
దాల్చి మూపున జన్నిదంబు లమర
మొల బెట్టి ఖట్వాంగమును విల్లు చేబట్టి
చండ భాస్కరుని తేజమున మీరి
సింహగర్జలు చెవుల్ చెవుడు పర్చగ బ్రబల
యాగ్ని కణంబుల నక్షు లుమియ'

ఈ వర్ణనము పరశురాముని క్రౌర్యము, వీర్యము చిత్రమున చూపినట్లు వివరింపబడినది.

కవ్వడి శిఖండిని మున్నిడుకొని మహారథుని భీష్ముని నొంచు ఘట్టమున కరుణరసము జాల్వారినది.

## మంజరి - చతురస్రి

"కవ్వడి భీష్ముని వాల్బలకల ముక్కలుచేసి యతని మేన మువ్వురుస బాణముల్ నాటిన శ్రమబొంది యెంతయుం బిరాన శరములూతగా దూర్పు మొగముతో శాంతనవుడు ధరనొటిగె పరమాద్భుతముం జెందిరి జోదులు భానుడస్త్రాద్రి కరిగె" శరతల్పమున బరుండిన శాంతనవు డుత్తరాయణ కాలము వచ్చువరకు ప్రాణముల చిక్కబట్టి వేదాంతచర్చలు చేయుచు శ్రీకృష్ణునితో సంభాషించి కన్నుమూయుట భీష్ముని మహోదాత్తతకు నిదానము. ఇట శాంతము రూపుగట్టినది.

## అంబరీష చరిత్రము

ఇందలి తొలి కృతులలో "అంబరీష చరితము నవరసామృత భరితము, సమ్మోద స్ఫురితము, సదాపహృత దురితము" అని శ్రీ దాసు గారు వ్రాసియున్నారు.

దుర్వాసమహర్షి అంబరీషుని శపించు సన్నివేశము రౌద్రభయానకముల కాలవాలమై యొప్పినది. వ్రతఫలితము దక్కుటకై వృద్ధానుమతమున సలిల భక్షణము కావించిన అంబరీషునిపై దుర్వాసుడు తన జటను సమగ్రముగా తెగదీసి వైవగా ...

"అభ్రం లిహ దభ్ర విభ్రమాభ్ర భ్రమ
కృష్ణీల దీర్ఘ శరీర మమర
ప్రళయకాలానల ప్రభను జక్రీకృతే
క్షణముల రౌద్ర మక్షయము గాగఁ
త్రైలోక్య కబళనోత్సాహ సూచక ఘన
వక్త్ర త్రయోగ్రత వాని కెక్క
బభ్రు బర్బర కేశ పాశారుణ ప్రభ
కాల సంధ్యారాగ కాంతి దనరఁ

గ్రకచ కఠిన కరాళ దంష్ట్రిలు వెలుంగఁ
బద యుగోద్ధూత పాంసువుల్ చదలు గప్ప
నేలఁ బదముల నింగిని నిడ్డ తలల
నత్తికొని వచ్చె గృత్తి తా మిత్తి పగిది."

తనపైకి వచ్చిన ఘోరశక్తినిచూచి అంబరీషుడు భయభ్రాంతుడైనాడు. కొన్ని తావుల భావము రసస్ఫోరకముకాగా మరికొన్నిచోట్ల పదప్రయోగము రసవ్యంజకమగును. ఇందు పదములు, భావములు, శైలి అన్నియు గలిసి రౌద్రభయానకముల సృష్టించినవి. ఈ పద్య భావమును మననముచేయు భావుకునకు ఒక చిత్తరువు చూచినట్లుండి తీరును. శ్రీ దాసుగారి రచనలోని రసస్ఫూర్తి కిది మంచి తార్కాణము.

ఇందు అంబరీషుని పరమ హరిభక్తి రసవాహిని పరవళ్ళు త్రొక్కుచు ప్రవహించి పాఠకుల మానసములందలి దురితము ధ్వంసము గావించినది.

## ప్రహ్లాద చరిత్రము

ఇదియు భక్తిరస ప్రధానమైన రచనయే.

గర్భిణియగు తన పత్నిని సురపతి గొనిపోయినాడని నారద మహర్షి వలన నెఱింగిన హిరణ్యకశిపుఁడు మండిపడి ఆ దేవర్షితో పలుకు సందర్భమున రచన రసవంతముగానున్నది.

"పులిమీసములు బెరుకునట్లు – శలభమగ్గిలో బడునట్లు–బలు త్రాచు న్మర్దిడునట్లు – సలిపె గీడు నాకా యధముండు – నేటితో స్వర్గముపని సరి – నిఖిల దేవతల పని సరి– మీఁటె దిక్కుల నేలగల్పెద– మేరువును తలక్రిందు సల్పెద"– ఈ కీర్తన భాగములో సాదృశ్యములు, రక్కసుని ప్రతిజ్ఞలు వీరరసమును తెల్పుచున్నవి.

ప్రహ్లాదుఁడు తాను చదివిన చదువులలోని మర్మమును జనకున కిట్లు వచించినాడు.

> "హరికి సమస్త కర్మములు నర్పణసేయక యున్నవాడు శ్రీ
> హరికథ బల్కువాని తన యయ్యగ నెంచనివాడు ఘోరదు
> ర్భర భవవార్ధి దాటు టెటు వానికి మోక్షముగల్గుటెట్లు పె
> క్కరయగ నేల శాస్త్రము లహో హరిభక్తియె తండ్రి! మేలగున్."

వైదికకర్మము లన్నింటిలో చివర 'సర్వం శ్రీ కృష్ణార్పణమస్తు' అను సంప్రదాయముగలదు. కర్మబంధముల బాపుకొనుట కిది యేర్పడినది. హరిభక్తియే సర్వశాస్త్రసారమనియు, మోక్షార్థికదియే ముఖ్యమనియు పల్కు ప్రహ్లాదుని హరిభక్తి మహోన్నతమైనది.

తాను పెట్టు బాధలకు కసిగందక యంతకంతకు తేజరిల్లు బాలకుని చూచి స్వర్ణకశిపుడు ఆత్మగతమున అద్భుతమునందు సన్నివేశమున .........

చక్రవాకము - త్రిశ్రగతి

ప॥ కొంచెమైన జావ డిక్కుట్ట డేమి హేతువో ॥ కొం ॥

అ॥ అంచిత తేజమ్మున దా నంత కంతకున్ మీరెడు ॥ కొం ॥

1. ఎంచి సముద్రమ్మున ముంపించితి దావాగ్నిం గా
ల్పించితి గ్రోలించితి విష మేనుంగుల ద్రొక్కించితి ॥ కొం ॥

అని యద్భుతరస ముట్టిపడగా (శ్రీ) దాసుగారు రచించినారు. సముద్రమున ముంచుటయు, దావాగ్నిలో గాల్పించుటయు, విషము దినిపించుటయు మరణ హేతువులు. అన్ని చేయించినను కుఱ్ఱడు ప్రహ్లాదుడు కొంచెమైన చావడట. ఎంత చక్కని రసపోషణశక్తి. పైగా చావకున్న మానె ? ఇంకను అంత కంతకు తేజస్సంపన్నుడగుచుండెనట ! ఇంతకన్న హిరణ్యకశిపుని అబ్బురపాటుకు కారణమేమి కావలెను? సమగ్ర కారణము లున్నను విపరీత కార్యోత్పత్తి జరిగినది.

నరకేసరి ప్రత్యక్షమగు సందర్భమున

"గంభీర భీకర గర్జారవంబున
బ్రహ్మాండ భాండ కర్పరము వగుల
చటుల సటాచ్ఛటా చలన సంజాత ప్ర
చండ వాతాహతిన్ గొండ లెగయ
కాలానలాభీల కీలాభ జిహ్వా ప్ర
భావళిఁ జగమెల్ల జేవురింప
తరుణేందు భాసుర దంష్ట్రా నఖచ్ఛాయ
లలమి దిక్కులకు వెన్నెలలు గాయ

కరము లురమును శిరము సింగంబు మాడ్కి
నాభికిఁ గ్రింది భాగము నరుని పోల్కి
నలర నరసింహ రూపున నవతరించె
నా్శితపరాయణుండు నారాయణుండు."

స్తంభము బ్రద్దలు చేసికొని శిష్టరంజకుడై దుష్టభంజకుడై హరి నృహరి రూపము నందుట యెంతయు రసోల్బణముగా విరచితమైనది. ఇట్టి రచన శ్రీ దాసుగారి రసిక హృదయమునకు మూదల యన వచ్చును.

## సావిత్రీ చరిత్రము

ఇది రసవంతమైన చక్కని యక్షగానము.

సావిత్రి కలలో గాంచిన యందగాని చిత్రపటమున వ్రాసికొని చెలికత్తెలతో నిట్లు పలికినది.

ఆనందభైరవి - త్రిపుట

ప॥ ఇతడెవ్వడో కాని యింతీ నిన్న నాకలలో
నేగుదెంచిన వీరుడే – మారాకారుఁడే ॥ఇత॥

1. ప్రాణనాయకీ! చేర రమ్మని నను బిలిచి
వలచి సందిట గ్రుచ్చెనే ముద్దు లిచ్చెనే
ఏను బులకరించి యేమరి యుండగ
నెంతో వింతకూడ సేసెనే – వీని జూడకున్న
నాయుసురు వీసమైన నిక నిల్వబోదు— ॥ఇత॥

ఈ కీర్తనలో శృంగారనాయికల మానసిక వేదన సూచితమగు చున్నది. శ్రీ దాసుగారి రచన ప్రతిపదరసస్యంది యనదగును.

సత్యవంతుడు అశ్వపతితో సంభాషించు సందర్భమున మూర్తీభవించిన వీరరసమువోలె మహోత్సాహముతో పలుకుట సుమనో మనోహరముగా నున్నది.

స్రగ్ధర : కఠిన జ్యాఘోష మాశా ఘన కరటి ఘటా కర్ణముల్ వ్రక్కలింపన్
పిఠర ప్రోద్భూత దావాగ్ని నిబిడ పరరాణ్ణీరసాగాళి గాల్పన్
జఠరీభూతారి నూత్నోష్ణరుధిర మదిరోన్మత్త భూతంబు లార్వన్
విఠరుల్ స్తోత్రింప నస్మద్విజయ యశము దిగ్భిత్తులన్ వెల్లవైతున్.

ఓజోగుణ విరాజితమగు ఈ స్రగ్ధర వీరరసాపాదకము. 'పరరాణ్ణీరసా గాళి' వంటి ప్రౌఢప్రయోగములు శ్రీ దాసుగారి పాండిత్య ప్రకర్ష కు నికషోపలములు.

పతి దుర్విధివశమున నుసురుబాయగా సావిత్రి బండలు కరుగగా తల మోదుకొనుచు నేడ్చినతీరు చూచిన పాఠకుల గుండెలు కలుగ కుండవు.

## హరిశ్చంద్రోపాఖ్యానము

శ్రీ దాసుగారి యక్షగానములలో దీనికిదియే సాటి. ద్విపదగా పద్యకావ్యముగా గద్యముగా నాటకముగా ఈ హరిశ్చంద్రుగాథ ఆోళ్ళ రోకళ్ళ బాడబడినది. అట్టి కథకు యక్షగాన రూపము గూర్చిన శ్రీ దాసుగారి నవరసభరిత కవితా వైభవము శ్లాఘనీయము.

వసిష్ఠ విశ్వామిత్రుల వాదోపవాదములలో

"చదువులకు జెంపపెట్టు దోసముల పట్టు
వ్యసనములకొట్టు పుణ్యకార్యములతిట్టు
పాపముల మెట్టు కడుబట్టబయలు గుట్టు
నీచు పనిముట్టు సత్తెమే రాచపుట్టు"

అను పద్యము సహృదయ హృదయంగమమై చక్కని యాసడింపుగా నున్నది. ఆరాజును బొంకింతునన్న విశ్వామిత్రునికి నీవల్లగాదన్న వసిష్ఠు నకు జరిగిన సంభాషణ యెంతయు రసవంతము.

మాతంగ కన్యలు హరిశ్చంద్రునితో వెకాపకము పోతలాగా దిట్లు పల్కిరి. "చలువ పూపాదరింట సందిట బిగియించి చొక్కి నీ కెమ్మోవి

నొక్కనిమ్మా, మగసేతలం దమి మల్లి నీ జొమ్మున వాలుగన్నుల దేల్చి సోలనిమ్మా" అను రచన యెంతటి శృంగార రసస్ఫోరకమో అనుభవైక వేద్యము.

మాలెతల గాదన్న హరిశ్చంద్రునితో గాధేయుడు పటురోషాగ్ని కణములు చటులముగా రాలగా

దర్బారు - ఏకతాళము

ప॥ ఔరౌర క్రూర రాజాధమా నా యాశ్రమంబులోన
నీకీ యల్లరేమిరా ॥ ఔరౌర ॥

అ॥ ఏర నన్గానక నా పెంపుడు లేడి నెంతయు నెదిరించి
బెదరించినది గాక ॥ ఔరౌర ॥

1. నాకు దెలుపబోక నాముద్దుకన్నెల
చీకాకు పఱచి శిక్షించి నావె ॥ ఔరౌర ॥

ఇట్లు రౌద్రముట్టిపడ పలుకగా హరిశ్చంద్రుడు పరమశాంతుడై సంభాషించు సన్నివేశమున శాంతరసము జాలువారినది. ఇందు హరిశ్చంద్రుఁడు సత్య దానవీరుడుగా చిత్రింపబడినాడు.

పుట్టింటి కేగుమన్న పతితో గుణవతియగు చంద్రమతి కటకటం బడి కన్నీళ్ళను గోటనెగయజిమ్ముచు డగ్గుత్తికతో

"పురుషు విడనాడి పుట్టింటనుండిన ప్రోలతికిఁ బరువుండునా" యనియు

'పతికి దూరమున్న పతి కిల్లరణ్యంబు
పాలు చేదు మఱియు బ్రతుకు చావు
అకట నిన్నుబాసి యరుగు మంటివి నాథ
తోడి నీడ నీకు తొలగు టెట్లు."

ఈ పలుకులలో కరుణారస స్రవంతి కట్టలు త్రెంచుకొని ప్రవహించుట గమనింపదగినది.

వీరబాహునితో సేవకుడు హరిశ్చంద్రుడు ప్రసంగించునపుడు తన గుణమును చెప్పిన భంగి మనోజ్ఞము.

"కొండనైన పిండిగొట్టగ జాలుదు
నబ్ధినైన నింకు నట్లొనర్తు
శక్తిపహిణ్నిచేత జగమైన బొలయింతు
గాని యాడి తప్పలేని దొకటి."

ఈ పద్యభావమునుబట్టి పరిశీలింపగా శ్రీ దాసుగారికి గల పాత్రోన్మీలన రచనా శక్తియు, రసపోషణానురక్తియు స్పష్టమగును.

## మార్కండేయ చరిత్రము

ఇది యొక శివభక్తుని గాథ. అనపత్యతా దోషమున అంతరంగమున ఆవేదనమందు మరుద్వతి పతితో పలుకుచు

"బుడుత లేకున్నచో నాడబుట్టు వేల
వియ్య మందగ నోచని విభవ మేల
బ్రతికి కొరగానిచో సతి బ్రతుక నేల
నా మనోనాథ యిపుడు నే నేమిసేతు"

అను పద్యమున వంధ్యాత్వము భరింపరానిదనియు అంతకన్న మరణమే శ్రేయోదాయక మనియు ప్రస్ఫుటమైనది.

తపోవనమును వర్ణించు ఘట్టమును శాంతరసము పోషింపబడినది.

కాంభోజి - ఏకతాళము

ప॥ ఏమని తెల్పుదు నా తపోమహిమ
సోమవమాళి కెరుక నే నరుడ గనుక ॥ఏమని॥

అ॥ గోమతీతీర ఘోరజంతువుల గుణము లపుడొక్క-
క్రొత్త చెలువందె ॥ఏమని॥

1. ఏనుగు నేస్తము నెనసెను సింగము-మానుగ బులి
దరి మలసె గురంగము - పూని యెలుక నెమ్మి
మొనసె భుజంగము మ్రానిపిల్లి పొత్తుమరగె బతంగము ॥ఏమని॥

ఇందు పరస్పర సహజ ద్వేషముగల జంతువుల చెలిమి శాంత రసోత్ఫుల్లముగా వర్ణింపబడినది. ఘోరజంతువుల శమమే శాంతరస మైనది.

మార్కండేయుని గొనిపోవుటకు వచ్చిన యమభటుల వర్ణనమున "హుమ్మనువారు భూరి పరిఘోన్నత బాహుల నప్పళించి రారమ్మను వారు భీకర పరశ్వధముల్ సవరించి చెంగటన్ గుమ్మరువారు నిప్పులటు గ్రుడ్డులు ద్రిప్పెడు వారునై భయంకరులై" రని వివరింపబడినది. భయానక రసపుష్టికి శ్రీ దాసుగారు చేపట్టిన ఫక్కి చక్కగానున్నది. బాహుల నప్పళించుట, పరశ్వధముల సవరించుట, నిప్పులట్లు గ్రుడ్లుద్రిప్పుట రసపోషణమునకు దోహదము చేసినవి.

కింకరుల మాటలు విని యముడు అట్టహాసముతో మార్కండేయుని జేరి పిడుగులు వడిన తీరున పల్కినతీరు రసప్రచురమై యున్నది.

దర్బారు - ఏకతాళము

ప॥ ఔర! కన్ను గానక నా యాజ్ఞ మీరితివా ॥ ఔర ॥

అ॥ ఎరీ! నీ దిక్కు వచ్చువారిపు ॥ ఔర ॥

ఈ విధమున శ్రీ దాసుగారు మార్కండేయచరిత్రమున యమునిలో రౌద్రము నభివర్ణించినారు. కన్నుగానకుండుట, ఆజ్ఞమీరుట యముని క్రోధమునకు హేతువులు. ఆ క్రోధమే రౌద్రమై విరాజిల్లినది.

## గ జేం ద్ర మో క్ష ణ ము

శ్రీమన్నారాయణుఁడు తిర్యక్కులకు గూడ మోక్షమును ప్రసాదించునను భక్తిరస భరితమైన దీ యక్షగానము. ఇందు పోతన గారివలె శ్రీ దాసుగారు భక్తిభావమును కరుణమును పాఠక జనరంజక మగు నట్లు రచించినారు.

"బలయుతుని శూలజాడ్యంబు పట్టినట్లు
లుత్తముని దుష్టకామిని యొడసినట్లు
ధ్యానవంతుని నిద్దుర పూనినట్లు
సమద గజమును మొసలి వాజాచి పట్టె."

అనియు మఱియు 'పొంచి మైపెంచి కుప్పించి పొంకరించి యొక్క మకరేంద్రుఁడిభరాజు నొడిచి పట్టె'నని బింకముగా రచింప బడినది.

కరి మకరముల పోరాటమును వర్ణించుచు

"ధరాధరము వలె శరీరము మెఱయ
గరాగరిగ జలచరేంద్రు తనువును
గరంబున బెనచి బిరాన విసరగఁ
గరేణువు లయ్యారే భళిరే యనగ."

నాగేంద్రుడు దురమొనరించుటను వర్ణించినాడు. "ధరాధరము, శరీరము, గరాగరి, బిరాన, కరేణువులు" అను ప్రాసనియమము రస స్ఫోరకముగా నున్నది.

అనన్య శరణ్యుడగు గజేంద్రుడు హరికి మొఱలిడు ఘట్టము కరుణ రస పూరితము.

"తల్లి చనుబాలు గ్రోలెడు తఱిని బిడ్డ
కరచిన విదల్చు తల్లి చికాకుతోడఁ
గావు మనే మఱి పోదిగట గదియుఁగాని
పోఁగలడె బిడ్డ యెంతైన నాగళయున."

ఈ పద్యమున భక్తునకు మాతృస్తన్యము నాను పసివానికి సాదృశ్యము చెప్పబడినది. తల్లిని పిల్లడువలె భక్తుఁడు భగవంతుని విడజాలడని నిరూపితము.

వరాళి - ఏకతాళము

ప॥ ఇంకనైన బ్రోవ వేమయ్యా! యీ బాధ
కెట్లోర్తురా పంకజాతనయనా! పాలింపరావ ॥ఇంక॥

చ॥ శంకరాది దేవ సంఘ నుత పదపంకజాత సాధు
బృంద పాలన శంకలేల దాసు నింక బ్రోవగ
బింక మటర జంకులటర సంకటహరా ॥ఇంక॥

ఇందు పెక్కేండ్లు నీరాటముతో పోరాడిన వనాటము జవసత్వము లుడిగి కన్నులలో ప్రాణాలు పెట్టుకొని 'ఇంకనైన బ్రోవవేమయ్యా' అనుట యెంతయు కరుణరసస్ఫూర్తి నిచ్చుచున్నది. 'ఇంకనైన' అనగా చావసిద్ధముగానున్న స్థితిలో ననియు, ఇంతగా వేడుకొన్నప్పటికి ననియు భావములు గోచరించును.

అంతట హరి గజేంద్రు గావ వచ్చి చక్రముచే నక్రగ్రీవమ్మును దెగవైచి రక్షించిన ఘట్టము మనోరంజకము.

'చల్లని కరమున సామజేంద్రు కర మల్లన నిమరగ జొచ్చెన్
నల్లలితంబుగ శక్తి వచ్చి గజవల్లభు డతులు విచ్చెన్.'

హరి కరము చల్లనిదట. అదెంత చల్లదనమో! ఆ కరము మనస్తాపతప్తమైన గజేంద్రు కరము నల్లన నిమిరినదట. ఈ భావన యెంతయు హృద్యముగానున్నది. ఇట్టి మధురభావపరంపరయే గదా రసపుష్టికి తోడ్పడునది.

## జానకీ శపథము

ఇది యుత్తర రామాయణగాథ. శ్రీ దాసుగారి యక్షగానములలో నిది కరుణరస ప్రధానము.

జననింద నొందిన శ్రీరాముడు తనను తాను నిందించుకొను ఘట్టమునందలి కీర్తన భావగర్భితము.

రాగవర్ణని - రూపకము

ప॥ ఏమిచేతు దైవమ నే-నిట్టి నింద కెటు సైచెద ॥ఏమి॥

అ॥ భూమిజాత యగ్నిసంపూతమయ్యు వ్యమచ్చపో ॥దేమి॥

మి॥ సీమముగల రఘుకులమున - నే నపకీర్తి పాలైతి

పామరులుం గూడ నన్ను బల్చన జేసిరి యకటా ॥ఏమి॥

1. ప్రాణేశ్వరి నెడయనగున యపవాదము బడయనగున
నే నెందుకు బ్రతికినాడ నిందితకర్ముడన యో ॥ఏమి॥

2. భూనాథుండే గర్వాత భోగము లాసించినచో
పూని యతని ప్రజలు ధర్మముం దప్పుట సంశయమా ॥ఏమి॥

నిందాసహనముకన్న కష్టతరమైన కార్యము మానధనులకు లేదు. అగ్నిపూతకే మచ్చబోకున్న నెవరేమి చేయగలుగుదురు ? నిష్కళంకమైన రఘుకులమునకు మచ్చకూర్చునట్టి పామరనింద నొందుట శ్రీరామున కసహ్యమైనది. భూపతి గర్వ్యాభోగలాలసుడైన ప్రజలు ధర్మాతిక్రమణము చేయకుందురా ? 'యథా రాజా తథా ప్రజాః' అను లోకోక్తి గలదుగదా! మఱియు శ్రీరామునికి ప్రాణేశ్వరి నెడయుటయా ? ప్రజానింద బడయుటయా ? అను భావద్వయ ఘర్షణ (Conflict) యేర్పడినది. అయోనిజపై నపవాదు వచ్చుట యగ్నికి జెదలుపట్టుటయేగదా! ఇంతటి రసభావ సమ్మేళనము నందిన రచనయెంతయు ప్రశంసాపాత్రము.

లక్ష్మణునిచే నడవుల విడువబడిన సీత

భవాని - రూపకము

ప॥ ఎంతపని జేసితివి రామా నీవింత కఠినుడవని యెఱుగ ॥ నెంత ॥

అ॥ సంతతంబు నిన్నె నమ్మిన సాధ్వి నడవికప్పగించి ॥ యెంత ॥

1. సీదులాడుకొన్న నేమి నిజము నీ వెఱుగవా
   నా చరిత్ర పవిత్రమని యనలుడు సాక్ష్యమివ్వలేద ‖ యెంత ‖

శ్రీరాముడు చేత యెంతయో వాకొనరానిదట. పరేంగితావగాహియయిన బుద్ధివిశేషముగల్గిన నీకు నిజము దెలియలేదా రామా! అగ్నిశుద్ధురాలను నన్ననుమానించుట తగదని కన్నీరు మున్నీరుగా నేడ్చినది.

"రమ్మా మృత్యువ వేగం జేకొమ్మా చచ్చి సుఖింతునిపుడు తినుడో పులులారా! నే దీనురాల మీ యాకలి దీరగ" అని సీత మృత్యువు నాహ్వానించినది. ఇట్టి దీనదశలోనున్న జానకీ వృత్తాంతము తెలిసిన భావుకుల గుండెలేగాదు బండలుకూడ కఱుగకపోవునా ? ఇది శ్రీ దాసుగారి కరుణరసపోషణకు నిదర్శనము.

"వాల్మీకి తపోవనమున ప్రసవవేదనపడు సీతావిలాపము వజ్రహృదయ దళనము గావింపకపోదు.

"అబ్బబ్బ ! యీ నొప్పు లధికమౌచున్నవి
    యింకెట్టు లోర్తునో యింతులార
అడపుట్టుక కన్న నడవిలో చెట్టయి
    పుట్టుట మేలగు పొలతులార
నా వార్త వదినెకు నాయత్త కమ్మక
    య్యకు దెల్పి తోడి తెందతివలార
యింక నే బ్రతుకబోనిది నిశ్చయము నాథు-
    నగపర్చు డొక్కమా రమ్మలార

తండ్రి జనకుడ కావు మో తల్లిభూమి
యిప్పటికినైన న్నా జీవ్మేలపోదు
యక్కటా ! లక్ష్మణా ! యొక్కరైనబలుక
రేమిసేయుదు నోరామ ! రామ ! రామ !"

ఒక వంక పతివియోగము, మరొకవంక ప్రసవవేదన సీతను కడగండ్ల పాలు జేసినవి. ఈ పద్యభావము కరుణ రసమునకు దావలమై శ్రీ దాసుగారి రసపోషణ కీర్తిరథమునకు పతాకమైనదని చెప్పుట సాహసము కాదు.

ఈ యక్షగానమున శ్రీ దాసుగారు సీతారాముల విప్రలంభ శృంగారమును వర్ణించి పోషించిన విధము రసజగత్తుకే అలంకారము. స్వప్నమున సీతనుజూచి శ్రీరాముఁడాందోళనము జెందు ఘట్టము కరుణరసాన్వితమై పఠితల హృదయభిత్తులను తుత్తునియలుజేసి ద్రవీభవింపజేయును.

"అక్కట! మౌని పల్లెల విహారమునల్పి బిరాన వత్తునం
చెక్కువ నమ్మికన్ వెడలి యెంతయు మక్కరినాజ్ఞచే దుర్ఘ
మిక్కలి మోసపోయితివి నీ పతి దుర్భర గర్భవేదనన్
బొక్కుచునుండి ఏమయితివో యడవింబడి జీవితేశ్వరీ!"

ఈ పద్యార్థమును సంభావించు రసజ్ఞులకు సీతపై శ్రీరామునకుగల గాఢానురాగము సువ్యక్తమగును. పతివియోగమున సీతాదేవి మిగుల వగల బొగిలినదో లేక పత్నీవియోగ దుఃఖమున శ్రీరాముఁడే గుండెలదరబొక్కెనో నిర్ణయించుట యేరికైన నసాధ్యమే. ఆదర్శ దంపతులయిన సీతారాముల పవిత్రప్రణయ మట్టిది.

ఈ సన్నివేశమున విప్రలంభ శృంగారము అతివేలముగా పోషింపబడినది. సీతారాముల శోకము కరుణమై ఱాతిగుండెలను సైతము కరగించినది. ఈ ఘట్టము శ్రీ దాసుగారి రసపోషణ చాతుర్యమునకు చక్కని తార్కాణము.

శ్రీ దాసుగారి యక్షగానములన్నియు నవరస పరిపూర్ణములై పాఠకులను మైమఱపించి "ఆహా!" యనిపించును. ఇక శ్రీ దాసుగారే గానము చేయుచో సభాసదులు రసామృత వారిధిలో నోలాడి 'ఓహో!' యని సంభ్రమాశ్చర్యచకితు లగుదురు.

ఱాలు గఱగించు దివ్యగానముతో ఒడలు పులకరింపజేయు హావ భావ ప్రకటనముతో తేనె లూరించు మాటలతో ఒడలు పులకరింప జేయు మనోహర నాట్యముతో దిక్కు లద్రువజేయు 'శంభో' నినాదముతో శ్రీ దాసుగారి హరికథాగానము నవరసతరంగములతో నొప్పుచు మధుర రసవాహినివోలె విరాజిల్లును.



# దాసభారతి దరహాసములు

## [వర్ణనలు - కల్పనలు]

భాషాప్రవీణ శ్రీ *బేతవోలు రామబ్రహ్మం*, **B. A.**

వివిధ ప్రక్రియలలో వెలసిన ఆంధ్రసాహిత్యములో సంగీతమునకు పరోక్షప్రాధాన్యమున్నను, గేయప్రధానమగు హరికథా ప్రక్రియలో ప్రత్యక్ష ప్రాధాన్యమున్నది. కావుననే సాహిత్యము ఒకమెట్టు క్రిందికి దిగుననియు, హరికథలను ఉన్నత సాహిత్య ప్రక్రియలుగా గణింప వీలు లేదనియు కొందరి మతము. ఇతర హరికథా రచయితలమాట ఎట్లున్నను, అనేక శాస్త్రభాషలలో పరిపూర్ణ పాండిత్యము - కవిత చెప్పుటకు చాలి నంత - కలిగిన ప్రతిభాసంపన్నులగు శ్రీ నారాయణదాసుగారి హరికథ లలో సాహిత్యపు విలువ తగ్గినది అనుటకు ఆవంతయు అవకాశము లేదు. లభించుచున్న వానినన్నింటిని చదివిన పిదప, వారి ఒక్కొక్క హరికథయు ఒక్కొక్క ఖండకావ్యమనుట నా కచ్చితమైన నిర్ణయము. వీరి తెలుగు హరికథలతోపాటు బాటసారి అను నిర్వచన పద్యకావ్యమును, సూర్య నారాయణ శతకమును కలిపి వీరి సాహిత్యములోని వర్ణనల వైవిధ్య వైశిష్ట్యాదులను, వాని ప్రయోజనముల తీరునుగూర్చి వ్రాయుచుంటిని.

"కవయతి = వర్ణయతి - ఇతికవిః" అని కవిశబ్ద వ్యుత్పత్తి, అనగా వర్ణించువాడు అని అర్థము. ఒక వస్తువునుగాని, ఒక మనస్తత్వ మునుగాని, ఒక భావవిశేషమునుగాని, మరిదేనికైనగాని, తన ప్రతిభతో అపూర్వముగా చూడగలిగినవాడును, ఆదర్శనమును తన వ్యుత్పత్తితో

పాఠకుల లేదా శ్రోతల అనుభూతికి సమగ్రసుందరముగా వర్ణించి అందించ గలిగినవాడును, ఆ అందించుటలో తనదైన ఒక మార్గమును అభ్యాస వశమున ఏర్పరచుకొనగలిగినవాడును కవి అగునని విశాలముగా చెప్ప వచ్చును. అనగా చూచిన చూపును బట్టియు, చెప్పిన తీరునుబట్టియు, అతడు కవి అగునో కాదో నిర్ణయించి చెప్పవచ్చునన్నమాట. "దర్శ నాత్ వర్ణనాచ్చాథ లోకే రూఢా కవిశ్రుతిః" అను హేమచంద్రుని కావ్యానుశాసనోక్తియు పై నిర్ణయమును బలపర్చుచున్నది. ఈ కవి శబ్దార్థ విచారమునుబట్టి కవిత్వమున లేదా సాహిత్యమున వర్ణనలకు ఎంతటి ప్రాముఖ్యమున్నదో తెలియుచునే ఉన్నది. ఇట్లు ప్రముఖస్థాన మును వహించిన ఈ వర్ణనములవలన కావ్యములకు కలుగు ప్రయోజ నములేమి ? అవి వీరి సాహిత్యమున ఎట్లు సాధింపబడినవి ? అనునది పరి శీలింపవలసియున్నది.

ఏ కావ్యమును చూచినను నగరచాతుర్వర్ణ్య వర్ణనములతో ప్రారంభమగుట కన్పించును. (దీనికి కొన్ని అపవాదములుకూడ లేక పోలేదు.) ఆ నగర వాతావరణ నైసర్గిక స్థితులును, ఆ జనుల ఆచార వ్యవహారములును, ఆ పురమున నివసించుచున్న నాయకుని స్వభావ స్వరూపముపై కొంత ప్రభావమును తప్పకచూపును కావున, వానిని వర్ణించుట అవసరము. పైగా కథను చెప్పబోవునప్పుడు "అనగా అనగా ఒహ వూరుంది" అని ప్రారంభించి శ్రోతమనస్సును ఒక విషయము పైకి ఆకర్షించి, కథాసక్తమొనర్చి, ఆకట్టుకొనుట కథకుని ముఖ్యకర్త వ్యము. అనగా కథానుకూల వాతావరణమును కల్పించి, పాఠకుని గాని, శ్రోతనుగాని, కథోన్ముఖుని గావించుట వర్ణనలవలని మొదటి ప్రయోజనమని తేలుచున్నది. ఏ విషయమును వర్ణించి చెప్పి నచో ఎదుటివారి మనస్సు ఆకర్షింపబడునో గమనించి దానిని సమర్థు డగు రచయిత ముందుగా వర్ణించుచుండును. అంబరీషచరిత్రమున, మానవ స్వభావమును నీతిబోధకముగా, శ్రోతల చెవుల పండువుగా,

శంకరాభరణరాగమున "పరుల గొప్పజూచి ఓర్వలేకుండినవానికి సుఖముండునా - ఎందైన - అవ్వానికి సుఖముండునా" అను పల్లవితో వర్ణించుకొనుచు వచ్చివచ్చి

ఒరుల గొప్పజూచి ఓర్వలేకుండిన
వాడు తప్పకుండ కీడుబొందు
అంబరీషు వ్రతము నారసి ఉల్కు దు
ర్వాసు డెట్టి ఇడుమ బడెనొ వినుడు —

అని తాను చెప్పదలచుకొన్న కథతో - వినుచున్నవారుకూడ తెలిసికొనలేనంతటి సుకుమారముగా - కలుపుకొనగలిగిన (శ్రీ) దాసు గారి ప్రతిభకు జోహార్లు. కథాప్రరోచనాత్మకమగు వర్ణనా ప్రయోజనము ఇట నెరవేరినది.

ఏ కృతియందైనను ప్రధానముగా పోషింపబడవలసినది రసము. కావుననే కావ్య పరమ ప్రయోజనము రసానందమైనది. అట్టి శృంగారాది నవరసములకు (ఆధారములు) ఆలంబన విభావములు - పాత్రలు. శృంగారమునకైనచో నాయికా నాయకులు, వీరమునకైనచో భట ప్రతిభటులు, హాస్యమునకైనచో విదూషకాదులు ఇట్లు అన్ని రసములకును కొన్ని కొన్ని ఆలంబన పాత్రలుకలవు. వీనిని సాధ్యమైనంత విపులముగా వర్ణించుటవలన రసపరిపోషణము సముచితముగా జరుగును. అనగా రసపరిపోషణము అనునది వర్ణనములవలని మరియొక ప్రయోజనముగా తేలినది.

ప్రకృతి రామణీయకము రాసిబోసిన గంగానది ఒడ్డున శంతను మహారాజు మలిసంజ కాంతులలో ఒక మోహనాంగిని చూచెను.

ఒడకొయ్యకుగట్టి ఒడ్డున తీయని
పాట పాడుచునున్న పంకజాక్షి,
పయ్యెద జారగ పలుమరు రాయంచ
వెంబడి పరుగిడు కంబుకంఠి,

ఇసుక తిన్నియమీద ఏమిరో ఆటల
ఆడుచున్నట్టి బింబాధరోష్ఠి,
సంజ ఎండకు మేనిచాయ మిక్కిలి తళ్కు
మీరగ నొప్పు రంభోరు యుగళ,

ఏరు దాటింతురమ్మ ప్రొద్దేగకుండ
సుంకమేమియు నడుగనంచు చిరునవ్వు
మొల్కలెత్తగ తనుబిల్చు ముద్దుగుమ్మ
పూర్ణచంద్రాస్య, జగదేక మోహనాంగి.

రమణీయమైకాంత ప్రాంతమున, ఇంతటి మోహనాంగిని, ఒంటరిగానున్న దానిని, తన్ను రమ్మని నవ్వుచు పిల్చుచున్నదానిని చూడగానే రాజ సాన్నము తినుచున్న శంతనునికి మనస్సు ఉవ్విళ్లూరి పరవళ్లు తొక్కినది. చూడగా చూడగా అతనికన్నులకు ఆమె——

వళులను తరంగముల్, నాభివలనను సుళ్లు,
పిరుదలను సైకతంబులు, తురుముచేత
నాచు, నవ్వునురగలున్, కనులమీలు,
వన్నెనీర్గంగ తన స్వభావమిటు తెల్పు (భీష్మచరిత్ర)

గంగానదివలె కన్పించినది. అంతవరకు తాను ఏకాంతముగా దీక్షగా చూచుచు కూర్చున్నది గంగానదినే కావున వెనువెంటనే కని పించిన ఆకృశాంగికూడ గంగానదివలె కన్పించుటకు ఒక మానసిక వికారము. పైగా గాంగేయునికి కన్నతండ్రియైన శంతనునికి మత్స్యగంధి గంగాదేవివలె కన్పించినదనుటలో ఎంతటి వ్యంగ్యమును, భావికథా సూచకమును, కవినిక్షేపించెనో సహృదయులు గమనింతురుగాక. ఈ నాయికా నాయకులకు పరస్పరానురాగ ప్రకటనమైన పిదప "తల్లి దండ్రులచాటుదాన, మా పెద్దల నొడబర్చుకొనుము" అని మోహన రాగమున మెత్తగాచెప్పి "ఉర్వీశు మరపించి ఓడపై కెక్కి" మత్స్య గంధి మెల్లగా జారుకొన్నది. శంతనుడు దృష్టికందిన మేరకును గాంచుచు

భావిసౌఖ్యము దలంచుచును, తనపురంబునకేగె తల్లడిల్లుచును". ఇట నుండి విరహము - విప్రలంభము. "నవినావిప్రలంభేన శృంగారః పుష్టి మశ్నుతే." విప్రలంభము లేనిచో శృంగారరసమునకు పరిపుష్టిలేదు. నిరాతంకముగా మొదటినుండి చివరివరకు ఒకేరసమును సాగదీసుకొనుచు పోయినచో పాఠకునకు - రసానందము మాట దేవుడెరుగు - ముందు విసుగుపుట్టును, సొగసుండదు. కొన్ని కారణాంతరములవలన ప్రకటితానురాగులగు నాయికానాయకులకు ఎడబాటు కలుగవలెను. ఆ కష్టములను, ఆ ఆటంకములను, గడిచి గట్టెక్కుటలో మరికొన్ని రసములను పాఠకులకు చవిచూపి, చిట్టచివరికి వారిరువురను పతాకసన్నివేశమున కల్పినచో విరహానంతర సంయోగము ఆ నాయికానాయకులకే కాక, సహృదయ పాఠకులకును మహానందమును గూర్చి ఉక్కిరి బిక్కిరి చేయును. కావుననే "కారణాంతర ముత్పాద్యరసం ఛింద్యాత్ కవిః కృతౌ" అని ఆలంకారికులు చెప్పిరి. ఈ భీష్మచరిత్రములో కూడ మత్స్యగంధిని ఇంటికి పంపక ఆ గంగయొడ్డుననే వారిరువురును ఏ గాంధర్వమునో కావించిరని చెప్పినచో రసముకూడ ఆ గంగలోనే కలిసియుండెడిది. అట్లుగాక శ్రీ దాసుగారు విప్రలంభ కల్పనముతో, నాయికావర్ణనముతో మొలకెత్తిన రతిస్థాయి భావమును, రసముగా పరిపోషించిరి.

ఔచితీ పరిధులు దాటకుండ, విప్రలంభ శృంగారమును వర్ణించుటకన్న సంభోగ శృంగారమును వర్ణించుట చాలకష్టము. దీనికి కవికి చాల నిగ్రహముకావలెను. ఒక శ్రేణికి చెందిన కొందరు మాత్రమే తమలో తాము చదువుకొని ఆనందించెడు ప్రబంధములయందు ఈ వర్ణన మెట్లున్నను, స్త్రీపురుష శ్రోతల ఎదురుగా తాను పాడుచు అభినయింపవలసిన హరికథలలో సంభోగ శృంగారమును అవధులు దాటకుండ వర్ణించిన శ్రీ దాసుగారు అవశ్యము వంద్యులు. మార్కండేయ చరిత్రలోని మునిదంపతుల రతికేళీ వర్ణనమును గమనింపుడు:-

కేలుల నొండొరుల బట్టి
గిలిగింతలు చాల బెట్టి,
మేలు పందెములు గట్టి
మేనుల చిరుచెమటలు బుట్టి
బిగియ కౌగిలించుకొనుచు,
పెదవి తేనె నంచు కొనుచు.
మొగమోటము త్రెంచుకొనుచు
ముద్దు గొనుచు,
నగుమాటల చెప్పికొనుచు
ఒగి నేర్పుల మప్పికొనుచు,
జిగిచెక్కులు నొక్కికొనుచు,
తగ శివునకు మ్రొక్కు కొనుచు.....

అమలిన శృంగారమనిన ఇది మునిదంపతుల. పవిత్ర ప్రణయ సన్నివేశ వర్ణనము. ఇంతకన్న ఔచిత్యవంతమగు సాంద్రసంభోగశృంగార వర్ణనము మరియొకటిలేదు - ఉండబోదు. "అవిదిత గతయామా రాత్రి రేవం వ్యరంసీత్" అనిన సీతారాముల సంభోగవర్ణనమునందలి భవభూతిపల్కులు ఇట తలపునకు వచ్చుచున్నవి. ఇంతటి రతికేళీ పారవశ్యమున గూడ ఆ దంపతులు శివుని మ్రొక్కుకొనుట మరువలేదు. కావుననే మార్కండేయు నంతటివానిని తనయునిగా పొందగలిగిన మహాభాగ్యమును బడసిరి. ఎంత ఔచిత్యము ! ఈ వర్ణనము ఏ కొంచెము అవధులు దాటినను ఔచిత్యముచెడి రసభంగమగును. "అనౌచిత్యాదృతే నాన్య ద్రసభంగస్య కారణమ్" అనునది క్షేమేంద్రుని సిద్ధాంతము.

నిరంతర నారాయణ నామధేయ పారాయణ తత్పరుడును, మహతీగానలోలుడును, మహాతపస్వియు, బ్రహ్మచారియునైన నారద మునిపుంగవుని హాస్యరసాలంబనునిగావించి ఆతని శృంగారచేష్టలను వర్ణించిన ఈ క్రింది పద్యము నవ్వుపుట్టించును.

అని తలపోయు చాపెదెస నమ్మని యెంతయు తేరిచూచు, మీ
స వెగయ దువ్వు, చిర్నగవు పొరగపర్చెడు, బోరవిర్చుకొం
చు నిగిడి ప్రక్కవారి గను చుల్కదనంబుగ, ఈలబాడు, మం
తున సకిలించు, నిల్వబడు, తొట్రిలు మాటికి కూరుచుండెడు౯.

(యథార్థరామాయణము)

ఈలవేసికొనుచు, చిరునవ్వులు చిందించుచు, మీసమును - నిజముగా నున్నదో లేక ఉన్నదనుకొనినాడో - దువ్వుచు - లేచుచు - కూర్చొనుచు - ఇంతగా హడావిడిపడుచున్న నారదముని సమీపమునకు ఆ స్వయంవరాంగనరాగానే, ఆ జవరాలి చెక్కుటద్దములో పాపము ఆతని మోము కోతిగా కనిపించింది. అది కలకాదు-వైష్ణవమాయ.

మృత్యుదేవతతో పెనగులాడుచున్నవాడును, ఆతనిచుట్టుచేరి విలపించుచున్న ఆత్మబంధువులును కరుణరసమునకు ఆలంబన విభావము లగుదురు. ఈ పాత్రల శోకములను, దీనావస్థను వర్ణించుటవలన సామాజికుని మనస్సు కరుణరసాప్లావితమగును. రోజురోజునకు నీరసించిపోవుచున్న సరోవరమధ్యభాగమున మకరితో పోరుచున్న తమభర్తయగు గజరాజును విడిచి వెడలిపోవుటకు మనసురాక, దిగి సహాయపడుటకు ధైర్యము చాలక, ఏమియును చేయలేక, దిక్కుతోచక కలవరపడుచున్న గజాంగనలను వర్ణించిన ఈ క్రింది సీసపద్యమును చదువుసరికి మనస్సు వికలమై తీరును.

కనుల నశ్రులు పెనుకాలువలై కారగ
గడగడ నొడళులు వడకుచుండ,
మానాథు రక్షించు మానాథ! అనిదైవ
మును మ్రొక్కెడుగతి మొగ్గతిల్లి,
పోనొల్లగాలేము ప్రాణేశ! యనుమాడ్కి
వలుదమేనుల నొడ్డు పయినివైచి,
విన్ను బీటలువార వెక్కియార్చుచు డస్సి
పొరలుచు పొరలుచు బొరలుదప్పి,

నరసు జొరబోయి చొరలేక, మరియు నేయు
పాయ మయినను తోచక పాయలేక
నీరునయినను గ్రోలక నెరి గజేంద్ర
కాంతలెంతయు వగల నాక్రాంతలైరి. (గజేంద్ర)

గజాంగనలు గట్టుపైనుండి చూచుచుండిరనే తప్ప ఇంతగా తల్లడిల్లిరని పోతనయును చెప్పలేదు. నోరులేని ఆ జంతువుల మూగబాధను శ్రీ దాసుగారు చూడగలిగిరి.

ప్రహ్లాదచరిత్రమున త్రిలోక భయంకరముగా, స్తంభమును చీల్చుకొని, దుష్టశిక్షణ శిష్టరక్షణములకై బయల్వెడలిన నృసింహావతారమును వర్ణించిన ఈ క్రింది పద్యము రౌద్రరసమునకెత్తిన ఏతాము. ఇది ఉద్ధతరసము.

గంభీర భీకర గర్జారవంబున
బ్రహ్మాండభాండ కర్పరము వగుల
చటుల సటాచ్ఛటాచల సంజాత ప్ర
చండ వాతాహతిఁ కొండలెగయ
కాలానలాభీల కీలాభ జిహ్వా ప్ర
భావళిఁ జగమెల్ల జేపురింప
తరుణేందు భాసుర దంష్ట్రా నఖచ్ఛాయ
లలమి దిక్కులకు వెన్నెలలుగాయ

కరములురమును శిరము సింగంబుమాడ్కి
నాభికిఁ క్రిందిభాగమున నరునిపోల్కి
నలర నరసింహరూపున్నవతరించె
నాశ్రితపరాయణుండు నారాయణుండు.

ఈ పద్యమునందలి భావములతో పాటు, సుదీర్ఘ సమాసములతోడి ప్రౌఢబంధమును, సంయుక్తాక్షర సంయోజనమును, రౌద్రరసస్ఫూర్తికి దోహదకారులైనవి.

హరిశ్చంద్రోపాఖ్యానమున జుగుప్సావహ దృశ్యములతోనున్న శ్మశానవాటికా వర్ణనమువలన బీభత్స రసస్ఫూర్తియు రుక్మిణీపరిణయములో రుక్మిణిని ఎత్తుకొనిపోవునపుడు శిశుపాలాదులతో కృష్ణుడు గావించిన యుద్ధమును వర్ణించుపట్టున అద్భుతరసస్ఫూర్తియు, భీష్మచరిత్రలో భీష్మపరశురాముల యుద్ధవర్ణనా సమయమున వీరరస స్ఫూర్తియు గలవు. ఇట్లు వీరి కృతులన్నింటిని చూడగా వర్ణనములు అనునవి నవరస పరిపోషకములుగా వెలసినవనుట సారాంశము. అవకాశమునుబట్టి కొన్నింటికి మాత్రమే ఉదాహరణములను జూపితిని.

మన కవులందరును షడృతువులను విపులముగా వర్ణించిరి. ఈ ఋతువర్ణనమువలనగూడ రసపరిపోషణము జరుగును. ఎట్లన :- సర్వసుమసౌందర్యాంచితమగు వసంతము శృంగారభావోద్దీపకము. మదనదేవునికి నమ్మినబంటులైన శుకపికాళుల వళావళి విరహిణులను తపింపజేయును. మలయమారుతము మండుగాడ్పువలెనుండునట, చంద్రుడు చెంగ్రడనిప్పులు చెరగుచుండునట. ఇట్టి మలయానిల చంద్రాదులనే తటస్థములగు ఉద్దీపన విభావములు అందురు. వీనిని, వీనికి అనుకూలస్థానములైన ఆ ఋతువులను వర్ణించుటవలన ఆయా రసములు పరిపోషింపబడును గావున రసపరిపోషణమనునది వర్ణనములవలని పరమప్రయోజనమనుట పునస్థాపితమైనది. కొన్నికొన్ని ఋతువులు కొన్ని కొన్ని రసములకు ఉద్దీప్తిని కలిగించును. శరదృతువునిష్పంక మార్గములతో జైత్రయాత్రానుకూలముగానొప్పి వీరరససముద్దీపకమగును. అట్లే ఉరుములు మెరుపులతో తళతళలాడెడు వర్షర్తువు విరహోద్దీప్తిని కలిగించును. "మేఘాలోకే భవతి సుఖినోఽప్యన్యథా వృత్తిచేతః" అనిన కాళిదాసు పల్కులు గమనార్హములు.

దృశ్యకావ్యములందును నాంద్యంతమున ప్రవేశించెడు సూత్రధారుడో లేక అతనికోరికపై సూత్రధారిణియో కావించెడు ఋతుగానముకూడ ఆ నాటకమునందలి ప్రధానరసమును సూచించును. ❀

దాసుగారు రుక్మిణీకల్యాణమునందు కృష్ణునివద్దకు బ్రాహ్మణుని దూతగా పంపిన పిదప వర్ష ర్తువును విపులముగా వర్ణించిరి. దీనివలన రుక్మిణీదేవి విరహము ఉద్దీప్తినంది శృంగారమురస పరిపుష్టినందినది. మార్కండేయ చరిత్రమున మునిదంపతుల పరిణయవర్ణనమున వసంత ఋతువర్ణనము శృంగారోద్దీపకమైనది.

సంతోషముగ వసంతము వచ్చెను,
కంతుని బలమంగనలన్ హెచ్చెను
చెలువుగ మామిడి చెట్లులు గాచెను
పొలుపుగ నెల్లెడ మొల్లలు బూచెను
తుమ్మెద లలరుల దొమ్మిగనాడెను
నమ్ముదమున పిక సంఘము పాడెను
అనిలుడు వీవనలందున డాగెను
క్షణముల పగిది నిశలు జనసాగెను (మార్కండేయ)

ఈ వసంతర్తువర్ణనమున శృంగార రసాధిదేవతయగు మన్మథునితో పాటు ఆతని బలగమంతయును ఒక్కుమ్మడి ఎత్తివచ్చినట్లు చెప్పబడినది.

రసపరిపోషణావసరమున ఆయారసములకు అనుకూలమగు రచనను చేయవలయునేకాని కవి తనకిష్టమైన శైలిలో రచనగావించుటకు వీలులేదు. రసస్పర్శలేని కేవల వస్తువర్ణనమునందు కవికి తన పాండిత్యమును, ఊహాశాలితను, లోకజ్ఞతను, వ్యక్తిత్వమును, ప్రదర్శించుకొనుటకు వెసులుబాటు అధికముగానుండును. గజేంద్రమోక్షమునందు సరోవర వర్ణనమునందలి ఈ క్రింది శ్లేషలను పరిశీలించినచో శ్రీ దాసుగారి సంస్కృతభాషా వైశారద్య మెంతటిదో తెలియగలదు.

"రామాయణ భారత భాగవతామ్నాయంబుల తెరంగున
సుగ్రీవ పాండవ బృందావన మహిమాభిరామంబై,
హరిభంగి హరిభంగి నింబారంభాయుతంబై,
రామగరిమ రాముగరిమ తాలభూజాంకితంబై ....

యోగిహృదయంబు పోలిక గభీరంబయ్యును
ప్రసన్నంబై, రాజముఖంబువలె రమణీయంబయ్యును
భయంకరంబై – నలుచదరంబై, అతులవి స్తీ
ర్ణంబై వెలయు నప్పంకజాకరంబుం బొడగని ....”

ఈ గద్యమును చదువుచున్నప్పుడు, ముఖ్యముగా చివరిపంక్తులలోని విరోధాభాసములను చూచుచున్నప్పుడు భట్టబాణుని కాదంబరీశైలి గుర్తుకువచ్చును.

వసుచరిత్రలోని పద్యరచనా శిల్పమునకును శ్రీ దాసుగారి కొన్ని పద్యములలోని రచనా నైపుణికిని దగ్గరపోలికలు కన్పించును. ఇరువురును సంగీతసాహిత్యములలో ఆరితేరినవారగుటయే కారణమేమో. ఈ సందర్భమున శ్రీ శ్రీ పలుకులు స్మరణీయములు- “సంగీతసాహిత్యాలను సరితూచిన త్రాసు, ఆదిభట్ల నారాయణదాసు.” గోదావరీ ప్రవాహమును వర్ణించిన ఈ క్రింది పద్యమును చూడుడు:-

అంతట బాలు డీశ్వరపదాబ్జములెంచుచు హాయినేగి య
త్యంత ముదంబునన్ గనియె నాతత పర్వత గహ్వరాంత రా
క్రాంత మహాశ్మసంచయ నిఘర్షణ భీమరవప్రవాహ సం
క్రాంత నితాంత మీనమకరవ్రజ భీకరగౌతమీనదిన్. (మార్కండేయ)

ఇందు రెండున్నరపాదము లొకటే సమాసము. చివరివరకును ఒకే గ్రుక్కలో చదివించెడు వేగము ఈ సమాసరచనలోనున్నది. ఇది ప్రవాహవేగ పరిస్ఫోరకము. దీనినిబట్టి దీర్ఘసమాసములతోడి ప్రౌఢశైలి ఈ రచయితకు ఇష్టమేమో అనిపించును. “మృత్యుంజయా” అను మకుటముతో మార్కండేయచరిత్రమున వీరుగూర్చిన అనేక స్తోత్రపద్యరత్నములుకూడ దీనికి ప్రబల నిదర్శనములు.

చటులాంభోధి గభీరభాష, విచలత్స్వర్వాహినీభూష, సం
కట సంసార విశోష, దృష్టి విలసత్కారుణ్య పీయూష, దు
ర్ఘట రక్షోజనభీష, భక్తజన హృద్రాజీవసంతోష, సో
త్కట గౌరీ రమణీయవేష, దురితాంధః పూష మృత్యుంజయా!

సమానమగు నిడివితో సమాసములను త్రుంచి, అంత్యాను ప్రాసమును అలంకరించుటతో ఈ పద్యములకు ఎక్కడలేని సొగసును చేకూరినది.

రుక్మిణీకల్యాణమునందు సెలయేటిని వర్ణించు నీ క్రింది పంక్తులు శ్రీ దాసుగారి ఊహాశాలితను చెప్పక చెప్పుచున్నవి.

"క్రొత్త వరద వండు విరిసి పిల్లల నింపగుచున్ చూల్కొన్న
బంగరు వరి పొట్టలన్ మీగాళ్లుగ, తేటతెల్లముగ
నడు గన్పర్పు కాడలతోడి విరిపమ్మి మొగ్గలన్ జన్నుగవ
నొప్పు చేతులుగ, పై వెండికుండల యొంతెనన్ చిక్కులు
తాకి ఎగురు చిన్కులు ముత్తెపుః బల్వరుసగ, ఇసుక
తిన్నెలు పిరుదులుగ, దివ్యాంగన నా బొల్చు పెద్దేటిం దాటి" —

ఇట సెలయేటిని ఎలనాగగా పోల్చెను, భీష్మచరిత్రలో మత్స్యాంగనను గంగానదితో పోల్చెను. ఇట్టి పోలికలను చూడగలుగుట (తెలుగు) కవులకు నేర్పినవాడు ఆదికవి వాల్మీకి. కిష్కింధాకాండలో శరదృతు వర్ణనమునందలి ఈ క్రింది శ్లోకములలో అట్టి పోలిక కలదు.

మీనోప సందర్శిత మేఖలానాం
నదీవధూనాం గతయోఽద్యమందాః
కాంతోపభుక్తాలస గామినీనాం
ప్రభాతకాలేష్వివ కామినీనాం.
దర్శయంతి శరన్నద్యః పులినాని శనైః శనైః
నవసంగమ సవ్రీడా జఘనానీవ యోషితః.

తెలుగు కవులలో ఇట్టి స్త్రీత్వారోపసౌందర్యమును ప్రదర్శించినవారిలో మొదటివాడు జక్కన. ఆపిమ్మట మాలినీనదిని మానినిగా వర్ణించిన వాడు శృంగారశాకుంతలకర్త పిల్లలమఱ్ఱి పినవీరన. రామరాజభూషణుడు శుక్తిమతీనదిని నాయికగా వర్ణించి తన శ్లేషచక్రవర్తిత్వమును స్థాపించు

కొనుటతో పాటు, అప్రాణివస్తువునందు ప్రాణప్రతిష్ఠచేసి రసానుకూల తను కల్పించుకొనినాడు.

గజేంద్రమోక్షమునందలి ఈ క్రింది చంద్రోదయ వర్ణనము కవి కల్పనాశక్తికి ఒక మచ్చుతునక

ప్రొద్దు పండుటాకు పోలికరాలె, కెం
జాయ చివురులెత్తె, కోయిలలను
చెలగి కవిసె చీకటులు, పూచె చుక్కలు
పైని చందమామ పండుతోచె.

అచ్చతెనుగు పదములతో, అర్థ సౌలభ్యము చెడకుండ, ఉపమాలంకార సౌందర్యముతోనున్న ఈ అల్పపద్యము అనల్పార్థబోధకము. సంజకెంజాయను చివురుటాకులుగా, చీకటిని కోయిలలుగా చెప్పుట అపూర్వముగా నున్నది.

మానవజీవిత రహస్యమును ఇముడ్చుకొనిన ఈ క్రింది పద్యములు (శ్రీ) దాసుగారి లోకపరిశీలనాశక్తిని చాటుచున్నవి.

ఔర! గారడినూర్యుండ! అబ్బురంబు
కద! బ్రతుకువలె నీకరకౌశలంబు
అల్ప భౌమంబులఁ జూపి అధిక దివ్య
ములను గనవ్పట్టనీయక మోనపుచ్చు. (బాటసారి - 21)

నలుపైనన్ భువిలోనజూపి పరిమాణంబెంతయో గల్గు చు
క్కలకున్ చాటొనరించి భూమి జలమింకంజేసి ధారాధరం
బుల మింటంగలిగించి శూన్యమునకున్ పొల్మెర గల్పించురా
యెలమిన్ నీకరకౌశలం బహహ! మాయీ సూర్యనారాయణా!
(సూర్యనారాయణశతకము - 5)

ఈ రెండు పద్యములును ఒకే గళమునుండి ఒకే కలమునుండి వెలువడి నవి కావున పోలిక ఎక్కువగా కన్పించుచున్నది.

పల్లెపట్టుల వాతావరణమును, వర్షర్తువులోని కొన్ని చిత్రములను స్వభావోక్తి చారువులుగా వర్ణించిన ఈ క్రింది వాక్యములు కవిగారి సూక్ష్మ పరిశీలనాత్మకదృష్టికి నిదర్శనములు. బాల్యమున తాను అల్లరచిల్లరగా తిరుగుచు, ఈతలాడిన చోటులలో గాంచిన దృశ్యములు మనఃఫలకమునుండి చెరిగిపోక అనంతరకాలమున వాక్యములలో ప్రతిఫలించి శాశ్వతత్వమునందినవి.

"...ఎనుబోతులంబట్టి ఉబ్బి వ్రేలాడు జలగలును,
పాములకుం బట్టువడి కీచుకీచుగ నార్చుచుండియుం గంట
పడు పురుగులకై నోర్దెరచు కప్పలును, మడిహద్దుగట్లన్
జపించు గ్రుడ్డికొక్కెరలకు ఎకసక్కెంబుగ నప్పసంబులన్
త్రుళ్ళు మిట్టగిడసలం బొంచి పట్టు లకుముకిపిట్టలును,
దొంగచీకటికి ఇరవయి దట్టమగు వెల్లులనడుమ నిలు
వులకొలది పెరుగు మెట్టచేలయందు ఒదిగి కేరుచు
పలుదారులన్ బయల్వాడు నీచవిటీవిటులును, పొడవగు
నొడ్డులన్ దెగబారుచు లోతులగడకందక కెరటంబుల
మిన్నుముట్టి హోరువెట్టు దొంగయేళ్ళమీదన్ ప్రాణంబులు
చిక్కబట్టి అవ్వలియొడ్డు చేరినతోడనె ఓడవాండ్ర నెదిర్చి
అదల్చి మాటాడు బాటసార్లను..." (రుక్మిణీకల్యాణము)

అంబరీష చరిత్రము, గజేంద్రమోక్షము, ధ్రువ చరిత్రము, మార్కండేయచరిత్ర, హరిశ్చంద్రోపాఖ్యానము, రుక్మిణీకల్యాణము — వీనిని రచించిన పిదప ప్రహ్లాదచరిత్రను వ్రాసిరి. ఈ వరుస ప్రహ్లాద చరిత్రలో చెప్పబడినది. ఆ తరువాత కొంతకాలమునకు వ్రాసినది భీష్మ చరిత్ర. ఇందు పుట్టినది మొదలు గిట్టువరకును గల మానవుని జీవితమునందలి దుఃఖములను వర్ణించిన ఈ క్రింది పద్యము పరిణతవయస్సులో

మోక్షకామియైన (శ్రీ) దాసుగారి వైరాగ్య స్వభావమును చాటు చున్నది.

తల్లిగర్భము నందొదవినట్టి కష్టము
పొత్తిళ్ళలోపల పొరలుబాధ
పసితనంబున అస్వవశతచే నిబ్బంది
యౌవనంబున కామయాతనయును
వార్ధక్యమున వ్యాధివలన వేదన తుత్తి
పానల నంటినపట్ల నిడుమ
సతత మంతర్బహి శ్శత్రుజనితపీడ
తాపత్రయంబున దగులు వింత

బ్రతుకు నిఖిలం బిదియె సుఖాభాసమకట !
దుఃఖపూరిత మటుగాన దురితదూర !
వాసుదేవ ! ముకుంద ! ఈభవము మరల
చెందనీయక నన్ను రక్షించు కృష్ణ ! (భీష్మ)

సూర్యనారాయణ శతకము నందలి ప్రతి పద్యమును - మరింత పరిణత వయస్సులో, పరిపక్వమనస్థితిలో వ్రాసినది కావున - (శ్రీ) దాసుగారికి మానవజీవితముపై గలిగిన విరక్తిని, పశ్చాత్తాపమును, మోక్షాకాంక్షను ప్రత్యక్షరమునను తెలియజేయుచున్నది.

యమలోకమును వర్ణించిన ఈ క్రింది పద్యము అక్రమ కార్యాచరణమున లోకులకు భయమునుబుట్టించి సన్మార్గప్రవర్తకులను చేయుటకు తగిన వ్యంగ్యోపదేశముతో కూడియున్నది.

తలకి రంపముకోత తాళజాలక లంచ
మెన్నడు తీయ మంచేడ్చువారు,
మరిగిన చమురు వేమరుజిల్క వ్యభిచార
ములు సేయమంచు కేల్మోడ్చువారు
అగ్గిగుండములోన అణగజాలక కూట
సాక్ష్యముల్ చెప్పమంచార్చువారు,

దొంగతనముసేయ దొరకొనమని బాధ
కోర్చక కన్నీరు గార్చువారు,
వెండియుం బెక్కు తెరగుల వెతలు జెందు
నరకవాసుల బొడగాంచు చరిగి యరిగి
ధర్మదేవుని దరిజేరి తత్తరమున
కలహభోజను డెంతయు బలికెనిట్లు. (మార్కండేయ)

ఈ వర్ణనములను వేనినైనను కథాభంజకములగునంతటి విపులములుగా చేయకుండుటయు, వృత్తవర్తిష్యమాణ కథానుసంధాయకములుగా గావించుటయు కవి ఉత్తమతను తెలియజేయును. హరిశ్చంద్రోపాఖ్యానమున లోహితాస్యుడు మరణించిన కథాంశముతో కలియునట్లుగా సూర్యాస్తమయమును వర్ణించిన ఈ క్రింది పద్యపాదము, అందలి భావమును, గమనార్హములు.

"తనవంశజుడగు బాలునిమృతికై ఆబ్ధి
స్నానంబు సలుప భాస్కరుడు గ్రుంకె."

కథాప్రరోచమును గల్గించుటయు, రసపరిపోషణమును గావించుటయు అను వర్ణనలవలని పరమప్రయోజనములను సక్రమసుందరములుగా సాధించుకొనుచు, ఈ వర్ణనములలో (శ్రీ) దాసుగారు తమ ప్రతిభాసంపదను, వ్యుత్పత్తి గౌరవమును, యథౌచిత్యముగా ఎడనెడ చూపుచు వచ్చిరి. వారి సాహిత్యము వివిధ ప్రక్రియలలో అనేక గ్రంథములలో సువిశాలముగా వెలసియున్నది. అందలి వారి వర్ణనా వైవిధ్యవైశిష్ట్యాదులను ఈ చిన్న వ్యాసమున కొంతవరకు నిరూపించితిని. వారి గ్రంథములన్నియును సులభోపలభ్యములు కాకుండుట ఆంధ్రుల దురదృష్టము. ఇంకను తలస్పర్శిగా వారి కృతులపై పరిశీలనములును, విమర్శనములును జరుగవలసియున్నది.

"కాలోహ్యయం నిరవధిః విపులాచ పృథ్వీ"

# 'ఉపమా ఆదిభట్టస్య'

'అ నం తం'

'ఉపమా ఆదిభట్టస్య' అను రెండు మాటలకు శ్రీమదజ్జాడాది భట్ట నారాయణదాసుగారు ఉపమాలంకార విరచనమున విశిష్టులు అని అర్థము. తెలుఁగుకవులలో — కనీసము వీరిసమకాలీనులలో — ఈ అలంకారవిరచనములో వీరు సమర్థులనియు, మఱియు మాటాడినచో ఈ అలంకార విన్యాసమున వీరియంతటివారు ఇంకొకరు లేరనియు భావము.

'ఉపమా ఆదిభట్టస్య' అను వాక్యము వినినంతనే 'ఉపమా కాళిదాసస్య'[1] అని యాదిగాఁ గల శ్లోకము సంస్కృతబుద్ధులకు స్ఫురించి తీరును.

'ఉపమా కాళిదాసస్య' అనుదాని ననుసరించి 'ఉపమా ఆది భట్టస్య' అనుటచే సంస్కృతసాహిత్యమున కాళిదాసునకుఁ గలస్థానము తెనుఁగుసాహిత్యమున నారాయణదాసుగారికిఁ గలదనియు ఈ యన్న వారి సూచనగా ధ్వనింపను వచ్చును. ఇది విషయాంతరము.

ఉపమాలంకార విరచనమున నారాయణదాసుగారి విశిష్టతను వివరించుటకు ముందు ఉపమనింత ప్రముఖముగా, కవిసామర్థ్యనికషముగా

---

1 ఉపమా కాళిదాసస్య భారవే రర్థగౌరవమ్ ।
దండినః పదలాలిత్యం మాఘే సన్తి త్రయో గుణాః"

నేల భావించుచున్నారో పర్యాలోచింపవలయును. పైని పేర్కొనిన శ్లోకమును రచించిన సహృదయునిదృష్టిలో కవిత్వమునకు పదలాలిత్యము, అర్థగౌరవము, ఉపమావిన్యాసము ముఖ్యము లన్నట్లు కాన్పించును. వీనిలో ఉపమాలంకారమున కాళిదాసు సిద్ధహస్తుఁడనుటనుబట్టియు, కాళిదాసునకు 'కవికులగురు' వను ఖ్యాతి యుండుచుండుటనుబట్టియు, ఆ సహృదయుఁడు ఆ గుణత్రియమునందును ఉపమావిన్యాసచణత్వము ప్రముఖముగా భావించినట్లు తేటతెల్లమగుచున్నది.

ఉపమకీ యుత్తమస్థాన మీయవలసినదే. కారణ మేమనఁగా కవిత్వరహస్యమంతయు నిందిమిడియున్నది. ఎల్లరు చూచువస్తువునే కవియు చూచును. చాలమంది భావించు ఆ వస్తువునే అతఁడును భావించును. కాని, ఆవస్తువుననో, అవస్తువుననో కలవిచిత్రధర్మాంశతత్త్వమును మాత్రము ఈతఁడే దర్శింపఁగలఁడు. ఇట్లు దర్శింపఁగలుగుటవలననే అతఁడు ఋషియనబడినాఁడు. అట్టి దర్శనము గలిగినవాఁడెల్ల తాను దర్శించనతత్త్వమును ఎదుటివారికి వర్ణించి చెప్పలేఁడు. అట్లు చెప్పను గలిగినవాఁడే కవియైనాడు. అందువలననే ఋషులని మొదట్లో అని పించుకొనినను ఋషులలో కొందఱే కవులని ఖ్యాతిగడించుకొనినారు.[2]

వస్తువునకైనను అవస్తువునకైనను ఇచ్చిన యుపమానమునుబట్టి దానిని పలికిన వైఖరినిబట్టి, వక్తయొక్క - పాత్రయొక్క - సంస్కారమును స్వభావమును తెలియును. తత్తత్పాత్రానుగుణముగ నుపమానములను బలికించుటనుబట్టి కవిసామర్థ్యము తెలియును. నారాయణదాసుగారి సారంగధర నాటకములో మహాకవిగాయక సార్వభౌ

2. చూడుఁడు. రచయితల సహకారసంఘము, గుంటూరువారి "శారదావిపంచి" పుట 132.

ముఁడు గురువు. సారంగధరుఁడు, సుబుద్ధి, గిలిగింత శిష్యులు. వారి నల్వురకు కవిత్వ విషయమై ఈ క్రింది సంభాషణము జరుగును:

మ. గా. సా : 'కవిత యెట్టులు రావలెఁ గఱపుఁడన్న'
సుబుద్ధి : 'సాగి కమ్మెచ్చునన్వచ్చు తీగెఁ బోలి'
సారంగ : 'సాలెపురుగుకడుపులోనినూలుబోలి'
గిలిగింత : 'పడిసె ముహుహుహు హుహుహుహూ
పస నహోహ'

పై శిష్యులలో మొదటివాఁడు శుద్ధతరసంస్కారి. కావున కృత్రిమ మయినను భావవిశుద్ధితో సాపుగ నుండవలయు నన్నాఁడు. రెండవవాఁడు అప్రయత్నసిద్ధముగ నుండవలయు నన్నాఁడు. కాని ఆ ఉపమానమును భావించునపుడు మనస్సున పొడముదృశ్యము పరిశుద్ధము గాదు. కఠినహృదయక్షత్రియోచితము, కించిత్ జుగుప్సా సహితము. మూడవవాఁడు హాస్యమునకనుకొని అసహ్యమైన యుప మానమిచ్చినాఁడు. వీఁడు అధమసంస్కారి. ఇట్లు కవిశక్తి నుపమ తెల్పును.

అంతేకాదు. లోకమునందును, వేదమునందును, లౌకికసాహి త్యమునందును గల సర్వాలంకారములకును మూలముపమయే. ఒకే బంగారము సొన్నారి కైవాడమునుబట్టి రకరకములయిన ఆభరణము లుగా మారి అందగించుచున్నట్లు ఒక్క ఉపమయే కవియొక్క ఉక్తి వైచిత్రినిబట్టి వివిధాలంకారములుగా శోభించుచున్నది. ఈ రహస్య మును మనయాలంకారికు లేనాఁడో కనిపెట్టి వివరించియున్నారు. "ఒకే నటి సీతగా, చింతామణిగా, చంద్రమతిగా, సావిత్రిగా - ఇంకను బహు రూపములలో రంగస్థలమున నటించుచు నాట్యవేత్తలమనస్సులను రంజిం పఁజేయుచున్నట్లు ఉపమయే వివిధాలంకారరూపములను ధరించి కావ్య రంగమున నటించుచు తద్వేత్తలచేతమును రంజింపఁజేయుచున్నది"

అని స్పష్టముగా చెప్పియున్నారు. [3]ఇటులూరక సిద్ధాంతమునుమాత్రము చెప్పి యూరకుండక ఉపమ యెట్లు సర్వాలంకారబీజమో అప్పయ దీక్షితులవారు చిత్రమీమాంసలో వివరించిరి.

మొత్తముమీఁద కవిత్వమునకు ప్రాణాధారముపమ. "కవిత్వమునకు ప్రాణముపమగదా" యని నారాయణదాసుగారుగూడ సారంగధరలో నొకచోట చెప్పియుండిరి. ఒక కవియొక్క సామర్థ్యమును పరిశీలింపవలయునన్నచో అతఁడుపమను విన్యసించిన విధానమును పరిశీలించుట ముఖ్యము. ప్రజ్ఞావంతులకు భాగవతము పరీక్షాస్థానమన్నట్లు, అతఁ డుపమావిన్యాసమున వైశిష్ట్యమును చూపినాఁడని రుజువైనదా, సగము గెలుపు గొన్నట్లే.

వారి కృతులలోని యుపమలనుబట్టియే కాక పైనుదాహరించిన వాక్యమునుబట్టియు నారాయణదాసుగా రుపమాతత్త్వమును తలస్పర్శిగా నవగతముచేసికొన్నవారని తెలియును. వారి యుపమలను పరిశీలింపవలయునన్నచో వారిసర్వకృతులను అవలోకింపవలయును. వానిలో వివిధభాషలనుండి తెనుఁగునకు తెచ్చినవియు నున్నవి. వానిలోని యలంకారములు ఎరవుసొమ్ములు. కావున అవి గీటునకు వచ్చునా రావా యని చూచుట నాపని కాదు. ఇఁక వారిస్వతంత్రకృతులలోని ఉపమలనే చూడవలయును.

ఉపమానములను వాడుటలో పూర్వకవులు వాడినవానిని సముచితతరముగ, సవిశేషముగ వాడుటయు, స్వతంత్రములయినవానిని సహృదయరంజకముగ ప్రయోగించుటయు సమర్థుఁడయిన కవి చేయును. తొలి రచనలలో (శ్రీ) నారాయణదాసుగారు పూర్వకవి

---

3 ఉపమైకా శైలూషీ సంప్రాప్తా చిత్రభూమికా భేదాన్।
రంజయతి కావ్యరంగే నృత్యంతీ తద్విదాం చేతః॥
—చిత్రమీమాంస, పుట — 41

పరియుక్తములయిన యుపమానములను పైమాట నుదాహరణముగను పుష్కలముగను నుపయోగించుకొన్నారు.

"ఎందుకిఁక వేయిమాట లీయిలను సర్వ
జనుల కుపకారముగ నడువని మనుజుఁడు
జపతపంబులు నిష్ఠలు సలుపుటెల్ల
బూడిదంబోయు పన్నీటిపోల్కి గాదె" (భీష్మ. పుట 3)

(పరివరుని) "కుందనమువంటి మేను మధ్యందినాతపోష్ణహతిఁ గ్రాగె (మను. 2-) అన్నది వరూధిని. దాసుగారు సంగీతమునందువలెనే సాహిత్యమునందును ఎవ్వరికంటెనైనను పైసంగతి ననఁగలరు. కావుననే 'నడుప్రొద్దు వేడియెండ స్మేల్పసిడి' కరుగునట్లు (కావుచేడెల) ఎలప్రాయపు టోడలం జెమ్మటలువారుట (రుక్మిణీ. పుట 12) వర్ణించినారు.

ప్రకృతిపరీక్షణమున గ్రద్దచూపు శ్రీకృష్ణదేవరాయలది. కావు ననే ఎట్టచీమలుగూడ ఆయనదృష్టినుండి తప్పించుకొనలేక ఆముక్త మాల్యద నాశ్రయించినవి. (చూ. 3-70)

ఈ గుణమున రాయల కేమాత్రమును తీసిపోవని కవిరాయఁడు నారాయణదాసుగారు. కావుననే వీరును వీనిని నిర్లక్ష్యము చేయలేదు. 'చీమబార్లంబోలి సంతపొంతలం గ్రొత్తసరుకుల మూపులు వంగి నడుచు పలు జనములు' (రుక్మిణీ, పుట 12)

మఱియొకచోటఁగూడ "ఆ వధూవరులకన్యోన్యవార్తలు దెల్పఁ జీమబారుగ నేగు చెలులచాలు" (యథార్థ. పుట 91) అన్నారు.

ఒకదృశ్యము పల్లెపట్టు మఱియొకటి అంతఃపురము, కాఁగా దాసుగారి నెట్టచీమలే కానక్కఱ లేదు; ఏ చీమలైనను కావచ్చును.

కనులను తుమ్మెదలతో బేడిసలతో కాటుకపిట్టలతో చకోరము లతో పోల్చుట యెందు నున్నదియే కాని, అవి నిలిచినస్థానమునుబట్టి

యవి సార్థకములగునట్లు వాడుట దాసుగారి యొడుపునకు గుర్తు. సావిత్రీ కళ్యాణమున దంపతులచూపు లుపమేయములు.

"సలలిత పాదాంబుజాతంబులందున
గొదమతుమ్మెదకవ కూడునట్లు
భాసుర నిమ్ననాభీసరోవరమున
గండుబేడిసజోడు గలయుభంగి
ప్రథిత పీనోన్నతోరః ప్రదేశంబున
ఖంజరీటము జతగట్టు మాడ్కి
కమనీయవక్త్ర రాకాసుధాకరు పజ్జ
ఘనచకోరము జంట నెనయు కరణి

ఏకముగ వలపుజిగురున నెదల నతికి
సన్నిధిం జేరినకొలంది చనువుమిగిలి
రెప్ప లెగసిన క్రమమున గొప్పమీరి
దంపతులచూపు లొండొంట దారసిల్లె" [సావిత్రీ, పుట 28-29]

ఇట్టి వున్నను దాసుగారిఉపమలలో జీవితమునుండి సరాసరి వచ్చినవే అధికము. "ధర్మవర్తన మెప్పుడైనఁ దప్పజనదు" అని చెప్పుటకు "దీపమాఱినయట్లు తెల్వి శూన్యంబగు దేహాంతములయందుఁ దెల్లముగను" (భీష్మ. పుట 3.) అని 'ధర్మవర్తనము తప్పనిసరి' అనుటకై ప్రతి సామాన్యకుటుంబికిని అనుభవములోని దగు 'దీపమారినయట్లు' అను ఉపమానము నిచ్చియున్నారు. దీపములు ఆఱిపోయినపుడు ఇంటిలోని వస్తువులు కానరాక బాధపడుట అందఱకు తెలిసినదే. దేహాంత సమయమున జ్ఞానము శూన్యమై కర్తవ్యము గోచరింపక పోవుటమాత్రము బ్రతికియున్నవారికి అనుభవములోనిది కాదు. ఇంత సర్వమానవపరిచితమయిన ఉపమానముద్వారా సర్వమానవాపరిహార్యమయిన దేహాంతసమయజ్ఞానశూన్యస్థితిని వర్ణించిరి కావున ఆదినుండియు ధర్మవర్తనమే తారకమనుటవలన కవి వివక్షితమైన ధర్మానుష్ఠానచోదనము సర్వహృదయ ముద్రిత మగుచున్నది.

ఈ దీపమునింకను ఎన్నియో తడవుల వినియోగించుకొన్నారు; ఎక్కడికక్కడే వైవిధ్యముతో. వానిలో విద్యాప్రశస్తిని వర్ణించు సందర్భ మొకటి. సహజపాండితీమండితులగుదాసుగారు విద్య సహజమగు తెల్విని రెట్టిగావించుననన్నారు. తెలివియే లేనివానికి విద్య యంటదు. సహజమైన తెలివిగలవాఁడు విద్య నేర్చినచో వాని తెలివి రెట్టింపగును. ఇంత చెప్పినచో చాలదు. ఉపమానము కావలెను. అది నిత్యజీవిత ములో నెంత సన్నిహితమైన నంత మంచిది. "గాజుపోలికి రెట్టి గావిం చెడి నైజమగు తెల్వి దీపంబునంటి విద్య" (ప్రహ్లా. పుట 14) హిరణ్యకశిపునింటిలో గాజు చిమ్నీలున్నవో లేవో కాని దాసుగారి శ్రోతలయిండ్లలో నాఁడున్నవి.

కలిగిన కలనుగూర్చి తల్లడిల్లుహరిశ్చంద్రు నూరడించుచు చంద్ర మతి "కలలు మనోవికారములు; గాలికి దీపము పోల్కి వేడికిన్ జలనము నంది చిత్త మవశంపుతలంపులం జేసెడిఁ" (హరి, పుట 19) అని పలు కును. గాలికి దీపము కదలినట్లు వేడికి చిత్తము చంచలమై ఏమేమో తలఁచునట. మొదటి యుపమానమున దీపములేని స్థితియు, రెండవచోట దీపకాంతి రెట్టింపగుస్థితియు నిందు దీపచలనమును సమానధర్మము లగుటలోని వైవిధ్యము గమనింపఁదగినది.

ఈ దీపచలనమే మఱొకచోట దేహమశాశ్వత మని చెప్పుటకు నుపమానధర్మముగా చెప్పఁబడినది. "మురికి కాయఁం మిది, మూనాళ్ళ ముచ్చట గాలిలోని యిలాయికరణిఁ గదలు" (గౌరప్ప. పుట 2)

ఇటులే అతిభీకరవస్తువున కతిపరిచితమైన సామాన్యవస్తువు నుప మానముగా నిచ్చి వర్ణ్యసాక్షాత్కార మొనరించునేర్పు వీరిలో విస్తా రము. "రొదవెట్టు వెదురొప్పిదలం గుండ్రిగ నమర్చిన యూజలంబోలు నిరవులం జుట్టుకుదుళ్ళమాడ్కిఁ జుట్టుకొను కొండచిల్వల" (రుక్మిణీ. పుట11(

తాము చెప్పఁదలఁచుకొన్న దానిని సూటిగా తేటగా చెప్పుటకుప యోగపడు నన్నదొకటే కావలయును గాని చిన్నపిల్లలవాచకములలోని

కథనయినను ఉపమానముగా వాడుకొనుటకు సందేహింపరు శ్రీ దాసు గారు. "జయ జయ దేవా! సచ్చిదానంద సచ్చిత్స్వభావా! సమస్తంబు నీవయ్యు నీవెద్దియుంగాక యున్నావు. నీ మాయ యీ తీరుదంచున్ దలంపంగ నెవ్వారికైనం దరంబా! భళీ స్పర్శచే గ్రుడ్డివాండ్రేనుగుం జేటగా రోలుగా రోకలింగా మృదంగంబుగా జీపురుంగా వడింబోల్చు చంగాన నిం దోచినట్లెల్ల సంసారఘోరాంధకారంబున న్మున్గు విజ్ఞాన లేశప్రభాదుర్విదగ్ధుల్ నిరూపించుచున్నారు" (రుక్మిణీ. పుట. 43)

ఇట్లు చిన్నపిల్లలవాచకకథలనే కాదు వారితినుబండములనుగూడ వీరు వదలరు. ఇది చదివినపిదప చక్కిలము తినుటకు వెగటుగల్గునని కొంద అందురేమో కాని దాసుగారి నిత్యజీవితవస్తు నిశితపరిశీలనమున కుదాహరింపక తప్పదు. "పాములంబోలి పాకుచు నల్లు దగులునపుడు చక్కిలంబులపగిది జుట్టుకొను రోకలిబొండల కదుపులును"

(హరి. పుట 16-17)

అసహ్యములగు రోకలిబండలను గొంగళిపురుగులను ఉపమేయ ములుగను ఉపమానములుగను గ్రహింపనగునా? అని యెవరికైనను అనుమానము రావచ్చును. పై భాగములను సప్రకరణముగా చదువు నపుడు మీ కేవముగొల్పుచున్నదా? అని సహృదయులను తిరిగి ప్రశ్నించు టయే దీనికి సమాధానము. అదియుఁగాక దీనికి ఆలంకారిక సమ్మతియు నున్నది.[4]

సాగరగంభీరభావనులైన నారాయణదాసుగారు స్వతంత్రించి వాడిన ఉపమానములలో మూర్ఛితుఁడై, తేరుకొని, భీష్ముని మార్గోన

---

4 రమ్యం, జుగుప్సిత, ముదార, మథాపి నీచ,
ముగ్రం, ప్రసాది, వికృతం, గహనం, చ వస్తు,
యద్వాప్యవస్తు కవిభావకభావ్యమానం
తన్నాస్తి యన్న రసభావ ముపైతి లోకే॥

నున్న పరశురాముని కడలితరంగముతో పోల్చినదొకటి వారిపరిశీలన శక్తికి గుర్తు కాఁగలది.

"గంగానందనుఁ డట్లర
యంగా భార్గవుఁడు లేచి యాఁగి వెనుకయై
పొంగు తరంగమువలె ము
న్నుంగవయుచు నను గభీరముగాన్" [భీష్మ. పుట. 16]

వచ్చుచు ఒక్క త్రుటికాలమాఁగి, వెనుకకు తగ్గినట్లుండి, మరల వేగముతో ముందునకురుకు సముద్రతరంగచాలనక్రమమును పరిశీలించినఁగాని ఇందలి విశిష్టత బోధపడదు.

(శ్రీ) నారాయణదాసుగారు బహుశిష్యులను ప్రాణాధికముగ వాత్సల్యము చూపి చేరఁదీసి, విద్యాబోధనచేసి, వారివృద్ధి కానందించిన ఉత్తమగురువులు. 'పుత్రాదిచ్ఛేత్పరాజయం'. తన కుమారుఁడు తన్ను మించినవాఁడు కావలెనని తండ్రితలంచును. అటులే శిష్యునిగూర్చి గురువుకూడ కనీసము తనయంతవాఁడైన కావలయు ననుకొనును. ఈ మాట పరశురామునినోట నిట్లు పలికించినారు దాసుగారు :

"తనయంతవాఁడు తనశిష్యుఁడైనను గురువు
తనియుఁ దన్నుంబోలు తనయునకుఁ దండ్రివలె" (భీష్మ. పుట 22)

చెప్పిన అల్పాంశమువలన, చెప్పని యధికాంశము గమ్యమానమగుటకదా ఉత్తమకవిత్వలక్షణము. ఇందుకుదాహరణములు కాఁదగిన యుపమలెన్నో దాసుగారికవిత్వమున నున్నవి.

దాసుగారు తమకాలమున కవివృషభులై ఎక్కడను ఎదురులేక చిత్తము వచ్చినట్లు వీరవిహారము చేసినవారు. శక్తిహీనులు ప్రతిభావంతులను చూచి ఉలుకుచుందురనియు, అందుకు ఎదుటివారిలోని ప్రతిభ చూచి ఓర్వలేకపోవుటయే కారణమనియు, ఎదుటివారిప్రతిభ చూచి ఓర్చుటయు,సంతసించుటయు ప్రాజ్ఞతవలనఁగాని కలుగదనియు గ్రహించి,

చెప్పి, అట్టి అప్రాజ్ఞులయిన శక్తిహీనులు ఎఱ్ఱచీరజూచి బెదరెడు బఱ్ఱెల వంటివారన్నారు. ఇట్టి బఱ్ఱె లెల్లప్పుడు నుండునవే.

"ఎఱ్ఱచీర జూచి వెఱ్ఱి యనలుబెట్టి
పరుగులిడుచు నార్చు బఱ్ఱెబోలి
ప్రతిభగాంచి యోర్చు ప్రాజ్ఞతలేమిఁ బై
కుబ్బి శక్తిహీను లుక్కుచుంద్రు" [మార్కం. పుట 7]

ఇందలి యుపమేయమునకును ఉపమానమునకును పుస్తకముల కంటె జీవితమే ప్రధానగురువు.

దాసుగారియుపమానములు అనితరసాధారణములు; ఆలోచ నామృతములు.

"పెనుదవానలముం జేర వెరచినట్లు
దండధరకింకరులు దన్ను దాకలేమిఁ
గాంచి యది యంతయును న్సంభుకరుణ యనుచు" [మార్కం. పుట 41]

ఆంగ్లసాహిత్యమునుండి గ్రహించినను ఆంధ్రమునకు సహజమని పించునట్లు ప్రయోగించుటకు మఱియొక యుదాహరణము :

"చందురు గరువగ శ్వానము లరచెడు చందమాయె" [మార్కం. పుట 42]

**Barking at the Moon**

సాహిత్యవిషయములందును తమకు నచ్చని ధోరణులను క్రొత్త యుపమానములకుఠారములతో బ్రద్దలుచేయుదురు దాసుగారు. నిఘంటుప్రసిద్ధపదములతో రచించిన కావ్యము ముదురుముంజెకాయ వలె నుండునఁట. "కృతిని నిఘంటువు వెతకి ముదురుతాటిముంజెవలె జ్ఞేయుమూర్ఖుఁ డొకఁడు." (ప్రహ్లాద. పుట. 4) నారికేళపాకము ప్రసిద్ధము. వెక్కిరింతకు పాషాణపాకమనుట వినుచున్నాము. కవిత్వమునుగూర్చి చెప్పినపుడు ముదురుముంజెకాయపాకమున నున్నదనుట స్వతంత్రమే.

వర్ణనకందనివానిలో ముఖ్యమైనది సంగీతము. కాని, కవి పరాజయము నంగీకరింపఁడు. అందని, లొంగనివానినిగూడ తనశబ్దశక్తి కంది లొంగునట్లు చేయుచునేయుండును. సంగీతమును మాటలలోని కనువదింపలేకపోయినను దానిని వినునపుడు మానవునకుఁ గలుగునను భూతిని వ్యక్తీకరించుటకు ఉపమానములసాయమున ప్రయత్నించును. కాలజ్ఞతతోడి జాతిమూర్ఛనలు బంతులెగిర్చినపగిది నొప్పునఁట. అవి యొప్పునట్లు స్వరము బాడవలయునట. "బంతులెగిర్చినపగిది గాలజ్ఞతన్ జాతి మూర్ఛన లొప్ప స్వరముబాడు" (ప్రహ్లాద. పుట 5)

దాసుగారికిష్టమగు నుపమాద్రవ్యములలో నెగిరెడుబంతి యొకటి. "కోయిలకూతలకుం గన మేళగించి యెగిరినిలిచినబంతివలె నెల్లపల్కుల యెక్కిరింతయగు బరతపిట్టకూతలు" (రుక్మిణీ. పుట 12) కాగా నిదియు సంగీతసంబంధము గలచోటనే ప్రయుక్తమగుట గమనింపఁదగినది.

ఈ క్రిందిచాటువులో చేసిన సంగీతవర్ణన ముపమాబాహుళ్యముచే రమ్యతరమైనది :

"ఒకసారి పావురమొదిగి వచ్చినయట్లు
వానకోయిలపిట్ట పలికినట్లు
ఒకపరి మేల్పుటానొడిసి త్రిప్పినయట్లు
మించుతో మబ్బు గర్జించునట్లు
ఒకమారువెన్నెలలోలికి గాచినయట్లు
కొలనిలో జలకేళి సలుపునట్లు
ఒకతూరి గవ్వ గిలకరించినట్లు
చేడెతో పూలచెండ్లాడినట్లు

చిన్ని నాయన్న నీ పాట వెన్నముద్ద
లేసినట్టులు జువ్వల నెగచినట్లు
సన్నచెంబేలి జాజులు జల్లినట్లు
చిన్ని పూదేనె పైపయి చిందునట్లు. [శ్రీ నా. దా. జీ. చ. పుట 251]

ఇది పప్పు వెంకన్నగారిపాటపై చెప్పినపద్యమఁట. పెద్దనాదులు శ్రీనాథునిస్ఫూర్తి నందుకొని సాహిత్యము పంచేంద్రియతర్పకమని చెప్పఁగా వీరు సంగీతమట్టిదని చెప్పుటయు, ప్రకృతిలోని సుకుమారములు పరుషములు, సహజములు, కృతకములు నయినద్రవ్యములయు దృశ్యములయు విన్నాణముతోడి కూర్పును నిందలి విశేషములు. ఈ పద్యమే ఒక ఒలికిన వెన్నెల. ఇందలియెత్తుగీతిలోని యుపమానములు వీరికి ప్రియతరములు. కావుననే "చిన్నివాంద్రార మిా" అను నెత్తుగడలోని మార్పుతో నీగీతి సారంగధరనాటకమునను వాడుకొనఁబడినది.

సాహిత్యముయొక్క ప్రాణమే ఔచిత్యమయియున్నది. అలంకారవిన్యాసమున ఉపమానముకడ అభారతీయులు న్యూనాధికదృష్టి నంతగాఁ బాటింపరు. దాసుగారు చాలవఱకు పాటింతురు. ప్రహ్లాద చరిత్రమును వ్రాయుమని వీరినొకరు కోరిరి. ఆయననగూర్చి చెప్పుచు "వేడ్క నా నేస్తుఁడగు బొడ్డు వేంకటేశమ నెడు విదురునిబోలిన యంఘ్రిజుండు" (ప్రహ్లాద. పుట 5). ఇంత ఔచితీజాగరూకము వీరిదృష్టి.

దాసుగారు పండితరాక్షసుఁ డనఁదగిన విద్వత్కవియైనను వారికి సర్వవిద్యలయందును గురువు జీవితమే. కావున వారి సర్వోపమలు జీవకళలో నవనవలాడుచు అచ్చమైన తెలుఁగుతనము తొణికిసలాడు చుండును. "పంతముతోడ నీపయిని బాముపలె న్పగబట్టుసుమ్ము దుర్దాంతుఁడు లోకకంటకుఁడు దానవభర్త" (ప్రహ్లాద. పుట 9) 'పులిమిాసములు బెరుకునట్లు, శలభ మగ్గిలోఁ బడునట్లు, బలుతాచు న్మద్దిడునట్లు—సలిపె గీడు నాకాయధముఁడు" (ప్రహ్లాద. పుట 11) ఈ చివఱి మూడుపమానములలోనిక్రమము పరికింపఁదగినది. వీనిలో పూర్వపూర్వము భీకరతరము. కాని అపకారకరణములో ఉత్తరోత్తరము బలీయము. మిాసము లాగినను పులి యుపేక్షింపవచ్చును. లేదా, మత్తులో ఒక పంజాదెబ్బతో వదలవచ్చును. అగ్గిలోబడినను వెంటనే యెగురగల్గినచో

చావు తప్పి తెక్కలుమాడి బ్రతుకవచ్చును. కాని, పామువిషమట్టిది కాదే. కానరాకుండ వ్యాపించి ప్రాణము తీసికాని విడువదు.

దివ్యర్షి మాటాడునపుడుగూడ వీరియుపమానములు తెనుగింటిని, తెనుఁగుపల్లెను దాటిపోవు. కారణము శ్రోతృజన సౌలభ్యాకాంక్ష, తెలుఁగుతనముమీద వలపు: విష్ణుని శపించి, పశ్చాత్తప్తుఁడైన నారదుఁడతనితో ననినమాటలు. "తనుఁ దీయఁబోవు నతనిగఱచెడు నట్టి నూతఁ గూలినకుక్కరీతి నకట (నన్ను రక్షించు నిన్ను శపించితిని) ... అంద ఱన్ బ్రోచుచుందు వుపాయమలర బెల్లమగపర్చి మందిచ్చుతల్లి మాడ్కి" (యథార్థ. పుట 51)

దాసుగారు తమ శ్రోతల జీవితానుభవములోని యుపమానములతో విషయమును చెప్పిన అదివారితలకెక్కును. కావుననే వారు కోరికను 'దురద'లో పోల్చిరి. దురదను పోగొట్టుకొనుటకై గోకిన కొలఁది ఉన్నది పెరుగునే కాని తరుగదు సరికదా ఆవల ఈగోకుటవలన క్రొత్తబాధ కలిసి మఱింతగా పెరుగును. కోరికలు తీర్చుటయు నిట్టిదే అట.

కోరికగల్గువాలొరులఁ గొల్వక తీరదు, కొల్వుకష్టమౌ,
కోరిక తీటఁబోలెఁ గడు గొబ్బునఁ దీర్చుకొనంగఁబోవఁ బెం
పారును నంతతోడ, నకటా! మరి దీనికి మేరయెట్లు నం
పారి గనంగఁజాలు నవిశంబు పరాత్పరు వేడకుండినన్ [గజేంద్ర. పుట 5]

ఇచ్చట నుపమానమైన కండూతి మఱియొకచోట సమానధర్మమైనది. సేతువువర్ణనము ప్రసక్తము :

"గాడినిప్పు నిపురుగప్పి నట్లెండకు
మీఁదిపొరగఁ కలికి మించునీడ
పాళమైన నీటిపగిది గోకించెను
బెఱుకుబొంది శీతవేళయందు [హరి. పుట 36]

ఎండకు మీఁదిపొరగ నున్నచలికి మంచునీడ గాడినిప్పును గప్పిన నివురు వలెనుండి గోకించినది. నివురుగప్పిన గాడినిప్పువేడి అందటి అనుభవము లోనికి రాదని కావలయును, పాళ్ళమైననీటిపగిది అని .మఱియొక యుప మానము. మూడింటను సమానధర్మము గోకించుట.

దాసుగారికి మిక్కిలి యిష్టమైన యుపమాన మింకొకటి గలదు. అది గణితశాస్త్రీయము. సున్నకు విడిగా విలువలేదు. దానికి నెడమ వైపున నంకె యున్నచో విలువ గలుగును. దీని ననేకవిధముల నుపయో గించుకొనిరి. బ్రహ్మ సత్యము. జగత్తు మిథ్య. మిథ్యయైన జగత్తు పర మాత్మసంగతిచే సత్యమువలె భాసించును.

"కల్లను నిక్కంబ గావించు నాతండు
సున్నకు విలువను బన్నునట్లు" [ప్రహ్లాద. పుట 23]

మఱియొకచోట

"ఒకటి సున్నతోడ నుండి యెంతయుఁ దన
విలువ దావియందు విస్తరించు
కరణి, నెవ్వఁడీ జగమునఁ బెంపంది
దీని విడిచి తుదకుఁ దానె మిగులు" [గజేంద్ర. పుట 6]

ఇటులే లెక్కలకన్నిటికి నొక్కటియే యాధారమఁట. కావున నది జగదాధారమగు పరమాత్మకు నింకొకచోటగూడ నుపమాన మైనది :

"ఎల్లజగంబుల కీవె యాధారము
లెక్కల కన్నింటి కొక్కటివలె" [యథార్థ. పుట 137]

ఈ 'ఒకటి' ఉపమానముతోడనే మఱియొక చమత్కారము సాధించినారు. 'ఒకటి' యున్నది. ఒకటి సున్నతోఁగూడుటచే పదియైనది. అటులే పరమాత్మయు మాయతోఁగూడిన దశావతారముల నెత్తి పది రకముల జీవులసంఖ్య పెరుగుటకు కారణమైనాఁడఁట.

"ఒకటి సున్నసుగూడి యున్నప్డు పదిగతు
లందుపోలిక మాయనొంది యతఁడు
తొలుతను బదివేషములఁ జూపు నెవ్వాని
జాడల జంగమసంఖ్య పెరుగు" [గజేంద్ర. పుట 6]

ఇటులు చెప్పి దశావతారములను క్రమముగా డార్విను పరిణామ వాదమున కుపబలకముగా చెప్పినారు.

కవి యనుగ్రహముండవలయును గాని కల్ల నిజమగును; నిజము కల్లయగును. కల్ల జగత్తునకు, మాయకు నుపమానమైన సున్నయే మఱి యొకచో పరమాత్మ కుపమానమైనది. సున్నకు సంకలన వ్యవకలనభాగ హారములు లేవు కావున "పెరుగవు తరుగవు విభజింపఁబడవు; శూన్యాంకమువలె నకలంకచరిత" అని (యథార్థ. పుట 137) పరమాత్మకు సాటి యైనది.

అల్పాక్షరముల ననల్పార్థరచన దాసుగారికిష్టమే యైనను అందుకయి అక్కఱమాలిన కుదింపునకు పోవరు. సందర్భమునుబట్టి శ్రోతృజన రంజనము, ఉపదేశసారళ్యము ప్రధానములుగా నెంచి పదిబంతులలో నుపమానమును విస్తరింపఁజేసి రెండు పంక్తులలో ఉపమేయమును సంక్షేపసుందరముగా చెప్పి ముగింతురు: ప్రతిమారాధానప్రశస్తి విషయము :

"పతి దూరదేశంబు పట్టినయపుడు
సతి వానిచిత్రంబు సరగునఁ దెచ్చి
కనుగొని యుప్పొంగు గన్నీరు నించు
కొనియాడు మనవి గైకొనుమని వేడు
నతిభక్తి గొల్చు నాథా యని పిల్చు
బ్రతిమాలు పదములపైబడి సోలు
దనగతిగని పొక్కు ధైర్యంబు దక్కు
తనదుసొమ్ముల దీయు ధర్మంబు సేయు

బెనిమిటిచరితంబు వినిపించు వారి
గని గారవించు సత్కథల నాలించు
నటువలె మనము నిత్యంబ సర్వేశు
బటమున భావించి బ్రతుకుట మంచి" (గజేంద్ర. పుట )

దాసుగారొక విషయమును వర్ణించుటకు అనేకోపమానములను ప్రయోగించిరనఁగా తప్పక ఒక్కొక్క దానికిని ప్రత్యేకప్రయోజన ముండితీరును.

"బలయుతుని శూలజాడ్యంబు పట్టినట్లు
ఉత్తముని దుష్టకామిని యొడసినట్లు
ధ్యానవంతుని నిద్దుర పూనినట్లు
సమదగజమును మొసలి వాఁజాచి పట్టి" (గజేంద్ర. పుట 13)

క్రమముగా శారీరకమానసికాధ్యాత్మికశక్తులు మొక్కవోయిన వన్న మాట. ఈ ఉపమానములు అమూలకములు; దాసుగారి సొంతములు. ఇటులే :

"బహులపక్షపు విధుపగిదిఁ గన్పట్టి
యహా మర్దమగుతరి నలరుమానవుని
నీడపోల్కిని డిందె నీటును దప్పి
వాడి క్షీణించె నా వనగజమపుడు" (గజేంద్ర. పుట 16)

ఈ రెండుపమలవలనను గజేంద్రుని కరుణార్హమగు కార్శ్యము కన్నులగట్టుట యటుంచి యతని పునర్వృద్ధియు సూచితమగుట గమ నింపఁ దగినది. మఱియు,

"కాలకింకరుచేత కష్టాత్ముపగిది
జాలరివలబడ్డ ఝషము చందమున
జెలగి సంసారపుచిక్కున బడుచు
బొలుపుమాలిన జ్ఞానిపోల్కిని మరియు
నప్పులలో మున్గు నలతిచందమున
నప్పులలో మున్గి హస్తీంద్రుడపుడు" (గజేంద్ర. పుట )

ఈ యుపమానములన్నిటిలోను దోషము గజేంద్రునిదే యను సూచన విశేషము :

నాకు మిక్కిలి ముచ్చటగొలిపినది సెలయేళ్ళకు ప్రభుశాసన ముపమానమగుట. రెంటికి సాధర్మ్య మేమనఁగా మొత్తము వాక్యము చూపవలయును. "ప్రభుశాసనము తెఱంగునం దరతరంబులుగ గ్రమం బున దిగివచ్చుచు సర్వజీవనోపయోగంబులగు సెలయేళ్లు" (హరి. పుట 28) శ్లేషానుప్రాణితమగుఁగాక ఎక్కడి సెలయేరు ఎక్కడి ప్రభుశాస నము! ఈ రెండిటిని కూర్చినందులకు మెచ్చవలయును!

బాహ్యావస్తువర్ణనమున నైపుణ్యమును మెఱయించిన వారనేకు లున్నారు. భవభూతివలె అంతరంగ భావవిశ్లేషణమున అధికులమనిపించు కొనుకవు లరుదు. దుర్భర వేదనాపూరితుల అంతర్బహిఃస్థితులను వర్ణించు నపుడు దాసుగారిచ్చు నుపమానములు సముచితములు. ఆశ్చర్యజనక ములు, సాటిలేనివి. వరములు కోరినపిదప "సత్యబుద్ధుఁడై కైకేయితో దశరథుఁడు బదులనలేక యత్యంతఖిన్నుఁడై చదికిలఁబడె నటులిటులు పాలుపోక". "పిడుగు మోదినట్లూరకున్నాఁ"డఁట దశరథుఁడు. అటు సత్యము, ఇటు పుత్రప్రేమ - అటు లిటులు పాలుపోనని యతనిస్థితిని కైక 'నెఱిబలముల నిరుదెసల లాగబడు నియతి నెటు జోగబోడు'అన్నది.

"పితృవాక్పరిపాలనాదక్షుఁడగు శ్రీరామచంద్రుఁడు సీతాలక్ష్మణ సహితుఁడై రథంబెక్కి చనుచుండ" "తనలేగన్గానని గోవు తెన్నున కౌసల్య వాపోవుట" ప్రాతయుపమానమే కాని, "ఒడ్డున వైచిన చేప వలె, జిగురుకండె న్దగిలిన పక్షికరణి, బంగిడిం జిక్కిన యేనుంగుమాడ్కి, దశరథుఁడు తల్లడిల్లుచున్నా" డనుటమాత్రము (యథార్థ. పుట 113) నారాయణోపజ్ఞము.

పుత్రవృత్తాంతము తెలియక అతనిని వెదకబోవు చంద్రమతిస్థితి యిది :

"వెఱ్ఱి పట్టినట్లు పెనుమంట బడినట్టు
లూబినీట మునుఁగుచున్నయట్టు
లడుగుబెట్టలేక యాగలేక తపించు
నా పెతోడ" (హ రి. పుట 43)

ఇఁక కుమారుఁడు సర్పదష్టుఁడై నాఁడని తెలిసి అతనిని చేరఁబోవు నా మెస్థితి యో, "అట్లుగానక కలయందు నరుగుపగిది" (హరి. పుట 44) నున్నదఁట. రాజ్యభ్రష్టత – అంతటి పతివియోగము – దాసీత్వము – ఏకపుత్రహాన్మరణము – ఆమెమన సెటులుండును ? అసలుండదు. కావున నే కలలో నడచునట్లున్నది. ఆమె యొడ లామెకు తెలియదు.

ఈ యుపమానమునే స్త్రీహత్య జేయవలసి వచ్చినందులకు హరిశ్చంద్రుఁడు కుందుచుఁబోవునపుడును వాడినారు వేఱు దారిలేక (హరి. పుట 52)

ఇంతకన్న పై సంగతి యింకొకటున్నది. కొడుకు పోయినాఁడని విన్నంతనే యిట్లయిన చంద్రమతి ఆ కొడుకు పునర్జీవితుఁడై నాఁడనఁగా నెట్లుండును ? ఆయనయే చెప్పవలయును.

"కలలోన కష్టముల్ దొలఁగిన యట్టులు,
నవ్వుదేలిన నూపి రాడినట్లు,
పెనుసగాధము దాటి వెల్లడి గనునట్లు,
చెదరిన సిరి మళ్లి చేరినట్లు,
సతతశంకితము విస్పష్టంబునై నట్లు,
మూర్ఛదేరిన తెల్వి మొనయునట్లు,
ఆస విడుచునర్థమది యుట్టిపడ్డట్లు,
ముప్పునుగారడి ముగియునట్లు,
హాయిగా రాచదంపతు లర్ఛకుండు
బ్రతుక గని...." [హ రి. పుట. 54]

ఈ యుపమానము లన్నియు రాజదంపతుల కించుమించు వాస్తవముగా

వర్తించునవియే యగుట వీనియందలి విశిష్టత. కావలెనని కల్పింపఁబడిన కష్టములివి కలవంటివే తొలఁగినవి. విశ్వామిత్రునియప్పు తేలినది. కష్టముల యగాధము దాటి యొడ్డెక్కిరి. చెదరిన సిరి తిరిగి చేరినది. రాజపుత్రఘాతిని యన్ననింద చంద్రమతిపై బడినది మృషయని విస్పష్టమైనది. మూర్ఛవలెఁ గప్పిన వీరబాహు ప్రభృతిభ్రాంతి తొలఁగి అచ్ఛమైన తెల్వి గలిగినది. రాజ్యాదులందు ఆస విడిచినారు; అవి మరల యుట్టిపడినవి. గారడీవంటి ముప్పు ముగిసినది.

కవి వాడిన యుపమానములనుబట్టి వివిధవిషయములనుగూర్చి కవికిఁ గల యభిప్రాయములను గమనింపవచ్చును. కవియభిప్రాయములన్నిటితోడను పఠిత ఏకీభవించి తీరనక్కఱలేదు. అతనికృత్యమేమనఁగా ఆ యభిప్రాయముల వెనుక గల కవిహృదయమును కనిపెట్టి వానిని సయుక్తికముగా, సందర్భోచితముగా, సముచితరమణీయముగా ప్రతిపాదించినాఁడా లేదా యన్నది తెలియుటయే. తనకిష్టమైనయభిప్రాయములను రచయిత వ్రాయఁడేమి యని కాని, వ్రాయుటయే గొప్పయని కాని మరి భావించుపఠిత పఠితకాఁడు.

గజేంద్రుఁడు చూచినసరస్సు "సుకవి భీషణంబు తెఱంగున శ్రోత్రోత్సవంబై" యున్నదఁట (గజేంద్ర. పుట 12) సుకవిపలుకు కపురపుపలుకువలె ముందు వీనులవిందుగా నుండవలెను. పిమ్మటనే అందలి అర్థము సంగతి.

కవిహృదయము కనిపెట్టుట కష్టమని వీరియభిప్రాయము. "కవి హృదయంబుపోల్కి దురవగాహంబు" (రుక్మిణీ. పుట 17). నిజమే. కవి హృదయము ఒక్కొక్కప్పుడు కవికే తెలియదు. ఇతరులసంగతి చెప్పనేమి ! కావుననే కవిత ఒకొక్కప్పుడు దుర్వ్యాఖ్యా విషమూర్ఛిత యగుటయును, దానినుజ్జీవింపఁజేయుటకు సంజీవిను లుదయించు

టయు జరుగును.[5] కవి హృదయము కవికెన్నడును తెలియదు. వ్యాఖ్యాతకే తెలియుననువారును గలరు. "కవితారసమాధుర్యము వ్యాఖ్యాత యెఱుఁగును; కవి యెఱుఁగఁడు. కన్యాకుచపరిష్వంగము నల్లుఁడెఱుఁగును గాని, తండ్రి యెఱుఁగఁడు"[6] ఇత్యాదిగా వారందురు. మొత్తముపై కవి హృదయము దురవగాహమనుట అవివదితము.

హూణవిద్యాపాఠశాలలు కోదువ్యవసాయము దాసుగారి దృష్టిలో సమానములు: "హూణ విద్యాపాఠశాలలభంగి బలుపంటల కొక్కమారాకరంబగు కోదు వ్యవసాయంబులు" (హరి. పుట 28)

లోభిని దూషింపనివాఁడు లేఁడు. అతఁడు భీమన్న గావచ్చు, వేమన్న గావచ్చు, కడకు కవిచౌడప్పగావచ్చు, ఎల్లరును లోభిపయి పద్యములు చెప్పినవారే. దాసుగారికిని లోభిమొగ ముపమానముగా నుపయోగపడినది. "మోజ్జువారి లోభిమొగంబువలె నిష్ఫలంబైన చిట్టడవి" (హరి. పుటలు 16-17) అని.

అంగదేశమునందలి కఱవులో "నింగి బొల్లి మేఘ మొకటినిల్చె లోభిమొగమట్లె" (యథార్థ. పుట 52) అది చినుకదు; వాఁడు విదుపఁడు.

రాముఁడులేని యయోధ్య "లుబ్ధుని ధనము పగిది" వ్యర్థమఁట
(యథార్థ. పుట 115)

ప్రతి హరికథకు మొదట పీఠికాప్రాయముగా దాసుగారు తాము చెప్పఁబోవుకథకనుగుణమైన ఉన్ముఖీకరణమునకైన యుపన్యాసమువంటి

---

5. భారతీ కాళిదాసస్య దుర్వ్యాఖ్యావిషమూర్ఛితా ।
ఏషా సంజీవినీ టీకా తామద్యోజ్జీవయిష్యతి ॥ - మల్లినాథుఁడు

6. కవితారసమాధుర్యం వ్యాఖ్యాతా వేత్తి నో కవిః ।
కన్యాకుచపరీరంభం జామాతా వేత్తి నో పితా ॥

రచన చేయుదురు. అందు లోక లోపపరామర్శలు, స్వానభిమతవిషయ విమర్శనలు, నీతిధర్మోపదేశములు కొల్లలుగా ప్రేల్లుచుండును. అపుడుపమానటి లాస్యము మాని తాండవమునకే దొరకొనును :

ఎన్నఁగ గోరనప్డు లభియించును సంపద జాతిబొమ్మకున్
సన్నుతపూజమాడ్కి; బెలుచం దను గోరిన రాదు లచ్చి బల్
చన్నులు నూసకమ్మకటు; చావక తీరని గూనివంపులా
గున్నది సేచ్ఛలేని బ్రతుకో జనులార యిఁకేటి సౌఖ్యముల్ ?

[సావిత్రి. పుట 5]

కోరినను సిరిరాదనుటకు ఇందిచ్చినంతకంటె మఱియొక యుపమానము దొరకదాయని సుకుమారుల కనిపింపవచ్చును గాని, వారి దృష్టిలో ఆపాటి వాడి యున్నదనుకొనుట మంచిది. ఈ దృక్కోణము నుండి దీనిని చూడకున్నచో ఇప్పట్టులందలి యుపమలు అన్నియు చెక్కి తీర్చినట్లు సరిపోవునవియే.

వేదాంతాధ్యాత్మిక భావములను వివరించుట కుపమానము లెంత గనో ఉపకరించునని వేదాంతము పుట్టిననాఁడే వెల్లడియైనది. వీరు పై పద్యముననే కాదు ఎక్కడ నీ భావముల వివరింపవలసి వచ్చినను పై వానివంటి నిత్యసన్నిహితోపమానముల నృత్యము చేయింతురు:

"విధివశంబున నది [మనసు = మాయ] వింత రూపుల మాఱు
మిన్నున గాలిచే మేఘమట్లు,
జగమిది కాదు వాస్తవము కలంబోలి
చిత్తభ్రమమున నీ చిన్నె లొదవు,
ఆత్మనందు విశ్వ మధ్యస్త మఖిలంబు
నింగిదోచెడి నల్లరంగువలెను" [యథార్థ. పుట 43]

సావిత్రిలో బంధుప్రేమ కల్ల యనుట కుపమానమైన నింగినల్లు ఇందు విశ్వమిథ్యాత్వనిరూపణమున కుపకరించినది. ఈ భావము చెప్ప వలసివచ్చినపుడెల్ల ఈ యుపమానము విడువరు దాసుగారు : "కలద

నియు లేదు, లేదన్న గలదు జగము నభమునందున గన్పట్టు నలుపు మాడ్కి" (యథార్థ. పుట 74)

నారాయణదాసుగారు ప్రాయ మింతకు మిగుల కై వ్రాలినినాఁడు వ్రాసినది యథార్థరామాయణము. అందు మిగిలిన విషయములందు వలెనే ఉపమావిన్యాసమునందును పరిణతి కాన్పించును.

ఒక్కయుపమానముతో నుపమేయముయొక్క యంతర్బహిస్తత్వములను వెలువరించు నేర్పు దాసుగారికి సహజము. రామునిగోరుటకు వచ్చుచున్న విశ్వామిత్రుఁడెటులున్నాఁడు? "నిగుడు గ్రమ్ముచున్న నిప్పులాగున భూతి పూసిన బంగరు బొంది మెఱయ" (యథార్థ. పుట 61) నున్నాఁడఁట.

ఒకటి రెండుపమానములతో పాత్రలకోమలస్వభావమువలెనే శరీరరూపములనుగూడ సాక్షాత్కరింపఁజేయుశక్తి దాసుగారిది. తాటకాస్వరూపము నొడ్డుపొడుగుల నీ రెండుపమానములతో మనమూహింపనక్కరలేకయే చూడగలము :

"....కాళ్ళకు దగులు వృక్షంబులన్నియు గడ్డి
కాడలవలె జాపకట్టుకొనఁగ ..."
"అగ్నికుండములట్లు రక్తాక్షు లలర
వచ్చి తాటక పిడుగులుపడగ బల్కె" (యథార్థ. పుట 68)

తాటకతరువాత నిట్టివర్ణనకుఁ బాత్రుఁడైనవాఁడు కుంభకర్ణుఁడు :

"నంజకెంజాయచే నంజనాచలమటు
కావిదుస్తుల నీలకాయ మమర
నిరుగడ మేరుశిఖర మినచంద్రుల
వలెఁ దల కుండలంబులు వెలుంగఁ
గ్రొమ్మెఱుంగులతోడి క్రొక్కారుమబ్బట్లు
తారహారముల నెద విలసిల్లఁ

గొండల నమ్మల్లెపూచెండులగతి నెత్తఁ
జాలినశూలము కేలఁ దనర

ప్రళయభైరవువలెఁ దాండవము సలుపుచు
నట్టహాస మశనిశబ్ద మపహసింప
కోటగోడ నొక్కడుగున దాఁటి కుంభ
కర్ణుఁ డేతెంచెఁ గపులు నల్గడలఁ బాఱ. (యథార్థ. పుట 239)

వాల్మీకి కుంభకర్ణునొకచో 'పర్వతసంకాశుఁ'డని రామునిచే ననిపించినాడు. ఇంకొకచో తానే పర్వతసంనిభుఁ డనియు, వేఱొకచో పర్వతోపముఁడనియు నన్నాఁడు. మఱి కొన్నిచోటుల మొత్తము కుంభకర్ణుడు గిరిశిఖరమువలె నున్నాఁడనినాఁడు. నారాయణదాసుగారు అటునిటు నుండినకుండలములతో నతనితలయే అటునిటు సూర్యచంద్రులు గల మేరుశిఖరమువలె నున్నదన్నారు. వాల్మీకి కుంభకర్ణునికంటె వీఁడీ సందర్భమున నెత్తైనవాఁడు. వాల్మీకి కుంభకర్ణుఁడు రెండుపాదములతోను ప్రాకారమును దూఁకఁగా ఈ యథార్థరామాయణకుంభకర్ణుఁడు ఒక్కడుగుననే దాటఁగలుగుట కిదియే కారణము. అతఁడు కుప్పించి దూఁకఁగా నితఁడు అనాయాసముగా నడచినట్లు దాటినాఁడన్నమాట.

"ఇరుగడ మేరుశిఖరమినచంద్రులవలెఁ దనకుండలంబులు వెలుంగ" అని చదువుసరికి శిశుపాలవధ . చూచినవారికి మాఘుని ఘంటామాఘుని జేసిన భావము స్ఫురింపకమానదు.

ఒకొక్కప్పుడు దాసుగారియుపమలు అధికోపమలవలెఁ గాన్పించును. కాని, ఆలోచించినకొలఁది అవి అల్పోపమలనవలయునా? అనిపించుట చమత్కారము : శ్రీరామచంద్రుఁడు మాఱువేషముతో "భూలోకమునకై స్వర్గము విడుచునట్లు క్రమక్రమముగా సౌధాంతరములనుండి క్రిందికి దిగి"నాఁడఁట. (జానకీ. పుట 9) నిజమునకా యవతారపురుషుఁడు దిగినది అంతకంటెపైదియగు వైకుంఠమునుండి కదా!

పాత్రిలనోట తత్తద్వృత్తిసహజములయిన యుపమానములను బలికించుటకు దాసుగారు పెట్టినది పేరు : "తెలియవు సుంతైన వెలు పలిసందడి పట్టుజేరిన కోడిపెట్టమాడ్కి" (యథార్థ. పుట 101) పలుకు చున్నది దాసి మంథర కైకతో. ఆమె దాసికా చన విచ్చినది.

ఆధునిక విజ్ఞాన శాస్త్రజ్ఞానజన్యములగు నుపమానములును దాసుగారికి వశ్యములు. శ్రీరామచంద్రుఁడు లక్ష్మణునితో ననుచు న్నాఁడు :

"అవురా యెక్కడికక్కడే సమత నిర్వాహించు చందమునన్
వివిధావస్థల నొక్కపోల్కి మది తృప్తింగాంచుఁగా, రాను రా
ను వనంబిట్టుల రాజధానివలె జంతుల్మంతులట్లీ యెడన్
భువి పర్యంకము మాడ్కి భక్ష్యములటుల్ మూలంబులున్దోచునే.

[యథార్థ పుట 129]

ఉపమానోపమేయములకు సాధర్మ్య మనేకవిషయములలో నుండవచ్చును. కాని ప్రకరణమునుబట్టి వక్త వివక్షించి వాచ్యము చేయున దొకటియే కావచ్చును. అట్లు వాచ్యమయినదానికంటె వ్యజ్య మానమగునదియే రమణీయతరమగును. ఇట్టి యుపమానములను దాసు గారు తక్కువ వాడలేదు. పర్ణశాలకు వచ్చుచు భరతశత్రుఘ్ను లను కొనుచున్నారు :

"వీరాసనమున నుండిన శ్రీరామునిపజ్జ నదో
యౌరా యరుంధతివలె నగపడియగపడదు వదినె"

[యథార్థ. పుట 131]

దృశ్యాదృశ్యత్వము వాచ్యము ; పాతివ్రత్యము వ్యంగ్యము.

కుంతలములదీర్ఘత్వ నీలత్వ వక్రత్వములను వర్ణించినవారున్నారు గాని ఇంత అందముగా దాసుగారివలె నీలిగాజులమలారముతో పోల్చిన వారు గలరా ? "కొప్పు నిలువఁబడి విప్పిన న్నీలిగాజుల మలారము పోల్కిఁ జెలఁగు నేల" (యథార్థ. పుట 162)

'నాటకాంతం హి సాహిత్య' మన్నారు. దాసుగారి సారంగధర నాటకమునకు ఎందువలననో రావలసినంత ప్రఖ్యాతి రాలేదనిపించును. మామూలు మాటలతో "సుగుణములు నైజముగఁ బుట్టవలయునే కాని యితరులు చెప్పిన నేపాటి కుదురును ? నీతులు పోత పాలవంటివి" వంటి మంచి యుపమానములను సూక్తికల్పములను చెప్పుటయే కాక, "పూర్వము సారథి యడ్డపడినపుడు మీ ముత్తాత యభిమన్యుఁడు సాహసించినట్లు మీరును జనుచున్నారు" ( పుట 35) వంటి భావ్యర్థ సూచకములగు నుపమానములనుగూడ చాల ప్రయోగించియుండిరి.

సీతాన్వేషణపరులైన హనుమదంగదజాంబవదాది కపివీరులు శ్రీరామచంద్ర భక్తిపరవశులై కర్తవ్యమాలోచించినరీతికి కొన్ని యుపమానముల నిచ్చిరి. వానిలోఁ గొన్ని అసాధ్యదుస్సాధసాధనపరులైన విజ్ఞానశాస్త్రవేత్తలను బేర్కొనునవియు నున్నవి. కపివీరుల ఆలోచనలు ఫలించునవి కనుక వీరియాలోచనలును ఫలించునని వీరు భావించి రనుకొనవలయును: "కట్టెతో కైలాసమేగ నుంకించు ముముక్షువుల లాగునఁ, బూర్వపశ్చిమభూగోళంబులకు రాకపోకలకై యేకబిలము ద్రవ్వయత్నించు క్షేత్రగణితజ్ఞులవలె, కుజమండలముతోఁ దంతీవార్తలేర్పర్చనూహించు శిల్పులకరణి, రసభస్మము చేయనెంచు వైద్యులచందంబున, హేమ విద్య సాధింపఁగోరిన ప్రకృతివేత్తల విధమున, సగుణపరమాత్మ నిరూపణమునకై తంటాలుపడు తార్కికుల సొబగున, బృథివ్యప్తేజోవాయువులు తప్ప నితరమే లేదని సిద్ధాంతీకరింప దేవులాడు నాస్తికులచెలువున, భూతహింస మాన్పింపదొరకును కారుణికులరీతిన" (యథార్థ. పుటలు 192, 193) అని. వీరిలో తంటాలుపడు, దేవులాడు పదముల ప్రయోగ విధానమునుబట్టి తార్కిక నాస్తికులయెడ వీరికి సానుభూతి లేదని తోచును.

సీతాసందర్శనార్థమైన కపులప్రతీక్షకిచ్చిన యుపమానములును ఇట్లే వారికి నచ్చిన, నచ్చని యుపమాద్రవ్యముల కలపోతగనే యున్నవి.

"దేవతాప్రత్యక్షమునకై భాగవతులమాడ్కిఁ, బాతాళజలధారోత్పత
నముకొఱకు యంత్రకూపఖనికులవలె, భిషక్సమావేశమునకై దీర్ఘరోగుల
చాడ్పునఁ, దరుణభార్యాప్రథమప్రసూతికై యధికధనవంతులగు వయసు
మళ్ళిన మగలపోలికన్, గారాగృహవిముక్తికై బందెలచొప్పున, సువృ
ష్టికై క్షామపీడితులతీరున, నిద్రాశనపానంబులకై పస్తున్న దేహధారుల
కైవడి, నిత్యసంతుష్టికై సంసారులవడువున సీతాసందర్శనార్థమై ప్రతీ
క్షించుచు" (యథార్థ. పుట 193) వీనియందు ప్రతీక్షాతీవ్రత యొకటే
వివక్షితము. ప్రతీక్షకులయెడఁ గాని, ప్రతీక్షితముల విషయమునఁ గాని
కల న్యూనత్వాధికత్వములు అవివక్షితములు.

వర్ణనానిపుణుఁడయిన కవివీరున కరణ్యము కురుక్షేత్రమువంటిది.
"బాణుఁడు రుచిచూచి విడిచినదే జగత్తంతయు" ననిపించుకొనిన
బాణమహాకవిని ప్రశంసించుచు నొకకవి యతని వింధ్యాటవీవర్ణనమును
ప్రత్యేకించి పేర్కొనినాఁడు. దాసుగారరణ్యమున బాణునితో బుజము
రాచుకొని తిరుగఁగలవారు. అందు ప్రత్యక్షముగనో విరోధాభాస
శ్లేషాద్యనుప్రాణనపరములుగనో వారు గుప్పించు నుపమానములకు
లెక్క లేదు. గమనింపుఁడు :

"రాచప్రాపున విఱ్ఱవీగుచు బెద్దల నిరసించు నల్పులవలె మెట్ట
కొనలం గంతులిడుచీసడించు కొండమేకలన్, గొండమేక లుండుగుట్టల
నెక్కఁజాలక వానిం గని యూటలూరుచు నందరాని పొందున కాసించు
క్షుద్రజాలరులవలె నోరావులించుకొని చూచునక్కలన్, నక్కనై చ్యం
బులం గొంగజపంబులన్ సిరిగలవారిపంచలంబట్టి ప్రేలాడు యాచకుల
వలె మట్టియూడల నూగులాడు మర్కటంబులన్, మర్కటకిశోర
న్యాయంబుగ వెలయాంద్రప్రాపునంబడు వృద్ధవిటులరీతి దీములకడ నిలు
వంబడు మృగంబులన్, మృగములవలె దిసమొలతో సంచరించు నడవి
మనుష్యులన్ (వెలయు ఘోరాటవిం జనుచుండి)

(యథార్థ. పుటలు 65-66)

ఇఁక అన్యాలంకారానుప్రాణనములు: విరోధాభాసలు: "యోగి హృదయంబులపోలికన్ గభీరంబులయ్యున్ బ్రసన్నంబులై, రాజసమ క్షంబులలాగున రమణీయంబులై యున్ భీకరంబులై (గానసభలపోల్కి మధురకవిగాయక స్వరమనోహరంబులైన)(శ్లేష) సరోవరంబుల విరాజిల్లి యు"— ఈ రెండును వీరికి ప్రియములని యివి రెండును శ్లేష అవ్యవ హితములుగ సందర్భోచితమైన కొలఁదిమార్పుతో గజేంద్రమోక్షణము నను ప్రయోగింపఁబడుట తెల్పును. "యోగిహృదయంబుపోలిక గంభీ రంబయ్యును ప్రసన్నంబై, రాజముఖంబువలె రమణీయంబయ్యును భయంకరంబై" (పుట 12).

శ్లేషలు : కొండొకచో లుబ్ధునిధనంబువలె నిష్ప్రయోజనంబు లగు నూసరక్షేత్రంబుల మెండుకొనియుఁ, గొండొకచో వ్రతభ్రష్టు మొగముకరణి వెల్తివడియుఁ, గొండొకచో మాఱుమనువు తెన్నున సందడి తగ్గియుఁ, గొండొకచో బహ్మసమాజంబుజాడ ద్విజకులబాహ్యం బయి, కొండొకచోఁ బాశ్చాత్య విద్యాపాఠశాలలఁబోలి ద్రవ్యమూలై కగమ్యంబై, కొండొకచో గ్రామ్యభాషాకావ్యంబుకైవడి నీచజన ప్రియంబై, కొండొకచోఁ గ్రూరభూపతి క్రతువులగరిమ బ్రభూతబలి ప్రియంబై, కొండొకచోఁ దురుష్కపురంబుచొప్పున మద్యగన్ధ బహు ళంబై,కొండొకచో నాధునికచాతుర్వర్ణ్యంబుపోలుపున సంకీర్ణంబై పరవ శంబై దుర్వినీతంబై, కొండొకచో నవనాగరికజీవనంబు సొబగునఁ గాంచన ప్రధానైక గౌరవంబై నిరర్థకంబై దుష్పథంబై, కొండొకచో బాలిక జెట్టపట్టిన ముసలిచాయ నిర్లజ్జంబై కర్కశంబై, కొండొకచోఁ గన్యావ శుల్కముమాదిరి విప్రకృతంబై, కొండొకచో కాపురుషగణంబుభాతి ననుదారువై, కొండొకచో బాల్యవివాహమువిధమున మన్మథదూరంబై ప్రియానభిజ్ఞంబై, కొండొకచో పాషండ పరిరక్షణంబునం బెరిగిన యార్యకుమారునిగమనిక గులధర్మశూన్యంబై వెలయు ఘోరాటవిం జనుచుండ (యథార్థ. పుట 68)

అరణ్యవర్ణనమునవలెనే పట్టణవర్ణనమునను ఉపమామాలికలు కొల్లలుగా నూగును :

దాసుగారి పట్టణవర్ణనలోని ఉపమానముల చిన్నె లెన్నుట యనఁగా పల్లెటూరువాఁడు పట్టణమునకు తొలిసారిగా పోయి బజారునఁ బడిపోవుటవంటిది. ఎన్ని వింతలు! ఎన్ని విశేషములు! "చెడనున్న తరుణ విటుని చందంబునఁ దలచూపి నిగిడి"నాఁడఁట "పున్నమచేఁడు" (యథార్థ (పుట 85) దాసుగారు వయసుమళ్లినపిమ్మట వ్రాసినదిది. "గొప్పవారి యందలి తప్పులవలె విస్పష్టంబులైనవఁట చీఁకట్లు" (యథార్థ. పుట 85) "చీకటుల నల్లదుస్తుల నొదుగుజారచోరుల కనిపెట్టలేక మితిమీఱిన తెల్వి బొరపడు పండితులవిధమున మిక్కుటపువెల్గున న్మోసపోయి"రఁట రాజ భటులు. "అందనిపండ్లు పులుపనునట్లు తమకు లభించనిభోగములు తుచ్ఛంబులని వదరు" వృద్ధులను "చెట్లను నఱికి మొదళ్ళను మిగుల్చు నట్లు పనికివచ్చు పడుచువారిం దెగటార్చి ఇమ్ముసలి ముద్దలకెంత యాయు విచ్చుచున్నావురా యని విధిం దిట్టుచు"న్నారఁట కొందఱు పెంకె పిల్లకాయలు (యథార్థ. పుటలు 86, 87)

కవియూహావైభవమునకు ఋతువర్ణన మొకటి విస్తృతావకా శము కల్పించును. అన్యత్రి ఋతువర్ణనసందర్భము వచ్చినపు డొకటి రెండు పద్యములతో తేల్చివైచిన దాసుగారు యథార్థరామాయణ మున వాలివధానంతరము శరదాగమము నిరీక్షించుచు రాముఁడు కాలముగడపు సందర్భమున మూడు ఋతువులను గీష్మవర్ష శరత్తులను రెండున్నరపుటలలో వర్ణించిరి. సీతావియోగసంతప్తుఁడగు శ్రీరామ చంద్రునకు ప్రతిక్షణమొక మహాయుగమైనదని తెలుపుటకు ఈ సుదీర్ఘ వర్ణన మవసరము. ఇందుపములు నుడిగాలులవలె రేగినవి; చిత్తజల్లుగాఁ గురిసినవి. వీనిలో స్వతంత్రములు, శ్లేషానుప్రాణనపరములు పుంఖాను పుంఖములు.

వాల్మీకి రామునియంతగా దాసుగారిరాముఁడు తనసీతావియోగ సంతాపమును బయల్పడనీయఁడు. తీరుబడిగా వియోగవ్యథ పడుటకంటె దుష్టశిక్షణగుఱించి యెక్కువ ప్రయత్నించుట వలయునని సీతాపహరణ వార్త విన్నవెంటనే యిటులన్నవాఁడు :

"ఒప్పుగ మానవు ల్నిజకులోచిత ధర్మము తప్పఁగూడ దే
ముప్పు లభించినన్ సుజనపోషణమున మఱి దుష్టశిక్షయున్
దప్పని నా పనుల్గనుక దల్లడమందక ధైర్యమూని నే
నిప్పుడ జానకి న్వెదుక నేగెద దబ్బున నెల్లచోటులన్.

(యథార్థ. పుట 172)

కావుననే వర్షర్తువర్ణనసందర్భమున క్రియాశీలియు, సుఖదుఃఖ తటస్థుఁడుననగు యుద్ధోద్యోగిచూపుతోడనే యుపమానములీయఁబడి నవి కాని వియోగిదృష్టితో కాదు. బయటపడనీయఁ డన్నమాట కాని బాధపడకుండ నుండలేఁడు. ఈ విషయము వ్యంగ్య మనుటకే కావల యును గ్రీష్మశరత్తులకంటె వర్షర్తు వర్ణనమధికముగాఁ జేయఁబడినది. అంతేకాక గ్రీష్మాంతమున సుగ్రీవాదులు కిష్కింధకు పోయిరి. శరదా రంభానంతరము వచ్చిరి. పదిమందిలోనుండి ప్రతీకారకరణమునకై సమా లోచనము జరుపుచున్నపుడు వియోగవ్యథ అంతగా నుండదు. అది సూచించుటకును అవి అల్పతరవర్ణితములయినవి.

వేఱొకచో వాన వ్యాకరణమువలె నున్నదని యిట్లు మనోహర ముగాఁ జెప్పఁబడినది :

"పల్లమువంకఁ బ్రవర్తించె నీర్విశే
షృముజాడ జను విశేషణముభంగి
నడవికార్చిచ్చుల కాదేశమై కొండ
వరద యాగమమయ్యె జెరువులకును
అల ప్రకృతిప్రత్యయమ్ము లట్టు లన్యోన్య
మెడయ కెల్లం గాల్వ లేకమయ్యె

కర్మభావప్రయోగంబులం దప్పని
యాత్మనేపదమట్టు లలరెఁ గప్ప

వడి నలౌకికవిగ్రహవాక్యమువలె
గోకిలరవప్రయోగంబు లేకయుండె
బల్లవితబహువ్రీహి సంపటలమగుచుఁ
బ్రబలి వ్యాకరణమువలె వాన వెలసె".

ఇటులు దాసుగారి యుపమాద్రవ్యవైభవము ప్రదర్శించుటకు అరణ్యానియో, మహానగరమో ఋతుతతియో, భూమ్యాకాశములను తిరుగవైచు అసాధారణమహాకార్యసంరంభమో కావలయును. అట్టి వానిలో కుంభకర్ణునియుద్ధముకూడ ఒకటి; కుంభకర్ణు డేతెంచి యేఁడీ రాముఁడేఁడీ రాముఁడని సింహగర్జనలు సల్పుచు నోరు గఱచుచుఁ గఫులఁ గొందఱ న్గాల్వేతుల నల్లులమాడ్కి నేల రాయుచుఁ, గొందఱ న్ననగలవలె నములుచుఁ, గొందఱ న్వెన్నముద్దలకరణి మ్రింగుచుఁ, గొందఱ న్దోమలలాగునఁ దోలుచుఁ, గొందఱన్పోడుమట్లు దిగబీల్చుచుఁ, జెఱకుతోట విఱచి తిను మదపుటేనుఁగుతీరునఁ బచ్చి పుట్టలఁ గొమ్మల విదల్చుచు, బలిసినపచ్చికబయలునఁ జెలరేగు కోఱ పోతుకీవి న్నైదలకుఁ దలపడిన యెల్లుబంటివిధమున, నెండుపూరికపువ్వన్దగి లిన కార్చిచ్చుచందమునఁ, బ్రళయభైరవునిరీతి న్విజృంభింప నద్దనుజుని యుచ్ఛ్వాసనిశ్శ్వాసంబుల నవశులై చిక్కువారును, మఱియు రోమ కూపద్వారముల నెడలువారును, గొండమీఁది చీమలబారుమాడ్కి..." (యథార్థ. పుట 239) ఇందు పోడుమట్లు దిగబీల్చుచు నిత్యాదులవలన హాస్యమును జనించుట గమనార్హము.

సహజములయిన కవితాగానములు ఇచ్ఛానుసారము పరవళ్లు ద్రొక్కును; కర్ణరసాయనములగును; కృత్రిమములు కృత్రిమములే అని "సహజకవితాగానంబులకరణి యథేచ్ఛం ద్రుళ్లిపారు తీయని వెండినీటి ధారలు" అను నుపమానముచే తెలుపుచున్నారు. దాసుగారికవితాగా

నములు రెండును సహజములే. వ్యుత్పత్తి గొప్పది గావచ్చుఁ గాని ప్రతిభకన్న గొప్పది యెన్నడును కానేరదు. పై యభిప్రాయమునే మఱియొకచోటఁగూడ నిట్లు వెలిబుచ్చినారు. శ్రీరామస్వామ్యనంతరము "సహజగానకవితాశాలిదరిన్ శుష్కశాస్త్రజ్ఞువలెఁ జుక్క సౌరు మాసె" నఁట. (జానకీ. పుట. 35).

దాసుగారి కవితాగానములు రెండును సహజములు; అటులని వారవిదితశాస్త్రరాద్ధాంతులనుకొనరాదని పుర్వోదాహృతము లయిన బహుశాస్త్రీయోపమానములు ఋజువుచేయుచున్నవి. కావున శుష్కశాస్త్రజ్ఞుఁడు సహజగానకవితాశాలిదరిని సౌరుమాయు ననిరన్నను, సహజకవితాగానములు మధురములై యత్యేచ్ఛం ద్రుల్లిపాడు ననిరనినను అది వస్తుతత్త్వప్రశంసయే కాని అశక్తికృతమయిన అప్రాప్యజ్ఞాననిందగా భావింపరాదు.

ఇటులు దాసుగారి యుపమావిన్యాసవిధానము వైశిష్ట్యమును, నైపుణ్యమును, వైవిధ్యమును సంతరించుకొన్నదై వారికి ఆంధ్రవాఙ్మయమున భద్రపీఠము నొసఁగజాలి యున్నది.

ఈ సుదీర్ఘవిచారమువలన తేలినదేమఁగా: "కవిత్వమునకు ప్రాణముపమ. నారాయణదాసుగారు పూర్వకవుల ఉపమానములను గ్రహించినచోట్ల వానిని సముచిసంస్కారముచేసి సవిశేషముగా ప్రయోగింతురు. వారు సంస్కృతాంధ్ర పూర్వకవుల గ్రంథములనుండియే కాక ఆంగ్లాదీతర భాషాగ్రంథములనుండియు అలంకారములను గ్రహించిరి. వారి యుపమానములలో అత్యధికభాగము వారిజీవితానుభవమునుండియు, తెనుఁగుజనుల జీవనరీతులనుండియు గ్రహింపబడినవే. గణితము, విజ్ఞానశాస్త్రము మున్నగు ప్రాచీనార్వాచీనశాస్త్రములకు చెందినవే కాక, సంగీతతర్కవ్యాకరణ మీమాంసాదిశాస్త్రములకును, సాంఖ్యవేదాంతాది దర్శనములకును సంబంధించిన యుపమానములు వీరికవితలో

విరివిగా నుండి వీరికా శాస్త్రవిషయముల గల పరిచయమును ప్రావీణ్యమును తెల్పును. పట్టణములు, అరణ్యములు, ఋతువులు, మహాకార్య సంరంభములు మున్నగు సువిశాలవర్ణ్యముల వర్ణనసందర్భములయందు వారుపమలను పుష్కలముగ నుపయోగించిరి. కొన్ని ఉపమలద్వారమున వెల్లడియగు దాసుగారి యభిప్రాయములు వివాదాస్పదములు. సునిశితమైన వారి మేధాశక్తి కంటెకూడ మిన్నయైనది వారి హృదయము యొక్క ఆర్ద్రత. దాసుగారిఅభిప్రాయము లెంత ప్రగాఢములో అంత అగూఢములు. ఉపమానములతో పాత్రలబహిరాకృతులవర్ణనముననే కాక అంతస్తత్వ విశేషణమునందును దాసుగారు నిపుణులు. అంకెలు, దీపావళిసరుకులు, ఎగిరెడుబంతి, దివ్వె మున్నగునవి దాసుగారికిష్టములగు కొన్ని యుపమాద్రవ్యములని వానిని పలుమారులు వాడుటవలన తెలియును. ఒక్క చిన్న యుపమానముతో కరుణలో రమణీయతను, రౌద్రభయానక బీభత్సములలో హాస్యమును పుట్టింతురు దాసుగారు. దాసుగారి ఉపమావిరచనవిధానము విశిష్టము, విపులము, వివిధమునై వారి నాంధ్రవాఙ్మయమున భద్రపీఠాధిరూఢులఁ గావింపఁగలదు" అని.

ఈ యనంతుఁడేమి ? ఆ యాదిభట్టనారాయణార్యు నుపమ నరయుటేమి ?
ఈశ్వరేచ్ఛ యొకటె హేతువు దీనికి శక్తికాదు కీర్తిరక్తి కాదు.



# వచన రచనా వైదగ్ధ్యము

సాహిత్య విద్యాప్రవీణ, భాషాప్రవీణ

**కుమారి కూనిసెట్టి స్వరాజ్యలక్ష్మి**

శ్రీ నారాయణదాసుగారు ఆంధ్రబాణులని చెప్పదగిన వచన రచన చేపట్టినట్టివారు. వారుచేపట్టుట కాదు. ఆ వచనసంపదయే వారిని చేపట్టినది. వీరివచనములు, ఎంతపెద్దవచనమైనను, ఎంతచిన్నవచనమైనను ఒక విలక్షణమైన సౌందర్యముకల్గి, అర్థవిశేషముచే మానసోల్లాసము కల్గించి తీరును. అసలీవచనములు వ్రాయుటలో విశేషమేమి యన్న ప్రశ్నమునకు సమాధానములవంటివి చాలగలవు. కాని సమాధానము మాత్రమొక్కటియే. కవిగతమైన భావమునకు ఛందము నువుపడనప్పుడు ఛందోరీతి నాశ్రయించి చెప్పినభావము మెలికలు తిరగక స్వేచ్ఛాసుందరముగా ప్రకటితము కాజాలనపుడు కవులు సాధారణముగ వచనము నాశ్రయింతురు. కాని మహాభారతాది గ్రంథములలోని అనవుడు, నావుడు, తదనంతరంబ, మఱియు ఇత్యాదులు ఈ కోటిలోనికి రావు. అవి కేవలము అదుకుముక్కలు.

కవియైనవాడు సాధారణముగా పద్యరచన కుత్సహించినట్లు గద్యరచన కుత్సాహము చూపకుండుట సామాన్యముగా మనకు గోచరించును. ఆంధ్రప్రబంధాదులయందలి వచనములు ఒక విధమగు శైలీవిన్యాసముతో పద్యరచనాప్రౌఢివంటి ప్రౌఢితో నొప్పారుట విదితమే. ఆ మార్గమునకంటెకూడ శ్రీమద్దాసమార్గము మిక్కిలి విశిష్టమైనది.

పద్యరచనలయందును మహాకవులు కొన్నికొన్ని సందర్భములలో తత్తదౌచిత్యపరిపోషకముగా వచనముల నాశ్రయించుట కద్దు.

కవులు తమ మనమున మెదలెడి విచిత్రభావమునకు పద్యమున సరియైన సుందరరూపము రానపుడు తమస్వచ్ఛందభావవిశేషమునకు సరియైన స్ఫూర్తికి వ్యక్తీకరణమునకు తగినట్లుగా వచనముల నందు కొనుట కద్దు. అనగా "గదవ్యక్తాయాం వాచి" యను ధాతువునుండి యేర్పడిన రూపము కావున స్పష్టముగా సూటిగా మాటాడుట యని యర్థము. కావుననే మహాభారతాదులయందలి వచనములీయభిప్రాయమునకు పోద్బలకము లగుచున్నవి.

శ్రీమద్దాసుగారి వచనరచన తనకు మిక్కిలినచ్చిన పోతనవచన రచనమునకు మిక్కిలిసరిపడియుండును. పోతనవచనరచనకంటెను వీరి వచనరచనలో విచారింపగా నొకవైలక్షణ్యమే భాసించును.

వీరిజానకీశపథములోని శ్రీరాముడు గూఢచారియై బయలుదేరి వెడలునపుడు కావించిన యీ వచనరచన గమనింపదగినది.

"ఒకభటుండు మాత్రము వెంబడింప దుష్టశిక్షణ, శిష్టరక్షణ దక్షుండగు శ్రీరామచంద్రుడు మారువేషముతో భూలోకముకై స్వర్గము విడుచునట్లు క్రమక్రమముగా సౌధాంతరములనుండి క్రిందికిదిగి నిశీథసమయంబున గోటకావలివారల జాగరూకతం బరికిలించి, సింహ ద్వారంబు వెడలి, యగడ్తవంతెనందాటి, నానావిధఫలవృక్షంబుల వరుసలకు నడుమ నున్నని వెడల్పు లిన్నని రాజవీథియందు జిమ్మకైన నొప్పికలుగని యంత మెల్లగ గడియకొక యడుగువేయుచు, కొద్ది వస్తువునైన గొప్పగగణించు తమ చిరుతచూపుల సహజౌదార్య గాంభీర్యశాంతభావంబు లొప్పార మింటిమబ్బుల వెడదచెవులం జెదర జిమ్ముచు దమహృదయనిర్మలత్వమ్ముం దెలుపు దంతకాంతులు దిక్కుల న్వెన్నెలలుగాయ నల్లపూసనైన శోధించి నిమిషోపాయంబునం బట్టజాలు

తుండాగ్రంబున నేలదుడుచునట్లు ఫూత్కరించుచు దెస లదర ఘీంకరించుచు, నెట్టికష్టంబులైన సహించి యల్పులకు లొంగిన్నైన లోకోపకారంబుగా నడచుటయే జన్మకు సార్థకమనునట్లు మావంతుల వశంబున మేనులంబట్టు కత్తళంబుల నలంకరింపబడి యెంతైనం దమ యౌన్నత్యబలపుష్టులకు సాటిలేదని యిరుపక్కలం జయఘంటలు మ్రోయం నూగుచుం బిల్లకొండలవలె నడ తెంచు నేనుంగులు,"

ఈ వర్ణనమున ప్రతివిశేషణమును గజముల కన్వయించుచు, శ్రీరాముని స్ఫురింపజేయుచున్నది. వెనుకటి రాజులయు, రాజ్యములసిద్ధాంతమును పురస్కరించుకొని రాజు అంగి కాగా, రాజలాంఛనములై పెట్టనికోటలైన గజము లంగములు గావున అంగవర్ణనము, అంగి వర్ణనలో పర్యవసించుట శాస్త్రసంప్రదాయము కావున నీ గజ వర్ణనమున శ్రీరామచంద్రుని స్వభావము మనకు గోచరించుచున్నది. రామునివలె చీమకైన నొప్పికలుగనీయని మందగమనము ఏనుగులకు సహజము. ఇందు మందగమనప్రయోజనము సునిశితముగా వివక్షితము. ఏనుగులకు సహజముగా కన్నులు చిన్నవి. మహారాజుల కటాక్షములలో సహజౌదార్యగాంభీర్య శాంతము లోపార్పుట ఉత్తమలక్షణము. మిన్నునఁ ద్రేలాడు మబ్బులు తమచేతుల కందునవి కావు. ఐనను తమ బహుశ్రుతి విశేషముతో అజ్ఞానమేఘపంక్తులను పారద్రోలుట శ్రీరామచంద్రుని లక్షణము. ఏనుగులకు చెవులు సహజముగా చేటలవలె నుండుట ప్రత్యక్షసిద్ధము. గజదంతములు శరత్కాలచంద్రికా స్వచ్ఛధవళ శీతలములగుట యెంత ప్రసిద్ధియో ఉత్తముల దంతపంక్తియు అంతసితసుందరముగా మల్లెమొగ్గలవలె నుండుటయు ప్రసిద్ధమే. దీనిచే రామహృదయగతమైన నైర్మల్యము వ్యక్తమగుచున్నది. నల్లపూసనైన తమ ఘ్రాణాగ్రములతో దుమ్మొడలించి గ్రహించుశక్తి యేనుగులకు కలదు. అట్లే తన సుదీర్ఘాలోచనముతో ఎంత అల్పాల్పమైన దోషమును సహితము పసిగట్టగలశక్తి రామునకు కలదు. ఏనుగు ఘీంకరించినచో దెస లద

రును. రాముడు కోపగించినచో దశదిశలదరును. ఎంత కష్టమునైన సహించి యల్పులకు లొంగియుండుట గజముకకు సహజము. అట్లే ఉత్తమ వంశమున పుట్టిన, ఆదర్శ ధర్మపరిపాలకుడైన మహారాజునకు ఎంత అల్పులేమన్నను తాల్మివహించి యుండుట సహజలక్షణము. ఎట్లైనను తమ ఔన్నత్యమునకు భంగము రాదని తెలియపరచు ఘంటానాదము ఏనుగుల కిరువైపుల నుండును అవి రామవిషయమున జయఘంటానాదములు.

ఇట్లు విశేషణములు ఉభయార్థసమన్వితములుగా మలచుట అసాధారణమేధాశక్తికి దృష్టాంతము

వీరి వర్ణనము లన్నియును స్వాభావోక్తికి పరమదృష్టాంతము లగుచున్నవి. వీరిచేతిలో ఉపమాలంకారము నానారూపముల ధరించి శైలూషివలెనే మధురసర్తన మొనరించినది.

ఇందలి రెండవవచనము లక్ష్మణుడు సీతను రథమెక్కించుకొని అడవులలో దించివచ్చుట. "తొలుత తలవంచి కష్టపడినంగాని సులభజీవనము దొరకదు. ఆపై నౌన్నత్యంబు జూపవచ్చునన్నట్లు సంసారుల పోల్కి వంగి లేచుచు సుఖదుఃఖంబులం గిట్టిగునేంతంబుల, దమగుర్తు దెల్ప సాధులడెందంబులవలె నిగూఢంబులయ్యు పరోపకారంబుగ బరిణమించునూతులు, — నడిమిదూరము గన్పడనీక పిన్నపెద్దతరగతిగా బార్లుదీర్చి వానకుంజాడలువడు కొండతుదిలోయల పెన్రొదల అరక్రోసుపొడవునంబడి చుక్కలకు బుగ్గలు పొడుచునట్లు, ముత్తెపుతుంపర్ల జిమ్ముచు, సహజకవితాగానంబులకరణి యథేచ్ఛంద్రుళ్ళిపారు తీయని వెండినీటిధారలు." ఈ వచనము అరణ్యవర్ణనముతో సీతావిరహము వలెనే నిరుపమానమయ్యు సోపమమై విరాజిల్లుచున్నది. ఇందలి సుఖదుఃఖానుభవద్యోతకమగు వాక్యము సీతామనఃప్రవృత్తి సంభావితము. మఱియు సహజకవితాగానంబులకరణి యథేచ్ఛం ద్రుళ్ళిపాఱు సెలయేటి

తెలినీటిధారలు. ఇది అచ్చమైన కవిచేయు భావన. ఉపమాలంకారము నూతనము. కవి కల్పితమయ్యును కవిసమయప్రసిద్ధమగుటచే లోకసిద్ధమే యగుచున్నది. ఈ వచనము మహాపర్వతశిఖర నిస్సరన్నిర్ఝరిణీ సముత్తుంగ తరంగాగ్రసుందరమై యున్నది.

ఇక మూడవవచనము వాల్మీకిమహర్షి కుశలవులను రామాయణ గానమునకై ఆజ్ఞాపించిపంపుట, వారలుగానముచేయుట, మొదలగువానిని వివరించును. ఆకుశలవులగానమువలెనే వీరివచనముకూడ చిత్రచిత్రగతులతో, అతివిచిత్రోపమలతో అద్భుతాద్భుతముగా సాగినది. వారి గానము "తుమ్మెదరొదమాడ్కి, తంత్రీనాదంబులు మనంబున హెచ్చరింప, కోయిలలు మ్రోగునట్లు, నెమళ్లు కూయుభంగి, ఔట్లు పేలు కరణి, తారాజువ్వ లెగయులాగున, డింకీపావురంపు మొగ్గలుతీరున, మేల్పటాసా మొనర్చినగతి, చక్రంబులు తిరుగుచాడ్పున, పెగ్గూపోసీలఖదమువలె, అరబ్బీగుఱ్ఱమ్ముల డాంబాజీపసందున, నేపాళపు బుంగలూదునట్లు,నీటిపై విసరినపడ్డ చిల్లపెంకు లెగురుగమనిక, సన్నజాజులజల్లు తెరంగున, కపురంపుటనటిపండ్లోలచుభంగి, మలయమారుతము వీచుసాగసున, కొండ ప్రక్కల మాటిమాటికి హెచ్చు తగ్గులం బొర్లిపడి సుడిగొని రేగు సెలయేటికెరటంబుల విధంబున, పూలచెండ్లాడు పొలపున, గవ్వలు గిలకరించురీతి, తేనియ లూరుతెన్నున, చిత్తజల్లుబాగున, పన్నీరొలుకు పోల్కి, పండువెన్నెల కాచుపోడిమి, అమృతసారంబు గరిమ,"నున్నది. ఇవి ఏమి ఉపమలో?! అచ్చమైన ప్రతిభయన్న నిటు లుండునుకాబోలు. శ్రీమద్రామాయణగానము నిజముగా నిట్లే యుండుననుట తద్విదు లెరుగుదురు.

వీరికుశలవుల వర్ణనమునుండి వారిరామాయణగానమునుండి శ్రీదాసుగారే, వారిసంగీతమే, వారి కథాగానమే, సహృదయుల హృదయములకు గోచరింపక మానుటెట్లు? ఈ విధానము కృతహస్తులు కృతముఖులు ఐనమహాకవుల కబ్బెడిసుకృతఫలము. అందందుకులైన పదము

లతో, దీర్ఘదీర్ఘ సమాసములతో మాలోపములతో మధుమాసదివస సాయంసమయ విస్ఫుటన్మల్లికామంజరులవలె సాహిత్యప్రపంచమున సువాసనలు గుబాళింప చేయునట్టివి వీరివచనములు.

వీరు గాంధర్వరేఖ యని వారి సౌందర్యమును కొందరు చెప్పుదురు. సంగీతసముద్రమని కొందరు చెప్పుదురు. లయబ్రహ్మయని మరి కొందరు వర్ణించుతురు. మహాకవిపరమేష్ఠి యని కొంద రగ్గింతురు. హరికథకపితామహు డని కొందరంజలింతురు. అష్టభాషామహాపండితు డని పెక్కురు ప్రశంసింతురు. నృత్యభంగీపరమేశ్వరుడని మఱికొందరు మెత్తురు. మహాతపస్వియని కొందరు కేలోడ్దురు. సర్వశాస్త్రపారంగతు డని కొందరు వాకొందురు. మహాదాతయని కొనియాడుదురు. ఇన్ని మహాగుణము లేకమై అవతరించిన మహాసారస్వతమూర్తిని దర్శించి నమస్కరించుకొనెడి భాగ్యము లేకపోవుటచే ఆమహాసారస్వతమూర్తిని గురుస్థానమున నుంచి మానసిక పూజగావించుకొందును.

వచనమున కాలంకారికు లెవ్వరును సమగ్రసుందరమగు లక్షణము చెప్పినట్లగపడదు. కాని రీతిస్వరూప నిరూపకుడగు వామనభట్టును, కావ్యాదర్శకర్తయగు దండియు గద్యముయొక్కస్వరూపమును ప్రస్తావించిరి. గద్యవచనములను పదములు రెండును ఏకార్థబోధకము లగుట జేసి పర్యాయపదములుగా యీ వ్యాసమున ప్రయోగింపబడుచున్నవి. వామనుడు "గద్యం వృత్తగంధి, చూర్ణ ముత్కలికాప్రాయంచ" అని సూత్రించి సోదాహరణముగా నీ మూడు భేదములను వివరించినాడు. కావ్యాదర్శకారుని,

> అపాదః పదసంతానో గద్య మాఖ్యాయికా కథా,
> ఇతి తస్య ప్రభేదౌ ద్వౌ తయో రాఖ్యాయికా కిల ॥

అను కారికను రామచంద్రమిశ్రుడు తన ప్రకాశవ్యాఖ్యయందు ఇట్లు భాసింపచేసినాడు. "అస్య గద్యస్య ముక్తక వృత్తగంధి చూర్ణ

కోత్కలికాప్రాయ నామకా శ్చత్వారో భేదా స్సంతి తేఽపి కథాఖ్యా యికయో రేవా న్తర్భవంతీతి తా ననుపన్యస్య కథాఖ్యాయికారూపం భేదద్వయం నిర్వర్తి." వామనుడు గద్యభేదములను మూడింటిని పేర్కొనగా కావ్యాదర్శకారుడు నాల్గింటిని పేర్కొనినాడు. ఈ నారాయణదాస వచనములు వామనసూత్రోదాహరణార్హములు. వామనుని వృత్తగంధి అనగా 'పద్యభాగవద్వృత్తగంధి' అనగా పద్యముయొక్క భాగములుగా ఏవచనమున భాసించునో ఆ వచనమునకు వృత్తగంధి యనిపేరు.

ఉదా:- గజేంద్రమోక్షణమునందలి "చటులవాతధూతశైవాల జలదభీ" ఇందు ఆటవెలది పాదము దొరలివచ్చినది. అంబరీషచరిత్రము నందలి వైకుంఠవర్ణనమున "బాలసూర్య ప్రభా భాసమానంబయి" ఇందు సీసపాదము నడచినది. రుక్మిణీకళ్యాణమునందు రుక్మిణిని తనరథము పై గూర్చుండబెట్టుకొని శ్రీకృష్ణుడు వెడలుసందర్భమున వ్రాసిన వచనమున "చాలు నోహో రుక్మి చలపట్టి బెబ్బులిన్" ఇందు ఆటవెలదిపాదము నిక్షిప్తమయినది. ఇవి వృత్తగంధికి ఉదాహరణములు. సూక్ష్మేక్షికతో పరిశీలించినచో ఇట్టివి శ్రీదాసవచనమునందు పెక్కులు కలవు.

"అనావిద్ధ లలితపదం చూర్ణమ్" అనగా దీర్ఘసమాసములు లేక ఉద్ధతములగు పదములు లేక లలితముగా నుండునది చూర్ణము. ఉదా :- యథార్థరామాయణమునందలి సీతాకళ్యాణఘట్టమున (85 పేజి) "ఇట్లు విశ్వామిత్ర రామచంద్రులు ముచ్చటించుచుండ సిరి యడిగిన ముదుసలివీక ననురాగమున నాకొఱకు చేతు లేల చాచెదు; సిగ్గర మన లక చేతకానపు డొకమూల నడగి పరువుదక్కించుకొనుము" ఇత్యాదులు ఈ వచనముననే కందపద్య పూర్వార్థమందలి మొదటిచరణము నడచుట గమనింపదగినది. "విపరీత ముత్కలికాప్రాయమ్" అనగా దీర్ఘసమాస గుంభితమై, ఉద్ధతపద భూయిష్ఠమై యొప్పారునది ఉత్కలిక.

యథార్థరామాయణమున సామ్రాజ్యసిద్ధి ఘట్టమునందల వచనము (228 పేజి)

> "లంకాపర్యంత సముద్రోర్ధ్వాధః ప్రదేశ ద్వయ సులభ సంచార ధూమశకట వ్యోమమార్గద్వితయ విరచనా నిపుణ బహుల యంత్రప్రయోక్తృజన సంకుల కోలాహల ప్రతిశబ్దిత దశ దిశావకాశంబును" మొదలగునవి కుప్పలుతెప్పలుగా గలవు.

రుక్మిణీకల్యాణము – ఇం దారువచనములు కలవు 1) రుక్మిణి తన యుపాధ్యాయుని శ్రీకృష్ణసమీపమునకు పంపినప్పుడా బ్రాహ్మణుని ప్రయాణవర్ణనము. 2) శ్రీకృష్ణుడు విదర్భాపురమును ప్రవేశించు సందర్భమునందలి పట్టణవర్ణనము. 3) రుక్మిణిని శ్రీకృష్ణుడు రథమున నెక్కించుకొనిపోవు సందర్భములోనిది. ఈ మూడును పెద్దవచనములు. మిగిలినమూడును చిన్నవి. 1) రుక్మిణి దుర్గాప్రార్థనము చేసి కృష్ణ సన్నిధికి వచ్చునప్పటిది, 2) శ్రీకృష్ణుడు పెద్దబావమరదిని పరాభ వించు సందర్భములోనిది, 3) రుక్మిణీకృష్ణులుద్వారకాపురము చేరున పుడు ముత్తైదువులు ఎదురువచ్చిన సందర్భములోనిది. మొత్తమీ యా రును వచనమునకు మచ్చుతునకలవంటివి. ఇందు బ్రాహ్మణప్రయాణ వర్ణనము సాధారణముగా హరికథకులు సందర్భానుసారము అన్నికథల యందును చొప్పించి శ్రోతలకానందమును గూర్చుచుందురు. కాగా నీ వచనములు పద్యాధిక రమణీయములగుట దాసుగారి ప్రత్యేకత. ఎంతటి వాడేని వ్రాసినవచనమున సహృదయు లేలనో ఆదరము చూపరు. శ్రీమద్దాసవచనములయం దనాదరము లేకపోగా ఆదరాధిక్యము కల్గు టకు వారి వచనరచనావైదగ్ధ్యమే కారణము. అసలు వారిసహజమగు వాగ్ధోరణి అట్టిది. "ప్రవేదిరే ప్రాక్తనజన్మవిద్యాః" అను కాళిదాస సూక్తికి శ్రీ నారాయణదాసుగారు ఉదాహరణ మని నా నమ్మిక. వారికి వచనమునందేకాదు, సర్వవిధ సాహితీ ప్రక్రియల యందును విదగ్ధత కలదు. ఆబ్రాహ్మణప్రయాణ వర్ణనవచనము సుదీర్ఘము. దీనిని

పద్యములలో వర్ణించిన నాల్గుపాదములతో పద్యము పూర్తియగును అట్టి పద్యసమాహారముతో నేర్పడిన వర్ణన ప్రియాణగతములైన అదుకులను సూచించును. ఆ వర్ణ్యమాన విషయముయొక్క పరిణామ రమణీయత భాసింపవలె నన్న అద్భుతమగు వచనముండి తీరవలెను. ఈ వచనము పద్యమునకంటె కమనీయము. మల్లెపూవులదండవలె మనోహర భావ పరిమళ పరివృతమై ఒప్పారుచున్నది. ఏసమయమున ఏపదార్థమును వర్ణింతురో, ఆ పదార్థముయొక్క జీవచైతన్యములు హృదయదర్పణమున ప్రతిఫలించునట్లు పాఠకునిమనమున హత్తుకొనుట వీరివచన రచనలోని ప్రత్యేకత. చిత్రమేమనగా వచనము మధ్యలో వాక్యము పూర్తిగాక పూర్వపూర్వవాక్యము ఉత్తరోత్తరవాక్యమునకు హేతువగుచు వేణీన్యాయమున అవశ్యవక్తవ్యాంశమును జారనీక, ఉక్తమెల్ల ప్రకృతోపయోగి యగునట్లుగా మలచుట వీరి కృతహస్తత. ఈతని ప్రయాణములో "తాటిచేదలన్ మంచిమాటలవలె స్వైరువం దీయని నీ రందిచ్చునూతుల దాపునన్" ఇది సాధారణముగా పల్లెటూళ్ళపద్ధతి. "చీమబారులంబోలి సంతపోంతలం గ్రొత్తసరుకుల మూపులు వంగి నడుచు పలుజనముల కోసరిలుచు, నడుప్రొద్దు వేడియెండక మేల్పసిడి కరుగున గ్లైలప్రియపు టొడలం జెమ్మటలు వారం దలచుట్టు దిట్టచూడ్కులం దమకష్టము ఫలింప నెదిగి వెన్నువంచిన చేలనడుమ నిబ్బరపు మనసునం దలనిడు చెట్లదొంతి చెక్కుచెదరనీయక డించి, మగల కలవొద్దిడు కాపు చేడెలను" సాధారణముగా అభిమానవతులైనవారు ఎదురువచ్చువారలకు దూరము తొలగి మార్గమిచ్చుట నేటికిని పల్లెటూళ్ళ కుటుంబినులకు మర్యాదగానే యున్నది.

మరియు ఆటవిక జంతువులు, వానిచిత్తవృత్తులు, వానిక్రియలు, సంచారములు ఏ యే మృగ మే యే విధముగా భావమును ప్రకటించునో వానిస్వభావసౌందర్యములను ప్రతిచిన్న అంశము నేని జావవిడువక ప్రత్యంశమునకును ప్రాణప్రతిష్ఠ చేయు పరమేష్ఠి శ్రీ దాసుగారగుటచే

హరికథలన్నియు హరికథామాత్రములు కాక మహాశిల్పసుందరోదాత్తములగు మధురకావ్యములవలె రామణీయకము నావరించుకొని ముగ్ధకులవధూ దరహాసామలచంద్రికా పూరములవలె ప్రహ్లాదకము లగుచున్నవి. శ్రీ దాసుగారిగ్రంథములయందలి మహాశిల్ప సౌందర్యము ప్రత్యేక ప్రత్యేకముగా చెప్పదగినదియే కాని ప్రసక్తానుప్రసక్తముగా ఉపసర్జనముగా చెప్పదగినది కాదు.

శ్రీకృష్ణవిదర్భాపుర ప్రవేశ సందర్భములోనివచనము కూడ శ్రీకృష్ణహృదయగత రుక్మిణీప్రణయ వృత్తాంతమువలె అన్యక్రియా సమన్వయము లేక ఏకక్రియా సమన్వితమగుట గమనింపదగినది. విదర్భాపురమందలి బడికుఱ్ఱలను సైతము వారువర్ణింపక విడువలేదు. సరస్వతీ స్వరూప సమగ్రత శ్రీ దాసుగారికే సాక్షాత్కరించినది. వారు వర్ణమాలనేర్చు బుడుతలు మొదలు, చెట్టుకొనకొమ్మల తోకలెత్తి దుముకు నుడుతలు మొదలు, పరబ్రహ్మపర్యంతము భేదభావములేక సమానప్రతిపత్తితో వర్ణించి యథార్థమగు నభేదభావమును సోదాహరణముగా ప్రపంచించినారు మహాభావుకుడై ఔచిత్యము నాకళించుకొన్న మహాకవికిని, తాత్త్వికునకును, పరమవైరాగ్యసంపన్నుడగు వేదాంతికిని భేద మంతగా కానరాదు. వీరిలో కవి తానెఱిగిన తత్త్వమును పరమరమణీయముగా కాంతాసమ్మితముగా లోకమున కందించును కావున ఉత్తముడగును. కావుననే "ఋషీణాం పున రాద్యానాంవాచ మర్థోఽ నుధావతి" అని ప్రాచీనులు అర్థవాక్కును సంభావించిరి. అచ్చమైన కవి ప్రాచీనుడా అర్వాచీనుడా అన్నప్రశ్నమున కవకాశము లేదు. భూత భవిష్యత్కాల విశేష సముదాచారములను అప్రయత్నముగా అనాయాసముగా తన కావ్యజగత్తున ప్రపంచించును. అట్టికావ్యప్రపంచ విరించనులలో శ్రీ నారాయణదాసుగారు అగ్రగణ్యులు. వారి సాహిత్యసృష్టియంతయు అద్భుతరసప్రపంచము.

హరిశ్చందోపాఖ్యానము నందలి హరిశ్చంద్ర మృగయావర్ణనాత్మకమగు నీ వచనము "చల్దిగుడుచుచు బెదరించుకాపులును, కావు

లంబోలి వీపులగూర్చుండి యీలబాడు నెత్రింతలకు డెక్కవాటుల నెగిర్చి మిడతలన్ విందొనర్చుచు జెవిలోకవిదల్పుల జోరీగల నెగర జిమ్ముచు బొర్లుటకై మూరొక్కని పండ్లిగిలించుచు నొండొరుల నెనవెట్టి కొమ్మలం గలిసి పోరాడుచు బుట్టల న్వివదల్చుచు హద్దులేని పచ్చికబయళ్ల న్మేయు సొమ్ముల మందలను మందలుగట్టి నల్లతుమ్మ రేవడి బీడుల న్మెసగుచు జెంగున నూడికడొంకలుదాటు లేళ్లును, లేళ్లు కన్గవలం బురడించు నల్లకల్వలు నిండినచెరువుల యొడ్డున బెన్నేరా ళ్ళారగించి పల్కుచిల్కు గుంపులును, గుంపులుబలిసి కటికనేలం బూచి ప్రాకిన చిట్టివాక తుప్పల దరి మెత్తనితివాసులవలె నొప్పు గరికిపరపుల నొడళ్ళ న్బెనుచుకొని పైనిక్కి కూటమిందేలు మగ యాడపాములును, బాములంబోలి బ్రాకుచు నడ్లుదగులునపుడు చక్కిలంబుల పగిది జుట్టుకొను రోకలి బొండల కదుపులును, కదుపులపయి త్రుళ్ళి పరుగిడు కుందేళ్ళ నెగర దన్నుకొని యేగెడు సాళ్వడేగల కిరనగు ముదుసలి చింతమొజ్జ బొర్రిలను, మొజ్జువారి లోభిమొగంబునవలె నిష్ఫలంబైన చిట్టడవిందాటి," ముక్తపదగ్రస్తముతో విలక్షణమగు శైలి నలవరించుకొన్నది. ఈ ముక్తపదగ్రస్తము ఆ వేటాడిన విధానమును, వేటాడునపుడు రాజుల కుండవలసిన సింహావలోకనక్రమపరిపాటిని చెప్పక చెప్పుచున్నది.

తరువాత హరిశ్చంద్రుడు తన రాజ్యమును వదలి కాశికిపోవు మార్గమధ్యము నందలిప్రయాణమును వర్ణించు వచనము క్రమసౌందర్యమును పోషించుచున్నది. ఇందలి యుపమానము లన్నియును సరిక్రొత్తలై ముత్తైపుసరులవలె నొప్పులొలుకుచుండును.

తరువాత హరిశ్చంద్రుడు వీరబాహునకు తా నమ్ముడువోయి ఆతనివెంట చండాలవాటికకు చేరుసందర్భము నందలి వచనము సమస్తపద్యరచనాశిల్పాధికసుందరము. "నానావిధమగు తినుబడివస్తువుల బేరంపురొదలును, బలుధాన్యములు గొలుచు పాటలును, గోటుతో దుకాణమ్ములయొద్ద గూర్చుండి బకధ్యానంబులుసేయు వర్తకులకు

బేరంబులు గుదుర్చుచు మర్గములలోని కండెలవలె దిరుగు దలారుల చమత్కారభాషణమ్ములును, మెత్తని బేరులం బెదరించుచు పాముల వాండ్ర నాగస్వరమ్ములును, మేనులగోసికొంచు రక్తంబులవిదల్చుచు బీభత్సవేషంబుల నడిగికొను మొంటెగూటి యార్పులును, జేదూర్పులును దలమార్పులును బోయినదమ్మిడి వచ్చినడబ్బని చెప్పువాని గిన్నెలో దిరుగు చుక్కలకాయమోత్రలును, వేలాముకూతలును, గంగిరెడ్ల వాండ్ల మెప్పుళ్ళును, లోహకారు పనిముట్ల చప్పుళ్ళును, మఱియు పెక్కురకంబుల గోలాహలంబగు నంగడివీథిం దాటి, యజ్ఞశాలంబోలి పశుహింస కాకరంబై వంటపుట్టిభోజనంబు మాడ్కి సంతతాపవిత్రంబై, జారిణిపోల్కి బరమనీచంబై, కృతఘ్నుకరణి హేయంబై నాస్తికునిరీతి వేదబాహ్యంబై, నవనాగరకమతంబుతీరున హాస్యాస్పదంబై, శత్రునికైవడి మార్గదూరంబై, గర్వితదృష్టి దెన్నున నిమ్నోన్నతంబై, సేవకు తెరంగున కష్టజీవనంబై, శుష్కవైయాకరణుపోలుపున యుక్తివిరహితంబై, శక్తిహీనుసొబగున బరుషభాషణంబై సత్యమట్లు బహుజనవిరుద్ధంబై, పతివ్రతచెన్నున బరాస్పృష్టంబై, దేవునివైఖరి సర్వశంకితంబై, పెద్దింటిగుట్టువలె బట్టబయలైన చండాలవాటికం జేరునంత" ఇది అచ్చమైన బాణునిశైలి. "ఉపమైక శరణాః కవయః" అను ఆభియుక్తోక్తికి శ్రీదాసవచనసంపద వ్యాఖ్యానమువంటిది. ఇందలి ఉపమానములు బాణకవిచే స్పృశింపబడనివి కొన్నికలవు. కొన్నియననేమి పెక్కులుగలవు. అనగా బాణుని వచనరచనా విధానమునకును, శ్రీమన్నారాయణదాస వచనరచనా విధానమునకును ఆకారమున సాదృశ్యమే కాని అంతర్యమున సాదృశ్యము లేదు. ఇందలి ప్రతి ఉపమయు తద్విశేషణమును, త్రిప్పి యర్థము చెప్పిననేకాని సొగసీయదు. ఇది కాదంబరీపద్ధతియే.

అంబరీషచరిత్రమున దుర్వాసుడు చక్రాయుధపు బారినుండి తన్ను రక్షించుకొనుటకై కైలాసమున కేగినాడు. అందు పరమేశ్వరుడు తాను

సంరక్షింపలేనను విషయమును వెల్లడించి వెన్నునిమహిమ చెప్పుచు, తన కా వెన్నునివలన కల్గినకామ మోహములనుగూర్చి, అవమానమును గూర్చి ప్రసంగించువచనము శృంగారరసరంజకమై సవయస్కులగు నాయికానాయకుల వాక్చాతుర్యములతో నొప్పారుట వీరి సర్వతోముఖ ప్రజ్ఞకు తార్కాణము.

తమయధికారముద్ర తమకుండనేయున్నది. అందుచూర్ణము ఉత్కలికాప్రాయము వృత్తగంధి యను వచనవిశేషములు శ్రీవారి చేతిలో మెఱుగులు తీరినవి. అంబరీషచరిత్రలోని రెండవవచనము శ్రీ వైకుంఠవర్ణనము. ఆ పురము మహిమంబులు వర్ణించినప్పుడుగాని కవికి గల కవిత సార్థకముగాదని పద్య గేయముల నందుకొనక వియన్నదీ వినిర్మలగంభీరతరంగమాలామనోహరముగ వచనము నందుకొనుటలో వారి ఆంతర్యము తేటతెల్లమగును. వర్ణనీయపదార్థవర్ణనమున కవికి వచనము మిక్కిలి యుపకరించునన్న తాత్పర్యము వీరి కున్నట్లుతోచెడి. నేత్రేంద్రియమునకు గోచరము కాని తత్వమును ప్రత్యక్షములైనపదార్థములతో పోల్చి, ప్రస్ఫుటింపచేయు నేర్పు మహర్షులకు వలెనే వీరికి సమృద్ధిగా గలదు.

గౌరప్పపెండ్లి తెలుగుపెండ్లి. ఇందలి 'మాట' = (వచనము) సన్నజాజిపూవులదండవలె మధురార్థవాసనాప్రకటమనోహరమై అచ్చ తెనుగుందన మిట్లుండునని సప్రమాణముగా ఋజువు చేయుచున్న ట్లున్నది. చిన్నచిన్న పదముల కలయిక, వానితోడి సమాసములు, ముత్యముల ముగ్గులవలె ముచ్చటలు కొల్పుచున్నది. ఉదా :- "అనుచు మెడపొంగించి, పలుజిగిబిగు లగపర్చు నూసరవిల్లివలెఁ దలనాడించుచుఁ, గదల కాఁగక తూఁగుటుయ్యాలతీరున నుట్టూతలూఁగుచు, నేమో చెప్పమఱచిన తెఱగున వెళ్ళినట్లేమళ్ళుచు, నెమ్మోలాడీ నిన్విడిచి పోవు టకుఁ గాళ్ళాడకున్నవే..............నుడిగొను నీ లోతుపొక్కిలి, పిడికిటనిమిడి యసియాడు నీయలంతికౌను,..............నీ కెంగోళ్ళు,

నీ కెంపుటడుగులు, గండుచీమచాల్పు న్మఱపించు నీనూఁగారు, ...... నీతళ్కు-బెళ్కు-లు, నీతీయపల్కు-లు, నీ తెల్వితేటలు, నీపార లేని యుల్లము..............యదిగో నన్నోనీ వుండనీ వక్కటా, నీకు జాలిలేదా, న న్నెందుకాడించెదవు, పనిలేకమరులు గొల్పెదవా...... వండనియింటికినిప్పురాయిడివలె నే తగులాటమైన నెఱుగని నా కేల నీలేనిపోనిగొడవ వట్టిమిట్టిపాట్లు, నాకన్న వేఱుదినుసుండనీ, మానని యే దెట్లున్న నేదరకాఁడనా" ఇందలి పలుకుబడులు, పదవిన్యాసము, వసంత మల్లికలవలె హృదయమును సముల్లాసింపచేయుచున్నవి.

చివరిదగు పార్వతీపరమేశ్వరకళ్యాణ సందర్భమున, ఆవైభవ మును వర్ణించినతీరు, వచనమున నే దప్ప మఱియొకదాన నొదుగదు.

గజేంద్రమోక్షణమున నున్న వచనమొక్కటియే యొక్కటి. అన్నివచనములొకయెత్తు. ఈ వచనమొక్కటి యొకయెత్తు. ఇది సార స్వత సారభూతమైన వచనము. "చటులవాతధూత శైవాలజలద భీత రాజమరాళక్షిప్త పక్షంబులు సితపటచ్ఛాదితోరుతాళవృంతంబులై చెలంగ, సితరక్తనీలోత్పలంబులు విచిత్రదీపంబులభంగి వెలుంగ, బద్ధాంకురంబులం చంచువులఁద్రుంచి నమలు రాజచక్రంబులు తాంబూలచర్వణానందకందులైన రాజచక్రంబులుగ విలసిల్ల, దరదర విందమరంద బిందు సందోహాస్వాదన తుంది లేందిందిర నిస్వ నంబు వీణాగానంబయి రాజిల, హరినీలమంటపంబుపై భాసిల్లెడు దివ్య గానసభగా నద్దానిబ్రమసి డగ్గర విమానంబులు డిగ్గనురికి, వడివడిదడబడి యందుఁజొచ్చి యయారే మోసపోయితిమని తడిసినపుట్టంబులు పిడుచు కొనుచు మరలవిమానంబులకేగు కిన్నరకింపురుష వియచ్చరుల కలకల ధ్వనులును, గలధ్వనుల మింటికెగసి యల్లాడుచు బాకీనంబుల నొడిసిపట్టి తిను నీటిపెట్టలును, బెట్టలకై మట్టుమీరి. నెట్టనజగడంబుల నెట్టుకొను పొట్టిబాతుల మొత్తంబులును, మొత్తంబులై పైకిదేలి మిట్టిపడు మిట్టలంబట్టి మ్రింగుచు దోబూచిజూపుచు మునింగితేలు కారండవంబు లును గలిగి రామాయణ భారత భాగవతామ్నాయంబుల తెరంగున

సుగ్రీవ పాండవ బృందావన మహిమాభిరామంబై, హరిభంగి హరిభంగి నింబారంభాయుతంబై, రాముగరిమ రాముగరిమ దాలభూజాంకితంబై, సుకవిభాషణంబు తెరంగున శ్రోత్రోత్సవంబై, సుందరీరత్నంబుభాతి నేత్రపర్వంబై చిత్రిణీజాతిస్త్రీవిధంబున జంచలరసయుతంబై, యోగిహృదయంబు పోలిక గంభీరంబయ్యును ప్రసన్నంబై, రాజముఖంబువలె రమణీయంబయ్యును భయంకరంబై, నలుచదరంబై, యతులవిస్తీర్ణంబై, వెలయు నప్పంకజాకరంబుం బొడగని" ఇందలి సుగ్రీవ పాండవ బృందావన శబ్దములు రామాయణ భారత భాగవ తార్థములలో కమలాకరార్థములో శ్లిష్టములై యున్నవి. రామాయణభారతార్థములయందు సుగ్రీవ పాండవ శబ్దములు వ్యక్తివాచకములు. కమలాకరపక్షమున జలపక్షివాచకములు. 'హరిభంగి హరిభంగి నింబారంభాయుతంబై' ఇందలి యొకహరిపదమునకు వాక్యపదీయకర్తయగు నింబార్కాచార్యునకు నామాంతరము. (చూడుడు శబ్దస్తోమమహానిధి) రెండవహరి పదమునకు దేవేంద్రు డనియర్థము. కావుననే రంభాయుతత్వము. పై బృందావనపదము భాగవతార్థమున సంజ్ఞావాచకము. కమలాకరపక్షమున వనసమూహార్థకము. 'రాముగరిమ రాముగరిమ తాలభూజాంకితంబై' మొదటిరాముపదము బలరామవాచకము. కావుననే తాలాంకితత్వము. రెండవరాము పదము శ్రీరామవాచకము. కావుననే భూజాం (సీత) కితత్వము. కమలాకరపక్షమున తాలనామకవృక్షసహితత్వము. 'సుకవిభాషణంబు తెరంగున శ్రోత్రోత్సవంబు' ఇందు కమలాకరపక్షమున సుకవిశబ్దము రాజహంసార్థకము. 'యోగిహృదయంబుపోల్కి గంభీరంబయ్యును, ప్రసన్నంబై' ఇచట గంభీరప్రసన్నభావంబులు రెండును ఏకత్ర వినివిష్టంబు లగుట విశేషము. 'రాజముఖంబువలె రమణీయంబయ్యును, భయంకరంబై' ఇందలి రాజపదము ఒకపక్షమున చంద్రార్థము, మరియొకఅర్థము భూపతివాచకము. ఇందునుముక్తపదగ్రస్తము గలదు. ఇక నీయుపమావైవిధ్యమనునది యొకప్రపంచమే. శ్రీ నారాయణదాసుల ఉపమావైవిధ్యమును గూర్చి శతపత్రములుగా వ్రాయ

వలసినదియే కాని చిన్నిచిన్ని వాక్యములతో చెప్ప నలవికాదు. ఈవచనోపసంహారము ప్రత్యేకముగా గమనింపదగియున్నది. ఈనిర్వాహణము, ఈచిత్రణము, అసలీపోలికలే అగమ్యములు. బుద్ధియందు స్థిమితములేని చిత్రిణీజాతిస్త్రీకిని, అందలి చంచలమైన రసము (జలము) నకును పోలిక లెందరు చెప్పగలరు. యోగిహృదయమే గంభీరమయ్యును ప్రసన్నమగునట. రాజముఖము రమణీయంబయ్యును భయంకరమ్మట. యోగిహృదయగత గాంభీర్యమును రాజముఖగత రామణీయకమునే పెక్కురు కవులు ప్రపంచించిరి కాని ఆవెనుకనున్న ప్రసన్నతను, భయంకరతను చెప్పగలధైర్యము చాలమందికి లేదు. ఆవివేకమును తక్కువయే. ఆ నిర్భీకత ఆవివేకశాలిత దాసుగారిసొమ్ములు.

యథార్థరామాయణము మిగిలిన హరికథలకంటె బహువచన భూయిష్ఠము. వచనములపుట్ట యనవచ్చును. ఇందిరువది వచనములున్నవి.

యథార్థరామాయణము నందలి సీతాకల్యాణమున నీవచనమున విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులను తోడ్కొని తన సిద్ధాశ్రమమున కేగు మార్గమధ్యము నందలి యరణ్యప్రాంతప్రదేశమును వర్ణించినతీరు సహజసుందరము. అందలిమృగముల మెలకువలు వానికిఁ దగిన ప్రాకృతిక విశేషములు బొమ్మగీసిన వడువున మనోగ్రాహ్య మగునట్లు చేసినారు. "సైనికులవలె తమపిల్లలకు వేటమప్పుచు జెరలాటమాడు బెబ్బులులన్, రాచప్రాపున విఱ్ఱవీగుచు బెద్దల నిరసించు నల్పులవలె మెట్టకొనలం గంతులిడు చీసడించు కొండమేకలన్, గొండమేక లుండుగుట్టల కెక్కజాలక వానిగని యూటలూరుచు నందరానిపొందున కాశించు క్షుద్రజాతులవలె నోరావులించుకొని చూచు నక్కలన్, నక్కనైచ్యంబులం గొంగజపంబులన్, సిరిగలవారి పంచలం బట్టి వ్రేలాడు యాచకులవలె మట్టియూడల నూగులాడు - మర్కటంబులన్................."

ఇందు రామలక్ష్మణులు మరలమరల తిరిగితిరిగి యరణ్యవిశేషమును తిలకించుట ముక్తపదగ్రస్తముతో నభివ్యక్తి చేసినారు. వచనాంతమునం

దలి ఉపమోత్ప్రేక్షలు నిరుపమానములు. ఆనాడు విశ్వామిత్రుని వెంట నరిగిన రామలక్ష్మణులు నిజముగా నే యే యరణ్యముల నెట్లు చూచిరో గాని శ్రీ నారాయణదాసుగారు మాత్రము అద్భుతావహములగు ననేక సన్నివేశములను సహృదయ హృదయములకు గోచరింపచేయుచున్నారు.

విశ్వామిత్రునితో రామలక్ష్మణులు మిథిలాపురిని చేరి యందందు గల దాని వైభవమును పరామర్శించు సందర్భమునందలి వచన మొక యద్భుతప్రపంచము.

ఈవచనమున నంతర్గతమైన హాస్యరేఖ సత్యముతో పెనవడి యారా యనిపించుటను మనము చూడగలము. వారి నానా దేశాటనానుభవములను నానావిధములుగా నుపమారూపమున మలచి మనకు గూర్చెడి వారి యోర్పు నేర్పులు నాన్యతో దర్శనీయములు.

సీతాకళ్యాణమున రెండవ వచనములో సూర్యాస్తమయ చంద్రోదయవర్ణనము లనిదంపూర్వములు. ఇవిపూర్వమహాప్రబంధముల నిబద్ధములైనను ఆభావములను ప్రపంచించెడి తీరున చాలభేదము కలదు.

ఇం దే యే యనుభవములను కోరువారు ఏ యే విధములైన భోగముల ననుభవింతురో వారిసంస్కారము వారి నాగరకత యచ్చుపడునట్లు వర్ణించినారు. బాల్య కౌమార యౌవన వార్థకదశలయందుండెడి పరస్పరభిన్నములైన మార్పులు, ఆ మార్పులలో వారివారి సంస్కారముల ననుసరించి యే యే విధములైన వాంఛావిశేషములు కల్గునో అవి యనుభవదూరము లైనపుడు వారితీరు లెట్లుండునో ఇవి యన్నియు ఈవచనమున సుస్పష్టములు. వివాహమునకు పూర్వమే సీతారాములు వినుకలి కనుకలి వలని విరహవేదనము నందుట, దానిచే వీరు క్షణ మొక యుగముగా గడుపుట, శ్రీ నారాయణదాస హృదయ దర్పణప్రతిబింబితమైన దీసన్నివేశము. ఇదియవాల్మీక మగునుగాని యసంబద్ధము కాదు.

దాసుగారి వచనపు తీ రేమోగాని వచనము ననుసరించి మనము గూడ ఆ దేశము ఆ కాలము ఆ లోకముల లోనికి చొచ్చుకొని పోవుదుము. ఆ సీతారామలక్ష్మణులతో నడవుల సంచరింతుము. వారివలె పెద్దబండలపై కూర్చుందుము. ఆ సెలయేటినీటి తుంపురలలో తడియుదుము. ఆ నెమళ్ళు, ఆ చిలుకలు, ఆ గోరువంకలు, ఆ లేళ్ళు, వానితో మనకు హార్దమైన సంబంధము కల్గును.

తర్వాతిది శ్రీరామచంద్రవర్ణనము. ఈవచనము ప్రత్యక్షర ముదాహరణార్హ మగుటచే (127పుట) సూచించుట యైనది. సంస్కృత మున వాల్మీకి యెంత ఒడుపుగా శ్రీరామచంద్రుని వర్ణించినాడో యంతకు వీసమేని వెనుదీయని విధముగా వీరు శ్రీరామచంద్రుని వర్ణించినారు. వీరి తెలుంగుపలుకుబడి యిట్టిది. చివరి కామునీశ్వరులు శ్రీరాముని దర్శించి దర్శించి, ప్రత్యంగంబు మిక్కిలితడవు భావించి భావించి, చివరికి "శ్రీరామచంద్రుడిట్టివాడని వర్ణింపదగు శబ్ద మొక్కటియైన స్వయముగా వాగ్దేవి మానాల్కన్ నిల్పినచో మేము వర్ణింపగలము" అనిరి. సీతారామలక్ష్మణు లడవులకు పోవుచుండగా ప్రకృతీశ్వర జీవులు ముువ్వురును మూర్తీభవించి నట్లున్నారట. ఈ యనుభవము వచ్చుట కెంతటి లో వెలి చూపు కావలెనో తాత్త్వికు లెరుగుదురు. తాత్త్వికునకును అచ్చమైన కవికిని భేదము లేదు. ఈ తాత్త్వికత ఈకవిత అను రెండు ధర్మములును మూర్తీభవించినవారు శ్రీ నారాయణదాసుగారు.

హనుమత్సందేశమున వర్ష శరదృతువుల సమ్మేళనము వర్ణింపఁబడినది. వాల్మీకమునందలి వర్షర్తువున యుపమాలంకారములు సెలయేళ్లై ప్రవహింపగా, శ్రీ నారాయణదాసవచనములయందు ఉపమాలంకారములు స్వభావసిద్ధములై మహానదీన్యాయమున సముత్తుంగ తరంగ సంగీతభంగీ మంగళమ్ములై నర్తించినవి. అస లీవాలకమే వేఱు. ఏ వస్తువునుగాని, యే ఋతువునుగాని, యే పట్టణమునుగాని, యే పరిసరమునుగాని, యే వ్యక్తినిగాని, వర్ణింప మొదలిడినచో చిత్రమేమోగాని

యందలి యంశాంశములు సైతము జారిపోక యనుగతముగా రజ్జుబంధ న్యాయమున యనుగమించివచ్చుట వీరిప్రత్యేకత. పోతనగారి భాగవత మున యుపమాలంకారబంధురములగు వచనము లున్నవి. కాని యిట్లు న్నవా? ఆజాతి వేఱు, ఈ జాతి వేఱు.

ఈ వచనోపక్రమోపసంహారములు కాదంబరీప్రతిబింబములై కామనీయకము లగుచున్నవి. విరోధాభాసలు, వివిధభావాభివ్యక్తీకరణ ములు అనల్పకల్పనాగౌరవములు ననన్యసాధ్యములు. వీనిని ప్రత్యేకించి చెప్పవలెనన్న వ్యాసము గ్రంథరూపము నొందును.

హనుమత్సందేశమునందలి రెండవవచనము కపివీరులు దక్షిణ దిశను వెదకుటకై బయలుదేరుట 'కట్టెతో కైలాస మేగ నుంకించు ముముక్షువుల లాగున.........నిద్రాశనపానంబులకై వస్తున్న దేహ ధారులకై వడి, నిత్యసంతుష్టికై సంసారులవడువున' సీతాసందర్శనార్థమై కపులు ప్రతీక్షించుచున్నారు.

వీరు ఈ రెండు మాట లెట్లనిరో! వారి భావనాప్రపంచమున నిది గోచరించెనో! లేక మహాకవితాతపస్వులగు వీరు భవిష్యమ్మును ప్రత్యక్షము చేసికొనిరో! ఏమో కాని యిట్లు పల్కిరి. ఆమాటలివి. "పూర్వపశ్చిమభూగోళంబులకు రాకపోకలకై ఏకబిలమును ధ్వంస యత్నించు క్షేత్రగణితజ్ఞులవలె, కుజమండలంబుతో తంత్రీవార్తలేర్పర్చ నూహించు శిల్పులకరణి" ఇవి కూడచంద్రలోకయాత్రవలె సత్యములు కావచ్చును. బుధు డూహించి చేయు కల్పనమున కన్యథాత్వము కలు గదుగదా! ఇట్లే ఇంకను అనేక వచనములు, వర్ణనములు వాగింద్రజాల సౌందర్యహేలాసాంద్రములు గలవు.

---

గమనిక : దాసుగారి 'వ్యాస పీఠము' అను గ్రంథమున ఉత్తరభాగమున వారి హరికథ లందలి చక్కని వచనము లనేకము గ్రహింపబడినవి.

— సంపాదకుడు.

# సారస్వత తీర్థంకరుఁడు

డాక్టర్. శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావు M.A., Ph. D.

"హరికథా పితామహు డగు ఆదిభట్టదాను సంగీతం సాహిత్యం సరితూచే త్రాసు." అన్న 'శ్రీ శ్రీ' మాటలు ప్రత్యక్షర సత్యములు. సంగీత సాహిత్యముల రెంటను సమాన పాండిత్యము గలవారు కళారంగమునఁ జాల సకృత్తుగా నుందురు. ప్రాచీనాంధ్రకవులలో నన్నయ, భట్టుమూర్తులవంటి యే యొక రిద్దరిలోనో తప్పఁ, దక్కినవారిలో నీ రెంటి ప్రాభవము గానరాదు. నన్నయ 'ప్రసన్నకథా కలితార్థయుక్తి'ని సాహిత్యమునకును, నాతని 'యక్షరరమ్యత'ను సంగీతమునకును, ఫలములుగా నెంచవచ్చును. ఇఁక భట్టుమూర్తి సాహిత్యప్రతిభ సర్వసాహితీ వేత్తృలోక విదితము. 'సంగీతకళారహస్య నిధి' నని సంగీతమునఁ దనకుండిన ప్రజ్ఞనుగూర్చి తానే చెప్పికొనినాఁడు. తక్కినవారిలో నీ రెంటిలో నేదేనొక పాలు హెచ్చుగా నుండెనే కాని సమానములు కావు. తిక్కనాదులయందు సాహిత్యము పా లెక్కువ; సంగీతము పాలు తక్కువ. త్యాగరాజాదులయందు సంగీతముపాలు హెచ్చు; సాహిత్యముపాలు లొచ్చు. సరస్వతీ స్తనద్వయమువలె సంగీతసాహిత్యములు సమప్రమాణములుగాఁగల పుంభావసరస్వతి నారాయణదాసు.

సాహిత్యరంగమునఁ దిరుపతికవు లెట్టివారో, హరికథా కథన విషయమున నారాయణదాసుగారట్టివారు. తిరుపతికవులు కవిత్వమున కెంతటి ప్రచారమును గావించియుండిరో, దాసుగారు హరికథా విధాన

మున కంతటి ప్రచారమును గావించియుండిరి. తిరుపతివారికిఁ బద్యము నల్లఁగల యెల్లరును బ్రత్యక్షముగనో, పరోక్షముగనో, యెట్లు శిష్యులో, దాసుగారికిని గజ్జెకట్టిన హరిదాసు లెల్లరు నేదో విధముగ శిష్యులే.

హరికథకునకుఁ గావలసినవి కేవల సంగీత సాహిత్యములే కావు. నృత్యము తెలియవలయును. కొద్దిగనో, గొప్పగనో కవిత్వము చెప్పఁ గలిగియుండవలయును. అన్నియు నున్నను, జమత్కృతిమత్కథన దక్షత లేనిచోఁ గథ రక్తికట్టదు. హరికథ వివిధకళా సమాహారమయిన యొక విశిష్ట కళ. అట్టి కళలో నెంతయుఁ బరిణతుఁడు నారాయణదాసు. అతఁడు హరికథా పితామహుఁడు.

దాసుగారి సాహితీమూర్తి సర్వతోముఖమయినది. ఆయన హరి కథలను వ్రాసిరి. శతకమును వ్రాసిరి. వేదాంతగ్రంథములను వ్రాసిరి. ధ్వని కావ్యమును (Allegory) వ్రాసిరి. అచ్చాంధ్రముపై నాయన కున్న యభిమాన మతిస్వచ్ఛమయినది. ఆ బాసలో నాయన రచించిన గ్రంథములే యాయన కందుండిన రక్తిశక్తులకుఁ దార్కాణములు.

ఆయన రచనలోఁ గొట్టవచ్చినట్టు కనుపట్టునది యాయన దృష్టాం తోపమాలంకార ప్రయోగ కుశలత. ఆయన రచించిన సూర్య నారాయణ శతకమునుండి యీ క్రింది యుదాహరణములను జూడుఁడు.

సరిగా వేదములెల్ల రువ్వియును శాస్త్రంబుల్ గడున్ గ్రోలియున్
గురుబోధల్ వినియున్ నిజానుభవమున్ శోధించియున్ మర్త్యుఁ డె
ట్లెఱుఁగున్ నీదగు నిత్యతత్త్వ మహహా "యేండన్ గనంజాలునే
ధర నెందైనను గుడ్లగూబ" పరమాత్మా ! సూర్యనారాయణా !

"అమరన్ బంగరునుండి దానిదగు చాయన్ వేఱుసేయంగ శ
క్యము కానట్టుల" నిజ్జగం బెడపరా దయ్యారె నిన్నుండి చ
"క్రమునం గోణమురీతి" నారయఁగ నీ త్రైలోక్య మేపారి నా
శము నీ యందునఁ జెందుచుండుఁ బరమేశా సూర్యనారాయణా.

అయ్యా మానవు తెల్వి వ్యర్థముసుమా యా "మూఁగనాల్కట్లు,"
భవదీయాంఘ్రి సరోజ భక్త్యమృతముం బల్మాఱు నాశించు నా
కవురా "పద్దనఁ బెండ్లియన్నటు" లిదేలా శుష్కవేదాంత త
త్త్వ విచారంబు.

సులభాస్వాదన మెట్టు లబ్బు నిఁక "నోర్ సూచీబిలంబంత యాఁ
కలికొండం తను నట్టు" లాయు పరయంగా నల్ప సిద్ధాంతిలో
పల ఖోగేచ్ఛ ఘనంబు.

"పాముంజావదు కట్టియున్ విఱుగదన్ వార్తానుసారంబుగా"
సామర్థ్యంబున వస్తుశోధన యెడన్ శంకా సమాధానముల్
సీమం బొందవుగాన జ్ఞానమునఁ దుష్టిం జెందరాదెందునన్
స్వామీ నీ పదభక్తి యోగమునఁ దప్పన్ సూర్యనారాయణా.

ఇమ్మాడ్కిన్ భవదీయ నామ సుధఁ గ్రోలింపన్ సదా తుచ్ఛ భో
గమ్ముం జిత్తము గోరు, "మోదకము వేడ్కన్ మేప శ్వానం బఖా
ద్యమ్ముం దబ్బిన మెక్క నేగునటు" లిద్ధాంతిన్ భళీ నైజ ధ
ర్మమ్ముల్ మానుప నేరి శక్యము మహాత్మా సూర్యనారాయణా.

లోకోక్తులను సందర్భశుద్ధితోఁ బ్రయోగించుటయం దీకవి మిక్కిలి నిపుణుఁడు.

"వెనుకొం.తం దలక్రిందఁ బెట్టుకొని యుర్వీజాలకై దేవులా
డు నటుల్" మామక చిత్త పద్మమున నెప్డున్ బాదుకొన్నట్టి ని
న్ను నజప్రాశ్రిత వత్సలున్ భువనబంధున్ మాని యారోగ్య మి
మ్మని నే మర్త్య భిషక్కులఁ దలఁపనేలా సూర్యనారాయణా.

"ఏకే మే కయినట్టు" సంసృతి మదీయేచ్ఛాకృతంబయ్యు నా
కాకల్పించెను శోకబంధ మన నేలా మెట్టవేదాంతి ?

అవురా "గొంగళిలోనఁ దించుఁ దలపోయన్ వెండ్రుకల్ లెక్కసే"
యు విధిం' దప్పులు పట్టుచుంద్రు కడు నన్యోన్యంబు విభ్రాంతులై
యవనింబండితమానులౌ జనులు.

చిన్నప్డే నిను నమ్ముకొంటి నిఁక "నీచిత్తంబు నా భాగ్యము,"

అలరంగా జగమెల్ల వెట్టియె కదా యా ''వెట్టికిన్ వే విధా
లిలలో నెవ్వని పిచ్చి వానికి ముదంబు.''

ఆయన రచనలలో నిట్టివి శ్లోకొల్లలు.

అర్థాలంకారములే గాక దాసుగారి కవితలో నెడనెడ శబ్దాలంకారములు గూడఁ గలవు. ఈ క్రింది పద్యములందలి యంత్యానుప్రాస మెంత సహజసుందరముగా నున్నదో చూడుఁడు.

వనజంబుల్ కనువిచ్చిచూడఁ, గలువల్ వాడన్, దమంబూడఁ, జె
ల్మిని జక్రంబులు గూడఁ, దెమ్మెరలకున్ లేఁదీఁగెలల్లాడ, వే
డ్కను నానా విధ పక్షి సంఘములు పాడన్, దాపసుల్ వేఁడ, నీ
వనురాగంబునఁ దూర్పునం బొడమె దయ్యా సూర్యనారాయణా.

ధనమా రాదు, దురాశ పోదు, పరతత్త్వజ్ఞానమా లేదు, యౌ
వనమా నిత్యము కాదు, వార్ధకమునన్ వామాక్షియొఁ జేదు, జీ
వనమా యెన్నఁగఁబాదు దుఃఖములకుం బల్మొఅటుల్ గావునన్
నిను నేఁ గొల్తు నిఁకేల వాదు ? దయఁ గన్మీ సూర్యనారాయణా!

దాసుగారి వైదుష్య మసాధారణము. సంస్కృతాంధ్రములయం దాయన కపారమగు పాండిత్యము గలదు. సంస్కృత సమాసములను దేశ్యశబ్దములతో జోడించి యీతఁడు పద్యము నతి మనోజ్ఞముగాఁ జేయును. దీని కెన్నియేఁ బద్యము లుదాహరింపవచ్చును.

తనరంగా భువనైక సుందర వధూ దంతచ్ఛదా స్వాదనం
బునకై గాదు త్రిలోకరాజ్య విభవంబుం బొందఁగాఁ గాదు శా
స్త్ర నిరూఢ ప్రతిభా విశేష మగు పర్వన్ గోరికా దక్కటా
నిను సత్యంబుగఁ జూడఁ గేడ్చెదను దండ్రీ సూర్యనారాయణా.

తమముం గొట్టు ఫిరంగిగుండ, యవధూతల్ పోవు కైవల్య గే
హ మణి వృత్త నిదానమా, సకలరోగారణ్యదావాగ్నిచ
క్రమ, మందేహ ధరాధర ప్రబల వజ్రంబా, త్రిమూర్తిస్వరూ
పమ యింకెట్టుల నిన్నుఁ బిల్వఁగల నప్పా సూర్యనారాయణా.

అచ్చతెనుఁగుపై నాయన కున్న యభిమాన మసమానము. ఆ బాసలో నాయన గ్రంథములకు గ్రంథములే రచించెను.

ఋక్సంగ్రహమును మొక్కుబడి యను పేర నొక యచ్చ తెనుఁగు గ్రంథముగాఁ దెలిఁగించెను. అచ్చతెనుఁగు మేలిమిని గొండా డుచు 'నచ్చతెలుఁగు పల్కుబడి' యను నొక చిన్నపొత్తమును గూర్చెను. అది యాయన కచ్చతెనుఁగుపైఁ గల నిట్టలమగు బత్తికిఁ దారకాణ, ఇంకను పార్వతీకల్యాణమును దాసుగారు గౌరప్పపెండ్లిగా నచ్చతెనుఁగున రచించిరి. మఱియు భగవద్గీతను వేల్పుమాటగా నాయన యచ్చతెనుఁగులో రచించిరి. మత్తేభవిక్రీడితమును నేనుఁగుచెఱలాట యనియు, శార్దూలవిక్రీడితమును బెబ్బులి చెఱలాట యనియు, నుత్పల మాలను గలువదండ యనియు నిట్లు పద్దెముల పేర్లనుగూడఁ దెలిఁగిం చుట చూడనగును. సింహాచలదేవునకుఁ దెలుఁగు రెంటత్రాగుడుతిండి మెట్టంటువేల్పు. (రెంటత్రాగుడు = ద్విపము; రెంటత్రాగుడుతిండి = ద్విపములఁదినునట్టిది, సింహము; మెట్టు = అచలము, సింహాచలము; సింహాచలము నంటువేల్పు = సింహాచలముననుండు దేవుఁడు.) అచ్చ తెనుఁగు బాసపై నాయనకున్న యభిమానము నాయన యచ్చతెలుఁగు పల్కుబడి' యను గ్రంథమున నెట్లు వ్యక్తముచేసెనో చూడుఁడు.

తీయని మెత్తన తేఁట తెల్లంబు
నుడులలో నచ్చతెనుంగు నయంబు
అచ్చతెనుఁగువార లచ్చతెనుంగు
తెలియనియెడ వారి తెల్వి దొనంగు
తేట తీయని యచ్చ తెనుఁగు రాకున్నఁ
దెలుఁగువారి కిఁకెద్ది తెలియుట సున్న
పుట్టు పల్కెంతయుఁ ముద్దుల మూట
కొన్ని తెచ్చుకొన్న తెగుల్ పెఱమాట.
కుళ్ళాయి పెట్టిన కోఁతి రాజగున
వింత నుడులవాని పెద్దనఁ దగున.
మానిసి వేలుపు మాటాడరాదు
నంబి జన్నముచేయ నాయము కాదు.

వేల్పుబాసకుఁ దల విఱిచిన తెనుఁగు.
నీరుల్లిపాయ కంటించిన పునుఁగు
ఎల్ల పల్కులఁ దెలుఁగే మేలుబంతి
పజలలోనఁ దెల్గువాఁడే వలంతి
అచ్చపు నాటు మాటాడుటే నీటు
కలగల్పు బాసలు కబ్బముచేటు.

పయిపలుకులలో మాతృభాష గీర్వాణభాషకన్నను మిన్నయను నాయన భావము స్పష్టపడుచున్నది.

ఉత్తమ కవిత్వమునకుఁ జమత్కారవత్త్వము ప్రధాన లక్షణము. 'చమత్కారవత్త్వం కావ్యత్వమ్.' దాసుగారి కవిత్వమునఁ జమత్కారమునకుఁ గొదువలేదు.

ఉదయాద్రిన్ నినుఁజూచినంత వెఱ నెంతో పాఱు చీఁకట్లు వెం
టఁదగుల్ నీ ప్రభకోడి వాని దగు కూనల్ పాదులన్ నీడలై
యొదుగన్ వానిని రేయితల్లికడ కోహో తూర్పునంబంపు నీ
దు దయన్ నాతరమా గణింప గుణసింధూ సూర్యనారాయణా!

భగవంతుఁడగు సూర్యనారాయణుని దయాసముద్రత నీతఁడు చమత్కరించిన విధము ప్రశంసనీయము.

సూర్యనారాయణుఁడు శృంగారాది నవరసముల నెట్లు ప్రవర్తింపఁ జేయునో చమత్కరించిన విధ మద్భుతము.

కమలాళిన్ వికసింపఁజేయు నెడ శృంగారంబు, హాస్యంబు, దు
ర్దమ మందేహతమిస్ర మారణమునన్ రౌద్రాద్భుతోద్వీర సం
క్రమ బీభత్స భయానకంబులు, లసత్కారుణ్యముం దావకీ
న మహాభక్తులయందు, నస్తగిరి పొంతన్ శాంతభావంబు నీ
వమరం జేయుదు నిత్య నిర్గుణుఁడవై హా సూర్యనారాయణా.

వివిధ సాహిత్య ప్రక్రియలలో శతకముకంటెఁ గవి యాత్మీయతా ముద్రను బ్రకటించు ప్రక్రియ వేఱొండు లేదు. కవి వ్యక్తిత్వమునుబట్టి చూపుటలో శతక మద్దము వంటిది. సూర్యనారాయణశతకమును రచించు కాలమునకు దాసుగారు వేదాంత తత్త్వ విత్త్వమున నారముగ్గినపండు. ఐహిక భోగములవలన జుగుప్సవహించి, యాముష్మిక సౌఖ్యముల

నాకాంక్షించు పరమర్షి యాయన. ఇహలోకసంబంధి భోగముల చాంచల్యము, పారలౌకిక సౌఖ్యముల శాశ్వతత్వము బాగుగా నెఱిఁగిన మహాజ్ఞాని యాయఁన. ఈ విషయమును శతకస్థ పద్యములే చాటుచున్నవి.

తొలుదొల్తన్ వనితాది భోగము లివెంతో బల్ సుఖాభాసముల్
దలఁపంగా క్షణభంగురంబు లటుమీఁదన్ దీర్ఘ దుఃఖాకరం
బు లటంచుం బలుమా ఱెఱింగియును సమ్మోదంబుతో మానలే
రిల నా బోటులు.

అవనిన్ మానవజన్మమందుఁగల సౌఖ్యం బెన్నఁగా నెల్కతోఁ
క విధానం గడు సన్నమౌఁ దుదకు దుఃఖం బెక్కువౌ నేటి పొ
ర్లు వలెన్ గావున మామకానుభవ మాలోచించి సంసార వా
ర్థి వడిన్ దాఁటెద నీకృపాతరణిచే శ్రీ సూర్యనారాయణా.

ఆత్మదోష పరిజ్ఞాన మెవ్వరికోగాని యుండదు. అది సద్గుణపుంజమునకు మకుటాయమాన మయినది. ఆత్మదోష తూలరాశిని బశ్చాత్తాప మగ్నివలె భస్మసాత్కృత మొనరించును. అట్టి హృదయపూర్వక పశ్చాత్తాప మీ కవి పద్యములఁ గనుపట్టుచున్నది.

శిష్టాచారము సల్పలేను; మఱి దుశ్చేష్టల్ విడంజాల; బల్
నష్టం బొందియు నీ పదాబ్జముల డెందంబుం గడున్ నిల్పవే;
నిష్టంబుండియుఁ దెన్నెఱింగియును దుర్వృత్తిన్ వడిన్ మాన; నేఁ
గష్టాత్ముండను గాచె దెట్లు నను నింకన్ సూర్యనారాయణా!

తనరంగాఁ బరిపూర్ణభావమున మద్బాల్యంబువోవన్ వినూ
తనమౌ యౌవన సన్నిపాత దశచేతన్ భ్రాంతచిత్తుండనై
తి నయారే వయసిప్పుడున్ ముదుర నెంతే బుద్ధియున్నట్లు ట
క్కును గన్పర్చు చిఁకేమి నే నగుదు నొక్కో సూర్యనారాయణా.

ఈ కవి వేదాంతజ్ఞాన మాపారము.

భూతాదర్శనమువంటి మాయయెడ నపూర్ణైక జీవుండు ప్ర
స్ఫితంబైన ప్రవృత్తిచేఁ దను జగచ్చిత్రంబుగాఁజూచి మో
హాతిక్రాంతుఁడునై నివృత్తి మెయి స్వీయాద్వైతభావంబు సం
ప్రీతిం గాంచు నటంచు నెంచెదను దంద్రీ సూర్యనారాయణా.

ద్వైతంబుండుట యుక్తికాదు మఱియ ద్వైతంబు ప్రత్యక్ష భా
వాతీతం బటుగానఁ గర్మములు సేయన్ మానరా దెంతయున్

ద్వైతాద్వైత సమంబు బ్రహ్మమనుచున్ ధర్మంబు నిర్మోహియై
ఖ్యాతిన్ సల్పినవాఁడె యుత్తముఁ డనంతా సూర్యనారాయణా,

జ్ఞాతంబైన పదార్థతుల్యమగు నజ్ఞాతంబు దోతేరఁ దజ్
జ్ఞాత ప్రాప్య వికారమున్ మఱి త దజ్ఞాతంబునం దోఁచుటే
ఖ్యాతిన్ భ్రాంతి యనంబడున్ గనుక జ్ఞేయాజ్ఞాన విజ్ఞాతృ త
త్త్వాతీతంబగు భూమ మీ వగుదువన్నా సూర్యనారాయణా.

ఈ కవి వైరాగ్యము ప్రసూతి శ్మశానాదులవలెఁ దాత్కాలిక సంభవముగాక, యొంటఁబుట్టిన దనుటకుఁ బెక్కు నిదర్శనము లాయన గ్రంథములందే గలవు. ఈ కవి నిశ్చయముఁ జూడుఁడు.

సమతన్ లోకులకెల్ల భూతదయయున్ సత్యంబు బోధించుచున్
రమణన్ నీదగుకీర్తి రాల్ గరగఁ గానప్రౌఢిచేఁజాటుచున్
ప్రమదం బొప్పఁ బరాంగనా విముఖతన్ వర్తించుచున్ బ్రహ్మచ
ర్యమునే సల్పెద నాకుఁ దోడుపడుమన్నా సూర్యనారాయణా.

ఆతని కోరికఁ జూడుఁడు.

క్షితియందున్ మగవారలెల్లఁ బితలై, స్త్రీలెల్లరున్ మాతలై
మతిలోఁదక్కిన భూతసంచయము లస్మత్ప్రాణ తుల్యంబులై
సతతానందము నా కొసంగ మఱి యుష్మత్పాద సంకీర్తనం
బతి నిష్కామత నేనొనర్తు నెపుడయ్యా సూర్యనారాయణా.

లోకమునందలి స్త్రీ పురుషులను జననీజనకులనుగా నెంచుచు, 'ఆత్మవత్ సర్వభూతాని' యని భావించుచు, నిష్కాముఁడై భగవంతుని భక్తిమై సంకీర్తించుట యీ కవి యాశయము. పరమయోగేశ్వరు లతి ప్రయత్నమున సాధింపనెంచు చిత్తస్థితి గదా యిది!

'అరయంగా సకల శ్రుతిస్మృతి పురాణాద్యర్థ సారంబుఁ ల్మాఱు నాశక్తి కొలందిఁజూచితి' నని శ్రీదాసుగారే చెప్పికొనిరి. ఇఁక సంగీతము మాట చెప్పనక్కఱలేదు. సంగీతసాహితీ స్రవంతులు గంగాయమునా తరంగిణులవలె నాయనలోఁ జక్కఁగా సంగమించినవి. సరస్వతీనదివలె నాయనలో భక్తి యంతర్లీనమై యుండుటచే, దాసుగారిని పవిత్ర త్రివేణీ సంగమతీర్థమునుగాఁ బేర్కొనఁ దగును.

శ్రీ ఆదిభట్ల నారాయణదాస

# సారస్వత నీరాజనము



తృతీయ భాగము

# సంగీత ప్రతిభ



# సంగీత జగజ్జ్యోతి

సంగీత భూషణ : శ్రీ శిష్టా సత్యనారాయణ రాజశేఖరం

28. హరికాంభోజి జన్యం | నారాయణగౌళరాగం-ఆదితాళం | ఆ: సరిమ పనిదని స; అవ: సనిదపమగరిగరిస.

పల్లవి॥ నడకే లయ విన్యాసం నీ-నుడుగే రస నిష్యందం శ్రీ నారాయణ
దాస ! నీ "శంభో!" ని-నాదమే ప్రణవ నాదానందం ॥నడకే॥

అను॥ కడగానని నీదు మేధ కందని-ఘన తత్త్వమ్ములను లేదు లే! ఒర
వడి దప్పని నీదుపాట నిముడని-భావము సృష్టిలోనె
లేదు లే! నీ ॥నడకే॥

చరణం భావరాగ తాళక్షీరాబ్ధిని దేవదానవులు నీవై తలచి వాఙ్మయ
మందరమును మునుగనీక - వరకూర్ముడవై మూపున మోచి
కైపీ సంపదనెల్ల వెల్వలచి - ధరణీ ప్రజలకు ప్రసాదించి
జీవిత సఫలత సాధించి జగ-జ్జ్యోతివై ప్రకాశించితివే! నీ ॥నడకే॥

2) స్వరలయమయ గేయ ప్రబంధముల-హరికథామృతము నొలికించి
హరికథా మహాప్రక్రియ నాంధ్రుల-కందజేసి ఆదిగురుడవై
హరికథా పితామహ బిరుదమ్మున - కర్థము నీవై విలసిల్లి
ధరను రాజశేఖరాదులకు నా-దర్శపూర్ణ పురుషుడైతివే నీ! ॥నడకే

(N. B. : స్వరమునకు త్రిప్పిచూడుడు)

ప॥ పామగరీ; రిగగరి సనిదా। నీ; సా; ;; ని ద నీ॥ ని ద ప ని ద ని పారిమపదనీ; । నిదపదదపమగ । రిగరీ స ని పా ॥
నద. కే ల. య, వి. . న్యాసం నీ. . ను. డు. గే . , ర . స. ని ష్యం . . దం . . . . . . శ్రీ . .

రీ మా పా నీ నీ దా దా నీ । సా సా నీ సా । రీ సా; స ని॥ దా నీ దా పా; పా దా పా । మా గా రిగరీ । స ని ద ని సా రి మ॥
నా. రా. యణదా. స నీ. శం. భో ని నా. దమే పర్శిభవ నా . దా . . నం . . దము.॥నత కే

అ॥ పదదప మగరిగ గరిసని సా; । రీమగరిగరి । మా; పాపా ॥ రి మపదనీ; నీదాదానీ । సాసానిరీ । సా; స ని సా ॥
క. డ. గా . . . న. వి, నీ -దుమే....ధ కం దని షు. న. త త్త్వ. మ్మెల నులే. దులే - ఒ. ర

రీ మగరీ; గరి సనిసారీ । సా నీ దా నీ । నీ దా నీ సా ॥ గా రీ పా నీ దా నీ దా పా । దా పా మా పా । మా గా రిగరిమ ॥
వడి. ద ప్ప. ని. నీ. దుపా. ట నిముడని ఛా, వమున్న. ష్టిలో. నె లే. దులే . . నీ. ॥నత కే

చ॥ మాపామాగారీగారీగా । రీ; సనిదని । సా; సాసా॥ రీమాపానీదానిపాపా । నిదపదదపమగ । రీ గా రీ; ॥
ఛా. వరా. గశా. శ షీ . . . . రా బ్ధిని దే. వదా. న వు లు నీ . . . . వై . . . . త ఱ చి

రీమాపానీనీదాదానీ । సానీ రీరీ । సానీ సాసా॥ నీసా నీదా నీదా పా; । దా పా మా గా । రీ గా రీ; ॥
వా, ఙ్మయమందర మునుమును గనీ, క వర. కూ, ర్మడవై మూ. ఘనమో. చి

గమనిక :— చరణ శేష మనుపల్లవి వలెను, రెండవ చరణమును మొదటిదానివలెను బాడుకొనవలయును.



# సంగీత చతురాస్యుడు

## యస్వీ జోగారావు

[ఈ వ్యాసరచనకు నాకు తోడ్పడినవి; శ్రీ దాసుగారి స్వీయచరిత్ర, శ్రీ ఎం. వి. చయనులుగారు వ్రాసిన దాసుగారి జీవితచరిత్ర, చీరాల సంస్కృతి సమితివారు ప్రకటించిన నారాయణదాస శతజయంత్యుత్సవ సంచిక. వారికి నా కృతజ్ఞత. ఈ వ్యాసమున దాసుగారి బహుముఖమైన సంగీతవైదుష్యము, తత్పూర్వరంగము, తత్సాధన, వికాసము, వారికి సంగీతము నెడగల అభిరుచులు అభిప్రాయములు, సంగీతముద్వారా ఆయన సాధించిన ఘనవిజయములు ప్రసక్తములైనవి.]

సంగీతము శ్రీ దాసుగారికి తరతరములనుండి నరనరముల బ్రవహించుచు వచ్చిన రసవాహిని. ఆయన తమ స్వీయచరిత్రమున– "మేఘగంభీర మంద్రమున శంఖము పూరించినట్లు మాతండ్రి సురటరాగమున నెద్దియో తరుచు బాడుచుండును. శ్రీరాగము సావేరీరాగములతో వాల్మీకి వ్యాసవిరచితములగు రామాయణ భారతములు చదువుచు నర్థము చెప్పుచుండును" అని వ్రాసిరి. హరికథారంభమున "శంభో" యని దాసుగారు పెట్టు పొలికేక శంఖారావ సన్నిభము, మేఘగంభీర నినాదమేదురమునని సామాజికులు హరికథాశ్రవణ వేళనే కాదు కాలాంతరమున స్మరణమాత్ర ప్రసన్నమగు దాసుగారి కంఠధ్వనిని గూర్చి చేసెడు ప్రశంసలకు మూలము తెలిసినది. ఆ స్వీయచరిత్రమునందే దాసుగారు తమ గురించి– "అయిదేండ్ల వయసునుండియు బురాణము చదివి లయజ్ఞానముతో బాడి యితరులను సంతోషపెట్టి డబ్బు సంపాదించు నేర్పు నాకు గలదు" అని వ్రాసికొనిరి. వయసువచ్చినపిదప

'లయబ్రహ్మ' బిరుదాంచితుడైన దాసుగారి కాలయజ్ఞానము సహజము గనే యొంటబట్టి యున్న దన్నమాట. దాసుగారి సంగీతపు వారసత్వ మంత మాత్రమె కాదు. వారి మేనమామలలో నొకడు 'వేలకొలది జనులకు రంజనముగాఁ దెలుఁగు పురాణము చదువఁగలఁ డింకొకఁడు బాగుగా నొక క్రోసు వినబడునట్లు సొగసుగ బాడఁగలడు.' పద్యములు చదుపునపుడును, పాటలు పాడునపుడును దాసుగారికి మేనమామల పోల్కి వచ్చినదని తలిదండ్రు లనుకొనుచుండెడివారట. మహిళాగోష్ఠు లందు భాగవతాది బహు పురాణార్థముల నాఖ్యానించి 'పురాణాల నరసమ్మగారు' అనియు, "చదువులవ్వ" అనియు విఖ్యాతి బడసిన తల్లి వీరి తల్లి. ఆమె "బహు దేశభాషల ప్రభుల మెప్పించిన మరువాడ వెంకన్న మనుమరాలు." భాగవత ప్రవచనముతో దాసుగారిని మహా భాగవతునిగా జేసిన వారి ఆద్యగురుస్థానము. ఇట్లు అమ్మవంకను అబ్బ వంకను గూడ దాసుగారిది సంగీత సాహిత్యములకు పెట్టిపుట్టిన వంశము.

బాల్యమున స్వగ్రామ మగు అజ్జాడ అగ్రహారమున సువర్ణముఖీ జీవనదీ తరంగ సంగీతములో కచ్ఛపీశ్రుతులు కనుగొనుచుంటయు, నేదిష్ఠ కేదారములలో పాతాళగంగను దెచ్చి బయలం జల్లు నేతాములు త్రొక్కు రైతుల "హరిహరీనారాయణ" పదమాలించి మహతివలె పరవశించుటయు, వరాల రామయ్యగారును, తమ పెద్దన్నగారును తరుచుగా పాడు గంగావివాహము పాటకును దాసరి రామదాసు కాలు గుంటి వెంకటస్వాము లాడు భాగవతములకును వీనులును గనులు నొప్ప గించుటయు, పొలములో మేసిన పోతుల నెక్కి యింటికి దోలి తెచ్చుచు సోదరునితో జోడుగూడి భాగవతపు దరువులు పాడుచుండుటయు, తల్లి కడ పురాణ శ్రవణము, పితృపాదుల గురుకులములో పంచకావ్యపఠనము, పేరయ్య యొజ్జల వేదపాఠము నిత్యకృత్యములుగా గల దాసుగారిలో హరికథక లక్షణము లప్పుడే రూపుగైకొనుచున్నవి.

సుమారు పదేండ్ల ప్రాయమున దాసుగారి పాటను వాసా సాంబయ్యగారను బొబ్బిలి సంస్థాన వైణికుడు వినుట తటస్థించెను. ఆయన

దాసుగారి శారీరమున కబ్బురపడి తానై దాసునకు సంగీతము చెప్పెదనని తనతో బొబ్బిలికి తీసికొని పోయెను. ఆయన యే యొక మంచిముహూర్తము చూచి దాసుగారిచే మొదట 'సాపా' యనిపించిరి. బొబ్బిలి సంస్థానగాయకశిరోమణి నందిగాన వెంకయ్యగారు బాలదా సొకపరి తలుపుపై వ్రేళ్ళతో తాళము వేసి చక్కని లయహొయలుతో పాడుట చూచి- "ఒడలంతా లయజ్ఞానముంటేనేగాని యీలాగు పాడుట సాధ్యముకాదు" అని అభినందించెను. సంగీత విద్వాంసులుగా వాసి కెక్కిన పప్పు వెంకన్న, కట్టు సూరన్న, ముదిగంటి సూర్యనారాయణ గారలు నాడట వాసావారి గురుకులమున నారాయణదాసుగారి సహాధ్యేతలు. ఆ దినములలో నొకనాడు దారిని బోవుచు దాసుగారు అలవోకగా పాడుకొనుచున్న పాటను విని తుమరాడ వెంకయ్యగారను ప్రసిద్ధ భాగవతుడు తత్రతులతో- "విను డీ పిల్లవాని కెవరు నేర్పి రెంత చక్కగా పంథవరాళి పాడినాడు! పూర్వజన్మవాసన యుండవలెగాని సంగీత మొరులు నేర్పిన నేపాటి కుదిరెను?" అని ప్రశంసించిరి. దాసుగారికి వాసావారి శుశ్రూష అచ్చిరాలేదు. ఆ సప లక్కడనే పెట్టి అనారోగ్యము కారణముగా బొబ్బిలి వీడి స్వగ్రామమున కేగెను.

మరి కొలది దినములకు విజయనగరములో దాసుగారిని వారి రెండవ యన్నగారు నిరాఘాటము కృష్ణయ్యగారను మహారాజుగారి పాటకునకు సంగీత పాఠము నిమిత్త మప్పగించిరి. ఆయన పాడునపుడు చేయు ఆంగికాభినయమంతయు దాసుగారికి గడియలో పట్టుబడెను. అది కనిపెట్టి ఆయన – "మీవాడు పాటలో నాకన్న నెక్కువగ రంజు కొనుచున్నాడు. నన్ను వెక్కిరించుచున్నాడు. వానికి నేజెప్పను." అని అన్నప్రకారము చేసెను.

పదునారేండ్ల వయస్సున దాసుగారు పురాణము జదివియు, పాడియు బడి జీతమునకును పుస్తకములకును సంపాదించుకొనెడివారు. అప్పటిలో సానిమేళములు యొద్ద శ్రద్ధగా గూర్చుండుట, వెలపడచులం

జూచి కనుగిల్పి మెలపున జావళీలు బాడుట మొదలగు నేర్పులబ్బెను. అప్పటికి దాసుగారికి నూరు జావళీలు, కొన్ని కృతులు, కొన్ని నాటకపు మట్లును వచ్చును. స్వరము పాడుట రాదుగాని లయజ్ఞానము స్వాభావసిద్ధమగుటచే ఆస్థాన సంగీత విద్వాంసులనుగూడ పల్లవిలో ఢీకొనుచుండెడివారు.

1883 లో (అప్పటికి దాసుగారికి 19 సం॥ల వయసు) విజయనగరమున దాసుగారు మెట్రిక్యులేషను చదువుచుండగా కుప్పసామి నాయుడను హరిదాసు చెన్నపట్టణమునుండివచ్చి కానుకుర్తివారి యింట ధ్రువచరిత్రమును పాడుచు నాడుచు విన్పించి సన్మానితుడయ్యెను. ఆ సన్నివేశమును దిలకించుటయే దాసుగారి హరికథకావతారమునకు నాందియయ్యెను. ఆ సందర్భమును దాసుగారు స్వీయచరిత్రలో నిట్లు వ్రాకుచ్చిరి – "సంగీత సాహిత్య విద్వాంసుడు మిక్కిలి ప్రశస్తముగ నృత్యగీతవాద్యములతో గానకవితాప్రజ్ఞ నగపర్చుచు హరికథ చేసినపుడు జను లిహపరతారకము (శ్రీ) హరికథ యని యెంచి మంచి వర్తనము కలిగి పండితపామరరంజకుడైన హరిదాసుని మిక్కిలి యాదరించెదరని నాకు తోచినందున నామరునాడే యదివరకే సంగీతమందును, పురాణము చదువుట యందును మిక్కిలి యారితేరినవాడనై కొంచెము పద్యములు పాటలు నల్లగల కవితాశక్తి యుంటచేతను ఇంగ్లీషు భాష కూడ నభ్యసించుటచేతను హరికథలు నే చేసినచో లోకు లానందించెదరను ధైర్యముతో కొంత నాకవిత్వముతోను. ధూళిపాళ కృష్ణయ్యగారు రచించిన ధ్రువచరిత్రమందలి కీర్తనలతోను ఒక్కనాటికి రచించి ధారణ మొనర్చి ఓంప్రథమముగా (శ్రీ) వేణుగోపాలస్వామి మందిరములో చిన్నప్పటినుండి నాతో గవగా బాడుచున్న నా నాల్గవయన్న పేరన్నగారు వెనుక పాట పాడుచుండగా విన్పించినాడను. శ్రోతలు మిక్కిలి యానందించిరి. గానలోలుడైన వేణుగోపాలుని ముందు గానశీలుడై బాలదాసు ధ్రువచరిత్రముతో ప్రారంభమైన హరికథక జీవిత మాయనను ఆంధ్ర సంగీత ప్రపంచమున ధ్రువతారను జేసినది.

1884 లో ఆ కథనే శ్రీకాకుళము, ఉర్లాము, నరసన్నపేట, రఘునాథపురము, మున్నగుతావుల గానము చేసి సత్కృతులైరి. అప్పటికే శరవేగమున గీర్వాణాంధ్రములు చదువుట. ఒక్కసారి వినిన మాత్రమున గీర్వాణాంధ్రాంగ్లేయ పద్యముల మరల జదువుట, కోరిన తాళములను పల్లవి పాడుట, పెక్కురాగము లాలాపించుట, గీర్వాణాంధ్రములలో నానా వృత్తములలో కవిత్వము చెప్పట, అష్టావధాన మొనర్చుట, అపూర్వకల్పనముగా ఆంధ్రాంగ్లేయ భాషలతో వేల కొలది జనులుగల సభలలో పాడుచు నుపన్యసించుటయు దాసుగారి కలవడిన విద్యలు. "విద్యలందు గురుశిక్ష మిక్కిలి తక్కువగాని స్వభావముగా నాకు జోరవ యెక్కువ. నే నాడినదాట పాడినది పాటగా జనులు సంతోషపడుట నా యెడల దైవానుగ్రహము" అని దాసుగారి వక్కణ. (స్వీ.చ.) ఆయేడే బరంపురములో టికెట్టుపెట్టి యొకపరి, నాళము భీమరాజుగారి యింట ఓం ప్రథమముగా కాలికి గజ్జెకట్టి నృత్యపూర్వకముగా నొకపరి, జయంతి కామేశం పంతులుగారి లోగిట నదే విధముగా (ఏకధాటి పదిగంటల సేపు) నొకపరి హరికథలు చెప్పి ఘన సత్కారము లందిరి. భీమరాజుగారి యింట జరిగిన హరికథను జూచి యచటికే తెంచిన కుప్పసామి నాయడు దాసుగారికి సాష్టాంగపడి–"విద్య నీ సొమ్ము. జగత్ప్రసిద్ధుడ వయ్యెదవు. నీవు చెప్పిన కీర్తనలు నాకు గొన్ని నేర్పుము" అని యడిగెనట. అట్లు తమ హరికథక జీవితపు వేకువ దశలోనే గురుసంభావనమును బొందుట దాసుగారి భవిష్యత్తునకు రాచబాట వైచినది.

ఆ యేడే దాసుగారి చరిత్రలో ఛత్రపురమున నొక విచిత్ర సంఘటన జరిగినది. ఒక పెండ్లి పెద్ద కోరికపై దాసుగారు వారి యింట ధ్రువచరిత్రము హరికథ చెప్పిరి. అది విని పెండ్లిపెద్ద దాసుగారితో– "ఇంతసొగసైన కవిత్వము గుంటడవు నీకెట్లువచ్చును? ఇదెవరో మీయూరం జేసినా రను కొనెదను. నీవే కవిత్వము చెప్పగలవాడవైనచో

నంబరీషచరిత్రము నాకొడుకున కిష్టము, కవిత్వము చేసి విన్పించగలవా? నీకు బది దినములు గడువిచ్చినా" ననెను. ఆ రాత్రికిరాత్రి పంతము పట్టి మతి బృహస్పతి యగు దాసుగారు అంబరీషచరిత్రమును రచించుటయే గాదు ధారణచేసి మరునా డుదయము తొమ్మిదిగంటలకు హరికథ నద్భుతముగా గానము చేసిరి. సభ నుల్లాసడోలికల నుయ్యాల జంపాల లూచిరి. పిసినారి పిడకయగు పెండ్లిపెద్ద యిచ్చిన నలువది రూకలను "పెండ్లి ఖర్చునకు మీరే యుంచుకొం"డని గిరవాటు వైచిరి. మరునాడు లోకనాథమను గ్రామమున సమర్థముగా నొక అష్టావధానమును సలిపిరి. అందు వ్యస్తాక్షరీనిషిద్ధాక్షరులతోపాటు కోరిన రాగములపై పురాణము జదువుటయు నొక యంశము. తదుపరి జయంతి కామేశం పంతులుగారి సన్నిధానములో తలగాము, సుబ్బమ్మపేట గ్రామములలో హరికథలు చేసి దాసుగారు వీడ్కొనునప్పుడు — "సూరన్నా! లోకము నిన్నెరుగజాలక నీకవజ్ఞత సేయుదు రేమో యని కుందెదను" అని పంతులు కంటతడిబెట్టిరి. ఆ తిరుగు ప్రయాణములో దాసుగారు శ్రీకాకుళములో ధ్రువచరిత్ర హరికథ చెప్పగా ఒక సుప్రసిద్ధ లుబ్ధాగ్రేసరచక్రవర్తి భక్తిపరవశుడై దాసుగారి కిరువది రూప్యము లొసగెను. దాసుగా రందరి నానందాబ్ధిలో ముంచగా ఆయన దాసుగారిని ఆశ్చర్యాంబుధిలో ముంచెను. ఆ సన్నివేశము వలన దాసుగారి హరికథాకథనదక్షత నూహింపగలము. ఆ శ్రీకాకుళమున నొక అష్టావధానము గూడ చేసిరి. అరసవల్లిలో నొక హరికథ చేసిరి. తదుపరి విజయనగరము చేరి నిరుపమాన ప్రజ్ఞాధురంధరుడైన రాజుగారి సంగీత విద్వాంసుని గురువుగా భావించి సంగీత సాధన జేయ నారంభించిరి. అయితే ఆయన చెప్పినదిలేదు గాని దాసుగారి పాటవిని మెచ్చుకొను చుండెడివాడు.

1886లో మెట్రిక్యులేషను పరీక్ష యిచ్చుటకు విశాఖపట్టణముచేరి [illegible] అటనున్న రెండు నెలలలో పండ్రెండు హరికథలు చేసిరి

దాసుగారు. ఉత్తీర్ణుడైనట్లు పరీక్షాఫలితము వచ్చినంతనే ఇక చాలు మరి చదువనక్కరలేదని సంతోషముతో నొక కేకవైచి– "విశేషముగా పరీక్షలు ప్యాసయి యుద్యోగముచేయు దృష్టి నాకెన్నడును లేదు. హరి కథలపై జీవించుటయే నా నిశ్చయము" అని హరికథా కంకణము గట్టు కొనిరి. పరీక్షలో నెగ్గినందుకు రెండు మ్రొక్కుబడి హరికథలు చేసిరి. శివాలయమునను, హనుమదాలయమునను. విజయనగరములో విక్టో రియారాణి జూబిలీకి ప్రత్యేకాహ్వానముపై నొక కథ చెప్పిరి. ఆనాటి విజయనగరపు దివాన్జీసాహెబు శ్రీ పెనుమత్స జగన్నాథరాజుగారికి దాసుగారి కథలన్న కడు మోజు. ఆయన రసజ్ఞ రాజశేఖరుడు. దాసు గారికి జరిగిన పిఠాపురరాజ సన్మానమునకు వారి సిఫారసే కారణము.

అప్పట్లో కట్టు సూర్యనారాయణగారినుండి చిన్న వీణతోపాటు సరళీ, జంటవరుసలు, కొన్ని అలంకారములును దాసుగారు గ్రహించిరి. దర్బారు విద్వాంసుడు గూడ వీణను మేళగించుటయు, రెండు మూడు పిళ్ళారి గీతములును మప్పెను. పిఠాపురములో హరికథలు చేసినప్పటి నుండి దాసుగారు సభలలో ధారాళముగ స్వరము పాడుచుండిరి. అప్ప టికే గజేంద్రమోక్షణమను హరికథ రచించి దివాన్జీగారికి వినిపించిరి.

1886–88 సం॥లలో విశాఖపట్టణములో F. A. చదువుచున్న కాలములో దాసుగారు కళాశాల ప్రిన్సిపాలు రామయ్యగారికి నిత్యా తిథి, వారి వెలయాలికి సంగీత శిక్షకుడు. కసింకోట జమీందారుగారి రెండు హరికథలతో మెప్పించి నెలసరి స్కాలరుషిప్పు సంపాదించిరి. ఆ కాలమున విశాఖలో సంవత్సరమునకు ముప్పది నలువది హరికథలు చేసిరి. అల్లిపురము జమీందారు హవేలీలో అనేకావధానములు గూడ చేసిరి. అందులో ముఖ్యములు: గ్రీకుభాషలో ఏబదిమాటల వ్యస్తాక్షరి, కోరిన రాగములతో పురాణము చదువుట, ఏకసంథాగ్రహణము మొ॥ ఒకపరి విశాఖలో స్త్రీల సభలో హరికథచేసిన యనంతర మొక యిల్లాలు దాసుగారితో– "అయ్యా! మీ తలిదండ్రుల పుణ్యమేమో

కాని, మిమ్ము జూచినపుడు దేవుని జూచినట్లు మాంకున్న”దనెను. తదుపరి రాజమహేంద్రవరమున రెండు హరికథలు చేసి తిరిగివచ్చుచు కాకినాడ నాటకపు కంపెనీవారిచే గూడ విజయనగరపు కంపెనీవారివలె సంస్కృత నాటక మాడింపదలచినవారికి విక్రమోర్వశీయమున తరిఫీదునిచ్చి రాజపాత్రి తామే ధరించి మెప్పులందిన దాసుగా రా నాటకపు సుమాళమునబడిపోక యభూపూర్వము హరికథా సామ్రాజ్యమేలుట ముదావహము.

దాసుగారింకను పైలాపచ్చీసులోనున్న కాలమున ఏలూరులో నొక వారకాంత యింట పదిమంది నెరజాణ గాణలు చేరిన గోష్ఠిలో నొక పల్లవి గాయకునితో పందెము పడినది. ఇరువురును “జయేచ్ఛ వాదించు ప్లీడర్లవలె, భోగేచ్ఛం బోరాడు వృషభద్వయంబుమాడ్కి” నొండొరులమీరి రాగతానపల్లవులు పాడుచుండిరి. హిందూస్థానీ కర్ణాటకము బాణీలు జోడించి పాడ నేర్చుండుటచేతను, అసలు శారీరమే అద్భుతమైనదనుటచేతను దాసుగారిదే పై చేయి ఆయెను. అంతట నా యేలూరి గాయకుడు “రెండు లక్షల గ్రంథము చదివినాడను. పల్లవిలో నీపని తెలిపెదనుండు” మని చతురస్రగతిలో పాడుచున్న పల్లవిని త్రిస్రగతికి మార్చి పాడజొచ్చెను. మునుపటి చతురస్రగతిని చేతనిల్పి, నోట త్రిస్రగతిగ పాడి చూపుడని దాసుగారు సవాలుచేసిరి. లక్షల గ్రంథ మాయన సంగీత లంకణముచేసెను. అపుడు దాసుగారు సభవారు సెభాష నన ధారాళముగ భిన్నగతులతో పల్లవినిబాడి లబ్ధవిజయులైరి. ఇట్టి అసమాన పల్లవి పాండిత్య శౌండీర్య ముండుటచేతనే దాసుగారి నాటి పొగరుబోతుతనమును సహించి పిమ్మట పెద్దలును వారి నాదరించుచుండిరి. ఆ యేలూరు వారాంగనలెల్ల దాసుగారికి దాసోహమని పాద సంవాహనాది పరిచర్యలు చేయుచు వారినోట పీఠము పెట్టుకొనియున్న సంగీత సరస్వతికి వరివస్యలు చేసిరి. వారు వలపు వాగురలో పడవైచుకొన నుద్యమించుట జూచి దాసుగారు– “ఇదిగో నాయొద్ద విద్యనేర్చుకొను స్త్రీలను పుత్రికలవలె జూచెద”నని హెచ్చరించిరి.

బందరులో దాసుగారు వంద హరికథలైన చేసియుందురు. వందలు వేలు నార్జించియుందురు. అక్కడ హరికథలేకాదు వారి ఖ్యాతికి కేతన మెత్తిన మేటి పాటకచ్చేరీలును జేసిరి. అట నొకనాడు దక్షిణదేశపు ఫిడెలర్లు, గాయకులు, మార్దంగికులు, తాళగాండ్రు మొత్త మరువదిమంది సంగీత విద్వాంసులుచేరి పెద్ద పెట్టున నొక గానసభచేసిరి. భంగు బిగించి దాసుగారును అచటికి దయచేసిరి. వారిని చూచి యా సభచేయించిన యజమాని మీరుకూడ పల్లవి పాడగల్గినయెడ పాడగోరెదననెను. అపుడు దాసుగారు దరస్మిత పురస్సరముగ నందుకొని అదివరకు నాల్గవకాలమున ఆరక్షరములు జాగాచేసి పాడుచున్న పల్లవిని అయిదవకాలము విలంబ ముగా మార్చి యొంటి యక్షరము జాగాచేసి మూడా వృత్తములు పాడిరి. ఫిడెలర్లుగాని పాటకులుగాని మద్దెలగాడుగాని కొలిపింపు విద్వాం సులుగాని లయ కణిశము కాచుకొనలేక జాగా తెలిసికొనలేక తడబడ జొచ్చిరి. అపుడు దాసుగారు- "ఇందరు విద్వాంసు లున్నారుగాని యొక రైనను జాగాకు రాలేకుంట ఆశ్చర్యమాయె" ననుచు ముక్తాయించి జాగా వెల్లడి చేసిరి. అటుపై కొందరు పాడ యత్నించుచు తప్పుచుండిరి. మద్దెలగా డొకసారి యైనను ముక్తాయింప జాలకుండెను. అపుడు బందరు పురజనులు ఇంతటి లయపండితు డిచటికి కెన్నడును రాలే"దని దాసు గారిని శ్లాఘించిరి. అటుపిమ్మట పరాభూతులైన యా విద్వాంసు లీసు వహించి కట్టుకట్టి దాసుగారి నవమానింప దలపెట్టిరి. "కాని మ్రింగరాని మిడిగ్రుడ్డునగు నేను వారికి లొంగకుంటిని" అని దాసుగారే వక్కాణిం చిరి. అట్టిది వారి ఆత్మవిశ్వాసము.

అప్పట్లోనే (అనగా 1888 సం॥ ప్రాంత మనుకొందును) బంద రులో పంతులుగారి మేడమీద దాసుగారు టిక్కెట్టుపెట్టి యొక అపూర్వ మైన నాన్యతోదర్శనీయమైన సంగీతసాహిత్యోభయాత్మకమైన అష్టావ ధానము నెరపిరి. అందలి యంశము : 1) రెండు పాదములతో రెండు తాళములు, రెండు చేతులతో రెండు తాళములును వేసి పల్లవిపాడుచు

కోరిన జాగాకు కోరిన ముక్తాయిలు వేయుచుండుట. 2) ప్రోబ్లము మెంటల్‌గా సాల్వుచేయుట. 3) నల్వురకు తెనుగున నలువురకు సంస్కృతమునను కోరిన పద్యములలో కవిత్వము చెప్పుట. 4) వ్యస్తాక్షరి. 5) న్యస్తాక్షరి. 6) ఆంగ్లోపన్యాసము. 7) పుష్పగణనము. 8) ఛందస్సంభాషణము. అవధానము బ్రహ్మాండముగ జరిగినది కాని దాసుగారచట కోరి కొందరితో అంతకుముందే గిల్లికజ్జా తెచ్చుకొనియుండుటవలన స్థానిక పత్రికలలో వారి గురించి కొంత దుమారము చెలరేగెను. ప్రతికక్షులతో సిగపట్ల గోత్రము వరకు వచ్చినది వ్యవహారము. అటుపిమ్మట నొకనాడు 'కలుమహారిణి' పత్రికాధిపతియింట దాసుగారు సంగీతగోష్ఠి చేయుచుండగా సభలో ఎవరో పల్లవి పాడుమని అభ్యర్థించిరి. "పల్లవి గూడ విను రసజ్ఞులిచట గలరు. ఏమిపుణ్యా!" యని దాసుగా రనగా యొక వృద్ధవైశ్యుడు లేచి "నేనున్నానయ్యా! పల్లవి వినగల రసజ్ఞుడనిక పాడుమయ్యా పల్లవి" అని తన చేతనున్న పదితులముల బంగారు కడియముతీసి దాస కరకమలము నలంకరించెను. కళాకారుని కంతటి సహృదయ సంభావనము కన్న జీవితమున నింకేమి కావలయును. అంతట దాసుగారు ద్విగుణీకృతోత్సాహులై రెండుగంటలసేపు పల్లవినే పాడి సభారంజన మొనర్చిరి. బందరులో దాసుగా రున్నపుడే ఏలూరు వేశ్య యొకతె అచటికి వచ్చి (శ్రీ) దాసుగారి శిష్యురాలనని చెప్పి మైదారు పాటకచేరీలుచేసి మూడువంద లార్జించుకొన్న దా రోజులలో. బందరులో దాసుగారి పీఠము పదునాల్గు మాసములున్నది. కట్నములు కానుకలు బాగుగ నార్జించిరి. వారి వీడ్కోలు సభలో అధ్యక్షులైన దాక్షిణాత్య వైష్ణవ శిరోమణి- "బొంబాయిలో బ్రాడ్లా ధోరణి వింటిని. ఇప్పు డట్టి ధోరణిగలవా రొక్క. నారాయణదాసుగారు తప్ప మన వారిలో మఱెవరునులేరు" అని యుగ్గడించిరి.

ఒక యేలూరు వకీలు దాసుగారి ముఖారి రాగాలాప ప్రజ్ఞ అనన్య సాధారణమని ప్రస్తుతించెను.

రాజమహేంద్రవరమున గీతాభినయ కళలందు నిష్ణాతులు స్వాశిక్షితలు నైన వారకాంతల సహవాసమున దాసుగారు కొంతకాలముండిరి. కాని వారితగులము కళలతోగాని కళావతులతోగాదు. సంగీత సాహిత్యాది రస జ్ఞత గలవారే లోకమున దరచు భూతదయాపరులు, పరోపకారులు, విత రణ శీలురునై యుందురని అప్పటి దాసుగారి యూహ.

దాసుగారు 1890ప్రాంతమున తమ యిరువదియారవయేట మరల గంజాము మండల పర్యటనము చేసిరి. ఉర్లాము లుకులాము మున్నగు గ్రామములందు హరికథలుచెప్పి సన్మానము లందిరి. ఉర్లాములో రుక్మిణీ కల్యాణము చెప్పినపుడు బందరు రామమూర్తి యను మార్దంగికునకు గర్వభంగముచేసిరి. 27-వ యేట మార్కండేయ చరిత్రము హరికథ రచించిరి. ఇచ్ఛాపురము జగన్నాథస్వామి యాలయముచెంత దాసు గారు విడిసియున్నప్పు డా చేరువనే విడిసియున్న నరసన్నపేట సానివారు విసరిన జావళికి ఆకృష్టయై దాసుగారి దయావీక్షణమునకై తన సంపద సర్వస్వము ధారవోసెదనని సిద్ధపడగా "హరిదాసుడను. మునుపు నా వృత్తి యెట్లున్న నిపుడు పరస్త్రీ నొల్ల"నని పల్కిన దాసుగారి చాప రికములేని తీరును నాటికి వచ్చిన స్వభావ పరిణామమును ప్రశంసనీయ ములు. మరల శ్రీకాకుళమున టికెట్టు పద్ధతిపై హరికథలు చేసిరి.

ఒకప్పుడు కట్టు సూరన్నగారి పాఠశాలలో విజయనగరాస్థాన వైణికు డొకాయన వీణపై "చింతయ మాకందమూల కందమ్" అను కీర్తనము వాయించుచు "ఉత్తుంగ కమనీయ వృషతురంగ" మని యా వృత్తము సరిపెట్టి భైరవీ ప్రసంగమని యెత్తుకొనుటచే సరిగా గ్రహము నకు చేరకుండుట జూచి దాసుగారు నవ్వుచు "అయ్యా! ... ఈ పాటి లయజ్ఞానములేని మీకింత ఖ్యాతి యెట్లువచ్చె నయ్యో! పామరలోకము!" అని యాక్షేపించి తాము సరిగ పాడి చూపిరి. అంతేకా దా వైణికుడు రచించిన స్వరజతులందును వర్ణములందును తప్పులు పట్టిరి. ఒకనాడు తమకు ప్రతిస్పర్థియైన పప్పు వెంకన్న యను ప్రసిద్ధగాయకశిరోమణి

కాలము చేయగా దాసుగారు కంటఁదడిపెట్టిరి. అతనిపై కవితాసారభము గుబాళించు పద్యమును గూడ చెప్పిరి. అట్లే బెంగుళూరు నాగరత్నము తిరువళ్లూరు రాజాయి, పాటలను గూడ చాల మెచ్చుకొనిరి. ఈ సన్ని వేశములు సంగీతమున నేపాటి లోపమును క్షమింపలేనట్టియు, ప్రతిస్పర్థి యొక్క సంగీత సామర్థ్యమును మెచ్చుకొనునట్టియు దాసుగారి సంగీత పరాయణ స్వభావ సౌమనస్యమును విశదముచేయును.

1894 లో (దాసుగారి కపుడు 30 సం॥లు) మదరాసులో దాసు గారు (శ్రీ) పనప్పాకము అనందాచార్యులు (శ్రీ) రెంటాల సుబ్బారావు ప్రభృతుల ఆధ్వర్యవమున నై దారుహారికథలుచేసిరి. 'హిందూ', 'స్టాండర్డు పత్రికలు దాసుగారి సంగీత సాహిత్యముల నుగ్గడించుచు వారి శారీర మువంటి ఘన గంభీర మధురధ్వని యదివరకెన్నడును విన్నదికాదని ప్రశంసించినవి. ఆనందాచార్యులుగారై తే ఒక గొప్ప ప్రశంసా వ్యాసమే వ్రాసిరి. రెవిన్యూబోర్డు మెంబరయిన గ్రోలు దొరగారు సంగీతగోష్ఠలి కాని దొరసాని దాసుగారి వీణావాదనమును చాల మెచ్చుకొన్నది. దాసుగారు దొరగారితో ప్రతిజ్ఞచేసి తాము పాడుచున్నంతవరకు ఫర్లాంగుదూరమున వచ్చుచు బోవుచున్న రైలుకూతల నాతనికి వినబడ కుండ జేసెను. అట్టి గొప్ప కంఠధ్వని తానెన్నడు వినియుండలేదని అక్క ఱంపడిరి దొరగారు.

దాక్షిణాత్యుల కన్న సంగీతమున నౌత్తరాహులు తక్కువయని మదరాసు ప్రాంతపు ప్రజల యభిప్రాయము. అందు మీాదట ఆ యేడే మదరాసు పోలీసు కమీాషనరుగారి యింట్లో పట్టుపంతముతో దాసు గారి గానసభ జరిగినది. నటభైరవి పాడుచున్న దాసుగారి యెడల దాక్షి ణాత్యులైన ఫిడెలరు, మార్దంగికుడు, ఘటవాదకుడును అలక్ష్యముగ నుండిరి. పల్లవిలో వీని బండారము బయల్పడునని దాసుగారిని పల్లవి యెత్తుకొండని తొందరచేసిరి. అంతట దాసుగారు విషమోద్గ్రాహమున పల్లవి పాడుచు, ఒక మారైనను జాగాకు రాజాలని ఫిడెలరును, మార్దం

గకుని జూచి "తానము పాడుచుండగ పల్లవి పల్లవి యని నన్ను తొం దరపెట్టితిరే! ఒకసారియైన జాగాకు రాలేరు. ముక్తాయింపజాలరు. కాల మును తరిమివేయుచున్నారు. మీ దాక్షిణాత్యులోకింతయు విలంబ కాలమునకు పనికిరారు" అని దాసుగారధిక్షేపించిరి. ఆ ఫిడెలరే తాము పాడు ఆనందభైరవి రాగము నతిమాత్రి మనోజ్ఞముగా వాయించు చుండుట చూచి దాసుగారు పాట నాపి వాని వాదన వైదగ్ధ్యమునకు పులకించి పోవుచుండిరి. ఎంత గానలోలుడు! దాసుగారు హిందూస్థానీ భైరవి పాడు నప్పు డా యాచ సభవారికి తెలియకున్నను వారి శారీ రము, లయజ్ఞానము, పల్లవియు సకల సభా శ్లాఘాశిరఃకంప పాత్రము లైనవి.

బెంగుళూరులో. దాసుగా రొక కచేరీ చేసినప్పు డొక సంగీత రసికుడు – "ఇదివరకు కోయంబత్తూరు రాఘవయ్య పాట విన్నాను. ఇపుడట్టి గంభీరశారీరము తిరిగి లభించెను," అని పరవశించెను. వారి హరికథ విన్న మరియొక రసికుడు – "ఇదివరకు మా దేశమున ప్రసిద్ధి చెందిన కృష్ణభాగవతుల కథ కన్నను రంజకముగాను పాండిత్యయుక్త ముగాను నున్నది మీ కాలక్షేపము" అని ప్రశంసించెను. మైసూరు మహారాజావారు బెంగుళూరులో వేంచేసియుండగా వారి సమక్షమున దాసుగారు రెండుదినములు వరుసగా అంబరీషచరితమును, గజేంద్ర మోక్షణమును హరికథలు చెప్పి, అలవోక నాంగ్లానువాదహేవాకము ప్రదర్శించి మహారాజావారిచే – "ఇదివరకింతటి సుందరమైన పాటకుని జూడలేదనియు, తత్రత్యులైన సంగీత పారంగతులచే "అసమాన ప్రతిభా వంతులు మీరు" అనియు ప్రశంసింపబడి సత్కృతులై దసరా మహో త్సవసందర్భమున మైసూరు దర్బారుకు ఆహూతులైరి. మరునాడు బెంగుళూరులోనే మైసూరు దివానుగారు ప్రత్యేకముగా నొక సంగీత సభ చేయించి దాసుగారి హనుమత్తోడిరాగమును, పల్లవిని చెరియొక ముప్పావుగంటవినిని కొనియాడిరి. ఆ మరునాడు హైకోర్టు ప్రధాన

న్యాయమూర్తి యొక్క క్లబ్బులో హరికథ చేయించి సముచిత సత్కారము గావించెను. ఆ మరునాడు దాసుగారియొద్ద హిందూస్థానీ భైరవి రాగము నేర్చుకొండని మహారాజా వా రాదేశింపగా వారి యాస్థాన విద్వాంసులు వచ్చి దాసుగారెంతసేపు పాడి చూపినను వారి కా సాగసులు పట్టువడకుండెను. అప్పుడు దాసుగారు వారితో - "అయ్యా! అంగుడినుండి దౌడలనుండి ముక్కులోనుండి పాడుట కలవడిన దాక్షిణాత్యులకు నిరాతంకముగ నాభినుండి ప్రారంభించి బాహాటముగ పెదవులు ముడవక దౌడలంటనీక ముక్కునబోనీక నమలక గొంతు తెరచి పాడుట కలవడిన ఔత్తరాహుల పాటరీతి యెట్లు లభించును? మరియు శ్రుతిలయ లొకటి యయ్యును, శారీరము యాచలను బట్టి గానభేద మగుపడును" అని ప్రాంతీయ సంప్రదాయ మర్మమును చక్కగా విశదీకరించిరి. అప్పటికి దాసుగారికి ముప్పదేండ్లు. కాని యనుభవమున జాంబవంతుడు. హరికథలో హనుమంతుడు. తిరుగు ప్రయాణములో గుంటూరున రెండు కథలు చేసిరి.

మైసూరు ప్రభువుచే సత్కృతులైనట్లు 'మెయిల్' 'హిందూ' పత్రికల ద్వారా విజయనగర ప్రభువులు విన్నంతనే దాసుగారు దర్బారు పండితులుగా దివాన్ దస్తరులో నమోదయిరి. ఆ యేడే దసరాకు రమ్మని వారికి మైసూరునుండి తంతివచ్చినది. వెళ్లిరి. దాసుగారిని చూచుటతోడనే రాజావారు - "నాడు బెంగుళూరిలో నీవు పాడిన పాట, నీ శారీరము నా చెవిలో మ్రోగుచున్నవి ... నీవంటి ప్రతిభావంతు నిదివరకు చూడకుండుటకు విజయనగరపు రాజెంతటి దురదృష్టవంతుడు!" అని పల్కిరి. అది రాజావారి సంగీతరక్తినే కాదు దాసుగారి శక్తిని గూడ విశదము చేయును. "మా దర్బారులో నీవేమైన సర్వీసు జేయ గోరెదవా?" యను రాజావారి ప్రశ్నకు - "మర్త్యులను గొల్వ నొల్లను" అని దాసుగారి సమాధానము. అవును. ఆయన కీ రాజాస్థానములతో పనియేమి! విశ్వరాట్టయిన విరాట్పురుషుని ఆస్థాన

విద్వాంసుడాయన. రాజావారు హిందూస్థానీ కర్ణాటముల యాచలు మిశ్రమముగా పాడ నేర్చిన దాసుగారివంటి గాయకుని మరిచూడలేదని మెచ్చుకొనుచు – "నీ వెక్కడ సంగీతము నేర్చుకొంటివి ?" అని ప్రశ్నించిరి. "నా సంగీత సాహిత్యములు సహజ పాండిత్యము" అని దాసుగారుత్తర మిచ్చిరి. "ప్రేపేదిరే ప్రాక్తన జన్మ విద్యాః" ఈ హరిదాస జగద్గురువునకైతే హరి యొక్కడే గురువు.

రాజావారు దాసుగారిచే జంఝూటి, కన్నడ, హిందూస్థానీ భైరవి రాగములు పాడించి రికార్డు చేసుకొనిరి. రాత్రిపూట ఐదు గంటలసేపు మార్కండేయచరిత్ర హరికథ చెప్పించుకొని ఉప్పొంగిపోయిరి. దాసుగారు పేరన్నతోపాటు మరియొక హరికథ గూడ చెప్పి రాజ సన్మాన విరాజితులైరి. తిరుగుదలలో బళ్ళారిలో ధర్మవరము రామకృష్ణమాచార్యులుగారి ప్రోత్సాహముపై వారి నాటకశాలలో రెండు హరికథలు చెప్పి రసజ్ఞసమారాధనము చేసిరి. రొక్కమెక్కువ చేసిరి. దారిలో గుంటూరులోను, అమలాపురమునందును, చోడవరములోను కథలు చెప్పిరి.

మైసూరు రాజ సన్మానము పత్రికలలో ప్రకటితమగుటతో మదరాసు రాష్ట్రమంతటను, తథాపి ముఖ్యనగరములందును దాసుగారి పేరు మారుమోగిపోయెను. విజయనగర ప్రభువులకును దాసుగారిపై గౌరవాభిమానములు మెండయ్యెను. ఒకపరి దాసుగారిని "కోటా పేటా పట్టదు మీ గాత్రము" అని ప్రశంసించిన రాజావారు తమ ఆంతరంగిక కార్యదర్శితో – "మన యందరి కొక్క కన్నే యున్నది. కాని యితనికి రెండు కన్నులున్నవి. సంగీత సాహిత్యముల నిరుపమానుడు. ఈ యూరనితని వలె సొగసుగ కవిత్వము చెప్పగలవారుగాని సంగీతజ్ఞులుగాని లేరు" అని దాసుగారిని మెచ్చుకొనిరి. మెచ్చిన వాడు ఆనందగజపతి రసరాజ్య వాస్తోష్పతి, శేముషీవాచస్పతి. అవును–మరి సంగీతసాహిత్య

ములన్నవి చదువుల తల్లికి చన్నులు కాని యీ పుంభావసరస్వతికి కన్నులే యగును గదా !

1898 లో దాసుగారు ప్రహ్లాదచరిత్రము హరికథ రచించిరి. అప్పటికే ధ్రువచరిత్రము, అంబరీష చరిత్రము, గజేంద్రమోక్షణము, రుక్మిణీకళ్యాణము, హరిశ్చంద్ర చరిత్రము, మార్కండేయచరిత్రము అను తెనుగు హరికథలను, శ్రీకృష్ణ జననము అను సంస్కృత హరికథను రచించియుండిరి. 1902 లో అప్పటికి మనస్సంతానమేగాని తను సంతానములేని దాసుగారు తదర్థము తల్లిగారి యాదేశముపై సావిత్రీచరిత్రము హరికథను రచించిరి. 1903 లో జన్మించిన పుత్రికకు సావిత్రియని పేరిడిరి. ఈ హరికథలో జన్యరాగము విషయమై కీర్తనలందు ముద్రాలంకార విషయమై అఖండ ప్రతిభను ప్రకటించిరి.

1904 లో బెంగుళూరిలో ఒక గొప్ప గాయక మహాసభ జరిగెను. దాసుగారి పేరు ప్రతిష్ఠ లప్పటికే బెంగుళూరున పెణకలు వట్టియుండుటచే వారి కాహ్వానము వచ్చినది. వారి రుక్మిణీ కల్యాణము హరికథ యేర్పాటయినది. దాక్షిణాత్య మార్దంగిక సార్వభౌము డొక పిళ్ళేగారు కథారంభముననే తన కంటె నెక్కుడు లయాద్ధత్యమును జూపుచుండుటను సహింపక దాసుగారు జంపెతాళపు కీర్తన నెత్తుకొని యొక గతిలో పాడుచు మరియొక గతిలో తాళపు చిప్పలతో లయ బనాయించుచుండిరి. పిళ్లేగారికి చేయాడలేదు. జాగా దొరకక మద్దెల మౌనము వహించినది. పిళ్లేగారు కాళ్ల బేరమునకు వచ్చిరి. దాసుగారి తత్త్వము "వజ్రాదపి కఠోరాణి, మృదూని కుసుమాదపి" అన్నటువంటిది. అప్పుడు జాగా వెల్లడిచేసి తాను తిరిగి రెండు గతులలో పనిచేయుచు, మూడవ గతిలో నృత్యవైశద్యము ప్రకటించిరి. సభ్యులు సంతోషపరవశులైరి. దాసుగారికి 'లయబ్రహ్మ' యని పేరు వచ్చెను.

1911-12 ప్రాంతమున బరంపురములో జిల్లాజడ్జి టి. సదాశివయ్యగారు దాసుగారిచే హరికథ చెప్పించి ముప్పది తులముల బంగరు కడియములతో సత్కరించెను 1912-13 లలో విజయనగరమున రీవాసర్కార్ రాణీ అప్పలకొండయాంబగారు దాసుగారిచే మూడు హరికథలు చెప్పించిరి. హరిశ్చంద్రకథ విన్నపు డామె శోకవివశయై అట్టి కరుణరస పరిప్లుతి గల కథ నెరి యెప్పుడును చెప్పవద్దని కోరెను. రుక్మిణీకల్యాణము విన్నపుడు సంతోషపరవశయై యేమి కావలయునో కోరుకొమ్మన్నది. దాసుగారు "ఈశ్వరకటాక్షముకన్న కోరదగిన వస్తువేమున్న"దనిరి.

ఆ కాలములోనే దాసుగారు కాశీయాత్ర చేసిరి. అలహాబాదులో సుప్రసిద్ధ గాయనీమణి జానకీబాయి దాసుగారి మేఘగంభీర స్వరము నకును హిందూస్థానీ బాణీకని విస్మితురాలయ్యెను. తిరుగుదలలో కలకత్తాలో తన సరుకెట్లు చలామణి యగునో చూడవలె నను కుతూహలముతో దాసుగారొక సభ చేయించి శ్రీకృష్ణజననము సంస్కృత హరికథ చెప్పుచు హిందీలో నుపన్యసించుచు సంస్కృత కవితా సంగీత నృత్యాదులందు బహుముఖ ప్రజ్ఞను ప్రదర్శించి విశ్వకవి రవీంద్రనాథఠాకూరు ప్రశంసలకు పాత్రులైరి. "మీరు పాడిన బేహాగు హిందూస్థానీ భైరవి దక్షిణదేశ మెరుగదు. ఉత్తరాదిని గూడ ఆ రాగములు మీవలె పాడువారరుదు" అని విశ్వకవి దాసుగారి కిచ్చిన కితాబు. కొన్నియేండ్ల పిమ్మట రవీంద్రులు విజయనగరము విచ్చేసి నపుడు దాసుగారిని గుర్తుపట్టి - "ఆనాడు మీరు పాడిన బేహాగురాగ మింకను నా చెవిలో మ్రోగుచునే యున్నది" అని సెల విచ్చిరి. కలకత్తాలో గోహర్జాను, ప్యారా సాహెబుల పాటలను దాసుగారు మెచ్చలేదు. అట్టివారికి పేరువచ్చుట, సరుకున్న వారికి రాకపోవుటలు గమనించిన దాసుగారు స్వరము తప్ప యొండెరుగని కోయిల పాటకు పేరువచ్చుట, త్రిస్థాయిగాత్రముగల గోరువంకకు పేరురాకుండుటను తలచుకొందురు.

1914లో అనుకొందును, చల్లపల్లి ప్రభువులు శ్రీరాజా అంకినీడు మల్లికార్జున ప్రసాదరావుగారు దాసుగారి నాహ్వానించి, కుడి యెడమ చేతుల సమవిషమ జాతులను వీణావాదనము చేసిన దాసుగారి ప్రజ్ఞావిశేషమునకు రిచ్చవడి మెచ్చుకొని నిండుసభలో బంగారు గండపెండేరమును బహూకరించిరి.

1908 – 14 సం॥ల నడుమ బరంపురము, విశాఖపట్టణము, కాకినాడ, రాజమహేంద్రవరము, బందరు మున్నగు పలుతావుల ప్రజలు దాసుగారి హరికథలకు తమ చెవులు కోసి వారిచేత పెట్టినట్లుగా ఆయన కనేక సువర్ణఘంటా కంకణములు, పదకములు, భుజకీర్తులు సమర్పించుకొనిరి. అంతేకాదు నూజివీడు, నందిగామ, వేంకటగిరి, హైదరాబాదు, భద్రాచలము మొదలైన పలుతావుల గజారోహణాదిక ఘనసన్మానము లనేకము జరిగినవి.

ఒకపరి చేబ్రోలులో 'రుక్మిణీ కల్యాణము' చెప్పటకు సిద్ధముగా నున్న దాసుగారు సభలో ఎవరో కొంటెతనమునకు హరికథ గాదు గిరికథ చెప్పుడనగా అప్పటి కప్పుడు గద్యపద్యగేయములెల్లనల్లి ఆశువుగా "గోవర్ధనోద్ధారము" చెప్పిరట! కనుసన్నల కళాసరస్వతిని కవ్వించు రసజ్ఞచతురాస్యు డాయన.

1915 లో దాసుగా రొక విశిష్ట ప్రణాళికపై షట్కథాసంపుటిగా "యథార్థ రామాయణము" ను రచించిరి.

1904 లో కాకినాడలో సరస్వతీ గాన సభ స్థాపితమైనది మొదలు 1942 వరకు ఏటా ఆ సభకు దాసుగారి కథతోనే బోణీ జరుగుచుండెను. ఏ పాట కచ్చేరికిరాని 'గేటు కలక్షను' దాసుగారి హరికథకు వచ్చుచుండెడిది. తనవలెనే తక్కిన విద్వాంసులనుగూడ సత్కరించుట ధర్మమని దాసుగారి స. గా. సభాధ్యక్షులగు శ్రీ కొమ్మిరెడ్డి సూర్యనారాయణనాయుడిగారితో ననుచుండెడివారు. ఆంధ్రగాయకు

లరవ దేశము పోయి శిక్షితులగుట మంచిదని నాడుయుగారనగా దాసుగా రందులకు ససేమిరా సమ్మతింప లేదు. ఎవరి యాచ వారిది, ఎవరి బాణీ వారిదనియు, మనకొక సంప్రదాయ మహాత్త్మ గలదనియు, దానిని సంరక్షించుకొనవలెననియు, తన పాటది తెలుగు బాణీ యనియు, అరవబాణీ ఉపాదేయము కాదనియు సర్వతంత్ర స్వతంత్రులైన దాసు గారి యభిప్రాయము.

1919 లో విజయనగర ప్రభువు విజయరామ గజపతి సంగీత కళాశాలను నెలకొల్పి అప్పటికే పింఛను పుచ్చుకొను వయసున్న దాసుగారిని బలవంతము చేసి వారి వలన సంస్థకు ప్రతిష్ఠ వచ్చునను గంపెడాసతో వారికి తగుస్వేచ్ఛ నిచ్చి ప్రిన్సిపలు పదవిని కట్టబెట్టిరి. దాసుగారు కడు సమర్థతతో సంస్థను సర్వాంగసుందరముగ తీర్చిదిద్ది ఆ పదవిని 1936 వరకు నిర్వహించిరి.

1922 లో దాసుగారి కేకలవ్య శిష్యుడైన శ్రీ పసుమర్తి కృష్ణ మూర్తిగారు తమ పార్వతీపరిణయ యక్షగానమును దాసుగారి కంకితము చేయుచు వారిని –

> "పంచముఖీ పరమేశ్వర !
> అంచిత త్రిపురారి సమ మహానట ! విలయా
> కుంచిత సుబ్రహ్మణ్యా సు
> కాంచన మణి ఘటిత వీరఘంటా వలయా !"

అని ప్రస్తుతించిరి దాసుగారికి 'పంచముఖి పరమేశ్వర' అను బిరుదు వచ్చుట కొక సంఘటన గలదు. అతఃపూర్వ మొకప్పుడు సుబ్రహ్మ ణ్యయ్య రను దాక్షిణాత్య సంగీత విద్వాంసుడు రెండు చేతుల రెండు తాళములు ప్రస్తరించుచు పల్లవి పాడు ప్రజ్ఞకు వీరఘంటాకంకణము బిరుదందె తొడిగినవాడు విజయనగరము వచ్చి సగర్వముగా 'బస్తీమే సవాల్' అని ఘీంకరించెను. దాసుగా రేకసమయమున కరద్వయ

చరణద్వయ వాగ్విన్యాస పురస్సరముగ పంచతాళములను పరిభవించి పదారు స్వరములతో తానము పల్లవి శబ్దము ముక్తాయింపులను పరమాద్భుత శక్తితో ప్రదర్శించి గర్జించిరి. అయ్యరుగారు వీరఘంటా కంకణము విప్పి జోహారు చేసిరి.

1923 లో కాకినాడ కాంగ్రెసు సమావేశ సందర్భమున కార్య నిర్వాహకవర్గము వారి ఆహ్వానముపై దాసుగారు రుక్మిణీ కల్యాణము హరికథ చెప్పుచు ఆ కథ కొక గొప్ప తాత్త్విక సమన్వయము చేసిరి. దాసుగారి పాట కోత్తరాహులు పెద్దలందరు నెంతో సంతోషించిరి. "your dance is exquisite" అని సరోజినీదేవి శ్లాఘించినది.

కాకినాడ స. గా. సభలో స్వవిరచిత 'శ్రీకృష్ణవిజయ' సంస్కృత యక్షగానము నుపన్యసించుచు దాసుగారు సంగీత సాహిత్యముల యను బంధము గూర్చి అద్భుతమైన వివరణముచేసిరి. సాహిత్యజ్ఞాన శూన్యమైన సంగీతముగాని, సంగీతరస మెఱుగని సాహిత్యముగాని అంగవైకల్యము గల విగ్రహమువలె ఇంపు నింపదనియు, వాని యనుబంధమును నిరూపించి, రసస్ఫూర్తి మెరయించి పరమేశ్వరారాధనకు వినియోగించి నపుడే ఆ రెండు కళలును చరితార్థము లగుననియు, అందుచే గానసభలలో హరికథకే ఉన్నతస్థాన ముచిత మనియు దాసుగా రుగ్గడించిన అభిప్రాయము లవశ్యముగ మనార్హములు. దాక్షిణాత్య గాయకులు వైద్యనాథయ్యరు ప్రభృతులు పాటకచ్చేరి చేయుచుండగా దాసుగారు సభలోనికి వచ్చినచో గాయకులు పాటనాపి వారికి నమస్కరించి వారు కూర్చున్న పిమ్మట "సెలవా?" అని అడిగి మరి పాట నుపక్రమించుట యాచారమాయెను.

1927 లో మదరాసులో జరిగిన అఖిలభారత సంగీత పరిషత్ప్రారంభోత్సవములో కొన్ని లోకోత్తరములైన "స్వరాక్షర" కృతులను స్వరచితములను గానముచేసి దాసుగారు ఆచార్య పి. సాంబమూర్తి ప్రభృతుల మన్ననలు వడసిరి.

దాసుగారు తమ జీవితకాలములో బందరు, తుని, నందిగామ మున్నగు నగరములలో హరికథాభివర్ధనీ సమాజములను నెలకొల్పి హరికథా శిక్షణ, పరీక్షలు, బహుమతులు నేర్పాటుచేసిరి. గాయక వైణిక నర్తకులకు పత్రికాముఖముగ సమస్యల నిచ్చుచు కళాకారులలో స్వతంత్రాలోచనమునకు తథాపి దేశములో కళావిజ్ఞాన వ్యాప్తికిని దోహదము చేసిరి.

1931 లో గుంటూరులో జరిగిన యేడవ ఆంధ్రగాయక మహాసభకు దాసుగారి నధ్యక్షులుగా నెన్నుకొనిరి. 1931-33 ప్రాంతమున విజయనగరాధీశ్వరులగు శ్రీ అలక నారాయణగజపతిగారితో ఉదకమండలమున కేగి అట అనేక సంస్థానాధీశ్వరుల సమక్షమున హరికథా కాలక్షేపముచేసి సెబాసనిపించుకొనిరి. 1933 లో విశాఖపట్టణమున ప్రభల లక్ష్మీనరసింహము పంతులుగారియింట హరికథ జరుగుచుండగా జయపురాధీశ్వరులు శ్రీ విక్రమ దేవవర్మగారు దాసుగారు నిలువబడి హరికథ చెప్పుచుండగా నేను కూర్చుండి విందునా యని నిలువబడిరి. కృతజ్ఞత తెలిపి- "నేను నిలువబడి చెప్పను. ఆడుతూ పాడుతూ చెప్పెదను కాన మీరు సుఖోపవిష్టులయి చిత్తగించుటే మంచి"దని దాసుగారు పల్కిన మీదట రాజావారు కూర్చుండిరి. ఆ సందర్భమున పురజనుల కోరికపై దాసుగారికి- "సంగీత సాహిత్య సార్వభౌమ" బిరుదము నొసంగిరి. తదుపరి భారతీతీర్థ సంస్థ పక్షమున- "ఆటపాటల మేటి" యను బిరుదము నిచ్చిరి. 1933 లోనే తునిలో దాసుగారికి "బహ్మరథ" సన్మానము జరిగినది. అతఃపూర్వము నందిగామలో గూడ నిట్టి సన్మానము జరిగినట్లు చయనులుగారు వ్రాసిన దాసుగారి జీవితచరిత్రమునుండి తెలియుచున్నది.

1938 లో తమ రామేశ్వర యాత్రాసందర్భమున పుదుకోట లోను, తిరువాన్కూరునందును దర్బారు సన్మానము లందినారు దాసుగారు. అప్పట్లోనే కన్యాకుమారి యందు దేవీదర్శనము చేసికొని పిమ్మట

లలితాసహస్రనామముల కాంధ్రమున పద్యరూప వ్యాఖ్యానముతోపాటు "దశవిధరాగనవతి కుసుమమంజరి" యను దేవీ స్తవమును సంస్కృతమున వెలయించిరి. ఈ మంజరి గురించి- "సంగీతజ్ఞులకు గూడ నాశ్చర్యకరమగు నపూర్వ రాగములచే నొప్పియున్న యీ రచన శ్రీ దాసుగారి అనన్య సాధారణ సంగీత ప్రాభవమును జాటుచున్నది" అని కీ. శే. మరువాడ వెంకటచయనులుగారు వ్రాసిరి.

మదరాసులో పలుతడవలు దాసుగారు హరికథలు చెప్పిరి. 1938 లో అచటి ఆంధ్రమహాసభవారిచే సన్మానము లందిరి. సర్ అల్లాడి, సర్ కూర్మా, సిర్ వేపా ప్రభృతులు పలువురు రసజ్ఞుల మెప్పు లందుటయేగాక శ్రీ బిడారము కృష్ణప్ప యను ప్రసిద్ధ దాక్షిణాత్య సంగీత విద్వాంసునిచే అతిమానుష ప్రజ్ఞుడుగా ప్రస్తుతింపబడెను.

నటరాజునకు గగనతలమే రంగస్థలమైనట్లు నట్టనడు వీథియే ఆదిభట్టు హరికథల కాటపట్టయినది. విజయనగర సంగీత కళాశాల యందు తన కడకు విద్యార్థులుగా వచ్చినవారిని విద్వాంసులుగా చేసి పంపుటయే కాదు తన లోగిటను వాకిటను గూడ హరిదాసుల కరచేత వైకుంఠము చూపెడివారు. "శ్రుతిర్మాతా లయః పితా" అని విశ్వసించిన దాసుగారి కా రెండు నుచ్ఛ్వాస నిశ్వాసములు. ఆయన తీసిన కూనరాగము సామగానము. ఆడిన తైతక్కలు శివతాండవము. ఆయన కీ జగమంతా సంగీతశాలయే. 'మొక్కుబడి' యనుపేర ఋగ్వేదము నందలి ఋక్కులను స్వరపరిచి యొక గ్రంథ మచ్చొత్తించి కళాశాలలో విద్యార్థుల కా వైదిక సంగీతమునుగూడ జంత్రగాత్రముల ద్వారమున అధ్యాపనము చేసిరి. ఇంటిలో చంటిపిల్లలకు గూడ షట్కాండల రామాయణమును పది పండ్రెండు చరణముల పాటగావ్రాసి నేర్పిరి. నడు వీథికి వచ్చి బిచ్చగాండ్ర పాటలు మెచ్చుకొనిరి. కింతాడ అప్పల నాయుని శిష్యుడొక డప్పులవాని లయజ్ఞానమున కచ్చెరువంది వానికి

16 రూ॥లు, 4 కుంచముల బియ్యము, జలతారు తలపాగ, పంచల చాపును పారితోషిక మిచ్చిరి. చెన్నపట్టణము రూపావతి (అది పేరే. ఆకారము వికారమే) యొక్క మనోహరగానము విని పరవశించి దాసు గారు సతీసమక్షమున నే-"ఈ పాట వింటూ ఇలాగే దీని వెంబడి వెళ్ళిపో వాలని వుం"దనిరి. "వెఱ్ఱి కుదిరిన ట్లేవుంది" అని భార్యయనగా- "పోవే ఎద్దుకేం తెలుస్తుంది అటుకులరుచి?" అని రూపావతిని సముచితముగ సత్కరించినారు దాసుగారు. ఒకపరి యొకరితో పట్టు పంతము వచ్చి అర్ధ రాత్రి అయ్యకోనేటిగట్టున ఒక మహావృక్షమున తలక్రిందుగా వ్రేలా డుచు సిక్షేపముగా నిదురించుచున్న ఋషిపక్షులను ఉదయ రాగమగు భూపాలము నాలపించి చట్టున మేల్కొలిపిరి. విజయనగరమున నొక ప్పుడు వర్షాభావ మేర్పడగా 'మూడు కోవెళ్ళ'లో మార్కండేయ చరి త్రము చెప్పి మూడు దుక్కుల వాన కురిపించిరి. అరువదేండ్లు హరికథ లతో భగవంతుని అంగరక్షకుడిగా సంగీత దేవత నర్మసచివుడిగా దేశ మంతయు దేవులాడిరి. 1923 లో ఇంగ్లండులో జరిగిన 'ఎంపైర్ ఎగ్జి బిషను'నకు భారతీయ సంగీతమునకు ప్రతినిధిగా దాసుగారే ఎన్నికయిరి. కాని ఆ వయసున నచటి శీతల వాతావరణమునకు తట్టుకొనుట కష్టమని ఆప్తమిత్రుడు బార్డ్స్‌వెల్ దొర సలహాయిచ్చుటచే వారి యింగ్లండు ప్రయాణ మాగిపోయినది. లేకున్న పాశ్చాత్యదేశములలో భారతీయ సంగీత సరస్వతి ప్రతిష్ఠకు ఢంకానగారాలు మ్రోగించి తాము ప్రపంచ వ్యాప్తమైన ప్రఖ్యాతి నార్జించి యుండెడివారే.

కనీసము దాసుగారి బాణీ దెలియుట కీనాడు మనకు గ్రామ ఫోను రికార్డులును లేవు; ఎందరో కంపెనీ యేజెంట్లు దాసుగారిపాట రికార్డుచేయుటకు దేవులాడిరి కాని హరికి గుండెలొడ్డిన దాసుగారు సిరికి మోకాలొడ్డి ససేమిరా సమ్మతింపరైరి. ఎట్లో యొక మూడు పాటలు మాత్రము మైసూరుకోటలో రికార్డుచేయబడియున్నవి. అవశ్యము వానిని సంపాదించి దాసుగారి బాణీని పట్టుకొని పరశ్శతముగా నున్న

వారి కీర్తలకు కనీసము సంగీత కళాశాలల ద్వారమున నైన ప్రచారము కలిగించుట మన కర్తవ్యమైయున్నది. అయితే దాసుగారి బాణీ అనన్యసాధ్యము. నాన్యతో దర్శనీయము. సంగీత మర్మజ్ఞులైన చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారన్నట్లు (ఆంధ్రపత్రిక 29-1-1945) దాసుగారి బాణీ దాక్షిణాత్య ఫక్కికిగాని ఔత్తరాహ ఫక్కికిగాని మక్కికి మక్కిగాదు. 'ఈ గానము లన్నిటిని కలియద్రొక్కి పెట్టిన కషాయమిది.' సర్వతంత్ర స్వతంత్రమైనది. హిందూప్రాణములు తురకప్రాణములని యుండనట్లు నిజమైన సంగీతమున భేదములుండవని దాసుగారి యభిప్రాయము. ఆయన విదేశీయుల సంగీతమున నోలాడగలరు విదేశీయుల కించునట్లు పాడగలరు. శిష్యులలో కొందరు కొంతవరకు అనుకరించినను కొన్ని పోలికలు దాసుగారితో అంతరించిన వేగాని నిల్చినవికావు. "ఈయన గాత్రము వంటి గాత్రము అనగా మేఘగంభీర స్వరము భగవంతుడే గాయకునకును ఇవ్వలేదని నా నిశ్చితాభిప్రాయము" అని శాస్త్రిగారి తీర్మానము.

"గీతం వాద్యం చ నృత్యంచ । త్రయం సంగీత ముచ్యతే"

అని సంగీత లక్షణము. కనుక గీత వాద్య నృత్యము లన్నిట నిష్ణాతుడైనవాడే సిసలైన సంగీత విద్వాంసుడని దాసుగారి నిశ్చితాభిప్రాయము. ఆ కళలన్నియు వారికి కరబదరములు, హృత్కవిలెలు, ప్రాణస్నాయువులు. సమస్తకళా కౌశల సమావేశము వారి హరికథ. అంతేకాదది సర్వవిద్యా విజ్ఞాన ప్రచారమున కొక పరిషత్తు. ఉపదేశముల కుపనిషత్తు. నవనవోన్మేష శీలమైన ప్రజ్ఞతోగూడిన వారి అపారమైన లోకజ్ఞత యొక్క వర్ణప్రకర్షకు హరివిల్లు. రసబ్రహ్మానుభవమునకు పురిటిల్లు. అందుకే అది కోటలోని ప్రభువులకును పేటలోని ప్రజలకును ధీశౌండులగు పండితులకును అమాయకులగు పామరులకును అస లాబాలగోపాలమునకును ఆనందపు విందులు చేసినది. దాసుగారు ప్రభువుల కళాకారుడే కాదు ప్రజల కళాకారుడును. కాదు కాదు భగవదాస్థాన

కళాకారుడు. రసజ్ఞుల భగవంతుడు. అందులకే ఏ విద్వాంసునకును జరుగని అఖండ ఘనసన్మానములును బిరుదములు ననేక మాయనను వరించినవి. గండపెండేర సువర్ణ ఘంటా కంకణములు, గజారోహణ బ్రహ్మరథములు దాసభారతి కేటికోళ్ళెత్తినవి. "ఆంధ్రదేశ భూషణము", "విజయనగర దిగ్గజము" మున్నగు మామూలు ప్రశంసల మాటయటుండ- "లయబ్రహ్మ", "ఆటపాటల మేటి", "సంగీత సాహిత్య సార్వభౌమ", "హరికథా పితామహ", "హరిదాస జగద్గురు", "పంచముఖ పరమేశ్వర", "శృంగారసర్వజ్ఞ", బిరుదరాజములు దాస యశశ్చంద్రికలను దిగంత ధగద్ధగితము లొనర్చినవి. ఒక్క గురువును లేకయే అన్ని కళలను సాధించిన ఆ మహామనీషికిగల సాక్షాచ్ఛిష్య ప్రశిష్యులే గాక ఏకలవ్య శిష్యు లనేకు లా మహానుభావుని విద్యాసంపదకు వారసులైరి.

ది 20-3-1933 న విశాఖపట్టణములో (శ్రీ) ప్రభల లక్ష్మీనరసింహముగారు తమ యింట శ్రీ రాజా విక్రమదేవవర్మగారి సమక్షములో నొక హరికథ చెప్పించి తాము దాసుగారికి త్వరలో "కనకాభిషేక" సన్మానము చేయనున్నట్లు సభాముఖమున ప్రకటించిరి. కాని అది జరుగకుండ కొలది దినములకే ప్రభల వారు స్వర్గతులైరి. ది 2-1-1939 న మదరాసు హైకోర్టు న్యాయవాది శిఖామణి శ్రీ గంటి లక్ష్మన్నగారొక లేఖలో దాసుగారికి ప్రభుత్వము "మహామహోపాధ్యాయ" బిరుదమును, ఆంధ్రవిశ్వకళాపరిషత్తు "కళాప్రపూర్ణ" బిరుదమును సమర్పించినచో అవి తముదాము సత్కరించుకొన్నట్లగుననియు, "no one deserves that title better than you who are so rich in arts and letters and in versatality of talent and attainments" అనియు నుగ్గడించిరి. ది 12-12-1943 న కీ. శే. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు కృష్ణాపత్రికలో "ఆంధ్రవిశ్వకళా పరిషదర్చకులకు నివాళి" అను పేరితో ఒక లేఖ వ్రాయుచు అందులో- "ఈరోజులలో 'కళాప్రపూర్ణ' బిరుదం పొందడానికి అర్హులైనవారు పలువురున్నారుగాని, అందులో

శ్రీయుతులు ఆదిభట్లనారాయణదాసుగారు చిటికెన వ్రేలిమీదికి వస్తారు.'' అని తీర్మానించిరి. అయితే దాసుగారి కంత యశః కామ జ్వరము లేదనుకొని కాబోలా డిగ్రీని విశ్వకళాపరిషత్తువారీయలేదు కాని 'గాయక సార్వభౌమ, కీ. శే. పారుపల్లి రామకృష్ణయ్యగారు దాసుగారిని ఒక లేఖలో-"సంగీత సరస కవితాది సకల కళా ప్రపూర్ణుని"గా అభివర్ణించిరి. మదరాసు హైకోర్టు న్యాయమూర్తియైన హెచ్. ఆర్. బార్డ్ వెల్ దొరగారు ది 2-2-1939 న దాసుగారి కిట్లు వ్రాసిరి:
"I belive the prize is awarded to some one of world wide fame and you can really claim to have that."
కాని దాసుగారా ప్రయత్నము చేసియుండలేదు.

హరికథకును దాసుగారికి నభేదము - వారి జీవితము, వ్యక్తిత్వము దానితో తాదాత్మ్య మందినవి. హరిభక్త మార్తాండుని అంశావతారములే వారు రచించిన పండ్రెండు హరికథలును. అందు సంస్కృతాంధ్రములయందు వారి కీర్తనలు (మంజరులు కాక) సుమారు పండ్రెండు వంద లుండును. అందు జానకీశపథము, ప్రహ్లాదచరిత్రములందు షట్ఛ్రుతి ఋషభ, షట్ఛ్రుతి ధైవత, శుద్ధగాంధార, శుద్ధనిషాద స్వరములుగల డెబ్బదిరెండు మేళకర్త రాగములతోను, మిశ్రములతోను అనేక కీర్తనలు గలవు. అవి సస్వరముగా గూడ ముద్రితములైనవి. సావిత్రీచరిత్రము జన్యరాగములకు నిధి. అంబరాగనిర్దేశముతో ముద్రాలంకారము ప్రతికీర్తనయందును సహజస్ఫూర్తితో ప్రతిష్ఠితమైనది. యథార్థరామాయణ కీర్తనలందు లయ శైలూషి వేసిన వాలకములు చేసిన లాస్యములు. ప్రశస్యములు దాసుగారి కీర్తనలలో [illegible]డుకలో లేని మారుమూలరాగము లనేకము గలవు. ఇవి యవి యననేల సర్వరాగములు సర్వతాళములు నందు గతార్థములైన వనవచ్చును. కథాసందర్భమునకును, సాహిత్యము నకును తగిన రాగతాళముల నెన్ను[illegible]నుటలోను క్రొత్త క్రొత్త మట్లు నేర్పరుచుటలోను దాసుగారు వాగ్గేయకార వాచస్పతి యనవలెను.

వారి దృష్టిలో వాగ్గేయకారుడు కాని వానికి సంగీత జగత్తులో స్థానము లేదు.

స్వోపజ్ఞములైన హరికథలనే వారు చెప్పిరి. కాని అప్పుడప్పుడు జయదేవుని అష్టపదులను, తీర్థులవారి తరంగములను, రామదాసు కీర్తనలను పాడుటకద్దు. కతిపయములు త్యాగరాజ కృతులను, శ్యామ శాస్త్రిగారి 'నిఖిలలోక జననీ' అను కీర్తనను వీణపై వాయించుటయు కద్దు. కాని వారి కీర్తనలు వీరి కీర్తనలు పాడుటకంటె స్వశక్తి చూపి జనరంజన చేయువాడే విద్వాంసుడని వారి యభిప్రాయము.

1944 నవంబరు ఆంధ్రపత్రికలో శ్రీ శ్రీనివాస శిరోమణిగారు దాసుగారి గురించి- "...దక్షిణాపథంలో సంగీతంలో అంతవాడు ఇంత వరకూ పుట్టలేదు. త్యాగయ్య సంగీతంలో ప్రాథమికంగా తేలికగా చేసిన పనులు శ్రీ నారాయణదాసు అతి సమగ్రంగా సప్రమాణంగా ప్రౌఢంగా ప్రదర్శించి చూపాడు" అని వ్రాసిరి.

ఒకపరి రాజమహేంద్రవరములో డాక్టర్ పాలకోడేటి గురుమూర్తిగారు- "ఈ పెద్ద వయసులో నంత బ్రహ్మాండమైన కంఠధ్వనితో పాడుట మంచిది కాదు. ప్రమాదకరము. చప్పున గుండెకాయ ఆగిపోవచ్చును" అని సలహా యిచ్చినపుడు, "నేను హరికథాగాన మొనరించుచుండగా నట్టి యదృష్టము పట్టిన యెడల నింకేమి కావలయును!" అని సమాధానము చెప్పిరి దాసుగారు. మరియొకరు వయసు మించినది, హరికథ మాని వేయండి అని యనగా దాసుగారు తనది యైహికమైన లౌకికవృత్తి కాదనియు, హరికీర్తన మా జన్మము నిర్విరామముగ చేయుచుండ వలసినదే యనియు బదులు పల్కిరి. జీవిత చరమదశలో "మచ్చికన్ నన్ను నీ ముచ్చటల్ చాటనీ లేనిచో మనికి జాలింపనిమ్ము" అని భగవంతునికి షరతు పెట్టిరి. దాసుగారికి సంగీతమే జీవితసర్వస్వము. అది హరికథలో విశ్వరూపము నవధరించినది. దాసుగారికిని వాసుదేవునకు నడుమ సౌహార్దసేతువైది.

దాసుగారి జీవితము హరికథ కంకితమైనపోయినది. వారు జీవితాంతము హరికథాఖ్యానము చేయుచునే యుండిరి. 1944 లో వారి యెనుబదవ జన్మదినోత్సవము నతివైభవోపేతముగా శిష్యులు, మిత్రులు అభిమానులు చేయసంకల్పింపగా ఆయన సన్మానములతో విసివితినని అప్పటికి తన హరికథ కరువదేండ్లు నిండినవిగాన దానికి షష్టిపూర్తిజరుపుడని యాదేశించెను. ఆ ప్రయత్నము లొకవంక జరుగుచుండగా ఈ లయబ్రహ్మ బ్రహ్మాలయ మందెను. ఆ తేది 2-1-1945 పుష్య బహుళ పంచమి. భారతకాలమాన పరిగణన ప్రకారమది త్యాగరాజస్వామి తిథి. తన భక్తితో భగవద్భక్తితో తనివితీరని బమ్మెర పోతరాజు, తన సంగీత వ్యాసంగముతో తనివితీరని త్యాగరాజులు కలిసి యేకైక తనువుగా నెత్తినజన్మము కాబోలు నారాయణదా సావతారము.



# సంగీతము - దాస హృదయము

శ్రీ గుండవరపు లక్ష్మీనారాయణ M. A.

ఆదిభట్ల నారాయణదాసుగారు ఆట పాట మాట మీటలయందు దీటులేని మేటి. సంగీత విద్వాంసులకు మహాసంగీత విద్వాంసులుగ, నృత్యకళామర్మజ్ఞులకు మహానృత్యకళామర్మజ్ఞులుగ, సాహితీవేత్తలకు మహాసాహితీవేత్తలుగ దర్శనమిచ్చిన సర్వకళాపరిపూర్ణులు. సర్వజ్ఞ సార్వభౌములు. వారి బహుముఖ ప్రతిభాసరస్వతీ విలాసములకు హరికథ ఒక అనువైన ఆధార రంగస్థలము. హరికథకు గజ్జెకట్టువఱకు దాసుగారు కేవలము హరిదాసు. గజ్జెకట్టిన తరువాత ఆయన హరిదాసు కానేకాదు. కొంతసేపు మహానటుడు. కొంతసేపు మహాగాయకుడు. కొంతసేపు విద్యాస్నాతకులనుగూడ తికమకపెట్టించు విద్వద్విద్వద్వరుడు. కొంతసేపు కడుపుబ్బనవ్వించు విదూషకుడు. అది యిది యననేల? సభాభిరుచినిబట్టి యేదైన కాగల మూర్తీభూత సకలకళాకీర్తి.

బహుబిరుదాంచితులు, బహుముఖ ప్రజ్ఞాధురంధరులైన దాసుగారి పర్జన్య గర్జాగంభీరమైన శారీరమును నేడు మనకు విను భాగ్యము లేదు. వారి నాట్యమును చూచుటకు మనము నోచుకొనలేదు. నేడు వారి ప్రతిభను ఊహించుటకు ఉన్నవి వారి గ్రంథములు మాత్రమే. ఆ గ్రంథములు దాసుగారి ప్రతిభా ప్రకాశములోని కొన్ని కిరణములు మాత్రమే. వారి ప్రతిభ ప్రధానముగా వ్యక్తినిష్ఠము. వస్తునిష్ఠము కాదు.

దాసుగారికి సాహిత్యము నందెంతటి ప్రావీణ్యమున్నదో సంగీతము నందు కూడ నంతటి ప్రావీణ్యమున్నదని సమకాలిక మహాపండితజన శ్రుతి. ఒక విద్యలో నైపుణ్యమున్నదని మఱియొక విద్యలో నైపుణ్యము లేదని చెప్పుటకు వీలులేదని వారి లభ్యకృతుల ఫలశ్రుతి.

దాసుగారి ప్రతిభలో ఏకదేశమైన వారి గ్రంథసముదాయమును బట్టి, సంగీతముపై వారికి గల అభిప్రాయములను సమీక్షించి సమీక్షింతము.

సంగీత సాహిత్యములు రెండు దాసుగారికి రెండు నేత్రములు. వారికి వానిపై వామదక్షిణ వ్యత్యాస భావముకూడ లేదు. రెండును వామ నేత్రములే. రెండును దక్షిణ నేత్రములే. ఆ సంగీత సాహిత్యముల అవినాభావ సంబంధము ఈ సరస్వతీ స్తనంధయునకు రకరకములుగ స్ఫురించినది.

"సంగీత సాహిత్యాత్మకమై విద్య రెండు విధముల నున్నది. సంగీతముపని మఱియు సాహిత్యము ఆ పని నొనర్చు తెలివి; దృశ్యము సంగీతము దృక్కు సాహిత్యము; సంగీతము జగమును సాహిత్యమాత్మయును; సంగీతము పౌరుషము సాహిత్యముదైవము; సంగీతము భోజ్యము సాహిత్యము భోక్త; లోకోపకారము సంగీతము లోకోపకారము సలుపు నేర్పు సాహిత్యము; సంగీతము ప్రకృతి సాహిత్యము పురుషుడు; సంగీతము లౌకికము సాహిత్యము పారమార్థికము; సంగీతము జగత్తు సాహిత్య మీశ్వరుడు; సంగీతము వికృతి సాహిత్యము ప్రకృతి; సంగీతము జీవితము సాహిత్యము మరణము; సంగీతము మిథ్యయు ననిత్యమును సాహిత్యము వాస్తవమును శాశ్వతమును; సంగీతము సగుణము సాహిత్యము నిర్గుణము."[1]

"గీతం వాద్యంచ నృత్యంచ త్రయం సంగీత ముచ్యతే"[2] అను

---

1) జగజ్జ్యోతి - ద్వితీయ సంపుటము పుట 370

2) జగజ్జ్యోతి - ద్వితీయ సంపుటము పుట 302

గాంధర్వవేద నిర్వచనమందు నమ్మకమున్నవారు దాసుగారు. అంతే కాక శ్రుతిలేని పాట సమ్మతిలేని మాట యనురీతిగా "సమ్యగ్గీతం సంగీతమ్" అని భావించినవారు.

సర్వ విద్యలు భగవత్ప్రసాదితములనియు, ఆ విద్యలన్నియు భగవదంకితములైనపుడే యవి సార్థకములనియు వీరు మాటిమాటికి చెప్పు మాట.

> "వేల్పులం గొల్చుకొనుటకు వీలుకాని
> యాట పాట చదువులెల్ల బూటకములె"1

సర్వ విద్యలలో స్వరవిద్య ఉత్తమోత్తమైన విద్య. పండితులను, పామరులను ఉఱ్ఱూతలూగించి ఆనందపరవశులుగ జేయునది సంగీతము. ఇట్టి సర్వజన హృదయంగమమైన సంగీత విద్యను నేర్చినవాడు మాత్రమే లోకరంజకుడు కాగలడనియు, అట్టి లోకరంజకుడైనవాడే విద్వచ్ఛ్రేష్ఠుడనియు దాసుగారి స్థిరాభిప్రాయము.

"సర్వజనరంజకుడైనవాడే నిక్కమగు శ్రోత్రియుడు. విద్వాంసుడు. బ్రాహ్మణుడు మఱి యార్యుడనదగువాడు"

"షడ్జాది సప్తస్వర జ్ఞానము లయజ్ఞానమును మఱి చతుర్విధాభినయ జ్ఞానమును గలిగి సర్వజన సమ్మతముగా బ్రతుకువాడే మనుష్యుడు. వేయేల? శ్రుతి లయజ్ఞానములు లేనివాడు మాతాపితృ ద్రోహియును, లోకద్రోహియునగు నొక క్రూర జంతువగునుగాని నిక్కముగా మనుష్యుడు కానేకాడు."2

దాసుగారి ఈ వాదమును తీవ్రవాదమనక తప్పదు. సృష్టిలోని ప్రతిమానవుడు సంగీత విద్వాంసుడగుట అసంభవ విషయము. ప్రతి వ్యక్తి సంగీత విద్వాంసుడైనచో అప్పుడు సంగీతము మానవ సామాన్య

1] మేలుబంతి - పుట 129

2] జగజ్జ్యోతి. ద్వి. సం. పుట 299.

ధర్మమగును. కాని విశేషముకాదు. ప్రతి మానవుడు ఆపాత మధురమైన సంగీతమును విని ఆనందించు హృదయము కలవాడు కావలెనని వీరి యభిప్రాయమై యుండవచ్చును. సంగీతమునకు హృదయ స్పందనము కల్గనివాడు మానవుడుకాడని దాసహృదయము. దాసుగారి వక్కాణ యందలి ఉత్తరార్థమునకు "శ్రుతిర్మాతా లయః పితా" అను ప్రాక్తన సూక్తి లక్ష్యమైయుండును.

సభారంజకముకాని స్వరవిద్య ప్రయోజనశూన్యమని దాసు గారి దృఢాభిప్రాయము. "సభారంజకమ్ సంగీతమ్" అను లక్షణమునకు లక్ష్యమైనవారు దాసుగారు.

"ఆట పాట మాట అందఱుమెచ్చగ
పెక్కువేలమంది క్రిక్కిరిసిన
గొప్పకొలువు చూరగొనువాడొకండె ని
క్కముగ మేటి చదువరి మొనకాడు!"1

దేశకాల పాత్రోచితముగ సమకాలిక ప్రజల యభిరుచి ననుసరించి శాస్త్రవిద్యను సమకూర్చుకొని ప్రజల కానందము కల్గింప వలెనని వీరి విన్నపము. అప్పుడే విద్య జనరంజకమగునని వీరి తాత్పర్యము. జనరంజకము కానిచో పరమప్రామాణికమైన వేద స్వరమునైన కాలానుగుణముగ మార్చవచ్చని దాసుగారి స్వతంత్రబుద్ధిజన్యవాదము.

"లౌకికస్వరమునకు వైదికస్వరము కారణమైనప్పటికి దేవుడు జగత్తునకు కారణమైనప్పటికి ఎట్లతీంద్రియగ్రాహ్యుడో యట్లే యతీంద్రియమునైక్యవిదితమేగాని లోకవేద్యము కాబోదు. మఱి మానవులచే బ్రయోగింపబడ సాధ్యముకాదు. జనరంజకముకాని వేదస్వరమునకై మనుష్యులు తంటాలుపడుట సూర్యబింబముం జౌరం బ్రయత్నించుట వలె వ్యర్థము"2

---

1] మేలుబంతి - పుట 130

2] జగజ్జ్యోతి - ద్వి - సం- పుట 296.

"తస్మాద్విద్వాన్ ప్రేవ వదేత్ వీవ నృత్యేత్ దాన కామా అస్మై ప్రజాభవంతి" అను శృతి సూచన ననుసరించి సకలజనరంజకుడే విద్వాంసుడను దానిని నమ్మినవారు.

ఈ సంగీతము విద్వాంసునకు "ముక్కు సెవులట్లు మేనితో పుట్ట వలయును"-అంతేకాని "ఈవు దంచుము ప్రక్క లే నెగురవైతు" నన్న సామెతగానుండు సంగీతము సంగీతము కాదని దాసహృదయము.

"ఆట పాటల నేర్పు తనంత గలుగ
వలయుగాని చదువుకొంట వలనరాదు." 1

ఆట, పాట, మాట, మీటల నేర్పు కృత్రిమముగా నుండరాదనియు ప్రకృతి సిద్ధములుం గావలెనని వారి తలంపు.

"క్రొత్తగా గవకూడుకొన్న యాల్మగల స
యాటకు మించిన యాట యేది ?
లేయాడువన్నోర్కె లేకయే వెలువడు
పాటకు మించిన పాట యేది ?
తల్లిదండ్రుల యొడి న్పిల్లల జిలిబిలి
మాటకు మించిన మాట యేది ?
కూటమి ముద్దుల గుసగుస లీలల
మీటకు మించిన మీట యేది ?

కూటికై దేవులాడెడు కొంటెయాట
పాట లవియెల్ల వెలయాలి వగలమాడ్కి
పూట కూళ్ళింట గొసరిడు బువ్వలాగు
తొక్క మున్వెచ్చపెట్టు, బర్వు చెడగొట్టు" 2

ఆటపాటలిట్లు సహజసుందరములై నవ్వాడే రాణించునుగాని పడికట్ల బంధనములతో రాణింపవు.

1. మేలుబంతి పుట 111.
2. మేలుబంతి పుట 115.

కన నింపుకాని దాటా ?
విన సొంపొదవింపని గడబిడ యొకపాటా ?
తనవి నెృంచుటకన్న
నృనులకు మతి లేనిపోని పడికట్లేలా ? 1.

"తమ తమ పుట్టిన నాటు పల్కులు తేటతెల్లముగా నెల్లరికి న్దమ తలంపులన్నియు న్వెల్లడియగు తీరున దమ తమ కనువైన రవళి వడు తేర్పర్చుకొని తోచినట్లెల్ల నాటపాటల వింతవింత చవుల న్బొగిచి పిన్నపెద్ద లందరికి న్వారివారి కలవడిన యే సొంపు పెంపార నింపుగావింప నొప్పును. తన పుట్టిన నాటూట పాటమాట లాయా యేచలంబట్టి తోటి పాటివారలు మెచ్చుతీరున దన తోచినట్లెల్ల వెల్లడించుట కన్న దగు కట్టుబాట్లెట్టి మాటకారి లయకానికైన న్బనికిరాదు. ఎచ్చట న్బుట్టి పెరిగినవారి కచ్చటి యాట పాట మాట లలవాటు కొలంది న్జవిగొల్ప జాలినట్లు లాతివి గానేరవు" 2.

తలయూపుట, మెడను ద్రిప్పుట, శరీరమంతయు ఎగురవేయుట వ్యాయామమగునుగాని సంగీతము కాదని దాసుగారి హేళనము.

అట్టి వేడబములు గల్గిన తమిళుల సంగీతముపై దాసుగారి కసహ్యాభావము.

''రెండు నాల్కల త్రైర్వడ గాంద్ర పాట
వారిచే చమురంటని బాతు చేట
మనము తెలుగు వారమిక నేమఱక యఱవ
బొల్లి యొకరింత వాలక మొల్ల దగదు''

తెనుగుభాష యఱవల దాడపాటకు సరిపడదనియు, తెనుగు నసహ్యించుకొనెడి యఱవలను వెలివేయవలెననియు దాసుగారి పత్రికా ముఖ ప్రకటనము.

---

1. మేలుబంతి పుట 111.
2. వైశాఖి పత్రికలో ప్రకటితమైన పల్కుముచ్చట యను వ్యాసము.

"తెలుగు కిట్టని యఱవల వెలి యొనర్చ
వలయు నన్నిట నిర్గున్న తెలుగువారు
అద్దె యిచ్చి యేడ్పించెడు నఱవకొయ్య
ద్రిప్ప దౌడ పాటకు దేట తెనుగు పడదు"

"పిక్కుచిట్టి పల్లింపు తబ్బిబ్బు పాట
పొసగ గొంతు తెఱవలేని ముక్కుమాట
కంపు తీగ పరంగి వాయింపు తాట
యనువు కాదు తెనుగుచోట నఱవయాట" 1

తెనుగునేల సంగీతమునకు చాల అనువైన చోటని నారాయణ దాసుగారి యభిప్రాయము. ఈ యభిప్రాయము మాతృదేశ భక్త్యావేశ పూర్వకమైనదికాక తర్కసహము.

"గొంతులేవదు మంచు మిక్కుట మగునెడ
కడిది వేడి కుత్తుక నిలుకడ నడంచు
శాళమౌ చలి యెండల న్బరగు గనుక
దెలుగునాటు దాపలి చోటు - పలుకునేటు" 2.

మంచధికమైనచో గొంతు లేవదు. ఉష్ణమధికమైనచో గొంతుకు నిలుకడయుండదు. తెలుగునేల సమశీతోష్ణ ప్రదేశము. సంగీత సాధనమునకు సరియైన స్థలము. తెలుగుభాష అజంతమైన చక్కనిభాష. మార్దవ మాధుర్యములకు ఇటాలియన్ ఆఫ్ ది యీస్ట్ అని ప్రశంస లందుకొన్న భాష. సంగీతమునకు సరిపడుభాష. ఈ రహస్యము నెఱిగిన వారగుటచే తమిళులు త్యాగరాయల కృతులన్నియు తెలుగులోనే యున్నను వానిపై వల్లమాలిన మక్కువ పెంచుకొనిరి. తమిళ దేశమును పాలించుచున్నను మహారాష్ట్ర ప్రభువులు తెలుగుభాష నాదరించిరి. ఆ ప్రభువులు సంగీత ప్రియులు మాత్రమేకాదు. సంగీత శాస్త్రజ్ఞులు కూడ. తుక్కోజీ ప్రభువు 'సంగీత సారామృత' శాస్త్ర గ్రంథకర్త. ఆ మహా

1. ఆద్వర్తయిజరు పత్రిక 1-4-1942.
2. తెలుబంతి పుట 117.

రాష్ట్ర ప్రభువుల ఆస్థానములలోని కవులందరు తెనుగున యక్షగానములు వ్రాసినవారే. సంగీత కళారహస్య నిధియైన దాసుగారి భావముకూడ నిదియే యగుటకు కారణమిదియే. దాసుగారి యభిప్రాయము వాస్తవము కాని మాతృదేశ స్తవముకాదని సారాంశము.

ఆట పాటలు మైకపు చదువులనియు, అవి యే జాతిస్త్రీలకైనను నేర్వరాదనియు దాసుగారి భావము.

"ఆటపాటలమరులు కొన్నట్టివారు
కాపురమునకు గొఱగారు - కనుక గోరి
మగువలకు మైకపు చదువు మప్పరాదు
తెల్వి తేటలుగల నాల్గుతెగల మగలు" 1.

లోకమందలి ప్రతివ్యక్తి ఆటపాటలకు పనికిరాదని దాసుగారి స్వానుభవపూర్వకమైన సందేశము.

"ఆటపాటల నేర్పరులగు లౌకిక మనుష్యులు గంధర్వులన బడుదురు. కామ్యకర్మపరులగు శ్రోత్రియు లాటపాటలకు బనికిరారు. సుందరాకారము లేనివాడు గంధర్వుడు గానేరడు. కాబట్టి యాట పాటల కందగాడు తప్ప కురూపి తగడు. అంత పొడవున్నాక యంత పొట్టియున్నాక లాఘవముగల యవయవములు కలిగిన సుందరాకారు డొక్కడే యాడుచుం బాడుట కర్హుడు గాని గుడ్డి, సొట్ట, మూగ, చెవిటి, ముక్కిడి, నత్తి, బోసి, కాకినల్పు, పిల్లితెల్పు, పాఱపళ్లు, చీపి కనులు, రేచీకు, పుప్పిగోరు, చెమటచేయి, తొట్టపెదవి, బొట్టముక్కు, పేడిగడ్డము, బూరెబుగ్గ, పట్టతల, పిలుకజుట్టు, బొచ్చుమేను, తుప్పతల, తట్టపాదము, తుంబకడుపు, దిబ్బపిఱ్ఱలు, పిట్టకాళ్లు, బోరగుండె, బక్క మెడ, యెండుదాడలు మొదలగు వికారములు కలవారుకాని, యధి కాంగులుకాని, న్యూనాంగులుకాని, దీర్ఘరోగులుకాని యాటపాటలకు

1. మేలుబంతి పుట 117.

రవంతయు న్గొఅగారు. సహజముగా నవయవ లోపముగల వికార రూపముల సంగీతసభల న్బైట్టించుకొన్న వారికేదో ముప్పు వాటిల్లక మానదు" 1

దాసుగారి చెప్పిన ఈ లోపములలో ఏదో యొక లోపములేని ఆటపాటల విద్వాంసు డుండుట కష్టవిషయము. దాసుగారు ఈ లోపము లేవియు లేని సుందరాకారులు. ఆయన విషయము వేఱు. ఆయన ఎన్నో విద్యలతో, ఎన్నో హంగులతో దైవముచే ప్రత్యేకముగా సృష్టింపబడిన కారణజన్ముడు. సరస్వతీ స్తనంధయుడైన చతురాస్యుడు. చతురాస్యుడైన పుంభావ సరస్వతి.

దాసుగారి మతమున సంగీత విద్వాంసుడు సుందర స్వరూపుడైనంతనే చాలదు.

"వ్రేలు నమలరాదు వడిరవళులతోడు
తప్పరాదు నెత్తి త్రిప్పరాదు
చెప్పుకొన్న ముక్క లప్పగించ న్రాదు
దుడ్డు కోర గూడదు లయకాడు.

డొంగ తన మెన్నడు న్జేయడు లయకాడు
వెలితి మాటాడ డెప్పుడైన లయకాడు
తినడు నంజుడు చంపడెద్ది లయకాడు
గొప్ప చదువరి మిన్నయగు లయకాడు." 2

కళాకారునకు ఉత్తమశీల ముండవలెనా? ఉత్తమశీలము లేకున్నచో కళాకారుడు కాడా? అను సందియములు వెంటనే కల్గును. ప్రతిభ వేరు. నిత్యజీవితము వేరు కదా!

1. "గానము అను వ్యాసము.

2. ఆంధ్రగాయక మహాజనసభ - గుంటూరు- అధ్యక్షోపన్యాసము. [27-6-1931]

కాని దానికి దాసుగారి అభిప్రాయమిది. కళావేత్త సామాన్య మానవునికన్న నిస్సందేహముగా గొప్పవ్యక్తి. గొప్పవ్యక్తిని లోకము పరీక్షించుచుండును. గొప్పవ్యక్తి యగు కళావేత్త శిష్టప్రవర్తనము కలవాడై మార్గదర్శకుడుగా నుండవలెనని నారాయణదాస హృదయము.

భగవద్దత్తమైన ప్రతిభను స్వార్థపరుడై జీవనవృత్తిగా మార్చు కొనరాదని దాస మతము.

"ధనాశలేని వేద విద్వాంసుడు హరికథాసంకీర్తనమున నృత్య గీత ప్రావీణ్యమున జనసత్కారము పొందుట మేలు గాన యబ్బడ్డ వాడెల్ల స్వార్థపరుడై డబ్బాసతో నాటపాటలమీటల జీవనవృత్తిగా జేసికొని తా జెడ్డ కోతి వనమెల్ల జెఱచు నట్లొరుల మోసపుచ్చి తా మోసపోక తప్పదు" 1

"కూటి కక్కూర్తి నాడిన దాటకాదు
పాడినది పాట కాదెదో చీదకాని
లాతికి న్లొంగి కడు తగులమున జిక్కు
మంది కన్న మిగుల కాఱుపంది నయము" 2.

ప్రతి వ్యక్తియు నుత్తమ వాగ్గేయకారుడు కాలేడు. అనేక విధములైన సామర్థ్యము కలవాడే ఉత్తమవాగ్గేయకారుడు.

"శ్రుతి స్మృతి విజ్ఞానము, శబ్దానుశాసనజ్ఞత, అభిధాన ప్రవీణత, ఛన్దః ప్రభేద వేదిత్వము, అలంకార కౌశలము, రసభావ పరిజ్ఞానము, దేశస్థితి చాతురి, నానాభాషా వైశద్యము, సర్వాకాకు విశారదత్వము, కళాశాస్త్ర నైపుణి, తూర్య త్రితయ చాతుర్యము, హృద్య శారీర శాలిత, లయకాల కలా జ్ఞానము, ప్రభూత ప్రతిభోద్భూత భాక్త్వము, సుభగ గేయత, దేశీయ రాగాభిజ్ఞత్వము, వాక్పటుత్వము, సభా విజయ

1. 'గానము' అను వ్యాసము.
2. ఆడ్వర్టయిజర్ పత్రిక (1-3-1944)

సామర్థ్యము, రాగద్వేష పరిత్యాగము, ఉచితజ్ఞత, సార్ద్రిత్వము, అనుచ్ఛిష్టోక్తి నిర్బంధము, నూత్నధాతు వినిర్మాణ దక్షత, పరచిత్త పరిజ్ఞానము, ప్రబంధ ప్రగల్భత ద్రుతగీత విరచనా నైపుణి, పద్యాంతర విదగ్ధత, త్రిస్థాన గమనప్రౌఢి, వివిధాలప్తి నిపుణత, విశేష వధానశక్తి, రమ్యరూపము, స్వేచ్ఛా సంచారము, స్వతంత్ర జీవనము వాగ్గేయకారుడగు నుత్తమ కథకుని లక్షణములు." 1

లోకమునందు పద్యమునుగూడ గద్యమువలె గొణుగుచు చదువవచ్చని కొందఱందురు. ఈ యభిప్రాయమును ఏమాత్రము లెక్కజేయరాదనియు, గీతములను సుస్వరముతో పఠింపవలెననియు దాసుగారు పద్యపఠన కర్తలకు చేసిన హెచ్చరిక.

"పఠనశక్తి జనరంజకము కానపుడు రుచ్యముగ జదివి సుస్వరముగ బాడలేనపుడు ఛందోలయలతో బనియేమి? మనసులో జదువుకొనుట చెల్లునుగాని వర్ణాత్మకముగాగాని కేవల ధ్వన్యాత్మకముగా గాని యెలుగెత్తి సుస్వరముగ బఠించినపుడు కదా గద్య పద్యగీతములకు సార్థక్యము." 2

సంగీత కళను లోకమందు అపమార్గము పట్టించు ముదిరిన మనుష్యులు రెండు రకములట.

"సంగీత కుఠారములలో నానవేసిన గొడ్డళ్ళు, నానవేయని గొడ్డళ్ళని రెండు తెఱంగులు. సహజ కృత్రిమ సంగీతములు వ్యయ ప్రయాసములతో వినుచుం గనుచు వెట్టియానంద మానందించుచుండియు నాడెము కట్టలేక నందిం బందియనియుం బంది నందియనియుం దెలిసినట్లు నటించి యభిప్రాయ మిచ్చు రసికమ్మన్యులు మొదటిమచ్చు. సంగీత మందభిరుచియే లేనివారు రెండవ రకము. లోకమందలి ముదిరిన మనుజులలో బలువు రీ రెండు విధములలో జేరిన వారే" 3

1. ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక [1911]

2. అంబరీష చరిత్ర పీఠిక,

3. వ్యాసపీఠము - పుట - 183

ప్రతిభ ఒక కళ. శాస్త్రముకాదు. కనుక ప్రతిభకు కొలతబద్దలు లేవు. పోలికలులేవు. ఎవరిప్రతిభ వారిదే. ఎవరిప్రతిభను వారే గమనించి దాని ననుసరించి ప్రవర్తింపవలెను. ఒకరు చేసిన పడికట్లపై ఆధారపడ రాదని దాసుగారి సలహా.

ఆట పాటల యెడ నందరు నొక్కటే
యొక్కొక్క పల్కున కొక్కొక్క చవి
ఎవరంతవారు వారెవ్వారి పడికట్లు
వారి వొకరొకరి దూర రాదు.
కుత్తుక విని నేర్చుకొనవలయు న్నాట
చెలువము కనిపెట్టవలయునాట
వ్రాతలు పనిముట్టు వ్రోత లుసులు తెల్వి
తేటల యందము న్దెలుప లేవు.
తన్నుగన్నవారి నెన్నజాలక తన
నాటుమాట సరిగ జాటలేక
పిక్కపెట్టు వాల్గు ముక్కల దెగనీల్గు
కొంటె ములచ బ్రతుకు కూటిచేటు. 1

జనసమూహామును, ఇరుగుపొరుగులను మెప్పించెడి విద్యయే విద్య. ఎవని కళకై ప్రజలు తండోపతండములుగ పర్వులెత్తెదరో వానిదే కళ. వేలవేల ప్రజలకెవడు ఆనంద మొసగజాలునో వాడే కళావేత్తయని దాసుగారి విశ్వాసము.

ఎవని నడత చూచి యెల్లవా రడకువ
కొందురో వానిదే గొప్ప యాట
ఎవని కుత్తుక విననెంతురో యందఱు
వానిదే కడు లెస్సయైన పాట
ఒరుల మేలున కైప డొడలప్పగించునో
యా వానిదే నిజమైన మాట.

1. ఆంధ్రగాయక మహాజనసభ - అధ్యక్షోపన్యాసము: [27-6-131]

ఎవ డిర్గుపౌర్గుల నెల్ల మెప్పించునో
యవ్వానిదే సుకుమారైన మీట

మాట పాటాట మీట లెచ్చోటనైన
దెల్లముగ విని కనువారి కెల్ల నెపుడు
పిన్న పెద్దలకు స్వేనవేల కెవడు
సలుపునో హాయి యట్టివాడె లయకాడు, 1.

సంగీత విద్వాంసుని గూర్చి శ్రుతులు, వేదాంగములు, స్మృతులు పురాణములు, నీతిశాస్త్రములు, కావ్యములు ఎట్లు ప్రశంసించుచున్నవో యొక సీసమాలికలో గుదిగ్రుచ్చినారు దాసుగారు.

చక్రవర్తికి గూడి సంగీత కోవిదు
నకు బుట్టు నానందము కలుగదు
విద్వాంసుడెంతయున్ విధిగ నృత్యము చేయ
వలయు నతడె దాన పాత్ర మగును
సిరిగోరు నాతని చెంగట ప్రోగించ
బడెడు వీణియ యజ్ఞవాట మందు
వాగ్గేయకారులౌ బ్రాహ్మణ క్షత్రియ
వైణికు ల్తప్పక పాడవలయు
దమ రచించిన సత్కథలని శ్రుతులును; ద
క్షిణ కర్ణమున బుత్రశిష్యహితము
వలచి సప్తస్వరంబుల నుపదేశింప
వలయు నాచార్యు, డపస్వరమగు
నాశీర్వచోఽక్షత లశనిపాతంబు, లం
గుళులందు నగ్వ్యపద్ధతులగుపర్చు
నతడె వేదాచార్యుడనబడు స్వరవైప
రీత్యముచే జెడున్ వృత్రు పగిది
ననుచు వేదాంగముల్; స్వాధీనమగును సం

1, ఆంధ్రగాయక మహాజనసభ అధ్యక్షోపన్యాసము. (27-6-'31)

గీతవేత్తలకు ముక్తి యని స్మృతులు;
అన్నవస్త్రములు శిష్యాళి కుపాధ్యాయు
లకు నెలజీతముల్ సరిగనిచ్చి
నాట్య వేదమును భూనాయకుల్ నేర్పించ
వలయును, గానముపలె మఱేదియు
గావింపజాలదు దేవునకున్ దృప్తి
యని పురాణములు; తౌర్యత్రికజ్ఞు
గాయనాధ్యక్షుగా జేయక తీరదు
రాజంచు నీతిశాస్త్రములు: మఱియు
సంగీత సాహిత్య సారానభిజ్ఞుడు
కడు మొండి పశువని కావ్యములును. 1

నిష్ణాతుడైన గాయకునకు సంగీత శాస్త్రమునందు చెప్పబడెడు రక్తము పూర్ణము, అలంకృతము, ప్రసన్నము, వ్యక్తము, వికృష్టము, శ్లక్ష్ణము, సమము, సుకుమారము, మధురము అను దశ విధ గుణములు తప్పక యుండవలెనని దాసుగారి సంప్రదాయానుసరణ భావము.

వీణా వాదన తత్త్వజ్ఞునకు మోక్షము సులభముగ లభించునని చెప్పుటకు

వీణా వాదన తత్త్వజ్ఞః శ్రుతి జాతి విశారదః
తాళజ్ఞశ్చా ప్రయాసేన మోక్షమార్గం నియచ్ఛతి

అను యాజ్ఞవల్క్యుని స్మృతివచనమును మాటి మాటికి ప్రమాణముగా గ్రహించుట దాసుగారి కొక యలవాటు.

దాసుగారి మతముప్రకారము వీణ, నాగస్వరము, చప్పట్లు, దుందుభి, యాహానని (వీరణము), శంఖము అను ఆఱు వాద్యములే వేద చోదితములు. ఈ వాద్యములందు వీణ యన్నచో దాసుగారికి ఎక్కువ మక్కువ. వీణకు గల వేద ప్రామాణ్యమును జెప్పిరి. వీణాకారమును వర్ణించిరి. వీణ నెటువంటి యోగ్యుడుప యోగింపవలెనో సూచించిరి.

1. మేలుబంతి పుట 110.

వీణయొక్క ప్రాశస్త్య కారణమును

> "పదివేల్లు గోళ్లతో బనిచేయదగిన
> వాద్దెము వీణెతప్ప మఱేదికాదు
> వాద్దెము లన్నిటన్ బాదుసా వీణె" 1.

అని వివరించిరి. వీణెకానికి మించిన విద్వాంసుడు లేడని దాసుగారి వీణా స్తుతి.

స్వరవిద్య సర్వోత్తమ విద్యయని దాసుగారి నమ్మకము.

> "కొసరి సంగీతసాహిత్య రసికులెల్ల
> హాయి హాయి యనంగ దా నాడి పాడి
> అఖిలదేశంబులందు ప్రఖ్యాతి గన్న
> భాగవతుని కన్న సమ్మాన పాత్రుడెవడు ?" 2.

అట్టి మహాభాగవతు డెవ్వరో కాదు- అన్ని కళలందు దిట్ట శ్రీ ఆదిభట్టయే.

---

1. మేలుబంతి పుట 123.
2. మేలుబంతి పుట 184.



# ఆధునిక వాగ్గేయకార తారాపతి

శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు, M. A.

వాగ్గేయకారగురులైన త్యాగరాజస్వామి జననానికి 97 ఏళ్ళ తరువాత, స్వామివారు సిద్ధిపొందిన 17 ఏళ్ళకు 1864 లో ఆంధ్రదేశంలో ఉత్తరాన ఉదయించిన వాగ్గేయకార తారాపతి శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాసులు.

నృత్య గీత వాద్య విద్యలు మూడింటిని ఒంట పట్టించుకొన్న ఈ కళానిధి. గాత్రగానంలోను వీణావాదనంలోను అందెవేసిన మహాపండితుడు, సంస్కృతాంధ్ర పారశీకాంగ్లభాషలలో అపూర్వ వైదుష్యముగల ప్రజ్ఞావంతుడు, అష్టభాషావేత్త, అష్టభాషాకవి, భరత, వ్యాకరణ, జ్యోతిషశాస్త్రములలో పండిత ప్రకాండులను గడగడలాడించిన ప్రతిభాశాలి. సువర్ణఘంటాకంకణ హస్తులు! గాయకులై-కవులైన వాగ్గేయకారులలో ఈయన వంటి భాషావైదుష్యవంతులు 'నభూతో నభవిష్యతి' అనిపించుకొనగల్గిన అద్వితీయుడు.

వీరిలో బాల్య ప్రాయంలోనే అంకురించిన గేయసుభగత, క్రమంగా వర్ధిల్లి వాగ్గేయకారకత్వమునకు దారితీసి, హరికథా పితామహునిగా అందలం ఎక్కించింది.

ప్రాచీన మధ్యయుగాలలోని సంగీత నాటకరూపమైన యక్షగాన ప్రక్రియకంటె దాసుగారి హరికథలు మహారాష్ట్ర సంప్రదాయాన్ని

అనుసరించి దక్షిణదేశ సంస్థానాలలోను, ఆలయాలలోను 2 శతాబ్దాల క్రితం ఆరంభించిన కథాకాలక్షేప ప్రక్రియకే దగ్గరగా ఉంటాయి. 18-వ శతాబ్దంలో గోగులపాటి కూర్మనాథకవి రచించిన మృత్యుంజయ విలాసము యక్షగాన ప్రక్రియను పూర్తిగా అనుసరించి ఉంటుంది. మునిపల్లె సుబ్రహ్మణ్య కవి రచించిన అధ్యాత్మరామాయణమూ తాళ్లూరి నారాయణకవి రచించిన మోక్షగుండ రామాయణమూ సంకీర్తనాత్మకములైన ఆఖ్యానములుగానే చెప్పుకోవాలిగాని, అవి అటు యక్షగానానికిగాని, ఇటు హరికథకు గాని పరిణామ క్రమంలోను, ప్రక్రియా స్వరూపంలోను అంతగా బాంధవ్యం ఉన్నట్లు భావించకూడదనిపిస్తుంది.

21 హరికథాఖ్యానాలను రచించి, వాటిలో తన సంగీతసాహిత్యముల ఉభయరచనాదక్షతను ప్రదర్శించి, స్వయంగాను, సమర్థులైన శిష్యులద్వారాను హరికథా ప్రచారముచేసి, 19-వ శతాబ్ది చివర ప్రారంభించి, తన జీవితకాలంలో హరికథకు పండితపామరజనసందోహాలను భక్తిరక్తి హృదయాలతో తన్మయులనుచేసి, హరికథాపితామహులుగా అద్వితీయ ప్రఖ్యాతి పొందారు.

దాసుగారి మిగిలిన హరికథలన్నీ ఒకయెత్తు - జానకీ శపథము ఒకయెత్తు. మిగిలిన అన్ని కథలలోను సంగీత సభా సంప్రదాయంలో ప్రచలితములై ప్రసిద్ధిపొందిన సాధారణ రక్తిరాగాలను ఎక్కువగా వాడారు. కాని, జానకీశపథంలో మాత్రం మేళకర్తరాగాలలో గోజన్య రాగాలలోగాని సమకాలిక విద్వాంసులు తరచుగా ప్రయోగించని రాగాల నెన్నిటినో వాడారు. అవి మంజుల, కనకాంగి, వనస్పతి, ఝుంకారధ్వని,. ధవళాంబరి, నీతిమతి, సుచరిత్ర, నవనీత, కోసలము, భవాని, ఝాలవరాళి, గవాంభోధి, మారరంజని, శూలిని, రఘుప్రియ, భోగవసంతకం, ధాతువర్ధని, పావని, రసిక ప్రియ, విశ్వంభరి, వరుణప్రియ, యాగప్రియ, హాటకాంబరి. శ్యామలాంగి, సేనావతి, దివ్యమణి, జ్యోతిస్వరూ

పిణి, కాంతామణి, నాసికాభూషణి, శారదాభరణం, గాంగేయభూషణి, చిత్రాంబరి, తానరూపి, మానవతి, రూపవతి- ఇత్యాదులు. జానకీ శపథంలో ఈ రాగాలలోని దరువుల మెట్లకు సాహిత్యంపైని స్వరాలు కూడా ప్రచురించడం ఒక విశేషం. మిగిలిన హరికథలలో అందరికీ తెలిసిన సర్వసామాన్య రక్తిరాగాలను వాడారు. జానకీశపథంలోని స్వరాలవల్ల, అందులోని అపురూపరాగాలలోని వరుసలద్వారా ముందు తరాలవారికి వారి సంగీతపాండిత్యమునూ కల్పనాచాతుర్యమునూ అక్షరబద్ధంచేసి అందించారు.

వీరి హరికథలన్నింటిలోను బహుజనరంజకమై సంగీతసాహిత్యముల రెండింటిలోను మాధుర్యమును, స్వారస్యమును ప్రకటించేది రుక్మిణీకళ్యాణము. ఈ కథలన్ని పాఠము చెప్పుకొన్న మొదటి తరపు శిష్యుల జీవిత కాలంలోనే వాటిలోని దరువుల సంగీతమును విద్వాంసులయినవారు అకాడమీల ప్రోత్సాహంతో స్వరపరచి, ముందుతరాల వారికి ప్రయోజనకరంగా ఉండేటట్లు ప్రకటించడం ఎంతైనా అవసరం.

హరికథలు గిరికథలు నీ
కర చేతులనిమ్మపండు లాజానుకరా !
సురలకును వెరపుగొలుపు న
పర భరతుడవీవెకావొ భవ్యచరిత్రా !

ఖంగున మ్రోగుగొంతు సితికంఠుని తారమునంటి పిల్వ, ధి
త్తాంగిట తోమ్మటంచును పదమ్ముల గజ్జెలు మోతమ్రోయ, తా
ళాంగము సవ్యహస్తమున లాస్యవిలాసత నందగింప, నీ
మంగళమూర్తి యింద్రసభ మాన్యము సేయుగదే పితామహా !

ఒక చరణంపుటందె పురుషోచిత తాండవశైలిచింద, వే
రొక పదనూపురమ్ము లలనోచితలాస్యవిలాసమొంద, నీ
వొకడవె వాచికాభినయమొప్పగ పాత్రలు నిర్వహించు నా
టకగతి యక్షగానముల డాబగజాపతి మెప్పునొందదో !

# సరస్వతీ వరప్రసాదుడు

విద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ, కవిశేఖర

## శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి

శ్రీ దాసుగారు రచించిన, హరికథారూప యక్షగాన ప్రబంధములు శ్రీ బాలాజీదాస, పరిమి సుబ్రహ్మణ్య దాస ప్రభృతుల హరికథా యక్షగానప్రబంధములకు మార్గదర్శకము లయినవి. ఆంధ్ర దేశములో ప్రఖ్యాతి పొందిన హరిదాసులు (భాగవతారులు) శ్రీదాసుగారికి శిష్యులో, ప్రశిష్యులో అయి ఉన్నారు. హరికథా వాఙ్మయ ప్రాచుర్యానికీ, హరికథాప్రదర్శన నైపుణ్యానికీ, మూలపురుషులు శ్రీనారాయణ దాసుగారే అయి ఉన్నారు.

కనుకనే-వీరు

"హరికథా పితామహ" బిరుదానికి సర్వవిధములచేతా పాత్రులయేరు. వీరి శిష్యులు - ఆంధ్రప్రదేశమంతటా వ్యాపించి యున్నారు. కీ. శే. వాజపేయాజుల-సుబ్బయ్యదాసాదులు కొందఱు కీర్తిశేషులయేరు. శ్రీనారాయణదాస ప్రతిభ - అనన్యసాధారణమూ, అప్రతిహతమూ అపూర్వమూ, అత్యద్భుతమూ, అనడంలో అతిశయోక్తి లేదు.

"వీరు మహాకవి గాయక నటనర్తక శిరోమణులు" అనే విషయం సామాన్య జనానికి సరిగా తెలీదు. ఇన్ని ప్రజ్ఞలుగలవారు - ఆంధ్ర దేశంలో వేరొకరు లేరనడం సాహసంకాదు.

పదార్థాభినయరూపమైన నృత్యములోనూ, వాక్యార్థాభినయ రూపమైన నాట్యములోనూ, సాటిలేని మేటి నేర్పుగల యీ మహా వాగ్గేయకారుడు - త్రిస్థాయిగమకములతో, రాగాలాపన నైపుణితో, కొండలను మాఱుమోగించే, సుస్నిగ్ధ దేవదత్త శంఖారావ రమ్యకంఠ స్వరముతో, నవనవరసమూర్తి అయి, సమవిభక్తమూ, సుదృఢమూ అరుణమూ, సుందరమూ అయిన సమున్నతాకారముతో, దినదిన ప్రవర్ధమాన యశస్సంపూర్ణ దిశదిగంతరుడూ, తృణీకృతబ్రహ్మపురంద రుడూ, దీర్ఘాయురారోగ్యభోగభాగ్యప్రాభవయుక్తుడూ అయి, యక్ష గాన ప్రబంధహరికథా ప్రయోగము చేస్తూ ఉన్నప్పుడు చూచినవారు- ధన్యాత్ములనడంలో సందేహంలేదు.

శ్రీనారాయణదాసుగారు నాటకీయ యక్షగానములను, మార్పు చేర్పు కూర్పులతో నూతనరూపములుగాచేసి, వాటికి యక్షగాన ప్రబంధములను పేరుపెట్టి, హరిభక్తిని ఉపన్యసించుచుతూ ఉండడం వల్ల వీటికి హరికథలను పేరు సార్థకమయింది.

శ్రీ దాసుగారు - గేయప్రబంధములలోని, కీర్తన పద్ధతినీ, రూపకములలోని నాట్యమును, దేశి రూపకములలోని నృత్యవిన్యాస మునూ, ప్రబంధములలోని వర్ణనాంశములనూ, వృత్తములను, జాతీయ ములూ, ఉపజాతీయములూ, అయిన తెలుగు పద్యములనూ, స్వకల్పిత ములయిన కొన్ని పద్యములనూ, మాత్రాఛందములోని గేయములను చేర్చి, యక్షగాన ప్రబంధములకు నూతనరూపము కూర్చిఉన్నారు.

ఆంధ్రప్రబంధములలో ఉన్న, ఉత్పలమాల చంపకమాల, శార్దూలము, మత్తేభము, అనే వృత్తాలను తఱచుగా వాడి ఉన్నారు. మత్తకోకిల, తరళ, లయగ్రాహి స్రగ్విణీ, తోటకము, మంగళమహాశ్రీ, మాలిని, పంచచామరము, మున్నగు వృత్తాలను అరుదుగా ప్రబంధాలలో వలెనే వాడి ఉన్నారు.

కందము, సీసము, తేటగీత, ఆటవెలది, ద్విపద, మంజరి, తరువోజ రగడ, మొదలయిన, జాతీయోపజాతీయ పద్యములను వాడి ఉన్నారు. "తోహారాలు" మహారాష్ట్ర హరికథలనుంచి తీసికొనబడి ఉంటాయని కొందఱు విమర్శకులు ఊహిస్తున్నారు. శ్రీ దాసుగారు - ఈ తోహారాలనే - మంజరులనే పేరుతో వాడియున్నారు.

నాటకీయ యక్షగానములలో లేని విశేషములలో ఈమంజరులు ముఖ్యమైనవి. ఇవి - హరికథలలో విశేషించి, సంభాషణలకు నడుమనున్న కథాంశములను చెప్పే సందర్భాలలోనూ కథను తొందఱగా నడిపించ వలసిన సందర్భాలలోనూ ఉంటాయి.

తోహారాలను, మంజరులనే పేరుతో శ్రీదాసుగారే ప్రారంభించి ఉంటారని తోస్తున్నది. 'నర్తకి" అనే మాత్రాచ్ఛందజన్యమైన గేయాన్ని శ్రీదాసుగారే కల్పించినట్లున్నది. ఇది శ్రీవారి మార్కండేయ చరిత్రములోనూ, సావిత్రీచరిత్రములోనూ ఉన్నది. సావిత్రీచరిత్రములో ఉన్న "నర్తకికి" ఒక భాగములో 29 మాత్రలున్నవి. కనుక దీనిని పాడేటప్పుడు చివరను మూడుమాత్రల కాలము అకారముతో పాడితే, ఆదితాళమునకు సరిపోవును. మార్కండేయ చరిత్రములోని "నర్తకి" ఒక భాగమునకు 16 మాత్రలు కలిగి ఉన్నది. కనుక అది చతురస్రగతికి సరిపోవును. రగడలకే యీ నామములు - ఉంచబడినవని ఊహించ వచ్చును.

మంజరులలోనూ, ఈ నర్తకులలోనూ, పల్లవీ, అనుపల్లవీ ఉండవు. అన్నీ చరణాలే ఉంటాయి. రెండేసి భాగాలుగల చరణాలు రెండుగాని, మూడుగాని, నాలుగుగాని, వీటిలో ఉంటాయి. రెండేసి భాగాలకు - ప్రాస ఒకటే ఉంటుంది. ప్రతిభాగమునకు వేర్వేరుగా యతి ఉంటుంది.

ఇవిగాక, కందార్థమూ, సీసార్థమూ, గీతార్థమూ, యక్షగానాలలోవలె హరికథలలోనూ ఉంటాయి. చివరను మంగళారతి ఉంటుంది.

ఇవి - శ్రీ దాసుగారు చెప్పినట్లు గానప్రబంధములు కనుక, ఇందులోఉన్న గద్యములూ, పద్యములూ, చూర్ణికలూ, వచనములూ, మొదలయినవి అన్నీకూడా గానముచేయవలసినవేగాని, కేవల పాఠ్యములు కావు.

ఔచిత్యాన్ని అనుసరించి, రసభావములకు తగిన రీతిలో, శబ్దములు, చిట్టస్వరములూ, ముక్తాయీలూ కూర్చే విధానంలో శ్రీనారాయణదాసుగారిది అందెవేసినచేయి. ఆయనను "లయబ్రహ్మ" అని అంటారు. దీనికి ఉదాహరణంగా చెప్పడానికి అసంఖ్యాక గేయాలున్నాయి. మచ్చుకు శ్రీరామ సుగ్రీవ మైత్రిలోని క్రింద కీర్తన సమీక్షించ వలసి ఉంటుంది.

రాగము–వసంత, తాళము—చతురస్రజాతి ఆట తాళము.

నాలుగవ కాలాక్షరములు నాలుగు అతీతముగా ఎత్తుబడి.

పల్లవి : (రెండవ కాలంలో)

రామా ! నవనవమేఘశ్యామా !

రఘుకులాబ్ధి సోమా !

అనుపల్లవి :

భూమిజా మానసాభిరామ సంపూర్ణ సర్వకామ ॥రా॥

చరణము :

సత్యజ్ఞానానంతస్వరూప - సజ్జన హృద్దీప

స్తుత్యగుణ కలాప, ధృతహరచాప !

సురవినుత ప్రతాప ! ॥రా॥

(3) నిసగరి - సనిదని - సరిగమ - దమనిద -

మదమగ - నిదనిస - రినిదగ

రినిదమ - ధారిత - హజ్ఝణు

(4) రిహ - తజ్ఝణు (4) తాకిట

తకధరి - కిటతకతోం - కిటతక ధరి -

కిటతక తోం - సమగరిగ -

దమగ - మనిదమదసనిద -
రినిదమతద్ధితోం - దరికిటతక ఝుణు
తధిహతకిణతకు - దరితకిటదధిగి -
ణతదధిగిణత - దధిగిణత ||రా||

(రెండావృత్తములు)

శ్రీ దాసుగారి గేయరచన విశిష్టంగా ఉంటుంది. సావిత్రీ చరిత్రంలోఉన్న ప్రతిగేయం చివరను, కథార్థములకు భంగములేకుండా రాగముయొక్క పేరు చెప్పబడి ఉన్నది.

కుంతలవరాళి. చతురస్రగతి.

ప॥ పిలచిన పలుకవదే మలుకా.

.... .... .... ... .... .... ....

చ॥ భక్తాళి మానస మరాళి ! కుంతలవరాళి !

శ్రీరాగము — చతురస్రజాతి

ప॥ కాంతా కనుఁగొనవే యీ కాంతారముసొగసూ.

చ॥ నిరతనిశ్రేయస శ్రీరాగము.

ఈ సావిత్రీ చరిత్రాన్ని తనకు కలలో కనిపించిన సావిత్రీ దేవత అయిన దుర్గకు అంకితం చేస్తూ, సావిత్రీ కటాక్షంవల్ల పుట్టిన "కథానాయికనూ," దీనిని రచిస్తూ ఉన్నప్పుడు తనకు జనించిన తన ఏకైక పుత్రికారత్నమైన "సావిత్రినీ" సూచించి ఉన్నారు

శ్రీ దాసుగారు – హరిశ్చంద్రోపాఖ్యానమును తల్లిదండ్రులకూ, యథార్థరామాయణమును తన భార్యకూ, అంకితముచేసి, తదితర కృతులన్నిటినీ భగవదర్పితములు చేసినారు.

క్రీ. శ. 1408 నుంచి 1507 వఱకు జీవించిన శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యుల వారికంటె ముందున్న తెలుఁగు గేయములు మనకు

దొరకలేదు. అన్నమాచార్యులవారు తాను రచించిన సంకీర్తనలలో, తెలుఁగుకావ్యాలలో ఉన్న యతిప్రాస నియమాలను పాటించేరు.

శంకరాభరణము — ఆదితాళము

ప॥ "అలరులు కురియగ ఆడెనదే"

.... .... .... .... .... .... ....

ఈ కీర్తనలలో పల్లవీ అనుపల్లవీ, చరణమూ అనే విభాగము సామాన్యముగా కనిపించదు. (శ్రీ) శివనారాయణ తీర్థులవారి కృష్ణలీలా తరంగిణిలోనూ, సిద్ధేంద్రయోగి రచించిన భామాకలాప యక్షగానము లోనూ, పల్లవీ, అనుపల్లవీ, చరణాలూ ఉంటాయి.

క్షేత్రయ్యపదాలలో రాగసంచారం సంపూర్ణంగా ఉంటుంది. పల్లవీ, అనుపల్లవీ, చరణాలూ ఉంటాయి. స్వరసంచారము- భావానికీ రాగానికీ, జీవం యిస్తూవుంటాయి. (శ్రీ) త్యాగరాజ కృతులలో-సంగీత సాహిత్యములు (ధాతుమాతువులు) సమప్రాధాన్యంలో ఉండి, సంగతు లకు అనుకూల్యము కలిగిస్తూ వుంటాయి.

మాత్రాకాలము - చాలాచోట్ల - తాళానికిసరిగా ఉండక, అకారాదులతో సరిపెట్టవలసి ఉంటుంది.

(శ్రీ) దాసుగారు - ఈ వాగ్గేయకారులందఱినీ బాగా సమీ క్షించి, మాత్రాకాలము తాళకాలానికి సరిపోయేటట్లూ, సాహిత్యానికి ప్రాధాన్యం కలిగేటట్లూ, కీర్తనలు రచించి ఉన్నారు. యతిప్రాసాది ఛందోనిబంధనలన్నీ పాటించడమేకాక, ఔచిత్యాన్నిబట్టి అనుప్రాస ములూ, అంత్యప్రాసములూ, స్వేచ్ఛగా ప్రయోగించి, పండితపామర జనరంజకములయిన కీర్తనలు రచించి ఉన్నారు.

అంత్యప్రాసమునకు ఉదాహరణం చూడండి.

ప॥ విడువిడు ననుముట్టకు నీ - ప్రేమ తెలిసె చాలు

అ॥ కడకు నవ్వులపాలయ్యెగా-నాబ్రతుకిటుల మేలు
చ॥ కౌసల్యకు వలె నాకున్ - గట్టవె పుస్తె
నాసతి కేలుబడియైన - నాపనివ స్తె

(పాదుకాపట్టాభిషేకము)

శ్రీ దాసుగారి కీర్తనలలో స్వరమునకు ప్రాధాన్యమిచ్చే కీర్త నలు కూడా లేకపోలేదు.

అభోగి - ఆదితాళము

ప॥ ఎందుగల్గెనె - జన్మములిట్టివి

.......................

శ్రీ దాసుగారు జానకీశపథములో ఉన్న గేయములలో, పెక్కింటిని స్వరపఱచి ప్రకటించి ఉన్నారు. ఈ గేయములకు ఏర్పరచబడ్డ రాగాలలో, నాలుగో, అయిదో తప్ప, తక్కిన రాగములన్నీ వాడుకలో లేనివీ, శాస్త్రముచేతనే సిద్ధించేవీ, అయి ఉండడం వల్ల, సంప్రదాయ సిద్ధంగా నేర్చుకొన్న శిష్యులకే గాని, వీటిని పాడుటకు వేరొకరికి సాధ్య పడదని తోస్తుంది. కలగడ, మంజుల, నాథనాళి, కనకాంగి, ఘంటా రవము, సామవరాళి, వనస్పతి మొదలైన రాగాలలో రచించబడిఉన్న యీ కీర్తనలను, సంగీత విద్వాంసులూ, సాహిత్యవేత్తలూ, అయిన వారు మాత్రమే- స్వయంకృషిచేసి సాధించవలసి ఉంటుంది. కలగడ - గాయక ప్రియజన్యం, మంజుల - చలనాటజన్యం, నాథనాళి - హనుమ త్తోడి జన్యం, అని, యీ జన్యరాగాల మేళకర్తలనూ, వీటి మూర్ఛన లనూ గుర్తించడమే-మొదటి కష్టము. తరువాత ధాతుమాతుసమ్మేళనం చేయడం మరీకష్టము. శ్రీ దాసుగారికి-సంగీతశాస్త్రంలోను, ప్రయోగం లోను, ఉండే అఖండపాండిత్యానికి చిహ్నాలుగా యివి నిలిచి ఉంటాయి. ఇందులో ప్రసిద్ధరాగాలలో ఉండే కీర్తనలను మాత్రమే శ్రీదాసుగారు స్వరపరచి ఉండలేదు. వాటిని సులభంగా పాడుకోవచ్చును.

'గేయమునకు ఏర్పరచబడ్డ రాగంలోనే, దాని క్రింద ఉండే పద్యం కూడా పఠించాలనే నియమం' శ్రీ దాసుగారు ఏర్పరచిఉన్నారు. దీనివల్ల రాగం మార్చడం వల్ల కలిగే రసభంగం ఉండదు. జానకీశపథంలో ఉన్న కీర్తనల క్రిందఉన్న పద్యాలు పఠించేటప్పుడు మాత్రం ఈ నియమాన్ని శ్రీ దాసుగారే సడలించి, వీలయిన రాగాలలో వాటిని పాడుకోవచ్చునని శిష్యులకు ఆదేశించేరు.

శ్రీ శివనారాయణతీర్థులవారి యందు- శ్రీ దాసుగారికి మిక్కిలి భక్తి ప్రిపత్తులు ఉన్నవి. కనుకనే శ్రీ తీర్థులవారి కృష్ణలీలా తరంగిణిని అనుసరించి శ్రీ దాసుగారు- శ్రీ హరికథామృతమును రచించినారు. ఆంధ్రపద్య, గేయములలో పాటించవలసిన యతిప్రాసములను సంస్కృత (పద్య) గేయములలో పాటించ నక్కరలేదు. సంస్కృత పద్యగేయములలో పాటించవలసిన యతి - విశ్రాంతి రూపమేకాని వర్ణసాజాత్యము గలది కాదు. అయినప్పటికి శ్రీ శివనారాయణతీర్థులవారు - ఆంధ్రులవడంచేత ఆంధ్రగేయ నియతములైన యతిప్రాసములను భాగవతకథారూపములయిన తన తరంగకీర్తనలలో పాటించి ఉన్నారు. అంతే గాక, సంస్కృతగేయ నియతములైన అంత్యప్రాసములనుకూడా పాటించి ఉన్నారు.

శ్రీ నారాయణతీర్థానుసారులైన శ్రీ నారాయణదాసుగారు కూడా తన బిందుకీర్తనలలో ఈ నియమాలను అన్నింటినీ సంపూర్ణంగా పాటించి ఉన్నారు. శ్రీ నారాయణతీర్థులవారు——

ఖగయాన సంచార ! - ఖండితాసురనికర !
సకలగుణ సంపన్న ! - సత్యపరిపూర్ణ !

అనే కీర్తనలోనూ, మఱికొన్ని కీర్తనలలోనూ, ఆంధ్రములోని ప్రాసనియమాన్నీ, సంస్కృతములోని అంత్యప్రాస నియమాన్ని విడిచి ఉన్నారు.

శ్రీ నారాయణదాసుగారు - ఈ నియమాలను వేటినీకూడా ఈ సంస్కృత గేయాలలో విడిచి ఉండలేదు. చూడండి—

కళ్యాణీ - రూపకమ్

ఉ॥ పాహిమాం గోపాల ! - భాగవతజనానుకూల !

ధ్రు॥ దేహకాంతి విజితనీల - దివ్యానందాలవాల !

తీర్థులవారి తరంగాలలోనూ, దాసుగారి బిందువులలోనూ శ్రీ భాగవతకథే వర్ణించబడిఉంది.

కృష్ణలీలాతరంగిణిలో కథాకథనం స్వల్పంగా ఉంటుంది. అందులో—

"ఆయాతి దేవకీ దివ్యసున్దరీ" (దివ్యసుందరి, దేవకి వస్తూంది.) అని, నాటకీయ యక్షగాన పద్ధతిలో పాత్రప్రవేశ స్వరూప వర్ణనము సంగ్రహంగా ఉంటుంది.

శ్రీ దాసుగారి హరికథామృతంలో ప్రబంధపద్ధతి ననుసరించి కథాకథనం విస్తరించి ఉంటుంది. హరికథామృతంలో—

ఉ॥ సాదేవకీ సుగుణా । హరిజనన పూరణా

ధ్రు॥ భూదేవతా, సహనయుతా - పూతచరితా.

.... .... ... ... .... .... .... .... ...

ఇత్యాదిగా దేవకీ స్వరూప స్వభావ వర్ణనము విపులీకరించబడింది.

కొన్ని ఘట్టాలలో కృష్ణలీలాతరంగిణిలోని రసభావాలనూ, హరికథామృతములోని రసభావాలనూ సమీక్షించితే, హరికథామృతములోని రసభావాలే అతిశయించినట్లు స్పష్టపడుతుంది.

కంసుఁడు దేవకిని చంపబోయే ఘట్టంలో, తరంగాలలోని వసుదేవుఁడు - కంసునితో యీలాగున అంటాడు.

మంజరీ : హే కంస, రాజసుత - (హే) భో నరశ్రేష్ఠ !
హే సత్యసంధకుల - జలధిభవరత్న !
ముఞ్చభగినీమద్య ముహురధికహృద్యాం !
సత్యం వదామి తవ - సత్యసంధోఽస్మి.
దాస్యామి తజ్జాన్యపత్యాని.

"ఓనరశ్రేష్ఠుఁడవైన కంసా ! రాజసుతా ! సత్కుల ప్రసూత రత్నమా ! మిక్కిలి అందకత్తె అయిన నీ చెల్లెలిని విడువు. ఈమెకు పుట్టిన సంతతిని నేను నీకిస్తాను. సత్యం చెప్పుచున్నాను." అని సామాన్యంగానే వేడుకోవడం యిందులో కనిపిస్తుంది.

ఇదే ఘట్టంలోని హరికథామృతబిందువులో వసుదేవుడు - కంసునితో అనేది చూడండి :

యదుకులాంభోజి — రూపకతాళం

ఉ : మా జహిన్వసారమ్ - మజ్జీవాధారమ్

ద్రు : భోజకులావతంస ! - భూతదయోత్తంస !

౧ పా : కిం విశ్వసనీయం శూన్యమ్ - కింతవభ్రమజన్యమ్
త్వం వృథానభిభీహి ! మే - దారాన్ విజహీహి !

౨ పా : త్రిజగదీశ్వరస్త్వమసి - స్త్రీ హన్తుం నార్హసి.
త్యజ దయాలో ! కోప - మఖిలబన్ధు తాపమ్॥

శ్లో॥ తవాప్యేకానుజాం బాలాం
త్వయ్యపి ప్రేమవిహ్వలామ్ ।
త్వదధీనాం కరిష్యామి,
విముఞ్చ తవ సోదరీమ్.
.... .... .... భయవిలోల శాతోదరీమ్॥

ఈ నీ చెలియలిని చంపకు. ఈమె నా జీవనాధారము. నీవు భోజకులావతంసుఁడవు. భూతదయ కలవారిలో శిరోరత్నం వంటి వాడవు.

మాయా భ్రాంతివల్ల పుట్టిన యీ ప్రపంచము – శూన్యం. ఇది విశ్వసింప దగినదా ? నీవు వ్యర్థంగా భయపడకు నా భార్యను విడిచి పెట్టు.

త్రిలోకాధీశ్వరుడవైన నీవు – ఒక స్త్రీని చంపడం తగని పని.

ఓ దయాళూ ! సమస్తబంధువులకూ తాపం కలిగించే యీ కోపాన్ని విడువు.

నీకు ఒక్కగా ఒకే చెల్లెలీ దేవకి. నీయందు ఎంతో ప్రేమగలది.

ఈమెను నీకే అప్పగిస్తాము. భయంతో వణకుతూ ఉన్న సన్నని నడుముగల యీ నీ సోదరిని విడువుము ... ... ... ...

ఈ వేడికోలు – ఎంత కఠినహృదయులకైనా జాలి కలిగించేదిగా చిత్రించబడింది. శివనారాయణ తీర్థులవారు రచించిన కీర్తి మంజరిలో యతిప్రాసములూ, అంత్యానుప్రాసమూ లేవు. శ్రీ నారాయణదాసు కీర్తనలో, శృంగార కరుణ రసాలు మూర్తీభవించి ఉండడమే గాక, యతిప్రాసములూ, అంత్యప్రాసమూ కూడ ప్రజారంజకముగా వెలయించ బడి యున్నవి.

ఈ హరికథామృతంలో తెలుగుజాతీయమైన సీసం కూడా ప్రయోగించబడిఉంది. చూడండి ! అంత్యానుప్రాసలతో కూడిన యీ సీసం—

సీ॥ "పాహిప్రసన్నరూప ! దయాకలాప ! స

త్యాలాప ! సర్వలోకైక దీప !"

శ్రీ దాసుగారికి నృత్యములోనూ, నాట్యాభినయములలోనూ, ఉండే ప్రావీణ్యమును తెలియజేసే కీర్తనలూ, కొల్లలుగా ఉన్నవి. మచ్చుకు క్రింది కీర్తనలోని యీ భాగం చూడండి !

కాఫీ - చతురస్రగతి.

ప॥ పెండ్లికూతులును పెండ్లికొడుకులును వెలయు సొగసు భళిరా!

అ॥ పెండ్లింటి ముచ్చట యీ బ్రతుకున వెదకిన మరి కలదా!

పా॥ మిసమిసమను నూనూగు
వయసుతో మేలమాడువగతో
ఒకరికొకరు పూసిన గంధముతో,
ఒయ్యారపు నడతో.

"ఒయ్యారపునడతో" ఇత్యాది స్థలములను అభినయించే టప్పుడు ఆ మహావ్యక్తి ప్రదర్శించే, "ఆ" భంగిమలు - చూచి తీరవలసిన వేగాని వ్రాయడానికి వీలుపడేవి కావు.

శ్రీ దాసుగారు నటన రత్నశిరోరత్నము గదా! స్పష్టమైన పాఠ్యమూ, నిరాఘాటమూ, నీతిప్రబోధకమూ, అయిన, ఉపన్యాస ప్రవచనమూ, గంభీరమైన మధురగాన ప్రసారమూ, క్రోసుదూరము వినిపించే "శంభో" నాదమూ, సమున్నత సుందరాకారమూ, శ్రీ నారాయణదాసుగారికి సహజసిద్ధములైన అలంకారములు.

ఏ హరిదాసుల (భాగవతారుల) ప్రదర్శనలలోనూ, ఈ విశేషములు మనకు నేడు కనుపించవు.

విభావమూ, అనుభావమూ, అనేవాటిని చక్కగా ప్రదర్శించి, వాటిచేత, సంచారభావములనూ, స్థాయిభావమునూ, స్ఫురింపజేసి, వాటి చేరికవల్ల, శృంగార హాస్యాది రసములను సభ్యులకు కలిగించే కవిత్వచాతుర్యమునకు హేతువులయిన ప్రతిభావ్యుత్పత్తులు- శ్రీ నారాయణదాసుకు పెట్టని సొమ్ములై ఉన్నవి.

"ఆంధ్రదేశంలో, ఎక్కువగా ప్రదర్శించబడేవీ, పండిత పామర ప్రజాసామాన్యంచేత బాగుగా ఆదరించబడేవీ, సొంపునింపు పెంపులుకలవీ

అయిన, యక్షగాన ప్రబంధరూప హరికథలు - శ్రీ నారాయణ దాస విరచితములే" అనడం - నిర్వివాదాంశం.

శ్రీ దాసుగారి కీర్తనలకు ప్రజాసామాన్యములో ఉన్నంత ప్రచారము - ఇతర హరికథా కీర్తనలకు లేదు.

ప్రజాసామాన్య ప్రచారంలోఉన్న యీ ప్రసిద్ధ కీర్తనలు ఆంధ్ర దేశములో అంతటా వినిపించేవే.

"రామచంద్ర, సీతామనోహరా !" "ఓరోరీ గణపతిరా" "రణధీరా కపివీరా !" "లేజవ్వనంపు పసందు" "ఏమీసేయుదు తపసిరాయా" "చాటుచున్నదదో భేరి," "పరీవహ్వోరీ" ననుగన్నతల్లియో నల్వారాణి" "కాంతా కన్గొనవే". ప్రతి హరికథలోను ముందు ధర్మమును, భక్తిని, నీతిని, జ్ఞానమును గట్టిగా ప్రబోధించి, ప్రస్తుత కథా నాయకులకు ఆ ధర్మాదులను అన్వయించి, తరువాతనే కథావిషయమును ప్రారంభించడము—— శ్రీ నారాయణదాస యక్షగాన ప్రబంధములోని ముఖ్యవిశేషము. వీరి తరువాతనే రచయితలందరూ, ఈ మార్గాన్ని అనుసరించేరు.

శ్రీ దాసుగారు 82 సంవత్సరములు ప్రజారాధనమూ, భగవదారాధనమూ చేసి 1945 లో జగన్మాతలో ఐక్యముపొందిన ధన్యాత్ములు.

గీత, వాద్య, నృత్య (నాట్య) త్రయ సమ్మేళనమే - సంగీత లక్షణమును ప్రమాణీకరించి, శ్రీ శివనారాయణతీర్థాదులవలె, సత్యమైన సంగీతము నారాధించినవారు శ్రీ దాసుగారు. శ్రీవారి యక్షగాన ప్రబంధ హరికథలను, ప్రదర్శింప జేయడంతోపాటు, వారు ప్రబోధించిన ధర్మమునూ, భక్తినీ, నీతినీ, జ్ఞానమునూ, అనుసరించడమూ, శ్రీవారి హరికథలను సర్వాంగ సుందరముగా ప్రదర్శించగల విద్యార్హతలను విద్యార్థులకు కలిగించడమూ, ప్రజాకర్తవ్యములని మనవి చేస్తున్నాను.

# దాసుగారి ఫక్కీ

శ్రీ పట్రాయని సంగీతరావు

శ్రీ త్యాగరాజస్వామి అవతరణతో కర్ణాటక సంగీత సంప్రదాయంలో విశేషమైన అభివృద్ధి వచ్చింది. శ్రీ త్యాగరాజస్వామికి పూర్వమే శ్రుతిలయ మర్మములను తెలియబర్చే సంగీతశాస్త్రం అపారంగా ఉన్నా రాగ తాళ ప్రయోగంలో లక్ష్యరూపమైన స్వరరచన కీర్తన విధానంగా ప్రౌఢశైలితో శ్రీ త్యాగరాజస్వామినుండే ప్రారంభం అయినదని చెప్పవచ్చును. అంతేకాకుండా శ్రీముద్దుస్వామి దీక్షితులు, శ్రీ శ్యామశాస్త్రి మొదలగు పలువురు వాగ్గేయకారుల ప్రతిభావంతమైన రచనలతో ఒక నూతనమైన సంగీత సంప్రదాయం యేర్పడి ఈనాటి సంగీతకచ్చేరీ విధానంగా పరిణమించింది.

నిరుపమాన వివిధరాగ తాళములతో గమకస్ఫూర్తి కలిగి భక్తిరసోద్దీపనములైన త్యాగరాజాది వాగ్గేయపరుల కీర్తనలు పండితపామరులలో ఆబాలవృద్ధ పర్యంతము ప్రచారంపొంది మిక్కిలి ఆదరణ పొందడం జరిగింది. అంతేకాకుండా శాస్త్రీయసంగీతం అంటే త్యాగరాజ కీర్తనలే అనే అభిప్రాయం ఏర్పడింది. ఈ కీర్తనలకి భిన్నమైన ఇతర సంగీత రచనలయెడల చిన్నచూపు ప్రారంభం అయింది.

ఈ పరిస్థితులలో శ్రీ నారాయణదాసుగారి అవతరణ జరిగింది. శ్రీ దాసుగారిది అపూర్వమైన వ్యక్తిత్వం. సంగీతసాహిత్యములలోనే

శాశ, బహు భాషాపాండిత్యం, మధురవచో నైపుణ్యమూ, విశిష్టమైన లోకజ్ఞత, నిరంతర భావస్వాతంత్ర్యము గల దాసుగారి ప్రతిభ సంగీత సంప్రదాయశైలీ పరిధిలో ఇమడలేక పోయింది.

శ్రీ దాసుగారి ప్రతిభావ్యుత్పత్తులకు అనుగుణ్యమైన కళాస్వరూపం అవసరం అయింది.

సంగీత సాహిత్య నృత్యకళలను సమన్వయ పరుస్తూ భగవద్గుణ గానానికి అనుకూలమైన కళారూపంగా "హరికథ" గా అవతరించింది.

'గీతవాదిత్ర నృత్యానాం త్రిభిస్సంగీతముచ్యతే' అనే నిర్వచనాన్ని బట్టి 'హరికథ' అనే కళారూపం ఏకముఖమైన కళాస్వరూపాలన్నింటి లోకీ సంపూర్ణమైనదని గ్రహించవచ్చును.

శ్రీ నారాయణదాసుగారినుండి సర్వాంగసుందరంగా అభివ్యక్తమైన "హరికథ" కి పూర్వరూపమేదైనా ఉందాలేదా అనే జిజ్ఞాస కలుగుతుంది.

ఈ హరికథా విధానం దక్షిణదేశంలోనూ మహారాష్ట్రదేశం లోనూ కూడా ఉంది. దేశంలో ఇతరరాష్ట్రాలలోకూడా ఉండవచ్చును.

దక్షిణదేశంలో హరికథాకాలక్షేపాలలో వివిధ వాగ్గేయకారుల, వివిధభాషలలో భక్తుల భక్తికీర్తనలు గానంచేయబడుతూ, రామాయణాది పద్యాలలోని శ్లోకములు కథా సందర్భాన్నిబట్టి ఉటంకించబడుతూ ఉంటాయి. అంతేకాని ప్రత్యేకించి హరికథా విధానాన్ని అనుసరించి రచింపబడిన కావ్యములేవీ ఉన్నట్టు కనబడదు. ఏమైనా దక్షిణదేశం లోని ఈ హరికథా కాలక్షేపాలు దాసుగారికి పూర్వంనుంచి ఉన్నదీ లేనిదీ; ఒకవేళ ప్రాచీనంగాఉన్న పక్షంలో శ్రీ దాసుగారి యెడల వాటి ప్రభావం ఎంతవరకు ఉన్నదీ విజ్ఞులు తెలియజేయవలసిఉంది.

ఒరిస్సాలో ప్రచారమైన ఒకవిధమైన యక్షగాన ప్రభావంతో శ్రీ దాసుగారి "హరికథ" వ్యక్తమయిందని పెద్దలు చెప్పగా విన్నాను.

అంతేకాకుండా మనకు అనుశ్రుతంగా పురాణప్రవచనంచేసే సంప్రదాయముండుంది. అనేకమంది భక్తుల భజనకీర్తనలు ప్రచారంలో ఉండనేఉన్నాయి. విభిన్నరూపములుగా ఉన్న ఈ కళాస్వరూపాలన్నీ శ్రీ దాసుగారి హరికథాగానంయొక్క ప్రాతిపదికలుగా కూడా ఊహించవచ్చును. ఈ విధమైన జిజ్ఞాస, శ్రీ నారాయణదాసుగారు హరికథా పితామహులుగా గ్రహించడంలో బాధకంగా ఉంటుందని అనుకోను.

అసాధారణ ప్రతిభావ్యుత్పత్తులుగల దాసుగారు నృత్య గీత వాద్యములు హరికథకు సమన్వయపరచడంతో "హరికథ" సర్వాంగ సుందరమైన కళారూపంగా పరిణమించి ప్రామాణికత సంతరించుకొంది.

కేవల సంగీతాన్ని ఆనందించడానికి కొంత పారిభాషిక జ్ఞానం, రసజ్ఞత, అభ్యాసం అవసరం. అదేవిధంగా నాట్యకళ విషయంలోకూడా. అయితే కథా సంవిధానాన్ని అనుసరించి సంగీతసాహిత్యములు నృత్యము సమన్వయ పరచడంతో హరికథ పండితులలోనే కాకుండా, పామరుల్లో కూడా సుబోధకమైన రాగతాళములు, నృత్యము సార్థకంగా ఆనందించడానికి అవకాశం కలిగింది.

దక్షిణదేశంలో కేవల సంగీతకచ్చేరీలు, నాట్యప్రదర్శనలు బహుకాలంగాప్రచారం అవడంతో అక్కడ జనసామాన్యంలోకూడా ఆయా కళలను ఆనందించే రసజ్ఞత పెంపొందింది. కాని తెలుగుదేశంలో జనసామాన్యంలో హరికథ ఆకర్షించినంత విరివిగా సంగీతసభలుగాని నాట్యప్రదర్శనలుగాని ఆకర్షించలేదని చెప్పవచ్చును.

ప్రజాబాహుళ్యంలో ఇంతటి ప్రచారాన్ని కలిగించినా సంప్రదాయ ఆగ్రహం కలిగిన సంగీత విద్వాంసులు హరికథాగానం విషయంలో తగినంత ప్రామాణికతను గుర్తించక పోవడమే కాకుండా శ్రీ నారాయణ దాసుగారివంటి వాగ్గేయకారుల విషయంలోకూడా ఔదాసీన్యత వహించడం జరిగింది. ఈపరిస్థితిని శ్రీదాసుగారు అతినిర్లక్ష్యంగా

ఎదుర్కొన్నారు. సరిగమలు పారాయణచేసే ప్రతిఛాందసుడు, పండిత వేషంవేసుకొని ప్రదర్శించే వేషం దాసుగారికి వేడుక కలిగించేది. రస దృష్టిగాని నవ్యతగాని లేని సంప్రదాయ సంగీతవిద్వాంసులను అపహాస్య భాజనులుగాచేసి రెచ్చగొట్టేవారాయన.

ఇది ఎంతవరకు వెళ్ళిందంటే సమకాలిక సంగీతజ్ఞులనే కాకుండా సంగీతకళలో యుగకర్తగా భావింపబడుతున్న త్యాగరాజస్వామి విష యంలోకూడా శ్రీదాసుగారు వేళాకోళపు ధోరణినే అవలంబించేవారని ఈక్రింది ముచ్చటవలన తెలుస్తుంది. ఈవిషయం ఒక జనశ్రుతిగామాత్రం ఉంది. ఎంతవరకు యథార్థమో తెలియదు.

శ్రీ దాసుగారి యెడల ఎంతో మెప్పుదల కలిగిన పండితకవులు ఒకరు శ్రీ దాసుగారిని ప్రశంసిస్తూ కొన్ని పద్యాలురాసి వినిపించారట. అందులో ఒక సీసపద్యంలో దాసుగారిని భాషాపాండిత్యంలో అనంతు డనీ, నాట్యశాస్త్రంలో భరతుడనీ, సంగీతంలో త్యాగరాజంతవాడనీ శ్లాఘించేరట. ఆ పద్యపాదం వినగానే దాసుగారు ఆగమని నవ్వుతూ అన్నారట.

"అవురా ఆరుమాసాలు సాముచేసి ఆడదానిమీదికి యుద్ధానికి పోయేడట. అలా ఉంది. ఇంతవాణ్ణి నన్ను పట్టుకొని రానురాను త్యాగ రాజుతో పోల్చేవేమిరా నాఖర్మం" అన్నారట.

పై మాటల్ని బట్టి శ్రీదాసుగారి ఆత్మవిశ్వాసం ఎంతటిది? అన్న విషయం మాత్రమే మనం గ్రహించవలసిఉంటుంది.

సంప్రదాయ సంగీతంలో కీర్తన రచనావిధానాన్ని బట్టి పరిశీలిస్తే శ్రీదాసుగారు హరికథలో ప్రవేశపెట్టిన 'మట్టు' ఒక విశిష్టమైన సంగీత రచనగా అర్థం అవుతుంది,

సంప్రదాయ సంగీత కీర్తనలో రాగపోషణ ప్రధానంగా ఉంటుంది. వివిధ సంచారములతో గమనస్ఫూర్తితో కీర్తన రచనచేయబడి, లయ అంతర్వాహినిగా ఉంటుంది. సాహిత్యం రాగభావాన్ని అనుసరించి ఒదిగి ఒదిగి ఉంటుంది. కీర్తనలో మాటమాటగా తెలియకుండా రాగంతో సాగిపోతు ఉంటుంది. ఆ కారణంచేత కీర్తనలో రస నిష్పత్తి రాగాన్ని ఆశ్రయించి ఉంటుంది.

హరికథమట్టులో సంగీతసాహిత్యములు సమానస్థాయిలో నడుస్తాయి. అంతేకాదు పరస్పరపోషకంగా ఉంటాయి. గమనసౌందర్యంతో సంగీత సాహిత్యములు తూగుతూ నడుస్తాయి.

రసనిష్పత్తికి రాగతాళములు, సాహిత్యమే కాకుండా నృత్యం యొక్క ప్రాముఖ్యతని శ్రీ దాసుగారు గుర్తించడం వలన ప్రతి 'మట్టు' కూడా నృత్యానుగుణ్యంగా రూపొందించ బడింది.

శ్రీ దాసుగారి 'మట్టు' గానం చేసేవారు ఈ విషయాలన్నీ గ్రహించడం అవసరం, కాని పక్షంలో వారి సంగీతానికి న్యాయం చేయడం జరగదు.

ముఖ్యంగా మట్టులో వారు ఉద్దేశించిన విరుపులు అర్థంచేసుకొని మృదంగము మొదలగు తాళవాద్యములు అనుసరణ క్రమాన్ని ముందుగానే నిర్ణయించుకోవడం అవసరం. 'మట్టు' లో ముఖ్యంగా నృత్యాన్ని మనస్సులో పెట్టుకొని అనేక నడకలు సమకూర్చబడి ఉన్నాయి. ఆయా కారణాలచేత గాయకులు దాసుగారి మట్టుని గానంచేయడంలో ఎంతో రసదృష్టిని పెంపొందించుకొనవలసిఉంది.

నవరసములను పోషించడంలో రాగముల ప్రాముఖ్యత శాస్త్రజ్ఞులచేత గుర్తింపబడినదే. అయితే త్యాగరాయుడి వాగ్గేయకారుల కీర్తనలు కేవల భక్తిరసోద్దీపితములు మాత్రమే. శ్రీ దాసుగారు కథా

సంవిధానా న్ననుసరించి వివిధరాగములను సమర్థంగా వివిధరసములను పోషిస్తూ కీర్తనలను రచించేరు. దగ్గరగా ఒక శతాబ్దికాలమునుండి రస జ్ఞుల హృదయాలలో శ్రీ దాసుగారు గానంచేసిన "మట్లు" చెరగని ముద్రవేశాయి.

పోతనగారి భాగవత పద్యములు శ్రీ జయదేవకవి అష్టపదులు శ్రీ నారాయణతీర్థుల తరంగాలు రామదాసు కీర్తనలు ప్రజలలో ఎంత ప్రచారాన్ని పొందాయో శ్రీ దాసుగారి మట్లుకూడా అంతటి ప్రచా రాన్ని పొందేయి.

రుక్మిణీకల్యాణంలోని "లేజవ్వనంపువసందు" "సామిరావదేమిరా యోగసర్వాంతర్యామిరా", సీతాకల్యాణంలో "తపసిమిన్న నీరాకచే ధన్యుడనైతి" "నాకులసతి జెరుప నేగినాడవా భడవా" "వెదకి రావె వేవేగపోవె" "సీతారాములకున్న పరస్పర ప్రీతిదెల్పతరమా" "పెండ్లి కొడుకులును పెండ్లికూతులును వెలయుసభ భళిరా" "కన్నవార లెంతధన్యులో", సుందరకాండలో "అమ్మనీవే సీతవా", మార్కండే యలో "బాలచంద్ర యేల పాదంబులిడవా", హరిశ్చంద్రలో "జాతి చెరచెగాని నానీతిచెరుపగలదావిధి", సావిత్రిలో "అవును నీవే నానాథు డవు", జానకీ శపథంలోని "ఏయూరు ఎవ్వారు తనయులు" వినుమందు "మాయూరు" మొదలైన మట్లు ఏనాటికీ రసికలోకానికి తన్మయ త్వాన్ని కలిగించే సంగీతరచనలు. ఆ యా మట్లు గానంచేసే కథకులు శ్రీ దాసుగారి కళాహృదయాన్ని అర్థంచేసుకొని గానం చేయడం అవసరం.

అయితే శ్రీ దాసుగారి శిష్యపరంపరలో వారి వ్యక్తిత్వాన్ని అనుకరించినంతగా వారి కళాసంప్రదాయాన్ని సాధనచేస్తున్నవారలు అరుదు అయిపోయే రనిపిస్తుంది. నేడు పలువురు హరికథకులు తమ హరికథాకాలక్షేపాలలో రక్తికలిగించకపోలేదు. అయితే శ్రీ దాసు

గారు సృష్టించిన నృత్యగీతవాద్య సమ్మేళనతో కూడిన ఉత్తమ సంప్రదాయాన్ని నిలబెట్టే అర్హత చాలావరకూ లోపించిందని చెప్పవచ్చును.

కొందరు కేవలం పాటమీదే ఆధారపడుతున్నారు. మరికొందరు కేవలం కాలక్షేపం కబుర్లతోనే కథ కంచికి పట్టిస్తున్నారు. నేడు హరికథా కాలక్షేపాలు శుష్క-రాజకీయ ఉపన్యాసాల లాగ బోలో స్వతంత్ర భారత్ కీజై, గాంధీమహాత్మాకీజై అనే నినాదాలు తెప్పించి కళాపరంగా ఆనందించడానికి ఏమి మిగలకుండా ఉంది. కొన్ని కాలక్షేపాలు చవకరకం సాహిత్యప్రసంగాలలా పరిణమించేయి.

ప్రజలను ఏదోవిధంగా ఆకర్షించడమే కాదు ఆ ఆకర్షణ ఉత్తమ కళాసంప్రదాయాన్ని అనుసరించినప్పుడే ఉత్తమకళారూపంగా 'హరికథ' శాశ్వతంగా నిలుస్తుంది.



# సంగీతదాసుడు

శ్రీ మోనేటి వెంకటేశ్వర్లు

హరికథాపితామహుడని దేశప్రఖ్యాతిగాంచిన నారాయణదాసుగారి సంగీతప్రతిభనుగూర్చి చెప్పాలంటే ఎంతో కష్టం. సంగీతాన్ని గురించి చెప్పడం, వ్రాయడంకంటె విని ఆనందించడం ఉత్తమం. ఆ ఆనందాన్ని వర్ణించడం త్యాగయ్యగారు చెప్పినట్లు "ఈలాగని వివరింపలేను చాలా స్వానుభవవేద్యమే మనసా" అనడం ఎంతో ఉత్తమం అనిపిస్తుంది. మాటకి భావం యెలాగో స్వరానికి రాగానికి భావం అలాగే ఉంటుంది. కాబట్టి స్వరరచన చూచినంతమాత్రాన గాయకునియొక్క భావం రచన పాడగా వింటేతప్ప వ్యక్తంకాదు. ఒక స్వరప్రయోగము యొక్క భావం ఒక్కొక్క సంగతిలో, ఆసంగతియొక్క రాగ, తాళ విన్యాసములతో వేర్వేరుగా స్ఫురిస్తుంది. అటువంటి పరిస్థితిలో నారాయణదాసుగారి గానం వినని నావంటివ్యక్తి ఆయనగానంగూర్చి వ్రాయడం ఎంతవరకు సమంజసమో చెప్పలేను. నాకుగల సంగీతానుభవాన్ని పురస్కరించుకొని నేను విన్న దాసుగారి కథలలోని రచనల ఆధారంగా వారి సంగీతప్రతిభను నేనూహించినంతవరకు మనవిచేయడానికి ప్రయత్నిస్తాను.

దాసుగారు బహుముఖప్రజ్ఞాశాలి. ప్రాచీన వాగ్గేయకారుల కోవకు చెందినవారు. వారి బహుభాషాపాండిత్యము, సంగీత, సాహిత్య, నాట్యశాస్త్రముల జ్ఞానము అపారము. ఇన్ని సుగుణములు ఒకవ్యక్తియందుండుట దుర్లభము.

దాసుగారి రచనలు పండితపామర జనరంజకములు. హరికథా పితామహులుగా, కథావాగ్గేయకారులుగా వారు ప్రఖ్యాతిచెందారు. మనదేశంలో హరికథారచనకు, ప్రచారానికి మార్గదర్శకులు. వారి లయపాండిత్యము అసాధారణమైనది. పంచముఖి, షణ్ముఖివంటి అసాధ్యములైన తాళములలో రచనలుచేసి గానంచేసి విద్వాంసుల మన్ననలు పొందిన ఘనవిద్వాంసుడు దాసుగారు, అనేకభాషలలో వారు కథలు రచించి గానంచేసేవారు. కథచెప్పడంలో, కథలోని ఆయాఘట్టములను వర్ణించుటయందు కడునేర్పరి. శ్రోతలను సమ్మోహితులను గావించే వాగ్ధాటి వారికిఉండేది. వారి బాణీ ముమ్మూర్తుల ఆంధ్రబాణీ అని చెప్పవచ్చును. ఆనందభైరవి, తోడి, కాంభోజి, ధన్యాసి, సురటి, ముఖారి, మోహన, నవరోజు మొదలైన ప్రసిద్ధరాగాలలోను, అనేక అపరూప మేళకర్తలలోను. జన్యరాగములలోను ఆయన కీర్తనలున్నాయి. సురటిరాగంలో "శ్రీ రుక్మిణీబాల్యము", తోడిలో "లేజవ్వనంపుపసందు," నవరోజులో "ననుగన్నతండ్రి," ధన్యాసిరాగంలో "దీనబంధు", శహానరాగంలో "నను బ్రోవరా," కేదారములోని "నిను వినా," కాంభోజిలో "రామ కోమలశ్యామ," శంకరాభరణంలో "కన్నవారలెంతధన్యుల్," మొదలైన రచనలు ఇందుకు కొన్ని ఉదాహరణలుగా చెప్పవచ్చు. రచనల్లో తెలుగువారి సంగీతపు పలుకుబడులు బాగా వినవస్తాయి. ఇవిగాక అనేక అపరూపరాగాలలోను, అపరూపమేళకకర్తలయందు వారిరచనలున్నాయి కాని వాటికి ప్రచారం తగినంతగారా లేదు.

ఇవిగాక దాసుగారి వచనములకొక ప్రత్యేకతఉంది. వాటిని చదివేటప్పుడు రాగయుక్తంగా గానంచెయ్యడం ప్రచారంచేశారు దాసుగారు. ఒకరాగంలో రెండుమూడు స్వరములుగల సంగతులతో వచనములయందలి కథావర్ణనలను నెంతో మనోహరంగా పాడడం దాసుగారు, వారి శిష్యులు బాగా ప్రచారంచేసారు. కథాసందర్భాన్నిబట్టి భావానుకూ

గుణంగా సంగీతాన్ని కూర్చడం గానంచెయ్యగలగడం విదగ్ధవాగ్గేయ కారునికే తగునుగాని, పండితుడైనంతమాత్రాన శక్తి అలవడదు. ఈ విధంగా వచనములను పాడడం దాసుగారి ప్రముఖశిష్యులలో ఒకరైన శ్రీ నేతి లక్ష్మీనారాయణ భాగవతార్‌గారి యొద్ద వినేభాగ్యం నాకు కల్గింది. వారు ఆకాశవాణిలో కూడ దాసుగారికథలను గానంచేసి రికార్డు చేసారు. రుక్మిణీకల్యాణం, పాదుక అనేదాసుగారి హరికథలను సంగీత రూపకాలుగా వారి నిర్వహణలో ప్రసారం చేయించారు. అవి రసికుల మన్ననలు పొందాయి.

దాసుగారి కథలు, వారి బాణీప్రచారం కావాలంటే ఆ సంప్రదాయం తెలిసిన వారి శిష్యులవద్ద యోగ్యతకల్గినవారు నేర్చుకోవాలి. ఆ సంప్రదాయం తెలిసిన పెద్దల హరికథాగానాన్ని ప్రముఖసంస్థలు రికార్డుచేసి భావితరాలవారి కుపయోగపడేటట్టుచెయ్యాలి. వాటిని నేర్చుకొనేవారికి సంగీత, సాహిత్యములయందు మంచి ప్రవేశముండాలి. కనీసం వర్ణాలైనా పాడటం రానివారికి వాటిని రాగతాళయుక్తంగా పాడడం సాధ్యంకాదు, దాసుగారి పాండిత్యము అపారమైనది. గాత్రము గంభీరసుందరమై 'శంభో' అని కేకవేస్తే ఎంతోదూరం వినబడేదని యీనాటికికూడా శ్రోతలు చెప్పుకుంటూఉంటారు. అనేకమంది సంగీత విద్వాంసులు వారి ప్రతిభకు జోహారులర్పించారు. అనేక సంస్థానములయందు వారు ఎంతో గౌరవమును, సన్మానములు పొందియున్నారు. అటువంటి మహానుభావుడు మన ఆంధ్రదేశంలో జన్మించడం మన ఆంధ్రులయొక్క పుణ్యమని చెప్పాలి. వారి హరికథలను సాధ్యమైనంతవరకు ఉత్తమ సంగీతకళాఖండములుగా ప్రచారంచెయ్యడమే వారికి మనం చెయ్యగలిగిన సేవయని నానమ్మకం. వారు హరికేగాదు సంగీత సరస్వతికిని దాసుడనే సంగతి మనం మరచిపోగూడదు.

# హరికథాగానము

శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు

నా చిన్నతనంలో అంటే ఇప్పటికి సుమారు ముప్పదియైదు సంవత్సరాలకు పూర్వం మా నాయనగారు (శ్రీ తి. న. చ. సం. జగన్నాథ తిరువేంకటాచార్యులుగారు సంస్కృతాంధ్రముల తలస్పర్శిపాండిత్యము గలిగి పరశ్శత గ్రంథములు రచించి భారత రామాయణాదులను హరికథారూపమున రచించినవారు) నారాయణదాసుగారి హరికథాకథన నైపుణ్యాన్ని గురించి, వారి కవితా ప్రతిభను గురించి ఎంతో చెప్పుచుండెడివారు. అప్పుడు నా కనిపించేది నారాయణదాసుగారి కథ ఎప్పుడు వినుట తటస్థపడుతుంది అని. తరువాత నేను మా నాయనగారి వద్ద కావ్యాలు చదువుచు రెండు మూడు హరికథలు నేర్చుకొనుట సంభవించినది. అది నా సంగీతాభ్యాసానికి నాంది అయినది. అది సుమారు 1940 వ సంవత్సరము పెనుగొండలో నూలు లక్ష్మీనారాయణ జమీందారు గారింట వివాహసందర్భమున నారాయణదాసుగారి కథ అన్నారు. నాయనగారివద్ద వారిని గురించి వినియుండుటచేత ఎంతో ఉత్సాహంతో వెళ్ళి ఆ కథ విన్నాను. రుక్మిణీకల్యాణ కథ. ఏది విన్నా ఛాయాగ్రాహక యంత్రంలాగ మనస్సు పనిచేసే రోజులవి. ముఖ్యంగా ఆరోజున దాసుగారు 'అన్న నే ధన్యుడ', 'లేజవ్వనంపు వసందు', 'దేవ దేవ', మొదలయిన నాలుగు ఐదు కృతులలో చేసిన స్వరకల్పన ఈ నాటికే కాదు ఏనాటికీ నాకర్ణకుహరాలలో ముఖరిస్తూ ఉంటుంది. వివిధ న్యాస విన్యాసగతి భేదాలతో తాండవ నృత్యంతో దిగ్భ్రమ గొలిపి

నారు దాసుగారు. ఆనాడు వారికి సహకార వాద్యాలు కీ॥ త్రిశేషులు సరిదే సుబ్బారావుగారు ఫిడేలు, కొంతం గంగరాజుగారు మృదంగము. వీరిద్దరూ ఆనాటికి అనేక యుద్ధముల నారితేరిన అనుభవమాత్ర వృద్ధ మూర్తులు. సహజంగా వారి స్వభావము ప్రధాన గాయకునిగాని హరి కథా కథకునిగాని అనుసరించు సమయంలో ఇవన్నియు మా కెంతో అవలీల అన్న భావము ముఖమందు కూడ కానిపింపజేయు స్వభావము. కాని నారాయణదాసుగారి కథలో పద పదమున వినయవిధేయతలతో అణకువతో జాగ్రత్తతో మసలుకొనుచు తాము కూడ తమ సద్యో గ్రహణ పాటవాన్ని ప్రదర్శించుకొనుచు దాసుగారి "సెహబాసులను పరిగ్రహిస్తూ తాము దాసుగారి స్వరకల్పనా ప్రస్తారములను శిరః కంపములతో శ్లాఘిస్తూ తమ సహకారాన్ని నిర్వర్తించారు.

అప్పటికే దాసుగారు చాలా వృద్ధులయ్యారు. కొంతమంది శిష్యుల చేయూతతో రంగస్థలి మీదకు వచ్చారు. ఒక్కసారిగా "శిరోగణప తితో "శంభో" అన్నారు అంతే. అంతవరకు పరుల కరావలంబనంతో వచ్చిన దాసుగారు కారు. ఏమి స్వరములు ?? ఏమి నృత్యములు ?? ముప్పది వత్సరముల యువకునివలె తాండవ లాస్యములు నెఱపినారు. (నేను గమనించినంతవరకు ఆ స్వరనృత్యములు వారి శిష్యులయిన కీ॥ శే॥ వాజి పేయయాజుల సుబ్బయ్యభాగవతారు వద్ద, బ్రహ్మశ్రీ నేతి లక్ష్మీ నారాయణ భాగవతుల వద్ద క్రమాలంకృతములు). ఎనుబదేండ్ల వార్ధక ములో శ్రీ దాసుగారు పంద్రెండు సంవత్సరముల రుక్మిణీదేవిని, ఆమె వలచి వలపించుకొన్న మనోహర కృష్ణమూర్తిని మాకు సాక్షాత్కరింప జేసిరి. ఎక్కడి కక్కడ అపూర్వార్థ ప్రపంచము, హాస్యరసము, నీతి బోధనము, వారి కథనములో గోచరించును. గాత్రము అతిగంభీరము, గొంతుము అగుటచేత పద్యమును తగినంతరాగములో పొల్లు సంగతులు లేక పాడెడివారు. రాగ జ్ఞానమున్నదని దాని ననవసరముగా వారు విని యోగింపలేదు. భావస్ఫూర్తికి ఎంత అవసరమో అంతే పద్య పదము

లతో మేళవించేవారు. 'లేజవ్వనంపు పసందు' అనే గేయములో రుక్మిణి వయస్సును ముద్దుగారు అని దాని నీ విధంగా మనోహరంగా వివరించారు. మూడు+దుగ=ముద్దుగ అంటే మూడు రెండ్లారు, ముద్దుగ+ఆరు=ముద్దుగారు అంటే పండ్రెండు వయసు అని నిర్వచించిరి. అసలు తోచే అర్థముమీద ఇది విశేషస్ఫూర్తి అన్నమాట. వారి సాహిత్య వైభవాన్ని చాటుటకు వారి గ్రంథములన్నియు సాక్ష్యులు. కాని వారి సంగీత వైదుష్యాన్ని గురించి చెప్పాలంటే అది వ్రాతల కలవికాని విషయము. అయితే ఒకటి మాత్రము చెప్పవచ్చును.

పూర్వముగాని ఇప్పుడుగాని ఇకముందుగాని ఏ రూపమున గేయమున్ననూ దానికి శాస్త్రమందు ప్రబంధమని పేరు. క్షేత్రయ్య పదము ప్రబంధమే, త్యాగయ్యకృతి ప్రబంధమే, ఆదిఅప్పయ్యగారి వర్ణము ప్రబంధమే, దాసుగారి పాటలు ప్రబంధములే. ప్రబంధానికి శాస్త్రజ్ఞులు ఆరంగములు కలవన్నారు. స్వరము, పదము, తేనకము, బిరుదము, పాటము (మృదంగశబ్దము), తాళము, ఇవి ఆరంగములు. ఏ ప్రబంధమున కయినా స్వరతాళపదములు నియతములు. పదములు లేకగాని, ఆ పదములకు స్వరము లేకగాని, ఆ పదముల సముదాయము తాళబద్ధము కాకగాని యుండిన అది సంగీత ప్రపంచమున ప్రబంధమనిపించుకొనదు. ఇది సాధారణ లక్షణము. కర్తృ కర్మ క్రియా వాచకములయిన పదజాలముల సంయోజనముచే వాక్యములేర్పడి అట్టి కొన్ని వాక్యములలో పల్లవ, అనుపల్లవ, చరణ విభాగములతో ఒక ప్రబంధమేర్పడుచున్నది. పూర్వ వాగ్గేయకారులయిన అన్నమాచార్య క్షేత్రజ్ఞ, త్యాగరాజుల ప్రబంధము లిట్టివే. ఈ ప్రబంధములయందు పాడుటకు ఫణితినేర్పరచునది స్వరమే అయినను అది సరిగమాది సంకేత రూపమున మనకు గోచరింపక కేవల నాదవాహిన్యైయుండును. కొంత మంది పూర్వవాగ్గేయకారులు, గాయకులు కొన్ని గేయములలో నొక సొగసుకూర్చుటకు పల్లవానుపల్లవముల మధ్య చిట్టస్వరములు చేర్చిరి.

శ్యామశాస్త్రి రచనముల కన్నిటికి ఈ చిట్టస్వరములు కలవు. అంతేకాక ఆ స్వరములన్నిటికి సాహిత్యములుకూడ కలవు. కొంతమంది గాయకులు కొందరి వాగ్గేయకారుల గేయములకు కొన్నిటికి చిట్టస్వరములు చేర్చిరి. కేవల స్వరజ్ఞానమేకాక కొంత మృదంగశబ్దపరిచయము గల సంగీత విద్వాంసులు ఒకే ఆవృత్తములో మణిప్రవాళములవలె స్వరపాటములను చేర్చి చిట్టస్వరములు రచించిరి. అనగా ప్రబంధాంగము లారింటికి ఒకే ప్రబంధమున వినియోగముకలిగినది. అటువంటి చిట్టస్వరములు (మృదంగ శబ్దములతో పై కాలపు ముక్తాయింపులతో) దాసుగారు కథల గేయ ములలో రచించుకొన్నారు.

హరికథకులుగాని హరికథారచయితలుగాని సాధారణముగా సంగీతశాస్త్రమందు విశేషపాండిత్యములేకున్నను కర్ణతాడితమైన ఒక జ్ఞానముతో కథాగానము, రచనము జేయుదురు. వాడుకలోనున్న రాగతాళములను వారు వినియోగించుకొందురు. దాసుగారు తమ సంగీతశాస్త్ర పాండిత్య శౌండీర్యమును జానకీశపథంలో ప్రదర్శించు కొన్నారు. అందు ఒక్కటియు సాధారణరాగముకాదు. అన్నియు, అపరూపములే. అందును ప్రధానముగా 72 మేళకర్తల 12 చక్రముల లోని అపరూపమేళకర్తలనే గ్రహించారు. 72 మేళకర్తలూ అపరూప ములే అని భావించేవారు కొందరున్నారు. మేళకర్తలలో ప్రధానములు, ఉత్తమములు, రసమయములు, వివాది దోషరహితములు, అయిన మేళకర్తరాగములు చాలకలవు. శంకరాభరణము, కల్యాణి, తోడి, చక్రవాకము, హరికాంభోజి, ఖరహరప్రియ, కామవర్ధని, షణ్ముఖప్రియ, సింహేంద్రమధ్యమము, కీరవాణి, మొదలయిన కొన్నిటిని అపరూప మేళకర్తమాత్రములుగకాక రసదీప్తిగలుగు కొందరు పూర్వ వాగ్గేయ కారులు రక్తిరాగములుగా నెంచి వాటియందు కృతులు పెక్కులు రచించి ప్రచారించిరి. తక్కిన మేళకర్తలలో ఎక్కువగా వివాద్యాది దుష్టములు కాని కొన్నిటిలో మచ్చునకు ఒక కృతినే రచించి వాటియం

దెక్కువ ఆదరముచూపక ఊరక స్పృశించి వదలిరి. కొన్నిటిని అసలు తాకనేలేదు. అయితే ఆ మేళకర్తల స్వరస్థానములు పట్టుట (కొందరికి వినుటకుకూడ) కష్టము, కష్టతరము. అటువంటి మేళకర్తల నన్నిటిని దాసుగారు జానకీశపథంలో వాడి పాడినారు. వారికి తప్ప తదితర కథకుల కవి సాధ్యములుగావు. వారు ఒక ప్రయోగాత్మకంగా రచించి పాడుకొన్నారు. సంగీతవిద్వాంసుల సహాయంతో భావితరాలవారు పాడుకొనవచ్చునసే అభిప్రాయంతో వారే గేయములన్నిటిని స్వరలిపి బద్ధంచేసి అచ్చువేయించారు. అయితే అంత ఓపిక ఎవరికి? ఎవరికి అనుకూలమయిన, ఇష్టమయిన రాగాలలో వారు పాడుట చూచాను. వారి రచనలలోని సౌలభ్యమే అది. వారి నిర్దిష్టములయిన రాగాలలో కాక పోయినా ఇంకొకరాగములో నిర్దిష్ట తాళానుసారముగా పాడుకొనుటకు చక్కగాకుదిరే మాత్రాఛందస్సుతో ఎట్టి ద్రుతకాలపు సమస్యలు పెట్టకుండా రచించిన రచనములు వారివి. వారిబుద్ధికి ఒకనూతన ప్రయోగాన్ని చేసే స్వభావమున్నది. శక్తియున్నది. కంఠమునకు స్వాధీనమున్నది. అపరూపమేళకర్తలతో జానకీశపథము వెలువడినది. జానకీశపథమును హనుమంతునకు వినిపించారు దాసుగారు. వారు ఒకటి అనుకొని యుందురు. అపరూపమేళకర్తల ప్రయోగముచేసినప్పుడు వినేకృతిపతి సర్వసమర్థుడుగా నుండవలెను. గీతార్థము సంగీతార్థము బాగ దెలిసినవాడు వాతాత్మజుడే. కనుక ఈ అపరూపమేళకర్తల కృతిని ఆయనకు వినిపించారు.

# సంగీత గంగాధరుడు

గానకళావిశారద

శ్రీ ఆరిపిరాల సత్యనారాయణమూర్తి

శ్రీమదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసుగారికి గల ప్రతిభావిశేషము అసాధారణమైనదని చెప్పవచ్చును. ఈ మహాపండితుడు కర్ణాటక సంగీత శాస్త్రములో కూడ అపారమైన కృషి చేయుటయేగాక తాను రచించిన గ్రంథములలో కొన్నిటిలో గల కీర్తనలకు ధాతు, మాతువులను కూడా నేర్పఱచియుండటం సంగీతకళలో ఆయనకు గల ధాతు, మాతు కల్పనాశక్తికి తార్కాణమగును. ఇట్టి శక్తిని గలిగియుండుట వల్లనే శ్రీ దాసుగారిని సుప్రసిద్ధ వాగ్గేయకారుడుగా సర్వులూను పరిగణించుటకు కారణమైనది.

ఇందుకు నిదర్శనముగా యీ కవి గాయక శిరోమణి రచించిన వివిధ గ్రంథములలో, ముఖ్యంగా పేర్కొనదగినది 1949 వ సంవత్సరములో ప్రకటించిన "జానకీశపథము" అను గ్రంథమగును. ఈ గ్రంథము శ్రీ దాసుగారికి కర్ణాటక సంగీత శాస్త్రములో గల కూలంకష విజ్ఞానాన్ని ఋజువుచేయుచున్నది. ఎటులనగా ?

కర్ణాటక సంగీత శాస్త్రంలో అతి ప్రధానమైన భాగముగా నెంచబడుచున్న 72 మేళకర్త (జనక) రాగములలో పూర్వ (శుద్ధమధ్యమ) మేళకర్తలగు 36 రాగములలో 16 మేళకర్తలను, ఉత్తర (ప్రతిమధ్యమ) మేళకర్తలగు 36 రాగములలో 19 మేళకర్తలను, మొత్తం 16+19=35

మేళకర్త రాగములలో కీర్తనలు రచియించి ప్రకటించుటం శ్రీవారి సంగీత విజ్ఞానానికి చక్కని నిదర్శనం కాకమానదు. అంతేగాక యీ 35 మేళకర్త రాగములలో రచించిన కీర్తనలలో 1) "హరిహరి" (హరికాంభోజి,- 28 వ, మేళకర్త) (2) ఎందుకీమాయ (ఝాలవరాళి-39వ మేళకర్త) వంటి రెండు కీర్తనలకు తప్ప మిగత 33 కీర్తనలకు గల ముఖ్యాంగములగు పల్లవి, అనుపల్లవి, చిత్రములను స్వరపఱచి ప్రకటించుటం, శ్రీ దాసుగారికి ప్రసిద్ధమైన 72 మేళకర్త రాగలక్షణమందుగల విజ్ఞానానికి తార్కాణమగును. ఈవిధంగా వారు అత్యంత ప్రతిభతో రచించిన కీర్తనల పట్టికనే గాక ఆయా మేళకర్తలను, వాటి సంఖ్యలను యీదిగువను తెలుపుట గమనింపదగును.

## శ్రీ దాసుగారు రచించిన మేళకర్తలందలి కీర్తనలు

(1) హరిభజనసేయు (కనకాంగి – 1-వ, మేళకర్త) (2) జానకీశపథము (వనస్పతి- 4 వ, మేళకర్త) (3) పరమాత్మునికృప- (నాగానందిని 30వ, మేళకర్త) (4) ఏమి నాపుణ్యమిట్టు (ఝంకారధ్వని-19వ, మేళకర్త) (5) ఏమిసేతు దైవమా (రాగవర్ధని-32 వ, మేళకర్త) (6) అరయమారాచబ్రతుకు - (ధవళాంబరి-49వ, మేళకర్త) (7) వింటివా యనుజా- (నీతిమతి-60వ, మేళకర్త) (8) అమ్మా వినుమా – (సుచరిత్రము-67వ, మేళకర్త) (9) అన్నా లక్ష్మణ నాదు (నవనీతము-40వ, మేళకర్త) (10) అకట యీమెకు (కోసలము-71వ, మేళకర్త) (11) అయోధ్యాజీవేశ్వరి (గవాంబోధి-43వ, మేళకర్త) (12) పోయినప్రాణము (మారరంజని-25వ, మేళకర్త) (13) జయజయకరుణాంతరంగ-(శూలిని-35వ, మేళకర్త) (14) ఈవే నేననుచు (రఘుప్రియ-42వ, మేళకర్త) (15) కోమలమేఘశ్యామా (సాలగము-37వ, మేళకర్త) (16) ఏలనే మాయమ్మా (ధాతువర్ధని-69వ, మేళకర్త) (17) ఎన్నాళ్లు సైరింతు (పావని-41వ, మేళకర్త) (18) ఏయూరెవ్వారితనయ (రసికప్రియ-72వ

మేళకర్త) (19) వినుమయ్యామాయూరు (విశ్వంభరి-54వ, మేళకర్త) (20) ఇంక జాగేలనే (వరుణప్రియ-24వ, మేళకర్త) (21) అదియేనేరా కాని (యాగప్రియ-31వ, మేళకర్త) (22) తమ్ముడా యాజనము (హాటకాంబరి-18వ, మేళకర్త) (23) ఏమిసేయుదునో (శ్యామలాంగి-55వ, మేళకర్త (24) రాముడు నీదగుప్రాణేశు (సేనావతి-7వ, మేళకర్త) (25) రాము కరుణ - (దివ్యమణి-48వ, మేళకర్త) (26) అమ్మా మన్నించుము జ్యోతిస్వరూపిణి-68వ, మేళకర్త) (27) అమ్మలార వందనమిదె(కాంతామణి-61వ, మేళకర్త) (28) రామ సుగుణధామ (నాసికాభూషణి-70-వ మేళకర్త) (29) సుదినమయ్యె (గాంగేయభూషణి-33వ, మేళకర్త) (30) అన్నలార మిమ్మంకముజేర్చి (చిత్రాంబరి-66వ, మేళకర్త) (31) ప్రాణేశ్వరీ మన (తానరూపి-6వ, మేళకర్త) (32) పరమపురుషులార (మానవతి-5వ, మేళకర్త) (33) ఆంజనేయభంజితాసుర (రూపవతి-12వ, మేళకర్త) వంటి కీర్తనలను ఆయామేళకర్త (జనక) రాగములందు రచించి వాటి సంగీతశైలిని గ్రహించుటకు వీలుగా స్వరపరచి యుండటం యెంతయు ప్రశంసనీయమైన విషయమనక తప్పదు.

ఇదే విధముగా ఆగ్రంథమున 22 జన్యరాగములలో కీర్తనలు రచించి అందులో (1) రణధీరా కపివీరా (హుసేని-22- ఖరహరప్రియ జన్యం) (2) మానసమా నీవు (శుద్ధసావేరి - 29 ధీర శంకరాభరణ జన్యం) అనెడి రెండు కీర్తనలకు తప్ప మిగత 20 కీర్తనలను యీ క్రింద తెలుపబడిన జన్యరాగములలో పల్లవి, అనుపల్లవి, మిత్రములను స్వరపరచి యుండటం మిగుల శ్లాఘనీయమైన విషయమగును. ఆకీర్తనల పట్టిక నేగాక, వాటి మేళకర్తలపేర్లు, వాటి సంఖ్యలను, జన్యములనుకూడ పాఠకుల కుపయుక్తముగ నుండుటకు యీ దిగువను తెలుపుటను గమనింపదగును.

## శ్రీ దాసుగారు రచించిన జన్యరాగ కీర్తనలు

1) శ్రీ గణనాథ (కలగడ - 13- గాయక ప్రియమేళ జన్యం) 2) అంబా కరుణించుము (మంజుల- 36- చలనాటమేళజన్యం) 3) హరి

భ_క్తిలేని (నాధనాళి- 8 హనుమతోడి మేళజన్యం) (4) హరిన్ గొలుచు_ (ఘంటారవము-2 రత్నాంగిమేళజన్యం) (5) అకటకటా (సామవరాళి_3 గానమూ_ర్తి మేళజన్యం) (6) ఓసీ యో మాయలాడి (బలహంస-28_ హరికాంభోజి మేళజన్యం) (7) మంచి తగవరివలె - (మేఘరంజి - 15 మాయామాళవగౌళ మేళజన్యం(8) కలయో నిజమో (కుంతలవరాళి28_ హరికాంభోజి మేళజన్యం) (9) ఎంతపని చేసితివిరా (పవాని-ఒక జన్య రాగం) (10) రమ్మామృత్యువ (హిందోళము-20 నఠభైరవి మేళజన్యం) (11) అమ్మా నీ విటులేల (ప్రతాపవరాళి-28 హరికాంభోజి మేళజన్యం) (12) ఏమి చెప్పుదును (కమలామనోహరి-27 సరసాంగి మేళజన్యం) (13) అమ్మ తండ్రివంటివాడ (గౌడమల్లారు-29 ధీరశంకరాభరణ మేళ జన్యం) (14) తాళలేను (నాగస్వరావళి 28-హరికాంభోజి మేళజన్యం) (15) కవలుపుట్టిరి (జనరంజని-29 ధీరశంకరాభరణ మేళజన్యం) (16) నిందెయనుచు (కామోద-65 మేచకల్యాణి మేళజన్యం) (17) రాము బాసియుంటి (భోగవసంతము-51 కామవర్ధని మేళజన్యం) (18) రామా రాక్షసభీమా (దేశాక్షి-28 హరికాంభోజ మేళజన్యం) (19) అన్నా కనుగొంటి (మలహరి-15 మాయామాళవగౌళ మేళజన్యం) (20) అను పమకరుణా (శారదాభరణము-34 వాగధీశ్వరి మేళజన్యం) వంటి కీ_ర్తన లను ఆయాజన్య రాగములలో రచించుటయేగాక ఆకీ_ర్తనల పల్లవి, అనుపల్లవి మిత్రములనెడి ముఖ్యాంగములను స్వరపఱచియుండటం, శ్రీదాసుగారి ప్రతిభావిశేషమున, కెంతయు నిదర్శనమగును. ఈవిధంగా శ్రీ దాసుగారు "జానకీ శపథం" గ్రంథంలో శాస్త్రీయ సంగీతానికి విశే షంగా ప్రాముఖ్యం యివ్వటానికి ముఖ్యకారణం, బహుశా హరికథకులకు శాస్త్రీయ సంగీతంలోని ముఖ్యభాగమగు జనక, జన్యరాగ లక్షణము లను గు_ర్తించుట అవసరమని సూచించడమేమో యని మనం వూహింప వచ్చును. ఈ విధంగా అతిక్లిష్టమైన యీ ప్రయత్నంలో శ్రీ దాసు గారు చాలావఱకు కృతకృత్యులై యుండిరనుటలో ఏలాటిసందేహం లేదు.

అందుకు వారిని యెంతయు అభినందింపవలసినదే. అయితే యీ సందర్భంలో ఒకముఖ్యవిషయాన్ని మాత్రం సూచించటం పాఠకులకెంతేని ఉపయుక్తమగును. శాస్త్రీయ సంగీత పరిజ్ఞానం లేని హరికథకులకుగాని తదితర పాఠకులకుగాని, జనక, జన్యరాగముల లక్షణములను గ్రహించి స్వయంకృషిచే ఆ యా కీర్తనలను పాఠం చేయుటకు వీలుగా, జనక రాగములకు సంఖ్యలను జన్యరాగములకును, వాటి మేళకర్తలు, సంఖ్యలను, ఆ యా రాగమూర్ఛనా స్వరములను, ఆ యా స్వరములు షోడశ స్వరములలో యే రకమునకు చెందినవో తెలుపు వివరమును తెలుపుటయేగాక, కీర్తనల స్వరసాహిత్యములకు, తాళాంగ, ఆవర్త, కాల ప్రమాణ, స్థాయి సంకేత, తాళగ్రహ గుర్తులను యేర్పఱచి ప్రకటించినచో అభ్యాసకుల స్వయంకృషికి యెంతో సులభసాధ్యమయ్యేది.

ఇదేవిధంగా యీ కీర్తనలలో కొన్నిటికి, రూపక, త్రిపుట, చతురశ్రత్రిపుట, ఝంపెతాళములను స్పష్టంగా పేర్కొనియుండటం ముదావహమూ. అట్లే మిగత కీర్తనలకు తాళములను పేర్కొనక త్రిశ్రగతి, చతురశ్రగతి, ఖండగతి, మిశ్రగతి, సంకీర్ణగతి యని మాత్రమ్మే పేర్కొనటం జరిగెను. గనుక అభ్యాసకులకు తాళములను వేయుటలో కొంతవరకు సందేహం కలగటానికి కారణమగును. గతి, యనగా ఏదైన ఒక తాళముయొక్క నిర్దిష్టమగు అంగములతో క్రియలను నడపువిధమును తెలుపునది "గతి" యని చెప్పబడును - గనుక అభ్యాసకులు యీ కీర్తనలలో కొన్నిటికివ్వబడిన త్రిశ్ర, చతురశ్ర, ఖండ మిశ్ర, సంకీర్ణ, గతులనుబట్టి ఆ యా కీర్తనల అసలు తాళములేవో నిర్ణయించటం సాధ్యం కాకపోవచ్చును. గనుక యీవిధంగా కేవలము "గతి" యని పేర్కొనుటకంటె "త్రిశ్రలఘువని"గాని "చతురస్రలఘు" వనిగాని, "ఖండలఘు" వనిగాని, "మిశ్రలఘు" వనిగాని, "సంకీర్ణలఘు" వనిగాని పేర్కొనియున్నచో వాటిని పంచజాతులకుచెందిన లఘువులుగాగాని, లేక పంచజాతులకు చెందిన త్రిశ్రఏక, చతురశ్రఏక, ఖండఏక,

మిశ్రఏక, సంకీర్ణఏక తాళములుగా గాని చెప్పటానికి వీలుకలిగి శాస్త్ర రీత్యా యెంతో స్పష్టంగా వుండేది. బహుశా యీ ఒకటి రెండు కారణములవల్లనే కాబోలు శ్రీ దాసుగారి శిష్యపరంపరకుచెందిన కొందరు శ్రీవారు జీవించియుండగనే దర్శించి వారి "జానకీశపథం" అను గ్రంథంలోని మేళకర్త రాగములందలి కీర్తనలను ఆయా రాగములతో పాఠం చేయుటంగాని, కేవలం గతులను మాత్రమే సూచించిన కీర్తనలకు తాళము వేయుటగాని సాధ్యంగాకున్నదనియు, అందుకు శ్రీవారి సలహాను కోరుతున్నామని సవినయముగా మనవి చేసినట్లునూ, అందుకు శ్రీ దాసుగారు వారి ప్రార్థనను సానుభూతితో మన్నించి హరికథకులు వారికిగల సంగీతజ్ఞానాన్ని బట్టియు, గాత్రసౌలభ్యాన్ని బట్టియు, అభిరుచిని బట్టియు, తగిన రాగ, తాళముల నేర్పఱచుకొని ఆయా కీర్తనలను పాఠం చేయదగునని సెలవిచ్చినట్లు యొక ప్రతీతి గలదు. ఇదే నిజమైనచో శ్రీ దాసుగారికి గల శిష్యవాత్సల్యము, సమయస్ఫూర్తి, నిర్ణయము లెంతవుదారములైనవో మనం సులభంగా గ్రహింపవచ్చును. ఈవిధంగా శ్రీ దాసుగారు "జానకీశపథం" అను గ్రంథములో రచించిన కీర్తనలను శాస్త్రీయసంగీతమునకు చెందిన మేళకర్తరాగమునందు రచించటంగాని, ఆయా కీర్తనల ముఖ్యాంగములగు పల్లవి, అనుపల్లవి, మిశ్రములను స్వరపరచి ప్రకటించడంగాని, శాస్త్రీయసంగీతంలో వారికిగల అభినివేశమునకు అభిమానమునకు తార్కాణమగును. అంతేగాక యిదివరకు యెవ్వరును ప్రకటించుటకు పూనికొనని ఒక పవిత్రగ్రంథరచనకు కూడా పూనుకొని ఆ ప్రయత్నములో కూడా వారు సఫలమనోరథులు కావటం వారి ప్రతిభకు నిదర్శనం కాకపోదు. అద్భుతమైన ఆ కృషి ఫలితమే "ఋక్సంగ్రహః" లేక, "మొుక్కుబడి" అను గ్రంథమగును.

ఈ గ్రంథమునందు శ్రీ దాసుగారు ప్రాచీనులగు పెద్దలు యేర్చి కూర్చిన మూడు వందల నాలుగు ప్రాబల్యపద్దెములను దరువులుగా

మార్చుటలో పదకొండు భాగములుగా విభజించి అందు మొదటి భాగంలో 41 చల్వవేల్పు దరువులను, రెండవ భాగంలో 66 వేల్పు తేడు దరువులను, మూడవ భాగంలో 32 వేకువరాణి దరువులను, నాల్గవ భాగంలో 48 కవలు దరువులను, అయిదవ భాగంలో 21 వేల్పు బొజ్జదరువులను, ఆఱవ భాగంలో 19 ప్రొద్దువేల్పు దరువులను, ఏడవ భాగంలో 23 వేడివేల్పు దరువులను, ఎనిమిదవ భాగంలో 19 ఏటివేల్పు దరువులను, తొమ్మిదవ భాగంలో 15 కవవేల్పు దరువులను, పదవ భాగంలో 9 ఎఱుకువ దరువులను, పదకొండవ భాగంలో 11 రాయ బారము దరువులను యేర్పరచి వాటిని స్వరపఱచి యుండటమేగాక వాటిని అచ్చ తెలుగు పద్యములతో వివరించియుండటం బహుశా మన దేశంలోనే జరిగిన మొట్టమొదటి ప్రియత్నమేమోనని భావింపదగి యున్నది. అంతేగాక యీ వేదపనసలను తాను వీణావాద్యమునందు కూడా ప్రదర్శింపగలగటం, తమ శిష్యులగు సంగీత విద్యార్థులచే సైతము ప్రదర్శింపజేయటం, శ్రీ దానుగారికి ప్రాచీనమైన మన ఋక్ పనసలయందు గల అఖండగౌరవమునకు నిదర్శనం కాగలదు. ఈ విధంగా వీణావాద్యమునందు వందలకొలదిగా నుండు ఋక్ పనస మంత్రములను ప్రదర్శించటంగాని, యితరులుకూడ ఆ పవిత్ర మంత్రములను ప్రదర్శించు టకు వీలుగా స్వరపఱచి ప్రకటించడంగాని శ్రీ దానుగారి జీవితంలో యొనర్చిన అద్భుతమైన కృషి ఫలితమగును.

# దాసుగారి హరికథామృతము — సంగీతరచనా విశేషములు

సంగీత సాహిత్యభూషణ, విద్వాన్

**శ్రీ ములుకుట్ల సదాశివశాస్త్రి**

శ్రీ దాసుగారు సంస్కృతమున రచించిన హరికథామృతము నందలి పెక్కు కీర్తనలు (ముహురానన్ద భరితమ్, సుజనావనమాశు శ్రూయతామ్ నారాయణచరితమ్ మొదలగునవి) తెలుగునాట సుప్రసిద్ధములై బహుళప్రచారమందియున్నవి. నారాయణతీర్థులవారి తరఙ్గముల తరువాత శ్రీకృష్ణచరితమును గేయకావ్యముగా సరళమగు సంస్కృతభాషయందు రచించినవారు శ్రీ నారాయణసద్గురువర్యు లొక్కరే.

"అష్టాదశపురాణాని ప్రోక్తాని గురుణా మమ
తేషుభాగవతం శ్రేష్ఠం కృష్ణలీలావిభూషితమ్
పురాణం శ్రీభాగవతం ద్వాదశస్కన్ధభూషితమ్
దశమే తత్ర సంభూతం కృష్ణస్యచరితామృతమ్" అని.

తలచి భాగవతదశమస్కంధపు కథను శ్రీకృష్ణజననమ్, పితృబన్ధవిమోచనమ్, ధర్మసంస్థాపనమ్మను పేర్లతో మూడుభాగములుగా గద్యపద్యాదులతో కథారచన చేయుచు కృష్ణకథాప్రాశస్త్యమును తెలుపుచు కాఫీ రాగము త్ర్యస్రగతిలో రచన చేసినారు.

ఉద్గ్రాహః. ముహురానన్ద భరితమ్ మురళీధరచరితమ్
ధ్రువమ్. విహృతసర్వదురితమ్ పిబతపిబత త్వరితమ్

౧. హరినామవితాన మతిసౌఖ్యనిధానమ్
పరమేశ్వరగానం భవమోక్షస్థానమ్

౨. కృష్ణకథాసారం భవతృష్ణాఘవిదూరమ్
తూష్ణీంకృతవైరం శ్రితతోషణప్రచారమ్

౩. వాసుదేవగీతం సర్వప్రపంచపూతమ్
భాసమాన నారాయణదాస సత్ప్రణీతమ్

ఈ కీర్తన త్ర్యస్రగతిలో నృత్యమునకు మిక్కిలి అనుకూలమైనది. నృత్యము దాసుగారి సొమ్ముగదా! అందున భరితమ్, చరితమ్, దురితమ్, త్వరితమ్ అను శబ్దాలజ్కారములగూర్చి కీర్తనమున మూడవ యక్షరమునకు దీర్ఘములు కల్పించి శ్రీదాసుగారు చేసిన రచన నిరుపమానమైనది. శ్రీ దాసుగారు రచింపదలపెట్టినది భాగవతకథ గనుక "అనుసర మానసభాగవతమతం" అను కీర్తనను శుభపంతురావళిలో చతురశ్రగతియందు రచించినారు. ఆ కీర్తన భాగవతమతమున కనుకూలమైన భావమును సూచించుచున్నది. ఈ కీర్తన పల్లవిని స్వరస్థాయిలోను, లయయందును మిక్కిలి విలంబకాలమున షడ్జమస్థాయిని ప్రారంభించుచు భాగవత మతప్రాశస్త్యమును వెల్లడిచేసినారు. తదనంతరము "హరికథామృతం పిబరే దురిత దూషిత స్మర నారాయణనామ మరణభీషిత" యని కాఫీరాగము రూపకతాళమున శ్రీ దాసుగారుచేసిన రచన సదాశివబ్రహ్మేంద్రుల "పిబరేరామరసమ్" అను కీర్తనను బోలియున్నది. నేడు జనసామాన్యము కాఫీ పానముచేయుచు మరణశీలురై యుండ "మరణభీషిత హరికథామృతం పిబ" అని కాఫీరాగముననే కీర్తనను స్వరపఱచుట ఎంతయు శ్లాఘనీయము. మరియు సంస్కృతమున ప్రాసనియమము లేకున్నను, సంస్కృతమునను యతిప్రాస నియమముల పాటించి శబ్దాలజ్కారాద్దుల గూర్చుచు భాగవత కథ గనుక తెలుగున భాగవతరచన

గావించిన పోతనకవీంద్రుల కవితారీతుల్నన్నింటిని తమ కీర్తనలలో గూర్చి తమకు భాగవత గ్రంథమునగల భక్త్యనురాగముల ప్రకటించినారు.

"గద్యం కవీనాం నికషం వదన్తి"

అట్టి గద్యరచనమందును దాసుగారికొక విశిష్టమైన స్థానముగలదు. అది సర్వజన విదితము. తెలుగున వారు రచించిన యథార్థ రామాయణాదులందేగాక సంస్కృతరచనమందును శుకయోగీంద్రులు పరీక్షిన్మహారాజును భాగవతకథాశ్రవణము చేయుమని చెప్పు సందర్భమున పరీక్షిన్మహారాజును సంబోధించుచు శ్రీ నారాయణదాస సద్గురువర్యులు చేసిన వచన రచన నిరుపమానమైనది.

"పాపాట వీవీతి హోత్రి - పుణ్యాచారిత్రి - సుకుమారగాత్రి - సమస్త పరిపన్ధిజైత్రి, సజ్జనవనచైత్రి - సంప్రాప్త విబుధస్తోత్రి కవికల్మాషాన్ధకార - ప్రచణ్డమిత్రి - శోకాబ్ధి నిర్మగ్న దీనవహిత్రి - యాచక దారిద్ర్యలతాలవిత్రి - పాండవకులపవిత్రి - సావధానం శృణు" దాసుగారి యీ వచన రచన నెంతని కొనియాడగలము.

వీరు కొన్ని కీర్తనలకు ముక్తాయిస్వరములగూర్చి, కొన్ని కీర్తనలకు వివిధ గతులలో శబ్దములగూర్చి అనన్య సామాన్యమైన తమ సంగీత శాస్త్ర ప్రతిభను చాటినారు. అందు "దేవదేవ విష్ణో త్రిగుణాతిచరిష్ణో" అను హంసధ్వని త్ర్యస్ర కీర్తనలో శ్రీ దాసుగారు కూర్చిన హంసధ్వని రాగస్వరము-అందు చూపిన వక్రసంచారి విశేషము అనన్య సామాన్యమైనవి. ఆ స్వరముననే నృత్యమునకు తగిన ముక్తాయింపు లిమిడియున్నవి.

శ్రీ దాసుగారి హరికథామృతమున ప్రతికీర్తనలో నేదో యొక విశేషము కన్పట్టుచునే యుండును. కొన్ని కీర్తనముల కొన్ని సంకేత

ములు కూడ గలవు. వసుదేవుడు దేవకిని బాధింపకుమని కంసుని ప్రార్థించు కీర్తనను యదుకులకాంభోజిరాగమున రచించినారు శ్రీ నారాయణ దాస సద్గురువర్యులు యదుకులకాంభోజిరాగము భాషాంగరక్తిరాగము. మధ్యమ ధైవతములు ఛాయాస్వరములు. ఈ సంగీతశాస్త్ర మర్మముల బాగుగా నెరింగిన దాసుగారు "మాజహిస్వసారం మజ్జీవాధారమ్." అను కీర్తనమున కూర్చిన ధాతుమాతు ప్రయోగ విశేషము - కీర్తన నడక ఆవసుదేవుని ఉత్తలపాటును ఎంతయు సూచించుచున్నది.

ఇది బహుకరుణరసమగు కీర్తన. కనుకనే దీనికి దాసుగారు కూర్చిన రాగతాళములట్టివి. ఈ కీర్తన రచించి పాడునపుడు దాసుగా రెంతటి కరుణార్ద్ర హృదయులయిరో ఊహింపనగును. దాసుగారే యన నేల ? కఠినహృదయుడగు కంసుడే

"బహుకరుణా రసభరితం
శృత్వా కంపోఽథ భావుకస్య గిరమ్
దయార్ద్రీకృత హృదయః
కోశే వినివేశ్య ఖడ్గమ భణత్తే."

అని పరమశాంతుడైనట్లు దాసుగారు రచించినారు.

దాసుగారు ఏరసమును ఏరాగ తాళములలో కీర్తనను రచింప వలయునో ఎరిగి ఆ రాగతాళములను ఆ యా కీర్తనలకు గూర్చుచుం దురు. శ్రీకృష్ణుడు కాళీయ భోగి భోగ పరివేష్టితుడైనపుడు చూచిన తలిదండ్రులు గోపబాలురు పొందిన దుఃఖమును పున్నాగవరాళి త్ర్యస్ర గతి కీర్తనలో రచించినారు. పున్నాగవరాళి ఎనిమిదవ మేళమైన హనుమ తోడి జన్యము. నిషాదాంత్య రాగము మంద్రస్థాయి నిషాదమునుండి మధ్యమస్థాయి నిషాదమువరకు గానము చేయదగినది. కొందరు మధ్యమ ధైవతమువరకే గానము చేయదగినదని తలంచినను ప్రసిద్ధ వాగ్గేయ కారులెందరో ఈ రాగమును నిషాదాంత్యముగా మధ్యనిషాదమును గూర్చియే గానముచేసినట్లు వారి కీర్తనల మూలమున తెలియుచున్నది.

ఈ రాగమునకు మధ్యస్థాయి యందుగల దైవత సంకలితమైన నిషాదమే ప్రధాన రాగకళగా నున్నది.

గ-రి-స-ని-గ-రి-గ గమ-మగ-గమ - ప- ప దనిదప దనిదపమ సగరిగరిగరిస మొదలగు ప్రయోగములు మిక్కిలి రంజకములై యుండును. పెక్కు కథలలో పెక్కు కీర్తనలను (సుప్రసిద్ధములైన బాలచంద్రమౌళి మున్నగు వానిని) దాసుగారు ఈ రాగములో రచించియు ఆ కీర్తనములకు మిశ్రగతి తాళమును విధించినారు. హరికథామృతములోని యీ పున్నాగవరాళి రాగకీర్తనకు త్ర్యస్రగతి విధించుట కాళియ భోగి భోగ పరివేష్టితుడైన కృష్ణునిజూచి తలిదండ్రులు - గోపబాలురు పొందిన దుఃఖోద్వేగమును తెలియజేయుటకొఱకే ఎంతటి కఠినహృదయులకైనను ఈ కీర్తన విన్నప్పుడు కంట నీరు చెమర్చక మానదు.

దాసుగారి కీర్తనలు ముఖ్యముగా హరికథామృతములోనివి. ఏ విద్వాంసుడైనను స్వరపఱచినచో హరికథకు లేగాక గాయకులుగూడ గానసభలలో పాడదగినవై యున్నవి. తక్కువ సాహిత్యము - ఎక్కువ సంగతులకు- రాగభావముల కవకాశము-అందున సరళమైన సంస్కృత భాష-తగిన రాగతాళములుగల హరికథామృతమునందలి కీర్తన లెంతయు హృదయరంజకములు. లోగడ హరికథామృతమునందలి కొన్ని కీర్తనలు (విష్ణోనారాయణ - అనుసరమానస- పరమేశ్వర భక్తింవ్రజ- నమోనారాయణాయ మున్నగునవి) భక్తిరంజనిలో ప్రసారమైనపుడు బహుజనాదరణ నొందినవి. కారణాంతరములవలన ఆకీర్తన లిప్పుడు ప్రసారమగుట లేదు. హరికథామృతమునందలి కీర్తనలను ప్రచారమునకు దెచ్చుటకు సర్వవిధముల కృషి చేయవలసియున్నది.

ఆట - పాట - మాట - మీటల మేటి ప్రంభావ సరస్వతియగు నట్టి శ్రీ నారాయణదాస సద్గురువర్యులకు ఐదుపదులుంచేసి సెలవుతీసి కొనుచున్నాను.

# హరికథా గాంధర్వ సార్వభౌముడు

హరికథక రాజహంస

**శ్రీ అమ్ముల విశ్వనాథ భాగవతులు**

## 1. యథార్థ రామాయణ సంగీత హృదయ సమీక్షణము

### ౧. శ్రీరామజననము:—

శ్రీ నారాయణదాసుగారి యథార్థరామాయణం "పాఠ్యే గేయేచ మధురం తంత్రీలయ సమన్వితమ్'' అని నుడివిన వాల్మీకి కవికోకిల వాక్యములకు తగినట్టుగా నిర్మించిన ఒక యక్షగాన కథాఖండమనక తప్పదు. కావ్యనిర్మితికి కావలసినది

"నానారాగ సమాయుక్తం నానాతాళ వివేచితమ్
నానారస సునిర్వాహ్యం కావ్యం కావ్యవిదో విదుః"

అన్న బుధోక్తి కూడా దృష్టిలో ఉంచుకునే దాసుగారు యక్షగానము సృజించినట్లు మనకు అర్థమవుతుంది. అంతేగాక వారు ఆ రామాయణ పీఠికలో కావ్యరచనా కౌశలం గలగటానికి ఈ క్రింది సల్లక్షణాలు కవికి ఉండవలెనని సూచనచేస్తూ "ఉపజ్ఞాలబ్ధ చతుర్విధాభినయ పరీక్షా వైభవముచే రాజసభల రంజింపజేయని వాడెట్టి కావ్యరచనము సేయ దగదు. మఱియు నట్టి సంగీత గోష్ఠుల పాఠ్యగ్రంథముల స్వరకాలను నియమించు నధికారిగా నుండదగదు. సంగీతజ్ఞాన శూన్యునకు నిక్కముగా సాహిత్యజ్ఞాన మొకింతయు గలుగనేరదు. పౌరాణ్య యుపన్యాసత్వ

కొయ్యత్రిప్పుడు వేదపాఠములన్ బఠింపగలడా ? చెల్లిపోయినవారి నిర్జీవమూకీపుస్తకములు కుక్షింభరులు పాఠముజెప్ప సాహసింపగూడదు. శ్రుతి తల్లి లయ తండ్రి. మాతా పితృ శుద్ధిలేనివానికి సందర్భశుద్ధి మృదు మధుర పదవిన్యాస కౌశలము వాతకుగాని వ్రాతకుగాని రాబోదు- అన్నారు. అంతటితో ఆగక హారికథకునకున్న ప్రశస్తి వానిబాధ్యత ఉండవలసిన సామర్థ్యము సంగీతవిషయము ఇంకెన్నెన్నో సోదాహరణంగా నీ పీఠికలో ప్రస్తావించారు. రామాయణమునందలి పాత్రల యౌచిత్యమును గూర్చికూడా ఇందు వారు పొందుపరచిరి. ఈ 'శ్రీరామ జనన' సంవిధానఘట్టంలో

దశరథుడొకనాడు వేటకై తరలి నట్టడవిలోన
విశిఖమున మృగమనుకొని యొక్కమునిన్ గూల్చె దనశరాన

అన్న 'మంజరి' (మధురగీతి) "నాదనామక్రియ"లో వారు పూరించారు. ఇది మాయామాళవగౌళజన్యమైన నిషాదాంత్యరాగం. దీని యాలాపనవలన శోకరసము జనించును. ఆ పిదపఘట్టంలో తమపుత్రుడు మరణించినట్లు దశరథునివల్ల గ్రహించిన వృద్ధమునిదంపతులు

ఏమందుమయ్యో ! యెట్లుందుమయ్యో యెందేగినావో కొడుకా !
మామూలధనమా మటినిమ్నగనమా యెందేగినావో కొడుకా హా ! !

అని విచారించిన ఈ కీర్తనకువారు "శుభపంథవరాళిరాగం" "త్రిశ్రజాత్యేకతాళం" లో సమకూర్చారు. విచారరసస్ఫోరకమగు రాగములలో నిదియూ ముఖ్యమైనదే. 45వ ప్రతిమధ్యమ మేళకర్తరాగమైన ఇది స్థాయి భేదములతో చక్కగా పాడగల్గినచో ప్రజలు సమ్మోహితులౌదు రనుట త్యుక్తిగాదు. ఉత్తరాదివారు దీన్ని 'తోడి' పేరుతో పిలుస్తారు. దాసుగారి రాగం చాలా విశేషంగా ఇష్టంగా పాడేవారని ప్రతీతి. హిందూస్థానీ గాయకులు సైతం వారిపాటకు ముచ్చటపడివిని మురిసిపోయేవారటకూడ. ఇలా దాసుగారు సమయానికి

తగిన సంగీతం సమకూర్చటంలో సిద్ధహస్తులని ప్రతికీర్తనలోనూ యిలా మనకు బోధపడుతూనేవుంటుంది.

తరువాత సన్నివేశంలో సంతానవిహీనుడైన దశరథభూజాని వశిష్ఠగురుదేవునవలోకించి నిస్పృహచెందుతూ మునివరా! మీరెంత చెప్పిననూ నాకు వంశాభివృద్ధి గల్గునన్న యాశలేదు.

"కాలము మళ్లిన యాలుమగలము గలిగెదరెటుమాకు సుతులిపుడు
ఏల యీ పిచ్చి యాసలో గురుడ ఋతువిరుద్ధమగు ఫలమెటులబ్బును ?

అని విచారించిన ఈ కీర్తన "నీలాంబరి"లో వ్రాశారు. నిరాశా దైన్యాలను వ్యక్తంచేసే యీ రాగం ఇచట మిక్కిలి సమంజసంగా వుంది. ఇది మధ్యాహ్నం పాడదగినదని కాలనిర్ణయ విభాగంలో నారదాదుల ఆదేశం. ఇది వ్రతరాగమనికూడా శాస్త్రం చెబుతుంది. ఇదిలావుండగా మహావిష్ణు సందర్శనాకాంక్షులై యోగమహిమచే వైకుంఠమునకేగిన సనక సనందనాదుల హరిద్వారపాలురు గ్రహింపలేక లోనికిపోనీక తిరస్కరించినపుడు వారుకోపించి,

ఔరా! జయవిజయులార అడ్డెదరా మమ్మె మీ రౌరా
నారాయణదాసులయ్యు జ్ఞానమొకింతయులేకారా!

అంటారు. అఠాణరాగంలో వ్రాసిన యీకీర్తన వారి ఆగ్రహావేశాల కనుకూలంగావుంది. ఇట్టి కోపతాపాల సందర్భంలో చాలచోట్ల దాసుగారు దీనినే వినియోగించారు. అలాంటి రసవిశిష్టతగల పద్యానికి కూడా ఈ రాగం మంచి రక్తినిస్తుంది. ఆ పిదప కథలో జయ విజయులు శాపగ్రస్తులై పశ్చాత్తాపంతో కుందుచున్నపుడు మాధవుడరుదెంచి వారిని మందలిస్తూ

ఎంతపని చేసితిరి యీ ఋషుల నడ్డితిర- ?
ఈరు జయవిజయులారా! మంతయుయు క్తాయుక్త మెరుంగక,
అంతిపురమున కెవరి రానీకు డీ యనగ - తత్కర్తనే యవలవెట్టివయట్టు
—ఎంతపని

అవి పరమాత్మ వారికి నీతిబోధించిన యీ కీర్తన మలయమారుతరాగం ఖండగతితాళంలో చిత్రించారువారు. భగవంతునిచే పలికించు యీ పసిడి పలుకులకు క్రమబోడవ సౌమ్యతమమగుఈ రాగమెంతో మనోజ్ఞంగావుంది. సరే, మరోవిశేషమేమంటే దాసుగారి రామజనన గాథలో యాజ్ఞవల్క్య రామాయణాంతర్గత నారదపరాభవకథను పొందుపరచారు. "లక్ష్మీదేవి కూడ భూలోకంలో విష్ణువుతోపాటు సీతామహాదేవియై జనించుటకు కారణం నారదుని శాపమే" అన్న రహస్యాన్ని బహిర్గతం చేయడానికే యీ ఉపగాథ వారిందుచేర్చారు. శీలనిధి మహారాజుగారు కుమార్తెకు స్వయవరం ప్రకటిస్తారు. ఇది తెలిసి నారదముని హఠాత్తుగా వారి భవనానికి వస్తారు. వెంటనే ప్రభువు తనముద్దుబిడ్డ విశ్వమోహినిని మహర్షి ముందుంచి ఆమెకు తగినభర్త కాగలవారెవరో చెప్పమంటారు విష్ణుమాయామోహితుడైన దేవమౌని ఆ కోమలాంగిన చూచి విస్మయమందిరి.

కొమ్మగాదిది మేలిబంగారు బొమ్మ యౌరౌరా యీ ముద్దు
గుమ్మ సొగసు వర్ణింప నాతరమా ! హా !
చూపాపువ్విల్కాని క్రొవ్వాడి తూపా తమిద్రుళ్ళెడు బేడిస
చేపా దాని చూచి శక్యమా ధైర్యమాప ? హా !

ఇది యమన్ కల్యాణిరాగం త్రిశ్రగతిలో వ్రాశారు దాసుగారు. ఈ రాగం కల్యాణివలెనేవుంటూ రెండు మధ్యమాలు తగలటంచేత హిందుస్థానీ పోకడలతోనిండి వుంటుంది. ఇది విలంబంగా పాడడానికి అభినయానికి కూడా వీలుగలిగిస్తుంది. నారదుని వంటి గానవిశారదునకు నటనాకుశలునకు తగురీతిగా నిది తయారు చేశారేమో దాసుగారు అనిపిస్తుంది. ఆ పిదప నారదుని స్వయంవరంలో పాడే

నావంటి సొగసుకాడేడే నవ్వులపదా యీ ముద్దులాడి
తుంటవిల్తుడిదానాకు ఆ వనిత నాపై బడదా ?

అనిన కీర్తన కమాస్ రాగంలో సమకూర్చారు. ఇదెంతో సహజంగా వుంది. ఈ రాగం కూడా హిందూస్థానీ బాణీనే స్ఫురణకు తెస్తుంది. ఆ దేశఘట్టంలో నారదుడు నారాయణుని శపించేప్పుడు

'ఎంతపని జేసితివి విన్నేమందునోయి
కాంతతో నీవును గ్గలసితో అమ్మాయి?'

అని గానముచేసిన సారంగరాగకీర్తనను మిక్కిలి సారస్యంగా సమన్వయపరచారు. అనంతరం అంగదేశమున కరువుకల్గటం, ఆసంగతి దశరథునకు వశిష్ఠగురుదేవుడు చెప్పే సందర్భంలో

“అంగదేశమున నొకప్పు డవనినాథ కరువు మట్టె
నింగి బొల్లి మేఘమొకటి నిలచె లోభిమొగమట్టి”

అనిన కీర్తన కూడ ఔత్తరాహిక గానసంప్రదాయానుకూలమైన జంఝూటరాగంలోనే వారు వ్రాశారు. ఇది మధ్యమశ్రుతి ప్రధానంగా మేళవించి పాడవలసినరాగం. సందర్భోచితంగా సౌమ్యతమంగా వుందిచట. ఇక ఋష్యశృంగాశ్రమానికేగిన నెరజాణలైన వేశ్యలను చూచిన ఆ ముని ఆనందాద్భుత రసము లుప్పతిలగా,

'ధన్యుడనైతిని మీసందర్శనమున తపసులారా
మాన్యులు మీరెంతయు మీమాడ్కి మౌనులున్నారా ?
ఈతీగలన్నిటు చేర్పరించెడి శ్రుతులు మావేదములకన్న మధురములగు.

అంటారు. ఇది శ్రీరాగంలో చిత్రించారు. క్రింది పద్యం కూడా ఎంతో హృద్యంగావుంది. ముని వచనములకు సమాధానంగా వారాంగనలు చెప్పు సమాధానకీర్తనాసరళి శహానరాగంరూపక తాళంలో మిక్కిలి మనోజ్ఞంగావుంది. ఈ రాగం ఆరోహణావరోహణములు రెండూ వక్రములైననూ శ్రుతిహితమైనది. వారవనితలు వీణలుధరించి వేణుమృదంగాది సమ్మేళనముతో నృత్యాభినయ సమన్వితముగ పాడి

ఆ మహర్షిని సంతోషపరుస్తారు. వాళ్ల గానకౌశలానికి పరమ ప్రామాణికంగా దాసుగారు సృజించిన రాగమిది. దశరథునకు సంతాన ప్రాప్తి చేకూరిన పిదప బారసాల మహోత్సవం చేసుకుంటున్న సందర్భంలో—

'పుత్రోత్సవమున్ దశరథ భూపతి జేసెన్ ముదమున
పత్రికలన్ శుభవార్తల ప్రచురించె సకలదేశంబుల.

ఈ కీర్తన 'నాయకిరాగం' రూపకతాళంలో రచించారు. ఇది ప్రచారంలో లేనిరాగం. కథకుడు దీనిమూర్ఛనాలంకార క్రమం తెలుసు కొని ముందుకు పోవటానికి ఇలాటి రాగాలను కూడా కల్పించారువారు. హరిదాసు సంగీతానికి సాహిత్యంచేత సాహిత్యానికి సంగీతంచేత దాస్యం చేయించకుండా వాటి సాహిత్యాన్ని సామర్థ్యంతో నిర్వహించటం దాసుగారి యభిమతమని యీ రూపకంలో వ్యక్తమౌతోంది మనకు. అందుకే ఒక చోటువారు.

కవులలోనెల్ల శ్రేష్ఠుడుగాని యక్క
గానకావ్యములల్లగా గలఁడె యొరుఁడు ?
పలుకుచెలియ చన్నుగవ నిర్వంకల చవి
నొందకయ కైతలల్లుట యూకదంపు.

అంటారు నిష్కర్షగా.

## ౨. సీతాకళ్యాణము :—

యజ్ఞసంరక్షణార్థం విశ్వామిత్రుడు రాముని తోడ్కొనిపోవుటకు వచ్చిన సందర్భంలో దశరథభూజాని కౌశికునకెదురేగి—

''తపసిమిన్న నీరాకచే ధన్యుడనైతి తరించెనాకులము
ఇపుడు నన్ను నీయిచ్చవచ్చినటు - లేలుకొమ్ము నే నీ దాసుడనో

అని స్వాగతం చెబుతాడు. ఈ కీర్తన 'కురంజి' రాగం చతురస్ర గతిలో సృజించారు వారు. ఇది 29వ మేళజన్యమైన ధైవతాంత్యరాగం.

అనగా సనిసరిగమపద-ధపమగరిసనిస - అనే ఆరోహణావరోహణములలో వుంటుంది. దీనికి విష్ణు వధిదేవత అని శాస్త్రం చెపుతోంది. ఇది చాలా లాలిత్యంగా వుంటుంది. దాసుగారు దీనిని చాలా చాకచక్యంతో పాడేవారట. కాని యీ కీర్తన ఆ ఛాయలుగల మరొక రాగంలో పాడి హరిదాసులు కొందరు తప్పుకుంటున్నారు. ఆ దాసుగారి హృదయాన్ననుసరించి అదే గానంచేస్తే ఎంతో బాగుంటుందిగదా!

పిదప రాముని విశ్వామిత్రునివెంటపంపవలసి వచ్చినపుడు దశరథ భూపతి వశిష్ఠగురుదేవుల ప్రార్థిస్తూ

'ఏమిసేతు దైవరాయ యెట్లిదయుదు నా గుండెకాయ
రాముని తన యజ్ఞరక్షణకై తోడ్కొన-యీ మౌనిశేఖరు దిట్టు పట్టుబట్టె

అన్న యీ విచారసూచితఘట్టంలోని పై కీర్తన "అసావేరి" రాగంలో వ్రాసి దానికి ఎంతో ధర్మం చేకూర్చారు.

ఇలాగే రామలక్ష్మణుల విశ్వామిత్రునివెంట వంపే సందర్భంలో దశరథుడు దుఃఖమావుకొని కుమారులను చూస్తూ—

అన్నలార మునియజ్ఞరక్షణకై అరిగిరండు జయమంది ముదంబున
యెన్నిరా మార్గ మన్నిఋషీశ్వరుడు మిమ్మె పాయ మిమ్మనెరయుమన.

అనిన ఈ కీర్తన దేవగాంధారిరాగంలో వ్రాసి ఎంతో రసపుష్టిని చేకూర్చారు ఈ సన్నివేశానికి దాసుగారు. యజ్ఞసంరక్షణానంతరం విశ్వామిత్రముని రామాదుల వెంటగొని [పోవునపుడు] అహల్యా శాపవిమోచనమైనది. అపుడు అహల్యాగౌతములు రాముని దేవోత్తమునిగా నుతిస్తారు. అనంతరం ప్రయాణంలో రాఘవుడు కౌశిక నవలోకించి 'మహర్షీ! ఆ దంపతులు దైవమని నన్నేల నుతించిరి? నే మానవుడనే యిది సమంజస మెట్లగును?' అనిన విని వారని మందహాసం చేసి—

అన్నలార మీకొక రహస్య మెల్ల వినిపింతు
అన్నులమిన్న అహల్య ఆ గౌతమఋషి భార్య

అని చెప్పే సందర్భంలో కీర్తన అభోగిరాగంలో చిత్రించారు. ఆ పాట కా రాగతాళా లెంతో సమంజసంగా వున్నాయి. ఇక గౌతమమహర్షి ఇంద్రుని శపించేసందర్భంలో—

"నా కులసతి చెరుప నేగినాడవా బడవా!
కాకృత్యము సల్పినావు కను లగుపడవా?

అంటారు. ఇది నాటరాగ కీర్తన. పురుషరాగం, ఘనరాగంకూడ కావటంచే నిది చాలా ఠీవిగా రాజసప్రకృతిగా వుంటుంది. గౌతముని భావగంభీరత కిదెంతో ఒప్పిదంగా వుంది. ఇలాంటి వెన్నో దాసుగారి దూరదృష్టికి నిదర్శనంగా మనకుగోచరిస్తాయి. తరవాత స్వయంవరానికి వచ్చిన రాజులు చిత్రపటాలు చూస్తూ జానకీదేవి రాముని పట్లమందు తనకున్న మమకారం వ్యక్తంచేస్తూ చెలికత్తెను చూచి—

వెదకిరావే వేవేగపోవే - ముదితరో యిటువంటి పురుషు డెందున్నాడో
రాముడంట దశరథరాజసుతుడట — కోమలి వీనిపై కోరిక పుట్టెనే

ఇది బేహాగ్ రాగం; మిశ్రగతి కూడ కావటంచేత జావళీ బాణీలో నడిచింది. విలంబంగా పాడుకోవటానికి వీలుగా ఉంటుంది. అంతేగాదు అభినయనమునకుగూడ ఎంతో అనుకూలంగా వుంది. మరోవిశేషం - ఈరాగానికి రెండు మధ్యమ ధైవతనిషాదాలు తగుల్తూవుంటాయి. హిందూస్థానీ పద్ధతిగా చాల వయ్యారంగా హాయిగా నడుస్తూవుంటుంది. ఆ పిదప సీతారాములు పూదోటలో నొకరినొకరు చూచుకొని వలచి వలపించుకొన్న రసవత్తరప్రణయఘట్టంలో కూడ సీత మరలమరల కొసరికొసరి రాముని చూడనెంచి నెచ్చెలితో

"ఏడె కానిపింప దేడ నున్నాడే రాముడు-నేడె నా జన్మసఫలము వాడే హా

ఘూతకగోడాశా

అనిన పూర్వికల్యాణిరాగ కీర్తన; అట్లే సీతను చూచి పారవశ్యం చెందిన రాముడు తమ్మునిపై చేయి వేసి

క్రొక్కారుమెరుగులాగున తళుక్కని మెరసి
ఇక్కడ మరగపడదదేమొకో తమ్ముడా!
ఆమె వనలక్ష్మియో ఆ రాజు కూతురో
ఈ పగిది నన్ను భ్రమయించి డాగె నెచటనో

అంటున్న "వసంతరాగకీర్తన సందర్భోచితంగా కథకు జీవం పోసినట్టున్నాయి. అనంతరం ధనుర్యాగ వేదికకు విచ్చేసిన రాజలోకాన్ని తిలకించి జనకరాజు

శివుని విల్లెక్కిడన్ జాలిన జెట్టి గలడా యిచ్చట
ఎవరైనన్ సరే యాతని వరియించు మాయమ్మ సీతమ్మ.

అని సంబోధిస్తున్న యీకీర్తన బేగడరాగం త్రిపుటతాళంలో మంచి పగడ్బందీగా జిగిబిగితో గూడుకుంది. ఆ సందర్భానికి మిక్కిలి అనుసరణీయంగావుంది. ఇంతేగాక రామచంద్రమూర్తి ఆ మహాసభా మధ్యంలో ధనుస్సుకడకు వెళ్లేటప్పుడు రాజలోక మా దివ్యమూర్తిని తిలకిస్తూ ఆశ్చర్యానంద సంభరితులై—

కన్నవార లెంత ధన్యులో శంకరుధను వెక్కిడదలచుకొను వీరుని
అన్నలువకైన పొగడతరమా-అనంతువకైనన్ రామచంద్రుని.

అనుకుంటారు. ఈ కీర్తన శంకరాభరణం చతురస్రగతి అవాగతంలో ఎత్తుగడగా సృష్టించారు దాసుగారు. ఇది సీతాకల్యాణకథకు మకుటాయమానం మనక తప్పదు. దీనిలో రాముని మనోజ్ఞసుందరరూపమంతా కళ్ళకు కట్టినట్టు కల్పించారు. వారు రక్తిరాగాల్లో శంకరాభరణంకూడా ప్రధానమైనది గావ ఇది పాడేటప్పుడు దాని ప్రత్యేకత తెలుస్తూనే ఉంటుంది. ఇక చివరి ఘట్టంలో—

సీతారాముల కున్న పరస్పరప్రీతిఁ దెల్పతరమా సుంతైన
భూతలమున నిటువంటి సొగసైన పుణ్యదంపతులు మరియిక పుట్టరు.

అన్న కీర్తన వారు దేశిరాగంలో వ్రాశారు. ఇది కరుణారసభరితమైన స్త్రీరాగం. గాని చాలమంది సింధుభైరవి (హిందూస్థానితోడి) పాడు కుంటున్నారు. ఈకీర్తన పాడకపోతే హరిదాసు చాలాలోపం చేసినట్లు భావిస్తారు ప్రజలు! ఇది తెలుగుజాతి హృదయాల్లో స్థిరంగా ముద్రవేసు కున్నది. ఈ కీర్తన రసవిశిష్టతకు పరాకాష్ఠ యనకతప్పదు. ఇక మంగళ హారతి విషయంలో పునరుక్తిదోషంలేని సురటరాగాన్నే వినియోగిం చారు. ఇది శాస్త్రసమ్మత మనే త్యాగరాజాదులును "మా కులమున కిహపర మొసగిన నీకు మంగళ"మ్మను వాటిని సురటలోనే వ్రాశారు. ఇది చంద్రాంశ రాగమని చంద్రదర్శన సమయమున పాడదగినదనీ నారదోక్తికూడ.

## 3. పాదుకాపట్టాభిషేకము :

ఈ సందర్భంలో పట్టాభిషేకం చేయదలచిన కుమారుని దగ్గరకు చేర్చుకొని దశరథుడు ప్రేమాదరాలతో ఆనందాశ్రుపూరితనేత్రాలతో

రఘుకులవర్ధన రామచంద్ర మద్రమ్యతపఃఫలమా సకలసుగుణపుంజమ !
మఘవుడు స్వర్గమునేలినట్లు యీ సర్వభూమండల మేలుమా శాశ్వతముగ

అంటూ బుజ్జగిస్తున్న యీ కీర్తన 'తోడి' రాగంలో వ్రాశారు. ఇది హనుమత్తోడి మేళజన్యమైన సంపూర్ణరాగం కావటంచేత స్థాయిగా భావసమ్మేళనంగా పాడుకోవటానికి వీలుగావుంటుంది. పది ఆవృతముల స్వరంకూడా అనుకోవచ్చు. తాళంచతురస్రం కావటంచేత మరింత సరళంగా వుంటుంది. దాసుగారు దూరదృష్టి ఇలాంటవుడు మనకు మిక్కిలిగా ద్యోతకమౌతుంది. ఇది బహుళప్రచారంలో వున్న కీర్తన.

ఇక మంథర కైకేమందిరానికి వచ్చి గుండె బాదుకొంటూ, నెత్తి మోదుకుంటూ రామపట్టాభిషేక వార్త వినివచ్చానని అఱపుతూ-

అమ్మా నేటి ముచ్చట అయోధ్య యేమనందు
ముమ్మాటికీ నమ్మ పుట్టిమునిగిపోయె-

అనే యీకీర్తన "దేశాక్షిరాగం" ఆదితాళంలో వ్రాశారు దాసుగారు. కాని ఈరాగంలో నేపెక్కురు కథకులు పాడుతున్నట్లు తోచదు. కైక జంఝూటి రాగం(మంజరిలో) సమాధానం చెప్పిన తీరు; ఆమె చీకటిగృహములో ప్రవేశించినపుడు దశరథుడు ఆమెను వెదుకుచూ వేగిరపాటుచెంది ఆమె ననునయిస్తూ—

చీకటిగదిలో నేల పరుంటివి చెప్పవె పూబోడి
నీకేటి వంత గల్గె పల్కవా నిద్దురా ముద్దులాడి.

అనిన "వవరోజురాగ" కీర్తన, సౌమ్యంగా రసవత్తరంగా వున్నాయి. మరియు రామవియోగభారాన్ని సహించలేక దశరథుడు వెక్కివెక్కి ఏడ్చుచు—

ఎటుల విడుతు నిన్ను పుత్రా! యేమనందు కులపవిత్రా!
కటకటా! యెఱుగనైతి కైక యింత పేయునముచు.

అని వాపోయిన కీర్తనకు సావేరిరాగం నిర్ణయించారువారు. ఇది విచార సూచితము. చంద్రాంశము స్త్రీజాతిపరము అయిన రాగం కావటం చేత ఆ సన్నివేశానికెంతో రసపుష్టిని చేకూర్చింది- మరియు రామచంద్రుడు అడవికేగ నిశ్చయించుకొని తల్లి మందిరమున కరుగగా ఆమె యీవార్తవిని నిల్వనేరక బిడ్డను కౌగలించుకొని భోరున యేడుస్తూ

ఇద్దియా నీ రాజవేషము కొడుకా నాకిటు లబ్బెనా సంతోషము
ముద్దులతండ్రి! ఈ మునిరూపమేలరా? అద్దిరా తెల్పుమా అలించెద
రామ!

అని కౌసల్య విలపిస్తున్న యీకీర్తనలోని సాహిత్యానికి తగినట్లు సంగీతంకూడ యదుకులకాంభోజిరాగం మిశ్రగతితాళంలో నడిపించారు వారు. ఇది వారి ఉపజ్ఞకు నిదర్శనం.

ఈ కీర్తన పాడేవారు విన్నవారు కూడ తప్పక శ్రోతప్తులు కావలసిందే. వెంటనే మరల కౌసల్య తనవిధివిధానమునుగూర్చి తలపోస్తూ

అనుభవింపకతీరునా చేసినకర్మ - మన్యుల ననదగునా ?
నన్నుగన్నతండ్రి ఈ నారచీరలుగట్టి-నట్టడవి పదునాలుగేండ్లుందువా

అంటుంది. ఇది పున్నాగవరాళి - మిశ్రగతిలో సృజించారువారు. ఇవి దుఃఖరసానికి ముఖ్యమైన రాగతాళాలు. అలా దాసుగారు ప్రతిదీ దూరదృష్టితో గ్రహించి ఋషితుల్యులై యీ కావ్యం నిర్మాణం చేశారు. ఇక గుహుడు రామాదుల గంగానదిని దాటించే సమయం వచ్చినపుడు చాల భక్తి ప్రపత్తులతో తనకర్తవ్యం నిర్వహిస్తాడు. రాముడందులకు సంతోషించి ఆనిషాదపతిని సత్కరింపనెంచి తనవ్రేలి ముద్రిక సమర్పిస్తాడు. అపుడు గుహుడు నమస్కరించి - ప్రభూ !

"రామచంద్ర సీతామనోహర రఘుకులజలధిశశీ ! పరమాత్మ !
నీమహిమదెలియ నెంతవాడనో నీముద్రిక దాల్ప నాతరమ్మా !

అని ప్రార్థిస్తాడు. ఈకీర్తన బేగడరాగం చతురస్రంలో నడిచింది. రక్తికి భక్తికి ప్రధానంగావున్న యీకీర్తన సర్వజనాకర్షణీయమైంది. ప్రతివారు బృందగానాల్లో ఉపయోగించుకుంటున్నారు. త్యాగరాజకృతులంత ప్రచారంలో వుందిది. హరిదాసు కూడ ఇచట కొంతసమయం తీసుకొని స్వరం కొనగోలు అంటూ వాద్యాలకు అవకాశమిచ్చి తన ప్రతిభ చూపించటానికి వీలుగావుంటుంది. శ్రోతలకిది మిక్కిలి రసానుభూతి కలిగిస్తుంది.

ఇక యీ కథలో చెప్పదగిన మరికొన్నిటిలో భరతుడు అన్న కొరకు కాన కేగునపుడు గుహుడు రామచంద్రునకు అనన్యమైన సేవజేసి గంగదాటించినట్లు తెలుసుకొని సోదరునిమాడ్కి ఆతని కౌగలించుకొని కన్నీటిధారతో

గుహుడా నీవెంత ధన్యుడవు - గొలచితివా శ్రీరాముపాదములు
అహహా నేనేల బ్రతికియుంటినో అడవిలోన రాముడిడుమలఁబడ ॥

ఇలా భరతుడంటున్నట్లు వ్రాసిన కీర్తన దేశిరాగంలో దాసుగారు సంధానపరచినా సింధుభైరవిలో పాడటమే చాలమందికి పరిపాటైంది. ఈ కథకిది రత్నదీప్తినిచ్చే కీర్తన. అంతేగాక అయోధ్యావాసులందర్నీ నావలపై చేర్చి గుహుడు పరివారము వారిని గంగదాటిస్తూ పాడేపాట.

సిరామచందార్రి సిరామచందార్రి సీతామనోహరా సిరామచందార్రి
రాతి నాతిగజేసి రక్షించినావా - బూతేళువిలుద్రుంచు పుణ్యస్వభావ

నావికులుపాడే ఆపాట జానపదభాషలో ఎంతో బాగుంది. పల్లెపదాలు ఏలపాటల ఫక్కీలో నడిచిందది. పిదప ఎన్నదగిన వాటిలో చిత్రకూటానికి వచ్చిన తమ్ములచూచి రామచంద్రమూర్తి ఆత్రతజెందుతూ వారినాలింగనం చేసుకొన్నప్పటి యీ కీర్తన

తమ్ములార మీరుకూడ తాపసులైతిరా ?
ఇమ్ముగ మనరాజ్యమిపుడేలువారలింక ?

ఇది "శుద్ధబంగాళరాగం"లో వ్రాశారు దాసుగారు. వారిభావాన్ననుసరించి ఆ రాగంలోనే హరిదాసు లది గానం చేయగలిగితే వినేవారికి పాడేవారికీకూడా వెంటనే రసానుభూతి గల్గుతుంది. ఆ తరువాత కీర్తన అన్ననుచూచి భరతశత్రుఘ్నులు శోకమూర్తులై

ఏమందుమోదేవ ఇట్లయ్యె మాత్రోవ
రామా యనుచయ్య దశరథుడు దివికింబోవ

అంటారు. ఇది 'రామప్రియరాగం' ఖండగతిలో సమకూర్చబడింది. అమూర్ఛనాకారక మేళములలో పదునారవదైన యీ రాగం ప్రచారంలో లేకపోవటంచేత హరిదాసులు మరో రాగంలో యిది పాడుకుంటున్నారు. ఆ దాసుగారు మాత్రం సందర్భోచితంగా ఇది సంధానం చేశారు. వారలా ఆడిపాడేవారటకూడ.

## ౪. రామసుగ్రీవ మైత్రి :

ఈ కథారంభంలోనే

> రామసుగ్రీవమైత్రి రమ్యకథామృతముగ్రోలి
> పామరులైనన్ తరింతు పాతకముల పారద్రోలి.

అన్న కీర్తన 'హుసేనిరాగ' త్రిశ్రగతి తాళాల్లో చిత్రించారు దాసుగారు. ఇది సాయంసమయ గానయోగ్యమైన రాగములలో నొకటి. త్యాగరాజాదులుకూడ దీన్ని విశేషించి ప్రయోగించారు. శ్రీ దాసుగారు హరికథా రచనకేదో కొన్ని రాగములు చాలునన్న చిన్నభావంతో కాకుండా పూర్వవాగ్గేయకారపణితిలో లక్ష్యలక్షణ ప్రామాణికంగా సృజించారీ యక్షగానాలు. ముఖ్యంగా రాముని వనవాసగమన ప్రధానమైన యీ కథలో పెక్కురు మహర్షులు రాముని కీర్తించు నపుడెన్నో రాగభేదాలు తాళగతులు మార్చి మిక్కిలి నైపుణ్యంతో సృజించారువారు. ఉదాహరణకు కొన్ని మాత్రమే మనం స్వీకరిస్తున్నాం. విరాధుడు తుంబురుడుగామారి గంధర్వరూపంతో రాముని ధ్యానం చేయునపుడు

> జయజయజయ జానకీమనోభిరామ జయరఘురామ
> జయజయజయ నవనీలాంబుదశ్యామ జయపరంధామ.

అని గానం చేస్తాడు. ఇది "గమకక్రియరాగం" సంకీర్ణజాతి త్రిపుట 2వ కాల సమగ్రహంలో చిత్రించిన కీర్తన. రాగం జన్యసంపూర్ణం తాళం 13 అక్షరముల గమనంలో వెళ్తుంది. దీనికి వారు స్వరం, మాత్రాయింపుపదాలు కూడ కల్పించారు. అదీగాక ఇది గంధర్వుడు గానంచేసిన కీర్తన గనుక అవధానదీక్షగా బహుముఖ ప్రజ్ఞ చూపుతూ కథకుడు ఆడి పాడాలని వారి ఆశయం కావచ్చు. కనుక గురుముఖతా ఇలాంటి రాగ తాళ భేదములు గుర్తించి దాసుగారి భావాన్ననుసరించి కథకులు కర్తవ్యం నెరవేర్చుకొనుటకు యత్నం చేయాలి. వివిధ రాగ

లక్ష్మణులు శరభంగాశ్రమానికి వెళ్ళినపుడుమహర్షి వారికి అర్ఘ్యపాద్యాదు లిచ్చి అంజలిఘటించి ఆనందాతిరేకంతో

రామా నవనీలమేఘశ్యామా రఘుకులాబ్ధిసోమా
భూమిజామానసాభిరామ సంపూర్ణ సర్వకామ

అని గానంచేసిన యీ కీర్తన చతురస్రజాత్యటతాళ వసంతరాగంలో ప్రకటించారు వారు. నాల్గవ కాలాక్షరములు నాల్గతీతముగ నెత్తుబడిచేసి పాడాలని సూచించారు. (తాళాన్ని ముందు, మధ్యలోను పిదప, కీర్తన ప్రారంభించేదానికే అతీత - అనాగత-విషమములంటారు); ఈ మూడు విధానాలు ఆ యీ కీర్తనల్లో సంధానం చేశారు. వారు పంచమవర్జిత మైన పై రాగమునకు స్వరవివరణమేగాక "ధారిమాతఝుణు, రిమాతఝుణు తాకిట తకతరికిటతోం" వంటి కొనగోలు, ముక్తాయిలు చక్కగా సూచించారు. శరభంగమహర్షియే గానం చేసిన మరొక—

కమలాక్ష నీకై నేనిటు కనిపెట్టుకొంటి
అమలచరిత్ర నాదెంత పుణ్యమో వినుగంటి.

అన్న కీర్తన కేదారగౌళ రాగంలో మిశ్రజాతి త్రిపుట తాళములో అయిదవకాలాక్షరము లెల్మిదింటపై 'పల్లవి' అని వ్యక్తంచేశారు. దీనికి స్వరం ముక్తాయిలు క్రిందవ్రాశారు. లఘువులో 14; ధృతంలో 8. అక్ష రాలు వుంటాయి యీ తాళానికి - యిలా కథకుడు ఏకాగ్రచిత్తంతో అవధానివలె యీ కీర్తనలు గానంచెయ్యాలి. ఇలా మనం చూస్తూ వెళ్తోంటె ఒక్కొక్క మహర్షి ఒక్కొకరీతి రాముని పరంధామునిగ భావించి స్తుతించటం అనన్యసామాన్యమైన సంగీత, సాహిత్య సౌంద ర్యాలతో ఏన్నో కీర్తనలు మనముందు సాక్షాత్కరించటం జరుగుతోంది.

ఇక శూర్పణఖ లక్ష్మణునిచే పరాభవింపబడి తనబాధ అన్న రావణునికి చెప్పేతునే ఘట్టంలో

నీయంతటి జగజెట్టికి చెల్లెల నేనయ్యు నిట్లు కుడిచితినా
వేయి యికేలర అన్నారావణ వెల్లడిగ సిగ్గు విడచితినా?

అనిన కీర్తన 'గౌళిపంతురాగం' ఆదితాళంలో మిక్కిలి శాస్త్రీయ దృక్ప థంతో సృజించారు. విశేషించి దీనికి స్వరం వ్రాశారు. శ్రమించి సంగీత కృషి చేసినవారికి కూడ కష్టతమమైన యిలాంటి రాగతాళాలతో వారీ కావ్యరచన చేయటం వారి ప్రజ్ఞకు నిదర్శనమేగాక కథకునకొక కను విప్పు కల్గించటం కూడ అవుతుందని మనమూహించవచ్చు.

పిదప సీతాదేవి మాయలేడినిచూచి కామించి భర్తను ప్రార్థించే సన్నివేశంలో

ఎంత చక్కనిలేడి ఇదిజూడు రఘువీర -ఎటులనాచే చిక్కునౌర
కాంతుడా దాని నెత్తైన బట్టుకరమ్ము—కానిచో దానినిక్కాన నగుపడనిమ్ము.

ఈ కీర్తన ఖండగతి తాళం - (శ్రీ)రంజని రాగంలో పొందుపరచారు దాసుగారు. పంచమవర్జితమై షాడవ, షాడవ స్వరూపమైన యీ రాగా నికి సరణంగా క్రింద స్వరం వ్రాసి రాచబాటవలె కథకునకెంతో మేలు చేకూర్చారు. రామాయణంలో ఇలా 15 కీర్తనలపైగా వారు స్వర పర్చారు. ఇక హనుమ రాముని ప్రథమమున సందర్శించి అతనిదైవంగా గుర్తించి పాడిన

రామచంద్రాయతే నమో నమో నమోస్తు
రాక్షసాంతకాయతే నమో నమో నమోస్తు
కామసుందరాయతే - న........... ...
క్ష్మాసుతాధిపాయతే నమో నమోస్తు.

ఈ కీర్తన 'బేహాగ్ రాగం' సంకీర్ణజాతి ధ్రువతాళంలో వ్రాశారు. పల్లవి ఎత్తుగడ మిక్కిలి విషమంగానే నిర్ణయించారు. దానిక్రింద స్వరం (ఝుంతరికిట తక తళాంగు తక దధిగిణతోం) అన్న ముక్తాయి

వరుసలు కూడ పొందుపరచిరి. ఈ బేహాగ్ ఔత్తరాహిక సంగీత సంప్రదాయాన్ని వ్యక్తం చేస్తుందని ఇదివరకే అనుకున్నాం. ఆ హిందూస్థానీ సంగీత రీతులన్నీ హనుమత్ప్రోక్తములని దాక్షిణాత్యగానవిధాన మంతయు నారద (స్వరార్ణవ గ్రంథాంతర్గత) ప్రామాణ్యమని ప్రతీతి. అందుచేత ఆసందర్భంలో దాసుగారు నిర్ణయించిన బేహాగ్ రాగం చాల సమంజస మనిపిస్తుంది. హనుమన్మూర్తియే మరోసందర్భంలో రామచంద్రుని ప్రార్థించే కీర్తన

హనుమంతుడ నీపాదసేవకుడ అనిలపుత్రుండ రామా
నిను దేవుడ యని వేల్చినాడ నీకృప వర్ధిల్లామా!

అనేదికూడ అఠేరి రాగంలో వ్రాశారు. హిందూస్థానీవారు దీన్ని భీంప్లాస్ రాగమంటారు. హనుమత్ప్రమోదితమైన ఔత్తరాహిక సంగీత సారస్యమే సమంజసమని ఊహించి వారిది ఇచట జోడించి యుందురేమో!

## ౫. హనుమత్సందేశము :

ఈకథలో రామునిమైత్రి ప్రభావంచేత సుగ్రీవుడు వాలిని రణరంగాని కాహ్వానిస్తాడు. అపుడు ప్రళయకాలివలె వాలి సుగ్రీవుని కెదురువచ్చినపుడు,

క్రొవ్వున మునుపటివలె రాకుమ వాజోలి
యొవ్వమి విప్పుడు నీ వప్పుడకదు వాలి.

అన్న కీర్తన భైరవి రాగంలో వ్రాశారు. ఈ రాగం రక్తికీ వీరవత్రిమాలకు పరాకాష్ఠగా వుంటుంది. ఇది క్రియాంగ రాగములలోనిది. కథకుడీ సదవకాశంలో తీవిగా నృత్యంచేస్తూ సుగ్రీవుడై పాడవచ్చును. అనంతరం వాలిధీరత్వంతో తమ్మునిపో టుమాటలకు సమాధానముచెప్పే కీర్తనకూడా మంచి పకడ్బందీగా కన్నడరాగ ఖండగతి తాళాల్లో నడిపించారు. దీనికి స్వరం వ్రాశారు వారు.

సెబాసు రణమునకు బయపడువె వాలి
గుబాలునక రానిమ్ము ప్రళయశూలి
ఉసురువలచి యెరు శరణు జొరునె మగడు-
ఇసీ పరువులేని బ్రతుకెంత యగడు.

ఈ కీర్తన అతీతంలో నడవటంచేత చాలా రక్తిని స్తుంది కథకు. అంతే గాక దీనికి వివిధ విన్యాసాలతో స్వరంకూడ వారు చిత్రించారు. పిదప వాలి శరవిద్ధుడై రామునిస్తోత్రం చేస్తున్నప్పటి

జయ జయ శ్రీరామా రఘుకుల జలనిధిసోమా
జయ జయ సంపూర్ణకామ - సద్గుణధామా!

అన్న కేదారగౌళ మిశ్రజాతి త్రిపుట కీర్తన చాలనైపుణ్యంతో వ్రాశారు. స్వరం ముక్తాయివరుసలుకూడ కల్పించటంలో కథకుని ఉపజ్ఞనుబట్టి అది ఎంత ప్రతిభతోనైన పాడుకొనవచ్చును. ఇక 'వాలి' ఈ భవసాగరం నుండి తరింపజేయ"మని ప్రార్థించేటప్పుడు

ఒల్లనొల్లనింకని కల్లబ్రతుకు రామచంద్ర
మళ్ళీ నన్ను బ్రతికింపగ - మదివెంచకు దయాసాంద్ర!

అంటాడు. ఇదీ 'మలయమారుతరాగం' త్రిశ్రజాతిలో వ్రాశారు దాసు గారు. దీనికి కూడా స్వరం కొనగోలు వ్రాశారు. కాబట్టి మంచిరక్తిని స్తుంది యీ కీర్తన. ఇలాగే శుభోక సందర్భంలో హనుమగానంచేసే

దేవదేవ రామచంద్ర వైదేహీమానసాంభోజమిత్ర
కేవలానందమయ ధర్మమూర్తి కిల్బిషలతాలవిత్ర సుచరిత్ర!

అనిన యీ కీర్తన పూర్వకల్యాణి చతురశ్రజాతి త్రిపుటలో చిత్రిస్తూ సత్సంప్రదాయంగా స్వరము మృదంగజతులు దానిలో పొందుపరచారు. ఇదేవిధంగా సుగ్రీవుడు రామునిగూర్చి

శ్రీరామచంద్ర దయాసాంద్ర-సీతామనఃకమలదినేంద్ర! యతంద్ర
మేరుధీర కోటిమన్మథాకార య-మేయ దయాపూర! త్రిలోకైకవీర!

అని గానమొనరించిరి. ఇదిన్నీ సాహిత్యపటిమతో పాటు సంగీత ప్రాధాన్యముగ "దేవమనోహరి" మిశ్రజాత్యటతాళంలో వ్రాశారు. మరో సందర్భంలో హనుమ రాముని ప్రార్థిస్తూ

ఎంత భక్తవత్సలుండ వీ వహో రామచంద్ర !
ఇంత మన్ననకు తగుదున యేదిమ్మడ దయాసాంద్ర !

అని ఇలా గానం చేస్తారు. ఇది ప్రతి మధ్యమరాగాల్లో 71 మేళకర్త యగు 'కోసలం' లో రూపకతాళంలో సృజించారు. దీనికినీ వివరించి స్వరం వ్రాయటమేగాక కొనగోలు వరుసలు ముక్తాయిలుకూడ విశేషించి సూచించారు. ఇలాంటివి గాయకప్రముఖులకే మిక్కిలి శ్రమ గలిగించే రాగతాళాలు. వీటిలో స్వరప్రస్తారంచేస్తూ విషమకాలాక్షరములకు సైతము ముక్తాయిలివ్వటం చిన్నపనిగాదు. ఇక మరో సన్నివేశంలో సహస్రయువతీ సంసేవితయై కిన్నరచేబూని (శ్రీరామచంద్ర) సంకీర్తనముచేసే స్వయంప్రభను సందర్శించిన కపులు వారి కార్యసాఫల్యమైనట్లు తలచి అద్భుతాశ్చర్యానందములతో

అమ్మా నీవేసీతవా ? దశాస్యామరానీతవా ? అఖిలమాతలోకమాతవా ?
నమ్మమా మేము రఘునాయకుని దూతలము-యిమ్మహితలమైన వెతగలకోతులము.

ఇది 'అమృతవాహిని రాగం.' ఖండజాత్యేకతాళంలో వ్రాశారు. ఈ కీర్తన కథకు మాంచి జీవఘట్టంలాంటిది. రసావేశంతో కపులందరు సీతమ్మయే తమకట్లు దర్శనమిచ్చినదనుకొంచుచూ గానంచేసినట్టు కథకుడు కూడ అట్టి మహోత్సాహంతో పాడి యాడవచ్చు. అయితే అమృతవాహిని రాగం లక్ష్యలక్షణ సమన్వితంగా గానంచేసే నైపుణి కథకుడు ఆర్జించుకోవాలి. అలాంటి రాగనిర్ణయం వారట్టి దూరదృష్టితోనే చేసియుండురు. ఇక రావణుడు సభామధ్యంలో హనుమన్న వదలించుచూ

"వాచరవకుకోతి వంకరనీమూతి
ఛీ చపలమృగమ్మా సిగ్గులేని తిమ్మా"

అనిన 'నాయకి రాగ'కీర్తన ఎంతో ప్రశంసార్హంగావుంది. ప్రచారంలో లేని అపురూపరాగాలు వారుకల్పించి పాత్రౌచితికి తగినట్లు దాసుగారు గానంచేసి మనకు మార్గదర్శకులైనారు. వారికి వారేసాటి అనిపించు కున్నారు. అనంతరం హనుమ లంకనంతయూ వెదకి విసిగి తుదకెట్లో సీతాదేవినిసందర్శించి తిరిగివచ్చి యీవార్త అంగదాదులకు తెలిపినపుడు వారంతా ముక్తకంఠంతో

సీతారామా సద్గుణధామా! శ్రితకుముద పూర్ణసోమా!
పూతచరిత్రా! శ్యామలగాత్రా! ఫుల్లాంబురుహనేత్ర?
ధృతకోదండా అమోఘకాండా-వృజినతిమిరమార్తాండా!

అని గొంతెత్తి గానంచేసేకీర్తన. 'హైమవతిరాగం' చతురశ్రగతిలో వ్రాశారు. దేవాంశ సంభవులైన కపులు భక్తిపారవశ్యంతో పాడి యాడిన యీ సన్నివేశం చాల రసస్ఫోరకంగావుంది. దీనికీ స్వరం వ్రాశారు. శ్రీ దాసుగారు వ్రాసిన ప్రతివక్రి - సంపూర్ణ-జన్య మేళ కర్త రాగములనూ ఏదోవ్రాసి వదలటమేగాక సామర్థ్యముతో గానం చేసి చూపేవారు.

## ౬. సామ్రాజ్యసిద్ధి :

రావణుడు కృత్రిమ రామలక్ష్మణుల శిరములు సీతకు జూపి యింక నైన తనవశముగమ్మని భయపెట్టే సందర్భంలో సీత పూరిపుడక నొకటి చేతబట్టి దానినే రావణునిగా సంబోధిస్తూ

పచ్చిమోసమున నిట్టుల బ్రతుకనెంచినావా?
అచ్చముగా చుప్పనాతి కన్నవుగావా!
అగ్గిచెంత మిడతపోల్కి నాటలాడబోకు
సిగ్గులేని పాడుబోత - చీచీ నను చేరరాకు.

అంటుంది. ఈ కీర్తన 69-వ ప్రతిమధ్యమ మేళజన్యమైన "ధాతు వర్ధని" రాగంలో వ్రాశారు. ఇది అమూర్ఛనా కారక మేళములలో

నొకటి. ఇలాంటివి పాడి సమర్థించటానికి హరిదాసు సాహిత్యంతో పాటు సంగీతంలో యెంతకృషిచేయాలో అతని పాత్రి యెలాంటిదో, వారిలా వ్యక్తం చేశారు. ఇక రామరావణ సంగ్రామరంగంలో. విభీషణుడు రాముని ప్రక్కనే వుండటం రావణుడుచూచి అతనియెడల కోపము అలతిభావము కూడ గలిగి ఓరీ! వంశద్రోహీ!

ఈనరుడా నిన్నుగాచ - ఇస్సీసీ పేదతపసి
దానవకులమందువీవు - తప్పబుట్టినావు చెడుగ.

అని రావణుడన్న యీ కీర్తన యాగప్రియ రాగంలో వ్రాశారు. శుద్ధ మధ్యమ మేళకర్త రాగాలలోనిది 31-వది. ఇదికూడ అమూర్ఛనాకారక మేళరాగమే. సామవేదానికి చిట్టస్వరములు వ్రాసిన మహాగాయకుడు రావణుడు; సంగీతంలోనిధి. అతని పాత్రౌచితికి తగినట్లు చాలాచోట్ల దాసుగారు అతనికి తగిన రాగాలలో కీర్తనలు వ్రాశారు. ఇంక రామచంద్రమూర్తికి విజయం చేకూరుతుంది. అపుడీవార్త భూపుత్రి కందించటానికి రాముడు హనుమంతుని బంపగా అతడామెదరిజేరి అంజలి ఘటించి

శుభవార్త విజయంబు సుఖము శ్రీరాములకు
అభయంబు ప్రజకెల్ల - హనుమ నో సీతమ్మ
చెంతనేయున్నారు శ్రీరామలక్ష్మణులు
సంతోషమలరార - జానకి విచ్చేయు.

అన్న ఆనందభైరవి రాగంతో కావ్యం సమాప్తమైంది. అంటే ప్రతి కీర్తన ఒక ప్రశస్తమణి వంటిదిగా తోచుచున్నవు డెన్నని వివరించి చెప్ప గలం? కొన్నిమాత్రమే సోదాహరణంగా ఇందు సూచించటం జరిగింది.

2. సావిత్రీ చరిత్రము-రాగరస సూత్రము

## ౧. ద్వారంవారి హృదయ నీరాజనం:

నాదస్వరూపులు. (శ్రీ) ఫిడేలు నాయుడుగారి నెవరో "అయ్యా! నారాయణదాసుగారి సమర్థతగూర్చి మీ యభిప్రాయమేమండీ" అంటే

"నాయనా! బ్రహ్మదేవు డొకనాడు చాలమంది మేధావుల్ని తయారు చేయాలని ప్రారంభించి చివర్లో విసిగిపోయి ఎందరికో దాచియుంచిన మేధాసంపదంతా ఒకే బుర్రలో పెట్టి మనిషిని తయారుచేసి మనాంధ్ర దేశంలో పడవేశాడు. అతడే నారాయణదాసుడు" అన్నారట. ఇలా దాగారిని ఉపజ్ఞగూర్చెందరో హృదయ నీరాజనా లందించారు.

దాసుగారు సంగీతంలో తనకున్న సామర్థ్యాన్ని వివిధ స్వరరాగ తాళభేదాలతో రామాయణాది యక్షగానములందు నిరూపించినా "జానకీశపథం" మాత్రం వారి సహజ సంగీత కళాప్రశస్త్యాని కొక నిదర్శనమనక తప్పదు. అది గానంచేసేవారికి, విన్నవారికీ ఇది "జానకీశపథమా లేక దాసుగారే సంగీత సాహిత్యాల్లో తన ప్రతిభ వెల్లడిస్తూ చేసిన శపథమా" అనిపిస్తుంది. వారాకథలో 72 మేళకర్త రాగాల్లోనూ కీర్తనలు వ్రాయడమేగాక త్యాగరాజాదుల కృతులవలె స్వరసౌష్ఠవం సమకూర్చి గాయకలోకానికి మార్గదర్శకులైనారు. పూర్వమిలా కథలురచించిన హరిదాసులు కొందరు అంత్యనియమప్రాసలతో గుఱ్ఱం కదను తొక్కినట్లు, వాద్యాలవారికి హుషారుచ్చినట్లు, శ్రోతల నేదో మైకంలో నెట్టినట్లు, కీర్తనలు (మట్లు) వ్రాసి గారడీచేసేవారు. ఆ గజిబిజిలో సాహిత్యం బోధపడకపోయినా, ఆవిన్యాస పూర్వక తాళగతికీ, రక్తికీ, ప్రజలు తాత్కాలికంగా తన్మయులయ్యేవాళ్ళు. అలా యమకగమకమిశ్ర సముదాయంగల కీర్తనలు దాసుగారు మచ్చుకు కొన్ని రాసినా చిరకాలం నిలువగలశక్తి వాటికిలేదని తెలిసి, వారాసంప్రదాయం విడిచి పూర్వవాగ్గేయకార ఫణితిలో పండిత పామర రంజకంగా మధురకృతులు రచించారు. కనుకనే కథకులు గాయకులు కూడ అవి శిరోధార్యంగా స్వీకరిస్తున్నారు. దాసుగారి కీర్తనలు పదానికీ పదానికీ మధ్య విలంబమేర్పడి ప్రస్తరించి భావం చెడకుండా పాడుకోవటానికి వీలుంటుంది. కనుకనే చిరకాలం మనగలశక్తి వాటికున్నది.

## ౨. సావిత్రీ చరిత్ర వైశిష్ట్యం :

వారి యక్షగానాల్లో 'సావిత్రీచరిత్ర' కొక ప్రత్యేక ప్రాధాన్యముంది. మహాపతివ్రత గాథను ఇతివృత్తంగా స్వీకరించి ప్రౌఢతమ సాహిత్యమందు పొందుపరచి వివిధ మేళకర్తజన్య, శుద్ధ ప్రతిమధ్యమ వక్ర సంపూర్ణ రాగాలు సంధానంచేసి, కథానుకూలంగా రాగము తగు నర్థము చేర్చి పూర్తిచేశారు. పూర్వవాగ్గేయకారులు కూడ కొందరిలా రచించినవారున్నారు. సంగీతరత్నత్రయంలో "శ్యామశాస్త్రిగారు" దేవిని స్తుతిస్తూ కొన్ని వ్రాశారు. అర్థగాంభీర్యంగల శబ్దసంయోజనమూ హృదయరంజకాలైన కల్పనలూ, భావానుగుణమైన సన్నివేశ చిత్రణము రసోచితమైన రాగనిర్దేశముల సమష్టియే సావిత్రీచరిత్ర విశిష్టత.

కథారంభమున దేవీప్రార్థనలో దాసుగారు (నటభైరవీజన్య) భైరవి రాగకీర్తన వ్రాసి చివర "జపాసుమాభపాణీ భైరవి" అని సంబోధించారు. ఆ రాగానికి రౌద్రరాజస గుణాలుండటంచేత రాజరాజేశ్వరిని కూడ వారారాధించినట్లైంది. "గణపతి వను కనకతమునగను" అను (ధీరశంకరాభరణజన్య) హంసధ్వని రాగంలో రాస్తూ "పాలింపుము వాకాన్యం బుత్తంశీకృత సకలపరమహంసధ్వని" అని ఉదాత్త భావంతో వ్రాశారు. కన్నడరాగంలో దేవీపరంగా మఱొక కీర్తనరాస్తూ "జననీ యెన్నగ నీకాయించవద నిందగుపర్చు మేలకన్నదా (హంసవాహినీ వచ్చి నన్ను రక్షించటానికెందుకమ్మా ఉదాసీనం వహిస్తావ్ దేవీ") అంటారు. సంతాన విహీనుడై - అశ్వపతి విలపిస్తూ "శివా! నాకు సంతానప్రాప్తి చేయూర్పవా? నా యౌవన వసంతకాలమంతా వృథాకావలసిందేనా ?" అని వసంత రాగంలో చింతించినట్లు వ్రాశారు. ఆ వసంత అద్భుతమ రాగం; సమయానికెంతో సముచితంగావుంది. చివర ప్రభువు సావిత్రీకటాక్షమునంది 'నీవెంత దయామయివమ్మా! శివ కేదారమహ' అని 'పాలింపుమ నాప్రేమమదీయసతీ నిన్నెంచగడగాన' (శ్రీ కేదారగౌళ ...

(హరికాంభోజిజన్య) కేదారగౌళ కీర్తన అమ్మవారిపేర్లు వ్యక్తమయ్యేట్టు వ్రాశారు. సావిత్రి యౌవనాన్ని వర్ణించేఘట్టంలో 21-వ మేళకర్త "కీరవాణి రాగం" సమకూర్చి "నమ్మవలయు త్రిపురసుందరియే యక్కీర వాణి" (చిలుకపలుకులు వెలార్చు పరాశక్తియే సావిత్రియైనది.) అని వర్ణించారు.

## 3. రాగ రస సమన్వయం ;

పిదప సావిత్రి కలగని తన మనోహరుని చిత్రం వ్రాసి అది చూస్తూ "నాథా! సందిట నిన్బిగియించి సరసములాడదలంచి యెందె వతెయుండె గొంజిక్రిందీ నాటకురంజి" అంటుంది. ఈనాటకురంజి హరి కాంభోజి జన్యము ఉభయ వక్ర సంపూర్ణరాగం. కథకుడు సంగీత పరిజ్ఞానం గలిగి చక్కగా రాగభావాలు తెలిసి పాడవలెనని దాసుగారి ఆశయం. అంతేకాదు శాసనం కూడ కావచ్చు. కనుకనే మనం మార్చ టానికి వీలుకానట్లు రాగాలిలా చివర నిర్ణయించారేమోననిపిస్తుంది. కథలో మఱోచోటు సావిత్రి కలలోవలచినవానిచిత్రం చెలులకుచూపి "మా నాయనగారికిది చేర్చి-విషయమంతా చెప్పండి. వీని చూడకున్న నాయుసురు వీసమైన నిక నిల్వబోదు. తానేమిదలచెనో మత్కులదైవత మగు "ఆనందభైరవి" అన్నది. ఆమె మనోవేదనచెప్పే యీజన్యరాగం శ్రుతిహితంగావుంది. అనంతరం చిత్రం చూస్తూ యోచిస్తున్న ప్రభువు కడకు "నారదమహర్షి" వచ్చారు. వారిని మర్యాదచేసి రాజు చిత్రం చూపి విషయమంతా ఆయనకు చెప్పేటప్పటి కాయన మందహాసంచేసి "రాజా! యీపటంలో వాడు రాచబిడ్డడే! నీ కుమార్తె కోరతగిన వాడే! పేరుడగున్ సొగసునకలఃమారుడగున్ చేరిపెట్టజాలడు బేగడ" అన్నారు. ప్రభూ! నీకుమార్తెకు బంగారునగలు తేలేడుసరిగదా! (అభ్రకంవంటి) కాకి బంగారంకూడా పెట్టలేడన్న భావం స్ఫురించేట్టు బేగడరాగంలో వ్రాశారీకీర్తన. నారదుని మాటలువిన్న ప్రభువు

కుమార్తెను పిలిచి అమ్మా! విన్నావా దేవముని పలుకులు? వీనివిడిచి మఱొక వరుణ్ణికోరి సుఖింపుమనగా "నాయనా ఇట్టులనమ్మిన మనల నికేల విడచు"న "భవప్రియ" అంటుంది సావిత్రి. "భవప్రియ" రాగ కీర్తనిది. ఆ పిదప సత్యవంతుడు వింధ్యాటవిలో విహరిస్తూ తను పెంచిన లేడికూన క్రూరమృగాలకు బెదురుతోంటే దాని నాతడోదార్చి నిమురుచూ, దైవనిర్మితమైనప్రకృతిలో నిట్లొక దానికొకటి బలికావలసిందేనా? ఆతని లీల లనూహ్యముగదా"అని "ఊరకుండు మేల్కొడులకున్నది దైవ 'మత్తాణ.'మనకురక్షణగా భగవానుడేవున్నాడు. నీందుకే భయమన్న భావ 'మత్తాణరాగం'లో చూపించారు దాసుగారు. కుమార్తె నిశ్చయాన్ని మార్చలేక అశ్వపతి సత్యవంతుని కొరకు వింధ్యాటవికి పరివారంతో వెళ్తున్నపుడు ఆ రాకుమారు డిదిగని శత్రువులే తనపై కెట్లు వస్తున్నట్లు భావించి - "వాళ్ళెలాంటివాళ్ళైనా నేగెలుస్తాను. అలవాస్తోష్పతినైనన్ లలిబుద్ధిన్ వాచస్పతి" నైనగాని (సురపతి బృహస్పతులనైన) జయిస్తానన్న భావం ద్యోతకమయ్యేట్టు సత్యవంతునిచే "వాచస్పతిరాగం"లో పలికించారు దాసుగారు, మఱల సత్యవంతుడువస్తున్న వారిన్జూచి రారాదుర్మతీ నన్నెపుడెదిరింతువో అతిశయమూడునా 'నాట' అని శౌర్యరసస్ఫోరకంగా గర్జిస్తాడు. ఆ సమయానికి 36వ మేళజన్యమూ వీర, రాజసగుణ ప్రధానమునగు 'నాటరాగం' చక్కగా, సహజంగావుంది.

వివాహసమయంలో 'సావిత్రి' పూలమాల తనభర్త కలంకరించేటపుడు "లలితశ్రోణి నీలవేణి లావణ్యగుణ లలితకల్యాణి" అని కల్యాణి రాగంలో ఇదెంతో కమనీయంగా వ్రాశారు. సతీసమేతంగా కుమార్తె నల్లున కప్పగించు మద్రపతి దీనంగా "అప్పా ఇచ్చకముల కొప్పదు, ఆడినమాట దప్పదు, వంతవిప్పదు, ఆజ్ఞకు మారుజెప్పదు, మదిగప్పదు, చెరుపు మప్పదు, సుగుణాలకుప్పను దుఃఖమాచి" అంటాడు. "కమాచి రాగం" సందర్భోచితంగా వుందిక్కడ. తనను విడువలేక విచారించు తండ్రిని 'సావిత్రి' ఓదారుస్తూ "తగునా జాలిదూలగా నాతండ్రీ! కన్యా

దానమిచ్చి తరియించి మగువ యెదిగినంత మగనిసామ్మోయగు మాయమ్మ నీకెట్లు మఱి లభియించెను బాగుబాగు" అంటుంది. ఇది బేహాగురాగంలో కల్పించారు. ఇక సత్యవంతుని కాయువు పూర్తికావస్తోంది. అవు డంబను వేడుకొంటున్న సావిత్రి "తల్లీ యీరాపిడి మాకాపి" అన్నట్లు కాఫీరాగంలోను; కాంతయగరజుగాని కాంతయరజు వాల్గత్తిలేని పరజు (కత్తి లేని 'వరవలె భర్తలేని బ్రతుకు నాకెందుకమ్మా) అన్న "పరజురాగ" కీర్తన, "దాసురాలను నారాయణి" అని నుతించిన "నారాయణి రాగ కీర్తన," భక్తాళి మానసు మరాళి "కుంతలవరాళి" అనిన 'కుంతలవరాళి', ఇలా పెక్కు ప్రచారంలో లేని రాగాల సంపుటిచేసి వ్రాసి హరిదాసు కృషికి మంచి హెచ్చరికనిచ్చారు దాసుగారు. అడవికి బయలుదేరిన భర్తను వెంబడిస్తూ సావిత్రి "తోడరానిమ్ము ననుగూడనాథా! కంది యమే సత్యవిలోల భూపాల!" అంటుంది. యీ 'భూపాల' వేకువను పాడదగినరాగం. సతిని వెంటగొని సత్యవంతుడడవికేగి అచటి రమ్యప్రదేశము లామెకు చూపుతున్న సన్నివేశం శ్రీరాగంలో- "సతీ! ఇదంతా నిరతనిశ్రేయస శ్రీరాగము" అనినట్లు చిత్రించారు దాసుగారు. ఇది క్షత్రియుల పురుషరాగం కూడ కావటం విశేషం. సత్యవంతు డాపిదప కావలసినవన్నీ సమకూర్చి కొలనులో స్నానం చేస్తోంటే, సావిత్రి చాల విచారిస్తూ నాథా! "నానబోకుమింక సరసులోన-వినుము నీవు కూర్చ వస్తువులు మన గంప కధికమయ్యె. మనల నొక్క జాములోనరమ్మని మామయాజ్ఞయయ్యె-మదనమోహన"! అంటుంది. సూర్యాంశము, మధ్యాహ్న గానయోగ్యమునగు ఈ మోహనరాగం సమరసంగా సంధానపరచా రిచటవారు.

భర్త ప్రాణం కోల్పోయిన సందర్భంలో 'సావిత్రి' పతిపై బడి విలపిస్తూ "ఒక్కసారి మాటాడరా యోరి, సత్యధారి దుర్మారి" అన్న కీర్తన "ముఖారిరాగం"లో వ్రాశారు. ఇలా మఱల విచారిస్తూ సావిత్రి "నాథా! నెయ్యము లేదా మనకెంతో వేస్తముగా

చూడుమెట్లువచ్చెదనో నీతోడ నేడు వేగ "పున్నాగ" అంటుంది. శోక మయమైన సమయానికీ "పున్నాగరాగం" పొందుపరచారు. భర్త ప్రాణం గొనిపోతున్నపుడు తన వెంటవస్తున్న 'సావిత్రి'ని నివారిస్తూ శమనుడు "రాకూడదిట్టులోపిల్లా ! మాతోడ మానుషశరీరంబుతోడ చూడుమా వరునిదప్ప వేడుమా వరమేదైన నేడు నిన్ను మెచ్చితి సువర్ణాంగి" అని 'యముడు' నివారించిన యీ ఘట్టంలో ఆమూర్ఛనా కారక మేళమగు 'సువర్ణాంగిరాగా'న్ని విని యోగించారు దాసుగారు. అదేంతో అన్వయసౌష్ఠవంగావుంది. జముడు ప్రసన్నుడుకావటాన్కి సావిత్రి స్వర్గనరకముల వివరాలడిగినపుడు, పాపులగూర్చి "లతాంగి ! విను" మని సంబోధిస్తాడు. ఇది "లతాంగి రాగం"లోనూ స్వర్గవాసుల గురించి చెప్పేటప్పుడు "నాకమున నలరు సుజనముల వినుమాయమ్మా! తిరముగ గతికచాక్షి, ధిక్కృత సారంగ" అని 'సారంగ' రాగంలోనూ వ్రాశారు. ఇచట ఒకే సారంగ శబ్దానికి మూడన్వయాలు కల్పించారు దాసుగారు. అంటే 'సావిత్రీ! నడకలో ఏనుగునూ, కొప్పుచేత తుమ్మెదను చూపులవలన లేడిని, నీవు గెలువగలదానవు' అని వివరించారు. చివర కీర్తనలో "వేదసమ్మతము నీచరితము సావిత్రీ అశ్వపతిపుత్రి సుగాత్రి" అని "యముని" చేతనిపించారు. ఇది "సామరాగం"లో సారస్యంగా చిత్రించారు సామవేదసమ్మతమని చివరిలో సూచిస్తూ వారు. మంగళ హారతి నిస్తున్న చెలులు కథాంతంలో దేవి నిలా "సురట"రాగంతో స్తుతి స్తారు. అమ్మా ! ధీరత నినుగొల్చువారికిన్ స్వాధీనమగుచు నుండున్ దమయుఁ'సురట' (నిన్నుకొల్చినవారు దీర్ఘాయువు లగుదురట)అని, అంత్యమందు సురట పాడటం శాస్త్రీయదృక్పథంగా వారు రాశారు. శ్రీ దాసు గారు సాహితీచతుర్ముఖులు. వారు కీర్తనాంతమందు సూచించిన రాగాలకు అనేకార్థాలుండవచ్చు. వారు జ్ఞానచక్షువులుగాన కేవలం వారి భావాలనే తెలుసుకోవటం అసాధ్యం. 'ముద్రాలంకార' మహితంగా వారి పాండిత్యానిట్లు ప్రస్ఫుటంచేశారు. ఇంతేగాదు వారు రచించిన

ప్రతికథకూ పీఠికల్లో పెక్కు ప్రాపంచిక విషయాలు, ఈ యక్షగాన ప్రశస్తి వివరించారు. రససామ్రాట్టులైన వారి సంప్రదాయం చేపట్టి ప్రతి 'హరిదాసుడు' వారి రచనలే రెండుమూడైననూ వల్లించి వారికి ఆత్మశాంతి చేకూర్చి ఇహపర సాధకులు కావటానికి సదా యత్నం చేయాలి.



# దాసుగారి సంగీత గురుత్వము

"వైణికశిరోమణి", "వైణికరత్న," "వీణావిద్యాధర," "వైణికకళారత్నాకర,"

వీణాగురుకులపతి : వాసా కృష్ణమూర్తి

మహాకవి, గాయక, వైణిక, సకలభాషా సార్వభౌమ, ఆటపాటల మేటి, హరికథా పితామహ శ్రీ మద్దజ్జాడ ఆదిభట్టనారాయణదాసుగారు మన హిందూదేశమున అవతరించిన అపర శారదావతారము. అట్టి మహాపురుషుడు మన ఆంధ్రదేశమున అవతరించుట మన ఆంధ్రుల అదృష్టము; గర్వకారణమైయున్నది.

శ్రీ దాసుగారు సంగీతము నందపార ప్రజ్ఞాధురంధరులు. వారేది పట్టినా అది అపరంజిగా మారిపోయేది. వారినడకలో శాళం, వారి నిత్య జీవితం సంగీతం. వారే సంగీతం అంటే నిజంగా బాగుంటుందేమో! కానుకుర్తి నరసింగరావుగారు శ్రీ విజయరామరాజులవారిని కలసి వారితో ఒక సంగీత కళాశాలను దాసుగారి ప్రిన్సిపలు పదవిక్రింద స్థాపించి మన విజయనగర కీర్తిని చిరస్థాయిగా నుండేటట్లు చేయుమని కోరగా, వెంటనే రాజావారందుల కంగీకరించి 1919 లో యేర్పాటుచేసిరి. ఆ నాడు మద్రాసు మొదలు కలకత్తావరకూ ఎచ్చటనూ సంగీత పాఠశాల అనేది లేనేలేదు. ఒక్క విజయనగంలో మాత్రమే యుండేది.

శ్రీ విజయరామ గానపాఠశాలకు నారాయణదాసుగారే తగిన దిగ్గంతులవంటి సంగీత విద్వాంసులను ఉపాధ్యాయులుగా నియమించినారు.

1) శ్రీ పేరి రామమూర్తిగారు (పేరిబాబుగారు)- గాత్రమునకు.
2) శ్రీ నేమాని వరహాలుదాసుగారు- చిన్నగాత్రమునకు.
3) మా తండ్రిగారగు శ్రీ వాసా వేంకటరావుగారు- వీణకు.
4) శ్రీ కట్టు సూరన్నగారు - చిన్నవీణకు.
5) శ్రీ ద్వారం వేంకటస్వామినాయుడుగారు - వయోలిన్‌కు.
6) శ్రీ లింగం లక్ష్మాజీగారు (మద్దిల అప్ప) - మృదంగమునకు.
7) శ్రీ మునిస్వామిగారు - నాదస్వరమునకు.
8) శ్రీ నటేశం పిళ్లెగారు - డోలునకు.

ఈ విద్వాంసులను 8 తరగతులకు ఉపాధ్యాయులుగా నియమించినారు. శ్రీ నారాయణదాసుగారు ప్రధానోపాధ్యాయపదవి నిర్వహించేవారు. ఈ సంగీత కళాశాలయందు ఎందరెందరో సంగీతమును గురుకులవాస పద్ధతిలో గురువులవద్ద 10 లేక 12 సంవత్సరములు అభ్యసించి, మన విజయనగర కీర్తికి గీటురాళ్ళవలె ఇప్పటికి చాలమంది గలరు. ఈ సంగీత కళాశాల శ్రీ నారాయణదాసుగారు నిర్మలమైన మనస్సుతో యేనాడు స్థాపించిరో నాటినుండి నేటివరకు వారి కీర్తిచంద్రికలు ఆ సంగీత కళాశాలకు ఆశాచంద్రికలై వారి ఆశీస్సులతో దినదినాభివృద్ధి నొందుచున్నది.

సంగీతమునకుగాని, కవిత్వమునకుగాని, చిత్రకళకుగాని, యింకే కళకునైనా పరిపూర్ణ కళాకౌశలత్వానికి జీవితమే చాలదు కదా! అట్టి అనేక కళలయందు శ్రీ నారాయణదాసుగారు పరిపూర్ణత్వాన్ని సాధించిన పుంభావసరస్వతి. అప్పటికి నాకు 18 సం॥లు వయస్సు ఉంటుంది. శ్రీ నారాయణదాసుగారికి అప్పటికే బాగా వృద్ధాప్యం వచ్చింది. ఆ రోజు వారి రుక్మిణీ కల్యాణం హరికథాగానం నేను వినటం జరిగింది. దాసుగారి కథ నేను వినటం అదే మొదటిసారి, ఆఖరుసారిగూడా. ఆ రోజు కథ రాత్రి 8 గం॥ లకు ప్రారంభంచేసారు. కథ రాత్రి 8 గం॥ నుండి తెల్లవారుఝాము 2½ గం॥ వరకు జరిగింది. వచ్చిన అశేష ప్రజానీకం మంత్రముగ్ధులై ఆనంద డోలికలలో మునిగిపోయారు. నాకు ఆ

రోజున (శ్రీ) నారాయణదాసుగారు అపరశంకరావతారం వలె కన్పించి నారు. ఆ రోజున వారి తాళవైదుష్యం ఏవిధంగా ఉందంటే – వారు గెంతేవారు. ఆ గెంతిన గతిచూచి సామాన్యులంతా ఏమి నృత్యం అని ఆశ్చర్యపడ్డారు. కాని అవి గెంతులుకావు. నృత్యం సర్వసామాన్యంగా "తకిట–కిటతక–దధిగిణత – తకదధిగిణత – తకధికుదధిగిణత –" అను ఈ 5 జాతులు. సశబ్దక్రియగా "తకిట" యనునపుడు "త" సశబ్దాక్షరముగా "కిట"అను రెండక్షరములు నిశ్శబ్దాక్షరములుగా శాస్త్రంలో చెప్పబడు తోంది. సశ్శబ్దక్రియ అనగా చేతితోగాని, కాలితోగాని కొట్టి ధ్వనింప జేసెడిది అని అర్థం. కాని (శ్రీ) నారాయణదాసుగారు చేసిన మహాద్భుతం ఏమనగా "తకిట" అనే శబ్దాన్ని ఎగిరి "తకి" యని వారు నోటితో అంటూ "ట" అనే అక్షరాన్ని మాత్రమే కాలితో సశబ్దాక్షరాన్ని చేశారు. "తకిట"లో 'తకి' నిశ్శబ్ద క్రియలుగా మార్చారు అంటే 'తకిట'ని "టతకి"గా మార్చారు. "త" సశాబ్దాన్ని నిశ్శబ్దంగా మార్చారు. ఆ విషయాన్ని వారు నృత్యంలో నిరూపించారు. అలాగునే "కిటతక" — "కకిటత." (చతురస్రం), "దధిగిణత" — "తదధిగిణ" (ఖండం), "తక దధిగిణత" — "తతకదధిగిణ" (మిశ్రం), "తకధికుదధిగిణత" — "తత కధికుదధిగిణ" (సంకీర్ణం). అనగా "దధిగిణత" అనే అక్షరపరిమాణం మీదనుండి క్రిందకు గెంతిన మధ్యలో ఉండేదన్నమాట. ఇది ఒక త్రుటిలో మృదంగం వానికీ అయిదు జాతులు చూపించేరు అంటే వారు అపర నటరాజస్వామి అన్నమాటేకదా ! ఈ 5 జాతులయందు చూపెడి ప్రకర్ష వారుచెప్పే ప్రతీకథయందు కన్పిస్తూనే ఉండేది. కాని అందరూ అవి ఇంకోవిధంగా అనుకునేవారు. నేను (శ్రీ) దాసుగారిని మీరు వేసిన గంతులకు నేను 'పైన ఉదహరించినవిధంగా' అనుకున్నాను, తప్పంటే చెప్పండిబాబూ అని అడుగగా, నువ్వు నన్నడిగింది అక్షరాల నిజంరా కృష్ణా అని ఆనందించి ఆశీర్వదించారు.

తాళ శాస్త్రమందు మకుటాయమానమగు ప్రకర్షకు చెందిన "పంచముఖ", "షణ్ముఖ" తాళములను (శ్రీ) నారాయణదాసుగారు అత్యంత ప్రతిభతో అవలీలగా వేసెడివారు.

**శ్రీ నారాయణదాసుగారు ప్రదర్శించెడి షణ్ముఖి తాళవివరణము :**

తాళగతులలో ప్రధానమైనవి ఐదు గతులు. అవి "త్రిశ్రం" అనగా మూడక్షరముల నడకగల "తకిట", "చతురశ్రం" అనగా నాలుగు అక్షరముల నడకగల "కిటతక", "ఖండం" అనగా ఐదు అక్షరముల నడకగల "దధిగిణత", "మిశ్రం" అనగా ఏడక్షరముల నడకగల "తకదధిగిణత", "సంకీర్ణం" అనగా తొమ్మిది అక్షరముల నడకగల "తకధికుదధిగిణత". ఈ ఐదు గతులను ఒక్కొక్కజాతిని ఒక్కొకసారి విడిగా చూపించుట కష్టముగాదు. కాని అన్ని గతులను వివిధశరీరాంగములచే ఒకేసారి చూపించుట ప్రకర్షయుక్తమైనపని. ఈ ఐదు జాతులను ఎంతో సామర్థ్యము, మనోనిశ్చలత్వము, సాధనాపటిమ ఉంటేగాని ఒకేసారి వివిధాంగములతో ఎవ్వరునూ వేయజాలరు.

షణ్ముఖి తాళము :- ఈ తాళములో ఐదు శరీరాంగములపై ఐదు గతులను, ఆరవ అంగము 63 అక్షరముల కాలమును చూపుచూ ఆరు ముఖములు కల్గియుండుటచే దీనికి షణ్ముఖితాళమని పేరువచ్చినది. ఇది సంగీతములో ఒక అపూర్వ ప్రక్రియ. శ్రీ నారాయణదాసుగారు సంగీత పాఠశాల వార్షికోత్సవ సందర్భంలో మహారాజావారు, పెద్దపెద్ద పండితులు, అశేషమగు జనానీకం ముందు నిలుచొని, నెత్తిపైన నిమ్మపండు నిడుకొని, నిమ్మపండు క్రిందపడకుండ ఈ షణ్ముఖి తాళమును అమిత ప్రజ్ఞా పాటవంతో ఆ రోజున ప్రదర్శించినారట.

షణ్ముఖి తాళమును వేయువిధానము :- రెండు చేతులను సమకోణములోనుండు విధముగా మధ్యకు మడచి కుడిచేతి వ్రేళ్లు ఎడమ చేతిపై అర్థభాగముపైనను, ఎడమచేతి వ్రేళ్ళు కుడిచేతిపై అర్థభాగము నను యుంచబడును. ఎడమచేతిపై నవున్న కుడిచేతి వ్రేళ్ళ 'తకిట' యను త్రిశ్రనడకయునూ, కుడిచేతిపై నవున్న ఎడమచేతి వ్రేళ్ళు "తదిగిణత" యను ఖండనడకయునూ, ఎడమకాలు 'కిటతక' యను చతురశ్రనడక యునూ, కుడికాలు 'తకదధిగిణత' యను మిశ్రనడకయునూ, ఎడమ

భుజము (కక్షము) తో అనగా చంకతో 'తకధికుదధిగిణత' యను సంకీర్ణ నడకయున్నూ, కుడిభుజము (కక్షము) తో 63 అక్షరముల ఆవృతమును చూపించును.

షణ్ముఖ ముక్తాయి లెఖ్ఖ వివరణ :- ఈ షణ్ముఖ తాళమునందు 1260 అక్షరముల కాలమున కొకసారి ఆరుగతులును కలియుచుండును. ఇందు తిశ్రము 420 సార్లు, చతురశ్రము 315 సార్లు, ఖండము 252 సార్లు, మిశ్రము 180 సార్లు, సంకీర్ణము 140 సార్లు తిరుగును. అయిదు జాతుల మొత్తము అక్షరములు 28. ఈ తాళమునందు అయిదుజాతులు పూర్తి అయిన గుర్తునకుగాను 28 అక్షరముల కొకసారి ఒక గంతు వేయబడును. కుడిభుజము (కక్షము) 63 అక్షరముల ఆవృతమును చూపును. 1260 అక్షరముల కాలములో 63 అక్షరముల ఆవృతములు 20 సార్లు తిరుగును. అయిదుజాతులు ఒకసారి పూర్తిఅయిన గుర్తునకు గాను 28 అక్షరములకొకసారి వేయుగంతులు 1260 అక్షరముల కాలములో 45 గంతులు వేయబడును. ఈ తాళమును ప్రదర్శించునంత కాలము ఆదిత్యం, అంబికం, విష్ణుం, గణనాథం, మహేశ్వరం అనే పంచ దేవతానామ సంకీర్తనచేస్తూ వేయబడును. ఈ షణ్ముఖఅనే తాళమును వాల్మీకిమహర్షి వద్ద భరద్వాజ, కుశలవులచే నభ్యసింపబడి మనకు అందింప బడినట్లు తాళశాస్త్రములయందు చెప్పబడుచున్నది. ఇట్టిమహాత్మ్యకష్టమైన తాళమును ఎరకయ్య (అసిరయ్య)దాసు అనే వారిశిష్యునికి దాదాపు 6 సం॥ లు శిక్షణనిచ్చి ఈ షణ్ముఖ తాళమునందు ప్రజ్ఞావంతునిచేసి విజయనగరమునందు పెద్దలగు విద్వాంసుల సమక్షమున గండపెండేర సమ్మానముగావించి ఎరకయ్య (అసిరయ్య) దాసు అన్న పేరునుమార్చి కళ్యాణదాసు అను నామకరణమును అతనికి గావించినారు. ఈ షణ్ముఖ తాళమును శ్రీ నారాయణదాసుగారు మైసూరురాజాస్థానమునందు ప్రదర్శించి సవాలుచేసినారు. కాని అచ్చటి విద్వాంసులు ఎవ్వరునూ ఈ తాళమును వేయజాలకపోయిరి.

శ్రీ దాసుగారు వీణవాయించునపుడు కుడిచేతివ్రేళ్ళతో మిశ్రము, తాళమువేసెడి చిటికెనవ్రేలుతో ఖండము నొకేసారిమీటుచూ, ఎడమ చేతితో చతురశ్రమును వాయించెడివారు. మూడుగతుల అక్షరములు

కలసి మొత్తం 7+5+4=16. అనగా ఆదితాళము ఒక ఆవృతము రెండవకాలమునకు సరియగును. కాని మూడుగతులను ఒకేసారి ప్రత్యేక కృషి సల్పినగాని వాయించుటకు వీలుగాదు. అప్పటికప్పుడు ఏవిద్వాంసుడును వాయింపజాలడు. వీరు హరికథలయందు ఏదైనా ఉపమాన ఉపమేయములుగా పిట్టకథలు చెప్పునపుడు కడురమ్యమైనవిధముగా, చిత్రాతిచిత్రముగా చెప్పెడివారు.

ఉదా:- ఒకపెద్దపులి దూరముగా నొకజంతువునుచూచి, దానిని పట్టుకొనుటకు వెళ్లునపుడు పెక్కువిధములగు నడకలను ఆ పులి ఎట్లు నడచునో అదేవిధమున శ్రీ దాసుగారు హావభావములన్నియు చూపుచూ దానికి సరియగువిధమున స్వరమును వేసెడివారు అదిమెట్లనిన ......

(పూర్వ కళ్యాణిరాగం)

దా, సదదాస దరిసరి దదాస దా, సదదాస దగరిగ సరీరి

దా, సదదాసా మగమరిగాగా గరిగసరీరీ రి సరిద సా సా

గరీ, గసా, రిదా, సపా, దాసరిగరి సరీరి పాదసరిస

దసాస దాదసదస దసాస దాదసదస దరీరి దాగరిగ

దారిసరి పాసదస దసరిగరిస సరిగమగరి పమగరిసద

సా, పమగరిసద సా, పమగరిసద సా,

"పమగరిసదసా" అనెడిస్వరము మూడుసార్లు అవగానే పెద్దపులి వెళ్ళి జంతువును పట్టుకొనెడిది అని వారి చెప్పెడివారు. ఇట్లాంటి స్వరభావములను ఎన్నోవందలు, వేలు రకములుగా (శ్రీ) దాసుగారు హరికథాగానమందు వేయుచుండెడివారు. భావస్ఫూర్తితోగూడిన స్వరమును మాత్రమే (శ్రీ)నారాయణదాసుగారు వేసెడివారు.

(శ్రీ) నారాయణదాసుగారు సంగీతపాఠశాల ప్రధానోపాధ్యాయులుగా ఉన్నపుడు వారు స్వయముగా ప్రతితరగతియందుగల విద్యార్థులను సంగీతమును వారెట్లు సాధనచేయుచున్నారో నిత్యము పరీక్షించెడివారు. ఆ రోజులలో సంగీతపాఠశాలయందు శిక్షణవిధానము గురుకులవాసపద్ధతిలో నుండెడిది. దానికనుగుణముగా గురువులు కన్నబిడ్డలకంటె యెక్కువ అభిమానముతో శిష్యులను చూచెడివారు.

ఇంక విద్యావిధానము :- 75 గీతములు, 25 స్వరపల్లవులు, 30 తానవర్ణములు 10 అటతాళవర్ణములు, 5 చౌకవర్ణములు, 10 లక్షణ గీతములు, తదుపరి రాగం, కీర్తన, చిట్టతానములు తరువాత పల్లవివిధానం, మనోధర్మముతో కూడిన స్వరము చెప్పెడివారు. "గీతం" "స్వరపల్లవి" "వర్ణము" మొదలగునవి త్రికాలపద్ధతిలో పాడించి, వాయింపించెడివారు. పైవన్నియూ శ్రీ నారాయణదాసుగారు విద్యార్థులు సాధనచేయుచున్నారో లేదో పరీక్షిస్తూయుండేవారు.

ప్రతీశనివారం యెవరో ఒకఉపాధ్యాయుడు ఒకకచ్చేరీ చేసేవారు. ఆరోజు విద్యార్థులందరూ ఆ సంగీతకచ్చేరికివచ్చి శ్రద్ధాభక్తులతో విని అందలివిషయములను గ్రహిస్తూయుండేవారు. శిష్యులందరూకలసి ఏదో సంగీతంవిషయమై ముచ్చటించేవారు. పైనిచెప్పబడిన సంగీతగ్రంథమంతయూ సాధనచేయటంవల్ల విద్యార్థి సామాన్యంగా మనోధర్మస్వరం వేయుడానికి ఉత్సాహంతో ఉండటం శ్రీ దాసుగారుచూచి, "ఏదిరా ఈకీర్తనలో ఫలానాజాగాకు సర్వలఘుస్వరం వెయ్యి చూద్దాం" అని విద్యార్థిని అడిగేవారు. ఉత్సాహంతో అతడు వెంటనే స్వరంవేసేవాడు. ఈ విధంగా శ్రీ దాసుగారు ఎంతటి చిన్నవాడైనాసరే శాస్త్ర బాగా పాడినా, వాయించినాసరే విని "వావావా!" అని బ్రహ్మానందపడేవారు. వారు నాదబ్రహ్మ కావున వారికి ఏ విధమైన వైషమ్యంకాని, చిన్నచూపుగాని ఉండేదికాదు. వారి భావాలవంటివి సామాన్యులకు లేకపోవటం సహజమేకదా! ఇందువల్ల దాసుగారు అందరినీ తిడతారు, ఎవరినీ అభినందించరు, అనుకునేవారు సామాన్యప్రజానీకం.

శ్రీదాసుగారు పాఠశాలనుండి ఇంటికి తిరిగివచ్చేటపుడు దారిలోనే శిష్యులకు ముక్తాయి, లెఖ్ఖవివరణగూర్చిన పాఠంచెప్పేవారు. శ్రీనారాయణ దాసుగారికి నిజానికి 24 గంటలు చాలేవికావు. వారు సెలవురోజున ఇంటివద్ద ఎప్పుడూ వ్రాస్తూనేవుండేవారు. ఎప్పుడూ నోటితో స్వరమో, శబ్దమో, ఈరెండింటిలో ఏదోఒకటి అభినయించేస్తూ, వారిలోవారే నవ్వుకుంటూ, వారిలోవారే మాట్లాడుకుంటూ ప్రపంచంతో ఏ విధమైన సంబంధములేకుండా ఒక్కొక్కప్పుడు ఉంటూఉండేవారు అట్టి బ్రహ్మానందమూర్తి శ్రీ దాసుగారు. ఎంతటి క్లిష్టమైనరాగం తోనైనాసరే

వారు స్వరం అవలీలగా వెంటనే వేసేవారు. దానిని విద్యార్థులకు బోధ పరచి "మీరుకూడా యిలా వెయ్యాలిరా ఆహా వెధవలూ" అని చిన్న హాస్యంచేసి నవ్వేవారు. వారి తిట్లు నిజంగా ఆశీస్సులుగా భావించేవారు శిష్యులు.

శ్రీ నారాయణదాసుగారు గణపతి నవరాత్రిమహోత్సవము చాలా వైభవోపేతముగా ప్రతిసంవత్సరము జరిపించెడివారు. ప్రతిరోజు ఒక సంగీతకచ్చేరీ మొదలగునవి ఉండేవి. ఆఖరురోజున పెద్ద అన్నసంతర్పణ జరిగేది. ఆఖరురోజున వీణ, వైలన్, మృదంగం, నాదస్వరం, డోలు, మొదలగు వాద్యాలతో, విద్యార్థులగానంతో, వేదప్రవచనాలతో, అశేషప్రజానీకంతో, గణపతి ఊరేగింపు మహోత్సవము జరిగెడిది. ఈ ఉత్సవము విజయనగరానికి ఒక వేడుకగాఉండేది. శ్రీ విజయరామగాన పాఠశాల వార్షికోత్సవమును ప్రతిసంవత్సరము అతివేడుకతో జరుపుతూ ఆ పాఠశాల పురోభివృద్ధినికోరుతూ శ్రీదాసుగారు పాటలు, పద్యములు తయారుచేసి, ఆరోజున ప్రభువులను ఆహ్వానించి, ప్రభువులపై కొన్నిపద్యరత్నములనుచేసి,విద్యార్థులచేపాడించి ప్రభువులమన్ననలను పొందేవారు. వారు ఎప్పుడు ఏమంచిపనిచేసినా అది అందరకూ ఉపయోగపడేటట్లుగా చేసేవారు. గొప్పలకోసంగాని, పదవీవ్యామోహంకోసంగాని, స్వప్రయోజనార్థమైగాని యేపని, ఎప్పుడూ చేసియుండలేదు. శ్రీ త్యాగరాజులవారు "మెప్పులకైకన్నతావు నప్పువడక విట్టువీగు" అని చెప్పియున్నారు. పైవాటికై ఆసక్తిపడేవారు ఆనాడూ, ఈనాడూకూడా ఉన్నారు. మానవాతీతములగు భావములు, మేధగల్గినట్టి సాక్షాత్ దేవతాస్వరూపులైనటువంటి శ్రీ నారాయణదాసుగారి గుణాగుణములను ఏ విధముగాను మనము నిర్ణయింపలేము.

శ్రీ నారాయణదాసుగారు "జానకీశపథం – హరికథాగానం" యథార్థంగా ఒక సంగీతకళాఖండం. అందువారు పూర్వాంగము, ఉత్తరాంగమునకు చెందిన 35 రాగాంగవములను కీర్తనలుగావ్రాసినారు. ఆ రాగములలో కీర్తనలను గానంచేయుటకు అసాధారణ ప్రజ్ఞాపాటవము లేకున్న గానముచేయుట దుర్లభము వారు వ్రాసిన ఆరాగములను ఇచ్చుట పొందుపరచినాడను.

శ్రీ అజ్జాడ ఆదిభట్ల నారాయణదాసుగారు రచించిన "జానకీశపథం" అనే హరికథా గానమందు వ్రాయబడిన కీర్తనలయందు గల మేళకర్త రాగముల వివరణము:-

| కీర్తన నెం. | కీర్తన పేరు. | మేళకర్త నెం. | రాగం | తాళం | చక్రము నెం. పేరు |
|---|---|---|---|---|---|
| 6. | హరిహరియను మనసా | 28వ మేళం | హరికాంభోజి | చతురశ్రగతి | 5 బాణచక్రం |
| 7. | హరిభజన చేయుదము | 1వ మేళం. | కనకాంగి | త్రిపుట | 1 ఇందుచక్రం |
| 10 | జానకీశపథము సదానంద | 4వ మేళం | వనస్పతి | ఖండగతి | 1 ఇందుచక్రం |
| 11 | పరమాత్మునికృప వలన | 30వ మేళం | నాగానందిని | చ. త్రిపుట | 5 బాణచక్రం |
| 12 | ఏమినాపుణ్య మిట్టులీవు | 19వ మేళం | ఝంకారధ్వని | రూపకం | 4 వేదచక్రం |
| 15 | ఏమిసేతుదైవ మ నే | 32వ మేళం | రాగవర్ధని | రూపకం | 6 ఋతుచక్రం |
| 16 | ఆరయమూరాచ బ్రతుకు | 49వ మేళం | ధవళాంబరి | ఝంపె | 9 బ్రహ్మ చక్రం |
| 17 | వింటివా అనుజా మనకెంత | 60వ మేళం | నీతిమతి | త్రిపుట | 10. దిశిచక్రం |
| 18 | అమ్మా విను మాయన్నను | 67వ మేళం | సుచరిత్రము | చతురశ్రగతి | 12 ఆదిత్య చక్రం |
| 19 | అన్నా ! లక్ష్మణా నాదు | 40వ మేళం | నవనీతము | త్రిపుట | 7 ఋషిచక్రం |
| 20 | అకటా ! ఈమెకు | 71వ మేళం | కోసలము | రూపకం | 12 ఆదిత్య చక్రం |
| 26 | ఎందుకీ ఆడజన్మ | 39వ మేళం | ఝాలవరాళి | రూపకం | 7 ఋషిచక్రం |
| 30 | అయ్యో శివేశ్వరీ | 43వ మేళం | గవాంబోధి | త్రిశ్రగతి | 8. వసుచక్రం |
| 32 | పోయినప్రాణము | 25వ మేళం | మారరంజని | చతురశ్రగతి | 5 బాణచక్రం |
| 33 | జయజయ కరుణాంతరంగ | 35వ మేళం | శూలిని | రూపకం | 6 ఋతుచక్రం |
| 34 | ఈవేనేనసుచు | 42వ మేళం | రఘుప్రియ | ఖండగతి | 7 ఋషిచక్రం |
| 35 | కోమలమేఘ శ్యామా | 37వ మేళం | సాలగము | రూపకం | 7 ఋషిచక్రం |
| 37 | ఏలనే మాయమ్మా నీవిటు | 69వ మేళం | ధాతువర్ధని | త్రిపుట | 12 ఆదిత్య చక్రం |

| కీర్తన నెం. | కీర్తన పేరు | మేళకర్త నెం. | రాగం | తాళం | చక్రము నెం. పేరు |
|---|---|---|---|---|---|
| 38 | ఎన్నాళ్లుసైరింతు తండ్రి | 41వ మేళం | పావని | మిశ్రగతి | 7 ఋషిచక్రం |
| 39 | ఏయూరెవ్వారితనయులు | 72వ మేళం | రసికప్రియ | రూపకం | 12 ఆదిత్య చ. |
| 40 | వినుమయ్యామాయూరు | 54వ మేళం | విశ్వంభరి | ఖండగతి | 9 బ్రహ్మ చ. |
| 41 | ఇంకజాగేలనేఇంతి | 24వ మేళం | వరుణప్రియ | రూపకం | 4 వేదచక్రం |
| 44 | అదియేమోకాని ఈ యర్భకుల | 31వ మేళం | యాగప్రియ | ఖండగతి | 6 ఋతుచక్రం |
| 45 | తమ్ముడా ఈజనముసేయు | 18వ మేళం | హాటకాంబరి | రూపకం | 3 అగ్నిచక్రం |
| 46 | ఏమిచేయునోప్రాణేశు | 55వ మేళం | శ్యామలాంగి | రూపకం | 10 దిశిచక్రం |
| 47 | రాముడునీదగుప్రాణేశుడు | 7వ మేళం | సేనాపతి | చ. త్రిపుట | 2 నేత్రచక్రం |
| 48 | రాముకరుణఇన్నాళ్లకు | 48వ మేళం | దివ్యమణి | రూపకం | 8 వసుచక్రం |
| 49 | అమ్మా మన్నించుము | 68వ మేళం | జ్యోతిస్వరూపి | రూపకం | 12 ఆదిత్య చ. |
| 50 | అమ్మలారవందనమిదె | 61వ మేళం | కాంతామణి | తిశ్రగతి | 11రుద్రచక్రం |
| 51 | రామసుగుణధామ | 70వ మేళం | నాశికాభూషణి | సంకీర్ణగతి | 12 ఆదిత్య చ. |
| 53 | సుదినమయ్యెనేడు | 33వ మేళం | గాంగేయ ,, | రూపకం | 6 ఋతుచక్రం |
| 54 | అన్నలారమిమ్మంకము జేర్చిన | 66వ మేళం | చిత్రాంబరి | చతురశ్ర గతి | 11 రుద్రచక్రం |
| 55 | ప్రాణేశ్వరీమనపై నిన్నాళ్ళకు | 6వ మేళం | తానరూపి | చ. గతి | 1 ఇందుచక్రం |
| 56 | పరమఋషులారా | 5వ మేళం | మానవతి | త్రిపుట | 1 ఇందుచక్రం |
| 57 | అంజనేయభంజిత | 12వ మేళం | రూపవతి | మిశ్రగతి | 2 నేత్రచక్రం |

**N B :–** అన్నియును మేళకర్తలే కనుక సంపూర్ణ ఆరోహణావరోహణ క్రమమునే అన్నియును కలిగియుండును.

ఉదా :– ఆరో:- సరిగమపదనిస

అవరో:- సనిదపమగరిస

శ్రీ దాసుగారు జానకీశపథమందు వ్రాసిన అష్టరూప జన్యరాగకీర్తనలు.

| కీర్తన నెం, | కీర్తన పేరు | జన్యరాగం | జనకరాగం | మూర్ఛన |
|---|---|---|---|---|
| 2 | శ్రీగణనాథా | కలగడా | 13 మేళకర్త గాయక ప్రియజన్యం | సరిగపదనిపా సనిదప మగరిస |
| 3 | అంబకరుణించు | మంజుల | 27 ,, సరసాంగి ,, | పసనిసరిగమప। మగరి సనిదప |
| 5 | హరిభక్తిలేని | నాధనాళి | 8వ ,, హనుమత్తోడి | సరిగమపనిససనిదప మగరిస |
| 8 | హరిన్ గొలుచు | ఘంటారవము | 2వ ,, రత్నాంగి | సరిసగమపనిససనిదప మగరిస |
| 9 | అకటకటాకష్టం | సామవరాళి | 3వ ,, గానమూర్తి | సరిమపదనిససనిదపమగరిస |
| 13 | ఓసిఓమాయలాడి | బలహంస | 28 ,, హరికాంభోజి | సరిమపదస సనిదపమరి మగస |
| 14 | మంచితగువరిపలె | మేఘరంజి | 15,, మాయామాళవ | సరిగమనిస । సనిమగరిస |
| 21 | కలయోనిజయో | కుంతల వరాళి | 28 ,, హరికాంభోజి | సమపదనిదస।సనిదపమస |
| 22 | ఎంతపనిజేసితివి | భవాని | 44 ,, భవప్రియ ,, | సరిగమదనిససనిదమగరిస |
| 24 | అమ్మనీవిటులేల | ప్రతాపవరాళి | 28 ,, హరికాంభోజి | సరిమపస।సదపమగరిస |
| 25 | ఏమిచెప్పుదును | కమలామనో | 27 ,, సరసాంగి,, | సగమపనిస । సనిదపమగస |
| 27 | అమ్మతండ్రివంటి | గౌడమల్లారు | 29 ,, ధీరశంకరా | సరిమపదస।సనిదపమగరిస |
| 28 | తాళలేనునొప్పుల | నాగస్వరావళి | 28 ,, హరికాంభోజి | సగమపదస:సదపమగస |
| 29 | కవలుపుట్టిరిచిన్న | జనరంజని | 29 ,, ధీరశంకరా | సరిగమపదపనిసద పమరిస |
| 31 | నిందెయనుచీకటిన్ | కామోద | 65 ,, మేచకల్యాణి | సరిగమనిస । సనిమగరిస |
| 36 | రాముబానియుంటి | భోగవసంతకం | 51 ,, కామవర్ధని | సరిగమపదనిససనిద మగరిస |
| 42 | రామారాక్షసభీమా | దేశాక్షి | 29 ,, ధీరశంకరా | సరిగపదస।సనిదపమగరిస |
| 52 | అనుపమకరుణా | శారదాభరణం | 34 ,, వాగధీశ్వరి | సమగమపదనిససనిద పమరిస |
| 1 | రణధీరాకపివీరా | హుసేని | 22 ,, ఖరహరప్రియ | సరిగమపనిదమపనిదనిస సనిదపమగరిస |

(శ్రీ) నారాయణదాసుగారు ఈ జానకీశపథం హరికథాగానం చేయగా నేనెప్పుడూ వినలేదు. కాని యిందలికీర్తనలు శిష్యులకు చెప్పగా విన్నాను. వారి శిష్యులలో ముగ్గురుమాత్రం ఈ జానకీశపథం 35 మేళకర్తరాగములను చెడకుండా పాడేవారని వినేవాడిని. వారు (శ్రీ) వాజపేయాజుల సుబ్బయ్యదాసుగారు, నేతి లక్ష్మీనారాయణగారు, నేమాని వరహాలుదాసుగారు. వీరిలో ఇద్దరిని నేనెరుగను, కాని కీ॥ శే॥ నేమాని వరహాలుదాసుగారుమాత్రం పాడడం నేనేరుగుదును. వారు ఈ 35 మేళకర్తరాగములలో కీర్తనలను చాలా మనోహరముగా రాగయుక్తముగా పాడెడివారు. నారాయణదాసుగారు వరహాలుదాసుగారు పాడుతున్నపుడు విని చాలాబ్రహ్మానందపడుతూ మానాన్నగారితో "విన్నావా వెంకట్రావూ! ఇదీపాటంటే. అందరూ నాకథలన్ని చెబుతారు వెర్రిమాదిగాడి కొడుకులు. కథలో వుంది సంగీతం అంతా. ఆ వరహాలదాసు కష్టించి నావద్ద చాలా శ్రద్ధాభక్తులతో చెప్పుకొని కృతార్థుడయ్యాడు" అనేవారు. వారలా అన్నారంటే అందులో ఒక్క అక్షరం కూడా అసత్యం ఉండదుకదా. వీరికథలలో మకుటాయమానమైనదీ, సంగీత ప్రకర్షకు చెందినదీ ఈ జానకీశపథం కథే అనుటకు మనకు ప్రత్యక్షంగా కనిపిస్తూయున్న పూర్వాంగ, ఉత్తరాంగములతో కూడిన 35 రాగాంగములే ప్రత్యక్ష నిదర్శనం.

(శ్రీ) దాసుగారు రుక్మిణీ కల్యాణమునందు నవరోజు రాగములో "కురుభూపకులదీప, ఘోరకలి సంతాప" అను కీర్తన వ్రాసియున్నారు. కర్ణాటక సంగీతములో ఈ రాగమునందు రచనలు కనబడుటలేదు. దీని

చ కా చ అం శు

మూర్ఛన :- ప ద ని స రి గ మ ప 1 పమగరిసనిదప 1 ఇది ధీరశంకరాభరణజన్యరాగం. ఈనవరోజురాగము మధ్యస్థాయి పంచమమునుండి తారస్థాయి పంచమమువరకు నుండును. ఇందు దాసుగారి కీర్తన షడ్జమముతో ప్రారంభింపబడినది.

; ససని దపద నిససాస; రిమాగ గరిస సరిగరి రీరి, గమ
; కురుభూ - - వ కులదీప: ఘో - రక - లి సం - - - తాప; స్థిర
పావ పమగ గరిసాసా; సాసా; ని రిగమగ సరిగరి పమగరి ॥సస॥
బుద్ధివై - - వి - నుము; దివ్యా; నుల - - - - - - ప - - - ॥కురు॥

అను పై స్వర ప్రస్తారము కీర్తనకు ఎంతో భావస్ఫూర్తి యిస్తూ షడ్జమం నుండి ప్రారంభించినందున కీర్తనకు రసపుష్టి నిచ్చినది. ఈ రాగము నందు దాసుగారు కీర్తనపాడిన తరువాత స్వర ప్రస్తారములు సందర్భానుసారముగా వేస్తూ నృత్యంచేస్తూ, అభినయము చేస్తూ ఉన్నపుడు నాకు ఏమి స్ఫురించేదంటే శ్రీ త్యాగరాజస్వామివారు వ్రాసిన కీర్తన "నాదలోలుడై బ్రహ్మానందమును బొందవె మనసా" అన్నటుల ప్రతి ఒక్కరు నాదబ్రహ్మంలో మునిగిపోయేవారు.

తరువాత "లేజవ్వనంపు పసందు" అనే కీర్తనలో "పల్కగనె రాలు వరాలు" అనుచోట వారు పాడుతున్నపుడు నిజముగా ఆ రుక్మిణి నోటినుండి వరాలు రాలుచున్న వనుటకన్న వారి సంగీతమునుండి అట్టి వరాలు రాలుచున్నవనడం అతిశయోక్తిగాదు. శ్రీ దాసుగారు ఈ కీర్తనలో స్వరమును నిషాదముతో న్యాసంచేసి పాడేవారు. ఎందుకనగా ఈ కీర్తనపై షడ్జమంతో ప్రారంభమయిందిగనుక "దాని", "మదాని", "గమదాని", "గమగమదాని" "సరిగమదాని" అన్న స్వరాన్ని సాహిత్యానికి సమన్వయిస్తూ వారు స్వరం వేసేవారు. ఇది అసాధారణమైన స్వరప్రస్తారప్రకర్ష అనడానికి సందేహము లేదు. ఇట్లాంటి సంగీత చతురతలతో పలు తెరగుల ప్రస్తారముతో వారు కథయందు స్వరం వేస్తూయుంటే సర్వజన సమ్మోహనముగా నుండేది.

తాళశాస్త్రములో కొన్ని ముక్తాయింపులను వారు వేసెడివారు. ఉదాహరణకు మాత్రము కొన్ని ముక్తాయిలు ఇందు వ్రాసితిని.

1) ముక్తాయి:- ఒక "దధిగిణత" (3 కాలములు) త్రిశ్రజాతి త్రిపుట యందు ఖండగమనంతో $7 \times 5 = 35$.
$5 \times 4 = 20$ 1-వ కాలం, $5 \times 2 = 10$ 2-వ కాలం, $5 \times 1 = 5$ 3-వ కాలం
∴ $20 + 10 + 5 = 35$ అక్షరములు.

2) ముక్తాయి:- ఆదితాళమునందు ఒక "దధిగిణత" ఒక ఆవృతమునకు:-
$5 \times 8 = 40$ ∴ $8 \times 5 = 40$.
ఇట్లాగునే లెఖ్ఖలేని పధ్ధతిలో కూడా వారు ముక్తాయిలలు వేసెడివారు.

3) ముక్తాయి:- 4-వ కాలములో తాళంవేస్తూ ముక్తాయిని సమగ్రహంగా చతురశ్ర గమనంలోనేవేస్తూ అనగా "ఝుం తరికిట తకధళాంగు తకదధిగిణత" మొదటిసారి వేసినాక 7 అక్షరములు విరామం. 5-వ కాలంలో పెట్టి 3 సార్లు అంటే వస్తుంది. ఇట్లాగే తమాషాకి యెప్పుడైనా "ఏదిరా అబ్బాయీ, సరళీ స్వరమును ఒక ఆవృతములో ఆరోహణ, అవరోహణ ఆదితాళములో మూడు కాలములు వెయ్యి" అనే వారు. విద్యార్థి ఆలాగవేస్తే అమితానందపడేవారు. వేయలేకపోతే వారు ఈలాగున చేతినివేసి చూపేవారు.

మిశ్రజాతి అనగా క్రియకు 7 అక్షరములు చొప్పున తాళము వేస్తూ నోటితో చతురశ్రములో వేస్తూయుండవలెను.

$8 \times 7 = 56$ అక్షరములు ∴ $7 \times 8 = 56$ అక్షరములు

పై మాత్రమును వారు విద్యార్థికి విపులముగా చెప్పి వానిచేత వేయిపించెడి వారు. వారికి ఈ ముక్తాయిలు ఒక లెక్కలోనివి కానేరవు. పంచముఖ

ముఖ, షణ్ముఖ తాళములను వేసెడి ప్రజ్ఞాధురంధురులకు ఈ ముక్తాయిలు "హనుమంతుని ముందు కుప్పిగంతులవలె" కన్పడును. వారు లయబ్రహ్మ, నాదబ్రహ్మ, స్వరబ్రహ్మ.

శ్రీ నారాయణదాసుగారు జానకీశపథంలో అపురూప జనక రాగములలోను జన్యరాగములలోను కీర్తనలు వ్రాసియున్నారు. ఇట్టి జనకరాగ, జన్యరాగములలో పాడుట. పెద్ద సంగీత విద్వాంసులకు కూడా క్లిష్టమైన సమస్యవంటిదనుటకు సందియము లేదు. ఉదాహరణకు జానకీశపథంలో శ్రీరాములవారు కుశలవుల అమరగానమునకు ఆశ్చర్య వంది కుశలవులతో "ఏయూరెవ్వాని తనయు లెలిగింపుడు బాలులార" అనే కీర్తనను దాసుగారు 72 వ మేళకర్తయగు రసికప్రియ రాగంలో వ్రాసేరు. రసికప్రియ రాగంలో నేటి హరికథకులు పాడనేర్వక 16 వ మేళకర్తయగు చక్రవాకములో ఎందరో పాడగా నేను విన్నాను. శ్రీ నారాయణదాసుగారు వ్రాసిన జానకీశపథంలో వ్రాసిన 35 పూర్వాంగ ఉత్తరాంగ రాగాంగములలో గానం చేయాలి అంటే పెద్ద సంగీత విద్వాంసుడై ఉంటేదప్ప ఆపాటి ఈపాటి మిడిమిడిజ్ఞానస్తుడు నిక్కువముగా ముమ్మాటికిని పాడలేడు. ఎవరికితోచిన సులభపద్ధతి రాగములలో మాత్రమే ఇప్పుడు పాడుచున్నారు. ఇక జన్యరాగములు :- గౌడమల్లారు, భవానీ, ప్రతాపవరాళి, భోగవసంతకము, మంజుల, కలగడా మొదలు గాగల రాగములను పాడటంపై జనకరాగములు ఎంత కష్టమో యీ జన్యరాగములు పాడటం అంతకు మరింత కష్టమని నేననుటయే కాదు, ఏ సంగీత విద్వాంసులైననూ శ్రీ దాసుగారు చూపించిన సంగీత ప్రకర్ష నిరుపమానమైనదని వప్పుకుంటారని నావిశ్వాసం. ఇట్టి మహనీయునిచే రచింపబడిన ఈమహత్తర మేళరాగ కీర్తనలను ప్రముఖసంగీతజ్ఞులచే మన ఆకాశవాణిసంగీతప్రయోక్తలువిజయవాడ- హైదరాబాదులనుండి 'సంగీత సంచికా కార్యక్రమాలలో' ఈ జానకీశపథం అనే హరికథాగానమును ప్రసారముచేస్తే చాలా బాగుంటుందని నేను విశ్వసిస్తున్నాను. ఈ కీర్తన

లను చిట్ట, కట్టి, మంచి గమక రీతులతో పాడితే పరమానందభరితముగా వుంటాయి.

శ్రీ నారాయణదాసుగారిని గూర్చి, వారి సంగీత వైదుష్యమును గూర్చి వ్రాయటం విశ్వాంతరాళంలో ఉన్న నక్షత్ర కోటిని లెక్కించ టం ఎంతటి అసాధ్యమో శ్రీవారి సంగీత వైదుష్యాన్ని అభినందించ టం గూడా నా అభిప్రాయంలో అంతకష్టమైనది. అట్టి మహనీయ అవ తారమూర్తి కారణ జన్ములుగా పుట్టటం మన అదృష్టం. శ్రీవారు చేసిన కళాసేవకు మన హిందూదేశమే ఋణపడి ఉందనటం నిర్వివాదాం శము. శ్రీ నారాయణదాసుగారి కివే నా శతకోటి నమస్సులు.

"నారాయణదాసగురుని । నమ్మి భజింపవె మనస। "



# దాసుగారి వాగ్గేయకార వైదుష్యము

## 1. ధాతురచనాదక్షత, ధాతుమాతు సమన్వయ విశిష్టత

సంగీత శేఖర

శ్రీ నూకల చినసత్యనారాయణ

శ్రీమదజ్జాడాదిభట్ట నారాయణదాస మహోదయుడు, సంగీత సాహిత్య కళా చతురుడు. మహాకవి, బహుభాషా కోవిదుడు, లయ బ్రహ్మ, హరికథా పితామహుడు, వాగ్గేయకార వాచస్పతి.

వారి హరికథలందు గల అనేకములైన కీర్తనలలోగల ధాతు రచనా వైదుష్యం, ధాతుమాతు సమన్వయ విశిష్టత, లయాన్వితమైన శబ్దకల్పనా ప్రజ్ఞ, అపురూపమైనది. అనన్య సామాన్యమైనది.

72 మేళకర్తలలో కృతుల రచించిన ఘనత శ్రీ త్యాగరాజుల తరువాత శ్రీ నారాయణదాసులకే కలదు. ఈ 72 మేళకర్తలలో ముఖ్యముగా వివాది మేళములలో కీర్తనలు రచించుట ఆకీర్తలనుపాడుట అతికష్టము. ఈ క్లిష్టతర కార్యమును శ్రీ నారాయణదాసు, శ్రీ త్యాగ రాజువలెనే కారణజన్ముడు కనుక సాధించగలిగెను.

వివాది రాగములలో రచనలను చేయుట, పాడుట క్లిష్టమను టకు కొన్ని కారణములను వివరించెదను.

వివాదరాగములలో వివాదిస్వరస్థానములు కలవు. సప్తస్వర మండలమునందు ఈ వివాది స్వరములు నాలుగు కలవు. అవిఏవనగా

1) శుద్ధగాంధారము, 2) షట్శ్రుతి రిషభం,
3) శుద్ధనిషాదం, 4) షట్శ్రుతి ధైవతం.

ఈ నాల్గు వికృతి స్వరములకు స్వయముగా వివాదిత్వము లేదు. కాని, శుద్ధగాంధారము శుద్ధ రిషభముతో చేరినపుడు, షట్శ్రుతి రిషభము అంతరగాంధారముతో చేరినప్పుడు శుద్ధనిషాదము శుద్ధధైవతముతో చేరినప్పుడు షట్శ్రుతిధైవతము కాకలి నిషాదము చేరినప్పుడు, వివాది దోషము కల్గును. వివాది దోషమనగా ప్రకృతిసిద్ధమైన సంవాదిత్వము లేక శ్రావ్యత లేకపోవుట. ఇట్టి వివాదిదోష రాగములకు సహజ శ్రావ్యత లేకపోయినను ప్రాజ్ఞుడైన సంగీతజ్ఞుడు తన ప్రతిభచే శ్రావ్యత నాపాదింపగలడు. ఈ ప్రక్రియ సాధారణ సంగీతజ్ఞునికి సాధ్యముకాదు. వివాదిరాగములను పాడుటకు ప్రత్యేక సాధన, కల్పనాశక్తి, సౌందర్య తిరంస కావలెను.

వాగ్గేయకారుడు సంగీత రచన ప్రారంభించి చేయుచున్న సమయమునందు తాను కూలంకషంగా పాడుకొనిగాని ఏ రచన చేయడు.

శ్రీ నారాయణదాసు ఈవివాది రాగములలో చాలా కీర్తనలు వ్రాశారు. స్వయంగా ఈ వివాది రాగములలో ఈ కీర్తనలను పాడుతో వ్రాసి ఉంటారనేది నిర్వివాదాంశం.

కనకాంగి, వనస్పతి, నాగానందిని, మారరంజని, శూలిని, రఘుప్రియ, సాలగము, రాగవర్ధని, గవాంభోధి, ధవళాంబరి, నీతిమతి, సుచరిత్ర, నవనీతం, కోసలం మొదలైన రాగాలు 'జానకీశపథం' అనే హరికథలో వాడారు. ఈ రాగాలన్నీ వివాది రాగాలే.

శ్రీ నారాయణదాసుగారి శిష్యులలో ఎక్కువమంది సంగీతాన్ని గాత్రపాటగా అనుకరణచేసే యోగ్యతమాత్రం కలిగినవారు అగుటచేత వారు సంగీత విద్వాంసులు కాకపోవటంచేత, ఈ పై వివాదిరాగాల్లో

శ్రీ దాసుగారు వ్రాసిన కీర్తనలను ఆ యా నిర్ణీతరాగములలో పాడుట కసాధ్యమగుటచే, వారి వారి సౌకర్యం ప్రకారం సులభ రాగాలలో ఏర్పాటు చేసుకొని పాడుతున్నారు. అందుచేత ఈ వివాది రాగాల్లో వ్రాసిన కీర్తనలు యథాతథంగా తరువాత తరానికి వినే అవకాశం లేకపోయింది. వాటి ధాతురచనా సౌందర్య ఫణితులు మరుగు పడినవి.

శ్రీ నారాయణదాసు ప్రసిద్ధ రాగములలో అనేక కీర్తనలు రచించారు. వీటిలో స్వరసాహిత్య సమన్వయ విశేషాలు చాలా ఉన్నాయి. ఈ కీర్తనలు కూడ సంగీతజ్ఞులుకాని హరిదాసులద్వారా ప్రజల కందింపబడటంచేత వాటి సహజ సౌందర్య స్వరూపానికి భంగం ఏర్పడింది.

వీరి యథార్థరామాయణంలో గల కొన్ని ప్రసిద్ధ రాగకీర్తనలలో ఉండే విశేషాలు ఇచ్చట ఉదాహరిస్తాను.

మొట్టమొదటి కీర్తన శ్రీరామ జనన సందర్భంలో

"ఆనందమానంద మాలించినన్..."

ఈ కీర్తన రసము శాంతము, హాస్యమున్న.

ఈ కీర్తన భైరవిరాగమునందు రచించుట సముచితము. భైరవి రాగ స్వరస్థానములు షడ్జమము, చతుశ్శ్రుతి రిషభము సాధారణగాంధారము, శుద్ధమధ్యమము, పంచమము, శుద్ధధైవతము, అన్యస్వరముగా చతుశ్శ్రుతి ధైవతము, కైశికనిషాదము. ఈ స్వరములలో సాధారణ గాంధారము, శుద్ధమధ్యమము, శుద్ధధైవతము, కైశిక నిషాదము కోమల స్వరములు. ఇవి కైశికీ ప్రవృత్తి కలిగినవి. చతుశ్శ్రుతి రిషభము సాధారణ గాంధారముతో చేరిఉండటం అట్లాగే చతుశ్శ్రుతిధైవతము కైశిక నిషాదముతో చేరియుండుటచే శాంతరసము స్థాయిని చెందిఉన్నది.

దశరథుని బాణముచే హతుడైన మునిబాలుని తలిదండ్రులు విల పించు సందర్భమునందు "ఏమందుమయ్యో" అను కీర్తన శుభపంతువ రాళిలో రచింపబడినది.

శుభపంతువరాళి స్వరస్థానములు కోమలములై కరుణరస ప్రధాన మైనవి. కరుణరసమునకు శోకము స్థాయిభావము. కనుక శుభపంతు వరాళి రాగమునందు ఈ సందర్భమున ఈ కీర్తన రసస్ఫూర్తికలిగి యున్నది.

సనకసనందన మహర్షులు విష్ణు సందర్శనార్థం వైకుంఠానికి వెళ్ళి అంతఃపురంలోనికి ప్రవేశిస్తోన్నప్పుడు జయవిజయులనే ద్వారపాలకులు వారిని అడ్డినప్పుడు సనకసనందనులు ఉగ్రులై "ఔరా జయవిజయులారా మమ్మడ్డెదరా" అనే కీర్తన అఠాణారాగంలో శ్రీ నారాయణదాసు రచించారు.

అఠాణా రౌద్రరసాన్ని ప్రతిపాదిస్తుంది. ముఖ్యంగా సదా, సని సదా, రీ మ రి స ని ప అనే ప్రయోగాలు ఉత్తరాంగంలో రౌద్రరసాను భూతిని కలిగిస్తాయి. అఠాణా రాగమునందు ఈ కీర్తన రచించుట సముచితము.

ఈరాగమునందే "ఏర ఇంత నక్కవినయమేల చూపినావు తేడ" అనే కీర్తన విశ్వామిత్రునిచే దశరథుని సంబోధించు సందర్భమున వ్రాసి. రౌద్రరస ప్రతిపాదనను చేయుట సహజముగనున్నది.

సావేరి రాగమునందు "ఎటుల విడుతు నిన్ను పుత్ర" అనుకీర్తన దశరథుడు శ్రీరామచంద్రునితో అరణ్యవాసమునకేగు సందర్భమున కరుణరసాత్మకముగా' శ్రీ దాసుగారు రచించిరి.

సావేరీరాగము కరుణరస ప్రధానమైనది.

ఈ రాగమునగల అన్ని స్వరములు కరుణరస జనకములే. ముఖ్యముగా "మగారి" అను ప్రయోగమునందు గల గాంధారము

అంతరగాంధారమునకు ఒక శ్రుతి తక్కువగాఉండి హృదయమును కదిలించును. సరినీదప, పదమగారి అను ప్రయోగములు రాగరంజక ప్రయోగములు. కరుణరస ప్రధాన రాగములలో ప్రథమశ్రేణికి చెందినవి సావేరి, శహానరాగములు.

శహానరాగమునందు శ్రీరామచంద్రుడు సీతను సంబోధించు "సీతా నే పోయి వచ్చెద నీవు మాయమ్మ సేవ చేయుచు నుండుమా" అను కీర్తన కరుణరసప్రధానముగా హృద్యముగ నున్నది. శయన రాగము కరుణరసప్రధానమైనది. ఇందలి స్వరస్థానములు - చతుశ్శ్రుతి రిషభము, అంతరగాంధారము, శుద్ధ మధ్యమము, చతుశ్శ్రుతిదైవతము, కైశికనిషాదము. మూర్ఛన- వక్రసంపూర్ణము.

సరిగమపమదానిసా । సనిసదపమగామరిగరిస ॥

ఈరాగము రక్తిరాగము. పూర్వాంగమునగల రిషభ, గాంధార, మధ్యమ, పంచమములు రాగచ్ఛాయ స్వరములు. గాంధారము అంతరగాంధారముకంటె ఒక శ్రుతి తక్కువగా నుండును. "రీగమపా" "పమగమరీ" అను ప్రయోగములు కరుణరసప్రధానములై రాగమును ప్రతిపాదించునవిగ నున్నవి. ఈ రాగము హరికాంభోజిజన్యము.

పున్నాగవరాళి యందు "అనుభవింపకదీరునా" అను కీర్తన సశాస్త్రీయముగానూ, కరుణరసజనకముగాను ఉన్నది. పున్నాగవరాళి మధ్యమశ్రుతిలో పాడవలెను. ఈ రాగము నిషాదాంత్యరాగము, భాషాంగరాగము. శుద్ధరిషభము అన్యస్వరము. ఇది 20వ మేళకర్త నటభైరవీజన్యము. "రిగాగరిరీపమ గారిస" "రిసనిగరిసా" అను ప్రయోగములు రంజకములు, కరుణరసమును ప్రతిపాదించును.

శృంగార రసము :

కమాచిరాగమునందు "నావంటి సొగసుగాడెడి" "వలవదా ముద్దాడి" అను కీర్తన శృంగారరసప్రధానముగ హృద్యముగ నున్నది.

పూర్వవాగ్గేయకారులు రచించిన "జావళులు" అను శృంగార రస కీర్తనలు నూటికి తొంబది కమాచి రాగములోనే కలవు. కమాచి రాగము 28వ మేళకర్త హరికాంభోజిజన్యము, భాషాంగము. ఒకప్పుడు ఉపాంగరాగమైనను ఈనాడు భాషాంగముగా మారినది. అన్యస్వరము, కాకలినిషాదము.

భక్తిరసము :

కేదారగౌళరాగము భక్తి శాంతరసములకు ఆటపట్టు. ఈ రాగమునందు "మ్రొక్కెదము విశ్వజనన స్థితివిధానముల ముమ్మూర్తుల నే దాల్చి" అను కీర్తనలో భక్తిరసము సంపూర్ణముగనున్నది.

వీరరసము :

దేవగాంధారి రాగమునందు "అన్నలార మునియజ్ఞరక్షకై అరిగి రండు జయమంది ముదమున" అను కీర్తనలో పూర్తిగ కలదు. ఈ రాగమున ఈ కీర్తన రచించుటలో దాసుగారి రచనా వైదుష్యము ఔచిత్యము ద్యోతకమగుచున్నవి.

దేవగాంధారి రాగమును పాడుచున్నపుడు వినిన ప్రతిశ్రోత మనస్సులో వీరరసము, ఒక విధమైన సహజోద్రేకము కలుగును.

ఈ రాగమునందు 'క్షీరసాగరశయన' అను త్యాగయ్యగారి కీర్తనయందు శ్రీరామచంద్రుని శౌర్యము వర్ణింపబడి వీరరసము ప్రతిపాదింపబడినది.

దాసుగారుకూడ శ్రీరామచంద్రుని చరిత్రయందు మొట్టమొదటి వీరకృత్యమైన యజ్ఞరక్షణ సందర్భములో దేవగాంధారి రాగమున ఈ కీర్తన రచించుట ఎంతయూ సముచితము.

శాంతము :

కళ్యాణి రాగమునకు శాంతరసము స్థాయిభావము; శృంగారము ఆనందము వ్యభిచారిభావములు.

ఈ రాగము కళ్యాణప్రదము కనుకనే కళ్యాణి అని ఈ రాగమునకు పూర్వాచార్యులు పేరిడిరి. ఈ రాగమున 'సీతాకల్యాణ విశేష వినోదము చెవుల విందుగా విన్పించెద' అను కీర్తనలో పై రస భావములు కలవు.

బీభత్సరసము :

దేశాక్షి రాగమునందు 'అమ్మా నేటి ముచ్చటయ్యో ఏమనందు' అను కీర్తన శ్రీరామ పట్టాభిషేకమునకు ముందుగ, మంథర కైకేయికి చాడీలు చెప్పి శ్రీరామచంద్రుని కష్టముల పరంపరకు కారణభూతమైన సందర్భమున రచించిన కీర్తన.

ఇందు జుగుప్స, ఈర్ష్యాది భావములు ఉత్పన్నము లగుచున్నవి. దేశాక్షి రాగము అపూర్వరాగము. సంగీతమునందు బీభత్సరసము కూడ అపురూపమే.

దేశాక్షిరాగము ఇప్పుడు ముఖ్యమైన రాగముగా పరిగణింపబడుట లేదు. దేశాక్షి రాగస్థానమును ఇప్పుడు బిలహరిరాగము ఆక్రమించినది.

శ్రీ దాసుగారు తమ హరికథాకీర్తనలయందు రాగ రసౌచిత్యమును మిగుల పాటించిరి. ఈ పై కీర్తనలు ఉదాహరణములుగా ఒక్కొక్క రాగము, ఒక్కొక్క రసము చొప్పున తీసుకొనబడినవి. ఇట్లే ప్రతి కీర్తనకు ఆ యా రాగము ఆ యా రసమునకు అనువుగా శ్రీ దాసుగారు రచించిరి. గ్రంథవిస్తర భీతిచే క్లుప్తముగా ఈ పై కీర్తనలు మాత్రము ఉదాహరింపబడినవి.

కేవల సంగీత రచనలు (Concert forms) :

శ్రీ దాసుగారు రచించిన హరికథలలో కేవల సంగీత రచనలు అనగా సంగీత సభలయందు సంగీతజ్ఞులు పాడుటకు, వాయించుటకు

అనువైనవి కొల్లలుగ కలవు. వాటియందుగల సంగీత పటిష్ఠతను పరిశీలించి సంగీతజ్ఞులు పరిగ్రహించినచో ఆ కీర్తనలు పూర్వప్రసిద్ధ వాగ్గేయకార రచనలకు సంగీత శిల్పమునగాని, రసవిషయమునగాని, ఏమాత్రమునను తీసిపోక సరితూగు చుండును.

ఈ కీర్తనలలో కథాసంవిధానము లేక ఆ యా సందర్భములలో కేవల కీర్తన రూపమున కలవు కనుక ఈ కీర్తనలను పాడుటలో సంగీతజ్ఞునికి ఏమియూ ఇబ్బంది లేదు.

ఈ కీర్తనలను సహృదయులైన సంగీతజ్ఞులు వేరుపరచి స్వరబద్ధముగా వ్రాసి ప్రచారము చేయవలసిన ఆవశ్యకత ఎంతయో కలదు.

దాసుగారు బహుముఖప్రజ్ఞాధురంధరుడు. ఉత్తమ వాగ్గేయకారుడు. వీరు ఏ వంగదేశముననో, తమిళనాడులోనో జన్మించినచో వీరి కీర్తనలు ఎన్నియో సంగీతజ్ఞులచే పాడబడి ఈపాటికి ప్రచారములో ఉండి యుండేవి. 'మావాడు' అను ఆప్యాయత ఆంధ్రరాష్ట్రమునకంటె తక్కిన రాష్ట్రములవారికి ఎక్కువ.

తక్కినవారిని చూచినైన మనముకూడ ఆ సహృదయత అలవరచుకొనుట వాంఛనీయము.

యథార్థరామాయణమున గల కేవల సంగీత రచనలుగా రూపొందుటకు తగిన లక్షణములు గలిగిన కీర్తనలను ఇచ్చట కొన్నిటిని ఉదాహరించెదను.

1) నీపదంబు తాకినంత కేదారగౌళ : రూపకము
2) అపరాధినపరాధినోదేవా భూపాల : ఝంప
3) జగమంతయు నజ్ఞానికిసత్యముగాతోచు : కేదార రూపకము
4) సీతారాములనకున్న పరస్పర ప్రీతి చెప్పతరమా దేశి : ఆది.
5) సీతామనోనాయక శ్రితజనాభయదాయక గౌళ:సంకీర్ణరూపకం

6) రఘుకులవర్ధన రామచంద్రి తోడి : ఆది
7) రామచంద్ర సీతామనోహర బేగడ : ఆది.

ఈ రాగము బేగడరాగమునందు మిగుల ప్రసిద్ధము.

ఈనాడుకూడా విజయనగరమునగల సంగీత కళాశాలలో ప్రార్థనా గేయముగ ప్రతిదినము ఉపాధ్యాయ, విద్యార్థి బృందముచే పాడబడు చున్నది.

8. సంస్కృత (కీర్తన) కృతి కాంభోజి—ఆదితాళము

ప॥ రామా కోమలమేఘశ్యామా । రవికులాబ్ధిసోమా । గుణధామా॥
అ॥ భూమిజామానసాభిరామ సం । పూర్ణకామ దివ్యసార్వభౌమ ॥ ॥రా॥
౧. జగదాధార ధర్మావతార । శతమదనాకార । దయాపూర॥
నిగమాంతవిహార పాపదూర । నిఖిలదుష్టరాక్షసమదవిదార ॥రా॥
౨. భువనాధ్యక్ష సూనృతదీక్ష । ఫుల్లాంభోజాక్ష క్షితరక్ష ।
వివిధదుష్ట శిక్ష సాధుపక్ష । వితతభవబంధమోక్ష శ్రీవక్ష ॥రా॥

ఈ కీర్తన కేవల సంగీత రచన (కృతి) లక్షణములు అనేకములు కలిగియున్నది. ప్రచారమునకు తెచ్చినచో చాలమంది సంగీతరచనగా బహుజనాకర్షణీయముగ రూపొందును.

9. వసంతరాగము చతురస్ర : అట.

క్రియకు నాలుగు అక్షరములు.

ప॥ (2కా॥) రామానవనవమేఘశ్యామా । రఘుకులాబ్ధిసోమ ॥రా॥
అ॥ భూమిజామానసాభిరామ సం । పూర్ణ సర్వకామ ॥రా॥
౧. సత్యజ్ఞానానందస్వరూప । సజ్జనహృద్దీప ।
స్తుత్యగుణగణాలాపధృతహా చాప । సురవినుతప్రతాప ॥రా॥
3) నిసగరి-సనిధని-సరిగమ ధమనిధ—మతమగ-నిధనిస రినిదగ—రినిదమ ధారిత — హర్ఝుణు 4 - రిహ - తర్ఝుణు 4) తాకిట తకధరి - కిటతకతోం-కిటతక తరి- కిట తకతోం - సమగరిగ ధమగ - మనిధమధసనిధ రినిధ మతద్ధితోం-దరికిటతక ఝుణు తధిహతకిణతకు - దరితకిటదధిగి - ణతదధిగిణత - దధిగిణత ॥రా॥
(రెండావృత్తములు)

ఇందలి చిట్టస్వరము, శబ్దము, మిగుల ఆకర్షణీయముగ నున్నవి. శబ్దము నోటితో ఉద్భవించుచు లయానుబద్ధముగా పాడుట మిగుల కష్టము. ఇప్పటి హరిదాసుల కసాధ్యము. కనుక సంగీతజ్ఞులు ఈకీర్తనను స్వర, జతి సహితముగా సాధనచేసి పాడిన హృద్యముగ నుండును. ఈకీర్తన చతురస్ర॥ అట, తాళములో రచింపబడినది. ఈచతురస్ర అట ముప్పదిఅయిదు సూళాది తాళములలో నొకటి ఈ తాళమునకు క్రియలు 12. పూర్వాచార్యులు ఎవ్వరునూ ఈ తాళమునందు కీర్తనలు వ్రాయలేదు. ఈ తాళమున పల్లవులు పాడెడివారు. ఇది అపురూప తాళము.

10. కేదరగౌళ ॥ మిశ్రజాతి త్రిపుట.

ప॥ కమలాక్షనీకై నేనిటు కనిపెట్టుకొంటి ।
అ॥ అమలచరిత్ర నాదెంతపు ణ్యమో నినుగంటి । ॥క॥

౧. నిలువనోప నొడలను చెరలో । నేనతి దీనుఁడ ।
సెలవిమ్మా నీలో నిఁక గల । సెద త్వదధీనుఁడ ॥క॥

౨. దాశరథీయీభవకార । ద్వారము తెఱచుమ ।
యాశించిన నీపదభక్తుని । యజ్ఞతఁ జెఱచుమ । ॥క॥

(3వ కా॥) మగరి । నిధపని । సరిపమ । గరిహత ద్ధిం । ధా ।
రిహ । ధహిర్ఝుణు । తహితఝెంపపమ నిధపస । నిధపమ । గరిప ॥క॥

(4 కా) తర్ఝుణుతద్ధిహి । తగ్గధిఝుణుత । ద్ధిగితగ్గధిత । తద్దిరు గుడుథా । ధిరుగుడు (5 వ కా॥) దిరుగుడుదిరుగుడు (4) ధారిహతర్ఝుం (5) ధిరుగుడు ధిరుగుడుధిరుగుడుఝుంతరి । కిటతకతళంగుతకదధిగిణతోం॥ ఝు తరికిటతకతళం తదధి।గిణతోం ఝుంతరికిట తకతళంగుతకదధిగిణతోం ॥కా॥ (అక్షరములపైనున్న బొట్లు తాళఘాతలను మఱియు నంకెలుయక్షరకాలము. నిల్వగీటు లావృత్తములను దెల్పును;)

ఈ కీర్తన కూడా పై కీర్తనవలె. క్లిష్టము.

ఈ తాళమునకు 11 క్రియలు అపురూప తాళము.

## 11. బేగడ : త్రిశ్ర : అట.

బేగడ త్ర్యశ్రజాత్యట-మూడవ కాలాక్షరములు 2 విడిచి యెత్తుబడి 2 కాలపల్లవి

ప॥ శరణు శరణు రామా । స మద దనుజ భీమా ।

అ॥ సురుచి రాస్య సోమా । సూర్యకుల లలామా ॥శ॥

౧. అమల కమల నేత్రా । యవనిజా కళత్ర ।

యమితసుగుణపాత్రా । యఘలతా ల విత్రా ॥శ॥

(2వ కాలము) పద।పమ।గిరి।ధారిత।హత।ఝణు।తధి।హిత।కిణ

గధ।మా।గరిసరి।గమ।పధ ప।సా।రి।నీ।ధప (మూడు కాలములందు తదధి

గిణత। (ఒక్క యావృత్తములో)

## 12. శుద్ధ సావేరి : సంకీర్ణ : అట.

శుద్ధసావేరి—సంకీర్ణజాత్యట ప్రథమకాలపల్లవి సమగ్రహము:

4 3

ప॥ నాతపంబిన్ని ది । నంబులకుం బండె । నారామ॥

8

అ॥ పూతనామ నవాం । బుదశ్యామ నదం । బుధి సోమ ॥నా॥

8

౧. జగత్సృష్టిస్థితి । సంహారమూల కు । జాలోల ।

6 8

నిగమాలవాలవి నిహతదనుజజాల । నృపా ఆ ॥నా॥

(1వ కాలము) రి-మ-ప-ద (2వ కాలము) ధి-న్నథా-రి-తహధ-ఝ్ఝణు(3కాలము సథపమ-రిన (4వ కాలము) తాకిట-తక ధరికిటతక-ఝ ధరికిటతక-(3వకాలము) పధపసు-రిమరిస-రిమపధ-సధపమ-తాకిట-తకధరి-కిటతక-ఝేకిట-తకధరికిటతక-ధిర్గుడు - ధిర్గుడు - ధిర్గుడు-హత్త-త్తాధిన్నత్తా-పధపమ-రిమపరిరిమపత-నధతఆ-ఆఆదఆ ఆఆదిఇ-ఇఇగిఇఇఇగిఇ-ఇఇణఅ-అఅతఅ-అఅతఅ-అఅతఅ-దఅధిఇ గిఇణఅ-తఆతద - ధిగిణత (2వ తాళావృత్తములు) (అక్షరముమీది కొట్టు తాళఘాతములను దెల్పును).

సంకీర్ణ అట తాళమునకు 22 క్రియలు.

ఈ తాళమునందు కీర్తనపాడుట అసాధ్యము.

ఈ తాళము అపురూపము.

13. బెహాగు : సంకీర్ణ జాతిధ్రువతాళము, రెండవకాలము రెండవ యక్షరముపై నెత్తుబడి

ప॥ రామచంద్రాయ తే నమోనమో నమోస్తు । రాక్షసాంత
కాయ తే నమో నమో నమోస్తు॥

అ॥ కామసుందరాయ తే నమో నమో నమోస్తు । క్ష్మాసుతాధి
పాయ తే నమో నమో నమోస్తు॥

[2కా॥] పపమగామగరిసనిసరిగమపమ [3కా] తాకిటతకథరికిటతకఝుంతరికిటతకతక ధద్ధిత్తోం [3 ముక్తాయిలు] ఝుంతరికిట ధళంగుతకదధిగిణతోం ॥రామ॥

ఈ తాళము సంకీర్ణ జాతి ధ్రువతాళము.

35 సూళాది తాళములలో అతి పెద్దది.

ఈ తాళమునకు క్రియలు 29.

ఈ తాళమున కీర్తనగాని, పల్లవిగాని పాడుట గొప్ప విద్వాంసులకే అసాధ్యము.

ఈ తాళమునందు రచనలు లేవు; పల్లవులుకూడా ఈనాడు ఎవరునూ పాడుటలేదు.

14. కేదారగౌళ—మిశ్రజాతి త్రిపుట

ప॥ జయజయశ్రీరామా రఘుకుల - జలనిధిసోమా ।

అ॥ జయజయ సంపూర్ణకామ - సద్గుణధామా ॥జయ॥

౧. జయజయ దుర్జనభీమా - జలదశ్యామా ।
జయజయజయ దైవలలామా - శాశ్వతనామా ॥జయ॥

[3కా] సనిదప - సగరిగ - రిసరిమ - పమపని - సరిమగ - రిసపరి - ససారి-నీధప పదపసాధపా-మగరిసా-రిమగన-రిపమపనిధపా-నిసరి-మగరిసా-నరిసపా - పదసపా - సరిస - సా - [4 కాలము] ఝాకిటతకదరి - కిటతక ధోంకిట ధోంతదదిగిణత ।జయ।

## 15. పూర్వకల్యాణి—చతురస్రజాతి త్రిపుట

## (5-వ కాలాక్షరములు 4 అతీతముగా నెత్తుబడి)

ప॥ దేవదేవ శ్రీరామచంద్ర వై । దేహి మానసాంభోజాతమిత్ర ।

అ। కేవలానందమయ ధర్మమూర్తి । కిల్బిషలతాలవిత్ర సుచరిత్ర ।దే।

౧. దీనబంధు కరుణామానసింధు । త్రిజగదేక వీర సత్యాధార ।
మౌనివంద్య పాద మంజునాద । మత్తదనుజతిమిరవిలయసూర ।దే।

[4కా] సానిధాపధప పాని తాకిటతగధిన్న । రీగరిగమగథా [5కా] ధిరుగుడు ధిరుగుడు ధిరుగుడు, సనిధపమగరిస [3 ముక్తాయిలు] ఝంతరికిట తకతళంగు కతదధి గిణతోం దే॥

## 16. దేవమనోహరి—మిశ్రజాత్యటతాళము

## తొమ్మిదింట విశ్రమము

ప॥ సని ధని పధా నీ స నీ ధా నీ । పామారి మారి సరి మపాధనిసాని । శ్రీరామ
చంద్రా దయాసాంద్రా । సీతామనః కమల దినేంద్ర యతీంద్ర ।

అ॥ సారి నీరి నీధ నీప మా పామప । థాని పధా పామపధానీసరీని॥సా
మేరుధీర కోటిమన్మథాకాతియ । మేయదయా పూర త్రిలోకైకవీర శ్రీ॥

౧. రీమపాధనీసా నిపధా నీప । ధామమరీస రీమపాధని సాని । శ్యామవర్ణసర్వాంతర్బహిః పూర్ణ । సద్గుణధామ దుష్టరాక్షసభీమ । ధాని పాధ పామ పాధానిసరిన । నీధనీ పమరిసరి మపాధనిసరిన్ని స॥ సామ వేదలోల నిశ్రేయసమూల । సంహృత దురిత పరమపావన చరిత దే॥

ఈ కీర్తనకు స్వరము సాహిత్యములు శ్రీ దాసుగారే రచించిరి. ఈ స్వరము నాధారముగా ఈ కీర్తనను సాధించుట సులభము.

ఈ పై కీర్తనలయందు సాహిత్యము సంగీతమునకు అనువుగా నున్నది. తాళములు, జతులు కష్టముగా నుండుటచే వాటిని వదలిపెట్టి

చిన్న తాళములలో ఈ కీర్తనలను అమర్చి సంగీత సభలలో ప్రచారము చేయుట కనువుగా నున్నవి

ఇట్టి హృద్యమైన రాగములలో, సరస సాహిత్యముతో అనేక కీర్తనలు కలవు. వాటిని పరిశీలించి సంగీత విద్వాంసులు పునరుద్ధరించుట చాల వాంఛనీయము.

ఇంకా కొన్ని రాగములయందు కేవల సంగీత రచనలు :—

1. రామారఘుకుల వార్నిధిసోమా భైరవి : ఆది.
(చూడు య. రా. పుట 191)

2. రామారామా మోహన : చతురస్ర ఏక.
(చూ- య. రా. పుట 196)

3. సీతారామా— హైమవతి : ఆది
(చూ- య. రా. పుట 220)

4. శరణు శరణు శరణురామ తోడి : (రూపకం) త్రిస్రగతి
(చూ- య. రా. పుట 229)

5. జయజయజయ రామచంద్ర సద్గుణ బేహాగ్ : ఆది.
(చూ- య. రా. పుట 251)

## మంగళములు కీర్తనలు

1) రాజీవాక్ష దశరథపుత్ర శ్రీరామ మంగళంబు, సురట : త్రిపుట.

2) శ్రీ రఘుకుల వర్ధనులై విరాజిలు సీతారాములకు
మంగళంబు. సురట : త్రిపుట.

3) రాతినాతిగజేయు రాముపాదముల విరాజిలు
పాదుకలకు మంగళంబు. సురట : త్రిపుట.

4) జయము నీకోరామ జలధరశ్యామ సురట : ఝంప.
5) మాయా మానుష విగ్రహ మంగళము సురట : త్రిపుట.
6) మంగళంబు సీతారామచంద్రులకు సురట : త్రిపుట.

ఈ మంగళంబులు శ్రీ దాసుగారు తన యథార్థరామాయణ మున ప్రతి అధ్యాయము చివర రచించిరి.

అన్ని కీర్తనలను సురటరాగమునందే రచించిరి.

"ఆది నాట : అంత్య సురట" అను శాస్త్రోక్తి ననుసరించి శ్రీవారు అట్లు వ్రాసిరి.

సురటరాగము శుభప్రదము. మంగళకరము. గానసభల చివర ఈ రాగము పాడినచో, అంతకుముందు గానసభలో పాడిన రాగముల యందు ఏవైన దోషములున్నచో చివర ఈ రాగము పాడిన ఆ దోషములను హరించు శక్తి గలిగినది ఈ సురటి రాగము. అట్టిదే త్రిస్రజాతి త్రిపుటతాళము (మిశ్రగతి) కూడ. తాళములలో మొట్ట మొదటిది, పురాతనమైనది, శుభప్రదమైనది, ప్రసిద్ధమైన ఆదితాళము కూడ చతురస్రజాతి త్రిపుటయే.

ఈ రాగతాళములయందు మంగళములను రచించుటలో శ్రీ దాసుగారి సందర్భశుద్ధి వ్యక్తమగుచున్నది.

ఈ మంగళప్రదకీర్తనలనుకూడా సంగీతజ్ఞులు ప్రచారములోనికి తీసుకొనివచ్చు ఆవశ్యకత ఎంతయూ కద్దు. ప్రస్తుతము మంగళ కీర్తనలు ఒకటో రెండో శ్రీ త్యాగయ్యవారి రచనలు మాత్రము సంగీతజ్ఞులు పాడుచున్నారు.

## శ్రీ జానకీ శపథము

శ్రీ దాసుగారు రచించిన శ్రీ జానకీశపథము బహుళ ప్రసిద్ధి గాంచింది. ఈ హరికథాగానకావ్యమునందు గలకీర్తనలు సంగీతదృష్ట్యా చాలా అపూర్వమైనవి.

కొన్ని కీర్తనలు సంగీతసభలలో పాడి ప్రచారంలోకి తీసుకు రావటానికి గల యోగ్యత కలిగి ఉన్నాయి.

ఈ కథాగాన కావ్యమునందుగల కీర్తనలలో కొన్ని మేళకర్తల లోనూ, కొన్ని అపూర్వరాగములలోనూ, కొన్ని మధ్యమకాల సాహిత్యాంగములు కలిగి, కొన్ని స్వరసాహిత్యములు కలిగి ఉన్నాయి. కొన్ని కీర్తనలు కేవలసంగీత రచనలు (concert forms) గా ప్రకాశిస్తున్నాయి.

మేళకర్తలు :

1. హరికాంభోజి : ఆది (చతురస్రగతి) ఈకృతి (concert form)

ప॥ హరిహరిహరిహరిహరి యను మనసా.

2. కనకాంగి : త్రి॥ త్రిపుట. ఈ కృతి (concert form)

ప॥ హరి భజన సేయుదము మిత్రులారా.

ఈ కీర్తన స్వరసాహిత్యములతో కూడియున్నది. ఇంకను, వనస్పతి, నాగానందిని, ఝంకారధ్వని, రాగవర్ధని, ధవళాంబరి, నీతిమతి, సుచరిత్ర, నవనీత, కోసలము, ఝాలవరాళి, గవాంబోధి, మారరంజని, శూలిని, రఘుప్రియ, సాలగము, ధాతువర్ధిని, పావని, రసికప్రియ, విశ్వంభరి, వరుణప్రియ, యాగప్రియ, సేనావతి, దివ్యమణి, జ్యోతి స్వరూపిణి, కాంతామణి,నాసికాభూషణి, గాంగేయభూషణి, చిత్రాంబరి, తానరూపి, మానవతి, రూపవతి మొదలైన మేళకర్తలలో, స్వర సాహిత్యములతో కీర్తనలు కలవు.

అపూర్వరాగాలు :

కలగడ, మంజుల, నాధనాళి, ఘంటారవము, సామవరాళి, లహంస, మేఘరంజి, (మేఘరంజిరాగం స్వరాంతరం. ఈ రాగము

నందు అయిదు స్వరములు కలవు. దీనిని జీవనరాగమందురు. చాలా అపురూపరాగం.) షవాని, ప్రతాపవరాళి, గౌడమల్లారు, నాగస్వరావళి, కామోద, భోగవసంతం, దేశాక్షి, శారదాభరణం మొదలైన అపూర్వరాగాల్లో కీర్తనలు కలవు. ఈ రాగములలో చాలాభాగం ఈనాటి సంగీతవిద్వాంసులకు కూడా తెలియవు. ప్రస్తుతకాలంలో ఈ రాగాలు వాడుకలో లేవు.

ఈ కీర్తనలలో ఎక్కువభాగము మధ్యమకాలము లేక మిశ్రము అను అంగము కలది.

మధ్యమకాలము అను ఈ ఆభరణాంగము మొదట ప్రారంభించిన వాగ్గేయకారుడు శ్రీ ముద్దుస్వామిదీక్షితార్.

సంగీతరచనకు ముఖ్యముగా పల్లవి, చరణము అను రెండు ముఖ్య భాగములుండును.

పల్లవి, చరణము, (చరణము ఒకటిగాని ఎక్కువగాని) ఉండిన ఆ సంగీత రచనను 'కీర్తన' అనుచున్నారు.

సంగీతరచనకు అసలు ప్రబంధము అని పేరు. ప్రబంధమునకు నాలుగు ధాతువులు లేక (భాగములు) కలవు. అవి :-1) ఉద్గ్రాహము, 2) ధృవము 3) మేళాపకము 4) అభోగము. ఈ భాగములే ఇప్పుడు కూడా వాడుకలో ఉన్నను పేర్లు మాత్రము మార్పుచెందినవి.

1. ఉద్గ్రాహమునకు పల్లవి అను పేరు.

2. ధృవమునకు చరణము అను పేరు.

3. మేళాపకమునకు అనుపల్లవి అను పేరు.

4. అభోగము : మధ్యమకాలము.

ఈ నాల్గు సంగీతరచనలను ఈ పై ధాతువులను అన్వయించినచో

ఉద్గ్రాహము = పల్లవి } ఇవి అన్ని సంగీతరచనలకు ముఖ్యాంగము
ధృవము = చరణం } ములు, "కీర్తన"

మేళాపకము = అనుపల్లవి

ఈ పై రెండు ముఖ్యాంగములను ఈ అనుపల్లవిని చేర్చినచో కీర్తన కృతిగా రూపొందును.

అభోగము = మధ్యమకాలసాహిత్యము. ఈఅంగము అప్రధానమైనను అలంకారప్రాయమైన అంగముగా వ్యవహరింపబడుచున్నది.

(శ్రీ) దాసుగారి హరికథాగాన కావ్యములందుగల కీర్తనలలో ఈ అభోగము అను ధాతువు (లేక అంగము) గలవి అనేకములుగా నున్నవి.

కృతియందు ఈ భాగము రక్తికి దోహదముచేయును. రసమును ఉత్తేజపరచును, ఉత్సాహజనకముగా నుండును. శ్రోతలను నిద్రనుండి మేల్కొల్పి కేంద్రీకృత మనస్కులుగా చేయును.

జానకీశపథమున గల కీర్తనలకు అన్నిటికీ స్వరసాహిత్యములు కలవుగాన సంగీతజ్ఞులు వీటిలో సభాగ్గానమునకు పనికివచ్చు కృతులను సులభముగా సాధన చేయవచ్చును.

కేవల సంగీత రచనలు (Pure art forms or concert forms)

1. హుసేని చతురస్రగతి (ఆది)

ప॥ రణధీరా కపివీరా.........

ఈ కీర్తన "రఘువీర రణధీర" అను త్యాగరాజస్వామివారి కీర్తనవలె నున్నది.

హనుమంతునిమీద కృతులు ఎక్కువగా వినబడుటలేదు గాన ఈ కీర్తనను సంగీతజ్ఞులు సాధనచేసినచో అపూర్వముగా నుండును.

2. మంజుల : ఖండగతి (ఝంప)
అంబ శరణించు త్వరగా నను నో శారదాంబా॥

3. శుద్ధసావేరి : ఆది.
ప॥ మానసమా నీవు మరవకే శ్రీహరి ధ్యానము ॥

4. నాధనాళి : ఆది.
హరిభక్తిలేని బ్రతుకెందుకే ....

5. కనగాంగి : త్రిపుట
ప॥ హరిభజన సేయుదము మిత్రులారా ...

6. ఘంటారవము : త్ర్యస్రగతి.
ప॥ హరినీ గొలుచుకొండీ ........

7. శూలిని : రూపకం.
ప॥ జయజయ కరుణాంతరంగ । జయజయ శివలింగ॥

ఈ కీర్తన శ్రీరామచంద్రుడు శూలిని నుతిచేసిన సందర్భమున్న రచింపబడి హృద్యముగానున్నది. శూలిని రాగమునందు ఈ కీర్తన వ్రాయుట యొక్క ఔచిత్యము.

8. సాలగము : రూపకము.
ప॥ కోమల మేఘశ్యామా, రామా ఎట్లు తాళ్ళుదురా.

9. మంగళకీర్తన :- రూపపతిః మిశ్రగతి (త్రి॥ త్రిపుట)
ప॥ ఆంజనేయ భంజితాసుర సముదాయ
మంగళంబు నీకు మంగళంబు॥ ...

# సావిత్రీ చరిత్రం

శ్రీ దాసుగారిచే రచింపబడిన హరికథాగాన కావ్యములలో "సావిత్రి చరిత్రము" అందలి సంగీత విషయముదృష్ట్యా ముఖ్యమైనది.

ఈ కావ్యమున వాడిన రాగములు రక్తిరాగములు ప్రసిద్ధ రాగములు. అట్లే తాళములుకూడా వాడుకలోనున్న తాళములనే శ్రీ దాసుగారు వాడిరి.

ఇందు శ్రీ దాసుగారు, ప్రతి కీర్తనలోనూ ఆ రాగముద్రను వాడిరి.

'ముద్ర' అనగా కీర్తన చివరిభాగమున రచయిత పేరుగాని, రచయిత ఇష్టదైవనామముగాని, చొప్పించి రచయితను తరువాత తరము వారు గుర్తుచేసుకొనుటకు వీలుగానుండునట్లు రచించుట. అటులనే రాగముద్రకూడా : ఏ రాగమున ఒకకీర్తన రచింపబడునో ఆ రాగము యొక్క పేరును ఆ కీర్తన సాహిత్యమునందు చివరిభాగమున రచియించుట. దీనివలన ఉపయోగమేమనగా కీర్తన పైభాగమున కీర్తనకు నిర్దేశింపబడిన రాగముపేరు ఏ కారణముచేతనైన ముద్రింపబడకపోయిననూ లేదా ముద్రణలో ఇంకొక రాగముపేరు పొరపాటుగా ముద్రించినను అది పొరపాటు అను విషయము కీర్తన సాహిత్యము ఒకసారి చదివినచో ఆ కీర్తనను రచయితచేనిర్దేశింపబడిన రాగము తెలియును.

ఈ ముద్రల సంప్రదాయం ప్రాచీన కాలమునుంచీ మనకు వస్తోంది.

శ్రీ అన్నమాచార్యులు తన కీర్తనలలో 'శ్రీ వేంకటేశ' అను ముద్రను ఉంచుకొనెను.

శ్రీ గోపన్న 'భద్రాచల రామదాసనుత' అని వ్రాసుకొనెను.

శ్రీ జయదేవుడు తన నామమునే "జయదేవ" అని రచించెను.

అట్లే,

| | |
|---|---|
| శ్రీ నారాయణ తీర్థులు | నారాయణతీర్థ |
| శ్రీ త్యాగరాజు | త్యాగరాజనుత |
| శ్రీ దీక్షితర్ | గురుగుహ |
| శ్రీ శ్యామశాస్త్రి | శ్యామకృష్ణ. |

అను ముద్రలను వారి కీర్తనలలో వ్రాసుకొనిరి.

శ్రీ నారాయణదాసుగారు కూడా తనరచనలలో "నారాయణ దాస పోషక" అని వ్రాసుకొనిరి.

సావిత్రీ చరిత్రమునందు చివర మంగళమునందు "మముగన్నతల్లి యీశ్వరి" అను సురట ఏకతాళము కీర్తనలో "నారాయణదాస పాలినీ అనంత సుగుణశాలినీ" అని వ్రాసుకొనిరి. ఇట్లే ఇంకనూ వారి స్వనామ ముద్రతో కొన్ని కీర్తనలు కలవు.

సావిత్రీ చరిత్రమునందుగల కీర్తనలన్నింటియందును రాగముద్ర కలదు. కొన్ని దిగువ నుదాహరింపబడినవి.

1. భైరవి : చతురస్రగతి.

ప॥ నన్ను బ్రోవుమమ్మా ... ... ...

చ॥ ఇప్పుడే ... ... ... జపాసుమాభపాణి భైరవి ॥నన్ను॥

2. హంసధ్వని : ఆది.

ప॥ కనికరమున నను గను గణపతి ... ... ...

చ॥ ఇలలో ... ... ... పరమ హంసధ్వని ॥కనికరమున॥

3. కన్నడ : మిశ్రగతి.

ప॥ అంబ జోహారే ... ... ...

చ॥ నిన్ను వినా దిక్కెవరే ... ... ... మేలకన్నడ.

సావిత్రీ చరిత్రమునందు కూడా కేవల సంగీతరచనలు Concert forms చాల కలవు.

పై నుదాహరించిన మూడుకీర్తనలు సంగీతజ్ఞులు గానసభలలో పాడుటకు అనువైనవే. ఇట్లే ఇంకను కొన్ని కలవు.

అంత్యప్రాస

సంగీత రచనకు అంత్యప్రాస చాల సొగసుగ నుండును. శ్రీ దాసుగారు ఇంచుమించు అన్ని కీర్తనలలోనూ అంత్యప్రాసలను వాడేరు.

యథార్థరామాయణం :— (పేజి 47)

1. యమునాకళ్యాణి త్రిస్రగతి.

| | | |
|---|---|---|
| కొమ్మా | ... ... ... | బంగారుబొమ్మా, |
| చూపా | ... ... ... | తూపా. |
| చేపా | ... ... ... | మాపా. |
| కురులా | ... ... ... | నురులా. |
| భ్రమరులా | ... ... ... | కింకరులా. |

2. మంజరి (పేజి 51)

| | | |
|---|---|---|
| అని పలిష్ఠుడున్ | ... ... ... | గతము |
| వినిచి | ... ... ... | కృతము |
| క్షితీశ | ... ... ... | వినుమ |
| యతుల | ... ... ... | బనుమ |
| అనవిని | ... ... ... | తోడ |
| నెలము | ... ... ... | జేడ |

కొండతలక్రింద ... .... ఏను
తంత్రీ ....... ... బోను.

శ్రీ దాసుగారు 'మంజరి' అను ఒకవిధమైన సంగీతరచనను కథాగమనమును వర్ణించు సందర్భములలో రచించిరి. ఈ 'మంజరి' కి లయ, తాళము నిర్దేశింపబడియుండును. ఏ రాగమునందైనను పాడు కొనవచ్చును. శ్రీ దాసుగారు ఈ మంజరులకు రాగమును కూడా నిర్దేశించియున్నారు. కాని ప్రతి రాగమునందు వారివారి సౌలభ్యము ప్రకారము రాగములను ఏర్పరచుకొని పాడుకొనవచ్చును. 'మంజరి'లో అక్షరములు సర్వలఘువులుగా నుండును. తాళాక్షరములు ఎన్నికలవో అన్ని సాహిత్యాక్షరములు కూడా ఉండును. అందుచే ఇది సంగీతరచన కేవలముగా కానేరదు.

శ్రీ దాసుగారు తన మంజరులలో అంత్యప్రాసల్లను రచించిరి. ఇవిగాక కీర్తనలో కూడా అక్కడక్కడ అంత్యప్రాసలను వాడిరి.

శ్రీ తులసీదాసు తన 'రామచరితమానస' అను రామాయణము నందు అన్ని కీర్తనలకు అంత్యప్రాసలను వాడిరి.

ఉదా :- శ్రీరామచంద్ర కృపాళుభజమన ......దారుణం
నవకంజ-లోచన. కంజముఖకర కంజ పదకంజ (జా) అరుణం.

కందర్ప అగణిత ... ... ... సుందరం,
పటుపీత ... ... ... సుతావరం.
ఇతివదతి తులసీదాస ... ... ... రంజనం,
మమహృదయ ... ... ... భంజనం.

శ్రీ హనుమాన్ చాలీసా అంతటా అంత్యప్రాసయే కలదు.

అంత్యప్రాస సంగీత రచనకు, ముఖ్యంగా భగవంతుని కీర్తించే కీర్తనలో ఎంతో సౌందర్యంగా భక్తిరస ప్రధానంగా ఉంటుంది.

# మార్కండేయ చరిత్ర

శ్రీ దాసుగారి మార్కండేయ చరిత్రలో శ్రీ శంకరుని కీర్తించుచు వ్రాసిన కీర్తనలు సంగీత విద్వాంసులు పాడదగినవి. కేవల సంగీత రచనల, లక్షణములన్నియూ సంపూర్ణముగ ఈ కృతులకు కలవు.

1. శుభపంథవరాళి ఏకతాళము.

ప॥ సుజనావనమోదా సర్వజగన్నాథా గానవినోద

అ॥ విజితఘోరకలుష విశ్వమోహన - అజేంద్రామరముని వినుతపాద ॥సు॥

౧. అనవరత దయాబ్ధితీర్థపాదా - యఖిలలోకరూప వేదనాథా

జనన మరణరహిత సాధ్వభయదా - శాశ్వతైశ్వర్య సదాభేద ॥సు॥

ఈ చరణము మధ్యమకాలములునున్నను, సమకాలములో (అనగా క్రియకు రెండక్షరముల) లో కూడా మొదట పాడి ఆతరువాత మధ్యమ కాలమున పాడినచో రక్తి ఇనుమడించును.

నిథమ గరిధ మగరిమగరి గరిరిస - ధా - ధా - సరిగ మా మా గరిస ధిర్ గుడుతధై య్యత్థోం తరిధోం జగణతణగకిణ ధిర్గుడు ధిర్గుడు ధిర్గుడు తధై య్యత్తాహ్ త్తాధిర్ గుడుతా ధిర్గుడు తధిన్నాహం తాదధిగిణత । తాదధిగిణత - తాదధిరిణత ॥సు॥

ఈ పై నుదాహరించిన సోల్కట్టుస్వరము (స్వరము, జతి) చరణము తరువాత మొదటి కాలములోనూ, రెండవకాలములోనూ కూడా పాడిన కృతిసౌందర్యము ద్విగుణీకృతమై హృద్యముగ నుండును.

మార్కండేయచరిత్రయందు దాసుగారు కొన్ని సంగీత రచనా చమత్కారములను సల్పిరి.

1. ఖరహరప్రియ ఆదితాళమున

ప॥ ఆలోచింపగ దరమా మన

భూలోకంబున - బోడము చోద్యములల ॥నా॥

అ॥ కాలుని వింతల - గలిగిన వంతల । దూలిన జంతుల-తోరపు చింతల ॥నా॥

౧. కాలము గలదా మనకు వశంబయి - జాలమేల మన - జన్మకు సార్థక ॥మా॥

౨. తెలియని కారణ - ముల గలిగెడు ధన। ముల సుఖదుఃఖం - బుల
నీ తనువుల ॥వా॥

3. పుట్టుట నెగడుట - బోవుట సమమగు। నట్టి జనంబుల-యందలి భేదము ॥రా॥

అను కీర్తనయందు ఛేకానుప్రాసము, వృత్త్యను ప్రాసమును రచించిరి.

స్వరాక్షరములు

భైరవిరాగము ఆదితాళము నందు

"ప॥ కలియుగమా తెలియుడి మీమది" అను కీర్తన స్వరసాహిత్యములతో వ్రాయుచు అందు స్వరాక్షరములను పొందుపరచిరి. అందునను స్వరాక్షర దీర్ఘములలో భేదమును చూపి క్రమముగా దీర్ఘములను తగ్గించుచు గోపుచ్ఛయతిని స్ఫురింపచేసిరి.

1-వ చరణం

6
పా ;; దనిదప దమపద మద
పా .. మరులధికధనులయిరి

6
పా ;; దమదప మదపదనిద
పా వనగుణము లగుపడవు

6
పా ;; మగరి గమపద మపద
పా పకృతములకు వెరువరు

3
పా, మగరి గమ
పా లిత మతము

3
పా, దప దమద
పా లక విధము

3
పా, నిసరిగమ
పా శమము గొలువు

3
పా, గరిసనిద
పా లె చెడినది

2 పాదప మదపమ
పాలిశుల పలుకు

2 పా నిద పనమద
పాటిగొనినయది

2 పా మగరి గమద
పారుల తెరగులు

2 పానిద
పాడరి

2 పాదమ
పాతక

2 పామమ
పా నమ

2 పామగరిస
పారమయిన

ఇటులనే రెండవ చరణమున మధ్యమమును స్వరాక్షరముగాచేసి గోపుచ్ఛయతి ధర్మమున క్రమముగా మధ్యమ దీర్ఘమును తగ్గించుచు వచ్చి పల్లవికి చేరినది.

స్వరాక్షరమనగా స్వరముయొక్క అక్షరము సాహిత్యాక్షరము ఒకటే అయియుండునట్లు రచనను చేయుట.

ఉదా :- మా గరిస నిదని స రి గ మా
మా నవులు విబుధు ల రు గు మా
పదమా ద మ ద మా ని ద మా
నారా॥దాసు నిజమా సు మ ద మా ద య మా
ని స మా
న వ మా etc., etc.

త్యాగరాజు అమృత వర్షిణి : ఆది.

పదనీదామా పా ద మా

(శ్రీ)...రామా పా ద మా

త్యాగరాజు చిత్తరంజని ఆది.

నాదతనుమనిశం శంకరం అనుకీర్తనలో

నిగ మా దమ సామ

నిగ మో త్తమ సామ వేదసారం.

మహా వైద్య నాథయ్యర్ } పదపా గమ పనినిదా నీ నిదా పగమాప
పదపంకజ పని నిదానించి దాపగ చేసి.

సంగీత రచనకు స్వరాక్షర సమన్వయ రచనావిధానము ఒక అలంకారము. పూర్వప్రసిద్ధ వాగ్గేయకారులు కొందరు ఈ స్వరాక్షరములు రచించిరి. వారి శ్రేణిలోనే (శ్రీ) దాసుగారు కూడా స్వరాక్షరములను రచించుట మిక్కిలి ముదావహము.

మార్కండేయ చరిత్రయందు మంగళాచరణ కీర్తన (శ్రీ) శంకరుని గూర్చి ఎంతో హృద్యముగనున్నది.

సురట : మిశ్రగతి (త్రి॥ త్రిపుట).

ప॥ కాలభీషణ శ్రిత - జాలపోషణ యీశ మంగళమ్మునీకు ॥

అ॥ బాలచంద్రభూష - భవవార్నిధిశోష మంగళమ్మునీకు ॥

౧. సకలలోకాధార - సద్భక్తమందార మంగళమ్ము ॥

ప్రకటమృత్యునాశ - పార్వతీహృదయేశ మంగళమునీకు ॥

మార్కండేయ చరిత్రయందు కేవల సంగీత రచనాలక్షణములు కలిగిన కొన్ని కీర్తనలు.

1. కేదార : రూపకం.

ప॥ శంకర శ్రితాఘ నాశంకర ప్రభో హరహర.

ఈ కీర్తన ప్రసిద్ధమైనది.

కేదార రాగమునందు శంకరుని కీర్తించు ఈ కీర్తన రచించుట విశిష్టముగానున్నది. కేదార రాగము కేదార దేశమున ఉద్భవించి కేదారేశ్వరుడగు శంకరునికి ప్రియమైన రాగము.

ఇది ఘనరాగము. ఉదాత్తమై, పాండితీ ప్రతిభను వెల్లడి చేయును. ఈ రాగము శంకరాభరణ జన్యమగుట కూడ విశేషము.

2. కేదారగౌళ : ఆది.

ప॥ మాంపాహి కృపానిధే శివ శివ శంకర.

3. సారంగ : ఆది.

ప॥ శంభో హర హర గిరీశ భవ-జంభారి వినుత పదకమల శివ॥

4. గౌళ : రూపకం.

ప॥ దేవదేవ నీలకంఠ దివిరక్షకా నను గావరా మహేశా ॥

5. భూపాల : రూపకము.

ప॥ నిఖిలాశ్రిత సుఖదాయక - నీరాజనమిదో నీ
కఖిలామర మునినాయక - యగరుధూపమిదోనీకు - శంభూహరహర ॥ని॥

౧. సతతదీనమందార - చందనంబిదోనీకు । వ్రితఫల సంధాన
శాలి - వస్త్రయుగ్మమిదో నీకు ॥ని॥

౨. భోగిభూషణపతి - కర్పూరదీపమిదిగో నీకు । నాగచర్మ
ఖానురాంగ నైవేద్యమిదోనీకు - శంభూ హరహర ॥ని॥

3. దారుణ దారిద్ర్యహరణ - తాంబూలంబిదో నీకు । పార
రహిత కరుణాబ్ధి - ప్రదక్షిణమిదో నీకు ॥ని॥

ఈ కీర్తనయందు, శ్రీ శంకరునికి షోడశోపచారములు వర్ణింప బడినవి.

6. అఠాణా : ఆదితాళము.

ప॥ కరుణాబ్ధే ఘోర భవ కలుష హరణా,

7. వరాళి : రూపకము.

ప॥ శరణు శరణు నీకు బాలచంద్ర భూషణా.

8. ఉదయ రవిచంద్రిక: చతురస్రగతి.

ప॥ దేవదేవ నీ మహిమము తెలియ నెంతవాడరా

## భీష్మ చరిత్ర

శ్రీ దాసుగారు భీష్మచరిత్ర యను తను రచించిన హరికథాగాన కావ్యమున ప్రసిద్ధ రక్తిరాగములలో వాడుకలోనుండు సులభతాళము లలో కీర్తనలను వ్రాసిరి. ఈ కీర్తనలలో కొన్ని కథా కథన సందర్భ మున వ్రాసిరి. కొన్ని దైవప్రార్థనలు,Conert formsఅనగా కేవల సంగీతరచనలుంగ, విడి విడిగా కూడా పాడుకొనుటకు అనువైనవిగా నున్నవి.

1. ఖమాచి : (అట) తిస్ర త్రిపుట.

ప॥ నీలశైల విహారా జగన్నాథ.

2. కర్ణాటక గౌళ : రూపకము.

ప॥ గణపతి నిను వినుతు సేతు గజముఖ దేవ.

3. యమన్ : చతురస్ర (ఆది)

ప॥ సరస్వతీ నీవదా శ్రితుడ నను సదా కాపాడవే.

4. నాటకురంజి : త్రిపుట.

ప॥ కొలిచెదను మది బుండరీకాక్షుని.

5. కుంతలవరాళి : సంకీర్ణ గతి.

ప॥ శరణు హృషీకేశ వరద నారాయణ.

6. శుద్ధ సావేరి : ఆది.

ప॥ శివనారాయణ కృష్ణముకుందా.

7. పున్నాగవరాళి : మిశ్ర, (త్రిపుట).

ప॥ కృష్ణా యాపదుద్ధారకా దేవ !

అ॥ ప॥ ... ... ...

చ॥ 2॥ శౌరీ ... ...

నారాయణదాసరక్షకా నలిన నాభ పాతక విమోచక!

స్వనామముద్ర దాసుగారు ఇందు వాడిరి.

మంగళం. సురట : త్రిస్రగతి - (రూపకం).

ప॥ వాసుదేవ నీలాచలవాసా మంగళంబునీకు.

అ॥ శ్రీ సతీవిలోలా ... ... ...

చ॥ 1) ... ... ...

చ॥ 2) చారు బుద్ధావతార ...

నారాయణదాసపోష = నాథా మంగళంబు నీకు!

ఇందు కూడా స్వనామముద్ర కలదు.

తెనుగు పద సాహిత్యమున వెలుగునకు వచ్చిన మంగళాచరణ కీర్తనలు బహుస్వల్పముగ నున్న కారణమున శ్రీ దాసుగారి మంగళ కీర్తనలను వాటి శోభను గుర్తించి బహుళప్రచారముచేయు నావశ్యకత ఎంతైన కలదు.

## హరిశ్చంద్రోపాఖ్యానము

శ్రీదాసుగారి హరిశ్చంద్రోపాఖ్యానమున గల కొన్ని గాన రచనలు సంగీత కళాత్మక రచనలుగా ఇప్పటికే ప్రసిద్ధిగాంచినవి. ముందు తరమువారికి ఈ రచనలను అందించు బాధ్యత సంప్రదాయజ్ఞులు, సంగీతజ్ఞులు, విషయ పరిగ్రహణాసక్తులైన కళాపోషకులపై బహుధా కలదు.

హరిశ్చంద్రోపాఖ్యానముగల సభాగాన రచనలను కొన్నిటి నీ దిగువ నుదాహరించెదను.

1. శహాన : ఆది.

ప॥ నను ప్రోవరా ప్రోవరా ప్రోవరా...

ఈ కీర్తన భక్తి, కరుణరసాన్వితమై వినుటకు చాల ఇంపుగ నుండును. కరుణరసప్రధానమైన హరిశ్చంద్రునికథ కరుణరసాన్వితమైన శహానరాగముతో ప్రారంభించుట శ్రీ దాసుగారి సమయస్ఫూర్తికి వైదుష్యమునకు తార్కాణము.

2. కాంభోజి : ఆది.

ప॥ వినుతిసేతురానిను । విఘ్ననాయక.

3. మంగళం

హంసధ్వని : త్రిశ్రగతి.

ప॥ మంగళంబురా శ్రిత సంగ శుభకరా.

అ॥

చ॥ 1)

చ॥ 2) మారకోటి ... ...

నారాయణదాసావన : నాగాధిపశయనా॥ మంగళం.

## ప్రహ్లాద చరిత్రము

శ్రీ దాసుగారు 'ప్రహ్లాదచరిత్ర' అనే హరికథాగాన కావ్యమున కొద్దిగా సంగీత రచనలు కలవు. ఇవి రక్తిరాగములలో వాడుకలో ఉన్న తాళములలోనే కలవు.

వాటిని ఇచ్చట పొందుపరచెదను.

1. శుద్ధసావేరి : మిశ్రగతి (త్రిపుట).

ప॥ అరసవిల్లి సూర్యనారాయణా-

ఇది సూర్యదేవుని స్తోత్రము :

సూర్యదేవునిమీాద శ్రీ దీక్షితర్ తన నవగ్రహ కీర్తనలో మొట్టమొదటిదిగా "సూర్యమూర్తే నమోస్తుతే" అని సంస్కృతమున సౌరాష్ట్రరాగమునందు ధ్రువతాళమున రచించిరి. తెనుగునందు సూర్యదేవునిమీాద శ్రీ దాసుగారి ఈ కీర్తన వినా ఇక కీర్తనలు లేవు.

ఈ కీర్తన చరణము చివరి స్వనామముద్ర శ్రీ దాసుగారు రచించిరి.

2. కాంభోజి : చతురస్రగతి (ఆది)

ప॥ గణనాయకా విఘ్నము సేయకురా ।

3. వసంత : చతురస్రగతి (ఆది)

ప॥ ప్రోవుమా నల్వారాణి ...

ఈ కీర్తన యందుకూడా శ్రీ నారాయణదాస ముద్రగలదు.

4. ధర్మవతి : రూపకము.

కలదు.

ప॥ హరిని విడిచి నాదుచిత్త మన్యుల చేరుటెటుల.

5. శ్రీరాగము : చతురస్రగతి (ఆది)

ప॥ హరిని భజింతము అన్యంబు త్యజింతము.

6. గమకక్రియ : రూపకం.

ప॥ దేవ సంశ్రితావనా బ్రోవు పతిత పావనా.

7. కేదార : రూపకం.

ప॥ నను శోధించగ నేలర నారాయణ జగదీశ్వరా ।

8. మంగళం :

సురట : ఖండగతి (ఝంప)

ప॥ మంగళము సూర్య జయమంగళ మవార్యా-

అ॥ మంగళము నీకు సురమానితౌదార్య-

మీ॥ సంగీతవిలోల - సకలజగత్పాలా - సంగతబుతవర్మా - శా
శ్వత పరమాత్మా ॥మం॥

౦. భూరిలోకదీప ప్రతిమూర్తిస్వరూప-ఘోరభవతాప మణిమండల
కలాపా - పారారసపల్లి సంక్రాంత నివాసా - నారాయణదాసా
వంద కరవిలాసా ॥మం॥

శ్రీ సూర్యదేవునిమీద మంగళముకూడ ఇది తక్క ఎక్కడనూ కానరాదు.

ఇందు నారాయణదాస స్వనామముద్ర చరణము చివర కలదు.

## 'రుక్మిణీ కళ్యాణం'

ఇందలి కేవల సంగీత రచనలుగా విరాజిల్లు పాటపము లక్షణములు కలిగిన కొన్ని కీర్తనలు :-

కళ్యాణి : రూపకం.

1. ప॥ రామునిన్ భజించు మనసా.

2. కళ్యాణి : రూపకం.

ప॥ రఘురామ రణభీమ – తారా నాశభయమీర.

ఇందు చరణమున నారాయణదాస స్వనామముద్ర కలదు.

3. శ్రీరాగము ; రూపకము.

ప॥ శ్రీజానకి మము గావుమ - చింతదీర్చు మాయమ ॥శ్రీజా॥

అ॥ నీజాడన్ త్రైలోక్యపూత నీతియగ్ని సాక్ష్యమయ్యె ॥శ్రీజా॥

మి॥ భూజవు పుణ్యచరిత్రవు - నోజన జగములతల్లివి ॥శ్రీజా॥
మాజయములకై నీవిభు - మనసు మరులుకొల్పుమమ్మా ॥శ్రీజా॥

1. ముల్లోకంబుల తల్లి - పిల్లవుగా జనకునకు
నెల్లి నేడు బెరిగి త్రిజగ - దేకవీరుడైన రాము
ని ల్లాలవు మాకెల్లరి - కిలువేల్పువు నీ పెనిమిటి
యుల్లము మముగాపాడగ - నొప్పించు మిటరప్పించుము ॥శ్రీజా॥

శ్రీ జానకిపై కీర్తన వ్రాసిన పూర్వ ప్రసిద్ధ వాగ్గేయకారులు ఎవ్వరులేరు. ఈ కీర్తన శ్రీ జానకిపై ఏకైక కీర్తన. "మాజానకి చెట్ట బట్టగా మహారాజువైతివి" అను కీర్తనలో త్యాగయ్యవారు శ్రీరాముని నిందాస్తుతి చేసిరి. "సీతమ్మ మాయమ్మ శ్రీరాముడు మాకు తండ్రి" అను వసంతరాగ కీర్తనలో శ్రీ త్యాగయ్య శ్రీరాముని కుటుంబముతో తనకు గల సాన్నిహిత్యమును తెలుపుకొనెను గాని కేవలము "శ్రీ జానకి మముగావుము" అనే ధోరణిలో సూటిగా కీర్తన ఇది తప్ప ఇంకొకటిలేదు. జానకియే శ్రీ అగుటచే ఈ కీర్తన శ్రీరాగమున రచించుట గమనింప తగినది.

4. కేదారగౌళ : రూపకము.

ప॥ అనిశ మీవేగతి – మాయమ్మ సరస్వతి॥

రుక్మిణీ కళ్యాణమున ప్రసిద్ధరచనలు.

1. సురట : చతురస్రగతి ఆది.

రుక్మిణీ బాల్యము.

2. తోడి : చతురస్రగతి (ఆది) యందు

లేజవ్వనంపు పసందు–

5. సావేరి : త్రిపుట.

ప॥ కరివరదా ముకుందా పరమపురుష॥

ఇందు "నారాయణదాసత్వ మిమ్మంటి" అను ముద్రకలదు.

6. నాటకురంజి : రూపకం.

ప॥ బ్రోవ రావమ్మె మ్మో నరహరి ...

7. భూపాల : త్ర్యస్రగతి రూపకం.

ప॥ సామి రావదేమిరా యో సర్వాంతర్యామిరా॥

8. మోహన : ఆది.

ప॥ పరమేశ్వర సకలసృష్టిస్థితి - వ్యయకారణ సంశ్రితభవతారణ ॥పర॥
అ॥ పరమపురుష సకలదేవవందిత - పరాత్పరా - స్ఫురద్ధరా-ధరధర ॥పర॥
మి॥ కరీంద్రవరదా భక్తాభయ - కరోరు బిరుదా
నిరాకారనిరీహానిష్కళంక - నిత్యసత్యముక్తబుద్ధస్వరూప ॥పర॥
పప్పాగరిసరిగరిసరి సధసా - పద్ధాసాపధసరిగరిసరిగధ
పప్పగపప్పగ ధద్ధపసస్సా - రీసధప - ధాపగరి - పాగరిస ॥పర॥
1. భళిరపురుషసూక్తానుసారముగ - బ్రత్యక్షమైతి విప్పుడోసామి
నలువయైన జలువరేడైన ని - న్నంస్తుతింపజాలరు నాతరమా
కలుషవిదూరా సాధుమవ - కంజవిహారా - విలసితోదార సచ్చి
దానంద - విగ్రహ - ప్రకటాగ్రహ - ఖలనిగ్రహ ॥పర॥
గపాపగగపరి - రిగాగరిగ్గరిస - సరిరి సరిసధసపాధపా
పధపసాసధస - ధసధరీరిసరి - సరిసగాగరిస - ధసధపగరిసరి ॥పర॥

ఇందు రెండు చరణములకు రెండు చిట్టస్వరములుగలవు. ఇవి రాగభావమును వ్యక్తయచేయునవిగనూ, సులభముగను, కీర్తనకు అలంకార ప్రాయముగను ఉన్నవి.

9. మంగళం.

సురట : త్ర్యస్రగతి (రూపకం)

ప॥ మంగళమోరామా జయ మంగళము భీమ ॥

ఇందు నారాయణదాసముద్ర చరణమునందు కలదు.

## అంబరీష చరిత్రము

శ్రీ దాసుగారు రచించిన అంబరీషచరిత్రము అను హరికథా గాన కావ్యమునందుగల కీర్తనలలో ఎక్కువభాగమున విజయనగర గోపాలస్వామివారి మకుటములు, నారాయణదాసముద్రలు కలవు.

1. కళ్యాణి : చతురస్ర.

ప॥ నిదా నమగ నీ పదార విందము.

సదా నమ్ముకొన్నాడరా

ఇందు నిదా, గ, నీ, పదా, సదా అనుచోట్ల స్వరాక్షరములు గలవు.

2. కాఫీ : చతురస్ర (ఆది.)

ప॥ ఓరోరి గణపతిరా నీ కుండ్రాళ్ళు పెట్టేదరా.

ఈ కీర్తన మా చిన్నతనమునందే బహుళప్రచారము నొందినది.

3. ఆనందభైరవి : తిశ్రగతి (చ॥ రూపకం)

ప॥ ననుగన్నతల్లి యో నల్వారాణి ... ...

ఇందు చివరిచరణమున నారాయణదాసముద్ర కలదు.

4. కేదారగౌళ : తిశ్రగతి (చ॥ రూపకం)

ప॥ కన్నుల నన్ను జూడ వేమిరా నీకన్న దిక్కెవ్వరో స్వామి

ఈ కీర్తన చివరి చరణమునందు "శ్రీ విజయనగర గోపాలక" అను నగరివేల్పు ముద్రగలదు.

5. సావేరి : చతురస్ర (ఆది.)

ప॥ దీనుడనై యుంటి దెబ్బుననాకొంటి.

ఇందుకూడ 'విజయనగర గోపబాలక' ముద్రగలదు.

6. భూపాల : ఖండగతి.

ప॥ నిరపరాధి నిడుమ బెట్టనేలా.

ఈ కీర్తనమందు కూడ "విజయనగర వేణుగోపాల"

మంగళం.

సురట : మిశ్రగతి (త్రి॥ త్రిపుట).

ప॥ కందర్ప శతకోటి సుందర ధృత ... ... ...

ఇందు నారాయణదాస ముద్ర గలదు.

## గౌరప్ప పెండ్లి

శ్రీ నారాయణదాసుగారు రచించిన గౌరప్ప పెండ్లి యందుగల సాహిత్యమంతయును అచ్చతెనుగునందు గలదు.

ఈ కావ్యము చాల విశిష్టమైనది.

ఇందలి కీర్తనలకుగల రాగతాళములకు సైతము శ్రీ దాసుగారు అచ్చతెనుగుపేర్లను పెట్టిరి.

### రాగములు

| తెనుగుపేర్లు | వాడుకలోనున్న పేర్లు |
|---|---|
| 1. ఆమనిరవలి | వసంతరాగము |
| 2. కలిమి రవలి | శ్రీరాగం |
| 3. పొలము గారు రవలి | కేదారగౌళ రాగము |
| 4. వేడి రవలి | సూర్యకాంతం రాగం |
| 5. చెంజోటి రవలి | జంఝూటి రాగము |
| 6. దొర కొలువు రవలి | దర్బారు రాగము |
| 7. కమ్మొచ్చు రవలి | లతాంగి రాగం ? |
| 8. నోటిపగ రవలి | ముఖారి రాగము |
| 9. మందడియతుకు రవలి | మధ్యమావతి? |
| 10. గురువెంద రవలి | ........ ...? |
| 11. తేనెల రవలి | ఉదయచంద్రిక |
| 12. వెన్నెల రవలి | చంద్రజ్యోతి |
| 13. పెండ్లామ రవలి | తోడి రాగము |
| 14. పాగాఱు రవలి | ... ....... ? |

### తాళములు.

1. ఏడు కుఱుచల కొలగల చప్పట్లు = త్రిశ్రజాతి త్రిపుట తాళము (ఏడు క్రియలు)

2. మూడు కురుచల కొలగలచప్పట్లు = త్రిస్రజాతి ఏకతాళం.
(మూడుక్రియలు)

4. నాల్గు ॥కు॥ ॥కొ॥ ॥చ॥ = చతురస్రజాతి ఏకతాళం.
(నాల్గు క్రియలు)

5. ఆరు ॥కు॥ ॥కొ॥ ॥చ॥ = చతురస్రజాతిరూపకం.
(ఆరుక్రియలు)

6. అయిదు కురుచలకొలగలచప్పట్లు = త్రిస్రజాతి రూపకతాళం.
(అయిదు క్రియలు)

శ్రీ దాసుగారు కీర్తనయొక్క పల్లవికి = ఎత్తుగడ అనీ అనుపల్లవికి = తోడు, అనీ, చరణమునకు = అడుగు అనీ, మధ్యమకాల సాహిత్యానికి (మిత్రము) = రెట్టింపు దండకము అని పేర్లు ముచ్చటగా పెట్టిరి.

వృత్తములు

శ్రీ దాసుగారు పెట్టిన పేర్లు

| | |
|---|---|
| తుమ్మెదకంటు | చంపకమాల |
| తోరము | మంజరి |
| కలవదండ | ఉత్పలమాల |
| ఏనుగుచెరలాట | మత్తేభము |
| బెబ్బులిచెఱలాట | శార్దూలము |
| గండుకెంపుకంటి | మత్తకోకిల |
| మాట | వచనం (లేక) గద్యం |
| కుదురు | పీఠిక. |

అచ్చతెనుగున కీర్తనలు మన సంగీత సారస్వతమున, శ్రీ దాసుగారు రచించినవిగాక వేరు లేవు గనుక ఈ గౌరప్ప పెండ్లి యందలి కొన్ని సంగీత రచనలుగా ఉండే కీర్తనలను స్వరపరచి సంగీతవిద్వాంసుల ప్రచారంలోకి తీసుకొనివచ్చుట చాల వాంఛనీయము.

* * *

## 2. పంచముఖి – షణ్ముఖి

### (అపూర్వ రాగతాళ ప్రబంధము)

సంగీత శేఖర శ్రీ నూకల

శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాసుగారు రచించిన పంచముఖి, షణ్ముఖి అనునది ఒక అపూర్వ రాగ తాళ ప్రబంధం. శంకరుడు పంచముఖుడు సద్యోజాత, వామదేవ, ఈశాన, తత్పురుష, అఘోర అని ఆ ముఖముల నామములు. షణ్ముఖియను ప్రక్రియకూడ పంచముఖి ప్రబంధమునందే ఇమిడియున్నది. శంకరునికి అయిదుముఖములుండుటయు, ఆ నామములవల్ల పంచముఖియను నామము ఈ రాగతాళ ప్రబంధమునకు తగియుండుటయేగాక, శివపంచాయతనమునుబట్టి పంచముఖి యను నామము ఈ ప్రబంధమునకు ఒసంగబడినది. ఎట్లనగా ఈ ప్రబంధమునగల సాహిత్యము "ఆదిత్య మంబికాం విష్ణుం గణనాథం మహేశ్వరం భజ" ఈ సాహిత్యమున మొత్తము 28 హ్రస్వాక్షరములు గలవు.

ఈ సాహిత్యము ఈ రాగతాళ ప్రబంధమున 45 సార్లు ఆవర్తమగును. 45 ఆవర్తములు తిరుగును. ఒక్కొక్క ఆవర్తమునకు 28 అక్షరములు (లేక) క్రియలు ఉన్నవి.

ఈ ప్రబంధమునగల 45 ఆవర్తములు 45 రాగములలో రచింపబడియున్నవి. ఈ రాగములన్నియు ప్రసిద్ధరాగములు, మేళకర్తరాగములు, రక్తిరాగములు అయి ఉన్నవి. రాగముల పేర్లు మాత్రము ఆవర్త ప్రారంభమున వ్రాయబడియున్నవి. శ్రీ దాసుగారు ధాతు అనగా స్వర రచన చేసియుండవచ్చును గాని గ్రంథవిస్తర సంశయముచే ఆ స్వర రచన చేర్చియుండలేదు.

స్వరముకూడా సాహిత్య అక్షరములపై వ్రాయుటకు ఈ పట్టిక యందు (Table) వీలులేక వదలివేసియుందురు. కీర్తనరూపమున స్వరము సాహిత్యము వ్రాసినచో స్వరముకూడ చేర్చునవకాశము గలదు.

ఇందుగల రాగములు

| | 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|---|
| 1) | మేచకళ్యాణి, | కాంభోజి, | కేదారగౌళ, | రసికప్రియ, | ఝంఝూటి, |
| 2) | తోడి, | దర్బారు, | నవరోజు, | నీలాంబరి, | నఠభైరవి |
| 3) | ముఖారి, | మోహన, | కనకాంగి, | రాగవర్ధని, | శ్రీరాగం, |
| 4) | మేచకళ్యాణి, | తానరూపి, | తోడి, | రత్నాంగి, | జ॥మ॥హరి |
| 5) | తోడి, | మధ్యమావతి, | నాటభైరవి, | నీలాంబరి, | నటభైరవి, |
| 6) | ముఖారి, | మోహన, | కల్యాణి, | రాగవర్ధని, | శ్రీరాగం, |
| 7) | మేచకల్యాణి, | కామవర్ధని, | కాఫీ, | వరాళి, | రసికప్రియ, |
| 8) | ఝంఝూటి, | తోడి, | ధవళాంబరి, | నవరోజు, | నీలాంబరి, |
| 9) | నఠభైరవి, | ముఖారి, | మోహన, | కల్యాణి, | మధ్యమావతి |

9×5 = 45 ఆవర్తములకు 45 రాగములు.

తాళ సంబంధమైన విశేషములు

ఈ రాగతాళ ప్రబంధము ఆవర్తమునకు 28 అక్షరములు చొప్పున 45 ఆవర్తములు కలిగియున్నది.

అనగా 45 ఆవర్తములకు మొత్తపు అక్షరములు 45×28 = 1260 అక్షరములు లేక క్రియలు అని కూడ అనవచ్చును.

ఈ మొత్తపు అక్షరములందు అయిదు జాతుల ఏకతాళములు ఇమిడి యున్నవి.

తాళ విభాగమునందు జాతులు అయిదు ఉన్నవి. అవి క్రమముగా
1) తిస్రజాతి 2) చతురస్రజాతి 3) ఖండజాతి 4) మిశ్రజాతి
5) సంకీర్ణ జాతి.

| | |
|---|---|
| త్రిస్ర జాతికి | 3 క్రియలు |
| చతురస్ర జాతికి | 4 క్రియలు |
| ఖండ జాతికి | 5 క్రియలు |
| మిశ్ర జాతికి | 7 క్రియలు |
| సంకీర్ణ జాతికి | 9 క్రియలు |

జాతిని వేయుట (అనుష్ఠించుట) కు లఘువు సహాయము కావలెను. లఘువుతోనే జాతిని చేతి వ్రేళ్లతో వేయవలెను.

త్రిస్ర జాతిని అనుష్ఠించుట :— దక్షిణహస్తమును వామ హస్తముపై ఘాత వేసి, చిటికెన వ్రేలు, అనామికము వేసినచో త్రిస్రజాతి లఘువు అగును. దీనికి 3 క్రియలు గలవు. ఇట్లే అన్ని జాతుల లఘువులకు ఒక ఘాత తక్కిన క్రియల సంఖ్య ననుసరించి అన్ని వ్రేళ్లు వేయుచుండవలెను.

ఇక తాళములు ఏడు (7) కలవు. ధ్రువతాళము, మఠ్యతాళము, రూపక తాళము, ఝంపతాళము, త్రిపుట తాళము, అటతాళము, ఏకతాళము.

ఏకతాళమునకు ఒకటే అంగము కలదు. ఆ అంగము లఘువు మాత్రము.

ఏకతాళములు 5 విధములు

| | |
|---|---|
| త్రిస్ర ఏక | 3 క్రియలు |
| చతురస్ర ఏక | 4 ,, |
| ఖండ ఏక | 5 ,, |
| మిశ్ర ఏక | 7 ,, |
| సంకీర్ణ ఏక | 9 ,, |

ఈ రాగ తాళ ప్రబంధమున గల 28 అక్షరముల యొక్క 45 ఆవర్తములును ఈ అయిదు ఏకతాళములలో ఏ తాళమునకైననూ

సరిపోవును. అంతేకాక ఈ అయిదు ఏకతాళములను అన్నింటినీ ఒకేసారి (Simultanious) వేయుచు పాడినను 45 ఆవర్తములు పూర్తి. అగునప్పటికి సరిపోవును.

ఈ పంచముఖ యను రాగతాళ ప్రబంధము యొక్క విశేషము విశిష్టత ఇట్టిది అయి ఉన్నది.

అది ఎట్లు సరిపోవుననగా—

ప్రబంధము యొక్క మొత్తపు క్రియలు 1260.

1) త్రిస్రజాతి ఏకతాళము (3 క్రియలు)

$$1260 \div 3 = 420.$$

ఈ ప్రబంధమును త్రిస్రజాతి ఏకతాళమునందు పాడినచో ప్రబంధము పూర్తి అగుసరికి ఈ ఏకతాళము 420 సార్లు ఆవృత్తి యగుచు సరిపోవును.

2) చతురస్రజాతి ఏకతాళము 4 క్రియలు.

$$1260 \div 4 = 315.$$

ఈ ప్రబంధమును చతురస్ర ఏకతాళమునందు పాడినచో ప్రబంధము పూర్తి యగుసరికి ఈ చతురస్ర ఏకతాళము 315 సార్లు ఆవృత్తి యగుచు, సరిపోవును.

3) ఖండజాతి ఏకతాళము 5 క్రియలు

$$1260 \div 5 = 252$$

ఈ ప్రబంధమును ఖండజాతి ఏకతాళమునందు పాడినచో ప్రబంధము పూర్తియగుసరికి ఈ ఖండజాతి ఏకతాళము 252 సార్లు ఆవృత్తి యగుచు సరిపోవును.

4) మిశ్రజాతి ఏకతాళము 7 క్రియలు

$$1260 \div 7 = 180$$

ఈ ప్రబంధమును మిశ్రజాతి ఏకతాళమునందు పాడినచో, ప్రబంధము పూర్తియగు సరికి ఈ మిశ్రజాతి ఏకతాళము 180 సార్లు ఆవృత్తమగుచు సరిపోవును.

5) సంకీర్ణ జాతి ఏకతాళము 9 క్రియలు

$$1260 \div 9 = 140$$

ఈ ప్రబంధము సంకీర్ణ జాతి ఏకతాళమునందు పాడినచో, ప్రబంధము పూర్తియగుసరికి ఈ సంకీర్ణ జాతి ఏకతాళము 140 సార్లు ఆవృత్తియగుచు సరిపోవును.

అట్లుగాక 45 ఆవర్తములు పూర్తికాక మునుపు ముగించినచో ఏదో ఒక తాళము మిగిలిపోవుచునుండును. ఈ అయిదు తాళములందు ఏదో ఒక తాళము పూర్తికాదు.

అందుకు కారణము :—

$$\begin{array}{r|l} 3 & 3,\ 4,\ 5,\ 7,\ 9, \\ \hline & 1,\ 4,\ 5,\ 7,\ 3, \end{array}$$

$$3 \times 4 \times 5 \times 7 \times 3 = 1260.$$

ఈ అయిదు సంఖ్యల యొక్క L. C. M. (క. సా. గు.) కనిష్ఠ సామాన్యగుణిజము 1260 అగుటయే ఇందుకు కారణము.

## షణ్ముఖి వివరణము

ఈ పంచముఖి అను రాగతాళ ప్రబంధమును 6వ తాళమునందు కూడా అనుష్ఠింపవచ్చును.

ఈ ఆరవతాళము పేరు లఘుశేఖరము. ఇది ఒక విచిత్రమైన తాళము :—

వైణికులు వీణావాదన నొనర్చునపుడు ఆరు అక్షరములకొకసారి తాళతంత్రులను మీటు సంప్రదాయము కలదు. ఇట్లు ఆరు అక్షరములకు ఒకసారి మీటుటనే "లఘుశేఖరము" అని యందురు.

28 అక్షరములు గలిగిన 45 ఆవర్తముల పంచముఖిని ఈ లఘుశేఖర తాళమునందు వేయుటచే షణ్ముఖి అని కూడా ఈ ప్రబంధమునకే పేరువచ్చినది.

$$1260 \div 6 = 210$$

ఈ ప్రబంధమును లఘుశేఖరమునందు పాడినచో ప్రబంధము పూర్తియగుసరికి ఈ లఘుశేఖరము 210 సార్లు ఆవృత్తియగుచు సరిపోవును.

## పంచముఖి ప్రదర్శన

'పంచముఖిని' 5 తాళములతో వేయుచు పాడుట చాలా కష్టసాధ్యము. పట్టుదల, ఓర్పు, దీక్షతో ఈ ప్రబంధమును ఒక గాత్రసంగీత విద్వాంసుడు కనీసము ఒక సంవత్సరము సాధన చేయవలెను.

ఆ సంగీతవిద్వాంసుడు ఈ ప్రబంధమును పాడుచూ, అయిదు తాళములను తనయొక్క శిరస్సుతోను, రెండు చేతులతోనూ, రెండు భుజములతోనూ వేయుచు శ్రోతలకు చూపించవలెను.

ఆ గాత్రజ్ఞునియొక్క తాళానుష్ఠానము సరిగానున్నదో లేదో కనుగొనుటకు అయిదుగురు విద్వాంసులు లయాతితాళములయందు నిష్ణాతులైనవారు. ఆగాత్రజ్ఞుని (Performer) ఎదురుగాకూర్చొని, ఒక్కొక్కరు ఒక్కొక్క తాళమును వేయుచు వారి వారి తాళములకు గాత్రజ్ఞుడు వేయు తాళములు సరిపోవుచున్నవో లేదో గమనించుచుందురు.

ఈ ప్రదర్శన ఒక అపూర్వమైన విద్వద్ధర్మమునకు సంబంధించిన కళాఖండము.

ఈ అపూర్వమైన రాగతాళ ప్రబంధమును శ్రీ దాసుగారు తమ అపూర్వమైన ప్రతిభాశక్తిచే వాగధీశ్వరి కటాక్షముచే రచించిరి.

పూర్వము రాగమాలికలు రచించినవారు కలరు; తాళమాలికలను రచించినవారు కలరు; రాగతాళమాలికలను రచించిన మేధావులు కూడా లేకపోలేదు. అట్టివారిలో మహావైద్యనాథయ్యరుగారు ముఖ్యులు. కాని శ్రీ దాసుగారు రచించిన ఈ పంచముఖ మరియు షణ్ముఖి అను ఈ ప్రబంధము 45 రాగములతో, 5 తాళములతో, మరియు ఆరు తాళములతో కూడా 45 ఆవర్తములు గలిగి ఒకరే అన్ని తాళములు వేయుచు పాటను పాడుచు ప్రదర్శించు ప్రక్రియ గలిగిన ఈ ప్రబంధము అద్వితీయము, అపూర్వము. నభూతో నభవిష్యతి-అనుట అతిశయోక్తి కాదు.

ఈ ప్రబంధమును పాడగలిగిన సమర్థులు ఈనాడు ఉన్నారు. కాని ఈ ప్రక్రియను ఓర్పుతో విని, చూచి, ఆనందించు శ్రోతలు రసికులు ప్రజలలో సన్నగిల్లుచున్నారు. కర్ణాటసంగీతము శాస్త్రీయగానమే మోటు అగుచున్న ఈ కాలమునందు ఇట్టి ప్రక్రియను ఆస్వాదించు భాగ్యము మనకు కలదా అని ప్రశ్నించుకొని, ఇట్టి అపూర్వ సంగీత లయాత్మకమైన ప్రబంధమును మరల పునరుజ్జీవింపచేయు బాధ్యత, ధర్మము మన దేశ సంగీతవిద్వాంసులపైని, రసికజనులపైని, ప్రభుత్వము పైని ఎంతైననూ కలదు.

ఈ పంచముఖిని ప్రదర్శించు విద్వాంసులు ఒకరిద్దరు మాత్రము ప్రకృతము కలరు. వారిని ప్రోత్సహించి, వారిచే ప్రదర్శనలు ఏర్పాటు చేయు బాధ్యత మన మీదనే ఉన్నది.

ఆధునిక విద్వాంసులలో కొంతమంది అయిననూ ఈ పంచముఖిని సాధించి ప్రదర్శించినచో శ్రీ దాసుగారి రచన సార్థకము అగును. వారి రచనను ప్రదర్శించి మనము కూడా సార్థకులము కాగలము.

(శ్రీ) దాసుగారు సంగీతమునను, సంగీతాత్మకమగు లయ శాస్త్రమునను అనేక పరిశోధనలు సల్పి సంగీతమునకు సేవచేసి మనకు ఆదర్శప్రాయులై ఉన్నారు. వారి ఋణము తీర్చుకొనుట ప్రతిసంగీత విద్వాంసుని ధర్మము.

సులభపద్ధతిని ఈ పంచముఖి షణ్ముఖిని ప్రదర్శించుపద్ధతికి సూచన :—

ఈ పంచముఖిని ఒకరు పాటపాడుచు 5 తాళములు వేయుట చాలా కష్టసాధ్యము.

అట్లు చేయుటకు బదులు.

అయిదుగురు విద్వాంసులైన గాతృజ్ఞులు చేరి ఈ 45 రాగములు 5 తాళములు గల ఈ ప్రబంధమును ఒక్కొక్కరు ఒక్కొక్క తాళమునందు పాటను పాడుచు ఎవరి తాళము వారే వేయుచు ప్రదర్శించుట కడుసులభము, ఆస్వాదించుటకు కూడా శ్రోతలకు (ప్రేక్షకులకు) ఎంతో ఆనందముగా నుండును.

ఈ 45 రాగములకు ధాతుకల్పనచేసి 5గురు విద్వాంసులు క్రొంచెముగా సాధనచేసి ఈ ప్రదర్శనను సిద్ధము చేయవచ్చును.

ఈ పద్ధతిలో ఈ రాగతాళ ప్రబంధమైన పంచముఖిని, అనుష్ఠించుట, ఆస్వాదించుట ఎంతో సుఖము, ఎంతో సులభము; కనుక కడు వాంఛనీయము.

* * *

## 2. దశవిధ రాగ నవతి కుసుమమంజరి

—సంగీత శేఖర శ్రీనూకల

శ్రీ దాసుగారు రచించిన "దశవిధ రాగ నవతి కుసుమమంజరి" అను రాగమాలిక అపూర్వమైన రచన.

ఈ రాగమాలికయందు నూటయెనుబది (180) రాగములుకలవు. ఇంత ఎక్కువసంఖ్యగల రాగమాలికను పూర్వము ఎవ్వరూ రచించియుండలేదు. భవిష్యత్తునందుకూడా ఎవ్వరూ రచించలేరు అనినచో అతిశయోక్తి కానేరదు. అందుచేతనే ఈరచన అపూర్వము. నభూతో న భవిష్యతి.

ఈ రాగమాలికపేరు "దశవిధ రాగ నవతి కుసుమమంజరి." దశవిధ రాగములు ఇందుకలవు.

1. సర్వసంపూర్ణ రాగములు 9 ఉన్నవి.

సర్వసంపూర్ణములు అనగా ఆరోహణ అవరోహణయందు సప్త స్వరములుకలవి అని అర్థము.

2. షాడవ ఔడవరాగములు 9 ఉన్నవి.

షాడవ ఔడవములు అనగా ఆరోహణయందు ఆరుస్వరములు అవరోహణయందు అయిదుస్వరములుకలవి అని అర్థము.

3. ఔడవ షాడవములు 9 ఉన్నవి

అనగా ఆరోహణయందు 5 స్వరములు అవరోహణయందు 6 స్వరములు.

4. సంపూర్ణ ఔడవములు 9 ఉన్నవి.

అనగా ఆరోహణయందు సప్తస్వరములు అవరోహణయందు 5 స్వరములు గలది.

5. ఔడవ సంపూర్ణములు 9 ఉన్నవి

అనగా ఆరోహణయందు 5 అవరోహణయందు సప్తస్వరములు.

6. శుద్ధషాడవరాగములు 9 ఉన్నవి.

శుద్ధషాడవములు అనగా ఆరోహణయందు అవరోహణయందు కూడా ఆరు స్వరములు కలిసిన రాగములు.

7. సంపూర్ణ షాడవరాగములు 9 ఉన్నవి.

సంపూర్ణ షాడవములు అనగా ఆరోహణయందు స్వప్తస్వరములు అవరోహణయందు ఆరు స్వరములు కలిగిన రాగములు.

8. షాడవ సంపూర్ణములు 9 ఉన్నవి.

షాడవ సంపూర్ణములు అనగా ఆరోహణయందు ఆరు (6) స్వరములు అవరోహణయందు సప్త( 7 ) స్వరములు గలిగిన రాగములు.

9. శుద్ధ ఔడవములు 9 ఉన్నవి.

శుద్ధ ఔడవములు అనగా ఆరోహణయందు అవరోహణయందు కూడా అయిదు (5) స్వరములు కలిగిన రాగములు.

10. వక్రరాగములు 99 ఉన్నవి.

వక్రరాగములు అనగా ఆరోహణ అవరోహణలందు స్వరములు క్రమపద్ధతిగా లేక హెచ్చుతగ్గులతో వంకరగా ఉండునవి అని అర్థము.

దశవిధరాగములు అనగా పై పది రకముల రాగములు అని అర్థము.

ఈ రాగమాలికయందు రాగములు దశవిధములుగా నున్నవి, మొత్తము రాగములు 180 కలవు.

ఈ నూటయెనుబది రాగముల రాగమాలిక అతిదీర్ఘమైనది.

ఈ రాగమాలిక సర్వతాళాత్మక పంచజాత్యేక తాళమున రచింపబడినది.

సర్వతాళాత్మక పంచజాత్యేకతాళము అనగా :—

మొదట - పంచజాతి ఏకతాళము అనగా :—

తాళమునందు అయిదు జాతులుకలవు. తిస్ర (3), చతురస్ర (4), ఖండ (5), మిశ్ర (7). సంకీర్ణ (9), జాతులు, లేక ఏకతాళము లని కూడా చెప్పవచ్చును. ఈ మొత్తపు క్రియలు కూడిన 28 క్రియలు వచ్చును.

ఇట్టి 28 క్రియలు కలిగిన ఆవర్తములు 180 అయినచో పంచ జాతులలో ఏ ఒక్క జాతికైనను సరిపోవును.

అది ఎట్లనగా :—

28 అక్షరములు లేక క్రియలు కలిగిన 180 ఆవర్తములు అనగా 180 × 28 = 1260 అక్షరములు (?) లేక క్రియలు అగును.

ఈ 1260 అక్షరములు త్రిస్ర ఏక, చతురశ్ర ఏక, ఖండ ఏక, మిశ్ర ఏక, సంకీర్ణ ఏకతాళములలో ఏ ఏకతాళమునకైనను లేక అన్ని తాళములకును రాగమాలిక మొదటినుండి చివరి వరకును పాడినచో సరిగా సరిపోవును.

ఎట్లు సరిపోవును అనగా :—

త్రిస్ర ఏక 1260 ÷ 3 = 420 ఆవర్తములు,

చతురశ్ర ఏక 1260 ÷ 4 = 315 ఆవర్తములు,

ఖండ ఏక 1260 ÷ 5 = 252 ఆవర్తములు,

మిశ్ర ఏక 1260 ÷ 7 = 180 ఆవర్తములు,

సంకీర్ణ ఏక 1260 ÷ 9 = 140 ఆవర్తములు అగును.

ఈ పై ఏకతాళములలో ఏ ఏకతాళమునందైనను ఈ రాగమాలికను పాడవచ్చును.

ఇంకొక విశిష్టమైనది విచిత్రమైనది అగు విశేషమేమన :

ఈ రాగమాలికను ఒకరు పాడుచుండగా అయిదుగురు విద్వాంసులు ఒక్కొక్కరు ఒక్కొక్క ఏకతాళమును వేయుచుండిన

రాగమాలిక మొదలుపెట్టి ముగించుసరికి అయిదు ఏకతాళములు ముగియును.

మధ్యలో మాత్రము ముగియదు.

కాగా ఈ అయిదు తాళములు ఒకరే వేయుచు పాడుటకు అపూర్వ సాధనచేసినచో ఇది యొక అద్భుతమైన క్రియ యగును.

అయిదు తాళములు ఒకరే వేయుట అసాధ్యము. శ్రీ దాసుగారు వారి శిష్యులలో ధారణ, సాధన చేయగల ఓర్పు ఓపికగల ఒకరిద్దరకు శిక్షణ గరపిరి. అయిదు తాళములు ఒకేసారి అయిదు శరీరాంగములతో వేయవలెను.

1. తిస్రగతి = కుడిచేయి, 2. చతురస్ర = ఎడమచేయి
3. ఖండ = కుడిభుజం, 4. మిశ్ర = ఎడమభుజం
5. సంకీర్ణ = శిరస్సు.

ఈ పద్ధతికి "పంచముఖ" అని శ్రీ దాసుగారు పేరుపెట్టిరి. పరమ శివునికి అయిదు ముఖములు. సద్యోజాత, వామదేవ, ఈశాన, తత్పురుష, అఘోర, ఈ ఐదు ముఖములనుండి అయిదు జాతులు (తాళములు) సప్తస్వరములు ఉద్భవించినవి అను నార్యోక్తి ననుసరించి శ్రీ దాసుగారు ఈ సప్త తాళాత్మక పంచజాత్యైక తాళమునకు పంచముఖ అని నామమును ఒసంగుట ముదావహము.

"పంచముఖ" లేక సప్తతాళాత్మక పంచజాత్యైక తాళమునందు ఈ రాగమాలికా ప్రబంధమును పాడుట కడుంగడు ప్రయాసము కనుకను, ఈ రాగమాలికా ప్రబంధము సంగీత ప్రధానమైనది, రాగప్రధాన

మైనది, కీర్తనాపూర్వకమై సాహిత్య విశేషములుకలది కనుకనూ, శ్రీ దాసుగారు ఈ రాగమాలికను సులభపద్ధతిలో మిశ్రజాతి ఏకతాళముననే రెండవకాలమున మొదటి 90 రాగములును, 3-వ కాలమున తక్కిన 90 రాగముల మాలికనూ పాడుటకు వీలుగా ఏర్పరచిరి. మిశ్రజాతి ఏకతాళముల రెండవకాలమున ఆవర్తమునకు 14 అక్షరములు, 3-వ కాలమున 28 అక్షరములు చొప్పున ఈ రాగమాలికను పాడుకొనవచ్చును.

ఇట్లు పాడిన ఏ ఆవర్తమునకు ఆ ఆవర్తము విడివిడిగా ఏ రాగమునకు ఆరాగము విడివిడిగా ముగించుచు సులభముగా పాడుకొనవచ్చును.

కాగా శ్రీ దాసుగారి ప్రజ్ఞాపాటవమును సంగీత లయ విద్వాంసులకు తేటతెల్లమొనర్చుటకు ఈ రాగమాలిగా ప్రబంధమును "పంచముఖ" తాళమున కూడా పాడతగును అని బోధించుచు తమ యద్భుత శక్తితో ఈ దశవిధరాగనవతి కుసుమమంజరిని, సప్తతాళాత్మక పంచజాత్యేక తాళమునందు పంచముఖ తాళమునకు సరిపోవునట్లు రచించిరి.

ఇక రాగవిషయము

ఈ రాగమాలికా ప్రబంధమునందు దశవిధరాగములు కలవు. ఈ దశవిధరాగముల పేర్లు మొదట వివరింపబడినవి.

ప్రతిరాగమునగల ఆరోహణ అవరోహణాది విశేషములతో స్వరము అందముగ రచింపబడినది. ప్రతి రాగమాలిక యొక్క సాహిత్య భాగమున ఆ రాగముపేరు భగవత్ కీర్తన పూర్వకముగా చొప్పించబడినది.

కీర్తనా సాహిత్యమున ఆ కీర్తనయొక్క రాగమును నిర్దేశించుట పూర్వము సంగీత త్రిమూర్తులలో నొకరైన శ్రీ ముత్తుస్వామి దీక్షితర్ వారు చేసిరి. అట్లే శ్రీ దాసుగారుకూడా ఈ రాగమాలికా ప్రబంధమునందుకూడ రాగనామమును చేర్చుట మిక్కిలి విశేషము.

కీర్తన సాహిత్యమున రాగముపేరు వచ్చునట్లు రచించినచో తరువాత తరమువారికి ఆకీర్తనను ఆ రాగముననే పాడవలెనని చెప్పునట్లును, ఇంకొక రాగమున మార్చి ఆ కీర్తన పాడుటకు అవకాశములేకుండ ఆ కీర్తనా రచయితయే రాగనిర్ణయమును శాసించినట్లునగుట మిగుల విశేషము.

ఈ రాగమాలికయందు శంకరాభరణము, నఠభైరవి మొదలగు మేళకర్త రాగములు - శ్యామలాంగి, పావని, రూపవతి మొదలైన మేళకర్త రాగములలో వివాది రాగములు - లోకోత్తరి, రత్నాకరి, చంద్రిక, నాగభూషణి మొదలైన అపురూప రాగములు- జగన్మోహిని, వసంత, నారాయణి, సరస్వతి మొదలైన అపూర్వ రక్తి రాగములు- హంసధ్వని, సునాదవినోదిని, నాగస్వరావళి మొదలైన రక్తిరాగములు- మేఘరంజని, సురవరాళి మొదలైన క్లిష్టరాగములు- భూపాలము, మధ్యమావతి మొదలైన పూర్వప్రసిద్ధ రాగములు- పున్నాగవరాళి, ముఖారి మొదలైన కరుణరస ప్రధానమైన రాగములు- ఆనందభైరవి, నీలాంబరి, జనరంజని, మొదలైన శృంగార రసప్రధానమైన రాగములు- మోహన, సింహవాహిని మొదలైన వీరరస ప్రధానరాగములు ఎన్నో కలవు.

సంగీత విద్వాంసులైనవారు ఈ రాగమాలికా ప్రబంధమును వర్ణించి, నిత్యము సాధనచేసిన వారికి అసాధ్యమైన విషయము సంగీతమునగాని తాళవిభాగమునగాని ఉండదు అనుట అతిశయోక్తిగాదు.

ఈ రాగమాలికను విద్యార్థులకు బోధించినచో-రాగమాలికలో మొదటి రాగమును నేర్చుకొనునప్పుడు విద్యార్థిగానుండు వ్యక్తి 180 వ (ఆవర్తము) రాగము నేర్చి, పాడగలిగిన నాడు విద్వాంసుడుగా రూపొందు ననుట నిర్వివాదాంశము.

ఆ మహామహునకు నా జోహారు!

* * *

# పరిశిష్టము

—సంపాదకుడు

౧. పంచముఖి:—

ఈ అపూర్వ రాగతాళప్రబంధమును ధాతువులో వస్తాదు, మాతువులో ఉస్తాదు అయిన శ్రీ దాసుగారు తమ కఠోర వ్యవసాయపు ఫలసాయముగా సంగీత జగద్భాగధేయముగా 1914 సం॥ ప్రాంతమున రూపొందించిరి. అది తాళద్వయ ప్రదర్శన ప్రజ్ఞామత్త శొండాలమగు సుబ్రహ్మణ్యయ్యరునకు శృంగభంగము చేయించి ఆతని చేతి బిరుదందె యగు వీరఘంటాకంకణమును విప్పించినది. ఈ సన్నివేశము 1922 లో ప్రకటితమై దాసుగారి కంకితమైన శ్రీ వసుమర్తి కృష్ణమూర్తిగారి పార్వతీ పరిణయ యక్షగాన కృతిప్రదాన పద్యములందు ప్రసక్తమైనది. అందు దాసుగారు "పంచముఖి పరమేశ్వరులు" గా కీర్తింపబడిరి. దాసుగారు దానికి 1933 లో సమగ్ర రూపకల్పన గావించిరి. 1-2-1933 న తమ సంగీత కళాశాల వార్షికోత్సవ సందర్భమున దాసుగారు మరియొక తూరి పంచముఖిని ప్రదర్శించిరి (చూ. ఆంధ్రపత్రిక 1-3-1933). 1-10-1953వ తేదీన దాసుగారి ముఖ్యశిష్యుడును, విజయనగర సంగీతకళాశాలలో నాడు మృదంగశాస్త్ర ప్రాచార్యుడును అయిన శ్రీ శ్రీపాద సన్యాసిరావుగారు తద్వివరణాత్మక పట్టికను తయారుచేసిరి. పంచముఖిని నేడు ప్రదర్శింపగల వారు శ్రీ ముట్నూరి సూర్యనారాయణశాస్త్రిగారు. వీరు దీనిని తమ తండ్రిగారగు కీ. శే. ముట్నూరి సంగమేశ్వరశాస్త్రిగారి కడ 12సం॥లు అభ్యసించిరట. వారు దాసుగారికి సమకాలికులే. వారి పంచముఖి దాసుగారి దానికి కొంత భిన్నముగా నున్నది. ఈ పంచముఖినే లఘుశేఖర మను ఆరవ తాళమున కూడ అనుష్ఠించినచో అది "షణ్ముఖి" యగును. దీనిని దాసుగారి కడ ఆరు వత్సరములు సాధనచేసి వాసికెక్కినవారు శ్రీ కొండపల్లి కల్యాణదాసుగారు.

ఆయన అసలు పేరు అసిరయ్యయో ఎరకయ్యయో. కల్యాణదాస నామము గురుప్రసాదము. (ఈ యిరువురి గురించి 'నాట్యకళ' ఆదిభట్లనారాయణ దాసు ప్రత్యేకసంచిక- 1965 ఫిబ్రవరిది చూడదగును.)

ఈ పంచముఖి గురించి మా కుపలబ్ధమైన నారాయణదాస సమ కాలికమైన ఒక సంగీత విద్వల్లేఖన మీ క్రింది విధముగా నున్నది :-

"వింశతి గుణిత షట్కాల లఘు సంఖ్యాత త్రిషష్టి మాత్రా పరిమిత పంచజాత్యేకతాళ పంచక యుగపత్పంచావయవారంభ సమాపన నిబద్ధ త్రిస్థాయి త్రివృత్తి త్రికాల త్రితివార ముక్తిఘటిత షోడశవిధ స్వరకలిత సంపూర్ణ వక్రద్వైవిధ్య రాగాలాప్తి త్రిఖండికారూప పంచ దేవతాత్మక పంచముఖేశ్వరనామ సంకీర్తనమ్.

త్ర్యశ్ర, చతురస్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణజాతులనైదు ఘాతలు ప్రత్యేకముగా రెండు పాదములతో రెండు ఘాతలు, రెండు చేతులతో రెండు ఘాతలు, రెండు బాహువులతో నొక ఘాత చొప్పునఁ బ్రకటించుచుఁ బంచదేవతానామ సంకీర్తనముఁ బదునాలు వివిధ స్వరములు గల పదునైదు రాగములు వరుసగా ముమ్మాఱు ప్రథమకాలమున రెండవ తూరి ముమ్మాఱు రెండవ కాలమున మూఁడవ తేప ముమ్మాఱు మూఁడవకాలమునఁ బ్రచురించుచుఁ బంచావయవములఁ బంచజాత్యేక తాళఘాత లయిదు నొక్కసారి మొదలిడి తిరిగి యొక్కసారి ముగియు నట్లు పాడుటకై యేర్పరుపఁబడిన ప్రబంధరత్నము."

౨, దశవిధరాగ నవతి కుసుమ మంజరి :-

1938 లో తమ రామేశ్వర యాత్రాసందర్భమున శ్రీ దాసు గారు కన్యాకుమారి కేగి దేవీదర్శనము చేసికొని దేవీస్తవ రూపముగా నాన్యతో దర్శనీయ నైపుణ్యముతో ఈ మంజరీ పరికల్పనము గావించిరి. ఇంద త్యపూర్వమైన రాగ ప్రజ్ఞా ప్రాగల్భ్యమును ప్రదర్శించిరి. పంచ ముఖీ తాళ ప్రజ్ఞను కూడ పరిఢవించిరి. అసలా మహామహుని సంగీత

ప్రజ్ఞ పంచముఖీనమును దశవిధమునుగాదు- అది బహుముఖీనము, అనంతవిధమును.

దాసుగారి యీ రచనల గురించి వారి అల్లుడు కీ॥ శే॥ ఉపాధ్యాయుల అప్పల నరసయ్యగారికి కీ॥ శే॥ విస్సా అప్పారావుగారు 16-4-54న ఒక ఉత్తరములో నిట్లు వ్రాసిరి. "మీ రిచ్చిన మీ మామగారి సంగీత రచనను విజయనగరము కాలేజీలో ఇచ్చినారు. వారు ఇది పాడుటకు కొన్ని సందర్భములు తక్కువయని ఇచ్చివేసినారు. పుచ్చుకొని సంవత్సరమైనది. సాధారణులకు ఇది కొలుకబడదు. అదిగాక దీనియందు భక్తి శ్రద్ధలు పట్టుదల అభిమానము కలవారుకాని దీనిని సాధించలేరు. అట్టి వారు కనపడేవరకు ఏమీ చేయలేము."

ఈ కృతుల గురించి తిరుపతి (శ్రీ) వేంకటేశ్వర ఓరియంటల్ ఇన్‌స్టిట్యూటు డైరక్టరు కీ॥ శే॥ పరవస్తు రామానుజస్వామిగారు (శ్రీ) కర్రా సూర్యనారాయణ (అడ్వకేటు, విజయనగరము) గారికి 18-8-55న వ్రాసిన జాబులో నిట్లున్నది.

"Sri Rallapalli Anantha Krishna Sarma, Reader in Music examined them and expressed the view that they reflected the high musical talents and the deep learning of the author. It is certainly a great feat that the author had accomplished in these works."

దశవిధరాగ నవతి కుసుమమంజరి గురించి దాసుగారి నాటి యొక సంగీత విద్వాంసుని వక్కాణ :—

"ఇందలి మేళకర్తరాగములు, జన్యరాగములు మొదలగునవి ప్రతి గాయకునకును, ప్రతి జంత్రివాద్యము వాయించువారికి వీలగు పనితనము శ్రుతులయందు పరిశుద్ధత తాళమునందు మంచి కణేశము మొదలగునవి యేర్పడుట కవకాశ మిచ్చునని దాసుగారు దీనిని తయారు చేసిరి. దీనివలన మనోలతలు యేర్పడును. ఇది విద్వాంసులు మాత్రమే కృషి చేయ తగినది మృదంగము వాయించువారుకూడా ప్రత్యేకముగా

సాధనచేయదగినది. పూర్వాచార్యులు సంగీత వాగ్గేయకారులు వెంకట మఖి, ముత్తుస్వామి దీక్షితులు ప్రభృతులవి చతుర్దండిప్రకాశిక సంగీత సంప్రదాయ ప్రదర్శిని మొదలగు గ్రంథములందు దీనిని పోలినవి అందందు కన్పించును. ప్రస్తుతమున ఇట్టి సంగీతరచనలు చేయువారుగాని వాటిని స్వరపరచి శబ్దములను పొందుపరచి యీవిధముగా వ్రాసినవారు గానిలేరు. ఇది పాడినందువలన మంచి శ్రుతి విచక్షణము మంచి తాళ విచక్షణము ధారాళముగ అలవడుట నిక్కువము. ఇందు జతపర్చబడిన పంచముఖియను అయిదు జాతులను అయిదు అంగములతో ఒకే కాలమున అన్ని అంగములతో సంకీర్ణ మిశ్ర ఖండ చతురశ్ర తిస్ర జాతులను ఏ యా రాగమునకు ఆ యా జాతి ఉదాహరణ- తకధికి తధిగిణత, తక తధిగిణత, తధిగిణత, కిటతక, తకిట- ఈ అయిదు జాతులను అన్ని అంగములతో ఒకేసారి చూపించిన దీనినే పంచముఖి యందురు. ఇది తాళశతావధానము. ఇట్టివి మన దేశమున వేయు విద్వాంసులు వంద సంవత్సరములకు వెనుక ఉండెడివారు-

ఇట్టి పనితనముగల ముక్తాయిలను సంగీతము నేర్చుకొనునట్లే వెనుకటి కాలమందు శిష్యపరంపర ఇట్టి ధీమంతులవద్ద చెప్పుకొని దానిని పదేపదే సాధకముచేసి సాధించెడివారు. నేడు యిట్టి పనితనమును యెవ్వరును సాధించుటకు పూనుకొనుట లేదు. ఛందస్సు అలంకారములు మొదలగు కట్టుబాట్లు కవిత్వమునకు యెలాగున్నో సంగీతమునకు గూడ స్వర శబ్ద జ్ఞానములు ఆవశ్యకములు. (శ్రీ) దాసుగారు గాయకుడు సమస్త తాళములను జంత్రవాద్యములకు సంబంధించు శబ్దములను వేయగలిగిననాడే వానిని గాయకుని పేర్కొనెడివారు. మార్దంగికునకు కూడా సంగీతజ్ఞునివలెనే స్వరము వేయుట, రాగభావము నర్థము చేసుకొనుట మొదలగునవి వచ్చినగాని, వానివాద్యమునందు పటుత్వము లేదనెడివారు. ఈ పనులుగాక వీరు ఒక నృత్యము చేయుచు, పై రెండు విషయములను చేర్చుచు, నృత్యము, గీతము, తాళము ఈ మూడింటిని

హనుమంతునివలె మానవులకొరకు గాకుండా ప్రణవనాదస్వరూపుడై ఒకప్పుడు, నాదలోలుడై ఒకప్పుడు శబ్దములగూడ కలిపి పాడుచు బ్రహ్మానందపరవశుడగునపుడు నృత్యముకూడ చేసెడివారు. అట్టివిధమున హనుమంతునివలె పాడువారు ఒక్క నారాయణదాసుగారుమాత్రమే, అన్ని కాలములలోను సంగీతప్రపంచములో పేర్కొనగలిగినవారు.

వారు ఈవిధముగా గానముచేయుటయేగాక, రోజుకు పది పన్రెండు గంటలకాలము ఇట్టి అపూర్వతాళములను రాగములను వారు స్వయముగా వ్రాసి యెప్పటికైనా సంగీతప్రపంచమునకు ఇవి సహాకరించవలెనను సత్సంకల్పముతో వ్రాయుట ఆంధ్రుల యదృష్టము. ఇట్టి మహోత్కృష్ట గ్రంథములను సమస్తగాయకులు వారివారి కృషిని బట్టి వీనిని బహుప్రచారములోనికి తీసుకొనివచ్చుటకు దీక్షవూని ఆంధ్రదేశ సంగీతప్రతిష్ఠను నిలుపుకొందురుగాక."

3. శ్రీ మబుగాపు కృష్ణదాసుగారి "మృదంగవాద్యబోధిని" అను గ్రంథము 25-26 పుటలలో శ్రీ దాసుగారి సంగీతప్రజ్ఞ గురించి యిట్లు పేర్కొనబడినది :—

ఎ) ద్రుతకాలమిశ్రము :

"పూజ్యులైన నారాయణదాసుగారు హరికథారచనలలో ద్రుత కాలమిశ్రము ప్రయోగించియున్నారు. ఈ రచన వీరివల్లనే ఫలోన్ముఖ మైనదని భావించవలయును. అంతకు పూర్వులైయున్న సుదర్శన దాసుగారు రచించిన కుచేలోపాఖ్యానములోను, కర్ణచరిత్రలోను ద్రుతకాలమిశ్రము లేనేలేదు. త్యాగరాజు కీర్తనలలో గూడ రూపక తాళములోనున్న ఏవో కీర్తనలకు తప్ప బహుకీర్తనలలో ద్రుతకాల మిశ్రము లేనేలేదు."

బి) లయబ్రహ్మ :-

"స్వకృషివలన మాత్రమే తనకుదా సాధించుకొన్న సమస్త వేద శాస్త్ర విశేషముల నన్నియు హరికథాగాన సమయమున బహుముఖ పాం

డిత్యముతోఁ బండితులు మెచ్చునట్లు వెల్లడించుచుఁ ద్రిస్థాయులన్పాడుచు షట్కాలముల నర్తనము చేయుచు లయబ్రహ్మ యను ప్రఖ్యాతిగాంచిరి.

సి) గండ పెండేర ఘన సన్మానము :-

"కుడి యెడమ చేతులన్నను విషమజాతుల స్వీణ వాయించి తన యనన్య సాధ్య ప్రతిభకు మిక్కిలి సంతోషించి చల్లపల్లి రాజా శ్రీ అంకినీడు మల్లికార్జున ప్రసాదరావుగారిచే దర్బారులో బంగారు గండ పెండరము నొడిగించుకొనిరి."





కోసలుదేరిన మీసము దువ్వి నా
సము లెవ్వరని సవాల్ సల్పుఘనుఁడు



ముట్టగోచీపెట్టి మున్నెసుల్తానుల
నేజలాడఁగను వేఁడ్కకాఁడు.

అనుబంధము-౧

# యశశ్చంద్రికలు

యస్వీ జోగారావు

ఏకైక కళావిలసితుడైన మహేశునకే సర్వజ్ఞ బిరుదము చెల్లుచుండ, బహుళకళాభారధూర్వహుడను, నానాశాస్త్రనైకముఖ నైపుణ్యాగణ్యుడను నాకేల చెల్లదన్నట్లుగా నారాయణదాస కోవిదలోక రాకాశశాంకుడు తన ప్రౌఢవ్యక్తిత్వమును ప్రదర్శించి రసజ్ఞ జగత్తున తన యశశ్చంద్రికలను ప్రగల్భింపజేసెను. కళాకమనీయమైన ఆ మహా మహుని జీవిత మడుగడుగున రసవత్సన్నివేశపేశలమై ఆయన మనుగడ నాడే చారుచరిత్రమైపోయినది. ఆ చరిత్రమందలి యనేక సన్నివేశము లానాడనేక పత్రికల నలంకరించినవి. పరశ్శతములగు వానిలో నుప లబ్ధముల కతిపయముల నిట నుటంకింతును. వీనినుండి దాసుగారి విశ్వతోముఖమైన కళాకౌశలమును, పాండిత్యశౌండీర్యమును, అభిజ్ఞులు చేసిన ప్రశంసలను, సమర్పించిన బిరుదులను సాయించిన సన్మానములను గురించి కొంతకుగొంత తెలిసికొననగును.

1. "విజయనగర గర్వకారణము"

మదరాసు హైకోర్టు న్యాయవాది శిరోమణి రాయ్ బహాదూర్ శ్రీ పసప్పాకం ఆనందాచార్యులవారి నివాసములో దాసుగారు

"అంబరీషచరిత్ర" హరికథాగానము చేసిరి. సత్కవి యనియు, బహుముఖప్రతిభాశాలి యనియు, ఆంగ్లభాషాభిజ్ఞుడనియు, గీర్వాణాంధ్ర గిరాంధురంధరుడనియు, గాయకజగద్గ్రామణి యనియు, విజయనగర వైభవ గర్వకారణమనియు, బహుధా శ్లాఘింపబడిరి. వారి కథాఖ్యాన కౌశలము అనుకరణ కళకశక్యమైనదని సంభావింపబడెను. అడుగడుగున సామాజికులు నిర్భరహర్షోత్కర్షముతో పరవశించిపోయిరి. దాసుగారి హరికథాఖ్యానమొక సర్వకళా సమారాధనమనియు, ఆధ్యాత్మికానుభవ ఘంటాపథమనియు, ఆనందపువిందనియు, వారివృత్తి సముదాత్తము, చరితార్థము నైనదనియు ప్రశంసింపబడెను.

(హిందూ. 30-6-1894. పుట 5)

2. "ఉత్తర సర్కారుల సంపద"

తేది 25-8-94 న బెంగుళూరులో మైసూరు ప్రభుత్వోన్నతాధికారులయెదుట దాసుగారు సంగీత కాలక్షేపము చేసిరి. ఆరాత్రి దాసుగారి గౌరవార్థ మొక విందు నేర్పాటు చేసిరి. ఆ సందర్భమున ఉన్నత న్యాయాధిపతియైన శ్రీ రామచంద్ర అయ్యర్ గారు దాసుగారిని "ఉత్తర సర్కారుల సంపద" అని అభివర్ణించిరి.

(హిందూ. 29-8-1894. పుట 4)

3. "అంధ్ర దేశ భూషణము"

మదరాసు పురప్రముఖుల మహాసభలలో దాసుగారు స్వోపజ్ఞము లైన 'సీతాకల్యాణము', 'రుక్మిణీ కల్యాణము', అను హరికథలను ఆఖ్యానించిరి. ఆసాంతము సభవారు మంత్రముగ్ధులై యుండిరి. బహుముఖప్రజ్ఞాప్రదర్శనము, సముదాత్త భావవ్యక్తీకరణము, హాస్య చమత్కారసంపద, సంగీతమాధుర్యము, నృత్యకళాకౌశలము, భక్తి భావోద్రేకము అనునవి ఆ హరికథాకాలక్షేపముల స్వభావ జీవ లక్షణములు. ఆ మహాకవి, ఆ నెఱజాణ గాణ, ఆ మహానటుడు, నాట్య

శాస్త్ర విద్యావ్యాసంగ చంగుడు, నృత్యకళలో ప్రామాణిక పట్ట భద్రుడై మెరసినవాడు తాళానుగుణముగ ప్రదర్శించిన పదవిన్యాస మపూర్వము. అరువది యైదేండ్ల ప్రాయమున ఆయన ప్రదర్శన మింత పకడ్బందుగా నున్నందుల కవశ్య మభినందనీయుడు. "ఆంధ్ర దేశ భూషణము"గా వారిని సంభావించుటలో అత్యుక్తి యుండదు.

(స్వరాజ్య. 17-1-1928)

4. "విజయనగర దిగ్గజము"

"విజయనగర ప్రభువైన ఆనందగజపతి ఆస్థానము నలంకరించిన పేరి కాశీనాథశాస్త్రి, వీణ వెంకటరమణదాసు, నారాయణదాసు, రామానుజాచార్య ప్రభృతులు ప్రాచీన హంపీవిజయనగర దిగ్గజములను తలపింతురు."— అని శ్రీ కోలవెన్ను రామకోటేశ్వరరావుగారి వక్కాణ.

(త్రివేణి, జులై-సెప్టెంబరు సంచిక 1928)

5 "హరికథలకు ఆదిగురువు"

"విజయనగరము నుండి చెన్నపురికి వచ్చి ఆంధ్రుల ప్రజ్ఞాతి శయమును వెల్లడించి మెప్పుగాంచినవారిలో బ్రహ్మశ్రీ అజ్జాడాదిభట్ల నారాయణదాసుగారు మొదటివారు. వీరు ఆంధ్ర గీర్వాణభాషా కోవిదులు, సుప్రసిద్ధకవులు, హరికథలను చెప్పువారికాదిగురువులు. వీరి హరికథా కథననైపుణ్యమును, సంగీతశాస్త్రపాండిత్యమును, అపారమగు లయజ్ఞానమును ప్రశంసనీయములు ... ... ... నారాయణదాసుగారి ప్రశిష్యులగు శ్రీయుత పుచ్చల బవరదాసుగారు (శ్రీ వాజపేయయాజుల సుబ్బయ్యగారి శిష్యులు) గూడ నీమధ్య కొన్నిసారులు చెన్నపురికివచ్చి హరికథల నొసరించి బాగుగా గౌరవింపబడిరి."

(ఆంధ్రపత్రిక. 26-7-1928)

6. "హరికథా పితామహుడు"

విజయనగర మహారాజావారి ఆంతరంగిక కార్యదర్శి యగు ఆకెళ్ళ సత్యనారాయణరావుగారి యింట జరిగిన యొక వివాహసందర్భ

మున తేది 7-4-29న "హిందూదేశమందంతట విఖ్యాతిగాంచి (శ్రీ) మహారాజావారి సంగీత కళాశాలకు ప్రధానోపాధ్యాయులుగా నున్నట్టియు, మహాకవి, గాయక వైణిక నటశిరోమణియు, హరికథాపితామహుడునగు బ్రహ్మశ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాసుగారు 'రుక్మిణీ కల్యాణము' హరికథాకాలక్షేప మొనరించి సభలో నున్నవారందరిని ఆనంద సముద్రమున నోలలాడించిరి." అత్యద్భుతముగా రుక్మిణీకల్యాణ కథకొక ఆధ్యాత్మిక పరమార్థమును నిరూపించిరి. సంస్కృతాంగ్లపారశీకాద్యనేక భాషలనుండి సూక్తులను లోకోక్తులను గుప్పించిరి. "వీరి హావభావములు నాట్యము సాటిలేనివై యొప్పును. లయజ్ఞానములో నద్భుతప్రజ్ఞగల్గి నిరుపమానులై యున్నారు." వీరి హరికథవినుట కవకాశమేర్పరచి నందుకు సత్యనారాయణరావుగారిని సభవారు శతధా అభినందించిరి.

(ఆంధ్రపత్రిక. 18-4-1929)

7. "భారతమాత కూరిమి బిడ్డ"

తేది 16-2-30న బూరగాం గ్రామమున దాసుగారి 'సీతా కళ్యాణము' హరికథ జరిగినది. పర్లాకిమిడి వగైరా ప్రాంతములనుండి సుమారు రెండువేల జనము వచ్చి పరమానందభరితులై "ఇట్టి మహనీయునిగన్న భారతమాత యొక్కయు భారతీయుల యొక్కయు అదృష్టము కొనియాడదగియున్నది" అని శ్లాఘించిరి. దాసుగారిని (శ్రీ) ప్రగడ చిరంజీవులుభుక్తగారు సత్కరించిరి.

(ఆంధ్రపత్రిక. 20-2-1930)

8. గుడివాడ సత్కారము.

తేది 11-10-30న గుడివాడ మారుతి సినిమా హాలులో దాసుగారు 'సీతాకళ్యాణము' హరికథ చెప్పి సరససామాజికుల హృదయములను తస్కరించిరి. వారు వీరిని సత్కరించిరి.

(హిందూ. 16-10-1930)

9. సంగీత కళాశాల వార్షికోత్సవము.

తేది 22-2-31న దాసుగారు అధ్యక్షులుగానున్న విజయనగర సంగీత కళాశాల ద్వాదశ వార్షికోత్సవము అతివైభవోపేతముగా జరిగినది. దాసుగారి సంస్కృత శ్లోక పఠనము, వీణావాదనము సభ నలరించినవి. (హిందూ, 23-2-1931)

10. బహుభాషాకవిత్వము.

తేది 6-8-31న విజయనగరములో జరిగిన మహమ్మదు ప్రవక్త జన్మదినోత్సవ మహాసభలో— "సంగీత కళాశాల ప్రిన్సిపాలుగారగు శ్రీమదజ్జాడాదిభట్ట నారాయణదాసుగారు సంస్కృత, ఇంగ్లీషు, తెలుగు, పార్శీ, అరబిక్కు భాషలలో మహమ్మదువారి గుణగణములు వర్ణించుచు పద్యములు చదివిరి." (ఆంధ్రపత్రిక, 10-8-1931)

11. శ్రీనివాసయ్యంగారి ప్రశంస.

శ్రీ సి. ఆర్. శ్రీనివాస అయ్యంగారు దాసుగారి బహుముఖీన మైన సంగీతవైదుష్యమును, తథాపి సంకీర్తనాచార్యకత్వమును, బహు భాషా పాండిత్య శౌండీర్యమును, కవితానైపుణిని, అనువాదవైదగ్ధ్య మును హెచ్చుగా మెచ్చుకొనిరి. (హిందూ, 13-12-1931)

12. హరికథాభవన శంకుస్థాపన.

"జగదేక షట్ఛాస్త్ర పండిత బ్రహ్మశ్రీ ఆదిభట్ల నారాయణ దాసుగారు కొత్తపేటలో నేడు 11వ తేదీ మధ్యాహ్నము 12-20 గంటలకు హరికథా భవనము శంకుస్థాపన మొనర్చిరి."

(ఆంధ్రపత్రిక, 12-2-1932)

ఈ విషయము 12-2-32, 4-6-32 తేదీలనాటి "హిందూ" లోను, 1-7-32 నాటి ఆంధ్రపత్రికలోను ప్రసక్తమైనది.

13. ఋగ్వేద సంగీతాధ్యాపనము :

తేది 12-9-32న విజయనగరము శ్రీ మహారాజావారి సంగీత కళాశాల వార్షికోత్సవము అత్యంత వైభవముతో జరిగినది "ఈ కళాశాలలోని విద్యార్థులచేతను, విద్వాంసులచేతను, అన్నిరకముల గానము ప్రదర్శింపబడెను. గమనింపదగిన విషయము ఋగ్వేదము కంఠముననను, వీణపైనను స్వరయుక్తముగ (శ్రీ) నారాయణదాసుగారిచే నేర్పబడు చున్నది. (ఆంధ్రపత్రిక 22-2-1932)

[దాసుగారు ఋగ్వేదములోని కొన్ని ఋక్కులనెన్నికచేసి స్వరపరచి "మ్రొక్కుబడి" అను పేర నొక గ్రంథమును ప్రకటించిరి. సం.]

14. "స్వరాక్షర" కృతిస్రష్ట.

మచిలీపట్టణము పురమందిరమున (శ్రీ)హరి నాగభూషణముగారి అధ్యక్షతను జరిగిన సంగీతసభలో ప్రసంగించుచు ఆచార్య పి. సాంబమూర్తిగారు - మహావైద్యనాథయ్యరు, కులశేఖరాళ్వారు, ఘనం కృష్ణయ్యరులు సాధించిన "స్వరాక్షర" అనునొక విశిష్టకృతిరచనా మార్గములో ఆధునికులలో (శ్రీ) నారాయణదాసుగారు గొప్ప సిద్ధాంతులని శ్లాఘించిరి. (హిందూ. 27-10-32)

(ఆచార్య సాంబమూర్తిగారు 15-9-32 న దాసుగారికి వ్రాసిన యొక లేఖవలన దాసుగారు 1927 లో మదరాసులో జరిగిన అఖిల భారత సంగీత పరిషత్ప్రారంభోత్సవ సభలో కొన్ని లోకోత్తరములైన 'స్వరాక్షర' కృతులను గానము చేసినట్లు తెలియుచున్నది. సం.)

15. 'లయబ్రహ్మ' :

నాట్యాచార్యుడు, నెల్లూరునకు (శ్రీ) ఆర్. కె. అప్పా గారిట్లు వ్రాసిరి. "... ఈనాడు భరతనాట్యమున ప్రవీణులైనవారు, ఆ కళ

యొక్క జీవకళను నిలుప నుత్సహించువారు అతిస్వల్పముగా నున్నారు. అట్టి కొలదిమందిలో విజయనగర సంగీత కళాశాలాధ్యక్షులైన శ్రీ శ్రీ నారాయణదాసుగారొకరు." ఆయన స్వశక్తిచే 'లయబ్రహ్మ' బిరు దాంచితుడై వాసికెక్కెను. నృత్యకళా వైదూష్యమున గూడ ఆయన లబ్ధ ప్రతిష్ఠుడు. ఆ నేర్పును తన హరికథ లన్నిట చక్కగా వినియో గించుకొనును.

ఇటీవల నెల్లూరులో వారొక ప్రదర్శన మిచ్చిరి. ఆయన భారీ విగ్రహము నృత్యకరణమునకు ప్రతిబంధక మగునని యనుకొన్నవారు పొరబడిరి. ఆయన అభినయ ప్రజ్ఞావిలసన మట్టిది. ఆక్షేపించుటకు వచ్చిన వారు స్తోత్రములు చేయుటకు వేచియుండిరి. ... ఈ అరువది తొమ్మి దేండ్ల వృద్ధ నిష్ణాతుడు అడ్డంకుల కెదురొడ్డి యింకను నృత్యకళను ప్రద ర్శన చేయుచున్నాడు. పలువురు శిష్యులకు గరపుచున్నాడు. ... నేటి నృత్య కళాకోవిదులందు దాసుగారొక బ్రహ్మాస్త్ర బ్రహ్మ.

(స్వరాజ్య. 10-1-1933)

16. "శృంగార సర్వజ్ఞ" బిరుదు.

తేది 8-2-33 న విశాఖపట్టణమున సూపరింటెండింగు ఇంజనీ రయిన శ్రీ నీలకంఠ అయ్యరుగారి నివాస భవనమున దాసుగారు తమ హరికథా కాలక్షేపముతో పురప్రముఖుల నుల్లాస వారాశి నుఱ్ఱూత లూచిరి. నాడు దాసుగారికి "శృంగార సర్వజ్ఞ" బిరుద ప్రదానము గావింపబడినది. ఆ సందర్భమున శ్రీ మహాదేవ అయ్యరు, ఐ. సి. యస్. (District Magistrate & Collector, Bengal); దాసుగారి కొక అభినందన పత్రము సమర్పించిరి.

అందులో వారి వక్కాణ మొకటి. "Besides his mastery of music, what appealed to me most was his brilliant exposition of ideas expressed by great masters of poetry like Shakespeare. His translations of English and

Persian poetry were based on a born poet's instinctive understanding of the ideas of a fellow poet. The whole performance was indeed a feast of reason and flow of soul." (స్వరాజ్య. 10-2-1933)

17. పంచముఖీ ప్రదర్శనము :

"19-2-33 సాయంకాలము శ్రీ మహారాజావారి సంగీత పాఠశాలలో 14వ వార్షికోత్సవము అత్యంత జయప్రదముగా జరిగెను. విద్యార్థులచే ఋగ్వేదము స్వరతాళయుక్తముగ గానము చేయబడి వాటి యర్థము ఆంధ్రగీర్వాణ భాషలలో చెప్పబడెను. ఇయ్యది నారాయణదాసుగారిచే నవీనముగ రచింపబడి అందరిచే మెప్పుబడసినది. వేదము సర్వతాళయుక్తముగ సంపుటించుటలో దాసుగారే ప్రథములు. దాసుగారు అద్భుతముగ తమ ప్రతిజ్ఞ ప్రకటించి సభ్యుల మిక్కిలి రంజింపజేసి మన్నన వడసిరి. వారు పంచముఖీశ్వర తాళము పదియారు స్వరములతో తానము, పల్లవి, శబ్ద ముక్తాయింపు గనబరచి చక్కగ పూర్తి చేసిరి. (ఆంధ్రపత్రిక. 1-3-1933)

18 "సంగీత సాహిత్య సార్వభౌమ" బిరుదు.

తేది 20-3-33న విశాఖలో శ్రీ ప్రభల లక్ష్మీనరసింహము పంతులుగారియింట నొక వివాహ సందర్భమున జయపుర ప్రభువులు శ్రీ రాజా విక్రమదేవవర్మగారి సమక్షమున శ్రీ దాసుగారొక హరి కథా కాలక్షేపము చేసిరి. రాజావారు ఘనసన్మాన పురస్సరముగా దాసుగారికి "సంగీత సాహిత్య సార్వభౌమ" బిరుదప్రదానము గావించిరి. దాసుగారు సాటిలేని మేటి సహజ కవి యనియు సంగీతవిద్వాంసుడు సంస్కృత ప్రాకృతాద్యనేక భాషావైదుష్య విలసితుడు ననియు, వారి షేక్స్పియరు, కాళిదాసు, ఉమర్ఖయాము కృతుల యనువాదము లద్భుతములనియు మెచ్చుకొనుచు పంతులుగారు దాసుగారికి తాము త్వరలో కనకాభిషేక సన్మానము తలపెట్టినట్లు సెలవిచ్చిరి.

(స్వరాజ్య. 22-3-1933)

19. బ్రహ్మరథము :

తేది 9-11-33 న సాధారణముగా మఠాధిపతులకును, మహా విద్వాంసులకును జరుగునట్టి సర్వోత్కృష్టమైన "బ్రహ్మరథ" సన్మానము శ్రీ దాసుగారికి తుని పౌరులవలన జరిగినట్లు 13-11-33 నాటి హిందూ పత్రిక తెలుపుచున్నది. ఆ తేదీనాటి ఆంధ్రపత్రిక ఆ మహోత్సవము నిట్లభివర్ణించినది.

"రైల్వేస్టేషను నుండి ముఖ్య పురజనులు శ్రీ దాసుగారిని పుష్ప మాలాలంకృతులనుగావించి శ్రీ తుని దివాణపు మేనాసవారిలో కూర్చుండబెట్టి ముందు బ్యాండు వాయిద్యములు తరువాత గంధర్వాంగనా నృత్య గీతములు, పిమ్మట భాగవతోత్తముల నృత్య గీతవాద్య సహిత హరినామ కీర్తనలు, పాలకీ కిరువంకల భూసురోత్తముల స్వస్తి వాచనములు మిన్నుముట్ట, రాజమార్గంబున సకల పౌరాంగనలు నివాళు లిచ్చుచుండగా భక్తి సంతోషాతిశయములతో రాజ చూడామణులు..., రాజసతీ తిలకములును, నమస్కార పురస్సరంబుగ మంగళహారతులు, ఫలములును సమర్పించుచుండగా నా బ్రహ్మరథోత్సవము తుని ప్రభువుల యౌదార్యమును, తుని పౌరుల యాదరమును, శ్రీ దాసుగారి గౌరవమును మిక్కిలి యపూర్వాద్భుతానంద విశేషాతిశయముల నాంధ్రదేశంబునకెల్ల వన్నె దెచ్చెను."

తేది 10-11-33 న దాసుగారు తునిలో తమ యథార్థ రామాయణములోని "హనుమత్సందేశము" హరికథాగాన మొనరించిరి. ఆ సందర్భమున తుని వర్తక సంఘమువారు దాసుగారికి వినతిపత్రమును సమర్పించినట్లు 15-11-33 ఆంధ్రపత్రికలో గలదు. ఆ పత్రమునందలి యొక వాక్యము.

"హరికథయన నెట్టిదో యెఱుగని సమయమునం దాంధ్రదేశమను నందనవనమునందు పారిజాతమువలె నవతరించి మీ యసమాన

శేముషీ విశేషంబులచే నాంధ్రులను భక్తవరులుగా నొనర్చుచు ఆంధ్ర దేశమునందలి ప్రతి పట్టణమునకు నొక్కొక్క శిష్య కుసుమంబును ప్రసాదించుచు, హరికథలచే నాంధ్రులను బునీతులుగా నొనర్చుచున్న మీ జన్మము ధన్యము, ధన్యతరము, ధన్యతమము."

(అతఃపూర్వమే- "నందిగ్రామ ధరామరేంద్రులు మహానందంబుతో స్వస్తి వాక్సందోహంబులు మిన్నుముట్ట గడు నోజన్ మంగళ ధ్వానముల్ దిందిం మ్రోయఁగ" శ్రీ దాసుగారికి బ్రహ్మరథము పట్టి యూరేగింపుటుత్సవము జరిగినట్లు చయనులుగారు వ్రాసిన దాసుగారి జీవిత చరిత్రమున 143 వ పుటలో గలదు.)

## 20. యలమంచిలి హరికథ.

తేది 2-12-33న యలమంచిలి లక్ష్మీనాటకశాలలో దాసుగారు 'రుక్మిణీ కల్యాణ' హరికథాగాన మొనర్చిరి. ముందు పురజనులపక్షమున శ్రీ చిట్టిళ్ల సుబ్బారాయుడుగారిచే స్వాగత పంచరత్నములు సమర్పింపబడినవి. 'శ్రీ దాసుగారు వయోవృద్ధులైనను హరికథ యందలి అన్ని రకములను ప్రదర్శించి సభ్యులను ఆనందాబ్ధిలో ముంచివైచిరి.'

ఆంధ్రపత్రిక 6-12-1933)

## 21. గానకళాపరిషత్సన్మానము.

తేది 14-10-34న రాజమహేంద్రవరము 'గానకళా పరిషత్తు' దసరా మహోత్సవములు దాసుగారి హరికథా కాలక్షేపముతో ప్రారంభమైనవి. కాలక్షేపము నాలుగు గంటలు పట్టినది. దాసుగారి వివిధ కళావైదగ్ధ్యమునకు విశిష్ట గాన నృత్యశైలులకు, బహుభాషా వైదుష్యమునకు మహాసభ పరమానందభరితమైనది. అంత పెద్దవయస్సు నందును ఆయన ప్రదర్శించినపాటవము చలాకీతనము అద్భుతావహములు.

(జస్టిస్. 16-10-1934)

22. సరస్వతీ గానసభాసత్కారము.

కాకినాడ సరస్వతీగానమహాసభా మహోత్సవములలో దాసుగారొక హరికథా కాలక్షేపము చేసిరి. (హిందూ. 19-10-1934)

(1904లో కాకినాడలో స. గా. సభ యేర్పడినప్పటినుండి 1942 వరకు దాని ప్రతి వార్షికోత్సవమునకును దాసుగారి హరికథతోనే ప్రారంభము.)

23. "దేశోద్ధారకులు"

తేది 18-11-34న దాసుగారు గోదావరీమండలము నందలి పెనుగొండపురమునకు హరికథా కాలక్షేపము నిమిత్తము వెళ్ళిరి. అక్కడ నాడు శ్రీ గరికిపర్తి సుబ్రహ్మణ్యదేవరగారి ఫిడేలు కచేరి శ్రీ జవ్వాది లక్ష్మయ్య నాయుడుగారి అధ్యక్షమున జరిగినది. దాసుగారు మహానందముపొంది దేవరగారికి ఆదరమేదురముగా నొక కరపత్రము నొసంగిరి.

పెనుగొండ వాస్తవ్యులు శ్రీ తెన్నేటి వేంకటదీక్షితులను నొక పండిత ప్రకాండుడు దాసుగారికి సన్మానపత్రము సమర్పించిరి. అందులో దాసుగారు పెనుగొండకు రెండవతూరి వెళ్ళినట్లు గలదు. ఆ పత్రము నుండి రెండుముక్కలు : "తమరు లోకనుతులు. ప్రయోజకత్వ విద్యావాసన లిసుమంతయైన నెఱుగని యెందరి కుటుంబములో మృష్టాన్నము దినుచు తీవిగ జీవించుటకు మీరాధారులైతిరి ...... జన్మప్రభృతి విద్యాగంధమెఱుంగని యెందఱికో యుచితముగ హరికథా రహస్యములు సమన్వయించు శక్తి నొసగుటచేత దేశోద్ధారకులైతిరి"

24. బిరుద ప్రదానము :

బ్రహ్మశ్రీ పేరి రామమూర్తి శాస్త్రిగారికి భారతతీర్థ సభ్యులు బారువ గ్రామమునందు సాహిత్య పరిషత్సభ్యులగు బ్రహ్మశ్రీ ముద

జ్జాడాదిభట్ల నారాయణదాసుగారిచే 'గాయక వైణిక శేఖర' బిరుద మిప్పించిరని డాక్టర్ బుర్రా శేషగిరిరావుగారు తెలుపుచున్నారు.

(ఆంధ్ర పత్రిక. 23-1-1935)

25. వయోవృద్ధుడు - నృత్య నిత్య యౌవనుడు :

రాజమహేంద్రవరము Music Academy దసరా మహోత్స వములలో హరికథా గానముచేసిన దాసుగారిట్లు ప్రశంసింపఁబడిరి :-

"It is remarkable that though Mr. Narayana Das is nearly 72 years old he kept the packed ball spell-bound and made the function a great success. In spite of the old age Mr. Das danced like a young man of 25."

(ఇండియన్ ఎక్స్‌ప్రెస్. 30-9-1935)

26 సరస్వతీ గాన సభలో హరికథ :

కాకినాడ సరస్వతీ గానసభవారి కార్యక్రమమునందు-"ఈ సంవత్సరమునందు ప్రత్యేకముగా జెప్పవలసిన విషయ మొండుగలదు. అది శ్రీ ఆదిభట్ల నారాయణదాసుగారి అనన్య సామాన్య హరిభజనము, ఆయన వయస్సు 72 సం॥లు. వృద్ధత్వము హెచ్చుకొలది గాత్రగాన పటుత్వము, నృత్య పటుత్వమును మరింత హెచ్చుచుండుట ఆయన పుణ్యావిశేషమని చెప్పవలెను...రుక్మిణీ కృష్ణుల కల్యాణమును బుద్ధి పరమాత్మను లక్షించి లయమైపోవుటగా మార్చి రెండు గంటల కాలము ఆ వేదాంతమును భక్తిని ఉపదేశించెను." (ఆంధ్రపత్రిక. 17-10-1935)

27 హైదరాబాదు శ్రీత్యాగరాజ మండలి సన్మానము.

హైదరాబాదు :- "ఈ పురమందు ప్రస్తుతము జరుగుచున్న శ్రీ త్యాగరాజ మహోత్సవములకై యాహ్వానింపబడిన హరికథా పితామహ ఆదిభట్ల నారాయణదాసుగారు 29-2-36 తారీఖున ఇక్కడకు విచ్చేసిరి. . . . ఆనాటి రాత్రి సికింద్రాబాదులో సంగీత సభవారి

వత్సరమున 'రుక్మిణీ కల్యాణము' హరికథ జరుపబడినది పట్టణములోని సాహిత్యాభిమానులెల్లరు వచ్చి నారాయణదాసుగారి పాండిత్యమును, నాటక కళానైపుణ్యమును జూచి యానందమగ్నులైరి. 5-3-36 గురువారమునాడు ఆంధ్రమిత్రమండలివారు తమ భక్తిని వెల్లడించుచు దాసుగారికి సన్మానపత్రమును సమర్పించిరి. అందు—

"తెనుగుసీమయందు పట్టణములలోను, పల్లెలలోను బాలబాలిక లకు తమ నామము ఉగ్గుపాలతో నూరిపోసినదనుట వట్టి యతిశయోక్తి కానేరదు. ఆంధ్రావనిలో హరికథ తమతో బుట్టినది. అట్టి హరికథ 'నభూతో నభవిష్యతి' యని చెప్ప సాహసింతుము" అని యుగ్గడింపబడినది.

ఆ సందర్భమున ఆంధ్ర ప్రముఖులగు శ్రీయుత సురవరము ప్రతాపరెడ్డిగారు పండితోత్తములగు దాసుగారి విద్వత్తును గూర్చి ప్రశంసించిరి. 6-3-36న తుల్జా భవనములో "హనుమత్సందేశము"ను హరికథ చెప్పబడినది. ఆంధ్రదేశమందు నారాయణదాసుగారి పేరిదివరకే యెల్లరకును దెలిసియుండుటచే నాంధ్రులేమి యాంధ్రేతరులేమి సుమారు 5000 (అయిదు వేలమంది) సమావేశమయిరి. .... ఈ యుత్సాహమును బట్టి మఱింత యావేశముకల్గి దాసుగారు ప్రదర్శించిన నృత్యము వర్ణనాతీతము. ఈ వృద్ధాప్యములో నిట్టి శక్తి సామర్థ్యములు కలిగియుండుట యద్భుతము. . .కథముగిసినతరువాత శ్రీ దోమా వెంకటస్వామిగుప్తగారు దాసుగారిని శ్లాఘించుచు పద్యములను జదివిరి. నారాయణదాసుగారి రాక యిక్కడ నివసించుచున్న యాంధ్రులకు మితిలేని సంతసమును గలిగించినది. . ." (ఆంధ్రపత్రిక. 16-3-1936)

ఈ హరికథా కాలక్షేపముల ప్రసక్తి 9-3-36 నాటి ఇండియన్ ఎక్స్‌ప్రెస్ నందును, 10-3-36 నాటి ఆంధ్రపత్రికయందును గలదు.

28. సవాల్ :-

ఎవరో యొక సరసాగ్రేసర చక్రవర్తి చేసిన సవాల్ ఇట్లున్నది. "శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాసుగారి యెదుటనే యరవ పాటకుడు కూర్చుండినసమమైన సమాధానము చెప్పగలడా? ఈ ప్రశ్నకు అరవ వారుగాని, అరవల పక్షపాతులుగాని జవాబునీయ వేడుచున్నాను."

(కృష్ణాపత్రిక. 25-7-1936)

29. ఇల్లెందుపుర పండిత సన్మానము :

తేది 19-5-1937 లో సింగరేణి కాలియరీస్ కడ ఇల్లెందుపుర వాస్తవ్యులు దాసుగారికొక పండిత సన్మానము జరిపిరి. సన్మానపత్రికలో దాసుగారి హరికథా కథన దక్షతతో పాటు వారి సారస్వత ప్రతిభ నతి మాత్రముగా కొనియాడిరి. అందొక వాక్యము—

"ఉమర్ ఖయాము రుబాయీల భాషాంతరీకరణములోని సంస్కృత శ్లోకములందు భూతకాలమున లుఙ్మాత్ర ప్రయోగమును, తెలుగు పద్దియములు అభూతపూర్వ మనన్యసాధ్యమగు కేవల దేశ్యాంధ్ర పద ప్రయోగనియమముల బాటించి రచించిన మీనిరుపమానపాండిత్యమును గొనియాడ నసాధ్యము."

30. సంగీతవిద్వాంసులకు బహిరంగలేఖ.

శ్రీ దాసుగారికి ఇప్పుడు 76 సంవత్సరముల వయస్సు. జీవించి యున్న పేర్గొన్న సంగీతవిద్వాంసులలో వీణె వెం: టరమణదాసుగారు తప్ప యీయనయె పెద్దవాడు. పై శరగతిలో చేరిన సంగీత సాహిత్య విద్వాంసులలో నొకరుగా పరిగణింపబడుచున్నారు. కొద్దివాడనయిన నా అభిప్రాయముతో బనిలేదు. మనదేశమున పేరుగల సంగీత

విద్వాంసులలో మీలో ననేకులను నేను పరిచయము చేసికొంటిని. వారితో ప్రసంగించునపుడు శ్రీదాసుగారికి గల అసమానసామర్థ్యమును వారు అంగీకరించినట్లే నుడువుచువచ్చిరి. అట్టివారి యభిప్రాయమును నేను విశ్వసింపకతప్పదు మరియు శ్రీదాసుగారు 'హరికథాపితామహు' డనియును, 'లయబ్రహ్మ' యనియును మనదేశమందు వాడుకలో నుండగా, అనేక సంవత్సరములనుండి నేను వినుచుంటిని. ఆయన హరికథలన్న వేలకొలది జనులు మూగుచుందురు. ఆయన నాయింటి యందు అనేకసారులు విడిది చేసిరి. ఆయన కూర్చుండుచోట వంద మందికి తక్కువగాని జనము చుట్టియుందురు. ఆయన దారిని నడుచు చుండగా వందమందికి తక్కువగాని జనము వెంబడించుచుందురు. ఆయనవ్రాసినహరికథలను మనదేశములో ననేకులు హరికథకులు పఠించి ఆయన పోలికననుకరించి చెప్పుచుందురు. కొందరు సమర్థులయిన హరి కథకులు కథప్రారంభమున ఆయన పేరు స్మరించి నమస్కరించిన పిమ్మట కథను సాగింతురు. ఆయన రచించిన కీర్తనలు, కృతులు నవీనమయినమట్లు గలిగి వినసొంపుగానుండును. ఒకడు త్రొక్కిన దారిని ఆయన త్రొక్కడు. ఆయనయందు సూక్ష్మబుద్ధితో చేరిన స్వయంవ్యక్తిత్వము అనగా "Original Genius" కలదని కొందరి పెద్దల యభిప్రాయము. ఆయన విగ్రహము మిగులదర్జాగలదియై మొనదుగలతీక్ష్ణతను ప్రకటించుచుండును. సర్వవిధముల శ్రీదాసుగారిది గొప్పవ్యక్తిత్వమై "Personality" యున్నది. మహారాజుల సంస్థానములలోను, జమీందారీ మహాళ్ళ లోను, గొప్ప గృహస్థులమేడలలోను, ఆయన తన విద్యావైపుణ్యమును చూపి శాభాష్ అనిపించుకొన్నవాడు. తన వృత్తిలో విశేషించి ధనము నార్జించినాడు.

ఏశక్తిగాని సమర్థతగాని లేకనే శ్రీ దాసుగారు అట్లు నిర్వహింపగల్గిరా! లేక ఆయన వద్ద గారడీగాని మాయగాని

యున్నదా ?. పైన వ్రాసిన అంశములు ఉత్త కల్లలేనా ? పెద్దలు యోచించెదరుగాక !

(Sd). దాసు గోవిందరావు, బి. ఏ.,
వకీలు, బందరు.
(కృష్ణాపత్రిక. 26-3-1938)

31. హరికథా ప్రశంస :

హరికథ గూర్చి శ్రీ కె. వెంకటరత్నముసూరిగారిట్లు వ్రాసిరి. "ప్రఖ్యాత గాయక శిరోమణి, సాహిత్య సార్వభౌముడు శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాసుగారు ఏతత్కళయందు విపులకృషి సలిపి క్రొత్త తళుకు, క్రొత్త మెరుగు, క్రొత్త రసములు, క్రొత్త భావములు దొలకరింప, కేవలము భగవద్భక్తులనే గాక లోకానురక్తులను సైతము నువ్విళ్ళూరింపజాలు పెక్కు యక్షగాన ప్రబంధములను సముత్కృష్ట శైలిని వివరించి, వినిపించి, నిరుపమాన కీర్తిచంద్రికల దెసల వెదజల్లిరి. అంతటనుండి, హరికథా కాలక్షేప కథ సర్వజన సమాదృతమై విలసిల్ల జొచ్చినది. తోడ్తోనె మామిడితోపాటు కారు వేము సైతము పూవు దొడుగు మాడ్కి కూనిరాగములు తీయగల కుంటుకవులు పెక్కురు ఏతత్కళారంగముపై దాడివెడలి ఎచ్చటి కచ్చటనే తమ చింకిగుడారముల నాటజొచ్చిరి." (ఆంధ్రపత్రిక 3-6-1938)

32. తిరువనంతపుర రాజ సత్కారము :

"మహాకవి, 'హరికథాగాన పితామహ' అజ్జాడాదిభట్ల నారాయణదాసుగారు గత నెల 23-వ తేదీనాడు తిరువనంతపురములో రాజభవనమునందు శ్రీ తిరువాంకూరు మహారాజు, మహారాణి మొదలగు ప్రభువుల యెదుట ఒక గంట కాలము వీణాగానమును, నృత్యప్రదర్శన

మును జరిపిరి. మహారాజుగారు ఆనందితులై దాసుగారిని ఉచితరీతిని సత్కరించిరి."

(ఆంధ్రపత్రిక, 3-8-1938)

33. నాగర్ కోయిల్ హరికథ :

తేది 5-8-38 న నాగర్ కోయిల్‌లో రావుబహాదుర్ ఎమ్. నీలకంఠ అయ్యరుగారి నివాసమున దాసుగారు విశిష్ట శైలిలో నొక హరికథను, పదాభినయమును ప్రదర్శించిరి.

(మదరాసు మెయిల్. 8-8-38)

34. చెన్నపురి ఆంధ్ర మహా సభా సన్మానము

తేది 28-8-38 న దాసుగారిని చెన్నపురి ఆంధ్రమహాసభవారు అసెంబ్లీ అధ్యక్షులు శ్రీ బులుసు సాంబమూర్తిగారి సభాధ్యక్షతన సన్మానించిరి. "సీతాకల్యాణము" హరికథాగానముచేసి "శ్రీ నారాయణదాసుగారు" 75 సం॥లు నిండినన్నీ సహజ గంభీర గాత్రంతో చతురాభినయ రీతులతో, వివిధ భాషాపాండిత్య ప్రకర్షతో, అద్భుత హాస్యరసంతో సభ్యులందరినీ తనియ జేసిరి." త్వరలో గోఖలే హాలులో దాసుగారికి మరియొక సన్మానము జరుగనున్నట్లు సభలో ప్రకటింపబడెను.

(ఆంధ్రపత్రిక. 29-8-38)

"నిన్న మదరాసు ఆంధ్రమహాసభవారు హరికథా బ్రహ్మయైన ఆదిభట్ల నారాయణదాసుగారికి సన్మానముచేసిరి...సాంబమూర్తిగారు సభకు అధ్యక్షత వహించుచు సంగీతములోకాని, హరికథ చెప్పుటలో కాని, కవిత్వములోగాని వారికి సాటియైనవారు లేరనిరి...దాసుగారుతమ 75 వ యేట బాలకురంగమువలె గెంతులిడుచు నృత్య, నృత్త, నాట్య భేదములను జూపిరి. ఏ యంత్ర సాహాయ్యములేకయే భావయుక్తమైన సంగీత కల్పన రాగప్రస్తారముచేసి సభాసదుల నందరిని స్తంభీభూతుల జేసిరి."

(జనవాణి 29-8-38)

35. త్రిలింగ విద్యాపీఠ సన్మానము ;

తిరుమల త్రిలింగ విద్యాపీఠమున (బెజవాడ) దాసుగారు శిష్య గణ సహితముగ సన్మానింపబడిరి. పీఠాధిపతులు శ్రీ దంటు సుబ్బావ ధానిగారు స్వాగత మొసగిరి. "విద్వత్కవితిలక" శ్రీమతి కాంచనపల్లి కనకాంబగారు ప్రశంసా పద్యములు చదివిరి. సర్వశాస్త్రముల పరమ ప్రయోజనము గురించి, భక్తిగురించి దాసుగారుపన్యసించిరి. "పంచ ముఖీ పరమేశ్వర" బిరుదాంచితులైనవారు రెండు చేతులతోను, రెండు పాదముల విన్యాసములతోను, శిరశ్చాలనముతోను, ఏకసమయ సంఘ టితముగా తాళపంచక సంచార ప్రజ్ఞను పరిఢవించి పంచాయతన పూజ గావించిరి. సర్వతోముఖమగు వారి పాండిత్యమున కందరు విస్మయము నొందిరి. తమకు సమకాలికులు. పూర్వులునగు సకల విద్వాంసులను స్మరించి దాసుగారు వారి గొప్పను బొగడిరి".

(ఆంధ్రపత్రిక 5-9-1939)

36. ఆంధ్ర మహాసభా సన్మానము :

తేది 10-9-38 న గోఖలే హాలులో చెన్నపురి ఆంధ్రమహాసభ వారు దాసుగారిని ఘనముగ సన్మానించిరి. దాసుగారు "హనుమత్సందే శము" హరికథాగానము నత్యద్భుతముగాచేసిరి. సర్ అల్లాడి కృష్ణస్వామి అయ్యర్ గారు, శ్రీ బులుసు సాంబమూర్తిగారును దాసుగారిని మిక్కిలి శ్లాఘించిరి.

(జనవాణి 12-9-1938)

37. అనన్వయాలంకారము :

ఇందు శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు "కొందరు తెలుగు కవులు" అను వ్యాసమున దాసుగారి గురించి యిట్లు వక్కా ణించిరి. "సంగీతమందును, సాహిత్యమందును, నృత్యమందును వివిధ

భాషా పరిజ్ఞానమందును ఆఱితేఱిన ప్రజ్ఞావంతులు ఆదిభట్లవారు. భారత భూమిలో వీరికి సాటి వీరే."

(భారతి సం. 1939. సంపుటము 16. సంచిక 2)

38. నభూతో న భవిష్యతి.

తేది 10-4-39న మదరాసులో శ్రీ మంత్రిప్రగడ నరసింహాం పంతులుగారియింట దాసుగారు 'రుక్మిణీ కల్యాణ' హరికథాగానము చేసిరి. శ్రీ బులుసు సాంబమూర్తి, సర్ ముత్తా వెంకటసుబ్బారావు, సర్ కూర్మా వెంకటరెడ్డినాయుడు, సర్ వేపా రామేశం, సర్ అల్లాడి, మదరాసు మేయరు కె. వెంకటస్వామినాయుడు ప్రభృతులు సభనలంకరించిరి. ఎల్లరును దాసుగారిని కొనియాడిరి. "సంగీత సాహిత్యముల యందిట్టి సామర్థ్యము గల వారాంధ్రదేశమున నిదివరలో జనింప లేదికముందు జనింపబోరు" అని శ్లాఘించి, పంతులుగారు దాసుగారిని సన్మానించిరి. దాసుగారు వారిని ఆశుపద్యములతో ప్రశంసించిరి.

(ఆంధ్రపత్రిక. 12-4-1939)

(ఈ విషయము 11-4-39 నాటి 'హిందూ' లోను ప్రకటిత మైనది.)

39. హరిదాస జగద్గురువు.

'ఆంధ్ర దేశానుబంధము' లో దాసుగారు హరికథ శాస్త్రనేసరులు గాను, ఎందరో హరికథకులకు గురుపీఠముగను, కవిగా గాయకుడుగా, బహుభాషా వేత్తగా బహుధా ప్రస్తుతింపబడిరి.

(ఇండియన్ ఎక్స్‌ప్రెస్. 23-9-1941)

40. దాస శబ్ద ప్రశంస :

దాసశబ్ద ప్రాశస్త్యము గూర్చి కొంత చర్చజరిగినది. "నేడు హరి దాస శ్రేణికి దలమానికమై చెన్ననగర పరగణా యందంతట విజయ

భేరి మ్రోయించుచు, బిరుదండెవైచి విలసిల్లుచున్న శ్రీ శ్రీ శ్రీ అజ్జాడాదిభట్ట నారాయణదాసుగారి పేరుతో బ్రకాశించుచున్న 'దాసు' శబ్దమును దమతమ నామములతో జేర్చుకొన నేహరిదాసును వెనుదీయ జాలడని చెప్పవచ్చును" అని యున్నది. (ఆంధ్రపత్రిక. 23-2-1941)

41. కళాపరిషదధ్యక్షత.

తేది 7-5-43న విజయనగరములో ఆంధ్రకళాపరిషత్తు ప్రారంభోత్సవసభ దాసుగారి అధ్యక్షతను జరిగెను. (ఆంధ్రపత్రిక. 12-5-1943)

అసలు వారిజీవితమే ఒక కళాపరిషత్తు
వారి వ్యక్తిత్వమే ఒక రసజగత్తు.

నారాయణదాస జీవితరంగమున వెల్లివిరిసిన యశశ్చంద్రికలనేకముండ పత్రికల కందినవి కొన్ని మాత్రమే. అవియు పరశ్శతముగా నున్నవికాని కొలది మాత్రమే మా యందుబాటులోనికి వచ్చినవి. వాని సారమును ఉపరి నిరూపించితిని.

తేది 30-8-1924న వారి షష్టిపూర్తి మహోత్సవము విజయనగరమున అతిమాత్ర విభవోజ్జ్వలముగా జరిగినది. 1945లో వారి హరికథకు షష్టిపూర్తి మహోత్సవమును శిష్యులు, మిత్రులు, అభిమానులు భారీ యెత్తున జరుపుట కుత్సహించి వారొకవంక ప్రయత్నములు చేయుచుండగా దాసుగారు పరమపదించిరి. 30-8-1964న దాసుగారి శతజయంత్యుత్సవ సందర్భముగా ఆనాటి ఆంధ్రప్రభ ఆదివారం సంచికలో దాసుగారి గురించి సచిత్రమైన ఒక ప్రత్యేక వ్యాసంలో "ఒకటి రెండు విద్యలలో సమానులుగా పాటి చదగిన వారుండవచ్చు. కాని ఏక కాలంలో అనేక విద్యలలో, అనేక కళలలో ఆరితేరి అన్నిటా సమధిక ప్రజ్ఞావంతుడుగా సకల కళానిధిగా పరిగణించ దగిన వ్యక్తి అరుదుగా మాత్రమే ప్రభవిస్తాడు. శతజయంతి మహోత్సవ సందర్భంగా

నేడు మనం సంస్మరిస్తున్న యశశ్శరీరుడు శ్రీమదజ్జాడ ఆదిభట్ట నారాయణదాసు అపురూపమైన అట్టిమహావ్యక్తి అనడానికి సందేహం లేదు... ఇట్టి సకల కళావిశారదునకు, ఇట్టి వరప్రసాదునకు, ఇట్టి పుంభావ సరస్వతికి శతవార్షికజయంతి సందర్భంగా యావదాంధ్ర జాతి జోహారులర్పించడం సర్వసమంజసం..."

చీరాల 'సంస్కృతి సమితి' వారు దాసుగారి శతజయంత్యుత్సవము నతివైభవముగా జరిపి, 1967 లో దాసుగారి స్మృత్యర్థ మొకపెద్ద సంచికను బలువురు పెద్దల వ్యాస సంపుటిగా రూపొందించి ప్రకటించిరి. 1945 లో మధ్వశ్రీ కాశీ కృష్ణాచార్యులువారి ఆధ్వర్యవములో విజయవాడలో శ్రీ నారాయణదాస హరికథాగాన కళాపరిషత్తు స్థాపితమైనది. ప్రతివత్సరము దాసుగారి ఆరాధనోత్సవములు జరుగుచున్నవి. అంతేగాక దాసుగారి శిష్యులలో అగ్రగణ్యులు శ్రీ నేతి లక్ష్మీనారాయణ భాగవతుల పూనికపై విజయవాడ సత్యనారాయణపురము శివాలయావరణములో 1953 లో దాసుగారి శిలావిగ్రహము వైదిక మంత్రోక్తముగా ప్రతిష్ఠితమై అనుదినము దానికి పూజాపురస్కారములు గూడ జరుగుచున్నవి. ఇంకను దేశమున విజయనగరము, రాజమహేంద్రవరము, పాలకొల్లు మున్నగు తావుల దాసుగారి ఆరాధనోత్సవములు జరుగుచున్నవి.



# పూ జా పు ష్ప ము లు

[శ్రీ దాసుగారి గురించి వివిధకవులు వ్రాసిన ప్రశంసా పద్యములు పరశ్శతముగా నున్నవి. అందు కొన్ని మచ్చుతునకలను మాత్ర మిందు పొందుపరిచితిమి. సం.]

సీ॥ రంభ దాఁ బుంభావ రాజితయై వచ్చి
లాస్యం బొనర్చు లీ - లలు జెలంగ
భారతి పుంభావ భాసురయై వచ్చి
గానం బొనర్చు సం-గతులు వెలయ
నారదుం డతుల శృం - గారవేషత వచ్చి
హరికీర్తనము చేయు - కరణి మెఱయ
ప్రహ్లాదుఁడిల విప్ర భావంబు గొనివచ్చి
శ్రీహరిని భజించు - చిన్నెలలర

జగతి కందఱ కమృతం బొ - సంగవచ్చు
నల జగన్మోహినీ కలా - కలిత గతుల
రమ్య తర వర హరికథా - రచనయందు
నలరితి సెబాసు నారాయ - ణాఖ్యదాసు. 1

—సత్యవోలు సోమసుందరకవి 1896

శా॥ శ్రీనారాయణ పాదపంకజ సుధా - శీ! పూషవాడ్భూభృదా
స్థానాచార్య పదప్రవృత్త సకలా - శా వ్యాప్తసుశ్లోక రా
శీ! నిష్పన్న చతుర్విధార్థ! మహిసూర్ - శ్రీశ్యామరాజేంద్ర స
న్మానీ! ధీరశిరోమణీ! గుణధనీ! నారాయణార్యాగ్రణీ! 2

శా॥ నందిగ్రామ ధరామహేంద్రులు మహా-నందంబుతో స్వస్తివాక్
సందోహంబులు మిన్నుముట్టఁ గడునో - జన్ మంగళధ్వానముల్
దిందిమ్మోయఁగ నీకు బ్రహ్మరథమున్ - దివ్యంబుగాఁబట్టు నా
చందంబొప్పు నొనర్చి రా మునులు వి-శ్వశ్రేయ సంధాతకున్. 3

మ॥ పరమామ్నాయపథ ప్రవక్తవని సం-భావించి యానాడు నిన్
వరవేదండ నివిష్టుఁజేసి మఱియున్ - బాజాబజంత్రీలతో
నిరవొంద న్మను నూజవీఁటి నృపు లూ - రేఁగింపరే! కీర్తి సు
స్థిరుఁడా యట్టులనే యొనర్చి రపుడా - జేజేలు సర్వజ్ఞునిన్. 4

మాలిని॥ విల సదుభయభాషా - విశ్వసాహిత్య భూషా
నలలిత కవితా శ - శ్వన్మనీషాత్మ తోషా
కలిత రుచిర ప్రావృ - ట్కంద గర్జాభ కంఠో
చ్ఛలిత విబుధకోటీ - సార సంగీత ధాటీ॥ 5

కం॥ వరవీణా వాదన త
త్పర, శ్రీ మద్విశ్వనాథ-పదపంకజ బం
భర, విజయవాటి కాపుర
హిరణ్య దుర్గాప్రసాద - కృత సిద్ధార్థీ! 6

—పనుమర్తి కృష్ణమూర్తిశాస్త్రి (1922)

(దాసుగారి కంకితమైన పార్వతీ పరిణయ యక్షగానము)

చం॥ ప్రతిభయు నూతనత్వమును - పాండితి యౌచితి భావకల్పనా
చతురత తూగునుం గలిగి - సాహితి తత్పరులౌననంగ గే
యత రస సంభృతంబులు న్నో-నన్యములైన కృతుల్ రచించి ధ
న్యతఁ గనినాఁడు ధన్యతముఁ - డాంధ్రవచో విభవాభిరాముఁడై. 7

—డా॥ బుర్రా శేషగిరిరావు, 1924.

గీ॥ మణివిరాజిత కాంచన - మకుటమువలె
లలిత గాంధర్వ వైదుష్య - కలితమైన
సాహితీ పటిమ స్నీవు - సరస ఫణితి
కవితఁ గావించి ప్రఖ్యాతిఁ గాంచి మించి
వన్నె వెట్టుచు భవదీయ - వంశమునకుఁ
దెచ్చితివి పేరు నీవుండు - దేశమునకు
ధన్యమతివి నారాయణ - దాస సుకవి॥ 8

— అడిదము రామారావు

ఉ॥ ఆయతకీర్తి దంతుర దిశాంతరుఁడై నిగమాంత సాహితీ
స్ఫాయదమేయ ధీవిభవ - సారయుతుండయి గీత సత్కళా
తోయజ సూతి సూతియయి - స్తుత్యమతిందగు "నాదిభట్ట నా
రాయణదాస" సత్కవి చిరాయువుఁగల్గి సుఖించు గావుతన్. 9

—విశ్వనాథ కవిరాజు

గీ॥ నీవు సూతమహర్షివై నిఖిల హరిక
థా విశేషంబులను జెప్పి - తనరు కతన
నైమిశారణ్యమయ్యె నం - ధ్ర ప్రదేశ
మాంధ్ర దేశీయులును శౌనకాదులైరి
దానకవిచంద్ర కడు ధన్య - తముఁడ వీవు॥ 10

—భోగరాజు నారాయణమూర్తి

ఉ॥ గాయక కోటి నిన్గొలువగా పురవీథుల నేగుదెంచి వా
హ్వాయని పండిత ప్రవరులందరు నిన్గని సంతసిల్లగన్
బాయవికూర్మితోడ లలనామణు లారతులిచ్చిపాడ నా
రాయణదాసవర్య యశమందితివౌ భళి షష్టిపూర్తి చే॥ 11

—ఆదిభట్ల వెంకటచ్ఛాయనులు

సీ॥ పాటలో నారదు నాటలో భరతుని
మాటలో శేషుని మీటవాణి
వెలయఁబోలినవాఁడు విజయనగరవాసి
ప్రఖ్యనెందును సార్థ పరుచువాఁడు

నయిన శ్రీ ఆదిభట్టాన్వయ నారాయ
ణాఖ్యునోటఁగథల నాలకించు
నట్టిరు సెవులతో నమృత మానెడు వారె
యౌదురు గాని యన్యంబుగాదు

పొట్టకై హరికథ కతబూని సభల
తకతకలనాడు వారిరీతి కనిపట్టి
రరరె వారి పీరిఫరకు నరయఁగలరు
నరకులందు మంచినరకు నెరుఁగగలరు ॥ 12

—దోమా వెంకటస్వామిగుప్త, 1935

సీ॥ "పలుబాసలన్ ముద్దు - లొలుకు కైతలు సెప్పు
పిన్నాణి"వని గంట వేసినారు
అచ్చపు లయకాఁడ - వని 'గండపెండేర'
ముడుగక డాకాలఁ - దొడిగినారు
ఆడిపాడియు నుడి హాయిఁబెంప 'హరిక
థా పితామహ' బిరు - దమిడినారు
అపర సరస్వతి వని యేన్గుమీఁద నె
క్కించి యుత్సవమొన - రించినారు

ధరణిపతులు; నారాయణదాస! నీకు
నింతవాఁడవు నసుఁబరీ - క్షించి నాకు
నలఘు "వాగ్గేయకారహ - ర్యక్ష" బిరుద
మిచ్చితి వయాచితముగ ని - దే జోహారు 13

—కట్టా అచ్చయ్యకవి 1938

సీ॥ డెబ్బదేండ్లు పయిబడినగాని యెవ్వాని
బొమ్మపుష్టికిఁ జలనంబులేదు
కృతిలీనముగను బూరించుచో నెవని గా
త్రధ్వని క్రోసెడు దాక మ్రోయు

మూకగా నమరులు మూఁగి మెత్తు రెవని
గండపెండెరమున్న కాలియాట
ఇష్టదైవము పిల్చియిచ్చు కోర్కె లెవని
భావాభినయ పటుత్వంబుగాంచి
ఎవఁడు సంగీతమునకు సాహిత్యమునకు
మధురభాషకు బోధనా విధములకును
పుట్టుగవి హరిదాస సంపూజ్యుఁడెవ్వఁ
డా సుచరితు నారాయణదాసుఁ గొల్తు 14

పాతూరి మధుసూదనరావు

శ్లో॥ షడ్భిర్ముఖైః ప్రథితశాస్త్ర విశేషషట్కం
శర్వస్యపుత్ర మభివీక్ష్య పఠన్ హసంతం
ఏకేన వక్త్రేన సమస్త శాస్త్రా
నారాయణాఖ్య హరిదాసగురుం నమామి 15

— రాళ్ళపల్లి సూర్యనారాయణశాస్త్రి, 9-10-1944

శ్లో॥ అనన్య సాధారణ శక్తి యుక్త
స్స్వయంతు నారాయణదాస ఏకః
అన్యేతు సాధారణశక్తియుక్తా
స్సర్వేపి నారాయణదాసదాసః. 16

—రాంభట్ల జగన్నాథశాస్త్రి 23-7-1947

కం॥ శారద యీ జగతి తదా
కారంబున నవతరించె నల విద్యలతో
నారూఢిగ నీవౌరా
నారాయణదాస నిన్ను నామది తలతున్. 17

—సామవేదుల సూర్యనారాయణసోమయాజులు

కం॥ నీ నడిపాయంబు గళరవ
మే నోచగనైతి వినఁగ - యేర్పడమొన్నన్
పూని యెలుగెత్తి ట్యాండున్
మానిపి తయ్యప్పయింట - మహిమంబొప్పన్. 18

— వేదనభట్ల వెంకటరమణయ్యదాసు. 18-5-1944

మ॥ పౌడమండింతటి జాణ నేలనిటుపై - ముమ్మారు వ్రాక్రుత్తు వీ
తడె యాడీతనికండు బల్చదువరుల్ - తామెంతయున్మెచ్చియొ
క్కడె తా గండరగండడై దవిణ మోగ్రిగన్ మోదుచున్మించు నె
వ్వఁడు నారాయణుబోలి పేర్కొనబడున్ బల్మాటలింకేటికిన్. 19

—కలువలపల్లి రంగనాథశాస్త్రి. 6-1-1937

సీ॥ శ్రీహరికథల వ్రాసె - నె వ్వెర్వుమీఱ యే
కవులకు శక్యంబు - గాని ఫణితి
కుడియెడమల గతు - ల్నడిపించె వేర్వేరు
విధముల వైణికుల్ - బెగడు ఫక్కి
పంచముఖీతాళ - పద్ధతి గల్పించె
భయపడి గాయకుల్ - బారురీతి
హావభావముల నృ - త్యమొనర్చెభరతశా
స్త్ర విధుల్ జోహారుల - సలుపు రీతి

నట్టి మద్గురు నాదిభట్టాన్వయాబ్ధి
చంద్రు నారాయణాఖ్యుదా - నవరు హరిక
థా పితామహు శిష్య వా - త్సల్య హృదయు
నతుల గొల్చెద నేవేళ - నయముమీర. 20

—హరిసోమయాజుల సుబ్రహ్మణ్యము 17-9-1942

సీ॥ వైదికంబునకు నో - ప్పని మీసము లవేల
కవిరాజనని యెరు - కపరచుటయొ!
పురుషవేషమున కొ - ప్పనె నిండు కొప్పేల
యిన్ని కావ్యముల ర - చింతుననియొ
సింహలలాటముల్ - సేతుల కవియేల
పండితేభముల భయపరచు టొకో!
కాలికి బంగారు - గండపెండెర మేల
రాట్సభా పూజ్యతా - ప్రకటనంబొ!

వేషమున కర్త మైనట్టి భాషలొప్పు
ప్రౌఢ, వేవేషమైనను పొల్పు గొల్పు
వేషమునకేమి పటురసా — వేశమైన
యపుడు నిగ్గన కన్దోయి - యాటునటవె. 21

సీ॥ ధారాధరము, దేవ - దత్తమా పాడుచోఁ
గుత్తుకలోదూరి - కోసుపెట్టు
వాయుఁడా లేకాంజ - నేయుఁడా నృత్యపుం
దళివి మేనికిఁ జుల్కఁ — దనము నిచ్చు
భరతుఁడా నందికే - శ్వరుఁడ నీకెరవిచ్చు
నందఱ నుబ్బించు - నభినయ కళ
శారదయా పరాశక్తియా నీవాల్కఁ
దాండవించుఁ గథాక-థనమువేళ

నారదాంశ పరిపూర్ణావ - తారమవనఁ
జాలఁ గొషాయ పటజటా — జాల రహితు
నిన్ను నారాయణాంశుఁగా - నిశ్చయింతు
దైవబలధన్య శ్రీ హరి - దాసమాన్య. 22

— ఈశ్వర సత్యనారాయణశర్మ,

1. విన్నామురా పాట
కన్నాముర్రా నృత్య
విన్యాస పిచికల
విహరించు మధురిమలు

2. పలుకు తేనెల జిల్కు
పద్మజుని రాణివిర
కవిత వేదవ్యాసు
గంభీర వాక్కురా - విన్నామురా॥

3. ఆనడక లా నృత్య
మా నాట్య గతులతో
కరగించు లాస్యాల
భరతముఖుని యూడెరా - విన్నామురా॥

4. సంగీత విద్యలో
చక్రవర్తివి నీవు
మహతీ విపంచికా
మహనీయ రూపమవు - విన్నామురా॥

5. 'శంభో' పదమ్ములో
అంభోధు లరచెరా
కాళ్ళగజ్జెల మ్రోతఁ
గంపించె కులగిరులు - విన్నామురా॥

౬. సప్తదశ వర్షాలు
లిప్తలై నడచెరా
వాగ్గేయకారకా
ప్రజ్ఞాధురంధరా - విన్నామురా॥ 23

భారతి, 8-4-1935 — అత్తిలి సూర్యనారాయణమూర్తి

సీ॥ సురగురుం డెపుడు త్వచ్ఛుశ్రూషఁ జేసిన
బుద్ధి బలంబున - బోలవచ్చు
కమలాసనుండు మీ - కడ నేర్చునేని వి
ద్యాయుక్తి మీసాటి - నందవచ్చు
శేషుండు కవిత మీ - చెంతనేర్చిన వర్ణ
నాయుక్తి మీసరిన్ - దనరవచ్చు
సన్మునుల్ మీతోడ - సంప్రతించిన మహి
మావళి మీసామ్య - మందవచ్చు
అంతెకాని సాధారణు - లైనజనులు
పోలఁజాలుదు రొక్కొ య - పూర్వబుద్ధి
యుతుని, పాండిత్య సంపద - న్వితుని సుకవి
పతిని బహుమహిమాసమ - న్వితునికెందు॥ 24

— పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి 26-7-1926

గీ॥ కాలి కడియంపు చిరుగంట ఘల్లుమనఁగ
వినెడు దాసుల గుండె గు - భిల్లుమనఁగ
సభ్యులకు కాయముప్పొంగి - ఝల్లుమనఁగ
ఘెల్లుమనునట్లు కథ విను - పించు నతఁడు॥ 25

— కవిభూషణ, అద్దంకి వేంకటరంగాచార్యకృత
(విజయనగరశ్రీ - ఖండకావ్యము 1947)

సీ॥ నీ గజ్జె కదలింపు - నేర్పిన భరత శా
స్త్రంబు వినూత్నతే - జమున మించు
నీదివ్య సాహితీ - నిపుణతకున్ బృహ
స్పతియైన మెచ్చి యం - జలి ఘటించు
నీ మేఘ గంభీర నిస్వనంబున దిశా
వలయంబు మారుమ్రో - తల ధ్వనించు
నీయేక వాగ్గర్భ - ణీకాంత వేయి భా
వాల బిడ్డల నవ - లీల గాంచు

ఆంధ్ర భారతి వీవయి యవతరించి
నావు శ్రీ యాదిభట్ల మాన్యకుల జాత
వాసిగన్న నారాయణదాసవర్య!
నన్ను దీవింపరమ్మ వందనముగొమ్ము. 26

— పెద్దింటి దీక్షితదాసు (ఆ. నా. దాసచరిత్ర హరికథనుండి)

ఉ॥ హాయనిపించునాట, యహాహా యనిపించునుజాట, తేనె సో
నాయనిపించు మాట, భళిరాయనిపించును మీట, కైత వ
హ్వాయనిపించు నో హరికథామృతసాగర! యాదిభట్ట నా
రాయణదాస! నీ కడ సమస్తము నవ్వయమయ్యె నద్దిరా! 27

సీ॥ అపరూప రాగంబులందు గేయమొనర్చి
రసము జిమ్మిన త్యాగరాజు వీవు
ఏక కాలము నందనేక తాళములతో
బాడగల్గిన లయబ్రహ్మ వీవు
అచ్చ తెన్గులఁగైత నల్లి పెంచిన మహో
ద్దండుఁడౌ నాంధ్రవిష్ణుండ వీవు
భరతాది మునులు జూపని విలక్షణ నర్త
నం బొనర్చెడు మహానటుడవీవు

పేర్కొనఁగనేల పల్వురఁ జేళ్ళఁ జెప్పి
బ్రహ్మవిష్ణ్వీశ మూల రూపంబవగుచు
హరికథామృత వారాసి నన్వహంబు
పండియు న్నాది నారాయణుండ వీవె॥ 28

— కాశీ కృష్ణాచార్యులు 29-1-1948.

శ్లో॥ ప్రాలేయాద్రిదరీ కుటీర విసరత్ గాంగాఝరీ నిర్మల
స్రోతః పూర్ణ తరంగసంగమ బహిర్ధ్వాంతాచ్ఛ వారిందవో
యస్యానల్ప కవిత్వ ముద్రిత కథాధారాఽతులాశ్చాభవం
స్త న్నారాయణదాస సద్గురువరాన్ కింస్తౌమ్యహం మందధీః॥ 29

మల్లాది చంద్రశేఖరశాస్త్రి 29.1.1948.

సీ॥ సర్వము నుచ్చస్థాయి పయికొని విహరించి
అంతలో మంత్రంబు ననుకరించు
పైనుండి క్రిందకు బూనినచో స్వర
మందక యెంతయు నధిగమించు
పాట బాడుచునుండు భరతమాడుచునుండు
బహురీతి గీతుల బలుకరించు
ఆడునో పాడునో యభినయ మందునో
పైచేయి యగుచునే వన్నెగాంచు

ఇంతవఱకును లేడెందు నిట్టివాఁడు
నికముందును గల్గఁబో డెంచి చూడ
సతత ముండును నిండు తేజమ్మునొంది
ధార్మికుండు నారాయణదాసు జగతి ॥ 30

— భమిటిపాటి అయ్యప్పశాస్త్రి 29 1-1948

శ్లో॥ ఆదిభట్టాన్వయాఽకాశే, సూర్యనారాయణో హరిః
సాహిత్య నవ్య శోభాస్తు, సర్వత్ర కృతవానహో ! 13

— కర్ణ వీరనాగేశ్వరరావు, 1942.

ఉ॥ రాగవిభావ సంజనితరశ్మిని, పద్మజుఁడాత్మకోశమం
దోగు నదల్చి, హంసవిభవోన్మిత సత్వమునంది, వాక్పతీ
శాగనమష్టి పష్ట పురుషోత్తముఁడై విలసిల్ల, స్వీయస
ద్యోగవిభూతి నాకృతిగ దోఁచె నతండిల నాదిభట్టుఁడై. 32

—బుర్రా కమలాదేవి.

తే.గీ॥ తనయుపాసన దేవితోఁదలపు దెలిపి
పౌత్రు బ్రదికింపఁ జూప అబ్బురముగ్గెంద
ఆత్మయోగమ్ము నంతరాస్యమ్ము దెలుప
నరవిక్షజగమెన్న స్వచ్ఛంద మరణుఁడయ్యె
తనియ నారాయణ బుధుండు ధన్యతముడు. 33

— చల్లా పిచ్చయ్యశాస్త్రి.

తథాయోగీ తథాభోగీ తథా కథన కోవిదః
తథారస స్తథాదాసో నదృష్టో నమయాస్మృతః 34

— జమ్ములమడక మాధవరామశర్మ.

అతనికతండె సాటియగు నాంధ్రుల భాగ్యపుఁబంటయై బృహ
స్పతి సమబుద్ధిశాలియయి వాగ్జితసర్వకులాధినాథుఁడై
చతురత యక్షగాన కృతిసంచయమున్ రచయించి శిష్య సం
తతి కవి నేర్పి సర్వజనతా ఘనతోషణ రీతిఁ దత్కృతి
ప్రతితినిబాడి యాడఁదగు పద్ధతిఁ దాఁ నొనరించి చూపి గ
ర్వీత మతులైన పండిత కవీశ్వరగాయకరత్న గర్వ ప
ర్వత పవియై విదేశకవి పండిత సన్నుతిఁగూడఁగాంచి సం
తత భగవత్పదాబ్జ యుగదత్త మనస్కుఁడుగా జెలంగి సం
స్కృత ముఖనైక భాషల విశేషముగాఁ గృషిఁజేసి యన్నిటఁ
గృతమతియై కృతార్థుఁడయి కీర్తిలతాంగి మనోహరుండునై
యతుల విరాగియై యతులకందని బ్రహ్మపదార్థమందు శా
శ్వతమ గనుండు నాఘనుని చారుచరిత్రముఁజెప్ప శక్యమే. 35

— వాజపేయయాజుల వేంకటరమణయ్య.

శుంభన్మోహన యక్షగాన విభవాస్తోక ప్రభావమ్ము సం
రంభమ్మొచు రసజ్ఞలోకముల కాహ్లాదమ్ము సంధింపగా
"శంభో"యన్న భవన్నుతి ప్రతతి విశ్వమ్మందు మార్మోగులే
అంభోధి ప్రతిమాన గర్జనలతో - ఆనాటి కీనాటికిన్. 36

— బృందావనం రంగాచార్యులు

ఆవర్తితాంధ్ర హృదయ ఆదిభట్ట కులోద్భవః
ఆద్యోగురుశ్చ సర్వస్యా హరికథక సంతతేః ॥ 37

— జటావల్లభుల పురుషోత్తము.

సభాముఖే వాదజయ ప్రశస్తిమ్
మత్తోఽద్యహర్తుం పటుతత్ర కోఽస్తి
ఇతిబ్రువన్నేవ వివాదధీరః
సభాసు నారాయణదాస ఆసీత్ ॥ 38

— గంటి జోగిసోమరాజు,

మ॥ ' సిగలో పూవులుపెట్టి, అత్తరువు వాసింబూసి మైపూతగా ।
నొగి గంధమ్ము నలంది, మీసముల నోహోవుట్టగా ద్రిప్పి రీ
విగఁదాళమ్ములు చేతఁబూనుచును బూవిల్కానిదౌ సోయగం
బగుపించన్, కతసెప్ప నీ హొయలు మే మాసింతు మేనాటికిన్. 39

— సామవేదం జానకిరామశర్మ.

సీ॥ చక్కఁగా దువ్విన నొక్కులక్రాఫింగు
వాసిఁదెల్పెడు మంచిమీసకట్టు
చేతుల రెంటికి సింహతలాటముల్
దంబుమై మెఱయు దండకడియాలు
మెడలోన బంగారు మేలిమి పదకమ్ము
బంగరుటంచు దువ్వలువ సొబగు
కాలికిఁదొడగిన గండపెండేరమ్ము
చేమంతి పూవుల శిఖదలిర్ప

తనదు శిష్యులు మేఁన జందన మలంది
వంతుఁ బాడఁగ మేఘనిస్వనమువంటి
గళరవమ్మున శ్రీ హరికథలఁబాడు
భవ్యచరితుండు 'దాసు' పుంభావవాణి. 40

— ప్రతాప వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి.

మ॥ ఎవరీ ముగ్ధమనోజ్ఞ దర్శనఁ! డెవండీ శారదామూర్తి! యీ
నవశృంగార రసావతారుఁ డెవరన్నా! శ్రీ మదజ్జాడయే
యవునా! ఆదరహాస! మానడకతీ! రాతీవి! యాదర్ప! మా
కవితాదీప్తి! యనన్యసాధ్యములురా! కైమోడ్పులందింపరా! 41

— కరుణ శ్రీ.

॥క "హరికథకు" పేరుపెట్టెను
"హరికథ" నిర్మించి లోకమంతట నింపెన్
హరికథకుల సృజియించెను
"హరికథక పితామహాఖ్య" అతనికె చెల్లున్. 42

— శష్టా సత్యనారాయణరాజశేఖరం,

ఉ॥ ప్రౌఢము నీదుశైలి పరి - పక్వము తావక శాస్త్రవిజ్ఞతల్
ప్రౌఢము గాత్రపాటవము - ప్రౌఢము త్వత్కథనా విధానముల్
ప్రౌఢము నీదుకల్పనలు - ప్రౌఢము నీ లయతాళరాగముల్
ప్రౌఢము గానివేమి తెలుపందరమా ద్రుహిణీ స్తనంధయా. 43

— పోకల ధనంజయరావు.

సీ॥ 'శంభో' యనెడు మేటిశబ్ద హుంకారంబు
యుఱుముచున్నట్లుండు మఱపురాదు
శ్రీ రుక్మిణీ బాల్యశృంగార భావంబు
మా కండ్ల ఫలమద్ది మఱుపురాదు
సంగీత సాహితీ స్వరరాగలయనృత్య
మహనీయగానంబు మఱపురాదు
ప్రక్కవాద్యంబుల లెక్క సేయక ప్రజ్ఞ
గఱపెడు పొందిలి మఱపురాదు

తే.గీ॥ అష్ట భాషలలో శక్తి స్పష్టపఱచి
యాంధ్రమాతను సేవించి యలరి నట్టి
దాను నారాయణార్యు నుద్దాము కథలు
మఱపు రావెన్నటికి మాకు మఱపురావు. 44

— పిల్లలమఱ్ఱి రామదాసుభాగవతార్.

కం॥ తెలుఁగునను వేల్పు మాటల
నలబారసి రాచబాసయను నాలుగు మో
ముల కైతల నలంరించుచు
నలుగడ మెప్పొందు నీవు నలువవు కావే. 45

— నిడదవోలు వెంకటరావు.

ఉ॥ మ్రోళ్ళుచిగుర్చ్చ నీ విమల మోహన గానము లేమిఁజేసి కొ
న్నాళ్ళుగ నాంధ్రభూతలమునన్ క్షజనియించెను నీరసంబికె
న్నాళ్ళిటు చూచుచుండెదవు నాకపురంధ్రుల కేళికేమిలే
భళ్ళున ప్రగుమ్మరింపుము భవన్మధుగాన విశేషవర్షముల్. 46

— కార్యంపూడి కృష్ణమూర్తి

శా॥ జ్ఞానాజ్ఞాన విచారసాగరమతిన్ సన్మార్గ సంవర్తనున్
వీణావేణు మృదంగకాహళ కళాభిజ్ఞున్ శివాత్మజ్ఞునిన్
గానోల్లాస విలాస నృత్య లలితాకారాదిభట్టాన్వయ
శ్రీ నారాయణ దాసవర్యు మది సంసేవింతు నశ్రాంతముగ. 47

— కలగ ఆంజనేయశాస్త్రి.

ఉ॥ కారణజన్ముఁడై విబుధకాండ శిరః ప్రణిధానయోగ్యుఁడై
పారములేని కావ్యవిభవంబులకెల్లను పైడిగద్దెయై
భూరికళావిభూతికిని పుష్కలమైన మహోజ్జ పీఠమై
ఏరికిసాటిరాని పరమేశ్వరుడీతఁ డనంతకీర్తిచేన్. 48

— దివాకర్ల రామమూర్తి.

గంభీరమైన నీ శంభోరవంబులో
అంభోధులరచెరా అందాలనరవరా
సంభావ్యమైన నీ సర్వశక్తులకు
కుంభినీశులె మెచ్చి కొలిచి సిరులిచ్చెరా
నీ గజ్జెకదలింపు నీ బొజ్జ కుదిలింపు
నీ గానమాధురి నీ సుభాషాఝురి
యూగించె నుజ్జ్వూత లుర్విపైబెక్కురను
సాగించె నెదిరిపై జైత్రయాత్రలను 49

నీవు పెట్టినభిక్ష నిజము మాకగు రక్ష
భావమున నినునిల్పి బాడుటే మాదీక్ష
దీవించి పోవయ్య దివినుండి దిగివచ్చి
నీవారమేగదా నిజము మరువకుమయ్య. 50

— అమ్ముల విశ్వనాథభాగవతార్.

ఉ॥ ఈతని సాటి యెవ్వరు మహీస్థలి నాట్యకళావిధాన సం
గీతములందు, ముద్రలమ కేవల షణ్ముఖివేసి చూపుటన్
ధాత సృజించు మానుషవిధాన సరస్వతిగాక మర్త్యుఁడే ?
ఈతని కీతడే సరి మరెవ్వరు పుట్టగలేరు లేరికన్. 51

— కర్రా గోపాలం.

తే.గీ॥ చిల్లపెంకేటవాలుగ చెరువువందు
వినరగాఁ దేలి వలయంబు లెనఁగునట్లు
పాట నవరోహణారోహ పాటవంబుఁ
దప్పకుండంగఁ బాడెను దా సొకండె. 52

— ఆదిభట్ల సూర్యప్రకాశం.

సీ॥ శారీరమన్న వస్త్రాదులు వరవడి
దీర్చుకోదగు మేనితీరు నీదె
శారీరమన్న ఉస్తాదులు సాధించి
చేరుకోదగు గొంతుసౌరు నీదె
వైదుష్యమన విద్వాంవరులు జన్మల నెత్తి
చదువుకోదగు పెద్దచదువునీదె
ప్రావీణ్యమన కళాపరులు పురాసుకృ
తమున పొందెడు భరతంబు నీదె

ఆదిభట్ల వంశమ్మున నాదిభట్టు
వాంధ్ర హరిదాస నిశ్రేణి నాదిదాసు
వగుడు ముమ్మూర్తు లాదినారాయణుడవు
ఆదిశేషుడు మాత్ర మేనగుదు నెట్లు? 53

— బాలాంత్రపు రజనీకాంతరావు

ఉ॥ శ్రీయుతమై, సదా విబుధసేవితమై, నయనోత్సవంబునై
ప్పాయదుదార సత్కళల స్థావరమై వెలుగొందు మూర్తితో
ధీయుతమైన మేధ నలుదిక్కుల నిండఁగ సభ్యులెల్ల వ
హ్వా! యని మెచ్చగా శ్రవణపర్వమునై వరకంఠ మాధురుల్
హాయిని గొల్వగా హరికథామృత మాంధ్రధరాతలంబునన్
పేయముగాఁగ నింపితివి ప్రేక్షకులెల్లరు విస్తుబోవ 'శం
భో!' యనునాదమున్ సలిపి ముగ్ధులుగా నొనరించుచున్ సదా
పాయని వేడ్క శిష్యులను పాలనచేయవె పుత్రులట్లుగా
వేయువచింపనేల పృథివీస్థలమందున నిన్నుఁబోలు స
ద్గాయక సార్వభౌముఁడిక కల్గఁడటంచు జనంబు పల్కగా
మాయని కీర్తియోగ మసమానము నందితి వాదిభట్లు నా
రాయణదాస! సంతత విరాజిత కీర్తివికాసవైభవా!

— మధురకవి మూలా పేరన్నశాస్త్రి.

శా॥ గానంబందు కవిత్వమందు బహులోకాదర్శ నిర్మాణ వి
ద్యానైపుణ్యమునందు, శాస్త్రములయం దాహార్య భావక్రియా
నూనామంద కలారహస్యములలో నుర్విస్థలిన్ నిన్ను బోల్
ధీనిర్ణిద్ర కళాప్రపూర్ణుఁడెట లేఁడే సూర్యనారాయణా! 54

(కొప్పకవి దాసుగారిని గురించి 'దేవదత్తము' కావ్యమునుండి)

# శ్రీ నారాయణ దాస
# జీవిత పంచాంగము

| | |
|---|---|
| 31-8-1864 | జననము (రక్తాక్షి శ్రావణ బహుళ చతుర్దశి). |
| 1869 | శివరాత్రి-స్వప్నజ్ఞయా భాగవత బహుమానగ్రహణము. |
| 1874 | సంగీతాధ్యయనార్థము వాసా సాంబయ్యగారితో బొబ్బిలి ప్రయాణము. |
| 1875 | తల్లిదండ్రులతో కాలినడకను జగన్నాథ యాత్ర. |
| 1877 | సింహాచలయాత్ర - పితృవియోగము. |
| 1880 | విజయనగరములో ఆంగ్లపాఠశాలా ప్రవేశము. |
| 1883 | హరికథకావతారము - విజయనగరము వేణుగోపాల స్వామి ఆలయములో ప్రథమ కథాగానము- 'ధ్రువ చరిత్ర' రచనము. |
| 1884-85 | ఉత్కళదేశమున హరికథా యాత్ర - ఛత్రపురమున ఒక్కరాత్రిలో 'అంబరీషచరిత్ర' హరికథారచన. మరు నాడుదయమే ప్రదర్శన - లోకనాథము గ్రామమున మొట్టమొదటి సంగీత సాహిత్యాష్టావధానము. |
| 1886 | మెట్రిక్యులేషను పరీక్షలో ఉత్తీర్ణత-విశాఖపట్టణమున రెండు నెలలలో పండ్రెండు హరికథలు-విజయనగరములో విక్టోరియారాణి జూబిలీకి ప్రభుత్వాహ్వానముపై హరికథాగానము- 'గజేంద్రమోక్షణ' రచన - వివాహము-వీణా వాదనాభ్యాస ప్రారంభము. |

1886-88 విశాఖపట్టణమున F. A. చదువు - ఖాసింకోట జమీందారుగారిని రెండు హరికథలు చేసి మెప్పించి స్కాలరుషిప్పు సంపాదించుట - విశాఖలో 80 హరికథలు - అల్లిపురము జమీందారు హావేలీలో అనేకావధానములు-పిఠాపుర రాజ సన్మానము.

1888-89 బాటసారి కావ్యరచన-కాకినాడ నాటక సమాజము వారికి కాళిదాస 'విక్రమోర్వశీయ' రూపక ప్రదర్శన శిక్షణ-రాజపాత్రధారణ - బందరులో టికెట్టు పెట్టి సంగీత సాహిత్యాష్టావధానము - కొందరు సంగీత విద్వాంసులకు శృంగభంగము చేయుట.

1890 దంభపుర ప్రహసన రచన-సారంగధర నాటక రచన-గంజాముమండల పర్యటన-ఉర్లాము లుకులాము లందు హరికథాగానము.

1891 మార్కండేయ చరిత్ర రచన.

1894 స్వీయ చరిత్ర రచన-మదరాసులో రాయ్ బహాదూర్ పనప్పాకం ఆనందాచార్యులవారి నివాసమున హరికథా గానము- 25-8-94న బెంగుళూరులో మైసూరు ప్రభువు ముందు సంగీత కాలక్షేపము, హరికథా గానము-తథాపి సత్కారము.

1895 మైసూరు ప్రభువుచే దసరా దర్బారులో ఘన సన్మానము -ఆనందగజపతిగారి ఆదరణ-సత్యవ్రతి, సూర్యనారాయణ శతకముల రచన - ఖాసింకోట కోటలో హరికథాగానము, తిరుపతి వెంకటకవుల శ్లాఘ.

1898 ప్రహ్లాదచరిత్ర రచన. (అప్పటికి రుక్మిణీకల్యాణ, హరిశ్చంద్ర చరిత్రలు, శ్రీకృష్ణజననము సంస్కృత హరికథ విరచితములు).

1900–1901 ఉర్దూ పార్సీ అరబ్బీ భాషల అభ్యాసము.

1902 భీష్మచరిత్ర, సావిత్రీ చరిత్రముల రచన.

1903 ఏకైకపుత్రిక సావిత్రమ్మ జననము.

1904 ప్రత్యేకాహ్వానముపై బెంగుళూరు దాక్షిణాత్యగాయక మహాసభలో రుక్మిణీకల్యాణ హరికథాగానము – అందు దక్షిణామూర్తిపిళ్ళె అను మార్దంగికునకు గుణపాఠము– కాకినాడ సరస్వతీ గానసభా స్థాపనము. (నాటినుండి 1942 వరకు ప్రతియేట తత్సభా ప్రారంభోత్సవము దాసు గారి కథాగానముతోనే ప్రారంభమగుట ఆచారము).

1905 మాతృ వియోగము.

1908 భంగు వ్యసన త్యాగము-ముకుంద, శివ శతక మృత్యుం జయాష్టక రచన.

1910 'తారకమ్' అను సంస్కృత ప్రబంధరచన – జర్మన్ ప్రొఫెసర్ గిల్డ్నరు కృత శ్లాఘ.

1911–12 రాజమహేంద్రవరమున వీరేశలింగము పంతులుగారిచే నవరత్న భుజకీర్తి ప్రదాన సన్మానము.

1912–13 విజయనగరమున రీవా సర్కార్ చే సన్మానము.

1913 కాశీయాత్ర–అలహాబాదులో జానకీబాయి మెప్పు– కలకత్తాలో, శ్రీకృష్ణజననము హరికథ – విశ్వకవి రవీంద్రుని ప్రశంస.

1914 బందరులో వీణావాదన ప్రజ్ఞకు చల్లపల్లి ప్రభువులచే గండపెండేర సన్మానము–కాశీ శతక రచన– (1908–1914 సం॥ల నడుమ)–దేశమున పలుతావుల హరికథా కాలక్షేపములు, ఘన సన్మానములు.

నూజివీడులో గజారోహణ, నందిగామలో బ్రహ్మరథ సన్మానములు. పంచతాళప్రజ్ఞ ప్రదర్శించి సుబ్రహ్మణ్యయ్యరు వీరఘంటా వలయమును విప్పించి, పంచముఖి పరమేశ్వరు డను బిరుదందుట.

1915 భార్యా వియోగము-యథార్థరామాయణ రచన.

1919 విజయరామగజపతి సంగీతకళాశాల ప్రిన్సిపాలు పదవి నధిష్ఠించుట.

1921 రామచంద్ర శతక రచన.

1922 పసుమర్తి కృష్ణమూర్తిగారి పార్వతీకల్యాణ యక్షగానము కృతి పతిత్వము- 'నవరస తరంగిణి' ప్రకటన.

1923 కాకినాడ కాంగ్రెసు మహాసభలో హరికథా కాలక్షేపము. సరోజినీదేవి ప్రశంస లందుట-ఇంగ్లండులోని Empire Exhibition కు భారత సంగీత ప్రతినిధిగా ఆహ్వానము. (కాని వెళ్ళలేదు).

30-8-1924 విజయనగరంలో షష్టిపూర్తి మహోత్సవము.

1927 కి ముందు 'వెన్నుని వేయిపేర్ల వినకరి' (విష్ణు సహస్ర నామ సంకీర్తనము) రచన.

1927 మదరాసు అఖిల భారత సంగీత పరిషత్ప్రారంభోత్సవములో స్వవిరచితములైన 'స్వరాక్షర' కృతులను పాడి ఆచార్య పి. సాంబమూర్తి ప్రభృతుల ప్రశంస లందుట.

1928 మదరాసు పుర ప్రముఖుల మహాసభలలో హరికథలు చేసి "ఆంధ్రదేశ భూషణము"గా ప్రశస్తు లగుట.

1929 'అచ్చతెలుగు పలుకుబడి' వేల్పుమాట, 'మొక్కుబడి' రచన - విజయనగరములో నవగ్రహాలయ ప్రతిష్ఠ.

1930 'వేల్పువంద' 'హరికథామృతమ్' ప్రచురణ. 'గౌరప్ప పెండ్లి' రచన.

1931 గుంటూరులో జరిగిన సప్తమ అఖిలాంధ్రగాయక మహాసభ కధ్యక్షత – అలక నారాయణ గజపతి ప్రభువుతో నీలగిరి ప్రయాణము – అక్కడ వివిధ సంస్థానాధీశుల గానముచే మెప్పించుట.

1932 తేది 11-2-32న కొత్తపేటలో హరికథా భవనము నకు శంకుస్థాపనము – ఉమరుకైయాము రచన, ప్రచురణ.

1933 విశాఖపట్టణమున ప్రథల లక్ష్మీనరసింహముగారిచే సన్మానము – రాజా విక్రమదేశవర్మగారిచే "సంగీత సాహిత్య సార్వభౌమ", 'భారతీతీర్థ' సంస్థచే "ఆట పాటలమేటి" బిరుద ప్రదానము,

తేది 8-2-33 న విశాఖపట్టణమున జరిగిన యొక సభలో "శృంగార సర్వజ్ఞ" బిరుద ప్రతిగ్రహము.
తేది 9-11-33న తునిలో బ్రహ్మరథ సన్మానము.

1936 సంగీత కళాశాలాధ్యక్ష పదవీ విరమణము – హైదరాబాదులో ఆంధ్ర మిత్రమండలి సన్మానము.

19-5-1937 ఇల్లెందు పుర వాస్తవ్యులచే పండిత సన్మానము.

1938 సశిష్యముగా రామేశ్వర యాత్ర- పుదుక్కోట తిరువాన్కూరు దర్బారు సన్మానములు- కన్యాకుమారీ దర్శనము–"దశవిధరాగనవతి కుసుమ మంజరి" రచనము–చెన్నపురి ఆంధ్ర మహాసభా సన్మానము.

2-2-39 బార్డ్స్‌వెల్ ద్వార 'నోబెలు' బహుమతి లబ్ధికై ప్రోత్సహించుట (కాని దాసుగారా ప్రయత్నము చేయలేదు.)

10-4-39 మదరాసులో మరియొక సన్మానము.

1939-43 "సీమపల్కు-వహి" అను దేశ్యాంధ్రనిఘంటు నిర్మాణము; ఆయుర్వేద పరిశోధనము - "మన్కి-మిన్కు" రచనము; "జగజ్జ్యోతి"-రచన.

7-5-43 విజయనగరములో ఆంధ్ర కళాపరిషత్ప్రారంభోత్సవ సభాధ్యక్షత.

1943-45 'తల్లి విన్కి' రచన. (లలితాసహస్రనామమునకు దేశ్యాంధ్రవివృతి) .

2-1-1945 పరమపదప్రాప్తి (మనుమనికి మశూచిరాగా భగవంతుని ప్రార్థించి దానిని తా నాకర్షించుకొని మనుమని బ్రతికించిరని ప్రతీతి).

[ పరికల్పన : ఆచార్య యస్వీ జోగారావు]



అనుబంధము — ౪

# నారాయణదాస గ్రంథావళి



## హరికథలు

1. అంబరీష చరిత్రము : 1884 లో ఛత్రపురములో నొక పెండ్లి పెద్దతో పంతము వచ్చి రాత్రికి రాత్రి రచించి ధారణచేసి మరునాడుదయమే పెండ్లి పందిట్లో దాసుగారు గానము చేసిన కథ.

2. గజేంద్రమోక్షణము : దాసుగారు 1894లో మైసూరు మహారాజావారి సమక్షమున తతస్తతముగా సాంగ్లానువాదముగా చెప్పి రాజసన్మానము నందిరి. రచన – 1886.

3. గోవర్ధనోద్ధారము : ఒకపరి చేబ్రోలులో దాసుగారు రుక్మిణీకల్యాణము చెప్పుటకు సిద్ధముగా నుండగా సభలో ఎవరో కొంటెగా "హరికథ కాదు గిరికథ చెప్పు" అనగా అప్పటికప్పు డాశువుగ ప్రయోగమును మించిన ఆశుకవితా పాటవముతో గద్యపద్య గేయము లల్లి అలవోకగా చెప్పిన కథ. ఇది నేఁడుపలబ్ధము కాదు గాని అంబరీషచరిత్రమున ఒక అవాంతర కథగా నిది ప్రసక్తమైనది.

4. గౌరప్ప పెండ్లి : అచ్చ తెలుగుపై దాసుగారి కమిత మమకారము. ఫలితముగా నిది యవతరించినది. 1931 లో 1940 లో శిష్యుడు శ్రీ కందిమళ్ళ రంగయ్యదాసు మాత్రమే కొలది పర్యాయము లేతత్కథాగానము చేసిరి. అచ్చ తెనుగున పూర్వులు చూపని క్రొత్త మెలకువలు కొన్ని చూపినారు దాసుగారు.

5. జానకీ శపథము : సవర్ణదీర్ఘ సంకలితముగ గూడ సార్థకమైన రచన. ఇందు మేళకర్త రాగముల మేలిమి పరిమళించుచున్నది. ఒకరిద్దరు శిష్యులేపాటియో చెప్పగలిగినను సిద్ధపురుషుడు దాసు గారికి మాత్రమే అనాయాససాధ్యమైనది.

6. ధ్రువచరిత్ర : హరికథక ప్రపంచమున ధ్రువతారలైన వీరి హరి కథా వాఙ్మయచరిత్ర 'ధ్రువచరిత్ర' రచనతో ప్రారంభమై యుండుట విశేషము.

అదీ వారి 19వ యేట (1883) లో. అవలీలగా ఒక్కరోజులో ధారణచేసి అతిహేలగా విజయనగరమున వేంచేసియున్న గాన లోలుడు వేణుగోపాలస్వామి సన్నిధానమున గానము చేసిరి. ఆ కథనే పలుతావుల గానము చేసి ఘనసన్మానము లందిరి. కాని గ్రంథ మలబ్ధము.

7. ప్రహ్లాదచరిత్రము : ఒకపరి విశాఖపట్టణమున ప్రభల లక్ష్మీ నరసింహం పంతులుగారి యింట దాసుగారు బసచేసియుండిరి. ఎవరో వచ్చి పంతులుగారికి "భక్త ప్రహ్లాద" నాటకపు కాంప్లి మెంటరీ టిక్కెట్టు నిచ్చినారట. "ప్రహ్లాదుడే నా యింట బసచేసి యుండగా నా కెందు కీ నాటకము?" అని పంతులుగారు దానిని తిరస్కరించిరట. ఆ దాసుగారు పలు తడవులు గానముచేసి పరవ శించి పోయిన కథ యిది. రచన 1898. సంగీత విషయమున నొక వైశిష్ట్యము గలది.

8. భీష్మచరిత్రము : భావనలో పోతన పోకడ, రచనలో తిక్కన చిక్కనయు గల కృతి. రచన 1902.

9. మార్కండేయ చరిత్ర : విజయనగరమున నొకప్పు డనావృష్టి యేర్పడినప్పుడు ముందుగా ప్రతిజ్ఞ చేసి "మూడు కోవెళ్ళ"లో

దాసుగారీ కథ చెప్పి మూడు దుక్కులు వాన కురిపించిరట. వారి పవిత్రవాక్కున హరకథయు హరికథయై ప్రత్యక్షముగా శివంకరమై ఫలించినది రచన 1891.

10. యథార్థరామాయణము : 1915 లో దాసుగారొక విశిష్ట ప్రణాళికపై షట్కథా* సంపుటిగా రూపొందించిరి. అనేక ప్రక్షిప్తములతో గూడిన నేటి వాల్మీకి రామాయణమున ఆ అఖిలోక ధీరోదాత్త నాయకునకు, ఆర్ష కవి హృదయమునకు తగినట్లు యథార్థకథ యెట్లుండవలెనో నిరూపించిరి. ఇది నాటినుండి నేటివరకు యావదాంధ్రమునను అనేక హరిదాసులకు మాసగ్రాసమై ఉపాధి కల్పించుచు, జనానీకమున భక్తి సద్భావ సంపదను, కళారాసిక్యమును పెంపొందించుచున్నది.

11. రుక్మిణీకల్యాణము : ప్రకృతి పరమాత్మల సమైక్యము అంతరమైన పరమార్థముగా రూపొందిన కథ. 1898 కి పూర్వపు రచన, మిక్కిలి వాసికెక్కిన కృతి.

12. సావిత్రీచరిత్రము : సంతానార్థము దాసుగారు మాతృశ్రీ ఆదేశానుసారము 1902లో రచించిరి. 1903లో పుత్రికను బడసి యామె కా పేరిడిరి. అనేక జన్యరాగముల విషయమునను, కీర్తనలందు ముద్రాలంకార విషయమునను ఒక విశిష్టత గలది.

13. హరిశ్చంద్రోపాఖ్యానము: 1898కి ముందటి రచన. 1912లో విజయనగరమున రీవా సర్కార్ రాణీ అప్పల కొండయాంబ గారు దాసుగారి ఏతత్కథాగానము విన్నప్పుడు శోక వివశయై అంత కరుణరస పరిప్లుతిగల ఆ కథ నింకెప్పుడు చెప్పవద్దని కోరిరి.

---

* శ్రీరామ జననము, సీతాకల్యాణము, పాదుకా పట్టాభిషేకము, రామ సుగ్రీవ మైత్రి, హనుమత్సందేశము, సామ్రాజ్యసిద్ధి.

14. శ్రీహరి కథామృతము: మూడు సంస్కృత హరికథల సంపుటి. (దీని గురించి "సంస్కృత కృతులు" క్రింద చూడదగును.)

గమనిగ : ఉపరిష్కృతులలో గోవర్ధనోద్ధారము, ధ్రువచరిత్రము ఉపలబ్ధములుగావు. గౌరప్పపెండ్లి యొక్కటూరి ముద్రితము. యథార్థరామాయణము, సావిత్రీచరిత్రము రాజమహేంద్రవరము కొండపల్లి వీరవెంకయ్య అండు సన్సు వారిచేతను, కడమవన్నియు విజయవాడ సరస్వతీ బుక్ డిపో వారిచేతను బహువారములు ముద్రితములైనవి. (దాసుగారి యితర కృతులును అనేకము వీరియొద్ద లభించును.) ఈ హరికథలన్నిటికిని సుపరిష్కృత ప్రతులు వెలయించుట మిక్కిలి అవసరము. ఒక్క మార్కండేయ చరిత్రకు మాత్రము అట్టి ప్రతి "నాట్యకళ" - 1965 ఫిబ్రవరి సంచికలో వచ్చినది.



## అచ్చ తెలుఁగు కృతులు

1. అచ్చ తెలుఁగు పలుకుబడి : ఇది మంజరీ ద్విపదలో బడి పద్దముగా వ్రాయబడిన లఘుకృతి. అచ్చ తెనుఁగు ప్రాశస్త్యమును దానిపై దాసుగారి మమకారమును అభివర్ణించునట్టిది. ముద్రణ : సుజనరంజనీ ముద్రాశాల, కాకినాడ-1929.

2. ఉమరు ఖైయాము రుబాయతు : పార్సీ రుబాయితులకు, ఫిట్జ్ జెరాల్డు ఆంగ్ల పద్యములకును అనువాదము.

(వివరణకు 'అనువాద' శీర్షిక క్రింద జూచునది).

3. గౌరప్ప పెండ్లి : హరికథ – ఉపరి ప్రసక్తము.

4. తల్లివిన్కి : లలితా సహస్రనామమునకు ప్రతి నామానువాదము తోడి వివృతి. పద్య గేయాత్మకము. రచన 1943–45.
ముద్రణ : దాసభారతి ప్రచురణలు, గుంటూరు–1974.

5. నవరస తరంగిణి : ఇందు కాళిదాస శ్లోకములకు దేశ్యాంధ్రాను వాదము గలదు. (చూ. అనువాద శీర్షిక)

6. నూలుగంటి : ఈసపు నీతికథల నొక నూటి నేర్చి కూర్చిన కృతి. బాలావబోధమునకై సద్యః ప్రసన్నమగు భాషలో గద్య ఘటిత మైనట్టిది. ప్రతి కథాంతమందును ఒక చిన్న పద్యమున కథాంశా పురస్కృతముగ నీతి ప్రవచనము నిపుణముగ చేయఁబడినది. ప్రతి పద్యము సద్యోహృద్య మగు నొక సురుచిర సూక్తి. దాసుగారీ నూటింటివి నూలు జ్ఞానచక్షువులుగా సంభావించిరి.
ముద్రణ : శ్రీ వేదవ్యాస ప్రెస్, విజయనగరము. రెండవ కూర్పు 1930.

7. మన్కి మిన్కు : ఇది ఆయుర్వేదమునకు సంబంధించిన పరమా ద్భుతమైన పరిశోధన గ్రంథము. అధర్వసంహిత, కృష్ణ యజుర్వేద తైత్తిరీయారణ్యకము, ఋగ్వేదీయ తైత్తిరీయారణ్యకము, ఐత రేయ బ్రాహ్మణము, ఛాందోగ్యాద్యనేకము లుపనిషత్తులు దాసు గారి పరిశోధనకు విహారభూములైనవి. వారి శాస్త్రజ్ఞతకు, దేశ్యాంధ్ర భాషాభిజ్ఞతకును శాణోపలమీకృతి. వారి ప్రామాణిక దృష్టియు, సమన్వయ ప్రజ్ఞయు కడు శ్లాఘ్యములు. శాస్త్రీయము లగు సంస్కృత పారిభాషిక పద జాలమునకు వారి తెలుగుసేత అత్యంతాశ్చర్యకరము. ఇది గద్య ఘటితము. పరిశోధన: 1939–43.
ముద్రణ : శ్రీ వేదవ్యాస ప్రెస్,. విజయనగరము - 1961.

8. ముక్కుబడి : దాసుగారు వివిధ ఋగ్వేద సూక్తములందు తమకు నచ్చినవానిని 300 ఋక్కుల నెన్నికచేసి వానిని వీణావాదనమున కనువగునట్లు స్వరపరిచి అచ్చతెలుగు పద్యములందను వాదముగూడ వెలయించిరి. ఆయన విజయనగర సంగీత కళాశాలాధ్యక్షులుగా నుండిన కాలమున శిష్యుల కీ ఋగ్వీణావాదనమున శిక్షణ నిచ్చుచుండెడివారు. ఈ కృతికే 'ఋక్సంగ్రహ' మని మరియొక పేరు. రచన : 1929.

ముద్రణ : శ్రీ వేదవ్యాస ప్రెస్, విజయనగరము – 1929.

(దాసుగారి జాతక వివరము లిందు గలవు)

9. వెన్నుని వేయిపేర్ల వినకరి : 'విష్ణు సహస్రనామ' సంకీర్తనమిది. ఆ నామముల కచ్చతెనుగున కించి ద్వివరణాత్మకమైన అనువాదము. పద్య ఘటితము. వివిధ పద్యముల ప్రసిద్ధములైన సంస్కృత నామముల కిచ్చ వచ్చిన మచ్చున తెలుగు పేర్లు పెట్టిరి. తెలుగు లాక్షణికులు చెప్పుటయే తప్ప తెలుగుకవులెవ్వరును ప్రయోగించని అర్థసమవృత్తముల నుపయోగించిరి.

ముద్రణ : సిటీ ప్రిమియర్ ప్రెస్, విజయనగరము. మొదటి కూర్పు – 1927.

(ఇందును దాసుగారి జాతక వివరములు గలవు.)

10. వేల్పుమాట : భగవద్గీత యని దీనికి నామాంతర మున్నది. కాని కాని కిది అనువాదముగాదు, మానస పుత్రిక మాత్రము. దాసుగారికి దత్తపుత్రిక. గ్రంథ మంతయు 'బడి' యను పేర మంజరియం దున్నది. చక్కని రచన. అతిగహనమైన తత్త్వము గూడ సుతిమెత్తని తేటతెలుగు పలుకుబడిలో వాటముగా అభివ్యక్తమైనది. దీని పీఠిక చివర దాసుగారి వ్రాయుస మిట్లున్నది:–

కౌరవ దేడాకెలలో నెద్దియైన నొక యుకెను దలంచుకొని యీా

వేల్పుమాట పాత్రములో నెద్దియైన నొక పెడ తెఱచి మీఁది నుండి క్రింది వఱకు లెక్కింపఁబడిన యిరువదేడు బంతులలోఁ దాఁ దలంచిన యంకెగల బంతి చదువుకొన్నప్పుడు తాననుకొన్న పని యేమగునో తప్పక తెలియఁగలదు" అని. వాసుదేవుడు తమ హృదయమునే గాక వాక్కునుగూడ ఆవేశించి యున్నాడని కాబోలు దాసుగారి విశ్వాసము. ఆ సంఖ్యానిర్దేశము గూడ సాభిప్రాయముగ నున్నట్లున్నది. రచన: 1929.

ముద్రణ : శ్రీ వేదవ్యాస ప్రెస్, విజయనగరము – 1929.

(ఇందును దాసుగారి జాతక వివరములు గలవు.)

11. వేల్పువంద : "రెంట ద్రాగుడు తిండి మెట్టంటు వేల్పు!" అను మకుటము గల సీసపద్య శతకము. ఆ మకుటమున కర్థము సింహాచలస్వామి. నారాయణ దాస స్వానుభవ మహాభాష్య మిది. వారి భక్తి భావ భండారమున కెత్తిన బావుటా. లోకజ్ఞతకు పట్టిన యద్దము. రచన: 1930.

ముద్రణ : శ్రీ విద్యా ప్రెస్, విజయనగరము తొలికూర్పు – 1935.

12. వ్యాస పీఠము : ఇందు పూర్వభాగమున ముద్రితాముద్రితము లందుపలబ్ధములైన దాసుగారి వ్యాసములు 16 కలవు. అం దెక్కువ భాగము స్వగ్రంథ పీఠికలు. అంతర్దృష్టియు, ఆలోచనా శీలియు, ఊహాశాలియు నగు దాసుగారి వైమర్శికదృక్పథ వైశిష్ట్యమును వారిందు చేసిన వివిధ జీవిత భాషాసారస్వత విషయ సమీక్షణమున దర్శింప గలము. ఉత్తరభాగమున వారి హరికథ లన్నిట గల ఉత్తమ వచన రచన లేర్చికూర్చితిమి. ఇందొక గొప్ప సారస్వతసౌరభము గుబాళించుచున్నది. విమర్శాత్మకమైన పూర్వ భాగమున 12 వ్యాసములును, సృజనాత్మకమైన ఉత్తరభాగమున

కొద్ది పాలును దేశ్యాంధ్రఘటితములు. (నా సంపాదకత్వమున ఈ గ్రంథము జూలై, 1974లో వెలువడినది).

13. సీమపలుకువహి: ఇదియొక అపూర్వ నిఘంటువు- అచ్చ తెలుగు నిఘంటువు. ఇతః పూర్వమే నిఘంటువుల కెక్కని పదజాల మెంతో యిందు ఎక్కడికక్కడ లెక్కదేలిన పర్యాయవాచకములన్నిటితో సహాయున్నది.మాతృభాషయందింతమమకారము,ఇంతప్రభుత్వము, ఇన్ని మనసు కాన్పులును గల సారస్వతసృష్టను మరి చూడబోము. ఈ గ్రంథమునకు గల విపుల పీఠిక మిగుల విలువైనది. విషయ గౌరవమునందేగాక పరిశోధన పాటవమునను దాసుగారికి తోడ్పా వైచునట్టిది. ఇందు తెలుగుభాషయొక్క స్వభావము, సంస్కృత ముతో దానికి గల భేద సాదృశ్యములు, సంస్కృత శబ్దముల వలె గన్పట్టు తెలుగు నుడువులు, తద్భవములుగా భ్రమింపబడిన తెలుగు పలుకులు, తెలుగులుగా భ్రమింపబడిన అన్యదేశ్యములు, నాటు తెలుగవునని కాదని వాదు కగ్గమైన మాటలు - ఇత్యాది విషయము లెన్నియో బహూదాహరణములతో చక్కగా నిరూ పింపబడినవి. ప్రకృతము 'అ' - నుండి - 'కందు' వరకు గల యొక భాగము మాత్రమే. ఆ.నా. దాస - అముద్రిత గ్రంథ ప్రచురణ సంఘము, విజయనగరమువారిచే 1967 లో ముద్రితమైనది. కడమ భాగము విజయనగరమున గలదని వినికిడి. (ఈ నిర్మాణకృషి : 1939-43).



# ప్రబంధములు

1. బాటసారి : ఒక తరము క్రిందట విశేష ప్రచారమునం దుండిన కావ్యరాజము. బహువారములు విశ్వవిద్యాలయ పట్ట పరీక్షలకు పఠనీయగ్రంథము. అవిద్యావరణములో అవతరించిన మానవ జీవి

తము పరిజ్ఞానసిద్ధివడసి సార్థకమగుట యిందలి వస్తుతత్త్వము. ఇది యొక గూఢ వస్తుమయకావ్యము(allengorical poem)వేదాంత పరమైన ఒక మహార్థ వివేచన మిందు చతురస్రముగా సాగినది. ప్రసాదగుణ ప్రవణమైన మనోజ్ఞ రచన. దీని రచనాకాలమునాటికి దాసుగారికి 24 సం॥లు. (క్రీ.శ.1888). పిన్నవయసునందే హృదయ పరిపాకముగల పెద్దరచన చేసిరి. వారి జీవితకాలమునందే పలు తడవలు ముద్రితమైనది.

2. మేలుబంతి : ఇది యొక పెద్ద చాటు ప్రబంధము. వివిధ విషయములపై తత్తద్వైశావిశేషముగా ప్రసరించిన దాసుగారి మనసు నుండి బాహిరిల్లిన భావములు - దేవతలు, ప్రభువులు, మహావ్యక్తులు, విద్వద్వంసులు, దేశము - నగరములు, సంగీతసాహిత్యములు, వర్ణనలు, హితోపదేశము,అనువాదములు, ఆశాసనములు, స్వవిషయములు. మున్నగువాని గురించి తెలుగున పద్యములు, సంస్కృతమున శ్లోకములు, అందునిందు కీర్తనలు - ఇట్లు బహుభంగులుగా వేసిన వాలకము లిందు కాననగును. దాసుగారి హృదయమునకును నాటి తెలుగు దేశమునకును దర్పణారోపము వంటికి దీ కృతి. ఇందును అచ్చ తెలుగు పద్యము లనేకము గలవు. ఎచ్చట పట్టిచూచినను దాసుగారి అచ్చ తెలుగు వైశద్యవాసితము, ఆ కూర్పు కౌశల పేశలము. ఒక లఘుకృతిగా ఇది 1929 కి ముందే ప్రకటితము, కాని తత్ప్రతులు లభించుటలేదు. అది గాక తదుపరి పదునారు వత్సరముల జీవితచరిత్రి మున్నది దాసుగారికి. ఆ కాలమున వా రలవోక గావించిన యనిబద్ధ రచన లనేకమున్నవి. ఆ యన్నిటిని కలిపి యొక బృహద్గ్రంథముగా రూపొందించితిని. ఇది 1974 జనవరిలో ప్రచురింపబడినది.

3. తారకమ్ : అపురూపమైన సంస్కృత కావ్యము. "సంస్కృత కృతులు" శీర్షిక క్రింద దీని గురించి చూడదగును.

* * *

# శ త క ము లు

1. కాశీశతకమ్ ; సంస్కృత శతకము. (చూ. సంస్కృత కృతులు)

2. ముకుంద శతకము; "కందళితానంద మూలకంద ముకుందా!" అను మకుటము గల ప్రతిపదసుందర, భావబంధురమైన రచన, ఇందు మహాభక్త కవియైన దాసుగారి మధుర హృదయస్పందము లనేకము విందుము. 1929 కి ముందే ముద్రితము. ప్రతులు దుర్లభము. రచన : 1908.

3. మృత్యుంజయ శివ శతకము ; దాసుగారికి, వారి హరికథలలో పాట కచ్చేరీలలో సహకారగానము చేయుచు అనేక సభలలో సెభాషనిపించుకొన్న గాంధర్వధూర్వహుడు, సర్వతంత్ర స్వతంత్రుడైన దాసుగారిని కంటికి రెప్పవలె సాకిన సహోదరుడునైన పేరన్న గారు మృత్యుముఖద్వారమున నున్నప్పుడా చెంగట గ్రుక్కిళ్ళు మ్రింగుచున్న దాసుగారి యెడద యేడ్చిన యేడ్పు ఈ శతకము. ఆ సహోదర సౌహార్ద మెట్లు నాన్యతోదర్శనీయమో ఈ శతక మందలి కదుష్ణ వేదనాశ్రుతి అట్లనిర్వచనీయమైనది.
రచన & ముద్రణ : 1908.

4. రామచంద్ర శతకమ్ ; (చూ. "సంస్కృత కృతులు".)

5. సత్యవ్రతి శతకము ; విద్యావినోది యగు ఆనందగజపతి ప్రభువునకును పుంభావసరస్వతియగు దాసుగారికిని గల హార్దమైన అనుబంధము దొడ్డది. ఆ రసజ్ఞ ప్రభువున కంకితముగా - "సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్" అను మకుటముతో వెలసిన దిది. దాసుగారి నీతి నిపుణతకును, లోకజ్ఞతకును నికషోపల మీకృతి. ఎప్పుడో డెబ్బదేండ్ల క్రిందటనే ముద్రితమైనది.

6. సూర్యనారాయణ శతకము: దాసుగారి నామకరణ మసలు 'సూర్యనారాయణ' అని. ఆయన సూర్యదేవుని ఇలవేల్పుగా, ఇచ్చ వేల్పుగా నుపాసించిరి. యావజ్జీవితము జీవితమునను సాహిత్యమునను పలుతావుల ఆమాట నుద్ఘాటించుచు వచ్చిరి. ముగురయ్యల మూలపు టయ్యగా భావించి ఆ దేవరపై నొక శతకమునే వన్నిరి. "సూర్యనారాయణా" యని దాని మకుటము. శార్దూల మత్తేభములు గృహీత వృత్తములు. ఒక మహాత్మాత్మిక దృక్పథము దాని ప్రాణసారము. దాసుగారిది శుష్కతానుస్మృత సుకుమార శుకానువాదప్రాయమైన మెట్టవేదాంతము కాదు. మరి, లోకమును లోగొన్న జీవితరహస్యమును జీర్ణించుకొన్న భావకూలంకషమైన ఒంటబట్టిన వేదాంతము. అదే యిం దడుగడుగున ప్రత్యక్షమగును. భక్తిభవ్యమైన ఆ సముదాత్త భావసరణింబడి సహృదయపాఠకు డెక్కడికో పోడు, ఎద లోతులకు దిగిపోవును లేదా సద్యోహృద్య సమున్నతానుభవసీమల కెగరిపోవును. ఇక నిందలి కవిత్వమందమా సందర్భ సుందరోపమలు, సద్యః పేయ పీయూషమువంటి భాష, వాగర్థయోగజాతకమగు శైలీలాలిత్యము మొదలగు కవితా సామగ్రి యందచందముల కాలవాలము. ముద్రణ : వైజయంతీ ప్రెస్, మదరాసు, 1903.

7. వేల్పువంద: చూ. అచ్చతెలుగు కృతులు.

* * *

## రూపకములు

1. దంభపుర ప్రహసనము : స్వభావోక్తి సుభగములైన పద్యములతో హాస్యసారస్యములతో నొప్పురచన. ఇందలి పాత్రలా నాటి కతిపయ విజయనగర పురప్రముఖులకు ప్రతీకలట. ముద్రితము- 1921. రచన : 1890.

2. సారంగధర నాటకము : పాశ్చాత్యప్రాచీన రూపక శైలీ మేళనము గల రచన. శాంతరస ప్రధానమయ్యు హాస్య కరుణాద్యంగరస పరిపోషణ సామర్థ్యమునను, సజీవపాత్రనిర్మాణ చాకచక్యమునను, బంధుర భావసంపద వలనను, సరళరచనా రామణీయకమునను, కవితాకళకు కేళాకుళులైన పద్యముల తోడను, సంగీత భంగీ తరంగితములగు పాటలతోడను పాశ్చాత్యనాట్యేచ మధురముగ రాణించు నాటకరాజము. రచన : 1890.

ముద్రణ : శ్రీ వేదవ్యాస ప్రెస్, విజయనగరము – 1921.

* * *

# గద్య కృతులు

1. జగజ్జ్యోతి: 'అష్టాదశ విద్యా ప్రకాశిక' యని దీని నామాంతరము. ఇది నారాయణదాస విజ్ఞాన భాండాగారము. దోరవయసు నందే దొడ్డ హృదయము గల దాసుగారు వయఃపరిపాకముతో పాటు మరింత పరిపక్వమైన హృదయముతోను, అసమాన పాండిత్య శౌండీర్యముతోను రచించిన ఆధ్యాత్మిక విజ్ఞాన వ్యాస సంపుటి. దాసుగారి సారస్వతమును, చరిత్రమును అందును ఈ గ్రంథమును పరిశీలించినచో ఒక జన్మకాలమున నొక మానవ మాత్రున కిన్ని విద్య లింత యలవడునా యని అక్కజము మిక్కుటము గాకమానదు. అందును ఈయన హరిదాస జగద్గురువే కాని యీయన కొక్క విద్య యందును నొక గురువనుచు లేడాయె. లౌకిక గురువుల నాశ్రయించినవా రెండు రొండు విద్యలం దొజ్జ లగుటయే అపూర్వము కాని జగజ్జగదీశులనే పరమ గురువులుగా పరిగణించిన వీరి కీ విద్య లలవడుట యేమి అపూర్వము ? దాసుగారు గ్రంథాదిని ఇష్టదైవత ప్రార్థనమున 'ద్వాదశాత్మా' !

జగజ్జ్యోతీ! ప్రభాకరా! అని సంబోధించిరి. సంవిత్తుకు ప్రకాశము సంకేతము. దానిని దాసుగారే సవితృదేవతాక మంత్రోపాసన వలననో సముపార్జించి లోక సంగ్రహార్థము ఆ వెలుగు నీ గ్రంథ రూపమున వెలయించి చరితార్థులైరి. మిశ్ర భాషలో చతురస్రము, అనవద్యము నైన గద్య రచన. ఇందు దాసుగారి సాధుమేధా సహస్రారధార కించిదూనన సహస్ర పుట సంపుటముగా బాహిరిల్లినది. రచన : 1939-43.

ప్రచురణ : ఆ. నా. దాస అముద్రిత గ్రంథ ప్రచురణ సంఘము, విజయనగరము – సంపుటము I - 1959, II - 1960.

2. నా యెఱుక : దాసుగారి స్వీయచరిత్ర. సంగీత నృత్య సాహిత్య త్రికళా కుశల త్రిదశులైన వారి పూర్ణ పురుషాయుష జీవితమున చిత్రముగా నిది మొదటి ముప్పదేండ్లకే పరిమితము. "స్వయముగ చెప్పవలసిన అగత్యమున్నంతటి తన జీవితకథను మాత్రమే స్వీయ చరిత్రకారుడు వస్తువుగా స్వీకరింపవలయును; అన్యమైన జీవిత కథను ప్రదర్శించు పని జీవిత చరిత్రకారునిది" అను నభిప్రాయము గల ఆదేశ్రద్ధిమ్మూరి సరస్వతీ ప్రచారకుని శేషజీవితము స్వయము గను వార్తాపత్రికల మూలమునను దేశమంతయు నెరిగినదే. మొదటి ముప్పదేండ్ల జీవిత సన్నివేశములే వారికి దప్ప లోకము నకు దెలియనివి. అందుకే ఆ నామకరణ మన్వర్థ మగుచున్నది. తెలుగులో 'స్వీయచరిత్ర' ప్రకటనమునకు వీరేశలింగముగారే ఆద్యులైనను తద్రచన కాద్యు లీ ఆదిభట్టే యని పెద్ద లనగా విన్నాడను. ఆ. నా. దాస జీవితచరిత్ర 237 వ పుట యం దట్లేయున్నది. ఈ గ్రంథమున బాలదాసుయొక్క పాండిత్య పరాక్రమము, తద్విజృంభ లబ్ధ విజయములతో పాటు ఆయన లోటుపాట్లను గూడ స్పష్టముగ గుర్తింపగలము.ఆయన వానిని బాహాటముగ చాటుకొనుటకు జంక

లేదు, కొంక లేదు. కొని కొన్ని సన్నివేశములు రసవత్తరములుగ నున్నవి కథారక్తి యేగాదు, ఆపురూపములైన ఉపమాద్యలంకారములతోడి కల్పనలు, వర్ణనలు నడుమ నడుమ కవితా కల్యాణికి సేసలు పెట్టినవి, చందస చర్చలు చేసినవి. ఆ నడుమ పత్రికలలో పరంపరగా నిందలి కొన్ని ఘట్టములు ప్రకటితములైనవి కాని గ్రంథము నేటిదనుక అచ్చుమొగము చూడకుండుట అబ్బురము. త్వరలో ఇది శ్రీ కరాని ఈశ్వరరావుగారి "దాసభారతి ప్రచురణ" (గుంటూరు) గా వెలవడుచున్నది. సంపాదకుడు : యస్వీ.

3. నూలుగంటి : చూ. అచ్చ తెలుగు కృతులు.

4. వ్యాసపీఠము : దీని విషయము పూర్వోక్తము. (చూ. 'అచ్చ తెలుగు కృతులు' - సం 13). ఇందు పూర్వభాగమున నొక సునిశిత వైమర్శిక దృక్పథముగల ఒక మహాద్రష్టను, ఉత్తరభాగమున సురుచిర కవితా దృక్పథము గల ఒక మహాస్రష్టను దాసుగారి యందు మనము దర్శింపగలము. ఎప్పట్లనను అనవద్యమైనది వారి గద్యశైలి. అది అచ్చబాస యైనను అంటు బాసయైనను వైశద్యము దాని జీవగఱ్ఱ.

* * *

## అనువాద గ్రంథములు

1. ఉమర్ ఖైయాము రుబాయత్ : శ్రీ దాసుగారు పారశీకమున కండలు తిరిగిన పండితుడు. తన కనేక విషయముల సదృశుడు, సమానధర్ముడు, తనవలె కవియు కళాప్రపూర్ణ రసికప్రవరుండు మహాప్రవక్త భక్తవరుడు శాస్త్రవేత్త బహుధానవభావుడు యద్భవిష్యుడు అయిన ఉమర్ ఖైయాము మహాభాగుని అంతరంగ సంగీతమైన 'రుబాయితు' అపవ్యాఖ్యాలాపములను గురియగుచున్నదని

గుర్తించి మహాబాధపడి మథనపడి అందుకోసమన్నట్లు పట్టుబట్టి పారశీకము నేర్చి మూలగ్రంథ లీలా మలిమ్లుచులై కవి హృదయము నాచికొని దోచుకొని తత్పరమార్థమును మన కందిచ్చినారు. వారి గ్రంథము సమగ్ర సుందరముగా (అచ్చాంధ్ర పారశీక పదటిప్పణులతో సహా) 1932 లో బొంబాయిలో బ్రిటీషిండియా ప్రెస్సులో ముద్రితమైనది. అందు 110 రుబాయతులు వరుసగా పారశీక, రోమను లిపులలో వ్రాసి అవియు ఫిట్జ్ గెరాల్డుగారి ఆంగ్లానువాద పద్యము లొకవైపుగను సంస్కృతాంధ్రానువాద పద్య గీతము లొకవైపుగను ముద్రితములైనవి. ఇందలి తెలుగు నిద్దపు టచ్చతెలుగు. ఇట్లు రుబాయతునకు సంస్కృత, దేశ్యాంధ్రము లందనువాదములు వెలయించుటకు దాసుగారే ప్రథములు. వీరు ఫిట్జ్ గెరాల్డు ప్రతిపద్యమునకును ఒక సంస్కృత శ్లోకము ఒక తెలుగు పద్యము చొప్పున వ్రాసిరి. అసలు రుబాయతుయొక్క ఆపాతమధుర గీతిధర్మమునకు దగినట్లు సంస్కృతమున నొకగీతి, తెనుగున నొకపాట చొప్పున వ్రాసిరి. (తెనుగు పద్యములన్నియు కందములు. దానిని 'స్కంధ' శబ్దభవముగా భావించి నాటు తెలుగున దానికి "మూపు" అని నామకరణము చేసిరి. కొద్దిచోట్ల మాత్రము తెలుగుపాట తేటగీతి యాటవెలదులందు పడినది కాని పలుతావుల "చెండు" అను పేర మంజరియే ప్రయుక్తమైనది.) సంస్కృతాంధ్రములందు మూలభావము సూచముట్టుగా సంగ్రహించుచు అనువాదమున స్వతంత్రకృతి యందు కవి యొక్క భావవ్యక్తీకరణ శక్తి ప్రదర్శిత మగుటకు గల వెసులుబాటు సశ్రమముగ అలవోకగ ప్రకటించుట భాషావరశేమభోగి యగు దాసుగారికే చెల్లినది.

2. నవరస తరంగిణి : కవితలో విశ్వమును, విశ్వములో కవితను దర్శించి తమ కావ్య నాటకములం దొక తనజగత్తును ప్రకల్పింప

జేసిన లోకైక మహాకవులు షేక్స్పియరు కాళిదాసు లెట్లాయా నవరసములను పోషించిరో వైనము వారిగా పటిష్ఠ ప్రణాళికముగా నిరూపింబడిన బృహద్గ్రంథము. ఇందా మహాకవుల సర్వ కావ్య నాటకములందలి ప్రముఖ పద్యములు, ప్రసిద్ధ పంక్తు లన్నియు వచ్చినవి. ఆ మూల పంక్తులన్నియు వివిధ రస శీర్షికల క్రింద వింగడింపబడి యెదురుగా తదనువాద మెక్కువగా పద్యములలోను ఎడనెడ వచనములోను చూపబడినది. ఆంగ్లమున కనువాదము మిశ్రభాషయందును, సంస్కృత ప్రాకృతముల కనువాదము అచ్చ తెలుగు నందును సాగినది. ఒక భాష ననువదించు పట్టున ఆ భాషయొక్క పద మొక్కటైన అందు పడగూడదని దాసుగారి నియమము. అనువాద మెప్పుడును - "అహో మూలచ్ఛేదీ తవ పాండిత్య"మను నట్లుండరాదు. మూలపంక్తి పరమార్థమును కర బదర మొనర్పవలెగాని దానిని మించిన కఠిన పాకమున బడరాదు. తాతకు దగ్గులు నేర్పవలెనా ? దాసుగారికి తెలియనివి కావీ సులువులు. వివిధ మూలపంక్తుల ఆకర సూచనలు, సందర్భ వివరణము, మూల గ్రంథముల ఇతివృత్త సంగ్రహము, అనువాదము నందలి కఠినశబ్దముల కర్థములును గలవు. వీని యన్నిటికిని మకుటాయమానముగ విపులమైన పీఠిక గలదు. అంతదితఃపూర్వ మెవ్వరును గుర్తించని ఆ మహాకవుల లోటుపాటులను విమర్శించుటకు వెను కాడలేదు సర్వతంత్ర స్వతంత్రుడైన దాసుగారు. ఆంధ్రసాహిత్య సరస్వతి కొక అమూల్యాభరణ మీ గ్రంథము. ఇది యొక క్షోదక్షమమైన పరిశ్రమ ఫలితము. ప్రభువు శ్రీ అలకనారాయణ గజపతుల కంకితము.

ముద్రణ : విజయరామ విలాస (రాజప్రాసాద) ముద్రణాలయము- విజయనగరము - 1922 (దీనికీ యొక్కటే ముద్రణ మిప్పటికి

వచ్చినది. ఆ ప్రతులు 500 మాత్రమే. నేడు ప్రతి మిక్కిలి దుర్లభము. అవశ్యము పునర్ముద్రణ చేయవలసిన గ్రంథము.)

* 3. తల్లినివిన్కి : (లలితా సహస్రనామ వివృతి).

* 4. నూఱుగంటి : (ఈసపు నీతి కథలు).

* 5. మొక్కుబడి : (ఋక్సంగ్రహము).

* 6. వెన్నుని వెయిపేర్ల వినకరి: (విష్ణు సహస్రనామ సంకీర్తనము).

* 7. వేల్పుమాట: (భగవద్గీత).

* ఇందు కొన్ని అనువాదములు, అనువాద ప్రాయములు. కొన్ని అనుసరణలు. ఈ అయిదింటి గురించియు "అచ్చ తెలుగు కృతులు" అను శీర్షిక క్రింద చూడదగును.

* * *

## సంస్కృత కృతులు

1. ఉమర్ ఖైయామ్ రుబాయత్ : "అనువాద గ్రంథ" శీర్షిక క్రింద దీని స్వరూపము నిరూపింపబడినది. ఇందు ఫిట్జ్ గెరాల్డు గారి ఆంగ్లపద్యములకును, పారసీక మూలమునకును సంస్కృత మున క్రమముగా నొక్కొక శ్లోకము నొక్కొక గీతము చొప్పున అనువాదము సాగినది. అవి ప్రాచీన కవి కృత శ్లోక ములవలె ప్రౌఢముగా నున్నవి. కొన్ని కాళిదాసాదుల శ్లోకముల వలె కమ్మగా నున్నవి. మరికొన్నిట వైయాకరణైక వేద్యము లైన ప్రౌఢప్రయోగములు గలవు. రుబాయత్ సంస్కృతీకరింప బడుట కిదే మొదలై యుండును. తద్గీతిధర్మమునకు తగినట్లది గీతి యందే అనూదితమగుట శ్లాఘ్యము. లిపి దేవనాగరి. ఈ గ్రంథము విజయనగర ప్రభువులు (శ్రీ) విజయ రామరాజుగారికిని

రాణి (శ్రీ) లలితకుమారీదేవిగారికిని కృతి. (ఇందు సంస్కృతాంధ్రాంగ్లములందు దాసుగారి పీఠికలు గలవు).

2. కాశీ శతకమ్ : దాసుగారు 1913-14లో సతీసమేతముగా కాశీపురిని దర్శించిరి. వారి తత్పుర దృశ్య పరిశీలనము, స్వానుభవములిందు మేల్తరముగ మేళవింపబడినవి. అలతి యలతి అనుష్టుప్పులలో ఆపాతమధురమైన శైలిలో అలంకార చమత్కారచారువుగా సాగినది రచన 1914లో. ముద్రణ : 1921 ప్రాంతమున ప్రథమ ప్రచురణ జరిగినది. ద్వితీయము ఆ. నా. దాస అముద్రిత గ్రంథ ప్రచురణ సంఘము వారిది. కృష్ణాపవర్ ప్రెస్ ముద్రణ, విజయనగరము- 1960. లిపి తెలుగు.

3. చాతుర్వర్గ్యసాధనమ్ ; 1930లో విజయనగరము (శ్రీ) వేదవ్యాస ప్రెస్‌లో అచ్చయిన దాసుగారి హరికథామృతము వెనుక తట్టు అట్టమీద ఇది సంస్కృత కృతియనియు, అప్పటికే అచ్చయిన ట్లుటంకింపబడినది. కాని చిత్రము ఒక్క ప్రతియు నాబోటి వానికి లభించినదికాదు. 'ఇటీవల పురుషార్థసాధనమ్' అను సంస్కృతకృతి లభించినది. (8 పుటలు - 38 సూత్రలు) ఇందు దాసుగారి యోనాహాదు లతి విలక్షణమైనవి, విశిష్టమైనవి.

4. తారకమ్ : ఇది దాసుగారి గీర్వాణము తారస్థాయి నందుకొన్న అపూర్వ ప్రౌఢప్రయోగ వైచిత్రితో భట్టికావ్యమువలె గండు మీరిన పండితుల గుండెలు తడవిచూచిన ప్రౌఢ ప్రబంధము, కావ్య ప్రారంభములో—"పాణినీయ సూత్రాణా మవైదికానా ముదాహరణ మేతత్కావ్యమ్" అని దాసుగారి ప్రతిజ్ఞ. అది నిర్వహించినది వారి ప్రజ్ఞ. అయిదు సర్గలు, సుమారు 300శ్లోకాలు. కథ చిన్నది, కల్పితము. కావ్యమున నున్న చమత్కార మంతయు కవితలోనే యున్నది గాని కథా సంవిధానమున లేదు. వారు హరి

కథలలో మారుమూల రాగము లనేకము వాడినట్లే యిందలి చతుర్థ సర్గలో అన్యకవి ప్రయుక్తములు కాని విశేషవృత్తము లనేక ముపయోగించిరి. ఛందస్సు మీాద వారికిగల ప్రభుత్వమున కిది యొక గుర్తు. పట్టి శాబ్దికమైన సాముగరిడీలే గాక లోకోత్తర వర్ణనలు కల్పనలు నున్నవి. అన్యాపదేశ విన్యాసము, సారవత్సందేశమును గలవు. "ఉపమా ఆదిభట్టస్య" అనదగిన ఉపమలెన్నో వారి సారస్వత సర్వాంగీణముగా నున్నట్లే యిందు నున్నవి. ప్రతి కృతియందు ప్రతిఫలించినట్లుగనే వారి అపూర్వ వ్యక్తిత్వ మిందును పలుతావుల ప్రతిఫలించినది. రచన: 1908-10 సం॥ల నడుమ. ముద్రణ : నిర్ణయసాగర ముద్రణాలయము, బొంబాయి- 1910. (జర్మనీలో మార్‌బర్గ్ విశ్వవిద్యాలయ సంస్కృత శాఖాధ్యక్షుడు ప్రొఫెసర్ కె. గెల్డ్నర్ తారకకావ్యము‌ను జూచి దాసుగారి కవితను కడు గొనియాడుచు ప్రశంసా శ్లోకములు రచించి పంపెను.)

5. దశవిధరాగ నవతి కుసుమమంజరి : ఇది సంగీత ప్రపంచమున హనుమంతుని సముద్ర లంఘనము వంటిది. ఒక అపూర్వ కౌశల ప్రదర్శనము. 1938 లో దాసుగారు కన్యాకుమారి యందు అమ్మవారిని దర్శించుకొని ఆ పరమానుభూతితో పది వివిధ జాతులలో తొమ్మిదేసి పంక్తులకు తొమ్మిదేసి రాగముల చొప్పున అనగా మొత్తము 90 రాగములలో అమ్మవారి పరముగ అన్వర్థమగునట్లు రాగనామ నిర్దేశము చేయుచు సర్వతాళాత్మక పంచ జాత్యేక తాళముతో సస్వరముగా విరచించిన దేవీ స్తవము. ఆరోహణ క్రమమున సాగిన ఆ తొంబది పంక్తులు చక్కని సంస్కృత రచన. అనంతరము అవరోహణక్రమమున సస్వరముగ సాగిన తొంబది పంక్తులు మిశ్ర భాషాత్మకములు. ఇందలి సంగీత ప్రక్రియను పరికించి పలువురు తచ్ఛాస్త్ర విద్వాంసులా గడిదేరిన కైవాడమునకు

ఆశ్చర్యచకితులైరి కాని ఇది యింతవరకు అచ్చుకాకపోవుట అస్మదాదుల కచ్చేరువు గొల్పుచున్నది. త్వరలో 'దాసభారతి ప్రచురణము'గా వెలయగలదు.

6. మృత్యుంజయాష్టకమ్ : రచన 1908. అలబ్ధము. రచన పకడ్బందుగా నున్నదనియు, వ్యాధిగ్రస్తులైన మిత్రులు తరచు దాసుగారిచే దీనిని చదివించుకొనెడివారనియు తెలియుచున్నది.

7. రామచంద్ర శతకము : ఇది 'రామచంద్ర' మకుటము గల భుజంగ ప్రయాత శతకము. భక్తి జ్ఞాన వైరాగ్య ప్రబోధాత్మకమైనది. దాసుగారి అద్వైత వేదాంత జ్ఞానమునకు నికషదృషత్తుగ నున్నది. విషయము మహా గహనమైన తత్త్వమగుటచే భావయందును బంధమునందును సారళ్యము నేకోరి ప్రదర్శించినారు దాసుగారు. ఇది 1921 నాటికే రచితపూర్వమైనను ఆ. నా. అముద్రిత గ్రంథ ప్రచురణసంఘమువారిచే 1960లో ప్రచురింపబడినది.

ముద్రణ : శ్రీకృష్ణ పవర్ ప్రెస్, విజయనగరము.

8. శ్రీహరి కథామృతము : ఇది శ్రీకృష్ణ జననము, పితృబంధ విమోచనము, ధర్మసంస్థాపనము అను మూడు హరికథల సంపుటి. 1913లో కలకత్తాలో ప్రథమ కథాగానము చేసి విశ్వకవి రవీంద్రుని శ్లాఘాశిరఃకంపమునకు పాత్రులైరి దాసుగారు. వారి అభీష్ట సిద్ధాంతములకు, వైదుష్య పరిణాహమునకు, భక్తి భావుకతకు, లోకజ్ఞతకు, తావలమైన కృతి. స్వీయకృతులలో వారి కిది మిక్కిలి ప్రీతిపాత్రమైనదిగ తోచును. వారు దీనిని దేవభాషలో వ్రాయుట, తొలుత 1930 లో విజయనగర శ్రీ వేదవ్యాస ప్రెస్సులో తెలుగు లిపిలో ముద్రించినను, పిదప 1939 లో మదరాసు వావిళ్ళ ప్రెస్సున నాగరలిపిలో వేయించుట చూడ సర్వదేశ స్థులును దీనిని చదివి

కృతార్థులు కావలెనని వారి యాశయ మనిపించును. అనుపద హృదయంగమమైన రచన. సంస్కృత భాషను, ఛందస్సందర్భాది కావ్య మర్యాదలను కొంత చక్కని తెలుగు వాలకము వైచిరి. (1921 లో విజయనగరము S. V. V. Press లో అచ్చయిన దాసుగారి సారంగధర నాటకము చివరిదైన 124 వ పుటలో "ముద్రితము లగుచున్న మద్విరచిత గ్రంథములు" అను శీర్షిక క్రిందనున్న పట్టికలో తొలుదొల్త కాళీయమర్దనము, కంసవధ, పారిజాతాపహరణము అను మూడును సంస్కృత హరికథ లని ఉటంకింపబడియున్నది. ఆ పేరిటి కృతులు వేరే లభింపకపోవుట వలన వరుసగా నీ మూడే హరికథామృత సంపుటిలోని కథలగునేమో యని అనుమానింపవలసి వచ్చుచున్నది. కాని ఆ 'సారంగధర' వెనుకటి యట్టపై "మద్విరచిత ముద్రిత గ్రంథముల" పట్టికలో సంస్కృత (శ్రీ)కృష్ణజననము పేర్కొనబడియుండుటచే మీాయూహ యెంతవట్టు సత్య సన్నిహిత మగునో చెప్పలేము.)

## అముద్రితములు : అలబ్ధములు

1. గోవర్ధనోద్ధారము : అలబ్ధము. (చూ. 'హరికథలు' శీర్షిక)

2. తర్కసంగ్రహము : అముద్రితము.

3. ధ్రువచరిత్రము : అలబ్ధము.

4. బాలరామాయణ కీర్తన : రెండు చరణములు మాత్రమే దొరకినవి. ఆరెండును 'దాసభారతి' వారి మేలుబంతి యందు ప్రకటితములు.

5. మృత్యుంజయాష్టకమ్ : అలబ్ధము. ఇదియు, మీాది కీర్తనయు విజయనగరమున నెవరైన పెద్దల యొద్ద దొరకవచ్చును.

6. వ్యాకరణసంగ్రహము : అముద్రితము.

7. సీమపల్కుఁవహి : (ద్వితీయ భాగము) అముద్రితము.

8. బాటసారి : (దాసుగారి ఆంగ్లీకరణము. ఉపలబ్ధము. అముద్రితము.)

గమనిక : 1960 లో ఆ. నా. దాస అముద్రిత గ్రంథ ప్రచురణసంఘము, విజయనగరము వారు ప్రకటించిన దాసుగారి కాశీశతకమున తత్కార్యదర్శి చేసిన విజ్ఞప్తియందు వారు పైపట్టిక యందలి 2, 6, 7 సంఖ్యల గ్రంథములను తాము ప్రకటింప నున్నట్లు వ్రాసిరి. కాని నేటిదనుక అవి ముద్రితములు కాలేదు. వాని ప్రతులు వారి కడనే యుండియుండవలెను. మొన్న మొన్నటి దాసుగారి వంటివారి కృతులు కొన్ని యింకను అముద్రితములుగ నుండి పోవుటయు, కొన్ని అసలే అలబ్ధము లగుటయు, కొన్ని ముద్రిత పూర్వములయ్యు అతిదుర్లభము లగుటయు మిగుల శోచనీయము.

* * *

## అకారాది గ్రంథ సూచిక

1. అంబరీష చరిత్రము-హ
2. అచ్చ తెలుఁగు పలుకుబడి-అ. తె.
3. ఉమరుఖైయాము రుబాయతు-అను
4. కచ్ఛపీశ్రుతులు (కవితాసంకలనము)
5. కాశీశతకమ్-సం.
6. గజేంద్రమోక్షము-హ.
7. గోవర్ధనోద్ధారము-హ.
25. భీష్మ చరిత్ర-హ.
26. మన్కిమిన్కి (ఆయుర్వేదసారము)
27. మార్కండేయచరిత్ర-హ.
28. ముకుందశతకము
29. మృత్యుంజయ శివశతకము
30. మృత్యుంజయాష్టకమ్-సం
31. మ్రేలుబంతి (చాటుప్రబంధము)

8. గౌరప్ప పెండ్లి-అ. తె. హ.

9. చాతుర్వర్గ్య సాధనమ్-సం.

10. జగజ్జ్యోతి (అష్టాదశ విద్యా ప్రకాశిక) -గ.

11. జానకీ శపథము-హ.

×12. తర్క సంగ్రహము

13. తల్లి విన్కి (లలితాసహస్ర నామము. అ. తె.)

14. తారకమ్-సం.

15. దశవిధరాగనవతి కుసుమమంజరి-సం. అండ్ తె.

16. దంభపుర ప్రహసనము

—17. ధ్రువచరిత్ర-హ.

18. నవరసతరంగిణి-అను.

19. నా యెఱుక (స్వీయచరిత్ర)-గ

20. నూఱుగంటి-అ. తె.

21. పురుషార్థసాధనము-గ.

22. ప్రహ్లాదచరిత్ర. హ.

23. భాటసారి (కావ్యము)

32. మెుక్కుబడి (ఋక్సంగ్రహము) అను.

33. యథార్థ రామాయణము-హ.

34. రామచంద్ర శతకమ్

35 రుక్మిణీ కల్యాణము-హ

36. వెన్నుని వెయిపేర్లవినకరి -అ. తె.అను. (విష్ణుసహస్రనామ సంకీర్తనము)

37. వేల్పుమాట (భగవద్గీత)

38. వేల్పువంద-అ. తె.

×39. వ్యాకరణసంగ్రహము

40. వ్యాసపీఠము-గ.

41. సంగీత తరంగిణి

42. సత్యవ్రతి శతకము

43. సారంగధర నాటకము

44. సావిత్రీ చరిత్రము-హ.

×45. సీమపల్కు వహి-అ. తె.నిఘంటువు.

46. సూర్యనారాయణశతకము

47. హరికథామృతమ్-సం.హ.

24. బాలరామాయణ కీర్తన —48. హరిశ్చంద్రోపాఖ్యానము ॥హ

సంకేతములు: అ. తె.=అచ్చు తెలుగు. అను=అనువాదము.
సం. సంస్కృతము
గ=గద్యము హ=హరికథ
×=అముద్రితము —=అలబ్ధము.

* * *

## దాసభారతి ప్రచురణలు

1. మేలుబంతి : చాటు ప్రబంధము. (అనేక పటములతో)
   పుటలు 284. వెల 12 రూ॥ సంపాదకుడు: యస్వీ జోగారావు.

2. కచ్ఛపీశ్రుతులు : దాసుగారి సర్వకావ్యములనుండి యేర్చికూర్చిన పలు చక్కని పద్యముల సంకలనము.
   పుటలు 150. వెల 10 రూ॥ సంపాదకుడు: యస్వీ జోగారావు

3. వ్యాసపీఠము : భాషా సాహిత్యజీవిత సంబంధులగు అనేక విషయములపై విమర్శనాత్మకములు, సృజనాత్మకములు నగు వ్యాసముల సంపుటి.
   పుటలు 300. వెల 20 రూ॥ సంపాదకుడు: యస్వీ జోగారావు.

4. తల్లివిన్కి : లలితా సహస్రనామముల పరమార్థ ప్రకాశిక-అచ్చు తెలుగు పద్యములందు వివృతి. (అచ్చులో నున్నది)
   పుటలు సుమారు 260. వెల 15 రూ॥
   సంపాదకులు : ఆచార్య శ్రీ ఓరుగంటి నీలకంఠశాస్త్రి

5. నా యెఱుక : దాసుగారి స్వీయచరిత్ర. (అచ్చులో నున్నది)
   పుటలు సుమారు 300. వెల 15 రూ॥
   సంపాదకుడు : యస్వీ జోగారావు

6. సంగీతతరంగిణి : పాటకచ్చేరీల కనువగునట్లు వీర్చి కూర్చి, స్వర పరిచిన అపురూపములైన దాసుగారి కృతులు, కీర్తనలు. 'దశవిధ రాగ నవతి కుసుమ మంజరి. పంచముఖీ తాళ స్వరూప వివరణాత్మక పట్టికయు చేర్పబడినవి. (త్వరలో)
సంపాదకుడు : శ్రీ నూకల చినసత్యనారాయణ.

7. The Light of the Worlds: An abridgement and translation of the jagajjyoti, an astounding product of learning and genius of Narayanadas by Sri Peri Suryanarayana, M. A., L. T. (dealing with the eighteen disciplines of the ancient Indian Wisdom.)—(Shortly)

8. భక్తిసుధ. 9. పూ క్తిసుధ 10. పురుషార్థ సాధనమ్.

ప్రకాశకులు : శ్రీ కర్రా ఈశ్వరరావు
B. Com. (Hons)., B. L., F. C. A.
Manager, Leaf Stocks & Supply; I. L. T. D. & Co., Guntur.

## దాస సాహితీ జీవిత సమీక్షా గ్రంథములు

1. "నాట్యకళ" : ఆం. ప్ర. సంగీత నాటక అకాడమి, హైదరాబాద్ ఆదిభట్ల నారాయణదాస శతజయంత్యుత్సవ ప్రత్యేక సంచిక. ఫిబ్రవరి, 1965.

2. "సాహితి" : వేంకటాద్రిమ గ్రంథమాల, ఏలూరు.
ఆ. నా. దాస శతజయంత్యుత్సవ అనుబంధము.
సంపుటము 3 – సంచిక 11. సెప్టెంబరు, 1964.

3. శ్రీ ఆదిభట్ల నారాయణదాస శతజయంత్యుత్సవ సంచిక : దాసుగారి సర్వతోముఖ ప్రజ్ఞావైభవమును ప్రత్యక్షముగా ఎరిగిన

పెద్దలు, శిష్యప్రశిష్యు లనేకు లా మహానుభావునకు సప్రశ్రయముగా సమర్పించిన వ్యాస ప్రసూనాంజలి.

పుటలు : తెలుగు & ఇంగ్లీషు 302+51. వెల : 5 రూ॥లు

ప్రచురణ : సంస్కృతి సమితి, చీరాల-1967.

4. నారాయణదాస జీవితచరిత్ర :

రచన : శ్రీ మరువాడ వెంకట చయనులు, బి. ఏ., బి. యల్.

ప్రచురణ : కొండపల్లి వీరవెంకయ్యాండ్‌సన్సు, రాజమండ్రి-1959.

పుటలు : 285. వెల : 4 రూ॥లు

5. Life of Adibhatla Narayana Das :
By Sri Vasantarao Brahmaji Rao, B. A., B. L. Advocate, Vizianagaram– 1956.
Pages 105, Price Rs. 2.

6. శ్రీ నారాయణదాస జీవితచరిత్రము (యక్షగానము) :

రచన : కవికథకరత్న శ్రీ పెద్దింటి సూర్యనారాయణ దీక్షితదాసు, నర్సాపురము, ప॥ గో॥ జిల్లా.

ముద్రణ : 1967. పుటలు : 50. వెల : 1 రూ॥

—[పరికల్పన : ఆచార్య యస్వీ జోగారావు]



జూపిటర్ ప్రింటింగ్ ప్రెస్, గుంటూరు. ఫోన్ : 21907

*With the best compliments of -*

# Quilon Wood Industrial Cooperative Society Ltd

Sponsored by the Department of Industries & Commerce



QUILON-10 KERALA